# పీఠిక.

శ్రీకృష్ణభారతములోని శాంతిపర్వము పెక్కేండ్లక్రిందటనే విరచితమయ్యు నిప్పుడే ముద్రితమై వెలువడినది. ఈయాలస్యమునకుఁ గారణము ద్రవ్యలోపము. మహాగ్రంథములు కేవల ముద్రణాదిసౌకర్యాభావములచే జనలభ్యములు కాకుండుట సల్లక్షణము కానేరదు. జనసామాన్యము ప్రాయికముగ సుద్గ్రంథములనెడ ననాదరముఁ జూపును. ప్రభుస్మయమును బోద్ధృమత్సరమునుగూడఁ జిరపరిచితములే. శ్రీకృష్ణభారత శాంతిపర్వపు ముద్రితగ్రంథము నాల్గువేల యేనూటముప్పది పద్యగద్యములుగలదై యారున్నూటయేఁబదిపుటలం బట్టియున్నది.

తిక్కనసోమయాజి శాంతిపర్వము మూఁడువేలతొంబదినాలుగు పద్యగద్యములలోను ఇన్నూటయెనుబదియాఱుపుటలలోను ముగిసినది. సంస్కృతభారత శాంతిపర్వము మున్నూటయఱువదియాఱధ్యాయములు గలది. మూలానుసరణమగుటంజేసి శ్రీకృష్ణభారతశాంతిపర్వము తిక్కనకృతికన్న రెండుమూఁడింతలు పెఱిగినది. శాస్త్రికృతి తొమ్మిదియాశ్వాసములు. యజ్వకృతి యాఱాశ్వాసములు. తిక్కనకవి తక్కినపర్వములలోఁగన్నఁ దనశాంతిపర్వములో నెక్కువగ మూలగ్రంథమును బొందుపఱిచెను. విషయము వివేకవిజ్ఞానపరమార్థసాధకంబగుట నాయన వ్యాసగ్రథితబోధమును విపులముగనే తెనిఁగించెను. భీష్మస్తవరాజము షోడశమహారాజచరిత్ర మున్నగునవి సోమయాజిచే సవిస్తరముగఁ బరివర్తితములైనవి. శాస్త్రిగారికి శ్రీనాథమహాకవి కవితాగురువు, కవిత్రయమువారు పూజ్యులు. శాస్త్రిగారిశైలి ధారాళమై నిర్దుష్టమై సరసమై మనోజ్ఞమై కవిత్రయశైలివలె - అందు ముఖ్యముగఁ దిక్కయజ్వశైలివలె - సర్వోత్కృష్టతను బొందియున్నది. శ్రీనాథకవి పోకడలు మెండుగ శ్రీపాదకవిరచనలం గానవచ్చెడిని. వీరి సీసపద్యముల గమనము లేక రూపమును దాల్చియున్నవి. సోమయాజికందముల సౌష్ఠవము శ్రీకృష్ణభారతకందములందుఁ బ్రతిఫలించినది. ఈసమగ్రాంధ్రభారతముచే నాంధ్రభాషకుఁ బునరుజ్జీవనమును నూతనపటిమయును గలుగును. కవిత్రయమహాభారతమువలె శ్రీకృష్ణభారత మాంధ్రలోకమునకుఁ బ్రియమై వినోదకరమై విజ్ఞానదాయకమై వివేకపోషకమై జ్ఞానతత్పరమై యార్యమతసనాతనధర్మముల

కాకరమై తనరారఁగలదు. వస్తుసాకల్య మిందలి విశేషముగుట నచిరకాలంబున నీకృతి యావదాంధ్రప్రపంచవ్యాప్తిం జెందును.

ఆర్యసాంప్రదాయముల నెఱుంగుటకు శ్రీమహాభారతమమూల్యసాధనము. దీనిని బంచమవేదమనుట సమంజసము. ఆగమపుంజపదార్థతత్త్వనిస్సంశయకారుఁ డగువేదవ్యాసుఁ డీకృతికిఁ గర్తయై వేదవేద్యంబగువిద్య నిందుఁ బ్రతిష్ఠించి లోకోపకారమును గావించెను. ఆఖ్యాయిక సాధారణముగఁ జేసికొని యీత్రికాల వేది సనత్సుజాతీయము భగవద్గీత శాంతిపర్వము అనుశాసనపర్వము మున్నగు లోకోత్తరగ్రంథములను లోకమునకుఁ బ్రసాదించెను.

వేదరాశి సామాన్యజనదుర్గ్రాహ్యమగుటఁ జేసి వేదవ్యాసకృతమహాభారతము తదుపదేశభూయిష్ఠమై జనుల నుద్బోధించుచున్నది. శాంతిపర్వములోని రాజ్యవ్యవస్థ వర్ణనియమములు మున్నగునవి కొన్ని మార్పులతో నీకాలంబునకు సరిపోవును. శాంతిపర్వంబున రాజధర్మాపద్ధర్మమోక్షధర్మములు సవిస్తరముగ నిరూపింపఁబడినవి తాత్కాలికమగు రాజ్యవ్యవస్థయు సాంఘికధర్మములు పారమార్థికసిద్ధాంతములును శాంతిపర్వమార్గమున శాంతనవునిచేఁ బశ్చాత్తప్తహృదయుం డగుధర్మజున కుపదేశింపఁబడినవి అనుశాసనికపర్వమునంగూడ నిట్టిమహా విషయములే కూర్పఁబడినవి.

వ్యాసకృతి సంపూర్ణముగ నేఁడు మనతెలుఁగుభాషలో గద్యపద్యరూపకముగ లభించినది. ఇది యాంధ్రులకు శ్రేయస్కరము. తాపత్రయశాంతి కీశాంతిపర్వము శాశ్వతసాధనము. మానవకృతగ్రంథములలో నిట్టియుద్గ్రంథ మింకొకటి కానరాదు. లోకానుభవముతో వేదోక్తధర్మములును ఉపనిషత్తత్త్వములును సమన్వయముం జెంది మానవజీవితమును జక్కపఱుచుచున్నవి. శాంతిపర్వనిష్పన్నములగు నిర్ణయములును నీతులును భారతదేశమునకేగాక యావత్ప్రపంచమునకునుగూడ వర్తింపఁగలవు. ఇవి లోకమంగళార్థమై సర్వజనసౌఖ్యమునకై ప్రతిపాదింపఁబడినవి.

సర్వశ్రేయోమూలంబులగు తపస్సత్యంబులును, శమదమంబులును, దానధర్మంబులును, గృహస్థబ్రహ్మచారివిధులును, మానన్యాసవిశేషంబులును సోదాహరణంబుగ సకారణంబుగ వర్ణింపఁబడి తరణోపాయంబులఁ బ్రకటించుచున్నవి. చతుర్విధపురుషార్థములనుబోధించు నీవిపులశాంతిగ్రంథము కథలతో నాఖ్యాయికలతో నితిహాసములతో సంవాదములతో వర్ణనములతో వ్యాఖ్యానములతో వివరణములతో విరాజిల్లుచున్నది.

శాంతిపర్వనామక వ్యాసకృతిలోని యంశములన్నియు శ్రీకృష్ణభారతశాంతిపర్వములోనికి సంక్రమించినవి. ఆంధ్రీకరణము మూలానుసరణముగను, కతిపయస్థలములలో నొకించుక విజృంభణముఁజెందియుఁ గానవచ్చెడిని. సోమయాజి శాంతిపర్వము ముఖ్యాంశములను సంగ్రహముగఁ బ్రస్తావించును. ఇందుకుఁ దార్కాణముగ దిగువఁ గొన్నికథాంశములు చూపఁబడుచున్నవి. వీనివలన నీమూఁడురచనలతారతమ్యములు కొంతవఱకుఁ దెలియఁగలవు. మొత్తముపై సోమయాజిరచనకును శాస్త్రిరచనకును భేదము కానరాదు. రెండును శ్రేష్ఠములే. రెండును ఆంధ్రభాషకు శాశ్వతభూషణములే. రెండును కవులకు మార్గదర్శకములే.

## వ్యాసప్రోక్తము.

ఆసనం శయనం యాన ముత్థానం పానభోజనమ్,
నియతం సర్వభూతానాం కాలేనైవ భవంత్యుత.
వైద్యాశ్చాప్యాతురాస్సంతి బలవంతశ్చదుర్బలాః,
శ్రీమంతశ్చాపరే షండాః విచిత్రః కాలపర్యయః.

... ... ... ... ...

సంతి పుత్రాస్సుబహవో దరిద్రాణామనిచ్ఛతామ్,
నాస్తి పుత్రస్సమృద్ధానాం విచిత్రం విధిచేష్టితమ్.

... ... ... ... ...

దృశ్యతే హియువైవేహవినశ్యన్వసుమాన్నరః,
దరిద్రశ్చ పరిక్లిష్టః శతవర్షో జరాన్వితః.
అకించనాశ్చ దృశ్యన్తే పురుషాశ్చిరజీవినః,
సమృద్ధే చ కులే జాతా వినశ్యంతి పతంగవత్.
ప్రాయేణ శ్రీమతాంలోకే భోక్తుం శక్తిర్న విద్యతే,
కాష్ఠాన్యపి హి జీర్యంతే దరిద్రాణాం చ సర్వశః.

... ... ... ... ...

యథా కాష్ఠం చ కాష్ఠం చ సమేయాతాం మహోదధౌ,
సమేత్య చ వ్యపేయాతాం తద్వద్భూతసమాగమః.

## సోమయాజిరచన

క. నరవర! సరసాన్నంబులుఁ, బరిమళసద్వస్తువులును బరమశయనవి
ష్టరములుఁ గాలాధీనత, నరుఁడొందుం బాయుంవాని నమ్మిమియు యుఁబున్.

చ. వలనధికంబుగాఁ గలుగువైద్యులు శాస్త్రము లభ్యసించిమం
దుల నొడఁగూర్చ నేర్చి తనుదోషము లారయు బుద్ధిగల్గి యా
ర్తులకుఁ జికిత్స సేసెదరు రోగము వాయమి లేదె వారు రో
గులగుట గాన మెట్లు ప్రతికూలవిధిన్నరు నేర్చు ద్రోచునే.

సీ. సద్వంశజన్మంబు.........భోగములును
భవితవ్యతానురూపంబులు పేదలై పెంచుట కలయంగఁ బెల్లుపుట్టు
దురు ప్రజ లెంతయు సిరిగలవారు గోరంగఁ బుట్టరు దరిద్రపుజనంబు
లాఁకట దిని తాలు నతిగించుకొందురు భోజ్యసంపన్నులు భోజనంబు

తే. పూర్ణముగఁ జేయఁజాలరు............

వ. బాంధవలాభంబును దద్వియోగంబును వఱదంగాష్ఠంబులు సంగతంబులై పదంపడి పాసినచందంబు.

## శా స్త్రి కృ తి.

క. శయనాసనయానాదులు, ప్రియతమవస్తువులు భోగవిస్తరములు ము
ద్దియలుం బోనగునవి, నియతంబుగ డాయుఁ బాయునిజము నరేంద్రా.

క. బలవంతులు బలహీనులుఁ, గలవారును లేనివారు ఘనవైద్యులు రో
గు లలంతులు ఘనులును విలసిలఁ గనుచుండుదుము గాలచిత్రముగాదే.

సీ. పెట్టి పెంచఁగలేని పేదకుఁ గోరకుండినఁ బెక్కుమందిపుట్టెదరు సుతులు
దినఁ బెట్టఁగ సమృద్ధిఁ దనరినవారు కోరినఁ బుట్టఁ డొక్కరుండును ధరిత్రిఁ
గొంతలోపలఁ జచ్చుఁ గొమరుఁ బ్రాయపువాఁడు వసుమంతుఁడును గులవర్ధనుండు
నూఱేండ్లు జీవించు నొగిలెడివాఁడు జరాన్వితుండు దరిద్రుఁ డధమజన్ముఁ

తే. డాఁకటికిఁ దిన్నతాలైన నఱుగు నిర్ధనునకు శ్రీమంతుఁడింతయుఁ దినఁగలేఁడు
కర్మసంచయమునఁజేసి కాలగతుల, విధివిచేష్టిత మీరీతి వెలయుచుండు.

క. కట్టెయుఁ గట్టెయుఁ బెల్లువఁ,గొట్టుకొనుచుఁ బోయిపోయి కూడుం బీడుం
బెట్టనఁ బ్రాణిసమూహం,బట్టులె యీధరణియందు నని యెఱుఁగవలెన్.

షోడశమహారాజచరిత్రలను సోమయాజి యొకించుకఁ బెంచి సీసపద్యము లలో వ్రాసెను. యథామూలముగఁ గృష్ణభారతకర్త యీచరిత్రలను వర్ణించి యొక్కొకవాక్యములో ముగించెను.

ఆపద్ధర్మభాగంబునం గలవిశ్వామిత్రచండాలసంవాద ముభయకవులరీతులఁ దెలుపును. ఇరువురును దుల్యప్రతిభగలవారయ్యు వారివారినియమముల ననుస రించి గ్రంథమును గ్లుప్తపఱుచుచువచ్చిరి. కొన్నిభాగములు దిగువఁ జూపఁ బడును.

ఉ. పాడియుఁ బంటయుం దఱిఁగె భాగ్యము భోగ్యము శూన్యమయ్యె నే
వాఁడును ద్రావ నీళ్ళయిన వారికిఁ జిక్కమి సొక్కి సోలియున్
మాడెడువాఁడయయ్యెఁ గొఱమాలినవయ్యె నసూత్కారంబు లే
పీడును బాడునుం జెడియెఁ బీనుఁగుబెంటల నిండి మెండుగన్.

క. కొందఱు చోరులచేతం, గొందఱు శస్త్రములచేతఁ గొందఱు క్షుధచేఁ
గొందఱు వ్యాధులచేతన్, మ్రందిరి మహిమీఁదఁ గలుగుమానవు లెల్లన్.

శా. విశ్వామిత్రుఁడు పీతిహోత్రసముఁడై విఖ్యాతినిం గాంచియున్
విశ్వంబెల్లఁ బరిభ్రమించెను క్షుధన్ విత్రస్తుఁడై పుత్రదా
రాశ్వాసాదికముం బొనర్పకయ భక్ష్యాభక్ష్యచింతావిహీ
నశ్వభ్రాస్యుఁడు హోరుహోరు మనుచున్ వాపోవుచున్ వాడుచున్.

చ. బ్రదికెడు దారిఁజూచుకొనఁ బాడి యెదేనియుఁ జేసి వాసిమై
బ్రదికిన శ్రేయముల్ వడయవచ్చును ధర్మము లాచరించి స
త్పథమున నిల్చి చచ్చినపదంపడి వచ్చెడిలాభ మెద్దియున్
గుదురదు బుద్ధిపూర్వముగఁ గుక్కపలాలము మెక్క నెంచితిన్.

ఉ. మాలలకన్న మిాశునకమాంసము విప్రుఁడవైన నీకు నేఁ
బోలనివాఁడనై యొసఁగ బుద్ధి యొనర్ప నొసంగి నేను నా
పాలగ్రహించి నీవు నతిపాపభయంకరదుష్టలోకముల్
చాలఁగ నొంది కుందుటలు సత్యమగు న్విబుధేంద్రచంద్రమా.

### సోమయాజిపద్యములు.

సీ. పైఱులు చెర్వులు నిపురఁగర్పనము లెందునుజెడఁ దరులతాదులు గమర
భూమియుఁ బసమాల గోమహిషాదిజీవధనంబు వ్రాలియ భూవరులు మేర
దప్పి లోకములోనిధాన్యముల్ గొన నధర్మం బంతకంతకుఁ బ్రబ్బనధికు
లనదలఁ జెఱుపంగ యాగముల్ దేవతాపూజలు నెడలంగ భూసురప్ర

ఆ. ముఖములైనవర్ణముల చొప్పుదప్ప న్యాహారరహితజనము లచట నచటఁ
బడఁగఁ జూడ ఘోరభంగిగాఁ దఱచయ్యె, డొక్కలున్నవారి కెక్కభయము.

వ. అట్టిసమయంబున.

క. మునిపతి విశ్వామిత్రుఁడు, దనయాఁకలి కెందు మెలఁగి ధైర్య మెడలి యో
దనమాంసమూలఫలములు, జనుల నడిగి యెందుఁ బడయఁజాలక డప్పిన్.

చ. అనుటయుఁ నంత్యజుండు నగి యట్టివిధం బధమంబుగాక చె
ట్టన యది ధర్మమే కటకటా మిముబోంట్లకు నిట్లు సేయఁగాఁ
జను నొకో యన్న నమ్మునిప్రశస్తుఁ డగస్త్యుఁడు దైత్యుమాంసముం
దినఁడె నశించెనే యతనితేజముఁ బెంపును నంతనుండియున్.

## సంసారసాగరవర్ణనము.

సీ. ఘోరదుఃఖోదము భూరిచింతాహ్రదమామయమృత్యుమహాగ్రహంబు
సాధ్వసోరగము రజఃకూర్మమును దమోమీనము స్నేహపంకానుగతము
ఘనజరాదుర్గము ప్రణుతవిజ్ఞానసుద్వీపము వరసత్యతీరయుతము
హింసాతివేగసమేతము నానారసాకరముఁ జ్వరస్పర్శనంబు

తే. శోకతృష్ణామహావర్తశోకితంబు, వ్యాధిగజమస్థిసంఘాతబహులఘట్ట
దర్శితము శ్లేష్మఫేనము దాన మార్తి, కమ్ము శోణితహ్రదవిద్రుమమ్ము మఱియు.

తే. హసితనిర్ఘోషమును రోదనాశ్రులవణ, పరివృతము పునర్జన్మప్రవాహకలిత
మైన సంసారసాగర మమల మునులు, జ్ఞానయోగంబునం దాఁటి చనెద రధిప.

మ. పితృపైతామహమైన రాజ్యమున సంప్రీతిం బ్రభుత్వంబునన్
విత్తైశ్వర్యము లొందినాఁడ వరిచే నీవైభవం బంతయున్
హృతమైనన్ ధనధాన్యవస్తునిచయం బెల్లన్ హతంబైన బ
ద్ధతకైనం జలియింప వింతయును నీధైర్యంబు సామాన్యమే.

సీ. ఒకనితోఁ గలహింప రొకని హింసింపరు పరమసమృద్ధి కసూయపడరు పరుల
నిందింపరు స్తుతింప రెందు వికారము నొందరు శాంతులై యుండు రెపుడు
విడి క్రోధహర్షముల్ వేరికిన్ ద్రోహము దలఁపరు హృదయబంధంబువీడ
బరమసుఖం బుంద్రు బంధులబంధువుల్ మిత్రులమిత్రులన్ మేఱలేక

తే. సర్వసమవర్తులై ధర్మసరణివిడక, ధాత్రి సర్వజ్ఞమూర్తులై దనరువారు
దుఃఖమనునది యెట్టిదో తోఁపకుండ, సంతతానంద మొందుదు రెంతయేని.

కృష్ణమూర్తిశాస్త్రిగారిరచన మొత్తముపై కైశికివృత్తిసమాశ్రితమై ప్రసాదమాధుర్యసౌకుమార్యాదిగుణోపేతమై యొప్పుచున్నది. ఈమహాకృతి యాంధ్రలోకంబున స్థిరప్రతిష్ఠంబొంది ప్రతిగృహంబునఁ బరిచితమై పురాణపఠనోచితమై యొప్పఁగలదు.

చోడవరము.

గ. సోమన్న.

# వి జ్ఞా ప న ము.



శ్రీమహాభారతం బనుకల్పవృక్షంబున నీశాంతిపర్వము మహాఫలం బని పెద్దలు చెప్పుదురు. ఇందులేని వేదాంతవిషయ మొక్కటిగాని యేవేదాంత గ్రంథమందును లేదు. భగవద్గీతలు, సనత్సుజాతీయము, పంచదశి లోనగు గ్రంథము లన్నియు దీనిపుత్రికలే. ఇట్టి శాంతిపర్వము మహాసముద్రమువలె నతివిస్తృతమై యున్నయది. ఇది మహాపండితులకేని దురవగాహ మనుచో నజ్ఞుఁడ నగు నను బోఁటివానిం జెప్ప నేమిటికి? అనేకక్లిష్టార్థఘట్టంబులందుఁ బొందియున్నది. రాజధర్మములు, ఆపద్ధర్మములు, మోక్షధర్మములు లోనగునవి దీని కలంకారములు. అట్టి మహాగ్రంథము నాంధ్రీకరింపఁబూనుట వట్టిచేతులతో మహాసముద్రము నీఁది దరిఁజేరఁగోరం దలంచుటయే యని నాయభిప్రాయము. ఇది తెలిఁగించుట భగవద్గీతలు, సనత్సుజాతీయము లోనగువానిం దెలిగించుటకన్న నెన్నియోరెట్లు శ్రమకలిగినది. దీనికి మనపూర్వులు శంకరాచార్యాదులు వ్యాఖ్యలు చేసియుండలేదు. నీలకంఠాచార్యులవారి గచ్ఛద్వ్యాఖ్యానము గలదుగాని యది నూఱు సంశయముల కొకసంశయమును దీర్చునదియై యున్నది. అదియును నాకు సంప్రాప్తముకాలేదు. నాకీయాంధ్రీకరణమం దెట్టిసహాయమును లభింపలేదు. కొన్ని కొన్నిఘట్టములలో నొక్కొక్కశ్లోకమున కొక్కొక్కదినముగాఁ గాలహరణమైనది. తుదకు "విస్సన్న చెప్పినదే వేద" మనునట్లు నాకుఁ దోఁచినదే యుచితార్థమని యిందుఁ బొందించితిని. "వినాయకం ప్రకుర్వాణో రచయామాసవానరం" చిత్రకారుఁడు వినాయకుని వ్రాయ నెంచి మొదలుపెట్టినాఁడు. తుద కది క్రోఁతిగా మాఱినది. తొండము తోఁకయైనది. అట్లే నా యీరచనము నగు నేమో యని నాభయముతీఱనిదే యగుచున్నది.

ఈశాంతిపర్వము బహుప్రతులలో బహువిధములుగా నున్నది వచ్చిన కథలే మఱియు మఱియు వచ్చినవి. అవి ప్రమాదములో ముద్రాపకుల దోషములో తెలియ శక్యముకాదు. అట్టిపట్ల రెండుమూఁడుప్రతులం బురస్కరించుకొని నాకుఁ దోఁచినవిధంబునం జేసినాఁడ ఇట్టిపట్ల సోమయాజినే యనుసరింతమని యెంచితినిగాని యది సరిపడినదికాదు. చాలస్థలముల సోమయాజి స్వతంత్రించినట్లు తెలియవచ్చినది. మనస్వాతంత్ర్య మిటఁ బనికిరాదనియు బహుప్రతులు ప్రమాణమనియు నెంచి తన్మార్గ మనుసరించితి. ఇది యెంతవఱకు సమంజసమో చెప్పఁజాల. అప్పటికిని నాకుఁ గలిగినసందేహము లం దందు రేఖాధోభాగంబుల (Foot note) సూచించియున్నవాఁడ.

ఇది నేను పెక్కుసంవత్సరములక్రిందటనే వ్రాసియుంచితిని. నాకుఁ జిన్న చిన్న కాగితము ముక్కలమీఁద వ్రాయు నభ్యాసము కలదు. దానం జేసి నాభారత మంతయు నక్లే చేసితిని. ఆవ్రాఁతయుఁ జాలవఱకు పెన్సిల్‌తో వ్రాసితిని సంవత్సరములు గడచినవి గావున నాయక్షరము లిపుడు విస్పష్టముగాఁ గానిపించుటలేదు. నడుమ నడుమ తుడుపులు, హంసపాదులు, క్లుప్తులు, సశేషములు, త్రిపాదులు, పంచపాదులు, వృత్తసంకరములు, చూ - డి, చూ - సం, చూ - తె, ఇత్యాదు లెన్నో ఆచిక్కిరి బిక్కిరివ్రాఁతలలో నున్నవి. అదిచూచి వ్రాయుట నాకే సాధ్యముగాకపోయినది. కాలమతిక్రమించినది కావున నాసంజ్ఞలు నాకిపుడు తెలిసినవి కావు. ఎట్లో కష్టముమీఁద నొకగ్రంథముగా వ్రాసి వ్రాయించినాఁడ. పైనఁజెప్పిన మాతృకా కారణమునఁ బుత్రికలో ననేకదోషములు పడినవి. విపుల గ్రంథము గావున స్థిమితచిత్తమున విమర్శించుటకు వీలుకలిగినది కాదు. ఇది మద్రాసులో "వావిళ్ల" ముద్రాశాలలో ముద్రింపఁబడినది. ముద్రించునప్పుడు తదధికారు లెంతో శ్రమచేసి నావ్రాఁతప్రతిలోని యెన్నోతప్పులను సవరించినారు. అట్లయిన నీశాంతిపర్వమం దెన్నోతప్పులు పడియున్నవి. శుద్ధపత్రము వ్రాయుటకైన గ్రంథమంతయుఁ గన్నుగలపండితుఁడు చూడవలయును. అదియుం దటస్థింపమిం జేసి దానిజోలికిం బోనైతి. పెక్కుస్థలములలో యతిభంగములు గణభంగములు లోనగునవియుంగలిగినవి. అది ప్రమాదముకాని నాయజ్ఞానము కాదని పెద్ద లూహింపకపోరు. ఇది పునర్ముద్రణమందు సవరింతుమనుకొన్న నాజీవితకాలములో అట్టిభాగ్యము పట్టదు. నేను గతించినవెనుకనైన దీనికిఁ బునర్ముద్రణభాగ్యము పట్టినయెడల నాయెడఁ గరుణగలవిద్వత్ప్రకాండు లాయా భాగములు చక్కఁజేసి నిర్దుష్టముగా గ్రంథమును ముద్రింపించి లోకోపకారము చేయుటయేగాక నాచిత్తమునకు శాంతియుం గలిగింతురుగాక యని కోరుచున్నాను.

ఈశాంతిపర్వమునకు విశాఖపట్టణమందలి చోడవరము రేంజియందలి పాఠశాలలకు సీనియర్ డెప్యూటీ యినస్పెక్టరుగానున్న విద్వాన్ గరిమెళ్ల సోమన్నపంతులు, యం. యే., యల్. టి., గారు నాయందలి కరుణచేఁ బీఠిక వ్రాసినారు. నేను వారియెడఁ గృతజ్ఞుఁడను. వావిళ్లముద్రాశాలాధికారులు తమ కెన్నో తొందరపను లున్నను నాయందలివాత్సల్యముచేత నీ గ్రంథమును ముద్రించుటయే గాక ప్రతిలోనిదోషములు సరిచేయించినందులకు వారి కనేక నమస్కారము లర్పించుచున్నాను.

రాజమహేంద్రవరము. | ఇట్లు,
18-11-1934 | శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రి.

# విషయసూచిక.

## శాంతిపర్వము - ప్రథమాశ్వాసము.

## చతుర్థాశ్వాసము.

## సప్తమాశ్వాసము

నవమాశ్వాసము





# స వ ర ణ

ఇందు 5-వ పుటలో "మానిని"కి మాఱు "మానినీమణి" అనియుం;

8-వ పుట 5-వ పంక్తి "అంగవిషయంబునంగలయట్టిమాలిని" అనుటకు "అంగవిషయేశునకుఁ దనదైనమాలిని" అనియుం;

18-వ పుటలో సీసపద్యము 4 చరణములకు మాఱుగా:—

సీ. "వెలుపలి ద్రవ్యంబు విడ సిద్ధి లేదు లో, ద్రవ్యంబు విడ సిద్ధి తగునో కాదొ
శారీరముల నాస సలుపుచు బాహ్యము, విడసిద్ధి సమత నేర్పడును మనకు
మనశత్రుకోటికి; మఱి బాహ్యశారీర, ములు విడ నగు ధర్మమును సుఖంబు
మనక కా దెల్లరకును గల్గుఁ గావున, మమ యనునది మిత్తి నమమ యనఁగ."

అని సవరింపవలయును. 18-వ పుట క్రింద నీ ఫుట్ నోటు చదువుకొనవలెను.

త్యాగము = ద్రవ్యరూపము; అది బాహ్యము, శారీరము, అని ద్వివిధము; బాహ్యము భూమయము, శారీరము ధీమయము; వ్యవహారోగయోగము బాహ్యము, సంకల్పమాత్రగతము శారీరము; అని.

41 పుట 28-వ పంక్తి "దబ్బిబ్బుగాకుండ" అనుటకు "గాకుండఁదబ్బిబ్బు" అనియు;

64 పుట 1-వ పంక్తి చివర "విదురుండు" అనియు;

70 పుట 28-వ పంక్తిలో "ప్రతిభ" అనుటకు "పోఁడి" అనియుం సవరింపవలెను.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు | పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|---|---|---|---|
| 8 | 24 | నుత్యము | సత్యము | 56 | 29 | నిరు | నీరు |
| 21 | 22 | రాగి | రాక | 63 | 6 | తేర్పడ | వేర్పడ |
| 42 | 27 | నిమగంబు | నిగమంబు | 64 | 25 | కువలాధి | కువలయాధి |
| 43 | 12 | గలవు | గనవు | 65 | 19 | ఉల్లపిత | ఉల్లసిత |
| 54 | 7 | నాఱు | నూఱు | అని సవరించుకొని చదువవలయును. | | | |



బాలాత్రిపురసుందర్యై నమః

# శ్రీకృష్ణభారతము

## శాంతిపర్వము - ప్రథమాశ్వాసము.



శ్రీమద్భారత సారభూరుహమునం జెన్నారి విద్వత్ప్రియం
బై మాన్యం బయి సర్వమానవతమోవ్యాపన్నోషధం బై వివే
కామోదప్రద మై మధూన్నతఫలం బౌ శాంతిపర్వంబునన్
నా మే లెంచెదు తోడునీడ వగు మోనానాజగత్పాలకా. 1

—నారదాదిమహాత్ములు ధర్మరాజుం జూడ వచ్చుట.—

వ. అవధరింపు మక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె నట్లు పాండవులు సుహృదుల కెల్ల నుదకకర్మం బాచరించి గంగాతీరంబున విదురధృతరాష్ట్రసమేతులై యాశౌచం బపనయింప నొక్కమాసమాత్రంబు నివసించి రక్కాలంబునం గృష్ణద్వైపాయన నారద దేవల దేవస్థాన కణ్వ ప్రభృతు లగు బ్రహ్మర్షిసత్తములు శిష్యప్రశిష్యవర్గంబుతోడం గూడి ధర్మనందను సందర్శింపం జనుదెంచిన నతం డెల్లవారి కర్ఘ్యపాద్యాదు లొసంగి సుఖాసీనులం గావించి సేవించి యున్నంత సద్వైకమత్యం బు గలిగించుకొని నారదుండు శోకవ్యాకులితచేతస్కుం డగుపాండవాగ్రజు నాశ్వాసించుచు నిట్లనియె. 2

మ. అమరేంద్రాభ భవత్ప్రతాపమున దీవ్యద్వాసుదేవప్రసా
దమునం ధర్మమునన్ జయింపఁబడె నీధాత్రీతలం బెల్ల భా
గ్యమునన్ లోకభయంకరం బయినసంగ్రామంబున న్ముక్తుఁ డై
తమితానందము నొందుచుండుమ నరేంద్రా విప్రధర్మంబునన్. 3

క. తలపు వ్యాడకయుండుం గలనం గెలిచితివి పగఱం గడుమోదమునన్
గలిగిరి సుహృదులు లక్ష్మి, కలితుండవై తిపుడు వంత గనురక యుంటే. 4

తే. అన యుధిష్ఠిరుఁ డనియెఁ గృష్ణాశ్రయమున, బ్రాహ్మణాశీః ప్రసాదసంప్రాప్తివలన
భీమఫాల్గునభుజశక్తి భూమియెల్లఁ, గలిగితినిఁ గాని మది శాంతి గలుగ దనఘ. 5

వ. చెప్పెద నవధరింపుము. 6

క. సకలజ్ఞాతికియయుర్, సకలంకాత్మకుఁడ వగుచు సలిపితి సౌభ
ద్రికు ద్రౌపదేయపంచక, మకటా కోల్పోతి ననుచు నడలుదు నెడఁదన్. 7

చ. అకటకటా! సుభద్రి నను నారసినప్పుడు పుత్రశోకపా
వకహతచిత్తయై యెటులు పల్కెడునో యన నేల పుత్రఘా
తుకుఁడవు రాజ్యలోభమునఁ దోఁగితి వీ వన కుందునే జయో
త్సుక మగుద్వారకాజన మధోక్షజుసిం గని నొవ్వఁ బల్కదే. 8

తే. అనిమొనం ద్రెళ్లి రాత్మజు లనుఁగుసోద, రులును జుట్టాలు వారలఁ దలఁచి ద్రుపద
రాజపుత్రిక కన్నీరు రాల్చినపుడు, నాదుమది కాల్చినట్టులు గాదె చెపుమ. 9

—ధర్మరాజు కర్ణుం దలపోసి దుఃఖించుట—

సీ. నాయడ లాఱనిదై యుండుటకు నొక్క, ఘనకారణము సెప్పఁ గలిగె వినుము
మాయమ్మ కన్నియ యై యున్ననాఁడు భా, స్కరుని ప్రసాదముకలిమిఁ గన్నఁ
గని మంత్రగోపనం బొనరించి యొకపెట్టి, యం బెట్టి గంగలో నదయ విడిచె
ననియును సూతజుం డనుసడి కైనసూ, ర్యాత్మభవుండు మాయన్న యనియుఁ

తే. దోయదానావసరమునఁ దోఁడఁ బుట్టు, వులును నేనును గొంతియే పలుక వింటి
మెఱుఁగ మంతకు మున్నె మే మిది యదీయ, గాత్రములదూదినగ్ని నాఁగాల్చునకట.

సీ. అఖిలజగంబునం దప్రతిమానరథుఁ, డుగ్రభానుప్రభ నొప్పువాఁడు
నాగాయుతబలుండు నాగారిదర్పుండు, ఘృణి యెప్డు లేదన కిచ్చుదాత
సతతంబు కౌరవక్షితినాథునకుఁ బట్టుఁ, గొమ్మ మమ్మనిఁ దూలఁ గొట్టినతఁడు
శీఘ్రాస్త్రశస్త్రుండు చిత్రయోధియుఁ గృతి, యద్భుతవిక్రముం డైనవాఁడు

తే. పూతచారిత్రుఁడును గుణోపేతుఁ డైన, భ్రాత రాజ్యలోభంబున ఘాతుకుఁడను
నేన చంపించితిని నాదుమానసంబు, తహతహం పడు నేమందు తాపసేంద్ర. 11

ఉ. కుంతి యొకప్డు కర్ణుకడకుం జని మాకు శమంబుఁ గోరుచున్
సుంతయు దాఁప కే గనినసూనుఁడ వీవును పాండవుండ వీ
వంతున నీదుతమ్ము లగువారలపైఁ బగ పూన నేల నీ
స్వాంతము చక్కఁజేసికొని వారలఁ గూడికొనంగ రమ్మనన్. 12

క. అని పట్టువఱచుతల్లికి, ననుకూలము గాఁగ మాట లాడక తండ్రి
ట్లని పలికె నంచు వింటిన్, మునివర ధర్మార్థయుక్తములు విను మెల్లన్. 13

తే. నీమతంబునఁ బడి నన్నుఁ జేరుముడించు, ధార్తరాష్ట్రుని విడనాడి ధర్మసుతునిఁ
గలియ రాఁ జాల నది కృతఘ్నత్వము కృపణత్వమునునసార్యత్వమునాఁగఁదలఁతు.

వ. ఇదియునుం గాక మాకర్ణుండు. 15

ఉ. బీరము లాడి క్రీడిఁ గని బీతున వీతబలప్రకారుఁడై
పోరు దొఱంగి పోయె నని బ్రియ్యఁగ నాడరె లోకు లోజని
త్రి రణమందు సాచ్యుతునిఁ గ్రీడి నణంచి యనంతరంబు నీ
కోరినయట్ల ధర్మజునిఁ గూడెద నే ననె నంట వింటివే. 16

వ. అనుటయు మాజనయిత్రి. 17

మ. తనయా నీమత మట్టిదేని విజయుం దాఁకంగ వీఁకన్ రణాం
బొనరింపం జను మప్వాం గలరు తమ్ముల్ నల్వు రవ్వారిఁ గాఁ
వన క మ్మన్న నతండు కే ల్మోగిచి యవ్వా వారిఁ జేఁ జిక్కినన్
దునుమన్ నీసుతు లేవురే తెలియ నాతో లేక విప్వచ్చుతోన్. 18

వ. అనిన మాతల్లి తండ్రీ ! తమ్ముల నేమఱకుండు మని మఱియుం జెప్పి యొప్పించి
గృహంబునకుం జనియె నని వింటి నీరహస్యంబు తల్లిగాని కొడుకుగాని వెల్లడింప
రందున నింత పుట్టె నాకర్ణింపుము. 19

ఉ. సోదరుఁ బుచ్చి సోదరుని సూర్యసమప్రతిభావిభాసితున్
గాడన కేన చంపితిని గట్టిఁడి నైతిని నామనంబు ని
ర్వేదము నొందుచుండె నని వేఱ వచింపఁగ నేల మేము నా
భూదయితుండు నైన సురపుంగవు నేని జయింప కుందుమే. 20

ఆ. మాసహోదరుండు మాకులదైవము, పాండవాగ్రజుండు బాహుబలవి
నిర్జితారిచక్రుఁ డర్జునిచేఁ గూలఁ, బడియె నేమిసేయువాఁడ నకట. 21

ఉ. ద్యూతసభాంగణంబునకు దుష్టసుయోధనుతోడఁ గూడి త
త్ప్రీతిగఁ బల్కె రూక్షములు తీక్ష్ణములున్ మము నప్డు నప్డు ధ
ర్మేతరముల్ పొనర్చె నతఁ డెంతయుఁ గ్రోధము పుట్టుఁ గాని నా
కాతనిపాదపద్మముల నారసినంతన శాంతి యయ్యెడిన్. 22

తరలము. అతనియంఘ్రులు కుంతిభోజసుతాంఘ్రు లొక్కతెఱంగ యై
మతికిఁ దోఁచిన నేను హేతువు మాత్ర మారయఁ జాల కా
వితరణామరశాఖిఁ గాంచినవేళ నెల్లా తలంతు నీ
విత మిదంచుఁ దెఱుంగఁ జాలనివెఱ్ఱి నైతి నిఁ కేమనన్. 23

వ. అని పలుతెఱంగులం బరితపించుచు మునీంద్రా సంగ్రామంబున దినేంద్రనందనుని
స్యందనచక్రం బిలఁ గ్రుంగుటకుం గలశాపకారణంబు విన వలతు ననుగ్రహింపు

మీవు సర్వజ్ఞుఁడవు నీ వెఱుంగని వెవ్వియు నేలోకంబున లేవు గావున నిన్నర్థించు సనిన నత్తాపసోత్తముండు వైకర్తనునివిషయంబున నీయన్నమాట యథార్థంబ దేవ గుహ్య మగునాతనివృత్తాంత మంతయుం జెప్పెద నవహితుండవగుమని యిట్లనియె.

—నారదుండు కర్ణునిచరిత్రము చెప్పుట—

ఆ. శస్త్రపూత మగుచు క్షత్రియవర్గము, స్వర్గమందుఁ బొందెఁ సర్వదేవ
తలును వైరవహ్ని వెలుఁగఁ గన్యాగర్భ, మలరఁ జేసి రనుచు నరయు మధిప. 25

సీ. అతఁడు తేజోయుక్తుఁడై సూతపుత్రత్వ, మొనఁక మొనఁగ వంగిరసునితోడఁ
గఱచి ధనుర్వేద మఱగొఱ గాకుండఁ, బెఱిగి నీబుద్ధియు భీముబలము
నరునిలాఘవమును హరిసఖ్యమును మాద్రి, తనయులవినయంబు ధరణిజనుల
యనురాగముఁ దలంచి మనమునఁ జింతాజ్వ, రమునఁ దపించియుఁ గ్రమము విడిచి

తే. దైవసంఘటనమున స్వభావమునను, నిత్యవైరంబు మీవయి నిలిపి బాల్య
మునన సుర్యోధనుని గూడికొని తదీయ, సఖ్యమునఁ జేసి యహమించె నవతులేక.

వ. వదంపడి యయ్యభిమానధనుండు ధనంజయుని ధనుర్వేదాధికత్వముం దెలిసి రహస్యంబుగ ద్రోణాచార్యునిపాలికిం జని నాకు బ్రహ్మాస్త్రంబు ప్రయోగోపసంహారంబులతోడ నుపదేశింపు మేను సవ్యసాచితో సమరంబున సముండనై పోర శక్తిం గలిగికొన వచ్చితి నీవు సర్వశిష్యసమస్నేహుండవు నీప్రసాదమున నన్నుఁ గృతాస్త్రుం జేయు మని ప్రార్థించిన వానిదౌరాత్మ్యం బెఱింగి ఫాల్గునపక్షపాతి యగునతండతని కిట్లనియె. 27

క. చరితవ్రతుఁ డగుబ్రాహ్మణ, వరుఁ డొండెఁ దపస్వి యగుమ వఱలెడురాజో
త్తరుఁ డొండె కాక యితరులు, పరమాస్త్రము దానిఁగొనఁగఁ బాత్రము లుండ్రే.

సీ. అట్లు ప్రత్యాఖ్యాతుఁడై కన్యకాజాతుఁ, డపుడు మహేంద్రాద్రి కరిగి పరశు
రామునిఁ గని మ్రొక్కి బ్రాహ్మణుం డను భార్గవుఁడను వచ్చితి నిమీయడుగులొత్త
ననుడు గోత్రాదిక మడిగి రాముఁడు నమ్మి, ప్రేమునం దనచెంతఁ బెట్టుకొనియె
నట భృగూద్వహునితో నస్త్రములఁ గఱచె నా, వైకర్తనుఁడు దేవపరులచెలిమి

ఆ. నిట్లు కొంతకాలమేగిన నొక్కనాఁ, డతఁడు విల్లునమ్ము లంది దక్షి
ణార్ణవంబుచెంత నగునాశ్రమప్రాంత, మున మెలఁగె విలాసమున నొకండు. 29

చ. ఒకమునిహోమధేను వట నుంట నెఱుంగ కతండు శాతసా
యకములు చిమ్ముచుండ నొకయ మ్మల వేలిమిపడ్డఁ దాఁకుడున్
వికృతము గాఁగ నార్చి యది వీడ్చెఁ బ్రాణము లంతఁ గర్ణుడుక్

— కర్ణునకుఁ గలిగినశాపములప్రకారము —

గకవికలైనచిత్తమున క్ష్మాసురసత్తముఁ జేరి యిట్లనున్. 30

శా. ఈయావుం దెగ నేసినాఁడ నిసుమంతే బుద్ధిపూర్వంబుగా
దోయయ్యా యపరాధమున్ సయిచి నన్నోమంగదే పాపముం
బాయం జేయవె నీప్రసాదమునకే పాత్రంబ పాలింపవే
నీయాజ్ఞం దలఁదాల్చి కొల్తుఁ గరుణం దేలింపవే మ్రొక్కెదన్. 31

వ. అనినం గ్రుద్ధుండై కటంబు లదర పటపటం బండ్లుగొఱుకుచు నవ్వాగాయుధుండు వానిం భర్త్సించుచు నిట్లనియె. 32

మానిని. ఈవు వధార్హుఁడ వింతకు నింతఫలంబును బొందుము నీ
భావము వేనిపయిం బగ బర్వునొ వాని నెదిర్చిన చో
క్ష్మావలయంబున నీరథచక్రము గ్రుంగును గ్రుంగు నెడన్
జేవడి నాతఁడు నీతలఁ జెండెడుఁ బో మ్మిట నుండి ఖలా. 33

వ. అని శపించినం జలించి వైకర్తనుం డాద్విజసత్తముం గృతాంజలియై ప్రార్థించి. 34

తే. ధనము గోధనమును రత్నతతులు నీకు, వలసినన్ని యిచ్చెదనన్న నెలమిఁ జూడ
మనుడు నానుడి వ్యాహృతంబయినజగము, వ్యర్థమగుఁ బొమ్మనియె ద్విజప్రవరుఁడంత.

వ. కర్ణుండు దైన్యంబున నధోముఖుండై రామాశ్రమంబునకుం జనియె నింక జామదగ్న్యునిశాపప్రకారంబునుం జెప్పెద విను మట్లు కర్ణుండు భక్తియుక్తాంతరంగుండై ప్రణయంబునం బరిచర్య సేయుచుండ నతండు వానికి మెచ్చి బ్రహ్మాస్త్రంబు లోనగు ననేకాస్త్రంబు లిచ్చి ధనుర్వేదవిద్వరునిం గావించె నంత నొకనాఁ డుపవాసకర్శితుం డగు రాముం డాశ్రమప్రాంతమునఁ గర్ణునుత్సంగంబుపై శిరంబుఁ జేర్చి నిదురించె నంతలో శ్లేష్మమేదోమాంసమస్తిష్కశోణితభోజనప్రియంబును దారుణంబును దారుణస్పర్శంబు నగు నొక్క క్రిమి వచ్చి కర్ణునూరువుక్రిందం జొచ్చి విచ్చలవిడిఁ దొలువం జొచ్చె నతండును గురునకు నిద్రాభంగం బగు నని శంకించి కీటకకృత్యంబునకు సైచి చలింపకుండె నంతఁ గొంతవడికి రుధిరపరిప్లుతుం డగుభృగూద్వహుండు మేలుకాంచి కర్ణుం గాంచి యిట్లనియె. 36

ఉ. ఏమిదిభార్గవా రుధిర మిట్లుగుడెంచి ప్రవాహమట్లుపై
నామెయికిన్ శుచిత్వము నణంపఁగఁ జాలె భయంబు దక్కి నీ
వీమెయి నంతయున్ దెలియ నేర్పడఁ జెప్పుము నాకు నావుడున్
రామున కావికర్తనవరప్రభవుండు నమస్కరించుచున్. 37

తే. తనదు తొడయెత్తి కృమిఁజూపి మునివరేణ్య, యిదిదొలిచినాఁడు క్రిందఁ దోఁపనీక తినియు.
మీనిదుర సేటునకు నోపమినిఁ జలింప, కుంటి నిట్లొది నానల్ల యంతె నకట. 38
వ. భార్గవుండును సూకరసన్నిభంబు సహస్రపాదంబు సూచీతీక్ష్ణదంష్ట్రింబును మహారోమ
సన్నిరుద్ధాంగంబు నగునలర్కం బనునక్కీటంబుం గనియెఁ గనినంతలోన. 39
మ. కృమి పంచత్వముఁ గాంచి కర్ణరుధిరక్లిన్నంబమై విస్మయ
క్రియ మొప్పంగ దదుత్తరక్షణమునన్ గన్పట్టె మున్నంతరి
క్షమునన్ రాక్షసుఁడై కరాళుఁడును గృష్ణప్రస్ఫుటాంగంబు ర
క్తమయగ్రీవము గ్రాల మేఘములపైఁ గా లూఁది మోదంబునన్. 40
వ. విశ్వరూపుం డగు రాక్షసుండు భృగుకులాన్వయుం గాంచి నమస్కరించి
యి ట్లనియె. 41
తే. ఏటికోళ్ళివె భృగువంశవృషభ నీకు, భద్ర మగు నరకమునుండి పాయఁ జేసి
నాకుఁ బ్రియమాచరించితి లోకపితృత, పోయివచ్చెద నీయాజ్ఞఁ బొంది వడసి. 42
వ. అనిన జామదగ్న్యుండు. 43
క. ఎవ్వఁడవు నీవు నరకం బెవ్విధమున, నీకు వచ్చె నెఱిఁగింపుము నా
నశ్వర దేహుం డిట్లను, దైవ్యనిభక్తిన్ భజించి దివ్యమునీంద్రున్. 44
తరువోజ. విను మునే దంశుఁడన్ విఖ్యాతి కెక్కిన, విబుధవిద్విషుఁడను వెఱవక పూర్వ
మున నొక్కతఱి భృగుమునిపత్నిఁ గాంచి, మోహించి బల్మిమెంపునను హరింపఁ
గని నీదుతాత లోఁ గనలి మలంబు, గతిఁ గలపెదుపుర్వు గమ్ము పొకాలు
మని నన్ను శపియించె నపుడు శాపాంత, మానతిమ్మని నేను బ్రార్థించినాఁడ. 45
వ. ఆభృగుమహర్షి నన్నుఁ గాంచి నూవంశంబున రాముం డవతరించు నతని సందర్శ
నంబున నీకు శాపమోక్షం బగు నని పలుకుచున్నంత నే నీకీటంబనై పాటందు
చు నిపుడు నీసాదరవిలోకనామృతసేకంబున విముక్తిం గాంచితి నని నమస్క
రించి యథేచ్ఛం జనియె రాముండును గ్రోధతామ్రాక్షుండై కర్ణుం దిలకించి
యి ట్లనియె. 46
ఆ. ఇంత లేసి తాల్మి యెక్కడ బ్రాహ్మణ, జాతి యెక్కడ యిది క్షత్రజాతి
కర్మ మీవు ద్విజుఁడు గావు సత్యము చెప్పు, మనుడు శాపభీతుఁ డగుచు నతఁడు.
వ. అనుగ్రహింపు మేను బ్రహ్మక్షత్త్రాంతరజాతం బగుసూతవంశంబునఁ బుట్టినవాఁడ
రాధేయుండ నస్త్రలుబ్ధుండనై యిట్లు చేసితి వేదవిద్యాప్రదుం డగుగురుండు తండ్రి
య కాన భార్గవుండ నని తండ్రిగోత్రంబ చెప్పితి నాతప్పు సైపు మని గడగడ
వడంకుచు నడుగులం బడి ప్రార్థించినం బ్రసన్నుండు గాక భార్గవరాముండు. 48

సీ. ఓరోరి సూతకులోద్భూత దివ్యాస్త్రలాభము మదినెంచి లోభమునను
బొంకాడితివి గానఁ బొందినబ్రహ్మాస్త్ర మది వధకాలమునందు మాత్ర
ప్రిస్ఫురింపక నీకుఁ బరకాలముల నట్లు, గాకుండెడి ధ్రువంబుగా మహాస్త్ర
మబ్రాహ్మణుని కిడ నలర దనత్వవాదికి స్థాన మిట లేదు తెరలుమీవు
తే. బవరమున నిన్నుఁ బోలినబంటు లోకమందు, గలుగఁ బోఁ డేగు మనుటయుఁ గర్ణుఁడపుడ
కదలి దుర్యోధనునిసముఖమున కరిగి, యేఁగ కృతాస్త్రుఁడ నైతి నం చెఱుఁగఁ జేసె.
వ. అతండు నతని నాదరించి ప్రీతుండయ్యె నంతఁ గొంత కాలంబునకుఁ గళింగ దేశా
ధీశుం డగుచిత్రాంగదుండను తనకన్యకు స్వయంవరోత్సవంబు ప్రకటించి రాజుల నా
హ్వానించుటయు నారాజపురంబునకు శిశుపాల జరాసంధ భీష్మక నీల రుక్మి సృగా
లాశోక శతధన్వ భోజ ప్రభృతి దాక్షిణాత్య రాజన్యులును మ్లేచ్ఛచయ్యలు ప్రాచ్యో
దీచ్య రాజులును వేనవేలు స్వయంవరరంగస్థలం బలంకరించిరి దుర్యోధనుండును జతు
రంగబలసమేతుండు కర్ణసహితుండై యటకుం జనియె నిట్లు సముపస్థితు లగునెల్ల
పార్థివులు సముచితాసనంబుల సముపవిష్టులై యున్న సమయంబున. 51
సీ. చిత్రాంగదాత్మజ ధాత్రీసమేతయై, పుష్పమాలిక చేతఁ బొందుపడగ
రంగస్థలంబున కంగజలక్ష్మినాఁ, జనుదెంచి వెవ్వేఱ జనపతులను
ధాత్రి చెప్పఁగ వించు ధార్తరాష్ట్రు నతిక్రమించి పోవుటలు వీక్షించి యతఁడు
కన్నియఁ జేఁబట్టి కలవారిఁ జీకొట్టి, తనరథంబునఁ బెట్టికొనియె నంత
తే. శస్త్రభృద్వర్యుఁ డగుకర్ణుఁ డస్త్రి ఖడ్గి, యగుచు నిజమిత్రు రారాజు ననుసరించె
నపుడు రాజులు సన్నద్ధు లగుచుఁ గలఁగి, వారి నన్నంటి పడి రస్త్రవర్ష మొలికి.
వ. అట్టియెడ మనవైకర్తనుండు. 52
చ. ఒరయఁగ వచ్చునందఱ నొకొక్కశరంబున నుక్కడంచుచున్
శరములు చాపముల్ విఱిచి జర్జరితంబులుగా రథంబులున్
దురగములున్ గజంబులును దుత్తుమురై పడఁ గాలుబంటులున్
ధరఁ గయి సేయ నేసి సుమృధం బొనరించె భయంకరాకృతిన్. 53
తే. అతని కైవడి కోపక యవనిపతులు, నొచ్చియును జచ్చియును వేడ వచ్చియు బ్రదు
కాన నేసియు హతశేషులైనవారు, పోరు విడనాడి పోయిరి దారి వట్టి. 54
వ. పదంపడి దుర్యోధనుండును గర్ణసాహాయ్యమానుండై కన్యాసహితుండై కరిపురంబునకుం
జనియె నంతఁ నావిష్కృతబలుం డగుమార్తాండాత్మజుం గని సైరింపం జాలక
మాగధుం డగుజరాసంధుండు గర్వాంధుండై పోరాడనం బిల్చె నంత వారిద్వర
కును భీమసంగ్రామంబు ప్రవర్తిల్లె నప్పుడు. 55

సీ. శస్త్రాస్త్రవిద్వరిష్ఠతఁ గన్నవా రిర్వు, రొండొరు శరవర్ష మొలికికొనుచుఁ
దెగనిపగం జేసి తెగువ మెయిం బోరి, భగ్నఖడ్గులు క్షీణబాణు లగుచు
ధరకు లంఘించి మాత్సర్య మెచ్చ నియుద్ధమునకుఁ గడంగి పెంపునఁ బెనంగి
రపుడు మీవసుషేణుఁ డాయువుపట్టునఁ, బొడిచిన మాగధుఁ డడరు టుడిగి
తే. ప్రీతుఁ డైతిని నీచేత కీర్తి నని, యంగవిషయంబునం గలయట్టిమాలి
నీనగర మిచ్చె నతఁడు చంపానగరము, నొడిసికొని యేలె రారాజు నొరిమఁ గాంచి.
మ. వరశస్త్రాస్త్రబలప్రతాపమున విశ్వఖ్యాతుఁడై దాతృశే
ఖరుఁడై యుండినవానిఁ జూచి సమయం బగా శేక యింద్రుండు నీ
పరమేష్టంబు దలంచి కుండలములున్ వర్మంబు భిక్షించి భూ
సురవేషంబున నై హరించె సహజస్తోభంబు లారెండునున్. 57
ఆ. దేవమాయవలనఁ దీసి యిచ్చెను గాని, కవచకుండలములు కర్ణుఁ డవని.
కలిగి యున్న వానిఁ గవ్వడి గా దెవ్వ, రైన గెలువ లేమి యే నిజంబు. 58
వ. అదియుం గాక. 59
మ. మునిశాపంబును రాముకోపమును వేల్పుం బిండురావంచనం
బును గుంతీవరదానమున్ నదిసుతాపూర్ణోక్తి శల్యమ్ము శ
ల్యుని తేజోవధమున్ యదూద్వహునయోద్యోగంబు నేకీభవిం
చినదానన్ వసుషేణునిం దునుమ మీ శ్వేతాశ్వుఁ డోపెం జుమీ. 60
క. వరుణ యమ ధనద సురపతి, హరముఖ్యులు గురుఁడు కృపుఁడు నఖిలాస్త్రములన్
నరున కొసంగుట శాపాకరుఁ డగు నక్కర్ణుఁ జంపఁ గలిగె నరేంద్రా. 61
వ. అనిన విని శోకోపహతచేతస్కుం డగు పాండవాగ్రజుండు కన్నీరు మున్నీరై పొఱిఁ
బరిదేవదనంబు సేయుచు నిట్టూర్పు నిగుడించుచున్నం గని కంటనీరు వెట్టుకొనుచుం
గుంతి చెంతకుం జనుతెంచి యి ట్లనియె. 62

— ♦ ధర్మరాజు స్త్రీలకు రహస్యగోపనము లేకుండునట్లు శపించుట ♦ —

ఉ. తమ్ములు నీకుఁ బాండవులు తత్పరతం గను మంచుఁ దెల్ప ను
త్యమ్మని పుత్రమోహమునఁ దానును జెప్పె దివాకరుండు మే
మమ్మెయి నెంత చెప్పిన రవంతయు నొప్పకొనం డతండు కా
లమ్మున కయ్యె వేరము తలంచెదుఁ బొమ్మని యూరకుండితిన్. 63
మ. పగవానిం గొని మీపయిం బగ మదిం బాటించి మీ కెగ్గులం
దెగుఁవం చేసినవాఁడు కాలగతికై తెల్లెక్కఁ దలంపంగ నీ

కగునే యట్టిదయావిహీనునకు దుఃఖాక్రాంతచిత్తుండ నై
పొగులం బోవుట ధర్మవిద్వరులు నీపోల్కిం బ్రవర్తింతురే. 64

వ. అని పలికిన నలుకం గటంబు లదరం గటకటం బడి ధర్మరాజు తల్లిం గని నీమంత్ర
గోపనంబున నింతలు పుట్టె నని చెట్టు వాపోవుచు. 65

ఆ. ఎల్లజగములందు నీనాఁటినుండి ర, హస్యగోపనము సమస్తమైన
స్త్రీజనంబునకును దెలియు లేకుండుత, మని శపించె ధర్మతనయుఁ డపుడు. 66

వ. అని శపించి పుత్రపౌత్రసంబంధిబాంధవసుహృజ్జనంబుల స్మరించి సంతాపపీడితుండు
శోకవ్యాకులితేంద్రియుండు నై నిర్వేదంబు నొంది విశేషించి వైకర్తనువిషోకను
శోకం బాఁగుకొనం జాలక ధర్మనందనుం డర్జునునాననం బాలోకించి యి ట్లనియె.

—ధర్మరాజు బంధుమిత్రాదులమృతికి విరక్తుఁ డగుట—

సీ. మనము వృష్ణ్యంధకజనపదంబుల భైక్ష, వృత్తిఁ జరించి జీవించి తిమ్మి
జ్ఞాతులం గూల్చినపాతకంబున నైన, దుర్గతు లబ్బినఁ దొడరఁ బోవు
పురుషార్థములు శాత్రవులకె లభించెను, మనకు లభింపనిమాటయు నిజ
మాత్మచే నాత్మను హతము గావించియే, ధర్మఫలంబుఁ బొందంగ నుండ
తే. మిసిసి క్షత్త్రియాచార మిస్సి బలంబు, పౌరుషం బిసి యన్నియుఁ బాయ ద్రొక్కి
కొల్పనే యిట్టియాపద పాల్పడంగ, నల్పవరి యమ్యో నేమందు నవ్వసాచి. 68

తే. క్షమయుదమమును శౌచమునసాధుతయును, త్యాగమును నహింసయు సమస్త రమ రాగ
మిని వనస్థులధర్మము లీర్ష్య లోభ, మోహమును లసూయయు మన నయి పోవడంచు.

క. ఈదుర్గుణములు గలుగుట, నే దుర్దశపాలుగా మహీరాజ్యభుభు
జోదర మగు మన కెంలమికి, గా దాత్రైలోక్యరాజ్యగతి గల దైనన్. 70

సీ. రాజ్యార్థ మవనీసురవ్రాతమును బంధు, జాతముం గూల్చి యెసంగుమనకు
నామిషార్థమునఁ గొట్లాడినకుక్కలకును బోలె నశుభమే కూడ వచ్చుఁ
గామమన్యుపరీతులై మాటుకొని పోర, హతులైన వారెల్ల ననువు దప్పి
మృత్యుయానము నెక్కి మిడుకుచు నై వస్వ, తక్షయంబునకుఁ బోఁ దగిరి గాదె
తే. తపము లుపవాసములు చేసి తల్లిదండ్రు, లాత్మజులఁ గాంచి సుఖమొందఁ దలఁచినంతు
రట్టివారెల్లనుం గాక యట్టె పోవ, నాశిత్పలయత్న మది రిక్త యగును గాదె.71

చ. తలఁపుము కోరె తల్లియును దండ్రియు నోములు నోచి నోచి పు
త్త్రులఁ గని నూఱ్వరక సిరులతోఁ దులఁ దూఁగుదు రంచు నుండియున్
ఫల మిసు మంతయుం గననివా రయి రక్కట వారొ పాపసం
కలితులు రెండులోకములఁ గాక వృథా వృథ పోయి రేమనన్. 72

తే. కురుకుమారులు పాంచాలకులును దెగిరి, వారు వారు చేసినచేత వలన వారి
కిహపరంబులు చెడియె నీయింతకును మనము కర్త మైతిమి ధార్తరాష్ట్రకునిఁ బట్టి.

మ. నికృతిప్రజ్ఞులు దుష్టచిత్తులు ఖలుల్ నీచాతినీచస్వభా
వకు లేవారలు చెప్పినన్ వినక సర్వం బొక్కమూఁకన్ మ్రింగుని
చ్చ కలారై మనపైఁ బగం జలిపి రాజ్యం బంద రేకాని యే
సుకముం బొందిరి యేమిచేసి రకటా శోషిల్లి రీయెల్లరున్. 74

చ. కొడుకులమీఁది ప్రేముడిని గూర్చుఁడు సొబయఁ డాడినట్లు గా
నడచెను గాని భీష్ముఁ డనినన్ విదురుం డనిన న్వినం డసం
పఁడు జనకుండు పుత్రుఁడును బాలిసుఁడై ఖలుఁడై దురాశలో
నిడికొని చంపి చచ్చెఁ దన యిద్దఱ శోకదవాగ్ని ముంచుచున్. 75

సీ. పాండవు లేను నేఁ బా లీయ నని పోరుమీఱి కృష్ణునికడఁ గాఱు లరచె
మనవైరపురుషు డాతనిపాపమున మఱి మిసుమిఁ బడితి మూకఁడును జచ్చెఁ
గురుకులం బంతయుఁ గూలెఁ జంపఁగ రాని గురుస్వాముల జంపుకొంటి మకట
కులనాశకుని వానిఁ గురురాష్ట్రపతిఁ జేసి, మునుసలిరా జిట్లు మునిఁగె నంత

తే. నరుల దుసుమాడ మనకోప మూతె గాని, పాప మని నన్ను శోకంబు పట్టికొనియె
త్యాగదానతపోధ్యాపనాదికముల, దాని బెడఁ బాపుకొన లోనఁ దలఁచినాఁడ. 76

క. త్యాగము పాప మడంచున్, ద్యాగి భవాంతముల నొందు కథిగత విలస
ద్యోగపదుండును కృతమతి, మై గతి బ్రహ్మంబు గాఁగ నలరు సుఖమున్. 77

వ. కావున నోసవ్యసాచీ పరిగ్రహవంతుండు జీవన్ముక్తిసుఖంబు నొందఁ జాలఁ డని శ్రుతికలదు పరిగ్రహంబునం జేసి యిట్టిపాపంబు నన్నుఁ జుట్టుకొనియె జన్మకృత్యనిమిత్తం బైనపరిగ్రహంబు రాజ్యంబును భోగంబులను పరిత్యజించి వనంబునకుం జని మునినై జ్ఞానసమన్వితుండనై విశోకుండనై విగతజ్వరుండనై యుండెద నీవు హతకంటకం బైనభూరాజ్యంబుం బరిపాలింపు మని యూరకున్నంత విక్రమోజ్జోధనుండును దృఢపాదపరాక్రముండు నగుధనంజయుండు తద్వాక్యంబు లధిక్షేపింపఁ జాలియుఁ జాలనివానితెఱంగభినయించుచుఁ దనయభిప్రాయం బెఱింగించువాఁడై దరహాసంబునం జెలువుగు నాఁకుకొనుచు నభినీతతరంబుగా నన్నకి ట్లనియె. 78

—అర్జునుండు ధర్మజున కుచితవచనంబుల మనస్తాపోపశమనంబు సేయుట —

క. హాహా యెంతటిదుఃఖం, బాహా పాపం బదెంత హాహా మాధ్వం
బోహో యే మన వచ్చు మ, హాహవము నహానుషక్రియం జేసి తమో. 79

ఉ. క్షత్త్రియధర్మతత్పరత సంస్తుతి కెక్కఁగ సంగరంబునన్
శత్రుల సంహరించి హరుసంబున రాజ్యరమాసమేతుఁడై
ధాత్రిఁ బొంది క్లీబునివిధంబున నేల్కొన లేక దాని నే
మాత్రము బుద్ధియుం గొనుట మాని త్యజింతు నటంచు వక్కటా. 80

క. ఇట్టిఁడవ యెం క్రోధము, మట్టుపడన్ బన్ని రణము మార్కొని పేర్మిన్
బట్టిన రాజుల నెల్లన్, మట్టిం బెట్టంగ నేల మహితవిచారా. 81

సీ. అర్థవిహీనుండు హతవైభవుం డగు, నతఁ డూరుపేద లే నట్టిఁ డగుచుఁ
బశుపుత్త్రహీనుఁడై భైక్ష్యంబున న్మను, నిలఁ బౌరుషారంభములను రోయుఁ
బాపిష్ఠ మైన కాపాలికవృత్తి నీ, వొంది రాజ్యము విడ నుంటివేని
లోక మే మను నిన్నుఁ బ్రాకృతజను నట్ల, కడగట్టి తే నిట్టికానిపనికి

తే. క్షత్త్రియాన్వయమందు సంజాతుఁడ వయి, గెలిచికొని భూమి ధర్మార్థములఁ ద్యజించి
యడవిఁ జన వైదికక్రియ లడఁగురు ఖలు, లమ్మహాదోష మంటు నిన్న వనినాథ. 82

క. ధనహీనుఁడు నడపీనుఁగ, యని నహుషుఁడు తొల్లి సెప్పె నది యెఱుఁగ వొకో
ధనమును గోరికి విడుచుట, మునులకుఁ దగుఁ గాని తగునె భూమిపతులకున్. 83

క. దేనిని ధర్మం బందురొ, దానిని ధన మచుమ నీవు దలఁపుము ధన మె
వ్వానికి లేకుండెడినో, వానికి ధర్మంబు లేనివచనము నిజమే. 84

తే. ప్రక్క నున్నదరిద్రునిఁ బతితు నట్లు, చూతురు దరిద్రత మహాపాతకంబు
పతితుఁడును నిస్వుఁడును నొక్కపగిది వగతు, రిర్వురకు భేద మింత లే దుర్వినాథ. 85

ఆ. ధనము పోఁగుపడిన దానివలన లోక, మునను సర్వకార్యములును నడచు
పర్వతములనుండి ప్రవహించు నేళుల, పగిదినట్లు గానఁ దగు ధనంబు. 86

తే. అర్థమున ధర్మకామము లర్థమునన, స్వర్గమును బ్రాణయాత్రయు సంభవించు
నర్థహీనుఁ డల్పుం డగు నతనిపనులు, వేసఁగిని స్వల్పనదు లట్లు విరిసి పోవు. 87

క. వానికి లోకము మిత్త్రము, వానికి జగ మెల్ల బంధువర్గము వైరుల్.
వానికి వశ్యులు ధర నె, వ్వానికి నెడతెగనిధనము వదలని దగునో. 88

ఉ. వాఁడు ధనాఢ్యుఁడై జగతి విశ్రుతకీర్తి వహించి యుండునో
వాఁడె కులీనశేఖరుఁడు వాఁడె సుధీనిధి వాఁడె విజ్ఞుఁడున్
వాఁడె మహాగుణజ్ఞుఁడును వాఁడె జగజ్జనదర్శనీయుఁడున్
వాఁడె ప్రవక్త వాఁడె గుణవంతుఁడు వాఁడె మహానుభావుఁడున్. 89

క. అర్థవిహీనుఁడు గోరిన, నర్థము శక్యంబు గాని దగులోకమునం

దర్థమునఁ గట్టఁబడియెడు, నర్థం బిల గజమునన్ మహాగజము బలెన్. 90

గీ. ధృతియు ధర్మముకామముఃశ్రుతముమదము,హర్షమునుగర్వమునునర్థమందె నిలుచు
నర్థమునఁ గుల మగు ధర్మ మతిశయించు, నిహపరంబు లధనునకు నెన్న సున్న. 91

క. తురగములు గోవృషంబులు, ద్విరదము లతిథులును భృత్యనివహంబులు నే
నగువింటఁ గృశము లగు నా, నరుఁడు కృశుఁడు దేహకృశుఁ డనం గృశుఁ డగు నే.

సీ. నిర్జరు లసురుల నిర్జించి వర్ధిల్లి, రో యిది తగ దని యుండి రోటు
న్నపుఁ డిట్లు గాకున్న నిజధర్మ మెట్లాచ, రింపఁ జాలెదు విచారించుకొనుము
సంపాదించి ధనంబు చదివి వేదంబులు, జన్నముల్ గావింపఁ జను నృపతికిఁ
బరునుండి కొంటమొ పరఁగు శ్రీయము ధర్మ, మనపకృతంబు గా నది లభింపఁ

తే. దండిశ్రీధనమును కొడుకుచందమున రాజు, పుడమిని జయించి నా దని నొడువునిట్లు
సేకరించినధన మెల్ల లోక మొందుఁ, నుదధి నీ రెల్ల దశదిశ లొందు నట్లు. 93

వ. ఇట్లు ధర్మం బాచరించి దిలీపుండు నృగుండు నహుషుండు నంబరీషుండు మాంధా
తృండు లోనగురాజర్షు లెందఱో స్వర్గాదిసుఖంబులం బొందిరి నీవును వారిమార్గ
మనుసంధించి ద్రవ్యమయయజ్ఞంబు గావింపు మట్లు గావింపకున్న నీకు రాజ్యకిల్బి
షంబు సంప్రాప్తం బగు రాజుల కశ్వమేధంబు విహితం బశ్వమేధావభృథంబున నె
ల్లరుం బవిత్రు లగుదురు నీ వీయనాదిపథం బవలంబించి కృతార్థుండ వగుము కుప
థంబునం బడకు మని చెప్పిన నప్పాండవాగ్రజుం డేకాగ్రచిత్తుండై యూరకుండి
కొండొకవడి కర్జునుం జూచి. 94

ఆ. సాధుగమ్యమైనసరణి నే నన్నది, నీవు ననినదట్టి త్రోవ గాదు
బొందఁ దగినదానిఁ బొందెద నది యేది, యనుచు నడుగు మడుగ నందువేని. 95

వ. నేన చెప్పెద వినుము. 96

సీ. విడిచి గ్రామ్యసుఖంబు లడవికిం జని యందు, నారచీరలు గట్టి కూరలు దిని
చలి కెండకు న్వాన కలుకక క్షుత్పిపా,సల కోర్చి యిరుసంధ్య లెలమి వార్చి
వేలిమిం గావించి వివిధమృగంబుల,చెలిమియుఁ దపసులసేవ గలిగి
సుతపంబున న్మేను శుష్కింపఁ గాఁ జేసి, దిన మొకచెట్టునీడను వసించి

తే. భైక్ష్యవృత్తిఁ జరించియుఁ బాంసుదిగ్ధ,తనుఁడనై జడాకృతి దాల్చిమనమునందు
జంతుహింస దొఱంగియు సర్వసమత,గలిగి కొని దేహయాత్రను గడప నుంటి. 97

మ. సమతిక్షా జీవులపట్లఁ గల్గి తన కేచందఁబు వర్తించు న
ధ్వము నా చందము గల్గి యుండు నని భావంబుం దగం జేసి క్రో

ధ మసహ్యంబును లేక నిర్మలమతిఁ దళ్కొత్తి తత్త్వప్రదే
శములం గష్టసుఖంబులన్ మఱచి సంచారంబు గావించెదన్. 98

సీ. శాంతి లేకుండి భిక్షాకాలమున రెండు, మూఁడిండ్ల భైక్షముం బొంది మెసవి
సమర్శి నగుచు లాభమునం దలాభమునం దుండియును లేనియట్ల యగుచు
బ్రదుకన్నఁ జావన్న ముదమును దుఃఖము, మదికి నేనాఁటికిఁ గదుర నీక
చందనం బలదిన శాతాసి వ్రేసిన, మేలుకీడ్లెఱుఁగని లీల నొప్పి
తే. యెట్టిసంకల్పమును లేక యింద్రియార్థ, బద్ధుఁడను గాక తృష్ణను బాఱఁ దోలి
జ్ఞానవిజ్ఞానసహితుఁడనై నిరంతరాధికానంద మొంద నే నభిలషింతు. 99

శా. సంసారంబున నాలుబిడ్డ లనుజుల్ సంబంధులున్ బాంధవుల్
హింసింపం దదధీనుఁడై మనుజుఁ డేయే కర్మముల్ సేయునో
ధ్వంసంబై చన వవ్వి చచ్చినపయిం ద న్నంటి వేధించు వి
ద్వాంసుం డైన నశింపఁ జేసికొను దివ్యజ్ఞానచిత్తంబునన్. 100

సీ. సంసారజంబాలసంచయమగ్నుఁడై భూతసంఘములతోఁ బొత్తువడసి
జన్మమృత్యుజరాదిసంబంధబంధురుం, డయి పుణ్యపాపము లాచరించుఁ
బుణ్యఫలంబునన్ బోయి స్వర్గసుఖంబు, నొందు ననంతరచ్యుతియు నందుఁ
దత్త్వవేత్త యెవండు తగులాట మికి మదిఁ, గోరికి సేయునొక్కో తలంప
తే. నల్ప నృపతులు రాజ్యలోభావృతమతు, లగుచు జన్మపరంపర నందుచుంద్రు
కాన నిర్భయమగుమార్గమేనుజూచు, కొనుచు నానందసౌఖ్యముఁ గొనఁ దలంతు.

—భీమసేనుండు ధర్మజునకు మనస్తాపోపశమనంబుసేయుట—

వ. అనినంత బకాంతకుం డన్న కి ట్లనియె. 102

తే. అకట మందుఁ డవిద్వాంసుఁ డైన శ్రోత్రి, యునకు ననువాకమున బుద్ధి యురలినగతి
నలసతన్ రాజధర్మము లలర వందు, విట్టినీబుద్ధి తత్త్వార్థ మెఱుఁగ దందు. 103

ఉ. ఇప్పటినీదుచిత్త మపుడే యెఱిఁగించినవాఁడ వేని యీ
చొప్పునధార్తరాష్ట్రులును క్షోణిపతుల్ మరణింపకుందు రే
మిప్పని కేల యియ్యకొని యిందఱ మ్రిందఁగఁ జేయ నెంతుమే
యెప్పటిభిక్ష మెత్తికొని యేగతినైన మనంగ నేరమే. 104

తే. క్షాత్రధర్మము కాదన్న క్షత్త్రియుండు, కాసరాఁ డొక్కరుఁడు నీవు కాని నాఁడు
నరవరేణ్య నీమదినెంత కరుణ యెంత, యానృశంస్య మెంత క్షమ నేఁ డయ్యె నవుర.

మ. బలవంతుం డగుపార్థివోత్తమున కభ్యామర్దమున్ జేసి భూ
తలమెల్లం భజియించు టొప్పు నదక్షాత్త్రం బైనధర్మం బటం

డ్రీల దానం బృథివీపతుల్ సమర మెంతే నెంతు రంచుఁ బ్రజా
వలినిన్ జంపక నొంప కెట్లు జయమున్ బ్రాపించుటల్ గల్గునే 106

అ. మనము క్షత్త్రధర్మమున రాజ్య మార్జించి, పగఱ నుక్కడంచి పడసినట్టి
ధరణి ననుభవింపఁ దగుఁ గాని కా దని, యడవి కేను బోదు ననుట తగవె. 107

సీ. జనుఁడు కూపము ద్రవ్వుకొని జలం బానక, బురద మేనం బాల్చి పోయినట్లు
పెనువృక్ష మెక్కి జు న్నను వుగఁ గైకొని, తేనె నాకక యుండఁ దెగినయట్లు
కడునాకటం బడి కబళింప నబ్బిన, యన్నమున్ విడనాడి యరిగినట్లు
పడరానిపాటులు పడి కోరుకొన్న రా, మిని చిక్క మది రోసి చనినయట్లు
తే. వితగఁ గలహించి శత్త్రుల కుతికఁ గోసి, వెనుకఁ దనతలఁ దాఁ గోసికొనినయట్లు
కారడవి దాటి చని రిత్త గ్రమ్మఱినట్లు, నీతలంచిన కార్యము నెగడు గాదె. 108

క. అడవికి నేగెదమసీత్రో, వెతఁగుల్మై యన్న యనెదు వెత్త్రినిఁ బతి రా
బడమిజను లెల్ల మానుమ, మ్మపఁదగ గర్హించి పలుకరే కరుణాత్మా. 109

చ. బలపురుషార్థవిద్యావిభావము గల్గి యనాథరక్షణో
జ్జ్వలమతిఁ బాల్చి యాత్మీతిఁ బ్రశంసకు నెక్కినమేము నేఁడశ
క్తు మయి క్లీబవాక్యమునకుఁ దల యొగ్గుచు వెంట నంట లో
కులు తమ రర్థసిద్ధి కయి కొండొకచూడక యందు రెట్లమో. 110

సీ. ముసలితనంబున మొనఁబ రాజయ మైన, నాపద లెవియేని యంటుకొనిన
సన్న్యాస మొప్పెను క్షత్త్రవిషయమందుఁ, బెరపట్టులం దొప్ప దరయఁగ నది
తత్త్వజ్ఞు లగుబుధుల్ ధర్మవ్యతిక్రమ, మని యందు రివిను క్షత్త్రియాన్వయంబు
హింసార్థ ముదయించి హింసైకజీవన, మయ్యె నింద్యం బని యనుట యెట్లు
తే. సృష్టి నింద్యము గా దెట్లు జగతి వేద, హీనులును నాస్తికులు ధనహీను లర్థ
వాదవిజ్ఞాన మనెడునాభాసమునను, క్షత్త్రసన్న్యాస మెంచి రసత్త్యాగతుల. 111

తే. మౌర్ఖ్యమున ధర్మ మనెడుఛద్మమును బన్ని, తనదునాత్మను నాత్మచేఁ దగ ధరింపఁ
బూని చావ సమర్థుఁడౌఁ గాని బ్రతుక, గా సమర్థుఁడు గాఁడు నిక్కము తలంప. 112

సీ. పుత్త్రపౌత్త్రాదులఁ బితృతిథులఋషి, దేవతాప్రముఖులఁ బోవ లేక
వనుల నేకాకియై బ్రదుక వచ్చును దాస, ఫల మేమి లేళ్లకుఁ బందులకును
వాయసాదులకును వనవాసమున ఫల, మగు నె సన్న్యాస మెసఁగు నటన్న
నగము లద్రులు సిద్ధి నందునే నిత్యస, న్న్యాసము బ్రహ్మచర్యవ్రతంబు
తే. నప్రతిగ్రహమును గల పవ్వి వాని, తొంటికర్మమె గాక వేఱొంట లేదు

కలదు కర్మము మన కందువలనఁ గర్మ, మును ద్యజించిన సిద్ధి లే దని యెఱుఁగుము.

వ. కావున నీ వెల్లవిధంబులఁ గర్మవ్యాపృతం బైనజగత్తుం బరీక్షించి కర్మం బాచరింపు మనుచున్నంత నర్జునుం డడ్డు వచ్చి మీసంవాదంబునకు సరిపడ నొక్క-పురాతనేతిహాసంబు గలదు చెప్పెద నని యి ట్లనియె. 114

—అర్జునుండు పురాతనేతిహాసము చెప్పుట—

సీ. మీసముల్ మొలవని, భూసురబాలకుల్, కొందఱు తమతమసుందరములఁ
దల్లిదండ్రుల నన్నదమ్ముల విడిచి ప్రవ్రజితులై యది సుధర్మముగ నెంచి
వనమునకుం జని వర్తించుచున్నచో, బంగారుపక్షియై బలవిదారి
కరుణించి వారలకడ కేగి విఘసాసు, లాచరించెదుకర్మ మద్భుతమము

తే. ధర్మతత్పరు లగువారు నిర్మలమతు, లుత్తమము వారిజీవిత ముత్తమోత్త
మగతిక్కి వార లర్హులు జగతి నిపుడు, నావుడును వార లాశ్చర్య భావు లగుచు.

తే. పర్ణమూలఫలాదులభక్షణమున, మనము విఘసాసులము మనలను శకుంత
మిది ప్రశంసించు చున్నది విదితముగను, మన తొడంగినదుత్తమ మనుట నిజము.

వ. అనిన శకుంతం బి ట్లనియె. 117

మ. ఫలపర్ణాదులు పక్షికీటమృగముల్ భక్షింప నుచ్ఛిష్టముల్
చులుకన్ వాని భుజించుమీరు విఘసాసుల్ గారు మందుల్ రజ
స్వలులు బంకవిరూపితుల్ మిముఁ బ్రశంసం జేసి భాషింప నా
పలుకుల్ మీకు నెఱుంగ రా వనుడు నాబ్రహ్మన్యవాయార్భకుల్. 118

తే. వెఱఁగుపడి పక్షిరాజ మా కెఱుఁగఁ జెప్పు, మేది శ్రేయము సత్పథం బేది దాని
ననుసరింతుము నీవాకులందు నిలుతు, మనుడుఁ జెప్పెదసంవియ మనుగవినుఁడు 119

సీ. పలుగాలివానిలోపల గోవు ప్రవర లో,హములలోపలఁ గాంచనము వరమ్ము
నరులలో విప్రుండు వరుఁడు శబ్దంబుల, మంత్రంబు ప్రవర మామంత్రమునన
జాతకర్మాదిసంస్కారము లంత్యసం, స్కారము లొప్పు ద్విజాతి కెన్న
వైదికకర్మముల్ స్వర్గమార్గములందు, నను బెక్కు-రాస్వర్గమునకుఁ జనిరి

తే. దృఢవినిశ్చయుఁ డగువాఁడు దెలియు నాత్మ, నెట్టు లట్టుల సిద్ధియై నెసకమెసఁగు
మానసక్షుర్తువుల నర్యమహిమభాను,తారకామార్గములు మూఁడు దారు లొందవ.

తే. సర్వభూతములును గర్మసంజ్ఞిత మగు, నిట్టిసిద్ధిశ్రీయును నొంద నెంత్రు పుణ్య
మయును కర్మాకరం బయి మహిమఁ గాంచు, నట్టిగార్హస్థ్య మే సిద్ధి కైనపదము.

ఆ. కర్మనిందఁ జేసి కాపథంబును బొంది, నట్టిమూఢచిత్తు లర్థహీను
లగుచు వృజినభాక్కు-లై నిరయంబుల, కరుగఁ గల రటంచు నరయుఁ డీసు. 122

సీ. వినుఁడు సిద్ధిత్రియ మను దేవయానమార్గము పితృయానమార్గమును బ్రహ్మ
యానమార్గము విడనాడి మూఢాత్ములై, యశ్రుతి పథమును నందఁ గలరు
కర్మమే తప మగుఁ గావున మీకు నే, నఖిలఫలము లిత్తు ననియె వేద
మందున నాకర్మమం దుంటయే తప, స్వాం కగుతప మని తలఁప వలయుఁ
తే. తెలిసి దేవర్షిపితృయజ్ఞములు గురుపరిచర్యయును విభజించి నిచ్చలును భక్తి
సలుపు టొంతయు నొప్ప నీచక్కి మెలఁగి, నేల్పు లైశ్వర్య మొందుట వినరొ మీరు.
క. కావునఁ గార్హస్థ్యము మేలై వెలయు న్నగుల కందు నగుఁ గర్మమునం
దే వఱలు సర్వ మాశ్రమ,మే వివిధశపంబు గాఁగ నెంచిరి విబుధుల్. 124
వ. సాయంప్రాతఃకాలంబుల నిజగృహంబున నన్నంబు విభజించి దేవతలకును పితృదేవతలకును నతిథులకును స్వజనంబులకును బెట్టి యుపశిష్టంబు భుజించువారు విఘసాశనులు వారు దురాధర్షం బగుపదంబును బొందఁ గలరు కావున స్వధర్మనిరతులై సువ్రతు లగువారు లోకగురువులై త్రిదివంబునందు శాశ్వతానందంబు నొందుదు రనినఁ దరుణవయస్కు లగు నా రావాక్యంబులు విని సన్న్యాసచికీర్షం దిగనాఁడి గార్హస్థ్యధర్మం బుపాసించిరి నీవును ధైర్యం బవలంబించి హతామిత్రం బగుధాత్రిం బాలింపు మనినంత నకులుండు ధర్మరాజు ననురోధించు న ట్లనియె. 125

—నకులుండు ధర్మజునకు మనస్తాపోపశమంబు సేయుట.—

సీ. జననాథ వినుము విశాఖయూపంబునఁ, గల వగ్నిచితులు వేల్పులకు నట్లు
కావున వారలు కర్మఫలస్థితు, లని తెలియఁగ వచ్చు నదియుఁ గాక
పితృదేవతలు విధివిధమునఁ గర్మమే, యాచరింతురు వా రనాస్తికులకుఁ
బ్రాణప్రదులు నిగమాపవిద్ధులు నాస్తికులు విప్రుఁ డా వేదములను విడక
తే. నాకపృష్ఠ మొందుం దేవయానమునను, వేదవిదు లంద్రు నాలుగై వెలయు నాశ్ర
మంబు లందుఁ గృహస్థాశ్రమంబు ప్రవర, మగుచు నన్నిటిని న్మించునట్టి దనుచు.
క. క్రతుముఖ్యంబుల విత్తము, వితరణ మొనరించి వేదవేత్తల భక్తిం
బ్రతిపత్తిఁ జేసి యడుగుము, శ్రుతిపథ మె ట్లగునొ తెలియఁ జూతువ యేనిన్. 127
సీ. అనిశంబు జితచిత్తుఁ డగుత్యాగి సాత్వికుం, డన నొప్పు గార్హస్థ్యమందు సుఖము
తెలియక వనికేగఁ దలఁచెడుత్యాగి తా, మసుఁ డొకచో నున్కి పొసఁగకుండ
నగమమూలాశ్రయుండై భిక్ష మెత్తుచుఁ, ద్యాగియు యోగియై హర్షకోప
ములును బైశున్యముఁ దొలఁగినవిప్రుండు, భిక్షుకుండై యొప్పుఁ బృథ్వీధవుఁడు

నొక్కప్రక్కను గార్హస్థ్య మొక్కప్రక్క, నునిచి గార్హస్థ్యమే ఘన మనిరి బుధులు.

క. ఇతరాశ్రమముల స్వర్గం,బతుకుకొనుం గాని కామ మదిలేదు గృహ
స్థతఁ గామము స్వర్గము రెం,డతులితముగ నగు నటందు రార్యు లధీశా. 129

తే. ఇట్టిభావ మొనర్చెడునట్టివాఁడు, త్యాగి నా నొప్పు గార్హస్థ్య ధర్మము విడి
వనమునకు నేగి కామముఁ గనఁ దలఁచిన,వాఁడు యమపాశబద్ధుఁడై వనటఁగుందు.

సీ. అభిమానకృతకర్మ మధిపులం బాయదు, త్యాగయుక్తము ఫలదము దలంప
శమము దమమ్ము శౌచము సత్య మార్జవం,బును జనులకు విధి యనఁగ వచ్చు
దేవపితృతిథుల సేవించుట గృహస్థ,విధి త్రివర్గం బంద వెలయుచుండు
నిందు నైష్ఠికుఁ డయి పొందువడినవాని, కేనాఁడు విచ్యుతి గానరాదు

తే. కలువ ప్రజలను సృష్టించి నను యజింపుఁ,డనుచుఁ గల్పించె యజ్ఞములా క్రియలకుఁ
బశువు లోషధులును జెల్లు పరఁగఁ జేసె, నని యెఱుంగుము భరతవంశాగ్రగణ్య.

చ. అరయఁగ నష్టికర్మము గృహస్థులకుం బ్రతిబద్ధ మయ్యె దు
ష్కరమును దుర్లభం బగుచుఁ గ్రాలు గృహస్థత దాని నొందియుఁ
బురుషుఁడు భాగ్యవంతుఁ డయి పొంపిరివోయియు వేల్వకుండినన్
నిరతముఁ గిల్బిషంబున మునింగి బడల్పడు నారకంబులన్. 132

వ. ఋషులు కొందఱు స్వాధ్యాయయజ్ఞంబులును గొందఱు జ్ఞానయజ్ఞంబులును గొందఱు మానసికయజ్ఞంబులును గావింతు రిట్లు మనస్సమాధానమార్గము బ్రహ్మభూతు లైనద్విజాతులకుం జెల్లు నీ వీయజ్ఞంబుల నుల్లంఘించి నాస్తిక్యముం బలుకుచుంటివి కుటుంబి వైనరాజునకు రాజసూయాశ్వమేధసర్వమేధంబులు సెల్లుఁ గాని త్యాగంబు సెల్లదు గావున నీవు బ్రాహ్మణపూజితంబు లగుమహాధ్వరంబులు మహేంద్రుండు వోలెఁ గావింపు మని మఱియును. 133

సీ. రాజ్యంబు సేయనిరాజు దోషంబున, దిక్కు లేకుండినదీనజనుల
దస్యులు వేధింప తద్ధేతువున రాజు, కలిపురుషుం డన పలుకఁ బడును
జనపదక్షేత్రగోశ్వగజాదిదానముల్, సలుపనిమేమును గలిపురుషుల
మగుదు మదాతలు నశరణ్యు లగుక్షత్రియులు దోషులై సుఖ మొంద కుంద్రు

తే. త్రెంచి స్వాహాస్వధాదులు తీర్థసేవ, విడిచి ప్రవ్రజితుండ వై వెడలు దేవి
గాలిఁ దెగుమేఘ పఙ్క్తింతరాళమంద, మెలఁగుచుండె దుభయలోకములకుఁ గాక.

వ. గృహంబు విడువ కంతస్సంగబహిస్సంగములు విడిచినవాఁడు త్యాగి నా నొప్పు నీవిధిం బ్రవర్తించువాని కెప్పుడును విచ్యుతి గలుగనేర దని మఱియును. 135

చ. సురపతిదైత్యులం బలెను సోదరుల స్రుక్కఁగఁ జేసి క్షత్త్రధ
ర్మరతులు పూర్వరాజులక్రమంబున రాజ్యము నొంది తుది భూ
సురులకు నిచ్చి వేలిమికిఁ జొచ్చి పదంపడి నాకపృష్ఠమం
దిరవుగఁ నుండఁ బోదు విపు డిట్లు మనోవ్యథ నొందఁగఁ బాడిగనే. 136

వ. అనంతరంబ సహదేవుండు. 137

—సహదేవుండు ధర్మరాజునకు మనస్తాపశమంబు సేయుట—

సీ. వెలుపలి ద్రవ్యంబు విడువకున్నను సిద్ధి, యొదవు లో ద్రవ్యముల్ వదలె నేని
శారీరముల నాస సలుపుచు బాహ్యవి,రక్తులౌ వారిధర్మమును సుఖము
మనశత్రుకోటికి నొనగు శారీరసౌ,ఖ్యము వీడి ధర యేలునట్టివారి
ధర్మము మన కగుఁ దలపోయ మమయను,నదియు నమమ యనునదియు మిత్ర
తే. బ్రహ్మమును నీద్వయమునాత్మభావమందె,యగపడకయుండి భూతాళి నడఁచిపుచ్చు
సత్వముల కవినాశము సత్యమైన,భూతములఁ జంప దోషంబు పొందదనఘ 138

చ. జననము వెంట నున్నదియ చావది గావున మేను నష్టమౌ
ననుట ధ్రువంబు నావలన నందఱు మ్రిందిరటంచు నెంచుచు
న్వనటఁ గృశించి పోఁదగ దవశ్యము పూర్వులు పోవుపంథనే
మనమును బోయినార మని మానవనాథ తలంపు సేయుమా. 139

క. జతనించి పగఱ నోర్చిచి, క్షితి యెల్లం బడసి వెనుక సిరు లందని భూ
పతి జీవితంబు నిష్ఫల, మతఁ డుండియు లేనియట్టిఁ డని తలఁప నగున్. 140

ఆ. వన్యజీవనమున వనవాస మొనరించు, నట్టిఁ డైన దరివ్యమందు నాస
సేయకుండఁ డట్లు చేయుట సంసార, మును బాసర్చు టనఁగఁ బోల దొక్కొ. 141

ఆ. అఖిలభూతములకు నాభ్యంతరము బాహ్య, మెల్లఁ బరిత్యాగాత్మదే స్వభావ
మని యెఱుంగు మిట్టు లని యెఱింగినవాఁడు, తెలియఁ బోడు సంసృతిభయ మెపుడు.

క. ఈవే నేతవు త్రాతవు, నీవే భ్రాతవును గురుఁడ వీవే గాన
నావెగడునుడుల కలుగక, భావమ్మున సైపు మనుచుఁ బ్రార్థింతు నినున్. 143

ఆ. ఒప్పొ తప్పొ తెలిసి యో తెలియకయొ నే, నుడివినాఁడ నిట్లు వెడఁగునుడులు
వాని నెల్లఁ భక్తి వశమున నైనవా, నిగఁ దలంపుసేయు నృపలలామ 144

వ. ఇట్లనేకవిధంబుల ననుజన్ము లందఱుం దవిలి పలికినను మాఱుపలుక కున్న ధర్మరా
జుం దరియ వచ్చి మహాభిజనసంపన్నయు నభిమానవతియు ధర్మజ్ఞయు ధర్మదర్శిని
యు నగు ద్రౌపది సామంబున నామంత్రించుచు ని ట్లనియె. 145

—ద్రౌపది ధర్మజునకు మనస్తాపోపశమంబు చేయుట—

సీ. చాతకంబులు పోలె నీతమ్ము లందఱు, నోరెండఁ గాయివెట్టువార లైరి
వారి నీ వుపపన్నవాక్యంబులం జేసి, తనుపుము దుఃఖసంతప్తచిత్తు
లకట ద్వైతవనంబునందు శీతాతపా, ద్దితు లైనయప్డు నీ వతికరుణము
గా నూఱడించుచుం గాలంబు సన్న నా, సుయోధనునిఁ జంపి దురమునందు
తే. సర్వకామపరిపూర్ణ మీయుర్వి యెల్ల, ననుభవింతము యజ్ఞము లాప్తదక్షి
ణములుగ నొనర్త మెట్టికష్టములు మనకు, నుండఁ బోవని పలుకవే యుర్వినాథ.
ఉ. ఈగతిఁ బల్కి నీ విపు డొకింతయు శాంతము సత్యచింతయున్
లోఁ గయికొక శోకమున లోఁగుచు మానసముల్ దహించుచున్
భోగములం దృజించి వనభూముల కేగఁ దలంతు క్లీబున
ట్లీగుణహీనకార్యమున కెట్లొనగూర్చితొ చిత్తమక్కటా. 147
ఆ. దండనీతి దెసకుఁ దలయూఁపకుండని, క్షత్రియుండు ధాత్రి సౌఖ్య మంద
కుండు టొకఁడ కాక దండధరుసపాలఁ, దప్పఁ జేసినట్లు దండ మొందు. 148
ఆ. సర్వభూతమైత్రి సంతతాధ్యయనం బ, హింస తపము దాన మెన్న విప్ర
ధర్మములగుఁ గాని ధరణి క్షత్త్రియధర్మ, ము లని యెవఁడు సెప్పె సలలితాత్మ. 149
సీ. దుష్టశిక్షణమును శిష్టరక్షణము నా, యోధనంబునఁ బాఱకుండుటయును
క్షమయుఁ గ్రోధంబును శౌర్యధైర్యములు ని, గ్రహ మనుగ్రహమును క్షత్త్రజాతి
ధర్మంబు లీవు శ్రుతమ్మున దానమ్ము, నను సాంత్వమున యాచ్న వసధి కాంచి
సంగ్రహింపఁగ లేదు సంగ్రామ మొనరించి, ద్రోణకర్ణాదియోధుల వధించి
తే. సంగ్రహించితి దానిని సౌఖ్య మెసఁగ, ననుభవింపుము భ్రాతృవరాన్వితుండ
వగుచుఁ గాదని వెడఁగవై తగవు మాలి, తపసివై వని కేగుట తగదు తగదు. 150
వ. నానాజనపదాయుతం బగునీజంబూద్వీపంబు నీదండంబున మ్పాదితం బగునయేని దీ
నికిం బ్రతి వచ్చి మేరువునకుం బశ్చిమంబున నున్నక్రౌంచద్వీపంబును గ్రౌంచద్వీ
పసదృశంబై పూర్వంబున నున్నశాకద్వీపంబును శాకద్వీపసమ్మితంబై యుత్తరంబు
న నున్నభద్రాశ్వంబును మఱియు సాగరాంతంబుగ నున్నవివిధజనపదాశ్రయంబు
లగుద్వీపంబులును నీవశంబు లగు నీవునీతమ్ములం గూడి దేవేంద్రవైభవంబునం దే
జరిల్లుచు నానావిధాధ్వరకర్మంబు లాచరించి త్రిజగజ్జేగీయమానుండవై మహానం
దం బనుభవింపు మని. మఱియును. 151
మ. అనృతం బాడదు కుంతిభోజసుత న న్నానాఁడు లాలించుచున్
వనితారత్నమ నీమగం డసిమొనం బ్రత్యర్థులం దున్మి ధా

త్రినిఁ బాలించెదు నీవు రాజ్ఞి వగుచున్ శ్రేయంబులం బొందు దీ
వనటల్ మాను మనేల్ దదీరితము నీవంకల్ వృథా యానొకో. 152

వ. అని కోపాటోపంబున. 153

శా. నీతమ్ముల్ వశవర్తులై నిను మదిన్ బ్రేమింతు రున్మత్తునిన్
నీతోడ్పాటున వారు నట్టి రగుచున్ నేర్పొది వర్తింతు రా
రీతిం గల్గక యున్నఁ గట్టి నిను వారే సర్వసర్వంసహా
నేతృత్వంబు వహింపకుందురె ప్రశాంతిం జేసి పాలించుచున్ 154

తే. మూర్ఖుఁ బొనరించునిట్లు శ్రీ మొగిసి రాఁగఁ, ద్రోయుచుంటివి నీవెట్టి భూపనస్య
ములను భేషజాంజనములఁ మూలముట్టు, గా నసింపఁగఁ జేసికొ మ్మోనృపాల.155

వ. అని దుఃఖాతిరేకంబున. 156.

మ. అకటా యేమని చెప్పుదాన హృదయేశా నేను లోకంబునం
దోకతన్ స్త్రీసముదాయమం దధమనై యుంటి న్ననుం బోలియొం
డొకకాంతామణి యుండ దట్టిదొరకింపొం దం దనూజాతనై
సుక మెట్లుండు నెఱుంగలే కిడుమకుం జోకైతి నెల్లప్పుడున్. 157

ఆ. ఏను బడెడుపాటు లేమని చెప్పుదు, కడుపునందుఁ గన్నకొడుకు లన్న
దములుఁ దెగుట విన్న దాననై బ్రదికితి, నాది యొక్క బ్రదుకె నరవరేణ్య. 158

వ. అని కంట నీరు వెట్టుకొనుచు మఱియును. 159

సీ. ఈవు రాజ్యం బీగి యేగితి వేని నీ, యెల్లచుట్టాల నట్టేట ముంచి
నట్టేడ వగుదు నాయన్నమాట నిజంబు, కావున నీచెడ్డభావము విడి
తొల్లి మాంధాతృభూవల్లభుం డంబరీ, షుఁడు నెట్లు పుడమిని విడువ కేలి
రట్లు నీవును బూజ్య మగు రాజ్యమును బొంది, పాలింపు మెల్లభూప్రజల నెమ్మి

తే. వివిధయజ్ఞము లొనరించి విప్రకోటి, కిచ్చ వచ్చినమచ్చున నిచ్చి ధనము
లంబరంబులు లోనగునవి గృహస్థ, ధర్మమున నుండు మదె నీకుఁ దారకంబు. 160

వ. అనియాజ్ఞసేని పలికినం బలుకకున్న ధర్మరాజునకర్జునుండు వెండియు నిట్లనియె. 161

—అర్జునుండు వెండియు రాజదండవిధానం బెఱింగించుట—

ఉ. దండమ లోకులన్ మనుచు దండమ సత్పథమందు నిల్పెడిన్
దండమజాగరూకత నొనర్చును దండమ ధర్మ మయ్యెడిన్
దండమ సర్వరక్షకము దండమ కాచెడు కామ మర్థమున్
దండమ సర్వసాధకము దండమునం దగు సర్వసిద్ధియున్. 162

సీ. రాజదండము యమరాజదండంబును, రెండు పాప మొనర్పకుండఁ జేయు
దండపాలనము లేకుండిన నొండొరుల్, కొఱకి తిందురు తమఃకోటి మునిఁగి

దండంబ దాంతులఁ దమియించుఁ దుష్టుల, శిష్టులు గాఁ జేయు క్షితితలమునఁ
బొదలుచుండెడిని వాగ్భుజదానదండముల్, బ్రాహ్మణక్షత్రియవైశ్యులకును
తే. దండశూన్యుఁడు శూద్రుఁడొక్కండు మాత్ర, మహిని మోహ మడంప ధర్మంబు వెంప
దండ మనియెడు మర్యాద దైవనిర్మితమ్ము దానం బ్రవర్తింత్రు ధరణిపతులు. 163
క. వర్ణాశ్రమధర్మంబుల, నిర్ణయమా దండమంద నిలఁబడి యుండున్
శీర్ణప్రజ్ఞులు మనుజులు, పూర్ణం బగుదండభీతిఁ బొందెద రధిపా. 164
సీ. వినుము భీతుం డగుజనుఁడు వేల్వఁడు దాన, మొసఁగఁడు సమయమం దుండఁబోఁడు
తొడరక మనుజుండు దుష్కరకర్మముల్, పరమర్మములఁ ద్రుంచుపనికిఁ గాక
మత్స్యఘాతినిఁ బోలి మనుజులం జంపక, యశము వృత్తము సిరి నంద లేదు
వాసవుండును వృత్రవధమున నే మహేంద్రుం డయ్యె సురల కెల్ల గండుమిగిలి
తే. రగ్ని రుద్రుండు స్కందుండు యముఁడు వరుణుఁ, డనిలుఁడును మిత్త్రియును లోఁగ్రనైనవారు
కడు ప్రతాపించుచుందురు గాన జనులు, గొల్చెదరు బ్రహ్మముఖ్యులం గొల్వఁ రెపుడు.
తే. హింసఁ గావింపకుండ నీపృథ్వియందు, నెట్టిజంతువు జీవింప నెఱుఁగ మెల్ల
సత్వములు సత్వములఁ దిన జను నలంతి, చేపఁ బెనుచేప తినుట వీక్షింప వొక్కొ.
సీ. మూషికంబులఁ దిను ముంగిస ముంగిసఁ, దినుఁ బిల్లి పిల్లినిఁ దిను శునకము
శునకంబులం బట్టి తినుఁ జిట్టపులి చిట్ట, పులిఁ గొట్టి కొని తినుఁ బురుషమృగము
కాల మివ్విధమునఁ గడచుచున్నది, ప్రాణి కన్నం బీచరాచరంబు
దైవవిహిత మివ్విధానము విద్వాంసుఁ, డిట మోహవశుఁడు గాఁ డెన్నఁ డేని
తే. యెట్టికార్యమునకు నీవు పుట్టితట్టి, కార్యమునఁ బొమ్ము శౌర్యము ధైర్యసాహ
సాదుల నీవడి వని కేగునట్టిరాజు, మందుఁ డని లోక మొంచెడు మానవేంద్ర. 167
చ. మునులును బ్రాణయాపనము పొంటె వధంబొనరింపరో జలం
బున సిలఁ బండ్లఁ గన్నులకుఁ బోల్పఁగ రాగిసుసూక్ష్మజంతువుల్
దన రెడు వానిఁ జంప కెటు దారు మెలంగఁగ నేర్తు రెన్ని చ
చ్చును దమయంఘ్రులందుఁ బడి చూడ నిదంతయు హింస కాదొకో. 168
క. ఏము విరాగుల మనుచున్, గ్రామంబులఁ బాసి పోయి కారడవులకున్
నేమమున నుండి యొందఱు, కామించి కుటుంబధర్మగతిఁ బోఁ గనమొ. 169
ఆ. భూమిఁ ద్రొక్కి కందమూలంబు లోషధుల్, ఫలములందు బీజములును మునులు
తినరె వానియందుఁ దనరదే ప్రాణంబు, దాని హింస యనుచు దలఁప రాదె. 170
క. పశువుల నండజతతులన్, విశసించి మఖంబు లెల్లవిప్రులు సేయున్
విశదముగ స్వర్గమందున్, వశియింతురు గాని నిరయవర్తు లగుదురే. 171
వ. అట్టులే దండనీతియందు సర్వోపక్రమంబులును సిద్ధించు నాకర్ణింపుము. 172

సీ. దండమే లేకున్న ధరణీజనుల్ సబలు, తు రొకళ్లొకళ్లను దినుముకొనుచు
రాజదండము ప్రజన్ రక్షించు నని తొల్లి, యానతిచ్చెఁ జతురాననుండు
జ్వాలనంబు ఫూత్కారసంతర్జితం బయ్యు, భయమునఁ జేసి యే ప్రజ్వలించు
మంచిచెడ్డల విభజించి తమముఁ బాపి, జగము దండమె పోషించు జ్ఞాన మొసఁగి
తే. దండజిత మెల్లలోక మధార్మికులును, నాస్తికులు వేదనిందకు లైనవారు
దండపీడితు లై ధర్మతత్పరు లయి, సుఖ మనుభవింతు రిందందు శుభచరిత్ర. 173
క. చాతుర్వర్ణ్య విభేదము, భూతలమున వినయదాన మును ధర్మార్థ
ఖ్యాతావనమును జేయ విధాతయె నిర్మించెఁ దొల్లి దండము నధిపా. 174
సీ. పశువులుం బక్షులు శ్వాపదంబులు శ్వాన, ములును బీతకి మనుజులు మెసంగు
వేదంబు చదువఁడు విప్రుండు కళ్యాణి, యాఁవునావు పాలీయ దక్షిణధర్మ
సేతువులుం జెఱు సేయ రధ్వరము లాశ్రమధర్మములు వినాశంబు నొందు
చదువరు బాలు రశ్వము లశ్వతరము లెద్దులు లొట్టియలు యానములను మోయ
తే. సమర వాలకింపరు భృత్యు లధిభువునడి, పాపమును వంచనంబును బ్రబలు నుర్వి
జారులును జోరులును దురాచారు లధికు, లగుదు రొక రాజదండము దగుల కున్న.
క. కావున ధర్మవిహిత మగు, భూవలయం బెల్ల నీవు పొందు యశంబున్
దేవేంద్ర వైభవంబును, భూవర పొందెదవు గాక బుధు లగ్గింపన్. 176
శా. ఆరంభంబులు సర్వ మర్థమున నౌ నర్థంబు దండంబునం
జేరున్ దండము లోకయాత్రకొఱకై శ్రేష్ఠత్వముం గాంచుఁ జే
కూరుఁ దండగుణాప్తి హింస యని నీకుం దోఁచి శంకింతువే
క్రూరవ్యాఘ్రముఁ జంపి గోవు బ్రదుకుం గోరంగ దోషం బొకో. 177
క. అత్యంతగుణము గలదియు, నత్యంతము గుణవిహీన మగునది ధర న
ప్రత్యయము మంచి చెడ్డలు, నిత్యంబై యుండు రెంట నిక్కం బరయన్. 178
సీ. వృషణంబు చీలితి వృషభంబు తల దాతఁ జిదుక వైతురు కొమ్ము లెదుగ కుండ
నది భారవహ మయి పొదలెడుఁ గాకున్న, వితథంబ యగు దండవిధ మిట్టు లని
తెలిసి పురాణధర్మలసద్గతిం జను, మిదుము నేల్వుము ప్రజ నేలికొనుము
శత్రుచాలనమును మిత్రపాలనమును, గావింపు ముభయలోకంబులందు
తే. ననము గాంతువు శత్రుసంహారమున నఘంబు రా దెన్న నాత్మవధ్యంబు గాదు
మేను విడియొండు మే నందు మానవుండు, ప్రాతయిలు వీడి క్రొత్తయిల్వాడసినట్లు.
వ. అని పలుకుచున్నంత భీమసేనుండు వెండియు. 180

—భీమసేనుండు వెండియు ధర్మజునితోఁ బ్రసంగించుట—

చ. నృపవర సర్వధర్మములు నీవ యెఱుంగుదు నీ కొకానొకం
డిపు డిది యిట్టిచందమని యేటికిఁ జెప్పఁగ నాదుచిత్తమం
దెపుడును జెప్పఁ గూడదనియే యగుఁ గాని భరింపరానిదుః
ఖపుగతి మంచిచెడ్డలను గానఁగ నీయమిఁ జెప్ప నెంచితిన్. 181

శా. నీ వీరీతిఁ దలంచి యెట్లనినఁ గానీ సమ్మతింతుర్ భవ
ద్భావం బిట్లు ప్రిమోహమందుటన నీ నా రిట్లు దీనస్థితిన్
జేవం దక్కి నపుంసకత్వమునకై చె ల్వేది యున్నారు దు
ర్భావుం డట్లు విమోహివై కృపణతం బాటింప భావ్యం బొకో. 182

ఆ. వెనుకముందుఁ గలుగువిస్తృతవృత్తంబు, నందు గతియు నగతి యరసి యెఱుఁగ
నిట్టినీకు రాజ్యహేతువునం దింత, చెప్ప నుంటి వినుము చిత్తగించి. 183

సీ. శారీరమును మానసం బన ద్వివిధమై, కలుగు రోగము మానవులకు నెప్రుడు
తను వున్నయంతకు మనము రోగము నుండు, నిందు మనోవ్యాధి హెచ్చునఁ దగు
వ్యాధి గల్గినవాని వదలదు దుఃఖము, దుఃఖమునన్ మఱి దుఃఖ మగును.
శ్లేష్మోష్ణవాతముల్ దేహగుణములు స, త్త్వరజస్తమములు చిత్తగుణము లవి

తే. సమత నొందిన స్వస్థుఁ డౌ జనుఁ డొకండు, హెచ్చె నేనిఁ జికిత్స గావింపవలయు
హర్షమున శోక మడఁగు నాహర్ష మడఁగు, శోకమునఁ జేసియొక్కొక్కచో ప్పనందు.

చ. ఒకఁడు సుఖంబున న్మెలఁగుచుండియుఁ దుఃఖము సంస్మరించు వే
ఱొకఁ డతిదుఃఖమం దడలుచుండి సుఖంబును సంస్మరించు నీ
కొకఁడు నొకప్పు డంటకయ యుండెడి నట్లు తలంప నయ్యెడిన్
సుఖమును దుఃఖమున్ సమతఁ జూతువు నా నది యొప్పు దెప్పుడున్. 185

వ. నీస్వభావం బిట్టిది నా నేరము గాని నీకును గ్లేశంబు లేకుండ దాక్షిణ్యంబును. 186

చ. చదురున కేకవస్త్రయు రజస్వలయై తగుకృష్ణఁ దెచ్చుటల్
పదుగురు నవ్వఁ గారడవి వాసముఁ జేయుట లొండ్లొకింగికో
నొదవనియట్లు మత్స్యపురి నుండుట లందును నందు క్లేశము
ల్మది నెఱయించు చుండెడి నిలాతలనాథ తలంపు నేయవే. 187

తే. ఆత్మతుల్యులు ద్రోణభీష్మాను లట్టి, వారితో నేల పోరితి వైరమునను
మనముతో నేలపోర వమ్మాట్కిఁ గెలుపు, పొందకున్న బుద్ధుస్మ మందవలయు.

వ. కావున నిట్టివికారంబు మదికిం బుట్ట నీయక పిత్రుపైతామహంబైన రాజ్యంబు నీయ
దృష్టవశంబున నీకరగతం బయ్యె నిట్టి పూజ్యసామ్రాజ్యం బేలుము మేమును వాసు
దేవుండును నీకుఁ గింకరులము మావలనఁ బనులు గొని వాజిమేధంబు విధివద్దక్షి

ణంబుగా నొసరించి కృతార్థుఁడ వగుమని కినిసి పలికినంతఁ గొంతవడికిఁ గొంతే
యాగ్రజుం డెల్లవారు విన నల్లన నిట్లనియె. 189

—ధర్మరా జెల్లవారువిన వైరాగ్యంబ శ్రేయం బని చెప్పుట.—

మ. అభిమానంబును రాగముఁ మదము మోహంబుఁ బ్రమాదంబు దు
ర్విభవోద్వేగములోనిదోషముల నన్వేషించు రాజ్యం బయో
శుభ మంచుఁ బలుకంగ జొచ్చితివి ప్రాజ్ఞుల్ దాని దుర్మాంసమ
ట్లు భుజింపం దగ దంచుఁ బల్కుదురు పాటుల్ దానఁ బాటిల్లుటఁ. 190

సీ. జేనెఁడుపొట్టఁ బోషించుకొంటకు రాజ్య, పలలమేమిటి కాకు లలము లుండ
నుదరాగ్ని వెలుఁగు నాహుతి వేయుకొలఁదిని, వేయకున్నఁ బ్రశాంతవిధినిఁ బొందు
నైశ్వర్యకామభోగాదుల మే లందు, భోగహీనులమహామునులఁ గనవు
గొలిచితి ధర యంతుఁ గొలువలే వుదరంబు, సంసారభారంబు సంశ్రయింతు

తే. లోభవశమున మెలఁగువేళ్లు వని నొక్క, కోలుపులినోటి కళనమై కూలువిషయ
సక్తుఁడగువానిగతియు నాచక్కి నయనుచుఁ, ద్యాగమొనరించునరుఁడుసౌఖ్యంబునొందు.

వ. తుల్యాశ్మకాంచనుం డగువాఁడు కృతార్థుం డయినట్లు సర్వసర్వంసహారాజ్యం బవక్రవిక్రమంబునఁ బరిపాలించుపార్థివుండు గాఁ జాలఁడు ఫలాహారు లశ్మకుట్టులు దంతోలూఖలికు లబ్భక్షులు వాయుభక్షులు లోనగువారు నిరయంబు నిర్జింతురు కావున నీ వీసంకల్పంబు విడిచి నిరాశుండవు నిర్మముండ వై మృషార్థంబునుండి ముక్తుండ వగు మని మఱియును. 192

సీ. దేవయానము పితృదేవయానము నాఁగ, ముక్తిమార్గంబులు మొనయు రెండు
ప్రాప్తవర్ణాశ్రమాద్యభిమాను లగువారు, పితృయానగతులు దుర్విషయరహితు
లైనవారలు దేవయానగతులును స్వా, ధ్యాయముఁ బ్రహ్మచర్యమును దపము
గలుగుమహర్షులుఁ గనరు మృత్యువు బంధ, ముక్తులు తత్పదంబును గ్రహింత్రు

తే. ద్వంద్వరహితుండు ముక్తుఁడైతనరు జనకుఁ, డనియె నిట్లునాకు ననంత మర్థమెసఁగు
గాని యది మదీయము గాదు కాలు మిథిల, కాలునది నాదికా దన్న గాథవినవె.

ఆ. మందబుద్ధి యైనమనుజుండు కొండపై, కెక్కి క్రిందివారి నెఱుఁగనట్లు.
శోచ్యులైనవారిఁ జూడఁ జాలఁడు ప్రజ్ఞ, గలిగి యున్న గర్వకలితుఁ డగుచు. 194

తే. చూడఁ దగువానిఁ జూచినవాఁడె జగతి, బుద్ధిమంతుఁడు తెలియని బూమెల్ల
దెలిసి తెలిపెడునది బుద్ధి తెలిసినట్టి, బోధకులవాక్కు వినువాఁడె పూజ్యుఁడగును.

తే. ఎపుడుభూతపృథగ్భావ మెల్ల నాత్మ, యం దడఁగియుండుట యెఱుంగ నైనయప్పు
డచట సృష్టియు లయము బ్రహ్మంబు నెఱుఁగు, నట్టిఁడగు నని తత్త్వజ్ఞు లనిరివింటె.

తే. బుద్ధిమంతులు తద్గతిఁ బొందఁ గలరు, పొందఁ జాల రబుద్ధులు మంద లబుధు
లల్పచేతస్కు లతపస్కు లైనవారు, సర్వకార్యములకు బుద్ధి సాధనంబు. 197

వ. అని యూరకుండినంత నంత కాత్మజవాత్సల్యవ్యాకులితుండును శోకసంతప్తచిత్తుండు నగున
ర్జునుండు వెండియు నన్న దిక్కు మొగంబై గృహంబునంద యుండియు ముక్తిం బడ
యవచ్చు నీయర్థంబున నొక్క యితిహాసంబు గల దాకర్ణింపు మని యి ట్లనియె. 198

—అర్జునుండు జనకునకు నతనిపత్నికి నైనసంవాదము చెప్పుట—

సీ. వైదేహుఁ డొకనాఁడు వైరాగ్యమునఁ జేసి, ధనధాన్యదారపుత్త్రికులతోడ
రాజ్యంబుఁ బెడఁబాసి ప్రవ్రజితుం డయి, భైక్షవృత్తిం గొని భ్రష్టయవల
ముష్టియుం గైకొనఁ బోయినతఱి భార్య, క్రోధదుఃఖంబులు గూడుకొనఁగఁ
బతిచెంత కరుదెంచి ప్రథితసామ్రాజ్యము, విడిచి కాపాలికవృత్తి నాశ్రి
తే. యింప నేటికి స్వల్పమం దిట్టిలోభ, మేల కలిగె ధానాముష్టి నేవిధమున
నతిథిదేవర్షిపితలకు ననుదినంబు, తృప్తి సేయుంగ నేతునో తెలియ దకట. 199

మత్త. వేదవేత్తల వృద్ధవిప్రుల వేనవేలుగ నన్నపా
నాదులన్ భరియించునీ విటు లన్న మో యనువాఁడవై
పోఁ దలంచితె నీదుతల్లిని బుత్త్రహీనత గ్రుంగఁగన్
నీదుభామిని భర్తృహీనత నీల్గఁగం బొనరింతువే. 200

తే. ధర్మకాములు క్షత్త్రియుల్ త్వద్గతాశు, లగుచు ఫల మెంచి నీయాశ్రయంబుఁగోరి
మెలఁగుచుందురు వారలు మిముక విడిచి, యెట్టిలోకము లందెదో యెఱుఁగఁ జెపుమ.

క. దారల ధర్మముల నలం, కారాదుల విడిచి ముండికరణిం జనునీ
యారణ్యాజీవనంబున, జేరదు పరలోక మనుచుఁ జెప్పెద నిజమున్. 202

ఆ. అఖిలభూతములకు నాధారభూతుఁడై, కల్పవృక్ష మట్లు గాఁగ్రిలునీవు
పరుల నాశ్రయించి భైక్షాశనము సేయ, నభిలషించుచుంటి వక్కటకట. 203

క. పురుషార్థహీనుఁ డగుచున్ సిరి వో వనిఁ జేరి కూడు సేరమిఁ జావన్
గరియట్లు పడినవానినిఁ, బరిపరిఁ గ్రవ్యాదకోటి భక్షించు నొగిన్. 204

చ. అడవుల నొంటిమెట్టుసమయమ్మున ఘాతుఁకు డెవ్వఁడైన నీ
కడ నగుగోచిపాతయును గట్టియుఁ గుండయు దొంగిలించి పోఁ
గుడువఁగఁ దాఁ్రవఁ గట్ట నొకకొంతయు లేక వనంట కై కడుం
గడు సిమమన్ బడల్పడెదు గాని ఫలం బది నీకుఁ గల్గునే. 205

సీ. అధము లకించను లర్థహీనులు బోడు, లై కుండఁ గట్టియు నభిలషింతు
రా జేంద్రుఁడవు నీవు ప్రాసాదశయునాన, నాదుల [illegible]

మొకఁడు గ్రహించెను నొండొక్కఁ డిచ్చెడు, ఘను నిందు నరయుమో మనుజనాథ
దంభాన్వితులకు సంతతయాచకుల కిష్ట, బూవె వేలిమి వోలెఁ బోవు వితగ

తే. యతులు జాతవేదసువట్టు లన్నపాన, ముల సమర్పింప వస్త్రాలు శ్రీయఁ గేస్తు
వే యతీంద్రుల కాధారమై యెసంగు, నాశ్రమంబులమేటి గార్హస్థ్య మనఘ. 206

తే. అన్న మేభూతకోటికిఁ బ్రాణ మన్న, దాత ప్రాణదాత యనుచు ఖ్యాతిఁ గాంచు
దాంతులు గృహస్థులం జేరి కాంతురు ప్రభ, వమ్మునుం బ్రతిష్ఠయునిక్కువమ్ము గాఁగ.

తే. జందెమునుఁ జుట్టు విడిచి యాచన యొనర్చు, నంతమాత్ర సన్న్యాసి యనఁగ రాదు
ఋజుగతిం ద్యాగ మొనరించుసుజనుఁ డెవ్వ, డతఁడు సన్న్యాసిపదమున కర్హుఁ డనఘ.

ఆ. సక్తవర్గుఁ డయ్యుఁ జనుఁ డసంసక్తుఁడై. సంగములను విడిచి శత్రుమిత్రు
లందు సమత గల్గి యలరారుచుండిన, ముక్తుఁడనుచుఁ జెప్పఁ బోలు ననఘ. 209

శా. గాయత్రి న్విడనాఁడి బోఁడు లగుచున్ గాషాయవస్త్రంబులన్
బాయం బోవక పాశబద్ధు లగుచున్ బహ్వర్థముం గూర్చువా
రై యిం దందుఁ బరిభ్రమించుచును దానార్థంబు తత్త్వార్థముం
డాయం బోయినవారు వోలె సక్కృతిన్ దర్శింత్రు దంభప్రియుల్. 210

ఆ. కాంతఁ జేసికాక కాషాయవస్త్రాది, ధారణం బరాగులై రహింతు
రనుచుఁ దలఁపఁ బోల దవనీంద్రచంద్ర వా, రలను ముక్తి వారి కలరు టరిది. 211

ఉ. నీవు గృహస్థధర్మమున నిల్చి సుసాధువులైన మానులన్
బ్రోవుము ధర్మతత్పరత భూతల మేలుము భూరిదక్షిణల్
ప్రోవులు వెట్టి యజ్ఞము లపూర్వవిధంబునఁ జేసి తన్పుమా
దేవతలన్ ద్విజన్ములను దీన లభించెడు నూర్ధ్వలోకముల్. 212

వ. అని చెప్పినఁ దత్త్వజ్ఞుం డగుజనకుండుఁ దనమోహంబుఁ దిగఁద్రొవి రాజ్యపాలన తత్పరుం డయ్యె నీవును నీమోహంబు విడిచి ప్రజాపాలనతత్పరుండవై దానపరుండవు నానృశంస్యగుణోపేతుండవై నానావిధాధ్వరంబు లొనరించి గురువుల సేవించి దేవతాతిథిపూజలం గావించి సత్యవాదులు బ్రాహ్మణులు వొందుపథంబు నొందు మనిన యుధిష్ఠిరుం డర్జునున కిట్లనియె. 213

—ధర్మజుఁ డర్జును నిరసించి పలుకుట—

సీ. అపరంబులు పరంబులైనశాస్త్రము లెల్ల, నే నెఱుంగనివి కా వేల చెప్పఁ
జేయుము కర్మముఁ జేయకు మని చెప్ప, ద్వివిధంబుగా శ్రుతి దెలియ వినుచు
నఖిలశాస్త్రమ్ములు నాకులంబులు హేతు, చింతితమ్ములు గాని మంతరమున
నిశ్చయ మ్మెఱుఁగుదు నీ వొక్క శస్త్రశాస్త్ర మెఱింగి వీరవ్రతమున నుంటి

తే. తత్త్వ మెఱుఁగనివాఁడవు ధర్మశాస్త్ర, మెఱిఁగినట్టులు చెప్పెద వీవు నాకుఁ
జెప్పనక్కఱ గాదు నీచెప్ప టరయ, భ్రాతృవాత్సల్య మని యెంతు భావమందు. 214
శా. నీకుం గల్గినవత్సలత్వమునకున్ నే సంతసం బందితిన్
నీ కాయోధనధర్మసంగ్రహమునన్ నేర్పెంత యేఁ గల్గు నే
లోకంబందును నందు నీకు సదృశుల్ పోలింపఁగా లేరు ధ
ర్మాకారం బది సూక్ష్మమై దురవగాహం బౌను నీబోంట్లకున్. 215
సీ. వృద్ధుల సేవించి యెఱుఁగ వెప్పుడును గే, వలయుద్ధశాస్త్రవిద్వరుఁడ వీవు
తెలియదు తత్త్వవేత్తలనిశ్చయము నీకు, శంకింపఁ దగవు నాసాధుమతము
దపము త్యాగము బ్రహ్మతత్త్వము వీనిపై, విద్వాంసులకు బుద్ధి వెలయుచుండు
నివి పరంపరగాఁగ హెచ్చి యుండుం గాని, వీనికి హెచ్చు యేవేని లేవు
తే. ధనముకంటె నొకండు లే దనెడునీప్ర, ధానమతమునన్ వర్తింప నేను జాల
ధార్మికులును ఋషీంద్రు లధ్యయననిరతు, లై తప మొనర్చి సుగతికి నరుగ విన వె.
చ. తెలియ నజాతశత్రులును ధీరు లరణ్యములన్ నివాసమున్
సలిపియు నింద్రియార్థముల జాడఁ ద్యజించి తపించి త్యాగులై
వెలయుచు నుత్తరంబునను విశ్రుతమై చను దారిఁ బట్టి పెం
పలవడునట్లు స్వర్గపద మంది సుఖించెద రెల్లకాలమున్. 217
మ. ధనధాన్యంబులఁ దొప్పఁదోఁగుచు నిరర్థం బైన సంసారసం
జనితాత్యల్పసుఖంబుఁ గోరి క్రియలన్ సంధించుకించుల్ వినా
శనజన్మంబుల కైనదక్షిణగతుల్ సాఁగన్ శ్మశానోపమా
ననికృష్టంబులు లోకముల్ గొని నితాంతం బార్తి నుం ద్రారయన్. 218
క. యోగుల నిర్దేశ్యం బగు, నేగతిఁ బొందెదరొ దాని కేర్పడుగతియై
యోగప్రధాన మగు నా, యోగమహిమ నీ వెఱుంగ నోపవు విజయా. 219
క. సారాసారదిదృక్షన్, సారం బిటఁ గలుగు నిచట సారము లే దం
చారూఢి నెల్లశాస్త్రము, లారసి పండితులు నిశ్చయాంచితులు గదే. 220
క. విను మర్థశాస్త్రముఖ్యము, లను దవిలినయేనరుఁడు ఫలముఁ గొనఁ గలఁడే
పనిఁ బూని యనఁటికంబము, గొని చీల్చిన సార మరసికొనువాఁ డున్నే. 221
సీ. వేదశాస్త్రారణ్యకాదుల విడిచిన, జనులు సార మెఱుంగఁ జాల రెప్పు
డద్వైతమతి లేమి నాత్మనిచ్ఛాద్వేష, సంగతమం ద్రొరు లింగితముల
నతిసూక్ష్మమై లోన నలరుజీవాత్మను, గనఁగ నోప రవిద్య కలుఁగుకతనఁ
గర్మలదెసఁ బోకఁ గర్వంబుఁ దృష్ణయుఁ, దెగుఁడు నాత్మోన్ముఖ మగు సుఖించు

ఆ. సూక్ష్మగమ్య మగుచు సుజన సేవిత మయి, యొసఁగుమార్గ ముండ నిట్టిసర్వ
మూల మైనయర్థములఁ బ్రశంసించెద, వే మనంగ వచ్చు నిపుడు నిన్ను. 222

ఆ. కర్మకాండవిదులు కర్మరతులు దాన, యజ్ఞములను బవిలినట్టివార
లైన నర్థముల ననర్థము లని యొత్తు, గాని నీకుఁ బోలెఁ గారుపార్థ. 223

తే. హేతుమంతులు పండితులే నశక్తు, లగుదు రెంతయును బ్రయత్న మాచరించి
పూర్వసంస్కారమున వారె మూఢు లనఁగ, నొప్పుదురు నాస్తికత్వము నూనుకతన.

క. అమృతము నవమానించుచు, దమయంతయుఁ దిరిగి ప్రకృతిసభల నుపన్యా
సము లిచ్చువావదూకుల, క్రమ మరయ స్వేచ్ఛ నీదు క్రమ మిది యెల్లన్. 225

క. క్రమశిక్షఁ జేసి విద్వాం, సులము ప్రాజ్ఞులము నగుచుఁ దర్కత్త్రైదునీ
మముబోటులె నీలౌక్యార్థము లెఱుఁగఁగ లే రితరుఁడు తగ నెఱుఁగు నొకో. 226

తే. తత్త్వవేత్త వైరాగ్యము తపమువలనఁ, బడయుజ్ఞానంబునఁ బ్రహ్మపదము నొందు
నవికలంబుగ సుఖ మందుఁ ద్యాగమునను, దీని కెనవచ్చునే యెట్టిదైనఁ గాని. 227

వ. అని ఫాల్గునుండు పలికినంత దేవస్థానమహాముని యుధిష్ఠిరుం గాంచి యుక్తిమదుత్త
రంబుగా నిట్లనియె. 228

— దేవస్థానుండు ధర్మజునకు హితోపదేశంబుసేయుట —

సీ. ధనముకన్నను మిన్న దనర దొక్కండని, ఫాల్గునుం డాడినపలుకు లొప్పు
వినుము చెప్పెద ధర్మమున జయించితి ధాత్రి, దాని వృథావృథ తగదు విడువఁ
దెలియంగ బ్రహ్మప్రతిష్ఠిత మది చతుష్పది యైననిశ్రేణి తదుపయోగ
మంతరంగంబున నరసి క్రమంబున, నద్దానిఁ బొందంగ నగును గాన

తే. నశ్వమేధాదియజ్ఞము లధికదక్షి, ణాన్వితంబుగఁ జేయుము యజ్ఞకర్త
శమము దమమునుగలిగి మోక్షమునుబొందు, ననుచుశాస్త్రమువచియించునవనినాథ.

వ. మహర్షులు కర్మనిష్ఠులుఁ దపోనిష్ఠులు నై స్వాధ్యాయయజ్ఞము జ్ఞానయజ్ఞముం గా
వింతు రీయర్థంబున వైఖానసవచనంబు గల దాకర్ణింపుము. 230

క. ధనహేతు వైనయజ్ఞము, నొనరింపఁ దలంచుకంటె నూఱక యుంటే
ఘనకార్య మట్టియజ్ఞము, పొసరించినదుష్కృతంబు పొంపిరి వోవున్. 231

చ. విధివిహితంబుగా మిగుల విత్తము మొత్తముఁగూర్చి దాని న
త్యధమముగా ననర్హాకృతియందు నొసంగుచు నర్హకార్యమం
దధికతియై యొసంగక నిరంతర మాత్మను దూరుకొంచుఁ ద
ద్విధమున భ్రూణహత్య నొదవించినవాఁ డగు నంచు నెంచుమా. 232

అర్హానర్హవిజ్ఞానంబునం జేసి దానధర్మంబులను వ్యర్థంబులు గనవు. 233

సీ. ధనములు సృష్టించె ధాత యజ్ఞార్థము, పురుషుండు తత్కృతి కరయ నయ్యె
ధన ముపయోగింపఁ జను నధ్వరంబున, దానఁ గామావాప్తి దనరుచుండుఁ
గావున యజ్ఞముల్ గావింపఁ జను నింద్రుఁ, డమరుల మించె యజ్ఞములఁ జేసి
దేవేంద్రపదమును దీపించె నతనికి, నభవుండు సర్వమేధాధ్వరంబు
తే. సలిపి దేవదేవుం డయి వెలసి సర్వభువనపారాధ్యుఁ డయ్యె నావిక్షితక్షి
తీంద్రుఁడు మరుత్తుఁడును హరిశ్చంద్రుఁ డాది, రాజు లధ్వరముల మహాప్రతిభఁ గనిరి.
వ. మఱియు నీయర్థంబున దివస్పతికి బృహస్పతి చెప్పినవిధంబు గల దాకర్ణింపుము. 235
క. సంతోషంబే స్వర్గము, సంతోషమె సుఖము సంతసమె సర్వంబున్
సంతసము కంటె నొండొకఁ, డింతయు నిల లే దదియ సమిద్ధము తలఁపన్. 236
మ. కమఠం బంగములం బలెం దనదులోఁ గామంబులం గుంచి యు
స్డమరం జాలునొ మానవుం డెపుడె నైజాత్మన్ మహాజ్యోతి కాం
తిమయంబై వెలుఁగొందుఁ బో తెఱియు భీతిం గొల్ప కెవ్వారిఁ గ్రో
ధము కామంబు జయించి కాంచుఁ బరమాత్మన్ జ్ఞానసంపత్తిమై. 237
తే. మనసునను వాక్కునను గర్మమునను భూతతతికి విద్రోహ మొనరింపఁ దలఁప కిచ్చ
నెఱప కెందును వర్తింప నేర్చు నెపుడు, బ్రహ్మమును బొందు నపుడ భూపాలతిలక.
క. సగుణము నిర్గుణ మైనన్, మొగి నేవిధమునగను గర్మమును బొనరింపన్
దగులునొ నరుఁ డాయావిధ,మున ఫలముం బొందు ననుచుఁ బుద్ధిం గనుమా. 239
సీ. పెక్కుదెఱంగుల నెక్కొనుం గర్మపథముల్, వినుము కొందఱు సామమును వచింత్రు
కొందఱు యత్నమున్ గొందఱు ధ్యానమున్, కొందఱు రెంటినిం గోరుకొంద్రు
కొందఱు యజ్ఞముల్ గొందఱు సన్న్యాస,మును దానమును గొందఱును బ్రతిగ్ర
హమును గొందఱును రాజ్యమును గొందఱు వైభ, వమ్మును గొందఱు భావమందు.
తే. నెంత్రు కొందఱు సర్వము నేపగించి, యొంటిఁ బోవక ధ్యానించుచుండు టుచిత
కర్మ మని చెప్పుదురు లోకధర్మ మిట్లు, పెక్కుతెఱఁగుల నొప్పు నో పృథ్వినాథ. 240
వ. మఱియుం గొంద ఱేకాంతశీలులు విడిచి ఛేదించి భేదించుట పరమోత్తమం బని
రన్నియుం దెలిసి బుధు లిట్లు నిశ్చయించి రాకర్ణింపుము. 241
సీ. అద్రోహచింత సత్యము సంవిభాగము, దయయుఁ దమంబు స్వదారలందుఁ
బ్రజనంబు హ్రీయు మార్దవ మచాపలమును, దనరుధర్మము లని మనువు పలికె
నది గాన నీవు ప్రయత్నించి వీనిని, బరిపాలన మొనర్ప వలయుఁ జూవె
రాజ్యస్థితుం డగురాజు తుల్యక్రియా, ప్రియుఁ డయి ధర్మంబు విడువ కెపుడు
తే. ప్రోచి శిష్టుల దుష్టులఁ ద్రోచి యాజ్ఞ, శిష్టభుజుఁ డయి ప్రజ నేలి చివర రాజ్య

రము సుతునిమీఁద నిడి విపినమున కేగి, తప మొనర్చి యుభయలోకధన్యుఁడగును.

మ. క్షమ నీరీతిఁ జరించి తొంటినృపతుల్ సత్యంబు దానంబు య
జ్ఞము నక్రోధము గల్గి కామముఖశత్రువ్రాజం బేర్చి ధ
ర్మమునన్ భూప్రజ నేలి గోద్విజులకై ప్రత్యర్థులం గొట్టి ప్రా
ణము లాలంబునఁ బాసి పుణ్యగతులన్ వర్తించి రోధర్మజా. 243

వ. ఇట్లు వసురుద్రాదిత్యసిద్ధసాధ్య ప్రభృతులును ధర్మ మాశ్రయించి చేసిననిజపుణ్య కర్మంబులంజేసి స్వర్గాదిసుఖంబు లొందిరని చెప్పుచున్నంత నిర్విణ్ణహృదయుండై యున్నయన్నం గాంచి యర్జునుండు వెండియును. 244

ఉ. క్షత్రియధర్మముం గలిగి శాత్రవకోటుల నుక్కడంచి యీ
ధాత్రి సుదుర్లభం బయినదానిని మానుగ నొంది కుందుటల్
క్షత్రియుఁ డైనవీ కగునె సంగరరంగమునందు మ్రిందుటల్
క్షత్రియజాతికిన్ సవనకర్మముకంటె వరంబు గాదొకో. 245

మ. తపముం ద్యాగము బ్రాహ్మణోత్తములకున్ ధర్మంబు సంగ్రామమం
దపవాదం బిసుమంత లేనిమృతి క్షత్రాగ్ర్యధర్మంబు ధ
ర్మపరిగ్రాహము రౌద్రమైనయది సర్వశ్రేష్ఠమై చెల్లె నె
ల్లపుడున్ విప్రుఁడు నిట్టులై సుకృతియై ప్రాపించు నత్యున్నతిన్. 246

సీ. క్షత్రియజాతికి సన్న్యాసము సమాధి, తప మన్యజీవన మెపుడు తగదు
ధర్మాత్ముఁడవు సర్వధర్మజ్ఞుఁడవు నీవు, పూర్వాపరంబుల పొం దెఱింగి
పోకార్చి సంతాప శోకముల్ వీకమై, సుముఖుఁడ వగుము రాజ్యము వహింపఁ
జాలి రాజన్యుని సరస రాఁ జాలదు, వజ్రసన్నిభ మగువానిహృదయు

తే. మని యెఱింగి జితాత్ముఁడ వై మహో మ, హీతలాధిపత్యము పూని యెల్లవేళ
యజ్ఞదాపరుండవై యధికసౌఖ్య, ముల నెనంగుచుఁ బర మందఁ గలుగు దనఘ.

ఉ. ఇమ్మహిఁ బ్రహ్మపుత్త్రుఁ డగునింద్రుఁడు క్షత్రియధర్మకర్ముఁ డై
తొంబదితొమ్మిదు ల్గణుతిఁ దోఁపఁగ వచ్చిన జ్ఞాతివర్గ ము
గ్రమ్మగుభంగి నుండఁ దునుగం బొనరించి సురాధిపత్యమున్
సమ్మతి నొంది యేలె మును స్వక్రియకున్ దగునట్లు వింటివే. 248

వ. అట్లు నీవును దిష్టంబు నతిక్రమించుటకుం జాలవు గావున విగతజ్వరుండవై పూజ్య సామ్రాజ్యంబుం బూను మనిన నేమియుం బలుక కూరకున్న ధర్మరాజుం గాంచి కృష్ణద్వైపాయనుం డి ట్లనియె. 249

శా. విద్వచ్ఛ్రేష్ఠుం డీవు డన్న వాక్యములు సద్వృత్తంబుఁ బోధించు నీ
నీకెవ్వారేనియు నిట్లు చెప్పెదరు నీవే సర్వధర్మంబులన్

ద్రెవ్వం బోవనిబుద్ధి గల్గితివి తర్కింపంగఁ ధర్మంబులం
దివ్వేళన్ మతి నిల్పి చూడు మొకమాటేమందువో పిమ్మటన్. 250

వ. ఐనను స్వార్థంబునం దెట్టివాఁడు నసమర్థుం డగుఁ గావున నేను నిందుకఁ జెప్పెద
నవహితుండ వగుము. 251

సీ. విహితము నిజధర్మ విధి నిర్వహించుట, దానిని విడనాడఁ దగదు నీకు
గార్హస్థ్య మత్యంతఘనతరం బగు ధర్మ, మని సర్వశాస్త్రములును వచించు
గృహమేధి ధర్మంబు గడపి నీ వడవికిం, జను టెన్న శాస్త్రదుష్టంబు సూవె
పితరులు వేల్పు లతిథులు భృత్యులు, నాశ్రయింతురు గేస్తు నర్థు లగుచు

తే. మఱియుఁ బశువులుఁ బక్షులు మనుజులు యజ, మానునిం జేరి జీవింత్రు మానవేంద్ర
తపము గార్హస్థ్య మని యెంచి తద్గతుండ, వగుచుఁ జరియింపు మందున యశము గలుగు.

మ. క్షమయున్ యజ్ఞము విద్యయుం దపము భైక్షం బింద్రియార్థైకసం
యమమున్ ధ్యానము తుష్టి జ్ఞానమును నేకాంతస్వభావంబు వి
ప్రమహాధర్మము లధ్వరాచరణ ముగ్రత్వంబు దండంబు ద్ర
వ్య ముపార్జించుట పాత్రదానమును భూపత్వంబు రాడ్ధర్మముల్. 253

వ. రాజధర్మంబులందు దండధారణంబుత్తమోత్తమం బది బలంబున సమాహితంబై
యుండు దండధారణంబున సుద్యుమ్నుం డను రాజేంద్రుండు తొల్లి ప్రాచేతసుం డగు
దక్షుండు వోలె సిద్ధిం బడసె ననిన యుధిష్ఠిరుం డాసుద్యుమ్నుం డెట్టికర్మంబున సం
సిద్ధిం బడసెం జెప్పు మనిన నప్పరాశరాత్మజుండు ధర్మరాజాత్మజున కిట్లనియె. 254

—పారాశర్యుండు సుద్యుమ్నునిచరిత్రము చెప్పుట—

క. మును శంఖలిఖితు లనియెడు, ముని లేకోదరులు గలరు పుణ్యాశ్రమముల్
ఘనఫలవృక్షయుతములుగఁ, దనరం గావించి బాహుదాతీరమునన్. 255

వ. ఇట్లున్నంతఁ గొంతకాలంబున కొక్కనాఁడు. 256

శా. అగ్రభ్రాత నిజాశ్రమంబునకు దవ్వై యున్నకాలంబునన్
వ్యగ్రత్వంబునఁ దమ్ము డైనలిఖితుం డచ్చోటికిం బోయి ప్ర
త్యాగ్రస్థానఫలంబులన్ దులిచి యాహారంజేసి భక్షించెఁ గ్రో
ధగ్రస్తుం డగుశంఖుఁ డంత నటకున్ దా నేగుదెంచెన్ వడిన్. 257

వ. ఏగుదెంచి ఫలంబులఁ భక్షించుతమ్మునిం గాంచి యి ట్లనియె. 258

ఉ. ఎక్కడి వీఫలంబు లిటు లేటికి మాటికి మెక్కుచుంటి వీ
విక్కువమున్ వచింపు మని నిష్ఠురవాక్యము సెల్లఁ బల్కినన్
మ్రొక్కిన కేలు ఫాలమున మోయఁగ నిల్పి సమీహవర్తియై
యిక్కడిచెట్లపండు లివి యే నిటు లాఁకటఁ దక్కి మెక్కితిన్. 259

వ. అనినం దీవ్రరోషసమన్వితుం డగుశంఖుండు లిఖితున కిట్లనియె. 260

ఉ. పండులఁ దొంగిలించితివి పాపము నీవయి వచ్చి పాతకిం
కొండన కేగి రాజుకడ కున్నది యంతయు విన్నవించి త
ద్దండన మొంది రమ్మనుఁడు దమ్ముఁడు సమ్మతిఁ జేసి పార్థివా
ఖండలుఁ డున్న తావునకుఁ గ్రన్నన నేగి వచించె వాకిటన్. 261

వ. సుద్యుమ్నుండును వాని రాక ప్రతీహారులవలన విని సహామాత్యుండై పదంబుల మెట్లు
గొనుచు వచ్చి సంశితవ్రతుం డగునయ్యతిం గాంచి నమస్కరించి యిట్లనియె. 262

క. మీ రిట నేం చేసినపనిఁ గారుణ్యముతోడ నాజ్ఞఁ గావింపుఁడు నే
నేరీతినైనఁ జేయం, గా రహిఁ గావింతు ననఁగఁ గడుమోద మొదవన్. 263

తే. లిఖితుఁ డిట్లను సుద్యుమ్న! లేవసీ వీడెఁ, గర్జ మొనరింతు నంటి వక్కాణ నడుము
గురు వొసఁగకుండ ఫలములఁ గొని భుజించి, నేగి కైతిని నన్ను శిక్షింపు మిపుడు.

వ. అనిన సుద్యుమ్నుండుఁ గొండొకవిచారించి యిట్లనియె. 265

చ. యతివర దండధారణమునందుఁ బ్రమాణమయే ననుజ్ఞయున్
మతి నరయంగ నట్టి దగు మానవనాథుఁ డనుజ్ఞ యిచ్చెఁ జే
సితి నని చెప్పినంతటన చేడ్పడియెం గలుషం బ దెల్ల సు
వ్రతుఁడవు దానిఁ బెట్టి పెరవాక్యముఁ జెప్పుము చేయ నెంచెదన్ 266

—లిఖితుండు సుద్యుమ్నుచే దండితుం డగుట—

క. అన లిఖితుం డిట్లను నో, మనుజేశ్వర ముచ్చిలించి మాగురుఫలముల్
దినినవాని నిట్లు పలుకుట, చను నే దండంబుఁ గాక శాస్త్రము గలదే. 267

వ. నా కొండువరంబునం బ్రయోజనంబు లేదు నీవు దండధారణంబు గలదండిమగండవే
ని నన్ను దండింపు మనిన నతం డెన్నిచందంబులం జెప్పిన నొప్పకున్న విసివి దండ
ధారణదీక్షాతత్పరుండై వానికరంబులు ఖండించె నంత లిఖితుండును నికృత్తకరుండై
కరంబు సంతసించుచు రాజుం దీవించి శంఖునిపాలికిం జని ధర్మజ్ఞా! ధృతదండుండ
నైతి దుర్బుద్ధిని నన్ను క్షమింపు మని ప్రార్థించిన నతం డతని కిట్లనియె.

ఉ. తమ్ముఁడ నీవయిం గినుకఁ దాల్తునె నిన్నుఁ దిరస్కరింతునే
నెమ్మదిఁ గన్మ ధర్మమును నీ వెడలించితి దాన నిష్కృతిన్
గొమ్మని పుచ్చితిం దెలిసికో నృపదండమునం బవిత్రుఁడై
తిమ్మెయిఁ బాహుదానదికి నేగి యొనర్పుము తర్పణంబులన్ 269

తే. అనిన లిఖితుండు నాఁ గాత మనుచుఁ బాహు, దానదికి నేగి పుణ్యతీర్థంబుల నవ
గాహన మొనర్చి తర్పణకార్యమునకుఁ, గడగునంతనఁ జేతులుఁ బొడమెఁ గడిమి.

చ. జలజము లట్లు హస్తము లెసంగుటకుం గను విస్మితాత్ముఁడై
సలిలవిధిం బొనర్చి వడి శంఖునిపాలికి వచ్చి చూచెఁ జే
తుల నవు డాతఁ డిట్టిమతితోఁ దపియించితి దాన నయ్యె వే
ల్పులు గరుణించి రచ్చెరువు పొందఁగ నేమిటి కింతమాత్రికిన్. 271

వ. అనిన లిఖితుం డన్న కి ట్లనియె. 272

ఉ. ఇట్టితపఃప్రభావమున నేర్పడియుండినవాఁడ వీవు నా
కట్టిమహాఘమున్ దులుప కానరనాథునిపాలి కంచుచో
నెట్టిది చెప్ప మన్న నతఁ డిం దగుదానికి దండ మూనుఁ గాఁ
బట్టి నృపాలుపాలికిని బంచితి నం దుఁ దలంచుకొ మ్మెదన్. 273

వ. రాజానుగ్రహంబునం జేసి నీవు నీపితృదేవతలతోడం గూడఁ బూతుండ వైతి వని ప్రత్యుత్తరం బిచ్చె రాజోత్తమా! దండధరుం డగునాసుద్యుమ్నుం డట్లు చేసిన దాన నుత్తమలోకంబులం బడసె క్షత్రియునకుఁ బరమోత్తమధర్మంబు దండంబు గాని ముండనంబు గాదు గావున నీవు శోకంబుఁ బోకార్చి భ్రాతృవాక్యం బవధ రింపు మని చెప్పి నుతియు ని ట్లనియె. 274

సీ. వనవాసమున మీరు వర్తించునపు డుండు, మీకోరికలు రిత్తవోక తగదు
కాననావాససౌఖ్యము నీ వెతింగిన, యది దానికై వెండి మది యిడుదు వె
ధరణిఁ బాలింపుము తమ్ములతోఁ గూడి, ధర్మార్థకామముల్ దగ నొనర్చి
పిదపఁ బ్రస్థానము పొదలించెదవు గాని, ఋషిపితృదేవతాఋణము దీర్పు

తే. మందునన్ సర్వము కీర్చి నట్టిఁ డగుదు, సర్వమేధాశ్వమేధముల్ సహజనహితుఁ
డగుచు సలుపుమునం ప్రాప్తయశుఁడ వైయి,హాపరములయందు సుఖ మందుదవనినాథ.

మ. మనుబోం ట్లాడినమాటల న్వినుము ధర్మంబుం బెడంబాసి పోఁ
బ్రమనస్త్వంబు వహింపఁ బోకుము పరద్రవ్యంబు గైకొంటయున్
సమరంబుల్ పొనరించి శత్రుజయముల్ సంధించుటల్ క్షత్రియో
త్తమధర్మంబు లటంచుఁ జెప్పుదురు శాస్త్రజ్ఞుల్ మహీవల్లభా. 276

ఆ. శాస్త్రజన్యమైనజ్ఞానంబు గలిగియు, దేశకాలగతుల దెలుఁగు లెత్తిఁగి
దస్యులైనవారి దండింపకుండియుఁ, బాపమునకుఁ గాడు పార్థివుండు 277

మ. బలిషడ్భాగము సంగ్రహించుచుఁ బ్రజం బాలింపకున్న స్మహీ
తలమందున్ జను లాచరించ త్రసిళమున్ ధర్మంబు వోనాడుచున్

గలుషం బందుఁ జతుర్థభాగ మరయన్ క్ష్మాపాలునిం బొంద నై
కలిగించు న్నిరయంబు గాన నతఁ డుక్తప్రక్రియన్ మెల్గ నౌ. 278

తే. ధర్మముల నాచరించెడుతతి నొకింత, ధర్మశాస్త్రంబుల మైన దాన శాస్త్ర
దూరుఁడై భ్రష్టుఁడై పోఁడు పూరుషుండు, వాని కెందును భీతియు వలదుఁ బోదు.

తే. కామమును గ్రోధమును నిచ్చఁ గలుగకుండ, శాస్త్రకర్మమునబుద్ధి సాఁగుచుండఁ
దండ్రివలె సహదర్శనత్వముఁ బ్రజల, నరయు రాజన్యునకుఁ బాప మంట దెపుడు.

మ. ఘనకర్మం బొనరింపఁ బూనుకొని యోగభ్రష్టుఁడై రాజు దై
వనిరోధంబున నట్టిదానిఁ బొనరింపం జాలకున్నంత మా
త్ర నతం డీజగమం దతిక్రమము నాఁ దల్పంగ నౌదోషముం
గొనఁ బోఁడంచు వచింత్రు ధర్మవిదు లోకప్రారాదివిధ్వంసకా. 281

తే. బుద్ధిపూర్వక మైన నబుద్ధిపూర్వ, కంబ యైనను శత్రుల గండడంచు
కొవ్వఁ బాపులతో సంధియొప్ప దెపుడు, రాష్ట్రమునఁ బుణ్యమునుఁ గూర్చి రాజు సేసంగు.

సీ. సత్కార్యు లార్యదోషజ్ఞశూరులు పరిపాల్యులు క్రోధనప్రథితజనులు
వ్యవహారముల ధర్మవర్తనముల బహుశ్రుతులు యోక్తవ్యులు సుగుణయుక్తుఁ
డైన యొక్కనిమాటయందు విశ్వాసము, సేయుంగ నొప్ప దసూయకొండు
నభిమాని స్తబ్ధుఁడు నవినీతుఁ డగువాఁ డ, రక్ష్యులు రక్షించి రాజు వారి

తే. దోషియగుచు దుర్దాంతుఁడౌ దూఱుఁ గాంచు, ప్రజలు దైవోపహతులు ఘోరవ్యాధితులు
నగుచు దుఃఖింతు రది వసుధాధినాథ, దురిత మని యెంత్రు పెద్దలు ధరణియందు.

క. పౌరుషము సుమంత్రియుతంబై రాజ్యంగఁ జేసి నవ్వుడును ప్రజా
హారము చెడు నది నృపదో, షాహూధ మధర్మమనుచు నాడరు విబుధుల్. 284

తే. చెడును సిద్ధించు దైవంపుచెయ్యి వలన, భూపతి పౌనర్భవారంభములను బురుష
కార మొప్పినఁ జాలు నక్కార్యమందు, పార్థివుని స్వశంకగ రాదు పాప మరయ.

— పారాశర్యుండు హయగ్రీవునికథ చెప్పుట —

శా. ఉగ్రుండౌ యన మండి శాత్రవుల నెంతో మంది ద్రుమ్మించి శూ
రాగ్రేయుం డయి భండనంబున సహాయత్వంబు సిద్ధింపమిన్
వ్యగ్రుండై హతుఁడై సురేంద్రపదముం బ్రాపించి దీపించె వా
జిగ్రీవుం డనురాజు తత్కథ యిటుల్ జెల్లుం జుమీ చెప్పఁగన్. 286

క. ధాత్రీజనపాలనమును, శాత్రవనిగ్రహము ధర్మశాస్త్రోక్త వర
క్షత్త్రియధర్మము లని నిజ, గాత్రము తత్క్రియకు విడిచి కనె నతఁ డసమున్. 287

మ. ధనువే యూపము నారియే రశన శాతం బైనశల్యంబె స్రు
క్కు నురూపం బగుఖడ్గమే స్రువము నె త్తాఱ్ఱిజ్యంబు తే ర్వేది వం
తున కొపో రనలంబు వాజితతి చాతుర్హోత్రమై గ్రాల న
జ్జననాథుండు సవాగ్ని వేల్చి రిపులన్ స్వర్గస్థుఁ డయ్యెం జుమీ. 288

తే. యోగమున న్యాసమునఁ జేసి యున్నత మగు, దైవసిద్ధియు మానుషదండనీతిఁ
గలిగి రాజ్యముఁ బాలించి ఘనయశంబు, వెంచి తను వీఁగిస్వర్గంబుఁ గాంచెనతఁడు.

వ. అట్లామాయగ్రీవుండు శత్రువులఁ జయించి ప్రజలం బాలించి సోమపానంబు గా
వించి ద్విజుల దానంబున సంతృప్తిఁ గావించి దండంబు ధరించి యుద్ధంబునఁ దను
వు త్యజించి దేవలోకంబుఁ బ్రాపించె ననిన విని ధర్మనందనుండు మొగంబుఁ బిగి
యం బెట్టుకొనియున్నఫాల్గునుం బ్రతీక్షించియుఁ బారాశర్యునిం బ్రతిపాదించుచు
ని ట్లనియె. 290

చ. గురువులు బంధులుం బ్రజలు కోటులు మేటులు వన్ని చెప్పి రె
వ్వరు నెటు చెప్పి రేనియును స్వాంతము శోకసమావృతంబ యై
గురుతరరాజ్యభోగములకుం బ్రియ మందదు భర్త లాత్మజుల్
మరణము నొంద నేడిచెడుమానినులం గన శాంతి గల్గునే. 291

వ. అనుటయు వేదవ్యాసుండు వెండియు. 292

— పారాశర్యుండు కాలప్రభావ మభివర్ణించుట. —

ఉ. కాలము దీఱ వారికయి కస్తి వహించుట కానిమాట యే
లీల మెలంగినన్ మనము లేవడి నొందుటె కాక యట్లనన్
గూలినవారిఁ జేఁ గలమె కొందఱు నేనియు కోటి కార్యముల్
పోలఁగఁ జేసి ధాత్రృకృతి పోకడఁ బెట్టఁగ నేర్తుమే కటా. 293

ఉ. కాలము గానియప్పు డొకకార్యము గా దెటువంటివారికేఁ
గాలము గూడినప్డు చులుకం బొను మూర్ఖుఁడు నర్థసిద్ధులన్
బోలినకాలమందు ఫలముం గన నౌషధమంత్రితంత్రముల్
కాలము మంచి దైన నవె కార్యఫలంబుల నెల్ల నిచ్చెడిన్. 294

సీ. కాలంబునం గాలి గదలుఁ గాలంబున, మేఘముల్ వర్షించు మెఱుము మెఱయుఁ
గాలంబునం బూచుఁ గాచు వృక్షంబులు, కాలంబునం దమ్మి లీలఁ గ్రాలు
వెన్నెలఁ జీకటి వెలయించుఁ గాలమే, కాలమున న్నల గడఁగు నడఁగుఁ
గాలంబునం బన్నగమ్మృగఖగాదులు, మ త్తిల్లుఁ గాలమే మాన్య మరయఁ

తే. కాలమునఁ గాక కాంతలు చూలుఁగొనరు, శీత ముష్ణంబు వర్షంబుఁ జేయఁగఁబోవు
చావను బుట్టరును జనుల్ చంద్రసూర్యులుదయ మస్తమయంబులును నొందఁబోరు.

—ధర్మరాజునకు వ్యాసుఁడు సేనజిత్తువాక్యంబులు సెప్పుట—

వ. సర్వంబుఁ గాలాధీనంబు గావున నీకు దేనికిం దేపురింపం బనిలేదు తొల్లి సేనజి
త్తుం డను రాజేంద్రుండు నీవలె దుఃఖార్తుం డయ్యుఁ గొంతవడికిఁ దనకుం దాన విజ్ఞా
నంబు గలఁడై పలికినపలుకులు గలవాకర్ణింపుము. 296

సీ. పర్యాయమున నంట వచ్చు మర్త్యుల సుఖదుఃఖాదిసర్వము తోఁచుపడఁగఁ
గాలపక్వము లయి కూలు జనంబులు, చంపితి ననియెడు నన్న గాని
చంపించువాఁడును జంపెడువాఁడును, గా డెవ్వఁడు స్వభావకలితమ మృతి
పుట్టినవన్నియుం గిట్టుఁ దమంతన, కర్త కాలము గాక కాఁ డెవండు

తే. తల్లిదండ్రులు పుత్రులు ధనము దార, లీగి రని వారిఁ దలపోసి యేడ్చి యేడ్చి
మొత్తుకొని నెత్తి దుఃఖంబు పోకడంప, జాల రజ్ఞాను లందున నన్నగింత్రు. 297

క. ఏడిచెడువానిఁ గన్గొని, యేడుచువాఁ డున్న దుఃఖ మినుమడి యగు నా
యేడుపు నీయేడుపు కడు, వాడిమి గల దగుచుఁ జెఱచు వానిన్ వీనిన్. 298

క. మే నిది నాయది కా దీ, కానంబడుపృథ్వి నాది గా దన్యులకున్
నేనును గా ననుకొనువాఁ, డేనెగులున్ లేక సుఖము నెంతయు నొందున్. 299

ఆ. ప్రతిదినంబు శోకశతములు హర్షశ, తములు మూఢజనునిఁ దవులుఁ బండి
తునిని దవుల వల్లె జనకోటులఁ బ్రియాప్రియమ్ము లంటి మెలఁగు నతిశయించి.

సీ. తృష్ణార్తివలనఁ బ్రాప్తించు దుఃఖము దుఃఖ, వినివృత్తి సుఖ మగు జనుల కిట్టు
లొకదానివెంట నొం డొక్కఁడు గా సుఖదుఃఖము లగు నెప్డుఁ దొలఁగఁ బోవు
కావున నా రెండుగతులఁ గాకుండ నో, శాశ్వత మొందుచు జనుఁడు దుఃఖ
వర్ధితతాప మేవంక నగుం దానిఁ, దెగఁ గోసికొను టొప్పుఁ దెలివిఁ జేసి

తే. యనుభవింపఁగ వలయు సంప్రాప్త మైన, కష్టసుఖములు మది నోడ కిష్టపుత్ర
దారలం దించుకయుఁ బ్రీతిఁ దవులకున్న, వేని కెవ్వఁడుచుట్టమో గాన వచ్చు. 301

క. తెలిసినవాఁడు నొకించుక, తెలియనివాఁడును సుఖాత్ము తెలిసియుఁ గొంతే
తెలియనిమధ్యముఁ డెంతయు, సిలుగుల పాలగు నటంచు సేనజితుఁ డనెన్. 302

వ. ఇట్లు చెప్పి లోకపరావరజ్ఞుండును ధర్మజ్ఞుండు నగు సేనజిత్తు సర్వదుఃఖవిముక్తుం డ
య్యె గావున. 303

సీ. పరదుఃఖమున దుఃఖపడువాఁ డొకప్పుడు, సుఖ మొంద డొకఁడు వెనుక నొకండు
దుఃఖపరంపరఁ దొడరుఁ దెగుట లేక, కలుగు సుఖంబు దుఃఖము నఁ గలిమి

లేమి లాభ మలాభ మామెయిఁ బ్రిదుకును, మరణము గలిగి మానసమున
ననుభవించెడు ధీరుఁ డగువాఁడు మోదఖే, దములకుఁ గాకుండు ధారుణీశ

తే. రాజులకు దీక్ష యని సేఁత రాజ్యపాల, నమ్ము యోగము బహుదక్షిణల నొసంగి
పడయు యోగము జ్ఞానము పావనమ్ము, లగుచు విధ్యుక్తధర్మము లన్యు వింటె.

ఉ. కావున వేదశాస్త్రము లఖండగతిం గొని రాజ్య మేలుచున్
జేవఁ జయించి శాత్రవులఁ జేసి మఖంబులు స్వస్వధర్మసం
భావన నాల్గువర్ణములవారిఁ బ్రివర్తిలఁ జేయుఁజేఁ డిలన్
బావనమూర్తియై పరఁగి స్వర్గమునన్ ముద మందు సంకుసన్ 305

తే. ధర్మతత్పరుఁ డయి నేలి ధరణి దివికి, జనినభూనాయకునిఁ బౌరజానపదులు
మెచ్చి వినుతింతు రదివాని మిసిమికగుచు, నుత్తమత్వము గలిగించునూర్ధ్వగతుల.

వ. అని పారాశర్యుండు పలుకుచున్న సమయంబున ధర్మనందనుండు పురందరనందనుని
దిక్కు మొగంబై యి ట్లనియె 307

తే. ధనముకంటె నత్యుత్తమ ధర్మ మెదియు, లేదు స్వర్గంబునుం గాదు లేనడి గల
వాని కర్థంబు సుఖమును వఱల దంటి, వది మృషావాద మెఱిఁగింతు నలరవినుము.

సీ. స్వాధ్యాయయజ్ఞమున్ సలిపి పెక్కురు సిద్ధి, వడసిరి ఘోరతపం బొనర్చి
మును లెందఱో సనాతనలోకములు గాంచి, రాశ్రమంబుల విప్రు లధికు లైరి
స్వాధ్యాయనిష్ఠులు జ్ఞాననిష్ఠులు ధర్మ, నిష్ఠు లనేకులు నీ వెఱుఁగవా
జ్ఞాననిష్ఠం గార్యసంసిద్ధిఁ జనిరి వై, ఖానసు లేవానిఁ గని యెఱుఁగుదు

తే. నజులుఁ బృశ్నులు సికతులు నరుణకేతు, వులునుదివ మందియుఁ దపంబువలన నధ్య
యనము దాన మింద్రియనిగ్రహమును యజ్ఞ, మప్రతిగ్రహ మివి శ్రుతిననుసరించు.

వ. ఈకర్మంబు లాచరించినవా రర్యమునిదక్షిణమార్గంబును యోగ మాశ్రయించిన
వా రుత్తరమార్గంబును బొందుదు రవియు నిం దుత్తరమార్గం బుత్తమం బనియు ము
న్న చెప్పియుంటి నెల్లసంతోషంబులకన్న వైరాగ్యం బుత్తమోత్తమం బది కైవల్య
ప్రదంబు వైరాగ్యంబుకంటెఁ బరమతుష్టి యెద్దియును లే దాసిద్ధి క్రోధమార్గం
బులు జయించినవానికిం గల దని తొల్లి యయాతియును. 310

తే. భయముపడుటయు భయపెట్టుట యును బగయుఁ
గాంక్ష మానమోహములు సంగమును విడిచి
భూతముల నభావము చేసి పొదలు నెప్డు
జ్ఞానియప్పుడనిర్వాణసౌఖ్య మందు. 311

వ. ఇట్లు చెప్పి మఱియు నీలోకంబునం గొందఱు ధర్మంబునుం గొందఱు శీలంబును
గొందఱు ధనంబునుం గోరుదు రాకర్ణింపుము. 312

సీ. ధనము ధర్మార్థమ యని గొన నెంతు రా, ధనము తదాశ్రియధర్మ మెన్న
దోషయుక్తము లని భాషింతురు ధనార్థి, వర్జనీయములును వదలలేఁడు
సమ్యగ్గతిం ధనసంగ్రహం బొనరించు, టరిది ద్రోహమునన యది లభించుఁ
బ్రీతికూల మగుసర్వఁ గతుల ధనము లోభి, స్వల్పార్థమునకై ద్రోహముపొనర్చు
తే. దుర్లభంబుగఁ గూర్చినందున నొకింత, ధనము భృత్యాదులకొసంగి దస్యుభయము
నం బలెం గడుఁ దపియించు నాఁడునాఁట, వాఁడు గ్రహియింపనెంచు దేవస్వమైన.
వ. ఈయర్థంబునఁ ద్రయీసంశ్రితం బగుయజ్ఞగీత తొల్లి కీర్తింపం బడియెనదియెట్లనిన.
తరువోజ. ధనము యజ్ఞార్థమ ధాత సృష్టించి, దాని రక్షింపఁగఁ దగ నిల్పె జనుని
జనుఁడు తద్ధనము యజ్ఞమునకె కాని, చనదు కామమున యోజ్యంబుఁ గావింప
ధనవంతుఁ డధ్వరార్థము దానమీఁదుఁ, దగు స్వామ్య మేనికి ధనమందు లేదు
ధనము యజ్ఞమునకు దానంబునకును, దగుఁ గాని భోగింపఁ దగ దెన్నఁ డేని. 315
మ. తనధర్మంబున మీఱి పాత్రగతికిం దవ్వైనయెవ్వానికే
ధనముం దప్పినదాన దాన మిడినన్ మర్త్యుండు న్యాత్యూదరం
బున కై దుర్గతి నూఱువర్షములు పెంపుం దక్కి విట్టుం భుజిం
చినవాఁ డయ్యెడుఁ గాన దానమున వాసిం గాంచుటల్ కా దయో. 316
వ. అని మఱియును. 317
మ. అభిమన్యుండును ద్రౌపదేయులును సప్తాశ్వాత్మజుండున్ శుచి
ప్రభవుండున్ ద్రుపదుండు మాత్స్యధరణీపాలుండునుం జేదిభూ
విభుఁడున్ దేశసమాగతుల్ ఘనులు పృథ్వీనాథులున్ జ్ఞాతులున్
విభవాపేతుఁడ నైననాకతమునన్ వ్రేటందనై రిందఱున్. 318
క. కులవిధ్వంసన మొనరన్, సలిపితి కార్యంబు దాన స్వాంతమునందున్
వెలలని దగుచున్ శోకము, సిలువెల్లన్ గాల్చు నగ్ని నెఱి గల దగుచున్. 319
మ. అకటా యేమనిచెప్పవాఁడ నొకొ బాల్యక్రీడలం దేలున
న్నొకము ద్దిమ్మని చేరఁ బిల్చి తొడపై నూరార్చుచుం జేర్చి పాం
డికఁ గావించినతాత నక్కటిక మింతే లేక చంపించి న
ట్టికృతఘ్నుండను రాజ్యలుబ్ధుఁడను గట్టిండిన్ కటా కష్టుఁడన్. 320
తే. వజ్రకల్పము లగుపార్థబాణముల నిజాంగము చలింప జీర్ణసింహమ్ము వోలె
ఘూర్ణిలెడునాపితామహుఁ గొనక కెరలి, గనుశిఖండిఁ గంటె నదినామనముఁగాల్చు.
తరళ. ఘనుఁడు భార్గవరాముఁ డాతనిఁ గయ్యమం దెదిరించి గె
ల్చినబలాఢ్యుఁడు కాశికాపురిఁ జివ్వ సర్వమహీశులం

దునిమి కన్యలఁ గొన్నపోటరి దుర్జయుం డరచేత మి
త్తినిఁ గ్రహించినమేటి భీష్మునిఁ ద్రెళ్ళఁ జేసితి నక్కటా. 322

మత్త. మున్ను, బిన్నటినాఁటనుండియు మన్ని మాకడగళ్ళకున్
బిమ్మటం పనుచుండు తాత వివేకశూన్యుఁడ రాజ్యలో
భమ్మునం దెగటార్చితిన్ గడుపాపకార్యముఁ జేసితిన్
ముమ్మరం బగుశోకమం దది ముంచె నన్ను మునీశ్వరా. 323

మత్త. ఆర్యవర్యుఁడు సర్వరాజసమర్చితుండు మహాత్ముఁ డా
చార్యుఁ డస్త్రవిదగ్రగణ్యుఁడు భూసురుం డగు ద్రోణు నై
శ్వర్యలోలుభత న్వధించిన వాఁడఁ బాపుఁడ నాకడన్
ధైర్య మెట్లగు శాంతి యెట్లగు దైవ మెట్లగుఁ జెప్పుమా. 324

ఉ. సత్యము బల్కు మోనృపతిచంద్రమ సీనుడికారమందు నేఁ
బ్రత్యయ మంతు నాసుతుఁడు చావెను వాసెనటే యనంగ ధ
ర్మాత్మయ మంచు నెంచక గజాంతరము న్గొని చచ్చె నంచు నే
సత్యము దప్పి నాగురునిఁ జంపితి నయ్యది నన్నుఁ గాల్చదే. 325

క. గురుఘాతి నైననా కిహపరములు రెండును నశించెఁ బాపుఁడ నైతిన్
భరియింపఁ జాల రాజ్యముఁ, బరమతపం బుండి మేను వాయఁ దలఁచెదన్. 326

క. సూర్యాగ్ని సదృశతేజుఁడు, శౌర్యోజ్జ్వలుఁ డైనకర్ణు సాహోద్భ్రాతన్
బర్యయమున జంపించి యు,నార్యగతిం బడితి నేమి యన వచ్చు ననున్. 327

మ. శుభకృద్దేహుఁడు సూర్యతేజుఁడు మహాశూరుండు ధీరుండు మా
యభిమన్యుం డతనిన్ గుమారుఁ డని నెయ్యం బేది కాలాగ్నిస
న్నిభుఁ డాద్రోణునిమొగ్గరంబు సొర నేనే పుచ్చితిం గానఁ ద
త్ప్రభృతిన్ జిష్ణునిఁ గృష్ణునిం గనఁగ నోపన్ బాపి చందంబునన్. 328

ఉ. ఏపురుపుత్త్రులుం దెగుట నెంతయు, జింత నలంది కుందుచూ
ద్రోవది గోత్రపంచకము ద్రుంగి నశింపఁగ నున్నపృథ్వి నా
జీవము గల్గి లేనిగతిఁ జెన్నఱి యుండినదానిఁ జూడ నా
కేవిపులార్థ ముల్లమున కెక్కఁగ నొప్పునొ మీర చెప్పుఁడీ. 329

తరువోజ. అరయంగ నిట్టినే నాగస్కరుండ నవని నాశకుఁడఁ బాపాత్ముఁడఁ గాన
ధరణియుం గిరణియుఁ దలపోయ కిపుడ తపయక వని కేగి తాపసవృత్తి
జరియించి దగ నైన జలము లానంగఁ జనక ప్రాయోపవేశము చేసి మేను
పరిశోష మొందవించి పాసెద నెల్ల వారు ననుజ్ఞ యీఁ బ్రార్థింతు మిమ్ము. 330

క. మునివర నా కీగతిఁ గా, ననుమతిఁ గావించి నాదు నఘములు వాయన్
మనమున నెంచి యథేచ్ఛ, జనుఁ డని సంప్రార్థనంబు సలుపుచు నుండెన్. 331

వ. అట్లు బంధుశోకవిహ్వలుండై యున్నయన్నరనాథు నిట్లు కా దని నిరోధించుచు మునీంద్రుం డి ట్లనియె. 332

క. అతివేలశోక మీగతి, మతిఁ దాల్పనఁ జేయఁ దగినమాటయె పృథ్వీ
పతి! పునరుక్తముగా నీ, మతికెక్కఁగ వినుతు వినుము మన్నించి మమున్. 333

ఉ. పుట్టినప్రాణికోటులకు బుద్బుదము ల్బలెఁ గష్టసౌఖ్యముల్
పుట్టి నశించు నింతియన భూతలమందు సమస్తవస్తువుల్
గిట్టు సముచ్ఛ్రయంబు తలక్రిం దగు యోగము విప్రయోగమౌఁ
బుట్టుట గిట్టుటే యని కవి బుద్ధిఁ దలంపుము పార్థివోత్తమా. 334

క. అలసత్వము సుఖమై య, వ్వల దుఃఖాంతంబయగుచు వఱలెడు దాక్ష్యం
బలఘుతరదుఃఖమై య, వ్వల సౌఖ్యాంతంబయ గుచు వాసిం గూర్చున్. 335

క. శ్రీయును భూతియు ధృతియును, హ్రీయును గీర్తియును బొందు నెపుడును దక్షుం
డై యున్నవాని నలసుం, డైయుండినవానిఁ బొంద వనిరి మహాత్ముల్. 336

క. మిత్రుఁడు సుఖము నొసంగఁడు, శత్రుఁడు దుఃఖంబు నొసఁగఁ జాలదు ప్రజ్ఞా!
సూత్రము కామ మొనర్పదు, దూత్రార్థము సుఖముఁ గూర్పఁ జాలవు తలఁపన్. 337

ఆ. కర్మ మాచరింపఁగా నిన్ను సృష్టించె, సృష్టి నీకుపనిని సలుపు మీవు
దాని విడిచి మాఱుదారిఁ బోవుటకు నీ, కీశ్వరత్వ మింత యేని లేదు. 338

— వ్యాసుండు ధర్మజునకు జనకాశ్మకసంవాదము చెప్పుట. —

వ. అని చెప్పి యప్పారాశర్యుండు జ్ఞాతిశోకాభితప్తుండై ప్రాణత్యాగమ్ముసేయ నున్న యన్నరనాథు నూఱార్చుచు వెండియుం బాండునందనా! నీ డెందంబు కలంక దీఱ నశ్మగీతం బను పురాతనేతిహాసం బొండు గల దాకర్ణింపు మొక్కనాఁడు దుఃఖశోకసమన్వితుం డగు జనకుండు తనపాలి కరుదెంచిన యశ్ముం డను బ్రాహ్మణు నర్చించి యి ట్లనియె. 339

క. బందుగు లర్థంబులుఁ దనుఁ, బొందినయపుడు వెసఁ బాసి పోయినయపు డే
చందమున మెలఁగి మనుజుఁడు, పొందున్ సుఖ మెఱుఁగఁ జెప్పు బుధవర కరుణన్.

వ. అనిన నతం డతని కి ట్లనియె. 341

సీ. మేను పుట్టినయంత దానితో సుఖదుఃఖ, ములు పుట్టుఁ దొంటి చెయ్వులకుఁ బోల
నం దేదియేనియు నంటినప్పుడు వాని, తెలివి మబ్బుచు గాలి వలె హరించుఁ
గనుఁగొన నభిజాతుఁడను బ్రసిద్ధుఁడఁ గేవ, లుఁడను గా ననుకొన్నఁ జెడును మనము

భోగసక్తుం డగు పోఁ గార్చి పితృధనం, బంబేద యై చౌర్య మాచరించు
తే. విగతమర్యాదు సన్మార్గ మ్యగము బోడు, వోలె శిక్షించు రా జ్యాధికారు లిర్వ
దియును మున్నది యే ద్రోఁ బెట్టుమరొకఁడు, శిలుబడిముకఁ గనూఱేండ్లు మానవేంద్ర.
తే. ప్రాణివృత్తి మెఱుఁగి బుద్ధిబలమునంన, సక్తిదుఃఖాను సుఖులను నొసఁగంబు
చేసికొన నొప్పదుఃఖముల్ సేయఁ జిత్త, విభ్రమ మంద్ర సుఖసల్ల వేఱుకాం. 343
సీ. జరయును మృత్యువు నతము వృకము లట్లు, బలవంతములును దుర్బలము లైన
సర్వజంతువులను సాపడుచుండు నె, వ్వఁడును వానికిఁ గానివాఁడు లేఁడు
పను వృప్రస్థితయుతై పరఁగుభూతముల కు, సుఖదుఃఖము ల వెప్డు నుదుగని వను
జనుల కర్థాముల సంయోగమునఁ బ్రీతి, విప్రయోగమున నప్రీతి యొదవు
తే. ధనము గణియింప దుఃఖము దాని నాశ, మునను దుఃఖము భోగముల్ పొనరునిట్లు
పుట్టునవి యెల్ల గిట్టును గిట్టినయవి, పుట్టెడు విధాన మి ట్లని పోలుఁ దెలియు 344
పంచ. చతుస్సముద్రముద్రితోర్వీశక్తియుక్తి నేలురా
జశ్లజుండు నేని కాల సంప్రసక్తిచే జరా
మృతుల్ గలాఁడ యాను దాఁటిమేన నైనకర్మపం
గతిన్ మనుష్యు నంటెడిన్ సుఖంబుదుఃఖదుఃఖముల్. 345
క. శయనాసన యానాదులు, ప్రియతమవస్తువులు భోగవిస్తరములు ము
ద్దియలున్ లోనగునవి నరు, నియతంబుగఁ డాయుఁ బాయు నిజము నరేంద్రా. 346
క. బలవంతులు బలహీనులుఁ, గలవారును లేనివాఁడు మనవైద్యులు రో
గు లలంతులు ఘనులును విల్పిలఁ గను దుంటుడును గాలచిత్రము గాదే. 347
క. కులజన్మం బారోగ్యము, బలమున్ సౌభాగ్యభోగభాగ్యంబులు రూ
పలవడు భవితవ్యము మెం,పలరిన లేకున్న లేద యని తెలియు నరున్. 348
సీ. పెట్టి పెంచఁగ లేనిపేదకుం గొరకు,ంజనఁ బెక్కుమంది పుట్టెదరు సుతులు
దినఁ బెట్టఁగ సమృద్ధిఁ దనరినవారు కో,రినఁ బుట్టఁ డొక్కఁగుండును ధరిత్రిఁ
గొంతలోపలఁ జచ్చుఁ గొమరుఁ బ్రాయమువాఁ డు,వసుమంతుఁడును గులవర్ధనుండు
నూఱేండ్లు జీవించు నోగిలెడువాఁడు జ,రాన్వితుండు దరిద్రుఁ డధమజన్ముఁ
తే. డాకటికిఁ దన్న డా లైన నఖుడ వి,ధ్వమునకు శ్రీమంతుఁ డింతయుఁ దినఁగ లేఁడు
కర్మసంచయమునఁ జేసి కాలగతులు, విధివిచేష్టిత మీరీతి వెలయుచుండు. 349
మ. కలకర్మంబునఁ జేసి ప్రాణితతికిం దబ్బిబ్బు గాకుండ నా
ధులు వ్యాధుల్ జల మగ్ని శస్త్రభయమున్ దుఃఖంబు కష్టంబునుం

గలుగఁ నిర్మితి దాఁట నెవ్వనికి శక్యం బంచునూహింపరా
దిల సర్వంబును గర్మచోదితము నా నేలయ్య చింతింపఁగన్. 350

క. వేటయుఁ బానముఁ జూదము, బోటియుఁను గాని వనుచుఁ బుధు లన వినియున్
బాటింప కాపురిసక్తిన్, మేటులనుం జెడుట వింతు మే కద జనకా. 351

తే. ఈప్సితానీప్సితంబుల నెల్ల యర్థములను గాలవశంబున భూతకోటి
తనయదృష్టంబున స్పృశించు దానికి మతి,యొం డకునిమిత్త మేదియునుండఁబోదు.

చ. దివమున్ వాయువు నగ్నియున్ శశియు నాదిత్యుండు జ్యోతిస్సులున్
బవలున్ రాత్రియు శీత ముష్ణము నిరుల్ వర్షంబును న్వాకలున్
దవురీతిన్ గన నొప్పఁ గాలమునఁ దత్తత్కృత్యమే మర్త్యునం
దవు నట్లే సుఖదుఃఖముల్ మనుజునిం బ్రాపించుఁ గాలంబునన్. 353

తే. జపతపంబులు వ్రతములౌషధము లమల,
మంత్రములు హోమములు జరామరణములకు
నైన మర్త్యుని రక్షించునట్టిపనికిఁ,
జాలవని నీ వెఱుంగు మోజనకరాజ. 354

క. కట్టియు గట్టియు వెల్లువఁ, గొట్టుకొనుచుఁ బోయి పోయి కూడుఁగ పీడున్
నెట్టనఁ బ్రాణిసమూహం, బట్టులె యీధరణియందు నని యెఱుఁగ నగున్. 355

క. కొందఱు స్త్రీగీతాదుల, నంది సుఖంబుం డ్రనాథులై ధరయందున్
గొందఱు పరాన్నదుఃఖము, నొందుదు రిరువాగు కాల మొకగతి నరయన్. 356

క. వేగురు తల్లులుఁ దండ్రులు, వేగురు దారలును సుతులు వెనుకటిసంసా
రాగమములందుఁ బొందితి, వేగతి నెవ్వరికి నెట్టు లేడ్వఁగ నగునో. 357

క. ఏవానికిఁ దానుం గా,దేవాఁడును దనకుఁ గాఁ డిఁ కీదారాదుల్
భావింప దారివెంటన్,బోవన్ బథికాళివోలెఁ బొందిరి మనుజుల్. 358

ఉ. ఎక్కడినుండి వచ్చితి నిఁ కెక్కడి కేఁగుదు నే నెవండ నా
కిక్కడ నుండ నేమిటికి నీపరిదేవన మేల వచ్చె నం
చొక్కెడ చిత్తమున్ మెదలకుండఁగ నిల్పి తలంచుకొన్నచో
జక్కఁబడున్ సమస్తమును సంసృతి చక్రము నాఁగఁ దోఁచెడిన్. 359

సీ. కానంగ రాకున్నఁ గల దనునిమగంబు,పరలోక మదిగాన వగవు మాని
విశ్వయజ్ఞ మొనరించి వెలయించి ధర్మము, విద్వద్వరేణ్యుల విధివిధమున
నర్చింపుము త్రివర్గమందు మీజగము జ, రామరణగ్రాహభీమ మైన
కాలనాగరమందుఁ గూలి యుంట యెఱుంగు,జాలఁ డజ్ఞుం డగు జనుఁడు విరుము

తే. వైద్యశాస్త్ర మెఱింగిన వైద్యులు నిజ,వ్యాధిపీడితు లై కషాయములఁ గ్రోలి
యును జరామరణంబుల నొంది తెగుదు,రిభము లిభరాజములచేత నీల్గినట్లు. 360
తే. అట్టులే తాపసులును స్వాధ్యాయనేత్త,లును మహాధ్వరకర్తలుఁ ఘనులు దాన
శీలురును జరామరణముల్ క్షితితలమున,బాఁట లే రని యెఱుఁగు మో ధరణినాథ.
క. జని నందినభూతములకు, మును గాంచిన రేలు పక్షములు మాసము లేం
డ్లును వెండియుఁ గన రా వవి, మనమునఁ దలపోయ వలయు మానవనాథా. 362
సీ. అస్థిరుం డగు నరుం డవశుఁ డై సంసార,మార్గంబునం గాలమహిమ నడఁగు
దేహముం జీవుఁడో దేహము జీవునో, విడనాడి పోవు నేవేళ నైన
దారపుత్రాదిబాంధవవర్గ మెల్ల మా,ర్గమున గూడినదయి గనఁగ వచ్చు
నొకనాఁటికేని మర్త్యునకు నానహవాస,మత్యంతమై యుండునదియుఁ గాదు
తే. తనకుఁ దనమేన యెఱుక యైన దనఁగ నన్యు,లెట్లు నత మని తలపోయు దీవు తల్లి
దండ్రు లెక్కడ దాతయుం దాను నెచట, వారు నినుఁ గనుంగొన రీవు వారిఁ గలవ.
చ. పురుషుఁడు స్వర్గమున్ నరకముం గని యుండఁడు శాస్త్రదృష్టియై
నిరతము విజ్ఞు లందు రది నీవును నమ్ముచు బ్రహ్మచర్యముం
జరిపి సుపుత్రులం బడసి జన్నములం బొనరించి జన్మసం
భరితఋణత్రయంబు గెడపం దలపోయుము పార్థివోత్తమా. 364
తే. బ్రహ్మచర్యము యజ్ఞముం బ్రజలఁ బడసి, దేవఋషిపితౄణములను దీర్చి జ్ఞాన
కలితుఁ డగుజనుం డిహపరంబులఁ దలిర్చి, మోక్షసామ్రాజ్యమును బొందు ముక్తుఁ డగుచు.
శా. రాగద్వేషములఁ ద్యజించి నృపధర్మంబుం బ్రవర్తించువాఁ
డై గర్హింపనిరీతిఁ గూర్చి ధనమున్ యజ్ఞాదులం జేసి దే
వాగంత్వర్థిజనాదులం దనుపు మట్లైనం ద్రిలోకంబులన్
భోగైశ్వర్యయశస్సుఖాదు లెపుడున్ బొందంగ నీ కయ్యెడిన్. 336
వ. అని తెలిపినం దెలిసి విదేహవల్లభుం డమ్మునివల్లభు నామంత్రితుం జేసి శాంతశో
కుండై గృహంబునకుం జని కులోచితకర్మనిష్ఠాగరిష్ఠుం డయ్యె నట్లీవును నీశో
కంబు పరిత్యజించి క్షత్రధర్మసంపాదితంబగు నీధాత్రిం బరిపాలింపు మొందుతలంపు
సేయకు మని వ్యాసభట్టారకుండు బోధించిన నేమియుం బలుక కూరకున్న యన్నం
గని గుడాకేశుండు హృషీకేశున కిట్లనియె. 367
క. జ్ఞాతివధజనితశోకా,త్యాతతసాగరనిమగ్నుఁ డై భూపాలుం
డీతఁడు మాకున్ సంశయ,మేతేఱం జేయఁ దేర్చవే నీ వనఘా. 368

పృథుఁడు రాజ్యం బేలుచు సర్వోపకరణంబులు స్వర్ణంబులం జేసి నానావిధాధ్వరంబు
లాచరించి సువర్ణగజాశ్వాదులు దక్షిణాకాలంబున నొసంగి భూలోకదేవేంద్రుం
డని పేరు వడసి రూపు మాసె యౌవనాశ్వుం డగు మాంధాత తండ్రియుత్సంగం
బునం బుట్టి దేవేంద్రపోషితుండై చతుస్సముద్రముద్రితోర్వీతలం బనక్రవిక్రమం
బునం బాలించి శతసహస్రాశ్వమేధంబులు పొనర్చి స్వర్గంబునకు నిర్గ
మించె నాహుషుం డగు యయాతియు ననేకక్రతువు లాచరించి మూఁడు కాంచనప
ర్వతంబులు విప్రుల కర్పించి నిజపుత్త్రుం డగు పూరునిఁ బట్టభద్రుం జేసి తాను దపో
వనంబున కరిగి పరమపదంబు నొందె నాభాగి యగు నంబరీషుండును వేనవేలు స
వనంబులు చేసి వారిం గాంచి కాయంబుం ద్యజించె శశిబిందుండు నూఱుకన్యాదా
నంబులును నూఱువేల గోదానంబులును గావించి కాయంబు వాసె గయుండును నూఱు
వర్షంబులు హుతశిష్టాశనుండై వహ్నివలన నక్షయవిత్తంబు గలుగ వరంబు వడసి
పుడమియెల్ల సువర్ణమయంబుఁ గావించి యశోవిశాలుండై కాలగతికిం బాలయ్యె
రంతిదేవుం డతిథిపూజాతత్పరుండై వేలకొలందిసూదుల మహానసంబున నెలకొల్పి
చతుర్విధాన్నంబులం బెట్టె నతనియింటం గలసర్వపాత్రాసనాదు లన్నియుఁ గాంచన
మయంబు లతనివలన నచర్మణ్వతిఁ జనించె నట్టి పురుషోత్తముండు మృత్యుం బెడఁబాసె
సగరుం డఱువదివేలపుత్త్రులం గని వాజిమేధసహస్రంబుఁ గావించె నతనిపేరున స
ముద్రంబు సాగరం బయ్యె నతండును దిగుండు గాఁడయ్యె వైన్యుం డగు పృథుండు
సర్వలోకాభివందితుండై రాజ్యపాలనంబు సలిపి సర్వాధ్వరంబులు నిర్వర్తించి మృత్యు
సాత్కృతుం డయ్యె వీ రందఱు నీపుత్త్రునికన్న వేయిమడుంగులు పేర్మిం గన్నవా
రు వా రెల్లఁ గాలచోదితులై రనిన నీవు నీబాలునికై వగచుచుంటి విది యజ్ఞానం
బ కాని విజ్ఞానంబు గా దనిన సృంజయుండు నారదున కభివందనం బొనర్చి మహా
త్మా! నామోహం బెల్లఁ జల్లాఱె నేను నీయనుగ్రహంబునఁ గృతార్థుండ నైతి
నని ప్రార్థించిన నారదుం డతనికిఁ బుత్త్రు ననుగ్రహించె ననిన యుధిష్ఠిరుండు నే నా
సృంజయపుత్త్రుం డగు సువర్ణష్ఠీవివృత్తాంతంబు కొంత వింటి పర్వతుం డేమిటి కాఁపు
త్త్రు నల్పాయువుం జేసె నారదుండు వెండియు వాని వర్షసహస్రాయువుగ నెట్లు చే
సెం జెప్ప ననుగ్రహింపు మనిన దేవకీనందనుం డాకుంతీనందనున కిట్లనియె. 372

—శ్రీకృష్ణుండు పర్వతనారదుల వృత్తాంతము చెప్పుట—

సీ. వినుము మామయు నల్లుండు నగు నారదుండును, బర్వతుండు నొకనాఁ డుర్వర నగు
నఖిలభోగంబుల ననుభవింపఁగ వచ్చి, తిరుగుచు నం దొండొరుఁ బెరిమ మెఱయ
హృదయసంకల్ప మెయ్యదియైన నొండొరుల్, చెప్పకొనుచు నట్లు చేయకున్న
శపియించుకొనునట్లు సమయంబు సైకొని, సృంజయుం డగు శైబ్యుచెంత కరిగి

కొంతకాలము నీయింటఁ గోర్కి దీఱ, నుండ వచ్చితి ననిన నాతండు వల్లె
యనుచు నారదునియింటనునుచుకొనియెఁ, దనదుసుత వారికుపచార మొనరుప నిడె.
కన్నియయుఁ బితృనిదేశంబున మునివర్యుల కుపచారంబు లొనరించుచుండె నంతఁ
గొంత కాలంబునకు. 374

నారదుఁ డాజలేజముఖి నాఁడును నాఁడును జేయు సేవకుం
జారుసురూపసంపదకు జవ్వనపుంజిగికి న్విలాసపుం
దీరునకున్ మది న్వలచి తియ్యనివిల్ గలవాని బారికిం
గూరినవాఁడ యై తగులు కొంచెమ యైనను బెంచె నెంచఁగన్. 375

భాగినేయుఁ డైన పర్వతునకుఁ దనహృదయాలాప మెపుడు నెఱుఁగఁ జేయఁ
డయ్యె వ్రీడమానుఁ డగుచు నాతఁడు దాని, దగ నెఱింగె నింగితములవలన. 376

ఎఱింగి నారదునిం గని యి ట్లనియె. 377

సమయము చేసి దాని విడఁ జాలితి బాలిశవృత్తి నూని నీ
దుమనము రాచకన్నెపయిఁ ద్రోఁగె వచింపవు గాన నాదుశా
పమునకు నైతి పాపడఁతి పత్నిగ నీ కగు నష్టక్రోఁతిరూ
పమున జగజ్జనుల్ గనఁగఁ బర్వెద పుర్వర గర్వ మేగఁగన్. 378

అని శపించిన నారదుండును క్రోధమూర్ఛితుండై నన్ను శపించుటం జేసి నీకు స్వర్గ
గమనంబు లేకపోవుం గాక యని ప్రతిశాపం బిచ్చుటయుఁ బర్వతుం డప్పుడ వా
నిం బెడఁబాసి దేశసంచారంబు గావించుచు సర్వజనపూజితుం డయ్యె నంత. 379

నారదుఁ డాసుకుమారిపాణిగ్రహణ మొనరించినయట్టిసమయమంద
వానరరూపంబు దా నొందె నొందిన, డెందంబునకు రోయ కిందువదన
క్రోఁతికిం గొంతయుఁ గొఱ లేనినిజభర్త, దైవభక్తిం జేసి సేవ చేసెఁ
బదపడి కొన్నాళ్ళ కద నెఱిఁగె ననంగ, వనమున ప్రమ్మఱ పర్వతుండు
నారదునిఁ గాంచి సేవించి నాకు శాపమోక్ష మొసఁగుము కరుణించి మునివరేణ్య
యనుఁడు నాకుఁ బుత్రస్థానమందు నుండి, యీవు నను మున్ను శపియించితి తగునె.

వెనుక నేను శపించితి నైన దానికి వగవం బని లే దిపుడు మనశాపంబులు దొలం
గించుకొంద మని యొండొరువు లట్లుచేసికొని వారిద్దరును రాజగృహంబు సేరం
జనుదెంచి రప్పు డప్పరమపతివ్రత యగుసుకుమారి నారదుం గని పరపురుషుం డని
శంకించి తొలంగం బాఱుటయు నామెం జూచి పర్వతుం డి ట్లనియె. 381

సుందరి నీవిభుం డితఁడ చూచి భయంపడఁ బోకు మన్యుఁడుం
చుం దలపోయ కుండుము త్రిశుద్ధిగఁ బల్కుచునుంటి నెమ్మదిన్

నందియు మందఁగా వలదు శాపవశంబున నట్టిరూపముం
బొందఁగ నయ్యె నిప్పు డది పోకడఁ బెట్టితి గట్టిపట్టునన్. 38

వ. సుకుమారియు శాపప్రకారంబును శాపమోక్షంబు నెఱింగి ప్రకృతిం బొందె
రాజేంద్రా! నీ వడిగినసువర్ణష్ఠీవివృత్తాంతంబు ప్రత్యక్షదర్శి యగునారదుండు చెప్పిన
నొప్పుమిగులు నదె నారదుం డమ్ముని నతిం డతనిదిక్కు మొగంబై ప్రార్థిం
చుటయు నారదుండు కౌరవేశ్వరా! మనవాసుదేవుండు చెప్పినదంతయు నట్టిద
యవ్వలం జెప్పెద నాకర్ణింపుము. 38

—నారదుండు సువర్ణష్ఠీవిచరిత్రము చెప్పుట—

సీ. ఏను నల్లుం డట్లు సృంజయుపాలఁ బెక్కేఁడులు సుఖముంటి మింతలోన
ననుఁ బిల్చి పర్వతుం డనియె నీరాజున,కొకవరం బొసఁగుట లొప్పు ననుడు
న ట్లగుం గావుత మని నేను సృంజయు,నరసి నీ కే నిప్పు డర మొసఁగుదు
నర్థింపు మనియెడు నంతలోఁ బర్వతుం, డీవు కోరెడునది యెవ్వరికిని

ఆ. బాధ గలుగకుండునదిగది నుండఁగ నగు, ననుఁడు సంతసించి యవనివిభుఁడు
వరతనూజు వీర్యవంతు నాయుష్మంతు, నింద్రతుల్యు నొసఁగ నెంచుఁ డయ్య. 38

వ. అనినఁ బర్వతుండు. 38

తే. దేవరాజాభిభూతికై నీవు కోరి, పుత్త్రు నర్థించితివి గానఁ బుట్టి సుతుఁడు
కనకమును గాంచి యత్యల్పకాలమందు, హతుఁ డగుం దేవరాజాగ్రహంబువలన

వ. అనుటయు సృంజయుం డట్లు కాకుండ వరంబుఁ బ్రసాదించి నాపుత్త్రు నాయుష్మం
తుం జేయు మని ప్రార్థించినను బ్రసన్నుండు గాక పర్వతుం డూరకుండె నయ్యవస
రంబున నేను దీనుం డగునాసృంజయుం దిలకించి రాజా! చింతింపకుము ప్రేతరాజ
వశంగతుం డైనసీపుత్త్రు నేను దెచ్చి యిచ్చెద నన్నుపుడు స్మరింపు మని యూఱ
డం బలికి వానిచే ననిపించుకొని పర్వతసహితుండనై స్వర్గంబునకు నిర్గమించితి
నంతఁ గొంతకాలంబునకు. 38

సీ. నరనాథునకుఁ గాంచనష్ఠీవి యనుయథా, ర్థాఖ్యుండు జనియించె నాత్మజుండు
దివ్యర్షివరదానదీపితుం డగువాని, వలనిభయంబును దెలిసి కలఁగి
గురునాజ్ఞఁ గొని వజ్రమరుదారఁ బుచ్చె సృం,జయపుత్త్రుఁ బులి వయిచంపు మనుచ
నదియు న ట్లగుఁ గాత మని చని యంతరం, బరయుచు నాతని ననుసరించె

తే. బాలుఁ డొకనాఁడు ధాత్రితో లీల నుపవ,నమునవిహరించుచుండ వజ్రముమహోగ్ర
మైనశార్దూల మై వచ్చి వానిఁ జంపి, పోయెఁ జూచుచు నుండంగ మాయమగుచు

వ. ధాత్రియును గొంతెత్తి యేడ్చిన విని సృంజయుం డంతఃపురాంగనలతో నట
వచ్చి హతుండై క్షితిం బడి యున్నసుతుం గని కట్టుకొని బెట్టు వాపోయి వాపోయి

తాపం బడంచుకొని కొంతలో నన్నుం దలంచుటయు నే నాగ సమ్మోహకాంతుని
యాంతికంబునం బాటసూపి నీకీవాసుదేవుం డిష్టుండు చెప్పినచొప్పిల్లం జెప్పి యు
ప్పొంచి పురందరామనుతంబున నవ్వుత్రుం బ్రిదికించి స్వంజయాదులు కానంగం
బాపాదించితి నంత సువర్ణష్ఠీవియు దినక్రమంబున సువర్ణం బనంతంబు గాఁ దప్పి
దంత్రుల కిచ్చియు ననంత కాలంబునఁ బహునోకంమునూర్లసంవత్సరంబులు రాజ్య
పాలనంబుఁ జేసి నానావిధాధ్వరంబులు గావించి పుత్రుల నుత్పాదించి స్వర్గంబు
నొందె నిప్పు నీవాసుదేవుండును వ్యాసుండును జెప్పినచొప్పునఁ బితృపైతామహం
బైన రాజ్యభారంబు వహించి భూరిదక్షిణాలు నధ్వరంబులు గావించి పుణ్యలోకంబు
లొందఁ గల వనిన నజాతశాత్రవుం డేమియుం బలుక కూరకున్నంతఁ గృష్ణద్వైపా
యనుండు కృపాయత్తచిత్తుండై వెండియు నిట్లనియె. 389

సీ. నరనాథరాజేంద్రునకుఁ బ్రజాపాలనవిధిఁ గడచినధర్మవిధము గలదె
దాన బ్రాహ్మణతపోధర్మంబు రక్షితం, బగు ధర్మము ప్రమాణ మఖిలమునకు
ధర్మరక్షకుండవై తనరి నీ విపుడు పితృపితామహగత మీధరిత్రిఁ
గైకొని యేలుము లోకమునం దస్వ, జేసినఁ బుత్రునే రోసమానను

తే. దండితునిఁ జేయు నొప్ప నీధర్మమునకు, భేదబుద్ధిఁ బ్రవర్తిల్లుభూదయితునిఁ
గిల్బిషము లంటు ధర్మంబు గినుపడఁగఁ నీయ కుండినభూపతిఁ బాయు నఘము 390

క. ధర్మప్రోద్భవ నీ విల, ధర్మము పోకడఁ చుట్టిదాయల నెల్లన్
ధర్మాజియందు దునిమి స్వధర్మము రక్షించి తిందుఁ దగునే వగవన్. 391

క. కుజనుల శిక్షించుటయున్, సుజనుల కిచ్చుటయు నవనశుద్ధిఁ దగుటయున్.
ప్రజలం బాలించుటయున్ వృజినము నంబాయు రాజువిధు లన వినవే. 392

వ. అనిన యుధిష్ఠిరుం డిట్లనియె. 393

తే. నీకునుడి కేమి శంకింప నీకు ధర్మ, మెల్ల నపరోక్ష మగుఁ దైవ మీవ తలఁప
రాజ్యకారణమునఁ జంప రాని వారి, జంపితిని దాన నామది సంతపించు. 394

వ. అనిన వ్యాసుండు వెండియు. 395

—కృష్ణద్వైపాయనుండు ధర్మజునకు ధర్మాధర్మంబు లెఱింగించుట—

సీ. విశ్వమునం గర్త యీశ్వరుఁడో పురుషుఁడో పెరచేఁ జంపఁ బడునో లేక
కర్మఫలంబునం గడతేరునో యని, చర్చించుకొన్న నీశ్వరనియుక్తుఁ
డయి పూరుషుండు శుభ మశుభంబు నగుకర్మమాచరించును ఫల మందు నీశుఁ
బరశువునం జేసి పురుషుండు వృక్షముం, దునుము పాపము పరశునకుఁ గాదు

తే. పరశు వగుఁ నచేతన మది పట్టినతఁడె, పాప మొందెడు నందు వేఁ బరశుకర్త
యేల కాకుండుఁ బాపము న్వాలుగొనఁగ, నెమ్మదిఁ దలంచి చూడుమో నృపలలామ.
క. పురుషుండు నఱకెఁ జెట్టని, పరశుస్థితిఁ బరశుకర్త యయిఁ బెట్టఁగ నీ
కు సుచింపకున్నయే నీశ్వరుపైఁ దత్ఫలము వెట్టఁ జనుఁ బ్రేరకతన్. 397
తే. పురుషుఁడే కర్త యగుఁ బాపపుణ్యములకు, నీశ్వరుఁడు లేఁడని వచింప నెంతు వేని
చెప్పెదను విన్ము తప్పె తే దప్పు డెల్లి, నీకు చేతయు నొప్పనై నెగడు నూవె. 398
ఉ. మాటలు వేయు నేల యణుమాత్రము నేనియు దైవనిర్మితిన్
దాటఁగ లేఁ డెవం డెపుడు దైవము పూర్వభవార్జితంబు నా
నాఁటియతండుఁ గాఁ డితఁ డనంతరజన్ముఁడు వాని నయ్యఘుం
బేటికి నంటు శత్రుకృత మెప్పుడు శిల్పికి నంట నట్లుగన్. 399
మ. ఒకఁ డొం డొక్కనిఁ జంపఁ గల్గు నని నీవూహింతువే నీశ్వరుం
డొకరుం డుండఁడు పుణ్యపాపములు లే కుండున్ భయం బప్పుడే
టికిఁ బుణ్యంబును బాపమొండు నని పాటింతేని దద్ధర్మ ర
క్షకుఁ డుర్వీపతి దండ మాతనికడన్ సాక్షాత్కరించుం గదా. 400
సీ. ఇన్నియు నేమిటి కేను జెప్పెద విను, మెల్లకర్మములకుఁ జెల్లునట్టి
పుణ్యపాపంబులు పొసఁగుఁ గర్మానుసారముగ మర్త్యుండు ఫలముల నొందు
వగపు దక్కుము నీవు స్వస్వధర్మమునందుఁ బఱలువానికి నపవాద మైన
నగునంతమాత్రకుఁ దగదు మే న్విడనాఁడ, నలరు నిష్కృతికర్మములకు నెందు
తే. మేను గలవాఁడు నిష్కృతుల్ పూని చేసి, పూతుఁడగు మేనువోఁ బరాభూతుఁడగును
బ్రదికి నీవు ప్రాయశ్చిత్తపరుఁడ వగుము, కాక చచ్చినఁ దప్పియుంతు కర్మగతుల. 401
వ. అని చెప్పిన నెప్పటిచొప్పున నప్పాండవాగ్రజుం డప్పారాశర్యునిం దిలకించుచు ని
ట్లనియె. 402
సీ. ఆహవంబున హతు లైరి పుత్రులుఁ బౌత్రులును దండ్రులుం దాతలును సహజులు
మామలు బావలున్ మఱఁదులు గురువులు, భాగినేయులు సుహృద్బాంధవులును
వివిధదేశాగతుల్ సవనకర్తలు మహీక్షితు లిందఱున్ లోభహతమతి నయి
చంపుకొంటిని నాకు శాంతి యెక్కడ నాదు, చిత్తంబు దహియించుఁ జింతవలనఁ
తే. బరితపించుచు నుంటి నే బంధుహీన, లైనవరవర్ణినులు పాప మాచరించి
నట్టినన్నుఁ జూచి యేడ్చిన నాలకింపఁ, జుమ్మ సుట్టక యుండునే నెమ్మనమ్ము. 403
తే. పతులు సుతు లన్నదమ్ములు పడుట విన్నఁ, గురుకులాంగన లెల్లఁ గొట్టుకొనుచుఁ

ప్రాణులు వాసెదరు దాన మానినీవ, ధాతుమునుఁ జుట్టుకొను మమ్మునంతనంత.

వ. మే మనన్నిరస్త్రాలమై నరకంబునం బడుట నిశ్చయంబు గావునఁ దపంబుండి శరీర
త్యాగము సేయుటయే నిశ్చయం బింక నాశ్రమవిశేషంబు లెఱింగింపు మనిన భగ
వంతుం డగు వ్యాసుండు వెండియు. 405

—వ్యాసుఁడు రాజులకు యుద్ధమున శత్రువులం జంపుట దోషంబు గాదని చెప్పుట.—

మ. ఎసఁగన్ క్షత్రియధర్మము న్నిలిపి నీ వి ప్డీవిషాదజ్వరం
బుడుగం జూపుము క్షత్రియర్షభులు వా రుర్విన్ యశఃకాయమున్
విడి వెల్గొందుచు స్వర్గమందు జని రిట్లన్ నీవేని నీతమ్ము లే
ని డిగం బోవరు హింస కిట్లు సలుపన్ లెక్కింపఁగాఁ గాలమే. 406

ఉ. దాసియనుగ్రహంబునకుఁ దావలమై యొకరుండు లేడు క
ర్మానుగతిన్ జగజ్జనుల నందఱ మ్రింగెడు హేతుమాత్రమై
కాసఁగ నయ్యె నియ్యని నొకానొకఁ డొక్కని నుక్కడంచె నన్
నానుడి దైవకర్తృకము నాఁ దలపోయుము ధర్మనందనా. 407

సీ. కర్మసూత్రంబునఁ గలుగును గాలక్రమము గాఁగఁ బుణ్యపాపములఫలము
లై సుఖదుఃఖము లఖిలజంతువులకుఁ, గాలవశంబునం గూలు నెల్ల
నిచ్చ లేమన్న నీ విట్లు హింసాకార్య, విధి కైతి వీశ్వరప్రేరణమున
జగమెల్ల యంత్రంబు సరణిఁ దిరుగుఁ గాల, మున నిమిత్తము లేక పోనఁగునుండు

తే. జనులకున్ శోకహర్షముల్ చావు పుట్టు, వులును బురుషకర్తృత్వము గలుగ దింత
యును నటైన నీమది శంక యుండె నేని, చేసికొనుము ప్రాయశ్చిత్త మాసఁ జేసి 408

సీ. వినవో దేవాసురుల్ మును శ్రీనిమిత్తము, దమలోనఁ దా రన్నదమ్ము లయ్యుఁ
గలహించి మూఁడుపదుల రెండువే లేండ్లు, కలను గావించి భూతల మి దెల్ల
క్షతజసముద్రము గాఁ జేసి రప్పుడు, శాలావృకులు నాఁగఁ జనెడు వారు
ఘనదర్పమోహితు లెనుబదియెనిమిది, వేల విప్రులు తొలివేలుపులకు

తే. సాయ మొనరించి పోరి రాసంగరమున, సురలు విప్రులతోడ నసురులఁ దనిమి
త్రిదివమును బొంది పొందిరి దర నెఱింగి, నీయెడల నిద్ది తార్క్యాణమై మెసఁగగ.

క. ధర్మము పొడవడఁగంగ న, ధర్మము వర్తింపఁ జేయుతామసులన్ దు
ష్కర్మమున నైనఁ జంపుట, ధర్మం బని రార్యజనులు తాపత్యమణీ. 410

తే. శిష్టపాలకనామము గోరి క్షితిఁ బలమున, నొకరుని జంపుటయు రాష్ట్ర మొనకుపొంకు
నెల్లకులము గూల్చుట యొప్పు నెఱిఁగికొనఁగ, నయము నర్మము నర్మము గల తెఱఁగున.

క. ధర్మ మధర్మము రీతి న, ధర్మము ధర్మంబుపగిదిఁ దలఁపఁగ వచ్చున్
నిర్మలమతిఁ దత్త్వాత్మత, కర్మతుఁ డెఱుంగ గలయుఁ గార్యము పట్లన్. 412
ఉ. నీవు సుపర్వమార్గమున నిల్చితి విట్టిరు నారకంబునన్
బోవరు గాన నీదుమనముఁ స్థిమితంబుగఁ జేసికొంచు నీ
దేవురుపాటు సూచి పరిదేవనముం బచరించుతమ్ములన్
ద్రోవది నూఱడం బలుకఁ దోఁగుము పాఁగినయోగసంగతిన్. 413
తే. తగినపని చేసి పాపమేఁ దగిలి చేసి, నాఁడ నని పాపశంకి యగానరుని నంటు
కొనును గల్మష మది వాపుకొనఁగ దుర్లభమ్ము నిష్కృతి లేదు శాస్త్రమ్ములందు.
శా. నీయం దింతయు లేదు దోష మరయన్ నీశత్రుదోషంబునన్
జేయం గల్గితి విట్టికార్యము స్పృహం జేయంగఁ బో పట్టులే
నీయాత్మన్ దురితంబుశంక యగు నేనిన్ వాజిమేధం బిటం
బ్రాయశ్చిత్తము దానిఁ జేసి శుచివై భాసిల్లు మోభూవరా. 415
మ. శతమన్యుండు మరుత్సహాయుఁ డగుచున్ సంగ్రామరంగంబులన్
బ్రతిపక్షప్రతతిన్ హరించి వరుసన్ బాపాపనోదార్థమై
క్రతువుల్ నూఱు పొనర్చి పేర్చి గరిమన్ గంధర్వులుం గిన్నరుల్
క్రతుభుజ్ముఖ్యులు పూనులుం గొలువ స్వారాజ్యంబు పాలింపఁడే. 416
చ. గెలిచితి వెల్లరాజులను గీరితిఁ గాంచితి చక్రవర్తివై
పొలిచితి విష్టులం గలిసి పోయి సపత్నులపుత్రపౌత్రులన్
వెలయఁగ వారి వారి ధరణీకలరాజ్యములందు నిల్పి పౌ
ల్పెంపమియుఁ గల్గి మ్రొగ్గనుచు నేల్కొను మెల్ల ప్రజం బ్రజం బలెన్. 417
చ. కొడుకులు లేనిచో ట్లకసి కూతుల రాణులఁ జేసి రాజ్యముల్
వడయఁగఁ జేయు మర్మిలి భవత్కృతి కెంచుచు వారితల్లు లే
ర్పడినప్రియంబునం బొదలి భర్తలఁ బాసిన వంత వాసి పోఁ
నెడఁద నిన్నున్ నుతింత్రు వగ పేగు ముదం బగు నీకు నందునన్. 418
వ. క్షత్రియర్షభా ! క్షత్రధర్మనిరతులై వీరస్వర్గ మలంకరించినవారికై వారిని పరిదేవనం
బు సేయుచుం బాడితప్పుట పాడి గాదు నాదగుహితంబు విని ధర్మతత్పరుండ వగు
మనిన యుధిష్ఠిరుం డెట్టికర్మంబులు ప్రాయశ్చిత్తార్హంబు లేకర్మంబున కెద్దిప్రాయశ్చి
త్తం బెఱింగింపు మనిన వ్యాసభట్టారకుం డిట్లనియె. 419

— వ్యాసుండు ధర్మజునకుఁ బ్రాయశ్చిత్తము లెఱింగించుట —

తే. విహితకర్మములను మాని విధినిషిద్ధకర్మముల నాచరించుచుఁ గష్టుఁడై యు

సత్యవర్తనమున నుండు జగతి నిష్కృతికి నయినపాపకార్యముల్ దెలిసికొనఁగ. 421

వ. మఱియు నాకర్ణింపుము.

తే. పూష యుదయించులఱి నిద్ర వోవువాఁడు ఘోటకబ్రహ్మచారి యైకుతిలఁగుడుచు
నస్తమయమున నిద్రించునతఁడు కునఖి, శ్యావదంతుఁడు నై పుట్టు జనవరేణ్య. 422

సీ. పరివిత్తి యగువాఁడుఁ బరివేత్తయును బ్రహ్మ, హత్యం బొనర్చినయట్టివాఁడు
దిధిషూపపతియును దిధిషువుఁ గుత్సరుం, డవకీర్ణియును ద్విజాతివధకుఁడును
బాత్రమం దిడక యపాత్రమం దిడినట్టి, త్యాగియు మాంసము నమ్మువాఁడు
సోమ మమ్మెడువాఁడు గ్రామఘాతియు గృహ, దాహకుండును గురుద్రోహకుండు

తే. పశువులం జంపువాఁడు స్త్రీవధకుఁ డన్నృత, వాది వహ్నుల విడిచినవాఁడు గురుల
నడ్డగించెడువాఁడు పాపాత్ము లగుచు, నిరయముల నొందెదరు సూవె నృపలలామ.

వ. మఱియు స్వధర్మపరిత్యాగంబును బరధర్మస్వీకరణంబు నయాజ్యయాజనంబు నభక్ష్య
భక్షణంబును శరణాగతపరిత్యాగంబును భృత్యజనారక్షణంబును రసవిక్రయంబును
దిర్యగ్యోనివధయు ననగ్న్యాధానాదికర్మాకరణంబును గోగ్రాసాదనిత్యదాననిరాకరణం
బును దక్షిణల నీయకుంటయు బ్రాహ్మణుల నిరసించుటయుఁ దండ్రితోడం గలహిం
చుటయు గురుతల్పంబు నొందుటయు ధర్మపత్నియందు బిడ్డలం గనకుంటయు నధా
ర్మికత్వంబు లోనగునవి యకార్యంబులు ప్రాయశ్చిత్తార్హంబులు మఱియు నకార్యంబు
లు వోలెఁ గానిపించియు దూష్యంబులు గానివియుం గలవు వానిం జెప్పెదఁ నాల
కింపుము. 424

క. తనుఁ జంపఁగ శస్త్రము చేఁ, గొని రణరంగమున నెదురుకొనినన్ నేదాం
తిని నైనఁ జంప నగు నం, దున దోష మొకింతయేని తొడరదు తెలియన్. 425

తే. వృత్తమున నుండి వెలియయి పృథివి నాత, తాయియగు బ్రాహ్మణునిజంపి తాను బ్రహ్మ
హత్య చేసినవాఁడు గాఁ డతని మన్యు, వతని హింసించె నని యెంచ నగు నరేంద్ర.

క. ప్రాణాత్యయమున వైద్యుల, చే నియమితుఁ డగుచు మదిర సేవించినవాఁ
డైనన్ సంస్కారార్హుఁ, డౌ నవ్వల నని యెఱుంగ నగు నవనీశా. 427

తే. తనగురునియాజ్ఞ గురుతల్పమునుగమించి, ధర జనుఁడు దోష మంద డుద్దాలకుండు
శిష్యునిం బుచ్చి పుట్టించె శ్వేతకేతుఁ, డనుసుతుం దొల్లి తార్కాణమది యనఁ జను.

తే. కామకారంబునం జేసి కాక గురువు, కొఱకు నాపదలందును వఱలఁ బోదు
స్తేయదోషము తనకుఁ గాఁ జేయ నపుడు, బ్రాహ్మణేతరవిత్తహరణముఁ జెల్లు. 429

క. పరిహాసమునఁ దనస్త్రీ, మః పరిరక్షణమునఁ జరించుపట్లన్ గురుకా

ర్యరతిఁ స్త్రీజనమందుం, బరిణయకరణమునఁ బొంకి వడయం డఘమున్. 430

క. మైనంబునఁ గలశుక్లము, పై మెలఁగిన వ్రతము సేయఁ బనిలేదు పున
ర్నామైంద్రియ మనుచుఁ ఘృత,హోమము నిష్కృతిగఁ జేయ నొప్పెడు ననఘా.

సీ. తనయన్న పతితుఁడైనను బ్రవ్రజితుఁడైన, ననుజుండు పరిణయం బగుట తగును
ధర్మసంతానంబు దయచేయు మని వేఁడఁ, బారదార్యంబునఁ బడయఁ డఘము
పశువులయెడలఁ గృపయును సంస్కారము, విధి వచించెం గానఁ బ్రథితజసుఁడు
పశుసమాలంభము వ్యర్థముగాఁ జేయ, నొప్పదు చేయుంప నొప్ప దెపుడుఁ

తే. దెలియ కర్హులు గానివిప్రులకు నిడిన, నర్హులకు నిడ కున్న దప్పుచోట లేదు
కులట వెలిఁ బెట్టి వరవుడు వలెను జూడు, మగఁడు దోషంబునం బడఁ దగఁడుజగతి.

తే. తత్వ మెఱిఁగి సోమము నమ్ముదాన దోషి,కాఁడు నరుఁడు సమర్థుఁడు కాని లెంక
విడిచినను గోవులకుఁ గాఁగ నడవిఁ గాల్చిన నిసుమంతయు దోషంబుదనరదధిప.

వ. ఇట్టివి దోషంబునఁ గానికర్మంబు లింకఁ బ్రాయశ్చిత్తంబులు నెఱిగించెద విను మని
మఱియును. 434

క. తెలియక చేసినపాపము, తలఁగించుకొనంగ వచ్చుఁ దపములఁ గర్మం
బుల దానంబుల మఱియుం, దెలిసి పొనర్చినను లేదు నిష్కృతి యచటన్. 435

సీ. బ్రహ్మచారియును గపాలపాణియును ఖ, ట్వాంగియై నిజకర్మ మాచరించు
కొను చనసూయుఁడై కుడిచి భైక్ష్యంబొక్క, పూటన తనతప్పుచాటు కొనుచు
స్థండిలశాయియై సంచరించినబ్రహ్మ, హత్య పండ్రెండేండ్ల కంతరించు
వేదపారాయణవిధిఁ దీర్చుచు నవాక్చి, రుఁడయి నూఱామడ నడఁచె నేని

తే. గోవులను బ్రాహ్మణులఁ గొల్చికొనుచుఁ దనదు,నిల్లు మంచముకుంచము నెల్లధనము
వేదవిదుఁడైనవిప్రుని వెదకి తెచ్చి, యిచ్చినను బ్రహ్మహత్యాఘ మెడసిపోవు. 436

తే. కృచ్ఛ్రచాంద్రాయణవ్రత మింత విడక, కృచ్ఛ్రభోజి యగుచు నుండు నేని బ్రహ్మ
హత్య గావించినపురుషుం డాఱువర్ష,ములకుఁ బాపంబునం బాసి పూతుఁడగుచు.

క. ప్రతినెలయుం జాంద్రాయణ, మతులితగతిఁ జేసి యేడమాసముల లెక్కన్
వ్రతియై మెలఁగుచు నుండెడు, నతఁడు త్రివర్షములలోన నఘముం బాయున్. 438

క. మాంసాశియైన యేనిన్, దోసముఁ బెడబాయు నేఁటితో నతినిష్ఠన్
మాసాధికకాలం బుప, వాసం బుండిన, నఘంబు వాయు మనుజునిన్. 439

ఉ. ఆవిధ మైనదోషమున కాకరుఁడైన మహీశుఁ డశ్వమే
ధావభృథంబునందు జల మాడినమాత్రన ఘాతకల్మషం

డై వసుధం బవిత్రుఁ డగు నంచు వచించు శ్రుతుల్ స్మృతుల్ పురా
ణావళు లిందు సందియము నందగఁ లే దెడ మింత యేనియున్. 440

తే. యుద్ధమున బ్రాహ్మణార్థమై యొడలు విడిన, గోశతసహస్ర దానము కొసర కిడిన
బ్రహ్మహత్యాఘమునఁగడుంబడలుచడెడు,వాఁడుపూతాత్ముఁడగుననిపలుకుశ్రుతులు.

వ. మఱియు నిరుపదియైదువేల కపిలధేనువుల నొసంగిన సర్వపాపంబులుం బాయుఁ
బ్రాణసంశయ సమయంబున సవత్సం బగుగోసహస్రంబు దరిద్రుఁ డగు విప్రున
కిచ్చినజనుండు కిల్బిషంబులం బెడఁబాయు నాఱుకాంభోజంబుల విప్రసాత్కృతంబు
గావించినవాఁడు పాపంబులనుండి ముక్తుం డగు. 442

క. ధరణీసురునిమనోరథ, మరసి యొకానొక్కకాలమునం దేని శివం
కరుఁడై పూనరిచి దానిం, బఱకీర్తన సేయ కున్నఁ బాయు నఘంబుల్. 443

సీ. సురను సేవించిన దురితంబు దానిని, దహనవర్ణము చేసి త్రావి యుండె
తన్మోధరాగ్రమునుండి మరుభూమిఁ బడి యుండె, జ్వలనంబులోఁ జొరఁబాఱియుండె
నొగి మహాప్రస్థాన మొనరించి యుండె భూ, దాతయై యుండెఁ బో, దఱుమ వచ్చు
బాపఁడైనన్ బృహస్పతిసవంబున వేల్చి, తద్దోషమును బాసి దాని మరల

తే. నంటకుండిన బ్రహ్మసభాంతరప్ర, వర్తి యయ్యెడు గురుతల్పి వహ్నితప్త
సుగునయఃప్రతిమం గాని యశ్మవిగ్ర,హమునుగానికౌఁగిటఁజేర్చియఘము వాయు.

మ. తన శేఫం బసిధారఁ గోసి కొని చేతం బూని మిన్వంకఁ గ
న్గొనుచుం బోవుచుఁ గొంతలోనఁ దనువుం గోల్పోయినం బిమ్మటన్
ఘనుఁ డాచార్యునిభార్యతోఁ గలియుటం గన్నట్టునప్పాతకం
బును బోకార్చుకొనంగఁ జాలు జనుఁ డోభూమండలాఖుండలా. 445

తే. మానినులు తప్పుజేసిర యేని నియమ, మొసఁగ నిష్ఠాగరిష్ఠలై యేఁడు కంచు
వ్రత మొనర్చినఁ దద్దోషతతి నొఱంగి, పుణ్యపద మందఁ గలరు విభూతులెసఁగ.

సీ. అశుభకర్మ మొనర్చినట్టేఁడు సర్వస్వ, మార్యుల కిడి యే మహావ్రతంబు
నంది యే గుర్వర్థ మని మొనం దెగి యే వి,ముక్తుఁ డౌఁ దద్దోషయుక్తి నుండి
యసత్యత మాడియు గురు నడ్డగించినతప్పు, తత్ప్రియం బొనరింపఁ దలఁగి పోవు
నవకీర్ణి యగు నేని యాఱుమాసములు గో, చర్మమునన్ వ్రతాచరణ మొప్పఁ

తే. బరధనమ్ము హరించియుఁ బరసతి కప, చార మొనరించియుం గొన్న భూరికలుష
మొక్కవర్షము వ్రతి యయి యుండి వారి, ధన మొసంగి సేవించినఁ దరలిపోవు.

క. పరివేత్తయుఁ బరివిత్తియు, పరుసం బదరెండునాళ్ళు వ్రతనిష్ఠ మెయిన్
బరివర్తించుచుఁ గృచ్ఛ్ర, చరణంబున దోష మీఁగఁ జాలుదు రనఘా. 448

ఉ. స్త్రీలకు దోష మంటుకొని చేష్టడిపో యిన వెన్నఁడున్న నాఁ
జాలవు శాస్త్రముల్ కుమపు సన్నగిలన్ నియమవ్రతంబునన్
నాలుగుమాసముల్ గడపినం దమదోషము లెల్లఁ బంచబం
గాళముగా విశుద్ధగతిఁ గ్రాలెద రందురు ధర్మవిద్వరుల్. 449

మ. అహఁ గా దంచుఁ దలంపఁ దే కొమరితో నజ్ఞానసంపత్తిఁ బొం
దగనై నట్టియఘంబు ముట్టియునయంతం బోవు స్త్రీజాతికిన్
భగవత్కల్పిత మారజస్సు పరికింపం గాంశ్యపాత్రాళికిం
దగుభస్మంబు తెఱంగునన్ బ్రవిమలత్వం బారఁ గల్గించెడిన్. 450

సీ. అంఘ్రిజోచ్ఛిష్టకాంశ్యము గోసురాఘ్రాత, పాత్రము గండూషపాత్రి మెపుడు
పంచగవ్యము మృత్తు భస్మ మామ్లము జలం, బగ్ని యనుపదింట నందు శుద్ధి
బ్రహ్మధర్మము నాల్గు పదము లొక్కొక్క కాలు, క్షత్రియాదుల కెన్న సన్నగించు
గురులఘుత్వము లిట్లు పరఁగుచుండెడిని బ్రాయశ్చిత్తము లొనర్చు నవసరముల

తే. వృక్షములను దిర్యగ్జంతు విసరములను ద్రుంచినం ద్రిరాత్రములు మారుతము మెసఁగి
తనపొనర్చినకర్మము వినిచి కొనుచు, వ్రతము గావించి దోషము వాయు నరుఁడు.

సీ. నరుఁ డగమ్యాగమన మకార్యకరణంబు, సలిపిన నార్ద్రవస్త్రము ధరించి
భస్మ మలందియు భస్మమున శయించి, నియమితాహారుఁడై నిష్ఠతోడ
మౌనిగతి నొందు మాటలాడక నిరాధార దేశ మ్మగుస్థండిలమున
నుండి సావిత్రి విధ్యుక్తదినంబులు, జపియించి యజ్ఞానజంబు లైన

తే. పాపములనుండి విడివడి ఫలము నొందుఁ, బుణ్యపాపము లధికతం బొంది యొండొ
కంటి నడఁచుఁ గావున శుభకర్మములను, హెచ్చుగాఁ జేయనగుఁ బాపమెగురుపోంటె.

వ. ఈచెప్పినప్రాయశ్చిత్తంబు లజ్ఞానకృతంబు లగునభక్ష్యభక్షణాదులం బునీతులం గావింపుం గాని జ్ఞానకృతంబు లైనమహాపాతకంబులకుం గా నేరవు జ్ఞానకృతపాతకం బత్యంతంబు దానిప్రాయశ్చిత్తంబు నత్యున్నతం బుండవిమ్ము రాజధర్మమ్మునం జేసి నీచేసినది శిష్టాచారంబు గాని దుష్టాచారంబు గాదు దీన నీకు దోషంబు రాఁ బోవదైన నీచిత్తంబు ఘృణాయత్తం బగు నేని యశ్వమేధాదులం జేసి ప్రాయశ్చిత్తంబు గావించు కొందువు గాని మంకుండవై మఱిందం దలంచుట యనార్యజుష్టం బనిన యుధిష్ఠిరుం డించుక చింతించి చింతితార్థచింతామణీ! భక్ష్యంబు లభక్ష్యంబులు పేయంబు లపేయంబులు పాత్రంబు లపాత్రంబు లెట్టివి యెఱిఁగింప ననుగ్రహింపు మనిన నాఁ గాత మని పారాశర్యుం డీయర్థంబున నొక్కయితిహాసంబు గల దాకర్ణింపు మని యిట్లనియె. 453

—వ్యాసుండు పాత్రాపాత్రలక్షణంబు లెఱింగించుట—

తే. వ్రతపరాయణుఁ డనుబుషిప్రవరుఁ డొక్క, యెడను స్వాయంభువమనువుకడకు వచ్చి
యెట్టియన్నము పాత్ర మేమేతకంబు, వరము కార్య మకార్య మే దరయఁ జెపుమ. 455

వ. అని యడిగిన నతనికి వారికిఁ జెప్పఁదొడంగె విను మని యిట్లనియె.

సీ. ఉపవాసము జపంబు హోమంబు లొనగు, నవి యెట్లు దేశకాలానుకూల
నక్షత్రయోగాను బుణ్యాపగల్ గిరులు, రత్నాదికస్నానము వాజ్యపూజ
నము సువర్ణప్రాశనము దేవతాలయ, గమనము విమలత గలుగఁ జేయు
సామాన్యపాపముల్ సమయు నందున గర్వ, మైన పరమహాపుణ్య మాచరించి

తే. తప్తకృచ్ఛ్రవ్రతము త్రిరాత్రములొనర్చి, పూతుఁడయి దీర్ఘమౌ యువ్రతుఁ బొందు నిజ్య
దాన మధ్యయన మహింస తపము సత్య, రక్షణ మక్రోధమును ధర్మలక్షణములు.

శా. ప్రాణాపాయమునందు హింసయు ననత్యస్తేయముల్ ధర్మసం
త్రాణస్థానము లెన్న ధర్మము నధర్మంబుం బ్రవర్తించుచో
రాణ న్మించి యధర్మధర్మఫలముల్ ప్రాప్తింపఁగాఁ జేయు నీ
క్షోణిం గార్యవిశేషపద్ధతుల నుత్కృష్టస్థితిం గాంచుచున్. 457

క. దైవమ్మును శాస్త్రమ్మును, జీవము జీవనముఁ గోరి చేరికఁ గర్మం
బీవసుధ నశుభ మైనం, గావించున్ శుభఫలంబుగతి నావసుధన్. 458

తే. అయిన లోకాపవాదభయంబు పొందె, నిట్టిపట్లఁ బ్రాయశ్చిత్త మెనఁగుఁ జుండు
నెఱిఁగి చేసినయట్టి దుష్కృత్యములకు, నిష్కృతులరీతు లెఱిఁగింతు నే వినుండు.

తే. క్రోధ మోహంబులం దెచ్చుకొన్న దోష, ములు మనఃప్రియాప్రియములై వెలసిన నవి
భాసురాగమవిధి నుపవాసములను, మంత్రగవ్యౌషధంబుల మలఁగిపోవు. 460

సీ. అధిపదండోత్సర్గమం దేకరాత్రోప, వాస మాత్మవిశుద్ధి వఱలుఁబొందె
మూఁడు నాళ్లుపవాసమును బుత్రమిత్రము, ఖ్యాతుయుంబులను శస్త్రాదికమునఁ
జావంగ నెంచియుఁ జావకుండినఁ ద్రిరాత్రోపవాసంబు శాస్త్రోక్త మయ్యె
జాత్యాశ్రమవతాపసద్ధర్మముల దిగ, విడిన నిష్కృతి లేమి విదిత మగును

తే. ధర్మసంశయకార్యము దవిలినపుడు, పదుగురు ధర్మపాఠకులు పదుగురు వేద
శాస్త్రవిజ్ఞులు చెప్పినసరణి యెల్ల, ధర్మశాస్త్రము నాఁ జెప్ప ధరణి నొప్పు. 461

తే. తినఁగ రాదెద్దుఁ జెదపుర్వుఁ దేనెయీఁగ, విరిగి యతివన పాలసుత్తో విడిసచేప
గచ్ఛపము గాక నలుకాళ్లు కలుగుకప్ప, లోని వగుజలజంతువు ల్భాసురాంతకు. 462

తే. పాలయును జక్రవాకము బకము నిరు, కాకియును నీరుకోడియుఁ గాకి యంచ
గ్రద్దయును డేగయునునులూకమును విప్రుఁ, డైనవానికి భక్షింపరాని పదయు.463

వ. మఱియు దంష్ట్రలు గలక్రవ్యాదంబులును జతుష్పాత్తు లగుపక్షులు నిరుగడ దంతం
బులును నలుకోఱలు గలజంతువులును బ్రాహ్మణాభక్ష్యంబులు. 464

సీ. గొఱ్ఱియపాలును గుఱ్ఱముపాలును, గాడిదపాలును ఱేడిపాలు
నీనినపదినాళ్లలో నావుపాలు మానిసిపాలు లొట్టియ లొసఁగుపాలు
ద్రావంగ నొప్పదు బ్రాహ్మణునకును ఱేని, తాన్నము సూతికాన్నాదికము
రాజునన్నము శూద్రకునియన్నము సువర్ణ, కారకునన్నము కాదు మెసవ

తే. రాజునన్నము హరియించుఁ దేజ శూద్రు,నన్నము హరించు వర్చస్సు నవని స్వర్ణ
కారునన్న మపహరించు ఘనతరాయు, వని వచింతురు తత్త్వజ్ఞులైనవారు. 465

వ. అని మఱియును. 466

ఆ. పతియు సుతులు లేనిపడఁతియన్నము నిజ,సతికిఁ బతినిఁ గూర్చుజనునియన్న
మాడి పాడి బ్రదుకునతివయన్నము విట్టు,నకును నింద్రియమ్మునకును సమము. 467

సీ. వడ్డి కిచ్చి బ్రదుకువానియన్నము స్త్రీజి,తాన్నము సోమము నమ్మికొనిన
వానియన్నము లోభివానియన్నము వేల్మి, యగులోన దీక్షితువన్న మనతి
యన్నము రజకునియన్నము చర్మకా,రకునియన్నము చికిత్సకునియన్న
మునుఁ దక్షునన్నము పురిఁ గాచువానియ,న్నము గణాన్నము కదన్నంబును మఱియు

తే. నన్న యుండంగఁ బెండిలి యైనవాని,యన్నమును వందియన్నము నతురతుని
యన్నమును వాసుహస్తాహృతాన్నముతొలి,నాఁటియన్నమభోజ్యముల్ నానెఱుగుఁడు.

మ. కలుతోఁ జెల్మిఘటిల్లఁ దెచ్చినది పెక్కం డ్రింటిలో నున్నవా
రలు మెక్కం దుది నిల్చియున్నదియు సారం బెల్లఁ జల్లార గో
ల్గల దుచ్ఛిష్టము నైనయన్నము నొసంగన్ రాదు పాల్పిండి కూ
ర లభోజ్యంబు లగున్ జిరస్థితము లై ప్రాకంది చొల్లవ్వటన్. 469

క. కృసర మపూపంబును బా, యసమును మాంసమును దమకు నైవంటకముం
బొసఁగించుకొని యథేచ్ఛఁ, మెసఁగుట దోషంబు నిర్నిమిత్తము గాఁగన్. 470

తే. ప్రతిదినంబును వేల్పులఁ బితల ఋషుల, నతిథుల భజించి వారికిఁ గుతుక మలరఁ
బెట్టి గృహమేధియగువాఁడు వెనుకఁ దాను, దనకుటుంబము భుక్తికి మొనయువలయు.

తే. ప్రవ్రజితుఁ డైనభిక్షు వేపగిది మెలఁగు, నట్లు గృహమేధి దారపుత్త్రాదిసహితుఁ
డై స్వగృహమందు మెలఁగియు నార్యధర్మ, నిరతుఁ డగునేని సద్గతి నరుగఁగలఁడు.

సీ. మఱియుఁ జెప్పెద దానమహిమంబు వినుఁడు య, శముఁ గోరి దానంబు సలుపరాదు
తన కుపకారంబు నొనరించు నని కాని, భీతునం గాని కావింప వితయు
నృత్తగీతంబులు నేర్చినవాఁడును, బరిహాసకుఁడు దుష్టవర్తనుండు

మత్తుఁ డున్మత్తుఁడు మాటలు రానివాఁ, డంగహీనుఁడు కుత్సితాధముండు
తే. వామనుఁడు దుష్కులభవుండు వ్రతవిహీనుఁ, డనుపనీతుఁడు వేదంబు విననివాఁడు
వికృతగాత్రుఁడు గాయత్రి విడిచినవాఁడు, దానము గ్రహింపఁ బాత్రతఁ బూనరెపుడు.
తే. దానము ప్రతిగ్రహంబును గానఁ బడి య, పాత్రకల్పితగతి కయి ధాత్రి దాత
కును బ్రతిగ్రహీత కనర్థజనకములుగఁ, బరిణమించెడు నని శ్రుతుల్ పలుకుచుండు.
ఉ. ఖాదిరముఖ్య శిలాఫలకఖండమునుం గొని సాగరంబునం
దీఁదఁ దలంచునట్టిజనుఁ డెట్టిగతిం గలఁ డౌనో లోకమం
దేదియుఁ జూడ కల్పులకు నిచ్చినదాన మనర్థహేతువై
కాదన కాప్రదాత కొసఁగం గల దయ్యెడు నారకవ్యథల్. 475
తే. పచ్చికట్టెలు వేయ నేపగిది వహ్ని, వెలుఁగఁ జాలక చల్లారి వితగ నగునొ
శ్రోత్రియత లేక దానముఁ జూఱగొన్న, పురుషుఁ డాగతి మానఱిపోవు నరయ. 476
తే. పుఱ్ఱెలోఁ గుక్కతిత్తిలోఁ బోసినట్టి, పాలు నీళ్ళును బోలె నపాత్రదాన
మున్నతిం జెడి నింద్యమై యోగుఁ గూర్పుఁ, గాన దానపాత్రమ్ములఁ గాంచు టొప్పు.
క. దీనుం డార్తుం డనుచుఁ, హీనులకుం గరుణఁ జేసి యిడ రా దాప్తుం
డైనం బ్రత్యుపకృతి గై, కొనన్ దాన మైనఁ గువిధిం బడెడిన్. 478
ఆ. తలఁప దారుమయము దంతిచర్మమయంబు, మృగము వేదరహితుఁ డగుద్విజుండు
నను త్రయంబు నామమునక కాని మఱొక్క, గతికిఁ గాని దనుచు మతి నెఱుఁగుమీ.
ఆ. స్త్రీలలోన షండుఁ డాలఁబోఁ బట్టిన, మొద్దు పశులందు నెఱకలు వెగు
పక్షి వోలె భూసురవర్యులలో శ్రుతు, లరయకున్న వాఁడు వ్యర్థుఁ డెన్న. 480
తే. గ్రామధాన్యము శూన్యమై క్రాలునట్లు, నిర్జలం బగుకూపంబు నెగడునట్లు
వెల్మిడిఁ మంత్రముల నేయి వేల్చినట్లు, వ్యర్థమయి పోవు మూర్ఖునియందు నీఁగి. 481
తే. హవ్యకవ్యవినాశన మాచరించి, త్రిదశవల్లభులయుఁ బితృదేవతలయు
నోళ్ళఁకుఁ గొసెనలు వేసి క్రొళ్ళుదాటు, మూర్ఖు లుత్తమలోకముల్ పొంద గధిప.
వ. అని చెప్పి యప్పరాశరాత్మజుం డిప్పగిదిం గలచొప్పెల్ల నీకుం జెప్పఁ గలంతవట్టు చెప్పితి నీ వెప్పాటం బాటి గావింతువో యనిన నక్కౌంతేయాగ్రజుం డమ్మునిసత్తమా! నీయుపదేశం బత్యుత్తమంబు సంతసించితిం గాని ధర్మాచరణంబునకును రాజ్యంబునకును బరస్పరవిరుద్ధార్థంబ యని తలంచితి నాకు ధర్మమార్గంబున విజయం బగుదెంచునట్లు లనుగ్రహించి చాతుర్వర్ణ్యధర్మంబులు నాపద్ధర్మంబులు నెఱింగింపు మనుటయు నమ్మునివరుండు సర్వజ్ఞుం డగునారదు నిరీక్షించి మించినవేడ్క నమ్మహీపతి నభినందించుచు ని ట్లనియె. 483

—వ్యాసుండు భీష్మునికడ ధర్మంబు లెఱుంగు మని ధర్మజునకుం జెప్పుట—

చ. మనుజవరేణ్య! ధర్మము సమగ్రముగా విన నెంచుబుద్ధిమైఁ
దనరినవాఁడ వేఁ గురుపితామహుపాలికిఁ బొమ్ము తండు నీ
మనమున నున్న ధర్మములమార్గములం దగుసందియంబు డీ
ర్చను నినుఁ దేర్పనుం గల ప్రభావసమగ్రుఁడు విజ్ఞుఁ డారయన్. 484

చ. అతఁడు జగత్త్రయప్రథితమై తగుగంగకుఁ గన్నబిడ్డఁ డై
క్షితిపయి నైనవాఁ డఖిలసేవ్యుఁడు భవ్యుఁడు శక్రముఖ్యులన్
గ్రతుభుజులన్ బృహస్పతిముఖత్రిదివౌకసులన్ భజించి త
త్ప్రతిగతధీవిశాలుఁ డయి ప్రస్తుతి కెక్కినవాఁడు చూడఁగన్. 485

సీ. రాజనీతిసవిస్తరంబుగ శుక్రుని, వ్యాసులతోఁ జదివినపండితుండు
చ్యవనవసిష్ఠాదిసంయమీంద్రులకడ, సాంగశ్రుతులు నేర్చినట్టిదిట్ట
బ్రహ్మమానసపుత్రుఁ సజ్జనధ్యాత్మత, త్వంబెల్లఁ గనినవిద్వన్మతుండు
ఘనుఁడు మార్కండేయమునిచెంత యత్యాద్యఖిలధర్మముల నెఱింగినఘనుండు
తే. పరశురామసుత్రాములకరుణ వడసి, పరమశస్త్రాస్త్రవేదియై పరఁగినప్ర తి
భాంచితుఁడు మర్త్యుఁ డయ్యు ని ప్లాత్మవశము, నందు మృత్యువు నరికట్టినట్టిమేటి.

ఉ. ప్రత్యహ మమ్మహామహునిపాలికి బ్రహ్మవిదుల్ మహామునుల్
సత్యవచస్కు లెల్లకడలం గలవారలు వచ్చి పోదు రా
నిత్యవినిర్మలుం డెఱుఁగ నే నను ధర్మము ముజ్జగంబులన్
సత్యము గాఁగ లే దనుచు సాక్ష్య మొసంగుదు మేము నీమునుల్. 487

ఉ. అంతటిధర్మతత్త్వవిదుఁ డన్యుఁ డెవండును గాన రాఁడు నీ
కెంతయుఁ గూర్చు నీ వడిగితేని వచించెడు నెల్లధర్మముల్
చింత లి వన్నియు న్విడిచి చెచ్చెర నచ్చతురాస్యుఁ జేరి నీ
స్వాంతము చక్కఁ జేసికొను మాతనిమై నుసు రాదు చుండఁగన్. 488

వ. అని చెప్పిన నప్పార్థివోత్తముం డే నిత్తఱి రాజ్యలోభంబునం జేసి పూజ్యు లగు
జ్ఞాతుల నెల్లం ద్రెళ్ళనేసిఁ సర్వలోకాపచారంబు గావించుటయ కాక లోకోత్తరుం
డగు నమ్మహాత్మునిఁ గృత్రిమసమరంబునఁ గూలనేసితి నిట్టిచెట్ట నగునే నా దేవవ్రి
తునిచెంత కెట్లుపో నేతు నేమొగంబు పెట్టికొని ధర్మంబు లుపదేశింపు మని ప్రార్థింప
నేతు నక్కటా! యని పొక్కుచు నక్కౌంతేయాగ్రజుం గాంచి గదాగ్ర
జుండు లోకానుగ్రహతత్పరుం డై యిట్లనియె. 489

తే. ఎంతలెంతలు చెప్పిన యేని వినియు, వగపు విడ నాడ వింత నిర్బంధ మేటి

కిట్లు తగదయ్య భగవంతుఁ డిమ్మహాత్ముఁ, డానతిచ్చినమచ్చునం బూని నడుము.

శా. ఘస్మాంతంబున మేఘునిం బలె నినుం గాంక్షించి నీభ్రాతలున్
ధర్మజ్ఞుల్ ధరణీసుపర్వులును యుద్ధంబందుఁ జా కుర్వరన్
బేర్మిం గాంచినరాజులుం బ్రజలు నీపృథ్వీపతిత్వంబునన్
శర్మం బందఁ దలంచి రెల్లర దయాస్వాంతంబునం దేల్పవే. 491

వ. ఈవ్యాసభట్టారకుండు చెప్పినచొప్పున సుహృద్వరు లగునస్మదాదుల మనోరథంబు దీర్పు మనియె నిట్లు కృష్ణుండును కృష్ణద్వైపాయనుండును నారదదేవస్థానులును మున్నుగాఁ గలమహామును లెన్నియో చందంబులఁ బొందుపడం జెప్పిన నప్పాండుపుత్త్రాగ్రజుం డెట్టకేలకు నిజస్వాంతంబున శాంతిం గలుఁగఁ జేసికొని సర్వలోకహితార్థంబు రాజ్యపాలనాయత్తం బైనచిత్తంబు నివేదించి ఋక్షపరివృతుం డగు చంద్రుండు వోలె సర్వజనపరివృతుం డై దేవభూదేవార్చనంబు గావించి హస్తిపురప్రయాణోన్ముఖుం డై ధృతరాష్ట్రుం బురస్కరించుకొని బ్రాహ్మణాశీర్వాదనాదంబులును వందిమాగధస్తోత్రంబులుం బోరుగలుగఁ బదియాఱుపాండురమహోక్షంబులం బూన్చినశుభ్రకంబలాజినసంవృతమహారథం బమృతమయరథంబు సోముండు వోలె నధిష్ఠించె నప్పుడు. 492

—ధర్మరాజు సపరివారంబుగా హస్తిపురికిం జనుట—

సీ. పదియాఱునట్టల పగ్గంబు లిరుగేల, నొగి నూనిపట్టె వృకోదరుండు
తారకాకీర్ణ మాధవశోభ్ర మనిపించు, నాలవట్టము వట్టె నర్జునుండు
వెన్నెలన్ బురుడించువింజామరను వీచి, రుభయపార్శ్వంబుల నుండి కవలు
నలువురు తమ్ము లి ట్లలరఁ గైసేయ ర, థస్థుఁ డై వెలుగొందె ధర్మజుండు
తే. వెనుక శ్వేతాశ్వరథమెక్కి చనె యుయుత్సుఁ, డవల శైబ్యసుగ్రీవాఢ్యమైన హేమ
మయరథమునం దధిష్ఠించి మాధవుండు, సాత్యకియుఁ దా ననుసరించె సంతసమున.

సీ. ఆందోళికారూఢు లై ధృతరాష్ట్రుండు, గాంధారి యగ్రభాగమునఁ జనిరి
కుంతియుం గృష్ణయుఁ గురుకులాంగనలు వె, న్వే యందలము లెక్కి వెనుకచక్కి
విదురరక్షిత లయి వెడలిరి చతురంగ, బలములు వెన్నంటి బలసి నడచె
వందిమాగధులు కైవారముల్ చదివిరి, పిక్కటిల్లి రవంబు దిక్కు లంట
తే. బ్రాహ్మణాశీర్నినాదముల్ ప్రబలె వివిధ, తూర్యములు మ్రోసె నెల్లెడఁ దుష్టపుష్ట
జనసమూహముల మర్యో ని ట్లొనరియుండఁ, దత్ప్రయాణ మఖిలజనోత్సవముఁ గూర్చె.

వ. ఇట్లు పయనం బై పాండవాగ్రజుండు చనుదెంచుట చారులవలన విని కరిపురంబునం గలపౌరు లెల్లరు నగరంబు సలుగడం బన్నీటఁ గలయంపి గూర్చియుఁ గస్తూరి గోము

ఖంబు దీర్చియుఁ బండుముత్తియంబుల మ్రుగ్గులు వెట్టియు నానావిధమాల్యంబులఁ
దోరణంబులు గట్టియుఁ బతాకాశతసహస్రంబులు ప్రతిష్ఠించియు నగురు ధూపం
బుల ధూపితంబు గావించియు నిష్టగంధగంధాదిచూర్ణంబులం జల్లియు ద్వారంబుల
వారిపూర్ణస్వర్ణకుంభంబులం బ్రతిష్ఠించియు ననేకవిధంబుల నలంకరించి గంధపుష్పా
క్షతలం గొని కన్యాజనంబు ముంగల నిలువ ముంగిళ్ళ నత్యుత్సాహంబున మహో
త్సవంబు ప్రకటించుచు దర్శనలాలసులై వేలకొలంది రాజమార్గంబునం దుభయ
పార్శ్వంబుల మూఁగికొని యుండి రంతఁ గొంతటిలోనఁ గౌంతేయాగ్రజుండు పుర
ప్రవేశంబు గావించి ఘంటాపథంబుఁ జేర వచ్చుటయు నప్పుడు. 495

క. పున్నమచందురు పొడుపున, నున్నత మగునుదధివోలె నుప్పొంగెఁ బ్రజా
భ్యున్నత మై సంపత్సంపన్నం బగు రాజపథము బహువిధగతులన్. 496

వ. అప్పు డప్పురంబునం గనపుణ్యాంగన లాధర్మరాజభీమార్జుననకులసహదేవులం గాం
చి పాంచాలిం బ్రశంసించుచు. 497

మత్త. ధన్యురాలవు మాన్యురాలవు తల్లి! యేభవమం దసా
మాన్య మైన వ్రతంబు చేసితొ మారసుందరమూర్తులన్
మాన్యులన్ జగదేకవీరుల నాథులం బడయంగ నై
తన్య మేల వచింప గౌతమి యట్టిదానవు నీ విలన్. 498

వ. అని ప్రశంసించుచు నీరాజనంబు లొసంగ నంగీకరించుచు ధర్మజాదు లల్లనల్లన రా
జమార్గం బతిక్రమించి రాజగృహంబు సేరం జనుదెంచునంతఁ బ్రకృతిప్రధానజనంబు
ధర్మరాజు నుద్దేశించి. 499

మ. ప్రతిపక్షున్ నియతిన్ జయించితివి ధర్మంబుం బ్రదర్శించుచున్
బితృపైతామహ మైన రాజ్య మిది ప్రాపించె న్నిను న్వొండియున్
శతవర్షంబుల దాఁక సర్వసుఖముల్ సంధిల్ల స్వారాజ్యమున్
శతమన్యుం డటు లేలుకొమ్ము ప్రజలన్ సౌఖ్యాబ్ధిఁ దేలించుచున్. 500

వ. ఇట్లు రాజకులద్వారంబున మంగళాభిపూజితుండును బ్రాహ్మణాశీర్వాదవిరాజితుం
డును నై ధర్మరాజు రథావతరణంబు చేసి తమ్ములతో దేవరాజగృహోపమం బగు
నభ్యంతరంబున కరిగి గృహదేవతలం బూజించి వచ్చి ధృతరాష్ట్రధౌమ్యులం బుర
స్కరించుకొని వేదవిదు లగుభూదేవుల గోహిర్యరత్నవస్త్రాదులం బూజించి సేవిం
చె నయ్యవసరంబునఁ బుణ్యాహఘోషంబును శంఖనిస్వనంబును జయజయధ్వానం
బును మిన్నుముట్టియుం గొంతవడికి నిశ్శబ్దం బయ్యె నయ్యెడఁ జార్వాకుం డనురా
క్షసుండు దుర్యోధనసఖుం డగువాఁడు భిక్షుకరూపం బవధరించి త్రిదండియు శిఖి

యునై బ్రాహ్మణసహస్రసమావృతుండై చూపట్టి విప్రుల నామంత్రింపక విగత సాధ్వసుండై యెల్లవారు విన నజాతశత్రు దిక్కు మొగంబై యుచ్చస్వరంబున ని ట్లనియె. 501

—చార్వాకుం డను రాక్షసుండు బ్రాహ్మణులనిగ్రహంబునఁ జచ్చుట—

క. ఈవిప్రులు తమలోఁ దా, రీవిధమునఁ దలఁచి నీకు నెఱిఁగింపఁగ నన్
గావించు కొనిరి ముఖముగ, నావలనన్ దానిని న్వినం దలఁపు మిటన్. 502

శా. ఛీ ఛీ నీవొక రాజమాత్రుఁడవె నీచిత్తం బఘాయత్త మీ
నీచార్థంబున కాస చేసి దురము న్నిర్మించి వంశంబు నా
నాచార్యాదులతోడ జ్ఞాతివధ మత్యాసక్తిఁ గావించి పా
పాచారుం డయి తిట్టనీమునికి యేలా? చచ్చినం బోవదే. 503

క. ఉత్తముల నెల్లచుట్టలఁ, దుత్తునియలు చేసి వాసి దోఁకొన దొరవై
నెత్తురుకూఁటికి నాసం, జిత్తంబునఁ జేసితట్టె సిగ్గతి ఛీఛీ! 504

క. అని పలికెడుచార్వాకుని, విన నోపనిసుడుల వెల్ల విని విప్రులు నె
మ్మనములు దిరుగుడువడ వా, నినిఁ గనుచున్ మ్రోడువాఱి నిలిచిరి కడలన్ 505

వ. ధర్మనందనుండును డెందంబున సిగ్గును భయంబునుం గదురఁ గంపితగాత్రుఁడై యేమి యు మాటలాడ నేర కూరకుండి యెట్టకేలకు మోడ్పుగేలు ఫాలంబునం గీలించి బ్రహ్మబృందంబుం దిలకించి యి ట్లనియె. 506

తే. ప్రణతుఁడను వేఁడుచుంటి నో బ్రహ్మలార, నను క్షమింపుఁడు వ్యసనంబుననుదపించు
స్వాంతమున నున్నవాఁడ నాయందుఁ దప్పు, యగుననేధిక్కరింపక తగును బ్రోవ.

వ. అని యవనతాననుండై సవినయంబుగఁ బ్రార్థించుచున్నంత డిల్లపడి బ్రాహ్మణు లెల్లరు నేకముఖంబై. 508

మ. ఇవి మామాటలు గావు మే మెఱుఁగ మేయే కర్మముం దుర్మనుం
డెవఁడో వీఁ డిపు డస్మదీయములు గా వీదుష్టవాక్యంబులన్
దివిషన్నాథునియంత వానికడ వాదించెన్ భయం బేచ కి
య్యవి పో నిమ్ము శివమ్ముతోడిసిరి నీకౌఁ గాత మోభూపతీ. 509

వ. అని యాశ్వాసించి పలుకుచు నమ్మహాత్ములు నిజతపోమాహాత్మ్యంబున నైనదివ్యదృ ష్టిం జేసి శాంబరీభిక్షుకుం డగు రాక్షసుం దెలిసికొని తేఁడా వీఁడు దుర్యోధనస ఖుం డగుచార్వాకుం డను రాక్షసుండు వానిమఱికి హితం బాపాదించువాఁడై పరి వ్రాజకవేషంబున వచ్చి యిట్లు ప్రల్లదంబులు వలికె ధర్మాత్ముండవగు నిన్నెఱింగి మే మేల పల్కుదుము యీయథముని వచనంబులం జేసి నీచిత్తంబునఁ జింత దక్క

కురుకులరాజ్యసింహాసనం బధిష్ఠించి నీవల్పాయు తమ్ములతోడం గల్యాణానంద
సుఖం బనుభవింపు మని యభినందించి పలుకుచు నలుకం జేసి హుంకరించుచుఁ
జార్వాకుం దిలకించునంతలోన. 510

చ. పిడుగులవేఁడి కీ డయినవిజ్ఞుగుచూపులు హుంకృతిధ్వనుల్
గడువడి రాక్షసాధముని కాయముపైఁ బడునంత వాఁడు పెం
బిడుగునఁ గూలుచెట్టనఁగ బిట్టులి లేర్పడఁ జచ్చి నేలపైఁ
బడియె మహీసుపర్వులతపఃప్రభవప్రతిభాప్రభావతన్. 511

వ. అట్లు కూలినవానిం గని యానందించుచు నజాతశత్రుండు దానుం దమ్ములును
బ్రాహ్మణప్రభావంబున కభినందించి వారి నెల్లం బూజించి యంపిపుచ్చి రప్వ డప్వం
డరికాక్షుండు భూసురప్రభావం బగ్గించుచు ని ట్లనియె. 512

సీ. చార్వాకుఁ డనెడు రాక్షసుఁ డాదియుగమున, బదరీవనంబున బహుళతపము
పచరింపఁ బరమేష్ఠి ప్రత్యక్షమై వరం, బర్థింపు మనుటయు నఖిలభూత
ములనుండి యభయంబు గలిగింపు మని వేఁడె, వేఁడిన ద్రుహిణుండు విప్రులకు న
వజ్ఞ సలుపకున్న వర మిచ్చితి నటంచుఁ, గరుణించి చనియె రక్కసుఁడు దాన
తే. నమితవిక్రముఁడై వేల్పుగమికిఁ దాప, మొదవఁ జరియించుచును వేల్పులోవ కసుర
కజుని కెఱిఁగించి ప్రార్థింప నతఁడు వారి, నాదరించి దయామతి నానతిచ్చె. 513

తే. వగవకుఁడు వాఁడు బ్రాహ్మణావజ్ఞ సేయు, వసుధ దుర్యోధనుం డనువానిహితము
గోరి తత్కారణంబున వారికోప, వహ్ని కెర యయి త్రెళ్లు నవ్వల వినుండు. 514

—ధర్మరాజు పట్టాభిషేకమహోత్సవము—

వ. అని యానతిచ్చె నాచార్వాకుండె నేఁ డిట్లు బ్రహ్మదండనిహతుం డయ్యె ధర్మనంద
నా నీవు రాజధర్మంబునం జేసి దురాత్ము లైనశాత్రవులం గాలధర్మంబు నొందించి
తివి వారును స్వర్గతులై సర్వసౌఖ్యంబులం దేలుచున్నవారు నీ వింక నీమనోగ్లానిం
దిగఁద్రావి రాజకార్యాభిముఖుండవై ప్రజల రక్షించుచు ద్విజులం బూజింపు మనినఁ
గుంతీనందనుం డమందానందకందళితహృదయారవిందుండై గోవిందుం బ్రశంసించు
చుం దదనుమతంబున నట నొక్క భద్రోదవళితాంతరంబునం భద్రసింహాసనంబున
బ్రాఙ్ముఖంబుగ నాసీనుం డయ్యె నతని కభిముఖంబుగఁ గృష్ణసాత్యకు లేకపీఠంబుఁ
నం దధివసించి రజాతశత్రున కిరుపార్శ్వంబుల భీమార్జునులు విశ్రమించిరి వెనుక
చక్కి గజదంతమయంబును జాంబూనదవిభూషితంబు నగునాసనంబున నిరుగడ
నకులసహదేవు లిరిగాని కుంతియుహాదేవి కూర్చుండె ద్వారకానాథుని పరిసర

బున మణిమయోన్నతాసనంబుల దుర్యోధనపురోహితుం డగుసుధర్ముండును
ధౌమ్యుండును ధృతరాష్ట్రుండును వసించిరి ధృతరాష్ట్రుని సమీపంబున
గాంధారియు యుయుత్సుసంజయులును గూరుచుండి రిట్లెల్లరు నాయా
స్థలంబుల నాసీనులై యున్నసమయంబున శమనాత్మజుండు సితకుసుమా
క్షతసువర్ణరత్నరత్నగర్భాదుల మంగళార్థంబుగ స్పృశించె నాలోఁ బ్రకృతివర్గంబు
పురోహితుం బురస్కరించుకొని నానావిధమంగళద్రవ్యంబులును సువర్ణమణిగణం
బులును సర్వసంభారసంభృతం బగునాభిషేచనిక భాండంబును గాంచనౌదుంబరం
బులును జలపూర్ణకుంభంబులును బహువిధకుసుమంబులును లాజలును బర్హిస్సును
గోరసంబును శమీపిప్పలపాలాశసమిత్తులును మధ్వాజ్యంబులును స్వర్ణభూషితస్రుక్స్రు
వంబులును శంఖంబులునుం దెచ్చి ధర్మరాజుం దర్శించి రంత దాశార్హాభ్యనుజ్ఞా
తుం డై ధౌమ్యుండు ప్రాగుదక్ప్లవనంబుగ వేదికం గల్పించి యందు వ్యాఘ్రచర్మో
త్తరంబును సర్వతోభద్రంబును దృఢపాదంబును హుతాశనసమప్రభంబు నగునొ
క్కమంగళాసనంబుఁ బ్రతిష్ఠించి దానిపై ధర్మరాజును ద్రుపదరాజపుత్త్రికను నధివసిం
పఁ జేసి యగ్నిముఖంబు గావించి విధిమంత్రపురస్సరంబుగ వేలిమిం గ్రాలఁ జేసె
ననంతరంబ పణవానకశంఖదుందుభిప్రముఖమంగళవాద్యంబులు బోరుకలుగ వాసుదే
వుండు సమంచితస్థండిలపూజితం బగుశంఖరాజంబు కరంబులం గ్రహించి దాన ధరిత్రీ
కళత్త్రుం డగు కుంతీపుత్త్రు నభిషిక్తుం జేసినపదంపడి ధృతరాష్ట్రుండును సర్వప్రకృతిజ
నంబును నభిషేకించి రట్లు రాజ్యాభిషిక్తుం డైనపాండవాగ్రజుండు సర్వలోకాత్యంత
దర్శనీయుండై స్వస్తివాచకులును వేదాధ్యయనసంపన్నులును ధృతిశీలసమన్వితులు
నునగు బ్రాహ్మణోత్తముల స్వర్ణనిష్కశతసహస్రంబులం బూజించె నప్పు డప్పౌరలో
కంబునం గలభూసురోత్తము లెల్లరు నుల్లంబులు పల్లవింప నక్కురుసత్తము దిక్కు
మొగంబై జయజయశబ్దంబులతో స్వస్తివచనంబు లుచ్చరించుచు. 515

ఉ. నీవును నీదుతమ్ములు ననిం బడి కీ డిసుమంత లేక పెం
పావహిలంగ ధర్మవిజయంబును గొంటిరి దైవనిర్మితిన్
భూవలాధిపత్యమును బొంది ప్రజాహితతత్పరుండ వై
పావనరాజ్యసంపదలఁ బర్వి సుఖింపుము ధర్మనందనా. 516

వ. అని ప్రశంసించి రట్లు పట్టాభిషిక్తుం డైనధర్మరాజు దేశకాలోపబృంహితంబు లగు
ప్రజావాక్యంబు లాకర్ణించి వినయంబు ప్రదర్శించుచు ని ట్లనియె. 517

సీ. మాకడ నుండిన లేకున్న సుగుణముల్, కల వని మ మ్మిట్లు గారవించి

పూజించితిరి మేము పుణ్యాత్ములము ధన్యు లము పాండురాజుతపముఫలంబు
గాఁ దలంతు మనుగ్రహోవ్యక్తులము కాని, మిము నొక్కఁ డర్థింతు మమితభక్తిఁ
దండ్రి యైనను దైవతం బైన మా కగు, నీధృతరాష్ట్రమహీశ్వరుండు

తే. మాయెడఁ దయ గల దేని యీయనఘుని, శాసనంబున మెలఁగుచు సర్వవిధస
పర్యలం జేయచును దొంటిపగిదిభక్తిఁ, గొలుచుచుండుటమా కెంతయును బ్రియంబు.

ఉ. మాకును మీకు నీధరణిమండలికిం బ్రభు వెన్న నీశుభ
శ్లోకుఁడె చెప్పుచుంటి మిది సుంతయు లే దిట నేను దమ్ములన్
జేకొని వీనిఁ గొల్చుటకె జీవనముల్ ధరియించి యుంటి మీ
వాకులు విశ్వసించి నడువం గలవా రగుగాత మెల్లరున్. 518

వ. అని పౌరజానపదుల సగౌరవంబుగ నంపిపుచ్చి యౌవరాజ్యంబున భీమసేను నిలిపి షాడ్గుణ్యనిశ్చయంబునందును మంత్రంబునందును విదురు నియోగించి కృతాకృత పరిజ్ఞానంబునందు నాయవ్యయచింతనంబునందును సంజయుం బూజించి బలపరిమాణంబునందును భృత్యవేతనదానంబునందును గర్మకలాపాన్వవేక్షణమందును నకులు నాజ్ఞాపించి పరచక్రోపరోధంబునందును దుష్టావమర్దనంబునందును ఫాల్గును నిర్దేశించి ద్విజకార్యంబులందును నితరకార్యంబులందును ధౌమ్యుం బ్రతిష్ఠించి సహదేవుం బిలిచి నీవు నిత్యంబును నన్నుఁ గాపాడుచు నాయొద్దన యుండునది యని యాజ్ఞాపించి మఱియు నేయేకార్యంబుల నెవ్వ రెవ్వరు తగి యుండు రాయాకార్యంబుల వారి వారి నియమించి విదురసంజయయుయుత్సులదిక్కు మొగంబై మీరు ప్రతిదినంబును లేచి మాతండ్రికార్యంబు లన్నియు నెరవేర్చుచుఁ బౌరజానపదులకార్యంబు లీవారకు నివేదించుచుఁ బంచి న ట్లన్నిపనులుం గావించు చుండునది యని యన్పనంబు వెట్టి తా నప్పుడు యుద్ధనిహతు లైనజ్ఞాతులకు వేఱువేఱ ధృతరాష్ట్రసహితుండై శ్రాద్ధకార్యంబు నిర్వర్తించి గోభూహిరణ్యరత్నాంబరాన్నదానంబు లొనర్చి దిక్కులేకుండం జచ్చినరాజుల నుద్దేశించి తన్నామాంకితంబులుగ సభలు తటాకంబులు ప్రపాశాలలు లోనగునవి నిర్మించి యెల్లవారికిం జెల్లున ట్లౌర్ధ్వదైహికంబు గావించి ఋణవిముక్తుండై యథాపూర్వంబుగ గాంధారీధృతరాష్ట్రవిదురులం బూజించి మాన్యు లగుకౌరవులనెల్లం గౌరవించి భృత్యుల నాదరించి హతవీరాత్మజ లగుకౌరవస్త్రీలం బాలించి నీచాంధకృపణు లగువారి గృహాచ్ఛాద...

భోజనాదుల ననుగ్రహించి కృతకృత్యుండై పూజ్యసామ్రాజ్యంబునం బొందుపడి గో
విందుం గాంచి కృతాంజలిపుటుండై యిట్లనియె. 520

—ధర్మజుఁడు శ్రీకృష్ణు నుచితవచనంబుల స్తుతించుట—

చ. అనఘ భవత్ప్రసాదము నయంబు బలంబును బుద్ధి విక్రమం
బును నిరతంబు మాయెడలఁ బొంపిరిపోవుటఁ జేసి కాదె నా
యనుజులు నేను నెమ్మదికి నైన మఱియుం గురురాజ్యసంపదల్
గొనఁ గలవార మైతి మని గొంచక మించక విన్నవించెదన్. 521

ఆ. పరమపురుష నిన్నుఁ బ్రస్తుతింతురు సక్తి, దత్త్వవేత్తలెల్ల సాత్త్వతుండ
వని యనాదిలయుఁడ వని పెక్కుపేళ్ళ నీ,కేటికో ళ్ళొనర్తు మేటి వనుచు. 522

తే. విశ్వసంభవ విశ్వాత్మ విశ్వకర్మ, విశ్వవల్లభ విశ్వేశ విష్ణుకృష్ణ
జిష్ణునామక వైకుంఠ శ్రీనివాస,దేవ పురుషోత్తమా నీ కిదే నమస్సు. 523

తే. అదితికిఁ విష్ణువామను లనఁగ మున్ను,పృశ్నిగర్భుఁడు రాముఁడు కృష్ణుఁ డనఁగ
నదితి రూపాంతరంబుల నవతరించి, తొకఁడ వేధను గా మూఁడుయుగములందు.

వ. మఱియు శుచిశ్రవుఁడు హృషీకేశుఁడు ఘృతార్చి హంస త్రిచక్షువు దామోద
రుఁడు వరాహుఁడు వహ్ని బృహద్భానుఁడు వృషభుఁడు తార్క్ష్యలక్షణుఁడు నవీన
సాహుఁడు పురుషుఁడు శిపివిష్టుఁడు నురుక్రముఁడు వరిష్ఠుఁడు నుగ్రసేనాని సత్యుఁ
డు వాజసని గుహుఁడునచ్యుతుఁడు నరిచ్యావనుఁడు సంస్కృతుఁడు వికృతుఁడు వృ
షుఁడునూర్ధ్వవర్త్మవృషదర్భుఁడు వృషాకపి సింధువు విధర్ముఁడు త్రికకుప్పత్రి ధాముఁ
డుత్రిదివచ్యుతుఁడు సమ్రాట్టువిరాట్టు స్వరాట్టు సురరాజు భవోద్భవుఁడు భూరూపుఁ
డు నతిభువు కృష్ణుఁడుకృష్ణవర్త్మ స్విష్టకృత్తు భిషజావర్తుఁడు కపిలుఁడువామనుఁడుయ
జ్ఞరూపుఁడుధ్రువుఁడుపతంగుఁడు యజ్ఞసేనుఁడు శిఖండి నహుషుఁడు బభ్రువుదివస్పృ
శుఁడుసుబభ్రువుక్త్యయజ్ఞుఁడు సుషేణుఁడు దుందుభి గభస్తినేమిశ్రీపద్ముఁడు పుష్క
రుఁడుపుష్పధారణుఁడు క్రతువు సర్వసూక్ష్ముఁడులోనగునామరూపంబులందాల్చి బ్ర
హ్మయు హిరణ్యగర్భుఁడును స్వాహాస్వధాకారంబులును సముద్రంబులు భూమియు
నాకాశంబును సూర్యుండు చంద్రుండు దిక్కులు విదిక్కులును లోకంబులు లోకే
శులు లోనగుసర్వంబు నీవ యై సర్వంబునకుఁ గారణంబవై సృష్టిస్థితిలయంబులం
జేయుచుండు నిన్నుంగ బ్రహ్మణుడు జాం రోమహాప్రభూ! నీ కిదే నమ

స్కారము దాశార్హా! నీ కివే యేటికోళ్లు దామోదరా! నీ కిదే వందనంబు నన్ను
కృతార్థుం జేయు మని యనేకవిధంబులం బ్రస్తుతించి ప్రార్థించినం బ్రసన్నుండై
పన్నగతల్పుం డనల్పపరిష్కారవాక్ప్రసంగంబుల నభినందించుచు నతని నానందసాగర
నిమగ్నాంతరంగునిం జేసె నంతఁ గౌంతేయాగ్రజుండు నాపేరోలగంబున నున్నపౌర
జానపదుల నెల్ల వారివారివిడుపట్లకుం బోవం బనిచి తమ్ములం గలయఁ బరికించి
సాంత్వనపూర్వంబుగా ని ట్లనియె. 525

చ. అలఁతులు వోలె మీ రడవులందు శ్రమంపడు టాది గాఁగ నా
వలన ననేకకష్టములపా లయి పోయితి రేమి చెప్ప న
క్కలన సపత్నసూత్నశితకాండచయక్షతదేహయష్టులై
యలమట కైతి రిట్టిమిము నారయ నక్కటికంబు పుట్టదే. 526

ఉ. ఇడుమల్ దీఱె యథాసుఖంబుగను మీ రిష్టానుసారంబుగా
నెడ విశ్రాంతి సెలంగ శాంతి దవులన్ హెచ్చిల్లి మే నుల్లసి
ల్లెడుచందంబున రాజ్యలక్ష్మి విజయాలేఖ్యంబులోఁ బెంపు పే
ర్వడఁ గైకొంచుఁ గుతూహలం బనుభవింపం జెల్లుఁ దెల్లంబుగన్. 527

వ. అని యుధిష్ఠిరుండు భీమార్జుననకులసహదేవుల నాశ్వాసించుచుం బలికి ధృతరా
ష్ట్రునుమతంబు వడసి. 528

సీ. బహురత్ననిర్మితప్రాసాదశోభిత, మగుసుయోధనుగృహం బనిలజునకు
స్వర్ణతోరణయుతసౌధరాజితము దుః, శ్శాసనుగృహ మింద్రజన్మునకును
మణిహేమమయ మతిప్రణుతము దుర్మర్ష, ణభవనరాజంబు నకులునకును
గనకమణీగణకలితము దుర్ముఖు, దివ్యహర్మ్యము సహదేవునకును

తే. గోపురం బుండఁగా నిచ్చి భూపవర్యుఁ, డంపిపుచ్చుటయును వార లభ్యనుజ్ఞ
వడసి చనిరి సాత్యకితోడ వాసుదేవుఁ, డర్జునగృహంబునకుఁ జనె నధిపునాజ్ఞ. 529

వ. ధర్మరాజానుమతంబున యుయుత్సువిదురసంజయులును ధౌమ్యసుధర్ములును వారి
వారియిండ్లకుం జని రంతఁ గౌంతేయాగ్రజుండును ధృతరాష్ట్రునితో నభ్యంతరంబు
నకుం జనియె నిట్లెల్లరుం దమతమవిడుపట్లకుం జని నాఁటిరేయి భోజనభాజనంబు
లైనపిమ్మట సుఖనిద్రం గావించి రని చెప్పిన నైమిశారణ్యవాసు లవ్వలివృత్తాం
తంబు చెప్పు మనుటయును. 530

## ఆ శ్వా సాం త ము.

చ. కనుఁగవ వ్రాల్చునంత నగుకాలములోపలనే నశింప నై
కనఁబడుతోలుబొమ్మపయిఁ గాంక్ష యొనర్చుచుఁ దప్పుత్రోవలన్
జని యిహముం బరంబు జెడుసంగతి కై చనుఁ జెట్టఁ డట్టెత
స్వవఁ బడనీక న న్గమణ పొంపిరివోవఁగ నేలు మీశ్వరా.

—గద్యము—

ఇది శ్రీమదఘునాతనోభయకవిమిత్ర వేంకటయజ్వాగ్రపుత్ర,
సమారాధితవిబుధరాజ, శ్రీపాదకృష్ణమూర్తికవిరాజ
ప్రణీతం బయిన శ్రీకృష్ణభారతంబునందుఁ
శాంతిపర్వంబునఁ బ్రథమాశ్వాసము.
శ్రీ శ్రీ శ్రీ



శ్రీబాలాత్రిపురసుందర్యై నమః

# శ్రీకృష్ణభారతము

## శాంతిపర్వము-ద్వితీయాశ్వాసము.


కరుఁడై సచరాచర
లోకాకరుఁడై వెలుంగులోకేశ్వరునిన్
గైకొని చిత్తమునందుఁ
వాకొందుఁ భారతంబు వన్నెకు నెక్కన్. 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె నట్లెల్లరుం బేరోలగంబు విడిచి విడిదలకుం జనిరని చెప్పిన విని జనమేజయుండు వైశంపాయనునిం గని ధర్మరాజట్లు పూజ్యసామ్రాజ్యంబుఁ గొని యెట్లు ప్రవర్తించెం జెప్పు మనిన నప్పరమమునీంద్రుండు వినుమట్లు పట్టభద్రుండైనయుధిష్ఠిరుండు చాతుర్వర్ణ్యంబును దత్తత్స్థానంబుల నుచితరీతి నిలువ నియమించి ప్రతిదినంబును స్నాతకు లయిన సహస్రబ్రాహ్మణుల కొక్కొక్కనికి సహస్రనిష్కంబు లిచ్చి సంతృప్తులం గావించుచు ననుపజీవు లగుభృత్యుల నాశ్రితుల నతిథులఁ గృపణుల నిష్టాన్నవస్త్రవాహనధనకనకాకులం దనుపుచుఁ బురోధసుండగుధౌమ్యునకుఁ బదివేలగోవులను ధనకనకరజతవాసోవిశేషంబు లర్పించి సేవించుచుఁ గృపునకును విదురునకును గురువృత్తిం జెల్లించి పూజించుచు నన్నపానవాసశ్శయనాసనాదుల నెల్లవారల సంతోషపెట్టుచు లబ్ధప్రశముండై ధార్తరాష్ట్రుం డగుయుయుత్సుం గౌరవించియు గాంధారీధృతరాష్ట్రులకును విదురునకును రాజ్యంబు సమర్పించి విగతజ్వరుండును స్వస్థచిత్తుండునై నిజనగరం బెల్ల నలంకరింపఁ జేసి యొక్కనాఁ డుదయంబున శ్రీకృష్ణదర్శనలాలసుండై వానియున్నచోటికిం గృతాంజలిపుటుండై చని యట మణికాంచనభూషితం బగునొక్కమహాపర్యంకంబున. 2

— ధ్యానాసక్తుఁ డైనశ్రీకృష్ణునిం గని ధర్మరాజు సంభాషించుట —

సీ. కాలాంబుదశ్యాముఁ గాంతిచ్ఛటాధాము, నాజానుబాహు లోకావనేహు
సంపూర్ణపూర్ణిమాచంద్రవదను గళాసదను మహావక్షు సారసాక్షు
మందహాసమనోహరుం దులసీధరుఁ, గౌస్తుభాభరణు భక్తజనశరణుఁ

పీతకౌశేయసంవీతదివ్యాకారు, సర్వలోకాదరజ్ఞానసారు

తే. ద్యుమణిబింబప్రభాభ్రాజమానదయశైల,విభు నిఖిలలోకవిభుఁ గురువిభుఁడు గాంచి
చెంగటికి నేగి వినతుఁడై స్మితముఖంబుగలుగ నిట్లని వచియించెఁ గ్రమభణితి. 3

తే. బుద్ధిమద్వర ! సుఖమునఁ బుచ్చితె, రాత్రి విజ్ఞానములనెల్ల ప్రవిమలములె
నీదయిన దైవియగుబుద్ధి నెగడుకతన,ధరణి నొందఁగఁ గంటిమి ధర్మగతుల. 4

వ. నీప్రసాదంబునం జేసి మేము ధర్మచ్యుతులము గాక విజయంబును యశంబును బొందఁ గలిగితి మని పలుకుచున్నను ధ్యాననిశ్చలమనస్కుండై మాఱుపలుక కున్న కాంచనాంబరధరుం దిలకించి యుధిష్ఠిరుండు వెండియు. 5

మ. ♦ ఇది యే మచ్చెరువయ్యె నచ్యుత! శివం బే యెల్లలోకాళికిన్
మది ధ్యానింతు చతుర్థమార్గమును సంభావించి దేహత్రయా
భ్యుదయార్థంబును మీఱి తెల్లపవనంబుం గట్టి తుల్లంబునం
దుఁ దగం బెట్టితి వింద్రియంబులు మతిన్ దోఁగించి తుర్యాకృతిన్. 6

సీ. ఇట్లింద్రియంబులు నింద్రియార్థంబులు, బుద్ధియు మదితోడఁ బొందుపడఁగ
క్షేత్రమునందలి క్షేత్రజ్ఞునం దుంచి,తివి చలింపవు రోమదేశములును
స్థిరములు నీదుబుద్ధియును మనంబును, శిలనాఁ గదలక నిశ్చేష్టుఁ డయితి
నిర్వాతదీపము నెఱివెలుంగుచు నుంటి, విది యేమి కారణ మిందిరేశ

తే యిది రహస్యము గాకున్న నే వినంగ, నగుదు నేనియు నాసంశయంబు దీర్ప
వే ప్రపన్నుఁడ భక్తుఁడ వేఁడుచుంటిఁ, బ్రణతి గావించి నీపాదపద్మములకు. 7

తే. నీవు కర్తవు హర్తవు నీవు క్షరుఁడ, వక్షరుండ వాద్యుండ వనాదినిధనుఁ
డవు వినమ్రుఁడ నగునాకుఁ డాప కిట్టి, ధ్యానతత్త్వ మెఱింగింపఁ దలఁపు మీశ. 8

వ. అని ప్రార్థించినం బ్రసన్నుండై పాంచజన్యధరుండు మనోబుద్ధీంద్రియంబులు గోచరంబులు గావించుకొని పాండవపూర్వుం గాంచి స్మితపూర్వంబుగా నిట్లనియె. 9

క. శరతల్పగతుండై కర, మరుదుగ శాంతి న్వహించునగ్ని తెఱఁగునన్
బరఁగెడు భీష్ముఁడు తలఁచుటఁ, గురువర నాచిత్తమతనిఁ గూడఁగఁ జనియెన్. 10

—శ్రీకృష్ణుండు భీష్మునిమహత్త్వం బభివర్ణించుట—

సీ. ఎవనిజ్యాతల ఘోష మెగసి పిడుగు వోలెఁ, గ్రతుభుక్పతికి సైఁపరాని దయ్యె
నెవఁ డెల్లరాజులఁ బవరంబునం గెల్చి, కాశీశ్వరునికన్యకలను దెచ్చె
నెవఁడు భార్గవరాము నెదిరించి యిర్వది, మూఁడు రాత్రులు పోరి ప్రతిభ గాంచె
నెవని గంగాదేవి యెల్లలోకము మెచ్చ, పగిదిఁ బ్రేమించి గర్భమునఁ గాంచె

♦ చతుర్థమార్గము=జాగ్రత్స్వప్నసుషుప్తులకంటెఁ బరమైనది.

తే. నీవుఁడు నాలుగు వేదము లెఱింగి సర్వ, విద్యలకు నాలవాలమై విశ్రుతాస్త్ర
శస్త్రములు దాల్చినధుఁడైన శాంతనవుఁడు, నను దలఁచుచుంటనామ నెచనియెఱటకు.

వ. వసిష్ఠజామదగ్న్యశిష్యుం డగునమ్మహాత్ముండు భూతభవిష్యంబు లగునెల్లధర్మంబు
లెఱుంగు నప్పురుషశ్రేష్ఠుండు స్వర్గంబునకు నిర్గమించె నేని నష్టచంద్రుం డైనశర్వరి
పోలె నుర్వర తేజోవిహీనం బగు విజ్ఞానంబు నశించుఁ గావున నీ వామహాత్ముని
నాశ్రయించి చతుర్వర్గప్రదంబు లగు సర్వధర్మంబు లెఱింగి ముక్తసంశయుండవగు
మనిన విని ధర్మనందనుండు సాశ్రుకంఠుండై వైకుంఠుం దిలకించి యి ట్లనియె. 12

ఉ. దేవనదీసుతప్రతిభ దేవర చెప్పినయట్లు మున్ను భూ
దేవులు చెప్ప వింటి నని తెల్పుచునుంటి జగన్నివాస నీ
భావము నాపయిం గలియఁ బర్విన నిన్నుఁ బురస్కరించుకొం
చే వెడలంగ నుంటిఁ ద్రిదివేశసముం డగుభీష్ముపాలికిన్. 13

తే. ఉత్తరాయణమునకు నయ్యుత్తమచరిత్రుండు దా వేచికొనియుండియొడలువాయు
నిపుడు నీదర్శనముఁ గోరు నెడఁద నీవు, బ్రహ్మమయనిధివి క్షరాక్షరముల కాది. 14

వ. అనిన విని పాంచజన్యధరుండు పజ్జ నున్నసాత్యకిం గని సారథంబు సజ్జంబు గావిం
పు మనిన నతండు దారుకునకుం జెప్పుటయు నతండును గాంచనభూషితాంగంబు
ను హేమనిబద్ధచక్రంబును మరకతచంద్రకాంతసూర్యకాంతమయవిటంకంబును దా
ర్క్ష్యపతాకాభిశోభితంబును విచిత్రనానామణిభూషితాంతరంబును నవోదితదివాక
రాంశుప్రభంబును శైబ్యసుగ్రీవప్రముఖమనోజవాశ్వసంయోజితంబును నగుదివ్య
రథంబు సన్నద్ధంబు గావించి కాంచనాంబరునకు నివేదించె నాసమయంబున నక్క
డ వేదవ్యాసనారద దేవస్థాన వాచ్యాశ్మక సుమంతులును జైమిని పైల శాండిల్య దేవ
రాత మైత్రేయాసిత వసిష్ఠ కౌశికహారీత లోమ శాత్రేయులును శుక్రబృహస్పతి
చ్యవన సనత్కుమార కపిల వాల్మీకి తుంబురు కురులును మౌద్గల్య భార్గవ రామ
తృణబిందు పిప్పలాద వాయు సంవర్త కచ పులహ పులస్త్య కాశ్యప క్రతు దక్ష
పరాశర మరీ చ్యంగిరో గౌతమ గాలవ కాశ్య ధౌమ్యులును విభాండ మాండవ్య
ధౌమ్ర కృష్ణానుభౌతి కోలూక మార్కండేయులును భాస్కరి పూరణసూతులు
లోనుగాఁ గలవా రనేకబ్రాహ్మణోత్తములు తన్నుఁ బరివేష్టించి యుండ గ్రహపరి
వేష్టితుం డగుచంద్రుండు వోలెం బ్రకాశించుచు శరతల్పగతుం డై శ్రద్ధాశమదమో
పేతుం డగు దేవవ్రతుండు కృతాంజలిపుటుండై వాసుదేవు నంతరంగంబున దిడి
కొను హృష్టతుష్టస్వరంబున ని ట్లని ప్రస్తుతింపం దొడంగె. 15

—భీష్ముండు శ్రీకృష్ణునిస్తుతించుట—

క. ఆరాధనం బొనర్పం, గోరికి మొదలుఁ గొంచెముగనో గొప్పగనో వా
క్యారంభ మొనర్చెద నది, శౌరికిఁ బ్రియ మగుచు శాస్త్రసమ్మత మగుతన్.
ఆ. శుచియుఁ దపనుండు శుచిపదుండును బర, మాత్ముఁడు పరమేష్ఠి హంసుఁడును బ్ర
జాపతి యగునీశు సర్వాత్మ నేకీభ,వించి కొలిచి శరణు వేఁడు వాఁడ. 17
సీ. భగవంతుఁడును బరబ్రహ్మయు నాద్యంత, రహితుండు ధాత నారాయణుండు
నగుహరి సర్వజ్ఞుఁ డతనిదేవతలు మ, హర్షులు సిద్ధులు యక్షరాక్ష
సులు పన్నగాదులు తెలియఁ జాలరు సంశ, యింతురు భగవంతుఁ డెం దగు నని
భూతంబు లెల్ల నాభూతేశునం దుండు, సూత్రమ్మున మణిస్తోము మట్లు
తే. కార్యకారణములచేత గ్రంథిత మగు, విశ్వమెల్ల విశ్వాంగుండు విశ్వకర్మ
యగునతనియందుఁ దంతువునందు స్రజము, వలె నెసంగెడునట్టియీశ్వరునిఁ గొలుతు.
తే. హరి సహస్రశిరస్కు సహస్రపదు స, హస్రకరు సహస్రముఖు సహస్రనయను
బరముఁ బరమాత్ము సేవింతు భక్తిభరిత, హృదయపీఠమునన్నిల్పి సదయహృదయు.
సీ. వాకములం దనువాకములందు ని, షత్తులందు నుపనిషత్తులందు
నింతకు నింతగా నంతకు నంతగా, శ్రేష్ఠవస్తువులకు శ్రేష్ఠునిగను
వచియించుచుండు రాశుచిషత్తు సాత్వత,పతి సత్వసంస్థుని వాసుదేవ
ముఖ్యముల్ నాల్గురూపులను బ్రహ్మను లో, నాలుగాత్మలు గల్గి క్రాలుఘనుని
తే. సత్యకర్ముని సత్యుని సత్యసాము,ములను ధ్యానింత్రు మానివర్యులు మనమున
శాశ్వతానందసుఖ మొందు సదమలేచ్ఛ, నట్టి సాత్వతుని భక్తి నభినుతింతు.
సీ. ఎవని ఘనుల్ పరమేద్ధముల్ గుహ్యము, లగునామములఁ గొల్తు రనుదినంబు
నెవనిప్రీతికి మును లెపుడు తప మొనర్చి, చిత్తాబ్జములయందుఁ జేర్చుకొందు
రెవఁడు సర్వుండు సర్వవిదుండు సర్వాత్ముఁ, డును సర్వభావనుఁడును ఘనుండు
నెవని యోగులు భక్తిఁ దవిలి నిజాత్మ నా, త్మగఁ గాంచి మోక్షముం దవులనుంద్రు
తే. వేదముల విప్రులన్ మఖవిధులఁ బ్రోవ, నరణి దీప్తాగ్నిం గన్నయట్లు జగము
మెలఁప దేవకి వసుదేవువలన నెవనిఁ, గనియె నతిసూర్యతేజు నాఘనునిఁ గొలుతు.
క. మును గల్పాదిం బురుషుం, డనఁ బిదప యుగాది బ్రహ్మ యన సంవర్తం
బున సంకర్షణుఁ డన జను, ననఘుని సేవింతు శరణ మందినబుద్ధిన్. 22
సీ. ఒకఁ డయ్యును బహుత్వ మొందినవేని న,నన్యభక్తి యజింతు రఖిలయోగు
లెవని జగత్కోశ మవు నని చెప్పుదు, రెవనియందు స్ఫురించు నెల్లజగము
నేకాక్షరము బ్రహ్మ ఋతము నై యెవ్వఁడు, సదసత్పరుం డయి సౌరుమీఱు

నాదియు మధ్యము నంతము లేనిమె, వ్వానిఁ దేవతలైన నెఱుఁగ
తే. రెవ్వాని సురాసురులు సిద్ధులెల్ల మునులు, ఘోరజపంబుల నెంచి సేవింపుచుందు
రమ్మహాత్ము సనాతను నాత్మయోని, హరిని నారాయణునిఁ బ్రభు నభినుతింతు.
క. తగిలి వచించెద రెవ్వని, జగదాధారాత్ము సర్వజగదధిపతిఁ గా
సగుణుఁడు నిర్గుణుఁ డక్షరుఁ, డగు నాపరమున్ భజింతు నంతశ్శుద్ధిన్. 24
క. పదిరెండు మూర్తులై తగ, నదితి మును హిరణ్యవర్ణ మగుగర్భము పెం
పొదవఁ గనియె నేమొక్కటి, సదమల సూర్యాత్ము నతని సన్నుతిఁ గొలుతున్. 25
క. అమృతమున సితాసితపక్షములన్ వేల్పులుఁ బితరులు సంతృప్తిపడన్.
గ్రమమున నొసర్చు ద్విజరా, జమహితు సోమాత్ము నాత్మ సతము భజింతున్. 26
తే. కటికిచీఁకటి కవ్వల ఘనతరప్రకాశమున వెల్గు తేజోమూర్తి గానఁ గలుగు
జనుఁడు మృత్యువుతలఁ దన్ని తనరుచుండు, నట్టి తేజాత్ము నాత్మలో నభినుతింతు.
తే. ఉక్థ యనుమహాధ్వరమున నొసరునగ్ని, హోత్రమున విప్రవరు లేచుహోత్రు సతి
భక్తి గానను సేయుదు రుక్తిరక్తి, నట్టి వేదాత్ము భజింతు నధికభక్తి. 28
తే. ఏమహామహు ఋగ్యజుస్సామధాముఁ, బంచహవ్యాత్మకునిఁ గాఁగఁ బ్రస్తుతించి
సప్తతంతువు సాఁగింత్రు సన్మునీంద్రు, లట్టియజ్ఞాత్ము నిం గొల్తు ననుదినంబు. 29
ఆ. నాల్గు నాల్గు రెండు నడపి యైదును రెంటు నక్షరములు గలియు నట్లు చేసి
సవములన్ యజింతు రెవని నాహోమాత్ము, శరణు వేఁడి కొలుతు స్వాంతమందు.
తే. యజ్ఞము శిరంబు ఛందము లవయవములు, వరరథంతర మది సామువాక్యము యజు
రాఖ్యఁ గలిగి వేదపురుషుఁడై యుండు నెవ్వఁ, డట్టి స్తోత్రాత్ము సేవింతు నతులభక్తి.
తే. విశ్వసృడ్వత్సరసహస్రవిశ్రుతాధ్వర[illegible] నేబుధి స్వర్ణపక్ష[illegible]
నవతరించెనో హంసాత్ముఁ డైనయమ్మహామహుని సంస్మరించెద ననులబుద్ధి. 32
క. పదజాలము లంగకములు, సదమలసంధులు సుపర్వచయము మఝ్ఝుల్
విదితవిభూషలు గలుగన్, బొదలెడువాగాత్ము శరణుఁ బొంది భజింతున్. 33
సీ. అవని యజ్ఞవరాహమై తాల్చె లోకహితార్థమే నట్టివీర్యాత్ముఁ దలఁతు
వేయితలలపాము పై యోగమున నిద్ర, నందు నేఁ డట్టినిద్రాత్ముఁ గొలుతు
ఋతమునం గట్టె నమృతసేతువును సుజ, నాళి కేఁ డట్టిసత్యాత్ము నెంతు
ధర్మాచరణరీతిఁ దత్తత్ఫలము లీయ, నలరు నేఁ డట్టిధర్మాత్ముఁ దలఁతుఁ
తే. కామమయదేహియై భూతగణముఁ గామమందఁ జేయు నేఁ డట్టికామాత్ముఁ దలఁతు
వ్యక్తుఁ డవ్యక్తుఁడై క్షేత్రమందు క్షేత్రి, మరయుచుండు నేఁ డట్టిక్షేత్రాత్ము నెంతు.
సీ. ఆత్మయై యాత్మస్థుఁ డగుచు భూతము లింద్రియములు నాఁబడుపదియాఱుగుణము

లమరఁగ సప్తదశాంచితులగు సాంఖ్యు, లెన్న ముత్తెఱఁగుల నెసక మెసఁగు
సాంఖ్యాత్మునకు జితశ్వాసులై సంయతేంద్రియులును సత్వస్థులైనవారు
పొనరిన విజ్ఞానమునఁ జూడ నగుజ్యోతి, రాత్మమై యొప్పు యోగాత్మునకును
తే. వెండియుఁ భవభయము గాకుండ బాప, పుణ్యములు నెఱుఁగక శాంతమూర్తులమలు
లైనసన్యాసు లెవ్వాని ననుగమింతు, రట్టి మోక్షాత్మునకు జోత లాచరింతు. 35
తే. యుగసహస్రాంతమునఁ బ్రదీప్తోగ్రకిరణుఁ, డగుచు వెలుఁగు విభావసు వై యెవండు
భూతజాతము నంతయుఁ బొడ వడంచు, నట్టి ఘోరాత్ము మ్రొక్కెదఁ బ్రాంజలి నయి.
శా. భూతవ్రాతము నెల్ల మ్రింగి జగముల్ మున్నీటిచే ముంచి తాఁ
బ్రీతిన్ బాలకులీల నొక్కరుఁడ వార్ధిన్ మఱ్ఱిపత్రంబుపై
చేతన్మాత్రము గాని యోగమున నెంతే నిద్ర గావించి వి
ఖ్యాతిం గాంచెడు మేటియై తనరు మాయాత్ముం బ్రశంసించెదన్. 37
మ. అజుఁడై శాశ్వతుఁడై పురాణపురుషుండై పుష్కరాక్షుండునై
నిజతేజోగరిమంబునం బరఁగు చే నిత్యుండు నెవ్వాని నా
భి జనించెన్ జలజోత్తమం బచట నీవిశ్వంబు దీపించు న
య్యజితున్ సర్వజగన్నియామకునిఁ బద్మాత్మున్ భజింతు న్మదిన్. 38
తే. వేయి శిరములు కరములు వెలయ వెలుఁగు, పురుషు సమితాత్ము నిజతుస్సముద్రనిర్గ
మనము గలుగంగ యోగనిద్రను సతంబు, గైకొనినయట్టి యోగాత్ముఁ గని భజింతు.
క. జలధరములు కేశముల న, దులు సంధుల నాల్గువారిధులు జఠరమునన్
గలిగిన తోయాత్మకునిన్, సలలితమతి మ్రొక్కి కొలుతు సర్వేశ్వరునిన్. 40
ఉ. ఎవ్వనిచే లయోదయము లేర్పడఁగా జగముల్ జనించు నో
యెవ్వనియందు లీన మయి యెల్ల నశించునో హేతుభూతుఁడై
యెవ్వఁడు రేలునుం బవలు నెప్పుడుఁ గున్కక జాగరూకతల్
నివ్వటిలంగ ద్రష్ట యయి నెమ్మి నెసంగునో వాని నెన్నెదన్. 41
సీ. వైకుంఠుఁడై యడ్డు లేక కార్యార్థముద్యతుఁ డగు కార్యాత్ము నభినుతింతు
ధర్మంబు విడిన క్షత్రమును ముయ్యేడుమా, ర్లాజి నడఁచిన క్రౌర్యాత్ముఁ గొలుతు
లోనెసంగుచు నాత్మ నేతు గాఁ బంచి భూ, తాళి నాడించు వాయ్వాత్ము నెంతు
యుగముల మాసాది యోగములన్ సృష్టి, నడగంగఁ జేయు కాలాత్ముఁ దలఁతు
తే. మోమునన్ బాడబులు భుజంబులను క్షత్రి, యులును నూరువులందు వైశ్యులును బాద
ములను శూద్రులు ప్రభవింపఁ బొలుపు గాంచు, నట్టి వర్ణాత్మునకును జోహారొనర్తు.
తే. అనల మాస్యము దివి మూర్ధ మాకసంబు, పొక్కిలియగు భూతలము పాదములు విభావ

సుండు చక్షుస్సులును దిశల్ శ్రోత్రములయి, యలరు లోకాత్ముఁ డైన శ్రీహరిని దలఁతు. 43

ఆ. పఱఁడు పరునికంటెఁ బఱఁడు కాలముకంటె, బఱఁడు మఖముకంటెఁ బరమపురుషుఁ
డాది విశ్వమున కనాది యా విశ్వాత్ము, నాత్మలోఁ దలంతు నధికభక్తి. 44

సీ. వైశేషికగుణప్రవర్తకుఁ డై విష, యాదిగోప్త యగు గోప్త్రాత్ముఁ దలఁతు
నన్నపానాదుల నఖిలభూతములకుఁ, బ్రాణప్రదుఁ డగు ప్రాణాత్ముఁ దలఁతుఁ
బ్రాణులలో నగ్ని యై చతుర్విధ మన్న, మఱఁగించునట్టి పాకాత్ముఁ దలఁతుఁ
బింగేక్షణసటంబు పృథులదంష్ట్రానఖం, బగు రూపు గొన్న దృప్తాత్ముఁ దలఁతు

తే. దైత్యదానవదేవగంధర్వముఖ్యు, లెఱసి కానఁ జాలునట్టి సూక్ష్మాత్ముఁ దలఁతు
జగ మనంతరూపమున రసాతలగతుఁ, డగుచు ధరియించినట్టి వీర్యాత్ముఁ దలఁతు.

సీ. సర్గావనార్థము జంతువులన్ మోహ, మను త్రాటఁ గట్టు మోహాత్మునకును
నాత్మవిజ్ఞానంబు నంది జ్ఞానంబునం, బ్రాపింప నైన జ్ఞానాత్మునకును
నప్రమేయశరీరుఁ డతిబుద్ధిచక్షుష్కుఁ, డపరిమేయుఁ డగు దివ్యాత్మునకును
దండంబు జడలు కమండలువును దన, రార వెలుఁగు బ్రహ్మాత్మునకును

తే. త్ర్యంబకుఁడు శూలి భస్మదిగ్ధాంగుఁ డభవుఁ, డైన రుద్రాత్మునకుఁ బినాకాయుధుఁ డుర
గాభరణదేహుఁ డైన యుగ్రాత్మునకును, నంజలిఘటించి మ్రొక్కెద ననుదినంబు. 46

తే. సర్వభూతాత్మభూతుఁడు శాశ్వతుండు, భూతసృష్టివినాశనహేతు వనధి
గతమనఃఖేదమోదుఁ డంచితవిశేషుఁ, డైన శాంతాత్మునకు నిదే నానమస్సు. 47

క. సర్వం బెవ్వనియం దగు, సర్వం బెవ్వానివలన సంభవ మగు నా
సర్వము తా నగు నెవ్వఁడు, సర్వాత్ముం డైన వాని స్మరియింతు నెదన్. 48

సీ. వినుతింతు విశ్వాత్మ విశ్వసంభవ విశ్వ, కర్మ విశ్వేశ్వర కర్మసాక్షి
నీలోన లోకముల్ నీవు లోకములలో, నలర సర్వమయుండ వైన దేవ
భువనప్రభవలయములకు నీవ కర్తవు, భర్తవు హర్తవు పరమపురుష
తత్త్వవిజ్ఞానంబు దవిలినఁ గాని నీ, దివ్యప్రకాశము దెలియ రాదు

తే. శిరమునన్ దివి పదముల ధరణి బాహు, వులను దిక్కులు వ్యాపింతువలఘుమూర్తి
నీదు చక్షువు సూర్యుఁడు నీదు వీర్య, మల ప్రజాపతి నిన్నెన్న నలవి యగునె. 49

క. అతసీసుమసంకాశా, సితదేహుని బీతవాసు శిఖిపింఛవిభూ
షితమస్తకు గోవిందుని, నతి గావించిన భయంబు నరుల కడంగున్. 50

తే. ఒకప్రణామము కృష్ణున కొనరఁ జేయ, నగు దశాశ్వమేధఫలంబు నొగి దశాశ్వ
మేధి వెండి జన్మించి భవాధు లొందు, జన్మమొందఁ డె[illegible] 51

క. కృష్ణవ్రతులై సతతము, కృష్ణుని స్మరియించునట్టి కృష్ణశరీకుల్ [illegible]

కృష్ణు గమింత్రు పాలుతోజ్యము, కృష్ణాయను నొందునట్లు కేవలమహిమన్ 52

తే. నరకసంత్రాసముఁ బాసి ధరణిజనుల, మనిచి సంసారసాగరమగ్నులైన
వారికిం దరియై జగద్వల్లభుఁ డగుకృష్ణు విష్ణు హృషీకేశు నే భజింతు. 53

క. బ్రహ్మణ్యదేవుఁడై గో, బ్రాహ్మణహితుఁడై త్రివిష్టపప్రభుఁడై సు
బ్రహ్మణ్యేశ్వరసుతుండై, బ్రహ్మాసురుఁడైన కృష్ణు భక్తి భజింతున్. 54

తే. ప్రాణకాంతారపాథేయ మత్యధికభ, వామయుచ్ఛేదభేషజం బతులదుఃఖ
శోకసంతాపహరము త్రైలోక్యపూజి, తము హరియనునక్షరద్వయము తలఁప. 55

ఉ. విష్ణుమయంబు సత్య మగు విష్ణుమయంబు జగత్త్రయం బటన్
విష్ణుమయంబు సర్వ మని నిన్ను భజించెడుభక్తకోటికిన్
దృష్ణ దొలంగ నీప్సితము దీర్చి సుఖంబు గూడఁగూర్చువేను శ్రీ
కృష్ణ! నిను న్నుతించి భజియించెద నన్ను ననుగ్రహింపవే. 56

క. ఆరయఁగఁ దపోవిద్యా, కారణమై సర్వలోకగణవంద్యుండౌ
నారాయణునకుఁ బరమై, సారతపం బొండు లేదు సకలజగములన్. 57

క. అని ప్రస్తుతించి కృష్ణా, య నమోనమ యనుచు మ్రొక్కి యమరనదీనం
దనుఁ డచ్యుతగతనిశ్చయు, మనస్కుఁడై యుండె నపుడు మఱచి జగంబుల్. 58

క. ఆలోనాతని భక్తికిఁ, జాలన్ హరి మెచ్చి వచ్చి స్వాంతమునందున్
బోలింప నగుచు వర మిడి, లీలన్ జనె ధర్మరాజు లేపిన యెడకున్. 59

చ. మును లట శాంతచిత్తుఁ డయి ముచ్చట లాడకయున్న నిమ్నగా
తనయుని బాష్పకంఠు లయి తద్దయు మెచ్చి నుతించుచున్ జనా
ర్దనుని మహాప్రభావ మెడఁదం దలపోయుచుఁ గొల్చి రాదలం
దనరఁగ మోడ్పుఁగే లపుడు తాత్వికబుద్ధినిబద్ధభావనన్. 60

వ. మఱియు నిక్కడ. 61

—శ్రీకృష్ణాదులు భీష్ముని దర్శింపవచ్చుట.—

సీ. వాసుదేవుఁడు భీష్మభక్తియోగమునకు, సంతసించుచు లేచి సంభ్రమమున
యుయుధానుఁడును దాను నొక్కరథం బెక్కి, చనిరి ధర్మజుఁడు నర్జునుఁడు నొక్క
స్యందనం బెక్కి వెన్నంటిరి భీముండుఁ, గవలును వేఱొక్కఘనరథమున
నెక్కి వెన్నాడిరి కృపుఁడు యుయుత్సుఁడు, సంజయుఁడు మఱొక్కస్యందనమున
తే. నెక్కి చని రంత వా రత్తేరు లెల్ల నగరిపై లోకనా నొప్పి నేమిసంభూతభీష
ణారవము భూనభోంతర మావరింపఁ, గదలె నంతయు వైభవం బుదయ మందఁ. 62

మ. తనమార్గంబున బ్రాహ్మణప్రవరు లత్యంతస్తవాశీర్వచో
జనితారావ మెసంగఁ బొల్చుటయు నాత్మోపాలచంద్రుండు వా
రిని మన్నించి కరంబు ల న్మోగిచి యర్థిన్ మ్రొక్కుచోఁ గాంచి కాం
చనచేలుం డతనిం గడుం బొగడి యిచ్చెన్ మెచ్చి నిం పెచ్చఁగన్. 63

వ. అనంతరంబ శ్రీకృష్ణుండును బాంధవులును దక్కటివారును వాయువేగవాజియో
జితంబు లగుమహారథంబులతోఁ గురుక్షేత్రంబుఁ దరియ నరిగి రదియును. 64

తే. నరగజాశ్వదేహాస్థిభూధరసమావృతమును గేశమజ్జాశీర్షసముదయసమ
లంకృతము శస్త్రవర్మాదిసంకులంబు, చితిసహస్రయుతము కురుక్షితితలమ్ము. 65

వ. మఱియు భూతప్రేతపిశాచరక్షోగణనిషేవితంబై భుక్తోజ్ఝితం బగుశాలాపానభూమిం
బోలె నున్నకురుక్షేత్రంబున రథంబులు డిగ్గి నడుచుచున్నసమయంబున గదాగ్రజుం
డు పాండవాగ్రజునకుఁ జేయి సాఁచి చూపుచు ని ట్లనియె. 66

మ. ఇవి రామహ్రదముల్ గనుంగొనఁగ నయ్యోం జూడు మై దిండు భా
ర్గవరాముండు పరాక్రమంబునను క్షత్రవ్రాతముం బోరులన్
భువి ముయ్యేడుపరుల్ చరించి మివులన్ బోకుండఁ బోకార్చి త
ద్భవరక్తంబునఁ దర్పణంబు లిడియెన్ భక్తిన్ బితృప్రీతిగన్. 67

వ. అనిన విని యుధిష్ఠిరుండు. 68

మత్త. ఏకవింశతివారముల్ ధర యెల్ల మెట్టి భృగూద్వహుం
డేకతంబున శేషమింతయు నేని లే నటు క్షత్రియా
నీకమున్ వధియించె మున్ ధరణీతలంబున వెండియు
న్వాకొసం బ్రభవించె క్షత్రము నా కెఱుంగ వచింపవే. 69

వ. అనిన శ్రీకృష్ణుండు పరశురాముని జన్మప్రకారంబును గోట్లుల కొలఁది క్షత్రియుల
సంహరించుటయు వెండియు రాజవంశోత్పత్తియుం దొల్లి నేనుమహర్షులవలన వినిన
తెఱంగున నెఱింగించెద నాకర్ణింపు మని యి ట్లనియె. 70

— శ్రీకృష్ణుండు ధర్మరాజునకుఁ బరశురామునిచరిత్రము సెప్పుట —

సీ. జహ్నుండు నాఁబడుజనపతి కజుఁ డమ్యె, నతఁడు బలాకాశ్వుఁ డనఁగ సుతునిఁ
గనియె నాతఁడు కుశికునిఁ గాంచెఁ గుశికుండు, తపముండి దేవేంద్రుఁ దనయుఁ జేసె
నతఁ డాతనికిఁ బ్రీతుఁడై తానె పుత్రత్వ, మును బొంది కౌశికాఖ్యను వహించె
నతఁడె గాధి యనంగ నలరె నాతనికి స, త్యవతి యనఁగ గూఁతు రయ్యె నాయ

తే. మను భృగునిపుత్త్రుఁడు ఋచీకుఁ డనెడుమునికి, నిడె ఋచీకుఁడు సతిచేతకిచ్చె మెచ్చి
పుత్త్రులకుఁ గాఁగఁ జరువులఁ బొనర్చి, తనకు నిది గాధిసతి కిది యని యొసంగె

వ. సత్యవతియు నాచరుద్వయంబు స్వీకరించి తనకు ధృతిమంతుండు శాంతుండు నగు సుతుండును దల్లికిఁ క్షత్రియదర్పభసూదనుం డజయ్యుం డగుసుతుండును బుట్టువా రని సంతసించుచుండ నంతలోనం జెంత కరుదెంచినతల్లిం గని చరుద్వయపరిభావం బెఱింగించి నివేదించుటయు నాయమ తనచరువు కూఁతున కిచ్చి కూఁతుచరువు దాను బుచ్చుకొనియె సత్యవతియు నజ్ఞానంబున నచ్చరువు భక్షించి గర్భంబు ధరించి యున్నంత ఋచీకుండు వచ్చి దివ్యజ్ఞానంబున నది యెఱింగి నీమాతృకారణంబునఁ జరువ్యత్యాసంబు గలిగె నీకుం గ్రూరకర్ముం డగుపుత్త్రుండు పుట్టు నీజననికి బ్రహ్మభూతుండును దపోరతుండు నగుతనయుండు పుట్టు నిట్లు నే నభిమంత్రించి చేసినచరువునం జేసి యగు ననిన నమ్మగువ మగనిపాదంబులపై వ్రాలి గడగడ వడంకుచు ని ట్లనియె. 72

మ. తగ దిట్లాడ మహామునీంద్ర పరుసత్వప్రాంచితాచారుఁ బు
త్త్రుఁ గనం జాలఁ గృపారసం బెడఁదయందుం బొంది సైరించి నా
దగునజ్ఞానము శాంతచిత్తుఁ డగుచుం బావ్యోందుసత్పుత్త్రునిన్
సుగుణాలంకృతునిం దపోనిరతునిం జూడం గదే నాకిడన్. 73

క. అనుడు ఋచీకుం డను నో, వనితామణి నాదుమాట వమ్మగు టెప్డేఁ
గని విని యెఱుఁగునె లోకము, చనఁ జొచ్చినదాని కింత చనునే పలుకన్. 74

వ. అనిన నామె మఱియును. 75

చ. తలఁచిన నొడ్డు లోకము లుదారుతఁ జేయఁగ నోపు దోమునీ
ట్తిలకమ! సూతికిన్ శమగతిం గలిగించుట యెంత పెద్ద బ్ర
హ్మలకును బ్రహ్మ వీవు భవదాజ్ఞ మెలంగెడు దైవ మీనతిన్
దలఁచి దయారసం బెడఁద దాకొలుపంగ ననుగ్రహింపవే. 76

చ. అనుడు ఋచీకుఁ డి ట్లనియె నక్కట నే నొకనాఁటి కింతయే
నన్నృతము నాడఁ గా నెఱుఁగ నగ్నిని వేల్చి సమంత్రకంబుగాఁ
బొనరిచితిం జరుద్వయము పూర్వకృతంబున వ్యత్యయంబునం
జనియె నెఱింగితిం గుశికసంతతి యంతయు బ్రహ్మభూతమా. 77

సీ. అన సత్యవతి యను నార్య! నీవచనంబు, తప్పని దేని నీతనయు విడిచి
తనయునితనయునిఁ దగులుకొనం జేయు, మనుడు ఋచీకుఁ డ ట్లగుత మనియె
నవల నాయమ జమదగ్నినిఁ గనె గాధి, పత్ని విశ్వామిత్రు బ్రహ్మతేజుఁ
గనియె నాజమదగ్ని ఘనుని దారుణకర్ము, రాముని గాంచె నాభీమబలుఁడు
తే. తపము గావించి గంధమాదనమునందు, హరుననుగ్రహమునను శస్త్రాస్త్రములను

—పరశురాముఁడు కార్తవీర్యార్జునుని జంపుట—

పరశువుం బొంది తత్ప్రభావంబుకలిమి, జగములం దప్రతిముఁ డయ్యె జనవరేణ్య.

శా. ఆ కాలంబున నర్జునుండు కృతవీర్యాత్మజప్రభూతుండు లో
కైకప్రస్తుతసత్తపోగరిమ దత్తాత్రేయు మెప్పించి త
ద్వ్యాకోచాదృతిమై సహస్రకరముల్ దక్కొత్త మత్తారిరా
ట్లోకం బెల్ల జయించి మించి కొనెఁ దోర్దర్పోఁ జక్రివర్తిత్వముల్. 79

ఉ. ఆతఁడు వాజిమేధ మనునధ్వరముం బొనరించి సర్వగో
త్రాతలముల్ ద్విజన్ములకు దక్షిణగా నిడె నట్టివేళ నెం
తో తృషితాత్ముఁడై జ్వలనుఁ డోజనరక్షక భిక్ష యన్న నా
దాత్మశిఖావతంసము ముదంబున నిచ్చితి నీయభీష్టముల్. 80

క. అనుటయు నాతం డాతని,ననుచరునిగఁ గొంచు నరిగి యఖిలపురంబుల్
వనములు గోత్రంబులు గాల్చెను నాఁకలి దీఱ రాజుచే రక్షితుఁడై. 81

తే. హైహయాధిపు సాహాయ్య మంది యట్లు, వీతిహోత్రుఁడు జగ మెల్ల వేల్చునపుడు
వాచవిగ నయ్యె నతనికి వాఙ్మహార్తిఁ, దగువసిష్ఠమునీంద్రుదివ్యాశ్రమంబు. 82

వ. దానం జేసి యమ్మునీంద్రుండు కనలి కార్తవీర్యార్జునునికడకుం జని. 83

తరళము. మునిజనాశ్రమ మంచుఁ జూడక ముందు వెన్క యెఱుంగకో
చెనఁటి చిచ్చును బుచ్చి కాల్చితి చట్టచేసితి కాన ని
న్నని మొనం గొని నీదుచేతు లివన్నియుం దెగనేయుఁ బా
యనిపరాక్రమ మొప్ప భార్గవుఁ డైనరాముఁడు భీముఁడై. 84

వ. శమాత్మకుం డగునర్జునుం డాశాపంబున కింతయును జింతింప కుండె నంత. 85

సీ. శాపకారణమునఁ బాపాత్ము లగునాత్మ,భవులు జన్మించి రాపార్థివునకు
వారు పెఱిగి పెద్దవా రయి బలమిక,గర్వించి తిరుగుచుఁ గన్నతండ్రి
యెఱుఁగకుండఁగ నొక్కయెడ జమదగ్న్యాశ్ర,మముఁ జని ధేనువత్సము గ్రహించి
నగరునకుం దెచ్చి రగుఁగా దనక పదంపడి రాముఁ డంతయు నెఱింగి

తే. రోషభీషణమూర్తియై రోఁజుకొనుచు, బవరమున కెత్తి చనుదెంచి పరశువునను
గార్తవీర్యార్జునునిచేయుకరములు దెగఁ, గోసి గోవత్సమును దెచ్చుకొనియె మఱియు.

వ. అంతఁ గొంతకాలంబునకు మఱియు. 87

ఉ. అర్జునపుత్త్రు లాత్రపున నారయఁ జాలనిజాల్ములై వడిన్
స్వార్జితమన్యువేగమున నాశ్రమభూమికి వచ్చి భార్గవుం
డూర్జితవిక్రముం డనుచు నుల్లము నేయ కతండు లేమిచోఁ

గర్జము దప్పి తజ్జనకు కంఠము గోసి గమించి రేపునన్. 88

వ. అంతలో సమిత్కుశార్థ మరణ్యానికిం జనిన రాముండు వచ్చి తండ్రి వచ్చినవిధం బెఱింగి కోపఘూర్ణితనేత్రయుగళుండై తత్క్షణంబ శస్త్రంబు గ్రహించి యుద్రేకించిన శౌర్యంబున నీధాత్రి యెల్ల నిఃక్షత్రంబు గావించెదం గాక యని ప్రతిజ్ఞం జేసి కార్తవీర్యునిపుత్త్రపౌత్త్రులతో హైహయసహస్రంబులం దునుమాడి క్షోణితలం బెల్ల శోణితకర్దమంబు గావించి మించినకోపం బుపసంహరించి శాంతుండై తపోవనంబునకుం జనియె ననంతరంబ పెక్కు వేవేండ్లు కడచనిన వెనుక విశ్వామిత్రపౌత్త్రుండును రైభ్యపుత్త్రుండును నగుపరావసుం డను రాజేంద్రుండు గంటుమిగిలి పరశురామునిపాలికిం జని పరిహాసించుచు ని ట్లనియె. 89

ఉ. క్షత్రియజాతి నంతయును సాళ్వసఁ జేయుచు నీధరిత్రి నిః
క్షత్రముగా నొనర్తు నని కల్లప్రతిజ్ఞ వహించినాఁడ వో
క్షత్రపరాక్రమశ్రవణజాతభయావృతచిత్తవృత్తి! యీ
ధాత్రిఁ బ్రతర్దనాదులు ప్రథం గొనియుండుట నీ వెఱుంగవో. 90

ఉ. కాగాకో వారు క్షత్రియులు క్ష్మాతల మిప్పుడు రాజకోటులన్
దీరి వెలుంగుచున్నయది నీదుప్రతిజ్ఞ యు దెల్లఁ బొల్లయై
పారము ముట్టి రాజభయభావితుఁడై యతి వోలెఁ గానలం
జేరితె సిగ్గు మాలితివె చెప్పఁగ నే మిఁక నీదుచైదముల్. 91

వ. అనిపరిహాసించుచుం బలికిన నలుక వొడమినమనంబునం బరశురాముండు శస్త్రగ్రహణంబు గావించి మున్ను తనచే విడువం బడి నూఱులకొలందిగ వృద్ధిం బొంది భూపతులై యున్నరాజన్యుల నెల్ల నాబాలవృద్ధంబుగ వెదకి వెదకి వధించి గర్భస్థులైనయర్భకులు పుట్టినపుడ పట్టి గిట్టించియి ట్లిరువదియొక్కమాఱులు పెక్కేఁడై తిరిగితిరిగి ధరణీతలంబు నిఃక్షత్రంబు గావించి తచ్ఛాంతి కశ్వమేధాధ్వరంబు చేసి మాధ్యందినసవనంబున నధ్వర్యుం డగుకశ్యపునకుం బుడమి యెల్ల దక్షిణగా నిడినంత నతం డందు నంపఁదల్లులసంరక్షణంబునఁ జావునకుఁ దప్పి మిగిలి యున్నక్షత్రపుత్రుల రక్షించువాఁడై భార్గవుం గాంచి యి ట్లనియె. 92

ఉ. దక్షిణగా నొసంగితివి ధారుణి యంతయు నాది యయ్యె నీ
వీక్షితియందు నుండఁ దగ దెందు నొకప్పుడు గాని యేగుమా
దక్షిణసింధుతీరమున దవ్వుల నుండుము నాఁగ నో నటం
చాక్షణమంద పాసి చనె నాభృగురాముఁడు దక్షిణాబ్ధికిన్. 93

క. తనకడకు నరుగుదెంచిన, మునితల్లజు నతని నరసి మున్నీ రచటం
బొనరిచి శూర్పారకమను, ననువగు దేశం బొసంగె నతనికి భక్తిన్. 94

—కశ్యపుఁడు హతశేష రాజపుత్త్రులం దెచ్చి రాజ్యం బిచ్చుట:—

తే. జామదగ్న్యునివలనఁ గశ్యపుఁడు పుడమి, నట్లు కైకొని బ్రాహ్మణులందు దానిఁ
బెట్టి తపము గావించెదు పేర్మిఁ జేసి, చనియె నొక్క మహావనంబునకు నంత. 95

సీ. కాలక్రమంబున నాలవమూఁడవ,జాతులవారలు స్వైరవృత్తి
వర్తించుచును విప్రవనితలఁ జెఱఁ బట్టి, తద్ధనంబు హరించి తఱిమివైచి
రపుడు దుర్బలుఁడు బలాఢ్యునిచేఁ బీడి,తుం డయ్యె విత్తమందు న్విభుత్వ
మెవనికిన్ లేని దయ్యెం దానఁ బీడింపఁ, బడి రక్షకులు లేమిఁ బుడమిపడఁతి

తే. వడివడి రసాతలముఁ జేరఁ బాఱుట గని, కశ్యపుఁడు దానిఁ బోనీక కడక నూరు
వున ధరించుట నుర్వినాఁ దనరి పుడమి, పట్టువఱచుచు నిట్లని పలికె మునికి. 96

తే. రాజరక్షణ మది లేమి నోజ సెడితి, యతివరేణ్య! హైహయులలో నతివలందుఁ
జేరి ప్రాణము లరచేతఁ జేరఁ బట్టి,కొని బ్రదికియుండి రిప్పటికిని నృపతులు. 97

వ. మఱియుఁ బౌరవదాయాదుండు విదూరథపుత్త్రుండు ఋక్షవత్పర్వతంబున ఋక్షం
బులచే రక్షితుం డై యుండె సౌదాసదాయాదుండు యజ్వయు ననుకంపమానుండు
నగుపరాశరునిచే రక్షితుండై శూద్రునకుం బోలె సర్వకర్మంబు లతనికి నడచుటం
జేసి సర్వకర్ముండని పేర్వడసి యుండె శిబిపుత్త్రుండు గోపతి యనువాఁడు గోగ
ణసంవర్ధితుం డై యుండెఁ బ్రతర్దనపుత్త్రుండు వత్సుండనువాఁడు గోష్ఠంబున వత్స
రక్షితుం డై యుండె దధివాహనపౌత్త్రుండును దివిరథపుత్త్రుండు నగువాఁడు గంగా
కూలమ్మున గౌతమరక్షితుం డై యుండె బృహద్రథుం డనువాఁడు గృధ్రకూటం
బున గోలాంగూలరక్షితుం డై యుండె మరుత్తాన్వవాయంబునందలి క్షత్రియాత్మజు
లు సముద్రరక్షితు లై యిప్పు డం దందు శిల్పులయు స్వర్ణకారులయు జాతులం
జేరి యున్నవారు వీ రెల్ల నన్ను రక్షింప సమర్థులు వీరితండ్రులును దాతలును
నాకై మహాయుద్ధంబునఁ బరశురామునిచే వినిహతు లై రి కావున నాకు వారిదా
యాదు లగు వీరిం గౌరవించుట కార్యం బతిక్రాంతధర్మలగుజనులరక్షణంబపేక్షింపఁ
దలంపం గావునఁ గార్యానుసంధానంబు గావింపుమనినఁ గశ్యపుండు వారి నెల్లం
దెచ్చి భూపాలురు గా నభిషేకించె వారిపుత్రపౌత్త్రాదులవంశంబులు ప్రతిష్ఠితంబు
లయ్యె నని పూర్వవృత్తాంతంబు సెప్పుకొనుచుఁ గదలి పోవునంతఁ గుంతీపుత్త్రా
గ్రజుం డాశ్చర్యమగ్నాంతరంగుం డై మురాంతకుని దిక్కు మొగంబై యి
ట్లనియె. 98

మ. అవురా! రామపరాక్రమంబు దనుజేంద్రారాతిని న్మించిన

ట్లవు నిఃక్షత్రియ మై ధరిత్రి చనఁ జేయం గల్గె బుద్ధాదు లెం
తవిశేషార్థము రామభీతి తొలఁగన్ రక్షించె రాజన్యులన్
భువియున్ ధన్యము భూజనుల్ తలఁప ధన్యు ల్విప్రధర్మజ్ఞులౌ బుసన్. 99

వ. అని సంభాషించుకొనుచుం జని చని యుధిష్ఠిరార్జును లోఘునతీరంబున నస్త్రాదిగ
తుం డై నసూర్యుం డో యన శరతల్పగతుం డై మునిజనపరివేష్టితుం డై దేవపరి
వృతుం డగుదేవేంద్రునిచందంబున నున్నగాంగేయుం దవ్వులం గాంచి రథావతర
ణంబు సేయుటయు భీమసేనాదులును రథంబులు డిగ్గి రిత్తారు నుల్లంబు శిరోగ్రం
బులు గావించుకొని వినయవినమితాంగులై సమీపించి వ్యాసాదుల కభివందనంబు
లొనర్చి దేవవ్రతుని సేవించి పరివేష్టించి విశ్రమించి రంత వాసుదేవుండు శామ్య
మానానలంబునోలె నున్నశాంతనవుం దిలకించి సంబోధించుచు నీననవనుండై యి
ట్లనియె. 100

—శ్రీకృష్ణుండు భీష్ముం బ్రబోధించి ధర్మజునకు ధర్మము లుపదేశింపఁ గోరుట.—

సీ. మున్నున్నవిజ్ఞాన మున్నదియే సుప్రసన్నమై నీబుద్ధి సన్నగిలక
వ్యాకులత్వము లేక వర్తించుచునె శరాఘాతదుఃఖము మేనఁ గలుగదు గద
హృత్పీడ కంటె శరీరపీడ ఘనంబు, కాని తండ్రివరంబు గలుగుకతన
నిటికించుకొంటి చావుచేత నించుక,ముల్లు గ్రుచ్చిన బాధ తెల్ల మనఁగ
తే. నిన్నిముల్కులు మేనిలో నున్న వన్నఁ, జెప్ప నేటికి నీ కెట్లు చెప్ప నచ్చు
చావుపుట్టువు లుండునం చోవశీంద్ర!, దేవతల కేని యుపదేష్ట వీవ కావె. 101

తే. జ్ఞానవృద్ధుఁడ వైననీస్వాంతమందు, భూతభవ్యభవత్కార్యజాత మెల్ల
సుప్రతిష్ఠిత మయ్యె నోసూరివర్య!, ధర్మనిధి వీ వెఱుంగుదు ధర్మఫలము. 102

చ. ఉరుతరరాజ్యసంపదల నొందియు రోగవిహీనుఁ డయ్యు సుం
దరతరవిగ్రహుండవు నుదారుఁడ వయ్యును స్త్రీసహస్రసం
పరివృతుఁ డయ్యు నుం బ్రతిన పర్వఁగఁ జేయుచు నూర్ధ్వరేతుఁడై
పరఁగితి నిన్నుఁ బోల్ జనుఁడు పల్కఁగ నుండఁడె ముజ్జగంబులన్. 103

తే. సత్యధర్మపరాక్రమశౌర్యధైర్య,ములను భీష్మునికంటెను బురుషుఁ డొకఁడు
పరఁగఁ డనుపేర్మి కై తిట్లు పడియు మిత్తిఁ, బట్టి యుంచితి వెంతతపస్వి వొక్కో. 104

ఉ. వేదము యజ్ఞముం దపము వీర్యము శౌర్యము ధైర్యముం ధను
ర్వేదము నానృశంస్యము నరిందమశక్తియు సత్యశౌచముల్
భూదయితత్వమున్ సకలభూతహితత్వము దానధర్మముల్

నీదెస సంచితంబు లయి నిల్చె నెవండును నిన్నుఁ బోలునే. 105

క. లోకంబులు లోకేశులు, నాకద్వేషులును గూడ నై నీమీఁదన్
డీకొనుచు నెత్తి వచ్చిన, నేకరథంబునన గెల్తు వీ వృద్ధతివై. 106

మ. నిను నే నెల్లమునీంద్రులున్ సతము వర్ణింపంగ నాలింతు ము
న్ననమం డ్రావసువుల్ తదంశమున నాల్గైన నవాఁ డై తి నీ
కెనరాఁ డింద్రుఁడు నింద్రలోకమున ని న్నెంతేఁ బ్రశంసింత్రు నీ
వనఘాత్ముండవు నిన్నుఁ బోల్పురుషు మే మాలింప మేలోపలన్. 107

ఉ. ఈవు చరాచరంబు లగునెల్లజగంబులఁ జేయుశక్తియున్
దేవసమప్రభావమును దెల్లము గాఁ గలవాఁడ వున్నత
శ్రీ వెలయంగ దేవమునిసేవ్యము లుత్తమలోకముల్ గొనం
బోవుదు వంచుఁ జెప్పఁ బని వుట్టెడునే సుతపోధనాగ్రణీ. 108

క. కావున జ్ఞాతిక్షయదుఃఖావిలమతి యైనపాండవాగ్రజు ననుకం
పావిధ మేర్పడఁ దేర్పన్, భావము గావింపు మనుచుఁ బ్రార్థింతు నినున్. 109

వ. చాతుర్వర్ణ్యంబునందును జాతురాశ్రమ్యంబునందును జాతుర్వైద్యంబునందును జాతు
ర్హోత్రంబునందును యోగంబునందును సాంఖ్యంబునందును వేదోక్తంబులు శిష్టోక్తం
బులగునెట్టిధర్మంబు లగు నవియెల్ల నీవు సేవించి యెఱుంగుదువు ప్రతిలోమప్రసూ
తుల దేవజాతులయులక్షణంబును నీకుఁ గరతలామలకంబు లితిహాసపురాణార్థంబు
లును ధర్మశాస్త్రంబులును నీచిత్తస్థితంబులు నీ వెట్టిసంశ యార్థంబు లైన భేదింప
నోపుదువు నిన్నుఁ బోలినవాఁ డేలోకంబునందు నెవ్వండును లే డీపాండవేయుని
మనస్సముద్ధితం బగుశోకంబు నీబుద్ధిప్రభావంబునం బోకార్పు మో దేవవ్రతా!
మిమ్ముంబోటియుత్తమబుద్ధివిస్తారులు ముహ్యమాను లగుమానవుల ననుగ్రహిం
పన కదా యవతరింతు రనిన విని శాంతనవుం డింత వదనం బెత్తి ప్రాంజలియై. 110

—భీష్ముఁడు శ్రీకృష్ణుని వినుతించుట—

క. సర్వం బెవ్వనియం దగు, సర్వం బెవ్వానివలన సంభవ మగు నా
సర్వము తా నగు నెవ్వఁడు, సర్వాత్ముం డైనవాని స్మరియింతు నెదన్. 111

సీ. వినుతింతు విశ్వాత్మ విశ్వసంభవ విశ్వ, కర్మ విశ్వేశ్వర కర్మసాక్షి
నీలోన లోకముల్ నీవు లోకములలో, నలర సర్వమయుండ వైనదేవ.
భువనప్రభవలయముల కీవ కర్తవు, భర్తవు హర్తవు పరమపురుష
తత్త్వవిజ్ఞానంబు దవిలినఁ గాని నీ,దివ్యప్రకాశము తెలియ రాదు

తే. శిరమునన్ దివి పదముల ధరణి బాహు, వులను దిక్కులు వ్యాపింతువలఘుమూర్తి
నీదుచక్షువు సూర్యుఁడు నీదువీర్య, మలప్రజాపతి నిన్నెన్న నలవి యగునె. 112
తే. నరకసంత్రాసమును బాపి ధరణిజనుల, మనిచి సంసారసాగరమగ్నులైన
వారికిం దరి యై జగద్వల్లభుఁ డగు, కృష్ణు విష్ణు హృషీకేశు నే భజింతు. 113
ఉ. విష్ణుమయంబు సత్య మగు విష్ణుమయంబు జగత్త్రయం బగున్
విష్ణుమయంబు సర్వ మని నిన్ను భజించెద భక్తకోటికిన్
దృష్ణ దొలంగ నీప్సితము దీర్చి సుఖం బొసఁగూర్తు వెప్పు శ్రీ
కృష్ణ! నిను న్నుతించి భజియించెద నన్ను ననుగ్రహింపవే. 114
తే. ఇష్టగతి నొంద నెంచితి నేను నీకు, భక్తుఁడఁ బ్రపన్నుఁ డను నాకుఁ బరమపురుష!
యెట్లు చేసిన మే లగు నట్లు నీదు,దివ్యచిత్తమునఁ దలంపు మవ్యయాత్మ. 115
వ. అనిన వాసుదేవుం డి ట్లనియె. 116
తరు. అనఘ! నీభక్తి నాయందు నిశ్చలత, నంది యుండుటను నీయందు నామూర్తిఁ
గనఁ జేసితిని భక్తి గలుగక శాంతి,గైకొననిజనుండు గన లేఁడు నాదు
తను వీవు నాకు భక్తవరుండ వెపుడు,దమ మార్జవము తపోదానధర్మములు
దనరినవాఁడవు తాపసి వర్యా,తను గొంటి ననుఁ జూడ ధన్యుండ వరయ. 117
క. పునరావృత్తిరహితములు, ఘనములు లోకములు నీదుకర్మఫలములై
మునిజనులు మెచ్చుచున్నఁ, గొన నచ్చెదు నింతలోనఁ గురుకులదీపా. 118
తే. నీదుజీవిత మింక గణింప నేఁబ,దాఱు దినములు శేషమై యెఱు నంత
లోన నూతేండ్లు నిండు నీమేను వాసి,కర్మఫలమున శుభ మొందఁ గలవు సూవె.
క. వసువులు వీరె విమానము, లసదృశగతి నెక్కి నింగి నంతర్హితులై
వెస నీదురాకఁ గోరుచు, ప్రసమీక్షించెద రుదీచి రవి సేరుటకున్. 120
వ. జ్ఞానస్వరూపుండ వై ననీవు పోయిన నీలోకంబున జ్ఞానం బంతయు నశించుం గావున
వీ రెల్లరు ధర్మవివేచనంబునకు నీసవిధంబుఁ జేరియున్నవారు జ్ఞాతిశోకోపహతచిత్తుం
డైనధర్మరాజునకు ధర్మార్థసమాధియుక్తంబు లగునుక్తి విశేషంబులఁజిత్తంబునం గల
యుత్తలంబు నపనయింపఁ బ్రార్థించుచున్నవాఁడ ననిన శాంతనవుం డించుక మో
మెత్తి కృతాంజలియై యి ట్లనియె. 121
తే. లోకనాథ! నారాయణ! శ్రీకళత్ర!, నీదువాక్యము వినినంత నాదుమనము
హర్షమున సంపరిప్లుత మయ్యె నెట్లు,వాక్పతీ! నీదుసన్నిధిఁ బలుక నేతు. 122
చ. పలు కెది పల్కఁగాఁ దలఁపు వచ్చెడు నయ్యది యెల్ల నీది యై

తెలియఁగ వచ్చు నల్పుఁడు మెదే నని యెంచిన నద్ది యెల్ల నీ
నలిపిన దై కనంబడు విశాలమతీ! జగదేకకర్త నీ
వెలమి వహింప నీయెడ నెట్లు చరింపఁ గలాఁడఁ జెప్పవే. 123

ఆ. దేవరాజు చెంత దేవలోక మెవండు, తెలియఁ బలుకు వాఁడు దేవరకడ
సకలధర్మములను బ్రకటింప నెంచెడు,ననుచుఁ దెలియ వచ్చు నమలచరిత. 124

వ. విషానలోపమంబు లగుశరంబుల తాపంబున నామనంబు వ్యథితం బయ్యె బుద్ధియు సంప్రసన్నంబు గాకుండె శరీరం బెండుకొని పోయె మాట లాడుటకును నాకు శక్తి సన్నగించె మర్మంబు లెల్లఁ బరితపించుచున్నయవి ప్రాణంబులు వెడలి పోవుటకుం ద్వరపడుచున్న విట్టిపట్ల నే నెట్లు సంభాషింపఁ గలుగుదు నైన నీసమక్షంబున ధర్మంబు లుపదేశించుటకు వాచస్పతియు జంకువడిన ట్లగు నన్ను క్షమింపుము నా కిపుడు దిక్కులును విదిక్కులును భూమ్యాకాశంబులును గాన వచ్చుట లేదు నీయనుగ్రహంబు కలిమి నిట్లు భాషించుచుంటి నే నసమర్థుండ సమర్థుండ వీవ యీధర్మరాజునకు ధర్మంబు లుపదేశింపుము నీ వాగమంబుల కెల్ల నాగమంబవు లోకకర్తవు నీవుండ ననుఁబోటివాఁ డుపదేశింపఁ బూనుట గురుం డుండ శిష్యుం డుపదేశించిన ట్లుండు ననిన వాసుదేవుండు. 125

మ. ఉపపన్నం బగు నిట్టివాకు కురువంశోద్భూతుఁ డై సత్వవీ
ర్యపరిష్కారపరిష్కృతుం డయి సమస్తార్థక్రియాదర్శి యై
నృపుఁ డై దేవవరప్రసాదమున నిర్నిద్రప్రభాశాలి యై
యెపుడుం జేర్మికి నైననీ కగు సమృద్ధప్రభావోదయా. 126

శా. బాణాఘాతరుజన్ వచించితివి నీపట్లం గృపం జేసితిన్
ద్రాణల్ గల్గ వరం బొసంగెదను దత్ప్రాప్తిం జనున్ వేదనల్
ప్రాణంబుల్ స్థిమితత్వ మొందు దగయుం బాయున్ శ్రమం బేగు ని
ద్రాణం బై నమతిప్రభావము సముద్యద్రీతి దీపించెడున్. 127

క. బల మొదవు మదికి బుద్ధియు, విలసనమునఁ బొందుఁ దమము విడివడు నీ వా
జలధరముక్తుం డగుజా, బిలితెఱఁగున వెలుఁగఁ గలవు విజ్ఞానగతిన్. 128

తే. ధర్మ మర్థంబు చింతించు తఱివిశుద్ధ,బుద్ధియుఁ జరాచరాత్మకభువన మరయు
పట్ల దివ్యబోధము నీకుఁ బరిఢవిల్లుఁ,గానఁ గల వెల్ల జలమున మీన మట్లు. 129

సీ. ఇట్లు వర మనుగ్రహించిన హరి ఋగ్య,జుస్సామముల మహర్షులు నుతించి
రంతరిక్షమ్మున నఖిలవాదిత్రముల్,మ్రోసె నచ్చరలు సమ్మోద మెసఁగఁ

బాడిరి సహాభీష్మపాండవుఁ డగుకృష్ణు,పయిఁ గురిసెం బుష్పవర్ష మపుడు
దెసలు శాంతము లయ్యె విసరె సుఖావహా,మయి గంధవహ మభ్ర మమల మయ్యె
ఆ. నంతఁ గొంతలోన నంబుజాప్తుఁడు పశ్చి,మాచలంబు దరికి నరుగుటయును
మునులు లేచి భీష్మముఖ్యులకుం జెప్పి, చనిరి రేపు వత్తు మనుచుఁ బలికి. 130

—ధర్మరాజు కృష్ణాదులతో హ స్తిపురికిం జని మరలి వచ్చుట—

వ. అంతఁ గృష్ణుండును బాండవులును దక్కినవారును గాంగేయు నామంత్రించి ప్రద క్షిణనమస్కారంబు లర్పించి రథంబు లధిష్ఠించి చనిరి సేనాసమూహంబును రథస మూహంబునకు మున్ను వెనుకల ననుసరించి ఋక్షవత్పర్వతంబు పూర్వపశ్చాద్భా గంబులం బొరదినసర్మదానదితెఱంగునం బరంగి చనియె నప్పుడు. 131

చ. పొడిచె నిశాకరుం డెదుటఁ బ్రొద్దుఖరాంసులఁజేసి వాసి వో
యెడుపగిదిన్ రసంబును గ్రహించినదాన మహౌషధీలతల్
కడువడి వాడివత్తలయి కానఁగ వచ్చిన వానిపైఁ గరం
బిడి పొదలించు నక్కటికి మెచ్చి యనన్ జగ మెల్ల మెచ్చఁగన్. 132

వ. అనంతరంబ వా రందఱును బురప్రవేశంబు గావించి తమతమగృహంబులకుఁ జని రంత మురాంతకుండు నిజనిశాంతంబున నా రేయి సుఖసుప్తుండై వేకువ మేలు కాంచి విజ్ఞానంబున సర్వజ్ఞానంబు లవగతంబు చేసికొని బ్రహ్మావలోకన తత్పరుం డయ్యె నయ్యెడ వందిమాగధులు వాసుదేవుని స్తోత్రపాఠంబులఁ బ్రస్తుతించిరి గాయకులు గానంబు చేసిరి శంఖమృదంగాదివాదిత్రంబులును వేణువీ ణాదినిస్వానంబులును బోరుకలిగె నాలో యుధిష్ఠిరుండు గీతవాదిత్రనిస్వనంబు లం బ్రబోధితుండై కాల్యకృత్యంబులు సాకల్యంబుగం దీర్చి పేర్చినభక్తి భీష్మద ర్శనాభికాంక్షియై యుండెఁ గృష్ణుండును స్నానసంధ్యాద్యనుష్ఠానంబులు నిర్వర్తించి యగ్నుల నారాధించి వేదవేత్త లగువిప్రులువేగురకు వేయి వేయిగోవుల నీఁ బలికి మంగళాలంభనం బొనరించి తన్నద్దంబునం జూచుకొని సాత్యకిం బిలిచి నీవు పోయి భీష్మునిపాలికిం బోఁ బయనంబు గమ్ము నీకై కృష్ణుండు వార్చి యుండె నని యుధిష్ఠిరునకుం జెప్పి ర మ్మనిన నతం డట్లు చేయుటయుఁ గాంతేయాగ్రజుండును ఫాల్గునుం బిలిచి రథంబు సన్నద్ధంబు గావింపుము దేవవ్రతుండు సందడిం బడఁ జాలఁడు గావున సైనికులయుఁ బురస్సరులయు బ్రయాణంబు నిలువరింపుము మనము మాత్రమ పోయి గాంగేయు నుపాసింత మతండు మనకుఁ బరమగుహ్యాం బుపదేశించెడు ననిన నతం డశ్వచనం బొదలం దాల్చి. 133

సీ. చెప్పినట్ల రథంబు సిద్ధంబు చేసినఁ, దమ్ములతో ధర్మతనయుఁ డపుడు
దానిపై నెక్కి భూతము లేను నొక్కచో, భాసిల్లు నసఁ బొల్చి వాసుదేవుఁ
డున్నచోటికి నేగుచున్నంత నతఁడు సా, త్యకితోడ రథ మెక్కి తారసిల్లె
వారి కన్యోన్యసంభాషణంబులు సెల్లె, దారుకుఁ డంతరథంబు నడపె
తే. సారథిప్రబోధితము లాశైబ్యమేఘ,పుష్పముఖ్యము లగురథ్యములు నభంబు
నొరయుచు ఖురాగ్రముల రాయుచుర్వినింత,మాత్రలోఁజేరఁ గానెఁగురుక్షేత్రమునకు.
వ. పాండవేయులును వెన్నడించి వచ్చినంత నెల్లరు రథావతరణంబు గావించి దేవగణ పరివృతుం డై నపితామహుండునుం బోలె ఋషిగణపరివృతుండై శరతల్పగతుం డై యున్నకురుపితామహుం దరియ వచ్చి దక్షిణకరంబు లెత్తిఋషుల కభివందనంబు లాచరించి భయభక్తు లినుమడింప దేవవ్రతు నుపాసించి రనిజనమేజయుండు వైశంపాయనునిదిక్కు మొగం బై మహామునీ! యవ్వీరసమాగమంబున నడచిన కథావిధానం బెట్టిది చెప్పుమనిన నతం డిట్లనియె. 135
మ. శరతల్పం బనుక్రుంకుమెట్టపయి భాస్వంతుండు నాఁ బొల్చుని
ర్జరలోకాపగపట్టిఁ జుట్టుకొని కృష్ణస్వామిముఖ్యుల్ తగన్
సురమానీంద్రుఁడు దొట్టిమానివరులున్ క్షోణీపతుల్ కొందఱున్
బరమాహ్లాద మెసంగ వచ్చి రుచితప్రారంభశుంభద్గతిన్. 136
తే. వచ్చి యెల్లరు గాంగేయుపరిసరమున, విశ్రమించినయంతలో వేల్పుఁదపసి
మది నొకించుక ధ్యానించి మనుజపతుల, నరసి యిట్లని వచియించెనంచితగతి. 137
మ. శమితారాతి నదీసుతుండు చరమక్ష్మాభృద్గతుం డై నయ
ర్యముచందంబునఁ జూడఁ నొప్పెడి శరీరం బీఁగి తా నూర్ధ్వలో
కములం బొందఁగఁ బోవు ధర్మములకుం గాణాచియై యొప్పునీ
సుమనస్కుం డితనిన్ భజించి వినుఁడీ శ్రోతవ్యముల్ ధర్మముల్. 138
క. అని నారదుండు పలికిన, విని భీష్ముని దరిసి యెట్టివిషయము లడుగన్
జనునో తెలియక యచ్చటిజను లొండొరుఁ జూచుకొనఁగ సాఁగిరి మిగులన్. 139
వ. అంతఁ గౌంతేయాగ్రజుండు గదాగ్రజుండు దక్షుఁ దక్షినవా రసమర్థు లని నిశ్చయించి నిశ్చలచిత్తంబున నతనిం గాంచి యిట్లనియె. 140
మత్త. సర్వకర్మవిదుత్తరుండవు సర్వలోకగురుండవో
శర్వసన్నుత! నీవు దక్కఁగ స్వర్ణదీసుతుతో సుధుల్
నిర్వహిల్ల వచింప నేర్చిననేర్పు కాఁ డొకరుండు లే

దుర్వారన్ మునుమున్న నీనుడు లొప్పఁ జేయవె సత్కృపన్. 141

వ. అనిన భగవంతుం డగువాసుదేవుం డాఁ గావుత మసి దేవవ్రతునిసన్నికృష్ణగతుం డై.

ఉ. రేయి సుఖం బెసంగ నిదురించితె నీదగుమేనినొప్పియుం
బాయనివ్యాకులత్వమును బాసెనె? బుద్ధి వికాసపద్ధతిన్
డాయఁగ వచ్చెనే? మును పొడంబడ నుండెడునెల్లజ్ఞానమున్
నీయెడఁ దోఁపవచ్చెడినె? నిర్దళితాఖిలకల్మషవ్రజా. 143

సీ. అనుడు భీష్ముం డను ననఘ! నీదుప్రసాద,మున దాహమును మోహమును శ్రమంబు
క్లమము గ్లానియు రుజ కడతేరె భూతభ,విష్యద్భవద్గతివిధము లెల్లఁ
గరతలామలకము కరణి నేఁ గనుచుంటి, వేదవేదాంతధర్మాదు లెల్ల
సవగతంబులు నాలు గాశ్రమంబులయు దే,శకులాదులయు ధర్మసముదయంబు

తే. నాదుహృదయంబునం దిప్డు నలువుమీఱు, నేది యెటు చెప్ప నగు నట్టులే వచింతు
భవదనుధ్యానబృంహితుం డవుటఁజేసి, చెప్పఁగ సమర్థుఁడై తి శ్రేయసంబు. 144

క. అయినను బాండుకుమారుల, కయముగ న న్నెల చెప్ప మనియెద వీ వే
ల యొకో చెప్పవు నీదుహృ,దయమున నగుతలఁ పదేమొ దాఁపక చెపుమా. 145

వ. అనుటయు వాసుదేవుండు. 146

ఉ. ఎల్లశుభంబులున్ యశము నే నతివేలముగా గణించితిన్
దెల్లము క్రొత్తపెం పిపుడు తెచ్చికొనం బని గల్గఁ బో దిలం
జల్లనివాఁడు చంద్రుఁ డన సాఁగిన విస్మయ మందుసే జగం
బుల్లపితప్రభావ! విను మున్న తెఱం గెఱుఁగ న్వచించెదన్. 147

ఉ. నీకు యశంబు గల్గుటకు నేను దలంచి విశేషశేముషిన్
నీకడ నిల్వరించితి ననింద్యచరిత్రుని ధర్మపుత్రునిం
జేకొని ధర్మముల్ తెలియఁ జేయుము దాన ననంతమై యశం
బీకుతలం బెసంగువఱ కింతకు నంతగుచుం బొసంగెడిన్. 148

తే. ఈవు ధర్మజునకుఁ జెప్పునెల్లధర్మ,వచనములు వేదములువోలె వన్నె గాంచు
నాత్మవిద్యాప్రసంగతి ననల నీకుఁ, బుణ్యలోకానుభవ మగుఁ బుణ్యమూర్తి. 149

చ. తనయశ మెంతదాఁక వసుధ న్విదితం బగు నంతదాఁక న
జ్జనుఁ డలనాకమం దలరిసౌఖ్యములం దులఁదూఁగుఁ గావునన్
జనవర! యిట్లు చేసితి నిజం బిదె కొల్చుచునున్నధర్మజుం
గనుఁగొని ధర్మముల్ తెలుపఁ గాఁ దగు నీదుయశోభివృద్ధికిన్. 150

సీ. వయసున వృద్ధుఁడ వయి యుండుటే కాదు, విజ్ఞానమునఁ జేసి వృద్ధుఁ డైతి
శ్రుతసమన్వితుఁడవు క్షితిఁ బుట్టినది కోలె, వృజినం బెఱుంగవు సుజనహితుఁడ
వఖిలధర్మములు నీ కయినసొమ్మదె ఋషుల్, వేల్పులు నిన్ను సేవించుచుంద్రు
జిజ్ఞాసమానులై చేరినవీరికిఁ, దండ్రి బిడ్డలకట్లు ధర్మములను
తే. దెలుపుమడిగినఁ దెలుపంగవలయుననుచుఁ, దెలుపకుండినదోషంబు గలుగుననుచు
శాస్త్రముల విందు మందున సకలలోక,ముల నెసంగెడుకర్జంబు సలుపు మనఘ.
వ. అనిన దేవవ్రతుండు నీవు భూతాత్ముండవు నీచెప్పినట్లు చేసెద ధర్మాత్ముం
డగుధర్మరాజు నన్ను ధర్మంబు లడుగుఁ గావుత మే నిపుడు ప్రీతుండ నా
వాఙ్మానసంబులు దృఢంబు లని పలికి పరమాదరంబున ని ట్లనియె. 152

భీష్ముండు ధర్మరాజును సప్రేమంబుగా గౌరవించుట.

సీ. ఏమహాత్ముఁడు గల్గ నెల్లమహర్షులు, సంప్రమోదాత్ములై సన్నుతించి
రేపూతచరితుండు దీపించుటం గురు,కుల మంతయుఁ బవిత్రకలన నొప్పె
నేధర్మనిరతునియెడ శమంబు దమంబు, క్షమ బ్రహ్మచర్యము సత్య మెసఁగె
నేధీరునకు బంధుభృత్యాతిథిశ్రిత, జనులఁ బ్రోచెడుబుద్ధి సహజ మయ్యె
తే. నేదయాళుఁ డొకానొకప్డే నధర్మ,మాచరింపనివ్రతమున నై మెలంగు
నాతఁ డిజ్యాధ్యయననిత్యుఁ డడుగుఁగాత,మడుగఁ దలఁచినధర్మములగున యేని.
వ. అనిన శ్రీకృష్ణుండు వెండియు. 154
చ. దుర మొనరించి శాత్రవులత్రుళ్లడఁగించుటె కాక వీఁకమై
గురువులఁ బూజ్యులన్ దునిమి కొంటి ఖలుండ నటంచు సిగ్గు బీ
తొరసినచిత్తవృత్తిఁ గడు నోటమికై పుయిలోడి నేఁడు నిన్
దరియఁగఁ జాలఁ డయ్యెడిని ధర్మతనూజుఁడు శాపభీతుఁ డై. 155
వ. అనుడు దేవవ్రతుండు. 156
సీ. దాన మధ్యయనంబు తపము యజ్ఞమును బ్రా,హ్మణజాతికిం ధర్మ మైనయట్లు
క్షత్రియజాతికి సంగ్రామమందు మి,థ్యాప్రవృత్తుని దండ్రి తాత భ్రాత
గురువు నాఁబడువారిఁ గొనకొని చంపుట,యును జచ్చుటయు ధర్మ మనఁగ నొప్పు
ధర్మవిదుండు క్షత్రప్రవరుం డిట్లు, కావించి పాపంబుఁ గానఁ బోఁడు
తే. ధర్మసేతువు మీఱినదాన దోష, మెసఁగు నాహూతుఁడై యని కేఁగి పెనఁగి
వసుధ నరిగజశైలయు ధ్వజపలాశి,గా నొనర్చినరాజు స్వర్గంబు గాంచు. 157
క. ఇది సుక్షత్రియజనునకుఁ, బొదలినధర్మం బటంచు మును మను వనియెం

బోదలంగ నెఱిఁగి ధర్మజుఁ, డెద సందియ మంద నగుట కేమనఁ జెల్లున్. 158

మ. అని భీష్ముండు వచింప ధర్మతనయుం డమ్మేటినిం డాయఁగాఁ
జని తత్పాదము లంటి మ్రొక్కుటయు సుస్వాంతుం డతం డమ్మహీ
శుని మూర్ధంబును మూఁడుకొంచు నెలమిన్ జూపించు నెమ్మోమునం
గని గారంబునఁ గూరుచుండు మని వేడ్కం బల్కె నిట్లయ్యెడన్. 159

తే. వత్స! శంకించె దేటికి వగపు దక్కి, నన్నడుగనున్న దడుగుము నావుడు యమ
నందనుఁడు కేశవపదాభివందనంబు, సలిపి వ్యాసాదులకు మ్రొక్కి కొలిచి భీష్ము.

సీ. రాజధర్మమ్ము పరమ మని ధర్మజ్ఞు, లం ద్రతిభార మయ్యది సమస్త
జీవలోకాశ్రయ మై వెలయుట వింధు, ధర్మార్థకామముల్ దవిలి యుండు
మోక్షధర్మము నందుఁ బొందుపడున్ హాయ, ముఁనకుఁ గల్గెము గజమునకునంకు
శము నట్లు రాజధర్మము లోకమునకుఁ బ్ర, గ్రహణం బని తలంపు గలుగు నట్టి

తే. ధర్మము నశించిన వ్యవస్థ తలఁగు నెల్ల, వ్యాకులంబగురవి యుదయంబునొంది
తమము వాపెడుగతిరాజధర్మ మశుభ, గతినడఁచిపుచ్చెడునటంచుఁగలదుగాన.

వ. ధర్మభృద్వరిష్ఠుండ వని వాసుదేవుండు నిన్ను మన్నించుచున్నవాఁడు నీవు
సర్వజ్ఞుండవు నాకు మునుమున్న రాజధర్మంబు లెఱింగింపు మవ్వల నెల్ల
రహస్యంబులును విందు ననిన మందాకినీనందనుండు. 162

మ. భగవంతుండును ధర్మమూర్తి యగుచున్ భాసిల్లు శ్రీకృష్ణునిన్
జగతీదేవులఁ గొల్చి వేదవిహితక్షత్రోజ్జ్వలధర్మముల్
తగ వాక్రుచ్చెద నెల్లవాని విని యంత స్వాని నాలింప నీ
దగుచిత్తం బగు వానినిం దెలుపు మే వ్యాహారముం జేసెదన్. 163

వ. అవహితుండ వగు మని యి ట్లనియె. 164

భీష్ముండు రాజధర్మంబు లెఱింగించుట.

సీ. రంజనకాముఁడై రాజు దేవతలయు, ద్విజులయు పూజ గావింప వలయు
దేవతాతిథిసేవ గావింప ధర్మలోపముఋణంబు దెగు జగద్వందితుఁ డగుఁ
బురుషకారమున నెప్పుడు జతనింప నొ, నది లేమి దైవ మర్థదము గాదు
పౌరుషదైవముల్ బండికుండలఁ బోలు, నా రెంటఁ బౌరుష మధికతరము

ఆ. పురుషకారమునకు నరయ దైవము తోడు, పాటువలనఁ గలుగుఫలము లేక
యున్నఁ గలుగ దగుట నుద్యోగ మొనరింప, వలయు వాని నొంద వచ్చు లక్ష్మి.

క. తనదు ప్రయత్నము వితథమ్మై, చనినంతన రోసి మానఁ జనదు మఱియు దా

నిన పూని పూన్కి విడువక, పొనరింపం జెల్లు నయము పొంపిటివోవన్.166

ఉ. సత్యము సిద్ధికారణము సత్యము ప్రత్యయముం బొనర్చు నా
సత్యమె మానికోటికిని శాశ్వత మైనమహాధనం బగుఁ
సత్యముకంటె నొండొకఁ డెసంగదు లోకములందుఁ గావునన్
సత్యము గల్గి రా జధికసౌఖ్యము లందెడు నిందు నందునున్. 167

తే. దాంతుఁడుఁ గుణవంతుఁడు ధర్మనిరతుఁ
డును దయాళుఁడును బ్రసన్నుఁడును జితేంద్రి
యుఁడును శీలవంతుఁడు దాతయు నగునేత
సిరులఁ బెడబాయ కసమునఁ జెలఁగు చుండు. 168

తే. ఆర్జవము సర్వకార్యములందుఁ దనర,నయమునుం ద్రయీసంవరణమును విడక
మార్దవముతీక్ష్ణతయుఁగల్గిమాన వేంద్రుఁ,డెల్లనాఁడును వర్తించియొసక మెసఁగు,

క. దండవిధానము విప్రుల, దండన్ బొనరింప రాదు ధారణి భూతం
బొండొకఁ డుండదు వారల, కుం డక్కఁగఁ బరమ మగుచుఁ గురుకులదీపా.

వ. ఈయర్థంబు దేటపడ మహాత్ముం డగుమనువు రెండుశ్లోకంబులు సెప్పె నవి
సెప్పెద నాకర్ణింపుము. 171

క. జలముల నగ్నియు విప్రుల, వలనన్ క్షత్రంబు తాలవలనన్ లోహం
బలరె న వెల్లెడఁ దేజున, వెలుఁగుం దమపుట్టుచో నివృత్తంబు లగున్. 172

క. శిలఁ దెగ నేయఁగ లోహము, జలములఁ గాల్పంగ నగ్ని జగతీసురులన్
గలహింప క్షత్రజాతియుఁ, దలఁచి కడంగినను జెడుట తథ్యం బరయన్. 173

క. మను విట్లు చెప్పెఁ గావున, జనవర బ్రాహ్మణులపట్లఁ జనదు పగం గై
కొని దండించుట బ్రహ్మముఁ, గని యుందురు వారు వారిఁ గని మ్రొక్కఁదగున్.

వ. మఱియు లోకత్రయవిఘాతుకులు దండనార్హు లైన విప్రులునుం గల రని
శుక్రుండు కొన్నిశ్లోకంబులు సెప్పె నవియు నాకర్ణింపుము. 175

భీష్ముండు విప్రులలో దండార్హుల నిరూపించుట.

క. కాదనక శస్త్రముం గొని, మీఁదికిఁ జనుదెంచి చంప మెలఁగెడువిప్రున్
వేదాంతి నైన నదుమం, గాఁ దగు రాజునకు ధర్మకార్యాసక్తిన్. 176

సీ. ధర్మరక్షఁ బొనర్పఁ దలఁచిననృపతి బ్రహ్మఘ్నుఁ డైనను భ్రూణహత్య చేసి
యున్నను గురుతల్ప మొందినను బ్రభుత్వ, విద్వేషి యైనను విప్రు నెఱిఁగి
పాపరాధుం డని తోఁప వచ్చిన దేహ, దండం బొనర్పక దయ దలిర్ప

విషయాంతమునయందు వెస విసర్జనము ప్ర, వాసశిక్ష విధింప వలయు నెపుడు
ఆ. ద్విజులయందు భక్తిదివిరినవా రెన్నఁ, దనకు దయితు లనుచుఁ దలఁప వలయు
నవనిఁ బురుషసంచయముకంటెఁ గోశము, పరమ మనఁగ రాదు ధరణిపతికి. 177

వ. శాస్త్రనిశ్చితంబు లగుమరుజ్జలపృథ్వీవనపర్వతనరదుర్గంబు లాఱింటియందును నరదుర్గంబు సుదుస్తరంబు గావున భూవల్లభుండు చాతుర్వర్ణ్యంబునందు దయ గలిగి ధర్మాత్ముం డై యుండు నది గాని యది యెల్లయెడం జెల్ల దనియుం జెప్పె నాకర్ణింపుము. 178

చ. క్షమ గలకుంజరంబువలె శాంతియ పూని మెలంగ రాదు రా
జమరఁగ మావటీఁడు దురహంకృతి హాస్తిశిరంబు మెట్టుచం
దమున క్షమాన్వితుల్ నృపతి దక్షుఁడు నా కథమాధముండు నేఁ
గ్రమ మఱి నట్టిచిత్తమునఁ గాఱులు ప్రేలి పరాభవించెదుర్. 179

క. కావున మృదుతయుఁ దీక్ష్ణత, యే వేళం గలుగఁ బోనిహృదయముతోడన్
భూవిభుఁడు వసంతార్కుని, శేవన్ శీతోష్ణగతుల డెక్కొన వలయున్. 180

తే. పూని ప్రత్యక్షముననునుమానముననును,మఱియునౌపమ్యముననాగమమునస్వపర
జనుల నెప్డు పరీక్షించి కొనఁగ వలయుఁ, బేర్మి కెక్కఁ దలంచి పృథ్వీధవుండు.

తే. ఎల్లపుడుఁ గూడదని చెప్పనొల్లఁ గాని,యెల్ల వ్యసనంబులున్ విడఁ జెల్లు వ్యసన
సంగమునఁబరిభూతుఁడైక్ష్మావిభుండు,ద్వేషియగువానిఁగనుఁగొనివెఱచుజగము.

మ. తగ నీర్షోసి మనోజ్ఞునుగుం డగుప్రియుం డా వీడి గర్భప్రియం
బగుచక్కం దలపోయుపొల్తి పలె నిత్యంబున్ మహీజాని ధ.
ర్మగుఁ డై స్వప్రియము న్విడం గలిగియున్ రాష్ట్రప్రజాకోటి కి
ష్టగతిం బోయెడువాఁడ యై మనఁగ నౌ సంపద్యశఃకాముఁడై. 183

క. కరితురగస్యందననర, పరికరపరిపూర్ణుఁ డై నపతి ధీరుఁడ యై
పరఁగిన నిర్భయుఁ డగు ధై,ర్యరమ న్విడువంగ రాదు రాజున కెపుడున్. 184

సీ. తమతమచోటులం దారు మెలంగక, మితి మీఱి తుద కవమతిఁ దలంత్రు
కార్యసంశయమును గల్పింతు రెట్టిగో, స్వార్థమే వెల్లడింత్రు రుల కైనఁ
గోరంగ రానికోర్కులు కోరుదురు రాజు, భోజ్యంబుల హరింత్రు పూజ్యతవిడి
లంచంబులం గొని వంచించి కర్జంబు, సెడ నడతురు దేశ మడలు గూడువ
తే. శాసనంబులు సృష్టింత్రు చనవొనర్తు,రంతిపురిఁగాచువాండ్రతో నందుఁజొరఁగఁ
దుల్య వేషంబు గలరయి త్రుల్లిపడుచు, సన్నిధి నపానజృంభముల్ సలుపుచుండ్రు.

సీ. భీతి యింతయు లేక భూతలేంద్రుం డెక్కు, నిభహయరథముల నెక్కుచుండ్రు
సరకుసేయక రాజవరు సంగతిం గని, యిది తప్పు తగ దని వదరుచుండ్రు
నగుదురు కోపించినన్ గారవించిన, మెచ్చరు దోషంబు మీఁద వైతు
రాజ్ఞ చెల్లింప రవజ్ఞ గావింతురు, హేళనంబు లొనర్ప నెంతు రెపుడు
తే. కూడి క్రీడింప నెంతురు కూళ లగుచు, భృత్యు లొడయండు చన విచ్చి నిత్యమార్ద
వమున నై పరిహాసముల్ పలుకుకొనుచు, మైత్రిమైఁ జేరఁదీసినమాత్రఁ జేసి.

వ. అని చెప్పి దేవవ్రతుండు వెండియు నోపాండునందనా! రాజేంద్రుండు నిత్యో
ద్యుక్తుండు గావలయుం గాని విగతోద్యముండై యాఁడుదానివలెం గూరు
చుండ నొప్ప దని భార్గవుండు చెప్పినవాక్యంబులు గల వాకర్ణింపుము. 187

తే. అరులపైఁ బగ సేయనిధరణివిభుని, విద్యకుఁ బ్రవాసి గాకుండువిప్రు వీరి
నిర్వుగను భూమి మ్రింగు నహీశ్వరుండు, బిలశయంబుల మ్రింగినపోలుపు దోప.

వ. రా జైనవాఁ డిట్లు తెలిసి చేరఁ దీయ నైనవారిం జేర దీసి విరోధింపఁ దగిన
వారి విరోధించి ప్రవర్తింప వలయు సప్తాంగంబులకుఁ బ్రతికూలప్రవర్తనుం
డగువాఁడు గురుండు మిత్రుండు నైన దండింప నర్హుం డని తొల్లి మరుత్తుండు
బృహస్పతిమతంబునఁ బలికెఁ గావున. 189

సీ. అవలిప్తుఁ డగుచు చేయఁగ రానిపని సేయు, గురునైన దండింపఁ గూడుఁ బతికి
సగరుండు నిజపుత్త్రుఁ డగునసమంజసుఁ, బురబాలురన్ నది ముంచె నంచు
మడియించె నుద్దాలకుఁడు సుతుం డగుశ్వేత, కేతుఁడు విప్రులఁ గేరె ననుచు
వెడలంగ నడచె నా విందుము గావున, రాజధర్మము ప్రజారంజనంబు
తే. సత్యసంరక్షణంబు నార్జవ మహింస, కాలదానము విక్రమక్రమము క్షాంతి
గలిగి వర్తిల్లు భూపతి చలన మింత, యైనఁ బొందక యభివృద్ధి నతిశయిల్లు.

సీ. ఆత్మవంతుఁడు జితస్వాంతుండు శాస్త్రాను, గతనిశ్చయుండును శ్రుతిహితుండు
సంవృతమంత్రుండు సంతతధర్మార్థ, కామమోక్షరతుండు క్షత్రియుండు
రాజు గాఁ జెల్లు నారాజునకు నరక్ష, ణముకంటెఁ బాప మన్యంబు లేదు
కావున ధర్మసత్కారరక్షయును జాతుర్వర్ణ్యరక్షయు నుర్వి నొప్పు
తే. విశ్వసింపక పోరాదు విశ్వసింప, రాదు పెరవారి నెప్పుడు రాజచంద్రుఁ
డెలమిషాడ్గుణ్యగుణదోషములుస్వబుద్ధి, నరయుచుండంగవలయుఁ బెంపంద నెంచి.

తే. పరులఛిద్రంబు లెఱిఁగి త్రివర్గమందు, సువిదితార్థుండు విజ్ఞానశోభితుండు
యుక్తచారోపధియుశమనోద్యముండు, గుహ్యకేంద్రుఁడై కోశంబుగూర్పవలయు.

సీ. స్థానవృద్ధిక్షయాత్మకగుణదోషముల్, తెలిసినవాఁ డయి తేజరిల్లి
భృత్యులం బ్రోచుచుఁ బేదలఁ గాచుచు, స్మితపూర్వభాషి యై చెలువు మిగిలి
జితతంద్రుఁ డై వృద్ధసేవ సేయుచు సుజనులకుఁ గల్పించి వృత్తులను భక్తి
బ్రహ్మవిత్తము హరింపక యసభ్యములు, విడనాడి సభ్యముల్ వేడ్కఁ జేసి
తే. వశ్యమగునాత్మ గలఁడయి స్వచ్ఛవర్తనుండు దాతయు భోక్తయై యుండి రమ్య
సాధనుం డయి వర్తించు క్ష్మాతలేంద్రుఁ,డైహికాముష్మికసుఖంబులందఁ గలఁడు.
ఉ. శూరులు భక్తులున్ సుకులజుల్ పరవంచన లందఁ బోనివా
రేరుజ లేనివారు పర మెంచెడువారును సూరిసన్నుతా
చారులు మానభూషణులు శాస్త్రవిధిజ్ఞులు నైనధీరులున్
భూరమణుండు చేర్చుకొనఁ బోలు సహాయులు గా నజస్రమున్. 194
క. ప్రత్యక్షపరోక్షములన్, సత్యవ్రతుఁ డైనరాజు సమవృత్తిమెయిన్
బ్రత్యయము కలిగి మెలఁగిన, నిత్యము ఖేదంబు లేక నెఱిఁ గొను నధిపా.
క. ఎందును విశ్వాసము లే, కందఱధన మపహరింప నై యనృజార్తిన్
బొందుపడులుబ్ధనృపుఁ జం,పం దగు స్వజనంబ వైరభావం బెసఁగన్. 196
సీ. ప్రజలచిత్తము వట్టి పాలించు రా జరి,గ్రస్తుఁ డై పతనంబు గాంచఁ బోఁడు
వ్యసనంబు క్రోధంబు వదలి జితేంద్రియుం, డగు తేఁడు విశ్వాస్యుఁ డగుజనులకుఁ
బ్రజ్ఞయుఁ బరరంధ్రపరతయుం ద్యాగంబు, గలరాజు లోకవిఖ్యాతిఁ గాంచు
సుప్రసాదంబును సుముఖత్వముం గల,రా జెప్డు సర్వవర్ణప్రియుఁ డగు
తే. క్షిప్రకారిత్వ మవికత్థనప్రసక్తి, కార్యదీక్షయు సత్యవాక్యము జితేంద్రి
యత్వమును గల్గి చూపట్టునవనివిభుఁడు, సర్వసంపత్సమేతుఁ డై పర్వుచుండు.
చ. జనకునియింటఁ బుత్రకులచందమునన్ జను వొప్ప నెప్పుడుం
దనరుచు వైభవస్థితిని దాఁపక దాంతులు శాంతులున్ స్వక
ర్మనిరతులున్ విధేయులును మత్సరశూన్యులు మాన్యచిత్తు లే
జనపతిదేశపుంబ్రజ లెసంగుదు రాతఁడు ధన్యుఁ డన్నిటన్. 198
క. పురజనహితమతియుం ద్యా,గరతియునున్ ధర్మమార్గగతి గల్గి మహీ
వరుఁ డెఱుక గోరి జ్ఞానులఁ, బరిసరమున నిలుపుకొని శుభంబులు వడయున్.
క. చేసియుఁ జేయనివా ర్వలె, వాసిన్ సేవించుచారవర్గము మంత్రుల్
భాసిల్లఁ బగఱ కెఱుఁగం, గా సమకుఱ కుండు రాజు గణుతింపఁ బడున్. 200
వ. తొల్లి భార్గవుండు రామచరితంబు చెప్పునప్పు డింద్రునితో నిట్లు చెప్పె నాలింపుము. 201

ఆ. మొదటివాఁడు లోకమునకు రాజవల భార్యయు ధనంబు రాజరక్ష చెడిన
లేదు భార్య ధనము లేదు ధర్మము లేదు, జగము రాజరక్షఁ దగిలి యుండు.

వ. మఱియుఁ బ్రాచేతసుం డగుమనువు రాజధర్మంబులఁ జెప్పినచొప్పు వినుము.

మ. జనులం గావనిరాజ వక్త యగునాచార్యుం డవిద్వాంసుఁ డై
చనుఋత్విగ్జనుఁ డప్రియంబె పతిపజ్జం బల్కు నౌభార్యయున్
వనకాముం డగునాపితుండు నగరిన్ వాంఛించుగోపాలకుం
డను నీషట్కము వీడ నొప్పు జలమం దాభిన్ననావం బలెన్. 204

వ. అని చెప్పి దేవవ్రతుండు నీకిప్పుడు రాజధర్మసారంబు చెప్పితిని మఱియు
బృహస్పతియు శుక్రుండును సహస్రాక్షుండును మనువును భరద్వాజుండును
గౌరశిరస్కుం డనుమునియును మఱియు రాజధర్మప్రణేతలు బ్రహ్మణ్యులు
బ్రహ్మవాదులు పెక్కండ్రు రాజధర్మంబులు పెక్కువిధంబులం బేర్కొని
యున్నవా రవి యన్నియుం జెప్పెద నవహితుండ వగుము. 205

సీ. చారుండు ప్రణిధి మత్సరహీనదానంబు, యుక్తకరాదాన ముచితగతియు
సత్పరిగ్రహణంబు శౌర్యంబు దాక్ష్యంబు, సత్యవ్రతంబు ప్రజాహితంబు
నార్జవంబునఁ గా ననార్జవంబునఁ గాని, రిపుపక్షభేదన మెపుడు జీర్ణ
భవనాద్యవేక్షయు ద్వివిధదండప్రయో,గమ్ము ధాన్యాదిసంగ్రహణబుద్ధి
తే. బుద్ధిమత్సాధుసేవయు భూజనాన్వ, వేక్షణంబును సైన్యసంరక్షణంబు
కార్యములనఖేదముకోశకల్పనంబు,నాత్మపురగుప్తిరాజకార్యములు మఱియు.

సీ. యామికు లగువారియం దవిశ్వాసము, పురసంఘభేదనమును స్వభృత్య
జనమందు నుపజాపమును నీతి ధర్మాను,సరణ మార్యప్రీతి శత్రుమిత్ర
విజ్ఞానమును నెల్లవేళ నుద్యోగ మ,నార్యకార్యత్యాగ మరినిబర్హ
ణము సతతప్రయత్నము రాజధర్మము,లని బృహస్పతి తొల్లి యానతిచ్చె
తే. అమృతముప్రయత్నమునలబ్ధమయ్యెనాప్ర,యత్నముననసురులుహతులైరి వజ్రి
యత్నమునశ్రేష్ఠుఁడయ్యెఁబ్రయత్నమునన,పండితుండగుసిరులందుఁబంచజనుఁడు.

చ. ఒనరుప్రయత్నమున్ సలుపకుండినవాఁడు మహీకళత్రుఁ డై
నను గడు బుద్ధిమంతుఁ డయినన్ విషశూన్యసరీసృపంబురీ
తి నరితిరస్కృతుం డగుచుఁ ద్రెళ్లుఁ బ్రయత్నము గల్గి యల్పుఁ డై
నను దహియించెడున్ రిపువనంబుఁ గృశానుకణంబు చాడ్పునన్. 208

క. చతురంగబలంబులలో, నతులిత మై యొక్కయంగ మమరిన యేనిన్

మతిబలము కలిమి శత్రు, క్షితిపతి ప్రేల్మిడిన గెలిచి చేకొను ననసమ్మున్. 209

సీ. రాజ్యమెంతయునుదంత్రముదానిఁగరినాత్ముఁడగువాఁడెపూనంగఁదగినవాఁడు
కానిభార్యను బోలుదాని మృదుస్వభావుఁడు చక్కఁబెట్ట నోపఁడు తలంప
సర్వామిషమ్ము రాజ్యము నిత్య మార్దవమున నది దక్కించుకొనఁగ వలయు
గాన మృదుత్వముఁ గ్రౌర్యంబునుం గల్గి, ధీరుఁడై రాజు వర్తింప నొప్పుఁ

తే. ప్రజలరక్షించునతని కేవలననైన,దొసఁగు పొసఁగినఁబ్రజలుపొందెసక మెసఁగఁ
దొలఁగఁ ద్రోచెడువారు గావలయు నిట్లు,తనరుచుండు సనాతనధర్మ మనఘ.

వ. అని చెప్పి యప్పితామహుండు రాజేంద్రా! రాజధర్మవిధానం బిట్లు సంగ్రహంబుగ నభివర్ణించితి నీ కెందేని సందేహం బున్న నన్నడుగు మనుడు నందున్న వ్యాసదేవస్థానప్రభృతులు వాసుదేవశారద్వతసాత్యకిసంజయులును బ్రహృష్టమనస్కులై మేలు మే లని ప్రశంసించి ధర్మభృద్వరుం డగుదేవవ్రతునిం బ్రస్తుతించిరి ధర్మజుండు దీనమనస్కుండు నశ్రుపూర్ణనయనుండునై కురుపితామహునిపదపల్లవంబు లల్లన స్పృశించుచుఁ బితామహా! దివాకరుం డస్తగిరిం జేరుచున్న వాఁడు నేఁటికిం బనివినియెద నెల్లి వచ్చి నాసంశయంబు లెల్లఁ దీర్చుకొందు నని యందలిమునుల కభివందనంబు లాచరించి కృష్ణాదులం గూడి తాడిసిడంబువాని వలగొని రథారూఢుండై కదలి మధ్యేమార్గంబున దృషద్వతీనదిం జలం బాడి సంధ్య వార్చి వేర్చినగరిమంబునఁ గరినగరంబునకుం జని మఱునాఁ డరుణోదయంబున లేచి కాల్యకృత్యంబుల నిర్వర్తించి మించినవేడ్క రథం బధిష్ఠించి తొంటియట్ల కురుక్షేత్రంబునఁ గురుపితామహుం దఱియ నరిగి కుశలప్రశ్నంబు గావించి వ్యాసాదులకు నమస్కరించి యెల్లవారితోడఁ భీష్ముం బరివేష్టించి కూరుచుండి కృతాంజలియై యి ట్లనియె. 211

చ. కురుకులదీప! రాజనఁగ గొప్పగఁ జెప్పెద రేమికారణం
బరయఁగ వచ్చు మానవుల కందఱకున్ హృదయంబు బుద్ధియున్
గరచరణాదులున్ విషయకాంక్ష సుఖంబును దుఃఖమున్ గుణో
ద్ధురతయుఁ జావుపుట్టువులు తుల్యము లేమిట రాజు మేటియో. 212

శా. ఆరాజొక్కఁడు బుద్ధిమంతులును వీరాగ్రేసరుల్ భూజనుల్
వారి న్మించి వశంబున న్నిలిపి సర్వక్ష్మాతలాధీశుఁడై
యేరీతి న్మనుపంగఁ జాలెడి జగం బేహేతువుం గల్గఁ ద

త్కారుణ్యంబు ప్రసాదముం గొనుకుతిం గావించి వర్తించెడిన్. 213

ఆ. రా జొకండు నెమ్మి రాజిల్ల రాజిల్లు, లోక మెల్ల నతఁడు వ్యాకులత్వ
మొంద వ్యాకులత్వ మొందెడు నని విందు, నిందుఁ గారణం బదేమి యగునొ.

క. అలుపపుఁగారణ మిచటన్, గలిగెడు నన రాదు దేవకల్పునిఁ గా భూ
తలపతి నొకనిం దలఁచుచుఁ, గలలోకం బెల్ల మ్రొక్కఁ గలిగెడు ననుటన్.

వ. ఇందలితత్వం బెల్ల సవిస్తరంబుగా వినఁ దలంచితి ననుగ్రహింపు మనుటయు
మందాకినీనందనుం డమందానందంబున ధర్మనందనున కిట్లనియె. 216

## దండనీతిజన్మప్రకారకథనము.

తే. వినుము రాజేంద్ర! కృతయుగంబునను మున్ను
రాజ్యమున దండధరుఁ డైనరాజు లేమిఁ
బ్రజలు ధర్మమునం బరస్పరము పాల్య
మానులై యొప్పుచుండి రనూనగతుల. 217

ఉ. వారికి వారె రాజు లయి వర్తిలుచుండినదాన వారికిన్
వేరము ఖేదమోహములు వెక్కస మై ప్రభవించె నంతలో
జేరెను లోభ మందునను జెన్నలరారెను గామ మందునన్
బేరెను రాగ మందున వివేకము పాకము దప్పి రాప్రజల్. 218

వ. అంతఁ గార్యాకార్యంబులును వాచ్యావాచ్యంబులును భక్ష్యాభక్ష్యం
బులును దోషాదోషంబులు నెఱుంగక యగమ్యాగమనంబు సేయుచు వేద
విధ్వంసకులై ధర్మంబు వోకార్చి రక్కాలంబున. 219

సీ. త్రిదశులు సంత్రస్తహృదయులై పరమేష్ఠి, పరిసరంబున కేగి శరణు వేఁడి
ప్రాంజలులై యిట్లు పలికి రో దేవ భూ, తలమున వేదశాస్త్రములు సమసె
ధర్మంబు చెడియె నధ్వరములు నశియించె, లోభమోహాదుల లోక మెదిగె
స్వాహాస్వధాదులు సన్నగిల్లుట హావి, ర్భాగము లేమి మే మోగు గుడిచి

తే. భయమునం జేసి దేవరపాలుపడఁగ, వచ్చినారము మామొఱ్ఱ లిచ్చ నెఱిఁగి
మాకు శ్రేయసం బగుమార్గ మెంచి, వేగ రక్షింపవే యని వేఁడుటయును.

వ. భగవంతుం డగుబ్రహ్మదేవుండు దేవతలదిక్కు మొగంబై దీని కే నిప్పుడ
ప్రతివిధానంబు గావించెద మీరు చింత దక్కి యుండుం డని మనంబునం
దలంచినమాత్ర శతసహస్రాధ్యాయంబులు గలనీతిశాస్త్రంబు నిర్మితిం గాంచె
నందు ధర్మార్థకామంబు లనుత్రివర్గంబును జతుర్థంబు నగుమోక్షంబునుం బృథ

గర్థగుణంబులుగాఁ జెప్పంబడె మఱియు సత్త్వరజస్తమోగుణంబులును స్థాన వృద్ధిక్షయంబులును రాజులచిత్తవృత్తులు నాత్మదేశకాల కృత్యసహాయకారణంబును నన్వీక్షకీత్రయీవార్తా దండనీతివిద్యలును స్వామ్యమాత్యరాష్ట్ర దుర్గకోశ సుహృద్బలంబులును బ్రణిధిచారలక్షణంబులును సామదానభేద దండోపేక్షోపాయంబులును దత్తత్ప్రకారంబులును మంత్రభేదార్థవిభ్రమంబులును హీనమధ్యోత్తమ సంధివిధానంబును దత్తదవయవంబులును యాత్రాకాలంబులును ధర్మవిజయార్థ విజయాసుర విజయలక్షణంబులును రథనాగహయ పదాతివిష్టినౌకాచారదేశికు లనునష్టాంగంబులం గల ప్రకాశాప్రకాశసైన్యస్వరూపంబును జంగమాజంగమ చూర్ణయోగవిషాదులును గ్రహనక్షత్రాదిమార్గ గుణంబులయు చతురశీతి భూమిగుణంబులయు వివరణంబులును మంత్రయంత్రాద్యాత్మరక్షణలక్షణంబులును రథాదినిర్మాణ నైపుణ్యంబును నానావిధనరనాగరథహయంబుల పుష్టికరయోగంబులును వివిధవ్యూహవిధానంబులును విచిత్రయుద్ధకౌశలంబు నుత్పాతనిపాతపరిజ్ఞానంబును శస్త్రాస్త్రపాలనక్రమంబును బలవ్యసనహర్షణంబులును బీడాపత్కాలపరిజ్ఞానంబును బ్రస్థానభేర్యాఖ్యాతవిధానంబును బతాకాదియోగ సంచారక్రమంబును జోరాటవికసంగ్రహమ్ము చేతను వహ్నిగరదప్రతిరూప కారకులచేతను బలాధ్యక్షవిభేదనంబు చేతను ధాన్యాద్యుచ్ఛేదనంబు చేతను మంత్రతంత్రౌషధాతంకాంజనంబుల చేతను భక్తారాధనప్రత్యయోపార్జనంబులచేతను బరరాష్ట్రపీడనవిధంబులును సప్తాంగంబుల రాజ్యహ్రాసవృద్ధి సమంజసవిధానంబును కృతసామర్థ్యయోగంబులు నరిమధ్యస్థమిత్రప్రపంచన లక్షణంబులును బలవచ్ఛత్రుజనామర్దప్రతీఘాతవిధానంబులును వ్యవహార సూక్ష్మజ్ఞానంబులును కంటకశోధనంబును శ్రమవ్యాయామ యోగత్యాగ ద్రవ్యసంగ్రహంబులును నభృతభరణంబును భృతాన్వేషణంబును గాలంబుల నర్థదానంబును వ్యసనాప్రసంగిత్వంబును రాజగుణంబులును సేనాపతిగుణంబులును గుణదోషవిభాగంబును స్వానువర్తివృత్తికల్పనంబును సర్వశంకితత్వంబును బ్రసాదవర్జనంబును నలబ్ధలాభలబ్ధవివర్ధనంబులును బాత్రదానంబును ధర్మకామార్థవిసర్గంబును గామక్రోధజోగ్రవ్యసనదశకనిరూపణంబును నానావిధయంత్రనిర్మాణంబును జైత్యద్రుమావమర్దకర్మానుశాసనంబును నుపకరణవసనాదినిర్మాణక్రమంబును బణవానకశంఖభేరీద్రవ్యోపార్జనవిధంబును

లబ్ధప్రశమనంబును సజ్జనపూజనంబును విద్వజ్జనైకీభావంబును దానహోమవిధిజ్ఞత్వంబును మంగళాలంభనంబును శరీరప్రతిక్రియయు నాహారయోజనంబును సత్యమధురవాగ్విధంబును సమాజోత్సవక్రియలును గృహోత్సవంబులును సర్వాధికరణప్రత్యక్షపరోక్షాభిజ్ఞానంబును నిత్యవృత్త్యాన్వేషణంబును విప్రాదండ్యత్వంబును యుక్తిదండనిపాతనంబును జాతిగుణసముద్భవమాన్యత్వప్రతీక్షణంబును పౌరరక్షణంబును రాష్ట్రవివర్ధనంబును మండలస్థద్వాదశారిరాజచింతనంబును ద్విసప్తతివిధశరీరప్రతిక్రియలును దేశజాతికులధర్మంబులును ధర్మాధర్మలక్షణంబులును మోక్షధర్మంబులును ధనలిప్సయునుపాయంబులును గోశవృద్ధికరకృష్యాదిక్రియాకరణప్రకారంబును మాయాయోగంబును స్థిరాంభస్స్రోతోదూషణంబు నార్యమార్గోపాసనోపాయంబును విపులంబుగ నభివర్ణింపఁబడియె నట్లు లోకోపకారంబు గాఁ ద్రివర్గస్థాపనంబు నకై నీతిశాస్త్రంబు నిర్మించి భగవంతుం డగు చతుర్ముఖుండు శక్రపురోగములగు క్రతుభుజులం గాంచి యి ట్లనియె 221

మ. నవనీతం బొనరించినాఁడ నిది వాఙ్నారీమనీషావిశే
షవిభావంబున భావితం బయి ప్రశస్తం బయ్యె దండాంచితం
బు వరేణ్యం బయి దండనీతి యన నై పొల్పొంది షాడ్గుణ్యసం
భవ మై లోకము నుద్ధరించెడిఁ జతుర్వర్గంబు సంధించుచున్. 222

వ. అని యానతిచ్చునంత నట బహురూపుండు విరూపాక్షుం డావిర్భవించి పరమేష్ఠిప్రతిపాదితం బగునీతిం బరిగ్రహించి దానిం దెలియుటకు లోకప్రజలకాయుర్దాయం బల్పం బని తలంచి విశాలాక్షం బను పేరఁ బదివేలయధ్యాయంబులుగ సంగ్రహించె నవలఁ బురందరుండును బాహుదండకం బను పేర దాని నైదువే లధ్యాయంబులుగం గుదించె బృహస్పతియు బార్హస్పత్యం బను పేర దాని మూఁడువే లధ్యాయంబులు గావించె నంత యోగాచార్యుం డగుశుక్రుండు దాని నేకసహస్రాధ్యాయంబులుగ సంక్షేపించె ననంతరంబ ఋషులును మానవులయాయుర్బుద్ధులు చాలమి నెఱింగి మఱియు సంక్షేపించి రట్లు రాజనీతిశాస్త్రంబు సంజాతం బై ప్రవర్తించునంత. 223

సీ. వేలుపుల్ విష్ణునిపాలికిఁ జని దాని, నధిగమింపం జాలునట్టియొకనిఁ
గరుణింపు మనుటయు హరి నిజతేజంబు,నను జేసె మానసతనయు నొకని
విరజుఁ డన్ పేరున వెలసి యతఁడు భూవి,భుత్వంబు గైకొన బుద్ధి సేయఁ

డతనిపుత్త్రుఁడు కర్దమాఖ్యుండు నిల నేల, నొల్లక తపముండె నెల్ల విడిచి
తే. యాప్రజాపతిపుత్త్రుఁ డనంగుఁ డనఁగఁ, బేరు గొని దండనీతివిశారదుఁ డయి
ప్రజలఁ బాలించె నతనిపుత్త్రకుఁ డతిబలుఁ, డనెడునాతఁడు పిమ్మట నవని నేలె.
క. ఆతఁ డింద్రియవశుఁ డై, ప్రీతిం గొని మృత్యుపుత్త్రిఁ ద్రిజగజ్జనవి
ఖ్యాతఁ సునీత యనియెడు, నాతిం జేపట్టి వేననాముం గనియెఁ. 225

## పైన్యుండనురాజుచరిత్రము.

సీ. వేనుండు రా జయ్యు విగతనయుండు రా,గద్వేషవశగుఁ డై కష్టుఁ డైన
నెఱిఁగి బ్రహర్షు లాహీనధర్ముని మంత్ర,పూతదర్భలు వైచి పొడ వడంచి
వానిదక్షిణసక్థిఁ బూని మథించుడుఁ, గాలినకొఱవి నాఁ గాన వచ్చు
నల్లనిమేనును నల్లనిచుంచును, నెఱ్ఱనికన్నుల నేవ గొలుపు
తే. కుబ్జుఁడుదయింపవానిఁ గన్గొనినిషీద,యనుచుఁబల్కిరిమునులందునవమ-ఱటియు
లందఱునిషాదులై గహనాశ్రయులయి,క్రూరు లై వింధ్యవాసు లై క్రమ్మరిలిరి.
వ. అంత మఱియు నమ్మౌను లవ్వేనునిదక్షిణపాణిం బట్టి మంత్రంబు లుచ్చరించుచు మథించిన నందుఁ గవచియు బద్ధనిస్త్రింశుండును సశరశరాసనుండును వేదవేదాంగవిదుండును ధనుర్వేదపారగుండు నగునొక్కమహాపురుషుండు రెండవపురందరుండు నాఁ బుట్టినంత దండనీతి యెల్ల నారాజోత్తము నాశ్రయించె నట్టియెడ నమ్మనోహరాకారుం డగుపైన్యుండు హర్షించుచు మహర్షులం గాంచి యి ట్లనియె. 227
సీ. తాపసోత్తములార! ధర్మార్థదర్శిని, నైయె సూక్ష్మబుద్ధి నాకమరె నిప్పు
డిందున నేకార్య మేఁ జేయ వలయునో, యర్థసమన్విత మైనదాని
జేయుదు నెఱిఁగింపుఁడీ యన వారు నీ, నియతధర్మంబును నెఱప వలయు
విడిచి ప్రియమ్ము నప్రియము కామక్రోధ, లోభమానాదులలోఁ దవులక
తే. సర్వభూతములందును సమత గలిగి, మానవుం డొక్కరుఁడును ధర్మమును విడని
వడుపున న్నీదుభుజశక్తి నడుపఁ జేసి, దండనీతిని బూను మోధరణినాథ.
వ. అనుటయు నతండు. 229
చ. త్రికరణశుద్ధిగాఁ బ్రజలఁ దేల్చెద దండము నాశ్రయింతు మా
మక మగుశక్తి లోకము సమంచితరీతి మెలంగఁ జేసెదఁ
బ్రకటముగా శ్రుతుల్ వెలయుఫక్కి నొనర్చెద వర్ణసంకరం
బకుటిలరీతి మైఁ దొలఁతు నార్యులపట్లఁ దలంప దండముఁ. 230

క. అని ప్రతినఁ జేసి సర్వమ,హిని నేలం గడఁగు మనెడుబుషులం గని వై
న్యనృపాలుఁ డట్లు యగు నా,కు నమస్యులు విప్రు లనుచుఁ గోరిక దెలిపెన్.

వ. అయ్యవసరంబున నటకు విష్ణుజిష్ణులు బృందారకబృందంబులతో లోకపాలు
రతో వచ్చి విష్ణునితో నష్టముం డగు నావైన్యు నఖిలధరణీసామ్రాజ్యపట్ట
భద్రుం జేసి యభిషేకించిరి శుక్రుండు పురోధసుం డయ్యె వాలఖిల్యులును
సారస్వతగణంబును మంత్రు లైరి గర్గుండు సాంవత్సరికుం డయ్యె ని ట్లతి
వైభవంబునం జక్రవర్తి యైనయతండు రత్నగర్భ యగుపృథివిం బొంది
పృథుండు నా నొప్పె నప్పు డమ్మనుష్యేంద్రునకు 232

సీ. అమరేంద్రుఁ డక్షయ్య మగువైభవం బిచ్చె, మేరువు బంగారుబారువు లిడె
యక్షేశ్వరుండు ధర్మార్థకామసమర్థ, మైనధనం బిచ్చె నంతలోన
నరనాగరథహయపరివారములు కోట్లు, కొలఁదిగం దలఁపునం గూడ నయ్యె
నిట్లు మహాప్రభుత్వేత్థప్రభావుఁడై, పృథుచక్రవర్తి వర్తించునపుడు

తే. సూతమాగధు లరుదెంచి స్తోత్రపాఠ,ములను బచరింపఁ బ్రీతుఁడై పుడమిఱేఁడు
సూతున కనూపదేశము చూఱ విడిచి,మగధ మాగధునకు నిచ్చిమహిమహించె.

వ. మన్వంతరంబులనుండియు విషమ యగువిశ్వంభర నవ్విశ్వవిశ్వంభ రారమణుండు
నిజధనుష్కోటింజేసి సమత్వంబు నొందఁ గావించె నని విందు మప్పుడు. 234

శా. ఆధుల్ వ్యాధు లడంగె భూప్రజల కన్యోన్యాగతం బైన భీ
త్యాధిక్యంబు తొలంగె దొంగలభయం బై పోయెఁ జతుశ్రవో
బాధల్ సన్నగిలెన్ సముద్రము చలింపంబోక స్తంభించె మా
ర్గాధారమ్ము నొసంగెఁ బర్వతము లాత్మోజాని పాలించుటన్. 235

క. ఆతఁడు పదియేడై వి,ఖ్యాతం బగుసస్యసమితి యనుతీరములన్
భూతప్రతృప్తి గా నీ,భూతల మనుపుడుకుదొడుకు పొదుగునఁ బిదికెన్. 236

తే. అవని ధర్మోత్తరంబుగా నతఁ డొనర్చెఁ, బ్రజల రంజించుటంజేసి రా జనంగ
బ్రాహ్మణక్షతత్రాణము పరఁగుకతన, క్షత్త్రియుం డన నొప్పె నాత్మోవిభుండు.

సీ. పృథుధర్మమునఁజేసి ప్రథితమైనదియును,బృథువైనదియుఁ గానఁ బృథివియయ్యె
నెవ్వండునేఁ బృథివీశు మీఱం డని, సంస్థాపనము చేసి చక్రపాణి
వాని నావేశించెఁ గాన దేవునిఁ బోలె, నరదేవుని జగంబు నతి యొనర్చు
దండనీతి నతండు దవిలి చారప్రచా,రమున నారసి ప్రజారక్ష సేయు

తే. సముఁ డగుచు రా జొనర్చినసాధుకర్మ, సంగతిని జేసి జగతికి సర్వశుభము

లోదవుఁ దద్వశమం దెల్ల రుండుటకును, దైవహేతువుగాఁ గొందు తలఁపనగును.
వ. మఱియు నాకర్ణింపుము. 239
చ. వలమురిదాల్పు నెన్నొసట బంగరుతమ్మి జనించె నందు శ్రీ
దలకొని పాలయిత్రి యయి ధర్మము నొందెను ధర్మసంగతిన్
వెలువడె నర్థ మాత్రయము వేడ్క వసించు మహీశునం దతం
డిల జనియించుఁ బుణ్యము క్షయించినదాన దివిం ద్యజించుచున్. 240
తే. వైష్ణవమహత్వయుక్తుఁడై వఱలుదాన, నతనిఁ బ్రజ్ఞయుమాహాత్మ్యమధిగమించు
దేవనిర్మితుఁ డగుట విధేయ మగుచు, జగము వానివశంబునఁ దగిలి యుండు.
క. కరచరణాద్యవయవములు, పురుషుల కొకరూప రైనఁ బురుషుఁ డతం డై
శ్వరలక్షణలక్షితుఁ డై, పరఁగుట లోకంబు వానిపలుకున నిలుచున్. 242
క. ఎవఁ డాతని సౌమ్యము శుభ, మవు మోముం గాంచి లోన హర్షించెడినో
నృవరుం డాతం డాతని, కి వశానుగుఁ డగుచు నత్తుఁ గృప దళుకొత్తన్.
వ. అని మఱియు. 244
సీ. పైతామహం బనన్ ఖ్యాతి గాంచినదండ, నీతి సులక్షణాన్వీత మందు
నయచారమును ధర్మచయము నాగమము పు, రాణమహర్షిసంప్రభవము వర
తీర్థవంశమును బ్రతీతవర్ణాశ్రమ, యజ్ఞవిద్యలు నితిహాసములును
వేదశాస్త్రంబులవిధము తపోజ్ఞాన, విధు లహింసయు సత్యవివరణంబు
తే. వృద్ధసేవయు శౌచము వివిధదాన, ములును భూతానుకంపయు మొదలగునవి
యన్నియును శబ్దితంబులై యలరుచుండు, దీని నెఱిఁగిననృవరుండు దేవసముఁడు.
వ. అని చెప్పి దేవవ్రతుం డిట్టిది నరదేవప్రభావంబు మఱియు నీభావం బేమి యభిలషించుచున్న దనిన నన్నరదేవోత్తముం డన్నదీపుత్త్రు నభినందించుచుం బ్రాంజలియై సర్వవర్ణసమధర్మంబులును జాతుర్వర్ణ్యధర్మంబులును నాశ్రమధర్మంబులును రాజరాష్ట్రపౌరజానపదవృద్ధిప్రకారంబులును గోశ దండ దుర్గ సహాయ మంత్రి బుత్విక్పురోహితాచార్య విశ్వాసి భృత్య లక్షణంబులు నాత్మరక్షణవిధంబును విన వలతుం జెప్పు మనిన నప్పితామహుండు కృష్ణాదుల కభివందనంబు గావించి కౌరవేశ్వరుం దిలకించి యి ట్లనియె. 246

## భీష్ముండు వర్ణాశ్రమధర్మంబు లెఱింగించుట.

తే. సత్య మక్రోధమును క్షమ సంవిభాగ, మార్జవము స్వదారరతి భృత్యభరణమును
శౌచ మద్రోహ మనునవి సార్వవర్ణి, కములు తొమ్మిది ధర్మము లమరి యుండు.

క. దమమును స్వాధ్యాయాభ్యస, నము ధర్మము కృత్య మందునం గలిగినక
ర్మము లధ్యవసితములు త, త్క్రియ మేమఱకుండ వలయు బ్రాహ్మణుఁ డెపుడున్. 249

వ. మఱియును.

మ. తనకర్మంబుననుండి యొండుల కెడం దాత్పర్యముం జేయ కె
ప్డును శాంతుండును జ్ఞానతర్పితుఁడునై భూదేవుఁ డున్నం దనం
తన తా వచ్చు ధనంబు దారయును సంతానంబు దానక్ యజిం
పను బెట్టం దిన నొప్పు నెప్పుడును ద్రోపాడంగ రా దాశ్రుతిన్. 250

తే. యజన మధ్యయనము దాన మవనిపాల,నమ్ము దస్యువధమ్ము దురమ్మునం బ
రాక్రమమ్మివిక్షత్రియప్రవరధర్మ,ములుదలఁపనిందురణ మొప్పు మొదటిదగుచు.

చ. శ్రుతులు పఠించి మించి శ్రుతిచోదితముల్ బహుదక్షిణాకముల్
క్రతువు లొనర్చి పేర్చి సుముఖంబున రాజిలురాజకంబు సం
స్తుత మగునాజిలో నరులతో నెదిరించి మృతించినట్టిఁ డు
న్నతుఁ డయి పుణ్యలోకము లనారతముం గొని సౌఖ్య మందెడున్. 252

సీ. అని గంట్లు వాఱనితనువు గలం డయి, కాందిశీకుం డైనక్షత్రియుండు
క్షత్రబంధుం డనుసన్నకై దుర్లోక, ములు పొందువాఁ డగుఁ బోడ వడంగి
యది గాన ధర్మము నరయువాఁ డై రాజు, ధర్మయుద్ధమునకుఁ దవుల వలయు
స్వస్వధర్మములందు వర్తింపఁ బ్రజ నిల్పి, రాజ్యపాలన మొనర్పంగ వలయు

తే. శమమునం జేసి సర్వకృత్యములు ధర్మ, సంగతిం జేసి ప్రజలఁ బ్రజలను బోలె
నరసి రక్షించు కార్యము ధరణిపతికిఁ, గార్య మని ధర్మశాస్త్రవాక్యం బెసంగు.

తే. యజ్ఞమును దానమును నధ్యయనము శౌచ
మును ధనసమార్జనము తండ్రి తనయుల బలెఁ
బసులఁ బ్రోచుట కృషియును వైశ్యునకును
ధర్మములు గాఁగ శాస్త్రముల్ తవిలి పలుకు. 254

ఆ. నలువ ప్రజలఁ బసుల నాఁడు సృష్టించి త, ద్రక్షణం బొనర్పఁ దలఁచి ప్రజల
బ్రాహ్మణునకు క్షత్రవరు నొసంగినయట్లు, పసిని వైశ్యజాతి కొసఁగె మున్ను.

వ. అట్టివైశ్యజాతివృత్తియు నుపజీవనంబునుం జెప్పెద నవధరింపుము. 256

సీ. నాలుగోవుల నేలునట్టిఁడై యొకగోవు, పాలు వేతనముగాఁ బడయ వచ్చు
గోశతం బేలిన గోమిథునము వర్ష, వేతనార్థము గొన నాతని కగు
వాణిజ్య మొనరింప వచ్చినసొమ్ములో, నేడవవంతు గ్రహింప వచ్చు
నల్లె ధాన్యాదుల వ్యాపారమందును, వర్షభృతిం గొన వైశ్యున కగు

ఆ. నట్లు వేతనంబు నంది వైశ్యుఁడు పశు, పాలనమున కిష్టపడఁడ యేని
వాని నొరులఁ బుచ్చి పాలించుకొన వచ్చు, నిట్లు ధర్మశాస్త్ర మెసక మెసఁగు.

ఉ. దాసునిఁ గాఁ జతుర్థజునిఁ దామరచూలి యొనర్చెఁ గావునన్
భూసురబాహుజోరుజుల ముమ్వారుసం బరిచర్య సేయుచున్
దోసమువంకఁ బో కెపుడుఁ దోడ్పడి యుండుట శూద్రజాతికిన్
భాసురధర్మమై చను శుభం బగు నట్లు మెలంగువానికిన్. 258

క. ధనసంచయంబు సేయుట, చన దతనికి దాన దురితసంగతి యొదవున్
జనపతి యనుమతిఁ గోరిక,లను దీరుచుకొనుచు నుంట లగ్గనిరి బుధుల్. 259

వ. వానివృత్తియు జీవనంబునుం జెప్పెద నాకర్ణింపుము. 260

సీ. వర్ణత్రయమునకు భరణీయుఁ డగుట శూ,ద్రునకు జీర్ణములు పర్యుషితములును
విసనకఱ్ఱయు శిరోవేష్టనమాతప,త్రము వస్త్రము నొసంగఁ దగు ధనముగ
ద్విజులలో నొకని సేవించిన వానికి, వృత్తి గల్పించుట విధి ద్విజుండు
తనపోష్యుఁ డగుచు వృద్ధును దుర్బలుం డన,శక్తుఁ డైనను వానిఁ బాదభవునిఁ

తే. బ్రోచి పిండం బొసంగుట పోలు విడువ,రాదుస్వాహావషట్కారరహితముగను
వ్రతముమంత్రము లేకుండఁ బాకయజ్ఞ,ముత్తరుం డగుశూద్రునకొప్పఁ జేయ.

వ. అట్టిపాకయజ్ఞంబునకు దక్షిణపూర్ణపాత్రమ యని చెప్పుదురు తొల్లి పైజవనుండు సచ్ఛూద్రుం డైంద్రాగ్నవిధానంబునఁ బాకయజ్ఞంబు గావించి నూఱువేలపూర్ణపాత్రంబులు దక్షిణాకాలంబున నొసంగె నని వినుదుము గావునఁ ద్రైవర్ణికులకుం బోలె నాలవజాతివారికిని శ్రద్ధాసమన్వితయజ్ఞంబున సంపూర్ణఫలంబు సంప్రాప్తం బగు బ్రాహ్మణక్షత్రియులకు వేదసహితంబు లగునగ్నీంద్రదేవతాకయజ్ఞంబులుం బోలె శూద్రునకు వేదరహితం బగుప్రజాపతిదేవతాకయజ్ఞంబు విహితంబు సర్వవర్ణంబులకును యజ్ఞం బుత్తమోత్తమంబు యజ్ఞకర్త సర్వాధికుం డని వైఖానసులయజ్ఞగీతలు పలుకుచున్నవి గావున శ్రద్ధాపవిత్రత్వ మాశ్రయించి యజ్ఞంబు గావించునది యని చెప్పి యాశ్రమధర్మంబులు సెప్పెద నాలకింపు మని బ్రహ్మచర్య గార్హస్థ్య వానప్రస్థ సన్యాసంబు లని నాలుగు వానివానిక్రమంబు లెట్టివంటి వేని. 262

స్రగ్ధర. తా నొక్కండేని గానీ తపులము విడుచున్ దారతోఁ గాని కానన్
మానాహంకారముల్ నెమ్మది విడివడ నేమంబు సెల్లన్ యతాత్ముం
డై నిత్యాధానవేదాధ్యయనముఖసుకర్మానురక్తి న్మెలంగన్
వానప్రస్థాశ్రమస్థప్రథితుఁ డయి ద్విజత్వంబు గొన్నట్టిఁ డైనన్. 263

మ. సకలారణ్యకశాస్త్రముల్ సదివియున్ సన్న్యాసియై ధర్మబో
ధకుఁడై సంగము లుజ్జగించి వివిధద్వంద్వంబులం బాసి కా
మ్యకకర్మంబుల వంకఁ బోక విషయవ్యాపారదూరుండు నై
యకలంకస్థితిఁ దత్త్వముం దెలియనై యత్యాశ్రమస్థుం డగున్. 264

ఉ. ఇల్లని వాకి లంచు మది నెంచక భిక్షుకుఁ డై యథోపల
బ్ధ్యల్లసితాశనుం డగుచు నూరును బల్లెయుఁ జెట్టు గుట్ట నా
కుల్లము చిక్కఁ బట్టుకొని యుండి చరించుచుఁ బ్రొద్దు గ్రుంకుచో
నల్ల శయించుచు న్నెలఁగ నా యతి యైనయతం డకామి యై. 265

సీ. చదివి వేదంబులు సతి నొంది ఋతుకాల, గామియై సంతతిం గాంచి మించి
కృతసర్వకృత్యుఁడై వితతభోగములను, గ్రాలి గార్హస్థ్యధర్మములఁ దవిలి
కుటిలుండును నృశంసకుఁడు శఠుండును గాక,క్షమయును సత్యంబు శౌచ మలర
హవ్యకవ్యములందు నప్రమత్తుం డయి, సతతాన్నదాత యై యతిథిపూజ
తే. నేమఱక దేవరతుఁ డయి యెల్లవారిఁ
బ్రోవఁ దగి జన్నములు చేసి పుణ్యమూర్తి
యయి గృహస్థాశ్రమమున దేహంబు విడిన
ద్విజుఁడు స్వర్లోకమున నొందు వితతసుఖము. 266

మ. ఉపనీతుండును దీక్షితుండు వ్రతసంయుక్తుండునై దేశిక
ప్రపదంబుం గొని సేవ సేయుచు శ్రుతుల్ వల్లించుచున్ శ్రద్ధమై
విపరీతార్థములందుఁ బొందుపడ కేవేళం బ్రవర్తించుచున్
సుపరిష్కారవిధి న్నెలంగ నది పొల్పున్ బ్రహ్మచర్యంబు నాన్. 267

సీ. క్రమమున నీయాశ్రమములు నాలుగు విప్రు,నకు రాజునకు వైశ్యునకు విహితము
లీకర్మములు స్వర్గహేతువుల్ దండధ,ర్మ మొకండ వీనికి సమతఁ గాంచు
విప్రుండు క్షత్రియవిట్ఛూద్రకర్మము, దవిలిన నిందితుం డవుటె కాక
శునకదాసాదులకును బోలె సంజ్ఞయై, నిరయంబున వికర్మ నియతిఁ ద్రెళ్లు
తే. నాలు కర్మములును నాలు గాశ్రమముల, సర్వధర్మోపపన్నుఁడై సలుపుకొనుచు
సంవృతుండుకృతాత్ముఁడుసత్యనిరతుఁ,డైనద్విజుఁడూర్ధ్వలోకములందుఁ దెలియ.

ఉ. అగ్రియవంశమం దయినయట్టిద్విజుండు స్వధర్మ మీఁగి తా
వ్యగ్రత హీనధర్మరతుఁడై చెడు నేమిటి కంటి వేని కా
లాగ్రహవధ్యుఁ డయ్యు మృగయాకృషివర్తకవృద్ధిజీవి యై

నిగ్రహ మాచరించుకొన నేరఁడు తొల్లిటికర్మవాసనన్. 269

సీ. విలు వట్టి శత్రులఁ బిలుకుమార్చుట పాశుపాల్యము కృషియును వర్తకంబు
ధనలుబ్ధుఁడై హీనజనుని సేవించుట, పిశునత్వమును నృపప్రేష్యతయును
వృషలీపతిత్వము వృద్ధిజీవనము న,ర్తనము కౌటిల్యచౌర్యములు లోని
దుష్కర్మములయందుఁ దొడరి దుశ్చరితుఁడై, బ్రహ్మబంధుం డయి బ్రాహ్మణుండు
తే. శ్రుతులుసదివినవాఁడైనశూద్రసదృశుఁ,డయియపాఙ్క్తేయుఁడగునట్టియధమధర్మ
నిరతు హవ్యకవ్యంబుల నియమితునిగ,సలిపి యర్చింప నొప్ప దేసమయమందు.

వ. బ్రాహ్మణుం డగువాఁడు తపస్స్వాధ్యాయసంపన్నుండును సత్యశౌచసమన్వితుం డును శమదమార్జవాదిసుగుణ సమేతుండును స్వధర్మానుష్ఠానరతుండును శాంతుండును జితేంద్రియుండును షట్కర్మాచరణైకతత్పరుండును సానుక్రోశుం డును సర్వసహుండును క్షమావంతుండును నై యుండ నొప్పు నీధర్మంబులకు భిన్నప్రవర్తకుండు పాపకర్ముండు నాఁబడు నిట్లే రాజన్యవైశ్యశూద్రులకును ధర్మార్థకామంబులు సంకీర్తితంబులు స్వధర్మంబునం బ్రవర్తింపనివానికి స్వర్గాది లోకంబులు దుర్లభంబు లగు నిట్లు వర్ణాశ్రమధర్మంబుల నెల్లవారిం బ్రవర్తిల్లం జేయుట రాజధర్మం బాకర్ణింపుము. 271

సీ. యత్యాశ్రమము దక్క నన్నియాశ్రమములు, పాదసంభవునకుఁ బరఁగి యుండు
నిజకృత్యములు దీర్చి ప్రజలం బడసి పర,మార్థతత్త్వము విన నాసఁ జేసి
రాజాజ్ఞ వడసి విరాగియై భైక్షచ,ర్యం జేయ నొప్పెడు ననిరి విబుధు
లగ్గతిఁ గృతకృత్యుఁడై కృతశ్రముఁ డయి,నడికిఁ గాలము మించి నడచునపుడు
తే. వైశ్యుఁడును రాజునానతి వడసి భైక్షచర్య గావింపఁదగు నట్లు క్షత్రియుండు
శ్రుతులుశాస్త్రముల్ చదివియుసుతులఁబడసి,ప్రజలఁబాలించుటొప్పుధర్మమునఁ జేసి

తరువోజ. ఆతఁడు రాజసూయాశ్వమేధాదు, లధ్వరంబులు చేసి యవని సురుల
కాతతదక్షిణ లర్పించి రణము, లందు జయముఁ గాంచి యాత్మజు నేని
పూతగోత్రజు రాజపుత్రు నేఁ గాని, పుడమి నేలఁగ నిల్పి పారి పారి దేవ
తాతిథిఋషిపితృయజ్ఞముల్ సేయు, నట్టిఁడై యెల్లర నర్చింప వలయు. 273

మత్త. ఆశ్రమంబుగ రాజ్య మేలుచు నంతకాలము రాఁ దురీ
యాశ్రమంబు గ్రహించి రాజు మహర్షి యయ్యెను గాన ధ
ర్మాశ్రయంబున భైక్ష్య మొప్పెడు నంద్రు గా నిది నిత్యమం
చేశ్రుతుల్ వచియింప వాతని కీవలం జనువారికిన్. 274

తే. విప్రులకు సాశ్రమచతుష్కవిధులు నిత్యమఖులు నృపాదుల కాశ్రమములవసించు
వారలకు భూరిదక్షిణల్ వారకిడుచుఁ గాచి ప్రోచుచు నుండుటే ఘనఫలంబు.

క. నరపతి వర్ణాశ్రమధర్మరతుం డై యెల్లనాఁడు మహి నేలుట యే
పరమోత్తమధర్మం బని, పరమేశ్వరువచన మయ్యెఁ బరికింపంగన్. 276

సీ. ఇభపదంబునయందు నెల్లసత్త్వంబులపదము లడంగినపగిది నెల్ల
ధర్మములున్ రాజధర్మమున నడంగు, నవి యన్ని యల్పాశ్రయంబు లల్ప
ఫలదంబు లని క్షత్రకలితధర్మము మహాశ్రయను మహాఫలప్రద మనియును
దలఁచి రార్యులు రాజధర్మప్రధానముల్, పాలించునది సర్వవర్ణములను

తే. త్యాగ ముత్తమధర్మ మండ్రది సమస్త, మును నృపధర్మమునఁ ద్రయీదండనీతి
నమరు నది లేక యున్న వర్ణాశ్రమాదిసర్వధర్మంబులు నశించు జగతియందు.

ఉ. క్షత్రియధర్మమం దెసఁగు సర్వజగంబులు సర్వదీక్షలున్
క్షత్రియధర్మ ముత్తమము గా వచియింత్రు సమస్తధర్మముల్
క్షత్రియధర్మమున్ విడువఁ గల్గి ఖలాపహృతంబు లై చెడున్
ధాత్రి మనోవ్యథం బడి స్వధర్మము దప్పుదు రార్తులై ప్రజల్. 278

వ. కావున క్షాత్రంబు ధర్మంబు నాఁ గీర్తింపం బడు నందుఁ జతుర్విధాశ్రమ ధర్మంబులును యతిధర్మంబులును వేదోక్తధర్మంబులును సర్వకర్మంబులును వర్తించు నాశ్రమవాసులధర్మంబు బహుద్వారం బప్రత్యక్షంబు విరుద్ధాగమంబుల నది విరుద్ధం బై యధోగతిం గలిగించు క్షత్త్రియప్రతిష్ఠితం బగు ధర్మంబు ప్రత్యక్షంబును సుఖభూయిష్ఠంబు నాత్మసాక్షికంబు నచ్ఛలంబును సర్వలోకహితంబు నట్టిరాజధర్మంబునం దుండి తొల్లి మహారాజు లెందఱో విష్ణుసాయుజ్యంబు నొంది రీయర్థంబు తేటపడ ధర్మార్థవినిశ్చయం బగునొక్కయితిహాసంబు సెప్పెద నాకర్ణింపుము. 279

ఇంద్రమాంధాతృసంవాదరూప మగుచరిత్రము.

శా. మాంధాతృం డనుక్షత్రియోత్తముఁడు మున్ మావల్లభుం బొందఁ గా
సంధానించి మహామఖం బొకఁడు నిష్ఠం జేయుచున్ లోకసం
బంధంబుల్ విడనాడి చిత్తమునఁ దన్మార్గంబు వర్తించి యుం
డం ధర్మజ్ఞుఁడు జిష్ణురూపమున వేడ్కన్ వచ్చె విష్ణుం డటన్. 280

ఉ. వచ్చిన భూతలేశ్వరుఁడు వానిపదంబులఁ జేర్చి యాదటన్
హెచ్చినభక్తి మ్రొక్కి భజియించి సదస్యులతో సపర్యల

ష్టిచ్చకొలంది సేయుటయు నింద్రుఁడు సాంద్రకుతూహలంబునన్
ముచ్చట సేయుచుం బలికె భూతలనాథునివంకఁ జూచుచున్. 281

ఉ. కాంచఁగ నెంచి తీవు త్రిజగత్పతి విష్ణుని విశ్వరూపునిన్
గాంచఁగ లేము మే మయినఁ గంజభవాదులు నైన దాని న
ట్లుంచి మఱొండు కోర్కు లెవి యుండిన నొండన కిత్తు వేఁడు మీ
వెంచ జితేంద్రియుండవు మహీంద్రుఁడ వేను ద్రివిష్టపేంద్రుఁడన్. 282

వ. మాంధాత మోడ్పుఁగేలు ఫాలంబునఁ గీలించి యి ట్లనియె. 283

సీ. కామాదివిషయసౌఖ్యములను విడనాడి, వెడలి సత్పద మైనవిపినమునకు
నందుఁ దపంబుండి యాదిదేవుని విష్ణుఁ, గన నెంతు నీకటాక్షంబుకలిమి
క్షత్త్రధర్మమున లోకముల నార్జించితి, స్థాపించితి యశంబు సర్వదిశల
నాధర్మమున నొంద నగు దాని నొందితి, నుత్తమత్వము చెప్ప నోప నైతి
తే. నావుడును దండధరుఁ డయి భూవలయము, నేలకుండినక్షత్త్రియుం డెట్టిధర్మ
పరుఁడు నైనను బొందఁడు పరమగతిని, క్షాత్త్రధర్మము శ్రీవిష్ణుకల్పితంబు.284

మ. నృపధర్మంబున కంగభూతములుగా నిర్మించె నీశుండు దే
హపరిత్యాగము పిమ్మటన్ ఫలము నీయం జాలి వర్తించున
ట్టిపరివ్రాజకముఖ్యధర్మములు పాటింపంగ నయ్యున్నియున్
సుపరిష్కారము గాఁగ క్షాత్త్రమునయందుం జేరి యుండుం జుమీ. 285

తే. క్షత్త్రధర్మమునం దొల్లి కడఁగి విష్ణు, వరుల నిర్జించి దేవర్షివరుల నెల్లఁ
గాచె నది యాది గాఁగ లోకములయందు,నాదిధర్మము క్షాత్త్రమై యతిశయిల్లు.

మ. హరి క్షాత్త్రంబున శత్రునాశనము చేయం బూనకున్నప్పు డి
ద్ధర వర్ణంబులు నాశ్రమంబులును సందష్టంబులై పిమ్మటన్
మరలన్ వర్ధిలె నాఁటనుండియును ధర్మవ్రాతమం దాదియై
పరఁగెన్ క్షాత్త్రము దాన సర్వఫలముల్ ప్రాపించు భూపాలునిన్. 287

సీ. భూతానుకంపమై భూపాలనము సేయు, రాజు క్షాత్త్రంబున రణమునందు
నొడలీగి మోక్షంబు నొందు దండభయంబు,వలన దుష్టులధర్మములకుఁ జొరక
పాపకూపంబులఁ బడకుందురు ధరిత్రి, శిష్టు లాచారముల్ చెడకయుండ
సాధుధర్మంబులు సంతరించుచు నుండ్రు, సర్వలోకమునకు సౌఖ్య మెసఁగుఁ
ఆ. బ్రజలఁ బ్రజలఁ బోలెఁ బాలించుపార్థివు,వలన నెల్లభూతములును బ్రీతి
సేయు నందువలన శ్రేష్ఠతరంబు లక్షయము లూర్ధ్వలోకగతులు గలుగు.288

క. కావున భూపరిపాలన, గావించుట లొప్పు నట్లు కాకుండినచో
భూవర ! సర్వప్రజల క,భావము సిద్ధించు నృపతిపాపము గాంచున్. 289

తే. సర్వసస్యసంపన్న యై జగతి పొలుచు,నట్లు సేయుట రాజసూయాశ్వమేధ
ములుపొనర్చుటయును బ్రజంబ్రోచుటయున,భైక్ష్యచర్యయుననిఁజావుపతికిఁజెల్లు

మ. గురుశుశ్రూష యొనర్చుచున్ శ్రుతులు పెక్కుల్ పెక్కుచందంబులన్
బరఁగ న్నేర్చుట బ్రహ్మచర్యముఖముల్ భవ్యార్థధర్మంబులం
గరిమం దీర్చుట లోఁగ నన్నియును సుక్షాత్రంబునన్ భూప్రజన్
బరిపాలించెడుదానికిన్ సవతు నాఁ బల్కంగ రా దెన్నఁడున్. 291

క. మనుజులు తమతమధర్మము,లను మెలఁగక యున్న నన్యలక్షణములు వా
రి నధర్మంబులఁ ద్రోయున్,మనుదురు పశుతుల్యు లగుచు మహీతలమందున్.

సీ. విప్రులకును నాల్గువిహితాశ్రమంబులు, వేదధర్మంబుల వెలయుచుండుఁ
బరకర్మరతుఁ డై ప్రవర్తించువిప్రుండు, శూద్రసన్నిభుఁ డయి సొంపు దరిగి
పూజ కనర్హుఁ డై పోవుటయే కాక, దండనార్హుం డగుఁ దనవికర్మ
మున నిట్లు పెరవర్ణములకును నిజధర్మ,ముల వీడి పరకర్మములను గొనుట

తే. తగ దనియు వారు శిక్షార్హు లగుదు రనియు,క్షత్రధర్మము శాసించుఁ గాన దండ
ధరుఁ డయినక్షత్రియునిధర్మ మరయ నెల్ల,ధర్మములకంటె శ్రేష్ఠ మై తనరుసూవె.

వ. అని యింద్రుం డనిన విని మాంధాత యవనులు కిరాతులు గాంధారకులు చీనులు శబరులు బర్బరులు శకులు తుషారులు పహ్లావులు మద్రు లాంధ్రులు పౌండ్రులు పుళిందులు రమఠులు కాంభోజులు లోనగువారు దస్యుధర్మంబులం దుండు రట్టివా రెట్టిధర్మంబులఁ బ్రవర్తింప వలయు వారి నెట్లు శాసింపవలయు నెఱింగింపు మనిన నింద్రుండు. 294

సీ. దస్యుధర్మమునందుఁ దవిలినవారు మా,తరపితృశుశ్రూష గురుసమర్చ
యాచార్యసేవయు నాశ్రమవాసుల, పూజయు ధారణీభుజులప్రణిధి
సలుపంగ నగు నివి సద్ధర్మములు నాఁగ, విధివిహితము లయి వెలయు మఱియుఁ
దఱి వేచి వారలు దాన మీఁ జనుఁ గూప,శయనప్రపాదులు క్ష్మాసురులకు

తే. సత్య మక్రోధము నహింస శౌచనిరతి,యమరఁ బితృయజ్ఞపాకయజ్ఞము లొనర్ప
నొప్పు నని యిట్లు వారికి యుక్తకర్మ,ములుగ విధివిహితంబు లై వెలయుచుండు.

వ. అనిన మాంధాత సర్వవర్ణంబులందును సర్వాశ్రమంబులందును వేషాంత

రంబున దస్యుధర్మంబు చూపట్టెడి దానికారణం బెఱింగింపు మనిన నింద్రుండు వెండియు. 296

మత్త. దండనీతి వినష్టమై నృపధర్మ మట్టడుగంటి పో
ముండులందును గేస్తులందును భూతలంబున భీతి లే
కుండినందున దస్యుధర్మము నొంది వారు చరింతు రా
దండనీతియె యున్న నింతయు ధర్మము న్వొడ రెస్వ్వగుణా. 297

వ. దండనీతిధరుం డయినమనుష్యేశ్వరు నవమానించినవానికిఁ దపోయజ్ఞదానాదులు ఫలింప నేరవు దేవతలు నతని నభినందింప రని చెప్పి వాసవుండు నిజనివాసంబునకుం జనియె నని. 298

చ. శ్రుతివిహితంబు క్షాత్రము నరుం డెవఁడేనియు దానిదోషసం
యుత మని పల్కుచుండ విన మోకురువంశమణీ! మదుక్తి ని
శ్చితమతివై మహీప్రజలఁ జేకొని యేలుము దాన నెల్లను
వ్రతము లొనర్చు నట్టిమునివర్యులలోకము నీకుఁ గల్గెడుణా. 299

వ. అనిన నజాతశత్రుం డాశ్రమాది ధర్మంబు లెల్ల నానతిచ్చితివి మఱియుం దత్తల్లక్షణంబులు నాయాఫలంబులు వివరించి చెప్పు మనిన నప్పితామహుండు డిట్లనియె నట్లు ప్రతిపాదితంబులైనసర్వధర్మంబులును రాజునందుఁ బ్రవర్తించుచున్నవి చెప్పెద వినుము. 300

### వర్ణాశ్రమ ధర్మఫల నిరూపణము.

క. కామద్వేషములను విడి, భూమీశుఁడు సర్వభూతములయందు సముం
డై మించి దండనీతిం, దా మెలఁగుచు నున్న యతిపదము నొందు నృపా. 301

తే. నిగ్రహానుగ్రహంబుల నెఱియు జ్ఞాన,మును విసర్గము నెఱిఁగి చెప్పినవిధమున
వృత్తి గలఁడయిధీరుఁడై వెలయుఱేఁడు,గోను గృహస్థాశ్రమపదంబుకురువరేణ్య.

ఆ. ప్రత్యహంబు సంవిభాగంబునం బూజ్యు, లర్హులైనవారి నరసి భక్తిఁ
బూజ సేయుచుండుభూపతి బ్రహ్మచ, ర్యాశ్రమపద మొందు నవనినాథ. 303

సీ. జ్ఞాతిసంబంధుల సఖుల నాపన్నుల, సాఁకిన వైఖానసపద మొందుఁ
గొనకొని లింగిముఖ్యులకు సత్కారము, పఱపి వన్యాశ్రమపదము నొందు
దేవమానుషపిత్రతిథిభూతయజ్ఞముల్, కదిసి దివ్యాశ్రమపదము నొందు
శిష్టరక్షను దుష్టశిక్షను రాష్ట్ర మే, ల్పడిని సత్యాశ్రమపదము నొందు

తే. క్షమయు నధ్యయనంబు నాచార్యపూజ, గలిగి బ్రహ్మాశ్రమపదంబు లలితజపము

దేవతార్చనమును ధర్మదీక్ష సలిపి, నృపతి ధర్మాశ్రమపదంబు నెమ్మి నొందు 304

వ. మఱియుఁ బ్రాణద్యూతంబున మృత్యువు నొండె రక్షణంబు నొండె నొందిన వానికిని జిహ్మంబును శఠంబును గానిమార్గంబున మెలంగుచు సర్వభూతసముం డగువానికిని బ్రహ్మాశ్రమపదంబును త్రైవిద్యులును వానప్రస్థులు నగువిప్రులకు విపులార్థంబు లొసంగినవానికి వన్యాశ్రమపదంబును సర్వభూతానుక్రోశంబును నానృశంస్యమును గలవానికిని బాలవృద్ధపోషకుం డగువానికిని సర్వావస్థం బగుపదంబును శరణాగతభూతపరిత్రాణంబును జరాచరభూతరక్షణంబును భ్రాతృపుత్రపౌత్రాదులపట్లను నిగ్రహానుగ్రహంబును సాధుజనసమారాధనంబును బ్రజాపాలనంబును లోనగుధర్మములు గలవానికి గృహాశ్రమపదంబును లభించుం గావున రాజపురుషుండు సర్వాశ్రమఫలంబు నొందు నతండు రాజ్యపాలనంబు సేయుచు గృహస్థుం డయ్యును సర్వాశ్రమస్థుం డనియు స్థానమాన కులమాన వయోమానంబు లెఱింగియు దేశధర్మ కులధర్మంబు లెఱింగియు సర్వాశ్రమంబులఁ బాలించుచుండునది యనియుఁ దెలియం దగు. 305

క. ధర్మాధర్మవినిశ్చయ, నిర్మలమతి గాక యున్ననృపతి ప్రజలకుఁ
ధర్మంబు కలుగ వలె నని, కర్మము గావించి సుకృతగతిఁ జను నసఘా. 306

సీ. రాష్ట్రంబునం బ్రభురక్షితు లగువారి, ధర్మంబుపాలు భూధవునిఁ బొందు
నృపతిపాలితులు ధర్మపరులు వానిపాపము వాపుదురు సత్తపంబువలన
నృపసహాయులు నన్యకృతధర్మమున నంశ, మునకు నర్హత గల్గి పొనరుచుండ్రు
సర్వభూతములందు సమవర్తి యై దండ, ధరుఁడు రాజిందందు గరిమఁ గాంచు

తే. రాజధర్మోక్తనౌక ధర్మమున నుండి, ధర్మసేతువరాటక త్యాగవాయు
శీఘ్రగామినియును సత్యసిద్ధవీర్య, మై నృపతిఁ దరియింపఁ జేయంగ నోపు.

వ. కామక్రోధాదినివృత్తుం డై కేవలసత్త్వమం దున్న రాజు బ్రహ్మంబు నొందు సుప్రసన్నభావయోగంబులం దగిలి వేదవేదాంగవేత్త లగువిప్రులను బ్రజలం బాలించురా జిహపరసౌఖ్యంబు లొందు వర్ణాశ్రమరక్షణంబున శతగుణాధికఫలంబు లభించు నీవును రాజ్యపాలనరతుండ వై ధర్మంబు నొంద వలయు ననిన ధర్మనందనుండు వర్ణాశ్రమధర్మంబుల తెఱం గెఱింగితి నింక రాష్ట్రకృత్యం బెట్టిది విన వలతు నానతిమ్మనిన భీష్ముండు. 308

భీష్ముఁడు రాష్ట్రప్రజనులధర్మంబులు చెప్పుట.

సీ. ప్రజ లెల్ల నొకరాజు రాష్ట్రాధిపతిఁ గాఁగ, నభిషిక్తుఁ జేసికొం టర్హకృత్య
మట్లుగా కుండిన నబల మై రాష్ట్రంబు, దస్యుపీడిత మై విధంబు దప్పు
ధర్మంబు నశియించుఁ దజ్జను లొండొరు,ల్వాఁచి మ్రింగుదురుదోర్వీర్య మెసఁగఁ
దగ దరాజక మైన ధరణిఁ గాఁపుర మొప్పు, దం దగ్ని మోయదు హవ్య మెపుడు
తే. రాజు లేకుండుకంటెఁ బరతరపాప,మొండు గానంగఁ బడ దతం డుర్విజనుల
కుం బ్రసన్నుఁడై కుశలంబుఁ గూర్చుఁగుపితుఁ,డై పొనర్చు నిశ్శేషత్వమవనినాథ.

సీ. పాలీనియావు దెబ్బలఁ దిను బా లిచ్చు, దానికిఁ గ్లేశంబు దవులఁ బోదు
వంగనిదారువు వంతురు కాలిచి, కాలు వుండదు వంగుకట్టియలకు
బలవంతునకులొంగుఁ బ్రజగాన మే ల్గోరు,జనుఁడు రాజును నిల్పుకొనఁగ నొప్పు
ధర యరాజక మైన ధనము దారలు దక్కు, టరిది హరించు ననార్థ మన్యుఁ
తే. డిన్నియును నుద్ధరింపఁగ నెంచువాఁడు, రాజుఁ గోరంగ నొప్పెడు రాజు లేమిఁ
బాపి యైనను క్షేమంబు పడయఁ డొకని, నిద్ద ఱిద్దఱఁ బదుగురు నేపడంత్రు.
క. దాసుండు కానిపురుషుఁడు, దాసుం డై పోవు నొకనిదారం బలిమిన్
దోసంబు నాక వేఱొకఁ, డాసురగతి నపహరించు నధిపుఁడు లేమిన్. 311

ఉ. దేవత లిట్టిహేతువు మదిం దలపోసి సృజించి రుత్తమ
శ్రీవిభవాభిరాము నృపశేఖరు నాతఁడు దండధారకుం
డై వెలుగొందకుండిన బలాఢ్యుఁడు దుర్బలుఁ బట్టి మ్రింగు నం
భోవలయంబునందుఁ గలపుం జిఱుచేఁపను బెద్దచేఁప నాన్. 312

వ. తొల్లి యరాజకం బైనయొక్కకాలంబున బలాఢ్యుండు బలహీనుం బట్టి భక్షించుచుండె నట్టియెడఁ బ్రజ లందఱుం గూడి పరుల దూషించువారును బాధించువారును బరదారగమనం బొనరించువారునులోనగుపాపవర్తను లెల్లెడలం జెల్లు రేఁగుట లెఱింగి నియామకుండు లేమిఁ దమలోఁ దార శిక్షించు నట్లు సమయంబు చేసికొని కొంతకాలంబు ప్రవర్తించి తమసమయంబు చక్కఁ బెట్టుకొనం జాల కెల్లరుఁ గూడి పరమేష్ఠి పాలికిం జని తమదుఃఖంబు నివేదించి మే మీశ్వరుండు లేక బ్రదుకం జాల మని విన్నవించిన నతండు కరుణాతరంగితాంతరంగుం డై మను వను వాని నిర్దేశించుటయు నతండు మనుష్యులు మిథ్యావర్తను లగుటం జేసి రాజ్యపాలనంబు సేయం జాల నని యొడంబడకున్నంత నాప్రజలు నీ కిట్లు పుయిలోటకుం జిత్తంబు సేయ నొప్పదు మాకుఁ గల

ధనంబునందును బశుధనంబునందును నేఁబదియవభాగంబును ధాన్యంబునందుఁ బదియవభాగంబును నీకు నిత్తు మది కోశంబు గాఁ గొని శస్త్రోపజీవుల నెల్ల నీసైనికులుగం జేసికొని బలవంతుఁడవై దుష్ప్రధర్షుండవై దుష్టుల శిక్షించి శిష్టులరక్షింపుము భవద్రక్షితు లగుశిష్టులధర్మంబున నాలవపాలు నిన్నుం జెందు నీవు దేవేంద్రుండు దేవతలం బోలె మమ్ముఁ బాలించుచు సుఖం బుండుము సూర్యుండు వోలెఁ బ్రతాపింపుము శత్రులమానంబు మాయింపుము మా ధర్మంబు గాపాడు మని యనేకవిధంబులం బ్రార్థించుటయు నమ్మనుప్రభుండు.

ఉ. దానికి నియ్యకో ల్పలిపి ధైర్యము వీర్యము గల్గినట్టిఁడై
మానవనాథుఁడై ఖలసమాజముఁ గూలిచి మూలముట్టుగా
భూనుతుఁడై స్వధర్మములు పొందఁగఁ జేసి జగజ్జనాళి నా
నా నన నేలె వేల్పుల బిడౌజుఁడు వోలె సుఖప్రసంగతిన్. 314

శా. భూతిం గోరినవార లీవిధమునన్ భూజానిఁ గా నొక్కనిం
జేతోమోదముతోడ నిల్పుకొని వాసిం గాంచి సేవించుచుం
బ్రీతిం గూర్చుచు భక్తి సేయుచును దద్ప్రీతిం బ్రవర్తించుచున్
భూతానుగ్రహకారణంబు గల రై పూజింప నొప్పున్ భువిన్. 315

మ. తనదేశీయులచేత సత్కృతుల నొందం గల్గుతేనిం బరుల్
ఘనసత్కారములన్ భజింత్రు స్వజనుల్ కాదం చవజ్ఞామతిం
గనుచున్నం బెరవా ర్పరాభవ మొగిం గావింతు ర ట్లైన భూ
జన మెల్లన్ సుఖశూన్య మై వగవ నై జా నేది చాఁ నొఁ జూమీ. 316

ఉ. కావున భూప్రజల్ నృపతి గౌరవదృష్టి పొసంగఁ గాంచుచున్
సేవ యొనర్చుచుం దమప్రసిద్ధము లైనమణీగణంబులున్
వావురముల్ గజంబులును వాసగృహంబులు భోజనాదులున్
క్ష్మావరుఁ డైనవానికి నొసంగి తదాజ్ఞ మెలంగ మే లగున్. 317

వ. ఇట్లున్నభూప్రజలపై భూపతి ప్రేముడించి వారితోఁ స్మితపూర్వమధురసం భాషణంబులు సేయుచుఁ గృతజ్ఞుండై వారిక్షేమంబునకై వీక్షించుచుండు ననిన యుధిష్ఠిరుండు మనుష్యాధిపతి యైనరాజును దైవతంబు గా నేమిటికిఁ జెప్పుదు రది వినవలతుం జెప్ప ననుగ్రహింపు మనిన నాపగాతనయుం డీవిషయంబున నొక్కపురాతనేతిహాసంబు గలదు తొల్లి వసుమనుం డనుకౌసల్యుం డొక్క నాఁడు బృహస్పతి నర్ఘ్యపాద్యాదివిధుల నభ్యర్చించి ప్రసన్నుం గావించుకొని యి ట్లనియె. 318

15

బృహస్పతి వసుమనునకుఁ జెప్పినరాజధర్మప్రకారము.

తే. భూతములు వేనిచే వృద్ధిఁ బొందు వేని, వేనిచే వినాశన మొందు వేనిఁ గొలిచి
యవ్యయం బగుసుఖ మొందు నానతిమ్ము,నావుడు నతండతని కిట్లనగుచుఁబలికె.

చ. తనరును రాజమూల మయి ధర్మము లోకమునందు రాజ్యయం
బునన యొకళ్లొకళ్ల దెసఁ బోయి బలంబున హాని సేయకుం
డ్రనిశము నుత్సుకత్వమున కాతనిచేతయె హేతుభూత మా
జనపతి ధర్మముల్ ధర నెసంగఁగఁ జేయుచుఁ దా నెసంగెడున్. 320

క. రవి యుదయింపక యుండిన, భువి చీఁకటిలోన మునిఁగి పోయినరీతిన్
నృపరుండు లేనిదేశము, ప్రవిమలగతి లేక చెడును బహులార్తుల నై. 321

మ. జల మల్పం బయి యెండ నుండినసరస్థానంబునం దుండుచేఁ
పలు వేగిం బడియుండఁ గొంగ లచటం బ్రత్యక్షమై వాని నాఁ
కలికిం దాళక మ్రింగినట్లు నృపరక్షాశూన్య మాభూప్రజన్
ఖలు లేతెంచి వధించి తద్ధనములం గైకొండ్రు వేండ్రించుచున్. 322

సీ. బలవంతు లెపుడు దుర్బలులఁ బట్టి వధింతు, రిది నాది యనుమాట పొదలకుండు
రత్నముల్ యానవస్త్రములు లోనగునవి, దుర్జనులు హరింత్రుఁ దోర్బలమున
వృద్ధుల మాతరపితరుల నాచార్య, గురువుల హింసింత్రు క్రూరజనులు
ధనవంతు లిది నాది యనుకొనునంతనే, వధబంధనాదుల వశ మగుదురు

తే. కృషియువాణిజ్యమును ధర్మవిషయములును
బరిణయంబులు యజ్ఞముల్ బహువిధంబు
లైనకర్మము లుడివోవు నవని యేలు
నుత్తమప్రభు వొకఁడు లేకున్న యేని. 323

వ. మఱియును. 324

సీ. వేదముల్ చదువరు విప్రులు జపములు, తపములు వ్రతములు తలఁగి పోవు
నరయ రాకుండ్రు విద్యాస్నాతలును వ్రత, స్నాతలు ధర్మంబు సన్నగిల్లుఁ
దెగు సర్వసేతువుల్ తెక్కలికాండ్రు చేతుల నున్నసొ మ్మైన దోఁచుకొండ్రు
వర్ధిల్లు ననయంబు వర్ణసంకర మగుఁ, బ్రబలు దుర్భిక్షము రాష్ట్రమందుఁ

తే. బురుషులును స్త్రీలు పెడఁద్రొక్కి పోవుచుండు
రొండొరులఁ బట్టి హింసించుచుండు రెపుడు
ధర్మమార్గానులంబి నైన దండమాని

పెంపుతో రాజు ధరణిఁ బాలింపకున్న. 325

చ. నిజభుజపీఠి భూభరము నిల్పి ప్రజావళి నెల్ల వేళలన్
ఋజుగతి నేలురాజు త్రిదివేశ్వరుఁ డంచు భజింప నొప్పెడిం
బ్రజ లటు సేయ కాతనికిఁ బాపము చిత్తమునం దలంచిన
న్నిజముగ నారకవ్యథల నెంజిలి నొందుదు రంచు నెంచుమా. 326

తే. జాతవేదోఽర్కమృత్యువై శ్రవణధర్మ,రాజు లను వేల్పు లేవురు రాజరూప [కు
మున మెలంగుదురిలఁగానమనుజవిభుఁడు, వేల్పనుచుఁగొల్వనొప్పుఁబృథ్వీజనుల

సీ. కదిసి పాపంబులు గాల్చివేయును గానఁ, బార్థివుం డగ్ని నాఁ బ్రతిభఁ గాంచె
సర్వభూతములను జారచక్షుస్సున, నరయుచుండుట నినుం డనఁగ నయ్యె
దండధరుం డయి ధార్మికేతరుల దం, డించుట యముఁ డంచుఁ గాంచెఁ బేర్మి
ధరణీసుపర్వుల ధనధాన్యపరితృప్తు, లను జేసి రాజరా జనఁగ నయ్యె

తే. సకలమారణయంత్రాదిసాధనములఁ, జారచోరాదిదుర్జనసమితి నెల్ల [లె.
వేళహింసించుఁగావునవిశ్వమందు, భూభుజుఁడు మృత్యురూపుఁడై పొలుపుమిగి

శా. ఏతాదృగ్విధవై భవాంచితుఁడు భూమీంద్రుండు సాంద్రప్రభా
న్వీతుం బూతచరిత్రుఁ బాత్రు సచివు న్నీతిజ్ఞుని న్నిల్పి వి
ఖ్యాతిం భూప్రజ నేలుచుం గ్రతువులం గావించి దేవవ్రతుం
డై తళ్ళోకత్రియు నవ్వలం ద్రిదివమం దాస్థానముం గాంచెడున్. 329

వ. ఇ ట్లంగిరసుండు చెప్పినఁ గౌసల్యుండు ప్రయత్నంబునఁ బ్రజాపరిపాలనంబు గావించి కృతార్థుం డయ్యె ననినఁ బాండవాగ్రజుండు పార్థివుం డగువాఁ డెట్టి విశేషకార్యంబులు సేయ నొప్పు జనపదంబు రక్షించు టెట్లు శత్రువులం గెల్చు టెట్లు దారపుత్రభృత్యాదుల విశ్వసించు టెట్లు చెప్పు మనిన భీష్ముండు. 330

సీ. తనయాత్మ గెలిచినవెనుకఁ బగఱ గెల్వ, నగు నజితాత్ముఁడు పగఱ గెల్వఁ
జాలఁ డింతయు నాత్మజయ మెన్నఁ బంచవ,ర్గవినిగ్రహం బని తపుఁ దెలియఁగ
జయము గోరెడుమహీజాని సంధుల దుర్గ,ముల గుల్మములు నిల్ప వలయు నొప్ప
నగరములందును నగరోపవనులందు, సంస్థానములయందు సర్వరాజ

తే. భవనములయందుఁబ్రాజ్ఞులఁబ్రణిధిజనుల,నునిచికొనియాదరించుచుఁదనకుఁదెలిసి
యున్నఁదెలియనియట్లమాత్యులనుబిలిచి, వారితోడనాలోచింపవలయుఁబనుల.

మ. పరుఁ డల్పుండని తోఁపకున్నఁ బరమోపాయంబునన్ సంధికై
పరివర్తింపఁగఁ జేసికొంటయును నల్పప్రజ్ఞుఁ డల్పుం డటం

చరయ న్వచ్చినఁ బూర్వవైర మది చల్లారంగ సేనాసమూ
హారతిం బైఁ బడి సంహరించుటయు దీవ్య ద్రాజధర్మం బగుఁ. 332

క. సామము దానము భేదం, బీమూఁటం గార్యసిద్ధి యొనఁగెడు దండం
బేమాడ్కి నైన విడుచుట, భూమీశున కొప్పు ననుచు బుధగురు వనియెన్

సీ. పన్ను రాఁబడి సార్వపాలు ప్రజలనుండి, పడయంగ నగు రాజు ప్రజలఁ బ్రోవఁ
గన్నబిడ్డలఁ బోలెఁ గనఁ దగుం జౌరులఁ, జెలిమి వారలపట్లఁ జేయకుండి
వ్యవహారముల నిల్ప వలయుఁ బ్రాజ్ఞులను స, ర్వార్థము లెఱిఁగినయట్టివారి
నాకరాదులయందు నాయవ్యయవిచార, ణార్థ మమాత్యుల నాఁగ వలయు

తే. రాజులకు దండ ముక్తధర్మంబు గాన, దండము ధరింప వలయు నేతద్విధంబు
నంటి యుండినరాజు వేదాంగవేత్తయును దపస్వియు నాఁబడు మనుజనాథ.

క. సవనము దానము లోనగు, నవి నృపధర్మంబు లగుచు నలరెడు వీనిన్
దవులని రాజన్యునకున్, వివరింపఁగ నిహము పరము వెలి యగు నధిపా. 335

వ. మఱియును. 336

సీ. బలవంతుఁ డగుదాయ భయము గల్గినరాజు, ఘనదుర్గములు చేసికొనఁగ నొప్పు
సామభేదాదుల సవరించుకొనుచు మార్గములందు ఘోషముల్ గట్టవలయుఁ
దనదేశధనికులన్ దళముల నిజదుర్గములఁ బెట్టుకొని ప్రోవవలయు నెపుడు
తఱి వేచి పగఱపై దాడి వెడలి వారి, దుర్గమస్థలు లగ్నిఁ దుడువ వలయు

ఆ. ముట్టడించి మార్గములు వెలుపలివస్తు, వందకుండునట్టు లాచరించి
ప్రబలి నాఁడునాటఁ బ్రత్యర్థి నోర్చుట, రాజధర్మములను బ్రథమ మగును.

వ. మఱియు నరేశ్వరుండు స్వపురంబు చుట్టును గట్టికోట బెట్టించి దానిచుట్టును బరిఘంబు జలావృతంబు గావించి వరణంబు నలుమూలల బురుజులును బురుజులపై శతఘ్నిప్రముఖమహాయుధంబులును యంత్రంబులును నిలువరించి కుడ్యంబులఁ బ్రగండు లమరించి బలసమన్వితంబుగ నభిరక్షితంబు చేసి పరిసరంబులఁ దృణచ్ఛన్నంబులు పంకదిగ్ధంబులు నగుకూపంబులు త్రవ్వించి శత్రుప్రవేశాసాధ్యం బగుముఖద్వారం బయోమయంబును బ్రఘాణపరికల్పితానల్పకవాటంబు గల్పించి తదంతరంబునఁ జత్వరంబు లేర్పడ సూర్యసోమవీథులం దీర్చిననగరంబు నిర్మించుకొని యం దాయుధాగారంబులు నశ్వాగారంబులును గజాగారంబులును వైద్యశాలలును విపణిమార్గంబులును గలరాజధానిం గల్పించుకొని ప్రకృతిప్రధానపురుషపరివృతుం డై రాజేంద్రుండు ప్రజారంజ

కుం డై షాడ్గుణ్యంబునఁ ద్రివర్గంబు సాధించి రాజ్యపాలనంబు సేయుచు నధ్వ
రంబులు చేసి యిహపరంబుల సుఖంబు నొందు నట్టిరాజన్యునకుఁ దపంబును
గిపంబును గొఱ గా వనిన యుధిష్ఠిరుండు దండనీతిప్రకారం బెట్టి దనిన నప్పి
తామహుండు. 338

సీ. రాజధర్మంబుల రాజిల్లెడున్ దండ, నీతి జగంబందు నిలిచియుండు
దండంబునన్ లోకధర్మంబు నడచెడుఁ, బ్రజల కందున సిద్ధి ప్రబలుచుండు
నిల దురాచారముల్ దొలఁగు సదాచార,ములు నెలకొను నందువలన లోకు
లల్పాయువులు గాక వ్యాధులాధులు లేక, మెలఁగుచుందురు సౌఖ్యకలితులగుచు
తే. విధవలును జారచోరులు విధురు లవనిఁ, గలుగఁ బోవ రధర్మము మొలవ దెల్ల
కడలుఫలవంతములగునెప్పుడునుగృతయు, గమ్మునడచుచునున్నట్లుగా నిపించు.
తే. కృతమునన్ దున్నక ఫలించుఁబృథివిఁద్రేత,మూఁడుపాళ్లధర్మ మెసంగుఁభూమికృష్ణ
పచ్య యగు ద్వాపరమున సాఁబాలు ధర్మ,మగుడు దున్నిన సాబాల యవనిపండు.
క. దండము విడిచినపార్థివుఁ, డుండినఁ దద్దేశవాసు లురుతరపీడన్
బెండువడి చెడుదు రంతన్, మెండుకొనుం గలియుగంబు మేదినియందున్.
సీ. సర్వధర్మంబులు సన్నగిలుం బ్రజల్, స్వస్వధర్మము వీడి సంచరింత్రు
వర్ణసంకర మగుఁ బాదజుల్ భైక్ష్యోప, జీవులు పరిచర్యఁ జేసి ద్విజులు
వైదికధర్మముల్ వడి నశించెదు సాధ్వులును వ్యాధులును మెండుకొను ధరిత్రి
ఖలులు పుట్టెదరు లెక్కలి కాంద్రభయ మెచ్చు,నొక్కింతలోఁ జత్తు రుర్విజనులు
తే. వాన లుండవు సస్యముల్ పండఁబోవు, ధేనువులు లెస్స పాలీవు తెగి జనంబు
మెలఁగు భూపతి మోహసంకలితుఁ డగుచు, దండనీతి వహింపక యుండునేని.
మ. యుగముల్ నాలుగు పుట్టఁ జేయుటకుఁ దద్యోగంబునం బుణ్యపా
పగతుల్ వొందుటకున్ నరేశ్వరుఁడె చెప్పం జొప్పడున్ హేతువై
జగతీనాథుఁడు దండనీతి విడువన్ సర్వప్రజల్ పాపముం
దెగువం జేయుదు రద్ది యంటుకొను వాని న్వానిచుట్టంబులన్. 343
ఆ. దండనీతి తల్లి దండనీతియె తండ్రి, దాని విడువఁ బోక మానవేశ్వ
రుండు లోక మేలుచుండిన వానికి, నిహపరముల సౌఖ్య మెసక మెసఁగు. 344
వ. దండనీతిప్రభావం బిట్టిది గావున నీవు దండధరుండవై ధర్మంబునం బ్రజలఁ
బాలింపు మనిన ధర్మనందనుండు దండధరుం డగురా జెట్టివృత్తంబున మెలంగి
శుభోదర్కంబు లగునర్థంబులం బొందఁ గలం డని యడిగిన మదాంకిసీనంద
నుండు. 345

క. ముప్పదియార్గుణములు గల, ముప్పదియార్గుణము లెపుడుఁ బొందినవాఁడై
చొప్పడినదండధరుఁ డగు, నప్పతి కళ్యాణ మందు నని తెలియ నగున్. 346

వ. తద్విధం బెట్టి దనిన. 347

సీ. అకటుకుఁ డై ధర్మ మాచరింప నగు న, నాస్తికుఁడై స్నేహ మంద వలయు
నన్నృశంసుఁడై యర్థ మార్జించునది యను,ద్ధతుఁ డయి కామముం దవుల వలయు
నకృపణుఁ డై పల్క నగుఁ బ్రియం బవికత్థ,నుఁ డయి శౌర్యమ్మును నడుప వలయు
నాపాత్రవర్షి యై యోపి దాన మొనర్ప,నగు ననిష్ఠురుఁ డయి తగులు ప్రతిభ

తే. ఆర్యత యెఱింగి సంధి చేయంగ నొప్పుఁగాదు చుట్టలతోడ విగ్రహ మొనర్ప
నదుము చునభక్తుఁజారుఁగాననుపరాదుస్వగుణకార్యము లెఱిఁగింపఁజనదొరులకు

తే. సాధువుల ధనము హరింపఁ జనదు కుజను,నాశ్రయింపనొప్పదు దండ మరసి చేయ
నొప్పుమంత్రముప్రచురించుటోఁగుఱుద్రలుబ్ధజనమైత్రి వీడుకోల్ పొనరుఁబతికి.

సీ. ఈర్ష్య లేకుండినయే గుప్తదారుఁడు, ఘృణిగామి శుద్ధుఁడై కెరలువాడుచు
స్త్రీలకుఁ జన విచ్చి సేవింపరాదు ప,ర్యుషితాన్నము భుజింప నొప్ప దెపుడు
నలసుండుగాకమాన్యులఁ గొల్వనగు నమా,యికుఁడయి గురువుల కెఱఁగవలయు
దంభము లేక త్రిదశుల నర్చింప నొ, శ్రీ నకుత్సిత వృత్తిఁ జెంద వలయుఁ

తే. బ్రణయమునువీడిదండమున్వలయుఁగొనఁగఁగాలతత్త్వమెఱుంగ దక్షతలభించుఁ
బగఱు వేఁడిన దయఁ బట్టువదలరాదు, శత్రుదోషము తెలియక చంపరాదు.

క. కారణము లేక క్రోధము, భూరమణుఁడు సేయరాదు మున్నెపుడేనిన్
దీరనియపకృతి చేసిన, వారియెడన్ మార్దవంబు వలవదు సలుపన్. 351

వ. ఇవి రాజన్యధర్మంబు లిట్లు చరించినరాజిహంబున సర్వశ్రేయంబు లంది పరం
బున స్వర్గంబునకు నిర్గమించి సుఖించు నిట్లు గాక యధర్మవర్తి యగురాజను
త్తమభయంబు నొందు ననినఁ బాండవాగ్రజుండు గదాగ్రజాదిపరివృతుం డై
పితామహునిపాదారవిందంబులకుఁ బ్రణమిల్లి ప్రజాపాలనపరుం డైనరాజ
న్యుం డాధిబంధవిముక్తుం డై యెట్లు ధర్మాపరాధంబు నొందకుండెడి నెఱిం
గింపవే యనిన గాంగేయుండు వెండియు. 352

మ. శ్రుతముం గల్గియు ధర్మనిష్ఠులగుచున్ శోభిల్లి దేవవ్రత
స్థితి నొప్పారెడు విప్రులం బిలిచి భక్తిన్ మ్రొక్కి యొప్పం బురో
హితునిం గూడి భజించుచున్ నృపతి దా నిందుం బ్రవర్తించినన్
స్తుతిపాత్రుం డగు ధర్మముం జెడదు పొందుం ధర్మకామార్థముల్. 353

మ. ధృతి బుద్ధ్యార్జవయుక్తుఁడై నృపతి యెంతేఁ గామముం గ్రోధముం
మతి గీలొక్కొ నిడ కర్థ మొంద నగుఁ గామక్రోధముల్ రెండు ను
న్నతిమై ధర్మము నర్థముం జెఱచుఁ గాన న్నీవు ధర్మార్థసం
గతులం సాధుల నిల్పు మాధు లెపుడుం గాకుండు రాష్ట్రంబునన్. 354

తే. మూర్ఖుఁడును లుబ్ధుఁడును గామమునకుఁ గ్రోధ
మునకు వశపడువాఁ డర్థముల నధికృతుఁ
డైన యోగము క్షేమముఁ గానలేక
ప్రజ పరిక్లేశమును బొందుఁ బార్థివేంద్ర. 355

క. బలిషష్ఠధనము నొందఁగ, వలయుం బ్రజనుండి రాజవరుఁ డెడ వరుదేఁ
దెలిసి తదర్థము మఱి వా,రలయోగక్షేమముల నరయ విడఁగ నగున్. 356

మత్త. ధర్మనిత్యుఁ డతంద్రితుండును దాత యైనమహీపతిన్
నిర్మలాత్మ భజింత్రు లోకులు నీవు లోభము పెంపునన్
ధర్మముం విడనాడి యున్నఁడు దండుగుం గొనఁ బోకు మీ
కర్మ మొప్ప దశాస్త్రవేత్తకుఁ గాదు ధర్మము ధర్మమై. 357

ఆ. నిరత మర్థశాస్త్ర పరుఁ డైనరాజన్యుఁ, డమలధర్మసంహితార్థములను
బొందఁ జాలఁ డతనిఁ బొందినతద్విత్త, మంతయు న్నశించు నంతనంత. 358

క. కరము లశాస్త్రీయమ్ములు, వరుసగఁ గల్పించి ప్రజల బాధించుటె కా
దరుదార స్వవధ మైనం, బరికింపఁడు లోభి యైన పార్థివుఁ డవనిన్. 359

మ. పొదుగుం గోసినఁ బాలు రానిగతి యొప్పున్ భూప్రజన్ వేచు రా
జుదయంబుం గొనఁ బోవఁ డీని పరువం బున్నట్టిగోవుల్ సదా
సదుపాయంబున సేవ సేయుచుఁ బయస్సారస్యముం గాంచిన
ట్లుదటుల్ జూపక రాష్ట్ర మేలుచు ఫలం బందం దగు న్నేర్పునన్. 360

తే. రాష్ట్రము నుపాయమున నేలురాజవరుని
బొక్కసము క్రమక్రమమున మిక్కుటము మగుఁ
గావునన్ రాజు స్వపరసంఘములనుండి
వసుమతి సురక్షితము సేయ వలయు నెపుడు. 361

క. ఓకురువర! నీ వామా, లాకారుం డట్లు గా వలయు నేనాఁడున్
గాకుమి యాంగారికున, ట్లాకర్షించుచుఁ గరంబు లందెడు వేళన్. 362

తే. అర్థము క్షయించెడిఁ బరచక్రాభియాన, మునను సామము సంధించి కొనుట లెస్స

బ్రాహ్మణేతరులందఱి ద్రవ్య మెప్పుడు, సామమునఁ జేసి పొందుటే సాధుమతము.

క. ధనవంతుఁ డైనబ్రాహ్మణుఁ, గని మనము చలింప నీయఁగా రా దతనిన్
ధన మిచ్చి యథాశక్తిన్, గొని కొల్చి మహీశుఁ డందుకొను స్వర్గంబున్. 364

వ. ధర్మనందనా! నీ విట్టిధర్మవృత్తంబునఁ బ్రజాపాలనంబు గావింపుము దాన నీకు శాశ్వతకీర్తియుం బుణ్యంబును బురుషార్థంబు నగు నాధిబంధంబునుం గలుగ కుండు నాకర్ణింపుము. 365

ఆ. భూతరక్షణంబు భూభుక్కునకు ధర్మ, మింతకంటె ధర్మ మన్య మెదియుఁ
బరఁగ దొక్కనాఁడు ప్రజ నేలకున్నఁ బా, ప మతని కగు వేయివత్సరములు.

ఆ. ప్రజల నొక్కనాఁడు పాలించుఫల మది, నాకమందు దశసహస్రవత్స
రమ్ము లనుభవించు రాజేంద్రుఁ డుగ్రత, పం బొనర్చుతపసిపగిది నధిప 367

వ. రాజేంద్రా! నీవు రాజ్యంబు నొంది సజ్జనుల రక్షించి దుర్జనుల శిక్షించి ధర్మమార్గంబునఁ బ్రజాపాలనంబు సేయుచు సోమంబుల నింద్రాదులఁ దృప్తులం గావింపు మిట్లు చేసిన నీవు స్వర్గాదిసుఖంబులం బొందఁ గల వీయర్థంబున నైలపురూరవోమాతరిశ్వసంవాదరూపం బగునొక్కయితిహాసంబు గల దాకర్ణింపు మొక్కకాలంబునఁ బురూరవసుండు మాతరిశ్వుం గాంచి యిట్లనియె. 368

## వాయుదేవుఁడు పురూరవునకుఁ జెప్పినరాజధర్మప్రకారము.

తే. బ్రాహ్మణుం డెట్టు లయ్యె వర్ణములు మూఁడు, నెట్టు లయ్యెను వానిలో నేదియెట్లు
శ్రేష్ఠతను గాంచె విన నిచ్చఁ జేసినాఁడఁ, జెప్పు మనుటయు నాతండు చెప్పెనిట్లు.

ఆ. బ్రహ్మముఖమునుండి బ్రాహ్మణుండును బాహు, యుగమువలన క్షత్రియుండు నూరు
వులను వైశ్యుఁ డంఘ్రితలమున శూద్రుండు, పొడమి రాదినుండి పొలుపు గలిగె.

తే. ధర్మకోశసంరక్షణార్థము ద్విజుండు, దండధారణార్థము క్షత్రియుండు ధనము
ధాన్యమును గూర్చి ముప్వురఁ దనుపవిశుఁడు, సేవయొనరింప శూద్రుఁడు క్షితి నెసగిరి

ఆ. అనిన నైలుఁ డనియె ననిల! ధర్మార్థాది, కారణములు గలుగుకతనఁ బృథివి
మూవురందు వేనిదై వఱలెడుఁ జెప్పు, మనిన వాయు విట్టు లనియె మఱియు.

సీ. జగతీగతం బగుసర్వము విప్రుని, దనిరి జ్యేష్ఠత యాభిజనత కలిమి
నతఁడు తాఁ దినుఁ బెట్టు నఖిలవర్ణములకు, గురువు శ్రేష్ఠుం డయి పరఁగుసతికిఁ
బత్యభావమున దేవరుఁ డగునట్లు వి, ప్రాభావమున నన్యుఁ డధిపుఁ డిలకు
దెలిసి నీ విది ధర్మకలితుఁడ వై గెల్చి, తెచ్చి యింతన్ భూమి ద్విజున కిమ్ము

తే. రాజు ధర్మజ్ఞుఁ డైనవిప్రవరుఁ గొల్వ,నగునతఁడు వాని దిద్దిశ్రేయములు గూర్చు
విప్రశిక్షితుఁ డై ధర్మవిధి నెసంగు, నతని ధర్మంబునఁ భాగ మందు ద్విజుఁడు.

చ. ప్రజలును ధర్మతత్పరుఁడు రాజు ప్రజం బలెఁ దమ్ము నేలుకో
వృజినము లేక ధర్మమున వృత్తము సెల్లఁగ నిశ్చయంబునన్
స్వజనముతో సుఖంపడుచు స్వామి భజింతురు వారిధర్మమం
దు జనవిభుండు గైకొనుఁ జతుర్థము భాగము శాస్త్రపద్ధతిన్. 374

వ మఱియు నాకర్ణింపుము దేవమనుష్యపితృగంధర్వోరగరాక్షసాదులు యజ్ఞంబుల జీవింతు రవి రాజరక్షితంబులై ప్రతిష్ఠితంబు లగు రాజరక్షణంబు లేనియెడ సర్వంబును భయాక్రాంతం బగు ఛాయ యుష్ణభయంబు నగ్ని శీతభయంబుం దొలఁగించున ట్లరాజకభయం బడంగింప నెద్దియుం గానరా దట్టిభయాక్రాంతు నకు శబ్దస్పర్శరూపరసగంధాదిసర్వభోగంబులందును సుఖంబు లేక యుండు జగంబునం దభయప్రదాత భూనేత యతండే ప్రాణదాత యై యింద్రుండు యముండు ధర్ముం డై సర్వప్రపంచంబు నుద్ధరించు నని మాతరిశ్వుండు చెప్పె నని భీష్ముండు వెండియు. 375

శా. రాజన్యుండు బహుశ్రుతుం డఖిలధర్మజ్ఞుండు నై ధర్మవి
భ్రాజిష్ణుండు బహుశ్రుతుండు భువనప్రఖ్యాతుఁ డై సత్తప
స్తేజోంచన్మతి యైనభూసురుని మంత్రిస్థానమం దుంచి శా
స్త్రాజిష్ణుం బగుతన్మతి న్మెలఁగ రాజ్యం బెన్నఁ బూజ్యం బగున్. 376

వ. పరస్పరసుహృదులు సమచేతస్కులు నగునాబ్రహ్మక్షత్రియులసమ్మానంబునం జేసి రాష్ట్రప్రజలు సుఖింతురు సర్వవర్ణంబులకును బ్రహ్మక్షత్రమ్ములు మూలమ్ము లీయర్థమ్మున నైలకశ్యపసంవాదం బనునితిహాసంబు గల దైలుం డొక్కనాఁడు కశ్యపుం గాంచి బ్రహ్మక్షత్రియులమైత్రి చెడి వా రొండొరులు విడనాడుకొని నప్పు డితరవర్ణములవా రన్యాగ్బలంబుగ నం దెవరి నాశ్రయించి భజింతురు చెప్పు మనినఁ గశ్యపుండు. 377

శా. ఏరాష్ట్రంబున రాజు బ్రాహ్మణునిపై నీ సెక్కి ద్వేషించునో
యారాష్ట్రంబున శ్రీ యడంగి చను నాయావర్ణముల్ రాజుపై
వైరంబుం గొని వానిఁ బుల్కసునిగా భావించి పోనాడుచున్
జేరున్ దస్యులవంక శంక విడి సంసేవించి జీవింపఁగన్. 378

చ. ఎవరికొమాళ్లు వేదమున నింత యెఱుంగనివార లౌదురో

కొంపరు యజింపకుండెదరో యేరికిఁ బాడి యొకింత యుండదో
భువి నటువంటిక్షత్రియులు భూసురులన్ విడనాడువారు నై
జివ చెడి విత్తహీను లయి చేడ్పడి పోదురు దస్యుభీతులై. 379

క. క్షత్రియునిన్ విడనాడిన, ధాత్రీసురుఁ డెల్లనాఁడు దస్యుభయముచే
నాత్రముపడి బహుబాధలు, ధాత్రిన్ మన వలసి వచ్చు ధరణీనాథా. 380

వ. ఇట్లు పరస్పరసంయుక్తంబగు బ్రహ్మక్షత్త్రం బభిప్రసన్నంబై సంప్రతిష్ఠం బొందెఁ దద్విభేదంబున సర్వంబు సంప్రమూఢం బగుటయ కాక మహాగాధజలంబుల నౌక వలె సంప్రపన్నంబై పారంబు గానక క్షయం బగు బ్రహ్మవృక్షంబు రక్ష్యమాణంబై సుఖహేమంబులు వర్షించు నరక్ష్యమాణంబై దుఃఖపాపంబులు వర్షించు బ్రాహ్మణుం డగువాఁడు బ్రహ్మచర్యంబునం జేసి వేదాధ్యయనంబు సేయకుండిన దేవుండు వానియభీష్టంబులం దీర్పండు దేశంబున క్షామడాంబ రాదులు దుస్సహంబు లగు బాపుఁ డగువాఁడు స్త్రీలను బ్రాహ్మణులం జంపి ధర్మసభలో శిక్షితుండు గాక పాపభయంబులం బొంది తత్ఫలంబున హింస్రుం డగునట్టిదోషంబున రాజు రుద్రుండై పుట్టి పాపంబులం గావించు నప్పాపంబులు కలిం బుట్టించి సాధ్వసాధువుల నెల్లం బెట్టు హింసించు ననిన నైలుండు హింస్రుండు రుద్రుఁ డగురా జెట్టివాఁ డతం డెట్లు పుట్టును సత్వంబు సత్వంబును బట్టి వధించు నెట్టిది యదియంతయుం జెప్పు మనినఁ గశ్యపుం డిట్లనియె. 381

తరువోజ. జనులమనంబునం జనునాత్మశత్రు, షట్కమునం జేసి స్వపరదేహమ్ము
లను నేర్చు రౌద్రమై లలి గ్రహావిష్టు,లకు స్వపరజ్ఞానలవము లేనట్లు
జనవిభుదేహంబు స్వకృతకర్మమునఁ, జను రౌద్రమై నింగి జనియించి గాలి
యును మబ్బు నటునిటునొరసియుత్పాత,యుతములై చూపట్టుచుండుట గనమె.

వ. అనిన నైలుండు కశ్యపా! గగనంబునఁ బృథగ్భూతంబు లైనవాయువులు వీవకుండునా? జీమూతంబులు వర్షింపకుండునా? యట్లు మానుషశరీరంబుల యుక్తుం డైనజీవుండును గామక్రోధంబులును బంధకమోహాకంబు లగుచుండు ననినఁ గశ్యపుండు వెండియు. 383

మ. ఒకగేహంబున నింత యై పొడమి దారూచ్ఛ్రస్థితివ్యాప్తి యం
తకమై గ్రామము నెల్లఁ గాల్చినగతిం గామాదిసంసక్తి మో
హకుఁడై జీవుఁడు రుద్రసంజ్ఞ గలఁడై హర్షోంది దేహంబులం
బ్రకటింపంబడు దానఁ బుణ్యమును బాపంబున్ జగన్మండలిన్. 384

వ. అనిన నైలుండు. 385

తే. పుణ్యపాపవిహీను నాత్ముని నిమిత్త, భూతపాపమునన్ దండమునను జొనుపఁ
బుణ్యపాపములసుకృతమునుసుదుష్కృ,తమునుగలిగెడుననునదితప్పయగును.

వ. అనినఁ గశ్యపుం డాత్మాహంకారాసంయోగంబున నాత్మకుఁ బాపంబు చూప
ట్టదు మిత్రభావంబునం జేసి శుష్కంబున నార్ద్రంబు దహింపంబడు నట్లహం
కారగతం బగునాత్మ కంటు ననుడు నైలుండు వెండియు. 387

తే. సాధ్వసాధువులందాల్చుజగతిసాధ్వ,సాధులుతపింపవేఁగుభాస్కరుఁడుసాధ్వ
సాధులన్ వీచు వాయువుసాధ్వసాధు,వుల దడుపునీళ్లు లాత్మయప్పోల్కినువ్వె.

వ. అనుడుఁ గశ్యపుండు. 389

ఆ. లోకదృష్టి నిట్టు లే కాన వచ్చు న,ముత్ర దృష్టి నట్లు పొసఁగదు మృతిఁ
బొంది పుణ్యపాపముల ఫలం బందఁగఁ,దగును సుకృతదుష్కృతము లొనర్చి.

చ. ధరపయి బ్రహ్మచారి యగుధన్యుఁడు మాన్యుఁడు సచ్చి యవ్వలన్
జరయును మృత్యుదుఃఖము లెసంగనిపుణ్యజగంబున న్నిరం
తరమును సంతసించెడిని దద్భువనం బమృతప్రణాభియున్
బరమఘృతార్చియు న్మధుసమంచితముం గనకప్రదీపమున్. 391

చ. దురితము లాచరించి కడుదూరున కైనదురాత్మకుండు దు
ర్మరణము నొంది కుందుచు నిరంతరదుఃఖసమన్వితంబు దు
ర్భరమును దుష్ప్రకాశ మగుపాపజగంబున కేగి పెక్కువ
త్సరములు దుఃఖముం గుడుచు సంతతమాత్మకుఁ దాప మంటఁగన్. 392

సీ. ఇది యిట్టిదగుటచే నృపతి విప్రుని వీడఁ, రాదు వీడినను రుద్రత్వ మొందుఁ
బ్రజకు దుస్సహమగుప్రతిబంధదుఃఖము, లతుకుఁగావునబురోహితునిఁగూర్చి
యవ్వల రాజన్యు నభిషిక్తుఁ జేయ నొ,నందునన్ ధర్మ మత్యధిక మగును
బ్రాహ్మణసృష్టియే ప్రథమంబు గావున, వర్ణములకు నెల్లఁ బ్రథముఁ డతఁడు

తే. పూజ్యుఁడును మాన్యుఁడును నగ్రభోక్త యతని
యందు శ్రేష్ఠత్వము విశిష్ట మయ్యెఁ గాన
నృపతి విప్రునిఁ గైకొన నెసక మెసఁగు
వారిసంసర్గ మొసఁగు భూప్రజకు మేలు. 393

వ. అని చెప్పె నని చెప్పి భీష్ముండు వెండియు నోధర్మనందనా! రాష్ట్రయోగ
క్షేమము రాజన్యాయత్తము రాజన్యయోగక్షేమము బ్రాహ్మణాయత్తము

బ్రాహ్మణుండు రాష్ట్రంబునం దదృష్టభయంబును రాజదృష్టభయంబును బాయఁ
జేయఁ బ్రజాసౌఖ్యం బభివృద్ధి నొందు నీయర్థంబున ముచికుందవైశ్రవణ
సంవాదంబు గల దాకర్ణింపుము. 394

కుబేర ముచికుందసంవాదము.

మ. ముచికుందుం డనురాజచంద్రుఁ డవనిన్ ముమ్మాఱు నిర్జించి మిం
చి చమూవారముతోఁ గుబేరు గెలువం జిత్తంబు గావించి పో
యి చలం బేర్పడ మోహరించుటయు నయ్యైశానుమిత్రుండు శ
త్రుచరిత్రంబున కోహటింప కెదిరెం గ్రోధంబు రెట్టింపఁగన్. 395

తే. రాక్షసులఁ బుచ్చుటయు వారు రాజసైన్య, ములను గొనిచించి చెండాడి రలుకఁ జేసి
వెడమొగము వెట్టి రాజోడి వెడలి పురికిఁ, దనవసిష్ఠుని గర్హించె వినిచి విధము. 396

వ. వసిష్ఠుం డుగ్రతపంబు గావించి రాక్షసుల నెల్ల నుక్కడంచి రాజమార్గంబు
సురక్షితంబు గావించె నంత వైశ్రవణుండు నిజసైన్యంబు దైన్యంబు నొందుట
యెఱింగి ముచికుందుం గాంచి యి ట్లనియె 397

మ బలవంతుల్ సపురోహితుల్ నృపులు ము న్వర్తించిరే కాని నీ
బలె వర్తింపరు వచ్చి నన్నుఁ గొలువన్ వాంఛింత్రు నీకున్ భుజా
బల మున్నం గనిపింప నొప్పెడి నిటుల్ బ్రహ్మప్రభూతోల్లస
ద్బలముం గైకొని విట్టివీగుటలు మే ల్భాషింపఁగా నుండునే. 398

వ. అనినఁ గ్రుద్ధుండై ముచికుందుం డైలబిలుం గాంచి న్యాయపూర్వంబుగా
ని ట్లనియె. 399

సీ. ఏకయోనిగ బ్రహ్మ సృష్టించె బ్రాహ్మణ, క్షత్రియజాతుల శాస్త్రసరణి
బ్రహ్మజాతిం దపోబలము క్షత్రియజాతి, బాహుబలంబును బాదుకొలిపె
నాబలద్వయ మేకమై లోక మేల నొ, ప్పుం బృథగ్బలవిధానం బ దొప్ప
దిది సనాతనమార్గ మిందుఁ బ్రవర్తించు, నన్ను గర్హించుట లెన్నఁ దగునె
తే. యనిన నతఁ డను నీశ్వరు నాజ్ఞ లేక, యేరికిని రాజ్య మీ నెంచ నే హరింప
నేలుకొను నీ కొసంగితి నెల్లపృథివి, ననుడు ముచికుందుఁ డాతని కనియె నిట్లు.

శా. బాహావీర్యవినిర్జితం బయినభూభాగంబు కా కీ విటుల్
సాహంకారత నిచ్చినట్టిధరణీసామ్రాజ్య మే నొల్ల నా
నాహా యంచు నసంభ్రముం డయి స్వధర్మాసక్తుని న్వాని నెం
తో హర్షించుచు నంపి పుచ్చె ధనదుం డుల్లంబు రంజిల్లఁగన్. 401

వ. అంత ముచికుందుండును క్షత్రధర్మరతుండై బాహువీర్యార్జితం బైనవసుంధరం బాలించె నిట్లు బ్రహ్మపూర్వం బైనక్షత్రంబు ధాత్రిం బాలించి మహాయశంబు గాంచు ననిన యుధిష్ఠిరుం డిట్లు కృతపురోహితుం డగురా జేవృత్తిం జేసి రాజ్య మేలి ప్రజాభివృద్ధిం గావించి తాను బుణ్యలోకంబులఁ బొందు నెఱుంగం జెప్పు మనిన భీష్ముం డి ట్లనియె. 402

సీ. రాజ్య మేలెడురాజు పూజ్యులఁ గొల్చుచు, దానము లొనరించి తపము చేసి
జన్నముల్ గావించి సత్యసంధుండును, ధర్మతత్పరుఁడు నై తనర వలయు
రా జెట్లు వర్తించుఁ బ్రజ లట్లు వర్తింత్రు, రాజరక్షితు లయి రాష్ట్రమందు
జను లొనర్చినధర్మమునఁ జతుర్థాంశము, రక్షణంబున జేసి రాజు నంటు

తే. నేలుబడినకుశల మైనయేని పాద, భాగ మర్ధము ననృతంబు పలికి ఘాతుఁ
కుఁ డయితత్పాపమంతయుఁ గుడుచునిట్లు, పాపపుణ్యములకు రాజు భాగి సూవె.

చ. వసుధ ధనోపజీవు లగువారిధనంబు హరింపఁ దస్కరుల్
మసలక రాజు తస్కరుల మట్టుపడం బొనరించి వెండి త
ద్వసువును దెచ్చి యీఁ దగును వారికి న ట్లిడఁ గా నశక్యమై
పొసఁగినచో స్వకోశధనముం గొన నీయఁగ ధర్మ మయ్యెడిన్. 404

ఆ. విప్రు నట్లు విప్రవిత్తము రక్షింప, వలయు నృపతి కందువలన సర్వ
మును సురక్షిత మయిపొనరువిప్రుసమాశ్ర, యించియొప్పుచుందు రెల్లవారు.

ఆ. ప్రాణిసముదయంబు పర్జన్యునిం బక్షి, సమితి యెల్లవృక్షసంచయంబు
నాశ్రయించి బ్రదుకునట్లు ప్రజల్ రాజు, నాశ్రయించి బ్రదుకునాస నుండ్రు.

వ. అనిన యుధిష్ఠిరుండు రాజులకు రాజ్యపాలనంబు ధర్మార్థం బనిన నందుఁ బుణ్యంబుకన్న మిన్నయై పాపంబు చూపట్టెడుఁ గావున నేను రాజ్యసుఖాన్వేషిని గాఁ జాల వనంబులకుం జని న్యస్తదండుఁడను జితేంద్రియుండ నై మునినై మూలఫలాశనుండనై ధర్మము నారాధించుచుఁ గృతకృత్యుండ నయ్యెద ననిన దేవవ్రతుండు. 407

ఆ. ఆనృశంస్య మైనయట్టినీబుద్ధి నే, నరసి యున్నవాఁడ నగుణము యిది
కేవలానృశంస్య మే వేళఁ గొని రాజ్య, పాలనంబు నేత పోల దెపుడు. 408

తే. నిను నధార్మికుఁగ్లీబధర్ముని ఘృణాస, మేతు నాశ్చర్యచరితుని మృదుహృదయుని
విని బహూకరింపదు లోక మని యెఱింగి, లోనపేక్షింపు పైతృక మైనవృత్తి.

శా. పూర్వక్షత్రియవృత్తమందు మెలఁగం బో నిచ్చ గావింప వీ

ఉర్విం బ్రోచినధర్మమున్ ఫలము లే దుర్వీశ క్రియం దానృశం
స్యార్వంబుం దిగ నందు వి ట్లగుదువం చానాఁట మీపూర్వు లా
శీర్వాదంబును బొందఁ గోరరు శుభశ్రీ లెంచి మే లెంచుచున్. 410

సీ. శౌర్యంబు బలమును సత్యంబు యశమును,గలుగమీతండ్రి వేల్పులను గోరు
మాహాత్మ్య మౌదార్యమాహవవిజయంబు,శ్రీయు మీతల్లి యాచించు ఋషుల
స్వాహాస్వధాదులు స్వాధ్యాయమును సత, తముఁగల్గఁబితృదేవతలు వచింత్రు
దాన మధ్యయనంబు ధర్మగతియుఁ బ్రజా,పాలనంబును గల్గుఁ బ్రభవమునను

తే. సత్కులంబునఁ బుట్టితి సకలధర్మ, వేత్త వైతి వైశ్వర్యము విస్తరించెఁ
బూర్వరాజన్యమార్గము పొల్లపోవ, నేలుకొన రాజ్య మందు వి దేటితెలివి.

తే. ధార్మికుఁడు రాజ్యపాలనధర్మ మంది,దాన మొనరించి యజ్ఞముం బూని చేసి
సూనృతంబును ద్విజసేవ మానకుండి,సకలసౌఖ్యము లందెడు జనవరేణ్య. 412

ఆ. ఒక్కఁ డైనధర్మ మూని యితరధర్మ,ములను విడిచి దోషమునఁ దపించుఁ
దగినకాలమందు ధాత్రీభరముఁ బూని, కష్టపడియు రాజు గాంచు ఫలము.

క. అన్నిట శిక్షిత మగుహాయ, మెన్నన్ స్ఖలనంబు లేక యెసఁగెడురీతిన్
దిన్ననికర్మములం దగు, నన్నరునకు నెందుఁ జలన మంటక యుండున్. 414

మ. తనదేశప్రజలన్ మహీశుఁ డధికార్థం బిచ్చియుం బ్రేముడిం
గనియుం గమ్మనిమాట లాడియును జేఖడ్గంబునుం జూపియున్
దనకున్ వశ్యులు గా నొనర్చుకొని మేధావంతుఁడై పైతృకం
బును బూజ్యం బగురాజ్య మేలి యశముం బుణ్యంబునుం గాంచెడున్. 415

తే. కాలసంప్రాప్త మగురాజ్యపాలనాది,భారమును వహింపక విడివడిన యేని
వారి నపకీర్తి విడువక వచ్చు నంటి, తలఁప రాజులకు విహితధర్మ మదియ.

చ. వినియత మైనవారువము వీఁగనియట్టులు స్వీయధర్మకృ
జ్జనునకు సిద్ధి చెప్ప నగు స్వల్పమ యైనను సారభూతమై
ఘనమగునద్ది దాని విడుకంటెను జేయుట మేలు ధార్మికుం
డనఁబడురాజు ధర్మము నొకప్పుడుఁ దప్పుట యొప్ప దెన్నఁగన్. 417

వ. అనిన నజాతశత్రుండు గంగాపుత్రునిం గని స్వర్గసాధనం బెయ్యది దానం
గలుగుప్రీతియుఁ బరమైశ్వర్యము నెట్టివి చెప్పు మనిన నతం డతని కి ట్లనియె.

ఆ. భీతు మాన్పి ప్రజల నేతఁజేఁ బ్రోచెడు, నుత్తముండు స్వర్గజిత్తముండు
నిజము చెప్పుచుంటి నీవె కౌరవులలోఁ, బ్రీతి కైతి రాజ వౌత మనఘ. 419

మ. అనృశంసున్ విజితేంద్రియున్ సదనుకంపాయత్తచిత్తున్ నృపుం
గని వానిన్ భజియింత్రు భూప్రజలు లోకంబందు స్వాదుద్రుమం
బునఁ బక్షుల్ బలె రక్షకుండ వగునీమూలంబునన్ సాధుస
జ్జను లెల్లన్ సుఖయింత్రు నీసుకృత మెంచం గొంచెమే ధర్మజా. 420

వ. అనిన ధర్మనందనుండు విప్రులు కొందఱు స్వకర్మమందును గొందఱు వికర్మమందును బ్రవర్తింతురు వారివారివిశేషం బెఱింగింపు మనినఁ గురుపితామహుండు. 421

సీ. అలఘువిద్యాలక్షణులు సర్వసము లగు, బ్రాహ్మణుల్ పరికింప బ్రహ్మసములు
ఋగ్యజుస్సామసమేతుల్ స్వకర్మవర్తిష్ణువుల్ విప్రులు దేవసములు
జన్మకర్మవిహీను లున్మార్గగులు దురిచ్ఛలు బ్రహ్మబంధువుల్ శూద్రసములు
వీర లశ్రోత్రియుల్ వీరిచే బలిఁ గొని, యురక సేవం గొను టొప్పుఁ బతికిఁ
తే. దెలియ ధర్మాధికారులు దేవలకులు, గ్రామనక్షత్రయాజకుల్ గహనమధ్య
మార్గసుంకగుల్ వీరు బ్రాహ్మణసమూహ, మందుఁజండాలురననొప్పుచుందురధిప.

వ. బ్రాహ్మణులలో ఋత్విజుండును బురోహితుండును మంత్రియు దూతుండును వార్తాహరుండును వీరు క్షత్త్రియసములు హయారోహులు గజారోహులు రథులు పదాతులు వీరు వైశ్యసము లిందు దేవబ్రహ్మసములు తక్కఁ దక్కిన వారివలన హీనకోశుం డగురాజు బలిం గ్రహింప నొప్పు నబ్రాహ్మణులవిత్తంబున కధికారి రాజని వేదంబు సెప్పు బ్రాహ్మణులలో వికర్మస్థు లగువారి నుపేక్షించుట రాజున కొప్పదు ధర్మానుగ్రహకారణంబున వారిని విభజించి వారి కొక్కనియమంబు సేయు టొప్పు విప్రులలోఁ జోరుం డుండెనేని తద్దోషంబు రాజున కంటు వృత్తి లేక స్తేనుం డైనవేదవిద్బ్రాహ్మణుని రాజు పోషింప వలయుఁ గృతవృత్తి యై స్తేనుం డైనవాని సబాంధవంబుగా దేశంబునుండి వెడలింప వలయు నని చెప్పిన యుధిష్ఠిరుండు రాజు వేనివిత్తంబునకుఁ బ్రభు వగు నెట్టివృత్తిం బ్రవర్తింపఁ దగు వివరింపు మనిన భీష్ముండు వెండియు. 423

కేకయరాజరాక్షససంవాదప్రకారము.

సీ. మనుజనాథుఁడు వికర్మస్థు లబ్రాహ్మణు, లగువారిసొమ్ముల కధిపతి యగుఁ
గా దుపేక్షింప వికర్మస్థు లగువారి, నని పల్కుదురు విజ్ఞులైనవారు
స్తేనద్విజుం డేనిదేశంబునం దుండు, నాకిల్బిషము రాజు నంటుకొనును

గావున రాజర్షు లేవిధంబున నైన, బ్రాహ్మణుఁ బాలింప వలయుఁ జువ్వె.

తే. యిచటఁ గైకేయగీత మొం డెసక మెసఁగు
నది యుదాహరించెదఁ గేకయాధినాథు
శంసితవ్రతు స్వాధ్యాయసహితు నొక్క
వనమునఁ ఘోరరక్షస్సు పట్టుకొనియె. 424

వ. పట్టుకొనినంత రాజేంద్రుండు పట్టువడక నీవు నాచెంత రా నొప్పదు నాకు రక్షోభయంబు లేదు నాజనపదంబున స్తేనుండును గదర్యుండును మద్యపుండు ననాహితాగ్నియు నయజ్వయు నవిద్వాంసుండు నవ్రతియు నసోమపుండును బ్రాహ్మణులలో లేరు యజనయాజనాధ్యయనాధ్యాపకదానప్రతిగ్రహంబులు గలిగి సత్యవాదులైనబ్రాహ్మణులు పూజితులు సంవిభక్తులునై స్వకర్మమం దుండి కీర్తింపం బడుచున్నవారు సత్యధర్మవిశారదు లగురాజన్యులును స్వధర్మనిరతులై యుద్ధపరాఙ్ముఖులు గాక బ్రాహ్మణులం బ్రోతురు యాచింపరు యాచకుల కిత్తురు వేదాధ్యయనంబు సేయుదురు చేయింపరు యజింతురు యాజకులు గారు వైశ్యులును గృషిగోరక్షణవాణిజ్యంబుల నమాయకులై జీవించుచు నప్రమత్తులు సువ్రతులు సత్యవాదులు నై సంవిభాగము దమము శౌచము సౌహృదము నాశ్రయించి స్వకర్మస్థులై యున్నవారు శూద్రులు ననసూయకులై మూఁడు వర్ణంబులవారిఁ సేవించుచు నిజకర్మనిరతులై యున్నవారు నేను గృపణానాథ వృద్ధదుర్బలాతుర యోషిజ్జనంబు సంవిభక్తంబు గావించి పాలింతుఁ గులదేశాది ధర్మగ్రంథి నేనాఁటికిం ద్రెంపువాఁడం గాను దపస్వుల సత్కరించి పూజింతు సంవిభాగంబు గావింపక భుజింపఁ బరభామినిం గామింప నెప్పుడు స్వేచ్ఛాప్రవర్తనంబు సేయ వైద్యుల వృద్ధులం దపస్వుల నవమానింప నాదేశంబున భిక్షాటనంబు సేయుగృహస్థుండును బ్రహ్మచర్యవ్రతనిష్ఠుండు గానిభిక్షుండును లేరు నారాష్ట్రంబు నిద్రింప నే జాగరూకుండ నగుదు నాపురోహితుం డాత్మవిజ్ఞానసంపన్నుండును దపస్వియు సర్వధర్మవిద్వరుండును ధీరుండును ధీమంతుండును సర్వరాష్ట్రంబునకు స్వామియునై యున్నవాఁడు నేను దానంబునఁ విద్యను సత్యంబునను బ్రాహ్మణరక్షణంబున నుత్తములోకంబుల నభిలషింతు గురుశుశ్రూషఁ గావింతు నారాజ్యంబున విధవయు బ్రహ్మబంధువును గితవుండును జోరుండును నయాజ్యయాజియుఁ బాపకర్ముండును వేరున కైన లేరు ధర్మార్థంబ యుద్ధంబు గావించిననాగాత్రంబున శస్త్రనిర్భిన్నంబై ద్వ్యంగుళ

మంతరంబును గానం బడదు గోబ్రాహ్మణులకును యజ్ఞంబులకును నిత్యంబు
స్వస్త్యయనంబు నాజనులు గోరుచుందురు నావలన నెట్టిపాపంబులును గాన
రావు కావున నీవు తొలంగి పొమ్మనిన రాక్షసుండు. 425

శా. సర్వావస్థల నీవు ధర్మము సమాశ్వాసించుచుం బాలనం
బుర్విం జెల్లఁగఁ జేయుచుండితివి నీయుల్లంబు గోబ్రాహ్మణా
ఖర్వానందకరంబు నీకు భయ మేకాలంబునం గల్గఁ బో
దుర్వీనాథ! గమింపు మింటికి శుభం బూహించి నే నేగెదన్. 426

వ. అని మఱియు విప్రపురోగముం డగువానికి రక్షోభయంబ కాక యెట్టిపాతక
భయంబు నంటదు భూవరుండు గోబ్రాహ్మణభక్తిభరితుండై యిహపరభద్రం
బులం బొందు నని రాజు నంపిపుచ్చి తా నెందేనియుం బోయె ననిన యుధిష్ఠి
రుండు పితామహునిదిక్కు మొగంబై బ్రాహ్మణున కాపద్ధర్మంబుగ రాజధర్మంబు
వృత్తి యని చెప్పితివి వైశ్యధర్మంబునను వృత్తి గలిగించుకొను టొప్పునో
చెప్పు మనిన భీష్ముం డి ట్లనియె. 427

భీష్ముఁడు ధర్మరాజునకు బ్రాహ్మణాదిధర్మములం దెలుపుట.

సీ. క్షత్రధర్మమున నశక్తుఁడై విప్రుండు, వృత్తిక్షయవ్యసనార్తచిత్తుఁ
డయి వైశ్యకులధర్మ మగుకృషిగోరక్ష, ణాదికమున వృత్తి నంద నొప్పు
ననుడు యుధిష్ఠిరుం డను వైశ్యధర్మము, న మెలంగుద్విజుఁడు పణంబు లెవ్వి
విక్రయింపఁగ వచ్చు వివరింపవే యన, నమరనదీసూనుఁ డనియె మఱియు

తే. సురయు లవణము తిలలు గేసరములున్న,పశువులశ్వముల్ గోవృషభములజావి
మహిషములు కృతాన్నముమధుమాంసములును,విప్రుఁడమ్మఁగ రా దెట్టివేళనైన.

చ. ఉడికినయన్నముం బృథివియుం దలపోయ విరాట్టు లశ్వ మ
ర్కుఁడు వృష ధేనువుల్ సవనరూపము లెన్న నజంబు వీతిహో
త్రుఁడు వరుణుండు మేష మని తొంటివినిర్ణయ మాట వీని న
మ్ముడు నరకంబు విప్రునకుఁ బొందఁగ నయ్యెడు నిశ్చయంబుగన్. 429

తే. పక్వమున కామమునుగొంటపాపమామ,మునకుఁబక్వముఁగొని తింటపోలునీవు
దీనిఁ గొనిదాని నాకిమ్ము తినఁగననుచు,సాధువినిమయమును జేఁతచనుద్విజునకు.

వ. అనిన ధర్మరాజు. 431

తే. క్షీణబలుఁడైనక్షత్రియుక్షేమ మెన్న,శస్త్రమును బూని ప్రజ లేఁతురడఁచిధర్మ
మపుడు రాజెట్లు రక్షకుండనఁగ నొప్పు,నెఱుఁగఁజెప్పుమనన్ భీష్ముఁడిట్టు లనియె.

తే. తపము దానము యజ్ఞము దమముపీన,వెలసిబ్రాహ్మణప్రముఖులు వేదబలము
కలిమి నేచి రాజబలంబువెలయఁ జేయు,దురు మహేంద్రునిదేవతావరులకరణి.

మ. బలహీనుం డగురాజచంద్రునకు విప్రవ్రాతమే రక్షకం
బిలఁ దద్బ్రహ్మబలంబు గైకొని నృపుం డెల్లప్పుడున్ రాష్ట్రమం
దెలమిం గూర్చెడువాఁడ యై ప్రజల ధర్మైద్ధప్రచారంబులన్
నిలువం బెట్టెడువాఁ డగుం దెలియు మోనిర్నిద్రభద్రవ్రతా. 434

క. ధరదస్యుమయం బై సం, కరకార్యము లతిశయించుకాలమునందున్
ధరణీసురాదిజాతులు, శరముం జేకొనుట శాస్త్రసమ్మత మధిపా. 435

క. అనుడున్ ధర్మప్రోద్భవుఁ, డను విప్రులఁ గాంచి క్రుద్ధుఁ డై పతి ద్వేషిం
చిన నెవ్వఁ డమ్మహీసురు, ననుకంపం బ్రోచు గతియు నపు డెట్టు లగున్. 436

వ. చెప్పు మనిన నప్పితామహుండు. 437

చ. ఎపు డతివృత్తుఁ డై ప్రభవ మిచ్చెడువిప్రులఁ జెందనాఁడునో
నృపు నపు డాఘనుల్ శమము నే కొని యుండక మాయ చేసియో
జప మొనరించియో వ్రతము సల్పియొ శస్త్రము చేతఁ బట్టియో
నృపశుని వాని దిద్దనగు నేరుపున న్నియమించి పుచ్చుచున్. 438

చ. జలమున నగ్ని బ్రహ్మమున క్షత్రము నశ్మమునందు లోహమున్
గలిగి జగత్ప్రకాశమును గైకొని పుట్టినచోట్ల శాంతినిన్
గల వగుఁ గాన బ్రాహ్మణుఁడు క్షత్రియుని న్నియమింపఁ జాలుఁ ద
ద్బలమును దేజమున్ ద్విజునిపట్టున నెట్టన శాంతి నొందెడున్. 439

ఆ. ఇనుము ఱాతి నఱకి ఘనతర మగువహ్ని,జలముఁదాఁకఁ బాఱె క్షత్రియుండు
బ్రాహ్మణుని నెదిర్చి భంగపడి నశించు, టరయ వచ్చు జగమునందు వింటె.440

సీ. బ్రహ్మవీర్యము మృదుత్వము నొందిక్షత్రవీర్యముదుర్బలంబయియమరద్విజుఁడు
పరబాధ కైనచోఁ బడి వచ్చి ధర్మము, కాపాడి జనుఁడు స్వర్గంబు నొందు
బ్రాహ్మణార్థము సర్వవర్ణములుం గ_త్తిఁ, బట్ట నో నట్టులే బ్రాహ్మణుండు
మూఁడువర్ణ ములకై మొనయ నో నశ్వమే,ధాదిఫలము శస్త్రహతుల కబ్బు

తే. ధర్మము నధర్మము నధర్మధర్మములగు, దేశకాలాదులంబట్టి దివ్యఋషులు
సర్పయాగాదు లొనరించి క్షత్రియులును,బరులహింసించిపాపముఁబడయరధిప.

తే. మూఁడుకాలములందును బాడబునకు, దుండగిండ్ల నడఁచుపట్ల దుష్టము లయి
వర్ణముల్ వోవుపట్ల స్వప్రాణరక్ష,పట్ల శస్త్రధారణ మొప్పుఁ బార్థివేంద్ర.442

వ. అనిన నప్పాండవాగ్రజుం డిట్లనియె నార్యా! క్షత్త్రబలంబు సంప్రమూఢంబై దస్యుబలం బతిశయించి వర్ణసంకరం బగునప్పుడు బలవంతుం డగునన్యక్షత్త్రియుండు దస్యుసంహారంబు గావించి ధర్మంబు రక్షించి రాజకార్యంబు నిర్వర్తించి తద్దేశంబునకు స్వామి యగు నట్లు గాక బ్రాహ్మణవైశ్యశూద్రు లట్లు గావించి దండంబును ఛత్త్రంబును ధరించుట ధర్మం బగునో కాదో చెప్పు మనిన శాంతనవుండు. 443

సీ. గతి లేనియప్పు డేకృతి గతి యయి దస్యుభయ ముడిగించి భూప్రజలఁ బ్రోచి
ధర్మంబు రక్షించు ధరణినాథుఁడు శూద్రుఁ, డైన నన్యుం డైన మాననీయుఁ
డై పూజ్యుఁడై బంధు వట్లు సేవించుట, కర్హుఁడై యుండెడు నని వచింత్రు
మోయఁ జాలనివృషంబును పట్టినావును, వంధ్య యౌ భార్యయు వలెను రాజు
తే. వ్యర్థుఁడై దారుమయహస్తియట్లు చర్మ, మయమృగంబట్లు షండునట్లయము దొరఁగి
యూషరమ్మున వర్ష మేఘోదయమ్ము, పగిదిని నిరర్థకుం డనఁ బడు మహీశ. 444
క. నిత్యము సత్యముఁ బ్రోచి య, సత్యము నవ్వలకుఁ ద్రోచి క్ష్మాతల మెల్లన్
బ్రత్యయమున నేలెడునతఁ, డత్యంతము కీర్తిఁ గాంచు నవనీంద్రుం డై. 445

వ. అనిన నజాతశత్త్రుండు ఋత్విజు లేమిటికిం గావలయు వా రెట్టిశీలవిధానంబులు గలవారై యుండవలయు నెఱింగింపు మని యడిగిన భీష్ముం డిట్లనియె. 446

## భీష్ముఁడు ఋత్విగ్ధర్మములం జెప్పుట.

సీ. అవని శాంతికపౌష్టికాదికర్మప్రయోగమ్ము ఛందమ్ము శ్రుతమ్ము నెఱిఁగి
వ్రతి యేకరతుఁడు వీరప్రియుండును సుహృదుఁడు సమదర్శియై తొప్పదోఁగి
సత్యవాక్య మ్మనృశంసయు నకుసీద, మద్రోహ మభిమాన మార్జవంబు
శ్రమము హ్రీయుఁ దితిక్ష దమమును సత్యము, గలిగి ధీమంతుఁ డకామచిత్తుఁ
తే. డగుచు నవిహింసకుఁడు జ్ఞాని యైన దోష, రహితవృత్తవంశశ్రుతసహితుఁ డైన
ఋత్విజుండు బ్రహ్మాసన మెక్క నర్హుఁ, డగుచు సర్వజనారాధ్యుఁ డై తలిర్చు.
వ. అనిన ధర్మరాజు. 448
తే. వేదములయందు దక్షిణావిధి నిదియిది, యీఁ దగునటంచు నియమంబు లేదొకండు
ధనవిభాగ మాపద్ధర్మమునను ఘనము, శక్తిఁ జూడదు శాస్త్రాజ్ఞ చాల భరము.
ఆ. శ్రద్ధ గలిగి సవము సలుపంగ నగు నని, శ్రుతి వచించు మిథ్య యూధి కెక్క
సలుపుయజ్ఞమునకు శ్రద్ధ యెక్కడ వచ్చు, విన వచింపు మనిన భీష్ముఁ డనియె.
క. సర్వస్వదానశాస్త్రము, నిర్వచనార్థంబు నిస్వనిం జెంద దటన్

సర్వ మిడకున్న నుండదు, గర్వము శాఠ్యమును వైదికనిరాకృతియున్. 451

సీ. ధనహీనుఁ డధ్వరదక్షిణ యజ్ఞాంగ, మనుపూర్ణపాత్ర మిచ్చినను జాలు
నది దక్షిణాహీన మైన కర్తఁ దరియింప, నలుపకుండదు శాస్త్రసమ్మత మగు
నది గాన యష్టవ్య మని యెఱుంగుము మూఁడు, రకవశ్యముగ విధి ప్రథితరీతి
సోమము నమ్మియు సొమ్ము యజ్ఞార్థము, తగుఁ గూర్ప వృత్తికై తగదు గాని

ఆ. న్యాయవృత్తపురుషయజ్ఞసోమంబులు, చెల్లు నట్లు గాక చెడును రెంట
దేహవృత్తిమాత్రఁ దిప్పుడు ద్విజునకు నప్యక్రయణీతములు నవాదు లెల్ల. 452

వ. ఇట్టియజ్ఞంబులకంటె బ్రాహ్మణునకుఁ దపంబు శ్రేష్ఠతమంబు తత్ప్రకారంబునుం
జెప్పెద దత్తావధానుండ వగుము. 453

మ. దయయున్ సత్య మహింసయున్ శుచిత్వము మోదం బానృశంస్యంబు న
ధ్యయనంబుం దప మంచుఁ జెప్పెదరు ధీరాగ్రేసరుల్ తిండి మా
ని యొడల్ సిక్కఁగఁ జేఁత కాదు శ్రుతులన్ నిందించి మర్యాద ని
ర్భయరీతి న్విడువారి కన్నిటను విధ్వంసంబు సిద్ధం బగున్. 454

తే. వినుము దశహోతృవిధి యొండు దనరుఁ జిత్తి
స్రుక్కు చిత్త మాజ్య మ్మనుబుక్కు నెఱిఁగి
జ్ఞానమునఁ జేసి బ్రహ్మసంధాన మెసఁగ
నాచరించు టంతర్యజ్ఞ మది వరంబు. 455

వ. ధర్మనందనా ! లోకమ్మున శఠత్వము మృత్యుపదము ఋజుత్వము బ్రహ్మపద
మని యెఱుంగుటే జ్ఞానం బనిన నతండు. 456

మ. అసహాయుం డగుపూరుషుండు జగమం దల్పంబు కార్యంబునే
నెసఁగం జేయుట దుర్లభం బనిన రాజేంద్రుండు తా నొక్కఁ డీ
రసఁ బాలింపఁగ నెట్లు చాలు సచివున్ రాఁ బట్టె నో నాతఁ డె
ట్టిసమాచారము శీలమున్ గలిగి పాటింపంగ యోగ్యుం డగున్. 457

భీష్ముఁడు సచివలక్షణంబు చెప్పుట.

సీ. *అన భీష్ముఁ డనియె సహార్థుఁడు భజమాన, సహజకృత్రిములు నాఁ జనెడునల్వు
రైదవవాఁడు ధర్మాత్ముఁడు వీరలు, పక్షపాతము లేక పరఁగి ధర్మ
పక్షమునం దుండువారయ్యు నర్థము, వలన దృష్టిం బెట్టి మెలఁగ వలయు

* సహార్థుఁడు=సమానప్రయోజనము కలవాఁడు. భజమానుఁడు=పితృపితామహక్రమాగతుఁడు. సహజుఁడు=మాతృష్వస్త్రీయాది. కృత్రిముఁడు=ధనాదులచే నార్జింపఁబడినవాఁడు.

మీఁదినల్వురిలోననిమిసిమిఁగాంతురు మధ్యములు పెరల్ నిత్యశంక్యులు దలంప
తే. నేవురును నాత్మకార్యము నెడలశంక్యు, లెపుడుమిత్రుపట్లను బ్రమాదపరివృతుఁడు
గాక రాజుండఁ దగు నట్లు కానినాఁడు, పరిభవింతురు లోకు లాధరణివిభుని.

తరు. అరి మిత్ర మగు మిత్ర మరి యగు సాధు,వతిదారుణాకారుఁ డగునసాధువును
బరికింప సాధువై పరఁగెడుజనుల, భావముల్ దిరములై వఱలవు వారి
బురుషుఁ డెవఁడునమ్మఁ బోలదుగాన, ముఖ్యకార్యము తాను మునుగని రాజు
పొరినొనర్పనగుఁబల్వుగనువిశ్వాస, మును నవిశ్వాసము పొసఁగఁ జేటగును.

ఆ. కాన విశ్వసింపఁ గా వలయు నొకప్డు, ప్రభువు విశ్వసింప రా దొకప్డు
నీతిరీతి యిట్లు నెగడొందెడు సనాత, నంబ యగుచు జగమునన్ మహీశ. 460

క. నే లేకుండిన జగతికి, నేలిక యగు నీతఁ డనుచు నెవ్వఁడు తలఁపం
గా లక్ష్య మగు నతని భూ, పాలుఁడు శంకింప వలయుఁ బగయం ద్రతనిన్. 461

ఉ. సేతువు చెంత చేను గలచెట్టఁడు రక్షణ మాచరింప కా
సేతువుఁ ద్రెంచినం గడమచేలకుఁ జేటగు నీట నట్లు భూ
నేతకు సీమ నున్నతఁడు నెయ్యుఁడు గాఁ డతఁ డెప్డు డేరిపు
క్ష్మాతలభర్తకుం దెఱ వొసంగఁ బొసంగెడు ముప్పుతిప్పలున్. 462

క. జనపతి వృద్ధిక్షయములు, తనవిగ భావించి నృపుఁడు తనరక యున్నన్
దనతనరు టరిది యనుకొను,మనుజుఁడు మిత్రంబు వాని మన్నింప నగున్.

ఆ. క్షతమునుండి తన్నుఁ దప్పించి నట్టిఁడై, వ్యసనమునకు భీతుఁడై సమృద్ధి
కలరునట్టివాని నాత్మసముం డగు, మిత్ర మనుచుఁ దలఁప మేలు పతికి. 464

సీ. రూపవర్ణస్వరరూపితుఁడు తితిక్షు, వనసూయకుఁడు సుకులాంచితుండు
మేధావి దక్షుండు స్మృతిమంతుఁ డానృశం, స్యము గలమేటి విద్యావినోది
మానితుం డయ్యునమానితుండయ్యును, గీడు జేనికిఁ జేయఁ బోఁ డెపుడును
ఋత్విజుం డాచార్యుఁ డేని సఖుం డేని, సచివుఁ డైన న్నేలు సంతరించు
తే. నర్థధర్మప్రకృతుల రూపరసికొనుచు,విద్యవలనఁబరంబయి వెలయుమంత్ర [అు.
తంత్రము లెఱుంగనగుమంత్రి తనకుఁదండ్రిఁ,బోలివిశ్వాసపాత్రుఁడై పొలుపుమీఱ

క. ఏకార్థంబున నొక్కరు, నే కా కిరువురను ముగుర నెసఁగించిన చో
నాకార్యము చెడు లే కా, కాకులత ఘటిల్లు జనుల కనవరతంబున్. 466

సీ. నీతిమర్యాదల నిలిచిన వాఁ డన,ర్థము లొనర్పనివాఁడు దక్షు లైన
వారి ద్వేషింపనివాఁడు సమర్థుఁడు, పర్యాప్తవచనుండు కార్యవాది

భయకామకోపలోభములను ధర్మము, గెడవనివాఁడు సత్కీర్తి కాముఁ
డవికత్థనుఁడు తితిక్షువు కులీనుఁడు శీల,వంతుఁ డార్యుండు విద్వాంసుఁ డరయఁ
తే. బ్రతినిధిగ నుండ నర్హులు రాజచంద్రుఁ, డట్టివార లమాత్యులై యలరఁ జేసి
సర్వకర్మస్థితులు గాఁ బ్రశక్తిఁ గూర్చి, గౌరవించి సాహాయ్యము గనఁగ వలయు.
తే. రాజకార్యములం దిట్టి ప్రతినిధులు త, లిర్చి సమయముపడినప్డు తీర్చి యొండొ
కళ్లు చర్చించి జతకూర్చికర్జ మీశు,నకు ముదంబును శ్రేయముఁ సలుపుచుంద్రు.
తే. జ్ఞాతు లుపరాజు లట్టులు భూతలపతి, వృద్ధి నైఁపరు మిత్తికి నెత్తు వచ్చి
ఋజుమృదుమతివదాన్యతహ్రీఋతములు,గలుగు తేనికిఁ నాశముగలుగనెంత్రు.
సీ. అక్లైన సుఖము లే దజ్ఞాతివలనఁ గా, వున జ్ఞాతివైరము చన దొనర్ప
జ్ఞాతిసఖ్యము లేనిజనపతిఁ శాత్రవుల్, పరిభవింతురు తలుల్ పడినయపుడు
పరనికృతుం డగుపతికి జ్ఞాతియె దిక్కు, పరనికారంబు నోర్వండు జ్ఞాతి
యది తనదిగ నెంచు నరయ జ్ఞాతులయందు, మంచిచెడ్డలురెండుమలయు నందు
తే. వలన జ్ఞాతినిమన్నింపవలయుఁ బ్రియము, నేఁతతగునప్రియముసేతచెల్లదెపుడు
నమ్మి నట్లుండి నమ్మక నెమ్మది గుణ, దోషములు నిరూపింపక తొడరవలయు.
క. ఇటు లప్రమత్తుఁ డగుచుఁ, బటుమతి యై యున్న నృపతి పగలు చెడ మహో
త్కటకీర్తి గలుగ ధరపై, నటమట మింతయును లేక యభివృద్ధిఁ గొనుఁ.
క. నావుడు నగ్రాహకు లగు, నావారలలోనఁ గలహ మైనపు డొకనిఁ
భావింప నొకని కెర వగు, నేవిధమున రెంట మైత్రి యేర్పడుఁ జెపుమా. 472
వ. అని యడిగినయజాతశత్రునకు గంగాపుత్రుం డిట వాసుదేవ నారదసంవాద
రూపం బగునొక్కయితిహాసంబు గలదు చెప్పెద విను మొక్కనాఁడు
నారదుం గాంచి వాసుదేవుం డి ట్లనియె. 473

## భీష్ముండు వాసుదేవనారదసంవాదముం దెల్పుట.

చ. అసుహృదుఁ డెన్నఁడేనియు రహస్య మెఱుంగ నసర్హుఁ డట్టిచో
ప్ప సుహృదుఁ డెన్నఁ బండితుఁ డపండితుఁడే నజితాత్ముఁ డైనచోఁ
బ్రసితసుహృద్వరుండవును బ్రజ్ఞ గలాఁడవు నం చెఱింగి నీ
దెస నొకయింత చెప్పఁగ మదిం బొసఁగించితి విన్ము నారదా. 474
శా. ఐశ్వర్యార్థము జ్ఞాతిదాస్యమును జేయం గోర న క్లైన భో
గైశ్వర్యంబున జ్ఞాతి కర్థ మిడి నే నర్ధంబ కైకొందుఁ ద
ద్వాశ్వానిష్టదురుక్తముల్ సయితు నో దేవర్షి! యేమందు నా

కాశ్వాసం బిసుమంతయుం గలుగన ట్లుయ్యోక సగోత్రాళిలోన. 475

ఆ. అరణి నగ్ని కాముఁ డగువాఁడు మథియించు, నట్లు తద్దుసక్తు లస్మదీయ
హృదయమును మథించి యెంతయేని దహించు, నేమి చెప్పువాఁడ నోమహాత్మ.

సీ. బల మెచ్చు రామునిపట్ల గదునిపట్ల, నరుదొందు సౌకుమార్యంబు హెచ్చి
ప్రద్యుమ్నుఁ డధికరూపప్రమత్తుం డన్య, లంధకవృష్ణు లత్యంతబలులు
ఘనులు వా రుభయపక్షుస్థు లక్రూరాహూకులఁ దేర్పనేఁ జాలఁగలఁతపడుదు
నేపక్షమునవార లెసఁగ రాపక్షము, చెడ నెసఁగినపక్ష మడరు చుండు.

తే. నేరు నాకు సహాయులు కా రిరుగడ, విడుమరం గాంచి మధ్యస్థవిధినిఁ బూని
కితవమాతతెఱంగునఁ గ్లిశ్యమానుఁ,డై వగతు శ్రేయ మెటో చెప్పు మవలనిపల

వ. అనిన నారదుం డి ట్లనియె. 478

మ. పలుకం జెల్లెడు నాపదల్ ద్వివిధముల్ బాహ్యంబు లాభ్యంతరం
బులు నాజ్ఞాతికృతంబు లై కలుగుటక్ బొల్పొందు నాభ్యంతరం
బులు నీయాపద లాత్మకర్మజనితంబుల్ సూ భవత్ప్రాప్తమై
వెలయుక్ శ్రీ యది యెల్ల నాహుకున కర్పిం తీవు భావింపఁగక్. 479

మ. కృతమూలం బగు జ్ఞాతిశబ్దము తునింగింపంగ శక్యంబుగా
దతివేలంబుగ నుగ్రసేనునిసిరుల్ ప్రాపించుటక్ వాంతమై
క్షితిపైఁ బాఱినయన్నముం గొనెడుమాడ్కిక్ హేయ మా దాన ను
న్నతిమై జ్ఞాతిభయంబు సంక్షయము గాన న్వచ్చు నోయచ్యుతా. 480

వ. కావున. 481

క. *మృదులము ననాయసంబును, హృదయచ్ఛిద మైనమేటి హేతిం గొని నా
ల్కఁ దెగంగోయఁదలఁపు త, ప్పది లేక ప్రియంబు గూర్చు మెద శాంతికగుక్.

వ. అనిన వాసుదేవుండు. 483

క. †పరిమార్జన మనుమార్జన, మరయుచు నాలుకను గోయ ననువై మృదువై
పరఁగు ననాయసశస్త్రము, సురముని! యెట్టిదియొ యెట్లుసులభ మొ చెపుమా.

వ. అనుటయు నారదుండు. 485

సీ. అనిశతితిక్షయు నన్నదాన మ్మార్జ, వ మ్మర్హపూజయు నెమ్మదియు న

*ఇట నాల్కగోయఁ దలఁపు మనగా మూకీభావము నొందునట్లు చేయు మని తాత్పర్యము.

†పరిమార్జనము=తితిక్షార్జవాదులంజేసి దోషాపనయము చేసికొనుట. అనుమార్జనము=పూజనాదుల చేతఁ బ్రీతిగుణాధానము చేయుట.

నాయస మ్మగుశస్త్ర మన నొప్పు దానిని, గలిగి జ్ఞాతుల కటుకములు లఘువు
లగువాక్యములు సైఁచి స్వాంతము వాక్కును, శాంతభావమునొంద సతమొనర్చి
యజితాత్ముఁడవు గాక వృజిన మెఱుంగక, యెద్దునా జొమ్మున నెంతభార

తే. మైన మోయుచు నినుఁ బొందు నట్టిసంఘ
మెడయ కుండెడుగతి సేర్పు కడిమిఁ జేసి
క్షాంతియును న్యాయబుద్ధియుఁ గలిగికొనుము
సంఘముఖ్యుఁడ వగుదు వోసారసాక్ష. 486

క. తనకష్టము దనరించుట, యనునది ధన్యము యశస్య మాయుష్యము గా
వున నవినాశన మగులా, గున దాయాదులను జూచుకొనుము ముకుందా. 487

వ. అని మఱియు నోమహాబాహూ! నీవు మహాప్రభావసంపన్నుండవు నీ వెఱుం
గనియది జగత్త్రయంబున లేదు లోకసంగ్రహార్థ మడిగితివి గావునం జెప్పితిఁ
గాని నీచిత్తంబున కన్యథాయత్తంబుగఁ బ్రవర్తించు వా రెవ్వరు యాద
వులుం గుకురులును భోజులు నంధకులును వృష్ణులును గల్యాణగుణసంపూర్ణుఁ
డవును భక్తాభీష్టప్రదుండ వగునీయం దాసక్తులై నిన్నుఁ జేరి జీవింతు రన
నేల లోకంబులు లోకేశులు నీకు వశంవదులు మహర్షులు నిన్నుపాసింతురు
నీవ సర్వభూతగురుండవు గతాగతంబు లెల్ల నీకుఁ గరతలామలకంబు లని
నారదుండు ప్రస్తుతించె నని చెప్పి భీష్ముం డిది యమాత్యాదుల మన్నించు
ప్రకారం బింకఁ గోశరక్షణప్రకారంబును వివరించెద వినుమని యి ట్లనియె.

క. బొక్కసముఁ బ్రోచుపట్టున, నెక్కటిపనిఁ బూనవలయు నృపుఁ డప్పనికిన్
దక్కటివారల నిలుపక, మిక్కిలి మెలఁకువ వహింప మే లొనఁగూడన్. 489

క. భృత్యు లమాత్యులు దానిన్, నిత్యము రక్షించుమాట నెఱి నమ్మక లోఁ
బ్రత్యయము సేసి న ట్లయి, ప్రత్యంగము కన్నుఁ దెఱచి పరికింప నగున్. 490

ఆ. ప్రాణతుల్యుఁ డొక్కఁ *డాయతికాఁ డుండి, కోశరక్షణమునకుం గడంగ
వలయు వాని నెల్లవారు బాధింతురు, రాజరక్షణంబు రహిత మైన. 491

కాలకవృక్షీయ క్షేమదర్శిసంవాదప్రకారము.

వ. కావున రా జగువానికిఁ గోశసంరక్షణం బవశ్యకర్తవ్యం బట్లు కానినాఁడు
నియుక్తులవలనఁ గోశంబు శుష్కప్రాయం బగు ననర్థంబు వాటిల్లు నీయర్థం
బున నొక్కయితిహాసంబు గల దాకర్ణింపుము కాలకవృక్షీయుం డను నొక్క

* ఆయతికాఁడు = ధనార్జనము చేయువాఁడు.

ముని యొక్క కాకిన్ బంజరంబునం బెట్టుకొని యిది యతీతానాగతంబు
లెఱుంగు నని చెప్పుచు నం దందుఁ బరిభ్రమించి కోసలదేశంబునకు వచ్చి
రాజకార్యనియుక్తులవలన స్వామిద్రవ్యాపహారం బగుచుంట యెఱింగి తాను
సర్వజ్ఞుండ నని ప్రకటించుకొనుచు క్షేమదర్శి యనుకౌసల్యుం దర్శించి వాని
సమక్షంబున నలంకృతుం డై యున్నయమాత్యునిదిక్కు మొగం బై. 492

ఉ. కాకము చెప్పుచున్నయది కల్ల యొకింతయు లేదు సత్య మో
హో కుటిలాత్మ! నీవు నిట నుండిన పేరును రాజకోశముల్
గైకొన కెగ్గు కొల్లఁగొనఁ గల్గితి రిందఱు *నొక్కత్రాటిపై
నై కనుగోఁ డితండు విభుఁడ న్నుడి కాని యెఱుంగఁ డింతయున్ 493

వ. ఆలోచించుకొనుఁ డని కాకంబు నటఁ బెట్టి తాను వీడుపట్టునకుం జనిరా
నంత రాజనియుక్తులును. 494

మత్త. విప్రకారవిధంబు గాకమువెంట వచ్చినదయ్యె నీ
విప్రుఁ డెచ్చటివాఁడొ తెచ్చెను వేఁడిపిడ్గు విధంబునన్
సుప్రకాశ మడంగు నిందున సూ డగుం బ్రభు వింతలో
నేప్రకారము చేసి వానికి నెక్కువార మొకో యిఁకన్. 495

క. అని యేకగ్రీవముగా, జనపతికడ నున్నపుల్గుఁ జంపఁ దలంపుం
గొని సంజపడినపదపడి, జను లందఱు నిదుర నందుసమయమునందున్. 496

ఆ. పంజరస్థ మైనపక్షి శూలము వెట్టి, పొడిచి చంపి రంతఁ బ్రొద్దు పొడువ
వచ్చి బ్రాహ్మణుండు వాయసమృతిఁ గాంచి, పిలిచి రాజుతోడఁ బలికె నిట్లు.

మ. ధరణీవల్లభ! మిత్త్రునర్థమున సంతాపంబునుం బొందుచున్
గర మర్థిన్ హిత మాచరించుటకు వేడ్కం జేసి నే వచ్చితిన్
వర మి మ్మిం దభయంబు వేఁడెదను నీవా కైన వాక్రుచ్చెదం
బరిశీలింపఁగ నాదువాక్యములు సైఁపన్ రావు నీవారికిన్. 498

తే. ఇతముబోధించుటకుఁ జెప్పనెంచియున్న, నొకొకపుడుదానవెదిరికినెక్కుమన్న్య
వట్లు గాకుండ శ్రీఁ గోరునతఁడు సైఁచుఁ, బరుష మైనను వక్తస్వభావ మెఱిఁగి.

మ. అనినన్ రా జను నాహితంబు మదిలో నర్థించి నీపల్కుప
ల్కునఁ బారుష్యము గల్గినన్ సయితు నోఁక్షోణీసురోత్తమా!
వినిపింపం దలపోయు మే విని భవద్విఖ్యాతవాగ్రీతులన్

* ఒక్కత్రాటిపైనై = అనఁగా నందఱు నేకాభిప్రాయముగలవారై.

బొనరింప న్మది నెంతుఁ గార్యమును బెంపున్ సొంపు నింపొందఁగన్. 500

సీ. అనవుడుమునిచంద్రుఁడను రాజునకుమిత్రు, లునునమిత్రులుఁబెక్కురొనరియుందు
రాశీవిషోపము లై వారు వారును, చెడుకాలమునఁ జేటు సేయ నెంత్రు
రాజోపజీవులే రాజునకుం గూర్తు; రార్తి యనవధానుఁ డైనయెడల
భృత్యులు పూర్వోపకృతి నెన్న కతనికి, భయముఁ గూర్పఁగ నెంత్రు ప్రాలుమాలి
అ. స్థితియు గతియుఁ బలుకుఁ జేష్టయు లోనగు, వానివలన ఖలులపరుస నింగి
తజ్ఞుఁడెఱిఁగి మెలఁగఁదగుఁ దనరాష్ట్రముఁ, దాను సుఖమునొందఁ దలఁచు నేని.

చ ఇతఁ డెఱిఁగించునొండొకని కెల్లరనుండియుఁ గీడు మూడు నీ
క్షితిపయిఁ దాను లే నటుల చిత్తము చేసి వచింప నొప్పు నీ
పితృహితవర్తి నౌట వెఱ వీఁడి వచించెద నున్నయర్థమున్
మతిఁ బొనరించి పోలినక్రమంబునఁ జేయుము మేల సూచుచున్. 502

క. భూవరుఁడు ప్రసన్నుఁడ యే, దేవునివలెఁ గూర్చు సర్వదివ్యార్థములున్
భావము వేత్తై మాఱినఁ, బావకుఁ డై మూలముట్టు పగఁ గొని యేర్చున్.

శా. ఆపత్కాలమునన్ సహాయుఁ డగు నిష్టామాత్యచందంబునన్
నీపాలం గలలోపముం దెలిపి నే నీ కర్థసంసిద్ధి సం
ప్రాపింప న్వచియింపఁ గా గల నుపాయం బైన నావాయసం
బీపట్ల న్వోఱఁ గూర్చుచుండుటను వా కీ రాక యుండెన్ బ్రభూ. 504

తే నీవు వీరికిఁ బ్రియుఁడవు గావు నాకు
నలుగ కుండుము గర్హించి పలుకఁ దలఁపు
సేయకుము హితాహితములఁ జెవిని వేసి
కొను మిటఁ బరోక్షమతివి గాకుము నరేంద్ర. 505

సీ. నీసొమ్ము దినువా రనేకులు నీయింటఁ, గలరు వార్పగ త్రైరి తెలియ నాకు
నినుఁ జంపి నీరాజ్యమును గొనఁ దలఁచిరి, కా దొంట నప్పని సూదుల దగుఁ
గాకిని జంపి రాఖలులు వారిభయంబు,కలిమి నే నడవికిఁ గదుల నుంటి
బహునక్రఝష మయి ప్రబలురాణ్ణీతిన,దిని గాకివలెఁ దాఁటి చనఁగ నోప
తే. వ్యాఘ్రసింహాసమూకుల మశ్మకంట,కాన్వితము కొండగుహావోలె నగుచు దుర్గ
మంబయినరాజమార్గముమనుజమాత్రుఁ, డెవఁడునుందాఁటలేఁడని యేతలంతు.

క. అమవసరేయి తెఱంగునఁ, దమమున కై గహన మైనతద్రాజ్యమునన్
శమ మెంచి నీకు నుండన, సమకుఱ దన నన్నుఁ జెప్పఁ జనునె మహీశా, 507

సీ. సుకృతిదుష్కృతు లిట నొకతెఱంగున వధ్యు, లీరాజనీతియు ఘోరతరము
నీ వసత్తును లోన భావించినట్టులు, సత్తును భావింపఁ జాల వెన్న
నాశీవిషావృత మవుకూపమవు నీవు, నీభోజనము విషనిర్మితంబు
ఘన*కరీరావృతమును దుర్గతీర్థము, మధుజలం బగునదిమాడ్కి నైతి
తే. కుక్కలును నక్కలును గూడుకొనినహంస,గతికి నైతివితృణతలావృతముతరువు
పగిది దవమున కయ్యెడు పండితులకుఁ,దావు లే దిందుఁ దరలుటే తగినమాట.
క. నీవును నీపరిపాలితు, లేవాఁడు ప్రియుండొ వానినే చంప మతిన్
గావింత్రు మిత్త్రియింటన్, జీవింపం జేరినట్లె నినుఁ జేరుటయున్. 509
ఉ. ఈకడ కేను వచ్చితి గ్రహించి వచింప నలైన భోజనం
బాఁకలి మిక్కుటం బయినయప్పుడు సైఁపనియట్లు నీళ్లనున్
వ్రేఁకన యైనతృష్ణ ప్రభవించినయప్పుడు మ్రింగఁ జాలన
ట్లో కుతలేంద్ర! నీప్రకృతు లోయనఁ బాయఁగఁ జేయు నాయెడన్. 510
క. నీవారు నాకు దోషము, గావించిరి వారి కేను గావింపను గా
నీ వారు దోషదర్శన, భావంబునఁ బాము లట్లు పగఁ గొందు రెదన్. 511
వ. అనిన రా జి ట్లనియె. 512
మ. నిను సేవించి భజింతు నిచ్చలును నిర్నిద్రప్రపత్తిస్మదీ
యనికాయంబున భవ్య మారయుచు నిత్యావాసముం జేయు మో
మునిలోకాగ్రణి! నానియుక్తులకు నీపొంత న్విరోధంబు చే
యన చిత్తం బగునేని నీ వెఱఁగి నా కాలింప వాకీ నగున్. 513
క. దుష్టులు నాకడనుండుట, స్పష్టంబుగఁ దెలియ వచ్చె భవదుక్తిమెయిన్
గష్టు లగువారిపైఁ గల, యిష్టము పోకడఁచి కొందు నెఱిఁగినపిదపన్. 514
క. అపరాధసదృశదండము, సుపరిష్కారముగఁ జేయఁ జూచెద నెల్లన్
గృపఁ జేసి తెలియఁ జెప్పుము, విపరీతము గాక మున్న విధ మిది యనుచున్.
వ. అనిన మునీంద్రుండు. 516
శా. కాకిం జంపినతప్పు వారిపయి కెక్కం జెప్పఁగాఁ బోకు మే
కైకప్రక్రమ మేర్పడం దెలిపి యన్యోన్యంబు వైరంబు రా
వాకొంచుం దుద కెల్లవారల జయింపం జూడు మాయాసిరుల్
వ్యాకోచస్థితి నొందుటన్ బలము వోకారంగ సంధించుచున్. 517
క. తనతప్పు తెలిసిపోయిన, మనుజాఁడు బలహీనుఁ డగుచు మానఁడె వోవున్

*కరీరము = ముళ్లచెట్టు, తీర్థము = జలావతరణమార్గము.

జననాథ ! మంత్ర భేదము, చన దెప్పుడు నిట్లు సేయ సమకుటు నెల్లన్. 518
సీ. ఏము బ్రాహ్మణులమువృదుదండమునుగోరు,దుముస్వస్తియగుతభూతములకెల్ల
నీకు సంబంధుఁడ నీతండ్రిసఖుడ న,తఁడు సన్న పిదప నేఁ దపముఁ గోరి
వని కేగితిని నీప్రవర్తన మరసి నె,య్యమున బోధించి పో నయితి నిట్లు
పతిసుఖదుఃఖముల్ మతిఁ దన వను కొను, ప్రెగ్గడగలుగ నేయెగ్గు రాదు
తే. అనుడుఁ గౌసల్యుఁ డౌఁగాతమనుచునతని,హితవచన మెంచి చెప్పినగతినొనర్చి
తనదుసచివుని గా నిల్పుకొనియతని స్వ,రాష్ట్రపాలన మొనరించె రాణలెసఁగ.
క. కాలకవృక్షీయుఁడు భూ,పాలునికడ నట్లు మంత్రిపద మంది ప్రజం
బాలించి పురోధసుఁ డై, యేలికకుం గలుగఁ జేసె నిజ్యాఫలముల్. 520
వ. అనిన నజాతశత్రుండు గంగాపుత్త్రుం దిలకించి పితామహా! మహీంకళత్త్రుని
కడ నుండం దగుకోశసంరక్షకుం డగునాయతి కానిం జెప్పితివి మఱియును-
*సభాసదులయు సహాయులయు సుహృదులయుఁ బరిచ్ఛదులయు నమాత్యు
లయు లక్షణంబులు చెప్పు మని యడిగె నని చెప్పిన నైమిశారణ్యవాసు లట్లడి
గిన నతని కతం డెట్లు సెప్పెం జెప్పు మనుటయును. 521

ఆ శ్వా సాం త ము.

ఉ. కా దని త్రోసిపుచ్చ కొకకాలమునాఁటికి నాకుఁ గూర్చుచున్
లే దన కెంతయే ధనము లిప్సకొలంది నొసంగియున్ బ్రపూ
ర్ణాదృతిఁ జూపియున్ గృతికి స్వాంతము చేసినచంద్రమౌళిధా
త్రీదయితున్ దయావృతమతిన్ గని ప్రోవుము దేవవల్లభా. 522
క. కోప మెఱుంగఁడు తనకుం, బాపము గావించువారిపట్లం గరుణా
వ్యాపృతమతి యై యుండెడు, భూపాలుం జంద్రమౌళిఁ బ్రోవుము దేవా! 523

గద్యము.

ఇది శ్రీమదధునాతనోభయకవిమిత్ర, వేంకటయజ్వాగ్రపుత్ర,
సమారాధితవిబుధరాజ, శ్రీపాదకృష్ణమూర్తికవిరాజ
ప్రణీతం బైన శ్రీకృష్ణభారతంబునందు
శాంతిపర్వంబున-ద్వితీయాశ్వాసము.
శ్రీ శ్రీ శ్రీ

* సభాసదులు = వ్యవహారనిర్ణాయకులు; సహాయులు = యుద్ధాద్యుపయోగులు, సుహృ
దులు = హితకర్తలు; పరిచ్ఛదులు = సేనానాయక ప్రభృతులు; అమాత్యులు = మంత్రులు.

శ్రీ

బాలాత్రిపురసుందర్యై నమః.

# శ్రీకృష్ణభారతము.

శాంతిపర్వము - తృతీయాశ్వాసము.

శ్రీమన్ముక్తీశ్వరపుర
భూమీశ్వరుఁడై కవీంద్రపూజితయశుఁడై
శ్రీ మించుచంద్రమౌళిం
గామితఫలదుండ వగుచుఁ గావుము దేవా. 1

భీష్ముండు దమాత్యాదిధర్మంబులం జెప్పుట.

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె నట్లడిగినధర్మజునకు ధర్మార్థ
కుశలుం డగుభీష్ముం డిట్లనియె. 2

తే. న్యాయమన్యాయమిదియిదియనుచుఁ జెప్ప, శక్తిగలవాఁడు దాంతుఁ డార్జవముశక్తి
సత్యమునుప్రాయుఁగలవాఁడుస్వామికడస,భాసదుండయినుడికెక్కుఁబార్థివేంద్ర.

క. అతిశూరుఁడు సంతుష్టుఁడు, క్షితిసురుఁడు పరిశ్రుతుండు క్రియల సమర్థుం
డతఁడు సహాయుఁడు నాఁ బడి, క్షితిపతికిన్ సమ్మదంబు సేకుఱఁ జేయున్. 4

క. నిజశక్తి దాఁపకుండెడు, సుజనుఁడు పూజితుఁడు తనకు సుంకంబైనం
బ్రజలెన్న మెలఁగుకులజుఁడు,నిజముగసుహృదుండునాఁగనెఱిఁగనునధిపా. 5

క. అనురక్తుండు బహుశ్రుతుఁ, డును దేశస్థుఁడు ప్రగల్భుఁడును ప్రాజ్ఞుండున్
ఘనకార్యపాలకుం డగు, జనుండు సుహృదుండు నాఁగఁ జను రాజకడన్. 6

తే. మోటువాఁడునుదుష్కులమునజనించు, వాఁడునిరపత్రపుఁడునిజస్వామిభక్తుఁ

డునునృశంసుఁడుఘాతుకుఁడును బరిచ్ఛదుఁడుగనుండంగనగు రాజుకడనృపాలా.

మత్త. ధీరచిత్తుఁడు శీలవంతుఁడు దేశకాలవిధిజ్ఞుఁడున్
సారబుద్ధియు సంగతజ్ఞుఁడు శాస్త్రజన్యవిధిజ్ఞుఁడున్
ధారణీశ్వర కార్యసన్నిహితప్రకారుఁడు ధీరుఁ డా
చారవంతుఁ డమాత్యుఁ డై నృపసత్కృతిం గొన నొప్పెడున్. 8

మత్త. రాజచంద్రమ! యిట్టివారలు రాజకార్యసహాయు లై
రాజిలం బొనరించి వారి నిరంతరంబును సత్కృపా
భ్రాజితాత్ముఁడ వై ప్రియంబున భావ మిచ్చి భజించుచున్
దేజ గాంచు మొకప్పుడేనియుఁ ద్రెవ్వఁ బోనినయంబునన్. 9

చ. చిఱునగ వాననంబునను జిందులు ద్రొక్క మృదూక్తు లాడుచున్
మఱుకువఁ బూన కెన్నఁడును మానము నర్థము లోనిసత్కృతుల్
వఱలఁగఁ జేయుచుం గనుము వార లొకప్పుడు ద్రోహచిత్తులై
కఱకరిఁ బూన కాప్తు లయి కార్యము లన్నియుఁ దీర్తు రాఢ్యులై. 10

తే. వేరిఁ బ్రియులుగఁదలఁతువో వారినర్థ,భాక్కులునుసుఖభాక్కులై వఱలఁజేయు
మాపదలవారునీతోననర్థములను, దుఃఖములఁబొందువారలై తోడ్పడుదురు. 11

సీ. మర్యాద నెఱుఁగనిమందచేతస్కుల, మెలఁకువ మెయిఁ జూడ వలయు నెపుడు
గణమును విడనాడి కా దొకని గ్రహింప, గుణియైననొకఁడ మేల్ గణముకంటె
సమయములందు నసము ప్రధానముగనెంచి పరాక్రమించువాఁ డెపుడు మేటి
సుసమర్థులను రాజు చులకఁ జూడఁగ రాదు, ధర్మమాపదనైన దాఁటఁ దగదు
తే. సత్యవాది జితాత్ముఁడు శాంతుఁడు కుల,శీలసంపన్నుఁడును శేముషీవిశాలుఁ
డైనపురుషుఁబరీక్షించిమానవేంద్రుఁ,డాత్మమంత్రసహాయుగానగుగ్రహింప. 12

సీ. *సాధుసజ్జనులతో సంబంధులగువారు, శ్రోత్రు లుత్తమజన్ము లై తలిర్చు
వా రనహంకృతుల్ ధీరులును బరంప, రాగతులగువా రహార్యచిత్తు
లనురాగమును క్షమయును ధృతియును స్థితి, శౌచము గలవారు సారమతులు
ప్రౌఢభావంబును బ్రజ్ఞయుఁ గాపట్య, రాహిత్య మార్యానురాగయుతులు
తే. దేశకాలవిధిజ్ఞులు దివ్యబోధు, లీశకార్యహితైషులై యొసఁగువారి
మంత్రిపదమున నెలకొల్పిమానవేంద్రుఁ, డాదరింపనౌనైశ్వర్యమాసఁజేసి. 13

సీ. హీనతేజస్కులతో నెఱిఁ గొనువాఁడు, కాదగు నన కెల్లకార్యగతులఁ

* శ్రోత్రులు = వేదపారగులు. అహార్యచిత్తులు = లంచాదులకులోఁబడనివారు.

బుట్టించు సందియంబు నతండు ధర్మార్థ, కామసంయుక్తుఁ డై కానఁ బడిన
మఱియెట్టివాఁ డైన మంత్రింపఁ దగఁ డట్టు, లనభిజాతుఁడు విద్వదగ్రసరుఁడు
ఘనుఁ డైన నంధునిగతి మోహయుక్తుఁ డౌ, నలఁతి కార్యములయందు నైన
తే. నస్థిరుం డగు వాఁ డుపాయజ్ఞుఁ డైనఁ, బదివినను గర్మమును గొనసాఁగఁ జేయఁ
జాలఁ డారంభశూరుఁడు శాస్త్రజన్య, బుద్ధియైన ఫలము నొందఁ బోఁపఁ డనఘ.

మ. అనురక్తిం గొనఁ బోనిమంత్రి నెపుడున్ స్వాంతంబునన్ నమ్మి న
మ్మి నృపుం డుండఁగ రాదు వాఁ డనిలసంమిశ్రంబు దావం బగం
బున దొట్టిం జొరఁబాఱి కాల్చినగతిన్ మూఢాత్ములం గూడి రా
జున కెల్లప్పుడు గుండెతల్లడము వెంచున్ నార్జవోపేతుఁడై. 15

మ. జననాథాగ్రణి క్రుద్ధుఁడై పరుసముల్ సంధించి త్రోపాడినన్
జనవుం జేయుచు గౌరవించినను నిచ్చన్ సైఁచి తత్క్షేమము
న్మనమం దెంచి సమానకష్టసుఖుఁడై పట్టాపమంత్రీశ్వరుం
డనురక్తుం డన నొప్పి యొప్పెసఁగు మంత్రాలోచనల్ సేయఁగన్. 16

సీ. అనురక్తుఁ డయ్యు గుణాలంకృతుం డయ్యు, నన్యజుఁ డై కర్జము లవఘళించి
పౌరుల నాదరింప కమిత్రులం గూడి, యొసఁగెడు వాఁ డసుహృజ్జనుండు
విషయసంసక్తుఁడై విడువక పడఁతుక, పైఁ గన్నువెట్టి లోఁ బడెడువాఁడు
స్తబ్ధుండు లుబ్ధుండు శత్రుసంసేవి య, విద్వాంసుఁ డగు వాఁడు విడువ నర్హుఁ
తే. డెంతవాఁ డైనఁ గ్రొత్తఁగా నేగుదెంచు, వాఁడు తండ్రిచే వెడలింపఁ బడినవాఁడు
రిక్తుఁ డగువాఁడు రాజమంత్రిగ నెసంగ, నొప్పఁ డని చెప్పి రార్యులో యుర్వినాథ.

సీ. సర్వకర్మజ్ఞుఁడు సత్యవాది స్వదేశ, జుఁడు కృతప్రజ్ఞుఁడు సుజనహితుఁడు
బుధుఁడు మేధావి సద్బుద్ధిభావితుఁడు ప్ర, జ్ఞాసమేతుఁడు జనసమ్మతుండు
ప్రకృతిజ్ఞుఁడును బితృపైతామహాగతుం, డద్వేషి మంత్రవిదగ్రయాయి
సంతుష్టుఁడు సుశీలసంపన్నుఁడును బహు, శ్రుతుఁడు గంభీరుఁడు శూరుఁ డఖిల
తే. లోకమును స్వవశముగ నిల్పుకొన శక్తి, గలిగినట్టిఁడు విశ్వాసకలితుఁ డార్య
సమ్మతుఁడు నయవిదుఁడు ధీసచివుఁ డగుచు, రాజమంత్రము విన నర్హుఁ డోజితారి.

క. విను ప్రకృతిచ్ఛిద్ర మెఱిం, గినమంత్రులమంత్రమంద కీల్కొని రాష్ట్రం
బనిశము శోభావహ మై, చనుచుండు నటంద్రు బుధులు జననాథమణీ. 19

క. తనఛిద్రము వెలిఁబుచ్చ కొ, రునిఛిద్రము లెఱిఁగి కార్యరూఢి మెలఁగుచున్
మనుజేంద్రుఁడు రాజ్యాంగము, లను గూర్మము రీతి లోన డాఁపఁగ వలయున్.

ఆ.*మంత్రి రాష్ట్రమునకు మంత్రగూఢుఁడు రాజు,మంత్రసంహననుఁడు మనుజుఁడంగ
మబ్బలంబుకతన నవని యెంతయు సార,వంత మగుచు నొప్పు వసుమతీశ. 21

తే.†మంత్రులుస్వవృత్తికై రాజుమాటనుందు,రుపధలగుదెంచుఁ జారమూలోచితగతి
నెల్ల నారసి తగురీతు లెసక మెసఁగ, నేర్పున మెలంగ నొప్పు భూనేత యెపుడు.

తే.మదము క్రోధము నీర్ష్యయు మానమీఁగి,రాజమంత్రులు క్షీరనీరములమాడ్కిఁ
గలిసి పంచోపధలు లేనిగతి మెలంగి,రేని రాష్ట్రప్రజలు సుఖియింతు రధిప.

మ ధరణీశుం డసమర్థుఁ డయ్యుఁ దలులన్ ధర్మార్థకామజ్ఞుఁడున్
గురుఁడున్ బ్రాహ్మణుఁ డుత్తరార్థుఁడు శుభాంగుండున్ గులీనుండు త
త్వరహస్యజ్ఞుఁడు ప్రాజ్ఞుఁ డైనసచివున్ భావించి సేవించి త
త్కారుణం గైకొని మంత్రము న్నడపి సిద్ధాంతీకరింపం దగున్. 24

క. జడుఁ డంధుఁడు ఖంజుఁడు కుబ్జుఁడు కృశుఁడున్ వామనుఁడునపుంసకజనుఁడున్
బడఁతియు మంత్రించుట కొప్పకుండగ రనుచు శాస్త్రములు వచియించున్.

ఆ. ప్రజలు లేనియోడపై నెక్కియేఁ గాని, తిప్ప తుప్ప లేక తేరి చూడ
నైన చోటునందుఁ గాని మంత్రము సేయఁ, బోలు నెల్లదోషములును విడిచి. 26

వ. ఈయర్థంబున నొక్కయితిహాసంబు గల దొక్కనాఁడు దివస్పతి బృహస్పతిం
గాంచి పురుషుం డెట్లు చేసి సర్వం బేకపదం బెట్లు సేయం గలండు సర్వభూత
ప్రమాణంబుగా యశంబు నొందు టెట్లు చెప్పు మనిన నతం డతని కిట్లనియె.

సీ. పురుషుండు లెస్సగాఁ బొనరించి సాంత్వము, నడుపు ‡ఏకపదంబు నా నెసంగు
నట్లు చేసినదాన నఖిలభూతప్రమాణ మ్మగు భూరియశమ్ము గలుగు
నేకపదం బది లోకసుఖావహం, బందునఁ బ్రియుఁ డగు నఖిలమునకు
సాంత్వవాక్యము లేకసతతంబు బొమముడి,వడఁజూచునాతఁడు పగతుఁడగును

తే జనుఁడు తనమొట్ట చెప్పకమును నిశేల,వచ్చి తనువానిఁబగ ఱట్లు మెచ్చరెపుడు
నగుమొగంబున నాడెడునరపతిపయి, లోకము ప్రసన్నమై యుండు లోకనాథ!

చ. తనరనిమాట లేకిడినదానము నిష్టము గాదు మంచిమా
టను ధన మంతయుం గొనఁ గడంగిన రోయక తద్వశంబుమైఁ
జను జగ మెల్ల సాంత్వమున సాటికి వచ్చి మఱొండు లేదు గా
వున దొర సాంత్వనం బెపుడు పూనఁగ నొప్పుఁ బురోభివృద్ధికై. 29

---

* మంత్రగూఢుఁడు = మంత్రము వెలిపుచ్చనివాఁడు; మంత్రసంహననుఁడు = మంత్రముచే రక్షితుఁడు. † ఉపధ = ఛలము.

‡ఏకపదము = సర్వగుణము లొకచోఁ జేరియుండునట్లు చేయఁబడినది.

వ. అని దేవేంద్రుండు చెప్పె నీవు నట్లు కావించి చరితార్థుండవు కమ్మనినఁ గౌంతేయాగ్రజుండు. 30

క. ఏరీతి పాలనంబున, భూరమణుం డిహమునందు భూరియశంబున్
గూరఁ బరంబున స్వర్గం, బారూఢిగఁ బొందఁ గలుగు నానతి యిడుమా. 31

తే. అనుటయున్ భీష్ముఁడను వ్యవహారశుద్ధిఁ, బ్రజలఁ బ్రజలను బలె నేలుపార్థివుండు
ధర్మతత్పరుఁడై కీర్తిఁ దగ గణించి, యిహపరంబుల సుఖియించు నిద్ధచరిత. 32

వ. అనిన యుధిష్ఠిరుండు. 33

తే. ఎట్టివ్యవహారములయందు నెట్టివారు, వ్యవహరింపఁగ నర్హు లవ్వారిగుణము
లీవు చెప్పితి వొకనియం దీగుణములు, దనరుచుండుట దుర్లభ మని తలంతు.

వ. అనిన దేవవ్రతుం డీవు చెప్పిన ట్లిట్టిశుభగుణయుక్తుం డగుపురుషుండు దుర్లభుం డనుట నిశ్చయంబ కాని ప్రయత్నించి యందు శీలాదులైనం బరీక్షించి చేకొన వలయు నట్టివారిం జెప్పెద వినుము. 35

సీ. *చతురుల్ ప్రగల్భులు స్నాతకులును శుచుల్, వైద్యు లౌనల్వురు బ్రాహ్మణులను
బలవంతులును శస్త్రపాణులు ధర్మైక, గతు లగునెనమండ్రు క్షత్రియులను
వృత్తసంపన్నులు విత్తవంతు లయి ప్ర, బలునేకవింశతి వైశ్యజనుల
నిత్యకృత్యములందు నిరతు ల్వినీతులు, శుచు లగుముగ్గురుశూద్రజులను

తే. అష్టగుణసంయుతుఁ డనసూయకుఁడు సత్య
వాణియుఁ బ్రగల్భకుండు పౌరాణికుఁ డగు
సూతుఁ డొకఁడు భూపతిచెంతఁ జొప్పడఁ దగు
నంద ఱేఁబదియేండ్లవారైన నొప్పు. 36

రాజామాత్యాదులకడఁ బ్రవర్తింపవలసిన విధానము.

సీ. †క్షోణీశ్వరుఁడు విప్రశూద్రసూతజు లెన,మండ్రు మంత్రులలోన మహితయశుని
సమదర్శి సువినీతు సప్తవ్యసనవర్జి, తుని శ్రుతిస్మృతిసమేతుని నలోలు
పునిఁ గార్యదక్షు నొక్కనిఁ బ్రధానుని జేసి, వానితో మంత్రము వఱలఁ జేసి
‡రాష్ట్రీయునకుఁ బంచి రాణ లెసఁగునట్లు, వ్యవహారములఁ దీర్చి ప్రజల నరసి

---

*అష్టగుణములు=శుశ్రూష, శ్రవణము, గ్రహణము, ధారణము, ఊహనము, అపోహనము, విజ్ఞానము, తత్త్వజ్ఞానము.

†సప్తవ్యసనములు=వెలఁది, పానము, జూదము, వేట, దండపాతనము, వాక్పారుష్యము, అర్థదూషణము. ‡రాష్ట్రీయుఁడు=న్యాయసభాధిపతి;

తే. రాజ్యపాలన మొనరించి రాజెసంగఁ, గలఁడు న్యాసాపహారాదికం బొనర్చి
ప్రజలఁ బీడించునే వారు రాష్ట్ర మీఁగి, పోవుదురు దేగఁ గన్నట్టిపులుఁగులట్లు

చ. అవిసిననావ సాగరమునందు మునింగెడురీతి దుష్టుచేఁ
దవిలినరాష్ట్రముం జెడు నధర్మమునం బ్రజ నేలునట్టిపా
ర్థివునకు దుష్కృతంబునను రేపును మాపు భయంబ యాఱు కా
దవల దివంబు దవ్వగుచు నంటఁగ వచ్చెడు నారకవ్యథల్. 39

తే. అవని నేలెడుపట్టున నధికృతు లయి, సుతులు గాని మంత్రులు గాని సతమధర్మ
వర్తులై కార్యము లొనర్ప వారితప్పు, తాన కొని రా జధోగతి కై నశించు.

చ. అలకువ వ్యాజ్యె మాడి వ్యవహారము తీర్చుకొనంగ వచ్చినన్
బలులు బలాత్కరించి బహుభాషలు పల్కఁగ వారిపక్షముల్
బలుకక ద్వైధవాద మగుపట్టున సాక్షిబలంబు సూచియున్
గలిగినపత్రముల్ గనియు క్ష్మాపతి తీరుపు చెప్పగా నగున్. 40

ఆ. త్రాసుముల్లు వోలెఁ దా నుండ నగుఁగాని, ప్రజలవాదు పడినపట్లఁ బక్ష
పాతి యగుచు న్యాయపద్ధతి నడుపని, నృపతి నిరయ మంది నెగులు గుడుచు.

సీ. అపరాధము నెఱింగి యనురూపదండంబు, పాపులయెడఁ జేయఁ బతికిఁ జెల్లు
నాజ్ఞల నర్థగ్రహణములన్ ధనికుల, నధనుల నిర్బంధనాదికముల
దుర్వృత్తు లగువారిఁ దోత్రప్రహారముల, దాసుల ముండనతాడనముల
శిష్టవర్తనులఁ గించిచ్ఛిక్షలను సాంత్వనోపప్రదానాదియుక్తగతుల

తే. రాజవధచికీర్షకుల వర్ణప్రసాంక, రికులగృహదాహకులఁ దస్కరకుల నెంచి
చిత్రవధమున శిక్షింపఁ జెల్లు ననుచు, ధర్మశాస్త్రమునం జెప్పె దైత్యగురుఁడు.

తే. *యుక్తునకునేని శాస్త్రోక్త ముచితదండ, మును బొనర్చుట భూతలేశున కధర్మ
మనఁగ రా దది ధర్మమై తనరెడు నవి, చారదండము దుర్గతిదారిఁ జూపు. 43

తే. †ఒకఁడు చేసినదాని కింకొకని శిక్షి, తునిఁగ నొనరించుటొప్పదెందును దదీయ
నాగమానుగమ మొనర్చియాంక్ష నునిచి, వదలఁదగు దోషి రాకున్న వానినవల.

చ. ఇతరులమాట చెప్పుటకు నింతయుఁ గొంకక యున్న దూతునిన్
మతి గలఁగన్ వధించుటకు మానవనాథుఁడు పూనరా దొక
ప్డతివిపదాగమంబు తన కైనను గాని వధించెనేని దు

* యుక్తుఁడు = శాస్త్రప్రకారము నడచువాఁడు. † ఆగమానుగమము=అపరాధి బయల్పడు ప్రయత్నము.

ర్గతి కగు వెన్కఁ దత్పితలు గాంతు రధోగతి భ్రూణహత్యకై. 45

తే. కులము దక్షతశీలముపలుకునేర్పు,స్మృతియుధృతియుయథో క్తవాదితయు నేడు
దూతునకుఁ బ్రతీహారికిన్ ఖ్యాతములగు,గుణములండ్రువిపశ్చితుల్ కురువరేణ్య.

తే ధృతియు మతియును హ్రీయును ధీరతయును
ధర్మశాస్త్రవిధిజ్ఞత తత్త్వవిత్వ
మును రహస్యగుప్తియు సత్వమును గులీన
తయును సంధ్యాదులు నెఱుంగఁ దగుఁ బ్రెగడకు. 47

ఉ. ప్రెగ్గడ ధర్మముల్ గలిగి పేర్మికి నెక్కెడు గాక పోరులన్
మొగ్గరముల్ రచించుటయుఁ బోటుతనంబును యంత్రకల్పన
న్దగ్గనినేర్పు నాయుధమున న్నిపుణత్వము వాన కెందకున్
లొగ్గడిలంగఁ బోనిమతి లోఁ గొన నా దళవాయి యెప్పుడున్. 48

క. నమ్మియు నమ్మగ రా దొరు, నెమ్మనమున కైనఁ దనదు నిర్ధారణమున్
సమ్మతిఁ బడి తనయునకే, నెమ్మెయిఁ జెప్పంగ రాదు పృథివీపతికిన్. 49

భీష్ముఁడు దుర్గకర్మవిధానం బెఱింగించుట.

వ. ఇట్లు శాస్త్రతత్వం బెఱింగించితి ననిన యుధిష్ఠిరుండు రాజనగరం బెట్లుండ వలయుం జెప్పు మనిన వియన్నదీనందనుండు పుత్రమిత్రకళత్రాదులతోడం గాఁపురం బుండఁ దగుదుర్గంబు కర్మవిధానంబు సవిస్తరం బెఱుంగఁ జేసెద నాకర్ణింపుము 50

తే. షడ్విధంబుల దుర్గముల్ సొరు మీఱు, నందు సర్వసంపత్ప్రదంబైనపురము
పురమున నివేశనంబులు పొదలఁ జేసి, రాజు వసియింపఁ దగునది రాజధాని.

క. అనుడున్ దుర్గము షడ్విధ, మని చెప్పితి వానితెఱఁగు నభివర్ణింపన్
విన నెంతు ననినఁ గుంతీ, తనయునకున్ నదిసుతుండు తగ ని ట్లనియెన్. 52

వ. *ధన్వదుర్గము మహీదుర్గము గిరిదుర్గము మనుష్యదుర్గము మృద్దుర్గము వన దుర్గము నని దుర్గంబు లాఱువిధంబులు. 53

సీ. ఎల్లదుర్గముల మహీదుర్గ మగు నది, పఱపు లోఁతును గలపరిఘతోడ
దృఢము లున్నతము లై దీపించు ప్రాకార,ములతోడ నెంతయుఁబొలుపుమీఱి
చత్వరాపణగృహాసంపన్న మగునగ, రీలలామంబుతోఁ గ్రాల వలయు
నందు నాగాశ్వమహారథనరసైన్య, సముదయంబును శూరజనసహస్ర

* ధన్వదుర్గము = చుట్టును నిర్జలప్రదేశముగలది; మృద్దుర్గము = మట్టికోట.

తే. మాఢ్యధార్మికశిల్పి విద్యావిశాల, శతసహస్రము పొలుపొందుచక్కి నిలిపి
ప్రభు వమాత్యబలంబునఁ బ్రబలుఁడగుచు, నప్పురంబుననివసింపనొప్పునధిప. 54

మ. ధనధాన్యంబులు నాయుధాలయము లుద్యానంబులుఁ గోధనం
బును గోశంబును వైద్యపుస్తకగృహంబుల్ ధర్మశాలల్ సుభో
జనగేహంబులు దేవతాలయములుఁ సత్రంబులుం జావడుల్
ఘనవిద్యానిలయంబులుం గలుగులీలం బ్రోలు గావింప నౌ. 55

వ. మఱియు వశ్యామాత్యుం డగుభూమీశుండు కోశబలమిత్రవ్యవహారంబులను భాండాగారాయుధాగార మంత్రాలయ నిచయంబులను వృద్ధిగావించునది కాష్ఠలోహతుషాంగారదారు శృంగాస్థివైణవంబులను మజ్జాస్నేహవసాక్షౌద్రౌషధగ్రాసములను శణసర్జరసధాన్యాయుధశరంబులను జర్మస్నాయు వేత్ర ముంజ బల్బజ బంధనంబులను జలాశయోదపానక్షీర వృక్ష సంచయంబులను సతతంబు రక్షించునది యాచార్యఋత్విక్పురోహితులను బూజించునది మహేష్వాసస్థపతి సాంవత్సరిక చికిత్సకుల నతిప్రయత్నంబున సత్కరించునది దాంత దక్ష శూర సాత్త్విక మేధావి బహుశ్రుత కులీనుల యుక్తకార్యంబుల నియోగించునది మఱియును. 56

భీష్ముఁడు రాజొనర్పఁ దగుధర్మంబు లెఱింగించుట.

సీ. శిష్టుల రక్షించి దుష్టుల శిక్షించి, వర్ణాశ్రమములు గాపాడ వలయుఁ
బౌరజానపదప్రవర్తనం బారసి, కర్జ ముచితభంగిఁ గలుగ వలయుఁ
జరమంత్రదండకోశముల నెల్లప్పుడు, స్వయముగాఁ దాన కాంచంగ వలయు
నర్యుదాసీనమిత్రాదిచికీర్షిత, మెప్పుడుఁ జారులఁ బుచ్చి యెఱుఁగ వలయు
తే. మిత్రులను గొల్వ వలయు నమిత్రులనని, గెల్వ వలయు ధర్మంబున నిల్వ వలయు
నీయ వలయు సవంబులు సేయవలయు, నేమరక సంతతంబును భూమివిభుఁడు. 57

సీ. వృద్ధులం గృపణుల విధవల నేప్రొద్దు, పోషింపఁ దగు వృత్తి పోషణించి
భోజనభాజనంబుల సత్కరింప నౌ, నాశ్రమపదముల నరసి యెపుడు
తనమేను రాష్ట్రము తాపసేంద్రులకు ని,వేదించి భక్తి సేవింప వలయు
సత్కులంబునఁ బుట్టి సర్వార్థములు త్యజిం,చినబహుశ్రుతులఁ బోషింపవలయు
తే. నిధులరక్షించుకొనునదినిపుణులనిజ, రాష్ట్రమునయందుబలెఁ బరరాష్ట్రమందు
వనములందునుసామంతవరపురముల, నిలువనియమించి పాలింపవలయు తేఁడు.

వ. అనిన ధర్మనందనుండు రాష్ట్రరక్షణం బెట్లు సేయం జెల్లుఁ జెప్పు మనిన నాపగా

తనూజుండు రాష్ట్రగుప్తియు రాష్ట్రసంగ్రహంబునుం జెప్పెద నవహితుండ
వగు మని యి ట్లనియె. 59

సీ. గ్రామంబునకు నొక్క గ్రామికుం బదిగ్రామ, ములకొక్క గ్రామణి పొసఁగ నట్టి
వింశతి కొకపరివృఢుఁడునూటికినొక్క, యొడయఁడు వేయింటి కొక్కప్రభువు
గా నధిపతులను గల్పింపఁగా నొప్పు, గ్రామదోషములను గ్రామికుండు
పోలించి పదిగ్రామములవాని కతఁడు వింశతిగ్రామముల దొర కతఁడు నూఱు
తే. గ్రామములతేనికతఁడు వేగ్రామములవి, భునకు నెఱిఁగింపనగు నంశములను బట్టి
వారలకు వేతనముగల్గువారిలోన, హస్రపతియుత్తముం డని యరయవచ్చు 60

క. గ్రామాధికారు లిందఱు, భూమీశుని దయకుఁ బాత్రభూతులగుచు సం
గ్రామక్రియ గ్రామక్రియ, నేమరక పొనర్చుచుంట కృత్యం బయ్యెన్. 61

ఆ. నగరనగరమునకుఁ దగ నొక్కఁడు గాని, సర్వదేశమునకుఁ జాల నొకనిఁ
గాని ధర్మవేత్త యైనధీసచివుండు, కలిగి చూచుచుండ వలయు నెల్ల. 62

శా. నక్షత్రంబులలో గ్రహంబుపగిదిన్ లక్షింప నై గ్రామికా
ధ్యక్షుం డాసచివుండు రాష్ట్రమున రాజాజ్ఞం బ్రవర్తించుచున్
రూక్షాత్ముల్ పరవిత్తహర్తల భయారూఢస్థితిన్ బాపి సం
రక్షింపం దగు భూప్రజన్ విహితచర్య న్వృత్తి గల్పించుచున్. 63

సీ. క్రయవిక్రయాదిసౌకర్యమునకు వణి, గ్జనుల నిల్పం జను జనపదముల
శిల్పరక్షార్థము శిల్పుల నిల్పంగ, వలయు వారికి వృత్తిఁ గలుగఁ జేసి
కులధర్మమాశ్రమస్థులధర్మమును బ్రోవఁ, బ్రోడల నలరింపఁ బోలు జగతి
జారచోరాదిదుర్జనభయం బెడలింప, గావింప వలయు రక్షకభటులను
తే. న్యాయ మన్యాయమును దీర్ప న్యాయసభలఁ, జేయ నో నుచితకరంబు నేకరింప
బాటల జలాశయంబుల భద్రపఱుపఁ, దగినవారల నెలకొల్పఁ దగును బతికి.

తే. తిండిపోతయి లోభంబు మెండుకొనఁగఁ,బరఁగు రాజును ద్వేషింత్రు ప్రజలువారి
ద్వేష మప్రియమును మేలు వెంపఁ జాల,వతఁడు సంప్రీతిదర్శనుం డై చనఁదగు.

సీ. అక్షయబుద్ధి యగానధిపతి రాష్ట్రమున్, బొనర వత్సౌపమ్యమునను బిదుక
వలయు వత్సము బలవంతమై యొంతయే,బరువు మోయఁగఁ జాలుఁ బాలు లేక
బలహీనమై యెట్టిపని సేయఁ జాలదు, రాష్ట్ర మగ్గతి యైన రాణ సెడును
రాష్ట్రంబు ప్రబలిన రాజు ప్రబలు నాప, దలఁ గోశ మగు రాష్ట్ర మెలమిఁ బతికి
తే. నాశ్రితులఁ బౌరజానపదాదిజనుల, స్వల్పధనుల నైనం దయ నరయ వలయు

దస్యుపరచక్రభయ మైన తఱులఁ బ్రజల, వలన నెట్టైన ధన మంద వచ్చు రాజు.

చ. అరు లఱ దెంచి రాష్ట్రము సమస్తము మ్రింగఁ దలంచి రిట్టివో
దుర మొనరించి మీకు నొకదుఃఖము గల్గక యుండఁ గాచెదన్
వరమతులార! మీధనము వాహిని ప్రోఁపున కిందు వెండియున్
బరభయ మీఁగ నిత్తు నని వారిధనంబు గొనంగ నొప్పెడిన్. 67

తే. వైశ్యులాటవికులులోని వారియెడల, మృదులములు సాంత్వనంబులు పొదలఁ జేసి
రాజకార్యముల నెఱింగి రాజు వారి, వలనఁ గప్పములం గొనవలయుఁ దఱుల.

సీ. దేశకాలాదుల తెఱఁ గెఱింగి ప్రజాహి, తమతియై వారి శ్రేయము తనదిగఁ
దలఁచి కార్యముఁ బ్రవర్తిలఁ జేసి భ్రమరము, మధుదోహ మొనరించుమాడ్కి రాష్ట్ర
ధన మంద నగుఁ బాల కని పొదుగుం గోయు, జడునివలెం గాక జలగ వోలెఁ
దిగిచి కొనం జనుఁ దెలియక పులి తన, పిల్లలం దినురీతి చెల్ల దెపుడు

ఆ. నిదుర వోవువాని పదము వేదన లేని, మాడ్కి జుంచుకొఱికి మాంసముఁ గొను
న ట్లతీక్ష్ణరీతి నర్థ మందగ నొప్పుఁ, గొంత కొంత యగుచు నెంతొ గాఁగ. 69

మ. క్రమ మొప్పార నుపాయసాంత్వనములం గల్పించి వే గిత్తలం
దమియింపం గలయట్లు భారసహతం దర్కించి రాష్ట్రప్రజన్
సుమనస్కుం డయి చూచి తద్ధనములన్ క్షోణీశ్వరుం డొందనౌ
సమయంబు న్విడనాడి యొద్దధనముల్ సాధింప రా దెప్పుడున్. 70

తే. దుర్దములసాంత్వనమ్ములతోడ వశము, గాఁగఁ గొని వారికతమునఁ గలుగువారి
వశులుగాఁ జేసికొను రాజు వసుపరిగ్రహణ మొనర్పఁగ నగు వ్యగ్రుఁడగుట తగదు

తే. పానశీలులు వేశ్యలు ప్రావణికులు, విటులు కితవులు లోనగువిషయలోలు
రధము లాధన మాసింప నైతి కాని, దనుచు శాసించె మనువు మున్నఖిలజగతి.

సీ. నేత యిందఱి నిట్లు నియమింప కున్నచో, వారిపాపము చతుర్భాగ మొందు
భూతి నాశకులు వా రేతఱేఁ దత్థ్సానములు నిరోధింపఁగఁ దలఁప వలయు
నతిధనంబును గూర్ప నగు వారిపైఁ బన్నుఁ, గట్టి తద్ధన మెల్లఁ గయికొన నగు
గోరక్షయును గృషికో లెనొప్పినకర్మ, ములు ధాత్రిఁ జేయింప మొనయవలయు

తే. ధని యయిన రాజు సర్వభూతముల కెన్న, రక్షకుండగుఁ గావున రాజు ధనియుఁ
బ్రాజ్ఞుఁడును ధార్మికుండయి తనరునేని, యఖిలలోకము నేల సమర్థుఁ డగును.

తే. బధిరపంగ్వంధభిక్షుకబ్రహ్మచారు, లైనవారలు గా కన్యయాచకులును
దస్యులును రాష్ట్రమందుండఁ దావులేని, యట్లు గావింపవలయు ధరాధిపుండు.

వ. నీ విట్టివాఁడ వై భూతదయం గలిగి సత్యార్జవాక్రోధానృశంస్యంబులం గలిగి భూప్రజం బాలింపుము దానం జేసి కోశమిత్రరాష్ట్రంబులబలంబు గలవాఁడ వగుదు వని మఱియును. 75

క. స్వవిషయమునందు భక్ష్యము, లవు ఫలముల నిచ్చుభూరుహంబులఁ ద్రుంపం దవిలినరాజున కఘ మగు, నవి బ్రాహ్మణమూలధనము లనిరి మనీషుల్. 76

క. మును లారగింప మివిలిన, వనస్పతిఫలంబులఁ బెర వారు భుజింపం జను నట్లు గాక యుండిన, జనవిభునకు దోష మంటి చను దెంచు వెసన్. 77

ఆ. వృత్తి లేమిఁ జేసి విప్రుండు దేశము, విడిచి పోవ నున్న పుడు నృపుండు వానిఁ దెలిసి ప్రోవ వలయు నట్లునఁ బోఁ, దలఁప వానిఁ దెగడ వలయు సభల.

తే. తనకు లేదని యడుగువిప్రునకుఁ దనదు, త్యాగమును జూపి తృప్తిని దనరఁ జేసి పుడమిఱేఁ డాతనిని వేల్పు పురుడు గాఁగఁ, గొలిచి సేవింపవలయు నోకురుకులేశ.

క. కృషియును వాణిజ్యాదులు, విషయంబున జనులు బ్రదుకువిధి కేర్పడియెన్ మృష గాదు త్రయీవిద్యా,విషయము భూతోర్ధ్వగతికి విఖ్యాత మగున్. 80

క. ఆశ్రుతి తత్పరిపంథిస,మాశ్రయమునఁ దెగినయేని యంతయును దమః ప్రశ్రిత మగు శ్రుతిరక్షకు, విశ్రుత మయి క్షత్రకులము వెలసె నృపాలా. 81

క. కావున గెలువుము శత్రులఁ, బ్రోవుము భూప్రజల జన్నము లొనర్పు మనిన్ బ్రావీణ్య మెల్లఁ జూపుము, భూవర ! ధర్మంబునందు బుద్ధిం గలవై. 82

సీ. రక్షింపఁ దగువారి రక్షింప కుండినఁ, దన కర్థసిద్ధి లే దనుట నిజము
లోకహితార్థ మాభూకాంతుఁ డాలము, సలుప నొఁ జారుల నిలుప నగును
స్త్రీయు చేఁ బరుఁ బరుచే స్త్రీయుఁ బరుఁ బరు,చేత స్త్రీయున్ స్త్రీయు చేత మనిచి
తా నెల్లవారి చేతన్ రక్షితుం డయి, రక్షింపఁ దగు నిజరాష్ట్ర మెపుడు

తే. ఛిద్ర మెట్టిది నా కుండె సిలుగు లెవ్వి, వ్యసనసంగ మెట్టిది వినిపాత మెద్ది
యేమిటికి దోష మంటె నే నేమి చేసి,నాఁడనని యెంచుకొనఁ జను నరవరుండు.

చ. అనుమతు లైనచారుల నిరంతరముం జనఁ బుచ్చి లోక మే
మనుకొనుచుండెనో తనధరావనపద్ధతి మెచ్చుచుండిరో
మనమున నొచ్చుచుండిరొ క్రమంబున మంత్రులు సంచరింతురో
తన కెదిరింతురో తెలిసి తత్పరతం బతి వెల్గఁ గాఁ దగున్. 84

ఉ. ఎల్లరు నొక్కచిత్తము వహింపరు మిత్రు లమిత్రమధ్యముల్
దెల్లము గాఁగ నుందురు సుధీమణి యైనమహీవిభుండు తా

నెల్లర నొక్కత్రాటిపయి నెప్డు మెలంగెడునట్లు నేర్పు సం
ధిల్లఁగఁ జేసి వాసిమెయి దేశము నేలుకొనం దలంప నౌ. 85

వ. అని చెప్పుటయు. 86

ఆ. తుల్యబాహుబలులు తుల్యగుణుల్ తుల్యులైనవారిపట్ల నధికుఁ డగుచు
నృపతి పనులఁ గొనుట యెట్లు చెప్పుమటన్న, నవనిపతికి భీష్ముఁ డనియె నిట్లు.

వ. *నీప్రశ్నంబు సంప్రస్తుతంబు చరంబు లచరంబులను దంష్ట్రు లదంష్ట్రులను విష
సర్పంబులు నిర్విషసర్పంబులను జంపి తినునట్లు శత్రువు లుక్కుమిగిలి చక్క
మడఁగింపం జూతురు వారు ప్రమాదపతనంబు గలభారుండంబులం బోలినవా
రట్టివారియెడ నప్రమత్తుం డై రాజు ప్రవర్తింపం దగు నత్యంతకరార్థితు
లయ్యు వణిజులును గృషికరులును రాష్ట్రంబు విడువఁ జాలరు వారు రాజ
భారమును వహించి లోకహితంబు గావించుచుందు రీయర్థంబునఁ దొల్లి
యౌవనాశ్వుం డగుమాంధాతృనకు నాంగిరసుం డగునుతథ్యుండు చెప్పిన
చొప్పు గలదు చెప్పెద వినుము.

మాంధాతృన కుతథ్యుఁడు చెప్పిన హితవాక్యప్రకారము.

సీ. లోకరక్షకుఁడునా వాకొనంబడురాజు, ధర్మం బొనర్పనై ధరణి వెలసె
ధర్మమునన్ దేవతాత్వ మధర్మము, నన్ నరకమ్మును నరపతి కగు
ధర్మమునన్ భూతతతి నిల్చు ధర్మము, నిల్చు భూపతియందు నిశ్చల మయి
ధర్మాత్ముఁ డగురాజుదండ లక్ష్మి వసించు, ధర్మహీనుం డైనఁ దరలి పోవు
తే. స్వీయధర్మమునం దర్థసిద్ధి యొసఁగు, నదియె మంగళ మని లోక మనుసరించు
ననుసరింపనిపాపాత్ము నడఁచ కున్న, నగు నధర్మము సతతభయంబు వొడము.

ఉ. †మామత మిద్దియంచు నభిమానమునం బరధర్మతత్పరుం
డై మహి సంచరించు దురితాత్ము నడంపకయున్నఁ దద్బలం
బే మహితం బగుం బ్రజల కిండ్లును బెండ్లము చేలు చెట్లునున్
సేమము లేక పోయెడి నశించెడి ధర్మము లెల్ల మొల్లముల్. 90

క. స్వాహాస్వధాదు లుండవు, గేహములం దతిథిపూజ కీడ్పడి పోవున్
ద్రోహము వేదమునం దగు,సాహంకారత ఖలాళి నడఁగింపనిచోన్. 91

సీ. ఉభయలోకక్షేమ మభిలషించి ఋషుల్ సృజించిరి ధర్మముల్ క్షితితలమున
ధర్మయుక్తుఁడె రాజు ధర్మహీనుఁడు వృష,లుఁడు వృష మన ధర్మ మడఁచుదాని

* భారుండము = రాబొందుపక్షి. † మొల్లము = ధనము.

ధర్మంబు వృద్ధి పొందఁ వృద్ధిఁ బొందు భూతము లది చెడఁ జెడు ధనవితృష్ణ
ధర్మంబు నశియించుఁ దన్నాశనంబునఁ, నారకవ్యథ లంటు నరపతులకుఁ

తే. జేతనప్రభవార్థము చేసె నలువ, ధర్మ మందున నది శ్రేష్ఠతరము యయ్యె
మహినిఁబాలించురాజు కామమునుగ్రోధ,మును విడిచిధర్మపాలన మొనరుపనగు.

క. ధర్మము శ్రేయస్కర మా, ధర్మమునకుఁ బుట్టినిండ్లు ధరణీదేవుల్
నిర్మత్సరమున వారిని, నిర్మలమతిఁ జేసి కొలుః నృపతికిఁ జెల్లుఁ. 93

క. వారల కవజ్ఞ చేసిన, భూరమణుఁడు భూరిభయము పొందెడిని గడుం
గూరిమి గలిగినమిత్రము, లే రోసి యమిత్రపదవి కెక్కెద రనఘా. 94

తే. మునువిరోచనతనయుఁడై వినుతిగన్న,బలి యసునతండు బ్రాహ్మణావమతిబాల్య
మునఁ బొనర్చినదాన నాతనిని బాసి, యరిగె సిరి ప్రేముడించెడు నడియ యైన.

చ. బలి విడి శ్రీ పురందరునికజ్జకుఁ జేరినఁ బాఱఁ జూచి య
బ్బలియుఁ దసూయఁ జూపుటయు వాని నొకింతన వీడి క్రీడఁగఁ
నెలకొనుచోటి కేగె నని నే విని యుంటి నయో యసూయకుఁ
ఫల మిది నీ వెఱింగి సిరిఁ బాయనిపాఁడవనై మెలంగుమా. 96

తే. సిరి కధర్మమువలన నిస్పృత మగుచు, దర్ప ముదయించె నద్దానిఁ దవిలి సురలు
నసురులును రాజవరులును గసిమసంగి,వ్యయమునొందిరి పెక్కురీవరసికొనుము

క. గెలిచిన రా జగు దానిం, గెలువఁగ లేకున్న దానికిం దాసుఁ డగుఁ
దెలిసికొని దర్పయుత మై, చెలఁగునధర్మంబు విడిచి సిరు లందు మిలఁ. 98

వ. రాజేంద్రా! నీవు మత్తోన్మత్త ప్రమత్త పాషండాది పరిచయంబునుండి విడి
వడినిగృహీతామాత్యదుర్గమారణ్యపర్వతదుర్గమహాస్త్వశ్వసరీసృపాదులసఖ్యంబు
వర్జించి బద్ధముష్ట్యభిమానదంభక్రోధనక్తంచర్యాదులఁ బరిత్యజించి ప్రవ
ర్తింపుము మఱియును. 99

చ. తెలియనికాంతలఁ బరసతీమణులఁ మగమాచకమ్మలఁ
గులటలఁ గన్యలఁ రతికిఁ గూర్పఁగ నొప్పదు వర్ణసంకరం
బలరిన వంగసంబుల జడాత్ములు రాకసు లంగహీనులు
ఖలులు నపుంసకుల్ వికృతకాయులుఁ పుట్టెద రట్టిపట్టునఁ. 100

సీ. కావున జాగరూకతఁ గల్గి భూపతి, ప్రజలఁ బాలింపఁగ వలయు నెపుడు
నటు గాక యుండిన నతని దోషము లంటు, ప్రజల నధర్మము వర్ణసంక
ర మ్మగు నుష్ణదినమ్ములఁ జలి చలి,కాలమున నుష్ణముఁ గల్గి యుండు

నతివృష్టి కొన్నా ళ్లనావృష్టి కొన్నాళ్లు, వ్యాధులు బాధులు నన్నినాళ్లు
తే. గలుగు ధూమకేతువులు నుగ్రగ్రహములు
తోఁచు నుత్పాతములు పుట్టు తొడరి బలవి
హీను బలవంతుఁ డడఁచు నా దిది యటంచుఁ
జెప్ప నుండదు ప్రజలు నశింతు రుర్వి. 101

క. పుడమి యరాజక మైనం, గడగండ్లం గుడిచి ప్రజలుఁ గడతేఱుదు రె
ప్పుడు ధర్మమువంకం గన, కడియాసలఁ బడినరాజు నంతంతఁ జెడున్. 102

ఆ. ధర్మచారి యగుచు ధరణీశ్వరుఁడు రాజ్య, పాలనంబు సేయఁ గాలవర్షి
యగును మేఘుఁ డెల్ల జగతీతలము సుభిక్షమున మించుఁ బ్రజ సుఖంబుఁ గాంచు.

మ. కులధర్మంబులపట్ల దోష మయినం గోరంత కొండంత యై
బలిమిం గైకొన నీక చాకి యొపు దేవస్త్రంబునం దే క్రియన్
మలముం బాపెడు నాక్రియన్ గొని మహీనాథుండు తద్దోషముం
దొలఁగింపం దగు మానవావళికిఁ దోడ్తోఁ దండ్రి యై తాత యై. 104

క. నాలుగుయుగములధర్మము, నాలుగువర్ణములయందు నడపించుటకున్
జాలినభూజాని ప్రమా, దాలసుఁ డైనన్ సమస్త మంధంబ యగున్. 105

ఆ. భూతకోటి కెల్ల భూనాథుఁడే కర్త, హర్త యగుచు నొప్పు నతఁడు ధర్మ
కలితుఁ డైన గర్త కాకున్న సంహర్త, యని యెఱుంగవలయు నవనినాథ.

సీ. అవనీశుఁడు ప్రమత్తుఁ డైనచోఁ దత్సతీ, సుతసుహృద్బంధువుల్ వెతలఁ గుడుతు
రశ్వతరాశ్వగోహస్త్యుష్ట్రగర్దభా,దులు క్షయించు నధర్మకలితుఁ డైనఁ
బ్రభువు దుర్బలులకు బలము గా విధి చేసెఁ, గాన దుర్బలులను గావ వలయుఁ
గావకుండిన వారికాలుచుం జెడు నాత్మ,యును దృష్టియును నేర్చునొడయు కులము
తే. వేఁడు మిథ్యాభిశస్తుఁ డై గోడుఁ గుడుచు, వానికన్నీరు భూపతివంక నపుడ
దొసఁగిడుం గాక యున్నఁ దత్పుత్రపౌత్ర,వర్గమునకైన విధిగఁ దత్ఫలము గుడుపు.

సీ. అనఘులు బలహీను లై దిక్కు లేకుండ, వధ్యు లై పోయినవార లైన
నిజదేశమునయందుఁ బ్రజలు బ్రాహ్మణులకై,వడి బికిరం బెత్తువార లైన
రాజపూరుషులు రాష్ట్రమున నీతిం బాసి, పాపం బొనర్చెడువార లైన
మోస సేయుచు ఖలుల్ మొఱ వెట్టుదీనుల,వసువెల్ల హరియించువార లైన
తే. దండధరుఁడైనరాజు తద్దురితమునను,నిరయగతుఁడయి యాతనల్ నిరత మొందు
నిల నధర్మము తలసూపఁ దెలిసి రాజు, తెగి నడంచినవాఁ డయి సుగతి నొందు.

తే. సకలభూతాశ్రయం బగుమహీరుహంబు, గూల భూతములకుఁ దావు కుదర నట్లు
రాష్ట్రమదిధర్మయుక్తమై గ్రాలనపుడు, ప్రజ లనాశ్రయులై వంతఁబడుదురధిప.

చ. తెలిసి యితండు పాపి యని దేశమునందు మెలంగ నిచ్చినన్
గలియుగ ధర్మ మానృపతి కైవసమై చెడఁ జేయు సర్వమున్
దులువలదుష్కృతం బెఱిఁగి తోడన దండన మాచరించినం
గలుగు మహాఫలంబు తనకల్గినరాజ్యము పూజ్యమై చనున్. 110

క. మంత్రుల సన్మానించుచు, మంత్రంబునఁ దంత్రమందు మఱి యుద్ధమునన్
యంత్రము లట్ల మెలంగ ని,యంత్రితులం జేసి నృపతి యభివృద్ధిఁ గొనున్.

క. తనవాక్కు సుభాషిత మై, తనపని సుకృతంబ యగుచుఁ దనరఁగఁ బ్రజలం
గని కరుణ నేలునృపుఁ డెప్డు ననుత్తమధర్మ మొంది పొనరెడు నవనిన్. 112

సీ. మంత్రులనవమానమతిఁ జూడ కతిదృప్తుఁ, లగువారి శిక్షించునట్టిరాజు
త్రికరణశుద్ధిగా సకలప్రజం బ్రజ, యట్టులు రక్షించునట్టిరాజు
దస్యుభయంబును దలఁగించి రాష్ట్రము, ననవరతముఁ బ్రోచునట్టిరాజు
వృజినం బొనర్చినప్రియునిపై సుతునిపై, నక్కటికము సేయనట్టిరాజు

తే. శరణుఁ జొచ్చినవారిని గరుణ పొదలఁ, గన్నకొడుకులబలెఁ జూచి కాచిప్రోచి
శాత్రవుల గెల్చి జన్నముల్ సరవిఁ జేయు, నట్టిరాజు ధర్మాత్మకుం డనఁగ నొప్పు.

ఉ. మిత్రుల వృద్ధిఁ గూర్చుచు నమిత్రుల యుద్ధములందుఁ దీర్చుచున్
బాత్రము లైనసాధుల సపర్యలఁ గొల్చుచు సత్యధర్మముల్
ధాత్రిని నిల్పుచున్ సుకృతతత్పరుఁ డై ప్రజ నెమ్మి నేలుసు
క్షత్రియుఁ డుత్తమం బగుచుఁ గ్రాలు గతిం జన నై ప్రకాశిలున్. 114

తే. రాజు ధార్మికులకు ననుగ్రాహకుఁ డయి
యింద్రియంబుల నరికట్టి యెల్లనాఁడు
చెడనియైశ్వర్యమును బొందు క్షితితలమున
నింద్రియనిరోధ మొనరింపఁ డేని చెడును. 115

వ. మఱియు ఋత్విక్పురోహితాచార్యాదుల నవమానింప కాదరించి సత్కరించుచు యథాశాస్త్రంబుగఁ బ్రజలం బరిపాలించు సుక్షత్రియుండు సహస్రాక్షుండు నాఁబడు నతం డప్రమాదంబున దండంబు పూని క్షమయు బుద్ధియు ధృతియు మతియుం గలఁడై సత్యజిజ్ఞాస చేయుచు దానంబునందును మధురవాక్యంబునందును నభ్యాసంబుఁగలిగినవాఁ డిహపరంబుల సుఖించు నదక్షుండై

ప్రజలరక్షింప నేరనివాఁడు భూభారభూతుండై క్లీబతుల్యుం డగు నీవు ధర్మవేత్తవు స్వపరదేశంబుల నీధర్మంబునకు నాశనంబు గలుగఁ బోదు విను మర్థకామంబులకంటె ధర్మంబ యుత్తమంబు ధర్మాత్ముం డుభయలోకసుఖియగు భూతసంగ్రహంబును దానంబును మధురవాక్యంబును నప్రమాదంబును శౌచము నివి రాజభూతికరంబులు వీనినుండి నీవు ప్రమాదంబు నొందకు మిట్టి వృత్తము యమవరుణవాయువులకును రాజర్షులకును గలిగి యుండు నీవా రాజర్షిసేవితం బయినవృత్తంబు గలిగికొనుము ధర్మవృత్తంబు గలరాజును దేవర్షిపితృగంధర్వులు కీర్తింతు రిహపరంబులు వానికిఁ గరతలామలకంబులని యుతథ్యుండు చెప్పిన మాంధాతృండు శంకారహితుండై భూభారంబు వహించి ప్రజలం బాలించె ధర్మరాజా! నీవు నామాంధాతరీతిఁ బ్రీతుండై పూజ్యసామ్రాజ్యం బేలుము నీకు స్వర్గస్థానంబు లభించు ననిన యుధిష్ఠిరుండు ధర్మంబున నుండఁ దలంచినధార్మికుం డగురా జెట్లు ప్రవర్తింప వలయుం జెప్పు మనిన సురసరిన్నందనుం డీయర్థంబు దేటపడ నొక్కయితిహాసంబు గల దాకర్ణింపుము. 116

వసుమనుఁ డనురాజునకు వామదేవుండు చెప్పినహితవాక్యములు.

చ. వసుమనుఁడన్ మహీశుఁడు తపస్వివరేణ్యుని వామదేవుఁ డన్
రుసిఁ గని మ్రొక్కి యి ట్లనియె రూఢమతిన్ మునిచంద్ర మర్త్యుఁ డే
పొసఁగెడువృత్తి వర్తిలుచుఁ బొల్చి స్వధర్మము చక్కఁ బెట్టునో
విసృతము గా వచింపు మన వీతరజుం డగునాతఁ డి ట్లనున్. 117

ఉ. ధర్మము మించి యొం డొకఁడు ధారణిఁ గల్గద యర్థసిద్ధియున్
ధర్మముకంటె లో చ్చనుచు ధార్మికు లెల్ల వచించుచుందు రా
ధర్మమునందు నున్నవసుధాధవుఁ డెల్లజగంబు గెల్చెడిన్
ధార్మికచక్రవర్తి యయి తద్దయు నొప్పు యశస్సమున్నతిన్. 118

పంచ. అధర్మదర్శియై బలంబు నంది పొందు వో మెలం
గుధారణీశ్వరుండు రెంటిఁ గోలుపోవునట్టిఁడై
వ్యథం బడున్ సుదుష్టచిత్తుఁడై నమంత్రిఁ గల్గి లో
కధర్మనాశకుండునై పొకారు మూలముట్టుగన్. 119

ఆ. కామచారియై వికత్థనుం డయి యర్థములు భజింప కున్నపురుషుఁ డెల్ల
భూతలంబు నొంది ఖ్యాతి నొప్పియు నింతలో నశించునంచు లో నెఱుఁగుము.

క. అనసూయుండు జితేంద్రియుఁ, డనవద్యుం డగుచు ధాన్యకాపేక్ష మెయిన్
జనునృపుఁడు వృద్ధిఁబొందున్, వననిధి వాహినులఁ జేసి వర్ధిలు మాడ్కిన్.

తే. ధర్మమునను గామమున నర్థమున నేను, బూర్ణుఁడను గా నటంచును బుద్ధి నెంచి
లోకయాత్రకు హేతువులై కనఁబడు, వాని వినువాఁడు కీర్తిసంపదల నొందు.

తే ఇట్లు ధర్మార్థపరిచింత యెపుడు సేయు, ధర్మసంరంభి కార్యముల్ దనరఁ జేసి
ధ్రువముగామహదైశ్వర్యరూఢి నెసక, మెసఁగునని చెప్పి రార్యులో వసుమతీశ.

ఆ. దాతఁ గాక స్నేహతాత్పర్యమును లేక, తెలియఁ బోక ప్రజపఁ దీక్ష్ణదండ
మెసఁగఁ జేయుచుండువసుమతీశుఁడు శీఘ్రు,కాలమున నశింపఁ గలఁడు సువ్వె.

ఆ. బుద్ధి లేక పాపబుద్ధుల నారయ, నోపక యపకీర్తియుక్తుఁ డగుచుఁ
బ్రాణికోటి వ్యసనపరిచింత చేయని,భూధవుండు నరకబాధ లొందు. 125

తే. తమ్ముమన్నించువాఁడును దాంతుఁడుమృదు,లస్వభావుఁడు వశవర్తిలలితమూర్తి
యైనదౌరవ్యసనముతమయుదిగనెంచి,ప్రజలుతలఁతురావ్యసనముంబాయఁజేయ.

ఆ. ధర్మబోధసేయఁ దగుదేశికుం గోరఁ, డడగఁ డెవరి నేని యర్థలాభ
ములస్వతంత్రుఁడగుచు మెలఁగునాతఁడుచిర,సుఖమునొందఁడనుచుశ్రుతివచించు.

క. గురువు ప్రధానము గాఁ గొని, వరధర్మములందు నర్థపరిచింతకుఁడై
గురులాభమందు ధర్మము, పరంప్రధానుఁ డయి పొందుఁ బరమసుఖంబుల్.

సీ. బలవత్తరు లధర్మపరు లయి దుర్బలు,లయెడఁ గ్రూరతతో మెలంగ వారి
యన్వవాయులు గర్హ్య మగునట్టివృత్తిమై, నుండి రాజాశ్రయ మొంది రేని
యాపాప మవినీతుఁ డగురాజునకు నంటి, క్షిప్ర మారాష్ట్రముం జెఱుప నగును
సాహసప్రకృతియై శాస్త్రలక్షణహీనుఁ, డైనరాజు నశించు నంతలోన

తే. ఉత్తమం బగుపూర్వులవృత్తి నడఁచు, క్షితిపతిం బట్టి జితులు నజితులు నొక్క
గతికినై పదభ్రష్టుని గానొనర్ప, నోపి యుందురు క్రోధంబు రూపు సూప.

క. కృతకల్యాణుఁడు శత్రు,క్షితిపతి సమరమునఁ జేతఁ జిక్కినయేనిన్
మతి గౌరవించి పుచ్చుని,క్షితిపతి ధర్మంబు విడిన కేవలుఁడె యగున్. 130

తే. ఆపదలరాజుసుముఖుఁడైయక్కటికముఁ, జూపభూతప్రియుండయిపొంపుమిగులు
వానిసిరులకు భ్రంశంబుఁ గానరాదు, సర్వసంసిద్ధు లరచేతఁ బర్వియుండు.

ఆ. అప్రియంబుసేయునతఁడు ప్రియుండైనఁ,బ్రియముసేయుటొప్పప్రియుఁడుఁగాక
ప్రియముసేయునతఁడు ప్రియుఁడుగాఁ డెన్నాళ్ళ,కైనఁగానియిదిసమాహితంబు.

క. తన కప్రియంబు చేసిన, మనుజునకుం బ్రియము సేయ మానగు నటు చే

సినవోఁ గొంతటిలో నా, జనుఁడు ప్రియుం డగుటఁ దనకు సహకారి యగున్.

సీ. మృష లాడరా దెట్టిమిషఁ గల్గ వచ్చినఁ, బ్రియవాది యై యున్న బేర్మిఁ గాంచు
ధర్మమున్ విడరాదు తబ్బిబ్బు లైనను, గోపసంరంభముల్ గూడుకొన్న
నడిగినదాని కిట్టట్టు లాడగ రాదు, భావించి వాక్యమున్ పలుక వలయు
త్వరపడరా దెట్టితరుణమం దైన న, సూయ యేనాఁటికి సూపఁ దగదు
తే. ప్రియముఁ గల్గిన హర్ష మప్రియముఁ గల్గ, నధికదుఃఖముఁ బూనరా దర్థకృచ్ఛ్ర
ములఁ దపింపఁగరా దొడ్లసలిపిరనుచుఁ; జింత యేనాఁడుమనుజేఁడు సేయరాదు.

చ గుణము గ్రహించి భూప్రజలకున్ బ్రియముం బొనరించు ఱేనికిన్
గణుతికి వచ్చి నిచ్చలును గర్మము లన్నియు సిద్ధి నొందెడున్
ప్రణుతములై సిరుల్ విడనిఫక్కి నెసంగెడు సద్యశం బగున్
రణవిజయంబు గల్గెడి నరాతిచయంబు పదంబు పట్టెడిన్. 135

మ. ప్రతికూలోక్తులు లేక భక్తుఁ డగుచున్ వర్తించువానిన్ స్థిర
ప్రతిపత్తిం గలఁడై ప్రియంబు సలుపన్ వాంఛించువానిన్ మహో
న్నతచిత్తున్ సతతానురక్తుని నరున్ రాజ్యార్థకార్యంబులన్
క్షితినాథుండు పొసంగఁ జేసికొన నౌ శ్రేయంబులం గోరుచున్. 136

తే. మూఢు నింద్రియలోలు లుబ్ధుని ననార్య
చరితు నబహుశ్రుతుని హింస్రు శఠుని మద్య
రతుని స్త్రీద్యూతమృగయానురక్తు రాజ
కార్యముల నిల్ప నృపతికిఁ గలుగుఁ జెడుగు. 137

సీ. రక్షింపఁ దగువారి రక్షించెనే వాని, రాష్ట్రంబునం బ్రజల్ ప్రబలి యుండ్రు
బలవంతునకుఁ గీడు సలిపి నే దూరమం, దుంటి బీతేమని యుండ రాదు
వారలు శ్యేనాభిపతనంబుల న్వచ్చి, యేమఱిల్లినవాని నేపడంత్రు
దృఢమూలుఁడై తనదెస బల మరసి య, లఁతి నెదుర్పఁగవచ్చు లాఁతిఁ గాదు
తే. విక్రమంబున మహి నొంది వివిధజనుల, ధర్మమునఁ జేసి పాలించి ధర్మయుద్ధ
మందు నిధనంబు నొందెడు నవనిపతికి, శాశ్వతానందసౌఖ్యము సంభవించు. 138

తే. జనుల నేలుట ధర్మానుశాసనంబు, నాలమును మంత్రచింతయుఁ గాలసుఖము
ననెడునివి యేనుఁ గలిగినజనవిభుండు, సర్వసంపత్సమృద్ధి మై జగతి నొందు. 139

ఉ. దాతను మార్దవోపగతు ధార్మికునిన్ సుజనప్రియున్ సదా
భూతలనాథుఁ డంచు జనముల్ భజియించెడు గ్రామ్యవృత్తికిన్

బ్రీతి పొనర్చి ధర్మమును వీడి పరాఙ్ముఖుఁడై ప్రజాళికిన్
ఘాతుకుఁ డైనరాజుఁ గని కాదని త్రోయఁ దలంతు రెల్లరున్. 140

తే. ముఖ్యమంత్రుల విడి హీనపూరుషులను, జెంతఁ జేర్చినవానికి సిలుగు లగును
సుగుణు లగుజ్ఞాతిజనులను జూడ నొల్ల, కున్నవానికి వెనుదన్ని యుండు మిత్తి.

సీ. జన్యంబు లేనివిజయము నొందఁ దలంప, వలయు భూజానిరై వఱలువాఁడు
సమరాగతము విజయము జఘన్యం బని, సర్వశాస్త్రంబులు చాటుచుండె
నందనిపండ్లకు నత్తెత్త రాదు మూ,ల మతిదృఢము గానిసమయమందు
సంపన్నజనపదసంతుష్టసచివులు, పొదల భూపతి దృఢమూలుఁ డగును

తే. వేనియోధులు సంతుష్టమానసు లయి, యున్నతఱినల్పబలమైన యుద్ధములను
గెలిచిజయమందఁగలఁడు వాఁడెలమిఁగలుగ, విజయమరచేతనుండెనువింటివికద

వ. అని వామదేవుండు చెప్పినచొప్పునం జేసి మాంధాత ప్రశస్తిం గాంచె నీవు
నట్లు ప్రవర్తించి లోకోత్తరకీర్తిం గాంచు మనిన యుధిష్ఠిరుండు రాజు పర
రాజును జయింపఁ గోరెనేని వానియుద్ధధర్మంబు లెఱింగింపు మనిన భీష్ముం
డి ట్లనియె. 143

## ధర్మరాజునకు యుద్ధధర్మంబు లెఱింగించుట.

సీ. అవనీశ్వరుఁడు ససహాయుఁడై కా కసహాయుఁడై పరరాష్ట్ర మంది ప్రజల
నరసి మీ కేను రాయఁడను సదా మిమ్ము, రక్షింతు నాకు ధర్మబలి నొసఁగుఁ
డని పల్కి వారిఁ బ్రియ మెసఁగ నుండిన, వాని వారు వరింతు రేని మేల
రాజు లేకున్న వారోజ నెదుర్చ ను, పాయములన్ వారి వంచ నగును

ఆ. శస్త్రబలము లేక సైన్యబలము లేక, యుండురాజు నరసి యొరుఁడు రేఁగి
పోరవచ్చుఁ గాన భూపతి శస్త్రాస్త్ర, బలముఁ గల్గి యుండ వలయు నెపుడు.

వ. అనిన యుధిష్ఠిరుండు. 145

ఆ. కత్తిఁ గట్టి పోరఁగా వచ్చు రాజన్యు, నె ట్లెదుర్ప వలయు నెట్టిరీతి
పో రొనర్ప వలయుఁ బోలంగఁ జెప్పుమా, తాత! యనినవాని కాతఁ డనియె.

సీ. అవధారు సన్నద్ధకవచుఁడుఁ గాకున్నఁ, బరునితోఁ బోరాట పాడిగాద
యొకనితో నొక్కరుఁ డొడ్డి పోరుట పోలు, ననిఁ బట్టి విడువ నౌ నక్షమరిపు
సన్నద్ధుఁడై రాగ సన్నద్ధుఁ డగు టొప్పు, దడముతో వచ్చిన దడము వలయు
మాయఁ బూనినఁ దాను మాయఁ బూనం జెల్లు, ధర్మాజి నైనచో ధర్మ మొప్పుఁ

తే. దగదు జితుఁ డైన భీతుఁడై తరలి చనిన
వ్యసనమును గొన్న నిష్ప్రాణుఁ డైన భగ్న
శస్త్రుఁడు విపన్నుఁ డైనను శరణ మనిన
హతహయుఁ డైన జంప రా దాహవమున. 147

తే కర్ణనారాచమును విషకలితశస్త్ర, మెట్టిపగతునిపై నైన నేయ రాదు
తనకుఁ గాఁ బోరి నొచ్చినమనుజు నాదరింప కేఁగినఁ బాపంబు పెంపఱమగు.

సీ. సాధుభేదము సేయఁ జన దెప్డు ధర్మయు, ద్ధమున శత్రువుం దగును జంప
జయ మధర్మమున సమకూర్చుకొను రాజు, తనుఁ జంపుకొన్న పాతకము నొందు
సాధువు గానున్న సాధుత్వమున గెల్వఁ, జను నధర్మజయంబుఁ గొనుటకంటె
ధర్మంబునం జావ తగుఁ బాపవిత్తము, పాపంబునం గూర్చి పడలువఱచు
తే. తనదుధర్మమునందున్న ధరణివిభుఁడు, సుకృతమునుబొందు ధర్మంబుచొప్పుదప్పి
వాకవరి చెట్టునాఁ గూలఁ బడును గాన, ధర్మమున జయకోశముల్ దవులనొప్పు.

వ. మఱియు విశీర్ణకవచుని నేను నీవాఁడ ననువానిని కృతాంజలి యగువానిని న్యస్తశస్త్రుని నిగ్రహించియు హింసింపరాదు బలవిజితునితోడం బోర్వానరాదు రాజు రాజుతోడనే పోరుట ధర్మంబు మేర మీఱి క్షత్రియుండు బ్రాహ్మణు నెదిరింపరాదు ధర్మలబ్ధ మైనవిజయంబుకంటె నధికలాభం బొండెద్దియును లేదు రాష్ట్రజనులం బీడించి భుజించురాజు చెడుట కెల్లం గోరుచు నమిత్రులై ప్రతిఘటింతురు ప్రస్ఫీతజనపదుండును సంపన్నుండును సంతుష్టభృత్యసచివుండు నగుపార్థివుండు దృఢమూలుం డగు సుపూజితఋత్విక్పురోహితాచార్యుం డగుజనవల్లభుండు లోకవిదుం డగు నిట్టివృత్తంబుననే మహీనాథు లింద్ర లోకంబు నొందిరి ప్రతర్దనుం డిట్టివిజయంబునం జేసి సర్వసంపత్సమేతుండై ప్రఖ్యాతిం గాంచె దివోదాసుండును భాసిల్లె నాభాగుండు నతిశయిల్లె నిట్లు పురాతనరాజర్షులవృత్తంబు సంప్రస్తుతం బయ్యె ననిన యుధిష్ఠిరుండు 150

మ. అపయానం బగుయుద్ధమందు జనసంహారంబు గావించునా
నృపధర్మంబునకంటెఁ బాపములతో నెక్కొన్నధర్మం బొకం
డు పరీక్షించినఁ గాన రా దని తలంతుర్ ధర్మమూర్తీ! స్వక
ర్మపరీతుం డయి యెట్లు రాజు సుగతిం బ్రాపించునో చెప్పవే. 151

. అనిన దేవవ్రతుం డనియె నిట్టులు శిష్టరక్షణంబున దుష్టశిక్షణమున
యజ్ఞదానతపంబు లాచరించుటను బార్థివుఁడు పాపంబుల నవులఁ ద్రోలు

విజయార్థియై భూతవితతి వేధించిన, వెనుకవారలఁ బ్రోవ మనము సేయు
నుఱుచుధాన్యం బెడ్లనుం గట్టి త్రొక్కించి, తన్నాశనముఁ గోరఁ దలఁపనట్లు
తే. వధ్యులను గూల్చి ప్రజలఁ గాపాడి ప్రాణ,దాతయై సుఖదుండయి ధనదుఁడగుచు
యెల్లక్లేశములం బాపి యెల్లనాఁడు, రాజ్య మేలి నిష్పాపుఁడై పూజ్యుఁడగును.

ఉ. జన్నము లన్నియుక్ సలిపి సాధుసపర్యల నాచరించి య
త్యున్నతవైభవంబున మహోజ్జ్వలరాజ్యరమావిలాసభా
స్వన్నయుఁడై మహీశ్వరుఁ డెసఁగ నిహంబున నెల్లభద్రముల్
మన్ననకై పదంపడి యమర్త్యపదంబున సౌఖ్య మొందెడుక్. 153

సీ. బ్రాహ్మణార్థం బైనప్రథనంబునక్ రాజు, తనయూపముననుండి తాన విడియు
భూరిదక్షిణ గలపో రనుయజ్ఞంబు, నం దొడల్ విడి స్వర్గ మందఁ గలుగు
నరిబాణము లవెన్ని యంగంబులం గ్రుచ్చు, కొను నన్నియేం డ్లందు నునికినొందు
తనమేనినుండి కాఱినవెత్తురుతో నెల్ల, పాతకంబులు పటాపంచ లగును
తే. అనిమొనక్ శస్త్రతాపసహంబె తపము, గా వచింతురు విజ్ఞులు గానశూరుఁ
లగుచు క్షత్రియులఁతిపై నడరక సము,లైనశూరులతోఁ బోరుటది విహితము.

తరువోజ. అనిమొనక్ భీరుఁడై యరుగునరాతి, నలుమరా దెదిరించునతనితోఁ బోరఁ
జనుఁ గేలు మొగిచిన జనుని రక్షింప, స్వాంతం బొనర్చుట సద్ధర్మ మరయఁ
దనవారి విడనాడి తా భీరుఁ డగుచుఁ, దరలి పోయినవాని దరిరావు శుభము
లనియు వేల్పులు వాని కస్వస్తి గలుగు, న ట్లొనర్తు రనియు నార్యవాక్యంబు.
తే. కలనఁ దనవారిఁ గావక తొలఁగితనదు, ప్రాణములఁ గాచుకొననెంచుపార్థివు యమ
భటులు కాష్ఠలోష్ఠంబుల బాదియును గ,టాగ్నిఁ గాల్చియు వేధింతు రంతకపురి.

చ. క్షతములు లేనిదేహము పొసంగ నెసంగెడుక్షత్రియుండు సు
స్థితిఁ గొని పెక్కువర్షములు సెల్లినమీఁదట నైన నింటిలో
సతతము శ్లేష్మమూత్రముల సాల్వడు మేను మునుంగ శయ్యపై
మృతిఁ గొను టొప్ప దంచు వచియింతురు ప్రాజ్ఞులు ధర్మవిజ్ఞతక్. 157

క. వీరుఁ డగుక్షత్రవరునకుఁ, బోరునఁ జా వొప్పుఁ గాని పురమందిరమం
దీరీతిఁ జచ్చు టొప్పదు, ఘోర న్వ్యేస్నినిచావు పుణ్యప్రద మా. 158

వ. అనిన నజాతశత్రుండు రణమరణంబు నొందినవారి కెట్టిలోకంబు లగుం జెప్పు
మనిన నప్పితామహుం డీయర్థంబు తేటపడ నింద్రాంబరీషసంవాదంబు గల
దది చెప్పెద విను మని యి ట్లనియె. 159

—◆ ఇంద్రాంబరీషసంవాదప్రకారము. ◆—

క. నాభాగాత్మజుఁడై మును, భూభాగం బేలి లోకపూజ్యుం డగుచున్
శోభిలినయంబరీషుఁడు, నా భూపతి స్వర్గపురమునకుఁ జని యచటన్. 160

తే. దివ్యతేజోమయవిమానదీప్యమాను, నమరసన్నిభు నిచ్ఛావిహారహారిఁ
దనదుసేనాపతి సుదేవుఁ గని సువిస్మితాత్ముఁడై యింద్రునిం జేరి యనియె నిట్లు.

సీ. సర్వసర్వంసహాచక్రంబు పాలించి, వర్ణాశ్రమములు గావంగఁ దివిరి
బ్రహ్మచర్యము గురువరసేవయుం జేసి, వేదశాస్త్రంబులు వెలయఁ జదివి
నృపధర్మముల నెల్ల నేఁ బ్రత్యహంబును, నతిథులఁ బెతరుల నార్యఋషుల
నన్నపానస్వధాస్వాధ్యాయములఁ గొల్చి, వివిధయజ్ఞంబుల దివిజవరులఁ

తే. దనిపి క్షత్రధర్మంబునఁ దనరి ధర్మ,యుద్ధ మొనరించి విజయంబు నొంది యున్న
నన్ను మించె సుదేవుఁడు మున్నితండు, నాదుసేనాని కారణ మేది చెపుము.

చ. అనవుడు దేవరా జనియె నార్య సుదేవుని చెయ్ది చిట్ట నే
వినుతు నితండు జన్య మనువిస్తృతయజ్ఞ మొనర్చె నందునన్
మునులకుఁ బొందరానిపదముం దగఁ బొందె ననంగ నద్భుతం
బున నగుచిత్తముం దెలమి పొంపిరివోవఁగ నాతఁ డిట్లనున్. 163

మ. చనునాయజ్ఞమునన్ హవిస్సు లెవి యాజ్యం బెద్ది ఋత్విక్కు లే
రనురూపం బగుదక్షిణార్థ మెది యజ్ఞాంగంబు లౌ స్రుక్కు లే
వనిశంబున్ విడనాడకుండెడుసదస్యశ్రేష్ఠు లెవ్వారు నే
విన నెంతు న్వినిపింపు మన్న వెలయన్ విశ్వంభరుం డిట్లనున్. 164

సీ. హయము లధ్వర్యులు హస్తులు ఋత్విజుల్,పరమాంసములు హవిర్వర మసృక్కు
సంస్కృతాజ్యము సదస్యసదుల్ సృగాలకా,కోలగృధ్రాదులు క్రాలుస్రుక్కు
లసిపరశ్వధఖడ్గముసలముద్గరములు, స్రువము లాయతశరప్రవరములు గ
నావేగమున రుధిరాజ్యము హోతిచ్ఛ,టాగ్నులఁ బ్రవహించునదను వాడమ

తే. నవియ పూర్ణాహుతులు దానియగ్రమందుఁ
గొట్టు చంపు మనెడునుడుల్ గొలఁపుశస్త్రతులు
దాయలబలముఖము హవిర్ధాన మిభహ
యాదిసంఘము శ్యేనచితాగ్ని తెలియ. 165

*వ. మఱియు వేనవేలు కబంధంబు లెగిరిపడుప ట్టప్రాశ్రిఖాదిరయూపంబు కుంజర

* త్రేతాంగములు = హస్తిపత్తి తురగశరీరములు,

బృంహితంబు లిడోపహూతంబులు వ్యాఘుష్టతలనాదంబులు వషట్కారంబులు
శంఖపటహదుందుభిధ్వానం బుద్గాతృగణంబు త్రేతాంగత్యాగము మహా
దక్షిణ గా నాచరించునది మహాసంగ్రామయజ్ఞ మందు మృదంగభేరిమండూక
కచ్ఛపయు వీరాస్థిశర్కరయు మాంసశోణితకర్దమయు నసిచర్మప్లవయుఁ గేశ
శైవాలశాద్వలయు ఛిన్నాశ్వరథనాగకృతసంక్రమయుఁ బతాకాధ్వజ వానీ
రయు హతవారణవాహినియు శోణితోదకయు హతనాగమహానక్రయుఁ
బరలోకవహయు ఋష్టిఖడ్గమహానౌకయు గృధ్రకంకబలప్లవయుఁ బురుషా
దానుచరితయు నగుమహానది నవభృథస్నానంబు సంప్రకీర్తితం బాయజ్ఞంబున
నవభృథస్నానంబు గావించినయోధుండు నారకవ్యథ లెఱుంగక నాకలో
కంబున మహానందం బనుభవించు నిట్టిరణయజ్ఞంబు నీసేనాని యగునీసుదేవుండు
గావించె నందు బాలవృద్ధస్త్రీలను దృణపూర్ణముఖులను శరణన్నవారిని
భంజింపక పేరు గలవారి నెదిరించినవారిం ద్రుంచి పుణ్యలోకంబులం బొందు
నేను జంభ వృత్ర బల పాక విరోచన నముచి ప్రహ్లాద శంబర విప్రచిత్తి
ప్రభృతుల నిర్జించి దేవాధిపుండ నైతి నీసుదేవుండు చేసినచేఁతయుం జెప్పెద
వినుము. 166

క. శతశృంగుం డనుదానవు, సుతులు సదమ విదమ దములు శూరత్వమునన్
జతురంగబలసహితు లయి, మితి మీఱి నినుం జయించు మెయి నుద్ధతులై.

మ. ధరణీచక్రము దద్దఱిల్లుగతి నుద్దామక్రియారంభులై
గురుసైన్యంబులతో భవత్పురము గగ్గో ల్వొట్టగా ముట్టి సం
గరముం జేయఁగ మోహరించుటయుఁ దత్కార్యం బవార్యంబ యై
పరికింపం దగి యుంట నీ వెఱిఁగి యీభవ్యాత్మునిం బుచ్చుచున్. 168

క. అరిసేన చుట్టుముట్టిం, బురమెల్లం బెగ్గడిలఁగఁ బోవు సుదేవా!
గురుబలముతోడ నీ వ, య్యరిఁ బోరం జనుము విజయ మటఁ గొని రమ్మా.

మహాస్ర. జయముం గైకోక నీ వాసమరమున భయస్వాంతత న్నాఱుమోమై
కుయి వెట్టం లోకులెల్లం గొదుగక చనుదేఁ గోలుపో దింతలో నీ
మెయి నంచున్ నీవు పల్కన్ మెయికొని యితఁ డా మేలు మే లంచు వీడ్కో
లయినంతన్ గూఢచారుం డన విని రిపుసైన్యాతిశాయిత్వ మెల్లన్. 170

ఉత్సాహము. దాయవాతఁ బెట్ట నేలఁ దడమఁ కడిమి మెఱయ నేఁ
బోయి నే నొకండ గెల్వఁ బోలు ననుచుఁ దలఁచి ని

శ్ఛాయకుఁ డయి ప్రేతభూమి చక్కటిం బురారి లో
డాయఁ జేసికొనుచుఁ గొలిచె తవతవల్ జనింపఁగన్. 171

పంచ. కటాక్ష మెంతకేని రామి కత్తి దూసి కుత్తుకన్
దటాలునం దెగంగఁ గోసి ధాత్రి కీఁ దలంచులో
జటాధరుండు పొల్చి చాలు చాలు నీదుసాహసం
బిఁకేల చేయ నెంతు వింతలేసి చెయ్వు లొప్పునే. 172

వ. నీ కేను బ్రసన్నుండ నయితి నేమి కావలయుం జెప్పు మనిన నతండు నీచెప్పిన చొప్పునం జెప్పి శత్రుజయోపాయం బెఱింగింపు మనిన నతం డొఁ గాత మని వీని కొక్కదివ్యరథంబును ధనుర్బాణంబులు నిచ్చి నీ వీరథం బధిష్ఠించి శత్రుసంహారంబు గావింపుము కయ్యంపునేలఁ గాలు వెట్టకు మని వరం బనుగ్రహించి చనియె సుదేవుండు దేవదేవప్రసాదితదివ్యరథం బెక్కి మొక్కలీఁడై పోయి దానవసేనం జొచ్చి విచ్చలవిడి విహరించుచు నించుకలోఁ గొంచ కరిబలం బెల్ల పీన్గుపెంటం గావించి సదముదముల సదముదంబు గావింప విదముండు గండుమిగిలి వీఁకం దాఁకు దెంచి. 173

స్రగ్ధర. జ్యాఘోషం బెల్లచోటన్ శ్రవణకుహరసంస్ఫోటితంబై చెలంగన్
మాఘూదిత్యుండు నాఁగన్ మటమటమనుచు న్మండుచున్ గాండపజ్క్తిన్
మోఘంబై పోనిరీతిన్ మొనసి పయిపయిన్ మున్గ నేయన్ సుదేవుం
డాఘాటం బింతలే నట్లఱిమి తఱిమి బాణౌఘముం బర్వఁ జేసెన్. 174

శా. దైత్యవ్రాతముఁ బాఱఁ దోలుచును దే ద్దైవస్థితిం డిగ్గి సం
స్తుత్యర్ష్యం బగుచంద్రహాసమున శత్రువ్రాతము న్వ్రేయుచున్
బ్రత్యాసన్నతఁ జేర్చి యార్చువిదముం బైకొంచుఁ దాఁకన్ శిరం
బత్యుగ్రంబుగ నంతలో నతఁడు వ్రేయం జాలె ఖడ్గంబునన్. 175

వ. ఇట్లు శత్రుసైన్యంబు దైన్యంబు నొందించి సదమాదుల మ్రందించి విదముని చేతిహేతిం దెగినసుదేవుం డిట్లు వీరస్వర్గంబు నొంద నర్హుం డయ్యె నని యింద్రుం డంబరీషునకుం జెప్పె నని చెప్పి దేవవ్రతుండు వెండియు. 176

క. మును మైథిలుండు జనకుఁడు, తనకుఁ బ్రతర్దనున కైనదారుణసమరం
బున నిజయోధులకుం బెం, పును జూపుచుఁ బలికె స్వర్గమును నరకంబున్.

క. వెఱ పుడిగి రణముఖంబునఁ, గఱకరియై పగఱ నఱిమి కడ తేరినవా
రఱిమఱి లేనితెఱంగున, నెఱిఁగలయాస్వర్గమందు నిలుతురు సుఖులై. 178

ఆ. సర్వకామములను సమకూర్చు నిద్ది గం,ధర్వకన్యకాజన ప్రకీర్ణ
మురుసుఖప్రదంబు సుత్తమోత్తమము స్వ, ర్గపుర మధికపుణ్యకల్పితంబు. 179

క. వెన్నిచ్చి యనికి వెలియై, సన్నకసనఁ బాఱుభీరుజనునకు నరకం
బున్నతి నెడఁ గలిగెడు నది, బన్నములకు నెలవు దుఃఖభరితము తలఁపన్.

ఆ. కాందిశీకుఁ డైనకట్టిఁడి కపకీర్తి, శాశ్వతంబ యగుచు జగతి నిలుచు
నరకబాధ లందినయనంతరము వాని, కధమయోనిపతన మగును జూండి. 181

వ. అని చూపి చెప్పిన నప్పదాతివర్గంబు తెంపు సొంపిరివోవ రణాజిరంబున నరి
వీరులం జించి చెండాడి భూపతికి ముదం బాపాదించి రది గావున నాత్మవంతుం
డగువాఁడు సంగ్రామరంగంబునం జొచ్చి విచ్చలవిడి విహరించి పరసైన్యంబుల
దైన్యంబు నొందించి విజయంబును విశాలయశంబునుం బొంది శాశ్వతపుణ్యా
లోకంబులం బొందుపడుం గావున శూరుండు సన్మానార్హుం డని చెప్పిన విని
కుంతీనందనుండు గంగానందనుం గాంచి జయార్థి యగురాజు సైన్యంబుల
నెట్టిధర్మంబున నడపింప నొప్పు నెఱింగింపు మనిన దేవవ్రతుం డి ట్లనియె. 182

## యుద్ధకాలనిరూపణాద్యుపాయప్రకారము.

సీ. తనదుధర్మము సత్యమున నని యుపపత్తి, ననియు సదాచారమున నని మఱిఁ
యునున్యాయమునననియునుబలువిధములఁ, దలఁచుచుందురుపాయధర్మములను
సిద్ధార్థముల నెల్లఁ జెప్పెద వినుము ని, ర్మర్యాదు లగుచు శాత్రవులు దస్యు
ధర్ము లైన న్వారిఁ దరలించి కార్యసి, ద్ధిని నుపాయంబునఁ గొనఁగ వలయు

తే. నరుల ఋజువక్రగతులచొప్పరసి వక్రు, పట్ల నికృతిని భేదమున్ బరఁగఁ జేసి
గెలుపుఁ గొను టది పార్థివతిలకునకు న, ధర్మ మని చెప్పఁ బో రెట్టిధార్మికులును.

వ. కావున శత్రుజయంబున ననేకసాధనంబులు సమకూర్చుకొన వలయుం జెప్పెద
నవధరింపుము. 184

సీ. అజగర గో వృష గజ శల్య చమర గో,ధాది చర్మముల లోహములఁ గవచ
ములుగూర్చుకొని పీతములుసితములులోహి, తములుశస్త్రమ్ములు నమరుచుకొని
శ్వేతరక్తారుణపీతపతాకలు, కేతువుల్ పెక్కులు ప్రీతి నెత్తి
ఫలకముల్ చర్మముల్ బహుపరశ్వథఖడ్గ, ముసలతోమరముఖ్యములను గూర్చి

తే. యోధు లెల్లరు కృతనిశ్చయులుగ మెలఁగ, సలిపి చతురంగ సేనలుసమకుఱంగఁ
జైత్రమున నైన మార్గశీర్షమున నైన, దండయాత్రకు వెడలుట తగు నృపతికి.

తరు. ఆమ్నాసములయందు నధికశీతంబు, నత్యుష్ణమును లేక యతిసౌఖ్యదాయి

రై మహీమండలం బంబుసమేత, మై పక్వసస్య మై యలరారునప్డు
ధీమంతుఁ డగురాజు ద్విడ్జనబలముఁ, దెలిసి ప్రస్థానంబుఁ దీపింపఁ జేసి
సామంతసహితము సైన్యమున్ నడపి, జయ మందు నరి నోర్చి సమయంబుకలిమి.

చ. అరిపయి దండయాత్ర చనునప్పటిమార్గ మనర్గళప్రచా
రరమణ మంబుమద్వరసరఃకలితంబు తృణాంచితంబునై
పరిసరవేద్యమై పరఁగుఫక్కిక చారవినిర్ణయంబు గా
ధరణిధవుం డెఱింగి తనదండును బుచ్చి జయంబుఁ గాంచెడిన్. 187

సీ. ఏకమార్గము జలావృతము దుర్గమ్మగు, సాహస మొనరింప నగుపథమును
నదివనాభ్యాశమునం దెత్తుగల దయి, యుండ నా దానిని యుద్ధనిపుణు
లగువీరభటు లెప్డు తగిలి కాచుచునుండ, వలయు సేనలుఁ బొంత మెలఁగ నొప్పు
ని ట్లైన పగఱకు నెపు డభేద్యం బయి, రాజరక్షణ మొనర్పంగ నోపు
తే. పరులపై దాడివెడలెడుపట్ల దుర్గ, సన్నిభంబుగ వ్యూహము సంతరించు
కొనిరిపులఁదాఁకినిపుణత్వమునరణంబు,సలిపి జయమందఁగలఁడుక్ష్మాతలవిభుండు.

క. వెనుకొని సప్తమహర్షులు, పొనరఁగ శుక్రుండు వాయువును సూర్యుండున్
చనుచక్కఁ జయ మవశ్యము, జననాథున కమరు ననుచు శాస్త్రము దెలుపున్.

సీ. అడుసునీళ్లను బెంకు లడరక సమమై వి, శాలమై చనుచోట్లు సప్తులకును
మిట్టపల్లములు రొంపియుఁ గోతులును లేక, తను పైనచోట్లు రథమ్ములకును
బోదలును జిఱుచెట్లు నుదకంబులుం గల్గి, చదు నైనచోట్లు గజమ్ములకును
జెట్టుచేమలు పొదల్ గట్టులు గుట్టలు, మొత్తంబు లగుచోట్లు పత్తులకును
తే. ప్రధనముల నొప్పెడిరథాశ్వబహుళసేన
సుదినములయందు బత్తులున్ మదగజములు
బహుళ మగుసేనవార్షికవాసరముల
నని పొసంగించుటకు నొప్పు ననిరి బుధులు. 190

మ. చతురంగధ్వజినిన్ గణంబులను నీచందంబునం గాలసం
ప్రతిపత్తిన్ విభజించి రిక్కలు తిథుల్ వారంబులున్ వర్జముల్
సతతంబున్ మది లెక్క సేసికొనుచున్ క్ష్మామండలాధీశుఁ డం
చితరీతి న్నడపించి సేనల నరిం జెండాడి మే లందెడున్. 191

ఆ. నిదురపోవువారిని న్వికీర్ణులఁదృషి,తులను వెఱచువారిఁ దూపు విడిన
వారిఁ గుడుచువారిఁ బఱచువారిం జంపఁ, బాడి గాదు ధర్మపరున కాజి. 192

సీ. అనువర్తులు పరంపరాగతుల్ పరిచర్య:సలుపువారు న్నిపుణులు రణమున
వెన్నీనివారలు విభునికై ప్రాణంబు, లర్పింప సంసిద్ధులైనవారు
యోధులుగా నుండ నొప్పువారల గౌరవింపగాఁ జను రాజు వేతనంబు
ద్విగుణీకరించియుఁ దగుమాట లాడియు, నాసనపానాదు లండ నిడియు
తే. నట్టివా రాలముల నోల మూసఁ గొనక, పతికి విజయంబుఁ గూర్తురు వారిలోనఁ
బదుగురకునొక్కఁడధిపతి వారునూర్వు,రకునొకఁడు వారు వేవురకొకఁడువలయు.
క. బలఁగముల కెల్ల నాతఁడు, దళవాయి యనంగఁ బరఁగి తా నెయ్యెడలన్
గలగం బొఱనిమనమున, కలన న్నడపింప వలయుఁ గలసైన్యములన్. 194
చ. నరపతి చెందనాడ కొకనాఁటికిఁ బోటున కోర్చి యెల్లరన్
దుర మొనరింపుఁ డొండొకరుఁ దోడ్పడి పోరుఁడు పాఱుబోఁతులై
మరలినయే నకీర్తి యగు మానసముం గలరై మెలంగుఁ డం
చరమర లేక పల్కుచుఁ బ్రహర్షముఁ గూర్పఁగఁ జెల్లు నాజులన్. 195
మ. ఇటు లుత్తేజముఁ గల్గఁ బల్కి నృపు: డెంతే నెయ్యముం జూపినన్
బటుశౌర్యంబును ధైర్యముం గలిగి వా ర్ప్రాణంబు లాసింప కె
క్కటికయ్యం బొనరించి శాత్రవుల నుగ్రంపశ్యులై నోర్చి యిం
తటిలో నేలికకున్ జయంబు నరచేతం బెట్టఁగా నుం డ్రనిన్. 196
మ. పురుషానీకము లగ్రభాగమునఁ బెంపుం గాంచి డాల్కత్తులం
గరయుగ్మంబునఁ బూని పూనిక మెయిం గ్రాలంగఁ బృష్ఠంబునన్
గరులున్ ఘోటకముల్ రథంబులును సింగారింప వాదిత్రముల్
వరుసన్ మ్రోయఁగ మొగ్గరంబున నరివ్రాతంబు దాఁకం దగున్. 197
ఆ. మిత్రబలము వచ్చి మేళగించెను మన, బలముతోడఁ బగఱు బడలుపడుదు
రెయిదుఁ డెయిదుఁడనుచు నెల్లెడ హర్షధ్వ,నులుపొసంగ నరుమవలయు నరుల.
వ. అని చెప్పిన నప్పాండవాగ్రజుండు యుద్ధవీరు లెట్టిశీలరూపసమారంభములు గలవారుఁ గావలయు సన్నాహం బెట్లుండ వలయు శస్త్రంబుల నెట్టివి శ్రేష్ఠంబులు నెట్టివారు నంగరక్షకు లెఱింగింపు మనినఁగురుపితామహుం డిట్లనియె.

## భీష్ముండు యుద్ధవీరలక్షణంబులు చెప్పుట.

క. భీరువులు కానివారలు, శూరులు శస్త్రాస్త్రసమితి చొప్పడ నసులన్
నేరుపరు లైనజోదులు, పోరుకొనం దగినయట్టిపూరుషు లరయన్. 200
సీ, బలవంత మాభీరబల మెల్లెడం బర్వి, పోరుకోఁ జాలు గాంధారసింధు

సౌవీరులున్ బ్రాసమరజ్ఞు లౌశీనరులు సర్వశస్త్రకుశలులు సత్య
వంతులు ప్రాచ్యులు వారణయుద్ధవిదుర్మదుల్ కూటయోధులును యవన
కాంభోజులు నియుద్ధకౌశలప్రాంచితుల్, దాక్షిణాత్యులు ఖడ్గధారణచణు

తే. లిట్లు ప్రాయికలక్షణాన్వితులఁ గొంద, ఱను వచించితిఁ గన దేశమునకు నొక్క-
గతిఁ గలిగియుండు లెల్లరవిత మెఱింగి, పెనకువం జేసి జయమందఁ జను నృపతికి.

వ. మఱియుం గొన్ని లక్షణంబు లెఱింగించెద వినుము. సింహశార్దూలగతివాజ్నే
త్రులు పారావతకులింగాక్షులు శూరులు ప్రమాథులును మృగస్వరులు ద్వీపి
నేత్రులు ఋషభాక్షులు శీఘ్రగమనులు ప్రమాథులు కింకిణీస్వనులు క్రోధను
లును మేఘస్వనులు కరభసన్నిభులు మహాక్రోధులు జిహ్మనాసాగ్రజిహ్వులు
దూరపాతులు బిడాలకుక్షినయనులు తనుకేశులు చపలవృత్తులు దురాసదు
లును గోధానిమీలితులు మృదుప్రకృతులు తురంగగతినిర్ఘోషులు పారయిష్ణు
వులు వ్యూఢోరస్కులు సుసంస్థితులు కలహంబులకు హర్షింతురు గంభీరా
క్షులు పింగాక్షులు భృకుటీముఖులు నకులాక్షులును శూరులు జిహ్మాక్షులు
ప్రలలాటులు నిర్మాంసహనువులు వజ్రబాహ్వంగుళీచక్రులు సాంపరాయంబులం
జొచ్చి విచ్చలవిడి విహరింతురు వజ్రదీప్తస్ఫుటితకేశాంతులు స్థూలపార్శ్వహనూ
ముఖులు నున్నతాంసులు పృథుగ్రీవులు వికటులు స్థూలపిండకులు పిండశీర్షులు
నతివక్త్రులు పృషదంశముఖులు నుగ్రస్వరులు మన్యుమంతులు నధర్మజ్ఞులు నవ
లిప్తులు రౌద్రప్రదర్శనులు త్యక్తాత్ములు నగువారు యుద్ధవిముఖులు గాక
ప్రాణంబు లాశింపకుండు రట్టిపరివారపరివృతుం డగురాజు రణంబున విజ
యంబు గాంచు ననిన ధర్మనందనుండు జయశీలం బైనసైన్యంబు లక్షణంబు
లెట్లుండుం జెప్పు మనిన దేవవ్రతుం డి ట్లనియె. 202

తే. దైవమది మాఱుపుంతను దగిలియుండ, మానుషము కాలచోదితమై నడచెడుఁ
దఱుల విజ్ఞులు జ్ఞాననేత్రమునఁ జూచి, శాంతికై జపహోమముల్ సలుపుచుంద్రు.

మ. గ్రహచారం బపసవ్యమార్గగతిమైఁ గన్పట్టు నప్పట్టునన్
గ్రహశాంతుల్ పొనరింపఁగా వలయు భూకాంతుండు తత్తద్విధిన్
స్పృహణీయార్థము లందునన్ ఫలసమన్వితంబులై పొల్చుఁ బ్ర
త్యహమున్ వైరము సూపుశాత్రవుఁడు శాంతాత్ముం డగున్ జూడఁగన్.204

## జయాపజయనిమిత్తములు.

సీ. బలమునన్ జోదులు వాహములుత్సాహ,మును గల్గియున్న చోఁ బొనరు విజయ

మనుకూలగతి గాలియును మబ్బులును రవి, రశ్ము లింద్రధనుస్సు గ్రాల మేలు
బకగృధ్రగోమాయువర్గ మనీకిని, కనుకూలగతి నంట నగును సిద్ధి
పొగ లేనివహ్ని యింపుగ దక్షిణావర్త,శిఖలతో వెలిఁగిన సుఖ మెసఁగు
ఆ. హుతము పుణ్యగంధయుతమైన గంభీర,శబ్దమునను దూర్యచయము మెఱయఁ
బగఱ గెలువ నేగుపతికి జయం బగు, ననుచుఁ దెలియఁ బలికి రఖిలబుధులు.
క. నడచెడుసేనకు వెనుకన్, గుడి కెడమం దవిలి మృగము గొబ్బునఁ జనినన్
పుడమిదొర వడయు విజయము, కుడియెడమల భేదమైనఁ గొండొక్క డగున్.
క. అంచలు శతపత్రంబులు, క్రౌంచంబులు శ్రవణపేయగతి మంగళశ
బ్దాంచితము లైన యోధులు, చంచద్గతిఁ గలిగి యున్న జయ మగుఁ బతికిన్.
సీ. పడగలాయుధములు భానుద్యుతులనొప్పఁ, బగఱనోర్చిజయంబు పడయు నృపతి
సౌహృదంబును బొంది సైనికు లన్యోన్య,సఖ్యంబు గల రైన జయము ధ్రువము
స్పర్శగంధములు శబ్దము మనఃప్రియములై, తెలియవచ్చిన గెల్పు గలియవచ్చు
కుడినుండి యెడమకు గ్రద్దపుట్టువులు వేన్, దన్ని పోయిన శుభోదర్కమగును
తే. శుభశకునము లీరీతిని జూడ నైన, యెడలఁ జతురంగసేనల నేకపఱచి
నలఁతియగు నేని దాయపై నడరి దాడి,వెడలి జయమందఁగలఁడ నిఁబుడమి తేఁడు.
క. సామముచేతన పగఱం, భూమీశుఁ డడంచి జయము పొందఁగ నౌ సం
గ్రామమునఁ గొన్న జయ మది, సామాన్య మటంచు ధర్మశాస్త్రమె నుడువున్.
క. బెదరిన మెకములగుంపులు, సెదరినఁ బెనుగండి వడిన చెఱువుజలంబుల్
గదలిన భగ్నంబై దళ, మదవదకై మఱలుకొన్న నాఁగం దరమే. 210
క. రురుచయ మట్టిది సైన్యము, పరచక్రభయంబు తోఁప వచ్చినయేనిన్
బరికింప దొండు ప్రాణముఁ, బరికించుచుఁ బవర మీఁగి పఱచున్ బెలుచన్.
సీ. ఓల మాసింపక యుక్కు మానము దెస, మక్కువయునుఁ గల్గు నొక్కఁ డేని
పెక్కుర వ్రేల్మిడిఁ జక్కడంచెడుఁగుల, పౌరుషేయాదులఁ బాటి చేసి
భీతిదం బగుపోరు భీరువులకు వీర, పురుషుల కుత్సాహకరము కరము
నిజబలోత్సాహము నెఱి మీఱ నారసి, దండయాత్రఁ బొనర్పఁ దగును బతికి
తే. శత్రుశరపీడ్యమానుల సాంత్వనములఁ, దేర్పఁ దగు మాటిమాటికి దేశకాల
గతు లెఱుఁగనొప్పఁ జారులసతముఁ బుచ్చి, యుద్ధవిజయమపేక్షించియున్న తేఁడు.
సీ. క్షమయ సాధువులను సాధువులుగఁ జేయు,క్షమమాణునకు యశంబమరు మిగులఁ
నపరాధమైన నా నృపతిపట్లన్ శత్రు, వర్గము విశ్వాసపరత నుండు

నాచార్యు లగువార లభినుతింతురు క్షమిఁ, గాన క్షమంజేసి మాని కినుక
నియమింప నగుఁ బుత్రునిం బలె శత్రుని, భూతవిద్వేషియై పోవుఁ గ్రోధి
తే. మార్దవంబును జెల్లదు మనుజపతికి, నొచ్చియును నొవ్వఁ బలుకక సచ్చరిత్ర
గలిగి మెలఁగుచు ధర్మసంగ్రామ మైనఁ,దెఱవు దప్పంగ వెన్నిచ్చి పఱవఁ జనదు.
ఆ. భూమి ఫలము నొందఁ గామించు భూపతి, యిట్టిక్రమము దప్ప కెన్నఁడేని
ప్రీతి మెలఁగు నేని భూతహితుం డయి, యిందు నందు సుఖము నొందఁ గలఁడు.
వ. అనిన నజాతశత్రుండు భూకశత్రుండు శత్రువులయెడ నెట్లు ప్రవర్తింప వలయుం జెప్పు మనిన నప్పితామహుండు నీయడిగినయర్థంబు తేటపడ నొక్కయితిహాసంబుగల దాకర్ణింపుము తొల్లి యొక్కనాఁడు వాస్తోష్పతి గీష్పతిం గాంచి నీ వడిగిన ట్లడిగిన నతం డతనికిఁ జెప్పినచొప్పుం జెప్పెద నాలకింపుము. 215

రాజు శత్రువులకడ మెలఁగువిధము.

మ. అరిసంహార మొనర్ప నెంచిననృపుం డవ్వానిపై నొండొకం
డరయం జాలక బాలకుం డొరులపై నల్కం బ్రదర్శించుమా
దిరికిం గాక యొకప్పుడుం గలహముం దెల్లంబు గానీక లోఁ
దిరమై యుండెడుకిన్క నాఁగి కొన నొం దిష్టంబు దృష్టించుచుం. 216
ఆ. విశ్వసింప కెడఁద విశ్వసించినయట్లు, కపటవర్తనమునఁ గానిపించి
శుష్కవైర మరికిఁ జూపి నొరెండించు, కొనక ప్రియము వల్కఁ జనుఁ దఱివడి.
ఉత్సాహ. గూటిపలుక పలికి బోయ గ్రుడ్డుఁగలుగుఁ బట్టిన
ట్లోటిమాట లైన దాయ కింపు వుట్టునట్లు గా
మాటి కాడి నమ్మికం గ్రమంబునం గుదిర్చి పై
పాట వాని నణఁగఁ ద్రొక్క వలయు భూభుజుం డిలన్. 218
ఉ. చీటికి మాటికి న్వితగఁ జివ్వకుఁ ద్రవ్వుచుఁ ద్రెవ్వనట్టిదె
పాటిలువైరముం మదినిఁ బాదుకొనం బొనరించి వైరి నో
నాటఁ బరాభవింపఁ జన దాతఁడు పెంట నడంగునగ్గి నా
దీటుకొనంగ నై కరము తెంపరియై పగఁ దీర్ప నెంచెడున్. 219
తే. పగఱ గెలిచితి మని వారిపట్ల నమ్మి, కలసి మెలసి మెలంగుట కానిమాట
మంత్రవిన్మంత్రిముఖ్యులతంత్రములట,నడువఁ జేయుటలొప్పుసంతతముబతికి.
సీ. పగఱు ప్రమాదము పడియున్న యప్పుడు, తనవారిచే వారిదడములందు

భేదమ్ము గల్పించి భేషజాదులమూలమునఁ బెంపుడుగఁ జేసి చనిన నాళ్లు
వేగిరింపక వైరిఁ బిలుకుమార్పం దగు, సమయంబు చిక్కిన శత్రుఁ బట్టి
గిట్టింప కున్న చోఁ గెరలి యాతఁడు శల్యమై తన్ను వేధించు ననవరతము

తే. అనవధానుని రాజ్యము ఘనతర మయి
యుండియుఁ బ్రవాహవేగము నొందియున్న
ఘనతటాకము వలె నపాయనిభృత మయి
చెడు నని యెఱుంగ వలయు ఱేఁ డెడఁద నెపుడు. 221

చ. పలువురతోడ నొక్కపరి భండనముం బొనరింప రాదు తా
బలము గలాఁడ యైన నృపవర్యుఁడు సామము దాన భేదముల్
సలిపినవెన్క దండము ప్రసంగఁగఁ జేయుట యొప్పు నొక్కనిన్
గెలిచి మఱొక్కనిం గెలువఁ గీల్పడు టుత్తమ మంత్రకోవిదుల్. 222

వ. అనిన నింద్రుండు దుర్జనలక్షణంబు లెట్టివో వారి నెట్లెఱుంగ వలయునో చెప్పు మనిన బృహస్పతి వెండియు. 223

సీ. ఇతరులగుణముల కెడఁద గర్హించుట, యును బరోక్షమున వారిని దెగడుట
కొనియాడఁ దగునితరునిగుణంబులు విన, కుండుట వినియు నిట్టూర్పు లిడుట
పెదవులు విఱుచుట బదులు వలుక కుంట, తల గదలించుట తాలుమాలు
మాటలాడుట కన్ను మాటికిం ద్రిప్పుట, దుష్టలక్షణములై తోఁప వచ్చుఁ

ఆ. దన్నుఁ బోలెఁ బరులఁ దలఁచుచు శయనాస, నాదులందు సమత నరయుచుంట
పెరలప్రీతి తనదు ప్రీతి గా మది నెంచు, నతఁడు మిత్రలక్షణాంచితుండు. 224

వ. అని బృహస్పతి చెప్పినచొప్పునం జేసి దేవేంద్రుండు శత్రుంజయుండై గండు మిగిలె నీవు నట్లుఁ గావింపు మనిన యుధిష్ఠిరుం డమాత్యబాధితుండై యర్థంబులం బొందఁ జాలక విగతకోశదండుం డగుధార్మికుం డెట్లు సుఖంపఁడఁ గలం డెఱింగింపు మనుటయు గంగాసుతుండు క్షేమదర్శియ మను నితిహాసంబు నీయడిగినదాని కుత్తరం బగుఁ జెప్పెద నవధరింపుము. 225

## క్షేమదర్శియ మనునితిహాసము.

సీ. క్షేమదర్శి యనంగ భూమీశ్వరుఁడు తొల్లి, క్షీణబలుం డయి సిలుగు గుడిచి
కాలకవృక్షీయుపాలికిం జని మ్రొక్కి, రాజ్యవిహీనుఁడై పూజ్యత చెడి
నాయట్టిరా జెట్లు నడవంగ నొప్పెడు, బలగంబు సెడె శత్రుబాధ హెచ్చె
క్షుద్రులు సెలరేఁగఁ జొచ్చిరి వ్యాధియు, నాధియుఁ దలసూప నయ్యె నొయ్య

తే. శక్తియు సుఖంబు నర్థము స్వప్నగతము
లట్టు లయ్యె నిట్టియెడఁ భయప్రకంపి
తాంగుఁ డగుపట్ల నేరీతి నైనఁ దొంటి
విభవ మందంగఁ గలుగునో విపులమూర్తి. 226

ఉ. ఏమని విన్నవింతు విబుధేశ్వర నాదునవస్థ నీకడన్
భూమిపతిత్వముం జెడి విభూతికిఁ దప్పి విపత్పరంపరన్
దీమస మేది యుంటి నతిదీనుఁడ నార్తుఁడ నైతి నాపయిం
బ్రేముడి చేసి తెరకొనఁ బెట్టెఁడు మార్గ మొకండు చూపవే. 227

తే. ప్రాణము పరిత్యజించుట వైరినాశ్రయించుటయునీచవృత్తి గావించుటయును
గాక నాయట్టివాఁ డెట్లు గానొనర్చు, శ్రేయ మొందెడుఁ జెప్పుమో క్షితిసురేంద్ర.

వ. అనినం గాలకవృక్షీయుం డిట్లనియె. 229

క. ఈయెల్ల ననిత్యము నా, కేయదియును లేదు తలఁప నే లే ననుచున్
నీయంతరాత్మ నానాఁ, డే యెంచినవాఁడ వైన నిటు కావు గదా. 230

క. ఎది యున్న దని తలంచితి, వది లేదనుకొన్న నింత యలజడిపాటున్
మది కెక్కనీయ కుందువు, కద తెలిసినవార లిట్లు గా రంగదలన్. 231

సీ. అనుభవించినయది యనుభవించెడునది, లే దనుకొన్నచో లేదు వగపు
నీ వేడ్చుటకు లేరు నీ కేడ్చుటకు లేరు, నీతండ్రి యెవ్వఁడో నీవెవండొ
నిను వారు చూడరు నీవు వారిం జూడ, వేరును జుట్టముల్ లేరు నీకు
నాత్మ యొక్కఁడె చుట్టమది నిన్ గదిసి యుండు, దానిఁ గదిసినీవు దనరుటొప్పు

తే. బుద్ధి సన్మిత్ర మగు దానిబుద్ధి వినిన, వాఁడవై నీదుచుట్టమున్ గూడుకొనుము
దానఁ బుట్టుట గిట్టుట లేనివాఁడ, వగుచు నార్తి యెఱుంగక నలరు దనఘ.

క. వినుము నృపా! నేనును నీవును సర్వజగంబు తూలపోలికఁ దిరమై
తనరుచు నుంట పొసంగదు, చనియెద మీనాఁడొ రేపొ చర్చింపంగన్. 233

మ. శతవర్షంబులు పూరుషాయు వనుచున్ శాస్త్రంబు లౌఁ గాని య
మ్మితి సిద్ధం బని నమ్మి యెవ్వఁడును దాల్మిం జేసి కల్మిం గొనన్
మతిఁ గావించుచు నుండ రాదు జను లీమర్త్యంబునం దింతలో
మృతి నొందం గల రెల్ల సంపదల కల్మిం బాసి రాజోత్తమా. 234

క. కావున సిరులకు మోహముఁ, గావింపఁగ రాదు నాది కా దిది యనుచున్
భావింప వలయు వానికి, దేవురుపా టింత లేదు తేఱి మెలంగున్. 235

సీ. ఆగతానాగతయోగములకుఁ గాక, భాగధేయము బలవత్తర మని
పరికించునాతఁడు పండితోత్తముఁ డా,తనికి సమున్నతస్థాన మబ్బు
ననదయుం జీవించు నఖిలార్థములఁ బొందు, రాజ్యపాలనమునఁ బూజ్యుఁ డగును
మతిఁ గలవారు నీమాడ్కి దుఃఖింపరు, దుఃఖము సర్వముం దొలఁచి వైచు
తే. నీవు విద్యాబలంబున నెసక మెసఁగు, దట్లు గావున దుఃఖంబు నవలఁ ద్రోయు
మంత సుఖయింతు వనుటయు నమ్మహీశుఁ, డమ్మునీశున కిట్లను నెమ్మిమీఱ.

క. యాదృచ్ఛికముగ రాజ్యము, నాదాయల కయ్యె నందునన్ జింతింతున్
కాదేని చింత సేయుదు, నే దేహమె దిరముఁ గామి నెఱిఁగి యెఱిఁగియున్.

వ. అనుటయు నతండు వెండియు. 238

సీ. ఎది యెట్లు కాని నెమ్మదిఁ జింత సేయరు, ప్రాజ్ఞు లేయర్థముపట్ల నైన
వచ్చినం బోయిన వారిచిత్తం బొక్క, బాటన యుండు నమ్మేటులకును
నరనాథ! లాభశూన్యం బైనదానికి, నడలక సంప్రాప్త మైనదాన
సంతృప్తి నొందుము సంపదల్ దెగె నంచు, వెతలకై కుందుట వెఱ్ఱితనము
తే. కలిమిలేములు రేయింబవళులు వచ్చి
పోవుచుండెడు నవియ యిబ్బామె తెలుఁగు
పూరుషుం డేది యెట్లైనఁ బొగలఁ బోవఁ
డెల్ల మేలునకే యని యెంచుచుండు. 239

క. ప్రాజ్ఞుఁడ వప్రాజ్ఞునివలెఁ, బ్రజ్ఞ చెడన్ మాటి కిట్లు రాజ్యము గిజ్యం
బాజ్ఞయుఁ జెడె నని దుఃఖా, వజ్ఞత వగ పంది కుంద వర్తిపి తగునే. 240

వ. అర్థంబు లనర్థరూపంబు లవిపోవుట యనర్థంబులు వోవుట యని యెఱుంగు మర్థవంతునిసమారంభంబు లెల్ల వితథంబులు గావున విజ్ఞు లగువా రర్థనాశనంబునకు శోకింపక ధర్మంబు నాశ్రయించి యిహసుఖం బభిలషింపక పరసుఖంబు నభిలషించి ప్రవర్తింతురు ధనలోభపరులు తన్నాశంబున కెంత లెంతల కైనం బాలుపడుదురు ప్రాణంబు లైనం బరిత్యజింతు రాకర్ణింపుము. 241

ఉ. జీవిత మధ్రువం బనుచుఁ జెప్పక చెప్పెదు లోక మెల్ల నే
జీవియు నెల్లకాలము వసింపఁగఁ బో దిట నేఁడొ రేపొ మేన్
వోవు నిజంబు దీనికయి పూరుషుఁ డర్థ మపేక్ష చేసి దు
ర్భావుఁడు నై పరం బెఱుఁగరానిగతిం బడి పోవుఁ బొల్లయై. 242

వ. కావున. 243

ఉ. కాపురుషోచితం బయినఘాతుకవృత్తిఁ బరిత్యజించి దు
ర్వ్యాపక మైనసంపదకు నాస యొనర్పక యైహికార్థముల్
పాపము లంచు నెంచి బెడఁబాసి వనంబునఁ గాలి పుచ్చుచున్
దాపసి యై మెలంగి సుకృతంబునఁ బోవుట లొప్పు దేహికిన్. 244

వ. అని మఱియును. 245

ఆ. అట్లు కాక క్షత్రియాత్ముండ వగుటఁ బౌరుష మొకింత సేయ రూఢ మైన
మనము గలిగితేని వినిపింతు వినుము నీ, రాజ్య మొందఁ జాలురాజనీతి. 246

ఉ. నే వచియించునీతి విని నీ వటు చేసినవాఁడ వేని నీ
భూవలయాధిరాజ్యమును బొంది ప్రభావసమన్వితుండ వై
శేవ నెసంగు దెప్పటికడింది తెఱంగు పొసంగ నన్న నా
భూవరుఁ డమ్మునీంద్రుపదముల్ దల సోఁకఁగ మ్రొక్కి యిట్లనున్. 247

క. పెద్దలతోడిసమాగమ, మెద్దాన నమోఘ మగుచు నేర్పడియెడు యు
ష్మద్దయకుఁ బాత్ర మైతి ల,సద్దోహల మెసఁగఁ దెలుప సమ్మతి యీవే. 248

వ. అనిన నతం డిట్లనియె. 249

మ. భయముం గ్రోధము హర్ష కామములు దంభంబు న్విసర్జించి నీ
వయముం గోరి విదేహవల్లభుని సంప్రార్థించుచున్ మ్రొక్కు మా
నయవిద్వర్యుఁడు నీకు రాజ్య మిడు దానం జేసి నీ వెప్పటిన్
జయమున్ వైభవమున్ యశంబుఁ గొని పూజాభాజనం బౌ దిలన్. 250

వ. అట్లు కా దంటి వేని. 251

చ. సుహృదులఁ జేరి నీదయినశోక మి దంతయు వెళ్లఁ బుచ్చి త
ద్బహుళచమూసమూహములభాగ్యము గల్గినవాఁడ వై సుధీ
స్పృహ ఘనభేదతంత్రమునఁ జేసి రణం బొనరించి శాత్రవు
న్సహపృతనున్ జయించుటకు సంతనకట్టుము గట్టిమోపునన్. 252

క. ఇవి రెండుం జేయఁగఁ జా, లవ యేని వృథా ప్రయత్నలాలసుఁడవు గా
కవని నుపేక్షాపరు లవు, నవు నన శాంతుండ వగుటయ తగు నరేంద్రా. 253

తరు. బలవంతుఁ డగురాజు బలములు గల్గి, ప్రబలయుద్ధము చేసి పగఱ జయించి
కలితకోశాశ్వాదికము గల్గి పెక్కు, క్రతువులు గావించి ఘనతరదాన [సౌఖ్య
ములొనర్చియిహసౌఖ్యములనొంది వెనుక, మఱియుచుంజనిస్వర్గమును బొంది
ముల నెల్లఁ బొందెడు మొనసి భూలోక, ముల నేల నెంచినపురుషుండు వింటె.

వ. ఇత్యాదులు దంభయోగంబులు పెక్కులు గల వవి నీవాచరించి సిద్ధార్థుండ వయ్యెద వనిన నయ్యొడయండు. 255

ఆ. మునివరేణ్య ! నికృతిఁ బూని దంభ మొనర్చి, బ్రదుక నిచ్ఛగించువాఁడఁగా న
ధర్మలబ్ధ మైనధన మొల్ల నానృశం, స్యమున బ్రదుక నెంతు జగతియందు.

వ. అనిన నమ్మునిచంద్రుం డోరాజచంద్రమా ! నీవాక్యంబు లుపపన్నంబులు నీవు బుద్ధిమంతుండవు బహుశ్రుతుండవు నీ వమాత్యపరిత్యాగంబునం జేసి యిట్టి వ్యసనంబు నొందఁ గలిగితివి నీదాయ యగువైదేహుం డుత్తమోత్తముండు నాకత్యంతప్రియుండు నేఁ జెప్పినచొప్పునం జేయ నొప్పువాఁడు మీ కిర్వురకు ననపాయం బగుసంశ్లేషంబు గావించెద నని వానిం దనగృహంబునకుఁ బిలువ నంచి యిట్లనియె. 257

సీ. వైదేహ ! నీ వెట్లు నాదుచిత్తమునకు, నైతివో కౌసల్యుఁ డట్టు లయ్యె
శుద్ధాత్ముఁ డీతఁడు శోధించి తిసుమంత, వృజిన మీతని యెడ వినఁగఁ బడదు
ననుఁ బోలె నీతనిఁ గని సంధి చేయుము, వీని రాజ్యము ధర్మవిధి గెలిచితి
వైన నీతఁడు సుగుణాభరణుఁడు ప్రతి, యుద్ధంబు సేయఁ దా నొప్పఁ డెపుడు

తే. మహిపతికి బుద్ధిమంతుఁ డమాత్యుఁ డొక్కఁ
డుండి మంత్రాంగ మొనరించుచుండు టొప్పు
సుగుణవంతుఁడు ధీమంతుఁ డగునితండు
నీకు నాలోచనము సెప్ప నేర్చు నధిప. 258

తే. జయపరాజయములు గావు శాశ్వతములు
సుకలుఁ డై క్షత్రియుం డొప్పి సొంపు గాంచు
ననిన నాతఁడు మీ చెప్పినట్లు చేయ
నుండెదం గాని వేఱు గా నుండ నెపుడు. 259

వ. అని కౌసల్యునితో సఖ్యంబు వాటించి వానిం దనగృహంబునకుం దోడ్కొని చని పూజించి యతనికిం దనకూఁతు నిచ్చి పెండ్లి చేసి నానావిధరత్నాంబ రాభరణాదులతో వానిరాష్ట్రంబున కంపిపుచ్చి నివ్విధంబున జయపరా జయంబు లొందుట రాజన్యులకుం బరమధర్మం బనిన ధర్మనందనుండు చాతుర్వర్ణ్యధర్మంబులు నాశ్రమధర్మంబులు లోనగునవియు రాజులవృత్తంబును గోశంబును గోశోత్పత్తియు నమాత్యగుణవృత్తియుఁ బ్రకృతివర్ధనంబును షాడ్గుణ్యగుణకల్పనంబును సేనావృత్తియు దుష్టపరిజ్ఞానంబును శిష్టలక్షణంబును

విజిగీషువృత్తంబును నాదేశరూపంబునం జెప్పి నన్నానందింపఁ జేసితివి గణంబులవృత్తి నెఱుంగ నెంచితి భేదింపఁబడక గణంబు లెట్లు వృద్ధి నొందు బహుసంఖ్యాకంబు లగుటం జేసి మంత్రసంవరణం బతిదుర్లభం బని యెంతు నిది యంతయు సవిస్తరంబుగా నెఱింగింపు మనిన గంగానందనుం డతని కిట్లనియె. 260

## గణజనులం బాలించు ప్రకారము.

సీ. *లోభ మమర్షంబు లోఁ దలసూపినఁ గలుగు వైరము కులగణములందు
నందునం జేసి క్షయవ్యయంబుల కయి, యన్యోన్యము నశించు నంత నంతఁ
జారమంత్రాదుల సామదానవిభేద, నాదులఁ బ్రేరేప నవి చెడ నగు
భేదిల్లి సంఘాతవృత్తులు గణములు, నరివశం బగుదాన మరల కున్న
తే. దానసంఘాత యోగము దనరు పొంకు, జతన మొనరింపఁదగుఁ బౌరుషము బలంబు
గణము గలిగిన చేని కెక్కాలమందుఁ, జేకుఱెడు నెల్లయర్థముల్ క్షితితలమున
క. కలఁగఁగ నీయక మన్నన, కలిమిఁ గణములను బోదివి కర్జములందుఁ
వెలితివడ నీయ కీగిం, గలిగించుచునున్న నృపతి గణము లెసంగుఁ. 262
సీ. జ్ఞానవృద్ధులు ప్రశంస యొనర్ప ధర్మిష్ఠులను వ్యవహారంబులం బొసంగ
నిలువరించుచు శాస్త్రనియమముం దప్పని,గతిఁ బరిపాలనక్రమ మెసంగఁ
గడక దప్పిర యేని కొడుకుల నేనియు, నడఁచి వినీతుల నరసికొనుచుఁ
జారమంత్రవిధానసంగతి సమకుఱఁ, బ్రాజ్ఞుల శూరులఁ బ్రజ్ఞకలిమి
తే. నిచ్చ మన్నించి సౌహార్ద మెచ్చికొనఁగఁ,గృచ్ఛ్రములుగల్గుపట్ల మిక్కిలిగ నక్కటికముసూపుచుఁ బుడమియేలిక మెలంగ, నతని గణములు నభివృద్ధినందునధిప.
తే. దండమును క్రోధమును విభేదమును భయము
కర్షణము నిగ్రహావధముల్ గలుగఁ జేసి
గణజనుల నొండుగతి చేఁడు గనిన వారు
పగ ఱగుచు నేగి గూర్తురు వసుమతీశ. 264
సీ. ఆగణముఖ్యులయందు సమాయత్తమై లోకయాత్ర వెంపందుఁ గాన
వారి మన్నించుట ప్రథమ కార్యము ప్రధానులతోడ మంత్రంబు సలుపుటొప్పు
గణముఖ్యులంగూడి గణహితకార్యము,పాదలించి విడకుండఁ బోదువవలయు
నన్యోన్యమును భిన్నమగు నేని గణబద్ధములు నశించు ననర్థములు పొసంగుఁ

* గణజనులు = యుద్ధములందు నైకమత్యముతో నెవ్వరికిని భేదింప రానట్లు బలవత్తరమై ప్రవర్తించు నొకజాతిశూరసమూహము,

తే. గలహ మగుఁ గులములయందుఁ దెలిసి పుడమి
ఱేఁడు మెలఁకువ గలిగి యేనాఁడు నేర్పు
పెంపునన్ గులగణముల భేదబుద్ధి
పుట్ట నీకుండఁ జేయుట పోలు నధిప. 265

వ. అనిన ధర్మనందనుండు ధర్మపథంబు బహుశాఖం బై యుండు నందు గరీయం బెద్ది దేని ననుష్ఠించి జనుం డిహపరంబుల సుఖంబు నొందు నెఱింగింపు మనిన సురనదీనందనుం డి ట్లనియె. 266

భీష్ముఁడు ధర్మసూక్ష్మత తెఱం గెఱింగించుట.

సీ. తలిదండ్రులన్ గురువుల భక్తిఁ గొలుచుచు, వారిపనుల్ గొఱవడఁగ నీక
నడపుచు వారలనుడులందు నిలుచుట, ధర్మములన్ ముఖ్యధర్మ మరయ
మూఁడులోకంబులు మూఁ డాశ్రమంబులు, మువ్వురు దేవతల్ మూఁడు వహ్ను
లా మువ్వు రే తండ్రి యగు గార్హపత్యాగ్ని, తల్లి దక్షిణవహ్ని తనగురుండు
తే. వెలయు నాహవనీయాగ్ని వీరిలోనఁ, దల్లివృత్తి నీలోకము దండ్రివృత్తి
నవలిలోకము గురువృత్తి నమలమైన, బ్రహ్మలోకము నుజయించుఁ బంచజనుఁడు.

చ. గురువులు వారు వారలను గొంచెము సేయక దూర కెప్పుడున్
గురువులు వారుభక్తిఁ గొని కొల్చెడువారికి భూరిభావుకం
బురుతరపుణ్యమున్ యశము నుత్తమలోకము నొంద నయ్యెడిన్
ధరణి సమస్తధర్మములు తద్గురుసేవకు మించ వెంచఁగన్. 263

క. వారల మువ్వురఁ గొలిచిన, పూరుషులకు మూఁడులోకముల విజయమ్మున్
భూరిసుఖ మ్మగుఁ గొల్వని, వారలకు ఫలింప వెట్టివరకార్యములున్. 269

క. నే నా మువ్వురఁ గొల్చిన, దాన శతగుణాధికంబు తత్సుకృతం బై
మానొందు నుత్తమంబులు, మానితలోకములు నాకు మానవనాథా. 270

సీ. పదిమడుంగులు పెచ్చువచ్చు శ్రోత్రియునకా, చార్యుఁ డాచార్యునకార్యుఁడగును
పాధ్యాయుఁ డన్ని రె ట్లాతని కన్ని రె, ట్లతిశయించును దండ్రి యతనికంటె
నన్నిమడుంగులు కన్నతల్లి గురుత్వమునఁ బెద్ద పుడమినిం బోలు నామె
కెన యైనగురువు లేఁ డని చెప్పుదురు తల్లి, దండ్రులకంటెను దలఁప గురువు
తే. పెద్ద యని నేఁ దలంచెద నిద్దఱు జను, జన్మకారణమాత్రు లాచార్యుఁ డెపుడు
చావు పుట్టువు లేనివిజ్ఞాన మిచ్చి, బ్రహ్మసాయుజ్య మొసఁగించుఁ బ్రజ్ఞకలిమి. 272

వ. ఎది యెట్టిద యైనను.

క. గురువులు మువ్వురు వారల, పరిచర్య యొనర్చి భక్తి భజియింపనిచో
దురితమునఁ బోవు మనుజుం, డరిముఱి సుకృతం బొనర్చినట్టిం డైనన్. 273

మత్త. తల్లిఁ గొల్చుట ధాత్రిఁ గొల్చుట తండ్రిఁ గొల్చుట ధాతృప
త్పల్లవంబులఁ గొల్చుటల్ గురువర్యుఁ గొల్చుట బ్రహ్మముం
దెల్లఁ గాఁగ భజించుటల్ జగతి న్మనుష్యున కెత్తఱిన్
దల్లిదండ్రులకంటెఁ బూజ్యతఁ దాల్చుదేశికుఁ డారయన్. 274

సీ. గురులఁ గొల్చిన ఋషుల్ సురలును బితరులుఁ, బ్రీతులై యిత్తురు శ్రేయములను
బూజ్యతములు వారు పొలుపఱి వారల, కవమాన మొనరించునట్టిజనుఁడు
భ్రూణహత్యకు మించిపోవుపాపము నందు, వానికంటె మఱొండు పాపి లేఁడు
గురుఘాతికిని గృతఘ్నునకు స్త్రీఘ్నునకు మిత్రహునకు నిష్కృతి ధరణి లేదు

తే. ధర్మనందన! ధర్మసంతతుల నెల్ల, నరసి యిట్లు వచించితి నతులితంబు
ధర్మ మనుటయు సత్యానృతములపట్ల, ధర్మపరుఁ డెట్లు మెలఁగిభద్రంబులొందు.

వ. సత్యానృతంబులు లోకంబుల నాశ్రయించి యున్నవి వానిపట్ల మనుష్యుం డెట్లు ప్రవర్తింప వలయు ధర్మం బెట్లుండు సత్య మెద్ది యసత్య మెద్ది సనాతన ధర్మంబెద్ది సత్య మెప్పుడు పలుక నగు నసత్య మెప్పుడు పలుక నగుం జెప్ప నను గ్రహింపుమని ధర్మరా జడిగిన భీష్ముం డి ట్లనియె. 276

### పాపపుణ్యవివేకము.

సీ. సత్య మసత్యంబు సాధుతయును నసాధుతయు నొందును దఱుల్ దొడరినపుడు
సత్య మెప్పుడు పల్కఁ జను నసత్యం బెప్డు, పలుకఁ జనుం దానిఁ దెలియవినుము
సత్య మసత్య మసత్యంబు సత్య మౌఁ, గావున సత్యమే గాదు పలుక
ననృతంబు వలికియు నఘము లొందఁడు నరుం, డట్టికాలము లెద నరయ వలయు

తే. భూతహింస గాకుంటకే పుట్టె ధర్మ, మపు డధర్మము ధర్మమై యతిశయించు
హింస యగుపట్ల ధర్మ మెంతే నధర్మ, మగును సత్య మసత్య మిప్పగిది వింటె.

సీ. ధన మిత్తు దుష్టున కని యీయ కున్నచోఁ, దప్పు నాఁబడ దసత్యంబు నట్లె
ఖలుబాఱిఁ బడి బొంకి తొలఁగుట తప్పు గా, దార్యసంరక్షణమందు నట్లె
ప్రాణాత్యయమున వివాహంబునందును, ననృత మాడిన సత్య మట్ల యగును
ధర్మంబు రక్షించుదానికి బొంకియు, సత్యవాదిఫలంబు జనుఁడు పొందు

తే. నికృతిజీవనుఁడయ్యుఁ బ్రాణితతిహింస, సలుపువాని సర్వోపాయములను బూని
చంపఁ జెల్లును దాన లేశంబు పాప, మంట కుంటయు కాదు పుణ్యంబు వచ్చు.

క. పితృదేవర్షి జనంబుల, సతతము సేవింపనట్టిజనుఁడు మృతప్రా
యత నొంది డిందుఁ దత్స్వంగతి సెల్లదు జనుల కెట్టికష్టములందున్. 279

క. నమ్మించి మోస చేసెడు, నమ్మనుజుఁడు చచ్చి కాక మై గృధ్రం బై
యిమ్మహిఁ వెండియుఁ బుట్టియు, ముమ్మాటికిఁ బాపి యగుచుఁ బొలుపఱి పోవున్.

ఆ. ఎవ్వఁ డెవనిపట్ల నేరీతి వర్తించు, నాతఁ డతనిపట్ల నట్టిరీతి
జనఁగ నొప్పు మాయకుని మాయచే మంచివాని మంచిచేత వలయు నరయ.

తే. నీచుఁడు బలాకుఁడను వ్యాధుఁ డేచి ప్రాణి, హింస సేయుచు నొకచీఁకు నెఱిఁగి చంపి
పుణ్య మందె గంగాతీరమునను బాము, గ్రుడ్డఁ జంపినగూబయుఁ గొనియె సుగతి.

పాపనిస్తరణప్రకారము.

వ. అనినం గౌంతేయాగ్రజుం డెట్టివారు పాపదుర్గంబుల నిస్తరింప నేర్తు రెఱిం
గింపు మనిన దేవవ్రతుండు. 283

సీ. వర్ణాశ్రమాచారవర్తులు సంయతాత్ములు దంభశూన్యులు సలలితాత్ము
లతిథిఁ బూజించెడునట్టిరు విషయము,లను జిక్కకుండెడుఘనులు నడుగ
నిచ్చువారలు పరుల్ హింసింప హింసింప,నట్టి రేమన్న మా ఱనని వారు
ననసూయకులు సదా స్వాధ్యాయశీలురు, ధర్మకోవిదులు మాతరపితరులఁ

తే. గొలుచువారు పవల్ నిద్రఁ గొననివారు, భూతహింస గావింపనిపురుషు లగ్ని
హోత్రపరు లన్యకాంతల నొందకుండు,వారు సత్యము పలికెడువారు మఱియు.

సీ. ఓల మాసింపక యుద్ధములం ధర్మ, విజయ మాకాంక్షించువీరవరులు
కుహకార్థధర్మముల్ గోరనివారు త, పోనిష్ఠు లగువారు పుణ్యరతులు
శాంతరజస్తముల్ శాంతులు వేదవ్ర,తస్నాతు లమలసత్వస్థితులును
బరధనంబుల కాసపడనివా రాత్మస,మముగ లోకముఁ గాంచుమాన్యగతులు

తే. గ్రామ్యధర్మనివృత్తులు సౌమ్యమతులు, సర్వదేవసముల్ తిథిశ్రాద్ధరతులు
శాంతులును శ్రద్ధధానులు సాధుజనులు, మద్యమాంసవివర్జితుల్ మానధనులు.

తే. యాత్రకై భోజనము చేయునట్టివారు, సంతతికి మైథునంబును సలుపువారు
సకలభూతేశభక్తులై చనెడువారు, కఠినదుర్గంబులన్ దాటఁ గలరు సువ్వె.

చ. జగముల కాదికర్త యయి సంతతరక్షకుఁ డై సుహృత్తు నై
యగణితసత్వభావమున నంతయుఁ బూని భరించువాఁ డయై
తగి సకలప్రపంచమునఁ దా నయి వెల్గెడువాసుదేవునిం
దగిలినభక్తు లింతటన తార తరించెద రెల్లదుర్గముల్. 287

క. ఈదుర్గతరణకథనము, భూదేవసమక్షమందుఁ బొలుపుగ వినినన్
గా దనక యెల్లదుర్గము, లీదెస నాదెసఁ దరింతు రెల్లరు వింటే. 288

వ. అని చెప్పిన నప్పూరువంశేశ్వరుం డప్పితామహునిదిక్కు మొగంబై యి
ట్లనియె. 289

క. యోగ్యులయోగ్యులకరణిన, యోగ్యులు యోగ్యులవడువున నొప్పెద రిల నా
యోగ్యాయోగ్యవిధం బె,భాగ్యంబున మా కెఱుంగ వచ్చుం జెపుమా.

తే. అనుడు మందాకినీసూనుఁ డనియె నిట్లు, తెల్లమై యేతదర్థము తేటపడఁగ
వ్యాఘ్రగోమాయుసంవాదమనుపురాత, నేతిహాసముగలదు నీ వెఱిఁగికొనుము.

## వ్యాఘ్రగోమాయుసంవాదము.

చ. పురిక యనంగఁ బేర్వడినపూర్వర మొప్పెడుఁ బూరికుండు నాఁ
బరఁగెడు రాజొకం డపుడు ప్రాణిభయంకరుఁ డుగ్రకర్ముఁడున్
దురితరతుండు నై ప్రబలె దుర్జనుఁ డాతఁడు సచ్చి నక్క యై
ధరపయి వెండియుం బొడమెఁ దార్కొనియుండఁ బురాభవస్మృతుల్. 292

మ. తొలుతం జేసినకర్మసంగతులకుం దోట్రిల్లి నిర్వేదము
న్గలదై యొండులు తెచ్చి యిచ్చినను వేడ్కం జేసి తా నెప్పుడుం
బలలంబు న్మెసవంగఁ బోక ఫలముల్ పత్రంబులున్ రాల నాఁ
కలికిన్ మెక్కుచు హింస లేక వ్రతముం గైకొంచు వర్తించుచున్. 293

క. డొంకల దోరియల మెలఁగఁగ, నంకిలి గలదై శ్మశాన మగు నని యచటన్
శంకాతంకము లెఱుఁగక, సంకట మెది లేక నక్క సతము వసించున్. 294

క. తనజాతిసృగాలము లా,పనులకు మది రోసి పెక్కుభంగుల నిష్ఠన్
జనుదానిబుద్ధి కలఁగం, బొనరిచె నెన్నే నుపాయములు దినదినమున్. 295

వ. అవి యన్నియు నొక్కనాఁ డగ్గోమాయువు కడకుం జని యి ట్లనియె. 296

చ. ఒలుకులమెట్ట బెట్టిదము నుగ్రము నీ విది పెద్దఁ జేసి యి
త్తలమున రేఁబవల్ విడక తాండవ మాడుదు మాంసభుక్కువై
వెలసిననీ కిట న్నిలువ విప్రతిపత్తికి హేతుభూత మౌఁ
గోల మగునట్లు నీ వగుము కొంకక యిచ్చెద మిష్టభోజ్యముల్. 297

వ. నీ వీమూఢవ్రతంబు విడువుము మాతోడం గలసి మెలసి మెలంగు మనిన
వాని కగ్గోమాయు వి ట్లనియె. 298

క. పితృవసతి నాసమాధికిఁ, బ్రతిబంధక మనఁగ రాదు వ్రత మిట ఫలదం

బితరముల నొల్ల భక్షణ,రతులకు మీ కొందుచోట్లు రమణీయము లా. 299

తే. లోభమోహితులై మీరు లోఁ దలంపఁ,బోక దోషము లిహపరములకు వెలిగ
మెలఁగ నెంతురుమీవృత్తి మెచ్చనేను, నా కయినరీతినుండెదనడువుఁడయ్య.

వ. అని ప్రత్యాఖ్యానంబు చేసె నంతఁ గొంత కాలంబున కా ప్రజ్ఞానిధి యగుజంబు
కంబు వృత్తాంతము విని విఖ్యాతవిక్రమం బగునొక్క శార్దూలంబు దానికడకు
వచ్చి తత్సాచివ్యంబు వడయ నెంచి పూజించి యి ట్లనియె. 301

మ త్త. సౌమ్యరూపుఁడ వీవు నీదగుసఖ్యముం గలిగించు కో
స్వామ్యమాత్యవిభేద మింతయు సల్ప కే నిటు వచ్చితిఁ
రమ్యభోగము లెన్నియేనియుఁ గ్రాలు లెంకలు పెక్కు లీ
భూమ్యధీశుఁడ నేను నాకడఁ బొల్చి కాలము పుచ్చుమా. 302

క. క్రూరులము మే మనంగాఁ, బే రొందితి మట్టివేరు పిఱుదికిఁ బోవం
గారుణ్యంబున నుపదే, శారూఢిఁ దిద్దు మంత్రి వగుము మహాత్మా. 303

వ. అనిన నవ్వాక్యంబులు మన్నించి మాననీయం బగునగ్గోమాయువు వ్యాఘ్రం
బున కి ట్లనియె. 304

సీ. మృగరాజ సదృశంబు లగువాక్యములు వల్కి, తహాహధర్మార్థసంగ్రహము లెస్స
ధనలోభి యగువాఁడు తద్బోధ మొనరింప, నేరఁడు ప్రాజ్ఞని నెమకు టొప్పు
వానిఁ దండ్రిం బోలె వలయుఁబూజించి కొ,ల్వఁగ ననుఁ గోరి తేఁదగుదుననుచు
నిసుమంత సంతోష మేని నా కొదవదు, సుఖభోగముల కేను జొక్కి కొనను

తే. నీకు నుపదేశ మొనరింప నే నమాత్య,పదము నందిననాశీల మది యెఱుంగ
నట్టిరై పూర్వభృత్యులు చెట్ట లగుచు,నీకు నాకుఁ బొరల్ పుట్టనేతు రధిప.305

తే. సత్స్వభావము యోగ్యత సాధువృత్తి, పరఁగి యుండినవా రైనఁ బరులసంశ్ర
యము దలంపఁగ శ్లాఘనీయంబు గాదు, దాన నాశ్రితునకుఁ జేటు కానవచ్చు.

తే. తెలివి గలవాఁడ వైనను దీర్ఘదర్శి,వైన నుత్సాహవంతుఁడ వైన భోగ
ములను దూఁగుచు నుండినఁ బొరలు వడినఁ,గీడునకు నైఁప నోపనివాఁడ నేను.

క. వనమున స్వచ్ఛందగతిఁ, బొనరించెడువాఁడ నేవపోలు పెఱుఁగనివాఁ
డను నే నీవు మృగేంద్రుఁడ,వనఘా! సాచివ్య మెట్లు లను వగు నాకుఁ. 308

సీ. రాజాశ్రయముఁ గోరుభూజనునకు భయం, బెన్నఁటికే నున్న దే తలంప
నటవి మూలఫలాశి యై యున్న వాని కే, తొడుసును లేదు సంతుష్టి గలుగు
వనవాసివ్రతచర్య వఱలు సంగము లేమి, రాజసంగమునఁ దద్వ్రతము చెడును

భయముతోఁ గూడినపక్వాన్నముకంటెను, వెఱ లేనిగంజియే నెఱి నెసంగు

తే. నెచట నిర్వృతియగునది యేసుఖంబు, నేను నీమైత్రిఁ గోనియున్న నీదుభృత్యు
లలుకఁ బగ చేసి యపరాధములనుబన్ని, వెఱవుమై నాకు వెతఁగూర్పవేతురనఘ

వ. మృగరాజ వగునీకోర్కి వమ్ము సేయను సమ్మతింపను నీవు నాసాచివ్యం బపే
క్షింతువయేని నీమూలభృత్యులమాటలు పాటింప కుండునట్లు సమయంబు సలి
చితి వేని నీకు హితోపదేశంబు చేయుచుందు ననిన శార్దూలం బట్ల యగుఁ
గాత మని సమయంబు చేసి గోమాయువుం దోడుకొని పోయి తనయింటం
బెట్టుకొని గౌరవించి దానియుపదేశంబునం బ్రవర్తించుచుండె నంతఁ గొంత
కాలంబునకు. 310

క. పులిపూర్వభృత్యు లెల్లను, బులిచెలిమిం జేసి సర్వమునకుం దానై
మెలఁగెడునక్కం గని మనములఁ గినుకం జేసి కపటమున మైత్రికి నై. 311

ఉ. నక్కకనుగ్రహం బెసఁగ నాఁటికి నాఁటికిఁ దియ్యమాటలున్
మిక్కిలిమక్కువల్ నెఱయ మీఁదికి మిత్రులయట్లు మెట్టుచున్
బ్రక్కన చేరి తద్వచనపద్ధతుల న్నడయాడి మైత్రి పెం
పక్కటికంబు దాని కగునట్టులు చేసిరి దోసకారులై. 312

క. గోమాయు వెఱిఁగి యెఱుఁగని, దై మాయకు మాయ సేయునది గాక కడుం
బ్రేముడి వారలఁ జూచెన్, స్వామిపయిం గలుగుభక్తి సమవేతముగన్. 313

ఆ. ఎఱచి తెచ్చి వార లిచ్చియు బహువిధక్రీడలందు బుద్ధి కూడఁ గఱపి
యును గలంపఁ దలఁచినను బ్రాజ్ఞ మగుజంబుకము చలింప దెట్టి కఱతలకును.

మత్త. అంత నక్క వినాశనంబున కాత్మఁ గోరుచు భృత్యు లా
వంతయేనియు సంశయింపక వ్యాఘ్రరాజము భుక్తికిన్
సంతరించినమాంస మంతయు నందు వేచి హరించి యొ
ట్లింతయుం గనకుండ దాఁచి రొకింత నక్కగృహంబునన్. 315

వ. అనంతరంబ. 316

ఉ. ఆఁకలిఁ గొన్న కోలుపులి యట్టిటు మెట్టుచు భోజనార్థ మా
లోకము సేయుచుం దనదులోఁగిలి నెందును గాన రామికిన్
వీఁకఁ దగుల్గొనన్ భటులఁ బిల్చి భయంబఱ యుంటి రీరు నా
కేకడఁ భోజనం బిడి రెదీ కన వచ్చుట లేదు కాంచఁగన్. 317

వ. అనిన నాభృత్యవర్గంబు. 318

క. ఇంతకు మును మీభుక్తిని, సంతన గావించి యిచట సంస్కృతపలలం
బెంతయు భక్తిం బెట్టితి, మింతటిలో నేమి యయ్యె నెఱుఁగము దేవా. 319

తే. చోరులు హరించి రింతె మా నేరమిందు, సుంతయేనియు లేద యిూప్రాంతభూము
లరయఁబుచ్చుము నావుడు వ్యాఘ్రమలిగి, తెలియుఁడాదొంగఁబట్టిపథింతునిపుడ.

వ. అని యానతిచ్చిన నక్కపటభృత్యులు నలుగడ నెమకినట్లు నెమకి నక్కయున్న యిక్కవలోనికిం జని యందొక్కగొంది సంస్కృతం బైనశార్దూలాహారంబుఁ జూచి తమయేలికకుం జూపి యిట్లనిరి. 321

ఉ. అక్కట! వంచనానిపుణ మైవ్రత ముండినయట్ల యుండి నీ
చక్కి గురుత్వముం బడసి సర్వమునందును దాన యైనయీ
నక్క భవత్పదార్థము క్షణంబున నిట్లు హరించెఁ జూచితే
యెక్కడి నైష్ఠికత్వమొ యి దెక్కడిసఖ్యమొ నీకు దీనికిన్. 322

శా. కాపట్యంబున మోసగించి నిను లోకం బట్టె బెట్టాడుకో
నీపట్లన్ సచివత్వ మొందినగతిన్ హేమించె నన్నింట నీ
వేపాపంబు నెఱుంగ లేనివెడఁ గై తేమందు నీచందమున్
మాపాడం గుణపంబులం దినుమృగంబా మూను మాంసాదృతిన్. 323

క. చాలుఁ బురేమే లయ్యె నిఁ, కేలా మీసచివుమాట లిటఁ దార్కాణం
బై లగ్గ యయ్యె నెల్లర, కాలోచించితివె చౌర్య మనవో దీనిన్. 324

వ. అనిన విని శార్దూలంబు బేలయై భృత్యకపటోపాయం బారయ నోపక కోపాటోపంబున విజ్ఞానఖని యగునజ్జంబుకంబుపైఁ గన్ను లెఱ్ఱ చేసె నదియ తఱి యని తలంచి పూర్వమంత్రివర్గం బామృగరాజుదిక్కు మొగం బై. 325

సీ. మృగరాజ! మావృత్తి దెగుపని చేసెఁ జూచితి కదా నిన్ను వంచించి దోఁచె
నీపాపగోమాయు వేపని సేయ లే, దెఱిఁగి మే మెఱిఁగింప వెఱతు మెదియుఁ
దగుమాటమాత్రకు ధర్మిష్ఠ మిది స్వభావమున దారుణముధర్మ మనుమిషను
గలిగి పాపాచారములకు నై వర్తించుఁ, బొట్టకై చుమి దీనిభూరివ్రతము

తే. కాంచితివి కాదె నీకుఁ గా నెంచినట్టి,పలల మింతన హరియించె సలలితాత్మ!
దీని తెఱఁగేమి యంచిఁకఁ దెలుపఁగలము,కనివినినయంతలోఁగొంతవినుతుమిట్లు.

వ. అనిన విని వ్యాఘ్రంబు గోమాయుప్రవర్తనము మాంసాపనయనంబునఁ బ్రత్యక్షంబు గావించుకొని దానిం జంపుట కాజ్ఞ యొసంగె నంతలో శార్దూల మాత యట వచ్చి పుత్త్రునిం బ్రబోధించుచు నిట్లనియె. 327

భయముతోఁ గూడినపక్వాన్నమునకంటె, వెఱ లేనిగంజియే నెఱి నెసంగు
తే. నెచటనిర్వృతియగునదియేసుఖంబు, నేను నీమైత్రిఁ గోనియున్న నీదుభృత్యు
లలుకఁ బగ చేసి యపరాధములనుబన్ని, వెఱవుమై నాకు వెతఁగూర్ప వేతురనఘ.

వ. మృగరాజ వగునీకోర్కి వమ్ము సేయను సమ్మతింపను నీవు నాసాచివ్యం బపే
క్షింతువ యేని నీమూలభృత్యులమాటలు పాటింప కుండునట్లు సమయంబు సలు
చితి వేని నీకు హితోపదేశంబు చేయుచుండు ననిన శార్దూలం బట్ల యగుఁ
గాత మని సమయంబు చేసి గోమాయువుం దోడుకొని పోయి తనయింటం
బెట్టుకొని గౌరవించి దానియుపదేశంబునం బ్రవర్తించుచుండె నంతఁ గొంత
కాలంబునకు. 310

క. పులిపూర్వభృత్యు లెల్లను, బులిచెలిమిం జేసి సర్వమునకుం దానై
మెలఁగెడునక్కం గని మనములఁ గినుకం జేసి కపటమున మైత్రికి నై. 311

ఉ. నక్క కనుగ్రహం బెసఁగ నాఁటికి నాఁటికిఁ దియ్యమాటలున్
మిక్కిలిమక్కువల్ నెఱయ మీఁదికి మిత్రులయట్లు మెట్టుచున్
బ్రక్కన చేరి తద్వచనపద్ధతుల న్నడయాడి మైత్రి పెం
పక్కటికంబు దాని కగునట్టులు చేసిరి దోసకారులై. 312

క. గోమాయు వెఱిఁగి యెఱుఁగని, దై మాయకు మాయ సేయునది గాక కడుం
బ్రేముడి వారలఁ జూచెన్, స్వామిపయిం గలుగుభక్తి సమవేతముగన్. 313

ఆ. ఎఱచి తెచ్చి వార లిచ్చియు బహువిధ, క్రీడలందు బుద్ధి కూడఁ గఱపి
యును గలంపఁ దలఁచినను బ్రాజ్ఞ మగుజంబుకము చలింప దెట్టి కఱతలకును.

మత్త. అంత నక్క వినాశనంబున కాత్మఁ గోరుచు భృత్యులా
వంతయేనియు సంశయింపక వ్యాఘ్రరాజము భుక్తికిన్
సంతరించినమాంస మంతయు సందు వేచి హరించి యొ
డ్లింతయుం గనకుండ డాఁచి రొకింత నక్కగృహంబునన్. 315

వ. అనంతరంబ. 316

ఉ. ఆఁకలిఁ గొన్న శోలుపులి యట్టిటు మెట్టుచు భోజనార్థ మా
లోకము సేయుచుం దనదులోగిలి నెందును గాన రామికిన్
వీఁకఁ దగుల్గొనన్ భటులఁ బిల్చి భయంబఱి యుంటి రీరు నా
కేకడఁ భోజనం బిడి రెదీ కన వచ్చుట లేదు కాంచఁగన్. 317

వ. అనిన నాభృత్యవర్గంబు. 318

క. ఇంతకు మును మీభుక్తిని, సంతన గావించి యిచట సంస్కృతపలలం
బెంతయు భక్తిం బెట్టితి, మింతటిలో నేమి యయ్యె నెఱుఁగము దేవా. 319

తే. చోరులు హరించి రింతె మా నేరమిందు, సుంత యేనియు లేద యీప్రాంతభూము
లరయఁబుచ్చుమునావుడు వ్యాఘ్రమలిగి, తెలియుఁడావొంగఁబట్టినవధింతునిపుడ.

వ. అని యానతిచ్చిన నక్కపటభృత్యులు నలుగడ నెమకినట్లు నెమకి నక్కయున్న
యిక్కవలోనికిం జని యందొక్కగొంది సంస్కృతం బైనశార్దూలాహారంబుఁ
జూచి తమయేలికకుం జూపి యి ట్లనిరి. 321

ఉ. అక్కట! వంచనానిపుణ మై వ్రత ముండినయట్ల యుండి నీ
చక్కి గురుత్వముం బడసి సర్వమునందును దాన యైనయీ
నక్క భవత్పదార్థము క్షణంబున నిట్లు హరించెఁ జూచితే
యెక్కడి నైష్ఠికత్వ మొ యి దెక్కడిసఖ్య మొ నీకు దీనికిన్. 322

శా. కాపట్యంబున మోసగించి నిను లోకం బట్టె బె ట్టాడుకో
నీపట్లన్ సచివత్వ మొందినగతిన్ హేమించె నన్నింట నీ
వేపాపంబు నెఱుంగ లేనివెడఁ గై తేమందు నీచందమున్
మాపాడం గుణపంబులం దినుమృగంబా మాను మాంసాకృతిన్. 323

క. చాలుఁ బురే మే లయ్యె నిఁ, కేలా మీసచివుమాట లిటఁ దార్కాణం
బై లగ్గ యయ్యె నెల్లర, కాలోచించితివె చౌర్య మనవో దీనిన్. 324

వ. అనిన విని శార్దూలంబు బేలయై భృత్యకపటోపాయం బారయ నోపక కోపా
టోపంబున విజ్ఞానఖని యగునజ్జంబుకంబుపైఁ గన్ను లెఱ్ఱ చేసె నదియ తఱి
యని తలంచి పూర్వమంత్రివర్గం బామృగరాజుదిక్కు మొగం బై. 325

సీ. మృగరాజ! మావృత్తి దెగుపని చేసెఁ జూచితి కదా నిన్ను వంచించి దోఁచె
నీపాపగోమాయు వేపని సేయ లే,దెఱిఁగి మే మెఱిఁగింప వెఱతు మెదియుఁ
దగుమాటమాత్రకు ధర్మిష్ఠ మిది స్వభావమున దారుణముధర్మ మనుమిషను
గలిగి పాపాచారములకు నై వర్తించుఁ, బొట్టకై చుమి దీనిభూరివ్రతము

తే. కాంచితివి కాదె నీకుఁ గా నెంచినట్టి,సలల మింతన హరియించె సలలితాత్మ!
దీనితెఱఁగేమి యంచీకఁ దెలుపఁగలము,కనివినినయంతలోఁగొంతవినుతుమిట్లు.

వ. అనిన విని వ్యాఘ్రంబు గోమాయుప్రవర్తనము మాంసాపనయనంబునఁ
బ్రత్యక్షంబు గావించుకొని దానిం జంపుట కాజ్ఞ యొసంగె నంతలో శార్దూల
మాత యట వచ్చి పుత్త్రునిం బ్రబోధించుచు ని ట్లనియె. 327

చ. కుటిలులు చేయుకృత్యములు కొంచె మెఱుంగనిబేల వైతి వె
ప్పటికిని గొండెము న్వినుట పాడియె శిష్టుల పెంపు సైఁప క
క్కటికము లేక వారలను గాఱియ పెట్టఁగ నెంత్రు లేనిచో
నెటువలె నైనఁ బుండు నెఱయింపఁగఁ జూతు రయోగ్యు లక్కటా. 328

క. వనిఁ దప ముండినశుచి యగు,ముని నైనను దనదుకర్మమునఁ బోయెడువా
నిని నైన దోషసంగతిఁ,గనుఁగొనుచుండంగఁ ద్రోయఁ గల రధము లిలన్.

క. పుడమిఁ గలయెల్లవారికిఁ,బొడమున్ మూఁడైనపక్షములు మిత్రుఁడు శ
త్రుఁ డుదాసీనుం డన న,న్యుఁడు కొండొక్కొండు గలుగఁ దూహింపంగన్.

తే. శిష్టుఁ డగువాని దుష్టుఁడు చేవ గలుగు,జనునిఁ గాతరుఁడుం బండితునినిమూర్ఖుఁ
డును ధనాఢ్యుని నిరుపేదయును సురూపి,రూపహీనుఁడు ద్వేషింతురు తనుజన్మ.

ఆ. పరులమాట కేమి పండితులే పెక్కు,మంది లుబ్ధమతులు మాయదారు
లగుచు దోషహీనుఁ డగువానిపై మోపఁ,గలరు దోష మెదియొ గలుగఁ దెచ్చి.

క. జను లెవరు లేనినీగృహ,మున నీ కగుపలల మెట్లు పోయెం బోయెం
దన కిడినఁ దిననివ్రతమునఁ,జనుసాదు హరించునో విచారింపు మెదన్. 333

క. సభ్యు లసభ్యులు పోలె న,సభ్యులు సభ్యులవిధమునఁ జన దోఁతురు త
త్సభ్యాసభ్యవిధానం, బిభ్యుఁడు దగ నెంచి యుక్తమెఱుఁగఁగ వలదే. 334

ఆ. స్థలము పోలె నాకసము దోఁచు ఖద్యోత,మగ్ని పోలెఁ గాన నగును నందు
నందు స్థలము వహ్ని యరసి చూచిన లేని,కరణి నిక్కువంబు గాదె తనయ.

సీ. కావునఁ దనకనుంగవతోడఁ జూచిన,యదియుఁ బరీక్షింప నగును మఱియు
నట్లు చేసినజ్ఞాని కర్థములం బరి,తాప మావంతయుఁ దోఁప కుండు
నీతలంచినపని నెఱి గలప్రభు వేఁడుఁ,జేయఁడు వానికిఁ జెల్లు శమము
సామంతు లెఱుఁగ నీజంబుకంబును దెచ్చి,తిపుడు నీమిత్రున కిట్లు తగదు

తే. పరులమాటలు నమ్మి యీపగిదిఁ జేయఁ,దగదు త ప్పొనరించె నేఁ దాన చెడును
నీదుభృత్యులు వీని కీవాదు తెచ్చి,రకట పాప మెఱుఁగఁడు ధర్మాత్ముఁ డితఁడు.

వ. అని యనేకవిధంబులం జెప్పి నమ్మకంబు పుట్టించి యీచౌర్యంబు జంబుకంబు
వలన నైనది కాదు వీనిని సంహరించుట మృగరాజ వైననీకు ధర్మంబు నాఁ
బడదు. 337

మ. అనుచుం దల్లి ప్రబోధముల్ సలుప నావ్యాఘ్రంబు గోమాయువుం
దనకై చాఁపుల నాదరించి కవుఁగింటం జేర్చి నెయ్యంబునన్

గనుఁగొన్నం గని తత్పరాభవమునన్ గాయంబు వోఁ గొట్టుకో
మనముం జేసి సృగాల మాజ్ఞ యిడ సంప్రార్థించె శార్దూలముల్. 338

వ. శార్దూలంబును జాలువాఱుకన్నీరు మున్నీరుగా దాని వారించి గారవించె
నంత విజ్ఞాననిధి యగునానక్క యొక్కింత సంభ్రమంబునం బులికి మ్రొక్కి
గద్గదస్వరంబున ని ట్లనియె. 339

చ. వినుకలి నాదువృత్త మది వీనులవిందుగ నెంచి తెచ్చియున్
మును నను బెద్ద చేసియును బూజితుఁ జేసితి వోలగంబునం
గనుకలి నొందురీతి గలుగన్ మది సేయవు నేఁటి కిట్లు నా
మన మరయంగ లేమి నవమానితుఁ జేసితి నన్ను నే మనన్. 340

ఆ. పరులు సూడ నిట్లు పడితిఁ బరాభవ, మలుసు గలిగె నాకు నందఱకడ
నే స్తకాఁడ ననుచు నీకు బుద్ధులు గఱపఁగ నిట నెలంగఁ దగదు పిదప. 341

వ. మఱియు నసంతుష్టులు స్థానచ్యుతులు నిందారోపితులు నపహృతులు పరాప
హితులు పరిక్షీణులు లుబ్ధులు క్రుద్ధులు భీతులు ప్రతారితులు ప్రతాపితులు
వ్యసనప్రతీక్షులు లోనగువారు ప్రభుస్థానంబున నుండ ననర్హు లాకర్ణింపుము.

క. స్థానభ్రష్టునిపై నవమానసమావిష్టుఁ డైన మనుజునిపై భూ
జానికి విశ్వాసం బగు, నే నే నెట్లుండువాఁడ నీకడ నధిపా. 343

క తొలిదొల్త సమర్థుం డని, సలిపి పరీక్షం గ్రహించి సచివత్వమునన్
నిలిపితి గుణి యని సభలోఁ, బలికితి సమయమ్ముఁ దప్పి బన్న మిడి తయో. 344

తే. ఇట్టు లవమతి కైన నాయెడల నీకు, స్నేహవిశ్వాస మఱు నట్టినీపయిం బ్ర
భూత మగు నాకు నుద్వేగ మేతరుణము, నీవు శంకితుఁ డవు భీతుఁడే నగుదుము.

సీ. పరులు ఛిద్రంబుల నరయుచుందురు కర్క, శులు కగ్గ మిది బహుచ్ఛలము తెలియ
నింతలో భిన్నమై యింతలో శ్లిష్ట మౌ, బ్రీతి స్నేహమున వర్ధిల్లఁ బోదు
ప్రభు వగునీకుఁ జూపట్టదు తనవాఁడు, పెరవాఁడు ననెడువివేకగరిమ
కలదు కార్యాపేక్ష కలుగదు సుస్నిగ్ధ, భావము మది చలత్వమును బొందు

తే. నూటికొక్కఁ డశంకుఁడు కోటికొక్క, రుఁడు సమర్థుఁడు ప్రకృతి నరులకు నట్టి
మంచిచెడ్డలపట్టున మాఱుచుండు, సహజ మయి దీన నేమనం జనెదు నన్ను.

వ. ఇట్లు గోమాయు వాకోలుపులి ననునయించుచుం బలికి తత్ప్రసాదంబు వడసి
మృదులవచనంబుల దానిచే ననిపించుకొని వనంబునకుం జని ప్రాయోపవేశంబు
చేసి మే న్వాసి దివంబునకుం జనియె నిందలి పూర్వాపరంబు లెఱుంగం గలి

గిన మంచిచెడ్డ లెఱుంగం గలుగు ననిన నజాతశత్రుండు ధరణీకళత్రుం డగు
వాఁ డెట్లు మెలంగి సుఖించుం జెప్పు మనిన నప్పితామహుండు తత్ప్రకారం
బెఱింగించెద విను మని యిట్లనియె. 347

భీష్ముఁడు ధర్మజున కలసత్వదోషం బెఱింగించుట.

ఉ. ఒంటె యొకండు తొల్లి వనజోదరుఁ జిత్తమునందు నిల్పి తా
నొంటరియై యరణ్యమున నుండి మహాతప మాచరించె నే
వెంటఁ జలింప కెంతయును వింతగ నంత హిరణ్యగర్భుఁడుం
గంటికిఁ బోలఁ దోఁచి యిదె కైకొను మిత్తు వరంబు నావుడున్. 348

క. లొట్టియ నలువకు మ్రొక్కుచు, నట్టిద యగునే ననుగ్రహము సేయుము నా
కిట్టియెడ న్నూఱామడ, లట్టె చనం జాగుదీర్ఘ మగుకంధరమున్. 349

సీ. అట్లగుం గావుత మని వరం బిడి బ్రహ్మ, చనె నంత నుష్ట్రంబు మనమునందు
గర్వించి యొండులఁ గైకొన కలసత్వ,మున నొండుచోటికిఁ జనఁగఁ బోక
యొకచోన యుండి మేయుచు నలుగడ నూఱు,యోజనంబులమేర నున్నకసవు
నొకనాఁడు తనగ్రీవ యోజనశతక ప్ర,మాణంబుగాఁ జాచి మసలుచుండె
తే. నపుడు పెనుగాలియును వాన యతిశరమయి, పృథివి నల్లడఁజూపట్టె భీకరముగఁ
దత్తరంపడి లొట్టెను గత్తఱిఁ దన, కుతిక సాఁగించి తల నొక్క గుహను బెట్టె.

ఉ. కుండలఁ గ్రుమ్మరించు గతిఁ గొట్టెడువానజలంబు నల్లడన్
నిండిన శీతభీతమయి నిల్వఁగఁ జోటు లేక జంబుకం
బొండు సదారమై యటకు నొయ్యన వచ్చి వడంకికొంచు న
క్కొండగుహం జొరంబడియెఁ గొంచెము గానిభయంబు పెంపునన్. 351

వ. ఇట్లు ప్రాణభయంబునుండి తప్పించుకొని మాంసజీవి యగునజ్జంబుకంబు క్షుధా
భరంబునం బరితపించుచు నుష్ట్రకంధరంబుం గని తానుం దనభార్యయు
దానిం గొఱికి తినం జొచ్చె లొట్టెయు నది యెఱింగి దుఃఖించుచుఁ దన
కంఠంబు సంకోచింపఁ జేయ నుంకించి క్రిందు మీఁదు లరయుచుండె నంతలో
నక్క లాకుత్తిక తెగి పడునట్లు కొఱికి భక్షించుటంజేసి యుష్ట్రంబు విగత
ప్రాణం బయ్యె జంబుకంబులును వర్షవాతంబు లుడుగునంతకు దానిమాంసంబు
పొట్టలు నిండం దిని గుహాముఖంబునుండి వెడలి చనియె దుర్బుద్ధి యగు
నుష్ట్రంబున కలసత్వంబున నిట్టికష్టంబు సంప్రాప్తం బయ్యెఁ గావున. 352

క. నీ వలసత్వం బెప్పుడు, భావంబునఁ బొంద నీక ప్రజ్ఞానిధివై

కావింపుము కార్యము ప్రజ్ఞావంతుఁడు విజయ మందు సతతము జగతిన్. 353

తే. బుద్ధి నైనపనులు శ్రేష్ఠములు భుజముల
నైనయవి మధ్యమములు జంఘాంచితము ల
ధమము లింద్రియముల గెల్చి దక్షుఁ డైన
నృపున కార్తి యుండదు రాజ్య మెపుడు నిలుచు. 354

మ. ఇది మంత్రంబు సహాయసంగతులచే నింపొందుభూజాని సం
పద లెచ్చున్ మహి యెల్ల నేలుకొన సామర్థ్యంబు వచ్చు న్మహీ
త్రిదశాధీశ్వర ! యిట్లు చెప్పిరి బుధుల్ దీపింప శాస్త్రోక్త మా
నది నేఁ జెప్పితి బుద్ధిచే నరసి నీ వారీతి వర్తింపుమా. 355

వ అనుటయు నయ్యుధిష్ఠిరుండు దుర్బలుం డగురాజు ప్రబలుం డైనశాత్రవుండు పాడకట్టినప్పు డెట్లు రాజ్యంబు నిర్భికుండై పరిపాలింపం గలం డెఱింగింపు మనిన మరున్నదీనందనుం డీయర్థంబు తేటపడ సరిత్సాగరసంవాదం బనునితిహాసంబు గల దాకర్ణింపుము. 356

సముద్రసరిత్సంవాదము.

ఉ. సందియ మందు డెందమున సాగరుఁ డెల్లసరిద్వరంబులుం
బొందయి యున్నఁ గాంచి ఫలపుష్పమనోహరవృక్షసంతతుల్
సందడి వెట్టి కూల్చెద రసార మకాయము వేతసంబు దా
నిం దెఱలింప రెల్లయెడ నిండి వడిం బ్రవహించునప్పుడున్. 357

ఆ. బంధు వనియొ కాక ప్రబ్బలి మీ కేమి, ప్రియ మొనర్చె లేక పెల్లగించు
బలము మీకు దానిపట్ల లేకుండెనో, నుడువుఁ డదియు మిమ్ము విడువ దెపుడు.

మ. అన గంగానది సాగరుం గని యనున్ యాదఃపతీ! నిట్టినీ
ల్గి నగంబుల్ బిగు వింతయున్ విడక శక్తిం జూపుచు న్మమ్మెది
ర్చినదానం దెగుఁ బ్రాతిలోమ్యమునకై చేరంగ నై వంగి మా
కు నమస్కారము చేసి వేతసము గైకోకుండు చే యున్నఁడన్. 359

క. ప్రబ్బలి వెల్లువ లై నదు, లుబ్బినతఱి ను బ్బడంగి యుండియు నవలన్
రెబ్బటిలి యుబ్బుకాలము, ప్రబ్బిన గతు లెఱిఁగి నరుఁడు వడయు శుభంబుల్.

ఆ. పగతుఁ డెగిచి యున్న పట్టున నెదిరింప, కలఁతి యైన నృపతి దొలుత నింత
నలత యైన నడఁగి మెలఁగినఁ జెడకుండు, నీటఁ బ్రబ్బ చెడక నిలిచినట్లు. 361

క. తనశక్తి పగతుశక్తియు, మనమునఁ దగ నిశ్చయించి మనుజేంద్రుఁడు బు

ద్ధినిరూఢి నడపి కార్యము, బొనరించినఁ బరిభవంబు పొందం డెపుడున్. 362

వ. అనిన యుధిష్ఠిరుండు సురనదీవరనందనుదిక్కు మొగంబై యి ట్లనియె. 363

తే. ఘనుఁడు విద్వాంసుఁ డయ్యు మూర్ఖుని తెఱఁగునఁ
దెగి ప్రగల్భము లాడుచుఁ దీక్ష్ణవృత్తిఁ
జదురునం దిట్టుచుండెడుజనుని నెట్లు
సలుపఁ గాఁ జెల్లుఁ జెప్పవే సదమలాత్మ. 364

వ. అనుడు నజాతశత్రు నిరీక్షించి సురనదీపుత్త్రుండు నీయడిగినవిధంబు దేటపడం
జెప్పెద నాకర్ణింపుము. 365

తే. అల్పమేధస్కుఁ డగునరుం డాడిపోసి, నను క్షమించెడువాఁడు నల్గినను నల్క
లేనివాఁడునునై మంచిమానసమున,నుండుమనుజుండు సుకృతంబునొందునధిప.

చ. సుకృతము లేక దుష్కృతము చొప్ప దలంచుచుఁ గ్రోధమూర్తియై
సకలజనంబుపై నలుక సల్పుచు నుత్తము లంతవారిఁ గొం
కక వితగాఁగఁ దిట్టుచుఁ బ్రగల్భము లాడెడువాఁ డధోగతిం
జికమక నొందుఁ డిట్టిభము చెన్నున వాని కుపేక్షయే తగున్. 367

ఉ. ఘాతుకుఁడైనవాఁడు తనకర్మమునన్ జగదేకనింద్యుఁడై
పాతకవర్తి సంస్తుతులపా లయి నాఁటికి నాఁడు వ్రీడితుం
డై తనలోనఁ దాన కృశితాత్మకుఁడై మృతకల్పుఁడై వృథా
యై తరలున్ యమాలయము నారయ వాని కుపేక్షయే తగున్. 368

మ. మతి యింతేనియు లేనిప్రాకృతుఁడు ధర్మం బెన్న లేకున్న ను
న్నతుఁ డోర్వం దగుఁ దత్ప్రశంసలును నిందల్ ఘోరకాంతారమం
దతిదీర్ఘం బగుకాకికూతలవలెన్ వ్యర్థంబులై పోయెడి
న్మతిమంతుండు గణింపకున్నఁ దనయంతం దానె చల్లార నై. 369

ఆ. పాపకర్ముఁ డెపుడు వాక్ప్రయోగము సేయు, వాకె వాని కర్థ మాక యుడిన
నెమిలి యాటఁజూపి నెగులు గూర్చెడునట్లు, కార్య మాచరించుఁ గష్టుఁడగుచు.

క. ఎవని కవాచ్య మకార్యము, భువి లేకుండెడినొ పాపపురుషుని వానిం
దవిలి వచింపఁగ నొప్పదు, ప్రవిమలవృత్తంబు గలుగువాఁ డవనీశా. 371

తే. ఎవఁడు ప్రత్యక్షమునఁ స్తుతియించుచుం బ
రోక్షమున దూరుచుండునారూక్షహృదయుఁ
డగు శునకతుల్యుఁ డుత్తముఁ డతనిమైత్రి
వడసి పుణ్యములం బాసి పాప మొందు. 372

సీ. అపవాదము పరోక్ష మందాడువాని నేర్పరి కుక్కమాంసము పసిచి విడుచుఁ
బరదోషముల నెన్ని పరివాద మొనరించు, వాఁడు పామట్టిఁడు వానికిఁ బ్రతి
సలుప నెంచినవాఁడు తెలివి మాలినఖర, మట్టిఁడు గావున నట్టివాని
మత్తమాతంగము మాడ్కి నశాంత మా, సాలావృకమురీతి శ్వాన మట్లు
తే. విడువఁగాఁ దగు దమహీను వినయశూన్యుఁ,బాపమతి పాపమార్గప్రవర్తనుని న
భూతికాముని ఘాతుకు నీతిబాహ్యుఁ, జేర్పఁగా రాదు చేర్చినఁ జేటు వచ్చు.
తే. ఖలుఁడు దుర్మైత్త్రిపోయుచుఁ గాఱు లఱచుఁ,బరిహసించును దప్పెంచు వానిపట్ల
నప్రియంబులు పలుకక యలుగఁబోక, శాంతి వహియించియుండుటే సమ్మతంబు.
వ. ఈయర్థంబు తేటపడ నొక్కయితిహాసంబు గలదు నాకది తపోవనంబునం
దొల్లి జామదగ్న్యుం డగురాముండు చెప్ప దానిం జెప్పెద నాకర్ణింపుము.

కుర్కురనీచత్వముం దెలుపుకథ.

చ. మనుజులు లేనికారడవిమధ్యమునన్ ఫలమూలభక్షుఁడున్
వినియమితేంద్రియుండు సువినీతమనస్కుఁడు శుద్ధసత్త్వసం
జనితమహాప్రభావుఁ డగుసంయమిచంద్రుఁ డొకానొకండు మున్
ఘనతపముండె నాకులను గట్టినయిల్లది యున్కిపట్టుగన్. 376

క. అమ్మునిసద్భావమునకు,నెమ్మది గలవగుచు నెమ్మి నెంజిలి విడి క్రూ
రమ్ములు శార్దూలాదిమృ,గమ్ములు దరియంగ వచ్చి కని చనుచుండున్. 377

వ. ఇట్లు ప్రత్యహంబును వన్యంబు లగుమహాసత్త్వంబు లెల్ల సకలభాషావిదుం డగు
నప్పారికాంక్షి సమక్షంబునకు వచ్చి కుశలప్రశ్నంబు చేసి పోవుచుండు నిట్లున్న
యవసరంబున నుపవాసకృశంబును ఫలమూలోదకాహారంబును శాంతంబు
ననురక్తంబు గ్రామ్యంబు నగు నొక్కకుర్కురంబు చనుదెంచి శిష్యభావంబున
నమ్మహామునిపాదమూలమ్ము సమాశ్రయించి యనుసరించి సేవించుచుండె నంత.

ఉ. దువ్వీ యొకండు మెం డగుచుఁ దోఁచి వ్యాదంతర మేఁచునాఁకటం
ద్రెవ్వనిమాంసఖాదనమతిం బచరించుచు నందు వచ్చి దా
దవ్వుల నేత్రపర్వముగఁ దద్భషకంబును గాంచి కాంక్ష లో
నివ్వటిలంగఁ గాలయమునిం బురుడించెడు క్రూరమూర్తి యై. 379

క. సెలవులు నాఁకుచుఁ దోఁకం, నిలువెల్లం గదలఁ జేసి నిమిషాంతరమం
దలకుక్కకెలన వ్రాలెన్, బలలాశి నోర్వెరు దెఱచి పట్టం దివిరెన్. 380

మ. తమఁ బట్టం బఱతెంచుచిట్టపులిఁ జెంతం జూచి ప్రాణార్థి యై

మునిపాదంబుల వ్రాలి జాలి గదురన్ మో మెత్తి వాపోవుచుం
గనుల న్నీ రురలంగ నేడ్చుచు ననుం గాఁ జేయ నీచిందు వ
య్యేను నన్నుం గరుణించి కావఁ గదె మౌనీంద్రా! నిను న్వేఁడెదన్. 381

వ. అని మొఱ్ఱవెట్టిన భావజ్ఞుండును రుతజ్ఞుండు నగునమ్ముని దానిభయకారణం
బెఱింగి. 382

సీ. వెఱవకు మని దాని ద్వీపిగా నొనరించె, జాంబూనదాకృతి జాను మీఱఁ
దనజాతి యని మ్రింగ మొనసినచిఱుత దా, సఖ్యంబు వాటించి చనియె నంతఁ
గొల్పులి క్షుద్బాధకుం దాళఁ జాలక, వ్యాదితాస్యంబయి వచ్చుటయును
బెగడి మాయాద్వీపి వేఁడిన ముని దానిఁ,బులిఁ జేసి నెయ్యంబు నిలువరించెఁ
తే. గుక్కపులి యంత మునుపటి చక్కి గాక,మూలఫలభోగబుద్ధినిఁ బో కడంచి
మృగపతి తెఱంగునంజంపిమృగగణంబు,పిశితమశనంబుగాఁగొని పెచ్చుపెఱిఁగె.

వ. అంత నొక్కనాఁడు. 384

చ. మదగజ మొక్క డక్కడికి మాటికి మాటికి ఘీంకరించుచున్
బెదరుపడంగ సత్వములు పెద్దమహీధ్రము మాడ్కి మెట్టుచున్
బెదవులు వ్రేల వచ్చుటయు బీతున వ్రాలినకోల్పులిన్ వర
ప్రదుఁ డయి పారికాంక్షి యొకవారణరాజముఁ జేసె వాసిమై. 385

వ. తన్నుం దలదన్నఁ గలమత్తమాతంగంబుం గని వచ్చినమతంగజంబు వెఱ
చఱచి పఱచె నంత ననంతరకాలంబున. 386

ఉ. సింగము బొబ్బరించుచును జేవ మెయిం జను దెంచి దానిపై
లంగ యొనర్పఁగా నది తలంకి ఋషీంద్రుని చెంతఁ జేరుడున్
సింగముగా నొనర్చె నిజసింహము సింహావరభ్రమల్ మదిన్
సంగతి గాఁగ సఖ్యము పొసంగఁగఁ జేయుచు నేగె నెప్పటిన్. 387

వ. ఇట్లు గ్రామసింహంబు సింహంబై ఋష్యాశ్రమంబున విహరించుచున్నంతఁగొంత
కాలంబున నొక్కనాఁడు సర్వసత్వభయంకరం బగుశరభంబు లోచనగోచరం
బగుటయుఁ గృతకసింహం బష్టపాదంబు నూర్ధ్వనయనంబు నగుదానిం జూచి
చకితంబై జీవచ్ఛవంబు వోలె నైన గ్రామ్యపశువుం బరికించి కరుణాతరంగి
తాంతరంగుం డగునత్తపోధనసత్తముండు మహాసత్వసమన్వితం బైన శరభంబుం
జేసిన సమాగతశరభంబు జీవితాశంజేసి రభసంబున భయద్రుతం బయ్యెఁ
గృత్రిమశరభంబును మునిపార్శ్వవర్తియై సర్వసత్వభయంకరంబుగాఁ బ్రవ

ర్తించుచు వనంబునం గలనానావిధప్రాణులం బట్టి గిట్టించి పొట్టం బెట్టుకొనుచు
జియ్యఁబట్టి తిరుగుచుఁ దొంటినీచజాతివాసనావశంబునం జేసి కృతజ్ఞత లేనిదై
దనకుఁ బరమోపకారియగు మానిచంద్రుం జంప నెంచె నతండును దనతప
శ్శక్తి నైనజ్ఞానదృష్టిం జేసి దానిదురభిప్రాయం బెఱింగి కుక్కవు నీవు నా
వలనం జిఱుతవై పులివై యేనికవై సింగమవై శరభంబ వైతివి జాతివాసనం
జేసి వాసి చెడి నన్నే చంప నెంచితివి కావున నీవు వెండియు నెందు కుక్కవు
గమ్మని శపించిన నది యట్లయయి దైన్యంబునొందె ఋషియుఁ బాపరూపమగు
నా వేఁపిని దనతపోవనంబునుండి వెడలం గొట్టె నని చెప్పుటయు నజాత
శత్రుండు శంతనుపుత్రు దిక్కు మొగంబై దుష్టార్థులవృత్తం బిట్టియదియు
దానిం బెట్టుము రాష్ట్రవృద్ధికరంబును బుత్రపౌత్రాభిరామంబును క్షేమవృద్ధి
ప్రదంబును నగుదాని నడుగుచుంటిఁ జెప్పననుగ్రహింపుము. 388

సీ. రాజ్యాభిషిక్తుఁడు రా జెట్లు వర్తించి, ప్రజలసంప్రీతికిఁ బాత్ర మగును
మెత్తనైనఁ జనుల్ నెత్తి కెక్కుదురు భృ,త్యులు వెచ్చగిలినవా రుదిలకొంద్రు
ప్రజలకు భృత్యవర్గములకు నతిమైత్రి, యైనచో రాజ్యము నలరు టరిది
పృథివీశుసంపద భృత్యమూలం బెట్లు, వర్తించినఁ దేఁడు వలలఁ గలఁడు
తే. సందియముదీఱ నృపధర్మసరణి యెల్లఁ, దెల్లఁగాఁ దెల్పుఁదలఁపు నోదివ్యమూర్తి
బుద్ధినిం బృహస్పతి కీడు వోదు వీవు, కృత్తయును నట్టివాఁడ యీజగమునందు.
వ. భృత్యు లెట్టిరు గా నుండ వలయు నెట్టికులీనులతో లోకయాత్ర సాఁగింప
నొప్పుం జెప్పు మనిన నప్పితామహుం డిట్లనియె. 390

## రాష్ట్రాభివృద్ధిప్రకారాభివర్ణనము.

క. అసహాయుఁడు రాజ్యము రాష్ట్రసమీచీనముగ నేలఁ జాలఁ డతనికిఁ
వసులాభ ముండ దున్నది, వెసఁ బోవుఁ రక్ష సేయువెఱవరి లేమిఁ. 391
తే. జ్ఞానవిజ్ఞానకోవిదుం డైనవాఁడు, సత్కులంబున జనియించి స్వామిహితము
నెంచువాఁడుసుస్నిగ్ధుఁడౌభృత్యజనుఁడు,గలిగియుండినభూపతిఫలముఁగుడుచు.
తే. కులజుఁడుం గుణి విజ్ఞానకోవిదవరుఁ, డాగతానాగతవిధిజ్ఞుఁ డనిశ మవని
పతిమతిం బట్టి విడకుండుఁ బ్రాజ్ఞుఁడైన, ప్రెగడయగు నేని ఫలమందుఁ బృథివినేత.
క. సమసుఖదుఃఖులు సత్యవ్రమనులు ప్రియకారు లర్థపరులు సహాయుల్
సమకుఱిన రాజచంద్రుఁడు, సమస్తఫలములు పొసంగ సతత మెసంగుఁ. 394
సీ. జనపదసన్నికృష్టగతప్రవర్తన, మెసఁగ నేల్ రా జభివృద్ధి నొందుఁ

దుష్టిపుష్టిసమేతు లిష్టులు జనులు కో,శావనస్థితు లైన నలరు నృపతి
యాప్తులుం బ్రియులు కోష్ఠాగారపాలకు, లైన మానవనాథుఁ డతిశయించుఁ
గర్మఫలోదయ గతి నగరవ్యవ, హార మున్నతు లూన నధిపుఁ డెసఁగు

ఆ. శంఖలిఖితధర్మశాస్త్రప్రచార మి, ట్లలరు నృపతి దాని ననుసరించి
సంగృహీతజనుఁడు షడ్వర్గయుతుఁ డైనఁ, బార్థివోత్తముండు ఫలము నొందు.

సీ. మతిమంతుఁ డగుమహీపతి యిట్లెఱిఁగి సత్య, శౌచార్జవ శ్రుత శమ దమ కుల
వృత్త కాను క్రోశ వీర్యప్రభావాదు, లరసి యోగ్యుల భృత్యవరుల నిలుపు
కొన నొప్పు సచివాదులను బరీక్షించి యే, కైకొన నొనట్లు కాకయున్నఁ
గలుగదు సుఖ మెప్డు కులజుఁ డేనాఁడును, బాపకార్యము సేయఁ బాలుపడఁడు.

తే. ప్రాకృతుండును దుష్కులభవుఁడు నైన, వాఁడుసత్సంశ్రయంబునఁబడసిదుర్ల
భమ్మయినమహైశ్వర్యముప్రకృతిధర్మ,మునను శత్రుత్వముం జేయుఁదనవిభునెడ.

వ. కావున విదేశవంతుం డైనభూకాంతుండు కులీనుండును శిక్షితుండును బ్రాజ్ఞుం
డును జ్ఞానవిజ్ఞానపారగుండును సర్వశాస్త్రార్థతత్త్వజ్ఞుండును సహిష్ణుతాగుణసంప
న్నుండును దేశీయుండును గృతజ్ఞుండును బలవంతుండును క్షాంతుండును
దాంతుండును జితేంద్రియుండును యుక్తాచారుండును సంధివిగ్రహకోవిదుం
డును పౌరజానపదప్రియుండును ఖాతకవ్యూహతత్త్వజ్ఞుండును బలహర్షణకోవి
దుండును నింగితాకారతత్త్వజ్ఞుండును యాత్రాజ్ఞానవిశారదుండును హస్తిశిక్షా
తత్త్వజ్ఞుండు నహంకారవర్జితుండును బ్రగల్భుండును దక్షుండును దాంతుండును
యుక్తాయుక్తవిచక్షణుండును జౌక్షుండును జౌక్షజనాకీర్ణుండును సుముఖుండును
సుదర్శనుండును నీతికుశలుండును గుణచేష్టాసమన్వితుండును నస్తబ్ధుండును
మృదువాదియు ధీరుండును శూరుండును దేశకాలోపపాదకుండును నగుసచివుం
బడసి సుఖంచువానిరాజ్యంబు దామరతంపర యై దినదినాభివృద్ధిం గాంచు
మహీపాలుండు నీచెప్పినగుణంబులు గలవాఁడై శాస్త్రవిశారదుండు నేష్టవ్యుం
డును ధర్మపరుండును బ్రజాపాలనతత్పరుండును ధీరుండు నమర్షియు శుచియుఁ
దీక్ష్ణుండును బురుషకారజ్ఞుండును శ్రుతవంతుండును శ్రోతయు నూహాపోహ
విశారదుండును మేధావియు ధారణాయుక్తుండును న్యాయోపపాదకుండును
దాంతుండును బ్రియవాదియు క్షమావంతుండును శ్రద్ధాళుండును సుఖదర్శ
నుండు నార్తహస్తప్రదుండు నమాత్యహితరతుండు నాహంవాదియు ననిర్ద్వం
ద్వుండును భక్తజనప్రియుండును బ్రసన్నవదనుండును భృత్యజనావేక్షుండును

నక్రోధియు యుక్తదండుండును ధర్మకార్యానుశాసనుండును జారనేత్రుండును ధర్మార్థకుశలుండును నైనచో గుణశతాకీర్ణం డగు యోధులును గుణగణావృతులును సుపురుషులును రాజ్యధారణసహాయులును సమరశౌండీరులును గృతజ్ఞులును శాస్త్రకోవిదులును ధర్మశాస్త్రసమాయుక్తులును బదాతిజనసంవృతులును నభయులును రథచర్యావిశారదులును గజపృష్ఠస్థులును నిష్వస్త్రకుశలులును గూడినచో రాజు సర్వసంగ్రహసంయుక్తుండును దానశీలుండును మిత్రాఢ్యుండును సంగృహీతమనుష్యుండును నై సర్వసర్వంసహాచక్రం బవక్రవిక్రమంబున జయింపం గలండు. 397

తే. శ్వానములఁ బోలి విశ్వాసవంతు లైన
భృత్యులను నిల్పఁ దగుచోట్ల వేడ్క నిల్పి
కృత్యముల నియోగించెడుక్షితిశ లేశుఁ
డెంతయును రాజ్యసుఖ మొందు నిభపురీశ. 398

క. స్థానమునఁ గాక యుచ్చు, స్థానంబున గారవించి శ్వానము నిలుపం
గానక ప్రమాణ మయ్యెది, ప్రాణాపాయమ్ముఁ దెచ్చునది యగు నధిపా. 399

వ. కర్మఫలాకాంక్షి యగురాజు శరభ సింహ శార్దూల ద్వీపుల నాయాస్థానంబుల నుంచినట్లు భృత్యుల నుచితస్థానంబులం దుంచి ప్రతిలోమంబు గలుగకుండఁ దత్తదనురూపకర్మంబుల నియోగించునది ప్రమాణ మతిక్రమించి ప్రతిలోమకర్మంబుల నిలువరించిన ప్రజ్ఞాహీనుండు ప్రజారంజకుండు కానేరండు. 400

సీ. బాలిశుల్ క్షుద్రు లప్రాజ్ఞు లవిజితేంద్రియు లకులీనులు చేర్ప నొప్ప రెపుడు
కులజులు జ్ఞానవంతులు సాధువులు శూరు, లక్షుద్రులు దక్షు లైననరులు
పారిపార్శ్వకు లయి భాసిల్లఁ గాఁ జెల్లుఁ, జౌక్షులు తత్పరుల్ శాంతమతులు
నృపతిబహిశ్చరు లెపుడు సింహము చెంత, ననుగమై సింహమే తనరుచుండు

ఆ. సింహసహిత మైనసింహేతరము సింహ
ఫలము నొందుఁ గుక్కదళము లోనఁ
జెలఁగుసింహ మెపుడు సింహఫలము నొందఁ
దొడరదు సహవాసదోషమునను. 401

వ. అట్టిద కాన శూరులు ప్రాజ్ఞులు బహుశ్రుతులు కులీనులు నగువారితోడం గూడినరాజు విజయంబు గాంచు నవిద్యుండు నన్మజుండు నప్రాజ్ఞుండు నమహాధనుండు నగుభృత్యునిం జేర్చు టొప్పదు స్వామికార్యపరాయణుండును బార్థివ

హితుండును నగువానిపట్ల సాంత్వనంబ ప్రసక్తిం జేయు నది రాజులకుఁ గోశంబే మూలంబు గావున నతిప్రయత్నంబునఁ గోశంబు వృద్ధి యగునట్లు చూచుచు సంతతసంరక్షణంబు గావించునది కోష్ఠంబు ధాన్యంబుల నిండించి యుంచునది ధర్మరాజా! నీవు ధనధాన్యపరుండవై సత్పురుషుల కిచ్చువాఁడ వగుము రణకోవిదులైననీభృత్యులు నిత్యాయుక్తు లగుదురు గాక నీకు నశ్వ ప్రయోగవైశారద్య మ్మగుత నీవు జ్ఞాతిబంధుజనప్రియుండవు మిత్రసంబంధిసం వృతుండవును పౌరకార్యహితాన్వేషివియు నగు మని దీవించి మఱియు నేమి యడుగఁ దలంచితి వడుగు మనుడు యుధిష్ఠిరుండు నీవు నా కిపుడ నేకపూర్వ రాజవృత్తంబులతో రాజధర్మంబు లెన్నేని చెప్పితివైనను మఱియు నవియే వినఁ దలంచితిం జెప్ప ననుగ్రహింపు మనినఁ గురుపితామహుం డిట్లనియె.

### రాజనీతిప్రభావాభివర్ణనము

ఆ. రాజచంద్ర వినుము రాజునకుఁ సర్వ, భూతరక్షణంబె ముఖ్యధర్మ
మది పొనర్చు టెట్టు లవ్విధ మెఱిఁగింతు, నొండు వినక యవహితుండవగుము.

తే. బర్హిచిత్రములగు పెక్కుబర్హములను, దాల్చునటు బహువిధరూపముల్చెలంగ
సత్యమార్జవ మాదాన సత్వములను, దైక్ష్ణ్యజిహ్మత్వముల ఱేఁడు దనర వలయు.

సీ. తనకు నేయర్థము ననుహితం బగునొ త, ద్వర్ణరూపంబుల వఱల నొప్పు
బహురూపములు గలపతి కార్యములు చెడ, వెపుడు రక్షితమంత్రుఁ డేనిసిరులఁ
జెలఁగు నాపద్ద్వారములయందు యుక్తుఁడై, ద్విజుల సిద్ధులను సేవింప వలయు
నర్థకాముం డగునతఁడు ధర్మధ్వజో, పమ మైనశిఖను దాల్పంగ వలయు

తే. ననిశముద్యతదండుఁడై యప్రమాద, మునఁ బ్రవర్తింపవలయు నెప్డును స్వరాజ్య
మందు నాయవ్యయంబుల నరయ వలయుఁ, బ్రభుత నర్థించి యుండెడిపార్థివుండు.

సీ. అలశరత్తున మూఁగ యై నట్లు తనలోని, యూహాల వెలిఁ బుచ్చకుండ వలయు
సెలయేళ్ల నాశ్రయించినరీతి సిద్ధులై, యొసఁగువిప్రుల నాశ్రయింప వలయుఁ
జిన్నచె ట్టెక్కి పెంజెట్టెక్కున ట్లొలిఁ, బన్ను హెచ్చించి రాఁబట్ట వలయుఁ
వెస తెక్కలను విప్పి విదళించునట్లు శ, త్రులదోషములఁ బట్టి తెలుప వలయుఁ

తే. దళులఁ దోలకరులం బలెఁ దగఁ దలిర్చి
వనమయూరము విధమున మనుజవిభుఁడు
తనదు రాష్ట్రమునం బ్రజాతత్పరుఁ డయి
ప్రభుతఁ జెల్లించుకొనుచుండ వలయు నెపుడు. 406

మత్త. పక్షపాతము గల్గి భృత్యులపట్లఁ గ్రాలఁగ రాదు శ
త్రుక్షయంబును గోరి దోషతతుల్ గనుంగొని తద్విధిన్
శిక్షమార్గ మెఱింగి కర్జము సేసి వారి సమున్నతిన్
సుక్షయం బొనరింప నొప్పెడుఁ జూవె రా జగువానికిన్. 407

సీ. పురి విప్పియాడి యెల్లర నాత్మ వశము చే,యుమయూర మట్లయియొడయఁడెపుడు
తనుఁ దాన రక్షించుకొనువాఁడయై తను, ప్రాణంబు విడకుండఁ దగునువిభుఁడు
పాశముల్ గలిగినపట్టు లిప్తము లైనఁ, బరిహరింపం దగు బరులు క్రుద్ధు
లగుచు విషము గ్రక్కినపుడు వారి నడంప, జతనింప నగు నాకనమునఁ బక్షి
తే. వలెను సర్వత్ర ప్రజ్ఞను నిలుపవలయు, నాత్మవృద్ధికరం బగునట్టినీతి
నేర్వఁ దగుఁ బరబుద్ధిపై నిలుపఁ బోక, నాత్మబుద్ధిబలంబున నలరవలయు. 408

సీ. పరమోత్తముం డగుపరు విశ్వసింపఁగఁ, జనుఁ దనశక్తియు జతనుపడఁగఁ
బరబుద్ధి నిజబుద్ధిఁ బరిమన్న మొనరించి, ప్రాజ్ఞుఁడై సాధింప వలయుఁ గార్య
మాగమవిహితము లగుకృత్యముల నెల్ల, ననుసరింపం దగు ననవరతముఁ
బ్రాజ్ఞుఁడు నర్థవిధిజ్ఞుఁడు మృదుశీలుఁ, డగువాని నిజకృత్య మందు నిలిపి
ఆ. తాను ననుసరింపఁ దగు రాజు ధర్మావి,రోధముగ సకలపురుషులకుఁ బ్రియ
మాచరించునది సమస్తభూభాగముల్, చారదృష్టి నరయఁ జను నృపతికి 409

క. ఇనుఁడు గరంబుల నెల్లెడఁ, జొనిపెడుగతి నినుఁడు దృష్టిఁ జొనిపి జగమునన్
జనులకు శిక్షారక్షలు, బొనరించుచు ధర్మరక్ష పోలుం జేయన్. 410

సీ. మృదుభాషులును ధర్మవిదులు నిర్దోషులు, మధ్యవయస్కులు మహితమతులు
హితు లవిక్లబులు శిక్షితు లలుబ్ధులు దాంతు, లగువారి సర్వకార్యముల నిలిపి
తుష్టచారోపస్కృతుం డయికార్యగ,తుల తెఱం గెఱిఁగి భూతలవిభుండు
వెలయఁ దగు నమోఘవిక్రమాదులు గల్గి, తనచేసినది తానె కనుల నరసి
తే. యనిశమును గోశమునఁ బ్రత్యయంబు గలిగి
నిగ్రహానుగ్రహంబుల నెఱి వహించి
గుప్తరాష్ట్రుఁడు గుప్తాత్మకుండు నైన
రాజు రాజధర్మజ్ఞుఁడై తేజుఁ గాంచు. 411

క. కాలప్రాప్తార్థంబున్, బోలుం గొనఁ బతికి వేగముం గైకొనుటల్
పోలదు గోపతి గోవుం, బోలెన్ దినదినము రాజు పుడమిఁ బిదుక నౌ. 412

ఆ. పూలనుండి మధువు పుచ్చి క్రమక్రమ,ముగను దేనెటీఁగ ప్రోగు సేయు

మాఁడ్కి మన్ను తేఁడు మహీధసం బంతయు, సంతరింప నొప్పు సంచయముగ.
ఆ. సంచయంబునుండి చాగ మొనర్పక, గుప్తశిష్టధనము కొంత కొంత
ధర్మకామములకుఁ దగ వినియోగింపఁ, దగును శాస్త్రవేత్త యగునృపుండు.
క. కొలఁది ధనం బని యపమతి, గలుగం దెగనాడ రాదు ఘనతరబుద్ధిం
గలిగికొని తనకుఁ దానే, తెలియం దగుఁ బెరలబుద్ధి దెసఁదగ దరుగన్. 415
తే. దక్షతయు సమయంబు నధైర్యము మఱి, దేశకాలాప్రమాదత ధృతియు శౌర్య
మాత్మ యనునివి ధనవృద్ధి కవనియందు, నెసఁక మెసఁగెడు నష్టసమింధనములు
సీ. ఇసుమంత యగునగ్ని యే నాజ్యసిక్త మై, కొండంతయగు బీజ మొండు మొలచి
వేయిరెట్లగు నట్టులే యర్థమును దాని, సపచూన మొనరింప నైతి కాదు
పగ బాలుఁ డైన నబాలకుం డైన స్థ, విరుఁ డైన మత్తుఁ డౌపురుషుఁ జంపు
కాలమే దేనికిన్ మూల మన్యుఁడు కాఁడు, కాలజ్ఞుఁ డధికుండు క్షత్రమందు
తే. నర్థమును ధర్మమును వీర్యమతిశయమ్ము, యశము హరియించుఁ గాన బలాఢ్యుఁ డైన
దుర్బలుం డైన శాత్రవుం దునిమి వైవ, క్షత్రజాతికి ధర్మ మై చను నరేంద్ర.
ఉ. బుద్ధి ప్రదీప్తమై బలిని బోకడఁ బెట్టి బలంబు వర్ధిలన్
బుద్ధియ సేయు బుద్ధిబలముం గలవాఁ డరి మేటి యైన వా
గ్బద్ధుని గా నొనర్చి గెలువం గలఁ డత్తఱి నశ్రమంబునన్
బుద్ధినిఁ జెప్పి చెప్ప నగుఁ బొమ్మనవచ్చెడు నెల్లకర్మముల్. 418
చ. నిపుణుఁడు హీనసత్త్వుఁ డగు నేనియు నిర్గతదోషవర్గుఁ డై
యెపుడును సర్వకామములు నిచ్చ మెయిం గొను సత్త్వగర్వదు
ర్వ్యాపినచరాత్ముఁ డై కృపణవృత్తికి నై ఫల మందఁ బోఁ డిలన్
నృపుడు ప్రజాహితుం డగుచు నేర్పునఁ గూర్పఁగ నొప్పు నర్థముల్. 419
తే. బుద్ధితో నైనవ్యవసాయమునను విద్య, తపము నర్థము సర్వ మొందంగ వచ్చు
నట్టివ్యవసాయ మెల్లరయందుఁ గలదు, కాన దానినెఱుఁగ నొప్పుఁ గార్యగతుల
క. జీవులదేహములందున్, దేవేంద్రుఁడు హరి సరస్వతియు భూతములున్
దావు గొని విడువకుండుం, గావునఁ దన్నింద సేయఁ గా దెవ్వరికిన్. 421
ఉ. లుబ్ధుని సంప్రదానమున లోఁగఁగఁ జేయఁగ నోఁ బరార్థమున్
లుబ్ధుఁడు స్వార్థముం బలెఁ గనుంగొను నర్థవినాశశంక మై
లుబ్ధుఁడు ధర్మకామములలోఁ జొరకుండు ననేకదోషముల్
లుబ్ధునిఁ జేరఁ గానఁ బతి లుబ్ధునిఁ జేకొన నొప్ప దెప్పుడున్. 422

ఆ. శాత్త్రవునకు నేని సర్వార్థములు గల్గ, సజ్జనుండు కోర్కి సలుపుఁ జూచి
నంతమాత్ర నధము నైనను ధర్మసంగతి నెలంగు నట్లు హిత మొనర్చు. 423

తే. అప్పుడును గుణీనుండు ధర్మాన్వితుండు, కార్యదక్షుఁడు విజ్ఞానకలితుఁ డఖిల
తంత్రవేత్తయు నగునమాత్యవరుఁ డవని, పతికి సంరక్షకుం డగు క్షితితలేశ.

వ. విధిప్రయుక్తంబు లగునీధర్మంబు లెఱింగి తద్విధిం బ్రవర్తింపఁ జేయువాఁడు రాజ్యంబు పాలించుటకుం జాలి యుండు నొండుగతిం బ్రవర్తించినవాఁ డను త్తమరాజ్యసుఖం బనుభవింపం జాల కిహపరదూరుం డగు నాత్మవంతుం డెంత లెంతల నైన నుపాయంబున జయించు ననాత్మవంతుం డెట్లు చేసియు ఫలంబు నొంద నోపండు నీవు నా చెప్పినచొప్పునం బ్రవర్తించి రాజ్యసుఖం బనుభ వింపుము సర్వధర్మంబులకు నృపధర్మంబు మూల మని యెఱింగి పుణ్యంబునం బొందు మనినఁ బాండునందనుం డమందానందంబునం బొంది మందాకినీనందను దిక్కు మొగంబై పితామహ! పితామహోక్తం బగుదండంబు సనాతనం బైనరాజధర్మంబు సర్వేశ్వరంబు దండంబున సర్వంబును బ్రతిష్ఠితంబు సర్వప్రాణిలోకంబునకు శ్రేయోదాయకం బని నీవు చెప్పితివి గాని మఱియు నెఱుంగ నెంచితి దండ మెద్ది దానిస్వరూపం బెట్టిది గతి యెట్టిది చెప్ప నను గ్రహింపు మనిన నతం డతని కిట్లనియె. 425

## భీష్ముఁడు దండనీతిప్రభావం బెఱింగించుట.

తే. ప్రజల రక్షించు రాజధర్మంబు దండ,మనఁగ వ్యవహారగతికి యోగ్యంబు దాని
ద్రుహిణువచనంబునం జేసి తొల్లిమనువు, చెప్పె నని చెప్పితిని వెండి చెప్పెదవిను.

సీ. సుప్రణీతం బయి చూపట్టు దండము,పరమదైవం బని ప్రణుతిఁ గాంచు
నుద్ధితాగ్ని యనంగ నుండు నాదండంబు,నీలోత్పలచ్ఛాయ నెఱి వహించు
దానికి నాలుగుదంష్ట్రలుఁ నాలుగు,భుజము లెన్మిదిపాదములు ననేక
నయనంబులుఁ రెండునాల్కలు శంకుకర్ణములును నూర్ధ్వరోమములు జటలు

తే. నరుణముఖమునుమృగరాజవరతనుచ్ఛ,దమునుగలిగినయుగ్రరూపము పొసంగ
శరశరాసనముసలముద్గరగదాసి,వివిధసాధనములతోడ వెలయుచుండు. 427

వ. ఇట్లు మూర్తిమంతం బైనదండంబు భీషణంబై దోషపుంజంబుల ఛేదించి ఛేదించి త్రెంచి దంచి పగిలించి నొగిలించి జగం బెల్లెడఁ దానయై పఱచుచుండు నసివిశస నుఁడు ధర్ముఁడు తీక్ష్ణవర్త్మ దురాసదుఁడు శ్రీగర్భుఁడు విజయుండు శాస్త్ర వ్యవహా రుఁడు సనాతనుఁడు శస్త్రము శాస్త్రము బ్రాహ్మణము మంత్రము ప్రాగ్వచనుఁడు

ధర్మపాలుఁడు నక్షరుఁడు దేవుఁడు సత్యగుఁడు నిత్యగుఁడు నగ్రజుఁడు నసం గుఁడు రుద్రతనయుఁడు మనువు జ్యేష్ఠుఁడు శివంకరుఁడు ప్రజాగరుఁడు కౌమారి సుతుఁడులోనగునామంబుల నారాయణుఁడు దండమై కీర్తింపంబడు బ్రహ్మకన్య లక్ష్మి సరస్వతి ప్రవృత్తి జగద్ధాత్రి లోనగునవి దండనీతినామాంతరంబులు మఱియు నర్థానర్థంబులు సుఖదుఃఖంబులు ధర్మాధర్మంబులు బలాబలంబులు దౌర్భాగ్యభాగధేయంబులు పుణ్యాపుణ్యంబులు గుణాగుణంబులు కామా కామంబులు మాసర్తుపక్షదివసక్షణంబులు ప్రమాదాప్రమాదంబులు హర్ష క్రోధంబులు శమదమంబులు దైవపురుషకారంబులు మోక్షామోక్షంబులు భయాభయంబులు హింసాహింసలు తపోయజ్ఞములు విషావిషంబులు నాది మధ్యాంతంబులు కృత్యప్రపంచనంబులు మదప్రమాదదర్పదంభధైర్యంబులు నయానయంబులు శక్త్యశక్తులు వ్యయావ్యయంబులు వినయవిసర్గంబులు కాలాకాలంబులు సత్యాసత్యజ్ఞానశ్రద్ధాశ్రద్ధలు లాభాలాభంబులు జయాప జయంబులు క్లీబతావ్యవసాయంబులు తీక్ష్ణతామృదుతామృత్యుతాగమానాగ మంబులు విరోధావిరోధంబులు కార్యాకార్యంబులు బలాబలంబులు నసూ యానసూయలు నపత్రపానపత్రపలు హ్రీసంపద్విపత్పదంబులు తేజఃకర్మములు వాక్శక్తిపాండిత్యంబులు సత్యాసత్యములు లోనగునవి దండంబునకు రూపంబు లని మఱియును. 428

సీ. దండభయంబున ధరఁ బ్రజల్ మనుచుండ్రు, లేకున్న నొండొరు లీఁక మోఁదు
కొని చచ్చెదరు దండమున రక్ష్యమాణులై, రాజాభివృద్ధికై ప్రబలు చుందు
రగుట దండము పరాయణమై జగద్వ్యవ, స్థాపన మొనరించు దాన సత్య
మగు సత్యమున ధర్మ మలరు నయ్యది విప్ర, తతియం దెసంగెడు ధర్మకర్మ

తే. యుక్తులగు బ్రాహ్మణులు వేదయుక్తు, లగుదురలరు వేదములఁ యజ్ఞములు నెలంగు
యజ్ఞములఁ జేసి దేవత లలరి యింద్రు, నకు నివేదింప నాతఁ డన్నంబు నొసఁగు.

ఉ. అన్నమునంద భూతముల ప్రాణము లెప్పుడు నొప్పుచుండు నా
యన్న మొసంగునట్టిదియు నర్థయశస్సుఖభాగ్యభోగ్యముల్
పన్నుగఁ గూర్చునట్టిది తలంపఁగ దండమ క్షత్రజాతియం
దున్నెఱి మీఱు దానఁ బ్రజ తుష్టికి నై నృపుఁ డందు సద్గతుల్. 430

వ. మఱియు నాదండంబు పురుషుం డీశ్వరుండు ప్రాణుండు సత్వము చిత్తము ప్రజాపతి భూతాత్ముఁడు జీవుఁడు ననునెనిమిదిపేరులం బెంపొంది కులము

ధనము నమాత్యులు ప్రాజ్ఞులు భృత్యులు ననఁ బంచవిధాత్మకం బై రాజున కైశ్వర్యం బాపాదించు బలము హస్త్యశ్వరథపత్తినౌకావిష్టిదేశికావికముల నష్టాంగం బనియు రథులు హస్తియాయులు నశ్వారోహులు పదాతులు మంత్రులు రసదులు భిక్షుకులు ప్రాడ్వివాకులు మౌహూర్తికులు దైవచింతకులు కోశము మిత్రములు ధాన్యము సర్వోపకరణంబులు ననియుం జెప్పుదు రట్టిసర్వోత్తమం బగుదండమే రాజునకు శరీరము దండమే ప్రభవను దండం బీశ్వరదత్తంబై క్షత్రియుని పరం బయ్యె క్షత్రియునకు దండంబుకంటెఁ బూజ్యతరం బగునన్యధర్మంబు లేదు దండము ధర్మసంస్థాపనార్థము లోకరక్షణార్థమును వ్యవహారరూపంబునఁ బరమేష్ఠికల్పితంబు వ్యవహారంబు వేదప్రత్యయంబు శాస్త్రోక్తంబు నై మూఁడులోకములఁ ధరించుచుండు సురాసురయక్షరక్షోగంధర్వోరగనరాదులకు వ్యవహారాత్మక మైనదండమే పరాయణంబు వినుము

ఆ. తప్పు చేసి రేని తల్లియుఁ దండ్రియు,నన్న దమ్ముఁ డాలు నను(ఁ)గుబిడ్డ
గురువు నాక రాజవరుఁడు ధర్మము పూని,దండ్యులుగ నొనర్పఁ దగు మహీశ.

వ. ఈయర్థంబు తేటపడ నొక్కపురాతనేతిహాసంబు గలదు విను మంగదేశాధీశుండు వసుహోముం డనురాజు సతీసహితుండై ముంజపృష్ఠం బనుహిమవచ్ఛైలశృంగంబునకుం జని పరమతపం బున్నసమయంబున మాంధాతృం డనుమహీవల్లభుండు వచ్చి ప్రణమిల్లినం గని వసుహోముండు వాని నర్ఘ్యపాద్యంబుల నర్చించి కుశలప్రశ్నంబు గావించి నీవచ్చినకార్యం బేమి నే నేమి చేయవలయుం జెప్పు మనిన మాంధాతృండు. 433

క. అనఘ! బృహస్పతిమత మౌ,శనసం బగుశాస్త్ర మెల్లఁ జదివితి కానన్
ఘనుఁడ వని నీసముఖం,బున దండవిధాన మెఱుఁగ బుద్ధి సలిపితిన్. 434

ఆ. దండ మెట్లు పుట్టె దానిని దొలిదొల్త,నెవ్వఁడు తాల్చెఁ బరమ మెట్టు లయ్యె
క్షత్రజాతి కెట్లు సమకుటె నాచార్య,వేతనంబు నిడుదు వినుచు మనఘ. 435

—— వసుహోముఁడు మాంధాతకుఁ జెప్పినదండోత్పత్తిప్రకారము. ——

వ. అనిన వసుహోముండు ధర్మాత్మకం బైనదండంబు ప్రకారంబు సెప్పెద వినుమని యి ట్లనియె. 436

చ. నలువ మహామఖం బొకఁ డొనర్ప మదిం దలపోసి యాత్మకుం
దుల యగుబుత్విజుం బడయఁ దోపమి గర్భము చేసి దానినిం
దల ధరియించి యున్ దశశతంబుల యేడులు మోచి యొక్కనాఁ

డలఘువుఁ గాఁగఁ దుష్టుటయు నట్టి పడెం దలగర్భ మూర్తికిన్. 437

క. క్షుతమున వెలువడెఁ గావున, క్షుతుఁ డనునామంబు వడసి సూనుండు ప్రజా
పతియై ఋత్విజుఁ డయ్యెం, బితృయజ్ఞసమర్థుఁ డగుచు వెలసినదానన్. 438

వ. ఇట్లు హిరణ్యగర్భుం డర్భకుం గని సవనంబు సాఁగించుచున్నంత దృష్టరూప
ప్రధానం బగుటం జేసి దండం బంతర్హితం బయ్యె నయ్యెడ. 439

సీ. ప్రబలెఁ బ్రజాసంకరము కార్యమున కార్య,మును భోజ్యమున భోజ్యమును గనంగ
రావయ్యెఁ బ్రజలు పరస్పరహింసకు, లైరి గమ్య మగమ్య మనెడుమాట
సమసెఁ బరస్వము స్వత్వము సమ మయ్యెఁ, గుక్కలవలెఁ బోరుకొనిరి జనులు
బలవంతుఁ డబలునిఁ బట్టి వేధించె ని, ర్మర్యాద మయ్యె సమస్తభువన

తే. మట్టిచోఁ బితామహుఁ డంబుజాక్షుకడకు, నరిగి సంకరమయ్యె లోకాళి యెల్ల
నట్లు కాకుండఁ జేయ వేయనుడు నతఁడు, నభవు ధ్యానించి ప్రత్యక్షమైనయంత.

వ. తత్ప్రకారం బెల్ల నెఱింగించిన నీశానుండు నిజధ్యానవినిశ్చలమనస్కుండై నిజతేజోఽతిశయంబున దండంబును దండనీతిని సృష్టించి దాని జగత్త్రయంబునం బ్రవర్తింపఁ జేయుటకు సహస్రాక్షుని దేవేశ్వరుని గను వైవస్వతుని బితృప్రభువు గను గుబేరుని ధనరాక్షసేశ్వరుని గను మేరువును బర్వతేశ్వరుని గను మహోదధిని సరిన్నాథుని గను వరుణు నపాంపతి గను మృత్యువును బ్రాణేశ్వరుని గను హుతాశనుని దేజోవిభుని గను నీశానుని రుద్రాధిపతి గను వసిష్ఠుని విప్రవల్లభుని గను జాతవేదుని వసుస్వామి గను భాస్కరుని దేజఃపతి గను నిశాకరుని నక్షత్రాధ్యక్షుని గను నంశుమంతుని వీరుత్పతి గను గార్తికేయుని భూతాధిపతి గను సంహారవిలయాత్మకుం డగు కాలుని మృత్యువునకును సుఖదుఃఖములకు నీశ్వరుని గను నిర్ణయించె నమ్మహాదేవుండె సర్వరుద్రులకు నధీశుండై బ్రహ్మదేవునకుఁ బ్రజాపతి యైనక్షుతు నొసంగి ధర్మవేత్తలకు నధిపతిఁగా నొనర్చి బ్రహ్మయజ్ఞంబు యథావిధిం బ్రవర్తిల్లం జేసి ధర్మరక్షకుం డైనవిష్ణుదేవున కాదండంబు నొసంగె నంతం డంగిరోముని కిచ్చె నతం డింద్రమరీచుల కిచ్చె మరీచి భృగువున కిచ్చె భృగువు ఋషుల కిచ్చె ఋషులు లోకపాలుర కిచ్చిరి లోకపాలురు క్షుతున కిచ్చిరి క్షుతుఁడు సూర్యసుతుం డగు మనువున కిచ్చె నతండు శ్రాద్ధదేవుండు పుత్రులకుం జెప్పినచొప్పున దండంబు ధర్మార్థకారణంబున దుష్టనిగ్రహంబునం గాని యదృచ్ఛం జేయఁ జెల్ల దదియు నల్పకారణంబు తగ దనియు బహిఃక్రియయు శరీరపీడయు శరీరవ్యంగత్వం

బును జెప్పి దేహత్యాగంబు నంగీకరించుచు దండంబును విభజించి దాని లోకంబులం బ్రతిష్ఠించె నాఁటినుండియు ననుక్రమంబునఁ బ్రజ లెఱింగిరి తొలి దొల్త నింద్రుండు నింద్రునివలన నగ్నియు నగ్నివలన వరుణుండును వరుణుని వలనఁ బ్రజాపతియుఁ బ్రజాపతివలన ధర్ముండును ధర్మునివలన బ్రహ్మపుత్రుం డగువ్యవసాయుండును వ్యవసాయునివలనఁ దేజస్సును దేజస్సువలన నోషధులు నోషధులవలనఁ బర్వతంబులును బర్వతంబులవలన జ్యోతిస్సులును రసంబులును రసగుణంబులును దెలిసికొనిరి జ్యోతిస్సులనుండి వేదంబులు ప్రతిష్ఠితంబులు వేదంబులవలన హయగ్రీవుండు హయగ్రీవునివలనఁ బితామహుండు పితామహునివలన మహాదేవుండు విశ్వేదేవులును విశ్వేదేవులవలన ఋషులును ఋషులవలన సోముండును సోమునివలన సనాతనదేవతలును సనాతనదేవతల వలన బ్రాహ్మణులు బ్రాహ్మణులవలన రాజన్యులునుం దెలిసికొనిరి రాజన్యుల వలన నీదండనీతి రక్షితం బై సర్వలోకరక్షకం బయ్యె నీదండంబు దేవదేవుండు శివుండు శర్వుండు కపర్ది శంకరుండు రుద్రుండు స్థాణుం డుమాపతి యను పేళ్లం బొలుపొందె నద్దండదేవు ననుష్ఠించుభూపాలుం డైహికాముష్మిక సిద్ధులం బొందు నని వసుహోముండు మాంధాతకుం జెప్పె నీదండనీతిప్రకారంబు వినిన సర్వకామంబులుం బొందుదు వని చెప్పిన విని యుధిష్ఠిరుండు ధర్మార్థకామంబుల నిశ్చయంబు విన నెంచితి వానిమూలంబును బ్రభవంబు నెట్టి వందు దేనియందు లోకయాత్ర సుప్రతిష్ఠితం బెఱింగింపు మనిన భీష్ముం డి ట్లనియె. 441

భీష్ముఁడు ధర్మజునకు ధర్మార్థకామంబు లెఱింగించుట.

సీ. ప్రశ్నించితివి లెస్స పార్థ! ధర్మార్థకా,మములు కాలప్రభవములు వినుము
ధర్మమూల మగునర్థము కామ మర్థఫ,లమ్ము సంకల్పమూలములు మూఁడు
విషయాత్మకం బయి వెలయు సంకల్పము, విషయము లాహారవిస్తృతమ్ము
లివి త్రివర్గమునకు హేతువులు నివృత్తి, మోక్షము నా నొప్పు నోక్షితీశ

తే. ధర్మమున దేహరక్ష యాధర్మమునకు, నర్థ మగుసాధనము కామ మగు రతిఫల
మది రజోదృష్ట మద్దాని నమలతపము,వలన ధర్మార్థియై గెడపంగ వలయు.

వ. ఈయర్థంబునఁ గామందకాంగరిష్ఠసంవాదం బనునితిహాసంబు గలదు వినుమాంగరిష్ఠుం డనునరవరుండు కామందకమునికడకు వచ్చి నమస్కరించి యిట్లనియె. 443

తే కామమోహబలాత్కృతుండై మహిపతి,కలుష మొనరించినిష్కృతింగనుటయెట్లు
ధర్మమనుకొని తెలియక ధర్మమాచ, రించుఁ దత్పాప మీఁగు లెక్లించి చెపుమ.

సీ. కామందకుం డనుఁ గామసక్తుం డయి, ధర్మార్థములపరిత్యాగమునను
బ్రజ్ఞ నశించెడుఁ బ్రజ్ఞ నశించుట, మోహ మత్యంతమై బుద్ధిఁ దగులు
నద్దానఁ బ్రభవించు నాస్తికత్వము దురా,చారము దుష్టుఁడై క్షత్రియుండు
దుష్టుల శిక్షింప శిష్టుల రక్షింప, నోపఁ డందున లోక ముదిలకొనుచు

తే. వాని ననుసరింపరు ప్రజల్ వైరమునను, ద్రోసిరా జందు రవమతిఁ జేసి కూల్తు
రట్టిబ్రదుకుకంటెం జావె యన్నిగతుల, శ్రేష్ఠమని చెప్పనొప్పు నీతిలితలమున.

వ. అట్లు ధర్మవిప్లవ మయినతఱి నిష్కృతిం బొంద నెంచినవాఁడు త్రయీవిద్యల
సేవించుచు బ్రాహ్మణసత్కారంబు గావించి దుష్కృతులం దొలంగఁ ద్రోచి
సత్కృతుల నాచరించి ముక్తపాపుండై శుద్ధుం డగు నని చెప్పె నని చెప్పి
నీవు గురుశుశ్రూషంజేసి ధర్మపరుండవై శ్రేయంబులం బొందు మనిన ధర్మ
నందనుండు ధర్మంబునకు మూలంబు శీలం బందు రట్టిశీలంబు లభించు టెట్లు
దానిలక్షణం బెట్టిది చెప్ప ననుగ్రహింపు మనిన దేవవ్రతుండు తొల్లి ధృత
రాష్ట్రదుర్యోధనులకు నడచినసంవాదంబు చెప్పెద నది నీసంశయనివృత్తిం
జేయు నని యిట్లనియె. 446

శా. ఇంద్రప్రస్థమునందుఁ దమ్ములును నీ వెంతే సమృద్ధిన్ సభా
చంద్రప్రస్తరవేదికాతలమునన్ సాక్షాన్మహేంద్రుండు నా
సాంద్రైశ్వర్యము నొంది యుండఁ గని లోనైఁపంగ లే కక్కురూ
ర్వీంద్రుం డైనసుయోధనుండు జనకు న్వీక్షించి చింతాదృతిన్. 447

వ. దీనస్వరంబున నీసభాసమృద్ధి యంతయు నెఱింగించిన విని ధృతరాష్ట్రుండు కర్ణ
సహితుం డగుసుతునిదెస మోము వెట్టి యి ట్లనియె. 448

ఉ. కుందెద వేల యిట్లు వగకుం గలకారణము న్వచింపు మా
చందము లెస్స యున్న విని చక్కఁబడం బొనరింతు నెన్నఁడున్
డిందనిసంపదల్ గలవు నీకు వశంవదు లెల్లతమ్ములున్
వందులు వోలె నై దొరలు వాఁకిట గావలి యుందు రందఱున్. 449

క. వేవురు సేవింతురు నినుఁ, బ్రావారంబులను దాల్తు పలలాశనమున్
గావింతు వుత్తమాశ్వము, లేవేళ వహింప నుందు నీవగ వేలా. 450

సీ. అనిన దుర్యోధనుఁ డను యుధిష్ఠిరునింటఁ, బదివేలస్నాతకుల్ ప్రతిదినంబు

రక్షపాత్రంబుల రుచు లెచ్చ భుజియింతు, రన్నములు చతుర్విధాంచితములు
దివ్యంబు తత్సభ దివ్యపుష్పఫలాన్వి, తము బహువిధరత్నసముచితమ్ము
క త్తలానులు వేలు త త్తిరికల్మాష, ములు వివిధాంబరంబులును గలవు

తే. పగ అయినపాండవేయులపాల నిట్టి, యితరపార్థివాసాధ్యసమృద్ధిఁ గాంచి
నంత నేనిట్లు తపియింపనై తిననుచు, నెఱుఁగఁజెప్పినధృతరాష్ట్రుఁ డిట్టులనియె.

క. తనయా! నీ వట్టిసిరుల్, గొన మనముం జేసి యున్నఁ గొనకొని శీలం
బును బొందఁ జూడు మందునఁ, గనఁ జాలని దొండు లేదు కలలోకములన్.

వ. తొల్లి శీలంబునం జేసి మాంధాత్రుం డేకరాత్రంబునను మూఁడుదినంబుల
జనమేజయుండును సప్తరాత్రంబుల నాభాగుండును మహీమండలాఖండలు
లై జగద్విశ్రాంతకీర్తిం గాంచి రనిన సుయోధనుండు తండ్రిం గాంచి శీలం
బన నెట్టిది దాని నెట్లు పడయ వచ్చుఁ జెప్పు మనిన నతం డీయర్థంబున నొక్క
యితిహాసంబు నాకు నారదుండు చెప్పె నది నీకుఁ జెప్పెద వినుము. 453

తే. శీలమునఁ జేసి ప్రహ్లాదుఁ డోలిమున్నుఁ, హరిహయుని గెల్చి తద్రాజ్యమపహరించి
తనవశంబునఁ ద్రైలోక్యమును జెలంగఁ, జేసికొనెనప్డు జిష్ణుండు వాసి చెడఁగ.

వ. కడుంగడు వగచి బృహస్పతి పాలికిం జని ప్రాంజలియై శ్రేయం బభిలషించి
వచించిన నతండు నైశ్రేయసంబగుజ్ఞానం బుపదేశించి విశేషవిజ్ఞానంబు భార్గవుని
వలన నెఱుంగు మనిన నింద్రుండు భార్గవునికడకుం జని విన్నవించిన నతండును
గొంత చెప్పి నాచెప్పినదానికన్న విశేషము ప్రహ్లాదు నడిగి తెలిసికొ మ్మనిన
నతండు బ్రాహ్మణరూపంబు ధరించి ప్రహ్లాదునిసమ్ముఖమ్మునకుం జని శ్రేయం
బుపదేశింపు మనిన నతం డతని కి ట్లనియె. 455

ఇంద్రుండు విప్రుండై ప్రహ్లాదు నాశ్రయించుట.

శా. ముల్లోకంబుల రాజ్య మేలుటకు నై ముప్రొద్దు వేగింతు నా
కిల్లుం జూచుకొనంగఁ దీఱుబడి యింతే లేదు నే నెట్లు నీ
యుల్లం బందలికోర్కిఁ దీర్పఁ గల ని ష్టోపంగ దయ్యా యనన్
సల్లాపంబు లొనర్చుచున్ గొలిచి యాసంక్రందనుం డి ట్లనున్. 456

చ. సమయము వచ్చునంతకు సజస్రము నిన్ను భజించుచుందు నే
క్రమమున నైన నీకపుడు గైకొన నుంటి ననుగ్రహింపు మో
సుముఖ! యనన్ ముదంపడి విశుద్ధమనస్కుత నట్ల యొనటం
చమరినవేళ జ్ఞానము యథార్థగతి న్వచియించె వానికిన్. 457

క. మాయాబ్రాహ్మణుఁడు యథా, న్యాయంబుగ గురుని భక్తి నారాధించెన్
బాయని ప్రీతికి నై యతఁ, డాయెడ నెయ్యంబు సేసె నాతనియెడలన్. 458

వ. అట్టిసమయంబున దేవేంద్రుండు త్రైలోక్యరాజ్యంబు నీ కెట్లు సంప్రాప్తించెం జెప్పు మనినఁ బ్రహ్లాదుం డి ట్లనియె. 459

చ. ద్విజవర! నేను రాజ నని విక్కుచు విప్రులపై నసూయ యే
వృజినమునందు నేఁ గొనను వేడక యుండినవారి కర్థముల్
విజితవికారచిత్తమున విస్తరిలం బొనరించి వారలన్
నిజ మగుభక్తిఁ గొల్చెదను నిచ్చలు మచ్చికఁ జేసి ముచ్చటన్. 460

మత్త. వారిభారము నేన పూనుదు వారి నెప్పుడు గొల్చుచున్
వారు నాపయిఁ బ్రేముడించుచు వాఙ్మహామృతధారలన్
జేర దిద్దుచు నుందు రందున శ్రేయముల్ గొని జాతిలోఁ
దారలన్ ద్విజరాజుపోల్పునఁ దద్దయుం బొలుపొందుదున్. 461

ఆ. విప్రముఖమునుండి వెలివచ్చు వాక్యమే, యెన్న భువనములకుఁగన్ను నమృత
మిట్లు తెలిసి పొలుచు టే యుత్తమం బగు, శీల మనఁగఁ జెల్లు క్షితితలమున.

వ. ఇది సర్వశ్రేయం బనిన విని విప్రపుంగవుం డత్యంతభక్తితాత్పర్యంబునఁ బ్రహ్లాదునకు శుశ్రూష గావించుటయు నతం డత్యంతసంతోషితాంతరంగుండై ద్విజోత్తమా! నీవృత్తంబునకుఁ బ్రీతుండ నైతి నభీష్టం బర్థింపు మనిన నమరవల్లభుం డల్లన ని ట్లనియె. 463

ఉ. నాకు వరం బొసంగెడుమనంబున నుంటివ యేని సత్యవా
గాకర! నీదుశీలము దయామతితోడ నొసంగవే యనన్
వాకొన నోడి లోభయము పర్వఁగ నీతఁ డనల్పతేజుఁ డౌఁ
గాకని యవ్వరం బొసఁగెఁ గైకొను మంచును మ్రొక్కి దుఃఖియై. 464

వ. దేవేంద్రుం డట్లు వరంబు వడసి శీలవంతుండై చనియె నంతఁ బ్రహ్లాదుండు చింతాజ్వరసమాక్రాంతస్వాంతుండై యుండ నతనిదేహంబునుండి ఛాయాభూతం బైనయొక్కమహాతేజస్సు వెలి వచ్చి విగ్రహంబు దాల్చి యున్నం గని దైత్యేంద్రుం డనునయించుచు. 465

ఉ. ఎవ్వఁడ వీవు చెప్పు మన నేను భవద్గతశీల మీవు న
న్నవ్వలఁ ద్రోయుటన్ వెడలునట్టిఁడ నైతి నహర్నిశంబు నిన్
గవ్వి భజించుబాడబునిగాత్రమునందు వసింప నేగెదన్

ద వ్వాయితం చదృశ్య మయి తారె నొకానొకయింతలోఁ బలికెన్. 466

ఆ. అంత నట్టితేజ మవధరించి మఱొక్క, వ్యక్తి వెలికిఁ దోప నరసి దైత్య
వల్లభుండు నీ వెవండవు నావుడు, ధర్మమూర్తి నేను దైత్యనాథ 467

వ నేను శీలంబుతో నుండెడివాఁడఁ గావున శీలం బున్నెడకుం బోవుచుంటి నని చనియె నంతఁ గొంతటిలోన మఱి యొక్కతేజస్సు నిజదేహంబునుండి వెల్వడి వచ్చినఁ బ్రహ్లాదుండు నీ వెవం డనిన నే సత్యం బను ధర్మం బున్నచోట నుండం బోయెద నని పోయె నంతలో మఱియొక్కపురుషుండు పొడకట్టి నేను వృత్తమును సత్య మున్నచో నుండుదు నని నిర్గమించె మఱికొంతలో వింత నాఁబబడుశబ్దంబుతో మేను వెడలి యింకొక్కతేజంబు నేను బలంబను వృత్తమున్నకడ నుండఁ బోయెద నని పోయె ననంతరంబ ప్రహ్లాదునిశరీరంబునుండి ప్రభాపుంజంబుతో శ్రీదేవి వెలువడుటయు. 468

చ. కనుఁగొని నీ వెవర్తుకవు కంజవిలోచన! యెందుఁ బోవుదో
యనుటయు నీయెడ న్మెలఁగునట్టిసిరిన్ నను వీడి తీవు నేఁ
జనెద బలంబువెంటఁ బడి త్మాసురుఁ డుండినచోట నుండ నం
చనుగతి రైయి బలంబుఁ గలయం జనుండిన నాతఁ డార్తుఁడై. 469

క. ఓవిశ్వజనని! పోవుదు, వే విప్రుం డాతఁ డెవ్వఁ డేర్పడఁ జెపుమా
నావలన వరము వడసెన్, నావుడు శ్రీదేవి యిట్లనం గరుణించెన్. 470

తే. బ్రహ్మచారి యగుచు నీదుపాలఁ జేరి, యోలి శుశ్రూష గావించి శీల మంది
నీదుత్రైలోక్యరాజ్యంబు నిమిషమాత్ర, నపహరించెనతఁడుహరిహయుఁడుసువ్వె

క. శీలమునఁ ద్రిలోకంబులు, గ్రాలున్ శీలంబు వోవఁ గడ తేరు సిరుల్
పోలించి వజ్రి నీకడ, శీలంబు హరించె మోసఁ జేసి మహీశా. 472

వ. ధర్మము సత్యము వృత్తము బలము నేనును శీలంబు ప్రధానముగా నుండుదు మని చెప్పి శ్రీదేవియు ధర్మవృత్తాదుల ననుసరించె ననిన దుర్యోధనుండు శీలంబుతత్త్వం బెట్టిది దానిం బొందునుపాయ మెట్లు చెప్పు మనిన ధృతరాష్ట్రుండు. 473

సీ. మనము వాకునుగర్మ మనుమూఁట సర్వభూతములకు ద్రోహంబు దలఁపకుంట
యనిశ మనుగ్రహంబును దాన మనునవి, శీలం బటందురు శిష్టజనులు
మనుజుల కహితకర్మము సేయ కెల్లరు, మే లన నుంటయు శీల మండ్రు
శీలహీను లొకప్డు శ్రీలు వొందుదు రవి, చిరకాల ముండక చెడి నశించు

తే. నిశ్చలతఁగి శీలవంతుఁడ వీవు గమ్ము, పాండవులకంటె హెచ్చిన ప్రాభవంబు
గలిగికొనునిచ్చచిత్తమందలరు నేసి, యనుచు ధృతరాష్ట్రుఁ డెఱిఁగించె నాత్మజునకు

వ. నీవు నిట్లు చేయుము ఫలంబు వొందెద వనిన ధర్మనందనుండు ధర్మజ్ఞా! లోకములో నాశ యంతము లేనిది దానికి వినాశనంబు గలిగినపట్ల నయ్యెడు దుఃఖంబు మృత్యుప్రాయంబు దుర్యోధనునిదురాశం జెప్ప నేమిటికి నేనును వానికతంబున హతాశుండనై మందాత్ముండనై కుందుచుంటిం గావున నాశ సద్రుమం బగుపర్వతంబుకన్న మహత్తర యనియు నాకాశంబుకన్న నప్రమేయ యనియు నట్టియాశం దొలఁగించుకొనుట దుర్లభం బని తలంతు ననిన భీష్ముం డొక్కయితిహాసంబు సెప్పెద నది వినిన నాశానిరాసం బగు నని యిట్లనియె. 475

సుమిత్రుఁ డనురాజుచరిత్రము.

సీ. హైహయవంశీయుఁ డైనసుమిత్రుఁ డన్, మేటిఱేఁ డొకనాఁడు వేటకుఁ జని
నతపర్వ మగునొక్కనారసంబున లేడి, నడఁచిన దానితో నామృగంబు
పఱవ ననుసరించి పఱచె రా జది మిట్ట, పల్లంబు లనకుండ వడిని జూపె
నంతలో సమమార్గ మందుఁ జూపట్టియు, నంతలో దవ్వయ్యె నగ్గ మయ్యె

తే. దృష్టికి నగోచర మ్మయ్యె దొరకునట్లు, తోఁచి యుపవనంబులు నదుల్ త్రుళ్లి దాఁటి
పోవ జవసత్వతారుణ్యములు సెలంగఁ, దరియఁజను రాజు మృగ మంతదవ్వయగును.

క. దానిని ముట్ట నసాధ్యము, గా నెంచుచు రాజు చెంతఁ గసి దానిపయిన్
బూని శర మేయ మృగమును, దానికి గవ్యూతిమీఁదఁ దా లలి నిలుచున్. 477

వ. ఇట్లామృగంబు బహువిధవిలాసవిభ్రమణంబుల విభ్రమింపఁ జేయుచు నెట్టకేల కొక్కమహావనంబు సేరం బాఱె నంత మహీకాంతుండు నత్యంతశ్రాంతుండై తాపసాశ్రమం బగునమ్మహారణ్యంబుం బ్రవేశించి యొక్కచో విశ్రమించి శ్రమార్తుండై యుండం గాంచి కొందఱు ఋషు లరుదెంచి వానిం బూజించుటయు నతండు వారిం గుశలప్రశ్నంబు చేసిన వారును. 478

ఉ. ఏకులమందు జన్మ మగు నెద్దియొ నామము విల్లు నమ్ములున్
బాఁకును బూని కాల్నడఁ దపఃప్రవరాశ్రమ మిద్ది చేరఁ గా
నేకత మానొ మాకు విన నిచ్చ యగు న్వచియింపవే యనన్
వాకొనె రాజచంద్రుఁడు సపర్య లొనర్చుచు నెల్లవారికిన్. 479

సీ. హైహయాన్వయమున నావిర్భవించితి, మిత్రనందనుఁడ సుమిత్రుఁ డనఁగ

నెగడొందువాఁడను మృగయావినోదినై, సానుచరుండనై యడవికరుగు
దెంచి మృగంబులఁ ద్రుంచుచు నొకయిఱ్ఱి, నేసితి నది శరం బెద వహించి
పాఱెను దానివెంబడిఁ బడి నే నిహా, తాశుఁడ శ్రమకర్శితాంగుఁడ నయి

తే. వచ్చినాఁడ యదృచ్ఛమై సచ్చరిత్రు, లైనమీయాశ్రమంబున కలసి భ్రష్ట
లక్షణుఁడ నైతి నాశ శైలంబుకంటెఁ, బృథివికంటె నుదధికంటెఁ బెద్ద యగును.

తే. ఆశ కంతము లే దని యది ప్రపంచ, మున మహోన్నతి గైకొను నని తలంతు
దీనికారణసామర్థ్య మేను వినఁగ, వలతు నెఱిఁగింపుఁ డీరు సర్వజ్ఞు లగుట.

వ. అనుటయు నందు ఋషభుం డనుఋషిసత్తముండు సుమిత్రుం గాంచి యి
ట్లనియె 482

సీ. తొలి నేను దీర్ఘయాత్రలు సల్పుచుఁ గొనర, నారాయణాశ్రమద్వారమునకు
నరిగితి నట నొక్కహ్రదము వైహాయస, మై వెలయుఁ గా హయగ్రీవుఁ డచటఁ
గృతనివాసుం డయి సతతము జపమును, దపమును గావించి తత్పరుఁ డయి
నిగమంబులు పఠించు నే నందుఁ బితృదేవ, తర్పణంబు లొనర్చి తత్ప్రదేశ

తే. మునఁ దలిర్చెడునాశ్రమమునకుఁ జనిన, నచటఁ జీరాజినధరుండు నతికృశుండు
నున్నతోన్నతగాత్రుఁ డతుల్యార్జితుండు, నైన తనుఁడనుఋషి నాకుఁ గానఁబడియె

వ. అదృష్టపూర్వుం డగునమ్మహర్షిం గాంచి భయకంపితగాత్రుండనై పాదాభి
వందనంబు గావించి ప్రాంజలినై యెదుటనిలువం బడి నామగోత్రాదులతోఁ
దండ్రిం బేర్కొని ప్రవరం బఠించి నంత నతండు న న్నొకయాసనంబునఁ
గూరుచుండం జేసి ఋషిమధ్యగతుండై ధర్మార్థసహితం బగునొక్కకథం
జెప్పుచుండె నయ్యవసరంబున నటకు జవనాశ్వసమేతుండును సబలుండును
సావరోధజనుండును నగునొక్కరాజేంద్రుండు విషణ్ణవదనుండై వచ్చి లోక
పూజితుం డగుతనుమహర్షి కభివందనంబు గావించిన నతండు వాని కర్ఘ్య
పాద్యంబు లిప్పించి విశ్రాంతి వహించినంత నాగమనకారణం బడిగిన నతం డి
ట్లనియె. 484

శా. వీరద్యుమ్నుఁడు నాఁగఁ బేర్వడి జగద్విఖ్యాతినిం గొంటి నే
భూరిద్యుమ్నుఁడు నాకుమారు నడవిం బోకార్చుకొంటిం గనుం
గో రాఁ డయ్యె నొకండ బిడ్డఁ డగుటం గో డెత్తుచిత్తంబునన్
ఘోరారణ్యము నల్గడం దిరుగుచుం గు య్యోట్టనైతిం గటా. 485

మత్త. ఇందుఁ గాంచెద నిందుఁ గాంచెద నిందుఁ గాంచెదఁ బుత్త్రునం

చిందు నందుఁ బరిభ్రమించితి నెందు నేనియుఁ గాంచ నే
మందు నోమునిచంద్ర! నాదగు నాశ కంతము గల్గ లే
దందునన్ ఘనమోహతాపము లావరించె మనంబునన్. 486

వ. అని మొఱ్ఱవెట్టిన నమ్మునిముఖ్యుం డఱ్ఱు వంచి నిధ్యానపరుండై మాఱాడ కూరకుండ నృపోత్తముండు దీనముఖుండై మందమందంబుగా మఱియును.

తే. ఆశ ఫలియింప కుండిన నాత్మలోన, సర్వమును సహ్యమగుఁ జూవె సంయమీంద్ర దానికిం గలగొప్పయు దానిపెంపు, నెట్టి యవియొ నాకుం జెప్పు మిప్పు డనఘ.

వ. అని పలికినం దొల్లి యమ్మునీంద్రుఁ డారాజేంద్రునిం గాంచనకనకవల్కలాదు లభ్యర్థించి పొందం జాలక వానిచే నవమానితుం డగుటం జేసి నిరాశుండై నేనింకఁ బ్రతిగ్రహంబు సేయ నని ప్రతినం జేసి దీర్ఘతపంబు గావించి సిద్ధిం బడసి యున్నవాఁడు గావున వీనియాశ నేఁ దీర్చి వైచెద నని మనంబున నిశ్చయించుకొని యుండె నంత వీరద్యుమ్నుండు వెండియును. 489

తే. ఆశకుఁ గృశత్వ మెట్టిది యాశకంటె, దుర్లభం బైనదియు నేది ద్రుహిణుసృష్టిఁ గలుగు నే యనఁ దొల్లింటికథ తలంపు, వచ్చునట్లుగా మునియిట్లు పలుకఁ జొచ్చె.

తే. ఆశ దుర్లభ మైనప్పు డది కృశించు, నిట్లు రాజులఁ బ్రార్థించి యొఱఁగి కొంటి ననిన రా జను దుర్లభ మాశకనుట, యెట్టి దొం డగు నేఁ జెప్పు మెఱుక పడఁగ.

వ. అనుటయు నమ్మునీంద్రుండు చెప్పెద విను మర్థి యొక్కం డొక్కలోభియుఁ గృతఘ్నుం డగువానికడ నర్థం బాసించి దుర్లభం బైనప్పు డాయాశ కృశించుఁ దల్లితండ్రుల కేకపుత్రుండు నష్టుం డైనప్పు డాతం డెంత ప్రయత్నించినను గానం జాలనియప్పు డాశ కృశించు నని తనకుం దాఁకున ట్లనేకంబులు చెప్పిన విని సావరోధజనుం డగు రాజన్యుండు మాన్యుం డగు నాద్విజోత్తముని పాదారవిందంబులు శిరంబు సోఁక మ్రొక్కి. 492

ఉ. ఈ విపు డన్నవాక్యము లివెల్లను సత్యము లేను దీనుఁడన్
నావలనన్ నికార మగు నన్ను క్షమించి ప్రసన్నదృష్టివై
నావరనందనుం గనుఁగొనంగ మదిన్ దలపోయుచుండితిన్
గావున నాదు వాంఛిత మొకానొక యింతన తీర్చి ప్రోవవే. 493

ఆ. అనిన నవ్విభూసురాన్వయప్రవరుండు, తనతపంబువలనఁ దత్కుమారు నటకుఁ దెచ్చి వాని నారాజునకు నిచ్చి, యంపి వుచ్చె నెల్ల రారనంగ. 494

వ. ఇది యంతయు నేను చెవులార విని కన్నులారం జూచితి నీవు నీయాశం

ద్రెంచుకొమ్ము సుఖయింతు వని వృషభుండు సుమిత్రునకుఁ బోధించి మృగ
యావిముఖుం గావించె నీవును నిరాశుండ వై నీలోనిసంతాపంబు దిగఁద్రోలి
సుఖం బుండు మనినఁ బాండవాగ్రజుండు నీవాక్యామృతాస్వాదనమ్మునఁ
దనివి తీరకున్నయది మఱియుఁ గొన్నిధర్మంబు లుపదేశింపు మనిన భీష్ముండు.

అరువదివేలవర్షము లహర్నిశముల్ విడకుండ సత్తపో
గరిమ నెసంగి పేర్వడినగౌతముఁ డక్కమునిముఖ్యుఁ డొప్పున
త్తరుణమునం గృతాంతుఁడు ముదంబున నాతనిఁ జూడ రా ఋషీ
శ్వరుఁడు మహాప్రభావమున వాని నెఱింగి నమస్కరించుచున్. 496

వాని సత్కరించి వైవస్వతుఁడు నాదు, వలన నీకు నెద్ది వలయు నడుగు
మనిన గౌతముండు ప్రాంజలియై యిట్లు, ధర్మరాజు నడిగె ధర్మగతుల. 497

మాతాపితౄణమోచన, మే తెఱఁగునఁ జేసి పొందు నేసత్క్రియలఁ
ఖ్యాతములు పుణ్యలోకము, లాతతగతిఁ బడయుఁ బురుషుఁ డానతి యీవే.

అనిన యముం డిట్లనియె. 499

తపమున సత్యధర్మములఁ దా శుచియై పురుషుండు భక్తిమై
నెపుడును దల్లిదండ్రుల ననేకవిధంబులఁ బూజ చేసినన్
వ్యపగతదోషుఁడై ఋణము వాయఁగ నయ్యెడి వాజిమేధముల్
నృపతి పొనర్చి పొందెడి ననింద్యములై చనునూర్ధ్వలోకముల్. 500

అనిన యుధిష్ఠిరుండు వెండియుం బితామహునిపాదారవిందంబుల కభివందనం
బాచరించి మిత్రప్రహీయమాణుండును బహ్వమిత్రుండును క్షీణకోశుండును
బలహీనుండును దుష్టామాత్యసహాయుండును జ్యుతమంత్రుండును రాజ్య
ప్రచ్యవమానుండును బరచక్రాభియాతుండును విగ్రహావర్తమానుండును
నసంహితరాష్ట్రుండు నగురాజునకు సామాద్యుపాయంబులు పొంద రాని
యపుడు కర్తవ్యంబును గతియు నెట్టివి చెప్ప ననుగ్రహింపు మనుటయు. 501

క్షీణకోశబలుం డగురాజు జొనర్పనగువిధానము.

నదిసుతుం డిట్లను నిది యుత్తమప్రశ్న, మడుగ కుండఁగఁ జెప్ప నెడఁద నేయ
ధర్మ మెంతయు సూక్ష్మతమము చెప్పుటకును, బ్రజ్ఞ చాలని దగుఁ బ్రాజ్ఞులకును
విని యట్లు వర్తించుజనుఁ డాఢ్యుఁ డగు నీవు, మేధావివగుట నిమ్మెయి నడిగితి
యాత్రార్థ మగునుపాయము ధర్మబహుళము, చెప్పెద నేఁ బెద్ద చేయకున్న
శాస్త్ర మెఱుఁగ కున్న జనుఁడు విజ్ఞానము, వడయఁ జాలఁ డజ్ఞుఁ డర్థసిద్ధి
లేక యుండు శంక లేనితెఱంగున, నాలకింపు మనహితాత్ముఁడ వయి. 502

క. బంఁడారంబు క్షయించిన, దం డెల్ల క్షయించు దాన ధాత్రీపతికిన్
భండనములందు నెగ్గగు, బంఁడారము గూర్చు టొప్పు బహువిధగతులన్.

ఆ. పూర్వు లాచరించువుంతన పడి యుపాయమున ధర్మసంగ్రహమ్ము సేయు
టొప్పు నెల్లనాఁడు నొకతెఱంగా పత్తున నృతఁ యొక్క తెఱఁగు నరవరేణ్య.

సీ. అర్థంబుకంటె ము న్నలరు ధర్మము ధర్మ, మునకంటె సద్వృత్తి పొనరుచుండు
ధర్మంబు న్యాయవృత్తము నొందు బలవంతుఁ, డెల్లసంపదల వర్ధిల్లుచుండు
నాపద లరుదెంచునపు డధర్మము ధర్మ,మై యొప్పు నని పెద్ద లనిరి తొల్లి
ధర్మమునకు గ్లాని దవ్వులకుండఁగ నాత్మ, నరికట్టి క్షత్రియుఁ డరి జయించు

తే. నెన్నియేని యుపాయముల్ పన్ని తనదు, నాత్మ గెల్వనౌ బాహువీర్యంబుకంటె
నుద్యమంబున నైపుణ్య మొప్పు ననుచు, ధర్మవేత్తలు పచియింత్రు ధర్మతనయ.

తే. బ్రాహ్మణస్వము తాపసిస్వమును వారి
వృత్తు లడఁగ హరించుట పృథ్విపతికిఁ
బోలె యుండ దభోజ్యాన్నమును భుజింప
నొప్ప దని మున్ను చెప్పి రార్యులు మహీశ. 506

ఉ బొక్కస మెల్ల శూన్య మయి భూరిబలంబులు పొల్లవోయి న
ల్దిక్కులు పట్టిపోయినను లేవడి వచ్చినఁ బార్థివుండు లోఁ
జిక్కియు వైశ్యశూద్రులకు జీవిక యైతగు వైశ్యచర్యకున్
మక్కువ సేయ రాదు లఘిమం గులధర్మము వీటిఁబుచ్చుచున్. 507

సీ. బ్రాహ్మణజాతి కాపద్ధర్మమున నన్య, వృత్తి కల్పిత మయి విహిత మయ్యెఁ
దగదు క్షత్రియున కాదారి యాతండు ర,క్షించునట్టిండు శిక్షించునతఁడు
రక్షించి ప్రజల వారలనుండి ద్రవ్యంబు, వడసి వారలకయి విడువ వలయు
వ్యసనంబులన్ రాజు ప్రజలరక్షణము నాశించి యుండుట శాస్త్రసిద్ధమ యగు

తే. బలము దండము మిత్రము గలిగి కోశ, మెసఁగ రాష్ట్రమునన్ భేద మెనయ నీక
మాయ కాఁడగుశంబరుమాడ్కిఁ గాక, యిష్టుఁడై ప్రజలకు రాజ్య మేలవలయు.

తే. మూల మగుఁ గోశబలము భూపాలురకును
బలము కోశమూలము ధర్మములకు నెల్ల
నదియ మూలము ధర్మమే యఖిలభూప్ర
జకును మూల మనుచు శాస్త్రసరణి నుడువు. 509

క. పీడింపక బంఁడారము,కూడు టరిది గాన రాజు కువలయజనులన్
బీడించి దానిఁ గూరిచి, పో డఘములపొంత వట్టి పూరుకులేశా. 510

సీ. అర్థార్థమై కార్య మాచరించిన రిత్తయగుఁ జేయకుండిన నది లభించుఁ
గర్మనిశ్చయ మిట్టిగతి గల దగుట మేఁ, ధావి తత్పథమును దవిలికొనియు
సవనయూపార్థము క్ష్మాజము నఱకిన, నరు నట్లు రాజన్యవరుఁడు కోశ
సంగ్రహార్థము శత్రుజనుల వినిర్జించి, పాపము నంటనిదగిది నొప్పు
తే. ధన మిహపరంబులకును సాధనము ధనము, లేక యుండిన సత్యము లేక యుండు
ధర్మమును లేకయుండు నేదారి నైన, ధనముఁగణియించియజ్ఞాదు లొనరుపఁదగు.
చ అడవుల నుండువారలు ధనాఢ్యులు కారిహసౌఖ్య మెప్డు వా
రడుగరు సంస్కృతిం దవిలినట్టిరు నా దిది నా ద దంచు నె
క్కుడుమది చేసి విత్తమును గూర్తురు దానము ధర్మకర్మముల్
గడువడిఁ జేసి సౌఖ్యమునఁ గాలము పుత్తురనుత్తమోన్నతిన్. 512
తే. రాజ్యసకుధర్మ మొక్కండు పూజ్య మవని, ధర్మతత్పరుఁ డై రాజు దండమునను
దానమునయజ్ఞమున సుకృతంబునొంది, పుణ్యలోకంబులం బొందుఁ బూరుపంశ్య.
తే. అధను దుర్బలు గా ధని నధికబలునిఁ, గా వచింతురు ధన మంద కలదు సర్వ
మందుఁ గోశాధిపతి దుస్తరార్థములను, బొందుపడ నొంది పరమును బొందునధిప.
వ. అట్టిధనసంగ్రహం బధర్మంబునం గాక ధర్మంబునం జేయ వలయు ననుడు యుధి
ష్ఠిరుండు క్షీణుండును దీర్ఘసూత్రుండును బంధుసానుక్రోశుండును బరిశంకిత
వృత్తుండును శ్రుతమంత్రుండును విభక్తపురరాష్ట్రుండును నిర్ద్రవ్యనిచయుం
డును నసంభావితమిత్రుండును భిన్నామాత్యుండును బరచక్రాభిజాతుండును
దుర్బలుండును నాపన్నచేతస్కుండు నగువాఁ డెట్లు ప్రవర్తింప నగుం జెప్పు
మనియె ననిన నైమిశారణ్యవాసు లీవిషయంబున నవ్యాసుమూర్తి యెట్లు చెప్పెం
జెప్పు మని సూతునడుగుటయును. 515

## ఆశ్వాసాంతము.

మ. కలికిం బంచసహస్రవర్షములు పైఁగా నైనకాలంబు వ
చ్చి లసద్ధర్మము లెల్లఁ బొల్ల లగుచున్ శీర్ణంబు లై నవ్వుచున్
గులధర్మంబులు మాన కుర్వీసురులం గొల్వంగనై సద్వ్రతం
బుల వర్తించెడుచంద్రమౌళినృపతిం బోషింపు మోదేవరా. 516

గద్యము.

ఇది శ్రీమదధునాతనోభయకవిమిత్ర, వేంకటయజ్వాగ్రపుత్ర,
సమారాధితవిబుధరాజ, శ్రీపాదకృష్ణమూర్తికవిరాజ
ప్రణీతం బయినశ్రీకృష్ణభారతంబునందు
శాంతిపర్వంబునఁ దృతీయాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ



శ్రీ

బాలాత్రిపురసుందర్యై నమః.

# శ్రీకృష్ణభారతము

శాంతిపర్వము - చతుర్థాశ్వాసము.



మన్ముక్తీశ్వరసే
వామాహాత్మ్యాప్తవైభవసమేతుండై
భూమి నగుకల్పతరువై
హేమించెడుచంద్రమౌళి నేలుము దేవా. 1

## ఆపద్ధర్మపర్వము.

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె నట్లడిగినధర్మనందనునకు ధర్మమూర్తి యగువసుమూర్తి యిట్లనియె. 2

సీ. విజిగీషు వైనవిద్వేషి పై నెత్తిన, నెదిరింప రాదు తా నెట్టు లేని
సంధి చేసికొనంగఁ జను నర్థ మిచ్చియో, కానిచో నిజరాజధాని విడియొ
విపదంబుధిం దాఁటి వెనుక ద్రవ్యాదులు, గణియించుకొనుట సుకరమ యగును
బలవంతుఁ డగుశత్రు వలఁతికిం గలవైభ,వము సూచి సైఁచుట వట్టిమాట
తే. యట్టితఱి వానినెదిరించి యాత్మనాశ,నమున కగుకంటె నిటు చేత సముచితమని
నీతిశాస్త్రము వచియించు హేతిబలము, గలుగునే నరిపై నొడ్డి గెలుచుట తగు.

క. అనుడు యుధిష్ఠిరుఁ డిట్లను, దనలోపలివార లలుగ దాయలు పీడిం
చిన మంత్రము బాహిర మ్మైనను గోశము సన్నగిల్లినను జను టెట్లో. 4

వ. అనిన భీష్ముం డిట్లనియె. 5

ఉ. శీఘ్రము సంధికార్యమును జేయుటొ చేవ గలాఁడవై యని

క్షిప్రము సేయుటో యెదియుఁ జేయఁగఁ జాలనివాఁడు రాజ్యముల్
క్షిప్రము వీడి పోవుటయె చేయఁగఁ జెల్లు మహీతలేశ్వరుం
డప్రతిరోధ మిష్ట మగు నల్పబలంబున గెల్చు నొక్కెడన్. 6

క. అని మొన గెలిచిన రాజ్యము, గొని సర్వసుఖంబు లందుకొనఁ గల్గెడు శ
త్రునిచేతి హతిహతుఁ డై, నను స్వర్గసుఖంబు లందు నరపతి సతమున్. 7

వ. అనిన నజాతశత్రుండు మందాకినీపుత్త్రుం దిలకించి సర్వలోకాభిసంహితం బై నధర్మంబు హీనం బై జఘన్యకాలం బరుదెంచి యున్న యప్పుడు పుత్త్రపౌత్త్ర పరివృతుం డగుబ్రాహ్మణుం డెట్లు జీవించుం జెప్పు మనిన నప్పరమోత్తమచరితుండు. 8

సీ. విను మట్టియెదనున విజ్ఞానబల మూని, జీవింపఁ గాఁ జెల్లు క్షితిసురుండు
జగతి విజ్ఞానికి సాధ్వర్థ మగుసర్వ,మును నసాధ్వర్థము గన మొకండు
తనయాత్మసంకరమున కైనఁ గృచ్ఛ్రవిధ,ర్మమునన సాధువుమది గఱచి
యడిగి యేనియు విత్త మార్జించి సాధువు,లకుఁ బెట్టి తాఁ దినుటకునుజాలు

తే. నిందితులయందు మేధావి నిలువఁగలఁడు,వృత్తివిజ్ఞానవంతుఁడై వెలయఁగలఁడు
వృత్తి గలిగినఁ దేజస్సువిపులబలము,గలుగుఁ బ్రాకృతశాస్త్ర మిక్కరణిఁ దనరు

వ. రాజన్యుండు ఋత్విక్పురోహితాచార్యప్రభృతుల బ్రాహ్మణోత్తముల నెవ రెట్లు చెప్పినను వేధించు టొప్పదు సత్కరించు టొప్పు నెప్పుడును బరీవాదంబులు చెప్పుటయు వినుటయుం దగ దట్టితరుణం బరుదెంచినప్పుడు జాను గులం గప్పుకొని పోవం దగుఁ బరీవాదంబును బైశునంబును దుర్జనలక్షణంబులు సత్పురుషు లెప్పుడును గుణంబు లభివర్ణింతురు మాత్సర్యంబున నొండె లోభంబున నొండెఁ బరనింద సేయం బాడి గాదు నిజకర్మపరిత్యాగి యై వికర్మస్థుం డగువాని దేవ శ్లథఃపతితుం గావింతురు వ్యాజంబులం బన్ని పర విత్తంబు పరిహరించుట పాతకంబు నీ విట్లు గాక సల్లక్షణంబులం బ్రవర్తింపు మని వెండియు. 10

## రాజోనర్పం దగుముఖ్యధర్మములు.

సీ. నృపతి బొక్కసమును నింప నొఁ దనదురా,ష్ట్రమునుండిపరులరాష్ట్రంబునుండి
రాజ్యాభివృద్ధి కర్థము మూల మగు దాన, ధర్మాభివృద్ధియుఁ దనరుచుండు
నబలునకుం గోశ మగు ననరా దకో,శునకు బలం బుండ దనఁగ వచ్చు
బలము లేకున్న రాజులకు రాజ్యం బెట్లు,శ్రీ యెట్లు రాజ్యంబు చెందకున్న

ఆ. నుచ్ఛవృత్తియందు నున్నచో శ్రీహోవు, టరయఁ జావుకన్న నతిశయించుఁ
గాన నెట్టు లైనఁ గాని కోశము బల,మునవనివిభుఁడు గూర్చుటది హితంబు. 11

క. ధనహీనుఁ డైనభూపతిఁ, గన నొల్లరు ప్రజలు వాని కార్యము సేయం
జన దనిన వినరు శాసన, మన హీ యని ధిక్కరింతు రవనీనాథా. 12

క. తన కెన్ని తప్పు లుండిన, ధనవంతుఁడు పూజ్యుఁ డగును తద్దోషములన్
ధన మెపుడుఁ గప్పిపుచ్చును, వనితామానంబు గాచు వసనము వోలెన్. 13

క. ధన మల్ప మైన మర్త్యుఁడు జగతిన్ నిలుపు నేని ధరణీవిభుఁ డం
దున సర్వపూజితుం డయి, ఘనతరకీర్తిం దలిర్చుఁ గౌరవనాథా. 14

సీ. లేదిహంబు పరంబు లేదనునాస్తికు, వలన విశ్వాసము సలుప రాదు
పోరకుండినవానిఁ బొలియింపఁ గా రాదు, పరదారగమనంబు పంకిలంబు
బ్రహ్మవిత్తాపహరణము నిశ్శేషక, రణ మరియే నొనర్పంగ రాదు
బలవంతుఁడ నటంచు బయిసిమాలి నృశంస, ముల నెన్నఁ డేనియు సలుపరాదు

తే. ధర్మము నధర్మమును జూడఁ దవిలియున్న, ధర్మ మది యధర్మముగా నధర్మమరయ
ధర్మముగ నయి యొక్కొకతఱి విరూప, ఫలములనొసంగఁ గలవఁగుఁ బార్థివేంద్ర

ఆ. బలము వలన ధర్మ మలరు ధర్మము బల, మందు నిలుచు నదియు నదియు వాయు
ధూమజలవిధమునఁ దోడ్పడియుండును, బలము గలుగువాఁడు వడయు సుఖము.

శా. దుష్టాచారుఁడు నష్టజీవనుఁడు దోడ్తో సర్వలోకంబులన్
గష్టంబుల్ గలఁడై తపించెడిని యోగక్షేమముల్ గోరునే
శిష్టబ్రాహ్మణపూజ చేసి శ్రుతులన్ సేవించి సత్కార్యమం
దిష్టంబుం గలఁడై మెలంగినను వాఁ డేనోవిహీనుం డగున్. 17

వ. సత్యాచారసంపన్నుఁడు దస్యుఁ డైనను జగన్మాన్యుం డై యిహపరంబుల
సుఖించు నేతదర్థంబున నొక్క పురాతనేతిహాసంబు గల దాకర్ణింపుము. 18

## కాయవ్యోపాఖ్యానము.

సీ. పారియాత్రాచలప్రాంతంబునఁ గలండు, కాయవ్యుఁ డనునొక్క బోయవాఁడు
శూరుండును బ్రహర్తశ్రుతవంతుఁడును మతి, మంతుఁడును నృశంసవంతుఁ డొక్క
క్షత్రియునకు బోయచానయందు జనించు, దాన క్షత్రియధర్మతత్పరుఁ డయి
ప్రాహ్ణమునందు సాయాహ్నమునందును, మృగయావినోది యై మెలఁగు నడవి

తే. నొకఁ డనేకశతంబుల నుక్కడంపఁ, జాలి ధర్మజ్ఞుఁడై ముదుసళ్లు చీఁకు
లైనతలిదండ్రులను భక్తుఁడై నిరతము, కొలుచు మధుమాంసములు ఫలములును బెట్టి.

వ. మఱియు నయ్యరణ్యంబునం గలప్రవ్రజితు లగుబ్రాహ్మణుల ఫలాహారాదులం బెట్టి పూజించి సేవించు చుండె నయ్యవసరంబున నొక్కనాఁ డందందుఁ గల దస్యుజనంబులు వేనవేలుగం గూడి వచ్చి కాయవ్యుం గాంచి మోడ్పుగేలు ఫాలంబులం గీలించి 20

ఉ. స్వామి! మహాత్మ నీమెఱుఁగఁ జాలనిచాలిక లెందు నుండుటల్
మేము వినంగఁ బోము నిను మెచ్చిననోట మఱొక్కపోటరిన్
సామెత కైనఁ జెప్పుటకుఁ జాలము జాలము లేక నీవు మా
గ్రామణి వై మము న్నడుపఁ గాఁ దగు లెంకల మేము నీ కిఁకన్. 21

క. చెప్పినచొప్పునఁ జేయుదు, మప్పా! మాపాలిపున్నె మై యేలుకొనం
జొప్పడుము తల్లిదండ్రుల, చొప్పై కనికరముఁ జూపుచు న్మామీఁదన్. 22

వ. అనినం గాయవ్యుండు వారి కిట్లనియె. 23

సీ. తలిరుఁబోఁడుల భీరువుల శిశువులఁ దపస్వులఁ జంప రాదని దొలఁగియున్న
వాని నేయఁగ రాదు వామాక్షులం జెఱఁ, బట్ట రా దెల్లసత్త్వంబులందుఁ
బెంటిఁ గూల్పఁగ రాదు విప్రులకుం గీడు, సలుప రా దేనాఁడు స్వస్తి వలికి
వారిహితార్థ మై పోరిత మొనరింప, నొప్పు సత్యము వీడ నొప్ప దెపుడు

తే. అనిశ మమరులఁ బితరుల నతిథిజనులఁ, దవిలి సేవింప వలయు భూతలసుపర్వు
లెల్లప్రాణులలో మేటులింత యెలివి, లేని చాలుదు రిలోక మేర్చి వైవ. 24

తే. శిష్టజనులను వేధించుచెనఁటులకు వధమ్మె దండము రాష్ట్రబాధక మొనర్చి
వృద్ధినొంద నెంచినవాండ్రు పీన్గులోని, పుర్వులకు సరిపోల్ప నొప్పుదురు సూరె

ఆ. ధర్మశాస్త్రరీతిఁ దవిలి వర్తించెడు,వారు దస్యు లైన వసుధలోన
సిద్ధి నొందఁ గలరు చెప్పితి మీ రిట్లు, నడతు రేని మీకు నొడయఁ డగుదు

వ. అనిన వా రట్ల యగుం గావుత మని తదనుమతంబునం బ్రవర్తించి పాపంబులం బరిత్యజించి ప్రవృద్ధిం గాంచిరి కాయవ్యుండును దస్యుల నెల్లధర్మప్రవర్తకులం గావించి ధర్మకర్మంబునం జేసి సిద్ధిం బొందె. 27

క. కాయవ్యచరిత మెప్పుడు, పాయక చింతించుచుండుపంచజనులకున్
మాయ మగుఁ బాపసంచయ, మేయెడలన్ భూతభీతి యేర్పడ కుండున్. 28

వ. అని చెప్పి భీష్ముండు వెండియు. 29

ఉ. కోశము వృద్ధి చేయుటకుఁ గోరెడురాజు మహీసురస్వమున్
శ్రీశముఖామరస్వమును జేకొనఁ జెల్లదు దస్యువిత్తమం

దాశ పౌనర్భ టొప్ప దథమార్థము లుత్తమకర్మదూష్యముల్
దేశజనుల్ మహీపతి కతిప్రణయార్హు లగర్హ్యు లెన్నఁగన్. 30

క దేవతలఁ బితల మర్త్యుల, సేవం బొనరిచి హవిస్సుచే నర్చనలం
గావింప కుండునధముని,కై వెలసినధన మనర్థకం బగు నధిపా. 31

ఉ. లోకము శోకముం గొనక లోముచ మేర్పడ నిచ్చుద్రవ్యముం
జేకొన నొప్పు భూధవుఁడు చెట్టలనుండి ధనంబు తెచ్చి సు
శ్లోకుల కిచ్చినన్ ఫలము సుంతయు లేదది శుద్ధి వాపఁగా
నై కొనువారికిం దనకు నార్తి ఘటిల్లఁగఁ జేయు నవ్వలన్. 32

వ. ఇట్టిధర్మంబు లెన్ని యేనిం గలవు రాజగువాఁడు ధర్మంబులతెఱం గెఱింగి యనాగతవిధాతయుఁ బ్రత్యుత్పన్నమతియు నైనచో సుఖించు దీర్ఘసూత్రుం డైనచో నశించు నీయర్థంబున నొక్కయితిహాసంబు గలదు చెప్పెద వినుము.

దీర్ఘదర్శి మొదలగుమత్స్యములవృత్తాంతము.

క. కల దొక్కమడు వగాధస, లిలములకుం గాక మిక్కిలిగ మత్స్యకులం
బులకు నివాసం బగుచున్, జలజవనాకీర్ణ మగుచు ఖ్యాతలఘుందున్. 34

వ. అందు దీర్ఘదర్శియుఁ బ్రాప్తకాలజ్ఞుండును దీర్ఘసూత్రుండు ననుమూఁడు మత్స్యంబులు మిత్రంబులై సహచారులై యుండె నంతఁ గొంతకాలంబునకు నమ్మడు వెండఁ బాఱుటయు నందలిజలచరంబులు కొన్ని దానిని విడిచి నానాముఖంబుల వివిధజలాధారంబులకుం బోవుటయు నయ్యవసరంబున దీర్ఘదర్శి తనయిరువురు సుహృదులం గాంచి యిట్లనియె 35

క. మడు వింకఁ బాఱె జలచర,దడముల కత్యంతభయము దాపర మగు ని
య్యెడ విడిచి యొండు వోవుద, మెడ సేయక జాలు తెగనియింతటిలోనన్.

తే. ప్రాప్తకాలజ్ఞుఁడను నేదిప్రాప్తమగునొ,దానికగునుపాయమువన్ని దాఁటుటొప్పుః
గాని రాఁ గల దని నేగి దాని కిపుడ,కుతిలఁగుడుచుట పోలునే మతిఁ దలంప.

వ. అనెడు మిత్రులనుడు లాలకించి దీర్ఘసూత్రుం డాత్రంబు లేనిచందంబున ని ట్లనియె. 38

చ. మడు విది పెద్దసాగరము మాడ్కి నెసంగెడి నెండిపోవు నం
చెడఁద భయంబు నొంది యెటనేఁ జన నొప్పెడు నంచు నొక్కఁ డ
త్తడ వరుదే నుపాయమున దాఁటుద మంచు మఱొక్కఁడున్ వృథా
యిడుమ పడంగ నేటి కెపు డిందన యుందము కుందు డిందఁగన్. 39

వ. ఇట్లిర్వురుం బ్రత్యాఖ్యానంబు చేసిన మహామతి యగుదీర్ఘదర్శి. 40

క. చేతోభీతిం గా దని,స్రోతోమార్గమునఁ బోయి చులక గభీరం
బై తోఁచిన పెద్దమడుం,గాతతమతిఁ జొచ్చి యచ్చ నందు సుఖంచెన్. 41

వ. అంత నిచ్చట. 42

మ. మడుగుం జా లది ప్రీలి నీళులు నశింపం జొచ్చె నానాఁట న
య్యోడ వేఁ టాడఁగ జాలరుల్ వలలతో నేతెంచి నీరెల్లఁ ద
ల్లడ మందన్ బదహస్తతాడనములన్ లఘింపఁగాఁ జేసి పె
న్వాడి జాలంబులు వెట్టి పట్టి రచట న్వాసించు మత్స్యంబులన్. 43

ఉ. ఊఁతలు వేసి వేసి తమయోపిక కోపక తేల దేవియున్
జేతుల బెళ్కుబేడిసలఁ జెచ్చెరఁ బట్టియు బుట్టఁ బెట్టియున్
ఘాతుకులైరి జాలరులు గంతు లిడ న్నెడ గిల్లి చంపియున్
మూతులు ముక్కులున్ విఱిచి ముక్కలు చేసియు రెండు మూఁడుగన్. 44

శా. వంశాగ్రంబుల ప్రేలుసూత్రముకొనన్ వాలారుమత్స్యంబులన్
దంశం బట్లు తగిల్చి గాలము లగాధంబం దొగిన్ ప్రేయ న
య్యంశంబు న్నెసవంగ వచ్చు నని మీ లాసించి మ్రింగన్ జడుల్
భ్రంశం బందగ నీక చేకొనిరి లోభం బిట్లు లోకంబునన్. 45

చ. జలములఁ దాటిపిండ మిడి సర్వముఖంబుల వచ్చి మేయుచో
వలలను ద్రిప్పి పై విసరి వాటముగా సరి చేసి లాగుచున్
జలజలరాల విప్పి ధరఁ జచ్చియుఁ జావక లేచి కూలుమీ
నులఁ గొని గోచిబుట్ట నిడి నున్నఁగఁ జేసిరి మద్గు నాజడుల్. 46

వ. ఇట్లు మత్స్యోపజీవులు జలాశయంబునం గలమత్స్యంబుల నెల్లం బట్టుచున్నప్పుడు దీర్ఘసూత్రుం డితరమత్స్యంబులతోడం బట్టువడియె నట్టియెడఁ బ్రాప్తకాలజ్ఞుండును. 47

ఉ. జాలరు లట్లు చేఁపలను జాలెడు నట్లుగఁ బట్టి త్రాళులం
జాలుగఁ గ్రుచ్చుచున్నతఱిఁ జయ్యన నగ్గుదిమీలలోనఁ దాఁ
బోలఁగ దూరి దాడలను బ్రోదిగఁ గ్రుచ్చినయట్లు పట్టి మూ
ర్ఖాలస మైనచందమున నారయ వచ్చె నయంబు పెచ్చునన్. 48

వ. అంత నమ్మత్స్యోపజీవులు. 49

ఆ. మీలరొంపి వోవ మే లైనజలముల,గుదెను వైచి తోలఁచు నద నెఱింగి

ప్రాప్తకాలవేది ప్రాఁటిపట్టు న్విడి, పడిగఁ బాఱె నీటియడుగుఁ జేర. 50

ఆ. దీనబుద్ధి యైనదీర్ఘసూత్రుఁడు సహా,గతవిపత్తెఱుంగ కతఁగుఁ డగుచు
జాలమందుఁ జిక్కి జాలరి తల గిల్లి, చంపఁ జచ్చె నొక్కక్షణములోన. 51

తే. ప్రాప్తకాలం బెఱుంగనిబాలిశుండు, దీర్ఘసూత్రునిగతిఁ జచ్చుఁ దెలివిగలుగు
నరుఁడననియెప్పటికిఁబోల నడచువాఁడు, ప్రాప్తకాలజ్ఞునటు సందియంబునొందు

క. రాఁ గల మేలుం గీడుం, బాగుగ మనమం దెఱింగి ప్రజ్ఞాగరిమన్
దాఁ గడఁగి నడచి సుఖులై, భోగించున్ దీర్ఘదర్శిఁ బోలి నరేంద్రా. 53

వ. అభిప్రేతార్థసిద్ధికి దేశకాలంబులు ముఖ్యంబులు దేశకాలంబు లెఱింగి మెలంగు
వాఁడు ఫలంబు నొందు ననిన ధర్మనందనుండు. 54

సీ. అలఘుమతీ! బుద్ధిబల ముత్తమం బంటె, వో నందు నరులచే నావృతుఁ డగు
నృపుఁడు మోహము నొందకెట్లుండుఁ బదుగురు, పెరవారు ముట్టడివెట్టు నపుడు
పార్థివుం డేరీతిఁ బచరింప నగు విప, న్మస్థు నొక్కని బెక్కుమంది ముట్టి
నొంప నెంచ సహాయసంపద లేనివాఁ, డోర్చి కాలూఁది యె ట్లుండఁ గలఁడు

తే. మిత్రు నరి నెట్లు తెలియుట మిత్రు నట్లు, యుండి శత్రువ యగువాని యోజ యెట్లు
సంధియును విగ్రహముఁ జేయఁ జనెడువార, లెవ్వరో చెప్పుమన భీష్ముఁడిట్టులనియె.

సీ విను మమిత్రుఁడు మిత్రుఁడును మిత్రుఁడు నమిత్రుఁ, డగుదురు కార్యసామర్థ్యమునను
గార్యము లెప్డొక్కగతిగ నుండవు గాన, సంధివిగ్రహములు సంభవించుఁ
గార్య మకార్యముం గణుతింప నగు దేశ, కాలవిజ్ఞానము గలిగి యుండి
బుధులతో సంధానమును బొనరింప నొ, ఖలులతో నెప్పుడుఁ గాదు సేయ

తే. ప్రాణములు నిల్పుకొనుపొంటె నరులతోడి, సంధియును జెల్లుఁ జెల్లదు సంతతంబు
మిత్రసంధియు నొక్కప్డు మీఁదుమిక్కి, లిగఁ దటస్థించు నింతఁ దెలియఁగనొప్పు

వ. మార్జారమూషికసంవాదం బనునొక్క యితిహాసంబు గల దది నీయడిగినదాని
కుత్తరం బగు నని యిట్లనియె. 57

మూషికమార్జాలసంవాదప్రకారము.

చ. కల దొకపెద్దమఱ్ఱి యొకకారడవిన్ రవికాంతి యింతయే
మెలఁగఁగఁ జోటు లేనియటు మిక్కిలి చిక్కఁగ నల్లుకొన్న కొ
మ్మలు గలదై లతాచయసమావృత మై ద్విజసంఘసేవ్య మై
బల మగునూడలం గలిగి వ్యాలమృగాకుల మై మహోన్నతిన్. 58

క. పాలమెల్ల నావరించియు, జలదము పన్నినతెఱంగు చల్లనినీడం

గలిగి మహాస్కంధమునం, బొలుపాఱున్ మఱ్ఱి సత్త్వముల కాదరువై. 59

తే. దానిమూలమునందు శతముఖబిలము,
ద్రవ్వుకొని యందుఁ బలితుఁ డన్ దనరు నెలుక
యుండుఁ గొమ్మలపై లోమశుండు నాఁగ
నొక్కమార్జారము వసించు మక్కువమెయి. 60

శా. ఇ ల్లాకాననమందుఁ గట్టుకొని తా నేప్రొద్దు సత్త్వంబులం
ద్రెళ్లం జేయుచు నుండు మూలఁ దోకఁ దర్థిం బ్రొద్దు వ్రాలంగ నే
ర్పెల్లం జెల్లఁగ మఱ్ఱిమ్రాఁకుకడ ను చ్చేర్పాటు గావించి రే
యిల్లుం జేరి శయించి వేకువన కొం చేగున్ వల ల్జీవులన్. 61

వ. ఇ ట్లుండ నొక్కనాఁడు. 62

ఉ. రేయి పడంగ మేఁతకుఁ జరించుచు రోమశుఁ డిందు నందు నా
స్నాయుమయోగ్రపాశముల సంగతి కై నడయాడ లేక దుః
ఖాయితమూర్తి యయ్యె నది గన్గొని యెల్క భయంబు దక్కి తా
నాయెడఁ దిండికై తిరుగునట్టిద యయ్యెఁ బ్రమాద మేర్పడన్. 63

వ. అంతలోన. 64

తే. ఎలుకగంధము వచ్చిన నెర లభించు, ననుచు హరితుఁ డన్ ముంగిస తనదుతామ్ర
లోచనంబులు మెఱయఁ గలుఁగుననుండి, వచ్చియూర్ధ్వముఖంబయి పజ్జనిలిచె.

ఆ. అంతలోనఁ గోటరాంతరంబుననుండి, చంద్రకుండు నాఁగఁ జనెడుగూబ
చెట్టుకొమ్మమీఁద నట్టె ఱివ్వన వ్రాలె, నెలుకఁ బట్టికొనెడునిచ్ఛఁ జేసి. 66

మ. నకులోలూకము లిట్లు తోఁచి మదికి న్గాఢార్తి పుట్టింప మూ
షిక మాదాయలబాఱిఁ దప్పికొని పోఁ జిత్తంబు గావించి తోఁ
పక తె ర్వెట్లును జావు దప్ప దనుచున్ భావించి పో నుండఁ జా
లక విజ్ఞానముకల్మి ధైర్యమున నీలాగెంచెఁ జిత్తంబునన్. 67

చ. కలుగున కేగ వెంటఁ బడి గంతుగొను న్నకులంబు పోక యి
త్తలమున నున్న గూబ ననుఁ దన్ని గ్రసించెడు నెట్లు నేఁతకుం
దెలియుట లే దపాయ మగుచెంచెడు దీనిని నిస్తరింప నా
కులరిపు వైనపిల్లియ యగున్ గతి కా దొకఁ డెద్ది యేనియున్. 68

సీ. నాదాయ మార్జార మేదారి దోఁపని, విషమగతిం బడి వెగడు గుడుచుఁ
బ్రాణార్థి యగుదీనిప్రాణము రక్షించి, రక్షించుకొందు నాప్రాణములను

నీతి నీతనిహితమీతఱి వర్ణించి, సిలుగు దీఱంగ వంచించి పోదు
సహజశత్రువు వీనిసంగతి యొప్పుడు, విపన్నస్థితిం గొన్నవీనితోడ

తే. సంధి చేసెద నిప్పట్లశత్రు నైన, నాశ్రయించుట తగు నందు రార్యజనులు
పండితుం డగుశత్రు వపండితుఁ డగు, మిత్రమునకన్న శ్రేష్ఠుఁ డీధాత్రియందు.

వ. పండితుం డగునీరోమశుండు నావచనంబునం జేసి నాపై మమత్వంబు ప్రతిష్ఠించు నని తలంచి సంధివిగ్రహకాలజ్ఞుం డగుపలితుండు మార్జారంబుచెంతకుం జని సాంత్వపూర్వంబుగా నిట్లనియె. 70

మ. సుహృదాచారముఁ జేసి పల్కెదను నాచుట్టంబు గాఁ జూచుచున్
గ్రహచారం బొకరీతి గా నగుట నీకష్టంబు ప్రాప్తించె నీ
కు హితం బెంచితి నిప్డు నీ వసువులం గోల్పోక యుండంగ నే
సహకారిత్వ మొనర్చి కూర్చెద నొగిన్ సౌఖ్యంబు సఖ్యంబునన్. 71

క. నీవలన నా కపాయం, బెవిధమునఁ గాని రానిదే యగు నేనిన్
నావలన నొకయుపాయము, జీవితము న్నిలువరింపఁ జేయఁగఁ దోఁచెన్. 72

క. అది నాకు నీకు శ్రేయఃప్రద మోమార్జార రాజ! పఱతెంచి ననున్
సదమదము చేసి తినఁగా, నిదె ముంగియు గూబ వేఁచె నీక్షించితి వే. 73

ఆ. వానినుండి భయము వాయఁ గాపాడు మే,నీదునురులు ద్రెంచి నీభయంబు
వాయఁ జేయఁ బ్రతిన వట్టితి నీవల,నను భయంబు గలుగ దనిన యేని. 74

సీ. ఈవృక్షమూలము నేను నగ్రము నీవు, నాశ్రయించి మెలంగునట్టివార
మెంతో కాలమునుండి యిదివఱ కెట్లున్న,నిఁకఁ బరస్పరసఖ్య మెసఁగ వలయు
నీజీవితము నేను నిలిపెద నాజీవి,తము నీవు నిలిపినదానఁ జేసి
తేపచే నది దాఁటి తేపను దాటించు, నోజ నా మనసమాయోగ మిపుడు

తే. అనుచుఁ బలితుండు పలికిన నాలకించి, సమయసంగతికిం గడు సంతసించి
మెచ్చుచును సామవాక్యములుచ్చరించి,యొలుకఁ గన్గొనిపిల్లి యిట్లనియె మఱియు

మ. మది సంతోషము నొందె నీనుడికి సౌమ్యా! నన్ను నాపన్ను నిన్
బ్రదికింపం దలపోసి శ్రేయమునఁ గూర్పం జూచి తేసంశయ
మ్మొదవం జేసికొనంగఁ బోల దిపు డీవో ప్రాణభీతిం దపిం
చెద విప్పట్టున నీవు నేను సఖతం జేకొంట మే లయ్యెడిన్. 7(

ఆ. ప్రాప్తకాల మయ్యెఁ బరఁగ నే కార్యము, సిద్ధికర మొ దానిఁ జేసి నాకు
నడలు గుడుప కుండ విడుగడ గలిగింపు, నీదు మేలు మఱవ నేను సఖుఁడ. 7

చ. శరణము వేఁడెదన్ నిను వశంవదుఁడన్ భవదీయశిష్యుఁడన్
నిరతము నీహితం బె గమనించెదువాఁడను న్యస్తమానుఁడం
గరుణ దలిర్పఁ జూడు మనఁ గాఁ బలితుం డెద సంతసించుచుం
గర మనురక్తిఁ జూపుచు ముఖాముఖ య్యై యను నివ్విధంబునన్. 78

చ. పలికితి నీయుదారగుణపద్ధతికిం దగ నబ్బురంపడం
గలుగ దొంకితయేని నిను గాడిలిచుట్టము గాఁ దలంచితిన్
జెలిమి దలిర్ప నీకడకుఁ జేరితి ముంగియు గూబపిట్టయున్
గలఁచెడి నాదుడెందమును గావుము వీనిభయంబు వాపుచున్. 79

క. చంపకుము నన్ను నిన్నుం, జంపక యుండంగఁ జేయుశక్తిఁ గలిగితిన్
శంకింపకుండు మీయురి, పెంపెల్లం జెడగఁ గొఱికి వేయుదు నింతన్. 80

వ. అనిన లోమశుండు హర్షోత్కర్షంబునన్ జూచి స్వాగతంబు వలికి పూజించి
సౌహార్దంబుఁ జూపుచుఁ బలితునిదిక్కు మొగం బై యి ట్లనియె. 81

ఆ. రమ్ము ప్రాణసఖుఁడ ప్రాజ్ఞుఁడ వగునీప్ర,సాదమునను మరల నాదుజీవి
తమ్ము నిలువఁ గలుగు నిమ్మెయి నీకు నేఁ,జేయఁ గలను సంధి చేసికొనుము.

తే. పెక్కుప్రత్యుపకారము లొక్క మొదటి
యుపకృతికి దీటు రావు నీ విపుడు చేయు
నిది మహోన్నత మొకఁడు తా నేమి కోర
నుపకృతి యొనర్చు నది చెప్ప నొరుఁడు కలఁడె. 83

వ. అని బిడాలంబు వలికినపలుకుల కలరి మూషికంబు విశ్వసించి తల్లిదండ్రుల
యుత్సంగంబునకుం జనుదెంచుబిడ్డవలె దానిపాదిగిటికిం జని యొదిగియుండె
న ట్లుండుటం గాంచి నకులోలూకంబులు వానిప్రీతికి విస్మయంబు నొంది పిల్లి
భయంబున నెలుకం బట్టుకొనునాస విడిచి యచ్చోటు వాసి పోయె మార్జాల
గాత్రలీనం బై నమూషికంబు దేశకాలంబు లెఱింగినప్రోఁడ గావున నయ్యు
రిత్రా డొక్కపరి కటుక్కునం గొఱికి త్రెంప కల్లనల్లం గఱచుకొని యుండె
నప్పుడు బంధపరిక్లిష్టుం డగులోమశుండు త్వరాన్వితుం డై పాశభేదనంబున
మూషికంబునకు సంచోదనంబు చేయుచు ని ట్లనియె. 84

తరలము. తడయు దేటికి ద్రెంప కీయురిత్రాడు నావలనం గృతా
ర్థుఁడవు నీ విటు నన్నుఁ జేయుట దోష మంచుఁ దలంపవో
విడిచి ద్రోహము తామసంబును వేగ మాలఁడు రాకము

న్నిడియఁ జేయుము వజ్రదంష్ట్రల నిన్నరంబులపాశముల్. 85

వ. అని వేగిరించుచుం బలికినఁ బలితుం డకృతప్రజ్ఞుం డగులోమశుం గాంచి యి
ట్లనియె. 86

ఉ. ఊరక యుండు మేపనికి నొప్పదు వేగిరపాటు లక్షణం
బారసి చేయుచేత సుఫలాతిశయంబున నొప్పు గాలముం
గూరనియ ప్డనర్థమ యగుల్ విదితం బిది యెల్ల నాకు మా
ర్జారము! లోన నీభయ మెసంగు నకాలమునందు విడ్చుటల్. 87

క. కాలము ప్రతీక్ష సేయుము, జాలింబడి వేగిరింపఁ జనదయ్య సఖా
మాలఁడు సశస్త్రహస్తుం, డై లక్షింపంగ నైన యప్పుడ త్రెంతుల్. 88

క. సాధారణభయమున నీ, వీధరణీరుహము నెక్కి నెంతువు మఱి యే
గాధమునకు డిగ వే నే, యాధియు లేకుండ లాఁగ కరిగెద సువ్వే. 89

వ. అని మూషికంబు తనహితం బెంచి పలికినఁ బలితుం గని జీవితార్థి యగుపృష
దంశుకంబును. 90

సీ. అగునయ్య మిత్రకార్యము పట్ల సజ్జను, లీరీతిఁ జేయుట యెఱుఁగ మయ్య
త్వరపెట్టి నీవు నావలన నాపదనుండి, ముక్తుఁడ వైతి నాముక్తిపొంటె
వెఱ చఱచినదాన వేగిరించెదఁ గర్జ, మొనరింప జతనింపు మనఘ మూర్తి
మనపూర్వ వైరముం బాటించి కాలము, గడపుచుంటివ యేమొ కాకు మట్లు

తే. తొల్లి తెలియక యేదేనిదుష్కృతంబు
నొనరిచితినయే నది నీదుమనమునందు
నిడికొనక నన్ను క్షమియింపు మిదె భజింతు
నీకుఁ బ్రసన్నుఁడ వగుము నాయెడఁ గృపాత్మ. 91

వ. అనవుడు పలితుండు. 92

క. నను నీవు నిన్ను నేనును, గని యెఱుఁగుదు మిపుడు మైత్రిగల మైతిమి మి
త్రుని నిను రక్షించుట నేర్పునఁ బాముం బట్టి విడుచుపొల్పున వలయున్.

క. బలవంతునితో సంధిల్, గలిగించుకొనియు భయంబు గలఁడై మెలఁగల్
వలయు నటు కానిచో, నిమ్ముల రోగి కపథ్యభుక్తిపోల్కిఁ జెడు గగున్. 94

క. ఎవనికి నెవ్వఁడు మిత్రుం, డెవనికి నెవ్వండు సుహృదుఁ డెల్లరు నర్థో
ద్భవశక్తిల్ బద్ధులు శాత్రవులును మఱి మిత్రు లిట్లు తనరెద రనఘా. 95

తే. ఏనుఁగులచేత వనిలోనియేన్గులు బట్టె, నర్థములచేత నర్థము లలరి బద్ధ [మున,
ములగునొక్కఁడుకృతకార్యమునను గర్త, గనుగొనం బోడుస్మరియింపఁడునుజగ

వ. కావున సర్వకార్యంబులు సావశేషంబులుగఁ జేయం జెల్లు నీవు దివాకీర్తి భయార్దితుండ వైన కాలంబున నన్ను నిగ్రహింప శక్తిఁ గలవయ్యును బలాయనపరుండ వగుదు విపు డొండు రెండు తక్క నురితంతువు లన్నియుం గొఱికివైచితి నవియు నింతటిలోనం గొఱికి వైతు నీవును నిర్వృతిం గొందు వని పలితమార్జారంబులు సంవాదంబు సలుపుచున్నసమయంబునఁ బిల్లికి భయం బుప్పతిల్లఁ దెల్లవాఱుటయు. 97

సీ. కాటుకకొండకుం దీటువచ్చెడుమేను, కారుచీఁకట్లను గ్రమ్ముచుండ నూనెగానుగఱోళ్లనుం దలపించెడు, పిఱుఁదు లొండొంటితోఁ బెనఁగులాడ గానుగరోకళ్లఁ గాదు కా దనిపించు, చేదోయి గుదియలు చిందులాడ వెల్లువం బురుడించుచొ ల్లూరునోటిలోఁ, గహకహధ్వానంబు గ్రమ్ముకొనఁగ

తే. మొఱపు దేరినవెండ్రుకల్ ముడులు వాఱఁ గల్లువాసన నలుగడ నల్లుకొనఁగ వేటకుక్కలమొత్తముల్ వెంట రాఁగఁ బరిఘుఁ డనుమాలఁ డచ్చోటి కరుగుదెంచె. 98

మ. యమదూతాభునిఁ బుల్కసుం గని భయవ్యగ్రాత్ముఁడై లోమశుం డమితవ్యాకులితస్వభావమున డాయన్ వచ్చునయ్యాఖువుం గ్రమమింతేనియు లేనివాక్యములు సోఁకం గాంచి యత్యంతసంభ్రమ మేతే నెటు సొత్తు నేమిగతి నాప్రాణంబు వో నయ్యెడిన్. 99

క. మిత్త్రికి నెత్తె మాలఁడు, హత్తం జనుదెంచె మిత్త్రమా! యిఁక నైనం దత్తఱము పడవు నను నే, యొత్తొరవున వేయ నెంతువో తోఁప దయో.

వ. అట్టిసమయంబున నకులోలూకంబులును సంత్రస్తంబులై నైరాస్యంబు నొంది తమతమస్థానంబులకుం బోయెఁ బిల్లియు నెలుకం బతిమాలి వేగిరించి పలికె.

క. నావుఁడు క్రూరాత్ముఁడ గా,నీ వోడకు మనుచుఁ బలితుఁ డింతటిలో నా లావు గలయుచ్చు త్రెంపెన్, బావురుఁగాఁ డెక్కెఁ జెట్టు ప్రవిముక్తుం డై.

చ. *పలితుఁడు లాగఁ జొచ్చె వడిఁ బాఱె జనంగముఁ డంత వచ్చి యుచ్చులు తెగిపోవు టెల్లఁ గని శోకము పైకొనఁ గా హతాశుఁడై యెలుక పొనర్చుదాని కెద నెంతయుఁ జింతిలి కుక్కకూటువుల్ గొలువఁగఁ గ్రమ్మఱిల్లి చనె గూడెమునం గలవానియింటికిన్. 103

*జనంగముఁడు = చండాలుఁడు.

వ. అనంతరంబ భయోన్ముక్తుండును బ్రాప్తజీవనుండును మహీరుహాగ్రస్థుండు నగు లోమశుండు బిలస్థుం డగుపలితుం బిలిచి యి ట్లనియె. 104

ఉ. మిత్రమ! మైత్రిఁ జూప కిటు మిక్కిలి శంక వహించి నాయెడన్
శత్రుత సంస్మరించుచును జక్కటికిం జనుదేక భూబిలం
బాత్రముతోడఁ బొందుట సముంచితమార్గమె నేఁ గృతజ్ఞుఁడన్
గాత్రము నిల్వరించితివి గాదిలిచుట్టమ నీవు చూడఁగన్. 105

తే. అయయొ మిత్రోపభోగసముయమునందుఁ, జెంతఁ జనుఁదేక వేర్పడి వింతవాని
కరణి నుండుట తగవు గాదరయఁదొంటి,సఖులఁ గాదన నెడరుల సఖులగుదురె.

క. నీచే సత్కృతుఁడను నే, నా చెలిమికి నాదుసిరికి నాప్రాపునకున్
గోచర మైతివి నీ విపు, డీచికమక గలుగ నుండు టేటికిఁ జెపుమా. 107

సీ. నాబంధుమిత్రులు నాదుసంబంధులు, గురుని వలెన్ నిన్నుఁ గొలుచుచుండ్రు
ప్రాణప్రదాత నీ వని నేను సహాపరి,వారుఁడ నై నిన్నుఁ జేరి యుందు
నాశరీరమునకు నాగృహార్థములకు, నీ వధీశుఁడ వయి యొసఁగు మయ్య
నా కమాత్యుఁడ వయి సాకుము తండ్రి నా, హితమును బోధింపు మెల్లప్రొద్దు
తే. నావలన జీవితభయ మేనాఁడు గాని, కలుగ దని బాస చేసెదఁ దలను ముట్టి
యీవు బుద్ధి బృహస్పతి వేను నీదు, బుద్ధిబలమున బ్రదికితి సిద్ధచరిత. 108

వ. అని పలికినఁ బరమంత్రజ్ఞుం డగుపలితుండు నీమాట లెల్ల సత్యసంఘటితంబులు నామాటలుం గొన్ని గల వాకర్ణింపు మని యి ట్లనియె. 109

చ. పగతుర నెయ్యురం దెలియుపద్ధతి సూక్ష్మము దుర్లభంబునున్
పగతుఁడు గాఁగ నుండియును భావమునం గడు మైత్రి చేయు మి
త్రుగతి నెసంగి యుండి పగతుం డగు లే రన వచ్చు నెయ్యురున్
బగతురు వారు నేరుపునఁ బట్టి లభించుచునుందు రెందునున్. 110

తే. తాను జీవించియుండెడుదనుక నెవఁడు,స్వార్థమునుజూడ కెడరైన నైచి తోడు
నీడ యగునో విపర్యయ మేడ లేక, వాఁడె మిత్రము నాఁబడు వసుధయందు.

క. తిరమై మైత్రియు వైరము, నరయంగా నుండ వెప్పు డర్థాసక్తిన్
బరుఁడును మిత్రుండయ్యెడు, నరిమిత్రుఁడు మిత్రుఁడరియు నగుదు రొకతతిన్.

సీ. అర్థయుక్తి నెఱుంగ నట్టిఁడై మిత్రుని, విశ్వసించి యమిత్రు విశ్వసింప
కానందమును బొందు నతఁడు మిత్రునిపట్ల, శత్రునిపట్లను జలితుఁ డగును
విశ్వసింపనివాని విశ్వసింపఁగ రాదు, విశ్వాసి ననిశము విశ్వసింపఁ
బోలదు విశ్వాసమున జనించినసేగి, మూలముట్టుగ జనుం బొడ వడంచు

తే. అర్థసంబంధమున నమ్మ యబ్బ కొడుకు, నన్న తమ్ముఁడు మామ మేనల్లుఁ డెల్ల
వారుఁ బ్రేమింతు రర్థసంబంధము చెడఁ, గొడుకు నే తల్లిదండ్రులు విడుతురవని.

క. లోకమ్ము స్వార్థసిద్ధిం, గైకొనుచు స్వరక్షణంబ కావించుకొనుం
గాక పరార్థము పరర,క్షాకార్యము ముఖ్యగతిగ గైకొను టసు దా. 114

మ. ఎపుడుర్ బ్రాజ్ఞుఁడు శత్రుఁ బట్టుకొనఁగా నెంచున్ సుఖోపాయముర్
జపలత్వంబున నుండు పీ వెఱుఁగుదుర్ న్యగ్రోధమే మన్కిప
ట్టిపు డీచిక్కమునందుఁ జిక్కుటలు లో నెన్నంగఁ బో వక్కటా
చపలుం డెంతటి కార్య మైన సలుపర్ సందేహముం బొందునే. 115

ఆ. ఈవు నాకుఁ బ్రియుఁడ వెంతయు నాచెంతఁ, జేర మనుచు నన్నుఁ జీరి తయ్య
మాటలాడుచుంటి వేటికో విను మిత్ర,విషయలక్షణంబు విస్తరింతు. 116

క. కారణమున మిత్రుం డగుఁ, గారణమున శత్రు వగును గన నర్థాపే
క్షారచితము లోకము నె,వ్వారికి నెవ్వరును బ్రియులు వఱలరు జగతిర్. 117

సీ. అన్నదమ్ములకు సఖ్యం బాలుమగలకుఁ, బ్రేమ కారణమున వెలయుచుండు
నిష్కారణప్రీతినిం గలుగుట వేని,కిని లేమి నిశ్చయ మని యెఱుఁగుము
కారణాంతరమునఁ గలహించినను భ్రాత,లును భార్యలు స్వభావమున నొకప్డు
ప్రేముడింతురొ కాని ప్రేముడింపరు పెరల్,దానంబునం బ్రీతుఁ డౌ నొకండు

తే. నొకఁడు ప్రియవాదమునఁ బ్రీతుఁ డొకఁడు మంత్ర
హోమజపములఁ బ్రీతుఁ డింకొకఁడు కార్య
మునను బ్రీతుఁడు కారణమునన ప్రీతి
కారణము లేనిచోఁ బ్రీతిఁ గలుగఁ బోదు. 118

ఉ. ప్రీతికిఁ గారణం బగుచుఁ జేరొకన నొప్పినకార్య మైన చోఁ
బ్రీతియు నంతలోని దగు విస్మరిఁ జిక్కినకాలమందు నీ
ప్రీతికిఁ గారణం బయినవిశ్రుతకార్యము తీఱె నింక నీ
ప్రీతియు నట్టిదే యనియుఁ జేరొకన వచ్చెదు నంచు నెంచెదర్. 119

సీ. అభ్యవహారార్థ మగుప్రీతి యొకఁడటఁ, గాలమే హేతువుం బోలఁ జేయు
స్వార్థపరుఁడు దాని ననుసరించెదు వానిఁ, దెలియుఁ బ్రాజ్ఞుఁడు లోకకలనకలిమి
స్వార్థపండితుఁడ నై చనునాడుకడసట్టి, నుడులు చెల్లవు చాలు నుడుగు మింక
నిపు డకాలము స్నేహ హేతువు నాయన్న,యుదియ నీయట్టిసమర్థుఁ డవని

తే. మబ్బులకు రూపములు గల్గుమాడ్కి మాటి

మాటికిని గల్పనలుచేసి మాటలోనె
శత్రువై మాటలోననె మిత్ర మగుచు
మాటలో మఱి శత్రువౌ నేటి కిట్లు. 120

క. మనమైత్రికి హేతువు మఱి, బొనరెడి నది చెల్లి పోయెఁ బోలింపఁగ నీ
వనయంబు జాతివైరివి, నిను సామర్థ్యమున మిత్రునిగఁ గొంటి నిటన్. 121

శా. ఆకృత్యంబు నివృత్త మయ్యె సహజం బైనట్టి శత్రుత్వమే
నీకు న్నాకొన నొప్పు నే నెఱిఁగియు న్నీవాగురం జిక్కి కో
నా కాంక్షింతునె నీదుబాఱిఁ బడి చా కట్టిట్టు గాఁ దప్పితిన్
నాకు న్నీ కిటు లుంట చాలు మఱియున్ సంగంబు గాఁ జెల్లునే. 122

మానిని. నీవు కృతార్థుఁడ వేను గృతార్థుఁడ నీ కొనరించెడుకృత్యము లే
దేవగఁ జూచిన నాఁకలిఁ దక్కఁగ నీ విట భోక్తవు నన్నము నే
నీవు బలాఢ్యుఁడ వే నబలుండను నీకును నాకును సంధి యిఁకం
గావుట కూడదు కూడఁగ వచ్చినఁ గాయము వాయుట నిక్క మగున్. 123

క. ఆఁకలికి నీవు వలఁబడి, తాఁకలికే నన్నుఁ బిలుతు వాఁకలి గొని నీ
వేఁకటఁ గైకొని యుందువు, నీ కిది యాహారవేళ నే నెఱుఁగ నొకో. 124

తే. నీవు ప్రేమింతు వందము నిన్నుఁ గూడి
యున్న ననుఁ గాంచి నీచుట్ట లూరకుండె
పట్టుకొని మ్రింగెదరు గాక యిట్టు లేల
పట్టువఱి చెదు పో నిమ్ము బ్రదుకనిమ్ము. 125.

ఆ. నీకు స్వస్తి యగుత నేఁ బోయి వచ్చెద, సుకృత మెఱిఁగినట్టిసుమతి వేని
పోవ నిమ్ము నీకుఁ బొసఁగినప్పుడు మేలు, నేయ నుందు దేహ మీాయ లేను.

సీ. ఆత్మార్థ మై రాజ్య మైన రత్నధనాదు, లైన సంతానము నైన విడువ
నౌ నని శాస్త్రంబు గాన సర్వము వీడి, యైనఁ గాపింప నౌ నాత్మరక్ష
ప్రాణ ముండిన నెల్లఁ బడయంగ వచ్చును, బ్రాణముం బడయుట గాని మాట
బలహీనుఁ డైనను బరఁగఁ బరీక్షింపఁ, గలవాఁడు శత్రులవలలఁ బడఁడు

తే. అతనిశాస్త్రార్థకృతనిశ్చయ మగుబుద్ధి, చంచలత్వము నొందఁ దేచందమునను
నీదుసంభాషణం బింక నిలుపు మనిన, సిగ్గుపడి లోమశుం డింత తగ్గి యనియె.

మ. తగ వీమాటలు శాస్త్ర మె ట్లయిన మిత్రద్రోహముం జేయ నీ
వగు దంచుం దలపోత లొప్పెడినె సత్యం బాడెదం బ్రాణ మీా

నగునీప్రాణము దీయ నెంతు నఁట సౌమ్యా! నీవు నా కిచ్చినం
దెగునం బ్రాణము వీడ నుంటి నిటు సందేహింపఁ గా నొప్పునే. 128

వ. న న్నన్యథా తలంపక సుహృదుండను మిత్రవత్సలుండను నీకు భక్తుండ నగు నాయెడ విస్రంభంబు వాటించి నన్నుఁగూడ ర మ్మని మఱియు మఱియుం దఱిమి చెప్పిన నప్పలితుండు చలితుండు గాక వెండియు ని ట్లనియె. 129

మ. ప్రియవాక్యంబులు పల్కి తీ వయిన నే విశ్వాసముం జేయ లే
నయుతంబుల్ ప్రయుతంబు లర్థముల నీ నత్యంతము న్మెచ్చనీ
నయవిద్వర్యుఁడు శత్రువుం దెలిసి తన్మాయోక్తుల న్నమ్మి త
ద్భయకృత్ప్రాపకతం గొనంగ మది సల్పం బోవఁ డేనాఁటికిన్. 130

వ. ఇయ్యర్థంబున శుక్రునినీతివాక్యంబులుం గల వాకర్ణింపుము. 131

మ. బలవంతుం డగుశత్రుతోడఁ జెలిమిన్ బాటించి మేటిల్లునే
ర్పలరం గార్యము చక్కఁ జేసికొని తా నంతంతలం దుండఁ గా
వలయుం గాని ప్రియుం డటం చలరి విశ్వాసంబు గావించుచుం
గలియం బోవఁగ రాదు పోయినను నిక్కం బిక్కటుల్ వచ్చెడిన్. 132

క. నమ్మనివానిని నమ్మక, నమ్మినవాని నయినఁ గడు నమ్మక పరులన్
నమ్మక నమ్మిన తెఱఁగున, నమ్మకముం బుట్టఁ జేసి నడువఁగ వలయున్. 133

ఆ. నరుల నెల్ల నాఁడు నమ్మక యుండుటే, నీతి యనుచు శాస్త్రనియతి యైన
నమ్మి నట్ల యుండి నమ్మక యుండుట, పోలుఁ బ్రాణరక్షపొంటె వింటె. 134

క. నిను బోంట్ల పట్ల నే నీ,పొనరెడునీతిప్రయోగమున బ్రదికెద నీ
వును బ్రదుకుము చండాలుని, పొనరుచుమాయలకుఁ జిక్కఁ బోవక యుంకన్.

వ. అని పలితుండు పలికిన నలుక వోడమ లోమశుం డేమియుం బలుక కచ్చోటు విడిచి చనియెఁ బలితుండును దన నేర్పు పెంపునఁ జావునకుం గాక నిజబిలాంత రంబునకుం జనియె నని మఱియును. 136

సీ. బలహీనుఁ డగువాఁడు ప్రాజ్ఞుఁడై బహుబల, వంతులఁ బలితుండు బలెజయించుఁ
బండితుం డరి సమర్థుం డగునే వాని,తో సంధి గావింపఁ దోఁగు టొప్పు
జనపతి భీతుఁ డయ్యు నభీతు న ట్లుండి, నమ్మక నమ్మిన ట్లెమ్మె వడసి
మసలంగ నగు నప్రమత్తుఁడు చలియింపఁ, డెపుడు చలించెడు నపుడ చెడును
తే. గాలమునఁ జేసి మిత్రవిగ్రహము శత్రు,సంధియును జెల్లు నిట్లు శాస్త్రంబు దెలుపు
క్షత్రకులధర్మ మిట్టిది సంధివిగ్రహముల యెడ జాగరూకుఁడ వై మెలఁగుము.

వ. ధర్మవేత్తలు కృతజ్ఞులు నగుబ్రాహ్మణోత్తములు నీ కార్యంబులకుం దోడునీడ లగుదురు గావున వారిసాయం బపేక్షించు చుండుట శ్రేయోదాయకం బని చెప్పిన నజాతశత్రుండు శంతనుపుత్త్రుం దిలకించి విశ్వాసం బెట్టిపట్టును జేయ రా దంటివి విశ్వాసంబున భయంబు పుట్టు నేని రా జెట్లు శత్రువుల జయించు నెట్లు విశ్రాంతిం గాంచు నెఱింగింపు మనిన నతండు నీయడిగినప్రశ్నంబున కుత్తరంబుగా నొక్కయితిహాసంబు గలదు సెప్పెద విను మని యి ట్లనియె.

## పూజని యనుపక్షివృత్తాంతము.

సీ. కాంపిల్యపురమునఁ గలఁడు రాజన్యుఁడు, బ్రహ్మదత్తుం డనఁ బ్రతిభఁ గాంచి
యతనియంతఃపురమందుఁ బూజని యను, శకుని యొక్కటి సర్వసత్త్వరుతము
లెఱిఁగి వర్తించుఁ బెక్కేడులనుండి దా:నికి రాజపత్నికి నొకదినమునఁ
బుత్త్రులు పుట్టిరా పూజని ఖేచరి, యై యబ్ధికడకుఁ బ్రత్యహము వోయి
తే. పుష్టి గలిగెడుపండ్లు రెం డిష్టవృత్తిఁ, దెచ్చి రాచూలి కొక్కటి యిచ్చి తనదు
పట్టి కొక్కటిఁ బెట్టు నీపగిదిఁ బ్రొద్దు, లైన నొకప్రొద్దు పూజని లేనియపుడు.

వ. అమృతఫలాస్వాదనంబునం జేసి బలతేజోఽభివృద్ధిం గొన్న రాజపుత్త్రుండు ధాత్రీ కక్షగతుం డై యొక్కచోఁ బూజనీపుత్త్రుం గాంచి బాల్యచాపలంబున దానిం బట్టి దానితో నాడుకొనుచు దానికంఠంబు విఱిచి చంపె నంతలో సముద్ర తీరంబునుండి శకుని చనుదెంచి రాజపుత్త్రహతుం డైననిజపుత్త్రుం గాంచి దుఃఖించి దుఃఖించి తనమనంబున. 140

ఉ. క్షత్త్రియజాతి కింతయును సౌహృద ముండదు కారణంబునన్
మైత్త్రి ఘటించు రవ్వెనుక మాటయు నాడరు ద్రోసిపుత్తు రే
మాత్త్రము గాని వారి యెడ మర్త్యుఁడు నమ్మి మెలంగ రాదు లో
నాత్త్రము గల్గి మీఁదికిఁ బ్రియంబును జూపుదు రక్కటక్కటా. 141

ఉత్సా. దోస మింత లేక తనకుఁ దోడు నీడ యై శుభ
శ్రీసమేతుఁ డైననాదుచిన్నిబిడ్డ వీఁడు వి
శ్వాసఘాతి యై వధించి పాపి యయ్యెఁ గాన నే
రోసమునకుఁ బోల వీని గ్రుడ్లు వీకి వైచెదన్. 142

వ. అని పూజని రాజపుత్త్రునినేత్త్రంబులు రెండునుం దనఖరనఖరంబులఁ ద్రెంచి మించినవేగంబున నాకసంబున కెగసి యెల్లరు విన ని ట్లనియె. 143

క. నృపపుత్త్రుఁడు నాపుత్త్రునిఁ, గృప యింతయు లేక చంపెఁ గేరుచు నే న

య్యపకృతికిఁ బోలువిధమున, నపకృతి గావించి యుంటి నందఱు చూడన్.

తే. శుభము నశుభము నూరకే సురిగి పోవు, కట్టి కుడిపెడు పుత్త్రవర్గముల కెల్లఁ
గృతమునకు నే నిపుడు ప్రతికృత మొనర్చి,తిని దురితమునాకంటదయనివచింతు.

వ. బ్రహ్మదత్తుండు పూజనీహృతలోచనుం డగునిజసుతునిం జూచి యిది కృతంబు
నకుఁ బ్రతికృతం బని తలంచి దానిం గాంచి యి ట్లనియె. 146

ఉ. త ప్పొనరించె నాసుతుఁడు దానికిఁ బోలఁగ నీ వొనర్చి తీ
తప్పు నిరున్ ఘటింప దని తత్త్వవిదుల్ వచియింత్రు పూజనీ!
యిప్పుడు నీదుపోక మది కెట్టివిషాదము పుట్టఁ జేయునో
చెప్పెడి దేమి యి ట్లుడిగి చేరి వసింపఁగ నొప్పు నెప్పటిన్. 147

వ. అనినం బూజని రాజున కి ట్లనియె. 148

సీ. ఒకపరి యపరాధ మొనరించి యట వ్రేలు, టొప్పదు వెడలుట యొప్పు నందు
రపరాధ మొనరించునతనిఁ బ్రార్థించిన, విశ్వసించుటలు వివేక మనరు
వాఁడు వధ్యుం డగు వైరము చల్లార, దతఁడు నాతనివార లలుక నుందురు
కాన నచ్చోటఁ జేయఁ గాదు విశ్వాస మ, విశ్వాసమే సౌఖ్యవిధికిఁ గూర్చు

తే. విశ్వసింపనివానిని విశ్వసింప,రాదు విశ్వాసి ననిశము కాదు విశ్వ
సింప విశ్వాసమున బీతు పెంపర మగుఁ,గాన విశ్వాస మనునది గాదు సేయ.

వ. అన్యోన్యకృతవైరు లగువారిసంధి పొసంగదు పూర్వాపకారి పూజింపఁబడు
చుండినను వానిపట్ల విశ్వాస ముదయింపదు వాఁ డాస్థానంబు వీడిపోవుట యె
పాడి నేను నీయింటఁ గలకాలంబు సమర్చితుండ నై యుంటి నిప్పుడు వైరంబు
వచ్చెం గావున నిదె పోవుచుంటి ననిన బ్రహ్మదత్తుండు వెండియు. 150

క. కృతమునకుఁ బ్రతికృతంబు ని,కృతియును నపరాధ మనుట కేవలమూర్ఖ
ప్రతిపాదితంబు నీయం, దతుకదు పగఁ బూనఁ బోల దరుగకుము ఖగా. 151

వ. పూజని యి ట్లనియె. 152

తే. తప్పు చేసిన వెండియుఁ దప్పు సేయ,కున్న యప్పుడు సంధి సముచిత మగును
నేను జేసినదానికిఁ బూని యిట్లు,చేసితిని గాన నాయున్కి చేటున కగు. 153

వ. బ్రహ్మదత్తుం డి ట్లనియె. 154

క. కృతునకుఁ గర్తకుఁ గార్యం,బతుకుపడున్ మఱియు వైర మచ్చోట లే దా
కృతమునఁ బాపము నొందెడు,గతియును లే దనుచు శాస్త్రకలనం దెలియున్.

వ. పూజని యి ట్లనియె. 156

తే. పగ యడంగదు బలిమిఁ బాలఁబడితి ననుచు, విశ్వసింప రాదండ్రు నవెత యగు నిల
శస్త్రమునకసాధ్యము సామసాధ్యమగుఁగ, రేణువ్రుసుబుచ్చిమదహస్తి రెమ్మునట్లు.

వ. బ్రహ్మదత్తుండు వెండియు. 153

తే. చంపఁగోన నున్న వారును సహనివాస, మునను సఖు లయి విశ్వాసమునఁ బరస్ప
రమునువర్తింత్రు శ్వపచుగృహమునఁ బెంపఁ, బడెడు శ్వానములనువర్తిఁ బరగునట్లు.

ఆ. పగతు రైనవారు తగిలి సహవాస, మున మృదుత్వ మొంది మునుపటి పగ
తామరాకుమీఁదఁ దగిలినజలబిందు, వటు చలించి పోవ నలరుచుండ్రు. 160

సీ. అనుడుఁ బూజని యిట్టులను స్త్రీజమును వాస్తుజము వాగ్జమపరాధజముసపత్న
జము నాఁగ నైదువిధముల వైరము వొల్చు; నయ్యది సుప్రకాశాప్రకాశ
ముల నొందు విశ్వాసమును జేయఁ గా రాదు, కృతవైరు నెడ నెట్టిగతుల నైన
దారువులం దగ్ని దాగి యుండినయట్లు, గూఢమై వైరము గూడి యుండు

తే. శ్రుతమునఁ సాంత్వమునను బారుష్యమునను, నర్థమునను గోపాగ్నిచల్లాఱ దెప్పు
డబ్ధి బడబాగ్నియుం బలె నతిశయించు, వైర వహ్ని దహింపక తీర దెట్లు. 161

వ. అర్థమానంబుల సంస్కృతుం డగుపూర్వాపకారిపట్ల మిత్రవిశ్వాసము సేయ
రాదు మన మిప్పు డిట్టివార మైతిమి గావున నేను నీయింట నుండుదాన నైన
నిపుడు విశ్వసించి యుండ రా దనిన బ్రహ్మదత్తుండు 162

ఉ. కాలమ చేయుఁ గార్యమును గాలమ చేయు సమస్తకర్మముల్
కాలమునం బ్రవర్తిలు జగం బిది సర్వము కాలసంభవం
బై లలిమించు వేని కెవఁ డాగము సేయును జావుపుట్టువుల్
కాలమ చేయు సర్వమును గాలవశంబునఁ గల్గు చుండెడిన్. 163

క. కాలమె సుఖదుఃఖములకు, మూలము గా కీవు నేను మూల మగుదుమే
కాలగతి కే సహించితిఁ, బోలిచి నీవును సహింపఁ బోలున్ శకునీ. 164

వ. అనినం బూజనియును. 165

సీ. నరనాథ నీ వన్నకరణి కాలమె ప్రమాణమ యైన వైరము లమర కుండుఁ
గలహింతు రేల బంధులు బంధులును బోరి, రేల దేవాసురు లాలమందు
భేషజం బేటికి భిషజు లేమిటికి శో, కాదు లేమిటికి వివాద మేల
పుణ్యపాపము లేమి పొలిసినదనచింత, యేమి పుట్టిన దన నెలమి యేమి

తే. వెడఁగుమాటలి వేల నాకొడుకుఁ జంపె, నీకొడుక టంచు నిట్లు నే వీకఁ జేసి
యుంటి నను నీవు హింసింప నుంటి వింత, నిక్క మని చెప్పుచుంటిని బెక్కు లేల.

శా. ఆహారార్థమొ క్రీడనార్థమొ మనుష్యప్రాణు లొక్కింత సం
దేహం బేనియు లేక పశులను బంధింపంగ వేధింపఁ గా
నూహం జేయుదు రిట్లెఱింగియు భయం బుల్లంబునం దోఁగ నీ
గేహంబు న్విడనాడఁ గాఁ దలఁచితిం గీ డెంచి జీవార్థినై. 167

తే. ప్రియము ప్రాణము పుత్త్రుఁడు ప్రియతముండు,కష్ట మూర్తి యనంగ నతిష్టము సుఖ
మనఁగ నిట్లు జగత్త్రయంబున సమస్తజీవకోటికి ధర్మమై చెల్లు నధిప 168

ఉ. దుఃఖము విత్తపర్యయము దుఃఖ మనిష్టతరప్రవాసముల్
దుఃఖము దుర్జరాభరము దుఃఖము వల్లభవిప్రయోగముల్
దుఃఖము బంధనంబు మృతి దుఃఖము స్త్రీకృతదుష్టకృత్యముల్
దుఃఖము రిక్తజీవనము దుఃఖము పండితపుత్రజన్మముల్. 169

ఉత్సా. నాకు నీవు నీకు నే నొనర్చినట్టిచేఁత యీ
లోక మెఱుఁగు వర్షశతము లోన నైనఁ బాపుకో
నాకుఁ గాదు నీకుఁ గా దనంగ నీవు సంధికిన్
వా కొనర్తు మట్టికుండ భగ్న మైన నదుకునే. 170

వ. ఈయర్థంబున శుక్రుండు ప్రహ్లాదునకుఁ దెలిపినవచనంబులు గలవు వినుము.

సీ. వైరి నమ్మి మెలంగువాఁడు దెగుం దేనెఁ, గొనఁబోయిఁ గోతిలోఁ గూలినట్లు
వైరము నశియింప దారయ కులమందు, నెవ్వఁ డేనియుఁగీడు నెత్తిపొడుచుఁ
గడుపు నిండం బగఁ గైకొని లాలింప,నది తాయి ఘటమునా నవియఁజేయుఁ
బరులకుం జేసి యపకృతి నమ్మినవాఁడు, పదపడి దుఃఖంబు వడయ కుండఁ

ఆ డనిన బ్రహ్మదత్తుఁ డనియె నవిశ్వాస,మునను బొందఁ డర్థములను దాన
దుఃఖభాజి యగుచు దురపిల్లు భయశంక,గలుగు నాతఁడు మృతకల్పుఁడగును.

వ. పూజని యిట్లనియె. 173

పూజని బ్రహ్మదత్తునకుం జెప్పిననీతిప్రకారము.

సీ ప్రణీతపాదుఁడు దారి వట్టి మెట్టినఁ గాళ్లు, బద్ధలై ధర మోప రాని వగును
నయనరోగము గల్గు నరుఁ డెదిర్చిన గాలిఁ, గనుఁ గొన్నఁ గన్నులు గాజు వాఱు
వానఁ జూడక దున్ని చేను విత్తియు దైవ,మును నమ్మినన్ సస్యమును బడయఁడు
చాపలంబునఁ బథ్యసంగతి విడి రోగి, దుష్టాన్నముం దిని తునిఁగి పోవు

తే. దైవము బురుషకారము దవిలియుండు,నట్లు కార్యము నడపింతు రలఘుమతులు
క్లీబులుపురుషకారముఁ గెరల నీక, దైవమునె నమ్ముకొని చెడిపోవుదు రిల.

క. విను సర్వస్వము విడిచియుఁ, దన కిష్టం బయిన కార్యతంత్రము నడుపన్
జనుకర్మశీలుఁ డందున, ఘనతరనిర్వృతిని గాంచఁ గలఁడు నరేంద్రా. 175

సీ. దాక్ష్యము శౌర్యము ధైర్యము విద్యయు, బల మివి సహజహితులు తలంపఁ
బొలము లోహములిల్లుపొలఁతిసుహృజ్జనం,బును నివియుపమిత్రములు నరునకుఁ
బ్రాజ్ఞుఁ డెం దైన విరాజిల్లుఁ దా నొండ్ల, భయ పెట్టఁడును భయంపడఁడు నెపుడు
బుద్ధిమంతునకు సమృద్ధిగా వర్ధిల్లు, నర్థ మల్పం బైన నంత నంత

తే. దాక్ష్యమునఁగాని కర్మముతలఁపహింస,కగును గృహమంద ప్రేమంబు దగిలివిడక
యుండునల్పునిమాంసము మొందెకట్టె, యైనభామిని భక్షించు ననుదినంబు. 176

తే. నాదుమిత్రము క్షేత్రము నాదుగృహము,నాదుదేశ మటంచు నే నరుఁడు తలఁచి
విడువకుండెడినో వాఁడు విజ్ఞుఁ డగునె,వానికిం బేర్ ప్రతిష్ఠయుఁ గానఁ బడవు.

ఆ. క్షామడాంబరాది కష్టము లొదవిన,పట్ల నన్యదేశపర్యటనము
పొలుచుఁ గాన నేను నిలువ నిచ్చట నొండు, నెడకుఁ జేరుకొనఁగ నేగు దాన

మ. కుకళత్రంబు కుపుత్రమిత్రులును కుక్షోణీశుఁడుం గుప్రపా
లకులుం గుప్రజలుం గుదేశ మయినన్ లక్షించి ప్రాజ్ఞుండు చూ
డక వేఱొండు పరిత్యజించుటలు శ్రేష్ఠం బంచు వాక్రుచ్చు నై
తికశాస్త్రంబు సమస్తలోకహృదయాధిష్ఠానముం గాంచుచున్. 179

సీ. ఎద్దడి వచ్చినయేఁ గుపుత్రుండు వి,శ్వాసి గాఁడు కుభార్య సౌఖ్య మిడదు
కుసఖుండు సంగతిఁ గొనఁడు కురాజ్యము, జీవిక లేకుండఁ జేయుఁ గునృపుఁ
డురక శిక్షించెడుఁ బరికింపఁ బ్రియ మాడు,నది భార్య నిర్వృతి కైనవాఁడు
కొడుకు విశ్వాసియై కొలిచి యుండెడునతఁ, డనుఁగు జీవిక యిడునది విషయము

తే. తీవ్రశాసనుఁ డగురాజు దెబ్బ లేక, జారచోరాదిభీతి సంసారదుఃఖ
మును దరిద్రత లేక పెంపున నెసంగు, నట్టిదేశము వాసయోగ్యంబు సూవె.

వ. అప్రమత్తుం డై రాజ్యపాలనంబు సేయురాజు త్రివర్గమూలంబు భూపాలుండు బలిషడ్భాగంబుఁ గొని భూప్రజలం బాలించుట పరమధర్మం బట్లు కానినాఁ డాతేఁడు తస్కరుండు నాఁబడు నభయప్రదానంబు చేసియు నర్థలోభంబున నట్లు చేయనివాఁడు పాపపంకిలుం డై నిరయంబునం బడు నభయప్రదాత యుభయలోకంబుల సుఖంపడు రాజన్యుండు తండ్రి యై రాష్ట్రప్రజల నను కంపం జేసి నీతి నుపదేశించి తల్లియై పోషించి వహ్నియై యనిష్టంబులం గాలిచి యముండై నియమించి కుబేరుండై యధ్వరంబుల నర్థంబు విడిచి గురుండై

ధర్మోపదేశంబు చేసి గోప్తయై పరిపాలించుచు నిశ్లేద్యస్వరధర్మంబులం గలిగి రాజ్యం బేలుచుఁ బ్రజారంజకుం డై పౌరజానపదార్చనం బెఱింగి ప్రవర్తించు రాజేంద్రుం డిహపరంబుల సుఖంబు నొందుఁ బన్ను లెక్కువ కట్టి ప్రజలం బీడించురాజు పరాభవంబు నొందు నని చెప్పి పూజని బ్రహ్మదత్తు నామంత్రణంబు చేసి వీడ్కొని నిజేచ్ఛం జనియె నిది పూజన్యుపాఖ్యాన మింక నేమి విన నెంతు వనిన మందాకినీనందనుం బిలికించి ధర్మనందనుండు యుగక్షయంబున ధర్మంబు పరిక్షీణం బై దస్యుపీడ్యమానం బగునట్టియెడ నీలోకంబున నెట్లుండ వచ్చుం జెప్పు మనిన నతం డతని కిట్లనియె 181

క. ఆపద్ధర్మం బెసఁగుౕ, భూపతులు దయారసంబు పోకారం గా
నేపగిది నీతి మెలఁగెద, రాపగిదియుఁ జెప్పు వాఁడ నవహితుఁ డగుమా. 182

వ. తొల్లి సౌవీరదేశాధీశ్వరుం డగుశత్రుంజయుండు భారద్వాజునికడకు వచ్చి యలబ్ధార్థంబులపట్ల వాంఛ యెట్లుంపు లబ్ధం బెట్లు వృద్ధి యగు వర్ధితం బెట్లు పాలింపంబడు పాలితం బెట్లు ప్రేముడింపం దగుఁ జెప్పు మనిన నతండు. 183

భారద్వాజుఁడు శత్రుంజయున కుపదేశించుట.

సీ. అనిశముద్యతదండుఁ డై విక్రుతపరాక్రముం డయి రాజన్యుఁ డుండవలయుఁ
దనకు ఛిద్రము లేక తగఁ బరచ్ఛిద్రము, లన్వేషణ మొనర్చు టాతని పని
యుద్యతదండున కుర్విజనుల్ భయాకంపితు లగుదురు గాన సర్వ
భూతజాతంబులఁ బొలుపొందు నాదండ,మున వశంబున నుంచుకొనఁగవలయుఁ

తే. జతురుపాయంబులౕ దండ మతులితమగు,మొదలునఱకినఁ గొమ్మలు పొదలనట్లు
మూల మగునధిష్ఠానము పోకడంచి, శత్రుజీవనము హరింపఁ జను నృపతికి.

వ. సుమంత్రితము సువిక్రాంతము సుయుద్ధము సుపలాయితము నాపదాస్పదకాలంబున నాచరింపం దగు నిందు విచారం బకర్తవ్యంబు. 185

చ. హృదయము శాతఖడ్గమున కెత్తయి యుండఁగ వాక్కు మెత్తనై
గదురఁగఁ జేసి క్రోధమును గామమును న్విడనాడి తియ్యనై
పొదలెడుమాట లాడి రిపుపుంగవుతోఁ దగురీతి సంధినిం
గుదురఁగఁ జేసి కొంచుఁ దనకుం గలకర్జము తీర్చుకోఁ దగుౕ. 186

క. కృతకార్యుఁ డగుచు నాతని, గతి నమ్మక తొలఁగి యుంట కార్యము శత్రు
ప్రతిమానుఁ డైనమిత్రుని, గతి యిట్టిద వాని నిట్లు కావింపఁ జనుౕ. 187

క. పగతురతో విశ్వాసము, దగులింపఁగఁ దగదు కార్యతంత్రము ఫలదం

బగుదనుక వారితోఁ బా, మగపడుగృహమందు నునికి యట్లుండ నగున్. 188

వ. అనాగతంబున దుష్ప్రజ్ఞునిఁ బ్రత్యుత్పన్నంబునఁ బండితు ననునయించి
సామంబునఁ గార్యంబు సాధించునది. 189

మ. కయిదోయి న్మోగుడించియున్ శపథముల్ గావించియున్ సాంత్వముల్
నయ మొప్పం బచరించియుం గనులఁ గాల్వ ల్గట్టఁగా బాష్పసం
చయమున్ జార్చియుఁ జేర్చియున్ రిపుకడన్ సామంబు సాఁగింప నా
నయమున్ గోరినభూతలేశ్వరుఁడు విద్యావంతుఁడై యున్నచోన్. 190

తే. కాలపర్యయమగుదాఁకస్కంధమందుఁ, బెట్టుకొని మోయఁగాఁ దగునెట్టిపగతు
నైనఁ గాలము సరిపడ్డ యపుడు క్రింద, వేయఁదగుఁ గుండ ఱాతిపై వేసినట్లు.

తే. భూతలేంద్రుఁడు తిందుకాలాతమట్లు, మండ గావలయు ముహూర్తమాత్ర మేని
ధూమముం గ్రమ్మెడుతుషాగ్నితోడుసువోలె, నుండగానొప్ప దెప్పుడు దండితారి.

క. ఆర్థికుఁడు కృతఘ్నునితో, నార్థికసంబంధ మొందు టది యొప్ప దతం
డర్థి యయినన్ భుజించిన, వ్యర్థుఁడు కాఁబోవఁ డంచు నందురు పెద్దల్. 193

క. కార్యము కొనముట్టినచో, నార్యుఁడు నవమాన మొందు నది గావున నే
కార్యము సశేషముగనే, కార్యం బని పెద్ద లండ్రు గాఢప్రజ్ఞన్. 194

మ. అరిపట్లన్ మృదులస్వరంబు చలనత్వాభావమున్ సంపదు
త్కరమున్ రూపబహుత్వముం దెలుపు చంతం దుంపఁ ద్రెంపంగనై
ధరఁ బుంస్కోకిలభంగి మేరువుబలెం దచ్ఛూన్యగేహంబు నా
నరితిం జూపునటుండు వోలెను వరాహం బట్లు తేఁ డుండ నౌ. 195

ఆ నిత్యయుక్తుఁడైననృపతి నిచ్చలు లేచి, శత్రువేశ్మములకుఁ జనఁగ వలయుఁ
జనియుఁ గుశల మడిగి చనుఁదేర నగు నట్లు, కాకయున్న నేఁగి కాకర మగు.

క. అలసులు నభిమానులు క్లీ, బులు లోకులరవళి కడరుఁ బొందెడివారున్
బలుమరుఁ బ్రతీక్ష చేసెడు, నలఁతులునున్ జాల రెపుడు నర్థము లొందన్.

ఆ. నృపతి బకమువోలె నెపుడు నర్థములఁ, జింతసేయ వలయు సింహ మట్లు
విక్రమింప వలయు వృకమట్లు గర్వింప, వలయు శరమురీతిఁ బడఁగ వలయు.

క. జూదము పానము వేటయు, వాదిత్రము గీత మిందువదనయును బ్రియా
పాదకము లైన వానన్, భూదయితుఁ డతిప్రసంగమున నైనఁ జెడున్. 199

క. తనచాపముతృణమయముగఁ, బొనరింపఁగ వలయు మృగమువోలె శయింపన్
జను గ్రుడ్డి చెవుడు వట్టిన, జనుగతిఁ గావలయు విషమసమయములందున్.

సీ. దేశకాలములను దెలిసి పరాక్రమిం, పం దగుఁ గాకున్న ఫలము చెడును
బరబలంబును నిజబలమును గమనించి, కడఁగట్టఁ దగు యుద్ధకార్యములకు
దండనార్థ్వాన్ దాయఁ దగులకుండిన సర్వ,తరిగర్భమ్ముఁబలె మరణ మొందు
భీతి లేనప్పుడు భీతునివలె భీతి, యగుచ ద్దభీతు న ట్లడర వలయు

తే. సందియము లేమిభద్రంబులందునరుఁడు,సందియమునొందునతఁడుకష్టంబులకగు
గాఁగలభయంబుదొలఁగిపోఁగ్రాలవలయు,వచ్చెడిసుఖంబుపై నాసపడలవలయు.

క. వచ్చినభయసుఖములకున్, వొచ్చినదుఃఖంబు ముదము హృదయంబునకున్
గ్రుచ్చుకొన నీక దైవము, నిచ్చం గొని యనుభవింప నే తగు నెపుడున్. 202

మ. పగతో సంధి పొసంగఁ జేసికొని విశ్వాసంబు వాటిల్ల లో
సుగముం గోరుచు నిద్ర వోయెడుమహీశుం డెన్న వృక్షాగ్రమం
దగుశాఖం బవళించి నిద్దురను జేయం బూనువాఁడుం బలెన్
రుగవాప్తిన్ గయికొక చచ్చెడిని నూరుం బెరులేకుండఁగన్. 203

ఆ. తలఁప మృదువు గాని దారుణంబె గాని, కర్మ మాచరించి కాశ్యపీంద్రుఁ
డతిసమర్థుఁ డగుచు ననిశముఁ ద న్నుద్ధరించుకొనఁగవలయు నెంచి యనువు.

సీ. తనదాయలకుదాయలను బ్రేముడించుచుఁ, జెలికారమునుబొందఁ జేయుటొప్పు
వైరులు విడిచినచారు నెఱుంగక, తా నిల్పుకొన్నచో హాని యగును
బాషండు లగువారిఁబరరాష్ట్రములకుఁబో, సాఁగఁ ద్రోలుట మేలు సాధుగతుల
సభలఁ దీర్థంబులఁ జలిపందిరుల విహా,రంబులఁ బానగృహంబులందు

తే. ఖలులు ధర్మాభిచారులు కలుషమతులుఁ, జారులుం జోరులుం గూఢచారులగుచు
సంచరింతురు వారలఁజాడ లెఱిఁగి, సైఁచి వారల వెడలింపఁ జను నృపతికి.

తే. నమ్మికం జేసి భయ మగు నమ్మ రాదు, తగఁ బరీక్షింప కెవ్వని దాయ నొనరఁ
బలికి నమ్మించి విచలితపదమునందుఁ, గాలగతిపాలుగాఁ జేయఁ బోలుఁ బలికి. 206

క. శంకింపరానివారిని, శంకింపఁగ వలయుఁ దఱుల శంకితులసదా
శంకించు టొప్పుఁ బగఱన్, శంకింపక యున్నఁ జేటు సమకుఱు దొరకున్.

తే. జడలు నజినంబుఁ దాల్చి కాషాయవస్త్ర
ములను గట్టి మౌనముఁ బూని పలుకుఁబడిని
పెచ్చురికఁ జేసి నమ్మించి పెచ్చుపెఱుగు
పగతుఁ దెగటార్పఁ దగు వృకమృగము రీతి. 208

తే. తండ్రి యైనను దోడైనఁ దనయుఁ డైన,నర్మసఖుఁ డైన నర్థవిఘ్నం బొనర్చు

నట్టు లైనను వధియించు టర్హ మగును, భూతికిం గోరి యుండినభూమిపతికి.

తే. గర్వితమై కార్యగతియు నకార్యగతియుఁ, దెలియఁ జాలక కానిత్రోవలను బట్టి
తిరుగు చరగోడ్డెములు సల్పుగురుని నైన, దండితుని జేయఁదగునం ద్రు ధర్మవిదులు.

తే. పరుల మర్మముల్ ద్రెంపక పరమదారుణం బయినయట్టికర్మ మొనర్పక నిశి
తాస్త్రమున నేయకంద లేఁ డధికవిభవ, మవని మత్స్యఘాతికరణి నగుచునందు.

సీ. జాతిచే మిత్రులు శత్రులుఁ దనరరుఁ, దనరుచుందురు సమర్థతను బట్టి
కారణంబులు సెప్పువైరిని వ్విడరాదు, పూర్వాపకారిని బొడవడంచు
పట్ల వగవ రాదు ప్రభువునకు న్నిగ్రహానుగ్రహంబులు నమర వలయు
నభియాతి నడఁగింప నభిలషించి ప్రియంబు,పలుకుచు నుండంగ వలయు నెదుట

తే. నరిశిరముఁ ద్రుంచి వగవరా దాత్మలోన, సాంత్వనమ్ము సన్మానము శాంతిఁగలుగ
సర్వజనుల నారాధింపఁ జాలవలయు, భూతినిం గోరుచుండినభూవరుండు. 212

తే. రిత్తవైరముఁ బూన రా దెత్తఱి నది
జేతులఁ దరింప రాదు గోశృంగముఁ దిన
రా దనాయుష్య మది యనర్థకము దంత
ములు పులియు నాల్క రసములఁ దెలియ కుండు. 213

ఆ. పగయు నప్పు నిప్పు మిగులకుండం జేయ, వలయు నట్లు కానిపట్ల నవి క్ర
మక్రమమునఁ బెఱిగి మఱియును బాధింపుఁ, గాన నచట శ్రద్ధఁ బూనవలయు.

క. పరిభూతు లైనశత్రులు, కరము ఋణం బున్నవానిఁ గని భయ మొదవన్
దురితంబు లాచరింతురు, నిరతం బాధియును వ్యాధి నెగడెడు దానన్. 215

క. మనుజులఁ జంపియు మార్గములను ద్రెంచియు నిండ్లు గాల్చి లగ్గలకై సే
నను గూల్చి శత్రురాష్ట్రముఁ, గనలున నాశన మొనర్పఁ గా నృపుఁ డెంచున్.

తే. కాకశంకయు సింహావిక్రమము గృధ్రదృష్టియును మృగదంశకచేష్ట భుజగ
చరితమును బకధ్యానము సతము గలిగి, రాజ్యపాలన మొనరించురా జెసంగు.

తే. శూరుఁ డగువాని నంజలిం జేరఁ జేసి, భీరువుం భేదమునఁ జేసి వేరుఁ జేసి
లుబ్ధు నర్థమ్మొసంగి తుల్యుం గ్రహించి, సంగర మొనర్చి గెలువ నా క్ష్మావిభునకు.

తే. మృదువు మృదువున మర్దింప నొదవు దారు
ణమును మృదువున భేదింప నమరు మృదువు
నకు నసాధ్య మొకింతయుం దలఁపఁ జనదు
కావునం దీక్ష్ణతర మయి క్రాలు మృదువు. 219

క. కాలమునఁ మృదు వగు నది, కాలమునఁ దారుణంబు గా నై క్రియలం
గూలిచి పుచ్చుచు శత్రుల, వాలాయము గెల్చునట్టివాసిం బొలుచుఁ. 220

తే. పండితునితోడఁ గలహించిపగదొలంగ, దూర మందుంటినని నమ్మి తొడరరాదు
బుద్ధిమంతునిబాహువు లొప్పదుగు లార్తిఁ, గూర్చువానిని బట్టి పెల్లేర్చిపుచ్చు.

వ. అని భరద్వాజుండు సెప్పిన విని సువీరరాష్ట్రేశ్వరుండు చెప్పినచొప్పునం జేసి సంపదలం బొందె నని చెప్పిన యుధిష్ఠిరుం డుత్తమధర్మంబు హీనంబై యధమ ధర్మంబ ధర్మంబై ధర్మం బధర్మంబై మర్యాద వినష్టంబై ధర్మనిశ్చయంబు క్షుభితంబై లోకము రాజులచేఁ బరులచేఁ బీడితంబై సర్వాశ్రమంబులు మూఢంబులై కర్మంబు లుపహతంబులై కామలోభమోహంబులభయంబు సూపట్టనెల్లరు నవిశ్వస్తులై భయంబు గొల్పుచుండ నికృతింజేసి పరస్పరవంచకులై ప్రజలు ప్రవర్తింపఁ బర్జన్యుఁడు వర్షింపమింజేసి దేశంబులు సంప్రదీప్తంబులై వేఁగుచుండ బ్రాహ్మణులు పీడితులై యుండఁ బృథివీతలంబున సర్వోపజీవనంబును దస్యు సాద్భూతంబై జఘన్యకాలం బరుగుదెంచునప్పు డుత్తమబ్రాహ్మణు లెట్లు జీవించెదరు పుత్రపౌత్రుల నెట్లు పోషింతు రిట్లు లోకంబు కలుషితంబై యుండ రా జెట్లు వర్తించు ధర్మార్థంబులగతి యే మగు ననినఁ గురుపితామహుం డిట్లు లనియె. 222

శా. యోగక్షేమసువృష్టులుఁ మరణభీత్యుద్రేకముల్ వ్యాధులుఁ
రాగద్వేషములుఁ సమస్తగతులుఁ రాజన్యమూలంబులై
రాగిల్లుఁ యుగసంప్రచారములు నా రాజన్యసంచారసం
యోగంబుం గలవై ప్రవర్తిలెడు నం చూహింపఁగా నొప్పెడుఁ. 223

ఆ. అట్టిదుష్టకాల మరుగుదెంచి ప్రజాళి, యడలు గుడుచుచున్నయపుడు జ్ఞాన
బలమునాశ్రయించి బ్రదుకు తెఱవుఁ జూచు, కొనఁగఁ బోలుననిరిఘునులు బుధులు

వ. ఏతదర్థంబున విశ్వామిత్రచండాలసంవాదరూపం బైనయితిహాసంబు గల దది నీయడిగినదాని కుత్తరం బగు విను మని యి ట్లనియె. 225

## విశ్వామిత్ర చండాలసంవాదము.

క. త్రేతాద్వాపరసంధిఁ, భూతలమునఁ బుట్టె మున్ను భూతభయోద్రే
కాతతము వఱపు తాపప్లోషితంబై ద్వాదశాబ్దవిఖ్యాతం బై. 226

సీ. త్రేతకు మోక్షంబు దెచ్చి ద్వాపరము ప్రతిష్ఠింప నగునట్టిదిష్టమందు
విధివశంబునఁ జిక్కు విడులుపఁ బోఁడు బలారాతి ప్రతిలోముఁడయ్యెగురుఁడు

వ్యావృత్తలక్షణుం డై పోవు సోముండు,దక్షిణాం బై యున్న దారివట్టి
వారివాహంబుల పేరు వినంబడ,దేఱుటం జెఱువులు నెల్లనీటి
తే. యిక్కలివురంగఁ బాతెమహీతలమున,వెడలెస్వాధ్యాయములుయజ్ఞవిధులునతిథి
పూజలుం జెడెఁ గర్షనంబులు నశించెఁ,దరులతాదులు కమరె భూతలమునందు.

ఉ. పాడియుఁ బంటయుం దఱిగె భాగ్యము భోగ్యము శూన్య మయ్యె నే
వాఁడును ద్రావ నీళ్లయిన వాతికిఁ జిక్కమి సొక్కి సోలియున్
మాడెడువాఁడ యయ్యెఁ గొఱమాలిన వయ్యె వసూత్కరంబు లే
పీడను బాడునుం జెడియెఁ బీనుఁగుబెంటల నిండె మెండుగన్. 228

క. కొందఱు చోరులచేతం,గొందఱు శస్త్రములచేతఁ గొందఱు క్షుధచే
గొందఱు వ్యాధులచేతన్,మ్రందిరి మహిమీఁదఁ గలుగుమానవు లెల్లన్.229

సీ. అతిభయంకర మగున క్కాలమునయందుఁ,దిఱుగఁ జొచ్చిరి జనుల్ తిండికొఱకు
నాహార మెందు నెయ్యాదియు లభింపమి,నరు లొండొరుం జంపి నమలి తినిరి
నియమంబు వోఁ బుుషుల్ నిరతాగ్నిహోత్రముల్,దిగనాడియుం దంచుఁ దిరుగనైరి
కోటీశ్వరుండును గూఁటిపేదయు నొక్క,తోయము వా రయి త్రుళ్లడఁగిరి
తే. నెండుటాకులు నమలియు నెండుగడ్డి,తినియు రేగటిమట్టిని గొనియుఁ బ్రతికి
చచ్చి కోటానఁగోటులు జనులు వేఁగి,పోయి రాఘోరదినములు పుట్టినపుడు.

సీ. దేశాలపా లయి దేవురించినగంజి, నీళ్లు ద్రావిరి కొన్నినాళ్లపాటు
అడవిమెగాలపా లయి యాకలంబుల, నెల్ల మెక్కిరి కొన్నినాళ్లపాటు
మెట్టలపా లయి వెట్టఁ గూలినచేత, నములఁ దినిరి కొన్నినాళ్లపాటు
దొసఁగులపా లయి పసిపిల్లలం జంపి, నమలివేసిరి కొన్నినాళ్లపాటు
తే. భూజనులు మలమలమాడ్చుపొట్టచిచ్చు, వేదనకుఁ దాళ లేక మర్యాద విడిచి
తగిలి బలివీటిదనుక నీజగతి లాజ, గతిఁ గడక వేఁచున వ్వెట్టకాలమందు. 231

వ. ఇ ట్లక్కజంబుగ నొక్కదిక్కున నైనం బొటుక్కు మని చినుకు రాలని యయ్యెండుకాలంబున మెండుగ మండిన క్లిండి యుండినతరుగుల్మలతాదులును బగ్గు మని మండునగ్గితెఱంగున నుండుపుడమిం బడి మలమల మాఁడి వేఁడిం గొట్టుకొనుచు నల్లు లనఁ బెల్లుగ నసువు లూడుచు జంతుజాలంబులును దిత్తుల కొలిమిం గరఁగునయోమయరసంబువలె బుసబుస మని కొంతదనుకం బొంగి నారికెడంబులగలుప వచ్చునన్న ట్లింకి యెండువాపీకూపతటాకాదిజలాశయంబులం బయల్పడి యొడలితోడన పుణ్యగతికిం బోవువారివడువున నాకారంబు

లును గానరా కాతపంబున భస్మీభూతంబు లగుజలచరంబులుం గలిగి నిఖిల భూతభయోత్పాతం బై ద్వాదశవర్ష క్షామంబు భీమం బయ్యె నయ్యవసరంబున. 232

శా. విశ్వామిత్రుఁడు నీతిహోత్రసముఁ డై విఖ్యాతినిం గాంచి యుక్
విశ్వం బెల్లఁ బరిభ్రమించెను క్షుధన్ విత్రస్తుఁ డై పుత్రదా
రాశ్వాసాదికముం బొనర్పక యభక్ష్యాభక్ష్యచింతావిహీ
నశ్వభ్రాస్యుఁడు హారు హా యనుచున్ వాపోవుచున్ వాడుచున్. 233

వ. అట్లు పరిభ్రమించుచు నొక్కనాఁడు. 234

మ. ఒకకాంతారమునందుఁ బ్రాణితతిమృత్యుప్రాయులున్ హింస్రకుల్
సకాలాఘూఘనికాయులున్ ఖలు లవష్టంభాంచితుల్ స్తేయకా
రకులున్ ఘోరవికారరూపకులు దుర్మార్గ ల్ద్విశాకీర్తు లుం
డు కడుం గూడిక గూడెముం గలుగ నాంధ్రుం దారఁ దీండ్రించుచున్. 235

చ. పగిలినబొచ్చెలున్ శునకవాహవరాహఖరాస్థిరాసులున్
మృగములతోళ్లు తుంపులును మేషవృషస్థనగాదిశీర్షముల్
సగము సగమ్ము తో లొలిచి చాపలఁ బెట్టినగొడ్డుడొక్కలున్
మిగిలిననేల లే దనఁగ నిండుకొన న్వెలివాడ యొప్పెడిన్. 236

తే. పాపకుబుసంబు మాలికల్ పందికొమ్ము, తోరణము లెంపముడికట్లు తోరమగుచు
నలుగడలునిండఁ గోళ్లుఁ గుక్కలునుబందు, లొలిరొ దసేయఁ జూపట్టు మాలపల్లె.

క. కలు ద్రావి మేను లెఱుఁగక, కలహించి యొకళ్లొకళ్లు కాఱులు ప్రేలన్
మొలచినక్రూరారావము, పొలమెల్లం గలసి మాఱు మ్రోసెన్ దెసలన్. 238

వ. అట్లు నికృష్టం బైనపంచమపక్కణంబుఁ జేర నరిగి విశ్వామిత్రుండు క్షుధార్తుం డై ఫలమూలమాంసాన్నాద్యాహారం బెద్దియు లభింపమింజేసి దౌర్బల్యంబున నేలం గూలఁ బడి యిత్తఱి రిత్త చావకుండఁ బ్రాణంబులు నిలువఁ బెట్టుకొనుట యెట్లొకో యని చింతించుచు నట నొక్కచో నప్పుడ చంపి తో లొలిచి పెట్టినకుక్కకడిమంబుఁ గనిపట్టి. 239

మ. అసువుల్ వాయకయుండ నాఁగెడునుపాయంబొండు చూపట్ట దీ
దెస ప్రేలాడెడుకుక్కమాంసముకుతంత్రిం దీని నేదొంగిలిం
చి సమీచీనముగా భుజించెద నిట స్తేనత్వదోషంబు పు
ల్కసవిత్తగ్రహణైకదోషమును నల్కంతేని లే కుండెడిన్. 240

క. భూసురుఁ డాపద్ధర్మము, గా సడికిక్ నైచి కుక్కకడిమంబుఁ గొనక్
దోసము గా దథమధనం, బాసించి పరిగ్రహించు టది యొప్పు నిటన్. 241

వ. అని నిశ్చయించి మునిప్రవరుఁ డప్పు డంద శయనించియుండె నంత నర్ధరాత్రం బగుటయు నమ్మాలపల్లెయెల్ల మాఁటుమడఁగె నట నుండు వెలివాండ్రును గుఱు పెట్టి నిద్రవోయి రట్టితరుణంబున మునితల్లజుం డల్లన లేచి గుడిసెలోనికిం జని కుక్కరజాఘునిం బట్టి తిగిచినంతలో నప్పాంత శ్లేష్మరోగియై మ్రాఁగన్ను వెట్టి పండుకొనియున్న శ్వపచుండు మేలుకొని లేచి దిక్కు లవియ నొక్క కేక వైచి రూక్షాక్షరసమన్వితంబుగా నిట్లనియె. 242

క. ఎవఁడవు కుతంత్రి లాగెద, వెవరును నిదురించియుండు రియ్యెడ నని యెం
తువ యేమొ నిదురఁ బో నేఁ, దవిలి వధించెదను సురుగఁ దలఁపకు మింకన్.

వ. అనిన విశ్వామిత్రుండు వ్రీడాకులముఖుండై వెగడొందుచు నిట్లనియె. 244

క. విశ్వామిత్రుఁడ నాఁకలి, శాశ్వతమై బాడబాగ్నిచందంబున లో
నశ్వరము గాక కాల్చుట, నీశ్వపలాలంబు గొనఁగ నెంచి హరింపన్. 245

ఆ. వచ్చినాఁడ నన్ను వధియింపకుము లెస్స,చూచు వాఁడ వేని సుమతి యనుడు
శయ్య డిగ్గివాఁడు సంభ్రాంతుఁడై మోడ్పు,గేలు ఫాలమందుఁ గీలుకొలిపి.

ఆ. కన్నుఁదోయి నీరు కాల్వలై పాఱ న,యమ్మ మీాఱ మునికులాగ్రగణ్యు
నెఱఁగి యోమహాత్మ యేమి నీదుతలంపు, తెలుపుమనుడుమునియుఁ దెలిచియనియె.

సీ. స్వస్తినీ కగుఁ గాత సతత మాయుష్మంతుఁ,డా! విను మే క్షుధితాత్ముఁడైతిఁ
బ్రాణముల్ వోయెడు నశనార్థి సిగ్గించఁ,జాలఁడు కలుషితస్వాంతుఁ డగుట
గడియలువడె చెవుల్ గడతేఱె సొజ్జయు,నో రెండుకొని పోయె నొడియురాదు
తలఁప భక్ష్యాభక్ష్యములతె న్నధర్మము, గ్రైనఁ బాపంబైన నవలఁ జూచు

తే. కొందునీకుక్కతొడకాలు పొందకుండ,నుడుగ శుచియైన నవ్వీతిహోత్రుఁడెట్లు
సర్వభక్షకుఁడయ్యెనాచందమునన,నన్నుఁ దలఁపోయుమోయిమానసమునందు.

తే. అనుఁడుఁ జండాలుఁడనియె నోమునివరేణ్య!
నాదునుడి విను విని నీకు న్యాయ మనుచుఁ
దోఁచినట్టులు ధర్మము తొలఁగ కుండఁ
దత్త్వ మారసి వర్తింపఁ దలఁపు మిప్పుడు. 349

తరు. నక్కకంటెం గుక్క నడవడిచొప్పు,న న్నీచ మాకుక్కనంజుడిలోనఁ
బిక్కనంజుడి చాల పేదవడు నది, వెలివాడవాండ్రురవిత్తంబు దానిఁ

దెక్కలికాఁడవై తిగిచి భక్షింపఁ, దివిరితి విది కానిలెఱుఁ గోడ లోమ
నొక్కచక్కనిమార్గ మూహింపరా దో, కో పొలకై తపం బాడ్చు కో నగునె

వ. నీవు ధర్మభృద్వరిష్ఠుండవు తొలుబొమ్మ నాశించి ధర్మంబు వోకాపుకొని నిర
యంబులపా లగుట నీతి కా దని తలంతు ననిన క్షుధాతురుం డగువిశ్వా
మిత్రుండు. 251

చ. ఒకకణ మైనఁ దిండియును నొక్కిసుమంతజలంబు లేక నా
కకట కటా! గతించెను మహత్తరకాలము క్షుద్భరంబునన్
నకనకలాడునాకడుపు నంజుడి తక్కగ నా కుపాయ మొం
డొకఁడు లభింప దే బ్రదికి యున్న సమర్థుఁడ దోష మిూఁగికోన్. 252

తే. క్షత్రియుల కైంద్రధర్మము క్ష్మాసురులకు, నగ్నిధర్మము శాస్త్రసమాహితములు
బ్రహ్మవహ్నిబలంబునఁ బ్రబలు నేను, గుక్కనంజుడి క్షుధ వాపుకొని తలిర్తు.

చ. బ్రదికెడుదారిఁ జూచుకొనఁ బాడి యెదేనియుఁ జేసి వాసిమై
బ్రదికిన శ్రేయముల్ వడయ వచ్చును ధర్మము లాచరించి స
త్పదమున నిల్చి చచ్చినపదంపడి వచ్చెడిలాభ మెద్దియున్
గుదురదు బుద్ధిపూర్వముగఁ గుక్కపలాలము మెక్క నెంచితిన్. 254

వ. దీనికి నీ వనుమతింపుము నాతపోమహత్వంబున నేతద్దోషంబు వూష తన
తేజోవిశేషంబునఁ దమంబునుం బోలెఁ బోఁ గొట్టుకొనం జాలుదు ననిన శ్వప
చుండు. 255

క. ఇది తిన్న దీర్ఘ మాయువు,పొదలదు ప్రాణములు నమృతమునఁ బలెఁ దృప్తిం
గదురవు మఱియొక భిక్షకు,మది సేయుము కుక్కఁ దినుట మాన్యమె మునికిన్.

వ. అనినఁ గౌశికుండు. 257

తే. అకట దుర్భిక్షకాలమునందు మాంస,మన్య మెదియును లభియించుటరిదినాకు
ధనము పూజ్యమాఁకలిఁగొన్న దాన దీని,షడ్రసోపేతముగ నెంతు స్వాంతమందు.

సీ. పంచముఁ డిట్లను బంచపంచనఖజం,తువులు ద్విజాతికి దోషదములు
తగదు నీ కిట్లుశాస్త్రము ప్రమాణం బేని,యనుఁడుఁగౌశికుఁడగస్త్యముని మున్ను
వాతాపిమాంసము వండించుకొని తినె, క్షుధితుఁడై నే నట్లు క్షుధితుఁడ నయి
కుక్కమాంసముఁ దిన గోరితి నావుడు, నీసమాధానము నేను మెచ్చ

తే. నిదిపరిహరించు టే శ్రేయ మెల్లగతుల,నని శ్వపచుఁడన్న గాధేయుఁ డేమియిట్లు
పలుక వత్తు శిష్టాచారము పనికి రాదె,వారలే ధర్మముల కెల్లఁ గారణంబు.

వ. కావున నే నీశ్వజాఘనిర్ మేధ్యాశనంబుకంటెఁ బరంబుగాఁ దలంతు నన్నుఁ బుల్కసుం డసజ్జనసమాచీర్ణంబు ధర్మంబు సనాతనం బెప్పటికిని గా నోపదు నీ విట్టినెపంబు వన్ని యకార్యం బాచరింపకు మనిన గాధేయుండు.

క. అవమతము పాతకంబును,దవిలి మునీంద్రుం డొనర్పఁ దలఁపఁడు ధర్మ ప్రవణులు శ్వమృగంబుల సమత వచింతురు గాన నిందుఁ దత్పరుఁ డైతిన్.

వ. అనుటయు శ్వపచుండు. 262

పంచ. సనాతనం బటంచు మానిచంద్రుఁ డాన్నమాసమున్
దినండు బ్రాహ్మణప్రియంబు దేశరక్షణం బటం
చొనర్చె నట్లు దానఁ బాప మొందఁ డయ్యె నెట్టితె
ప్పు నైనఁ జేసి శిష్టలోకముల్ భజించు టొప్పదే. 263

ఉ. నావుడు గాధిపట్టి యను నాదగునాత్మ ద్విజప్రియం బగుం
గావునఁ బూజ్య మయ్యె ననఁగాః బని యుండదు దానిఁ బ్రోవఁ గా
నీవిధ మేఁ దలంచితి నొకింతయు దోషము దీనఁ గల్గఁ గాఁ
బోవుట లాకసంబునను బూవులు పూయుట లట్టులే సుమీ. 264

సీ. పుల్కసుం డను బుణ్యపురుషులు ప్రాణమేఁ,బాయుదురే కా నభక్ష్యబుద్ధి
సలుపరు నీతుధం బొలఁగించుకొనుటె కా,కిచటఁ బరహిత మొక్కింత లేదు
ముని యనుఁ గర్మనాశనమున కే నోర్వ,దాన బ్రదుక నెంచి తలఁతు నిట్లు
బుద్ధ్యాత్ముఁ డిప్పట్లఁ బుణ్యంబు నొందెడు,మోహాత్ముఁ డైనచోఁ బొడ వడంగు
తే. నావుడున్ శ్వపచుఁడు సుహృద్భావమునను,నీదుశ్రేయసం బెంచి నేవచింతుఁ
గాని పలలోభమునఁ జేసి కాదు సుమ్మె,నాపయిం గృపసేయుము తాపసేంద్ర.

క. మాని యను సుహృజ్జనుఁడవ,యేనియు నాశ్రేయ మెంతు వేనియు మాంసం
బీ నోపి యీవిపత్తుం,బో నాడి సముద్ధరించి పుణ్యముఁ గొనుమా. 266

వ. అనిన శ్వపచుం డిట్లనియె. 267

ఉ. మాలల కన్న మీాశునకమాంసము విప్రుఁడ వైననీకు నేఁ
బోలనివాఁడ నై యొసఁగ బుద్ధి యొనర్ప నొసంగి నేను నా
పాలగ్రహించి నీవు నతిపాపభయంకరదుష్టలోకముల్
చాలుగ నొంది కుందుటలు సత్య మగు న్విబుధేంద్రచంద్రమా. 268

వ. గాధినందనుండు. 269

ఆ. ఇపుడు పాపకార్య మేఁ జేసి జీవించి,పుణ్యకార్యగతులఁ బోవువాఁడ

దాన నీకు మేలు గానంగ వచ్చెడు,ననుచుఁ జెప్పుచుంటి ననఘచరిత. 270

సీ. వెలివాఁడు వచియించుఁ గులధర్మకృత్యము;నం దాత్మయే సాక్షి యది యెఱుంగు
దీవు కుర్కురమాంస మిది భూసురుఁడు;దినరాని దని నేను దెలుపుచుంటి
నన ముని యను దీని నడిగి భక్షించెద;హింసయు ననృతము నిచట లేదు
కడజాతివాఁ డను గుడుపున కిది హేతు,వందు వేదము ధర్మమరయ వాక్య

ఆ. హీనజాతినుండి హీనపదార్థము,సంగ్రహించి తినుట సాధువృత్త
మగు నటంచు దలఁప నవల నీ చిత్తము,కోలఁది సేయుము మునికులవరేణ్య.

వ. అని పల్కి పుల్కసుండు విశ్వామిత్రు నడ్డగింపఁ డయ్యె నతండును విధివశం
బునంజేసి శ్వమాంసముం గ్రహించి దానివలన దేవతారాధనంబు చేసి వెనుక
భక్షింప నెంచి బ్రహ్మవిధి నగ్నిం గల్పించి యైంద్రాగ్నివిధిం జరుశ్రపణం
బొనర్చి దేవపితృకర్మంబుం జేయం దొడంగి యింద్రాదుల నావాహనంబు చేసి
యథాభాగంబు హవిర్భాగంబు లొసంగె నంతలో దేవేంద్రుండు ప్రజాళిం
బ్రదికించువాఁడై వర్షించె నోషధులునుం బుట్టె విశ్వామిత్రుండు శ్వమాంసం
బాస్వాదింపనివాఁ డయ్యును బ్రతిగ్రహబుద్ధింజేసి చేసినదోసం బుగ్రతపంబు
గావించి పోఁ గొట్టుకొనియె నిట్లు వ్యసనస్థుం డగుబుద్ధిమంతుండు సర్వోపా
యంబులంజేసి ప్రాణంబు రక్షించుకొని భద్రంబులం బడయం దగు దాన నిహ
పరంబులు సెడవు నీవును ధర్మార్థంబులతెఱం గెఱింగి ప్రవర్తింపు మనిన
యుధిష్ఠిరుండు. 272

మ. ఇది ఘోరం బగుదస్యుధర్మ మని నే నెంతేని చింతించెదన్
మది మోహంబున డిందె నీనుడులు విన్నన్ సర్వధర్మజ్ఞ ! నా
కెదియుం దోఁపదు నావుడున్ నదిసుతుం డిట్లేల కా నయ్యెడిన్
స దసద్ధర్మము లెల్ల రాజు విని ప్రజ్ఞావంతుఁడై యొప్పెడిన్. 273

సీ. బహుశాఖలుగ ధర్మపద్ధతి వర్తిల్లు, నాచారము ప్రధాన మై యెసంగు
విజయైషి యగురాజు విని యెల్లధర్మముల్, బుద్ధిబలంబునం బొదలి ధర్మ
పథమున నడవంగ వలయు దుర్బలునకుఁ, బ్రజ్ఞాబలము లేమి ప్రథిత మగును
ద్వివిధధర్మంబును దెలిసి ప్రజ్ఞాబల,మునఁ బ్రవర్తించుటఁ బోలుఁ బతికి

తే. ధర్మపరిపంథి కెల్లశాస్త్రములు వితగఁ, బలుకుదు రపక్వమతులు వారలు తలంపఁ
బరులవిద్యను నిరసించి స్వస్వవిద్య, సారె కొనియాడుకొంద్రు రాక్షసులు వారు.

ఆ. లోకయాత్రపొంటె లో నెంచి పండితుల్, ధర్మశాస్త్రములను దగ వచించి

రవి సమూహితంబు లని యజ్ఞు లెంచరు, ప్రాజ్ఞు లం దసూయ వారిప్రకృతి. 275

వ. అప్రాజ్ఞుం డజ్ఞానంబున జ్ఞానహేతువాక్యంబు సాధు వని విశ్వసింపఁడు వాఁడు వేదశాస్త్రంబుల కపార్థంబు గల్పించు నిట్లు చెప్పి తొల్లి శుక్రుండు జ్ఞానమోహితు లగునసురులం దేర్చె నీవు నిందునం జేసి విగతసంశయుండ వగుమీ పుగ్రకర్మంబుపొంటె సృష్టింపఁ బడితివి రాజుల కదండ్యుల దండించుట యెట్టిదో దండ్యుల దండింపమియు నట్టిద కావున రాజు దీక్షితుండు గాకున్న లోకప్రజల స్వస్వధర్మంబున నిలుపం జాలం డట్లు కానినాఁడు జనులు వృకంబులు వోలె నన్యోన్యంబు పీడించుకొందురు లోకంబు చెడుం గావున నీవు కులీను లగుమంత్రులమంతనంబునఁ బ్రజలం బాలింపుము దుష్టనిగ్రహంబును శిష్టానుగ్రహంబును ముఖ్యధర్మంబులు బ్రాహ్మణసేవ శుభప్రదం బనిన ధర్మరాజు శరణాగతరక్షణం బెట్టిఫలం బీఁ జాలుం జెప్పు మనిన శాంతనవుండు వెండియును. 276

క. శరణాగతరక్షణ మది, పరమోత్తమధర్మ మనుచుఁ బాటించి నరే
శ్వర! మున్ను శిబిప్రముఖులు, వరసిద్ధిం గొనఁగ వినమె భవ్యయశమునన్.

ఆ. ఒక్కగువ్వ తనదునోడ లొక్కబోయకు, భోజనముగ నొసఁగి పోయె దివికి
ననుడు ధర్మపుత్త్రుఁ డాకథ యెట్టిది, తెలియ నానతిమ్ము సలలితాత్మ. 278

వ. అనిన భీష్ముండు. 279

భీష్ముండు కపోతోపాఖ్యానముం జెప్పుట.

తే. సర్వపాపాపహంబయి జగతిఁ బరఁగు, నక్కథం దొల్లి ముచికుందుఁ డనెడుపతికి
భార్గవుం డానతిచ్చె నమ్మార్గ మెల్లఁ, దెలియఁ జెప్పెద విను మని పలికె నిట్లు.

క. కలఁ డొక్క కాననంబున, నలఘుతరగ్రీవజంఘుఁ డతిరక్తాక్షుం
డలఘుభుజుఁ డొక్కవ్యాధుఁడు,పొలతియుఁ దానెల్లజంతువులకు యముండై.

ఆ. బండికందెనజిగి బైసిమాలినకొక్కి,బికిరిబడుగుటొడలు వేసడంపు
సొరము బూచినడలు పరఁగ జీవచ్ఛవ, మనఁగఁ గనఁగ నయ్యె నల్లబోయ.

వ. సకలప్రాణిలోకకాలమృత్యుస్వరూపుం డై పాపాత్ముం డగునమ్మృగవధాజీవుం డనుదినంబును. 283

తే. పులుఁగులను జంపి తినుచును వెలకు నమ్మి
కొనుచు నదియ బ్రదుకు గాఁ దదనుసరంబు
లైనసాధనముల నెన్ని యేని గూర్చు

కొని యడవులెల్లఁ దిరుగుచు ముని వసించు. 234

వ. ఇట్లు పెద్దకాలంబు గడచునప్పు డొక్కనాఁడు 235

మ. జిగురుంగండెలు విల్లు నమ్ములు వలల్ చిక్కంబు బురుల్ కత్తులున్
దగునీటె ల్గొని వేఁటకై కనఁ గడుం దవ్వై మహాదుర్గమం
బగుపెన్గానకుఁ బోయి యం దలరునానాండప్రభూతాళి దై
వగతిం జిక్కఁగఁ బట్టెఁ జిక్కువలలన్ వ్యాధుండు సక్రోధుఁడై. 236

క. జిగురుంగండెలు వలలున్, దగులంబులు గొన్ని తాల్చి దవ్వగునడవిం
దగిలినపక్షుల నెల్లన్, మొగిఁ బట్టెం బ్రొద్దుగ్రుంకఁ బోయెడుదనుకన్. 237

వ. ఇట్లపరాహ్ణంబుదనుక నానావిధపక్షిజాలంబుల జాలంబులం బట్టి గఱులు విఱిచియు విఱవకయు జంపియుఁ జంపకయుఁ జిక్కంబునం బెట్టుచుండె నట్టియెడ. 238

చ. కదువడిఁ జూడ్కిఁ జీఁకటులు గ్రమ్ము తళుక్కనుమించుదీఁగలుం
బడబడలాడుమబ్బులును బ్రాఁకులఁ గూల్చెడుహోరుగాలులుం
బడువడిగండ్లచప్పుడులు పర్వి దెస ల్వరికింప రాక పెం
గడవలఁ గ్రుమ్మరించుగతిగాఁ గురిసె న్బలువాన రెండుజాల్. 289

వ. సంవర్తసమయంబునందుం బలె భూనభోంతరాళంబు లేకార్ణవంబు గావించు నమ్మహావర్షంబున. 290

క. వలి గొట్టి కదల నేరక, పులుఁగులు మృగములును మార్గమునఁ బడియుండన్
జలిగొని చావఁగ నుండియు, ఖలుఁ డాతఁడు వానిఁ బట్టి కట్లం బెట్టెన్. 291

ఉ. కుత్తుకబంటినీటఁ బడి కుయ్యిడి యేడ్చుచు నన్నరాధముం
డత్తఱిఁ జిక్కము న్విడక హా! యిపు డేడకుఁ బోదు నొక్కొ యం
చెత్తినభీతిచేఁ గదలి యేగుచుఁ జుక్కల రాసి జొంపమై
హత్తినమఱ్ఱిచెట్టొకటి యాడఁ గనుంగొని దానిమిట్టునన్. 292

ఆ. నిలువ నెంచి చెట్టువలను బ్రతీక్షించి, మోడ్పుఁగేలు ఫాలమున గదించి
శరణు వేఁడుచుంటి సురలార! నాప్రాణములను నిలువరించి ప్రోవ రయ్య.

వ. అని ప్రార్థించి. 294

క. తడిసినగుడ్డల వడవడ,వడకుచుఁ బైఁ బొటునీరు పాణిఁ దుడుచుచున్
ముడుగం గూడుచు సతిపైఁ, గొడుకులపై నాసఁ బెట్టుకొని జీవించెన్. 295

వ. అంత వజ్జడి సూర్యుం డస్తంగతుం డైన కొంతవడి కడంగుటయు నయ్యొలుకు

కన్నులుం గాలునుం గాన రాక మిన్ను మన్ను లేకంబు లై కాటుక ప్రామి
నటులు చిక్క నగునక్కటికిఁజీఁకటి నద్దమురేయి నాభిదఘ్నం బై కంటకాకీర్ణం
బగునడుసుదారి దూరగతం బగుతనకుటీరంబునకుం బోఁ జాల కమ్మతిమిట్టున
శిలయె సెజ్జగా శీతార్తుం డై శయనించి కునుక కేకాకిన్యై యనేకవిధంబుల
మనోవ్యథలం బొదలుచుండె నాసమయంబున 296

సీ. అన్నగకోటరమందుఁ గాఁపురముగా,నొకగువ్వ పెక్కేండ్లనుండి యుండు
నాలుబిడ్డలతోడ నధికసుఖంబుగ,నానాఁడు మేతకై యరిగి పెట్ట
రాతిరి జామైన రా కుండి తపసిన,నక్కపోతము నలుదిక్కు లరసి
యెల్లు రాల్పడఁ గూత లిడిన రామిఁ దపించి,డగ్గుత్తికను బెట్టి దిగ్గురనఁగ
తే. నకట యెటయేని కడుదవ్వు వికల యగుచు,మేతకై చని పెంజడి మేను దాఁకి
గఱులు తడిసిననీరేయిఁ గదలలేక,యొకతపడియుండెఁగాఁబోలునొక్కొ తెలియ.

వ. అని యిట్లక్కపోతము మిక్కిలి యుక్కివ మ్మగుచింతాసాగరమ్మున మునింగి
యొక్కింతవడి కక్కపోతి నుద్దేశించి. 298

సీ. ఎచట నుంటివో చెలీ! యింతప్రొద్దోక చోట,ననుఁబాసి యుండుట నాయమటవె
యేకారణంబున నేమైతివో వాన,యేపునఁ దెగితివో యిగురుఁబోఁడి
నవుటాల కీపజ్జనన యుండి నన్నిట్టు,లాడించుచుంటివో యలరుఁగొమ్మ
నినుఁ బాసి యే నొక్క నిమిషమాత్రం బైన,నెమ్మేనఁ బ్రాణముల్ నిలుపఁ జాల
ఆ. నింటి కిపుడ వత్తొ యిఁకనె వత్తువొ యంచు,నాస వట్టి యెచట నలుకుఁ డైన
నోళ్లు తెఱచి నీదుపిల్లలు వాపోవు,వానివనటఁ దీర్ప నైన రావె. 299

తే. పుత్త్రులును బౌత్త్రులునువధువులును గలిగి,నిండియుండియు గృహిణి లేకుండెనేని
గృహము కాదది గహన మై తహతహ నిడు,నీవు లేకున్న నెల్లయు నిష్ఫలంబు.

చ. కడుకొని తేయునుం బవలు కష్టము లంటఁగ నీఁక సౌఖ్యముం
దొడరఁగఁ జేయుచుం బయలఁ దోఁచెడుప్రాణమ వై మెలంగునీ
వెడసిన బోఁటి! నాకు సుతు లేటికిఁ గాఁపుర మేటి కేరు మె
చ్చెడునది మే ని దేటి కిఁకఁ జీటికి మాటికి మాట లేటికిఁ. 301

సీ. ఇంటి యాతనికి ననేకాపదలు వాపి,యలరించునట్టి దిల్లాలు సూవె
పతి కనంగదశాప్రతతి దాఁక నీఁక ని,రతసౌఖ్య మిడునది సతియ సూవె
మగనికి నీరేడుజగములందు న్నిద్ధ,మగుకీర్తి కగునది మగువ సూవె
ప్రాణనాథునకుఁ గైవల్యసంప్రాప్తికి, సదన మైనది ప్రాణసతియ సూవె

తే. పనుల దాది కరణములఁ బరమమంత్రి, భోజ్యములఁ దల్లి రతి రంభ భూమిఁ క్షమను
రూపునను లక్ష్మి యనఁగఁ బేర్కొనుచు నిలగృహస్థునే లెమ్మనది గేస్తురాలుసూవె.

ఆ. ప్రేత యైనవానివెంట నెవ్వియు రావు, పెండ్లియాడినట్టి వెలఁది గాక
కాన నర్థకామ మైన మిత్రం బైన, గూర్పుచుట్ట మైనఁ గులసతి గద 303

సీ. ధర్మార్థకామసంతతులు పర్వినయప్డు, పతికిఁ దోడ్పడునది భార్య కాదె
పరలోకగమనంబు పట్టినయప్పుడు, పతికి సహాయము భార్య కాదె
బహుకృచ్ఛ్రగతుఁ డయి తహతహం బడునప్డు, పతి కెన్న నేడ్గడ భార్య కాదె
యామయగ్రస్తుఁ డై యడలుగుడుచునప్డు, పతికి నొప్పగుమందు భార్య కాదె

తే. భార్యఁ బోలినచుట్టాలు భార్యఁ బోలు, మిత్రులును భార్యఁ బోలుపవిత్రగతులు
భార్యఁబోలినసౌఖ్య మీపదియునాల్గుజగములఁ లేవు లే వనఁ దగును గాదె.

ఆ. ధర్మపత్ని లేనికర్మహీనునిగేహ, ముసుసు లేనిదేహ మొకడ సూవె
వాఁడు బ్రదికి యున్నవాఁ డయ్యుఁ జచ్చిన, వానితోడ నీడుపచ్చు నకట.

ఆ. నే భుజింప కున్నఁ దా భుజింపదు నేను, జలకమాడ కున్న జలక మాడ
దే ముదంబునొందఁ దా ముదం బొందు నేఁ, డట్టిపతినిఁ బాసి యెట్టు లుండు

చ. పలుకులఁ దేనియల్ చిలుకఁ బల్కుచు నన్నెడఁబాయ కెన్నఁడే
నలసిన నాఁకలిం గొనిన నంతటిలో వివిధోపచారముల్
సలుపుచు నన్ను సాఁకికొను సాధ్వినిఁ గూడి వనాగమంబులఁ
నిలిచియు దివ్యహర్మ్యముల నిల్చినయట్లు సుఖింతు నక్కటా. 307

వ. అని వికలరవంబునం బలుఁదెఱంగులఁ బలవరించెడు తనచెలువునిపలుకు లంతకుమున్న పన్నినయక్కిరాతునిచిక్కంబునం జిక్కి చాఁ గొక్కిమొగిఁ బ్రాణంబు లుగ్గఁ బట్టియున్నయక్కపోతి విని పతిమతి కింత యెక్కినయతివ గదా పుణ్యవతి యని సంతోషితస్వాంతయై సన్నంపుఁబెలుంగునఁ దాను లుబ్ధకసంలబ్ధయై వలం జిక్కి జీవమాత్రావశిష్టయై కష్టదశ నుంట మగని కెఱింగించి విధికృతంబునకు వగవం బనిలేదు దుడుగు మనుడు నప్పలుకులు ములుకు లై చెవులు సోఁక బెగ్గిలి యగ్గువ్వ దిగ్గన నన్నగంబు డిగ్గనుఱికి వలలోఁ బులుగులఱాపిడిం దగిలి పొగులుదానిచెంతకుం జని కనుంగొని కంటికిం గడవెడు నీళ్లుగా వలవలవలపోయుచు ని ట్లనియె. 308

మ. అకటా! యొక్కనిసొత్తు గానివనమం దావాసముం బొంది యెం
డ్లకుఁ గీ డెన్నఁడుఁ జేయ కాకు లలముల్ భక్షించుచుఁ గాల మి

ట్లోకచందంబున వెళ్లఁబుచ్చు మన కయ్యో! దయ్య మోర్వంగఁ జా
లక యిప్పాటులు సంఘటించెఁ గదె వాల్గంటీ! యిఁ కేమందునే. 309

వ. అని యనేకవిధంబులం జింతించుచు నాగ్రహంబున. 310

క. చచ్చినవాఁడుం బలె నెఱు, కిచ్చుటఁ బడియుండె వెఱ పొకించుక లేదీ
వచ్చినయాపడి దొలఁగఁగ, నుచ్చులు సడలింతు వెడలు ముగ్మలి యనుడున్.

ఆ. వలలఁ జిక్కి వీనిపశవర్తి నైతిని, మీర లిట్లు తలఁప మేర గాదు
ఇతఁడు మనగృహమున కతిథియై వేంచేసె, నతిథిపూజ కన్న నన్య మున్నె.

క. నావలనిదుఃఖమోనా,థా! విడు "మభ్యాగత స్స్వయం విష్ణు" వనం
గా విన వచ్చినవీనికిఁ, గావింపుమి యతిథిపూజ కౌతుకమతివై. 313

చ. అనవుడు నక్కపోత మతివా! యిపు డీవు వచించునంత యొ
ప్పు నయిన నొక్కసందియము పుట్టె మనంబునఁ బతు లేడ భూ
జనులకుఁ బూజ లేడ? యెటుసంఘటనం బగుఁ బో పరస్పరం
బును విషమంబు గాదె తలఁపోయఁగ నీయది చేయ నెట్లగున్. 314

చ. అమరగ నర్ఘ్యపాద్యముల కంబువు లంబరము ల్సుగంధపు
ష్పములు నివేదనార్థములు చాలము తే నిఁక షోడశోపచా
రము లిడి కొల్వ నెట్టు లగుఁ బ్రాణసఖీ! వివరింపవే యనం
గ్రమ మది యంతయు న్మదికి రాఁ జిఱునవ్వున గువ్వపెట్టియున్. 315

వ. ప్రాణేశ్వరా! పరులకు భరం బగు కాలానుగుణ్యాగణ్యబాధానివారణం బొన
రించుటయ పరధర్మం బని పెద్దలు వలుకుచుందు రితం డిపు డిట సీతునం బీతు
వోవుచున్నవాఁడు శీతార్తుం డగునితనికి సీ తుడుపుటయ పరమాతిథ్యంబు
గాన నీ వెటయేనియుం బోయి యొక్కయింధనాగ్రతలసంగతం బగునింగ
లంబు నెమకి తెమ్మనుడు సమ్మతిలి తనశోకంబు వీఁకం బోకార్చి యక్కపోతం
బక్కిరాతునిచక్కికిం జని తమజాతిం దెల్పి మనుష్యవాక్యంబుల నిట్లనియె.

శా. అన్నా! డస్సితి నేఁడు మా కతిథివై తాతిథ్య మీ నుంటి మా
కున్నంతన్ భవదీప్సితార్థ మెదియో యొప్పం జుమీ చెప్పఁగా
నన్నన్ లుబ్ధకుఁ డిచ్చ మెచ్చి ద్విజవర్యా! సీతునం గొంకెదన్
న న్నొక్కింత యనుగ్రహించి చలి మాన్పం జెల్లుఁ బుణ్యం బగున్. 317

చ. అది విని గువ్వపోఁతు రయ మారఁగ నాకస మంటి చూచి య
ప్పదమునఁ బొంత పల్లియకుఁ బాఱి యట న్మొగి మండునింగలం

బోదవిన వేడ్క ముక్కుకొన నూఁకొని వెండియు వచ్చి యొక్కచోఁ
జిదుగుల ప్రోవునం దిడి విశేషము గా రగులించె తెక్కలన్. 318

మ. తనగూటం గల ప్రాఁత పేలికల చేత న్వహ్ని వెల్గించి బో
యను వీక్షించి మహాత్మ! కాచుకొన సర్వాంగంబులున్ లేచి ర
మ్మన వాఁ డమ్మిథునమ్ము సంతసిలగా నయ్యగ్నిచే శీతబా
ధను బోఁ ద్రోలుచు లోనియాఁకలియు నంతం దెల్పె నిశ్చింతుఁడై. 319

క. ఆవెత విని పులుఁగిటఁ దిన, నేవియు మును గూడఁ బెట్టనేలు ల్లయినన్
లే వీతనిక్షుధ కెటు పో, దైవమ! యని వెల్ల నగుచుఁ దల్లడపడుచోన్. 320

తే. చిక్కమునఁ జిక్కి చిక్కినపక్కి మెలఁత, కలత యేటికి నీ కింత సలలితాత్మ!
యాత్మవల్లభ నే నిట్టు లధిపుకరుణ, నన్నిటికి నాయితంపడి యుండనుండ. 321

చ. అని సతి సారెకుం బలుకు నప్పలుకు ల్వెడఁ బెట్టి పిట్టరా
జనుమతి బోయదిక్కు మొగమై యతిథీ! మఱి యొంద వెవ్వి నీ
ఘన మగునాఁకలిం గెడపఁ గాఁ గన రామి మదంగ మిచ్చెదన్
దినుమని పావకేశుల నుతించుచుఁ జిచ్చునఁ జొచ్చెఁ జొచ్చినన్. 322

తే. దానిఁ గన్గొని విస్మయ మూని బోయ, కలవె యిటువంటి చెయ్వు లెక్కడనునైన
ననుచు ముక్కున వ్రేలిడియచట బొమ్మ, వలెను ప్రాన్పడి కనుచట్టె నిలిచియుండె.

వ. పదంపడి కొంతవడికిఁ దనమనంబున. 324

మ. వలి నగ్గి న్విడఁ బాపి తాఁకలికి నోర్వం జాల నన్నంత నీ
పులుఁగిట్లాలిని బిడ్డలం దొఱఁగి వేల్పు ల్మెచ్చ నిచ్చిచ్చునం
దళు కింతేనియు లేక యన్న మిదె కొమ్మా యంచు మే నిచ్చె హా!
తలఁప న్వింత లిటుండునే జగతి నేతద్రీతి సామాన్యమే. 325

వ. అని ప్రశంసించుచు. 326

చ. తను సకలాఘకోటులకుఁ దావల మంచును మే నశాశ్వతం
బనుచు నెఱింగి లుబ్ధకుఁ డనంతవిరాగయుతాంతరంగుఁడై
తనవల నున్నపక్షితతిఁ దక్షణమే విడనాడి యొల్ల సా
ధనములు పాఱఁ జిమ్మి చనెఁ దా నుపవాసము లుండి మే న్విడన్. 327

వ. అంత నవ్వాలనవ్వాల వెలువడి వడి నయ్యాఁడుగువ్వ శోకానలదందహ్యమానాంత
రంగయై దళనవసనంబు లెఱియ నట్టు బెట్టుగ వెట్టనిట్టూర్పు లిచ్చుచుఁ జిచ్చు
నం జొచ్చి చచ్చి మండెడుపతిదండ కరుదెంచి కాంచి యశ్రుజలతరంగితాస్య

యగుచు నెల్లు రాల్పడఁ గడువడి నడలుచు నోడయు నుద్దేశించి. 328

క. పెక్కురు పుత్త్రులు గలిగిన, చక్కని వైభవము బంధుసందర్శనముల్
మిక్కిలి యౌక్యము గలిగిన, నక్కట పతి లేనిసతికి నంతయు వితయే. 329

చ. మనమున భర్తృసోదరులు మామయుఁ జాలు ని దేటిసంగడం
బనియెద రత్తయుం గఱకు లాడి శపించెడు నాఁడుబిడ్డలున్
గనలుచు బండ్లు గీఁటెదరు గాటము దూఱెడుఁ దోడికోడలున్
మనుజుల కెల్లఁ జుల్కనగు నాథవినాకృతకాంత కాశ్యపీ. 330

వ. అని మఱియును. 331

చ. చల్లనిమందమారుతము సౌరభమున్ వెదజల్లుచుండ న
ల్లల్లన తెక్కదోయి నిడుపాఱఁ గదల్చుచు నాకసంబునన్
సల్లలితప్రచారమును సల్పుచు నల్పము గాని వేడుకన్
గొల్లగఁ గొన్న సౌఖ్య మది కొంచెమయే మఱువంగ శక్యమే. 332

మ. అకటా! యేమని చెప్పుకొందు హృదయేశా! నీవును న్నేను బా
యక మాకందకుజాగ్రశాఖలపయిన్ హాళిం బ్రవర్తించుచున్
సుకముం బొందుచు మందమారుతమునం దూఁగాడి డోలావిహా
రకళం దేలుట తోఁప వచ్చినను నాప్రాణంబు వోకుండునే. 333

చ. గలగల మంచు ఱాలపయిఁ గాలువ గట్టెడు కొండయేఱులన్
జలకము లాడుచు న్మన మెసంగెడునప్పుడు తెక్కదోయితో
జలములు చల్లి నాపయి వెస న్బెడమోమయి నవ్వుచుండు నిం
దలఁచిన గుండె జల్లు మని నాదగుప్రాణము వోక యుండునే. 334

క. నినుఁ బాసి యొక్కనిముసము, దనువునఁ బ్రాణములు నిలుపఁ దలఁపను నీతోఁ
జను దెంతుఁ బ్రాణసఖ నగు, నను విడి నీ కొంటి నరుగ న్యాయమె నాథా.

వ. అని యనేకగతులం బడి మగనియనుగమనంబున నోడలు విడనాడినచేడియ పుణ్యగతులం బడయు నని హృదయంబునం దలంచి కోటరంబున మాటిమాటికిం జెవులు దూఁటు కట్టునట్టు బిట్టు మొఱవెట్టుతన లేఁతపోతంబుల నెగుబోఁదలగుదనుక నాదరింపుఁ డని చెంతఁ జేరిన చుట్టాలకుం జెప్పి యప్పు డప్పావకుం దరికొల్పుచు వలగొని జేజేలు మేలు మే లనుచుండఁ గీలాజాలంబున వ్రాలి ప్రాణేశ్వరు స్మరియించుచుఁ బ్రాణంబులు విడిచె నప్పుడు. 336

చ. సురుచిరరత్నజాలపరిశోభితరుక్మవిమాన మొందు ని

ర్జరు లొాగఁ దేర దంపతులు రాజితదివ్యశరీరధారులై
కరముగ నచ్చరల్ గొలువఁ గాఁ గని యెక్కి నిషాదుఁ జూచి నీ
కరుణనుగాదె స్వర్గగతి గల్గెను మా కిటు పోయి వత్తుమే. 337

వ. అని పలుకుచు. 338

సీ. దివ్యదేహములతో దివ్యయానము నెక్కి, దివి కేఁగుపువ్వలఁ దివిరి చూచి
వైరాగ్యవంతుఁ డా వ్యాధుండు తా మహా, ప్రస్థానమున నిట్టిపగిది నగుదు
నని మరుదాహారుఁడై ఘోరకాంతార, మునఁ బడి మే నెల్ల ముండ్లు సింప
రక్తసిక్తాంగుఁడై భ్రమియించుచుఁ దవానల ముద్భవించి యప్పాలము నాల్గు
ఆ. మూల లల్లుకొని సమున్నత మై వన, మేర్చుచుండ బీ తొకింత లేక
పిఱికికండ లేనియెటు కెదురుగఁ బోయి, దావవహ్నిఁ జొచ్చి దగ్ధ మయ్యె.

వ అంత నక్కిరాతుండును దివ్యతరసుగంధమాల్యాంబరాద్యలంకారాలంకృత
దివ్యరూపధరుం డై దేదీప్యమానదివ్యాసీతానూనప్రభాభాసమానవిమానంబు
నెక్కి కొని దైవతకపోతవధూవరసహితంబుగ హితంబున నప్సరోగణపూజ్య
మానుం డై జగత్ప్రాజ్యం బగుస్వర్గంబునకు నిర్గమించి యచ్చట నిచ్ఛా
విహారసుఖంబు లనుభవించుచు ధృవంబుండె నని వెండియు. 340

క. ఈకాపోతచరిత్రము, చేకొని వ్రాసినను విన్నఁ జిత్తమునందుం
గైకొనినఁ బాపనాశన, మై కలుగుఁ స్వర్గసౌఖ్య మవనీనాథా. 341

తే. గోఘ్నునకునైన నిష్కృతికొంత గలదు, గాని శరణాగతునిఁ గావమానసంబు
సలుపకుండినవానికిఁ గలుగ దెట్టి, నిష్కృతియుఁ గానఁ జెప్పితి నీ వెఱుంగ.

వ. అని చెప్పినఁ బాండవాగ్రజుం డత్యంతానందభరితాంతరంగుం డై శరణాగత
రక్షణం బింత యొప్పునే యని యప్పితామహు నభినందించుచు నబుద్ధిపూర్వ
కం బైనపాపం బెప్పాట నివర్తింప నోపుం జెప్ప ననుగ్రహింపు మనిన నతం
డతనిం గని తొల్లి పరీక్షిత్తనయుం డగుజనమేజయుం డనువాఁడు తన కబుద్ధి
పూర్వం బైనబ్రహ్మహత్యం బెడఁబాపుకొనియె నక్కథ పురాణప్రసిద్ధంబు
చెప్పెద నవహితుండ వగు మని యిట్లనియె. 343

### జనమేజయుండు బ్రహ్మహత్యం బెడబాపుకొనుట.

ఉ. పాపము సుట్టుకొన్నపుడు పార్థివసత్తము నాతనిం బ్రజల్
కోపము తాపముం గదురఁ గొంతటిలోనఁ బరిత్యజించి పోఁ
బాపనవారునుం దెగడి పాయఁగఁ జేయఁగ నొందు తోఁపమిఁ

భూపతితం ద్యజించి వనభూములకుం జనెఁ దాపతప్తుఁ డై. 345

క. ఉపవాసవ్రతనిష్ఠఁ, దప మెంతయుఁ జేసి యతఁడు తాపసవర్యుల్
కృపఁ జూతు రనుమతిం గా, శ్యపిఁ గలదేశములు తిరిగె నార్తుం డగుచున్.

వ. ఇట్లు తిరుగుచు నొక్కతపోవనంబున బ్రహ్మనిష్ఠాగరిష్ఠుండు నాత్మజ్ఞానసం
న్నుండును సంశితవ్రతుండు నగుశౌనకుం డనునింద్రోతమునిం గని పాదంబుఁ
వ్రాలి పజ్జం గృతాంజలి యై నిలిచినం గని గర్హించుచు నతం డి ట్లనియె. 346

మత్త. ఘోరపాప మొనర్చి పేర్చినక్రుళ్లుపోతువు నీ విటం
దారసిల్లితి వేర దుర్మతి తాపసాశ్రమభూము లీ
క్రూరకర్మున కేమికార్యము గూడఁ జేసెడి పొమ్ము పో
మ్మోరి! నీదగునున్కి మామది కొప్పఁ జేయదు చెప్పితిన్. 347

మ. పొల వల్పుం గడు నిన్నుఁ గాంచిన శవంబుం గాంచిన ట్లయ్యెడిన్
మలినాత్ముండవు నీవు ప్రాణములతో మట్టాడుచుం జచ్చిన
ట్టులు గాన్పించెదు నీస్వభావ మది యొప్పుం బాప చింతాసము
జ్జ్వల మై యుండెడు నిన్నుఁ జూచినను బాపం బయ్యెడుం బో మ్మిఁకన్. 348

చ. జనకులు మే ల్దలంచి వ్రతచర్యలు దేవసపర్యలుం గడుం
బొనరిచి పుత్రులం గనఁగ బుద్ధి యొనర్తురు నీకతంబునన్
వనరుచు స్వర్గసౌఖ్యమును బాసి భవత్పితృవర్గ మెల్లఁ గ
న్గొను మదె నారకవ్యథలఁ గూరి తపింపఁగ నయ్యె నయ్యయో. 349

స్రగ్ధర. ఓరీ! పాపాత్మ నీ వీయొడలు దెగినపై నోసరిల్లంగఁ బో కా
ఘోరం బౌ దుర్గతిం బెక్కులు సమలు గడుం గుయ్యిడ న్నోము క్రిం దై
జీరాడన్ వ్రేలఁ గట్టం జెడఁ బొడిచి తినం జేరి కంకాదిపక్షుల్
పారంబుం బొందలే కాపదల కయి కడున్ వందు దేసందు లేమిన్. 350

క. పెదకాల మిట్లుగడచిన, పదపడిఁ గ్రిందుగను ద్రోయఁ బడి భువి పాపా
స్పద యోనిఁ బుట్టి పాపము, వదలక చేసెదవు మఱియు వనటం బడఁగన్. 351

వ. అనిన జనమేజయుం డమ్మునికి ట్లనియె. 352

క. నిందింపఁ దగినవాఁడన, నిందించితి వీవు దీన నే నెగు లొందన్
నిందించి నంత లాభము, పొందుదునె ప్రసాదబుద్ధి పొడగన కనఘా. 353

సీ. నే బ్రహ్మభక్తుఁడ నే యని పలుమాఱు, తెలుపఁగాఁ గల బాస సలిపి యిపుడు
మాకులంబున నిట్టిలోకనింద్యం బైన, దోష మెన్నండును దొడర లేదు

తోడరంగఁ గూడ దెన్నఁడుఁ గాని నన్ను నే, నిందించుకొనుచుంటి పందుచుంటి
శబరపుళిందాదిజను లట్లు కర్మబాహ్యుండ నై నరకంబు నొంద నోప
తే. నిహపరంబుల దోషసమేతుఁడ నయి, వితగఁ బోవకయుండ నావిధ మెఱింగి
నన్ను శిష్యుని గురువట్లు సన్నుతమతి, వగుచు రక్షింపు మ్రొక్కెద నార్య! నీకు.
సీ. నాపొనర్చినపాపరూపాపరాధము, దావానలమురీతిఁ దనువుఁ గాల్చు
నాకర్మమున కేన శోకించుచుంటి వైవస్వతభయము నన్ వదలకుండె
నది శల్యమై నాదుహృదయంబునం జొచ్చె, జీవింతు నెట్లు దుఃఖావిలుండ
నాసంకటము వాపి ననుఁ బుత్రునిం దండ్రి, విధమునఁ గని ప్రోవ వేఁడుచుంటి
తే. ననుడు నత్తపోధనుఁడు కృపార్ద్రహృదయుఁ
డగుచు నాతనిఁ గరుణింప నాత్మ నెంచి
బ్రహ్మహత్యాఘ మొనరించి పతితుఁ డైన
నిన్నుఁ గనికరింపఁ దలంచితి నృ రేంద్ర! 355
క. అప్రాజ్ఞుఁ డసాంప్రతముఁన్, క్షిప్రంబుగఁ జేసి వెనుక చింతించు నెడన్
సుప్రాజ్ఞుఁడు భూతహితార్థప్రాప్తిన్ వగవు లేనిదానిఁ బొనర్చున్. 356
క. ప్రాజ్ఞుఁడు ప్రజ్ఞాసౌధము, విజ్ఞులు మెచ్చంగ నెక్కి వీతజ్వరుఁ డై
యజ్ఞు లొనర్చెడుపనుల నభిజ్ఞుం డై చూచి హృదయవీథిన్ వగచున్. 357
క. నిగమాగమముల నీకుం, దగులము గల దే నెఱింగినాఁడ మహీశా
సుగతిం బొందగ నిష్కృతిఁ, దగఁ జేయుము బ్రహ్మ నిన్ను దయఁజూచు నెడన్.
తే. పాపమం దనుతాపము దాపరిల్లె, నేని బ్రాహ్మణావజ్ఞ సుం తైన లేక
ధర్మతత్పరుఁడవు గమ్ము ధరణినాథ, యనుడు జనమేజయుం డిట్టు లనియె మునికి.
క. పాపాగ్నితాపతప్తుఁడ, నేపగిది నధర్మతీర్థ మే నొందం గా
నీపాదసేవఁ గోరితి, నాపాలం గరుణం జూప న్యాయము కాదే. 360
వ. శౌనకుం డిట్లనియె. 361
మ. విను దంభంబును మానముఁన్ విడిచి నీప్రీతి న్మదిం గోరుచు
న్వినిపింతుం గృపణత్వముఁన్ భయము నింతే లేనిసత్యోక్తి నీ
పని నా కెద్దియు లేదు ధర్మమతి నై వాకొందు ధర్మంబు త
ప్పనిమార్గంబున సర్వభూతహితముఁన్ చాటించి వర్తింపుమా. 362
ఉ. పాతకవర్తి వై ననినుఁ బట్టి మెలంగిన మొత్తి వెట్టుచున్
భూతము లెల్ల హా యనుచుఁ బొక్కు నధర్మ మొనర్చినట్టినన్

బూతచరిత్రు నైన బుధపుంగవు లెల్లరు నొల్లఁబోక మై
నాతలఁ దప్పవెట్టి తెగనాడి త్యజింపఁగఁ జూతు రీతఱిన్. 363

క. కావున నాయొనరించెడు, నీవిధికిం గినుక వొడమ నీయక ద్విజులన్
సేవింపుము తత్క్షేమము, భావించుచు ద్రోహ మిూఁగి పార్థివముఖ్యా. 364

వ. అనవుడు జనమేజయుండు. 365

క. మనమున వాక్కునఁ గర్మం,బున నే విప్రులకుఁ గూర్తు మోహభ్రాంతిం
గొని వారిపట్ల ద్రోహము, పొనరుప నని నీదుపదము ముట్టి వచింతున్. 366

సీ. అనుటయు శౌనకుం డను నట్టిదేని చె,ప్పెద నీహితముపొంటె వినుము సిరియు
బలమునుదుష్టియుఁగలిగిపార్థివుఁడుద,ర్పముభోగమునుమానిసుముఖుఁడగుచు
ధర్మతత్పరుఁ డయి తపమును దానముఁ, దవిలి మున్ దారుణత్వమున నయ్యుఁ
దుద మృదుత్వమ చూపి పొదలభూతంబులఁ, గరుణించు నే మేలు గాంచునవని

తే. నట్టివాఁడవ వై నీవు యజ్ఞ దాన, సత్య వేద దయాదులజాడ విడక
నడపుచుండిన శ్రేయముల్ వడయఁగలవు,పుణ్యదేశాభిగమనముల్ పోలునీకు.

వ. ఇప్పట్ల యయాతి చెప్పినచొప్పునుం గలదు చెప్పెద నవహితుండ వగుము.

సీ. పురుషుండు నిజజన్మమును సార్థక మొనర్పఁ,గొన నెంచు నే ధర్మమునఁ జరించి
జన్నముల్ గావించి స్వాధ్యాయసంపన్నుఁ, డై తపశ్చర్యయు నాచరించి
క్షేత్రతీర్థంబులు సేవింపఁ దగు నందు, శ్రేష్ఠతరము కురుక్షేత్ర మెన్న
దీనికన్న సరస్వతియు సరస్వతికన్న, మహితతీర్థము లందు మానసంబు

తే. పుష్కరంబులును బ్రభాసమును బృథూద
కము దృషద్వతి కాలోదకమును బోలుచు
వానియం దాడి జల మాని మానవుండు
జన్మమృత్యుజరాభీతిఁ జనఁగఁ బోఁడు. 369

వ. ఈతీర్థంబులందు స్వాధ్యాయశీలుం డై స్నానం బొనర్చిన సర్వపాపంబులు
సమసి పోవు నని మనువచనంబు గలదు నీవు తీర్థసేవం గావించి విగతకల్మ
షుండవై బ్రాహ్మణప్రసాదంబు వడయునట్లు ప్రజాపాలనంబు సేయుము బ్రాహ్మ
ణావజ్ఞం జేయక తపస్తప్తుండ వై పాపంబునుండి పరిముక్తిం గాంచెదవు
మఱియు ధర్మాచరణంబునను దీర్థాటనంబునను దపఃకరణంబునను నీపాపంబు
పాదపాదంబుగఁ బరిహారం బగుఁ దపశ్చర్య సద్యస్కాలఫలప్రదం బొక్కయేఁ
డగ్నినుపాసించిన నభిశప్తుం డాదోషంబు వాయు మూఁడేండ్లు సేవించిన భ్రూణ

హత్యాదోషంబు దొలంగుఁ బుష్కరప్రభాసాదితీర్థాటనంబు సేయుచుఁ దత్తజ్జలంబుల నఘమర్షణస్నానంబు చేసిన నశ్వమేధావభృథంబునం బోలె బ్రహ్మహత్యాదిపాతకంబులు పటాపంచలగు నని మనువు చెప్పె నొకప్పుడు సురాసురు లాబృహస్పతిం జేర నరిగి పాపపుణ్యంబుల తెఱం గెఱింగింపు మనిన నతండు వారలకుఁ జెప్పినవిధం బాకర్ణింపుము. 370

మత్త. బుద్ధిపూర్వక మైన పుణ్య మబుద్ధిపూర్వకపాప మ
త్యుద్ధురం బయిన న్నశించెడు నోజ సేయఁగఁ జాలెడిన్
బద్ధమై వసనంబున న్మలినంబు చేరిన దానినిన్
శుద్ధముం బొనరించుకారము చొప్పు చొప్పడ నెప్పుడున్. 371

వ. అని యింద్రోతుం డనుశౌనకుండు జనమేజయునకుం జెప్పి వానిచే వాజిమేధంబు సేయించె నతండును వ్యపనీతకల్మషుం డై వెలుంగుచు వెండియు రాజ్యపాలనంబు గావించె నని చెప్పిన నప్పాండవాగ్రజుం డొండేని చచ్చి వెండియుం బ్రదికినవాఁ డుండునో యన భీష్ముండు నీయడిగినదానికి సమాధానం బై గృధ్రజంబుకసంవాదం బనునొక్కపురాతనేతిహాసంబు గల దాకర్ణింపుము. 372

## గృధ్రజంబుకోపాఖ్యానము

సీ. విదిశాపురంబున విప్రుఁ డొక్కఁడు గలఁ,డతనికి లేక లే కయ్యె సుతుఁడు
బాలకుండును సువిశాలాక్షుఁడును గుల,సర్వస్వభూతుఁడుం జారుమూర్తి
బాలగ్రహాత్యంతబాధితుం డయి చచ్చెఁ, జచ్చిన వానికై సర్వబంధు
వులు వెక్కి వెక్కి మిక్కిలి యేడ్చి యేడిచి,మృతునిఁ గైకొని యొల్కిమిట్ట కేగి
తే. యచటఁ బడ వైచి పోవలేకార్తు లగుచు,నంకమునఁ బెట్టుకొని చుట్టు నావరించి
వానిపూర్వోక్తభాషల వరుసఁ దడవి,తడవి పలవింప సాఁగిరి కడలు ద్రోయ.

ఉ. అంతట వారిరోదనమహారవము న్విని గ్రద్దయొక్కఁ డ
త్యంతము సంతసించుచు రయంబున నచ్చోటి కేగుదెంచి మీ
రింతయు మోహము న్విడక యేడ్చుచుఁ బీనుఁగు వైచి పోవలే
కెంతయు సంతపింతు రని యిట్లు వచించె మనుష్యవాక్కులన్. 374

తే. ఇచ్చటికి వేనవేలు గా నెల్లనాఁడు, స్త్రీపురుషశవంబులఁ దెచ్చి చెచ్చెరఁ బడ వైచి పోదురు గాని మీవలెను దుఃఖ,కర్శితాత్మకు లై యుండఁ గానెఱుంగ.

మ. జగ మెల్లన్ సుఖదుఃఖసంభృతముగా సాక్షాత్కరింపంగ మీ

రోగి వీక్షింతురు విప్రయోగమును సంయోగం బెడందం దలం
పగఁ బర్యాయసముద్భవంబు లెపు దేభంగిం బ్రవర్తింపఁ గా
నగు నబ్బంగియ కాక ప్రాణులకు వే ఱొ నెట్లుగాఁ జెప్పఁడీ. 376

ఉ. చచ్చినవానితో నెవఁడు చావఁగ లేఁ డొకరుండు చచ్చియున్
వచ్చినజాడయుం గన మవశ్యము చచ్చెడి నెల్లజంతువుల్
నెచ్చెలి వీఁడు సూఁ డనుచు నెమ్మది నెన్నదు మృత్యు వెల్లరన్
గ్రచ్చఱ నోట వైచికొనుఁ బ్రాణులకున్ గతి యివ్విధం బగున్. 377

ఆ. ప్రొద్దు గ్రుంకఁ బొఱె సద్దు చేయుచు నిట,భూతములు పిశాచములు గ్రహములు
మెలఁగుచుండు నకట మీర లీచచ్చిన,వానితోడఁ జచ్చువారె చెపుడ. 378

క. వితగా నేడ్చుచు నున్నన్, మృతి నొందెద రిచట నెల్ల రీమోహమ్మున్
మతిఁ దవుల నీక పీనుఁగున్,క్షితి వైచి చనుండు వేగ గృహమునుం జేరన్. 379

వ. అట్లు గ్రద్ద పలికినపలుకుల కులికి బాలబంధువర్గం బెల్ల గొల్లు మని పెల్లురేఁగిన
దుఃఖంబున నొక్కపెట్టె కొట్టుకొని యేడ్చి సుతుండు మృతుం డగుట నిశ్చ
యించుకొని నిరాశులై కళేబరం బటఁ బెట్టి పురంబు దారివట్టి పోవుచున్న
సమయంబున నట నున్నయొక్కబొక్కనుండి నక్క యొక్కటి వారి కెదురు
పడి కంట నీరు గ్రుక్కుకొనుచు ని ట్లనియె. 380

ఉత్సా. కరుణ లేనికటికవారు గారె మీరు బాలకున్
ధరణిమీఁద బాఱ వైచి దారి వట్టి పోవుచుం
టిరి దివాకరుం డెసంగెడిన్ భయంబు లే దిటన్
మరలుఁ డిట్లు తగదు మీకు మాట లేటి కాడఁగన్. 381

ఉ. ముద్దులు మూట గట్టుచును ముచ్చటఁ గూర్చెడుచిన్నిపాపనిన్
గద్దరిగ్రద్ధ మాట విని కారుణికత్వము నుంత సూపఁబో
కద్దిర వల్లకాట విడనాడి చనం జను నోటు కాలపుం
బద్దు విచిత్ర మింతన కుమారు నెటో బ్రదికింపఁ జేయునో. 382

ఆ. కొడుకుతో కుపలుకు కూళలకేనియు,ముద్దు గులుకఁ జేయు నద్దిరయ్య
మీర లెంత కొయ్యదేఱినవారొ పక్షికిని బసికి నున్నకృపయు లేదొ. 383

మ. పసికిం బక్షికిఁ గీటకంబునకు సర్వప్రాణికిన్ బిడ్డలం
దెసఁగు స్నేహ మహంబునం బరమునం దిచ్చు న్మహానంద మి
ట్టిసుతుం గా దని వైచి పోఁ దలఁతు రీ తేవల్ గడుం గాని వ
ద్దెసఁ గాకుండుఁడు దైవపుంజెయిది మేల్ తే నుండునో మీ దెసన్. 384

తే. పోవఁ గాళు లెట్లాడెడుఁ బ్రొద్దుగ్రుంకు
వఱకుఁ జూడుఁడు మోమున వాసి చెడదు
బాలకుఁడు పెండ్లికొడుకు నాఁ బోలెఁ దోఁచు
బ్రదికెడినొ మీసుకృతలేశపటిమవలన. 385

వ. అని పలికిన బాలబాంధవు లాశాపాశబద్ధు లై మగిడి వచ్చి చచ్చినవానిం బొదువుకొని పరిపరివిధంబులఁ బరిదేవనంబు సేయుచుండ స్వార్థపరాయణం బగుగృధ్రంబు వెండియు. 386

ఉ. చాలుఁ బురే నృశంస మగుజంబుక మాడినమాయమాటలన్
జాలికి నై యొకం డెఱుఁగఁ జాలనిమీపు దురాశ పెంపునన్
గాలు మరల్చి వచ్చితిరె కాలునిప్రోలికిఁ బోయె మీసుతుం
డేల విరాళి లోకమున నీల్గినవారలు గల్గ విందుమే. 387

తే. పంచభూతపరిత్యక్త మెంచి చూడ, బాలకునిమేను గొయ్య యై బడలువడియెఁ
గందియును గాజువాఱె వికార మొందె, వెండి జీవించు ననుకొంట వెఱ్ఱితనము.

ఉ. ప్రేతకు నూర్ధ్వలోకములఁ బేర్మి ఘటిల్లఁగ దానధర్మముల్
ప్రీతిఁ బొసర్పఁ జేడ్చినను బిమ్మట గల్గునె కా కొకింతమే
లేతఱి లేదు సత్క్రియ లవెన్ని యొనర్చిన నంత సౌఖ్య మ
త్యాతతవైభవంబు మృతుఁ డైనభవత్సుతుఁ డందుఁ బొందుగన్. 389

సీ. మీబాలకుం డిప్డు మీ రొనర్చినపుణ్య, కర్మముల న్మీఁద గరిమఁ గాంచి
మఱియును ధనధాన్యమణిరత్నపుత్రాది, సంపత్సమేతుఁ డై జగతిఁ బుట్టు
సుకృతదుష్కృతముల చొప్పననే పుణ్య,పాపజన్మంబులు వడయ వచ్చు
శోకదైన్యంబులు సూరెల రా నీక, పుత్రమోహంబును బోకడంచి

ఆ. విడిచి పీనుఁ గైనబుడుతను బ్రొద్దుగ్రుం,కకయ మున్న యిండ్లకడకుఁ జేరు
కొనుఁడు జీవితాశ గొని యుంటి రేని లో,కమున నొకనికొకఁడు గలఁడె తెలియ.

క. ఎంతో ప్రేమించినవాఁ, డింతటిలో విడిచి పోవు నెంతెంతలు నే
వింతగఁ గాలవశంగతు, లింతటిలో నుండుదాని కిం తేమిటికిన్. 391

క. ఏడిచి మీపుత్రకునిం, గూడి చనం దేరఁ గల రొకో యిఁక మీఁదన్
వీడి శవంబుం జనుఁ డిటఁ, గీడగుఁ బడసినను మీకుఁ గించులవలనన్. 392

వ. అని పలుకుచుండ జంబుకంబును. 393

చ. అలుపపుబుద్ధి గృధ్ర మకటా! సుకుమారకృతాతిదుగఖత

స్తుల రగుమీామతిం గలంచి పొం దని చెప్పుచు నుండె మీార లి
ప్పలువ వచించుమాటలను బాటి యొనర్చుచు నాణిముత్య మ
ట్లలరెడునిక్కమారు విడనాడి గమించుట పోలి యుండునే. 394

క. ప్రేముడియుర్ నుడికారము, సామాన్యము సర్వజంతుసంఘుంబుల కీ
కోమలగాత్రుం గనుఁగోఁ, బ్రేమ న్నాకంట నశ్రుబిందువు లురలున్. 395

తే. పురుష కారము దైవము పొసఁగియున్నఁ, గార్యసిద్ధి యగుం గాన నార్యు లెపుడు
యత్న మొనరింపఁ గాఁదగునవలదైవ, మున్న ఫలియించు లేకున్న సున్న యగును.

తే. జనుఁడు నిర్వేదమునఁ గాక జతనమునను, బడయునర్థము కులకర్త బుడుత నిట్లు
విడిచిచననౌనె ప్రొద్దు గ్రుంకెడువఱకును, నరసిచన రాదొ మీాకింతకరుణ లేదొ.

వ. అనిన గ్రద్ద యి ట్లనియె. 398

శా. చెల్లెన్ సార్ధసహస్రవర్షములు నాజీవించు కాలంబునం
దెల్లం దేశము లేగి చూచితి నెటే నేప్రాణియుం జచ్చి తా
నల్లన్ వచ్చినయట్లు నే నెఱుఁగ నన్యం బైనగర్భంబునం
దెల్లం బయ్యెడుఁ బుట్టి గిట్టు టరయ న్బీనుంగు జీవించునే. 399

సీ. జంగమస్థావరజంతుజాలమునకు, సహజము పుట్టుట చచ్చుటయును
నీభాగ్యభోగ్యము లెన్న ననిత్యముల్, దారపుత్రాదులు తరలినపుడు
మనుజులు దందహ్యమానమానసు లయి, రుద్రభూమి నైచి రోఁజి రోఁజి
నిజనివాసములకు నెగులుపుచ్చుచు నేగి, బ్రదుకం దలంతు రిప్పగిది నెల్లఁ

తే. పేదయునుమహారాజును బిన్న పెద్ద,మూఢుఁడునుయావనస్థుఁడుప్రౌఢుఁడు తమ
కష్టసుఖములు భాగ్యభోగ్యములువిడిచి, వెడలిపోదురు చుట్టాలుమిడుకమిడుక.

తే. ఉసురు లేగుటఁ గాష్ఠత్వ మొందె నిట్టి, పీనుఁగును బట్టికొని యిట్లు ప్రేముడించి
కదల నేరక యుంటి రియ్యది నిరర్థ,క మ్మయి పరిశ్రమ మ్మగుఁ గాదె తలఁప.

చ. చెవుల వినండు కంటఁ గని చెప్పఁడు చొప్పులు నిట్టనిల్గి కొ
య్యవలె నిలం బడెం బుడుతఁ డక్కట పీనుఁగ యయ్యె వీనినిం
దవిలి మదీయధర్మవచనంబుల నొల్లక యొల్లఁబోయి చి
త్తవికృతిఁ గుంది మందు లయి తారఁ దలంపర యేమి చెప్పుదున్. 402

క. తగులంబు గలిగి తలఁచుచుఁ, బొగడుచు నీక్షించుచున్నఁ బొడ వడగక పా
క్కగణిత మగు నజ్ఞానము, తెగటాఱం జేసి పోవఁ దెగ రకట కటా. 403

వ. అని హేతుమద్వాక్యంబుల విజ్ఞానంబు గలుగం జెప్పిన విని బాలబంధు లాశా

పాశంబు దెగఁదెంపులు చేసికొని మృతునిం బరిత్యజించి కదలి కొంతచని
రంతలో మృగధూర్తకంబు వారి కడ్డపడి యిట్లనియె. 404

తే. గృధ్రవాక్యము లాలించి కించు లగుచు, జాళువాపైడి కెత్తగుబాలు విడిచి
పోవఁ దలఁతురు స్నేహంబు పోకడంచి,దీనఁ దాపము మితి లేని దాను మీకు.

వ. మఱియుం జెప్పెద వినుండు. 406

సీ. తొల్లి రాఘవుఁడు మృతుం డైనద్విజసూతి, బ్రదికింపఁడే ప్రభావమునఁ జేసి
సృంజయుం డనురాజశేఖరుతనయుఁ డీల్గిన నారదుఁడు బ్రదికింప లేదె
శ్వేతుఁ డన్రాజర్షి విగతజీవుం డైన, నిజపుత్త్రునిం దపోనిష్ఠఁ దేడె
మృతుఁ డైనసౌమిత్త్రి బ్రతికింపఁడే యంజ,నావరసుతుఁడు సంజీవిఁ దెచ్చి

తే. ఆవిధంబున నిత్తఱి దేవుఁ డేని, సిద్ధుఁ డేనియు ముని యేని చేర వచ్చి
కురరుల క్లేశ్ముమీఁపయిఁ గరుణఁ జేసి,బాలుఁ బ్రదికింత్రుఁ గా కేమి పాలుమాల.

వ. అని బోధించిన వా రాశాపాశంబు పట్టి పట్టువఱుపఁ గ్రమ్మఱి వచ్చి చచ్చిన
వానిచుట్టుం జేరి బిట్టు వాపోవుచుండి రంతఁ గొంతలో గృధ్రంబును వచ్చి.

తే. అశ్రుపాతపరిక్లిన్నుఁ డగుచు మీకు,మారకుఁడు దీర్ఘనిద్రాసమావృతుండు
లేవఁ డెంతకుఁ గా నయో జీవ మెడలి,నట్టివారలు బ్రదుకుట వట్టిమాట. 409

వ. బ్రహ్మవిష్ణుమహేశ్వరాదులు దిగి వచ్చి వర మిచ్చినం జెప్పఁ జాలను గాని
యిట్టిజంబుకశతంబు నూఱేండ్లు తల్లక్రిందుగ దపంబు చేసియును మృతునకు
మూర్తిప్రదానంబు సేయఁ జాల దిది యును నేనును మీరును బాష్పవిమో
చనంబు చేసినను నిశ్వాసంబు నిగిడించినను దీర్ఘరోదనంబు చేసినను వీనికిఁ
బ్రాణంబులు తేఁ జాలము సత్యము శ్రుతము న్యాయము భూతదయ యజిం
హాత్వము నశాఠ్యము లోనగునవి ధర్మంబు నాఁబడు నప్రియము పరుషత్వము
పరద్రోహము పరస్త్రీ యనృతము లోనగునవి యధర్మంబు నాఁబడు నీమా
యావి యైనగోమాయువుమాటలు నమ్మి మోసపోకుం డనిన జంబుకంబు వచ్చి
సర్వప్రాణివినాశకం బగునీమర్త్యలోకం బతిదారుణం బిం దలీకంబు నసత్యము
నప్రియముం బ్రబలి యున్నయవి నా కీలోకంబున నిమేషమాత్ర మైన నిలిచి
యుండ నిష్టంబు గాకున్న దిపు డీపాపభూయిష్ఠంబు లైనగృధ్రవాక్యంబులు
నిందాపాత్త్రంబులు వీనిం బాటించి బాలుం గోలుపోవుట పాడిగాదు రూపసం
పన్నుం డైనవీని జీవించియున్నవానిఁగాఁ నేఁ దలంచుచుంటి మీరు నామాట
విని దివాకరుం డస్తంగతుం డగువఱకుం జూచి పొం డని పలుకుచుండ

గృధ్రం బలికుద్ధం బై. 410

సీ. ఇది ప్రేతవన మిందు నెందుఁ జూచినను రక్షఃపిశాచభయంబు కర మెసంగు
గూబలు క్రోల్చెడు ఘోరతరంబు గా, సాంద్ర మై ప్రేతవాసన లెసంగు
సింహశార్దూలముల్ చెలరేఁగి తిరిగెడు, నస్రపుల్ వికృతదేహముల తోడ
మీాకుఁ గాన న్వత్తు రాఁకలిం దెలుపుచు,భయ మధికం బగు బంధులార!

తే. నక్కజిత్తులు నమ్మి ప్రాణములు గోలు,పోక పీనుఁగు నిట వైచి ప్రొద్దుగలుగఁ
బోయి ప్రేతకార్యంబు లీపుణ్యమూర్తి, కాచరింపుఁడాముష్మికం బతిశయిల్ల

చ. అనుటయు జంబుకం బను నహస్కరుఁ డుండినఁదాక నేభయం
బును దలఁపవ నోప దిటఁ బుత్రునికావలి యుండు డండజం
బనియెడుతీవ్రవాక్యముల కాత్రము నొంది విమోహితాత్ములై
తనయుఁడు దక్కఁ డంచు విడి తారఁ దలంపకుఁ డయ్య చెప్పితిన్. 412

వ. ఇట్లు పీనుంగు వైచి పొమ్మని గృధ్రంబును బో వల దని జంబుకంబును మాటిమాటికిని శాస్త్రసమ్మతము లగుమాటలు మేటులు చెప్ప నప్పుసిబాలుని బంధువు లురియాడుచి_త్తంబుల నుయ్యేలలూఁగుచుఁ గదలియుం గదల నేరక శోకదైన్యసమావిష్టు లై యుండి రత్యంతక్షుధా_ర్తంబులును బాలకళేబరభక్షణైకతత్పరంబులు నగునాగృధ్రజంబుకంబులలో గృధ్రంబు రాత్రి యైనం దన కట నుండ రామిం జేసి బాలుం బడవైచి యప్పుడ పోం డనియును జంబుకంబు ప్రొద్దు గ్రుంకినం గాని తా నచ్చో నిలువఁ జాలదు గావునఁ బో వల దనియును స్వార్థపరత్వంబునం బలుకం జొచ్చె నంతఁ గొంతలో సూర్యుం డ_స్తంగతుం డై చిమ్మచీఁకటులు గ్రమ్ముకొనియె నిమ్మెయి నున్నసమయమ్మున సర్వలోకశంకరుం డగుశంకరుండు సర్వమంగళాసహితుం డై ప్రేతవనవిహారమ్ము సేయం గోరి వారికడ కవతరించి దేవీప్రచోదితుండును గారుణ్యార్ద్రీకృతేక్షణుండు నై సాదరాతిరేకంబున ననుగ్రహంబు చూపుచు నభీష్టం బర్థింపుఁ డని యభయప్రదానంబు సేయుటయు బాలబాంధవులు సంప్రమోదసంభ్రమసంభరితాంతరంగులై సాష్టాంగదండప్రణామంబు లాచరించి దుఃఖించుచు.413

మ_త్త. ఏకపుత్రుఁడు వీఁడు వీనికి నిట్లు మృత్యువు వచ్చుటన్
శోకముం దెగకుండె మాదెసఁ జూపి సాదరదృష్టి నో
లోకరక్షక! మమ్ముఁ బ్రోవఁగ లోఁ దలంపవె పుత్రదా
నైకతత్పరచి_త్తవృ_త్తివ యై ప్రియంబున ని_త్తఱిన్. 414

వ. అని ప్రార్థించినం బ్రసన్నుండై పరమేశ్వరుం డక్కుమారుం బునర్జీవితుం జేసి వీఁ
డింక నూఱేండ్లు జీవించు నని యానతిచ్చి గృధ్రగోమాయువుల కెన్నఁటికిని
క్షుత్పిపాసలు లేనట్లు వరంబు ప్రసాదించి కాంతాసహితుం డై యంతర్హితుం
డయ్యె బాలబాంధవులును శంకరప్రసాదంబునం జేసి కృతకృత్యులును బ్రహృష్ట
మనస్కులు నై మృతుం డయ్యు నిద్రితుండు మేలుకొనుపోలికఁ గ్రాలుచున్న
బాలకుం గొని పురంబునకు నిర్గమించి రిది ధర్మార్థమోక్షయుక్తం బగు నితి
హాసంబు దీని విని మనుష్యుం డపమృత్యుభయంబు నొందం బోఁ డని చెప్పిన
నప్పాండవాగ్రజుండు నిగ్రహానుగ్రహసమర్థుండును నిత్యాసన్నవర్తియు నుద్య
తుండును బలవంతుండును నగునభియాతి నెట్లు చేసి వంచించి బలహీనుం
డగువాఁడు ప్రబలుం డగుం జెప్పు మనినఁ గురుపితామహుండు నీయడిగిన
దాని కుత్తరంబుగా నొక్కయితిహాసంబు చెప్పెద నాకర్ణింపుము. 415

## పవనశాల్మలీతరుసంవాదము.

సీ. హిమవన్నగంబున నెసక మెసఁగు నొక్క, శాల్మలివృక్షంబు చాల ముదిరి
పెద్దకాలమునుండి వృద్ధి గైకొని తదీ, యస్కంధశాఖ లత్యలఘుతరము
లనిశపుష్పఫలసమంచిత మగుదాని, పై శుకశారికాప్రముఖపక్షి
తతులు కాఁపురముండు దాని నన్నాలుమూరలు తన్వు గలనీడ ప్రబలు ఘర్మ
తే. సమయములను మత్తేభాదిసత్వసమితి, విశ్రమించును సార్థికుల్ విటులు తాప
సులును మార్గస్థులు వనౌకసులును దాని, క్రింద నివసించి పొదు రానంద మొంది.

వ. ఇట్లు జగదేకోన్నతిం గలిగి దర్శనీయం బై యున్నవృక్షరాజంబు చేరువకు
నారదుం డొక్కనాఁడు చని దాని నగ్గించుచు ని ట్లనియె. 417

శా. ఓహో నీదగుసుందరత్వమును నోహో నీదు నౌన్నత్య మో
హోహో నీదుతనూవిలాసము గనుంగో మాకు సంతోష మై
దేహంబు న్మఱపించునట్టి దగు నీదీవ్యన్మహాసంశ్రయో
త్సాహంబుం గొను నెల్ల నిన్నుఁ బొగడన్ శక్యంబొకో శాల్మలీ. 418

చ. చనువునఁ జేసి నిన్నడుగఁ జాలెద నీదగు మేటిస్కంధముల్
ఘనతరశాఖ లెన్నఁడును గాని ప్రభగ్నము లైన జాడ నేఁ
గనుఁగొన నీపయిం బ్రియము గల్గునొ లేక ననుంగునేస్తమో
కనికరమో సమీరణుఁడు కాచెడు నేమికతంబు బూరుహా. 419

మ. భగవంతుం డగువాయుదేవుఁడు నిజప్రాబల్య మేపాఱఁ బెం

పుగభూజంబుల భూతలంబును మహాభూధ్రంబులం దెంపుమైఁ
దెగనేయం గలఁ డొక్కఁ డేల్చిడిన వార్ధివ్రాత మింకించు నా
శుగతిం బోల్చునతండు నిన్నుఁ గృపఁ గొంచుం జూచునాఁ డోఁ చెడిన్. 420

మ. సకలైశ్వర్యము లంది మేరువు బలెన్ సర్వర్తుసంపద్గతిం
బ్రకటింపం బడి తీవు నీకడ బుధవ్రాతంబు సిద్ధర్షి జా
లకముల్ బ్రహ్మాకదంబము న్నిలిచి మేల్గైకో భవత్థ్సాన *మూ
ష్మకమందుం ద్రిదివంబు నాఁ దగు మహైశ్వర్యంబునన్ శాల్మలీ. 421

క. అతిబలునకు నీపైఁ గల,మితి లేనిప్రియత్వ మేమొ మిత్రత్వం బో
సతతము నిను రక్షించిన,కతమున నీ విట్టు లుంటి కదె మే ల్గలుగన్. 422

వ. అనిన బూరువు గర్వించుచు. 423

ఉ. గాలికి నాకు బాంధవము గల్గదు మైత్రియు లేదు నన్ను నా
గాలి యనుగ్రహించునది గాదు మదీయబలంబు దానినిన్
డీలుపడంగఁ జేసెడి వడిం బదునెన్మిది యైనవంతు నేఁ
గాలిబలంబు పోలు ననఁగాఁ దగ దందు మునీంద్రచంద్రమా. 424

తే. చెట్లఁ జేమల గిరుల భంజించి తాఁ బ్ర,భంజనుం డను పేర్గన్నస్పర్శనుండు
నన్నుఁబొడఁగని స్తంభించునన్న నేను, వానికోపమునకు భయంపడుదునొక్కొ. 425

వ. అనిన నారదుండు. 426

సీ. బూరువా! విపరీతములు వల్కఁ జొచ్చితి,భూతములకు గాలిఁ బోలుబలము
లే దని చెప్పుదు నాదితేయస్వామి, వరుణుండు యముఁడును సురవరులును
పురుడు రా రన నీవు పుర దగుదే పలా,శివి నీవు నీవెట్టి చెయ్వు లేల
వాయువు శ్రేష్ఠుఁ డావాయువు లేకున్నఁ, బ్రాణిలోకమునకు బ్రతుకె లేదు

తే. సత్వభృద్వరుఁ డగునట్టిశ్వసను నిట్లు, గొప్ప సేయనిపగిది గాఁ జెప్పుచుంటి
వట్టి నీబుద్ధి పెడతలఁ బట్టె నేమొ, యల్పబలమ వీ వేడ నీయనుట లేద. 427

శా. నీమాట ల్వినినంత నాదుమదికిన్ రేకెత్తెడిన్ రోష మో
భూమిప్రోద్భవమా! భవద్వచన మాభూరిప్రభావాఢ్యుతో
నీమై చెప్పెద నేను వానికడ కిప్డే పోయెదన్ బెండు నా
నీమే నయ్యెడు నీ వెఱుంగ కిటు దుర్నీతిం బ్రలాపింతయో. 428

మత్త. సారవంతము లైనచందనసాలముఖ్యమహీజముల్
తీరి యుండియు నిన్నుఁ బోలె నతీతగర్వయుతంబు లై

* ఊష్మకమందున్ = వేసంగియందు.

దారి తప్పి మెలంగ వాపృషదశ్వ నీశ్వరుఁ డంచు నొ
ప్పారుభక్తి నమస్కరించెదు నన్వహం బిఁకఁ జాలుఁ బో. 429

వ. అని పలికి నారదుం డాదారిన ప్రకంపనునిపాలికిం జని శాల్మలి దుర్భాషితం బంతయు నెఱింగింప నెంచి యి ట్లనియె. 430

మ. హిమవత్పృష్ఠమునందు శాల్మలి యొకం డింపొందఁ బెంపొందెడిన్
సముదగ్రోన్నతి మింటి నంటికొన నై స్వాంతంబునం దింతయేఁ
గ్రమమ్ముం దప్పి యహంకరించుచు నినుం గైకోక దుర్వాక్యముల్
తమి నాడెన్ సయిరింప రాని వవి యేలా నీకు వాకో నిటన్. 431

క. లోకైకరక్షకుండవు;నీ కవమానంబు గలుగ నే నోర్వక నీ
కీకరణి విన్నవించితి, నీకుం బోలినతెఱంగు నెఱపు మధీశా. 432

వ. అని నారదుండు సెప్పిన సమీరణుం డాఁగాత మనియాతని నంపిపుచ్చి చెచ్చెర శాల్మలిపాలికిం జని తన్నెఱింగించి కోపారుణితనేత్రుండై యి ట్లనియె. 433

మ. నను గర్వించుచు నీవు నారదునిచెంతం బంతముల్ మీఱఁ బ
ల్కినపల్కు ల్వినవచ్చె నీబిరుసుఁ జెల్లింపంగ నూహించితిం
గను మే నెల్లియ నాప్రభావమును లోకం బెన్నఁ గాన్పించెదన్
నినుఁ జిన్నప్పటినుండియుం దెలియుదు న్నీచెయ్దముల్ క్రొత్తలే. 434

తే. తెలిసియును ప్రజాసర్గము సలుపునాఁట,నజుఁడు నీపయి విశ్రాంతి నందె దాన
నినుఁ గృపాదృష్టిఁ జూచితి ఘనతరాత్మ,వీర్యమును జూప నైతి నో వెడఁగుఁజెట్ట!

క. ప్రాకృతు నట్లు తలంచుచు,నా కవమానం బొనర్చి నారదునికడన్
వాకొంటి కాన రేపే,నాకడిమిం జూపనుంటి నాలికుజంబా. 436

వ. అనిన నవ్వుచు నవ్వృక్షరాజం బి ట్లనియె. 437

మ. ఇహిహీ! నాయెడ నల్క నేతె పవనా! యి ట్లల్గి న న్నేమి సే
తు హరింతో విడనాడు మిట్టినుడుఁగుల్ తొక్కు ల్కదే వీని కే
నుహుంహూ యంచు వడంకఁ బోవ వెఱమై నూహింప నీవే మహా
మహుఁ డై తేనియుఁ గాక పోఁ డితరుఁడున్ మంత్రాట మింతేటికిన్. 438

తే. నే బలాఢ్యుఁడ నీకంటె నీభయంబు,నాకు లవమాత్రమును లేదు లోకమందు
బుద్ధిబలమే బల మ్మయి పొలుచుఁ గాని,ప్రాణమాత్రబల మ్మది బలము గాదు.

వ. అని పలికిన నలుక వొడమినచిత్తంబున మెత్తన గా కత్తఱి మాతరిశ్వుండు ముష్కరంబుగ హుంకరించుచు. 440

ఆ. కాని రేప యిట్లు గాఁ బల్కుదువు గాని, నాదుబలము చూతు గాదె బర్చు
రాధమా!యటంచు ననిలుండు పలుమోము,తోడ తివ్వ రనుచుఁ దొలఁగిపోయె.

వ. అంతఁ గొంతవడికి సూర్యుం డస్తంగతుం డగుటయు నాశాల్మలి నస్థిమిత చిత్తంబునఁ దత్తరంపడి తన్నుం దాన తెలిసికొని వాయుబలంబు ప్రబలం బని నిశ్చయించి. 442

శా. నే నానారదుతోడ నాడినసుడుల్ నిస్సారనిశ్శానతు
ల్యానుష్ఠానసమాహితంబు లసమర్థాహంక్రియాస్థానముల్
సానందంబుగ నుండఁ జాల కటు లేలా పల్కినాఁడన్ జగ
త్ప్రాణాఖ్యాతుఁ డతండు ప్రాణఁ గలఁ డేతన్మాత్రుఁడే చూడఁగన్. 443

క. అతఁ డెక్కడ నే నెక్కడ, మతిలే కాడితిని దేవమౌని యనినటుల్
క్షితిరుహములలో సార,స్థితి యింతయు లేనినేను జేయు నదేమో. 444

వ. అని మిగుల వగలం బొగిలి కొంతవడికి లేనిధైర్యంబు దెచ్చుకొని. 445

ఆ. బుద్ధితోడ నాకు భూరుహం బెద్దియు,సాటి రాదు నేఁడు మేటిబుద్ధి
బలము కలిమి గంధవహునిభయమునుండి, విడివడం గలాఁడ వెరవు వన్ని.

ఆ. బుద్ధి లేనిశాఖు లిద్ధరణిస్థలిఁ,జేటు నొందఁ గలవు మేటిగాలి
వలన నట్లు గాక వల నెఱింగిననేను,భయము వాయు లెంతొ భరముకాదు.

వ. అని నిశ్చయించి సంక్షుభితం బగునాశాల్మలి నిశీథినీసమయంబునఁ దనశాఖలు ప్రశాఖలు స్కంధంబులు పత్రంబులు పుష్పంబులు తనంతఁ దాన విఱిచుకొని మోడై యుండె నంతఁ బ్రభాతం బగుటయుఁ గృతప్రతిజ్ఞుం డగు ప్రభంజనుండు చండవేగంబున నం దందుఁ గలవృక్షంబులఁ బెల్లగించుచు శాల్మలీవృక్షంబు చెంతకుం జనుదెంచి హీనపర్ణంబును విశీర్ణపుష్పంబును విగతశాఖంబు నై మోడుపడి యున్న దానిం గని నవ్వుచు ని ట్లనియె. 448

మ. నిను నే నిట్లు పొనర్ప వచ్చితి రుషన్ నేఁ జేయుకార్యంబు నీ
వ నెఱిం దప్పి పొనర్చుకొంటివి సిసీ! వమ్మైతి నీకొమ్మలున్
ననలుం బువ్వులు నాకులుం జిలవలున్ రాలంగ మోడైతి నీ
ఘనగర్వం బది యెల్ల ఖర్వ మయి పోఁ గన్పట్టు దీ వక్కటా. 449

వ. అనిన వాయువచనంబులు విని మోడువడినబూరువు వ్రీడితయై నారదుమాటం దలంచుకొని మాటాడ కూరకుండె నతిబలుండును గృతకృత్యుం డై చని నారదున కది యంతయు నెఱింగించె నిట్లు దుర్బలుండు బలవంతునితో

నెదిరించి మత్సరించినశాల్మలిగతిం గలఁడయి విగతప్రాభవుం డగుం గావున బలవంతునితో నెవ్వండును వైరంబు వెట్టుకొనరాదు బలాఢ్యుండ నని గర్వించుదుర్యోధనుండు ప్రబలులైనమాతోడం గలహంబు వెట్టుకొని సర్వక్షయంబు నొందుట మనకుఁ బ్రత్యక్షంబ కదా యిట్టివి రాజధర్మంబు లింక నేమి వినవలతు వనిన నతం డతని కిట్లనియె. 450

పాపపుణ్యప్రకారాభివర్ణనము.

క. పాపం బెట్లు ప్రవర్తిలుఁ, బాపాధిష్ఠాన మెద్ది భరతర్షభ త
ద్రూపమ్ము వినఁగ నెంచితి, నోపి వచింపం బొనర్పు ముల్లము కరుణన్. 451

వ. అనిన శాంతనవుం డిట్లనియె. 452

సీ. జనవరోత్తమ! పాపమున కధిష్ఠానము
ఘనతరలోభము గాఁ దలఁపుము
పాపమ్ము లోభమువలన వర్తించెడుఁ
బాపి యధర్మముం బట్టి యుండు
మఱియుఁ గ్రోధమును గామము మోహమును మాయ
మాన మక్షమయు స్తంభము పరాసు
తయు హ్రీపరిత్యాగ మయశంబు ధర్మసం
క్షయ మసత్యమును మత్సరము మదము

తే. మొదలు గాఁగలదుర్గుణములును లోభ,మునన ప్రభవించు సద్గుణములఁగలంచి
ధర్మము తొలంచి నరునివర్తనము పాప, పంకిలంబుగ నొనరించి బడలువఱచు.

వ లోభావిష్టుఁ డైనవాఁ డత్యాగము నతితర్షము వికర్మక్రియ కులమదంబును విద్యామదంబును రూపైశ్వర్యమదంబును సర్వభూతాభిద్రోహంబును సర్వభూతాసత్కృతియు సర్వభూతావిశ్వాసంబును సర్వభూతానార్జవంబును బరవిత్తాపహరణంబును బరదారాభిమర్శనంబును వాగ్వేగంబును మనోవేగంబును నిందావేగంబును నుపస్థోదరవేగంబును మృత్యువేగంబును నీర్ష్యావేగంబును మిథ్యావేగంబును రసవేగంబును శ్రోత్రవేగంబును గుత్సవికత్థ మాత్సర్యము పాపము సాహసము నకార్యకరణము లోనగునసత్కార్యంబులపాలై పుట్టి నప్పుడో బాల్యముననో కౌమారంబుననో యౌవనముననో గృహంబుననో వనంబుననో జలంబుననో చచ్చి తాను జీర్ణించినన్ జీర్ణింపనితనకర్మంబుఁ బరిత్యజింపక నరకకూపంబులం బడి పాపం బనుభవించి నీచక్షేత్రంబులం బుట్టి చచ్చు

నని మఱియును. 454

ఆ. లోభమోహములకు లో నయినజనుండు, నాల్గుకడలనుండి నదులనీరు
వచ్చి పడినఁ దృప్తి వడయనిజడధి నా, నెపుడు దృప్తి లేనియెడఁద నుండు.

క. సుర లసురులు గంధర్వులు, నురగులు యక్షులును దెలియ నోపరు లోభ
స్ఫురణము తత్త్వము దానిక్, వెరవున గెలువంగ వలయు విజితాత్ము లై.

తే. దంభమును ద్రోహమును నింద దర్పమును బి
శునతయును మత్సరంబును గన నగు నకృ
తాత్ము లగులుబ్ధకులయెడ నాత్మవిదులు
వానిఁ దఱిఁ జేర నీరు విజ్ఞానపరత. 457

సీ. వినుము బహుశ్రుతుల్ వివిధశాస్త్రంబులు, చదివి ఛేదింత్రు సంశయము లెల్ల
నట్టివారలును గ్రోధాభిభూతులు నశి,ష్టాచారు లై కష్ట మందు చుందు
రల్పబుద్ధులు క్లేశ మందుదు రిల ద్వేష,మును గ్రోధమును గలజనులు నింద్యు
లలధర్మవైతంసికులు క్షుద్రు లగువార, లరసి హేతుబలము నాశ్రయించి

తే. త్రొక్కి బహుమార్గములుధర్మదూషలగుచు, లోభమజ్ఞానమునుగల్గిప్రాభవంబు
సమయవర్తింత్రు క్రోధహర్షములుదర్ప, మదములుగ్ వారిసొమ్మయివదలకుండు.

వ. అట్టివారు లోభసమన్వితు లశిష్టులు శుచివ్రతులు శిష్టులు వారిం జెప్పెద
వినుము. 459

సీ. ఆవృత్తిభయమును నపరలోకభయమ్ము, లేనివా రంహస్సు లేనివారు
నామిషమందుఁ బ్రియాప్రియంబులయందు, సంప్రసంగము లేనిసాధుజనులు
సమసుఖదుఃఖులు దమము సత్యమును శి,ష్టాచారమును గల్గి యగ్రజహితు
లై దాత లై దయాస్వాంతు లై సర్వోప,కారు లై వీరు లై క్రాలువారు

తే. సర్వధర్మానుపాలకుల్ సర్వభూత, హితులు సంతతోద్యుక్తులు పితృసురాతి
థిజనపూజకు లగువారు తెలియశిష్ట, జనులు సాధుసంసేవ్యులు మనుజనాథ.

వ. మఱియు నహింసావ్రతప్రతిష్ఠితులు కామక్రోధవ్యపేతులు నిర్మలులు నిర
హంకారులు నిత్యసత్యవ్రతులు స్థిరమర్యాదులు దాంతులు శాంతులు నగు
శిష్టుల నుపాసింపుము వారిధర్మము ధనార్థము యశోర్థమును గాదు వారి
శరీరక్రియ లవశ్యము చేయ వలయు నని చేయు నవి కాని మఱి యొండు
గాదు వారికి భయము క్రోధము చాపల్యము శోకమును లోభమును
మోహమును లేవు వారిధర్మము ప్రతిష్ఠకుం గాదు వారికి రహస్యంబు లేదు
వారు సత్యార్జవస్థితులు లాభములకు సంతసింప రలాభములకు దుఃఖింపరు

నిర్మలులు నిరహంకారులు సత్త్వస్థులు సమదర్శులు ప్రియాప్రియంబులును మరణజీవితంబులును సమంబు లట్టిమహానుభావుల సమర్చించిన సర్వార్థసిద్ధులుం బడయ వచ్చు ననిన సచ్చరిత్రుం డగుధర్మజుం డనర్థముల కధిష్ఠానము లోభ మని చెప్పితి వజ్ఞానంబున కధిష్ఠానంబును దాని ప్రవృత్తియు స్థానంబును వృద్ధి క్షయోదయంబులును మూలయోగగతికాలకారణంబులును విన వలతుం జెప్పు మనిన నప్పితామహుం డి ట్లనియె. 461

క. తనసంక్షయం బెఱుంగఁడు, జనుఁ డజ్ఞానమునఁ జేసి సాధులఁ దెగడున్
జను దుర్గతి నిరయమునం, గొనుఁ గ్లేశం బెంతయేని కుడుకులదీపా. 462

సీ. తలఁప రాగద్వేషములు మోహహర్షముల్, దర్పతంత్రాలస్యతాపములును
శోకాభిమానముల్ వ్యాకులతయు నిచ్ఛ, కామముం గ్రోధము గర్వ మెల్ల
నజ్ఞానమునఁ జేసి యావిర్భవించెడు, నది పాపకర్మము లాచరించుఁ
బుడమి లోభంబునఁ బుట్టి యజ్ఞానము,వలనఁ బ్రవృద్ధి యాఁ బాప మెపుడు
తే. మోహకారణ మగులోభమునకుఁ గాల, మేడుగడ దానియాజ్ఞలో నెల్లలోక
ములు ప్రవర్తించు నజ్ఞానమునజనించు, లోభ మజ్ఞాన మెసఁగు నాలోభమునను.

వ. జనకుండును యువనాశ్వుండును వృషాదర్భియుఁ బ్రసేనజిత్తును మఱియుం దక్కినజనాధిపతులు లోభక్షయంబున దివంబు వడసి రీవును లోభంబు విడిచి యిహపరంబుల సుఖివి గ మ్మనిన నమ్మహీపతి స్వాధ్యాయంబునఁ గృతకృత్యుఁ డై ధర్మకాముం డగువాని కిహపరంబుల నెట్టి శ్రేయం బగు మఱియు ధర్మపథంబు నానాశాఖాసమన్వితం బెద్ది విశిష్టధర్మంబు దానితత్త్వంబు సమగ్రంబుగ నానతి మ్మనిన నమ్మహాత్ముం డి ట్లనియె. 464

దమంబు ప్రభావము.

చ. తమతమప్రజ్ఞ పెంపునను ధర్మవిధం బది పెక్కుభంగులం
దమరగఁ జెప్పి రార్యు లగునట్టిమహాముని లెల్ల వానికిన్
దమము పరాయణం బనుట తథ్యము దాన లభించు ముక్తి ము
ఖ్యముగ మహీసుపర్వునకు నద్ది సనాతనధర్మ మయ్యెడిన్. 465

చ. దమము పవిత్ర ముత్తమము దానము యజ్ఞ మధీత మెల్లధ
ర్మములును దానికిం బురుడు రా వది తేజము వృద్ధి చేయు దో
షముల నడంచు దాంతునకు సర్వజగంబుల సౌఖ్య మయ్యెడున్
దమమునఁ గ్రోధలోభములు దర్పము మోహము గెల్వఁ గాఁ బడున్. 466

తే. దమము గలవాఁడు సర్వధర్మముల నొందు
దమ మిహాముత్ర ఫలద మై కొమరుమిగులు
దమము లేనిజనుం డనర్థముల కెల్లఁ
దానకం బగుఁ గ్లేశ మాతనికి హెచ్చు. 467

ఆ. దమము నాలుగాశ్రమముల నుత్తమ మయి, వివిధసంపదలును వెనుక ముక్తి
నిచ్చు దమ మనంగ నెట్టిదియో దాని, చిహ్నముల నొగి న్వచింతు వినుము.

సీ. క్షమయహింసయుధృతిసత్యమార్జవమును, నింద్రియజయమును హ్రీయు సమత
దాక్ష్యమార్దవము లదంభ మచాపల, మనసూయయును దయయును బ్రియంబు
వినయ మకార్పణ్యమును నసంరంభము, సంతోషమును వీనిసముదయంబ
దమమునాఁబడు భూతదయగల్గి గురుపూజ, సలుపుచుఁదమిమ్పుషల్ వలుకఁబోక

తే. స్తుతియు నిందయు సమము గా మతిఁ దలంచి
కామమును గ్రోధలోభ వికత్థనములు
స్తంభ మీర్ష్యయు నవమానదర్పములును
దవ్వులు కొనఁ బోక సతతంబు తనరుచుండు. 469

క. నావాఁడ వీవు నేనుఁ, నీవాఁడను నాది యిద్ది నీ దిది యనుచుఁ
భావింపఁ బోఁడు సంబం,ధావిలమతి యగుచు దాంతుఁ డగువాఁ డధిపా. 470

తే. శీలసంపన్నుఁడు ప్రసన్నచిత్తుఁ డఖిల, సంగముక్తుఁ డాత్మజ్ఞానసంయుతుఁ డయి
దమియిహంబునఁసకలసత్కారములకు, నగుచుశాశ్వతానందుఁడైసుగతినొందు.

సీ. విజ్ఞానయుక్తుండు విజితేంద్రియుం డయి, వనులఁ దపించెడువాఁడు ముక్తుఁ
డాకసంబునఁ బక్షి కంబువులం జేఁప, కును బలె గతి గనుంగొనఁగ రాక
సన్యస్తకర్ముఁ డై సన్యస్తసర్వస్వుఁ, డై తత్త్వవిజ్ఞాన మతిశయిల్లఁ
దమి గుహాపిహిత మై తనరు బ్రహ్మపదంబుఁ బడసెడు నావృత్తిభయము విడిచి

తే. దమము గలవాని కెల్లలోకములు సులభ
సాధ్యములు గుణాశ్రయ మై ప్రశస్తి గాంచు
దమమునం దొక్కదోషము తనరు దాంతు
నెం త్రశక్తుం డితం డని పృథివి జనులు. 472

వ. అని పలికిన దేవవ్రతునిపలుకు లాలించి యమృతంబు సేవించినచందంబున నిందు
కులుం డానందంబు నొంది తపఃప్రకారంబు సెప్పు మని భీష్ము నడిగిన నతం
డతని కి ట్లనియె. 473

### తపఃప్రభావవర్ణనము.

మ. తపమే మూలము దీని కంతకుఁ దపస్తప్తుండు గాకుండు వాఁ
డెపు డేయింతక్రియాఫలంబుఁ గొనఁ బోఁ డిట్లెంచియే బ్రహ్మ మున్
దపముం జేసి సృజించె సర్వము ఋషుల్ దానన్ శ్రుతుల్ వొందిర
త్తపమే యన్నముఁ గూర్చి ముజ్జగములం దళ్కొత్తఁ గాఁ జేసెడిన్. 474

సీ. ఔషధంబులు క్రియ లన్నియుం దపమున,నగుఁ దపంబున కసాధ్యంబు లేదు
ఋషులు దపంబున నే మహాదైశ్వర్య,మందిరి పంచమహాఘములును
దపమున నశియించుఁదపము నానాప్రకా,రములనుండునివృత్తి యమరమనుజుఁ
డనశనవ్రతమునఁ దనరుటే తప మహిం,సాదానసత్యవచనశమాది

తే. వరక్రతులకంటె ననశనవ్రతమె మేటి,తపము నాఁబడు వేల్పులు తపముచేత
మహిమఁగాంచిరితపియించిమహిజనుండు,సందియము లేదు దేవత్వమొందవచ్చు.

క. తలిదండ్రు లెపుడు తనకుం, గులదైవము లంచుఁ దలఁచి కొలుచుచుఁ దత్సే
వల మెలఁగుచుంట తప మని,పలికిరి తత్త్వజ్ఞు లైనపరమమునీంద్రుల్. 476

వ. అనిన విని విప్రర్షి పితృదేవతలు సత్యమును బ్రశంసింతురు నే నిపు డాసత్య
స్వరూపము విన నెంచితిఁ దల్లక్షణంబు నది లభించువిధంబు నెఱింగింపు మనిన
ధర్మసుతునకు దేవవ్రతుం డి ట్లనియె. 477

క. నాలుగు వర్ణములకు ధ,ర్మాలోలత సంకరంబు నంటకయుండం
గా లలిఁ జలుపున్ సత్యము, పోలింపఁగ దానిఁ బోలుపుణ్యము గలదే. 478

క. సత్యము సజ్జనధర్మము, సత్యము యోగమ్ము తపము సత్యము వర మా
సత్యము యజ్ఞము బ్రహ్మము, సత్యమునఁ బ్రతిష్ఠితములు సర్వార్థములున్. 479

వ. సత్యలక్షణాచారంబులును దత్ప్రాప్తిక్రమంబునుం జెప్పెద నవహితుండ
వగుము. 480

సీ. సర్వలోకములందు సంకీర్తితం బగు, సత్య మాసత్యము సమత నయము
క్షమతితిక్షయు నమాత్సర్యము హ్రీయును, ద్యాగ మార్యత్వము ధ్యానము ధృతి
యనసూయతయును దయయు నహింసయు నన, బదుమూఁడువిధములఁ బరఁగు
నవ్యయం బవికారి యగునది ధర్మవి, రుద్ధ యోగంబున సిద్ధి నొందు [చుండు

తే. నిష్టమందు ననిష్టమం దెపుడు సమత,గలిగి కామము క్రోధముం దొలఁగఁదమము
ధైర్యగాంభీర్యములతోడఁదనరరోగ,శమనమభయంబునుంబోల్చుజ్ఞానమునను

—సత్యస్వరూపాదికథనము.—

వ. మఱియు సత్యంబున దానధర్మంబుల సంయమంబు గలుగ నమత్సరుం డగుఁ బ్రియాప్రియంబుల క్షమి యైనసత్యవాక్కు సిద్ధించు ధీమంతునికి గ్లానియుండదు కళ్యాణం బగుధర్మంబున హ్రీయుఁ బ్రశాంతియు నగు ధర్మార్థహేతువునఁ దితిక్షాశాంతియు నగు విషయంబుల స్నేహంబు విడుచుటే త్యాగంబు రాగద్వేషవిహీనుఁ డైనఁ ద్యాగంబు గలుగు భూతప్రయత్న మార్యత నాఁబడు సుఖదుఃఖంబుల వికారము నొందమి ధృతి వీతభయక్రోధుండు ధృతిం బొందు సర్వభూతాద్రోహం బనుగ్రహంబు దానము ధర్మము నివి త్రయోదశాకారంబు లివి సత్యలక్షణంబులు సత్యగుణుం గణుతింప నశక్యంబు గావున భూదేవపితృదేవవర్గంబు సత్యంబుం బ్రశంసించు నని మఱియును. 482

క. సత్యముకంటెఁ ధర్మ మ, సత్యముకంటెఁ దురితము చన దొండొకఁ డా
సత్యము శ్రుతిహితధర్మము, సత్యమునెడ బుద్ధిసేయఁ జను నేవాఁడున్. 483

క. శ్రుతు లగ్నిహోత్ర మధ్వర, మతిథిసమర్చనము దాన మాయాధర్మ
స్థితు లెల్ల నొక్కసత్య, వ్రతమున సిద్ధించు ననుచుఁ బలుకుదు రార్యుల్. 484

క. ఒకవేయునశ్వమేధము, లొకవంకఁ సత్యవాక్య మొకవంకం దూ
నికఁ గోలఁ గట్టి తూఁచినఁ, బ్రకటిత మై సత్యమంద భారము తోఁచున్. 485

వ. అనిన ధర్మనందనుండు కామము క్రోధము లోభము మోహము మాత్సర్యము శోకము విధిత్స పరాసుత్వ మీర్ష్య కుత్స యసూయ భయము నకృప యివి పదుమూఁడు నెట్లు ప్రభవించు నని యడిగిన నాపగాతనూజుం డిట్లనియె.486

—అరిషడ్వర్గాదికథనము.—

సీ. వినుము చెప్పెద ధర్మతనయ యీపదుమూఁడు, ప్రాణికోటికి నతిప్రబలరిపులు
విడువ కుపాసింతు రడిమి నొందఁ బ్రమత్తు, లప్రమత్తులు వీని నడఁచివైతు
రివి వృకంబులరీతి నెగిచి నరుం బట్టి, బాపదుఃఖంబు లాపదియు మూఁడు
నొదవెడు నని జనుం డూహింప నగు నెందు,వలన దుఃఖం బెందువలనఁ బాప

తే. మగు నని యెఱుంగఁ దగు వానియభ్యుదయము
క్షయము నీకు నెఱింగింతు నవహితమతి
వగుచు నాలింపు మెద సంశయంబు గాని
పగది నని యిట్లు పలికె దేవవ్రతుండు. 487

సీ. అధికలోభంబున నావిర్భవించుఁ గ్రోధము క్షమాశక్తిచేఁ దఱిగి పోవు
సంకల్పమునఁ జేసి సంభవించుం గామ, మది విరక్తింజేసి సదమద మగుఁ

క్రోధలోభంబులఁ గూడుఁ బరాసూయ, భూతదయంజేసి పోఁడ వడంగు
నజ్ఞానమున మోహ మూఁపహిల్లును మోహ, మది విజ్ఞసంగతి నడఁగి పోవు

తే. నగు విధిత్స విరుద్ధశాస్త్రావలోక,మున నదెల్లఁ దత్వజ్ఞానమున నశించుఁ
గలుగుశోకము ప్రియవియోగమునవ్యర్థ,మునితలంచినయడ్డ రూపఱితొలంగు.

తే. అగుఁ బరాసుత క్రోధలోభానుగతులఁ, బొలియు భూతదయంజేసిపోఁడముసత్య
మునువిడుట మత్సరముసాధుపురుషసేవ, వలననదియెల్ల క్షీణించితొలఁగిపోవు.

సీ. కులమున నైశ్వర్యకలన మదము పుట్టు, నాయింత వోయిన నదియుఁ బోవు
నీర్ష్య కామంబున నెసఁగు నితరసత్వ,ముల ప్రజ్ఞఁ గనినంతఁ దొలఁగి పోవు
ద్వేష్యవాక్యంబుల వెలయును గుత్స లో,కాభిదర్శనమున నడఁగిపోవు
నెదియుఁ జేయఁగా శక్తియొదవనప్పు డసూయ, గలుగుఁ గరుణ నదిగదలి పోవు

తే. దీనులను జూడఁ గృప వుట్టుఁ దెలియ ధర్మ, నిష్ఠ నది పోవు నజ్ఞాననిభృత మైన
లోభమగు నదిభోగముల్ తొలఁగునస్థి,రములని తలంపనశియించు రాజచంద్ర.

వ. ఇవి కామాదుల ప్రవృత్తినివృత్తిలక్షణంబులు. 491

చ. శమమున వీనినిం గెలువఁ జాలుదు రార్యు లనార్యు లందులోఁ
గ్రమ మఱి కూలి చచ్చెదరు కౌరవు లీపదుమూఁడు దోషముల్
తమరు గుణంబులం చెదఁ దలంచి య కాదె నశించి రీవు స
త్తము లగు పెద్దలం గొలిచి దాన జయించితి వెల్లదోషముల్. 492

తే. అన యుధిష్ఠిరుఁ డానృశంస్యంబు సుజన, దర్శనంబునఁ దెలియంగఁ దగితినిఁక నృ
శంసులఁగా వారికర్మముల్ సతతగర్హ్య, ములగు నట్టివి గావునఁ దెలియ నైతి.

క. కంటకము కూప మగ్నియు, నంటంగా రాని వనుచు నవని జనంబుల్
గెంటుదు రట్ల నృశంసుఁడు, కంటకుఁ డని త్రోసిపుచ్చఁ గాఁ జను నైనఁగా. 494

వ. వానిధర్మనిశ్చయం బె ట్లుండుం జెప్ప ననుగ్రహింపు మనిన శాంతనవుం డి
ట్లనియె. 495

శిష్టాశిష్టలక్షణాభివర్ణనము.

సీ. గర్హ్యవిధిత్సయుఁ గర్మదుస్పృహయును,నాక్రోష్టతయుఁ గల్గునట్టివాఁడు
శఠుఁడు నైకృతికుఁడు సంగియు దత్తాను,కీర్తియు విషముండు కృపణబుద్ధి
సర్వాతిశంకి యసంవిభాగియు మాని,యును క్షుద్రుఁడును వికత్థనుఁడు వర్గ
శంసి బలీశుండు హింసావిహారుఁ డా,శ్రమవైరి బహ్వాలీకమతి లుబ్ధుఁ

తే. డానృశంస్యవిహీనుఁ డన్యాయపరుఁడు,స్వాత్మశీలప్రమాణము నధిగమించి

ధర్మమును విశ్వసింపనిదాంభికుండు,లోనయినవార్ నృశంసులునానెఱుఁగుము.

మ. తనదోషంబులు గప్పిపుచ్చుచుఁ దనుం దా మెచ్చుకొంచుం బెరల్
ఘనులైన న్మది మెచ్చఁ బోక గుణముం గాదంచుఁ దద్దోష మె
ప్డును వేనోళులఁ జెప్పుచున్ సుజనులం బోనాడుచున్ వృత్తికై
మునినైన న్విదళించుచున్ మెలఁగు నామూఢుండు గూఢాత్ముఁడై. 497

క. తన కుపకారము చేసిన,జనుని న్వంచించి పుచ్చు స్వాంతమునఁ దలం
చును ధన మిడి యుపకారికి,ఘనతరముగ సంతసించు ఖలుఁ డాతఁ డిలన్.498

చ. ఫలములు భక్ష్యభోజ్యములు పాయసముల్ మఱియుం గజోయముల్
కెలన వసించువారు పరికించుచునుండ నొకింతయేనియుం
బిలిచి తినుం డటం చిడక పేరిమితోఁ దనపొట్ట నింపుకో
దలఁచి మెలంగుక్రూరుఁ డెడఁదం దలపోయ నృశంసుఁ డయ్యెడున్. 499

క. మునుమున్ భూసురులకు నిడి,వెనుకన్ మిత్రులను గూడి వేఁడుకతోడన్
దినదినము మెసవునాతఁడు,చని స్వర్గపురంబునందు సౌఖ్యము నొందున్. 500

వ. అనిన భీష్ముండు వెండియు. 501

తే. వేదవేదాంగములు చదివినయతండు,యజ్ఞ మొనరింపఁ గాని స్వాధ్యాయపరతఁ
గాని యాచార్యపితృకార్యకలనఁ గాని,పరులనుండి గ్రహించుట పరఁగు నండ్రు.

తే. ధర్మభిక్షులు సాధు లాధరణిసురులు,నిస్స్వలగునట్టిద్విజులకు న్విద్యదాన
మీయఁ దగు దక్షిణాదాన మితరులకును,గడమజాతుల కన్నము నిడఁగ నొప్పు.

తే. రాజు సర్వరత్నంబుల బ్రాహ్మణులను,వేదముల యజ్ఞముల నెల్ల వేళలందుఁ
గాచి రక్షింపఁ గాఁ దగు రాచపాడి,వైదికాచారయుక్తమై వెలయుఁ గాన.

తే. పుష్కలంబుగ ధన మున్నఁ బూని చేయ,నొప్పు నధ్వర మట్లు కాకున్న మూఁడు
హాయనంబులకుం జాలినంతభృత్య,జీవనం బున్నఁ జేయుట చెల్లు నధిప. 505

క. ఘనతరము యజ్ఞమందుం,గనుఁగొన నేకాంశ మైనఁ గడఁబడినఁ జెడున్
ధనహీనుఁడు విప్రుఁడు క్రతు,వొనరుపఁ దగు రాజువలన నొంది ధనంబున్.

క. ధనముం బశుధనముం గ,ల్గినవైశ్యుఁడు సవము సేయ లేకుండినఁ ద
ద్ధన మెల్లఁ గ్రతువుపొంటెన్,గొనిపోఁ దగు నండ్రు విభునకు న్నరనాథా. 507

సీ. వృషలునియింటిలో విత్తంబు గొన రాదు,జన్నములందు దోషంబు పెద్ద
యాహితాగ్నియుఁ గానియతఁడునూఱాలను,యజ్వగానతఁడు వేయాలఁగలుగ
నాయిరువురనుండి యవిచారముగ రాజు,కొనిపోదు ననియాలఁ గొనఁగ వచ్చు
లోభినుండియుసొమ్ము లోఁగొనఁ దగుదాన,దోష మావంతయుఁదొరయఁ బోదు

ఆ. ఆఱు నాళ్లు తినక యశ్వస్తనం బను,వృత్తిఁ బూని ద్విజుఁడు హీనకర్ముఁ
డైనవానినుండి యాహారమును గొన,వచ్చు ననుచు శాస్త్రవచన మెసఁగు 508

మ. పొలముం దోఁటయుఁ గళ్లమం దెదియు నే భుక్త్యర్థమై భూమిపుం
డెలమిం గైకొని భూతలేశ్వరునితో నిట్లంచు వాక్రుచ్చినన్
విలసద్ధర్మవిదుం డతం డతనిని న్వీక్షించి దండింప రా
దిల మూర్ఖుం డగునేని రాజు ద్విజుఁ డెంతేఁ గ్లేశ మందున్ క్షుధన్. 509

క. శ్రుతశీలము లెఱిఁగి మహీ,క్షితుఁ డౌరసపుత్రుఁ దండ్రి చెన్నున ద్విజు నం
చితరీతిఁ గాచి ప్రోచుట, యతులితధర్మం బటండ్రు శాస్త్రజ్ఞులు కృతులన్. 510

తే. ప్రభువు ప్రత్యబ్దమును దోషపరిహరణము,పొంటె వైశ్వానరేష్టి నొనరుప నగుఁ
దనరు ననుకల్పముగ వేల్పులను భజించు,టయును జెల్లు నాపద్ధర్మమయి నరేంద్ర.

తే. ప్రథమకల్పము సేయఁగఁ బ్రభువయియును,కల్పమును జేయ దొరకొని నిక్రాలువాని
కింత యేనియు సాంపరాయికఫలంబు,గలుగఁ బోదని తెలియుము కౌరవేంద్ర.

తే. అనదనని వేదవిదుఁడు రాజునకు మనవి,యొనరుపఁడు రాజవీర్య మాయనకుఁదగ్గు
నతఁడె కర్తయు శాస్తయు నతఁడె ధాత,యతని కెగ్గులు దలఁప రాదవనివిభుఁడ.

క. ఘనవీర్యంబున క్షత్రియుఁ,డును ధనమున విశుఁడు శూద్రుఁడును హోమమునన్
మనువున విప్రుఁడు తమ కౌద, వననాపద లుత్తరించి వెలయుదు రధిపా. 514

సీ. యువతియుం గన్నియయును నమంత్రజ్ఞుఁడ,జ్ఞుఁడ సంస్కృతులు గానఁ గడక వేల్చి
నిరయంబులం బడి పరితపింతురు వేద,విదుఁడు వైతానకవిధికుశలుఁడు
వడి వేల్వ నగు నన్న మిడ నిప్రాజాపత్య,మును సదక్షిణపచమును బొనర్చి
నతఁ డొప్పెడు ననాహితాగ్ని నా శ్రద్ధధా,నుండును విజితేంద్రియుం డనాప్త

తే. దక్షిణాధ్వర మొనరింపఁ దగదు దానఁ,బ్రజలు పశువులు స్వర్గ మధ్వరము నింద్రి
యములు కీర్తియు నాయువర్ధమును గ్రమము,గానశించెడు ననిశ్రుతుల్ గానవచ్చు.

క. ముట్టగు కామినిఁ బొందిన, యట్టిఁ డనగ్నియును శ్రోత్రియాన్వయమందున్
బుట్టనివాఁడును నా వలెఁ, బుట్టువు పాపమునఁ బొందఁ బోవుదు రధిపా. 516

మ. ఉదపానోదక మే శరణ్యముగ నౌసూర న్నివాసించినం
బదిరెండేడులు శూద్రిభర్త యగుచున్ వర్తించినన్ బ్రాహ్మణుం
డెద నబ్రాహ్మణుఁ డంచు నెంచ నగుఁ దా నెల్లప్పు భార్యారతిన్
మదిఁ గామించుచు నన్యజాతి గొలువ న్వర్తించి పాపుం డగున్. 517

వ. అట్టివాండ్రు శుద్ధు లగుపద్ధతియుం జెప్పెద నాకర్ణింపుము. 518

సీ. ద్విజుఁ డొక్కరాతిరి వృషలి నొందిన నేగి, మూఁడేండ్లు వ్రతియైన వీడి పోవు
మేలమాటకుఁ గాని స్త్రీలయెడం గాని, పరిణయంబునఁ గాని గురువుకొఱకుఁ
గాని జీవితమునఁ గాని పల్కినబొంకు, పాపభూయిష్ఠ మై పరఁగఁ బోదు
హీనునుండియు శ్రద్ధధానుఁ డై శుభవిద్య, పొందవచ్చు న మేధ్యమునను మణిని
తే. దుష్కులమునుండి స్త్రీమణిన్ దుష్టవిషము
నుండి యమృతముఁ గైకొన నొప్పు మణియు
నుదక మతివయు దూష్యత నొందవనుచు
ధర్మశాస్త్రము వచియించు ధారణీంద్ర. 519

క. గోవుఁ బ్రాహ్మణుఁ గావం, బ్రోవం గులసంకరంబు పుట్టినపుడు ర
క్షావిధి శస్త్రగ్రహణము, గావింపఁగ వచ్చు విశుఁడు క్ష్మాతలనాథా. 520

తరు.గురుతల్పమునుసురంగొనుటయువిప్రు,కుతికఁగోయుటయునీకొలఁదివియనుచుఁ
బరికింప రానట్టిపాపంబు లెన్న, బంగరుమ్రుచ్చిమి బ్రాహ్మణద్రవ్య
హరణంబు మద్యపానాదులకన్న, నధికపాతక మని రార్యులు కార్య
కరణంబునన్ లుబ్ధకపతితసంగ, కమునను బతితుఁ డై కష్టుఁ డౌ జనుఁడు. 521

వ. పతితునితో నొక్కసంవత్సరంబు యానాసనశయనంబులకంటె యాజనాధ్యాప
నాదు లత్యంతదూష్యంబులు పంచమహాపాతకంబు లొనర్చినవారికిం బ్రేత
కర్మాదులుం జెల్లవు వారు గురువులైన నమాత్యులైనఁ బ్రాయశ్చిత్తంబున
శుద్ధులు కాఁ జాలరు వారి ప్రేతకర్మంబులం దన్నంబు పరిగ్రహించినపాపంబు
నకు నిష్కృతి గలుగ నేర దని మఱియును. 522

క. ప్రాయశ్చిత్తి కనర్హము, లై యుండినపాతకముల కైన గురువులన్
దాయాదుల విప్రులఁ బెడఁ, బాయం దగు ధార్మికుండు పాతకభీతిన్. 523

ప్రాయశ్చిత్తవిధానకథనము.

ఆ. దొంగ దొంగ యనిన దోష మగుం గొంత, దొంగ కానివాని దొంగ యనిన
ద్విగుణ మైనదోష మగు బ్రహ్మహంతకు, మూఁడు రెట్లదోషముఁ గొన వచ్చు.
వ. కన్యాదోషముం బ్రకటించినవాఁడు నాల్గురెట్లదోషంబు నొందు మఱియును.
సీ. అవనీసురుని ముట్టి యవమతిం జేసిన, శతవర్షములు ప్రతిష్ఠం దొలంగుఁ
బడ నేయ వేయేండ్లు కడుదుఃఖమును బొంది, నారకవాసమునం దపించుఁ
బుడమిదేవర నెత్రు తడుపుఁ బాంసువు లెన్ని, యన్నియేండ్లానిరయంబునొందు
భ్రూణహత్యం జేసి భూపతి సంగ్రామ, మున శస్త్రహతిఁ జేసి పూతుఁ డగును

తే. గాకయుండిన నగ్నిలోఁ గాలి శుద్ధుఁడగును గలుఁ ద్రావి నతఁడు కల్లడరఁ గాచి
త్రావియ వ్వేఁడిఁ దపియించి దానఁ జచ్చి పూతుఁడగు నొంటఁ బాతకంబొందఁ బోఁడు.

మ. గురుతల్పంబున నైనపాపమున కుక్కుంబొమ్మ ప్రత్యాకారముం
బరఁగం జేసి దహించి దానిపరిరంభంబుం దగం జేయుచు
న్మరణంబుం గొని శిశ్నముల్ వృషణముల్ ఖండించి చేఁ బూని స
త్వరుఁడై నైరృతిదిక్కు వట్టి చని పోవం బాపముం బాసెడున్ 527

వ. మఱియు బ్రహ్మహత్యం జేసినవాఁడు బ్రాహ్మణార్థంబు ప్రాణంబులు విడిచియు నశ్వమేధంబు గాని గోమేధంబు గాని యగ్నిష్టోమంబు గాని చేసియుఁ గపాలియై పదిరెండేండ్లు బ్రహ్మచర్యవ్రతంబున నింటింటం దనతప్పు చెప్పుకొనుచుఁ బర్యటనంబు చేసి తపస్తప్తుం డయ్యును బ్రహ్మహత్యాఘంబుం బాసి శుద్ధుం డగు గర్భవతిం జంపినవాఁడు ద్విగుణం బగు బ్రహ్మహత్యాదోషంబు నొంది పతితుం డగు సురాపుం డైనవాఁడు నియతాహారుండును బ్రహ్మచారియు క్షితిశయుండును నై మూఁడేండ్లుండి పిమ్మట నగ్నిష్టోమంబు గావించి ఋషభైకసహస్రగోదానంబులు చేసి శౌచంబు నొందు వైశ్యునిం జంపినవాఁడు రెండేండ్లు సురాపుండు వోలె నుండి ఋషభైకశతగోదానంబులు చేయం దగు శూద్రునిం జంపినవాఁ డొక్కయేటివ్రతంబు నన్నియ గోదానంబు లొనర్పం దగు శ్వానవరాహఖరంబులం జంపిన శూద్రహతికిం జెప్పినవ్రతంబు సేయునది మార్జార చాష మండూక కాక వ్యాల మూషికంబులం జంపినఁ బశువులం జంపినపాపం బగు దానికిఁ బ్రాణివధకుం జెప్పినప్రాయశ్చిత్తంబు చేయునది యల్పం బైనదోషంబున నొక్కసంవత్సరంబును శ్రోత్రియభార్యావిషయంబున మూఁడుసంవత్సరంబులును బరదారగమనంబున రెండువత్సరంబులును జతుర్థకాలభోజియై బ్రహ్మచర్యవ్రతంబు చేయునది స్థానాసనపయఃపానంబుల మూఁడుదినంబులు నియమవ్రతంబునఁ జరించునది యగ్నిపరిత్యాగియు నిట్టిదోషంబు నొందు నకారణంబుగఁ దల్లిదండ్రులను గురువులను బరిత్యజించినవాఁడు పతితుండు నాఁబడుఁ దనభార్య విరుద్ధ యైనను వ్యభిచారిణి యైనను దానిశయనంబు పరిత్యజించియు గ్రాసవాసోమాత్రం బిచ్చునది పరదారశయనంబునఁ బ్రవర్తించినవానిం బట్టి రాజు కుక్కలచేతం గఱపించియుఁ దప్తాయసశయనంబునం బెట్టించునది భర్త్రతిక్రమంబున భార్యకు నిట్టిదండం బగు నెల్లు సంవత్సరాభిశస్తుం డగువానికి దండంబు ద్విగుణంబు దండితు లైనవారు రెండు మూఁడు నాలు గైదు సంవత్సరంబులు క్రమంబుగ

మునివ్రతంబున భైక్ష్యంబు చరించునది పరివిత్తిపరివేత్తలు పతితతుల్యులు వారికి వీరహత్యాసమపాతకం బగుఁ బరివేత్త యొక్కమాసంబు కృచ్ఛ్ర చాంద్రాయణవ్రతంబు చరించునది జ్యేష్ఠాభ్యనుజాతుం డై భార్యం బడసి దానిం దనజ్యేష్ఠునకు నివేదించి తదనుమతంబున నాభార్యం బరిగ్రహించి నచోఁ బాపముక్తుం డగుఁ బశువులతో రమించినపురుషుండు మీఁదికిం దన జుట్టు కట్టుకొని మృణ్మయపాత్రంబుఁ గొని నియమవ్రతంబున నేడుగృహం బులఁ దనతప్పు చెప్పుచు భిక్షం గ్రహించి యొక్కచో భుజించుచుఁ బండ్రెండు దినంబులఁ బరిశుద్ధుం డగు నట్లు కాకున్న నొక్కవత్సరంబు నియమవ్రతం బునఁ జరించునది దానశక్తుం డైనచో గోదానం బైనం జేయునది శ్వవరాహ మనుష్యకుక్కుటఖరమాంసంబుం దినినగోమూత్రపురీషప్రాశనంబునఁ బూతుం డై సంస్కారార్హుం డగు బ్రాహ్మణుండు సురాపుం డైనచో మూఁడునా ళ్లుడుకునీళ్లును మూఁడునాళ్లుడుకుపాలునుం ద్రావి మూఁడునాళ్లు వాయు భక్షుం డై పూతుం డగు నిట్లు ప్రాయశ్చిత్తంబులు సనాతనంబు లివి యజ్ఞాన సంభవంబు లైనప్పుడు విహితంబు లని చెప్పిన పితామహుం గాంచి ఖడ్గయుద్ధ విశారదుం డగునకులుండు శరతల్పగతుండగుశాంతనవుం గాంచి యి ట్లనియె.

తే. ధనువు ప్రహరణశ్రేష్ఠము దానికంటె, ఖడ్గ ముత్తమ మందు నక్కార్ముకంబు
చెడిన వాజులు వడినయప్పుడు కృపాణ,మరులఁ జెండాడి కాచుకొననువుపడును.

వ. ఖడ్గం బేమిటి కిట్లు ప్రహరణశ్రేష్ఠం బయ్యె నది యేమిటి కుత్పాదింపం బడినది దానికిం బూర్వాచార్యు లెవ్వరు చెప్పి నాసంశయంబు దీర్పు మనిన మాద్రీ పుత్రునివచనంబు విని ధనుర్వేదపారగుం డగుసౌరనదీసూనుం డి ట్లనియె. 530

### ఖడ్గప్రభావాభివర్ణనము.

సీ. ఈసర్వమును దొల్లి యేకార్ణవం బయి, చిమ్మఁజీఁకట్లచేఁ గ్రమ్మఁబడియు
నిశ్శబ్ద మై యిది నేల యి దాకాశ, మని యేర్పడనికాలమం దజుండు
గాలిఁ గీలిం హేళి నేల నీళుల నింగి, గ్రహతారచంద్రనక్షత్రములను
సంవత్సరర్తుమాసములఁ బక్షములను, క్షణలవాదులను లోకములఁ జేసి

తే. పులహు నత్రి మరీచ్యంగిరుల వసిష్ఠు, రుద్రులను బులస్త్యుఁ గ్రతు నద్రికల్పు
లనుసుతులఁ గాంచె వారివలన సమస్తజంతుజాలము జగముల సంభవించె.

వ. ప్రాచేతసుం డగుదక్షుం డరువదుండ్రఁ గన్యలం గనె వారు ప్రజాసర్గంబున కైరి వారివలన విశ్వభూతంబులు దేవతలు పితృగణంబులు గంధర్వులు నప్స

రలు రక్షస్సులు పతత్రిమృగమీనంబులు ప్లవంగంబులు మహోరగంబులు నుద్భి
దములు స్వేదజములు నండజములు జరాయుజంబులుం బుట్టె నిట్లు జంగమ
స్థావరం బుత్పన్నం బైనంత స్వాయంభువు స్వాయంభువు లైనవేదంబులధర్మంబు
ప్రతిష్ఠించె నాధర్మంబున సహాచార్యపురోహితు లగుదేవతలు నాది
త్యులు వసువులు రుద్రులు సాధ్యులు మరుత్తులు నశ్వులు భృగ్వంగిరస్సులు
సిద్ధులు కాశ్యపులు వసిష్ఠగౌతమాగస్త్యనారదపర్వతాదులు వాలఖిల్యులు
ప్రభాసులు సికత్ములు ఘృతపులు సోమపులు వైశ్వానరమరీచిపులు నాకృష్టులు
హంసులు నగ్నియోనులు వానప్రస్థులు బ్రహ్మానుశాసనంబునం బ్రవర్తించిరి
హిరణ్యకశిపు హిరణ్యాక్ష విరోచన శంబర విప్రచిత్త ప్రహ్లాద నముచి బలి
ప్రభృతు లగుదైత్యదానవులు లోభమోహసమన్వితు లై ధర్మసేతువుం దాఁటి
దేవర్షులతోడం బోరు వెట్టుకొని భూతానుక్రోశంబు లేక లోకకంటకు లై
ప్రజలం బాధింపఁ జొచ్చి రప్పుడు బ్రహ్మర్షిసేవ్యమానుం డగుబ్రహ్మదేవుండు.

సీ. శతయోజనాయత మతివిచిత్రమణీస, మంచితం బధికభూజావృతంబు
నగుహిమవచ్ఛృంగమందు లోకార్థసం, సిద్ధికై వేయేండ్లు చేసెఁ గ్రతువు
దేవర్షు లెల్ల ఋత్విజు లై ప్రవర్తింపఁ, బుట్టె నగ్నిఁ గ మహాభూత మొకఁడు
నీలోత్పలాభ మాభీలదంష్ట్రాకరా, ళాస్యము ప్రాంశుదేహంబు భయద

తే. మపుడుచలియించెభూతలంబర్ణవములు, గలఁగెనుత్పాతములుదోఁచె గాలిసుడిసె
నపు డశాంతము లయ్యె దిగంతరంబు, లఖిలభూతమ్ములకు భయం బావహిల్లె.

ఆ. బ్రహ్మదేవుఁ డప్డు బ్రహ్మర్షులం జూచి, వెఱకుఁ డేన దీని నెఱయఁ జేసి
నాఁడ లోకరక్షణమున కసురశిక్ష, ణమున కిది కృపాణ మమరులార. 534

ఉ. అవ్వల భూతరూప మొకయంతటిలో విడి తీక్ష్ణధార మై
క్రవ్వకొనంగఁ దేజ మది ఖడ్గము గా నయి పర్వ దానినిం
ద్రెవ్వని భక్తితో నలువ తెచ్చి మహేశ్వరుచేతి కిచ్చె లో
నవ్వుచు ఖడ్గముం గొని పినాకి మహోన్నతవిక్రమంబునన్. 535

క. నాలుగుచేతులు నగ్ని, జ్వాలాజాలావృతోగ్రవదనమ్మూర్ధ్వ
ప్రాలంబదృష్టులుం గలఁ, డై లింగాకార మడర నత్యున్నతుఁ డై. 536

తే. నీలపాండురలోహితాభీలవర్ణ,ములు దిగంతరములు గ్రమ్మ మూర్ధమున ది
వాకరునిముట్టితోల్దాల్చి వహ్నినేత్ర,మడర నిస్త్రింశమునుదాల్చి కడిమిమెఱసె.

ఉ. అంతట ఖడ్గహస్తుఁ డగునావృషభధ్వజుఁ డట్టహాసముం

గొంతన కెంతయే సలిపి ఘోరరవంబున నార్చుచుఁ దిశా
భ్యంతర మెల్ల నిండుకొన నట్టిటు మెట్టుచుఁ జంద్రహాసముఁ
వింతగఁ ద్రిప్పుచు న్వొలిఁగె వేడుక లోడిక లెత్త నత్తఱిన్. 538

సీ. అట్టహాసము లార్పు లతిశయించిన విని,దానవుల్ పఱతెంచి దారుణముగ
నశ్శోల్కములు లత్యంతమ్ము వర్షించి, నానాప్రహారముల్ నాటనేసి
వివిధవిభ్రమముల వెలసినరుద్రు నొక్కని వేయిమంది గాఁ గని భ్రమించి
తలఁకిరప్పుహరుండుతలలుగోసియుబాహు,వులుద్రుంచియునువక్షములునఱకియుఁ

తే. గఱుగత మైనదావాగ్నికరణి దైత్య,దానవావళిఁ గడతేర్చె ధైర్య మెడల,
సంప్రకీర్ణాస్త్రగాత్రులై సమరవిముఖు,లగుచుఁ బఱచిరి హతశేషు లార్తు లగుచు.

క. కొందఱు భూమిం దూఱిరి, కొందఱు దివి డాఁగఁ జనిరి కొందఱు భూభృ
త్కందరములందుఁ జొచ్చిరి, కొందఱు కంథుల నడంగికొని రతిభీతిన్. 540

వ. ఇట్లు హరుండు దైత్యసంహారంబు గావించి నప్పుడు. 541

తే. మాంసశోణితకర్దమమహిత మగుచు,బాణబాణాసనాదిసంభరిత మగుచు
సమరభువి పుష్పితాశోకసహితసూక్ష్మ,పర్వతములతో నొప్పుచుపగిదిఁ దోఁచె.

వ. అట్లు దైత్యదానవుల నెల్ల సంహరించి సర్వలోకంబును ధర్మోత్తరంబు గావించి
రుద్రుం డారౌద్రరూపం బుపసంహరించి శివంకరుం డై త న్నెల్లవేల్పులుం
బ్రస్తుతించి పూజించుచుండ ధర్మగోప్త యగువిష్ణుదేవుం బిలిచి బ్రహ్మదత్త
నిస్త్రింశం బాతని కిచ్చె నతండు దాని మరీచికిని మరీచి ఋషులకును ఋషులు
వాసవునకును వాసవుండు లోకపాలురకును లోకపాలురు సూర్యసూనుం డగు
మనువునకును మనువు క్షువునకును క్షువుఁ డిక్ష్వాకునకు నిక్ష్వాకుఁడు పురూ
రవునకును బురూరవుఁ డాయువునకు నాయువు నహుషునకును నహుషుండు
యయాతికిని యయాతి పూరునకును బూరుఁ డమూర్తరజస్కునకు నమూర్త
రజస్కుఁడు భూమిశయునకును భూమిశయుఁడు దౌష్యంతి యగుభరతున
కును భరతుం డైలబిలుఁ డనురాజునకు నైలబిలుఁడు ధుంధుమారునకును
ధుంధుమారుఁడు కాంభోజునకును గాంభోజుఁడు ముచికుందునకును ముచి
కుందుఁడు మరుత్తునకును మరుత్తుఁడు రైవతునకును రైవతుఁడు యువనాశ్వు
నకును యువనాశ్వుఁడు రఘువునకును రఘు విక్ష్వాకువంశజుం డగుహరిణా
శ్వునకును హరిణాశ్వుఁడు శునకునకును శునకుఁ డుశీనరునకు నుశీనరుఁడు
భోజునకును భోజుండు యదువునకును యదువు శిబికిని శిబి ప్రదర్దనునకును

ప్రదర్దనుఁ డష్టకునకును నష్టకుఁడు వృషదశ్వునకును వృషదశ్వుఁడు భర
ద్వాజుం డగుద్రోణునకును ద్రోణుఁడు కృపునకును గృపుఁడు మీాయేవురకు
నిచ్చె దానినక్షత్రము కృత్తిక వహ్ని దైవతము రోహిణి గోత్రము రుద్రుఁడు
గురువు దాని కసి విశసనము ఖడ్గము తీక్ష్ణధారము దురాసదము శ్రీగర్భము
విజయము ధర్మపాలము ననునెనిమిది రహస్యనామంబులు వానిం గీర్తించిన
జయం బగు నది ప్రహారణవరేణ్యం బై మహేశ్వరప్రణీతం బయ్యె. 543

మ. పృథు వీఖడ్గమె సర్వసాధనములం జేరొందఁగాఁ దాల్చి మున్
బృథుసంగ్రామములన్ జయంబు గొని ధర్మైధప్రకారంబునం
బృథివిం ధేనువుఁ జేసి సస్యములు నా విఖ్యాతదుగ్ధంబులం
బ్రథితప్రక్రియఁ బిండి దండిమగఁ డై పాలించె నీలోకమున్. 544

తే. అవల వైన్యుఁడు కౌక్షేయకాస్త్రమునన, దండధారణకర్మముం దవిలి చేసె
నీవు నసిమార్గములయందు నేర్పరి వయి,దానిఁ బూజించుచుండుట తగునుజూవె.

క. యుద్ధవిశారదు లెపు డీ,యుద్ధాస్త్రముఁ బూజ సేయ నెసఁగు న్విజయం
బిద్ధరణి నసిమహత్వము,బుద్ధిం దలపోయఁ గీర్తిఁ బొందఁగ వచ్చున్. 546

వ. అని నకులునకు సకలధర్మస్వరూపుం డగునదీపుత్రుండు ఖడ్గోత్పత్తిప్రభావాది
కంబు చెప్పినప్పుడు పాండవాగ్రజుం డానందకందళితాంతరంగుండై గాంగేయు
నభినందించి నాఁటి కింటికిం బోవ ప్రొద్దగుటయు విదురాద్యనుమతంబునఁ
గురుపితామహునను జ్ఞ వడసి సపరివారంబు గాఁ గరిపురంబునకుం జని విదుర
పంచము లగుతమ్ములం బిలిచి యిష్టగోష్ఠులం బ్రొద్దుపుచ్చుచు ని ట్లనియె 547

తే. ధర్మ మర్థము కామ మన్ త్రయమునందు,లోకవృత్తి సమాహిత మై కడుకొను
నందు నుత్తమాధమమధ్య మాభిధాన,ములను నే దేదిపొందునో తెలుపవలయు.

క. ఎందుం *త్రివర్గవిజయము,పొంద న్మది నిలుప వలయుఁ బోలిచి చెప్పం
డిందఱు నావుడు విదురుం, డందఱకు న్ముందు పలికె నార్యహితముగన్. 549

—— ధర్మార్థకామతారతమ్యనిర్వచనము. ——

సీ. తపము త్యాగము శ్రద్ధ దయయు యజ్ఞము క్షమ,సత్యముశుద్ధియు సంయమంబు
నివి యాత్మసంపద లెన్న వీనికి మూల,ముల యయి ధర్మార్థములు పొసంగు
ధర్మమునం దేవతలు ఋషుల్ తీర్థులు, ధర్మమునన్ లోకతతి ప్రతిష్ఠి
తము ధర్మమందు నర్థము సమాహితముగా, వున ధర్మ ముత్తమ మని వచింతు

* త్రివర్గవిజయము = కామక్రోధలోభవిజయము.

తే. రర్థ మది మధ్యమము కామ మధమ మనియు
నెఱిఁగి ధర్మప్రధానత నెల్లవేళ
మఱవ కఖిలభూతముల ధర్మమున నడప
జతన మొనరింపఁ గాఁ దగు క్షితితలేశ. 550

వ. అని యూరకున్న నర్థశాస్త్రవిశారదుండును ధర్మార్థతత్త్వజ్ఞుండును నగుపార్థుండు ప్రబోధితుం డై యి ట్లనియె. 551

సీ. ఇది కర్మభూమి యిం దెసఁగెడు వాణిజ్యమును ధేనురక్షణమును గృషియును
వివిధశిల్పములును వీనికి నెల్లక ర్మముల కర్థమ ప్రధానము తలంప
ధర్మకామమ్ము లర్థము లేక వర్తింప, నర్థవంతుఁడు ధర్మ మాచరించుఁ
గామములను బొందుఁ గామము ధర్మము, నర్థమునకు నవయవము లగును
తే. అర్థమున రెండు సిద్ధించు నర్థహీనుఁ, డైనపురుషుఁడు ధర్మకామాదు లెవియుఁ
బొందఁ జాలఁడు గాన నిప్పుడమి నర్థ, మునకు మించిన దెదియు లేదనితలంతు.

వ. మఱియు జటాజినధరులు దాంతులు జితేంద్రియులు ముండులు నిస్తంతువులు కాషాయవస్త్రధారులు విద్వాంసులు శాంతులు సర్వపరిగ్రహముక్తులు లోనగువా రెల్లరు నర్థార్థు లై వారివారిధర్మము లనుష్ఠింతురు శిష్టుల రక్షించుటకును దుష్టుల శిక్షించుటకు నర్థంబ ముఖ్యం బని యెఱుంగు మనిన ధర్మార్థకుశలు లగునకులసహదేవు లేకవాక్యంబు గా ని ట్లనిరి. 553

సీ. జనుఁడు కూర్చుండిన శయనించినన్ లేచి, నడచిన నిలిచిన న్మననమునందు
యోగములం దర్థయోగము దృఢము గాఁ, గొని యుండ నగు నది కొంత యైనఁ
గామాదులను బొందఁ గానఁ డర్థము ధర్మ, మరయ నన్యోన్యాశ్రయము లనర్థు
నకుఁ గామమును నధార్మికున కర్థము లేదు, కాన ధర్మార్థముల్ కలిగి యుండఁ
తే. దగును దొలితొల్త ధర్మముం దగిలి యున్న, ధర్మసంయుత మర్థము దాన కలుగుఁ
దానఁ గామమునుం గల్గుఁ దప్ప దనినఁ, బవననందనుఁ డి ట్లని పలికె నంత.

ఉ. కామము లేనిపూరుషుఁడు కాంక్ష యొనర్పఁడు ధర్మ మర్థముం
గామము లేక యాత్రయును గల్గఁగఁ బోవదు జీవితాశయే
కామము వాయుభక్షు లయి కానల నుండెడిసంయమీంద్రులున్
కామము లేక వే రగుటఁ గామమ మేటి యటంచుఁ జెప్పుదుర్. 555

సీ. స్వాధ్యాయపారగు లై మహాధ్వరముల, నాచరించెడివార లమలమునులు
కామంబునం జేసి కాదె వర్తింతురు, దానము కామమ్మె తనర దోటు?

కర్షకుల్ వణిజులు కారులు శిల్పులు, గోపులు సేవకస్తోమకార
పరులు కామంబును బట్టియే కర్మము, లొనరింత్రు కామసంయుతము జగము
తే. కామమారయ బహువిధాకారమయ్యెఁ, గామమునఁ గొందఱంబుధిలోమునుంగు
చుంద్రు కామమునం గొందఱింద్రపదము, గోరుదురు కామమునఁ గాక కొంత లేదు.

తరు. కామమునకుఁ గాని కర్మ మొకండు, కాలేదు కా దింకఁ గాఁ బోదు జగతి
కామసారము లయి క్రాలు ధర్మార్థ,కములు దధి న్వోన్న గలిగినయట్లు
కామము ధర్మార్థకముల జనించుఁ, గాఁడకంటెం బూవు ఘన మైనయట్లు
కామము ధర్మార్థకములకంటెఁ గడు, ఘన మైన దని శ్రుతుల్ గాటము చాటు.

వ. మఱియు నీలోకచేష్ట లన్నియుఁ గామంబునం బ్రవర్తిల్లుచుండుఁ గావునఁ బిణ్యాకంబుకంటెఁ దైలంబును దక్రంబుకంటె ఘృతంబు నుత్తమంబు లైనట్లు గామమే త్రివర్గోత్తమంబు విశేషించి పుష్పంబులందలిమధువుం బలె ధర్మార్థంబులఁ గామం బాభ్యంతరంబు రాజులకుఁ గామమే ప్రధానంబుగా గ్రహించి ధర్మార్థకామంబులు సమంబులుగ సేవించునది త్రివర్గంబునం దొక్కదాని సేవించినవాఁ డధముండు రెంటిని సేవించినవాఁడు మధ్యముండు మూఁటిని సేవించినవాఁ డుత్తముం డని చెప్పి యూరకున్నంతఁ గౌంతేయాగ్రజుం డొక్కముహూర్తమాత్రంబు చిత్తంబునం జర్చించి యి ట్లనియె 558

తే చెప్పితిరి మీరు సంశయచ్ఛేదముగను, ధర్మశాస్త్రప్రమాణము తవులుకొనఁగ
వింటి నేను నాతోఁచినవిధము మీస, విధమునవచింతుఁ జెవి యొగ్గి వినుఁడు మీరు.

సీ. దురితపుణ్యములందు నిరతాత్మకుఁడు గాక, ధర్మార్థకామముల్ తవులఁ బోక
సమలోష్టకాంచనుం డమలాత్ముఁ డై ముక్తదోషుఁ డై సుఖమందు దుఃఖమందు
నర్థసిద్ధి న్వీడ నాడి సంగము రోసి, సర్వభూతములందు సమత గలిగి
జగ మెల్ల మిథ్య యంచు గణించి సర్వము, బ్రహ్మ మంచుఁ దలంచుపండితుండు
తే. పొందు నిర్వాణమనిస్వయంభువచించె, నట్లు కాక స్నేహాసమేతుఁ డై నజనుఁడు
జన్మమృత్యుజరారోగసహితుఁ డగుచు, పార మెఱుఁగనివాఁడయి బడలుపడును.
క. ఇది యిట్టిద కావునఁ బ్రియ, మిది యప్రియ మిది యటంచు నెంచక కామా
స్పదచిత్తవృత్తి లేకె, య్యది సేయ నియుక్తుఁ డయ్యె నది సేయ నగుఁగా.

చ. విధివినియుక్తముల్ సకలవిష్టపభూతము లెల్లఁ దెల్లఁ గా
విధిబలవత్తరం బనుట విశ్రుత మెంతయొ యంతె కాక పై
నధికము పొందఁ జాలము క్రియాధికయత్నము పూనుకొన్న ని-

వ్విధము త్రివర్గహీనుఁడును విశ్రుత మర్థము పొందఁ గల్గెడిన్. 562

వ. అని హేతుమద్వాక్యంబులు పలికిన విని మనంబున నభినందించుచు వా రంద ఱును వానిపాదారవిందంబులకుం బ్రణమిల్లి రంతఁ బ్రభాతం బగుటయు ధర్మనందనుండు సపరివారుండై గాంగేయునిపాలి కరిగి ప్రణతుం డై తన రాక యెఱింగించి. 563

ఆ. ఎట్టివారు సౌమ్యు లెట్టివారలతోడ, బ్రీతి యుత్తమంబు వేరు చాలి నట్టివారు వారి నానతియిచ్చి నా, వలనఁ గరుణఁ జూపఁ దలఁపు మనఘ. 564

ఆ. ఎచటసుహృదు లుండరచటఁ బెట్టె ధనము సం,బంధిబాంధవులును బరఁగకుంద్రు హితము సెప్పునట్టియతఁడును వినునట్టి, జనుఁడు దుర్లభుండ యని తలంతు.

వ. ఏతదర్థంబు సవిస్తరంబుగా వ్యాఖ్యానంబు గావింప నర్హుండ వనిన శాంతనవుం డి ట్లనియె. 566

క. సంధేయులైనవారు న,సంధేయులు నైనవారు జనసంఘములన్ సంధిల్లి యుంద్రు తత్సం,బంధవిధానంబు దెలియపఱతు న్వినుమా. 567

స్నేహార్హానర్హలక్షణస్వరూపము.

*సీ. క్షుద్రుండు లుబ్ధుండు క్రూరుండు త్యక్తధ,ర్ముండును నికృతి శఠుండు కష్టుఁ డలసుండు పాపసమాచారుఁడు ఖలుండు, క్రుష్టుండు దీర్ఘసూత్రుండుసర్వ శంకియు నసృజుండు సంప్రకీర్ణేంద్రియుం,డును నిరపత్రపుండును జడుండు వ్యసనప్రియుండు దురాత్ముఁడు గురుదార,రతుఁడును గామనిరతుఁడు నాస్తి
తే. కుఁడు నసత్యవాదియుఁ బిశునుఁడును లోక
విద్విషుఁ డకృతప్రజ్ఞుఁడు వేదనింద
కుఁడును మత్సరగ్రస్తుఁడు కుజనహితుఁడు
కితవుఁడు నృశంసుఁడును దుష్టమతియు మఱియు. 568

సీ. అకృతాత్ముఁడును సమయానవస్థితుఁడును, సుజనాపకృతిఁ జేయఁ జూచువాఁడు దైర్యహీనుఁడు లోభి తనవారిఁ గాదని, పెరల కిష్టార్థముల్ పెనుచువాఁడు నిర్ఘృణుండును క్రోధి నిత్యమిత్రద్వేషి, పానప్రియుం డయి పరఁగువాఁడు ఘాతుకుండు కృతఘ్నుతాతత్పరుఁడు గర్వి,తృప్తి యింతయు లేక తిరుగువాఁడు
తే. సుకృతికళ్యాణమును బాపఁ జూచువాఁడు
కుటిలవర్తనుఁడును బ్రాణికోటిఁ గూల్చు

* క్రుష్టుండు = లోకనిందితుఁడు.

వాఁడు జారుఁడు చోరుఁ డై వఱలువాఁడు
వీరలంద ఱసంధేయు లోరసేంద్ర. 569

సీ. సర్వజ్ఞుఁడును వాక్యసంపన్నుఁడుఁ గులీనుఁ,డును లోభవర్జితుండును జితశ్ర
ముఁడు జ్ఞానవిజ్ఞానమూర్తి సురూపవం,తుఁడుగుణాంచితుఁ డలుబ్ధుఁడును సుజన
హితుఁడు కృతజ్ఞుఁడు సతతమాధుర్యవా,క్సహితుండు కులపుత్రసంయుతుండు
సత్యసంధుఁడు యథాశక్తిసమాచారుఁ,డునువిజితేంద్రియుండును సుహృదుఁడు
తే. కలుషరహితుండు వ్యాయామకలితుఁ డుత్త
ముఁడు క్రుథారహితుఁడు క్రోధమోహలోభ
విరహితుఁడు ధర్మదయితుఁ డవితథయత్నుఁ
డార్యవర్తనుఁ డనఘుఁడు న్యాయపరుఁడు. 570

సీ. తన కెంత పీడయైనను సుహృత్కార్యము, దెస పరాయణుఁ డయి తీరువాఁడు
వసనంబు నరుణిమ వదలనితెఱఁగున, మిత్రకార్యము నంటి మెలఁగువాఁడు
మెఱుఁగుబంగరునందు మఱి పెళ్లయందును,సమబుద్ధి యేనాఁడు సలుపువాఁడు
మణివిభూషలమీఁద మనసు నిల్పం బోక, గుణవిభూషణములఁ గొనెడువాఁడు
తే. జన్మశీలసంపన్నుఁడు స్వామికార్య,రతుఁడు వీ రందఱును రాజ్యరమను బెంచి
ప్రజలఁ బాలింప నెంచినపార్థివునకు, నెల్లనాఁడును సంధేయు లిభపురీశ. 571

వ. అని చెప్పి దురాచారులలోఁ గృతఘ్నుండును మిత్రఘ్నుండు నధమాధ
ములు వారిం బరిత్యజించుట ముఖ్యకార్యం బనిన యుధిష్ఠిరుండు వారిసం
బంధం బెట్టిది సవిస్తరంబుగం జెప్పు మనిన భీష్ముం డీయర్థంబు తేటపడ నొక్క
పురాతనేతిహాసంబు గలదు దానిం జెప్పెద నాకర్ణింపు మని యి ట్లనియె. 572

## నాడీకజంఘునిచరిత్రము.

తే. మధ్యదేశీయుఁ డగునొక్కమహీసురుండు, బ్రహ్మవర్జిత మగునొక్కగ్రామ మధిక
వృద్ధియుతముగ నుండుట బుద్ధి నెంచి, భైక్షకాంక్ష నటకుఁ బోయె బైసిమాలి.

చ. ధనయుతుఁ డెల్లవర్ణములఁ దత్పరతం గనువాఁడు సత్యవా
గ్వినుతుఁడు దానధర్మగుణవిశ్రుతుఁ డొక్కకిరాతుఁ డచ్చోటన్
ఘనుఁ డయి యుండె వానియిలు గౌతమనాముఁ డతండు సేరి నా
కనుగల మైనభిక్ష యిడు మంచు నుతించుచుఁ గోరెఁ గోరినన్. 574

క. కరుణామయుఁ డగుధన్యుఁడు, ధరణిసుపర్వులకుఁ బెట్టుతాత్పర్యమునం
బరఁగెడువాఁ డగుటన్ వత్సరమునకుం జాలుభిక్ష తా నిడఁ బలికెన్. 575

ఉ. పొట్టకు బట్టకుం గఱవు పుట్టఁగ నీ నని పల్కి వానికిం
గట్టినయిల్లు ధాన్యమును గట్టఁగ బట్టలు నిచ్చి భర్త లే
నట్టియు జవ్వనంబు గలయట్టియు నొక్కకిరాతకామినిం
గట్టిన గౌతముం డచటఁ గాఁపుర ముండెఁ గుతూహలాత్ముఁడై. 576

ఆ. పండువంటికులము పాడు గా విప్రుండు, భిల్లపల్లియందు భిల్లపల్ల
వాధరీప్రసంగబోధితుఁ డై కొన్ని, హాయనంబు లుండె నధముఁ డగుచు. 577

ఉ. బోయలతోడ బాణ మరిఁ బోయుట యేయుట నేర్చి గౌతముం
డేయెడ నిర్ఘృణుం డగుచు నెల్లమృగంబుల నేయువాఁడ డై
పాయనివేడ్క నవ్వనుల బ్రాలెడుహంసలఁ జంపి నిచ్చలున్
బోయలతో సముం డగుచుఁ బ్రొద్దులు పుచ్చుచు నుండె నిచ్చమై. 578

సీ. కొన్నియేం డ్లారీతిఁ జన్న పదంపడి, చీరాజినధరుండు శిఖిసురుండు
స్వాధ్యాయపరుఁడు బ్రహ్మణ్యుండు సద్బ్రహ్మ,చారి గౌతమపూర్వసఖుఁ డొకండు
దేశాటనము సేయ దీక్షితుం డై గౌత,ముఁడు కాఁపురం బున్నబోయపల్లె
కరుదెంచి విప్రగృహాన్వేషి యై వాడ,వాడయుఁ దిరిగి యాబ్రహ్మబంధు
తే. గేహసీమకుఁ జనుదెంచి గ్రీష్మతాప,తప్తుఁ డయి సోలుటన్ గృహద్వారమందుఁ
బంచనీడ నించుక విశ్రమించె నంత, మట్టమధ్యాహ్న మగునట్టిపట్టునందు. 579

వ. అంతలో గౌతముండు. 580

ఉ. నెత్తురు చెమ్మటల్ గలసి నెత్తికి నేలకు నేకధార యై
మొత్తముగా స్రవింప శరముల్ ధనువుం గరమందుఁ దాల్చియున్
మిత్తికి నైనపుల్గుగమి మిక్కుట మైనభరంబు మోయుచు
న్మెత్తన గానిచిత్తమున మెల్లుకఁ బిల్చుచు వచ్చె నింటికిన్. 581

వ. అట్లు వచ్చి పిట్టపీనుంగుల కావడిం దింపియున్నప్పుడు. 582

మ. పురుషాదాభుని బ్రాహ్మణబ్రువు నొగిం బోలించి బ్రహ్మణ్యుఁ డా
ధరణీదేవుఁడు వ్రీడితాత్ముఁ డగుచుం దా ని ట్లనున్ బ్రాహ్మణో
త్తరవంశంబునఁ బుట్టి మోహమున నేతద్వృత్తి దస్యుండ వై
పరివర్తించెద వేటికర్మ మిది పాపస్వాంతుఁ డై తక్కటా. 583

క. విల్లమ్ము లేమి పక్షులఁ, బ్రెల్లం గా నేయు టేమి తెంపరి వగుచున్
భిల్లికి వల్లభుఁ డగుచుం, బల్లియ నివసించు టేమి భావ్య మె చెపుమా. 584

ఉ. ఉత్తమవిప్రవంశమున నున్నతులై చనునీదుపూర్వులం

జి_త్తమునం దలంప విటు చెట్టవ నైయె కులపాంసనుండ వై
తొత్తును జెట్టఁ బట్టి పశుతుల్యుఁడ వై శ్రుతముం దృజించి యిం
ది_త్తెఱఁ గేర్పడ న్మెలఁగ నెట్లు సహించితి వక్క_టక్క_టా. 585

క. ఎన్నో జన్మము లె_త్తిన, నున్నతతప మున్నఁ గాని యొదవని త్రిజగ
త్సన్నుతవిప్రత్వంబుల, నన్నకసన్న విడనాడఁ జాలితి వయయో. 586

తే. బ్రాహ్మణుం డయి జన్మించి బ్రహ్మవిద్య
నభ్యసించినదానికి నాత్మచింత
దమము శీలము శ్రుతము సత్యమును గలిగి
యుంటఁ దగుఁ గాని యీవెంట నుంట తగునె. 587

వ. అని యనుక్రోశంబునం బలికిన సుహృద్వచనంబు విని గౌతముం డా_ర్తుండును బశ్చాత్తాపతప్తుండు నై తనచేతకుం దాన గర్హించుకొనుచు నభ్యాగతునిం గాంచి నమస్క_రించి యి ట్లనియె. 588

చ. ద్విజవర! తప్పు చేసితిని వేద మెఱింగియు నిర్ధనుండ నై
నిజవిషయంబు వాసి కడునెంజలి నై ధన మాస చేసి యి
ట్లజవిధి నిందు వచ్చి నడయాడుచు ని ట్లయి పోతి నే మనః
వృజినము దాపరించె నను వీతమనోజ్వరుఁ జేయవే దయన్. 589

వ. ఇంక నే నిం దుండువాఁడం గాను నేఁడు నీ విం దుండు మెల్లి నీతోడం బడి వచ్చువాఁడ నని ప్రార్థించినఁ గరుణాతరంగితాంతరంగుం డగునతం డట్ల కాక యని క్షుధాపీడితుం డయ్యును భోజనంబు సేయ నొల్లక నాఁడు గడపి మరునాఁ డరుణోదయంబున గౌతమునకుం జెప్పి పయనం బయ్యె గౌతముండు నతనితోఁ గొంతదూరంబు వోయి యొక్క_చో సాముద్రికు లగుసార్థవాహు లం గాంచి వారితోడం బడిపోయె సార్థంబును సముద్రతీరంబునకుం బోనెంచి కొండమార్గంబువట్టి చనుచుండ నొక్క_వనగజంబు వచ్చి మ_త్తిల్లి యున్నది గావున నెల్లరం బట్టి కాళ్ల మట్టిమట్టుపెట్టె నట్టియెడఁ గొందఱు బేహారులు చావునకుం గాక తప్పించుకొని పాఱిరి పాఱుండును వారణంబుబాఱిం బడక భయంబునుండి విముక్తుం డై ప్రాణంబు లఱచేతం బెట్టుకొని యు_త్తరదిగ్భా గంబువట్టి యేకాకి యై పఱచి సముద్రప్రాంత కాంతారంబునం జొచ్చె నదియుఁ బుష్పఫలభరిత రసాలసాల తాలతక్కో_లతమాలకాలాగురుప్రభృతినానావిధ పాదపసముపేతంబును మనుష్యవదనఘోరుండభూలింగాదిశకునసమంచితంబును

శుకపికశారికాదివివిధవిహంగమనినాదసంభృతంబు నై కరంబు డంబుమీఱు
నందు ధారణీసురుండు విహరించుచుం బోవం బోవ ముందఱ సువర్ణసికతాంచి
తంబును సువిశాలంబును స్వర్గోద్దేశసమంబు నగుసమప్రదేశంబు లోచనగోచ
రం బగుటయు నందు. 590

క. నలుగడఁ బ్రబలినశాఖలు, విలసనమున వట్రు వగుచు విశ్వంభరకున్
నిలిపినఛత్త్రము పొలుపున, నలరారువటం బొకండు నతిరమ్యగతిన్. 591

క. చందనపుష్పమరంద, స్యందనమున దానిమూల మతిసిక్తం బై
మందానిలవిచలత్సుమ, సందోహసుగంధసతతసంవాసితమై. 592

క. ఆనందజనక మగుచున్, జానొందెడుమఱ్ఱిమ్రాఁకు చక్కటికి న్మా
ర్గానూనశ్రమ కగునా, మానిసి చని కూరుచుండె మన మలరంగన్. 593

చ. మలయనగాగతానిలకుమారుఁడు మాటికిఁ బూవుఁగొమ్మలం
గలఁచుచు వచ్చి గౌతమునిగాత్రములం బ్రవహించి దారి నా
నలమట లెల్లఁ బాపుటయు నాతఁ డొకింతన సేదఁ దేఱి మే
న్దెలియక గుఱ్ఱు వెట్టుచును నిద్దుర వోయెను గ్రుంకెఁ బ్రొద్దునున్. 594

సీ. అంత సంధ్యాకాల మరుదెంచినప్పుడు, బ్రహ్మలోకమునుండి మ్రానికడకు
నాడీకజంఘుఁడు నా రాజధర్ముఁడు, నా నొప్పుబకరాజు నలినభవుని
కృపకుఁబాత్రుండు గశ్యపునౌరసుఁడు దేవ,కన్యాసుతుఁడు విద్యఁ గఱచినతఁడు
దేవగర్భాభుఁడు దేదీప్యమానప్ర,భాభ్రాజితుఁడు మృదుభాషణుండు

తే. వటముపైఁ గలగూఁటికి వ్రాల వచ్చె, నచ్చెరువువడి ద్విజబంధు వరసి తుప్పి
పాసలంజేసి దానినిఁ బట్టి చంపి, తినఁగఁ దలపోసె మనమునఁ దెలివి మాలి.

వ. అంత నక్కొక్కెరయు నక్కిరాతబ్రాహ్మణునిచక్కికిం జని యిట్లనియె. 596

ఉ. స్వాగత మయ్యె యోపురుషవర్య! యదృష్టము మంచి దయ్యె న
భ్యాగతుఁ డెన్న విష్ణు వగు నస్తగతుం డరుణుండు సంధ్యయున్
రాఁ గలిగె న్మదీయగృహరాజమునం దిట నాతిథేయ మీ
రే గొని యేగఁ గాఁ దగును రేపకడం బయనంబు సేయుచున్. 597

వ. అనిన నతండు విస్మితుండును గౌతూహలాయత్తచిత్తుండు నై చూచుచుండఁ
గొక్కెరాయి వెండియు. 598

ఆ. అనఘ! నేను గశ్యపాత్మసంభవుఁడ దా,క్షాయణీసతినను గన్నతల్లి
యతిథి వీవు నీకు స్వాగత మనుచు స,త్కార మాచరించె గారవించి. 599

వ. సాలపుష్పమయంబగు బ్రుసిం గల్పించి భగీరథరథాక్రాంతదేశంబులం బెడఁగిన మందాకినీమీనంబులం దెచ్చి వహ్నిపక్వంబు గావించి యిచ్చిన నతండు వానిం దిని సంప్రీతిం గొని యున్నంత విహంగమంబు శ్రమాపనయనార్థము తనగఱుదోయి విసరుచు విశ్రాంతిం గాంచినంత గోత్రనామంబు లడిగిన నతండు నేను గౌతమద్విజుండ నని చెప్పి యొండు చెప్పకున్నంత నాడీకజంఘుండు వానికిఁ బల్లవపుష్పంబుల శయనంబు గల్పించి యందు విశ్రమింపం జేసి. 600

క. ఎం దుండి యెందుఁ బోవుచు, నిందుల కేతెంచినాఁడ వింతయు నాకుం బొందుపడఁ జెప్పు మనుటయు, విందుం దిని తృప్తుఁ డగుచు విప్రుం డనియెన్.

ఆ. కూటివేద నగుచుఁ గొన్ని దేశంబులు, తిరిగి తిరిగి యొండుః దెరువు లేక యుదధిఁ జేరఁ బోవునోడ బేహారుల, వెంటవచ్చినాఁడ విత్తకాంక్ష. 602

మ. అనుడుం గాశ్యపుఁ డిట్లు వల్కు ద్విజవర్యా! మాను ముత్కంఠ నీ పని నిర్విఘ్నము గాఁగ సాఁగెడు ధనప్రాప్తిన్ భవద్దేహముం జనఁ గాఁ జాలుదు వర్థసిద్ధికిఁ జతుశ్శాఖల్ ప్రశస్తంబు లై చను నంచున్ వచియించె శాస్త్రము సురాచార్యుం డవార్యంబుగన్. 603

క. విను మవి పారంపర్యం,బును దైవము కామ మైత్రములు నా నా క్రి వును నే మిత్రములము గా,వున నే జతనింతు నర్థపుఁడ వగు దీవున్. 604

వ. అంతఁ బ్రభాతం బగుటయు. 605

సీ. బకవల్లభుఁడు బ్రహ్మబంధువుం గని ద్విజ, వర! మధువ్రజ మనుపురవరంబు కల దచ్చటికి నాలుగవ్యాతు లెడము గా, రాక్షసేశుఁడు విరూపాక్షుఁ డనఁగ బలవంతుఁ డప్పురిఁ బాయక యుండు నా, కత్యంతమిత్త్రుఁ డీ వటకు నేగి నాపంపు వినిపించి నీపని చెప్పుము, చెప్పిన నీయభీప్సితముఁ దీర్చు

తే. బాట యిటు లని చెప్ప నాబాపనయ్య, పయన మైఁ దారి నమృతకల్పంబు లైన ఫలము లాహారముగఁ గొని పవలు రెండు,నడచి మేరువ్రజపురంబుకడకునరిగె.

మత్త. శైలసాలము శైలతోరణసంభృతంబును శైలయం త్రాలయంబు మహానదీపరిఘావృతంబు మహేశదే వాలయాంచిత మున్నతోన్నతహర్మ్య ముద్ధితగోపురా ట్టాలకంబు జగన్నుతం బయి డంబుమీఱుపురం బిలన్. 607

వ. అట్టిమేరువ్రజపురంబు బహిర్ద్వారంబుకడకుం జని గౌతముండు నాడీకజంఘుని పనుపున వచ్చినవాఁడ నని తనరాక ద్వారపాలకులమూలంబున రాక్షసేంద్రున

కెఱింగించి తదనుమతంబునఁ బురప్రవేశంబు చేసి విరూపాక్షుదర్శనంబు గావిం చుటయు నతం డతని నతిగౌరవంబునం గాంచి పూజించి యుచితాసనాసీనుం గావించి గోత్రచరణంబును స్వాధ్యాయబ్రహ్మచారికంబు నడిగిన నతండు గోత్రమాత్ర మెఱింగించి యూరకున్న విరూపాక్షుండు బ్రహ్మవర్చోవిహీనుం డగువానిం దేఱి పాఱం జూచి వాఁ డధముం డని సంశయించి యి ట్లనియె.

శా. నీదేశంబును నీదువృత్తమును నీనీలాలకాచారముల్
నీదాంపత్యము నీప్రవర్తనము సందేహింప కొక్కింతయున్
నాదండ న్వచియింపు మున్న తెఱఁ గంత న్నాభయం బింతయున్
రా దీవాబకవల్లభేష్టుఁడవు గానం దప్పు సైరించెదన్. 609

వ. అనిన నాబ్రాహ్మణబ్రువుం డతని కి ట్లనియె. 610

తే. మధ్యదేశప్రసూతుఁడ మహీసురుండ,నయ్యు శబరాలయంబున నాలు శూద్రి
యును బునర్భువు గా వాస ముంటి నిపుడు,సత్య మియ్యది రాక్షసేశ్వరవరేణ్య.

ఉ. నా విని రాక్షసేంద్రుఁడు మనంబున నీజనుఁడెట్టిఁ డైనఁ గా
నీ వల దీవిమర్శనము నెయ్యుఁడు పుచ్చినవాఁడు పుట్టుకన్
బ్రావిబుధుండు వీని కెటు గాని ధనం బిడి యంపిపుత్తు నా
భావన సంశ్రితుం డయినవాని నిజాప్తునిఁ గా గణించెదన్. 612

సీ. ఈనాఁడు కార్తికి యేతెంత్రువిప్రులు,వేవురు వానిలో వీనిఁ గలిపి
పూజించి ధన మిచ్చి పుచ్చెద నేఁడు పుణ్యదినంబు వగ వేల మదిఁ బొనర్ప
నని నిశ్చయించి వచ్చినయెల్లరకు స్నాన,మాడించి క్షౌమవస్త్రాదు లిచ్చి
సమలంకృతులఁ జేసి స్వర్ణపీఠంబుల,బ్రుసికుశాస్తరణముల్ పొసఁగ నిలిపి

తే. యర్ఘ్యపాద్యాదివిధుల సమర్చనంబు
సలిపి జాళువాపళ్లెరంబులను షడ్ర
సముల శాల్యన్న మొసఁగె భక్ష్యములతోడ
మధుఘృతాదులతోడను దధులతోడ. 613

వ. ఆవిరూపాక్షున కిట్లాషాఢమాఘంబులందును విశేషించి కార్తికంబునందును జేయ నియమవ్రతంబు గలదు నాఁ డట్లు బ్రాహ్మణసమారాధనంబు చేసి నవరత్నం బులు రాంకవాజినంబులు సువర్ణరాసులును దక్షిణ యొసంగి మీరు భుజించిన స్వర్ణపాత్రలతో నెల్లధనంబు యథేష్టంబుగ మోయఁ గలంత మోచికొని పొం డనిన వా రెల్లరు సువర్ణరత్నసంచయంబు గొని వారివారిదేశంబులకుం జని రంత గౌతముండును. 614

చ. రతనములుఁ సువర్ణములు రాసులు రాసులు గాఁగ ముల్లెలం
గుతికకుఁ గొన్ని నెత్తిపయిఁ గొన్ని భుజంబులఁ గొన్ని వెన్నునం
దతుకుకొనంగఁ గొన్ని నడుముందుఁ గరంబులయందుఁ గొన్ని గా
మిత మది లేక కట్టుకొని మెట్టుచు నెట్టుచుఁ బోయె మర్త్రికీ. 615

వ. ఇట్లతికష్టంబున మోయ లేనిమోపు లెల్ల మోచుకొని వచ్చి తెచ్చినముల్లె లన్నియు నమ్మర్రివృక్షంబు కడం బెట్టి మార్గమధ్యంబున నన్నపానంబులు లేమిం జేసి క్లాంతుండై నిట్టూర్పు నిగిడించుచు నట్టి చదికిలంబడుటయు మిత్రవత్సలుం డగు రాజధర్ముండు వడివడిం బఱతెంచి వచ్చి నిజపక్షాగ్రవిక్షేపంబుల విసరి మార్గాయాసం బపనయించి పూజించి భోజనం బర్పించిన వాఁడు భుజించి సువిశ్రాంతిం గాంచి తనమనంబున. 616

మ. కడుదూరం బిలు మోయ లేనిబరువుల్ గాల్నొట్టన నెట్టి పో
గడియర్ గా వొకమూఁడునాళ్లకన యోగం బుండ దిద్దారిలో
నడుమర్ ముల్లెల డింప నొప్పు దెటు లైనం గొంతభక్తంబు వెం
బడిఁ గొంచుంజన నొ న దెట్లు సమకూర్ప న్వచ్చునో యిచ్చటర్. 617

వ. అని మనంబున నాహారాన్వేషణంబు సేయుచుం గొంత వడికి. 618

తే. చేఁపలం జెల్లలం దిని చియ్యఁబట్టి,యున్న దీకొక్కరాయి దీని న్నొగిల్చి
చంపి కలమాంసమంతయు సంతరించి,వెంటఁ గొనిపోదుఁ బాథేయవిధి నొనర్ప.

వ. అని కృతనిశ్చయుం డై యుండె నంత సాయంసమయం బగుటయు రాజధర్ముండు రక్షార్థ మట నొకనెగడిం బెట్టి దాని కెడ గలుగ వాని కొక్కసుఖశయనంబు గల్పించి శయనింపం జేసి తానుం దత్పార్శ్వంబున విశ్వసించి నిదురించె నంతఁ గృతఘ్నుం డగునాదుర్బ్రాహ్మణుం డొకయింతయు ననుబంధంబు దలంపక లగుడంబున దాని నొక్కపెట్టు పెట్టి చంపి. 620

ఉ. ఱెక్కలు వ్రచ్చి మేనఁ గలఱేకులు డుల్చి శరీర మగ్నిలోఁ
బక్కువముం బొనర్చి చురి వ్రచ్చి శిరంబును గాళ్లు గోళ్లను
న్మక్కులు డొక్క లెమ్ముకలు మూఁడియుఁ బుచ్చి పలంబు ముద్దగా
నొక్కటి గాఁగఁ జేర్చుకొని యూఁడనిఁబాడె నతండు వేకువర్. 621

వ. అంత నక్కడ విరూపాక్షుం డామరునాఁడు తనపుత్త్రుం బిలిచి మనం బాత్ర పడ ని ట్లనియె. 622

తరళము. కటకటా! మనరాజధర్ముఁడు గానవచ్చుట లేదు తా

నిటకు వచ్చెదుఁ బూర్వసంధ్యల నెప్డు నల్వ భజింపఁ గా
నటకుఁ బోవుచు రెండుసంధ్యలు నాఖగోత్తము రామి ప్ర
స్ఫుటమ యయ్యెఁ గలంగు నామది సూడ కుండుట మిత్రునిన్. 623

మ. ద్విజవంశాపశదుం డొకం డతని సంధించెన్ దురాచారుఁడున్
గుజనుం డున్నతపాతకావృతుఁడు నాకు న్వానిపై సందియం
బు జనించె న్వీన రానికార్య మెదియే మోహంబునం జేయ నుం
డి జతం జేసెనొ తోఁప దీవు చని తండ్రీ! చూచి రమ్మింతలోన్. 624

వ. అని నియోగించిన రాక్షసేశ్వరనందనుండు రక్షోగణసహితుండై త్వరితగమ
నంబున మఱ్ఱివృక్షంబునకుం జని రాజధర్మనికంకాళంబు సూచి కన్నీరు మున్నీ
రుగ విలపించి విలపించి వారు పదుగురుం గలసి గౌతమునిమార్గంబు వట్టి 625

చ. వడివడిఁ బాఱి పాఱి యొకవంక బకాంగపలాల పిండమున్
నడుమునఁ గట్టి పెట్టుకొని నట్టడవిం బడి పోవుదుష్టునిన్
బెడకయిఁ గట్టి నెట్టుకొని పెన్వడి రాక్షసరాజధానికి
న్మిడుకుచుఁ బోయి రాజునకు మించినదానిని విన్నవించుచున్. 626

వ. పక్షాస్థిచరణోజ్ఝితం బయిన రాజధర్మనిశరీరమాంసపిండంబుతోఁ గృతఘ్నుం
డగునాదుర్బ్రాహ్మణుని ముందుత్రోసి చూపుటయు మిత్రవత్సలుం డగునతండు.

చ. కనుఁగొని బాష్పబిందువులు కన్గవఁ గాల్వలు గట్టి పాఱఁగా
వనరుచు నేడ్చె నేడ్చినను వారిజలోచనలుం గుమారులున్
జనులును మంత్రులుం దొరలు సాల్వడి యేడిచి రార్తనాద మా
ఘనతరసౌధభాగములఁ గ్రమ్ముకొనెం దెగ దెంపులేనిదై. 628

ఆ. అంతఁ గొంతవడికి నవ్విరూపాక్షుండు, తెప్పిఱిల్లి బాలసుదిండ్లఁ జూచి
మడియఁ జేసి పాపమతి నైనవీనినం, జుఁడి భుజింపుఁ డెల్లఁ గడుపు నిండ. 629

మ. అనుడున్ రాక్షసు లేము క్రూరుఁడును బాపాచారుఁ డౌవీనినిం
దిని పాపంబునఁ బోవఁ జాలము దయాబ్ధీ! మమ్ము రక్షింపవే
యని ప్రార్థించిన నట్ల కాక భటులారా! యీకృతఘ్ను న్మహా
సి నికృత్తాంగునిఁ జేసి దస్యులకు వాసిం బెట్టుఁడీ నావుడున్. 630

శా. వా రాబ్రాహ్మణబంధు నీడ్చుకొనుచు న్వధ్యప్రదేశంబును
స్వైరం బోయి యటన్ శితాయుధమునన్ ఛేదించి చిత్రక్రియల్

గూర స్ముక్కలు చేసి దస్యులకు మెక్కం డంచు నీ వారు నీ
క్రూరక్రవ్యము ముట్టఁ జాల మనుచుం గు య్యోట్టి రప్పట్టునన్. 631

క. కుక్కలను బిలిచి వానికి, మెక్కం బెట్టంగ నవియు మెక్కం జని చేఁ
దెక్కినగతి మూర్కొ కా, దిక్కుం గన కేగె భయము దీం డ్రింపంగన్. 632

వ. అని భీష్ముండు. 633

తే. కుక్క లైనఁ గృతఘ్ను నిదిక్కు సనదు
బ్రహ్మహత్యకుఁ బానచౌర్యముల కైనఁ
దనరు నిష్కృతి లేదు కృతఘ్ను న కిల
నిట్టివాఁడె మిత్రద్రోహి యెఱిఁగి తట్టె. 634

వ. అట్లు కుక్కలును ముట్టకున్న నప్పాపదేహఖండంబు లొక్కచోఁ గ్రిమిక్రవ్యా
దుల కాహారంబుగాఁ బాఱవైచి రాజానుమతంబున నొక్కరమ్యప్రదేశంబునఁ
జితిం బేర్పించి స్వర్ణరత్నమణివస్త్రగంధమాల్యాదుల నలంకరించి మఱ్ఱికడ
నుండి తెచ్చిననాడీకజంఘునికరండంబును గౌతమునియొద్దంబుచ్చుకొనినసంజూడి
ముద్దయు దానిపయిం బెట్టి రంత రాక్షసేశ్వరుండు సనుదెంచి విలపించుచు
ననలంబు దరికొలిపి ప్రేతకార్యంబు నిర్వర్తించె నాసమయంబున. 635

సీ. సురభి దాక్షాయణి సురవర్త్మమున నేగు, నది బకేశ్వరుచితి యడుగునఁ బడఁ
బైపైఁ జనఁగ దానిపాలును వక్త్రఫేనముఁ గూడిసొదమీఁద నమరఁ బడియెఁ
బడినంత రాజధర్ముఁడు పునర్జీవితుఁ, డయి తొంటిరూపున నసురవిభుని
కడ కరుదెంచె నాక్షణమున శక్రుండు, సాక్షాత్కరించి యి ట్లని వచించె
తే. నీదు దిష్టము మంచిది నీసఖుండు, చచ్చి పుట్టెను వెండి రాక్షసవరేణ్య
బ్రహ్మ శపియించెఁదనుఁ జూడ రామినిట్లు, వానివరముననీరీతిఁ బ్రదికెమఱియు.

క. అనవుడు ఖగపతి సురపతి, వినయంబునఁ జేరి మ్రొక్కి విబుధవరేణ్యా
నను బ్రదికించినతెఱఁగునఁ, బనివడి నాసఖుని ద్విజుని బ్రదికింపఁ గదే. 637

క. అని ప్రార్థించిన వాసవుఁ, డనుకంపం జూచి గౌతమాంగంబులపైఁ
గొనకొని యమృతము చిలికెం, గనుచుండ నతండు బ్రదికి గౌతముఁ డగుచున్.

మత్త. రాజధర్మునిఁ జేర వచ్చిన ర మ్మటంచు సగౌరవా
వ్యాజవాక్యపురస్సరంబుగ వాని సత్కృతుఁ జేసి ర
క్షోజనంబులు గొన్నసొ మ్మది కొమ్మటంచిడి పుచ్చుఁడున్
జేజె వెట్టి యతండు పల్లియఁ జేరఁ బోయె రయంబునన్. 639

ఆ. రాక్షసేంద్రుఁ డనుప రాజధర్ముఁడు నింద్రు, తోడఁగూడిమాడి తోయజభవుఁ
గొలువ నరిగె నతఁడు కోరిక లిరిక, లెత్త గారవించె నెంచి యతని. 640

ఉ. గౌతముఁ డట్లు పల్లియకుఁ గౌతుక మావహిలంగ నేగి య
త్యాతతవిత్తసంచయము నంతయు మార్గను వైనశూద్రికిం
బ్రీతి నొసంగి బిడ్డలను బెక్కురఁ గాంచి సుపర్వశప్తుఁ డై
ఘాతుకుఁడుం గృతఘ్నుఁడును గావున దుర్గతు లొందెఁ గుందుచున్. 641

క. ఈకథ నారదముని మును, నాకుం దెలియంగఁ జెప్పె నరనాథమణీ!
నీ కిపుడు నేను జెప్పితి, లోకమునఁ గృతఘ్నుఁ డిట్లు లులివడు నవలన్. 642

సీ. ధరణీశ! వినుము కృతఘ్ననిపట్ల న, శ్రద్ధ యెన్నండును సలుప రాదు
జనుఁడు మిత్రద్రోహమున నైన నట్టిదు,ర్గతికి దానక మయి వెతలు గుడుచుఁ
గృత మెఱింగెడివాని సతము మిత్రునిఁగాఁబ,రిగ్రహించి భజించు టగ్ర ధర్మ
మతఁ డెల్లయర్థము లతికించు నాపద్వి, ముక్తికి హేతు వై రక్తి వెంచు

తే. విడువఁ దగుదురు నిరపత్రపుడు కృతఘ్నుఁ
డును గులాంగారుఁడును బాపుఁడును నకార్య
చణుఁడు ఖలుఁడు మిత్రద్రోహి జంతుహింస
కుఁడు నని యెఱుంగ వలయు నోకువలయేశ. 643

వ. అని భీష్ముండు ధర్మరాజునకుం జెప్పె నని వైశంపాయనుండు జనమేజయునకుం
జెప్పినట్లు సూతుండు నైమిశారణ్యవాసులకుం జెప్పిన వా రవ్వల భీష్ముండు
ధర్మజున కేయేధర్మంబు లుపదేశించెం జెప్పు మనుటయు. 644

ఆ శ్వా సాం త ము.

శా. శ్రీముక్తీశ్వరపాదపద్మయుగళీసేవాసమాసాదిత
శ్రీమాన్యుం డయి వాసిరెడ్డికుల మర్త్యాక్షీరాబ్ధికిం జంద్రుఁడై
భూమీశాభరణాయమానుఁ డయి పెంపుం గాంచురాజేంద్రునిన్
క్షేమస్థైర్యజయాభయాదు లిడి వాసిం బ్రోవు మాదేవరా. 645

గద్యము.

ఇది శ్రీమదధునాతనోభయకవిమిత్ర, వేంకటయజ్వాగ్రపుత్ర,
సమారాధితవిబుధరాజ, శ్రీపాదకృష్ణమూర్తికవిరాజ
ప్రణీతం బయిన శ్రీకృష్ణభారతంబునందు
శాంతిపర్వంబునఁ జతుర్థాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ

శ్రీ
బాలాత్రిపురసుందర్యై నమః.

# శ్రీకృష్ణభారతము.

## శాంతిపర్వము - పంచమాశ్వాసము.



మన్ముక్తీశ్వరసే
వామార్గసమాప్తవైభవాధికయశునిన్
భూమీంద్రుఁ జంద్రమౌళిం
గామితఫలదుండ వగుచుఁ గావుము దేవా. 1

### మోక్షధర్మపర్వము.

క. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె నట్లు చెప్పి పితామహుండు వెండియు నేమియడిగెద వనిన యుధిష్ఠిరుండు. 2

తే. రాజ ధర్మాశ్రయంబు లై తేజ గాంచు, ధర్మముల నెల్లఁ జెప్పితి ధర్మమూర్తి
యాశ్రమములకు నుత్తమ మైనధర్మ, మెద్ది వచియింపు మన నతం డిట్టులనియె.

తే. తపము సత్యము లోఁగ నై తలఁప నైన, వెల్లధర్మముల్ ధర్మ మనేకమార్గ
ములఁ దలిర్చెదునందు విఫలమయయిన, ప్రియమొకండును లేకుండునయవిశాల

### భీష్ముఁడు ధర్మజునకు సేనజితునికథ చెప్పుట.

శా. ఏయేసద్విషయంబులం దెవఁ డెవం డేయేమనోనిశ్చయం
బాయత్తంబుగఁ జేయునో యతఁ డతం డాయాగతిం బోవుఁ దా
నేయేరీతి జగం బసార మని లో నీక్షించు నట్లే విరా
గాయత్తిన్ జనుఁ డాత్మమోక్షమున కై యత్నం బొనర్పం దగున్. 5

క. అనుటయు నజాతశత్రుండు. 6

చ. ధనమును దారయుఁ సుతుఁడుఁ దల్లియుఁ దండ్రియు నాప్తుఁడుం బ్రమీ
లనమును బొందినప్పు డెడలంగ మనోబల మేడ్వ నుండు భూ
జనుఁ డది యేమి నావుడును శాంతనవుం డితిహాస మొక్కఁ డీ
వనుకొనుసర్థముం దెలియ నానతి యిచ్చెడు విన్ము చెప్పెదన్. 7

క. సేనజితుం డనునొకభూ, జాని సుతుం డీల్గ దుఃఖసంతప్తాత్ముం
డై నెగులు గుదుచునెడ సఖుఁ,డై నద్విజుండొకఁడువచ్చియనియె నయమునన్.

ఉ. ఏ మిది మూఢభావమున నేడ్చెద వేడ్చెదునిన్నుఁ జూచి నీ
భామయు నీదుచుట్టములు పక్కము లేడ్చుచునున్న వారయో
నీ మెయి నాశ్రయించుకొని నీప్రజ లుండిరి యిట్టు లొప్పునే
యే మెయి వత్తు మామెయిన యేగుదు మేగక యుందుమే నృపా. 9

ఉత్సా. అట్టు లన్న నన్నరేంద్రుఁ డనియె నోతపోధనా!
యెట్టిబుద్ధి యెట్టిసుతప మేసమాధి యేశ్రుతం
బెట్టిజ్ఞాన మెట్టినిష్ఠ యేవ్రతంబు పూని నీ
విట్టియెడల దుఃఖ మంద కెట్టు లుందొ చెప్పుమా. 10

వ. అనిన బ్రాహ్మణుండు. 11

తే. తాను జేసినకర్మంబు దారివట్టి, యుత్తమాధమమధ్యమాఖ్యోచిత మయి [ద్ర
భూతజాతముదుఃఖముంబొందుఁబొంద,కుండునెఱిఁగింతువినుముభూమండలేం

క. ఈమేను నాది కా దీ, క్ష్మామండలి నాది కాదు కలయర్థములున్
నామాడ్కిఁ గావు పెరలకు, నీమాడ్కిం దలఁచు నాకు నేమిటికి వ్యథల్. 13

క. కట్టెయుఁ గట్టెయు నంబుధి, పట్టున నొకయంత కూడఁ బడు విడిపోవున్
బట్టి కనుంగొన భూతము, లిట్టివ వీనికి విచార మేటికిఁ జేయన్. 14

క. పుత్త్రులు పౌత్త్రులు జ్ఞాతులు, మిత్త్రులు బాంధవులు నట్టిమిసిమిం గల రీ
మాత్రకు మోహించుట తగ, దాత్రము దగ దిటువియోగమగుట ధ్రువంబే.

సీ. మొదటఁ జూపట్టఁడు పిదపఁజూపట్టఁడు, వాఁ డెవఁ డని వాని కేడు తకట
తొడరుఁ దృష్ణార్తుల దుఃఖము దుఃఖార్తి, సుఖవ మ్మగు సుఖము సుఖమువలన
దుఃఖము జనియించు దుఃఖమే మాటికి, దోఁచు సుఖమువెన్క దుఃఖ మొంద
నగును దుఃఖమువెన్కనగు సుఖంబవి రెండు,బండిచక్రములట్లు భ్రమణమొందు

తే. సుఖమునన్ దుఃఖ మొందితి సుఖము నొందు
దవి యనిత్యముల్ వానికి నాయతనము

తనువు దాని కాయతనముల్ తలఁచి చూడ
నవి యని యెఱుంగ వలయు నోయవనినాథ. 16

క. మే నెత్తి చేసి కర్మము, దానికిఁ దగుఫలము గుడుచు ధర జీవితముఁ గా
మేనున జాతిం జనునవి, గానంబడు పెఱుఁగ విఱుగఁ గాన్నై యధిపా. 17

తే. బహువిధస్నేహపాశసంబద్ధవిషయు, లగుచు జను లకృతార్థులై యాపగాప్ర
వాహసైకతసేతువుల్ వలె నశింతు, రంటి స్నేహము స్నేహమ ట్లార్తిఁగూర్చు.

సీ. అశుభకర్మము కళత్రాపేక్ష నొనరించు, నొకఁడక్లేశం బందు నుభయగతులఁ
బుత్రదారకుటుంబభూతుఁడై శోకపం, కార్ణవమగ్నుఁ డౌ హస్తివోలెఁ
బుత్రమిత్రజ్ఞాతిముఖనాశమున దవా,నల మట్టిదుఃఖముం గలిగికొనును
దలఁప భవాభవంబులు సుఖదుఃఖముల్, దైవతాయత్తముల్ ధరణినాథ

తే. ధనవిహీనుఁడుధనియుమిత్రములులేని,వాఁడుగలవాఁడుప్రాజ్ఞుఁడప్రాజ్ఞుఁడరయ
దైవమునఁజేసిసుఖమొందుదాయసఖుఁడు,తనదుదుఃఖమునకుసుఖంబునకుగారు

క. తనబుద్ధి ధనము నిచ్చుం, దనజాడ్యము లేమిఁ దెచ్చుఁ దాఁ గర్త యనం
జన దెల్లలోకవృత్తము, ననువునఁ బ్రాజ్ఞం డెఱుంగు నటుఁ గా రితరుల్ 20

మత్త. శూరుఁ డైనను భీరుఁ డైనను శుంఠుఁ డైనను భాగియై
తీరినప్పుడె సౌఖ్య మందెడు ధేను వెవ్వరి దైనఁ ద
త్క్షీరపానము చేయువానిదె ధేను వయ్యెడు నాతఁ డా
భీరుఁ డేనియు స్వామి యేనియు బిడ్డ యేనియుఁ జోరుఁడేఁ. 21

ఆ. వేరు మూఢతరులొ వేరు విజ్ఞానులో, వారు సుఖము నొందువారు తలఁప
నిట్లు గాక మిగులు నెల్లరుఁ గ్లేశంబు, నొందు వారె యందు నోనరేంద్ర. 22

తే. మొదటఁగష్టములకునోర్చితుద సుఖింత్రు,ధీరులటుగాక మొదట నెంతేసుఖింపఁ
గోరితుదదుఃఖములకయికుతిలఁగుడుతు,రజ్ఞులంత్యసౌఖ్యంబెసౌఖ్యంబుదలఁప.

సీ. ద్వంద్వంబులఁ రోయువారికి నర్థ మ,నర్థము నెప్పుడు నంటఁ బోవు
సంతాప మెఱుఁగక సంతతమును వారు, హర్షింత్రు దివమున నమరు లట్లు
విషయప్రసక్తులు వివిధరీతుల సుఖ,దుఃఖంబులకు నయి తొట్రిలుదురు
ప్రతిదినంబును శోకశతమును భయశతం,బును వచ్చి మూఢునిఁ బొందుచుండుఁ

తే. ప్రాజ్ఞుఁడు జితేంద్రియుఁడు కృతప్రజ్ఞుఁడువిజి,తేంద్రియుండనసూయకుం డిద్ధబుద్ధి
దాంతుఁడును శాంతుఁడగు వారిదరికి శోక, మెన్నఁడేనియు రాదనియెఱుఁగుమధిప

క. ఉదయాస్తమయము లెఱుఁగక,వదలనిశోకమునఁ గుందువానికిఁ దాపం

బుదయించు దాన నెంతయు,మది కాయాసంబు వొడము మానవనాథా. 25

క. ఇది నాది యనుమమత్వము, వదలక యున్నంతదనుక వానికి దుఃఖం
బుదయించు నది నశించిన, మది కానందంబ కాక మఱి యొం డగునే. 26

సీ. కామసౌఖ్యంబు లోకమునఁ దృష్ణాక్షయ,సౌఖ్యమునం గళాంశమును గొనదు
తనపూర్వకృతకర్మమున శుభాశుభ ఫలం,బులు వొందుఁ బ్రాజ్ఞుని మూఢు విడక
సుఖదుఃఖములు నల్లె చుట్టివచ్చుచు నుండు,నవి యెఱింగి సుఖించు నాత్మవేత్త
కామముఁ గ్రోధముం గడకొ త్తి తత్త్వజ్ఞుఁ,డగువాఁడు మృత్యువు నాస్తియనును

తే. గామముఖ శత్రువులఁ గెల్చి దీమసమున,నాత్మ చే నాత్మ నరసెడునట్టిజ్ఞాని
బ్రహ్మసాయుజ్యమును బొందువాని కెట్టి,జన్మపరివర్తనము లేదు సౌఖ్యమ యగు.

తే. మేను జీర్ణించినం గాని తాను జీర్ణ
దశను బొందక దుస్త్యజత్వమును బొంది
దేహమును బాపఁ జాలెడుతృష్ణయనెడు
రోగమును బాసి సుఖయించు యోగి యెపుడు. 28

పింగళ యనువేశ్యకథ

వ. ఈయర్థంబున నొక్కయితిహాసంబు గలదు చెప్పెద వినుము తొల్లి పింగళ యను
నొక్కవేశ్య తా వలచిన కాంతుండు చేసినసంకేతంబు మేఱకు రాక తడసినఁ
బెద్దయుంబ్రొద్దు ప్రతీక్షించి ప్రతీక్షించి విసివి వేసారి విరక్తిం జెంది. 29

ఆ. నేను బిచ్చిదాన నై నాకుఁ బలెఁ బిచ్చి,ప్రియున కున్న దనుచుఁ బెరిమఁ జేసి
వలచి చెంతఁ జేరి మెలఁగెడురమణుని,గా దటంటి చింత కలదె చదురు. 30

వ. అని యెంతయుం జింతించి. 31

ద్విప. ఒంటికంబముతోడ నొప్పునీనాదు, నింటివాఁకిళ్లు రెం డేడును మూసి
కంటి నిండం గూర్కు గావింతు నంత, నంట వచ్చినకాంతు నంటి క్రీడింతు.

ఆ. కోర్కి లేనినన్నుఁ గూడ నరక రూపు,లగుచుఁ గామరూపు లైన ఖలులు
నన్ను నింక వంచనం జేయఁ జాలరు, మేలుకొంటి తెలివి మేలు గంటి. 33

తే. దైవమునఁ గాని పూర్వకృతమునఁ గాని, నరుననర్థము నగ్ధ మూ నరసికొంటి
నిపుడు నేనిరాకార జితేంద్రియనని, త్రెంచుకొని యాశ సుఖనిద్రఁ దేలెఁ దెఱవ.

వ. అని యనేకవిషయంబులు విప్రుం డుపదేశించిన సేనజితుండు కలంకఁ దేఱి
సుఖి యయ్యె నని చెప్పిన యుధిష్ఠిరుండు సర్వభూతక్షయావహం బయిన
కాలం బతిక్రమించునట్టియెడ జనుం డెట్టు చేసి శ్రేయం బందుఁ జెప్పు మనినఁ

బితామహుండు పితాపుత్రసంవాదరూపం బగు నితిహాసంబు గలదు విను మని యి ట్లనియె. 35

* పితాపుత్రసంవాదరూపేతిహాసము.

తే. మున్ను స్వాధ్యాయనిరతుఁడై యున్న విప్రునకుఁ గుమారుఁడు మేధావినా నెసంగు
నట్టి మేధావి తండ్రితో ననియె నిట్లు, మోక్షధర్మార్థకుశలుఁడై ముదము పొదల.

చ. జనులకు నాయు వింతటన జారుచున్నది ధీరుఁ డిట్టిచోఁ
గను గలవాఁడ వై సలుపఁ గాఁ జనుమార్గము లానుపూర్విగా
వినఁగఁ దలంచినాఁడ వినిపింపఁ గదయ్య! యథార్థయోగముం
దనయునిపైఁ గృపారసము దార్కొనఁ జేసెడునట్టివాఁడ వై. 37

వ. అనవుడుఁ దండ్రి యి ట్లనియె. 38

తే. చదివి సాంగశ్రుతులు బ్రహ్మచర్యమున గృహస్థువై నిజపితృపావనార్థ మాత్మ
జన్ములం గాంచి జన్నముల్ సలిపి పిదప, వనమునకుఁ బోయి మునియయి తనర నొప్పు.

ఆ. అనుడుఁ బుత్రుఁ డిట్టు లభ్యాహతము పరివారితమ్ము లోక మారయఁగ న
మోఘములును గూలిపోవుచుండఁ గా, ధీరునట్లు పలుకఁ దివురు దేమి. 40

ఆ. అనినఁ దండ్రి లోక మభ్యాహతం బెట్లు, వేరికతమునఁ బరివారితంబు
తెలియ నేయమోఘములు గూలు నక భయపెట్టఁ జూతు విది వివేకమోటు.

సీ. అనఁ బుత్రుఁ డను లోకమభ్యాహతము మిత్తివలన జరం బరివారితంబు
పడు నహోరాత్రముల్ వచ్చుచుం బోవుచు, నిట్లు తలంప వీ వేను మిత్తి
మనయిచ్చ నుండెడు నని తలంపను నాళ్లు, చను చున్న నాయువు సన్నగిల్లు
విద్వాంసుఁడు పవళ్లు వృథ వోవు నని యెంచుఁ, జెనఁటి యివ్వరునీటఁ జేపవలెను

తే. సౌఖ్యపడ నెంచుఁ గోరికల్ సాఁగకమును, మైమఱచి పూవులం గోయుమనుజుఁ బట్టి

---

* పితాపుత్రసంవాద మను నియ్యితిహాస మిట నొకమాఱును, ఈపర్వమునందే కొంతదూరములో మఱియొకమాఱును సంస్కృతప్రతులలో ముద్రింపఁబడియున్నది. ఇంచుమించు రెండుచోట్ల నుండునదియును సమానముగానే యున్నది. సంస్కృతప్రతిని సంస్కరించి ముద్రింపించినవారు ప్రమాదపడి రెండుపర్యాయములు ముద్రింపించిరేమో యని నాయభిప్రాయము. ఈకథ పెక్కుప్రతులందు రెండుసార్లుపడియుండుటచేతను, తిక్కనసోమయాజిభారతములో రెండుసార్లుండుటచేతను, ప్రమాదమని తెలిసియును నేను నా యీభారతములో మూలములోనున్నట్లు రెండుసారులును వ్రాసితిని. తిక్కనభారతములో "ఈయర్థంబు దెలియుటకు ముంద రేను జెప్పినపితాపుత్రసంవాదంబను నితిహాసంబు లెస్స. యందుఁ గొన్నివాక్యంబు లప్పుడు సెప్పనియవియునుం గలవు చెప్పెద వినుము" అని యున్నది. ఇదియు నాంధ్రసంస్కర్తలప్రసాదమే యని నాయభిప్రాయము.

మేఁకఁ దోఁడేలు కొనిపోవువీఁక మృత్యు, వపహరించెడు నింతలో నట్టె వచ్చి.

మ. ఇపుడే చేయుము రేపు చేయఁ గల దేదేఁ గాల మిట్లుండ దీ
వెపుడో చేయుదు నన్న కార్య మది కొంతేఁ గాక మున్ మృత్యు వై
కృప యింతేనియు లేక ముట్టెడిని నీకృత్యంబు గాకుండె నన్
సుపరీక్షం బొనరింపఁ జూడ దనుచున్ సూక్ష్మక్రియం జూడుమా. 43

సీ. మరణకాలం బెప్పు డరుదెంచునో చెప్ప, నేవాఁ డెఱుంగు నీజీవితంబు
మాత్ర మనిత్యము మనుజుండు ధర్మము, సలిపిన నిహమందు లలితకీర్తి
పరమందు సౌఖ్యము పడయు నిక్కము దార,పుత్రాదులం గూడి మోహమునను
గనుఁగానకున్న వానిని బులి నిద్రించు,మృగమునుం బలెఁ బట్టి మృత్యు వేగు
తే. నిదికృతంబిదియకృత మియ్యదికృతాకృ,తంబనుచు నిహసుఖమందుఁ దగులువాని
స్వవశవర్తినిఁ గాఁ జేయు శమనుఁ డెపుడు,కర్మఫల మందఁ గోరుట కానిమాట.

క. బలవంతుని శూరుని దు,ర్బలు భీరున్ జడునిఁ గవిని బాలుని వృద్ధున్
బలుగాకి సత్యసంధుని, దలపోయఁగ మిత్తి మ్రింగు ధాత్రీజనులన్. 45

క. జరయును రోగము దుఃఖము, మరణము నివి సర్వదేహమహితము లగుచున్
నరు నంటి యుండు వానికిఁ, బరికింపన్ సుఖము గలదె పండితవర్యా. 46

క. విను సంసారమ్మునయం, దనురాగము బంధరజ్జు వట్టిది దానిం
దునిఁగించి సుకృతి యొప్పుం,దునిఁగింపఁగ లేమి దుష్కృతుఁడు వెత లొందున్.

వ. మనోవాక్కాయ హేతువులు జీవితార్థాపనయనంబులు నగుకర్మంబులం జేసి ప్రాణంబుల హింసింప నేరనివాఁడు బద్ధుం డగుఁ దనపైఁ బడనున్న మృత్యు సేన నెదిరింపఁ జాలనివాఁడు బాధితుం డగు మోహమే మృత్యువు సత్యం బున నమృతం బాశ్రయించుం గావున సత్యవ్రతాచారుండును సత్యయోగ పరాయణుండును సత్యాగముండును దాంతుండును మృత్యువుం జయింతురు.

సీ. అమృతమృత్యువులు దేహమునం బ్రతిష్ఠిత,ములుమృత్యువయ్యెడుమోహమునను
సత్యమునం బొల్పెసఁగు నమృతము సత్య,మెంచి కామాదుల నేవగించి
సమసుఖదుఃఖుఁడున్ సత్యవాదియు నయి, పరిహాసించెద మిత్తిఁ బ్రౌఢి మెఱయ
యతి నయి నే శాంతియజ్ఞము బ్రహ్మయ,జ్ఞము మనోయజ్ఞము సలుపుచుందు
తే. హింస కగుపశుయజ్ఞము నెన్నఁడేని
సలుప నెంచరు మాదృశుల్ సత్యశౌచ
ములును ద్యాగముఁ దపమును గలిగి నరుఁడు

పరమపద మందఁ బోయెడుఁ బండితేంద్ర. 49

తే. విద్య కెన యైనచక్షువు వెలయుసత్య
మునకు నీడగుసత్తపము ననురాగ
మునకుఁ జాలినదుఃఖము నెనయుత్యాగ
మునకుఁ బ్రతివచ్చుసుఖమును గనము గనము. 50

ఆ. ఆత్మయందు నాత్మ నాత్మనిష్ఠం బయి, ప్రజ జనించు నన్నుఁ బ్రజ దరింపఁ
జేయఁ జాలు నోటు చేరి నే నాయాత్మ,యంద మెలఁగుచుండునట్టివాఁడ. 51

క. ఏకతయు సమత సత్యత, శ్లోకము శీలంబు తపము శుద్ధార్జవముల్
లోకానుగ్రహముం ద్విజ, లోకమునకు ధన మటంద్రు లో నెంచి బుధుల్.

క. చచ్చినవానిం దవులఁగ, వచ్చునె ధనధాన్యబంధువర్గం బెదియే
నచ్చ మగునాత్మగుహలో, నిచ్చలుఁ గనుచుండు మదియె నిను రక్షించున్. 53

వ. అని కొడుకు చెప్పినచొప్పునఁ దండ్రి ప్రవర్తించి కృతార్థుం డయ్యె నీవు
నట్లు ప్రవర్తింపు మనిన ధర్మపరాయణుం డగుధర్మరాజు ధనవంతులు నిర్ధ
నులుం గల రందు సుఖించువారు దుఃఖించువారు నెవ్వ రని యడిగిన నవ్వ్యాసు
మూర్తి శంపాకుం డనునొక్కశాంతవిగ్రహుం డగునగ్రజన్ముం డతఁ డన్న
వస్త్రములకుం గఱవుపడి కుదారవలనం గ్లిశ్యమానుండై యొక్కనాఁడు నా
కడకు వచ్చి ప్రసంగానుప్రసంగంబుగాఁ గొన్నివచనంబు లెఱింగించె వానిం
జెప్పెద నాకర్ణింపుము. 54

శంపాకవచనములు.

సీ. పుట్టినదాదిగాఁ బురుషుండు సుఖదుఃఖ,ముల నొందు నొక్కఁడే పొందఁ డెపుడు
శుద్ధాత్ముఁ డటు గాక సుఖ మైన సంతస,మసుఖ మైనన్ దుఃఖ మందఁ బోఁడు
తనయాత్మకున్ శ్రేయమును గామిఁగొన లేఁడ,కామియుంగొను దైవికం బెసంగ
ధనము లేనట్టిఁ డధఃపతితుం డయ్యె, నిదురించి సుఖపడు నెఱి వహించి

తే. నిర్ధనత్వము శ్రేయము నిత్యసుఖము, శివము రాజ్యాధికగుణమ్ము శ్రేష్ఠతమము
సులభలభ్యము సతతసంశుద్ధుఁ డగున, కించనున కెల్లలోకముల్ మించఁ బోవు.

మ. ధనహీనుం డగువాని కెయ్యెడల భూదారాగ్నిచోరాదిదు
ర్జనసంభూతభయంబు చొప్పడ దరిష్టంబుల్ సమీపింప వె
ప్డును జా వన్న భయంపడం డతఁడు పెంపుం గాంచి తానేలపై
ననుపస్తీర్ణముగా శయించెడిని దేవానీక మగ్గింపఁగన్. 56

మ. ధనవంతుం డనిశంబు మృత్యుముఖముం దా నొంది యుద్విగ్నుఁడై

చనున ట్లుండియుఁ గ్రోధలోభములకున్ స్వాధీనుఁడున్ నష్టచే
తనుఁడున్ శుష్కముఖుండు నై బొమముడుల్ దార్కొఁగ మీఁదుల్ గనుం
గొనుఁ గ్రుద్ధుం డగు యాచకుం డనిన నాక్రూరుండు భాషార్హుఁడే. 57

సీ. సిరి యిట్టిమనుజుని చిత్తంబు హరియించు,నదియును రూపము నాభిజాత్య
మివి మూఁడు గలిగినయేని కేవలమును,ష్యుఁడను నేఁ గా నని యడరుచుండుఁ
బిత్రుసంచితం బగువిత్తంబు గడతేఱ, భోగార్థము పరస్వమును హరించు:
హద్దు మీఱినవాని నవనీశ్వరుఁడు పట్టి, తెగనేయు లుబ్ధుఁడు మృగము నట్లు
తే. తెలియ ధన మిట్టిదుఃఖముల్ తెచ్చి పెట్టు, నట్లగుట సర్వసంగము లవలఁ ద్రోలి
యట్టిదుఃఖములం బాపనైనమందు, జ్ఞానమని యెంచి సుఖమొందు జనుఁడుదాన.

వ. అని శంపాకుండు చెప్పె ననిన ధర్మతనయుండు సమారంభంబు లాచరించియు ధనార్జనంబు సేయఁ జాలక ధనతృష్ణాభిభూతుం డగునాతం డెట్లు చేసి సుఖంబు నొందుం జెప్పు మనిన మందాకినీనందనుండు సర్వసమత్వంబును సత్యవాక్యంబును నిర్వేదంబును విధిత్సయు ననాయాసంబునుం గలవాఁడు ప్రశాంతుం డై సుఖించు నీయర్థంబున నొక్కయితిహాసంబు గల దాకర్ణింపుము.

## మంకి యనుబ్రాహ్మణునిచరిత్రము.

సీ. ధనమున కై మంకి యనుద్విజుండు కడంగి,హతమనోరథుఁ డయి ప్రతిపదమునఁ
గొల్ల వో మిగిలినకొంతధనంబునఁ, గోదమకోడెల రెంటిఁ గొని ప్రియమునఁ
దగిలించి వానికిఁ దలఁగున లంకియఁ, బనినేర్పుటకుఁ దోడుకొని చనంగ
నవి క్రేళ్లు వాఱుచు నాదారి లొట్టెన్గు, శయనింపఁ గా దానిస్కంధమునకు
తే. నిట్టు నట్టుగఁ బడినంత నట్టె లొట్టె, వానితో లేచి పఱచె జవంబుకలిమిఁ
గోడె లుఱివేసిన ట్లయి కొంతలోన, విలవిలం దన్నుకొని చచ్చె విప్రుఁ డడల.
వ. తనవత్సతరంబు లి ట్లగుటం జేసి నిర్వేదంబు నొంది యెల్లరును విన ని ట్లనియె.
ఆ. ఎంత దక్షుఁ డైన నెంత ప్రయత్నించి,యైన నవిహితార్థ మంద లేఁడు
పూర్వజన్మకృతము పర్వి యున్ననరుండు, పడినపాటు చెల్లుబడికి వచ్చు. 62
ఉ. కోడెలవర్తకంబునను గొంత ధనంబు గడింప నెంచి నేఁ
గోడెల రెంటినిం గొనియుఁ గొన్నిదినంబులు పెంచియుం బనిం
గూడఁగఁ జేయ మల్పుటకుఁ గొంచుఁ జనంగ విధిప్రసంగతిన్
గ్రీడయ పోలె వచ్చె నయొ గిత్తలకున్ మృతి యుష్ట్రరూప మై. 63
ఉ. కావున దైవమే ప్రబలకారణ మంతకుఁ గాదు పౌరుషం

ఖేదగఁ జూచినఁ సుఖ మొకించుక సంసృతిఁ గాన రాదు సౌ
ఖ్యావహ మర్థసంగ్రహమునందు నిరాశ వహించు టిట్లు ముక్
దేవసదృశుఁ డైనశుకదేవుఁ డనె న్మిథిలాధినేతకున్. 64

ఆ. పొందు నెల్లకామముల నొక్కరుఁ డొకండు, వాని నవలఁ ద్రోయు వారిలోనఁ
బొందువానికన్నఁ బొందకుండెడివాఁడె, శ్రేష్ఠతముఁ డటంచుఁ జెప్పె శుకుఁడు

సీ. మేను జీర్ణించినం గాని ముందున కెప్డు, తృష్ణ జీర్ణింపనిదే తలంప
నే ధనాశంజేసి యెన్నియో చేసితి, వేన నొక్కింత లాభింప లేదు
సంచితం బెల్ల నష్టం బయ్యె నైనను, జతనింప మానినజాడ లేదు
ననుఁ జూచి లోకులు ధనతృష్ణ వీడదు, నిన్ను నీ వెప్పుడు నిలుఁతు సుగతి

తే. ననుచు గర్హింప మొదలిడి రైన నేను, సరకుసేయక తృష్ణలోఁజొరఁగఁబడి ధ
నాశ నెన్నెన్నియో చేసి లేశ మైన,సుఖము గానక తుద కిట్టిచొప్పు గొంటి.

వ. ఇట్టినే నింక ధనాశంజేసి పరులకడఁ బ్రేష్యభావంబు నొందఁ జాల నాకు
ధనంబునం గలుగు ప్రయోజనం బెల్లఁ దెల్లం బయ్యెఁ గావున సర్వసమారంభం
బులుం బరిత్యజించి విజ్ఞానంబు గలిగి యుండెద నని కామంబు నుద్దేశించి. 67

తే. కామమా ! నీదుహృదయము కఠినతరము,వజ్రసారమయంబు సర్వజనులహృద
యములఁగాలిచిపుత్తువుక్రమమెఱుఁగవు,స్వస్తియగునీకుసుఖముందుసతతమింక.

తే. కామమా! నిన్నెఱిఁగితి సంకల్పముననె,బుట్టెదవు నీవు సంకల్పమును దొఱఁగిన
వానియెడ నీవు చచ్చినదాన వగుదు, విడుతు సంకల్ప మేను నీకడిమి యడఁగ.

వ. కామకార్యంబులందు ధనకార్యం బత్యంతహానికరంబు. 70

తే ధనమునార్జించుటకుఁజింత దానిఁ బెంచు,టకును రక్షించుటకును గష్టంబుఘనత
ర మదిపోవుటమృత్యుతుల్యముతలంప,ధనముకంటెనుదుఃఖంబుధరణిఁగలదె.

సీ. ధనము పుష్కల మున్న దాని కెక్కువ గోరు, నరుఁడు తదాశ కంతంబు లేదు
నే నట్టివాఁడ నై నెంజిలిఁ గుడిచితిఁ, దొల్లి యిప్పుడు విరక్తుండ నైతి
కామాదులం బ్రీతి గడతేతెఁ గావున, విడనాడి పొందు మీ రెడఁగ నాకు
నాతనువున భూతజాతమంతయుఁ జూచు,చును యోగమున బుద్ధి దనరఁ జేసి

తే. బ్రహ్మమందు మనంబును బరఁగ నిలిపి, సక్తియును రక్తియును లేక సౌఖ్యగరిమ
సంచరించెద నన్నుఁగష్టములపాలు,సేయఁగాఁ జాల విఁక కామమా! యరుగుము.

సీ శ్రమము శోకము తృష్ణ సంభవించెడుఁ గామ,మున నందు ధననాశ మనఁగ నేల
ధననాశకుని జ్ఞాతులును మిత్రు లవమతిఁ, గావింత్రు ధనమందుఁ గలవు పెక్కు

దోషముల్ ధనవంతుదొంగలు హింసింత్రు, దొరలు వేధింతురు దొసఁగుపొసఁగ
యర్థలోలుఁడ నై యనుభవించితి దుఃఖ,జలధి మునింగితిఁ దెలివి వచ్చె
తే నోసికామమ! ననుఁ జేర నోప వింక, ధనము పోకడఁ బెట్టినదాన నాకు
బుద్ధి వచ్చెను నాక్లేశములు నశించె, బ్రదికెద సుఖంబుగా నీదుపాలఁ బడక.

తే. క్షమము దమమును శాంతి సత్యమును సర్వ
భూతదయయును నిర్వృతిఁ బొందినాఁడ
నను విడిచి కామలోభతృష్ణలు యథేచ్ఛఁ
దొలఁగి పోవుత బ్రహ్మముం గలిసికొంటి. 74

ఆ. ఆత్మతోడ నేద్వు రగుశాత్రవుల మిమ్ముఁ, బొలియఁ జేసి బ్రహ్మపురమునందు
నెల్లనాఁడు సౌఖ్య మెసక మెసంగ నే, రాజు వోలె నుండుఁ దేజ మెఱసి.75

వ. అని తలంచి మంకి దమ్యనాశనంబున నిర్వేదంబు నొంది సర్వకామంబులం
ద్యజించి బ్రహ్మపదంబు నొందె మఱియు నేతద్విషయంబున మఱియొక్క
యితిహాసంబు చెప్పెద వినుము విదేహపురాధీశ్వరుం డగుజనకుండు. 76

ఆ. నాకుఁ గానిధన మనంతముగా నాకుఁ, గలదు మిథిల వహ్నిఁ గాలుచుండెఁ
గాని నాదుపురము గాలుచుండ దొకింత, యనుచు నెంచి ముక్తుఁ డయ్యెనతఁడు.

వ. మఱియుం జెప్పెద వినుము తొల్లి నాహుషుండు పరమశాంతుం డైనబోధ్య
ర్షిం గాంచి మునీంద్రా! నే నెట్లు శాంతచిత్తుండ నగుదు నుపదేశింపు మనిన
నతం డతని ననుగ్రహించి నాకివ్వనంబునఁ బింగళయుఁ గురరంబును సర్పంబును
సారంగాన్వేషణంబు నిషుకారుండును గుమారియు ననునార్వురుగురువులవలన
నుపదేశంబు నొందితి నీవు తత్తల్లక్షణంబులం దెలిసికొని శాంతుండ వగు
మనిన నతం డట్లు కావించి చరితార్థుం డయ్యె వానిలక్షణం బెఱింగించెద
విను మని యిట్లనియె. 78

సీ. *నైజాశను నిరాశ గాఁ జేసి కొని సుఖ,స్వప్నంబు గావించెఁ బైఁడికంటి
యెఱచి గైకొని నింగి కెగిరెడులకుముకి, నెఱచి వీడినదాన నెఱి వహించెఁ
గాఁపురంబుండ నిల్ గట్ట దుఃఖం బని, యహి పరకృతగృహమందు బ్రదుకు
నఖిలభూతములకు నద్రోహమున భైక్ష్య, చర్యం బ్రవర్తించుషట్పదంబు

* లకుముకి మాంసముం గొని నింగి కెగురగా నితరపక్షులు తనపైఁబడి బాధింప నున్నప్పుడు దాని విడిచి సుఖించెను; కుమారి యతిథిసత్కారమునకై ధాన్యముం దంపుచుఁ బదుగురుగూడినఁ గలహమనుచు ధ్వనించు తనచేతిశంఖములు (గాజులు) తీసివేసికొనెను;

ఆ. శరముతోడుగ నెంచిపరఁగువిల్కాఁడొక్కఁ,డంతికముననున్న యధిపు నెఱుఁగ
డధిక మైనఁజప్పు డనిశంఖకములను, దీసికొని కుమారి వాసి గాంచె. 79

వ. మనుష్యుఁ డీయార్వురలక్షణంబు లెఱింగి ప్రవర్తించి పరంధామంబు నొందఁ గలం డనిన యుధిష్ఠిరుండు లోకంబున మానవుం డెట్టివృత్తంబున వీతశోకుం డగు నెట్లు చేసి యుత్తమగతి నొందు నెఱింగింపవే యనినఁ బ్రహ్లాదాజగర సంవాదం బనునితిహాసంబు గలదు దాని విని నిస్సంశయుండ వై దండి కెక్కుము మున్ను ప్రహ్లాదుం డజగరుం డనుమునిం గాంచి యి ట్లనియె. 80

అజగరచరితవ్రతకథనము.

సీ. నీవు స్వస్థుండవు నిర్వ్యథిత్స్వుండవు, దాంతుండ వధిక మేధావి వయ్యు
బాలునివిధమునం బచరింతు లాభము, నాసనేయ వలాభమందు వగవ
వవమతిం దలపోయ వాత్మజులందును, విమనస్కుఁడవు వోలె వెలయుచుందు
కానిపింతువు ధర్మకామార్థములయందుఁ, గూటస్థునివిధంబు తేటపడఁగ

తే. నింద్రియార్థములను రోసి యెల్ల నాఁడు,ముక్తసంగుండ వై సాక్షిభూతుఁ డగుదు
వేమి శ్రుత మెట్టిప్రజ్ఞ యిం కెట్టివృత్తి, తెలియ నానతి యిమ్మనఁ బలికె నతఁడు.

క. భూతములు పుట్టు కారణ,భూతంబులు గావు వానిపొదలుటకు వినా
శాతతగతికిఁ ముదముఁ, జేతోగతి దుఃఖ మెపుడు చేయను వింటే. 82

తే. విను స్వభావభూతములు ప్రవృత్తు లెల్ల, వర్తమానము లవి స్వభావనిరతములు
వానికి న్నెమ్మనమ్మున వగచుటయును,ముదము నొందుట వృథయనిమదిఁదలంతు.

తే. విప్ర యోగపరాయణను ప్రథితము, లైనసంయోగములు వినాశాంతము లట
నుమ్మలిక మొప్పనిదగుణయుక్తములగు,భూతములువినాశనమునుబొందునవియ.

సీ. జలచరమ్ములు స్థలచరములు నాకాశ, చరములు జంగమస్థావరములు
స్థూలముల్ సూక్ష్ముముల్ దుర్బలంబులుబల,వంతముల్ భూతముల్ ప్రత్యహంబు
మిత్తివాతను బడ నెత్తఱఁ గనుచుందు, జ్యోతిస్సులుం గూలు భూతలమున
మరణంబు సర్వసామాన్యము గా నెంచి, సుఖముగా నిదురింతుఁ జొక్కుటుడిగి

తే. ఆఁకలికి నెద్దియే లభ్య మైనదాని, నారగింతును మెత్తల కాసపడక
కటికుటాల నైనను బండి కంటి నిండ, నిద్రవోదు మేల్కొడులు నేఁ దలంప.

క. దొరకక యుండిన నాళులు, నిరశనముగ నుందు నాకు నియమము లే దే
కరణి నగు నేను నట్టుల, చరియింతుఁ స్వప్రయత్నసంగతి పోవఁ. 86

మ. అలుపం బైన ననంత మైన సుగుణం బైనఁ సుదుష్టంబు నై

తెలియ న్వచ్చినఁ బచ్చి దైన మఱి యేదేఁ బిండి పిట్టైన నే
ఫల మైనం బలలంబునైనఁ బ్రియ మావంతేనియుఁ లేక యాఁ
కలికిం దోఁచినదానిని న్నమలి మ్రింగం జూతు నెల్లప్పుడుఁ. 87

తే. హంసతూలికాతల్పమునందుఁ గాని, పుడమిపైఁ గాని సమబుద్ధి పొడమఁ బండి
నార యైనను దో లైనఁ జారువస్త్ర, మైన ధరియింతు భేద మిం తైన లేక. 88

ఆ. అచల మనిధనంబు శుచిసను పేతము, సదమలంబు శివము సాధుసమ్మ
తము విశోక మతుల మమరలోకాదిదు,ర్లభ మెసంగు నజగరవ్రతంబు. 89

ఆ. అచలిత మతిధర్మమందు నచ్యుతుఁ డసం,గుఁడను విగతభయుఁడఁ గ్రోధలోభ
వర్జితుండ నగుచు వర్తించెదఁ బరావ,రంబు లెఱిఁగి యజగరవ్రతంబు. 90

సీ. అనియతభక్ష్యభోజ్యవిహారశయనాది,కము విధివిహితక్రమమునఁ బొదల
నది నీది యిది నాది యనుమోహమును దృష్ణఁ,గామలోభాదులఁ గడకుఁ ద్రోలి
లాభ మలాభము వైభవము సుఖంబు, దుఃఖము మదిలోన దొరల నీక
మరణజీవితములమాటఁ దలంపక, తత్త్వజిజ్ఞాస లోఁ దగులుకొనఁగ

ఆ. విగతభయుఁడ నగుచు వీతరాగుండ నై, నియమసత్యశౌచనిశ్చలుండ
నగుచుఁ బ్రియము నప్రియం బెఱుంగక నిర్భ,ర మ్మొనర్తు నజగరవ్రతంబు.

వ. ఇది యజ్ఞదుర్లభం బైనయజగరవ్రతంబునం జేసినశాంతిప్రకారం బని చెప్పె
నని చెప్పి భీష్ముండు వెండియు. 92

క. అజగరచరితవ్రతవిధి, విజితమనోదోషుఁ డగుచు వినిన జనుం డే
వృజినముల పొంతఁ బోవక, సుజనుం డై సుగతి గాంచుఁ జువ్వె నరేంద్రా.

వ. అనిన నత్తాపత్యుండు బంధువిత్తకర్మప్రజ్ఞలలో నేది సుప్రతిష్ఠిత మని యడిగిన
దేవవ్రతుండు. 94

ఆ. ప్రజ్ఞ లాభకరము ప్రజ్ఞ నిశ్శ్రేయము, ప్రజ్ఞ సుప్రతిష్ఠ ప్రజ్ఞ దివము
ప్రజ్ఞ చేతఁ గాని పనులు లోకమునందు, లేవు ప్రజ్ఞ సర్వభావితంబు. 95

వ. బలి ప్రహ్లాద నముచి మంకి ప్రభృతులు ప్రజ్ఞాబలంబుననే సర్వోత్కృష్టులైరి
గావునఁ బ్రజ్ఞకు మించిన దెద్దియును లే దీవిషయంబున నింద్రకాశ్యప
సంవాదం బను నితిహాసంబు గలదు చెప్పెద వినుము. 96

### ఇంద్రకాశ్యపసంవాదము.

సీ. శ్రీమంతుఁ డగునొక్కకోమటి దృప్తుఁ డై, తే రెక్కి వచ్చి కాంతారమందు
సంశితవ్రతుఁ డగుసంయమినందనుఁ గాశ్యపుఁ డనువానిఁ గడురయమున

బఱచురథంబునం బడఁ ద్రోచె మునిసూతి, పడి జీవితాశ పోవంగ నార్తుఁ
డగుచుఁ జచ్చెద నని యఱచి మూర్ఛితుఁడయ్యె,నాలోఁబలారిసృగాల మగుచు
తే. వచ్చి కలవరపోవృతపస్విసుతుని, నరసి యిట్లను నేమయ్య యఖిలభూత
ములు మనుష్యత్వమునుగోరు నెలమి మనుజు,లందువిప్రత్వము త్తమంబై తలిర్చు.

వ. నీవు మానవుండ వగుటయు కాక విప్రుండ వై శ్రోత్రియుండ వైతి విట్టిదుర్లభం బైనజన్మంబు నొందియు నిట్లు కించిద్వేదనఁ సహింపఁజాలక చావ నెంచుట తగదు వినుము. 98

సీ దేహాభిమానంబు దీపింప వానికి, సర్వలాభంబులు సంతనపడు
ధర్మనీయం బైనతనువు గలాఁడవు, నీతలం పిది చాల నింద్య మగును
పాణియుగ్మము గల్గు భాగ్యము చెప్పెదు, పాటిదే వానినిఁ బడయ వచ్చు
సర్వార్థసిద్ధులు సంయమీశ్వర! పాణి,లాభమునకు మించులాభ మేది
తే యేము చేతులు లేకుండు హేతువునను, ముల్లు తీసికొనం జాల మెల్లకృములు
కుట్టినం గోకికొన లేము కుదిరె వ్రేళ్లు, పది మనుష్యుల కవి మహోపకృతికయ్యె.

ఉ. వానయు మంచు నాతపము బాధ యొనర్చెడు జంతుజాతముల్
వానిని గాచుకోఁ గలఁడు పంచజనుం డొకఁ డెల్లప్రాణులున్
వానకు నెండకుం జలికి వందురుచుండి సమస్తకష్టముల్
మానక పొందుచుండెడిని మాటయు నాటయు లేదు వానికిన్ 100

చ. మనుజుఁ డుపాయసంగతుల మచ్చికఁ జేసి వరాహ సింహ పం
చనఖ మృగాద నాహి గజ జంబుక సైంధవ ముఖ్యజంతులన్
దనవశమందు నుండెడువిధంబున మచ్చియు వాని నెక్కియున్
దినఁ దగువానినిం దినియు ధీబలముం గొని సంచరించెడున్. 101

వ. నీవు నీపుణ్యంబునం జేసి నక్క కుక్క కాకి గ్రద్ధ పిల్లి యెలుక పాము లోనగు నీచయోనులం బుట్టక మనుష్యుండ వై బ్రాహ్మణుండ వై శ్రోత్రియుండ వై పుట్టితి విట్టిలాభంబున సంతుష్టుండ వై యుండం దగుదువు నన్నుం జూడుము నాశరీరంబున నీక్రిములు కుట్టి వేధించుచున్నయవి చేతులు లేనినేను వీని బాధం దొలఁగించుకొనం జాల కున్నదాన నిట్టినేను దీనికన్న నీచజన్మం బెత్త వలయునో యనుభయంబున నీదేహత్యాగంబు సేయ నొల్ల నైతి మీమనుష్యజాతి పరమోన్నత మైనది దానికిని సుఖదుఃఖంబులు గలవు గాని విజ్ఞాని యైనచోఁ దుఃఖంబు లేదు కామమోహితుం డగువాఁడు తాను ధనవంతుండు గా

నెంచుటయు నతండు రాజు గాఁ గోరుటయు నతండు దేవుండు గా నభిలషిం చుటయు నతం డింద్రుండు గా వాంఛించుటయు దుఃఖకారణంబులు నీ వింద్రత్వంబు వచ్చినను సంతసింపనివాఁడవు నీ కెంత కైన సంతృప్తి యొదవదు దురాశ యడంగదు తృష్ణ నీసొమ్ము తృష్ణ యగ్నికంటెం జెడ్డది యగ్ని జలంబులం జల్లారుఁ దృష్ణ ప్రియలాభంబునను శాంతింప దిట్టితృష్ణం ద్రెంపఁ గలవాఁడిహపరంబుల శ్రేయంబు లొందు నింద్రియంబులఁ బశులఁ బంజరంబునం బలె దేహంబున నిరోధించినచోఁ దృష్ణాదులు గలుగ నేరవు కొందఱు మనుష్యులు వధబంధపరిక్లేశంబులం బొంది కుందుచుందురు కొందఱు సంతసించుచుందురు కొందఱు బాహుబలదర్పితులు కొందఱు విద్యాబలగర్వితులు వారు పాపవృత్తినుపాసించువారై పారంబు నొంద కుందురు పుల్కసుం డైన గ్రుడ్డి యైనఁ గుంటి యైనఁ బశుహాతుం డైన నాత్మత్యాగంబు సేయుటకుం దలంపఁడు నీ వుత్తమోత్తమయోనిసంభూతుఁడవు నీకు సకలాంగంబులు సమగ్రంబులు నిరాతంకంబును నిరామయంబు నైనయీబ్రాహ్మణదేహంబు త్యజింపఁ బూనుట మాని వేదోక్తధర్మాచరణకార్యముం బురస్కరించుకొని నామాట విశ్వసించి నీయుద్యమంబునుండి విముఖుండవై యదికి స్వాధ్యాయ మగ్నిసంస్కారము నప్రమత్తుండవై పాలించుచు సత్యము దమము దానము యజనము యాజనము లోనగుసత్కర్మముల నిరతుండవు కమ్ము సత్కర్మాచరణంబున నుత్తమయోనియు దుష్కర్మాచరణంబున నధమయోనియుం గలుగు నేను వేదనిందకుండనై హేతువాదంబు సేయుచు నిరర్థక మైనయాన్వీక్షకీతర్కవిద్యయం దనురక్తుండనై నాస్తికుండనై యిట్లు సృగాలంబనై పుట్టితి నీవు నీయుత్తమజన్మంబు వితసేయకు మనినఁ గాశ్యపుండు వేదనాభరంబునకు నైఁచి లేచి జ్ఞానదృష్టిం జేసి యతని దేవేంద్రునిగా నెఱింగి పూజించి తదనుజ్ఞవడసి నిజాలయంబునకు నిర్గమించె ననిన విని మనంబున సంతసించుచుఁ గుంతీసుతాగ్రగణ్యుండు దానము యజ్ఞము తపము గురుశుశ్రూష యనునివి యెట్టిఫలంబు నొసంగు నానతీయ నర్థింతు ననిన నాపగానందనుం డిట్లనియె. 102

తపోయజ్ఞాదిసత్కర్మఫలనిర్వచనము.

ఆ. విను మధర్మయుక్తమును గలుషంబు నౌ మనము పాపకర్మమునఁ దగులొ్కనంగఁ జేసి మెలఁగునరుఁ డిహపరములఁ గృచ్ఛ్రములను బొందుఁ గేవలంబు.

ఆ. కలవుమీఁదఁ గలవు కష్టంబుపైఁ గష్ట మును భయంబు మీఁద ఘనభయంబు చావుమీఁదఁ జావు సమకులు తెలఁగునఁ బాపకారి బ్రదుకు బడలుపడును. 104

ఆ. ఉత్సవంబుమీఁద నుత్సవంబును బుణ్య, పదముమీఁదఁ బుణ్యపదము సుఖము
మీఁద సుఖము నొందు నాదృతిశుభకారి, యగుచు శ్రద్ధధానుఁడైనజనుఁడు.

ఆ. నాస్తికుండు వొందు హస్తిచోరవ్యాళ,దుర్గములను బొంది దుర్గతి కగు
నతిథిదేవపూజలాచరించువదాన్యుఁ,డుత్తమముల గతుల నొందు నధిప. 106

క. కలధాన్యములందుఁ బులా,కలు పక్షులయందుఁ బుత్తికలు వోలె మను
ష్యులలో ధర్మవిహీనులు, పొలుపఱి పోవుదురు వ్యర్థముగ భూమీశా. 107

క. తనచేసినకర్మము మను, జునిఁ బాయక నీడ వోలెఁ జుట్టినఁ జుట్టుం
జనినం జను లేచిన లే, చును బండినఁ బండు విడువఁ జూడక యెపుడున్. 108

సీ. ఎవఁ డెట్టికర్మము దవిలి చేయునొ తొల్లి,వాఁ డట్టిఫలమును బడయఁ గలుగుఁ
దనసంచితము ప్రయత్నము లేక నరుఁ డందుఁ, గాలములం జెట్లు గాచినట్లు
క్షయముదయంబునుసంమానమవమాన,మునులాభము నలాభమును సుఖంబు
కష్టము తొల్లింటికర్మమునన్ గర్భ,మునఁ బడినదిగోలెఁ బొందుచుండు

తే. నెట్టితఱి నెట్టియీడున నెట్టియొట్టి, చేఁత గావించి యుండెనో క్షితి మనుష్యుఁ
డట్టితఱి నట్టియీడున నట్టియట్టి, ఫలము నందు శుభం బశుభంబు నైన 109

క. తనతల్లి వేనవేలై, చనునావులమంద నున్నఁ జూడం గని దా
నిని నంట వచ్చు క్రేపన, మునుపటికర్మంబు జనుని ముట్టఁగ వచ్చున్. 110

క. చేలము నంటినమలినము, నీళులఁ బోఁ జేయునట్లు నియమవ్రతముల్
పోలంగఁ జేసి పాపము, దూలించి ఫలంబు గాంచుదురు తత్త్వజ్ఞుల్. 111

ఆ. ఆకసమునఁ బక్షు లంబువులన్ మీన,ములు చరింప జాడఁ దెలియ నట్లు
జ్ఞానవేత్త లయినమానిచంద్రులగతి, యిట్టి దనుచుఁ దెలియ దేరికైన. 112

క. ఈనింద లీపొగడ్తలు, నే నీకడఁ జేయ నేల నీమదికి వరం
బై నెఱి గల దని తోఁచెడి,దానిం గొని చేయు మార్యధర్మానుగతిన్. 113

వ. అనుటయుం ధర్మరాజు ససాగర గగన శైల వలాహ కాగ్ని భూ పవనం బగు
నీవిశ్వ మెవ్వఁ డెందులకు సృష్టించెఁ బ్రళయంబున నది యెవ్వానిం బొందు
భూతంబు లెట్లు సృజింపం బడియె వర్ణవిభాగం బెట్టిది వానిశౌచాశౌచంబులు
ధర్మాధర్మంబు లెట్టివి జంతువులు జీవించుటయుఁ జచ్చుటయు నెట్టివి మృతుం
డై యీలోకంబు విడిచినజనుం డేలోకంబు నొందు నానతి మ్మనిన దేవ
వ్రతుండు తొల్లి కైలాసశిఖరంబున నాసీనుండై యున్న భృగుమహర్షిం గాంచి
భరద్వాజుండు నీవు న న్నడిగిన ట్లడిగిన నతం డతని కి ట్లనియె. 114

భీష్ముఁడు పృథివ్యాదిభూతోత్పత్తిక్రమంబు చెప్పుట.

సీ. ఆదినారాయణుం డవ్యయుండు ననంతుఁ, డై భూతసృష్టి చేయంగ నెంచి
యవ్యక్తమానసాఖ్యల నొప్పునొక్కని, గల్పించెఁ దనయంశకమునఁ జేసి
యతఁ డజరామరుం డాద్యంతరహితుఁ డా, తనివలనన్ మహత్తత్త్వ మయ్యె
నతఁడు తేజోమయంబగు నొక్కపద్మము, కల్పించె నద్దివ్యకంజమందు

తే. నలువ జన్మించి యాకాశ మలరఁ జేసె, నందు జలమయ్యె జలముల ననల మనిల
మలరె వానిసంయోగమువలనఁ బృథివి, వెలసె నీరీతి నేర్పడె విశ్వసృష్టి. 115

వ. అట్లు పుట్టి వేదమయుం డై యహంకారుండు నాఁబడు బ్రహ్మకు శైలంబు లస్థులు మేదిని మేదోమాంసంబులు సముద్రంబులు రుధిరం బాకాశం బుదరంబు పవనంబు నిశ్వాసంబు వహ్ని తేజంబు నిమ్నగలు నాడులు చంద్రసూర్యులు నేత్రంబులు నభంబు శీర్షంబు పాతాళంబు పాదంబులు దిక్కులు భుజంబు లిట్లు దుర్విజ్ఞేయుం డనంతరూపుం డగునతం డే విష్ణుం డన విశ్రుతుం డై సర్వభూతాత్ముండు సర్వభూతప్రభవుం డయ్యె ననిన భరద్వాజుండు గగనాదిభూతంబుల ప్రమాణంబులు చెప్పు మనిన భృగుం డవి యనంతంబులు దేవతల కయినం గొలఁది వెట్ట రాని వందు న్యూనాధికవిచారంబును నిరవధికం బాకాశంబు సిద్ధదైవతసేవితంబు చంద్రాదిత్యకాంతు లందుఁ గ్రిందుమీఁదులు వ్యాపించి యుండు దేవతలు స్వయం దీప్తులై యుందురు దానిపరిమితి నెవ్వరు నెఱుంగరు పృథివ్యంతమున సముద్రము తదంతమునఁ దమమ్ము తదంతమ్మున జలమ్ము తదంతమున నగ్ని రసాతలాంతమున సలిలము తదంతమున నాకాశమి ట్లుండునాకాశముం బోలి యగ్నిమారుతాదు లపరిచ్ఛిన్నంబు లగమ్యంబు లతిదురవగాహంబులు మఱియు ననంతుం డై నవిష్ణుండు మాననీయుం డతం డణువుకన్న నణువు మహత్తుకన్న మహత్తు నగు నతని నెఱుంగ నెవ్వారికిని శక్యంబు గా దమ్మహామూర్తివలనఁ బుష్కరంబునుండి పుట్టినబ్రహ్మదేవుండు ననంతుం డయ్యె ననిన భరద్వాజుండు. 116

ఆ. పుష్కరంబునుండి పుట్టె సురజ్యేష్ఠుఁ, డనిన నతనికంటె నల్లపుష్క
రమ్ము జ్యేష్ఠ మనఁగ రాదె బ్రహ్మను జ్యేష్ఠుఁ, డనుట యెట్టిదెఱుఁగనాన తిమ్ము.

వ. అనిన నతం డి ట్లనియె. 118

ఆ. మనసువలన నైన వనజసంభవునకు, ధాత్రి పద్మ మయ్యె దానిమేరు
వందుఁ గూరుచుండి యఖిలలోకంబులు, సృష్టి చేసె ననుచుఁ జెప్ప నొప్పు. 119

తే. అనుటయుఁ భరద్వాజుఁ డి ట్లనియె మేరు
మధ్యగతుఁ డైనబ్రహ్మ యేమాడ్కిఁ దాఁ బ్ర
జావిసర్గ మొనర్చెఁ దత్సరణి యెల్ల
నెఱుఁగఁ జెప్పు మనఁ భృగు విట్టు లనియె. 120

ఉ. మానసుఁ డైనబ్రహ్మ తనమానసమందుఁ బ్రజావిసర్గముం
జానుగఁ జేసి రక్షణము సల్పఁగ నెంచియు భూతకోటికిం
బ్రాణ మొసంగి ప్రోచుటకు నైనజలంబుల సృష్టి చేసె మున్
వానిఁ బరిత్యజించిన వినాశన మొందెడు నెల్లప్రాణులున్. 121

క. అవి యెల్లకడల నిండెన్, భువియును భూధ్రములు మేఘములు సర్వము మౌ
నివరేణ్య! వారుణం బని, సవిమర్శముగా నెఱుంగఁ జను నెవ్వరికిన్. 122

వ. అనిన భరద్వాజుండు జలంబులును దక్కినభూతంబులు నెట్లు సృష్టింపం బడియెఁ
జెప్పు మనిన భృగుమహర్షి యి ట్లనియె. 123

సీ. మును బ్రహ్మకల్పమునను ఘనుల్ బ్రహ్మర్షు, లేకస్థులై లోక మెట్లు పుట్టె
ననెడుసందేహము జనియింప వారు ధ్యా,నించిరి నూఱేండ్లు నిష్ఠ నిలిచి
వెనుక నభస్స్థలముననుండి వారల, దెస వినం జనుదెంచె దివ్యవాణి
ము న్నచలోపమమును నష్టచంద్రార్క,పవన మాకాశము పరిధవిల్లె
ఆ. నంత సలిల ముదయ మయ్యె నవ్వలఁ దమం,బలరె సలిలపీడవలన వాయు
వగుచు నబ్ధితలము వగులించి శబ్దము,తోడ నాకసమున నాడఁ జొచ్చె 124

క. అనిలాంబుఘర్షణంబున,ననలము ప్రాదుర్భవించి యాకసమందున్
ఘనతిమిర మెల్ల నడఁచెఁ బ,వనుసఖ్యముకలిమిఁ గడుఁ బ్రవర్ధన మగుచున్.

మ. జలవాయ్వగ్నిసమాగమంబున సమస్తప్రాణి కాధార మై
విలసద్గంధరసాత్మకం బగుచు నావిర్భూత మై భూతలం
బలరన్ సర్వపదార్థముం గనెడుతావై యొప్పె నంచు న్మదిం
దెలియం జెల్లు నటంచుఁ దోఁచె నెదుటన్ దివ్యోక్తి సువ్యక్త మై. 126

వ. అని చెప్పిన భరద్వాజుండు బ్రహ్మనిర్మితంబు లనేకసహస్రంబులు భూతంబులు
భువనంబుల నావరించియుండ మహాభూతంబు లయి దనుట యెట్లు చెప్పు మను
గ్రహింపు మనిన భృగుం డి ట్లనియె. 127

తే. గాలి చేష్టాస్వరూప మాకసము శబ్ద,మనల మూష్మము ద్రవము జీవనము పృథివి
కఠినరూపము వాన విగ్రహము పాంచ,భౌతికం బయి చూపట్టుఁ బరమపురుష.

వ. ఇట్లీపంచభూతంబులచే స్థావరజంగమంబు సర్వంబు సముత్పన్నంబు శ్రోత్రము ఘ్రాణము రసము స్పర్శము దృష్టి యివి యింద్రియసంజ్ఞికంబు లనిన భరద్వాజుండు. 129

సీ. పంచభూతములతోఁబరఁగు నేనియు స్థావ,రములుజంగమములో విమలహృదయ
స్థావరంబుల మేన ధాతువు లీరైదు,గనుపట్ట వనుట నిక్కంబు గాదె
చెట్ల కూష్మంబును జేష్టయు నుండదు,కాఠిన్య మదిమాత్ర గలిగియుండుఁ
గనవు వినవు స్పర్శము నెఱుంగఁ జాలవు,రసగంధ వేదిత పొసఁగ దెట్లు

తే. పాంచభౌతికములు నాఁగఁబలుకఁ బడునొ
ద్రవము నగ్నియు భూమి స్పర్శనము నభము
గలుగమిం జెట్ల భౌతిక మలరఁ బోవ
దని తలంచెద నన భృగుం డనియె నిట్లు. 130

సీ. కాదు నీ వనినట్లు ఘనవృక్షములకు నా,కాశాదిశక్తులు గలవు వినుము
పుష్పఫలవ్యక్తి భూజంబులం బొలు,పొందు నుష్మంబునఁ బూలు పండ్లు
పర్ణముల్ త్వక్కును వాడు శీర్ణం బగుఁ,గాన స్పర్శజ్ఞాన మౌ ననఁ దగు
నశనినిర్ఘోషము నగ్నివాయ్వాదులఁ,బూలును బండ్లును రాలుకతన

తే. శబ్దముఁ గని వినియెడుశక్తి త్వగ్బీజములకుఁ,దీవ వృక్షముఁ బెన వేయుఁ దెఱపి తెలిసి
ప్రాఁకు నందునదృక్శక్తిపరఁగు ననుచుఁ, దెలిసికొనవచ్చుఁ దెలుపక సులభముగను.

ఆ. పుణ్యగంధధూపములవిశేషంబున,రుజలు వోవ భూమిరుహము లెల్ల
మొగ్గ దొడిగి విరియఁ బూచుఁ గావున వాని,కలరు ఘ్రాణశక్తి యని తెలియుము.

సీ. వ్రేళ్లలం ద్రావిననీళ్లను వ్యాధియుఁ,దత్ప్రతిక్రియయును దనరుచుండు
మఱియు నుత్పలనాళమహితవక్త్రంబునఁ,బై జలంబు గ్రహించు బాదపంబు
గాన రసనశక్తి గలదు సంచ్ఛిన్నమై,మొలక లెత్తును దుఃఖమును సుఖంబు
తెలియ వచ్చును వృక్షములకుఁ జైతన్యము,లే దనియెడువాఁడు వేదు రగును

తే. మొక కాహారపరిణామమునను సౌమ్య,లతయు ముదిమియుఁజూపట్టు సతముపంచ
ధాతువులు వొల్చు జంగమతనువులందు,వలెను వేర్వేఱు గానుండ కలరుఁగలసి.

వ. జంగమశరీరంబునఁ ద్వఙ్మాంసాస్థిమజ్జాస్నాయువులును శ్రోత్రఘ్రాణాస్యహృదయకోష్ఠంబులును శ్లేష్మపిత్తస్వేదవసాశోణితములు నైదువిధంబులు ప్రాణాపానవ్యానోదానసమానంబు లని వాయువు లైదువిధంబులు హృదయాది స్థానంబు లావరించి యుండుఁ బృథివ్యప్తేజోవాయ్వాకాశంబు లైదు భూతం

బులు వానికిం గ్రమంబున గంధరసరూపస్పర్శశబ్దంబులు గుణంబులు జనుండు భూమివలన గంధంబును జలంబువలన రసంబును దేజంబువలన రూపంబును వాయువువలన స్పర్శంబును నాకాశంబువలన శబ్దంబు నెఱుంగుచుండుఁ బార్థివం బైనగంధ మిష్టానిష్టమధురకటునిర్హారిసంహతస్నిగ్ధరూక్షవిశదంబులు నా నవవిధంబు మధురలవణతిక్తకషాయామ్లకటుభేదంబుల వారిమయం బగురసంబు షడ్విధంబు జ్యోతిస్స్వరూపంబులం దెలియురూపంబు హ్రస్వ దీర్ఘాణు స్థూల చతురశ్ర వృత్త శుక్ల కృష్ణ రక్త నీల పీతారుణ కఠిన చిక్కణ శ్లక్ష్ణ పిచ్ఛిల మృదు దారుణములు నాఁ బదియాఱువిధంబులు వాయవ్యగుణం బయినస్పర్శ ముష్ణ శీతసుఖదుఃఖ స్నిగ్ధవిశదఖరమృదు రూక్షలఘుగురు భేదంబుల నేకాదశ గుణం బాకాశగుణం బైనశబ్దంబు షడ్జఋషభగాంధారమధ్యమధైవతపంచమ నిషాదభేదంబులసప్తవిధంబు మృదంగవేణువీణాదుల విదితం బగు నిట్లు భూతపంచకసంభృతం బయినశరీరంబున జలాగ్నిమారుతంబులు ప్రధానంబు లై ప్రాణంబుల నాశ్రయించి యుండు ననిన భరద్వాజుండు పార్థివం బయిన ధాతువు నాశ్రయించిశారీరంబు లగునగ్నియు వాయువు నెట్లు దాని నే యవకాశవిశేషంబునఁ బ్రవర్తిల్లఁ జేయుచుండునో చెప్పు మనిన భృగువో భరద్వాజా! తద్గతులెఱింగించెద విను మని యి ట్లనియె. 134

### ప్రాణాదివాయుప్రచారలక్షణము.

సీ. బలవంత మగుచు నేపగిది వాయువు దేహ, ములను వేష్టించి పెంపలరుచుండు
నాపగిదిన్ మూర్ధ మాశ్రయించియు నగ్ని, పాలించుచుండెడు వర్ష్మ మెల్లఁ
బ్రాణవాయువు మూర్ధమం దగ్నిఁ గూడి వి, ఖ్యాతిమై వర్తించు నదియె సర్వ
భూతాత్ముఁ డైనసనాతనపురుషుఁ డ, య్యదియె మనంబు నయ్యదియె బుద్ధి
తే. యద్దియే యహంకారము నదియె పంచ, భూతములు నివ్విధంబునఁ బొలుచుప్రాణ
వాయువే ప్రాణికోటులకాయమెల్ల, దాన యై పరిపాలించు మానినాథ. 135

మ. అది పృష్ఠంబుననుండి నాభి నిలయం బయ్యున్ సమప్రస్థితిన్
విదితం బైనగతిన్ సమాన మననై వెల్గొందుచున్ వహ్ని తన్
గరిమం గైకొని వస్తిమూలగుద మంతం దాల్చి విణ్మూత్రముల్
పొదలున్ వాయు వపాననామమున నెప్డున్ జంతుదేహంబులన్. 136

క. బలముం గర్మము యత్నము, గలిగించుచుఁ గంఠదేశగత మగుగాలిన్
దెలియు ముదానం బని సం, ధుల నెల్లెడఁ దిరుగు నది చనున్ వ్యాన మనన్.

ఉ. ధాతువులందు వ్యాపకత దాల్చినవహ్ని సమానవాయుసం

పాతసమీరితం బయినప్రస్ఫుటశక్తిగతిన్ రసంబులన్
ధాతువులం బ్రదోషములఁ దాఁకి ప్రవర్తిలఁ జేసి వస్తుసం
పాతము పక్వమున్ సలుపుఁ బ్రాణ మపానముఁ దన్ను రేఁచఁగన్. 138

సీ. వదనంబు మొదలుగాఁ బాయువు వఱకు స్రోతోమార్గ మగు దానితుద గుదంబు
నాఁబడు నట నుండి నాళము లన్నియుఁ, బ్రభవించి వ్యాపించు వర్ష్మ మెల్ల
నానాడు లొండొండు ప్రాణసంబంధము, వలన సంబంధము గలిగి యుండు
మేన సూక్ష్మమె వహ్ని నా నొప్పి యాహార, పచనం బొనర్చెడుఁ బ్రతిపదమున
తే. నగ్ని వేగవహం బగుప్రాణము గుద,తలముతుదఁ బ్రతిహత మయి తరలిమీఁది
కగ్ని మఱియునుత్క్షేపించునట్టిదగున, టంచునెఱుగంగవలయునోయమలమూర్తి.
తే. అరయ నాభికిఁ గ్రిందఁ బక్వాశయంబు, పయిన నామాశయంబును బరఁగునాభి
మధ్యమునఁ నెల్లప్రాణముల్ మలయుచుండి, హృదయమున నుండినల్గడ నేగుచుండు.
తే. ప్రాణదశకచోదితములై పరఁగునాడు, లన్నరసము వహించు నాయాసమునకు
నోర్చిమూర్ధమునం దాత్మ నుంచిపరమ,పదమరయఁగోరు యోగుల కిదియె పథము.
వ. ఇట్లు ప్రాణులసర్వప్రాణంబులందు నెల్లప్పుడు నాత్మ స్థాలీనిహితం బగునగ్నివలెం
బ్రకాశించుచుండు ననిన భరద్వాజుండు. 142

సీ. వాయువే జీవింపఁ జేయునదియును వి,చేష్టించునదియు శ్వసించునదియు
భాషించునది యని పలుకనై యుండెడు, నన్న జీవుండు నిరర్థకుండ
యాగ్నేయమే యూష్మ మగు నేని యది పచిం,పఁగ నఱిగింపఁగా నగున యేని
జీవప్రయోజన మేవగ నయ్యెడు, జంతువు నశియించు నంతలోనె
ఆ. జీవుఁ డరయ రాడు పోవు వాయువు మేను, విడిచి యూష్మశక్తి పోడవడంగు
నీవిధం బెసంగుఁ గావున జీవశ,క్తికిఁ బ్రయోజనంబు తెలియ నగునె. 143

ఉ. వాయుమయుండు జీవుఁ డన వాయువుతోడన కూడి యుండు నా
వాయువు మండలంబువలె వ్రాలి కనుంగవఁ గాన నయ్యెడున్
వాయువుతో నజస్రమును వర్తిలుచుండఁగ నయ్యెడు న్మహా
వాయువుతోడ నాతఁడు నవశ్యముగా నశియింప నయ్యెడున్. 144

తే. సాగరవిముక్తమై కూపసలిలములను, గలియఁ బోయినభాజనసలిల మట్లు
వహ్నిఁ గలసినదీపమువలెను గాలిఁ,గలసి యదిపోవఁ దాఁబోవుఁగాదె ప్రాణి.
సీ. పంచభూతంబులసంచయమే జీవి,త మన నం దొకఁడు వోఁ దాను వోవు
వారి నశించు నాధారశూన్యం బయి, గాలి యుచ్ఛ్వాసనిగ్రహమునఁ జెడు

నాకసంబు నశించు నన్నాదికోష్ఠభేదమున నగ్నియభోజనమున మాయుఁ
బుడమి రోగక్లేశములశీర్ణ మగు వీని,యం దేయొకఁడు దెగ నన్నియుఁ దెగు

తే. నట్టిసంఘాతము నశించినపుడు జీవుఁ, డేసమాశ్రయమున నుండునేమిరెట్లు
తెలిసికొనినట్టివాఁ డగుఃబలుకు నెట్లు,వినెడువాఁడగునెట్లునివ్వేఱఁగుపాడము.

మ. పరలోకంబున నున్న నన్నిది తరింపం జేయునం చెంచి యే
పురుషుం డొక్కని కావునిచ్చి మరణంబుం బొందినన్ గోవ దే
కరణిన్ వానిఁ దరింపఁ జేయఁ గలదో కాలంబునం గూలి పో
దురు గోదాతృప్రతిగ్రహీత లెటు లొందుర్ వారికిం బొందికల్. 147

క. మృగపక్షిభక్షితుండున్, నగాగ్రపతితుండును జ్వలనమునం దగ్ధుం
డగుచు నశించినజీవుఁడు, మొగి వెండియుఁ బ్రదుకు టెట్లు మునికులనాథా.

వ. విచ్ఛిన్నతరుమూలము వెండియు నంకురింప నట్లు పోయినజీవుండు వెండియు జీవింపఁడు తరుబీజంబులు మఱియు నంకురించుఁ గాని మృతుండు వెండియుం బ్రదికిరాఁ బోఁడు గావున మృతులు మృతులే యనియు బీజంబునుండి బీజంబు మాత్ర మంకురించు ననియు నాయభిప్రాయ మనిన భృగుం డి ట్లనియె. 149

ఉ. జీవుని కెడ్డు నాశనము చెప్పఁగ రా దిఁక దానముఖ్యముల్
జీవు లొనర్చుకర్మములు చేటును బొంద వుపాధి శీర్ణ మై
పోవునయేని ప్రాణి చెడిపోక మఱొక్కయుపాధి నొందెడుం
బావకుఁ డింధనంబు లవి భస్మము లైన నశింప నట్లు గన్. 150

వ. అనిన భరద్వాజుండు. 151

తే. అనలునకుఁ బోలె జీవునకును వినాశ,నమ్ము లే దంటి వౌ నింధనమ్ము లైన
నగ్ని గనరాదు నశియించు నందు నిందు,గతి ప్రమాణము స్థానము గాన రాదు.

వ. అనుడు భృగుండు వెండియు. 153

చ. సమిధలు చెల్లినంతన ప్రశాంతము నొందెఁ గృశానుఁ డంట య
క్రమ మతఁ డాకసంబున నిరాశ్రయుఁ డై కనరాక యుండు నా
క్రమమున జీవుఁడున్ దనువు రాలినపిమ్మట నాకసంబు నా
నమరి సుసూక్ష్మరూపమున నారయ రాఁడు నిరాశ్రయంబునన్. 154

సీ. ప్రాణంబుల ధరించునగ్ని యే జీవుఁడు,నాఁబడు వాయుసంధారణాగ్ని
యాత్మము జీవత్వ ముచ్ఛ్వాసనిగ్రహ,మున నశించెడు నెప్పుడును నశింపఁ
బోవఁడు జీవుండు జీవత్వ మది నశిం,చిన నచేతన మయి తనువు చెడును

చెడి వానికయన మౌక్షితిఁ గలియుం జంగ,మస్థావరముల కీమాడ్కియె యగుఁ

తే. దనువు వో వాయు వాకాశమునకుఁ బోవు
వహ్ని యనుగమించెడు దాని వాయువు నివి
మూఁడు నేకమ్ము గావున భూతలమున
సుప్రతిష్ఠితము లగుచు సొంపు మిగులు. 155

తే. ఎచట నాకాశ మట వాయు వెచట వాయు
వచట నగ్నియు నుండు నయ్యవి యమూర్త
ములు జలంబును భూమియు మూర్తిమంత
ములు సువిజ్ఞేయములు శరీరులకు నెపుడు. 156

వ. అనిన విని భరద్వాజుండు భృగుమహర్షిం గాంచి ప్రాణులందుఁ బృథివ్యప్తేజోవాయ్వాకాశములు గల వందు జీవలక్షణం బెట్టిది కర్మేంద్రియపంచకంబును జ్ఞానేంద్రియపంచకంబునుం గలిగి పంచభూతాత్మకం బగుశరీరంబున జీవుఁ డెట్లుండు నో యెఱుంగ నెంచితి మాంసాస్థిశోణితమేదస్స్నాయుసంఘాతం బగుదేహంబు భేదించి చూచిన జీవుండు కానరాకుండుఁ బంచభూతసమన్వితం బగుశరీరంబ జీవం బగునపుడు శారీరమానసదుఃఖంబు లనుభవించువాఁ డెవ్వఁడు మఱియు మనస్సు వ్యగ్రం బై యున్నయప్పుడు జీవుండు చెవులతోఁ జెప్పినదానిని వినియు విననివాఁడును మనోదృష్టి దృశ్యముఁ జూడఁ గలవాఁ డయ్యు నపుడు కంటం జూచియుఁ జూడనివాఁడు నగుచున్నాఁడు నిద్రావశ గతుం డై చూడఁడు వినఁడు పలుకఁడు మూర్కొనఁడు స్పృశింపఁ డిట్టిచో హర్షించువాఁడు కోపించువాఁడు దుఃఖించువాఁడు నుద్వేగించువాఁడు నెవ్వఁడు ధ్యానేచ్ఛాద్వేషభాషణమునకుఁ గర్త యెవ్వఁ డెఱింగింపు మనిన భృగుం డి ట్లనియె. 157

సీ. ఈతనువునఁ బంచభూతసాధారణ, మగుమది తక్క లే దన్య మెదియు
నాతను వొక్కఁ డౌనంతరాత్మ వహించు,శబ్దగంధధ్వనిస్పర్శరూప
ములు మొదలగుగుణంబుల నెల్ల నయ్యంత,రాత్మయే తెలిసెడునట్టి దగుచుఁ
బంచాత్మకమునందుఁ బంచగుణంబుల,నరయుచు సకలావయవములందు

తే. సర్వగాత్రానుగత మయి పర్వి సతము
వివిధసుఖదుఃఖముల నైన విధము లెల్లఁ
దెల్లఁగ నెఱుంగుచుండుఁ దద్విప్రయోగ
మున నొడ లెఱుంగలే దింతయును నిజంబు. 158

క. రూపస్పర్శోష్మంబులు, చూపట్టక యెప్పుడు లోనిశోచిష్కేశుం
డేపఱి పోయెడు నవు డోడ, లే పోవును గాని యాత్మ యిది పో దెపుడున్.

సీ. ఆపోమయము సర్వ మాపమే దేహుల, కిగుమూర్తియం దుండు నాత్మ మాన
సబ్రహ్మ మది భూతసంఘమున్ సృష్టించు, నాత్మ ప్రాకృతగుణప్రాంచిత మయి
క్షేత్రజ్ఞుఁ డని తద్విశేషవిరహితుఁడై, పరమాత్మ యనియును బలుకఁ బడును
నయ్యాత్మ నారయ మఖిలలోకహితాత్మ,క మ్మని యందుఁ బుష్కరమునందు
తే. వారిబిందువువలెనుండు వానిలోక, హితుని క్షేత్రజ్ఞునిత్యుఁగా నెఱుఁగవలయుఁ
దమము రజమునుసత్త్వముం దలఁపజీవ, గుణములుస చేతనము జీవగుణమటండ్రు.
తే. అదియె చేష్టించుఁ జేష్టించునట్లు చేయు, సకలమును దద్విభిన్నమై సప్తభువన
ములఁబ్రవర్తింపఁ జేయుచునలరుదాని,నండ్రుపరమాత్మ యనివేత్తలయినవారు.

ఉ. జీవవినాశనం బనఁగఁ జెల్లదు దేహవిభేదమందు మి
థ్యావచనంబుగా మరణ మం డ్రవివేకులు మిత్తి యన్న నా
జీవుఁడు మాఱుదేహమునఁ జేరుటయే యని యెంచు మిట్లె యా
జీవుఁడు సర్వభూతములఁ జేరి నిగూఢముగాఁ జరించెడిన్. 162

ఉ. వానిని దత్త్వ వేత్త లగువారు గ్రహింతురు సూక్ష్మబుద్ధిచే
మానులు రేమొదల్ తుదలు మానసశుద్ధి లఘూపహారముం
గా నొనరించి యోగమును గర్మఫలం బెడఁ గోర కాత్మ నా
త్మానిశదర్శనంబున సుఖానుభవంబున సంతసింత్రెదన్. 163

## వర్ణాశ్రమాచారక్రమము.

క. కావునఁ గాయములందున్, దావల మగుమానసాగ్ని తలపోయంగన్
జీవుఁ డని తెలియఁబడియెడు, నేవంవిధ మజునిభూతసృష్టివిధంబున్. 164

సీ. అనుడు భృగుం డను నాచార్య! మును బ్రహ్మ, బ్రాహ్మణులం బ్రజాపతులు గాఁగ
సృష్టించె వా రగ్నిచిత్రభానుప్రభుల్, బ్రహ్మతేజస్కులై పరఁగి రంత
సత్యము ధర్మ మాచారము తపమును, శౌచమున్ వేదము స్వర్గసాధ
నములు గా సృజియించెఁ గ్రమమున దేవదా,నవులును దైత్యగంధర్వయక్ష
తే. రాక్షసాసురులును మహోరగపిశాచ,ములును నాగులు మనుజులు గలిగి రందు
బ్రాహ్మణక్షత్రవైశ్యశూద్రప్రముఖుల, సలిపి భూతతతికి వర్ణములు పొసఁగె.
వ. అందు బ్రాహ్మణులకు సత్త్వగుణం బను శ్వేతవర్ణంబును క్షత్రియులకు రజో
గుణం బను లోహితవర్ణంబును వైశ్యులకు రజోమిశ్రితతమోగుణం బను పీత-

వర్ణంబును శూద్రులకుఁ దమోగుణం బునునసితవర్ణంబును గావించె ననిన విని భరద్వాజుండు. 166

శా. చాతుర్వర్ణ్యము నిట్లు వర్ణములచేఁ జర్చింతు మేని సంకరం
పీతత్వంబున నెల్లవర్ణములకున్ మేరాళమాఁ గామమున్
భీతిక్రోధమదక్షుధాశ్రమములున్ జింతాదులుం జిత్తమున్
వాతశ్లేష్మపురీషమూత్రము లగున్ వర్ణప్రభేదం బెటో. 167

వ. మఱియు జంగమస్థావరంబుల జాతు లసంఖ్యేయంబులు వివిధవర్ణంబు లగు వారికి వర్ణవినిశ్చయం బె ట్లనిన భృగు వి ట్లనియె. 168

సీ. వర్ణవిశేషంబు వఱలదు విను జగం,బెల్ల బ్రాహ్మం బని యెఱుఁగుము మును
బ్రహ్మసృష్టం బగుప్రజ యెల్లఁ గర్మవ,శమున వర్ణత్వము సమరఁ గొనియెఁ
గామభోగక్రియల్ కఠినస్వభావులు, త్యక్తస్వధర్ము లత్యంతసాహ
సికులు రజోగుణస్థితు లగుద్విజులు క్ష,త్రియు లైరి గోరక్షకృషియుఁ గలిగి

తే. ధర్మ మెడల రజస్తమోదర్శితులయి, ద్విజులువిశులై రిహింస యప్రియమునసృత
మునుగలిగి ధర్మశౌచములనువిడిచిన, ద్విజులుతమమున శూద్రులై తేలిరపుడు.

చ. తమతమధర్మకర్మముల దానిని బ్రాహ్మణు లిట్లు వర్ణభే
దము గల రైరి వారలకు ధర్మము యాగము నిత్యము న్నిషి
ద్ధము లన రాదు బ్రహ్మవిహితం బయి వేదము తొల్లి నాల్గువ
ర్ణములకుఁ జెల్లు లోభకరణంబున వా రనభిజ్ఞు లై రిలన్. 170

సీ. వేదముం జదివియు వేదతంత్రస్థు లై, నియమవ్రతంబుల నిలిచి జపము
తపము నొనర్చు చుత్తమసృష్టి వేదమే, యనువారు బ్రాహ్మణు లందు నాల్గు
జాతులే కాక పిశాచరక్షఃప్రేత, ముఖ్యనానావిధంబు లగుమ్లేచ్ఛ
జాతులు పొడమి నష్టజ్ఞానవిజ్ఞాన,ము లయి స్వేచ్ఛాచారములను మెలఁగె

తే. బ్రహ్మసంస్కారులు స్వకర్మపరులునైన,ప్రజలఁ బ్రాచీనులగుబుషిప్రవరులుతమ
దివ్యతపమున సృష్టించి తేజు మెఱయ, సలిపి రెంతయు ధర్మసంస్థాపనముగ.

వ. ఆదిదేవసముద్భూతము బ్రహ్మమూలము నక్షయము నవ్యయము నగు నామానససృష్టి ధర్మతంత్రపరాయణం బనిన భరద్వాజుండు బ్రహ్మక్షత్రియ వైశ్యశూద్రధర్మము లెట్లు ప్రవర్తిల్లుం జెప్పు మనిన భృగువు వెండియు. 172

తే. జాతకర్మాదిసంస్కారసంస్కృతుండు
శుచియు నాచారసహితుండు శ్రుతిరతుండు

నిత్యషట్కర్మనిరతుండు సత్యపరుఁడు
ప్రతియు విఘసాసి గురుభక్తుఁ డతఁడు ద్విజుఁడు. 173

క. తపమును దానము సత్యము, జప మద్రోహంబు నానృశంస్యము దయయుఁ
ద్రప యక్రౌర్య మహింసయు, నెపుడుం బొలుపొందు బ్రాహ్మణేద్ధగుణము లై.

క. యాగము వేదాధ్యయనము, చాగ మ్మాదాననిరతి క్షత్రజకర్మా
వేగము క్షత్రియధర్మము,లై గణుతింపంగ నొప్పు నఖిలజగములన్. 175

క. ఆదానరతియు గోర,క్షాధృతియుం గృషియు బేరమం దిష్టంబున్
వేదాధ్యయనము శౌచము, నాదటఁ గొనువాఁడు వైశ్యుఁ డని నుడి కెక్కున్.

క. ఆచారవిహీనుం డై, శౌచము నా నెఱుఁగ కెపుడు సకలాన్నములున్
వాచవి చేయుచు శ్రుతిహీ,నాచారుం డైన శూద్రుఁ డనఁ బడు ననఘా.

సీ. విను సత్యదానాదు లనునీగుణంబులు, శూద్రునం దైన సచ్ఛూద్రుఁ డతఁడు
బ్రాహ్మణునందుఁ జూపట్టకుండిన వాఁడు, బ్రాహ్మణుం డయ్యు నబ్రాహ్మణుండు
లోభముక్రోధ మెట్లో వీడి యాత్మసం,యమ మొనర్చుట యుత్తమ మగుజ్ఞాన
మన నొ నెపుడు క్రోధమున నుండి లక్ష్మి మ,త్సరమునుండి తపంబుసాఁకికొనుచు

తే. మానమవమాన మను రెండుమార్గగతుల,వలనవిద్యఁ బ్రమాదమువలనఁదనదు
మేనురక్షించుకొనుచుండ నొనటంచు, శాస్త్రవిద్వర్యులువచింత్రుసంయమీంద్ర.

క. ఎవనిసమారంభము ల,య్యవి యాశాబంధయుతము లై చొప్పడవో
యెవనివిసర్జన మది హుత,మవు నాతఁడు ప్రజ్ఞ గలుగుత్యాగి యనఁబడున్.

ఆ. భూతహింస లేక ప్రీతిఁ జూపుచుఁ బరి,గ్రహము మాని బుద్ధికలిమి నింద్రి
యముల గెల్చి యిందు నం దభయమును న,శోక మైనపదముఁ జేకొన నగు.

సీ. దానమ్ము దపమును మాన మాత్మవినిగ్ర,హము గల్గి సంగము లవులఁ బెట్టి
విజితేంద్రియుం డయి విప్రుఁ డెసంగ నొ,నింద్రియగ్రాహ్య మై యెసగెడునది
వ్యక్త మతీంద్రియ మై శాస్త్రదృష్ట మా, నయ్యది యవ్యక్త మనఁగ నొప్పు
మన మకర్తవ్యములను గాక కర్తవ్య,ముల నిల్పి మతిఁ బ్రాణములను గట్టి

తే. బ్రహ్మమునయందుఁబ్రాణముపరఁగఁజేసి,బ్రాహ్మణుండువిముక్తుఁడై బ్రహ్మసుఖముఁ
బొందుశౌచమాచారముభూతదయయు, ముఖ్యలక్షణములువిప్రపుంగవులకు.

క. సత్యమె బ్రహ్మపదంబున్, సత్యమె సత్తపము ప్రజల సత్యమె చేయున్
సత్యమె లోకము నిలుపున్, సత్యమె స్వర్గం బొసంగఁ జాలెడు నదియున్.

క. అనృతము తమస్స్వరూపం, బనృతమునన్ నరకకూపమందుం బడి భూ

జనుఁడు తమోవృతుఁ డగుచుం, గనుఁగొనఁ జాలండుసుప్రకాశము నెపుడున్.

వ. సత్యము ప్రకాశ మనియు నసత్యము తమం బనియుఁ జెప్పుదురు సత్యాసత్య నిమిత్తం బగునయ్యుభయంబును భూచరు లొందుచుందురు. దీనం జేసి ధర్మా ధర్మములు స్వర్గనరకములు సుఖదుఃఖములు మానవులకుం గలుగుచుండు సత్యమే ధర్మము ధర్మమే స్వర్గము స్వర్గమే సుఖ మిట్లనృతమే యధర్మ మధర్మమే నరకము నరకమే దుఃఖ మని తెలియం దగు నని మఱియును. 184

శా. శారీరంబులు మానసంబు లగుచున్ సంధిల్లుదుఃఖంబులన్
మేర న్మీఱినదుఃఖముం గుడువ నై మేటిల్లుసౌఖ్యంబులన్
దీరన్ విష్టపసృష్టి యం దెఱిఁగి హృద్వీథిన్ గతభ్రాంతు లై
ధీరుల్ దుఃఖవిముక్తికిం జతన మర్థిం జేయుచుం డ్రెంతయున్. 185

తే. ప్రాణికోటికి సుఖమనిత్యంబిహపరములఁ దమోగ్రస్తుఁడగుచంద్రమునివెలుంగు
పొదలనట్లు తమోభూతభూతమునకు, సుఖము లే దని తెలియుము శుద్ధబుద్ధి.

సీ. సౌఖ్యము ద్వివిధము శారీరమును మానసము నని మనుజుకర్మము లిహపర
సుఖమునకే యగుం జూడఁ ద్రివర్గఫలము తద్విశిష్ట మై యమర దొక్కఁ
డది కామ్యగుణవిశేషాంచిత మయ్యు ధర్మార్థగుణారంభ మగుచునుండు
ననిన భరద్వాజుఁ డను సుఖమే పరమార్థ మనుడి నాకు ననభిమతము

తే. విను తపస్వుల కిది ప్రాప్యమనఁగ రాదు
వా రభిలషింప రిద్దాని ప్రభువు లోక
కర్త యగుబ్రహ్మదేవుఁ డేకాకియగుచుఁ
గామసుఖ మొల్లఁ డని చెప్పఁ గాదె శ్రుతులు. 187

వ. మఱియును. 188

క. కామము ననువర్తించెదు, కాముని విశ్వేశ్వరుండు కడ తేర్చెఁ గదే
కామము విశిష్టగుణ మని, యే మది సేయ న్మహాత్ము లిది యొల్ల రెదన్. 189

వ. కావున సుఖమ్ముకంటె వే ఱొండు లే దనియు ఫలోదయము ద్వివిధ మందు సుకృతంబున సుఖంబును దుష్కృతంబున దుఃఖంబు నగు నని నీవు చెప్పినది లోకప్రవాదం బనియును నామతం బనిన భృగుండు వెండియు నీయర్థంబున నించుక చెప్పెద వినుమని యి ట్లనియె. 190

సీ. అనృతంబువలనఁ బుట్టును దమోగుణము తమోగ్రస్తులగువారు మొగి నధర్మ
మాచరింతురు ధర్మ మాచరింపరు క్రోధ, లోభహింసాదులలో మునుంగు

వా రింద నందు లవము సౌఖ్య మొందరు,వ్యాధిపీడలు వధబంధనాది
బహువిధార్తులు క్షుత్పిపాసోపతాపముల్, వాతశీతాతపప్రతిభయములు
తే. మున్నుగా నగుశారీరములు సుదుఃఖ
ములును బ్రియబంధుధననాశములు వియోగ
కృతము లగుమానసికదుఃఖతతులు మఱియు
ముదిమి మృతి యనుదుఃఖముల్ పొందుచుంద్రు. 191
శా. ఎవ్వం డీద్వివిధార్తిదూరుఁ డగుచుఀ హెచ్చిల్లువాఁ డెప్పుడుఀ
ద్రెవ్వంబోనిసుఖంబునం దగులు నిం దేకాని స్వర్గంబునం
దెవ్వేళం గన మిట్టిదోషము లటఀ హేరాళసద్వాయువుల్
రివ్వల్ దేర సుగంధముఀ విసరు నోలిఀ సౌఖ్యముం గూర్చుచుఀ. 192
తే. జరయుఁబాపముక్షుత్పిపాసలును శ్రమము,స్వర్గమున లేవునిత్యముసౌఖ్యమయగు
నిట సుఖంబును దుఃఖము నెసఁగు నరక,మందు సంతతదుఃఖమే పొందఁగలుగు
చ. ధరణియె భూతజాలములఁ దత్పరతం గనుఁ దన్వ లట్టి రే
పురుషుఁ డగుం బ్రజాపతి సముం డట శుక్రమె దివ్యతేజ మీ
సరణి విధాత లోకము లెసంగఁగఁ జేయుచునుండు నీప్రజల్
నిరతముఁ బుట్టుచుండు రవనిఀ నిజకర్మఫలానుయాయులై. 194
వ. అని చెప్పిన భరద్వాజుండు సంతసించుచు సంయమీంద్రా! దానధర్మంబుల
కును దపస్స్వాధ్యాయయజ్ఞంబులకును ఫలం బెట్టిది చెప్పు మనిన భృగుం
డి ట్లనియె. 195
తే. యాగమునఁ బాపశాంతి స్వాధ్యాయమునను
బరమశాంతియు దానంబువలన భోగ
మును దపంబున స్వర్గము నొనరు ననుచు
బ్రహ్మమే వచియించు నీపగిది వింటె. 196
క. దానం బిహపరసుఖదం,బై నెగడుచు ద్వివిధ మయ్యె నది సజ్జనులం
దైనఁ బరం బితరులయం,దైన నిహం బొసఁగునట్టి దగు నని రార్యుల్. 197
వ. దానం బెట్టిదైన ఫలం బట్టిద యగుననిన భరద్వాజుండు ధర్మాధర్మలక్షణంబును
దద్విధంబు నెఱింగింపు మనిన భృగుండు స్వధర్మాచరణశీలు లగుమనీషులు స్వర్గ
ఫలావాప్తి కగుదు రట్లు కానివా రజ్ఞు లగుదు రనుడు భరద్వాజుండు చతు
రాశ్రమధర్మంబులసమాచారంబు నానతిమ్మనుటయు భృగుండు. 198

మ. కమలప్రోద్భవుఁ డాది లోకహితకాంక్షన్ ధర్మసంరక్షణా
ర్థము నాల్గాశ్రమముల్ విధించె ననువొందన్ వానిలో బ్రహ్మచ
ర్యము వొల్చుం బ్రథమాశ్రమం బయి జగత్ప్రఖ్యాతినిం గాంచి త
త్క్రియ లెల్లన్ వివరించెద న్విను భరద్వాజా! ద్విజేంద్రాగ్రణీ! 199

సీ. గురుకులవాసాశ్రమరతుండు విధ్యుక్త, శౌచసంస్కారము లాచరించి
నియతాత్ముఁ డగుచు నుభయసంధ్యలన్ భాస్క,రాగ్నిదైవతముల నలర నెఱిఁగి
త్రిషవణస్నానంబుఁ దీర్చి తంద్రాలస్య,ములు వీడి గురులను మ్రొక్కి కొలిచి
వేదశ్రవణపఠనాదులఁ బావనా,చారాత్ముఁ డై బ్రహ్మచర్యమునను
తే. నిత్యభైక్షాశనంబున సత్యనిరతి, నిలిచి స్వాధ్యాయనిరతుఁ డై మెలఁగ వలయు
వానికిం జిత్తశుద్ధియు స్వర్గసిద్ధి, కరతలామలకంబు లై కానఁబడును. 200

సీ. గార్హస్థ్యము ద్వితీయ మహాశ్రమము సదా,చారము సహధర్మచర్య గలిగి
గేస్తనిందిత మగుకృత్యముచేత ధ,ర్మార్థకామావాప్తి నభిలషించి
స్వాధ్యాయశబ్దార్థసంచయంబునఁ గాని, బ్రహ్మర్షిదత్తంబువలనఁ గాని
హవ్యకవ్యనియమాభ్యాససమాసాది,తధనంబునం గాని దైవతప్ర
తే. సాదలబ్ధార్థమునఁ గాని సదమల మగు, వృత్తి గార్హస్థ్యమును నడపింప వలయు
నది సమస్తాశ్రమములకు నాదిమూల, మనుచుఁ బేరెన్నికకు నెక్కె నవనియందు.
తే. నియమనిష్ఠాగరిష్ఠు లై నెఱి నెసంగు, గురుకులనివాసులకు యతికుంజరులకు
సదనపతి యిడు భిక్షాదిసంవిభాగ,ములె గదా జీవనాధారములు తలంప. 202

సీ. అరయ వానప్రస్థు లగువారు సాధుప,థ్యాదనుల్ సాధు లధ్యయనరతులు
తీర్థాభిగమనంబు దేశదర్శనమును, జరియింప నిల యెల్లఁ దిరుగువారు
వారు రా నెదు రేగి వందనం బొనరించి, యర్ఘ్యపాద్యము లిచ్చి యాదరించి
శయ్యాసనంబులు సమకూర్చి భోజన,భాజనాదులఁ గొల్వ వలయు నెపుడు
తే. అతిథి భగ్నాశుఁ డై యేగృహంబునుండి, వెడలునో వానిపాప మావేశ్మపతికి
వేశ్మపతిపుణ్య మతిథికి విడువ కంటు, ననుచు శాస్త్రప్రమాణము దనరుచుండు.
వ. మఱియు నియ్యాశ్రమంబున యజ్ఞక్రియలచేత దేవతలును నివాపంబులఁ బితరులును విద్యాభ్యాసశ్రవణధారణంబులచే ఋషులును నపత్యోత్పాదనంబునఁ బ్రజాపతియుఁ బ్రీతు లగుదురు గృహస్థునకు సర్వభూతవాత్సల్యమును బ్రియవచనము గలుగుటయుఁ బరపరితాపంబును బారుష్యమ్మును జరావమానాహంకారదంభాదులను విడుచుటయు ధర్మంబు లహింసాసత్యాక్రోధ

తపంబులు సర్వాశ్రమాశ్రయణీయంబు లిందు వస్త్రమాల్యాభరణాభ్యంగ
నిత్యోపభోగనృత్యగీతవాదిత్రశ్రుతిసుఖనయనాభిరామదర్శనాదులును భక్ష్య
భోజ్యలేహ్యపేయచోష్యాద్యభ్యవహారోపభోగంబులును గ్రామసుఖాదిసం
తోషవిహారంబులును నింద్యములు వర్జనీయంబులును గావు వినుము. 204

చ. ఎవఁడు గృహాశ్రయంబును వహించి త్రివర్గమున న్మెలంగు వాఁ
డవిరత మిందు సౌఖ్యపడి యవ్వల శిష్టగతిన్ గమించుఁ గృ
త్తవసతి త్యక్తకాముఁడు స్వధర్మరతుం డయి యుంఛవృత్తిమై
నెవఁ డగు వాఁడు స్వర్గతి వహించి సుఖించుట కష్టఁ డయ్యెడిన్. 205

వ. ఇట్లు ప్రమాణంబు గల దింక వానప్రస్థాశ్రమవిధం బెఱింగించెద విను మని
భృగుండు వెండియు. 206

సీ. ధరణి వానప్రస్థ ధర్మ మనుసరించి, పుణ్యతీర్థక్షేత్రములును నదులు
సేవించుచు వరాహసింహశార్దూలాదిమృగసమాకీర్ణము లగువివిక్త
వనముల నివసించుచును దపోనిష్ఠు లై, గ్రామ్యవస్త్రాదిభోగములు విడిచి
వన్యౌషధులు పర్ణ ఫలమూలభక్షు లై, నేలను గూర్చుండి నేల బాయి

తే. యిసుక కంకర బూడిదయొసఁగుచోటఁ, బండి కుశకాశచర్మముల్ వల్కలములు
గట్టి కేశముల్ శ్మశ్రునఖములు లోమములు ధరించి ప్రవర్తిల్ల వలయు మఱియు.

చ. నియమిత మైనకాలమున నీళుల నాడి బలిప్రదానముల్
భయమును భక్తియుం గలిగి ప్రత్యహముం బొనరించి హోమముల్
మెయికొని చేసి పూవులు సమిత్కుశముల్ గొని తెచ్చుమాత్ర శ్రాం
తియ గలవార లై విపినదేశములందుఁ బరిభ్రమించుచున్. 208

మ. చలికి న్వానకు నెండకు న్వెరసి తో ల్సళ్లంగ యోగాదిచ
ర్యల శుష్కించియు మాంసశోణితము లేయంగంబులన్ లేక య
స్థులు చర్మంబును మాత్రమే గలుగ నెంతో ధైర్యయోగంబులన్
నిలుపం జాలిన మేనితోఁ బొలుతు రానిర్నిద్రతేజోనిధుల్. 209

తే. అట్లు బ్రహ్మర్షివిహితచర్యలఁ బొనర్చునట్టివా రెల్లదోషము లగ్నివోలెఁ
బోడరి దగ్ధము గావించి దుర్జయంబు, లైనలోకముల జయింతు రనియెఱుఁగుము.

వ. ఇంకఁ బరివ్రాజకాచారంబు లెట్టివంటి వేనిం జెప్పెద నాకర్ణింపుము. 211

సీ. ధనధాన్యపుత్రమిత్రకళత్రములతోడ, నిత్యాగ్ని విడనాడి స్నేహపాశ
ములఁ ద్రెంచి వెడలుదు రిలు వాసి వారికి, నొకరూప యగును గనకము వెళ్ల

ధర్మార్థకామముల్ దవ్వులనిబుద్ధి మైనరిమిత్రులందుఁ దుల్యప్రదర్శ
ను లయి స్థావరములందును జంగమములందుఁద్రికరణశుద్ధి వర్తించువారు

తే. తమ లోకనివాస మనునదితలఁప కెడఁదఁగొండచరియలు వాహినీకూలములును
భూజమూలములుం గుల్లు పులినములు నమాశ్రయించి వసింతు రెంతైనఁగాని.

ఉ. గ్రామము గాని పత్తనము గాని చనం దలఁ పైనఁ బోయి యా
గ్రామమునందు నొం డయినరాత్రియుఁ బత్తనమందు రెండుమూఁ
డై మిసిమించురాత్రులు నయంబున నుండియు నందుఁ బ్రాణర
క్షామతి భైక్ష్యముం గుడువఁ గాఁ దగు శ్రోత్రియకేతనంబులన్. 213

వ. కామక్రోధదర్పలోభమోహకార్పణ్యదంభపరివాదాభిమానహింసానివృత్తులై ప్రవర్తించువారిపట్లఁ గొన్ని ప్రమాణవచనంబులునుం గలవు సావధానుండ వగు మని మఱియు. 214

క. ఏభూతంబులకున్ భయ,మేభంగిం జేయకుండు నే నాతని కా
యాభూతసంభవభయం,బేభవమునఁ బుట్టఁ బోవ దెఱిఁగికొనంగన్. 215

శా. శారీరాగ్ని మఖాగ్నిహోత్రముగ నిచ్చం జేసి భూదేవతా
గారప్రాపితభైక్ష్యహవ్యము కరాగ్రస్రుక్కునన్ స్వాస్యమం
దారం హోమముఁ జేసినట్టిపురుషుం డత్యుత్తమస్థానముం
జేరం బోయి సుఖించు సంతతము సుశ్రీవైభవోపేతుఁడై. 216

వ. మఱియు మోక్షాశ్రయ మాశ్రయించి శుచియు సంకల్పితయుక్తబుద్ధియు నై విధ్యుక్తక్రమంబునం బ్రవర్తించునాద్విజుం డనింధనాగ్నివలెఁ బ్రశాంతుం డై బ్రహ్మలోకాశ్రయుం డగు ననిన భరద్వాజుం డీలోకంబుకంటెఁ బరం బగు లోకంబు కల దని వినుచుందుము గాని కనుచుండము దానితత్త్వంబు విన నెంచితి నానతిమ్మనిన భృగుమహర్షి యి ట్లనియె. 217

### పరలోకాభివర్ణనము.

తే. పుణ్యదము సర్వసుగుణాతిగణ్యమైన,హిమవదుత్తరపార్శ్వమం దెసఁక మెసఁగుఁ
గామ్యమును క్షేమ్యమైనలోకంబొకండు,పలుకఁబడుచుండునద్ది యేపరమటంచు.

తరళ. దురితదూరులు నిర్మలాత్ములు దుఃఖశూన్యులు మోహలో
భరతిహీనులు శుద్ధులున్ నిరుపద్రవుల్ జను లుందు రం
దరయ స్వర్గమునందునుం బలె నన్ని మేళ్లగు వ్యాధులున్
మరణముల్ మనుజాళి నంటవు మానిచంద్రము! వింటివే. 219

సీ. అట నున్నవారు ద్రవ్యాపేక్ష నొండొరుల్ మడియించుకో నొల్ల రెడ స్వదార
నిరతులు ధర్మతత్పరులైనవారి కృతమునకు ఫలము ప్రత్యక్షమ యగుఁ
గాని పరోక్షముఁ గాదు తినం ద్రావఁ గట్ట సమృద్ధిమైఁ గలదు మఱియు
మేడలుఁ మిద్దెలు మాడుగులు విహారభూము లసంఖ్యేయములు దలిర్పు
తే. సర్వభూషణభూషితుల్ సర్వకామసంభృతులు శోభితాంగులు సౌఖ్యవంతు
లెందఱే నుండ్రు శ్రమకోర్చి కొందఱచటఁ బ్రాణధారణ మొనరించువారుఁ గలరు.

వ. ఈలోకంబునందు. 221

మానిని. కొందఱు ధర్మపరుల్ మఱి కొంద ఱధర్మపరుల్
కొందఱు దుఃఖితులుఁ మఱి కొందఱు సౌఖ్యయుతుల్
కొందఱు నిర్ధనులుఁ మఱి కొందఱు విత్తపతుల్
కొందఱు సత్యరతుల్ మఱి కొంద ఱసత్యమతుల్. 222

సీ. ఇందున్నవారల కేనాఁడు శ్రమ మర్థమున నైనలోభము మోహము క్షుధ
వివిధధర్మాధర్మవిహితకర్మములజీవనోపాయము చెల్లుచుండుఁ
బ్రాజ్ఞుల కంట దేహాపము కపటము స్తేయము నికృతి యసూయ హింస
పైశున్య మనృతంబు పరివాదము పరోపఘాతము ననునివి కలుగు వాని
తే. తపము నశియించు నివి లేనితపము పొదలుఁ గర్మభూమి యనం జెల్లుఁ గాన నిందు
సుకృతదుష్కృతకర్మానుసూచితముగ శుభమశుభ మొందుచుందురు క్షోణిజనులు

తరళము. ఇటఁ బ్రజాపతియుఁ సుపర్వులు నెన్నియేనియు జన్మముల్
పటుతపం బొనరించి మించిరి బ్రహ్మలోకమునందు మున్
బటిమఁ బుణ్యకృతిం బొనర్చినవార లుత్తరపుణ్యభూ
తటమునందు జనించి సౌఖ్యపదంబు నొందుదు రెందునుఁ. 224

వ. పాపకర్మము లొనర్చినవా రిందే పశుపక్ష్యాదియోనులం బుట్టి క్షీణాయుష్కు
లై యన్యోన్యభక్షణాసక్తులు లోభమోహసమన్వితులు నై పరివర్తనంబు
నొందుచుందురు మఱియు బ్రహ్మచారులై గురూపాసనాపరు లగుసుత్తములు
సర్వలోకమార్గంబు లెఱింగినవా రగుదు రో భరద్వాజా! బ్రహ్మనిర్మితధర్మం
బిట్లు సంగ్రహంబుగ నెఱింగించితి ధర్మాధర్మంబు లెఱింగినవాఁడు బుద్ధిమంతుం
డగు నని భృగువు చెప్పిన విని భరద్వాజుం డానందించి భృగున కభివందనం
బాచరించి చనియె నిట్లు జగదుత్పత్తిప్రకారం బెఱింగించితి ననిన ధర్మనంద
నుండు సర్వజ్ఞుండ వగునీవలన నాచారతత్త్వం బెఱుంగఁదలంచితి ననిన భీష్ముం

ఇ ట్లనియెను. 225

భీష్ముఁడు ధర్మజున కాచారవిధి యెఱింగించుట.

క. వినుము దురాచారప్రియు,లును దుశ్చేష్టులును గష్టులును సాహసికుల్
గన దుర్జనులు సదాచా,రనుతులు సజ్జనులు సూవె రాజబిడౌజా. 226

సీ. రాజమార్గమున గోరాజిమధ్యంబున, ధాన్యమధ్యమున మూత్రము పురీష
మును విడువారుదుర్జనులువాఁబడుచుం,డ్రు, తగ శౌచమునుదీర్చి దైవతములఁ
దర్పణ మొనరించు టేర్పడు మానవ,కోటికి ధర్మమై కుతలమందు
నాచమింపక నదియందు జలం బాడ,రాదు తా నశుచియై క్రాలుచున్న

తే. వేకువన లేచి సూర్యు సేవింపవలయు, సంధ్యలన్ వార్చి సావిత్రి జపమొనర్పఁ
దగును గాల్చేతులను మోముఁదడిపి మౌన,మంది ప్రాఙ్ముఖుఁడై భుక్తినానవలయు

తే. అన్ననిందయొనర్పరాదార్ద్రపాణి, యగుచు లేవంగనొప్పునార్ద్రాంఘ్రుఁడగుచు
నిదుర పోఁ గూడ దాచార మిది ప్రశస్త,మనుచు దేవర్షి నారదుం డానతిచ్చె.

క. అనల మనడ్వాహము వే,ల్పును గోష్ఠము చదుకము ద్విజపుంగవుఁడు కనుం
గొననైన యపుడు వలగొని, చనవలయు నటంచు నార్యసమ్మత మయ్యెన్. 229

సీ. తనభుజించెడువానిఁ దనియంగ నతిథుల,కును భృత్యులకుఁ బెట్టఁ జను జనులకు
నిరుప్రొద్దు కుడుచుటయే దేవనిర్మిత,మటు చేసి నడుమ నెప్పటికి గుడువ
కుండువాఁ డుపవాస ముండినఫల మొందుఁ,దఱి వేల్చుటయు నిజదార ఋతువు
నను గూడు చన్యకాంతలఁ గూడనట్టిఁడు,బ్రహ్మచారియనంగఁ బ్రణుతి కెక్కుఁ

తే. దళ్లిహృదయంబువలెనమృతమనవచ్చు,బ్రాహ్మణోచ్ఛిష్టముభుజించుపంచజనుడు
సత్యమునయందుసతతంబుసౌఖ్యమందు, ననుచుశాస్త్రమువచియించునవనినాథ.

క. వెళ్లను మర్దించుటయున్, గోళ్లనుగొఱుకుటయుఁదృణముఁగొనిత్రెంచుటయున్
జెల్లదు నాకటు చేసిన, ప్రల్లదులకు నాయు వల్పపరిమితిఁ జెల్లున్. 231

మత్త. మాంసభక్షణ మాచరింపనిమానవుండును దా యజ్ఞ
స్సంసితంబును సంస్కృతం బయి సర్వదైవతభక్ష్యమౌ
మాంసముం దినవచ్చు నొండొకమాడ్కి నెప్పుడు గాని యే
మాంసముం దినరాదు పృష్ఠముమాంస మెంతయు నెగ్గగున్. 232

క. పరదేశమందు నైనన్, బరతెంచినయతిథి పస్తుపడియుండఁగఁ దాఁ
బరికించి యుండరాదే,వెరవుననే నతనిక్షుధను వెడలింప నగున్. 233

ఆ. కామ్యకర్మఫలము గలిగెనేఁ దన కది, గురున కెఱుకఁ జేసి కొలిచి మ్రొక్క

నతఁడు పొందుమిగుల నైశ్వర్యమాయువు,నసమునను-చుఁ దెలియుమమలచరిత.

సీ. వీక్షింపరా దుదయించునాదిత్యబింబము నగ్న యగుపరవనిత మేనుఁ
గులకాంతరతి యైన గోప్యము గావింప, నగు ద్విజుల్ దర్శించునప్పుడెల్ల
గుశల మడిగి వానిఁ గొలువంగ వలయు సాయంతనములఁ బ్రాతరవసరముల
గుడులందు గోవులనడుమ విప్రక్రియా, స్వాధ్యాయ భోజనసమయములను

తే. సవ్యయజ్ఞోపవీతి యై సంతసమున,దక్షిణకరంబు పై కెత్తి తరలవలయు
ద్విజులయెడఁగాక తక్కిన ప్రజలయందు,భాతృభావంబు నెలకొల్పవలయు నెపుడు.

వ. మఱియు విప్రునకు భోజనం బొసంగి సంపన్నం బనియుఁ బానీయం బిడి తర్పణం బనియుఁ బాయసకృసరయవాగు లర్పించి సుశ్రుతం బనియుఁ బలుక వలయు వ్యాధితుండు శ్మశ్రుకర్మము క్షుతము స్నానము భోజనముం బొనర్చి నప్పుడు పరమేశ్వరస్మరణ మాయుష్యవర్ధనంబు. 236

సీ. ప్రొద్దెదురుగ నిల్చి మూత్రంబు విడ రాదు, తనవిట్టు చూచుట తనకుఁ దగదు
నాతితో సహభోజనము సహశయనము, విడ నొప్పుఁ బెద్దలఁ బేరుపెట్టి
నీ వని పిలువరా దీవిధిఁ బిన్నలు, సములైనచోఁ దప్పిదమునఁ గాదు
పాపులహృదయంబు వారిచేష్టలె తెల్పుఁ, దెలిసి చేసినతప్పిదియును గాని

తే. కప్పి పెద్దలకడ దానిఁ జెప్పకున్నఁ, జెడునుమనుజులకనుగప్పఁ గడిమి యున్న
వేలుపులకన్నుగప్పగాఁ జాలఁడుతన,పాపమును దాఁచి మఱియుఁ బాపమునకగును

క. ధర్మము దాఁచిన యేనిన్, ధర్మఫలం బందఁ గలఁడు ధర్మజ్ఞుం డై
ధార్మికుని ధర్మ మరయఁగ, ధర్మము నే యనుసరించు ధర్మప్రభవా. 238

మ. తన కావించినతప్పు తప్పనుచుఁ జిత్తంబందుఁ జర్చింపమిన్
గొని జాబిల్లిని రాహువుం బలెను తద్ఘోరాఘ మామూఢు నొం
దన వచ్చున్ దలపం దురాశ మెయి నౌ ద్రవ్యంబు దుఃఖంబులన్
బొనరించుం బుధు లెంచ రాతనిఁ గనం బోఁ డొంకెదున్ మిత్తియున్. 239

తే. సర్వభూతధర్మము మానసంబె గాన, సర్వజీవులకును మనఃపూర్వకముగ
శివ మొనర్పఁగ నగు ధర్మచింతనమున, సాయ మక్కఱయుండ దేసమయమందు.

క. ధర్మమె హేతువు నరులకు, ధర్మమె సురలకు మహామృతము దివమందున్
గర్మమునఁ దెగినవారికి, ధర్మమునన్ సుఖ మొసంగు ధర్మజ్ఞమణీ. 241

వ. అనిన విని కురుపుంగవుండు చింతింపం దగునధ్యాత్మం బెయ్యది తత్స్వ రూపం బెట్టిది స్థావరజంగమాత్మక మగునీప్రపంచం బేమిటికి సృష్టింపం బడినది

ప్రళయమున నది యొందుం జేరుచున్నయది చెప్ప ననుగ్రహింపు మనిన
మందాకినీనందనుండు. 242

తే. ఏది శ్రేయస్కరతమంబు సృష్టివిలయ,యుక్త మాచారదర్శిత ముత్తమంబు
నిహపరసుఖప్రదము భూతహితము వినుము,దానిఁ జెప్పెదనధ్యాత్మతత్త్వమెల్ల.

భీష్ముఁడు ధర్మజునకు యోగప్రకారము సెప్పుట.

సీ. నింగి నేలయు నిప్పు నీ ళ్లాకసము నని, పంచభూతము లవి వానిలోనె
పుట్టియు వానిలో గిట్టుచు నుండును, ప్రబలి మహాబ్ధితరంగము లటు
కూర్మ మంగములను గుంచి పెంచెడు రీతి, భూతాత్ముఁడు సృజించి భూతములను
సంహరించు నతండు సర్వభూతములను, ఘనతరవైషమ్యమును బొనర్చుఁ

తే. గాని జీవుఁ డెఱుంగఁ డాకరణి యెల్ల
స్పర్శమును జేష్టయును త్వక్కు వాయుగుణము
లగును శ్రోత్రము శ్రోత్రేంద్రియమును శబ్ద
మును విహాయసగుణము లై తనరు మఱియు. 244

తే. రసము క్లేదము జిహ్వ నీరగుణము లయి
పరఁగు రూపము చక్షువు పాకము నివి
యనల గుణము లై యొప్పు ఘ్రేయమును ఘ్రాణ
మును శరీరము భూగుణంబు లయి పొదలు. 245

వ. ఇట్లు మహాభూతంబు లైదు నాఱవది మనం బేడవది బుద్ధి యెనిమిదవవాఁడు
క్షేత్రజ్ఞుఁడు సంశయాత్మక మగునది మనస్సు నిశ్చయాత్మకమగునది బుద్ధి క్షేత్ర
జ్ఞుఁడు సాక్షీభూతుఁ డై యుండి యూర్ధ్వాధోభాగంబు లెల్లఁ జూచుచు
దేహమంతట నిండి యుండు నింద్రియములు సత్త్వరజస్తమోగుణములు తదా
శ్రితము లగుభావములు సమగ్రముగాఁ బురుషుం డెఱుంగఁ దగి యున్నవి
బుద్ధిమంతు లగువారు తమబుద్ధిబలమ్మున నీభూతముల గమనాగమనం బెఱింగి
శమంబు నొందుదు రాకర్ణింపుము. 246

సీ. బుద్ధిచే నింద్రియములు మనంబును గుణ,వంతము లగు బుద్ధి వఱలకున్న
గుణములు లేకుండు గణుతింప బుద్ధిమ,యము లై చరాచరసముదయములు
కలుగు నశించు కన్గను చెవి వినుముక్కు,మూర్కొను నాలుక మొనయురుచుల
స్పర్శ మెఱుంగును ద్వక్కు బుద్ధివికాస, మొనరియున్నప్పుడ మనము దలఁచు

తే. బుద్ధి పంచేంద్రియమ్ముల మొనసినపుడ, సర్వమును శక్తిమంత మై జనుగుపురుషు
బుద్ధి భావత్రయంబున మొనసి ప్రీతి, సుఖము దుఃఖము నవశమై చూరఁగఁ జేయు.

సీ. ధీమంతుఁ డగువాఁడు తెలివిమై నింద్రియ,ములను జయింపంగ వలయు నెపుడు
త్రిగుణమ్ములుం బ్రాణి దేసనుండి వేదన, ననుభవింపఁగఁ జేయు ననుదినంబు
హర్షంబు ప్రీతియు నానందము సుఖంబు, శాంతంబు ననునివి సాత్త్వికములు
పరితాప మశుమ నిరత రాసంతుష్టి, ప్రభ లోభ కాములు రాజసములు

తే. మోహ మవమానముఁ బ్రమాదమునును దంద్ర
తామసంబులు మరలింపఁ దరము గాని
వెవఁడు బహువిధగామిరై యేగ్చు మనము
నాఁగు నాతఁడె సుఖపడు నందు నిందు. 248

క. ఒకటి సృజించు గుణము లిం,కొకటి సృజింపదు విభేదమో యియ్యది వా
నికి సత్వక్షేత్రజ్ఞుల, కిఁక మశకోదుంబరగతి నెపు డవి కలయుఁన్. 249

సీ. అవి పృథగ్భూతము లయ్యు నెప్పుడు కల, యిక నుండు మత్స్యోదకైక్య మట్లు
గుణము లాత్మ నెఱుంగ వణుమాత్రమాత్మగు,ణముల నెఱింగి సర్వమును గాంచుఁ
దెలివియుం జేష్టలుఁ గలుగ నిబుద్ధీంద్రి,యముల దీపమువలె నాపరాత్మ
వెలిఁగించు గుణసృష్టము లగువానికి నాత్మ, సాక్షియైయుండు నాశ్రయము లేదు

తే. మనముతో నింద్రియమ్ములు మసలునపుడు, ఘటమునందలిదీపము కరణి నాత్మ
వెలుఁగుఁ బ్రాకృతకర్మము విడిచి పెట్టి,యాత్మ రతుఁ డగుముని పొందు నమలగతిని.

ఆ. నీటి కాకిమేన నీ రంటనటు కృత,ప్రజ్ఞుఁ డైనముని నిరంతరమును
భూతతతి మెలఁగి స్వబుద్ధిచే నిర్లిప్తుఁ, డగుచుఁ బరమపదము నందఁ గలఁడు.

తరళ. మదిని ఖేదము మోదముఁన్ విడి మత్సరత్వము మాని సౌ
హృదమునన్ మెలఁగం దగున్ జనుఁ డెల్లనాఁ డటుఁ గాక దు
ర్మదుఁడు దుష్టుఁడు నై భవంబునఁ గ్రాలు నే నిజతంతులన్
గదల నేరనియూర్ణనాభి యనన్ గనందు నివృత్తినిన్. 252

వ. మఱియుం గొందఱు ప్రత్యక్షానుమానంబులఁ బరోక్షంబు నిశ్చయింతురు
కొందఱు నివృత్తిం జెప్పుదు రేరి కేది సమ్మతమో వా రట్లు ప్రవర్తించుచు
బుద్ధిభేదమయం బైనహృదయగ్రంథిని భేదించి భిన్నసంశయులై సుఖం బందఁ
గలరు మలినులయ్యు నిట్లు జ్ఞానవంతు లైనవారు శుద్ధులై నదిం బడిననరుల
వలె విజ్ఞానప్లవంబునఁ బారంబు నొందఁ గలరు తత్త్వజ్ఞుఁడు ఫలాఫలంబుల

సనుుండై యథార్థాత్మజ్ఞానంబునఁ గైవల్యంబు నొందు మానవుండు భూతంబుల గతియు నాగతియు నెఱింగి శమనంబు నొందుఁ ద్రివర్గప్రవృత్తి నెఱింగిన వాఁడు తత్త్వదర్శి యగు నింద్రియంబులకు స్వేచ్ఛాగమనంబొసంగినవాఁ డాత్మం జూడఁజాలం డి ట్లెఱుంగుట జ్ఞానలక్షణం బీజ్ఞానంబున నే మనీషులు కృతకృత్యు లగుచుందు రని చెప్పి గంగానందనుం డింకఁ జతుర్విధధ్యానయోగం బెఱిం గింతు వినుమని యి ట్లనియె. 253

ఉ. జ్ఞానము గల్గి మౌను లయి సద్గతు లొందఁ దలంచువా రెదన్
ధ్యాన మెఱింగి తద్విధివిధానమునం బచరించునట్టి రై
కానిన స్తువుం గని సుఖంపడి సంసృతిదోషముక్తు లై
పూనినద్వంద్వదుఃఖములఁ బోకడఁ బెట్టి సుఖంత్రు సిద్ధులై. 254

సీ. అం దందు సంశ్లిష్ట మగుమనం బేకాగ్రముగ నిల్పి యింద్రియంబులను గట్టి
కొయ్యబాఱినయట్లు కూర్చుండి మౌని యై వినక శబ్దము స్పర్శమును నెఱుఁగక
కనక రూపము రుచి గానక వాసనల్ దెలియక యోగమం దెలమి నుండి
సంచరించెడుద్వారపంచక మరికట్టి ధ్యానపథంబునఁ దనరఁ జేసి

తే. మనము నింద్రియములు నేకమార్గమందు
నిలుప నగు నిది ధ్యాన మిట్టులు పొనర్చి
నను మొయిల మెర్మవలెఁ బర్ణమునను వారి
బిందువువలెన్ మనము లౌల్య మందు చుండు. 255

చ. మనము సమాహితం బయి క్రమంబున ధ్యానపథంబు నొందియున్
గను మెదలించులోపునన గాలివలెన్ జలియించు నప్డు యో
గనిరతుఁ డింతయున్ శ్రమకుఁ గాక మదిన్ విసు వొంద కెప్పటిన్
జనునటు జాగరూకతను సల్పఁగ నొప్పును మాటిమాటికిన్. 256

సీ. ధ్యానస్థితుం డగుమౌని కాది విచారము వివేకము వితర్కమును జనించు
మదిఁ గ్లేశ మైన సమాధాన మొనరించు కొన నగు నిర్వేదమునకుఁ గాక
తగఁ బ్రయత్నించినంతన గాని నీ ర్చల్లుమాత్ర పాంసువును భస్మము కరీష
మును రూపుఁ గాంచఁ బోపునె యవ్విధంబున నింద్రియగ్రామము తంద్ర లేక

తే. సాధుగతి సంహరించి ప్రశాంతిఁ గాంచి తరళ మగుమదిన్ దొల్లింటిధ్యానపథము
నందు యోగము చేనిట్లు నట్లు చేసి శమముఁ గలఁడయి సుఖయించు సతతమాత్మ.

క. అట్టిసుఖ మెట్టిచేతలఁ బుట్టదు తత్సుఖమునందు ముని మునిఁగియుఁ బై
నెట్టన నిర్వాణంబుం బట్టి మహానంద మందుఁ బార్థివముఖ్యా. 258

వ. అనిన యుధిష్ఠిరుండు జాపకులఫలావాప్తి యెట్టిది వారి కెట్టిగతులు పట్టు జప
విధానం బెచందంబున నుండు సాంఖ్యయోగక్రియావిధులు జపంబు లగునో
చెప్ప ననుగ్రహింపు మనిన దేవవ్రతుండు వెండియు. 259

మ. ఇతిహాసం బొకఁ డేతదర్థమున నుత్ప్రేక్షింపఁగా నొప్పు నీ
క్షితి మున్ గాలయమేంద్రమృత్యువులకున్ జెల్లెన్ విసంవాద మో
క్షితినాథాగ్రణి నీదుప్రశ్నమున కాఖ్యేయం బుదాహారమై
ప్రతిబద్ధం బగుఁ గానఁ జెప్పెదను భాస్వద్బుద్ధి నాలింపుమా. 260

సీ. సాంఖ్యయోగమ్ములు సంశ్రితము లసంశ్రితము లివి రెండు మార్గములు జపము
చిత్తసంశుద్ధినిం జేసి యుపకరించు,నది యగుఁ జూప్పె చెప్పెదను వినుము
రెండింటియందు వర్ణితము మనస్సమాధియును సర్వేంద్రియజయము మఱియు
సత్యమగ్నులపరిచర్య వివిక్తసేవనము ధ్యానము తపంబును దమంబు

తే. క్షాంతి యనసూయయును మితాశనము విషయ
విముఖతయు మితభాషిత శమ మనునివి
గలుగుట ప్రవర్తకము జపకలనఁ గర్మ
ఫలనివృత్తి గలుగుట నివర్తకంబు. 261

తే. వ్యక్త మవ్యక్తమున నాశ్రయంబు విరత, మైనదారిఁ గుశోచ్చయాసీనుఁడు కుశ
హస్తుఁడుం గుశశిఖయుఁ గుశావృతుండు, నగుచు విషయంబులకునమస్కారించి.

తే. జీవమున కాత్మకును సామ్యమావహిల్ల,సలిపిమనమందమనమునుగలియఁగూర్చి
సన్యసించి సమాధి సుసంస్థితుఁ డయి,బ్రహ్మసంహితజపియింపవలయు నియతి.

క. దానిబల సంశ్రయంబున, ధ్యానము జనియించు నదియె తప మగు దానన్
మాని విశుద్ధుఁడు దాంతుం, డై నెగడు నకామదుగఖుఁడై నిర్మముఁ డై. 264

తే. అతఁడునిర్ద్వంద్వుఁడై నిష్క్రియారతుఁడయి,యవమతిదలంపకర్థగ్రహణపరుండు
గాక మానావమానముల్ కడకుఁ ద్రోచి, ధ్యాననిశ్చలచిత్తుఁ డై తనరవలయు.

క. ధ్యానక్రియాపరుండున్, ధ్యానవినిశ్చయుఁడు నగుచు ధ్యానము నందున్
బూని సమాధిం దుదకెక్కి,ద్దానిన్ విడనాడి బ్రహ్మతత్త్వము నొందున్. 266

తే. అట్లు తన కిచ్ఛలేక తా నరుగునపుడు, బుద్ధిబలమున నై శాంతి భూతుఁడును ని-
రామయుండయియుండునే నమృతమువిర, జమ్ముశుద్ధమునగునాత్మ నెమ్మినొందు.

వ. అనిన నజాతశత్రుండు జాపకు లొందుగతు లెఱింగించితివి కాని వారికి
మఱొండు గతు లుండునే నెఱింగింపు మనుడు భీష్ముండు వారు పొందు

లోకంబులు మఱియు ననేకంబులు గల వవి నిరయంబులు చెప్పెద విను మని
యి ట్లనియె. 268

సీ. విధిచోదితక్రియావిధులు దీర్ప కొంకించు, కించుకమాత్ర గావించు వారు
శ్రద్ధ లేక ఫలాభిసంధి గలిగి ప్రీతి, విడిచి యహంకృతి నడపు వారు
మనమునందుఁ బరావమానము సైఁపక, జపులై తపింపఁగాఁ జనెడువారు
నిరయంబు లొందుదు రరయ నెం దనురక్తి, వఱల జపింతురో వారు దాని

తే. నంది ముక్తులుఁగాఁ జాల రజ్ఞ లగుచు, మదిఁ జలింప జపించిన మఱియుమఱియుఁ
జలనగతు లొందుటయ కాక పలుతెఱంగు, లైననిరయంబు లందెద రవనినాథ.

క. అకృతప్రజ్ఞుఁడు బాలుఁడు, సుకృతము దలపోసి మోహసూచితుఁడై జా
పకుఁడైన నిరయ మందున్, దికమక కై దుఃఖ మంది దిక్కఱి పోవున్ 270

ఆ. జాపకుండు ప్రతిన సల్పి సల్పినయట్లు, జపము పూర్తి చేయఁ జాలఁడేని
వాఁడు నిరయ మంది వత్సరంబులు పెక్కు, కుతిలగుడుచుచుండుఁ గువలయేశ.

వ. అనిన నజాతశత్రుం డుత్తముం బగుపదంబు నొందియు జాపకుండు మరల
నిట జన్మించునో యని యడిగిన జాహ్నవీసుతుండు జాపకత్వంబు ప్రశస్త
మయ్యు నందు ననేకవిధంబు లగుదోషంబు లగుం గావున దానం జేసి యుత్త
మోత్తమపదంబు నొందియుఁ బునరావృత్తి నొంద నగుచుండు ననిన యుధిష్ఠి
రుండు జాపకుం డెట్టినిరయంబు నొందు నెఱింగింపు మని యడిగిన నతండు
వెండియు. 272

చ. నిరయము లంచు నే నిపుడు నీకు వచించినచోట్లు దేవతా
వరపరమేష్టవాసగృహవర్ణితముల్ వివిధప్రసూనసుం
దరఫలవృక్షదృశ్యములు నవ్యవిలాసలసత్సభాప్రభా
కరములు దేవయానపరికల్పితచత్వరరమ్యభూములున్. 273

వ. మఱియు నాస్థానంబులు లోకపాలురకును శుక్రబృహస్పతులకును విశ్వేదేవుల
కును మరుతులకును సాధ్యులకు నశ్వులకును రుద్రాదిత్యవసువులకును దక్కం
గలదేవతలకును నిలయంబులు వినుము. 274

సీ. పరమాత్మనిలయంబు భయరహితము క్లేశ,శూన్య మనానందశోకచయము
మూఁటి రెంటిన్ మఱి మూఁటి నెనిమిదింటి, విడి లక్షణచతుష్క మెడసి కార
ణములు నాల్గున్ విడనాడినట్టిది కాల,మునకుఁ బ్రభుత్వము మొనయ దందు
నది కాలమునకును త్రిదివంబునకును బ్రభుత్వము గల దయి పొదలు చుండు

తే. నాత్మ కేవలత్వము నొంది యందు శోక,మూన కుండును గాన నాస్థానమునకు
నెల్లస్థానములుఁ నిత్యహీనము లయి, నిరయము లనంబడుం జుమి ధరణినాథ.

వ. అని చెప్పిన విని ధర్మరాజు కాలమృత్యుయమామలసంవాదంబు చెప్పెద
నంటి వది చెప్పు మనిన గాంగేయుండు చెప్పెద విను మని యి ట్లనియె. 276

యమకాలమృత్యుభూసురేక్ష్వాకులసంవాదము.

తే. పరఁగుఁ గౌశికుఁ డనునొక బ్రాహ్మణుండు, వేదవేదాంగ వేత్త సద్వృత్తరతుఁడు
జాపకుఁడు పైప్పలాది విజ్ఞానఘనుఁడు, ధర్మనిష్ఠాగరిష్ఠుఁడు నిర్మలమతి. 277

సీ. ఆతఁడు వేదనిష్ణాతుఁడై యొక కాల,మున హిమవత్పాదమున వసించి
సంయతాత్ముం డయి సంహితాజపమున, బ్రాహ్మ మగుతపంబు పట్టి చేసె
వేయేండ్లు కడచినవెనుక సావిత్రి ప్ర,త్యక్ష మై విప్రునిదండ నిలిచి
సంప్రీతి నందితిఁ జనుదెంచితి ననంగ, జప్య మావర్తించుసందడిఁ బడి

తే. అతఁడు మాటాడ కుండె న ట్లయిన దేవి, యజ్జపంబునకుఁ మెచ్చి యంతలోన
జపసమాప్తి యొనర్చి యాజాపకుండు, లేచి సాష్టాంగవందన మాచరించి. 278

ఉ. నాదెస సుప్రసన్న వయి నా కిటు దర్శన మిచ్చి తోజని
త్రీ! దయివారుసీకరుణ కే నిటు భాజన మైతి ధన్యుఁడఁ
నాదగుభాగధేయము ఘనం బని తోఁపఁగ వచ్చె నామనం
బిదినమందు జప్యమున నే రమియించెడునట్లు చేయుమా. 279

వ. అనిన గాయత్రి యి ట్లనియె. 280

క. అది య ట్లగు నోవిప్రుఁడ, మది కిష్టం బెద్ది దేని మాకడ నర్థిం
తది సేయ నుంటి కొంకక,విదితము గావింపు మనుడు ద్విజుఁ డి ట్లనియెన్.

క. నాయిచ్ఛ జప్యమందుం, బాయక యుండఁ మనస్సమాధి ప్రబలమై
నాయెడఁ బొదలెడునట్లుఁ, జేయవె దయ నీదుమదికిఁ జేరిన యేనిఁ. 282

చ. అనవుడు దేవి యట్ల యగు నంచు వచించియు వెండి యి ట్లనుఁ
మునివర నీవు జాపకులు పొందెడునానిరయంబు నొందఁగాఁ
జనదు చనంగనొప్పెడిని నాశ్వత మయ్యు ననిందితంబు నై
కనఁబడుతానకం బటులుగా నొనరించెద నే సమర్థతఁ. 283

వ. నీ వేకాగ్రచిత్తుండ వై జపించుచుండుము నేఁ బోయి వచ్చెద నింతలో
ధర్ముండు నీకు దర్శనం బిచ్చెడుఁ గాలమృత్యుయములు నీకడకు వత్తురు వారి
కిని నీకును బెద్దవివాదం బయ్యెడు నని యాదేశించి వేదమాత నిష్క్రమించె

నంత బ్రాహ్మణుండును దొంటియట్లు జపించుచుండ మఱియు నొక్కదివ్యవర్ష
శతం బతిక్రమించె నంత దాంతుండును శాంతుండును జితేంద్రియుండును
సత్యసంధుండు ననసూయకుండు నై వ్రతసమాప్తిం జేయ నుండునాసమయం
బున ధర్ముండు ప్రసన్నుండై దర్శన మిచ్చి యి ట్లనియె. 284

మత్త. నేను ధర్ముఁడ వచ్చినాఁడను నిన్నుఁ జూచెడు వేడుకన్
మానివర్య! భవజ్జపాప్తి నమర్త్యలోందనిలోకముల్
పై నెసంగెడులోకముల్ గొనువాఁడ వీతను వీఁగినం
గాని నీకు లభింప వయ్యవి గాన మే న్విడనాడుమా. 285

క. నావుడు బ్రాహ్మణుఁ డిట్లను, నీవచియించినవి నాకు నేమిటి కిఁక నో
దేవా! వెడలుము సుఖదుగ,భావహ మగు మేను విడఁగ నభిమతముపడన్. 286

తే. ధర్ముఁ డిట్లను నోవిప్ర తప్పక భవ,దీయదేహంబు విడనాడి దేవలోక [మఱియు.
మునకు నేగుము నామాట వినవదేమి ?, యనవుడును బ్రాహ్మణుం డిట్టు లనియె

సీ. తను వీగి స్వర్గముఁ జన నోప నొడలు లే,నపుడు స్వర్గం బేల యరుగు మీవు
నా ధర్మ వను నోయి నామాటబడి నీదు, దేహాభిమానము తెరలఁజేసి
యరజస్కలోకంబు లంద నేగి సుఖంపు, శోకంబెఱుంగనిచో వ్వెలింగి
జన్నిగ ట్టను నాకు జపమే మహానంద, కంద మాలోక మే నంద నైన

తే. మేనితోఁ బోయి పొందుట మేల యేమొ, ధర్మ వను మేను విడనాడఁదలఁపవేని
చూడుమటు కాలమృత్యులఁగూడియముఁడు,వచ్చుచున్నాఁడుకన్ను నీవంకవైచి.

వ. అంతలో యమకాలమృత్యువు లరుదెంచి రందు యముం డాబ్రాహ్మణుం
దరియ వచ్చి యి ట్లనియె. 289

క. నీదగుచరితకుఁ దపమున,కే దనిసి ఫలంబు గూర్ప నిట వచ్చితి నో
భూదేవ! నేను యముఁడన్, నాదర్శనఫలము నీ కనంతం బగుతన్. 290

క. కాల మను నీజపంబున, కీలలి ఫలకాల మయ్యె నే తెమ్ము దివ
శ్రీ లనుభవింప నేనే, కాలమ నోవిప్రవర్య! కదలుము వేగన్. 291

క. మృత్యువ యి ట్లను నన్నున్, మృత్యువు గా నెఱుఁగు కాల మిటు ప్రేరేపన్
సత్యప్రతిజ్ఞ నిన్నున్, బ్రత్యయమునఁ గొంచుఁ బోవ వచ్చితి ననఘా. 292

వ. అనిన బ్రాహ్మణుం డి ట్లనియె. 293

క. స్వాగతము సూర్యసూతికి, స్వాగత మీకాలమూర్తి కధిదేవతకున్
స్వాగతము మృత్యువునకున్, స్వాగత మగు ధర్మమునకు నని భక్తిమెయిన్.

వ. నావలన మీకుం గావలసిన కార్యం బేది యని పలుకుచు వారి కర్ఘ్యపాద్యంబు లొసంగి పరమప్రీతుండై నాశక్తికిం బోలఁ మీకుఁ జేయం దగునది యెద్దియో యెఱింగింపుఁ డని పలుకుచుండునంత దీర్ఘయాత్రాచణశీలుండై యెందేనియుం బోవునిక్ష్వాకుం డను రాజేంద్రుం డట వచ్చి వారిం బూజించి నమస్కరించి కుశలప్రశ్నంబు గావించె నంత నాబ్రాహ్మణోత్తముం డారాజోత్తమున కాసనార్ఘ్యపాద్యంబు లొసంగి స్వాగతంబు పలికి నీ విందుల కేల వచ్చితివి నీకార్యం బెద్ది చెప్పు మనిన నప్పార్థివుం డతని కి ట్లనియె. 295

తే. నేను రాజను షట్కర్మనిరతుఁడ వగు, బ్రాహ్మణుఁడ వీవు నీకు నావలనఁ గొంత
వసువుగొనుకోర్కిఁగలదేనివాకొనుమిట,నిత్తుననుటయుబ్రాహ్మణుండిట్టులనియె.

సీ. ఇలఁ బ్రవృత్తులు నివృత్తులు నని బ్రాహ్మణుల్, ద్వివిధులు ధర్మము ద్వివిధమే ని
వృత్తుఁడను బ్రతిగ్రహోత్తచిత్తుఁడను గా, నిమ్ము దానములు ప్రవృత్తులకును
నే నొల్ల నీ కిష్ట మే నిత్తుఁ గోరుము, సాధింతు నాతపశ్శక్తి దాని
ననవుడు రాజను నయ్యనేక్షత్రియుం,డను దేహియనుమాట యనియెఱుఁగను

తే. యుద్ధ మది దక్క నావుడు నుర్విసురుఁడు, నీవు నీధర్మమున నెట్లు నిలువ నెంతొ
నేను నాధర్మమున నట్లు నిలువ నెంతు, నంతరము లేదు మనకు నే మందువిపుడు.

వ. అనిన రా జి ట్లనియె. 293

క. నాశక్తి కొలఁది నిచ్చెద, నాశయ మెఱిఁగింపు మంటి వది గావున మా
నీశా! నీజపఫల మే, నాశించితి నా కనుగ్రహము సేయు మెదన్. 299

వ. బ్రాహ్మణుం డి ట్లనియె. 300

క. నా వాణి యుద్ధయాచ్నం, గావించెడు గాని యొండు గావింప దటం
చీవు వచించితి యుద్ధము, నావలనం గాదు యాచనకు ఫల మగునే. 301

వ. అనిన రాజేంద్రుండు. 302

సీ. వాగాయుధులు మహాభాగులు భూసురుల్, భుజబలజీవనుల్ భూమిభుజులు
నీతోడ నా కిప్డు నెగడొందునది తీవ్ర,వాగ్యుద్ధ మనుటయు బ్రాహ్మణుండు
బళిరె నేఁ జేసినప్రతినకుం బోల నే, నిచ్చెద నడుగు మోయినకుమార
నా నృపుఁ డది యట్టిదేని నీశతవర్ష, కృతజప్యఫలము నా కిచ్చిపుచ్చు

తే. మనుడు ద్విజుఁ డను నాజపమందు సాము, ఫలము నొందుము నీ కిచ్చుగలిగె నేని
యంతయును గొమ్ము నా వినిసంతసించి, పార్థివుఁడు బ్రాహ్మణునిఁజూచిపలికె నిట్లు.

క. మునివర! యాచించితి నీ, ఘనతర మగుజప్య మెల్లఁ గాని తదీయం

జపము మగుఫల మదెట్టిది, వినుచుము శుభ మగుత నీకు వెడలెద నేనున్.

వ. అనిన విప్రుండును. 305

క. ఫలమెఱుఁగఁ గాని నాకుం, గలజప్యం బెల్ల నీకుఁ గా నొసఁగితి భూ
తలనాథ! కాలయమమృత్యులు ధర్మువు సాక్షు లగుచు నొప్పుచు నుండన్.

క. ఒడయుఁ డను ఫల మెఱుంగని, జడజప్యము నా కిదేల క్ష్మాసుర! ఫలమున్
నుడుపవ యేనిన్ దత్ఫల, మిడికొని నీ వనుభవింపు మిదె నేఁ జనుదున్. 307

సీ. నావిప్రుఁ డిట్లను నాజపఫలము నీ, కొసఁగితిఁ బరదత్త మొందఁ నేను
మనయిరువుర కైనమాట లే యిటఁ బ్రమాణము ఫలాపేక్షను న్నలుపజపము
నెట్లు తెలియ వచ్చు నిట్టిచోఁ దత్ఫలం, బిమ్మంటి నీవు నే నిత్తు నంటిఁ
జెల్లింతు నామాట క్షితినాథ! నీసత్యమును నీవు గాపాడుకొనుము స్థిరత

తే. నానుడుల నీవు గైకొనవేని నీవ, నృతకృత మధర్మమున కొడు నీవు మృషలు
వలుక కే నాడి తప్పెడువాఁడఁ గాను, నీవు సత్యపరుండవై నెగడు మధిప.

చ. అడిగితి విత్తు నంటి నిసుమంత విచారము సేయ మైతి మి
ప్పుడు వగ పేల జాలమునఁ బోకడఁ బెట్టక కాల మిందు ర
మ్మడిగిన దాని నిచ్చెద సమంచితచిత్తముతోడఁ బుచ్చుకొ
మ్మెడయక సత్యసంధత వహింపుము నింపుము నాకు వేడుకన్. 309

ఆ. తాఁ దరింప లేఁడు తనపూర్వులఁ దరింప, సలుపఁ జాలఁ డనుచుఁ దెలుపుచుండఁ
దాను గన్న వారిఁ దరియింపఁ జేయునే, బొంకులాడువాఁడు భూతలమున.

క. యాగములన్ ధ్యానతపో,యోగములు వ్రతంబులును సమున్నతవిత్త
త్యాగములు నెవ్వియేనియు, లోఁగెడు సత్యమున కండ్రు లో నెంచి బుధుల్.

సీ. సత్యమే బ్రహ్మము సత్యమే తపమును, సత్యమే యజ్ఞము సత్యమె శ్రుతి
వేదములన్ సత్యమే దాఁగి యుండును, సత్య ముత్తమఫలసంగతంబు
సత్యమునన్ ధర్మశమను లొప్పుచునుండ్రు, సత్యమందే సమస్తంబు నుండు
సత్యమే శ్రుతమును సత్యమే యాగముల్, సత్యమే విద్యయు సత్యమె విధి

తే. సత్యమే స్తోభలునుసరస్వతియువ్రతము ప్రాణిజనన మోంకారమంత్రములుసత్య
మున రవియు నగ్ని వెలుఁగుపీఁచును బవనుఁడు,స్వర్గము ప్రతిష్ఠితంబగుసత్యమంద.

క. తులఁ బెట్టి సత్యధర్మం,బులు దూచిన సత్య మున్నమూలన్ బరువై
ములు సూపుఁ గానఁ ద్రిజగం,బుల సత్యముతోడ నెవియుఁ బోలవు వింటే.

తే. అనృతకర్మ మొనర్ప నీ వభిలషింప, నేమిటికి సత్యమున భావ మెసక మెసఁగ

మసలు మఱుఁగాక యున్న ధర్మచ్యుతుఁ డయి,హీనలోకము లందెదవిదినిజంబు.

వ. మఱియు నిచ్చెద నన్నవాఁడును బుచ్చుకొందునన్నవాఁడును దమతమమాట లం దప్పుదు రేని వారు నన్నృతదోషభాజనులగుదు రనిన రా జి ట్లనియె. 315

క. అనిఁ బొనరించుటయును బ్రజలను గాచుట యిచ్చుట క్షత్రలక్షణములుఁ గా వినుచుఁ శాస్త్రము లెవ్విధ,మున దానము గొందు విప్రపుంగవ! చెపుమా.

తే. ధరణిసురుఁ డను నీయింటి కరుగుదెంచి,నిను బలాత్కరించితి నోటున్నృపలలామ! నీవు నాకడ కరుదెంచి దేవురించి, యడిగి యిడఁ జేసికొని యిప్పు డగునెకొనమి

వ. అని వారు వివాదము పడుచున్నసమయంబున ధర్ము వి ట్లనియె. 318

తే. ఏను ధర్ముఁడ మీకడ కేగుదెంచి, నాఁడ మీకు వివాదము కూడ దిట్లు విప్రునకు దానఫలమును బృథివిపతికి,సత్యఫలమును లభియించు శాశ్వతమయి.

వ. అంత స్వర్గంబు పురుషాకృతిం దాల్చి వచ్చి యి ట్లనియె. 320

తే. స్వర్గమను నేను వచ్చితి సాధుశీల, మీవివాదము విడువుడు మీ రిరువురు తుల్యఫలభాక్కు లై యొప్పుదురయటంచుఁ,బలుకుచుండిన రా జిట్లుపలికెనలుక.

ఉ. స్వర్గముతోఁ బ్రయోజన మెసంగదు నా కిసుమంతయేని యో
స్వర్గమ! నీకు వందన మొసంగెద నీదగునిచ్చవచ్చునట్
నిర్గమనం బొనర్పు మిఁక ని న్వరియించెదనిచ్చ వచ్చు నే
నర్గళ మేమి విప్రునకు నస్మదుపార్జితపుణ్య మిచ్చెదన్. 322

మ. అన విప్రుం డను బాల్యమం దెసఁగి నే నజ్ఞానినై చేయి చా
చిన నేమయ్యె నివృత్తధర్మమున సంసేవించుచున్ సంహితన్
వినివృత్తుం డగునన్ను లోభపరుప న్నీ వెంతు నా కార్యమే
నొనరం జేసికొనంగఁ జాలుదును గా నూహింప నీసాయమున్. 323

శా. నా రా జిట్లను నీదుజప్యఫలమున్ నా కిచ్చితేనిన్ మదీ
యారంభాప్తఫలంబు నీ కిడితి నీయారెండు నీవే సమ
త్వారూఢిం గొను టుత్తమం బటులు కాదా నాదుసర్వంబు నై
కొ రాగిల్లుము ధర్మమున్ మనువు మో గోత్రామరగ్రామణీ 324

## విక్రృతివిరూపులవివాదము.

వ. అని ప్రార్థించుచున్నసమయంబునఁ గుచేలధారులు వికృతరూపులునై విరూప వికృతు లనునిరువురుపురుషు లొండొరుం గట్టుకొని యచ్చోటికి వచ్చి నీవు నాకు ఋణపడియుండ లే దని యొకండును నేను నీకు ఋణపడి యుంటిం

గైకొనక తప్పదని యింకొకండును బలుకుచుం గలహించి వా రిర్వురతో మమ్ముఁ బరీక్షించి దోషనిరూపణంబు చేయు మని రప్పుడు విరూపుం డి ట్లనియె.

క. నరవర! వికృతున కే గో, వరదానఫలంబు ఋణము పడితిని దానిన్
బరికించి తీర్తు నన నీ, పురుషుఁడుఁ గైకొనఁ డిదేమి బూమెయొ తెలియన్.

వ. వికృతుం డి ట్లనియె. 327

క. నా కీవిరూపనాముఁడు, పోకంతయు నప్పుపడఁడు పోలింప నితం
డీకడ మిథ్యావచనము, వాకొనుచున్నాఁడు నిజము పరికింపఁ గదే. 328

వ. అనిన విని రాజు విరూపునిదిక్కు మొగంబై నీ వీతని కేమిఋణంపడి యుంటి వెఱింగింపు మెఱింగి కర్తవ్య మూహింతు ననిన విరూపుం డి ట్లనియె. 329

సీ. క్షితినాథ! విను మవహితుఁడవై వికృతుండు, స్వాధ్యాయశీలియై చనెడునొక్క
బ్రాహ్మణోత్తమునకు భక్తిమై గోదాన, మిచ్చెఁ దత్ఫలము నా కిచ్చె నదుగ
బదు లీగుటకు నేను వెదకి కపిలగోవులను రెంటిఁ గొని తెచ్చి వినుతశీలుఁ
డును నుంఛవృత్తియై చనుద్విజున కొసంగి, తద్విగుణఫల మీతనిఁ బరిగ్ర
తే. హింపు మంటిని గాదాడు నీతఁ డిందు, వేఁడు శుద్ధుఁడు దోషి యెవ్వాఁడు దీని
కేము తగవాడి వచ్చితి మో మహీశ!, తగ విమర్శించి శాసింపఁ దగును దోషి.

వ. ఈతం డిచ్చినదానిని నేఁ బుచ్చుకొనిన ట్లీతండును నే నిచ్చినదానిని బుచ్చుకొను టుచితం బగున ట్లొకమార్గంబు మాకుఁ జూపు మనిన రాజేంద్రుండు వికృతుం జూచి యి ట్లనియె. 331

ఆ. ఋణము తీఱుపొందె నిచ్చుచుండె నితండు, పుచ్చుకొన వి దేల పురుషవర్య!
జాగు సేయ కాదిసమయంబునం జేసి, నడుమ వలయు దాని నెడయ రాదు.

వ. అనిన వికృతుం డి ట్లనియె. 333

ఆ. అప్పుపడితి ననుచుఁ జెప్పు నీతం డది, తప్పు వీని కేను దాన మిడితిఁ
గాని యప్పొసంగఁ గా లేదు గాన నీ,తండు వాదు విడిచి తరలు టొప్పు.

వ. రాజు వికృతుం జూచి. 335

క. ఇచ్చినను బుచ్చుకొనుటకు, నిచ్చం బొనరింపకుంటి వీ వో వికృతా!
నచ్చుదు నీవడవడి గన, నిచ్చలముగ నీవె దండనీయుఁడ వరయన్. 336

సీ. వికృతుఁ డిట్లను నేను వీని కిచ్చితి నది, వెండి కొనుట యెట్టి విధమొ కాని
యిం దపరాధము పొందఁపడిన యేని, నన్ను శిక్షింపుము న్యాయఘణితి
నన విరూపుఁడు వికృతా! నాయొసంగిన, యది యేమిటికిఁ గొనవైతి వీవు

దండింపఁ దగు దీవు ధర్మానుశాసకుం, డీరాజచంద్రుఁ డీ వెఱ్ఱిఁగికొనుము
తే. వికృతుఁ డను నీవు యాచింప విని యొసఁగితి, దత్త మెట్లు గ్రహింతు నీదారివట్టి
ప్రజ్ఞఁ గొనిపొమ్ము నీకభ్యనుజ్ఞ నిచ్చి, నాఁడ ననునంతలో నట బాడబుండు.
ఉ. రాజబిడౌజ! వింటివె కరం బరుదారఁగ వీర లిద్దఱున్
రాజసమక్షమం దిపుడు రాజిలఁ జేసినయాప్రసంగమున్
నే జగడించి చెప్పునది నీవు పౌనర్పక పోవ రాదు నా
రాజు నిజాంతరంగము నిరంతరచింతకు వంతు వోవఁగన్. 338
ఉ. ఈపురుషద్వయప్రధన మి ట్లతిగహ్వర మై తలిర్చునీ
జాపకనిశ్చయం బిటు లెసంగుచునున్నది యెట్లు లయ్యెడిన్
బాపఁ బోసంగుదానమును బట్టకయుండను బాపసంహతిన్
ద్రోపడ కుండ నెట్టులును దోఁపకయున్న దిఁ కేమి చేయుదున్. 339
వ. అని మిగుల వగలంబొగలుచు వికృతివిరూపులం గాంచి యి ట్లనియె. 340
క. మీరు గమింపుఁడు నన్నుం, జేరినరాధర్మ మెల్లఁ జేద్పడిపోయెన్
భూరక్షణాదిధర్మము, పో రహి చెడి విప్రధర్మమున కైతి నయో. 341
వ. అంత బ్రాహ్మణుండు. 342
క. యాచింప నీవు నీ కీఁ, జూచితి దానిం గ్రహించి క్షోణీశ్వర! నా
మోచినఋణ మీగం జే, సాఁచుము గాకున్న నీకు శాపం బిడుదున్. 343
వ. రా జి ట్లనియె. 344
మ. ఇసిసీ రాజకులైకధర్మ మరయన్ హీనాతిహీనంబ యై
పస వో నయ్యెడిఁ గార్యనిశ్చయ మ దీఘక్కిన్ బ్రవర్తించె నే
నొసగం బోక గ్రహింప నైతి నిది యయో్య తుల్య మె ట్లయ్యెడిన్
వ్యసనం బిప్డు నిరర్థకం బనుచు నా బ్రహ్మణ్యతో ని ట్లనున్. 345
మ. ఎపు డభ్యాసము లేక యుండినను గానీ నేఁ డపూర్వంబుగా
నృపధర్మం బతి దాఁచి యిచ్చుటకు నై నే నాదుచే సాఁచితిన్
విపులాదేవ! భవత్కృతంబు ఋణ మా నే దాని నా కిమ్ము నా
నపు డావిప్రుఁడు నాజపాత్తఫల మే నర్పించితి నీ్న కిటన్. 346
వ. అని ధారవోసినంత రాజేంద్రుండును. 347
తే. జలము పడియెను నాచేత సంయమీంద్ర, సమతగాఁదగు మనకునాసంగ్రహించు
యాగఫలమును నీ కిత్తు నదిగ్రహింపు,మనునృపాలుఁ గనివిరూపుఁ డనియెనిట్లు.

శా. కామక్రోధుల మేము మమ్మెఱుఁగు మోక్షైనాథ! మద్రూపుఁడై
భూమిం బొల్తువు నీవు తుల్యతకు నిష్ఠుర నీదుపల్కయ్యె నౌ
నౌ మీరిద్దఱు తుల్యలోకగతిమై హర్షొందఁగా నుంద్రు మే
మీమృత్యుప్రభృతుల్ పరీక్షకులమై యేతెంతు మిచ్చోటికిన్. 349

వ. అన్యోన్యనిష్కర్షంబునం జేసి సత్యంబు నిర్ధృష్టం బయ్యె నీవు నీకర్మపరిపాకంబున నెల్లలోకంబులుం జయించితివి నీయిచ్చవచ్చినలోకంబు నొందఁ బొమ్మనియె నని యమ్మందాకినీనందనుం డో ధర్మనందనా! జాపకులఫలావాప్తియు వారి గతియు వారిస్థానంబును వారిలోకంబులు నెఱింగించితి సంహితాధ్యాయి బ్రహ్మదేవునిం గాని సూర్యాగ్నులం గాని పొందు నట్లు కాకున్నఁ దేజోరూపంబున నం దందు విహరించు రాగమోహితుం డయ్యె నేని తత్తదనుకూలక్రమంబున సోమవాయ్వాదిలోకంబుల భూమ్యాకాశశరీరుండై తత్తద్గుణంబు లాచరించుచు నరాగుండై యుండు విరాగి యగువాఁడు శాంతుండును నిరాత్ముండును బ్రహ్మభూతుండును నిర్ద్వంద్వుండును నిత్యసుఖియు నిరామయుండు నై యనావర్తంబు నేకంబు నక్షరసంజ్ఞికంబును నదుఃఖంబు నజరంబు శాంతంబు నగు బ్రహ్మస్థానంబు నొంది నాలు గాఱు పదియాఱు లక్షణంబుల విహీనుం డగుపురుషు నతిక్రమించి యాకాశంబు నొందు రాగాత్ముం డగు నేని కోరినకోరికల నెల్ల ననుభవించుచు నిరయసంజ్ఞికంబు లైనలోకంబులం బొందు నిస్పృహుండు సర్వసంగవిముక్తుండై సుఖంబుండు నిది జాపకుల గతిప్రకారంబు మఱియు నేమి వినవల తనిన యుధిష్ఠిరుండు. 350

తే. అట్లు పలికినయవ్విరూపాహ్వయునకు,బ్రాహ్మణుఁడు రాజ నేముత్తర మ్మొసగిరి
తెలుపు మోతాత! వార లెం దే గమించి,రో వివాదము వారి కౌనో తెలుపుము.

వ. అనిన శాంతనవుం డి ట్లనియె. 352

సీ. అట్లగుఁ గావుత మని బ్రాహ్మణుఁడు ధర్మ,యమకాలమృత్యునాకముల నట స
మాగతు లగువసుధామరులం గొల్చి, యిక్ష్వాకుదెస మొగం బెసఁగఁ జేసి
జననాథ నాయొసంగినఫలమ్మునం గొని, యేగు ముత్తముఁడ వై యేను నీదు
నభ్యనుజ్ఞం గొనునట్టిఁడ నై దేవి, యాదేశమున జప మాచరింతు

తే. ననిన రాజును జపము నీ వభిలషింతు,వేని నాజాపకఫలంబుఁ బూని నాదు
వెంటఁ జను దెమ్ము నావుడు విప్రుఁ డప్పు, డమ్మహారాజుతో నిట్టు లనియె నలరి.

ఉ. ఏము సమాన మైనఫలమే కొని యొక్కకడ న్వసింతు మం

చీమహానీయు లెల్ల విన నీవు పొనర్తు మహాప్రయత్న మో
భూమిప! దాన నిర్వ్యరము పొందుదు మొక్కఁ డటంచుఁ బల్కుచో
నామెయి వచ్చె నింద్రుఁ డట కాత్రముతో సహలోకపాలుఁడై. 254

కౌశికేక్ష్వాకులు బ్రహ్మపదంబు నొందుట.

వ. మఱియు సాధ్యులు విశ్వేదేవులు మరుత్తులు లోనగువారును వివిధంబు లగు నదులు శైలములు సముద్రంబులు తీర్థంబులు తపంబులు వేదంబులు స్తోభలు సరస్వతియుఁ బర్వతనారదులును విశ్వావసువును హాహాహూహూలును బరివారపరివృతుం డగుచిత్రసేనుం డనుగంధర్వుండును నాగులు సిద్ధులు మునులు దేవదేవుండును బ్రజాపతియు సహస్రశీర్షుం డగువిష్ణుదేవుండును వారికడకు వచ్చి రంతరిక్షంబున దివ్యవాదిత్రంబులు మొఱసెఁ బుష్పవర్షంబు గురిసె గంధర్వులు పాడి రచ్చర లాడి రంత స్వర్గము మూర్తిభవించి రాజవిప్రులం గాంచి మీరిద్దఱు సిద్ధుల రైతి రని నంత వా రిర్వురు నేకకాలమున విషయోపసంహారము గావించి ప్రాణాపానవ్యానోదానము లను వాయువులను మనంబునం దరికట్టి భ్రూమధ్యంబునం జేర్చి నిశ్చేష్టులై నిశ్చలదృష్టితో నాత్మను మూర్ధగతంబు గావించి రంత బ్రాహ్మణునితాలుదేశము పగిలించుకొని బ్రహ్మరంధ్రంబునుండి జ్వాలమాలాకులం బగునొక్కమహాజ్యోతి వెడలి యెల్ల దిక్కుల హాహాకారంబు బోరుగలుగఁ దనతోడ బయలువెడలినరాజతేజంబు నకుఁ బ్రత్యుత్థానంబు గావించుచు దానిం గూడి త్రిదివంబునకుం జని పరబ్రహ్మం జేరినంత నతం డాప్రాదేశమాత్రపురుషులకు స్వాగతంబు పలికి జాపకులకును యోగులకును దుల్యఫలంబ కాని జాపకులకుఁ బ్రత్యుత్థానంబు విశిష్టం బింక మీరు నాయందుండుఁ డని యాస్యంబు తెఱచిన బ్రహ్మక్షత్రియు లందుఁ జొచ్చి రనంతరంబ దేవత లాబ్రహ్మదేవుం దఱియ వచ్చి నమస్కరించి దేవా! జాపకులకు విశిష్టఫలంబు ప్రత్యుత్థాన మంటివి మేము జాపకార్థ మిట వచ్చితిమి యోగిజాపకులఫల మత్యధికం బని తెలిసితిమి కాని వీరు వాంఛితం బగునేని సర్వలోకము లతిక్రమించి పోఁ జాలుదురా యనినఁ జతుర్ముఖుండు యోగిజాపకులును మహాస్మృతిపాఠకులు ననుస్మృతిపాఠకులు దేహాంతమున నాలోకమున నధివసింతురు మఱియు నితరలోకంబులును సాధింపఁ గల రని వారి నామంత్రించి యంతర్ధానంబు నొందె దేవతలును ధర్మాదులం బురస్కరించుకొని వారివారిస్థానంబులకుం జని రిట్టిది జాపకులకుం గలఫలం బింక

నే మడిగెద ననిన యుధిష్ఠిరుండు కర్మజ్ఞాన యోగంబులఫలంబును జీవునిప్రకా రంబుం జెప్పు మనిన నప్పితామహుం డీయర్థంబున నొక్కపురాతనేతిహాసంబు మనుప్రజాపతిబృహస్పతిసంవాదరూపంబై చూపట్టుచున్న దది నీప్రశ్నకు నుత్తరం బగు నాకర్ణింపుము ము న్నొకప్పుడు బృహస్పతి మనువుకడ కేగి నమస్కరించి యి ట్లనియె. 355

## మనుబృహస్పతిసంవాదము.

సీ. అనఘ! కారణ మెట్టి యది ప్రపంచమునకు, నెందు వర్తించు మంత్రేద్ధవిధులు
జ్ఞానమునకు ఫలం బైన దెట్టిది మంత్ర,శబ్దంబులకు నగోచర మ దెద్ది
యజ్ఞధేనుప్రదానాదుల నాగమ, మంత్రవేత్తలు గోరుమహితఫల మ
దెట్టిది తత్ఫల మెపు డెట్లు సిద్ధించు, మహియు మహీజముల్ మాతరిశ్వుఁ
తే. డంతరిక్షము జలము జలౌకములును, దివమును దివౌకసులుమున్న దేనివలనఁ
గలిగి రనుండు జ్ఞాన మెందులకుఁ గోరుఁ,దత్ప్రవృత్తియుమిథ్యయెద్దాననగును.

వ. నేను ఋగ్యజుస్సామాది వేదంబులును నక్షత్రగతియు నిరుక్తంబును వ్యాకర ణము సంకల్పము శిక్ష లోనగునవి యెఱింగినవాఁడ నయ్యు భూతప్రకృతి నెఱుంగని వాఁడఁ గావున నిట్లు వేఁడుచుంటి నిది యంతయు సామాన్యవిశేష శబ్దంబులం దెలియఁ జేయు మిదియుం గాక జ్ఞానంబునందును గర్మంబునందునుం గలఫలంబును దేహంబునుండి ప్రాణి యెట్లు వెడలునదియును మఱియు దేహంబు నె ట్లొందునదియును విన నభిలషించితి ననిన మను వి ట్లనియె. 357

సీ. వినుము చెప్పెద నేజనున కెద్ది ప్రియ మది, యే సుఖం బప్రియం బేది యద్ది
దుఃఖంబు గాఁ జెప్పుదురు కర్మవిధి యిష్ట,మే కావలయుఁ గాని యెపుడు నప్రి
యమ్ము కాఁగూడద యని ప్రవృత్తం బగు, నిష్ట మనిష్టంబు నిచ్చు విడుటె
జ్ఞానమార్గం బగు నానావిధము లైన, కర్మయోగము లెల్లఁ గామ్యదములు
తే. వాని విడనాడి పర మంద వలయు విడక
వానియంద ప్రవృత్తుఁడై వఱలు నేని
నిరయములఁ బొంద నయ్యెడు నరుఁడు నిశ్చ
య మ్మని వచించి మఱియు ని ట్లనియె నతఁడు. 358

సీ. మనమునన్ గర్మమునను బ్రజాసృష్టి యగు,నవి లోకజుష్టము లమలపథము
లమరుఁగర్మముశాశ్వతమునశాశ్వతమునై, యటఁగారణముమనస్త్యాగమయగుఁ
గాని యొండొక్కఁడు గాదు మోక్షార్థి ధర్మపరుఁడై మంచికర్మములఁ జేసి

పరిశుద్ధుఁ డగుఁ గర్మపథము పరంధామ,మునకు దూరము గోర్కులను దొలఁగు

ఆ. నతఁడు దానిఁ బొంద నర్హుండు వేఁకువ, కడఁ దమోవృతంబు గానికన్ను
మంచిదారిఁ జూపు మాడ్కి జ్ఞాన మ్మశు,భముల విడి సుకర్మపథముఁ జూపు.

శా. పాముల్ తేళ్లును జెట్లులున్ గుశములున్ బావుల్ తటాకంబులున్
ఆమార్గంబు లెఱింగి తప్పుకొని సన్మార్గంబునన్ మానవుల్
తా మేగం దలపోయునట్టులు లసత్కర్మంబునన్ బోయి ని
త్యామోదంబున నుంద్రు జ్ఞానులు దురూహం బోదు రజ్ఞుల్ మహిన్. 360

వ. విధివత్ప్రయుక్తము లగుమంత్రానుష్ఠానంబులు సదక్షిణాకంబు లగుయజ్ఞంబులు నన్నప్రదానంబులు పంచాత్మకం బగుమనస్సమాధియు ఫలవత్తరము లగుచున్నవి కర్మములు గుణాత్మకంబు లని నిగమంబులు పలుకుచున్నవి నిగమములే మంత్రములు కర్మములు మంత్రపూర్వంబులు కార్మికుండు ధర్మానుగుణంబుగాఁ గర్మఫలభోక్త యగుచున్నాఁడు శబ్దస్పర్శరూపరసగంధాదిఫలంబులు కర్మముచే సిద్ధించు చుండెడిని మనుష్యుం డేశరీరంబుచే నెట్టికర్మంబు చేయునో దా నాశరీరంబుచే నట్టిఫలంబు నొందఁ గలండు శరీరమే సుఖదుఃఖస్థానము వాఙ్మనః కృతం బగుకర్మము ఫలంబు వాఙ్మనంబులచేతన పొందు నెట్టిఫలం బర్థించి కర్మం బాచరించునో వాఁ డట్టిఫలంబు నొందు మత్స్యము ప్రవాహాభిముఖం బగునట్లు పూర్వకృతకర్మము నరు నంటి వచ్చు శుభకర్మమున సుఖించుటయు దుష్కర్మమున దుఃఖించుటయు మనుష్యధర్మము మఱియు జగదుత్పత్తిక్రమం బెఱింగినయాత్మవేత్తలు పొందునుత్తమపదంబు మంత్రముల దురూహంబునుం జెప్పెద విను మని మఱియును. 361

తే. రసవిముక్తము గంధవిరహిత మస్వ,నము నరూపము నస్పర్శకమును మఱియు
నమలమగ్రాహ్యమవ్యక్తమగుచు నేక, మగునదియెయైదువిధములనయ్యె మున్ను.

వ. అది స్త్రీపుంనపుంసకభేదము లేక సత్తు నసత్తును గాక వెలయుచుండు దానినే బ్రహ్మవేత్త లక్షరపరబ్రహ్మం బని తెలియుదు రంబరంబునుండి వాయువు వాయువునుండి జ్యోతి జ్యోతినుండి జలంబు జలంబునుండి భూమి భూమినుండి జగత్తును బ్రాదుర్భవించుచున్నవి మేనితో జలమును జలముతోఁ దేజమును దేజముతోఁ బవనమును బవనముతో నంతరిక్షమును గలయ మాయాతీతుఁ డై దేహి యక్షరస్వరూపుఁ డై మోక్షము నొందుచున్నాఁడు మఱియు నుష్ణము శీతము మృదువు తీక్ష్ణము తిక్తము నామ్లము కషాయము మధురమును

గాక శబ్దాదులు లేక యుండు నదియే పరమస్వభావము తనువుచే స్పర్శమును జిహ్వచే రసమును ఘ్రాణముచే గంధమును శ్రవణముచే శబ్దమును జక్షువుచే రూపంబును దెలియుదురు గాని యనధ్యాత్మవిదులు పరతత్వముం దెలియఁ జాలరు యోగులు రసాదులనుండి రసాదులు మరలించి పరతత్వముం దెలియుదురు కర్తృకారణాదిసముదాయమునకు వ్యాపకమును సాధకమును హేతువు నగునది పరవస్తుస్వరూపము నాఁబడు స్వకృతకర్మంబులం జేసి మనుష్యుఁడు శుభాశుభఫలంబు లందు నట్టిశుభాశుభశరీరములందు జ్ఞానము నిబద్ధంబై యుండు దీప మెదుట నుండునితరవస్తువులను బ్రకాశింపఁ జేయు నట్లు జ్ఞానజ్యోతి యింద్రియాదులఁ బ్రకాశింపఁ జేయును గార్యములం దమాత్యులు రాజుతోఁ గలసి యుండునట్లు తమకంటె నుత్తమ మయిన జ్ఞానజ్యోతి కధీనములై మనస్సు నింద్రియము లేక దేశగములై యుండు నని మఱియు. 363

తరళ. పవనవేగము పావకార్చులు వాహినీజలపూరముల్
రవిమరీచులు వోలె నెప్పుడు ప్రాణికోటుల దేహముల్
జివికి పోవుచు వచ్చు చెప్ప చలించుచుండెడుఁ గాని యే
ప్రవహమందు వినాశనంబును బల్కఁ జెల్లదు దేహికిన్. 364

మ. పొగయు న్నిప్పును గట్టెఁ గొట్టినఁ గనం బోరానియట్లంగముల్
దెగ నేయ న్మెయిఁ గానరాదు పర మెంతే కాష్ఠముంబట్టి త్ర
చ్చఁగ ధూమాగ్నులఁ గాంచినట్లు బుధుఁ డక్షవ్రాతముం బుద్ధితో
దగ బంధించి మథించినం బరమతత్వం బెల్లఁ గాన్పించెడిన్. 365

చ. కలలోనన్ దనమేను నేలఁ బడుటన్ గన్గొంచుఁ దా నన్యున
ట్లులు గన్పట్టును గాన దేహమున కెప్డున్ భిన్నుఁడై జీవుఁ డొ
డ్డులు మేనుల్ గొని ధీమనోక్షములతోడుం గల్గి లింగాంతరం
బులఁ బొల్పొందు నటంచు నీకుఁ దెలియం బోలున్ బుధేంద్రోత్తమా. 366

సీ. ఉత్పత్తియును వృద్ధియును వ్యయంబును లేక, కర్మానుసారము గాఁ జిదాత్మ
దేహాంతరము నొందు దృక్ఛ్రవణాదులఁ, గనఁడు వినఁడు నెట్టి కార్య మైనఁ
జేయఁ డాజీవుఁడు పాయక వానికి, సాక్షియై యుండు నేసమయమందు
జ్వలనసంపర్కమువలన నొం డొక్కఁడు, తాపరూపంబును దాల్చుకరణి
తే. దేహగతదుఃఖములు దోఁచు దేహియందు, నింద్రియోపహితంబగునీశ్వరాత్మ

యెల్లగుణములు గలదని యెంచఁబడుచు, నింద్రియములుద్గఁ బరవస్తు వేయనఁబడు.
తే. అది రజస్సత్త్వతమముల నంటకున్న; స్థానగుణసంగతిం జేసి తా విరూప
మంది యింధనస్థాగ్నిని ననిలమట్లు, లింద్రియముల నావేశించు నెల్లనాఁడు 363
క. తెలియఁగ శ్రోత్రాదీంద్రియ,ములు తముఁ దాఁ దెలియ లేవు పూర్ణప్రజ్ఞుం
డలఘుఁ డగునతఁడు వానిం, దెలియుఁ గా సర్వజ్ఞుఁ డౌట దేశికవర్యా. 369
క. హిమవత్పార్శ్వగతుం డై, హిమకరుఁ డగపడకయున్న నేఁడీ లేడం
డు మె భూతాత్ము నతనిఁ గా, నమి లే డని పలుకు టొప్పునా విజ్ఞులకుఁ గా. 370
క. చందునిలో పలికందుం, గందురు మచ్చంచు రది జగం బనుకొన రా
చందమున జ్ఞాన ముండియు, నందఱు నిజ మైనజ్ఞాన మందరు వింటే. 371
సీ. పుట్టుటకు మున్ను గిట్టుటకు న్వెన్క, వస్తువునకు రూపు వఱలకునికి
రూపవంతముల నరూపవంతములుగాఁ, దలఁతురు విజ్ఞులు తపనునిగతి
తెలియకున్నను గతి గల దని యుదయాస్త,మయములం బట్టి నిశ్చయము సేయు
నటులు దూరస్థ మౌ నాత్మను బుద్ధిదీ,పము చేత నరయుచుఁ దమకు సన్ని
తే. హితము లగుజ్ఞేయముల జ్ఞానయుతము సతము
నైన బ్రహ్మము నొందింప నభిలషింత్రు
జ్ఞానమునఁ జేసి కార్యము చక్కఁ బెట్టు
కొంద్రు దేని కుపాయమే కుదురవలయు. 372
తే. మృగవధాజీవి మృగము చే మృగము పక్షి, చేతఁ బక్షిని ద్విరదము చేఁ ద్విరదముఁ
జేపచేఁ జేపఁ బట్టెడుఁ జెల్మి నట్లు, జ్ఞానమునఁ జేసి జ్ఞేయము గాన వచ్చు. 373
తే. పాముకాళ్లు పాము పరికింపఁ గలయట్లు, మూర్తులందునుండి మూర్తిమంత
మనఁగ నొప్పుజ్ఞేయమును జ్ఞానమునఁ జేసి, తెలిసికొనఁగ వలయు స్థిమితగతుల.
సీ. చంద్రుఁ డమావాస్య జాడ లేకుండిన, లేఁ డని చెప్పుట కూడ దట్టు
లాత్మ బుద్ధికిఁ దోపనంత నభావము, పూని వచించుట కానిమాట
క్షీణకోశుం డయి శీతాంశుఁ డమవస, వెలుఁగ నట్టులు మూర్తి విడిచి దేహి
వెలుఁగఁ డవ్వల నెల విన్నెక్కి కన వచ్చు, పగిది దేహాంతరప్రాప్తి నతఁడు
తే అలరు జన్మవృద్ధిక్షయములు కళానిధికి బలెఁ గా మేని కే కాని దేహి కెపుడు
వెలుగ వబ్బునిఁ దమ మంటి విడిచిపోవు, నట్లు దేహియు దేహము నంటి విడుచు.
తే. అరయఁ జంద్రార్కసంయుక్తుఁ డయినయపుడె, రాహువగపడుఁ గానప్డు రాదు కాన
నప్పగిది దేహనిర్ముక్తుఁ డైనయపుడు, దేహి కానంగ రాఁ డని తెలియు మనఘ.

క. ఆమనసఁ జక్కులఁ గలసియు, హిమధాముఁడు కన్నుఁగవకు నేరుపడనిచం
దమునన్ దేహియు దేహ, ప్రముక్తుఁడై కర్మఫలము బడయఁగ నుండున్. 377

క. ఈయవ్యక్తము నిదురం, బోయిన జేతనము దిరుగఁ బోవున్ జ్ఞానం
బాయెడ నింద్రియయుక్తం, బై యుండు భవాభవంబు లట్లగుఁ దెగినన్. 378

సీ. కన వచ్చు విమలోదకములందు రూపము, కలుషోదకములందుఁ గాన రాద
యటులు ప్రసన్నేంద్రియము లగునప్డు జ్ఞేయమును జ్ఞానంబున నరయ వచ్చు
నప్రసన్నము లైనయప్పుడు జ్ఞేయమున్, జ్ఞానమునన్ జూడఁ జాల మెప్పు
డజ్ఞానమున మన మాకృష్టమై దుష్టమైననింద్రియముల కగును వికృతి
తే. జ్ఞానహీనుఁడు విషయసంసక్తుఁ డగుచుఁ, దృప్తి లేకుండు జ్ఞానము తేలినపుడు
విమలమై యాత్మ విషయనివృత్తి నొందుఁ, గన నతృప్తికిఁ బాపమే కారణంబు.

వ. పాపము నశించిన దురాశ నశించును శాశ్వతునికి విషయసంసర్గమువలనఁ బరంబు గలుగ నేరదు పురుషులకుఁ బాపకర్మక్షయంబున జ్ఞానోత్పత్తియై యద్దమునఁ దనమోమును బోలెఁ దన్నుఁ దాఁ జూడం గలుగు నింద్రియప్రసారంబు దుఃఖంబు నింద్రియనియమనంబు సుఖంబు గావున నింద్రియములనుండి మనంబు మరలింప వలయును మన స్సింద్రియములకుఁ బూర్వమైనది తరువాత బుద్ధి జ్ఞానము పిమ్మట మహత్పదార్థము నొప్పు నవ్యక్తమునుండి జ్ఞానము జ్ఞానమునుండి బుద్ధి బుద్ధినుండి మనము ప్రసృతంబు లగుచుండు మనము శ్రోత్రాదిసంయుక్తమై శబ్దాదుల నెఱుంగుచున్న వెవ్వఁ డావిషయాదులను విడుచునో వాఁడు సర్వవ్యక్తుల విడిచి నిర్వాణంబు నొందుచున్నాఁడు. 380

చ. రవి యుదయించుచున్ దొలుత రశ్ములు సృష్టి యొనర్చి క్రుంకుప్రా
ద్దపునపు డన్నిటిన్ మరల నాత్మగతంబుగఁ గొంచుఁ బోవు న
ట్లవిరత మంతరాత్ముఁడు ప్రియంబున నింద్రియరశ్ములన్ మెయిన్
దవిలియుఁ దద్గుణంబులను దాఁ గొని యస్తము నొందు వానితోన్. 381

సీ. మఱియు జీవుఁడు కర్మమార్గ మనుసరించి, కర్మఫలంబును గాంచుచుండు
విషయనివృత్తి యాశ వెస నిరాహారికి, బుద్ధి కర్మగుణాళిఁ బోవఁ జేసి
స్వాంతంబుతోఁ గూడి నంత లయం బయి, బ్రహ్మత్వసిద్ధిని బడయఁ గలుగు
నపుడ సత్వమ్మింద్రియగుణంబులన్ విడ,నాడి పరమపదం బందునట్లు
తే. ఆకృతులు మనోమగ్నము లైనయపుడు, మనముమదిఁ జేరుమదిజ్ఞానమార్గమందు
జ్ఞానము పరమ్ము నొందు నీచంద మెల్ల, నాత్మవేత్త లెఱింగినయట్టియదియ.

తే. పొదల దింద్రియముల చేతమదికి సిద్ధి, మది యెఱుంగదు బుద్ధినయ్యది యెఱుంగఁ
జాల దవ్యక్తవస్తు వీసర్వ మెఱుఁగు, నట్టిదై యుండుసూక్ష్మ మానాత్మ యొకఁడ.

శా. శారీరంబులు మానసంబు లని యెంచం బొల్చుదుఃఖంబులన్
జేరం బోవనిమార్గమున్ వెదుకఁగాఁ జేయం దగున్ యత్నమున్
సారప్రజ్ఞఁ దలంప కుంటయ యగున్ దద్దుఃఖభేషజ్య మే
దారిన్ గాని యొకింత చింత యగునేఁ దాపించెడిన్ వెండియున్. 334

తరు మానసంబును బ్రజ్ఞ మరలింప నొప్పు; మరియు శారీరంబు మందులఁ జేసి
జా నైనరూపంబు జవ్వనము ధన,సంచయమున్ మిత్రసంగతి బ్రదుకు
నా నొప్పునివి వీని నమ్మి మేధావి, నటియించుచుండఁ డనారత మెడఁద
జానపదిక మయి చనుదెంచుదుఃఖ,చయముఁ బరిహరింప జతనంబు దగును.

చ. జనునకు జీవితంబునను సౌఖ్యముకంటెను దుఃఖమె చ్చనం
జను విషయప్రసంగతుఁడు జ్ఞానవిహీనత మృత్యు వన్నఁ జం
కునఁ బడు దుఃఖసౌఖ్యములకున్ వెలి యైనవిపశ్చిదగ్రియుం
డనయము బ్రహ్మముం గని సుఖానుభవంబున సంతసించెడున్. 386

క. ధనమార్జించుటయందున్, ధనపాలనమందు దానినాశనమందున్
ఘనతరదుఃఖమ కావున, ధనమున కెద నాస సేయఁ దగ దెవ్వరికిన్. 387

సీ. జ్ఞానము జ్ఞేయము చే నెఱవేఱు నా,జ్ఞానగుణమె మనం బై నెఱి గను
నదియె ప్రజ్ఞాయుక్త మై బుద్ధి నాఁబడు, నాబుద్ధి కర్మగుణాంచిత మయి
మదితోడఁ గూడి నెమ్మది ధ్యానయోగము, సలిపిన బ్రహ్మముం దెలియ వచ్చు
గిరికూటముననుండి క్రిందికి దిగువారి,వలె గుణయుక్తమై వఱలుబుద్ధి

తే. కర్మగుణములతో మది గలసి మూఢ,మగును నిర్గుణమై మది నంటి ధ్యాన
కలిత మగునేని బ్రహ్మముఁ గాన వచ్చు, నికషమున స్వర్ణ రేఖ మాడికి మునీంద్ర.

ఆ. స్వాంత మాది నింద్రియార్థనిదర్శక,మగుచు నపహృతంబ యగుసమక్ష
గుణములం దపేక్ష గొని నిర్గుణనిదర్శ,కంబ యగుచు నుండుఁ గదె మునీంద్ర.

తే. యోగి సర్వేంద్రియద్వారభాగములను, గప్పి సంకల్పరూపము గా నొసంగు
మనము నేకాగ్రముగఁ జేసి మసలుచున్నఁ,బరమునొందఁ గలండని పండితోక్తి.

క. తమకుం దామ మహాభూ,తము లెట్లు గుణక్షయంబు తఱి మఱలెడు నా
క్రమమున నింద్రియములతో, సముపస్థిత మగును బుద్ధి స్వాంతమునందున్.

తే. ఎప్డు వ్యవసాయగుణమున నెసఁగుబుద్ధి, మనమునన్ లీనమగునప్డు మనమునదియు

ధ్యానమునఁజేసి గుణములఁదరలఁగొట్టి, నిర్గుణబ్రహ్మమునుబొంది నెగడుచుండు.

మ. అది యవ్యక్తనిదర్శనం బగుచు దృష్టాంతంబు లేకుంటఁ ద
త్పదముం గాంచుట దుర్లభం బయిన శుద్ధస్వాంతముల్ సత్తపం
బు దమంబుల్ శ్రుతముల్ శమంబు మననంబుల్ జాతియు న్నీతియుల్
బొదలం గల్గినయోగివర్యుఁ డయినన్ బొందంగ సాధ్యం బగున్. 393

సీ. అంతర్బహిర్వ్యాప్త మయ్యు నయ్యదిగుణా,భావమై చిత్స్వరూపంబ యగుటఁ
దర్కింప రాకుండుఁ దా నింధనంబున, వైశ్వానరునియట్లు వఱలు చుండి
సగుణమై బ్రహ్మముం దగులంగఁ జాలదు, నిర్గుణమై బ్రహ్మనిష్ఠిత మగుఁ
బంచేంద్రియమ్ములు స్వస్వకర్మ్ముల, వదలిన బ్రహ్మము వదలుఁ బ్రకృతి

ఆ. ఇట్లు ప్రకృతినుండి యే జీవు లెల్లఁ బ్ర,వృత్తిభావ మాశ్రయించి మోహ
ముడుగఁగా నివృత్తినొందుఁ గాకుండిన, స్వర్గ మొందుననుచు వలయు నెఱుఁగ.

సీ. పురుషుండు ప్రకృతియుబుద్ధియువిషయసం,ఘము నింద్రియములహంకార మాన
ములు నను నియ్యవి భూతసంజ్ఞం బొల్చు, పరఁగునీయాత్మకుఁ బ్రథమవృత్తి
తన రెడు ప్రకృతివలన ద్వితీయప్రవృ,త్తిమిథునవ్యక్తిమై నమరఁబనుచు
క్షితిని ధర్మముచేత శ్రేయ మధర్మము,చేత నశ్రేయము నాతత మగు

తే. రాగవంతుఁడుప్రకృతిమైఁ గ్రాలుచుండు, రాగహీనుఁడుజ్ఞానియైరమణమెరయు
ననుచు వచియించి మేధావి యైనమనువు,జీవునిం గాంచి మఱియును జెప్పెనిట్లు.

క. వినుము సవిషయేంద్రియముల, మనమును నరికట్టె నేని మణిహారమునం
దొనరినసూత్రము వోలెన్, గన వచ్చున్ బ్రహ్మ మనుచు ఘను లనిరనఘా.

తే. స్వర్ణరజతముక్తామృత్ప్రవాళగోళ, ములఁ నెసంగెడుసూత్రము వలెఁ జిదాత్మ
గోశ్వమానవమృగకీటకోటులందు, నమరియుండు స్వకర్మవశమునఁజేసి. 397

క. ఏయేదేహంబులతో, నేయేకర్మములఁ జేసి యొనఁగునొ జీవుం
డాయాదేహంబులతో, నాయాకర్మములఫలము నందుచు నుండున్. 398

తే. ఏకరస మైనభూమి యనేకగతుల, నోషధులఁ జేసి మాఱెడునోజ, కలిమి
నంతరాత్మయె సాక్షిగా నలరుబుద్ధి, కర్మఫలసంగతిన్ మార్పు గాంచుచుండు.

వ. జ్ఞానపూర్వకముగా వాంఛయు వాంఛాపూర్వకముగా నభిసంధియు నభిసంధి
పూర్వకముగాఁ గర్మమును గర్మమూలకముగా ఫలంబును గలుగుచుండు
ఫలము కర్మాత్మకము కర్మము జ్ఞేయాత్మకము జ్ఞేయము జ్ఞానాత్మకము జ్ఞానము
సదసదాత్మకము జ్ఞానజ్ఞేయకర్మఫలము నశించిన జ్ఞేయప్రతిష్ఠితం బగుదివ్యజ్ఞాన

ఫలమును బొంది యోగు లమ్మహద్భూతముఁ గాంచుచున్నారు గుణబద్ధు లగునజ్ఞు లెఱుంగఁ జాలరు వినుము. 400

సీ. భూమిరూపముకంటె భువనరూపము దాని, కంటెఁ దేజము దానికంటె నాకా
గము దానికంటె నాకసమును దానికం,టె మనంబు దానికంటెను మనీష
దానికంటెను గాల మౌను మహత్తర, ములు దానికంటెను భువనరూపి
భగవంతుఁ డగువిష్ణుఁ డగు మహత్తరుఁ డమ్మ,హాత్మున కాదిమధ్యాంతగతులు
తే. లేవు గావున నవ్యయుఁడై వెలుంగు, దుఃఖశూన్య మమర్త్యమై తోఁచునతని
రూపె బ్రహ్మము తద్ధామమే పరమము, దానిఁ గని ముక్తు లౌదురుమానివరులు.

వ. మఱియు నిర్గుణంబును నివృత్తిలక్షణంబు నగునాపరతత్త్వమును జీవాగ్ర ప్రవర్తకంబు లగుబుగ్యజుస్సామంబు లెంతయుఁ బ్రయత్నించియుఁ దమకంటె నాది యగునయ్యనంతు నాదిమధ్యాంతశూన్యు నవ్యయు నతనిం దెలిసికొనం జాల వనిన గుణార్థులును విషయసంసక్తులు ఫలాకాంక్షు లగువారు తెలిసి కొందు రనుట సత్యదూరం బాపరతత్త్వము సూక్ష్మం బగుమనోజ్ఞానంబుచేఁ దెలి యం దగును గాని వాగ్గోచరంబు గా నేరదు మనంబుచేత మనంబును దర్శ నంబుచేత దర్శనంబును గ్రహింపవలయును జ్ఞానంబున బుద్ధి నిర్మలంబు గావించి దానితో మనంబును మనంబుతో నింద్రియగ్రామంబునుం గలిపి పరంబు నెఱుంగ వలయు నని మనువు బృహస్పతికిం జెప్పినవిధంబు చెప్పిన నప్పాండవాగ్రజుండు పుండరీకాక్షునితత్త్వం బెల్లఁ దెల్లంబు గావింపు మనిన దేవనదీసంభవుండు జామదగ్న్య నారద కృష్ణద్వైపాయ నాసిత దేవల వాల్మీకి మార్కండేయాదులు నాకుఁ జెప్పినచొప్పునం జెప్పెద విను మని యి ట్లనియె. 402

భీష్ముఁడు ధర్మరాజునకు విష్ణుమంత్రప్రభావం బెఱింగించుట.

మ. నరనాథాగ్రణి ! కేశవుండు త్రిజగన్నాథుం డితండే మహా
పురుషుం డీభగవంతునిన్ బుధవరుల్ పూజించుచున్ దన్మహా
త్తరమాహాత్మ్యము వెల్లడించుచును దత్త్వజ్ఞానదృష్టిన్ నుతిం
తురు నానాగతులన్ దదర్థముల నీతోఁ జెప్పి యొప్పించెదన్. 403

శా. భూతాత్ముం డగునమ్మహాపురుషుఁడే భూతంబు లేనింటినిన్
జేతోమోదముతోడఁ జేసి శయనించెన్ సర్వతేజోమయుం
డై తత్తోయములందుఁ బొందుపడి దివ్యచ్ఛక్తి భూతాదిగా

ఖ్యాతిం గాంచినదివ్యరూపధరునిం గల్పించె సంకర్షణుఁ౯. 404

క. ఆతఁడె భూతాశ్రయమై, భూతభవిష్యములఁ దాల్చి పొల్చె ఘనుండై
యాతనినాభిన్ రవిసమ, మై తనరెం బద్మ మొక్కఁ డభ్యంచితమై. 405

సీ. ఆనాభిపద్మమం దవతరించెఁ౯ సర్వ,భూతపితామహుండై తలిర్చి
బ్రహ్మదేవుఁ డతండు ప్రాదుర్భవించిన, పిదపఁ దమస్సుచేఁ బేరుకొనుచు
నుదయించె మధుఁ డనునొక్కమహాసురుం, డుగ్రకర్ముం డయి యుండ నెఱిఁగి
పురుషోత్తముఁడు వానిపొడ వడంగించెను, నల్వనుఁ బ్రీతిగా నాఁటినుండి

తే. యాదవశ్రేష్ఠునకు మధుసూదనుఁ డని, పేరు వచ్చె నంతట బ్రహ్మ కోరికిమెయి
మానసుల దక్షసప్తము లైనవారిఁ, దనయులం గాంచె వారల వినుతు వినుము.

వ. మరీచి యత్రి యంగిరసుఁడు పులస్త్యుఁడు పులహుఁడు క్రతువు ననువారందు మరీచి కశ్యపుం డను బ్రహ్మవిత్తముని మానసపుత్త్రునిం గనియె నాహిరణ్యగర్భుండు మరీచికన్న మున్నుగాఁ దనయంగుష్ఠంబునుండి దక్షుని సృజియించె నాదక్షప్రజాపతికి దితిప్రభృతులు ముప్పదుగురు కన్య లుదయించిరి వారికి సర్వధర్మవిశేషజ్ఞుండును మరీచిపుత్త్రుం డగు కాశ్యపుండు పతి యయ్యె మఱియు దక్షప్రజాపతి పదుగురు కన్నెలం గని ధర్మున కొసంగె నాధర్మునకు వసువులు రుద్రులు విశ్వేదేవులు సాధ్యులు మరుత్వంతులుం గలిగిరి మఱియు నిర్వదేడ్వురగు కాశ్యపపుత్త్రికలకు సోముండు భర్త యయ్యెఁ దదితరకన్యలు గంధర్వులను దురగులను గిన్నరులను గింపురుషులను గోవులను ద్విజులను మత్స్యములను నుద్భిజ్జములను వనస్పతులం గాంచి రదితి దేవశ్రేష్ఠులగునాదిత్యులం గాంచె వారిలో విష్ణుండు వామనుండై వాసిం గాంచె నతనివిక్రమణంబున దేవతలసంపద యభివృద్ధిం గాంచె దైత్యదానవాసురులు పరాభూతులైరి పిదప దనువు విప్రచిత్తి ప్రధానుల దానవులం బుట్టించె దితి మహాసత్త్వులగునసురులం గనియె నంత మధుసూదనుం డహోరాత్రపూర్వాహ్ణాపరాహ్ణాదికాలవిభాగంబు గావించె నతనిధ్యానమూలమున నే మేఘములు స్థావరజంగమములు పృథివియుం బ్రభవించెఁ బదంపడి నాకృష్ణభగవానుండు తనముఖంబునుండి బ్రాహ్మణశతంబును బాహువులనుండి రాజన్యశతంబులును నూరువులనుండి వైశ్యశతంబును బదంబులనుండి శూద్రశతంబునుం గల్పించె నిట్లు నాల్గువర్ణంబులం గల్పించి సర్వభూతములకు నధ్యక్షునిగా వేదవిద్యావిధాత యగువిధాత నాదేశించి భూతమాతృగణా

ధ్యక్షునిగా విరూపాక్షుని బాపంబులు శాసించి పితృదేవతలం బాలించుటకు సమవర్తిని నిధులఁ బాలించుటకుఁ గుబేరుని సముద్రముల నేలుటకు వరుణుని దేవతలఁ బరిపాలించుటకు నింద్రుని సృజియించి నియమించె నని మఱియును.

సీ. ప్రజలకుఁ దేహధారణవాంఛ యగునంత,వఱకు యమునిభీతి వదలి వారు
జీవించుచుండిరి చిత్తమై నంతనే, సంతానమును గాంచఁ జాలియుండి
రెపుడు మైథునధర్మ మెఱుఁగరు త్రేతాయు,గమునసంస్పర్శమాత్రమునఁ బ్రజలు
దనరి రప్పుడును మైథునము లే దవల ద్వా,పరమున మైథునపరత యయ్యెఁ

తే. గలియుగంబున ద్వంద్వముల్ గానవచ్చె, మైథునంబును హెచ్చెనీమానవుండు
భూతపతి వీఁడు భూపతి యీతఁ డలఁతి, యనెడు భేదము లేర్పడె నవనినాథ.

వ. ఇఁక నిరయాపేక్షులం జెప్పెద నాలకింపుము దక్షిణాపథంబున నంధకులు పుళిందులు గుహులు శబరులు చుచుకులు మద్రకులు నుత్తరాపథంబున యవనులు కాంభోజులు గాంధారులు కిరాతులు బర్బరులునుం బ్రబలి మాంస భక్షులు గృధ్రధర్ములు పాపకర్ములై ప్రవర్తించి రిట్టివారు కృతయుగంబున లేరు త్రేతాయుగంబునుండి ప్రవృద్ధిం గాంచి రట్టిఘోర కాలంబున రాజుల కన్యోన్య వైరంబున మహాయుద్ధములు ప్రవర్తిల్లె నిట్లు సృష్టిక్రమంబు నాయెఱింగినంత వట్టు నీ కెఱింగించితి నీపుండరీకాక్షుండు సాక్షాన్మహావిష్ణుం డిది యంతయు నీతనిప్రభావం బనిన భరతర్షభుండు పరమానందభరితుండై తొల్లింటికాలం బునం బ్రజల కెవ్వ రధినాథులు ఋషు లెవ్వరు చెప్ప ననుగ్రహింపు మనిన నిలింపనదీనందనుండు వెండియు. 409

◆ భీష్ముండు పూర్వాధినాథులం దెలుపుట. ◆

సీ. వినుముసనాతనుండునుస్వయంభువునాద్యుఁ,డగుబ్రహ్మయొక్కఁడేయలరుచుండు
నతనిపుత్త్రులు మరీచ్యత్ర్యంగిరఃపుల,స్త్యపులహక్రతువసిష్ఠాఖ్యు లేడ్వు
రందు స్వాయంభు వనం దలిర్చె వసిష్ఠుఁ, డాయేడ్వురును బ్రహ్మ లనఁగ నొప్పి
రత్రివంశమ్మున కైన ప్రాచీనబర్హి కిని బ్రాచేతసు లెన్న సుతులు

తే. పదుగు రందఱకుఁ దక్షుఁ డొదవె నొక్కఁ
డతనికిఁ బ్రజాపతియు బ్రహ్మ యనఁగఁ బేర్లు
పొదలె నమ్మరీచికిఁ గశ్యపుఁడు జనించె
నాతని కరిష్టనేమి నామాంతరంబు. 410

వ. అత్రికి సోముఁ డర్యముఁ డనునిర్వు రౌరసపుత్త్రు లందు నర్యముఁడు వేయి

దివ్యయుగంబులు తపోనిష్ఠుండై యుండె నని మఱియును. 411

సీ. శశిబిందునకు దశసాహస్రసతులందు, నొక్కొకరిత వేగు రుదితబలుల
సుతులఁ గనెఁ వారు శతసహస్రశతంబు, లెక్కకు నైరి వా రొక్కనిని బ్ర
జాపతి యన నిచ్చ సలుపఁ బ్రజ శశి, బిందునిదే యని విప్రులందు
రిశశిబిందుఁడు సృష్టివంశమున బ్రభవుఁడు ప్రజాపతివంశకరుఁడు

తే. కావున యశోవిశాలురు ఘనభుజు లగు, సదమలాత్ములు వీరు ప్రజాపతు లని
జనసముద్దిష్టులై రింక జగదధీశు,లైనవేల్పులఁ జెప్పెదఁ నవధరింపు. 412

వ. భర్గుఁ డంశుఁ డర్యముఁడు మిత్రుఁడు వరుణుఁడు సవిత దాత వివస్వంతుఁడు త్వష్ట పూష యింద్రుఁడు విష్ణువు ననుద్వాదశాదిత్యులు కశ్యపునాత్మసంభవులు నాసత్యుఁడు దస్రుఁడు ననునాశ్వినులిరువురు నష్టమమార్తండునకుఁ బుత్రులు త్వష్టపుత్త్రుం డగువిశ్వరూపుఁ డజైకపాత్తు నహిర్బుధ్న్యుఁడు విరూపాక్షుఁడు రైవతుఁడు హరుఁడు బహురూపుఁడు త్ర్యంబకుఁడు సావిత్రుఁడు జయంతుఁడు పినాకి యనువారు నష్టవసువులును మనుప్రజాపతికాలమున దేవతలుగా నుండి రవల దేవత లనియుఁ బితృదేవత లనియు రెండుతెగలుగా వ్యవహరింపఁ బడుచుండిరి మఱియు సిద్ధులు సాధ్యులును శీలయౌవనములం జేసి రెండుతెగ లైరి మఱియు ఋషభులు మరుత్తులు విశ్వేదేవు లశ్వినులు దేవగణంబులలోనివా రాదిత్యులు క్షత్త్రియులు, మరుత్తులు వైశ్యు, లశ్వినులు శూద్రు, లంగిరసులు బ్రాహ్మణు, లిట్లు దేవతలందును జాతుర్వర్ణ్యము ప్రకీర్తితము ప్రాతఃకాలముల నీదేవతలఁ స్మరించిన సర్వపాపంబులు నశించు నవక్రీతుఁడు రైభ్యుఁడు నర్వావసుఁడు పరావసుఁడు నౌషిజుఁడుకాక్షీవంతుఁడు బలుఁడు మేధాతిథి కణ్వుఁడు బర్హిషదుఁడు లోనగువారు ప్రాచ్యులగుసప్తర్షు లున్ముచుఁడు విముచుఁడు స్వస్తి యాత్రేయుఁడు ప్రముచుఁ డిధ్మవాహుఁడు దృఢవ్రతుఁడు మిత్త్రావరుణపుత్త్రుం డగునగస్త్యుఁడు వీరు దాక్షిణాత్య లగుబ్రహ్మర్షు లుషంగుఁడు కవషుఁడు ధౌమ్యుఁడు పరివ్యాధుఁ డేకతుఁడు ద్వితుఁడు త్రితుఁడు నత్రిపుత్త్రుఁ డగుసారస్వతుఁడు వీరు పాశ్చాత్యులగుమహాత్ము లాత్రేయుఁడు వసిష్ఠుఁడు కాశ్యపుఁడు గౌతముఁడు భరద్వాజుఁడు విశ్వామిత్రుఁడు కౌశికుఁడు ఋచీకపుత్త్రుం డగుజమదగ్ని వీ రేడ్వురు నౌత్తరాహులు వీ రిట్లు భువనంబులకు సాక్షిభూతులై ప్రతిదిక్కు నాశ్రయించి యుండిరి వీరిసంకీర్తనంబు సర్వపాపాపహం బని చెప్పినఁ బాండవాగ్రజుండు పితామహునిదిక్కు మొగం బై. 413

మ. భగవంతుం డగువాసుదేవునిమహత్త్వం బద్వితీయంబు దే
వగణస్తుత్యము తద్విధంబు విన నాస్వాంతంబు వాంఛించె నా
జగదారాధ్యుఁడు తిర్యగాకృతుల నేచందంబునం దాల్చెనో
తగుకర్జంబు ల వేమియో తెలుపు మోధర్మజ్ఞచూడామణీ. 414

వ. అనిన భీష్ముం డి ట్లనియె. 415

క. మును మృగయాఖేలనమున, మనమై నే నొక్కనాఁడు మార్కండేయా
వని కేగి కంటి నచటన్, మొనసి సమాసీను లైనమునితల్లజులన్. 416

క. వేలకొలందిగ నట స,త్కాలక్షేపంబు చేయుతాపసివర్యుల్
పాలించి నన్నుఁ గైకొని, పూలున్ మధుపర్క మిచ్చి పూజించి రటన్. 417

వ. నేను వారి నభినందించి విశ్రమించియున్నసమయంబున నట నున్నకశ్యపర్షి
యొక్కమనోహర మగుకథం జెప్పె దానిం జెప్పెద నేకమనస్కుండ వై విను
మని యి ట్లనియె. 418

మ. నరకాదుల్ మును దానవప్రవరు లెన్నన్ దానిపిర్యంబునన్
గురువుల్ వాఙిన క్రోధలోభములతోఁ గోటానఁగోటుల్ భటుల్
పరివేష్టింపఁగ దాడివచ్చి యమరవ్రాతంబులన్ దాఁకి దు
ర్భరయుద్ధం బొనరించి నొంచిరి కడున్ గ్రౌర్యం బవార్యంబుగన్. 419

క. వేల్పులసమృద్ధి కోర్వక, నల్వంబగుమత్సరంబు స్వాంతములందున్
గల్పించుకొనుచు దనుజులు, కోల్పులులై మాటి కార్తి గుడిపి రమరులన్. 420

తే. దనుజపీడితులై దేవతలును ఋషులు, సుక మొకప్పు డొకింతయుఁ జూడఁబోక
వగలఁ గుడుచుచు వివశులై వారిజాస,నునికడకు నేగి యి ట్లని వినిచి రెఱఁగి

ఉ. రాయిడి కోర్వఁ జాలము పరాఙ్ముఖు లై లిమి దైత్యకోటికిన్
మాయిడుమల్ వచించుటకు మాటలు దోఁపవు భూతలంబు దుః
ఖాయిత మయ్యె భూతతతి కాఙియ నొందెడు సర్వసంపదల్
పాయవడెన్ మహాసురులప్రల్లదనంబునఁ బద్మసంభవా! 422

క. మముఁ గావు మనుచు విన్నప, మమరించుచు నున్నఁ గాంచి యరవిందభవుం
డమరేంద్రులార! చెప్పం,గ మ జేమిటి కెఱుఁగ వచ్చెఁ గ్రమ మది యెల్లన్.

క. వరబలసంపన్నత నా, సురవైరులు తమకు వచ్చుచో ప్పనయఁగఁ జా
లర యగుచుఁ గన్ను గానక, పరివర్తించెదరు వైష్ణవం బెఱుఁగ రయో. 424

చ. అమరుల కేని కానఁ బడనట్టితెఱంగునఁ దా వరాహరూ

పమున గమించి భూవివరపద్ధతులం దొోగి డాఁగియున్నదు
గ్ధము లగునాసురద్విషుల రాసీ వధించెదు నింతలోన మీా
రమరిననెమ్మదిం జనుఁ డనంతరసౌఖ్యము సంస్మరించుచున్. 425

వ. అని యానతిచ్చిన వియచ్చరు లత్యంతానందకందళితహృదయారవిందు లై యాథాగతకృతగమను లై రంతఁ గొంతలోన. 426

శా. వైకుంఠుండు వరాహమూర్తి యగుచున్ వర్తించి కీర్తింప నై
లోకాతీతపరాక్రమక్రమమునన్ లోఁ దేజు రాజిల్ల న
స్తోకప్రక్రియ భూమిగర్భగతుఁడై శోధించి వేధించుచున్
గేకల్ వేయుచు దైత్యసంఘములచక్కిం జేరె నొక్కుమ్మడిన్. 427

క. అయ్యతిమానుషసత్వము, నయ్యసురులు చూచి మోహితాత్మకు లగుచున్
జయ్యన దానిం బట్టిరి, బ్రుయ్యఁగనై చుట్టుముట్టి ప్రోద్బల మెసఁగన్. 428

తే. పట్టి యాకర్షణము సేయునట్టి రగుచు, నట్టు నిట్టును గదలుప నైతి గాక
భూరిసత్వులు దై తేయవీరు లపుడు, భయము విస్మయమును మదిఁ బాదుకొనఁగ.

వ. అమ్మహామూర్తిని సహస్రాత్ముని గా నెంచి సంశయించుచుండి రయ్యవసరంబున.

శా. యోగాత్ముం డగునమ్మహామహుఁడు నిత్యోత్సాహ మేపార ను
ద్యోగంబుం గొని దైత్యదానవులు సంతోషంబునుం ధైర్యమున్
పోఁ గంపంబును బొంది డిందుపడి పెంపుం దక్క పొక్కంగ భూ
భాగం బల్లలలాడ నార్చె భయముద్ధ్వానం బనూనంబుగన్. 431

శా. ఆనాదంబున నెల్లచోట్లు ప్రతినిర్హ్రాదంబున న్నిండె న
ద్దానన్ క్షోభ మెసంగె లోకములకున్ ద్రస్తాత్ములై దేవతల్
కానం జాలనివార లైరి జగముల్ కంపించి నిశ్చేష్టతం
బూనెన్ దైత్యులు తల్లడిల్లి యసురుల్ పోకార్చుకొనై రటన్. 432

తే. ఇవ్విధంబున నసురులనెల్లఁ గూల్చి, క్రిందికిం జని కిటిమూర్తి యందు నున్న
దైత్యులం జీల్చె ఖురములఁ దన్ని త్రొక్కి, వెలికి రా మాంసమేదోస్థివితతి యెల్ల.

వ. ఆనాదంబునం జేసి సనాతనుం డనువే రమ్మహాయోగివర్యున కంకింపం బడియె నంత దేవతలు వెండియుం బితామహునిపాలికిం జని యీనాదం బేది దీనం జేసి లోకంబు లాకులం బగుచున్న యవి తత్తేజంబున దేవదానవులు మూర్ఛిల్లు చున్నవా రని యడుగుచుండునంతలో వరాహరూపుం డగునమ్మహావిష్ణువు మహర్షిస్తూయమానుండై యట నావిర్భవించె నప్పు డప్పితామహుండు దేవతలదిక్కు మొగం బై. 434

శా.భీతిం బాయుఁడు వేల్పులార! జగముల్ పీడించుదైత్యాళి వి
ఖ్యాతౌజఃప్రభవంబునం దునిమి వేడ్కం గూర్చె నీకృష్ణుఁ డే
భూతాత్ముం డయి భూతభావనుఁడు నై భూతేశుఁడై యొప్పు వాఁ
డీతండే పొనరించె నిట్టినినదం బిం కేల శంకింపఁగన్. 435

వ అనిన విని యుధిష్ఠిరుండు మోక్షయోగంబు తెఱం గెఱింగింపు మనిన భీష్ముం
డీయర్థంబున నొక్కపురాతనేతిహాసంబు గల దది గురుశిష్యసంవాదరూపంబు
దానిం దెలియఁ జెప్పెద నాలకింపు మని యి ట్లనియె. 436

తే. బ్రాహ్మణుండును దేజోవిరాజి సత్యసంధుఁ డగునొక్కగురువరుసరస కరిగి
పరమమేధావి శిష్యుఁడు పాదములకు, వందనము చేసి ప్రార్థించి పలికె నిట్లు.

క. నాసేవకు నీచిత్తం, బీసమయమునం బ్రసన్న మేని మునీంద్రా!
నాసందేహము దీర్పం, గా సమ్మతిసేయు మయ్య కరుణ దలిర్పన్. 438

ఉ. ఎక్కడనుండి వచ్చితిమి యేనును నీవును దుల్యకీర్తిమై
నెక్కడు నెల్లభూతముల కీవిపరీతలయోదయంబులున్
బెక్కులు వృత్తముల్ గలిగి వేర్వేరను బెట్టివిధంబు లోకమం
దొక్కఁడు నైనవాక్య మయి యొప్పెదునయ్యది యేది చెప్పవే. 439

వ. అని యడిగిన నాచార్యుం డి ట్లనియె. 440

### అధ్యాత్మవిద్యాప్రకారము.

సీ. ఆలింప వోయి మహాప్రాజ్ఞ! సర్వవిద్యలకు నాగమముల కాదిమూల
మధ్యాత్మసంజ్ఞికం బతిగుహ్యమగుతత్త్వ, మెఱింగించెదను బ్రియం బెసక మెసఁగ
వాసుదేవుఁడె పరబ్రహ్మంబు సచ్చిదానందమూర్తియు జగన్నాథుఁ డజుఁడు
సర్గప్రలయకర్త శాశ్వతుం డతఁ డని, వార్ష్ణేయసంహితవలనఁ దెలియు

తే. బ్రాహ్మణుఁడు బ్రాహ్మణునకును రాజు రాజు
నకును వైశ్యుఁడు తనవైశ్యునకును శూద్రు
నకును శూద్రుఁడు దెలుప నై నలువు మీఱు
దాని నాకడ విన నీవు దగుదు విప్రుడు. 441

క. ఆవార్ష్ణేయ మనంతము, భావాభావస్వభావభావిత మనఘం
బై వెలయుఁ గాలచక్రము, గోవిందునియందుఁ బొడకొనియుండుఁ జుమీ.

క. అమృతుండవ్యయుఁ డక్షరుఁ, డమలుం డవ్యక్తుఁ డజుఁ డనాద్యంతుఁడు వే
దమయుండు శాశ్వతుఁడు బ్రహ్మము పురుషోత్తముఁ డటందు రార్యులు వింటే.

సీ. ఆతఁడే పితరుల యక్షరాక్షసుల ఋషుల దేవతల మనుష్యుల నసురుల
వేదశాస్త్రాదుల విశ్రుతధర్మంబుల సృజించుచుండుఁ బ్రలయము ప్రకృతి
గలుగ యుగాదులఁ గాలస్వరూపుఁడై, ఋతుచిహ్నములువోలె ఋతువులందు
భావంబు లవి యెల్లఁ బరికింప నౌ లోకయాత్రావిధానజ మైనజ్ఞాన

తే. మగుచు నుండు యుగాంతమునందు నేతి
హాసవేదము లడుగంట నవ్విధాతృ
ననుమతిం జేసి ఋషులు దివ్యతపమునను
గాంచి ప్రకటించుచుందురు ఘనమతు లయి. 444

వ. అందు వేదకర్త యగుబృహస్పతి వేదాంగంబులం దెలిసికొనియె శుక్రుండు నీతిశాస్త్రముం బ్రకటించె నారదుండు గాంధర్వంబు నెఱింగించె భరద్వాజుండు ధనుర్విద్యఁ వెలయించె గార్గ్యుండు దేవర్షిచరితంబు సంగ్రహించెఁ గృష్ణాత్రేయుఁడు వైద్యశాస్త్రము సంతరించె మఱియుం బెక్కురు ఋషులు న్యాయతంత్రంబులు సంగ్రహించిరి హేత్వాగమసమాచారములచేఁ జెప్పఁబడినబ్రహ్మ ముపాసింపం దగినది దాని దేవతలు ఋషులు నెఱుంగఁ జాలరొక్కనారాయణుం డెఱుంగు నాభగవంతునివలన ఋషులును సురాసురులును రాజర్షులును దుఃఖభేషజం బగునప్పరమంబు తెఱం గెఱింగిరి. 445

సీ. అల్లప్రకృతి పురుషాధిష్ఠితము లగు, భావములం గని పరఁగునపుడు
హేతుయుక్తం బగునీజగ మంతయు, నట మున్న ప్రభవించునట్టి దగును
దీపమునం బెక్కుదీపమ్ము లగునట్లు, కలిగించుఁ బ్రకృతి జగంబు లెల్ల
నది యనంతం బగుటఁ దఱుగ దవ్యక్తమున నహంకారముఁ బుద్ధి కనును

తే. అయ్యహంకారమున నింగి యగును దాన
వాయు వగు దానఁ దేజంబు వఱలు దాన
జల మగుం దాన ధర యొప్పు వెలయు మొదటి
ప్రకృతు లీయెన్మిదింటను బరఁగు జగము. 446

వ. శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణంబు లనుజ్ఞానేంద్రియంబు లైదును వాక్పాణిపాదపాయూపస్థ లనుకర్మేంద్రియము లైదును శబ్దస్పర్శరూపరసగంధంబు లనువిషయంబు లైదును సర్వవ్యాపి యగుమనంబును గలసి షోడశవికారంబు నాఁబడి దేహంబున జ్ఞానకర్త యగుచిద్రూపు నాశ్రయించి యుండుఁ ద్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణంబులు పంచభూతగుణంబు లందు గంధము పృథివీగుణము

శ్రోత్రము నభోగుణము చక్షు వగ్నిగుణము వాయుగుణ మగుస్పర్శము సర్వ భూతములందును సర్వదా ప్రవర్తించుచుండు మనస్సు సత్వగుణ మనియు నది యవ్యక్తసంభవం బనియు సర్వభూతాత్మభూతం బనియుఁ బండితు లెఱుంగు చున్నారీభావములే చరాచరాత్మక మగుప్రపంచము నావహించి యున్నవి.

మ. అరజస్కుండు పరుండు నై ప్రకృతికి వ్యక్తుండు నవ్యక్తుఁ డై
గరిమం గాంచియు ను క్తభావములతోఁ గాంచుఁ నవద్వార మా
పురముం బొందియు వ్యాప్తి గాంచి శయనంబుం జేయు నం దందుఁ
బురుషాఖ్యం గొని యప్పరాత్పరుఁడు పొల్పుం గాంచు చుండుఁ రహిన్.

తే. సగుణమై నిర్గుణం బయి సర్వభూత,గుణములకు నాశ్రయం బయియణువు బలెను
మేరువుం బలె జంతులమేనులందు, దీపనుం బోలి వెలుఁగు నాదివ్యమూర్తి.

సీ. అక్షంబులకు విషయజ్ఞాన మగుటకు, హేతువు దేహ మీయెల్లకర్మ
ములకు జీవుఁడె కర్త తలఁప దానుగతాగ్ని, తర్పినం గాని భేదన మొనర్పఁ
గానరా సట్లు యోగమునఁ గాని శరీర,గతుఁ డగుజీవుండు గాన రాఁడు
నదిలో జలంబులు నా రవిరశ్ములు, నా దేహములును సంతతము లరయ

తే. స్వప్నమునఁ బోలెనింద్రియసహితముగుచు, నాత్మ దేహమువిడిచియొండై నదేహ
మునఁ బ్రవేశించు నిజకర్మమునను బుట్టు,గిట్టుసుఖదుఃఖములనొందు నెట్టియెడల.

వ. స్వకర్మజనితం బగుభూతకోటి దేహంబు విడిచి యొండు దేహంబు నొందుచం దంబు నెఱింగించెద విను మని మఱియును. 451

సీ. నాల్గువిధంబు లై నలువుమీఱుఁ జరాచ,రము లై నభూతజాతము లి వెల్ల
నవ్యక్తమునఁ బుట్టు నవ్యక్తమున గిట్టు, స్వాంత మవ్యక్తాత్మసంభవంబు
నశ్వత్థబీజమునందు మహాద్రుమ, మట్టు లవ్యక్తమునందు వ్యక్త
మనువొందు నిను మచేతన మయ్యుఁ గర్మధ,ర్మాదుల విద్యయు వ్యక్తమునకు

తే. నాభిముఖ్యము నొందున ట్లఖిలకర్మ, వాసనాదులు కర్త యై వఱలుఁ జేత
నునికి దేహాంతరప్రాప్తి యొనరునప్డు, గలియవచ్చెడునని లోనఁ దెలియవలయు.

వ. ఒక్కజీవుండు తప్ప భూమి గాని యాకాశము గాని భూతములు గాని ఋషులు గాని సురాసురులు గాని మఱియేవియుం గాని మున్ను లేవు మఱియు ననాద్యంత మగుజననమరణప్రవాహము ననుసంధించి కారణసంయుక్తమై కార్యమును జేయునది జీవస్వరూప మవ్యక్తనాభంబును వ్యక్తారంబును వికార పరిమండలంబును స్నిగ్ధాక్షంబు నగుసంసారచక్రము క్షేత్రజ్ఞాధిష్ఠితంబై యవి

చ్ఛిన్నముగాఁ బ్రవర్తించుచుండుఁ దిలపీడులచేఁ దిలలుం బోలె నీజగంబం
తయు నజ్ఞానసంభవంబు లగుభోగములచే నీచక్రంబునఁ బీడింపఁ బడుచుం
డును. 453

### కాలచక్రప్రభావాభివర్ణనము.

సీ. పురుషుఁడహంకారమునఁ గర్మములొనర్చు,నాగామిహేతువౌ యోగములకుఁ
గాలంబు హేతు వౌఁ గార్యోపకరణంబు, కర్మయుతము లై వికారములును
బ్రకృతులును బరస్పరము గలియుచునుండుఁ,దను వీగి జీవుండు తామసాది
రహితుఁడై రేగి భూరజము వాయువు నంటు,నట్లు క్షేత్రజ్ఞుని ననుసరించు
తే. నింతమాత్రమె సంబంధ మెన్నఁ బాంసు,వులకు గాలికిఁ బోలె జీవునకును బర
మాత్మ కని తలఁపంగ నౌ నట్లు తలఁపఁ,బోక సంబంధ మెంచుట పోల దధిప.
తే. అనలదగ్ధబీజము మొల కందనట్లు, క్లేశములు జ్ఞానదగ్ధములై శమింప
నాత్మ వెండియు నుత్పత్తి నందఁ బోవ,దపుడు నిర్వాణ మఱచేతి దగును జూవె.
వ. వేదవిద్వాంసులు కర్మమార్గ మందురు విజ్ఞాననిష్ఠులు ముక్తిమార్గమె సర్వో
త్తమ మని దానిం దప్ప నన్యంబు గైకొన రది సదాచరితం బగుట నగర్హితం
బెది యుత్తమగతి నొసంగునో యదియె బుద్ధి యని పెద్దలు చెప్పుదురు. 456
సీ. మోహంబునం జేసి దేహి రాజసతామసములఁ గ్రోధమ్ము లోభమును గలుగ
నాచరించుఁ బరిగ్రహములను దేహాయాసమునకు నశుద్ధపథమునందుఁ
బడరాదు కర్మముల్ ఫల మపేక్షించి చే,సిన శుభలోకముల్ చెంద లేఁడు
లోహయుక్తం బయి లుగ చెడుకనకంబు, పుటపాకమునఁ గాని పోనర నట్లు
తే జ్ఞాన మది రాగదోషవిహీన మైనఁ, గాని పోనరదు కామాదిగతులు విడక
ధర్మపథ మందినను ఫలదంబు గాక, సానుబంధ మై యంధ మై యది నశించు.
క. రాగాన్వితుఁ డై మర్త్యుఁడు, వీఁగ నిశబ్దాదివిషయవిధిఁ బడ రా దా
రాగమునఁ గ్రోధహర్షము, లే గాక విషాద మొదవు నెంతయు బలిమిన్. 458
మ. తతసత్త్వాదిగుణాశ్రయం బగుచు భూతవ్రాతసంబద్ధమై
క్షితిఁ బెంపొందినయీశరీరమునకుం జెప్పంగ రా దెప్పుడున్
స్తుతి నిందాదులతోఁ బ్రయోజనము నజ్ఞుల్ స్వర్ణరూపాదులం
దతిసంగంబునఁ బార్థివంబు తమదేహం బంచు నెంచ ర్మదిన్. 459
తే. మృణ్మయం బగుగేహము మృత్తుచేత, మెత్తి నలు వొందఁ జేసెడుమేఱఁ బార్థి
వం బయినమర్త్యదేహమున్ బార్థివంబు,లైన యాహారములచేత నగును బ్రోవ.

క. పాలు న్నేయియుఁ దేనెయుఁ, దైలము మాంసమును గుడము ధాన్యఫలాదుల్
మూలములు లవణజలముల్, పోలింపఁగ మృద్వికారములు ధరణీశా. 461

శా. కామ్యంబుల్ విడి సన్యసించి వనులన్ గాపున్నవాఁ డెప్పుడున్
గ్రామ్యాహారములం ద్యజించి యెటులో కాలంబు వెల్లించు నా
సామ్యంబుం గలఁడై గృహస్థుఁ డిడుమల్ సైరించి యాత్రార్థమై
సమ్యగ్రీతికిఁ గాక మెక్క నగు నెంచన్ రోగి మందున్ బలెన్. 462

సీ. సత్యశౌచార్జవక్షాంతి పరిత్యాగ,ధైర్య విక్రమ తపః స్థైర్యములను
విషయాత్మకము లగువివిధభావంబుల, విడనాడి శాంతినిఁ బడయఁ గోరి
నిష్ణాతుఁ డింద్రియనిగ్రహం బొనరింపఁ,బోలు గుణత్రయమోహితు లయి
యజ్ఞానమున జననాదు లందుచుఁ జక్రమట్లు భ్రమించెద రజ్ఞజనులు

తే. కాన నజ్ఞానమునఁ జేసి యైనదోష,ములఁ బరీక్షించుకొనుచుండ వలయు నెపుడు
మఱియు నజ్ఞానభవ మయి వఱలిదుఃఖ, హేతు వగునహంకారము నీఁగవలయు.

వ. మఱియు మహాభూతంబులు నింద్రియంబులు సత్వరజస్తమోగుణములు నీశ్వరం బగు నీత్రైలోక్యంబును సర్వకర్మంబులు నహంకారమ్మునంద సుప్రతిష్ఠితము కాలము ఋతుధర్మములఁ బ్రకటించునట్లు భూతంబులం దహంకారము కర్మప్రవర్తకం బగుచుండు నజ్ఞానసంభవం బగుతమస్సే మోహజనకం బగు నింకఁ బ్రీతిదుఃఖనిబద్ధంబు లగుసత్వరజస్తమోగుణంబులం జెప్పెద వినుము ప్రసాదము ప్రీతి యసందేహము ధృతి స్మృతి యివి సత్వగుణంబులు కామము క్రోధము లోభము మోహము ప్రమాదము భయము క్లమము విషాదము శోకము నరతి మానము దర్పము ననార్యత్వము నివి రజస్తమోగుణంబు లిట్టి దోషముల గురులాఘువంబులం దొక్కటొక్కటిగాఁ బరీక్షించి విమర్శించుచుండవలయు ననిన యుధిష్ఠిరుం డేదోషంబులు మనస్సుచేఁ ద్యక్తంబులో యేవి బుద్ధిచే శిథిలీకృతంబులో యేవి మఱియు మఱియు వచ్చుచుండునో యేవి వచ్చియు విఫలంబు లగుచున్నవో వేనిబలాబలములు సహేతుకముగా బుద్ధిచే విమర్శింప వలయునో చెప్పు మనిన నక్కుంతీపుత్రునకు గంగాపుత్రుం డి ట్లనియె. 464

## నానావిధదోషపరిత్యాగవిధానము.

సీ. మూలముట్టుగ దోషముల నెల్లఁ ద్రెంచి వి,శుద్ధాత్ముఁ డగువాఁడు చొచ్చుముక్తి
నిను వినుమున నాశమును బొందునటు లాత్మ, నిజదోషములచేత నే నశించు

సత్త్వరజస్తమస్సంగతి దేహులకును దేహబీజము లని యెఱుంగు
మాత్మజ్ఞునకు సత్త్వమమరించు బ్రహ్మముఁ, గాన నాత్మజ్ఞాని యైనవాఁడు

తే. తమము రజమును విడువంగఁ దగును వాని, రెంటినిన్ విడనాడినవెంట శుద్ధ
సత్త్వము వినిర్మలం బయి స్ఫటికమట్లు, సత్పదార్థముఁ జూపెడు సరణి యగును.

వ. ఆత్మజ్ఞానంబునకై మంత్రవిహిత మగుయజ్ఞాదికమును దుష్కృతహేతు
వందు రట్లు తగ దది చిత్తశుద్ధిమూలకముగా వివేకవైరాగ్యాదులకు హేతు
వగుచున్నది రజోగుణంబున ధర్మకార్యము లాచరించి యర్థయుక్తము లగు
సర్వకామంబులం బొందుదురు తమోగుణంబున నిద్రాతంద్రాదిసమన్వితు లై
క్రోధలోభయుక్తంబు లగుహింసాదికార్యంబు లొనరించి నిరయంబు లందు
దురు కొందఱు సత్త్వగుణంబున శుద్ధసాత్త్వికభావంబు లరయుచు శ్రద్ధావిద్యా
సమన్వితులై పరంధామంబు నొందుదు రని మఱియును. 466

తే. రజమునం జేసి మోహము ప్రబలుచుండుఁ, దమమునం జేసి క్రోధలోభములుదర్ప
మునుభయంబునుగలుగు వానినిజయించి, నట్టిపురుషుండుశుచియనననలరుచుండు.

మ. పరమాత్ముండు పరేశుఁ డక్షయుఁడు నవ్యక్తుండు వ్యక్తుండు నై
గరిమం గాంచినవిష్ణువున్ బుధులు వేడ్కన్ దేవతామూర్తి యం
దురు తన్మాయ మునింగి మానవు లశాంతుల్ భ్రష్టవిజ్ఞానులున్
దురితస్వాంతులు నై వివేక మది యొందన్ లేక వర్తింత్రిలన్. 468

సీ. జ్ఞానమోహంబున జనియించుఁ గ్రోధంబు, దానఁ గామంబును దాన లోభ
మోహంబులున్ మానమునుదర్పమును నహం,కారమునగు నహంకారమునను
గ్రియలు ప్రవర్తించుఁ గ్రియలచే స్నేహంబు, దానిచే శోకంబు దాపరించు
మఱియును సుఖదుఃఖమార్గక్రియలచేత, జననమరణములు సంభవించు

తే. జన్మమున శుక్రశోణితసంభవ మగు, గర్భవాసము విణ్మూత్రగతియుఁ గలిగి
శ్రమల కోరిచి పుట్టుచుఁ జచ్చుచుంద్రు, కాలచక్రప్రవాహములో లయించి.

క. మనుజుఁడు క్రోధాదులతోఁ, ననఁగియుఁ దృష్ణాభిభూతుఁడై వాని విడన్
మన మొనరించినయేనిన్, వనితలసంపర్క మాది వదలఁగ వలయున్. 470

తే. ప్రకృతిచే క్షేత్రభూతలు వారిజాక్షు, లరయ క్షేత్రజ్ఞలక్షణుల్ పురుషులగుట
వారలన్ బండితుం డగువాఁడు విడువ,వలయు నవిచారితంబుగా వసుమతీశ.

ఉ. వారలు ఘోరరూపిణులు వారవిచక్షణులన్ స్వశక్తిమై
మూరగ మోహవారినిధి ముంత్రు రజఃకలితాంతరాత్మ లై

వారు దురింద్రియంబులకు వశ్యముల న్నడిగన్నవారల
వ్వారలమీఁదిరాగమున బ్రాణులు పుట్టుచుఁ జచ్చుచుండెడిన్. 472

ము. తనదేహంబునఁ బుట్టినట్టిక్రిములన్ దాఁ గాంచియున్ నావి కా
వని పోఁ ద్రోచినయట్లు స్వాంగభవులై హర్వొందుచున్ స్వీయులై
తనయాఖ్యం జనుకీటకంబులను మేధావంతుఁ డీక్షించి వా
రిని నావారని ప్రేముడింపక విసర్జింపంగ నౌ వ్రేల్మిడిన్. 473

సీ. ప్రాణికోటులు స్వభావముననో కర్మయోగముననో శుక్రరసములవలనఁ
బ్రాదుర్భవించు వర్ష్మమునుండి వాని విసర్జింప వలయు విజ్ఞానమునను
రజము తమమునఁ బర్యస్తము సత్యము, రజము నందు నిరంతరంబు నుండు
బుద్ధ్యహంకారసంభూత మై జ్ఞానము, నలమినతమమె దేహులకు బీజ

ఆ. మదియె జీవసంఖ్యనలరారు జీవుండు, కాలయుక్తకర్మగతిని గలను
మనముతోడ సంసృతిని సల్పునటు దేహి, గర్భమునఁ జరించుఁ గర్మగతుల.

తే. బీజభూతకర్మముచేతఁ బ్రేరితుఁ డయి, పిండభూతజీవుం డెట్టివిషయచింత
నలరునట్టివౌ విషయేంద్రియములు రాగయుక్తమనమునన్ వానికినొంపఁగలుగు

వ. శబ్దరాగంబున శ్రోత్రంబును రూపరాగంబునఁ జక్షువును గంధరాగంబున ఘ్రాణంబును స్పర్శరాగంబునఁ ద్వక్కును రసరాగంబునఁ జిహ్వయుం గలుగుఁ బ్రాణాపానవ్యానోదానసమానము లనుపంచవాయువులు దేహయాపనముఁ గావించుచుండు జీవుఁడు కర్మానుగుణంబుగా శారీరమానసంబు లగుదుఃఖము లాదిమధ్యాంతంబులం బొందఁ గలుగు గాత్రములతో నుద్భవించుచుండు దుఃఖ ముపాదానంబునం బుట్టి యభిమానంబునం బెఱిఁగి పరిత్యాగంబున నశించుఁ దన్నిరోధజ్ఞుఁడే ముక్తుఁ డగు నింద్రియములకు భవలయములు రెండును రజోగుణంబునంద యగు సర్వంబును శాస్త్రదృష్టిం బరీక్షించి పండితుండు ప్రవర్తింప నొప్పుఁ దృష్ణాహీనునిజ్ఞానేంద్రియంబు లింద్రియార్థంబుల సమీపింపవు జితేంద్రియునకుఁ బునర్జన్మంబు లే.దని భీష్ముం డీవిషయంబున నొక్కయుపాయంబు సెప్పెద దాని నీవు శాస్త్రదృష్టిం బొడమినవిజ్ఞానంబున నెఱింగి మెలంగితి వేని పరమగతిం బొందుదు వని మఱియును. 476

ఉ. భూతములందు నుత్తములు పూరుషు లందు మహీసురుల్ గుణ
ఖ్యాతులు వారిలోన నిగమాగమవేత్తలు మంత్రదర్శులున్
పూతులు సర్వదర్శనులు భూతచయంబున కాత్మభూతులై

భూతలమంతః వేల్పు లయి పొల్పెసలారుచునుందు రెప్పుడున్. 477

ఆ. కనులు లేనివాఁ డొకఁడన్నై యడవిదారిఁ, గస్తిపడినగతి జగతిని జ్ఞాన
హీనుఁ డార్తి నొందుఁ గాన మానవులందు, జ్ఞానవేత్త యధికుఁ డౌ నిజంబు.

తే. ధర్మ కామములు శాస్త్రపథమున ధర్మ
మాచరించుచు వారల కరయఁ ద్రికర
ణముల శుద్ధియు క్షమయు సత్యమును ధృతియు
స్మృతియుఁ దప్ప నన్యగుణంబు లతుకఁ బోవు 479

తే. సర్వధర్మములందును సద్గుణములు, కల వని వచింత్రు ధర్మవేత్తలు సమస్త
ధర్మముల నుత్తమం బయి తనరు బ్రహ్మ, పరము బ్రహ్మచర్యం బది పర మొసంగు.

వ. లింగసంయోగహీనంబును శబ్దస్పర్శవివర్జితంబును వాఙ్మనోబుద్ధిశూన్యంబు నగు
నాబ్రహ్మచర్యం బతిదుష్కరంబు దాని సాధించునుపాయంబు చెప్పెద నవ
ధరింపుము. 481

బ్రహ్మచర్యసాధనోపాయకథనము.

సీ. సంప్రవృత్తం బయి సముదీర్ణ మగురజో, గుణము చిత్తంబునఁ గూర్ప రాదు
నారీకథాశ్రవణ మొనర్ప రాదు దిగంబర లగువారిఁ గనఁగ రాదు
స్త్రీదర్శనమున రజోదర్శనం బయి, దుర్బలులం గూడఁ దొట్రువఱచు
రాగంబు వొడమఁ గృచ్ఛ్రత్రయ మొనరించి, త్రిషవణస్నానంబు దీర్పవలయు

తే నది మునిఁగి మది నఘమర్షణమును మూఁడు
మాఱులు జపించినన్ రజోమయము లైన
యాత్మలోపలిదోషము లడఁగి పోవు
నని శ్రుతిస్మృతుల్ చాటెడు నవనినాథ. 482

తే. జ్ఞానసముపేతమై యొప్పుమానసమునఁ, బండితుఁడు కుణపామేధ్యపరివృతమ్ము
ద్వారశూన్యప్రదేశమువలె శరీరమును దలఁచి దేహిఁ దద్బద్ధుఁ డని యెఱుంగు.

శా. నాడీమూలమునన్ రసంబు లెపుడు న్సర్వాంగసర్వస్వమున్
గూడ న్వాతము పిత్తము న్గఫముఁ ద్వక్కున్ మాంసముం బెంచు నా
నాడుల్ రెండయిదుల్ దశేంద్రియములం జాల్చున్ దదుజ్జాతముల్
నాడు ల్వేలకు వేలు సూక్ష్మతరముల్ నల్వొందు దేహంబునన్. 484

క. నదులు జలంబుల వార్ధిం, బొదల న్వర్ధిల్లఁ జేయుపోలికి నాడుల్
నదు లగుచు దేహవార్ధిన్, పొదలించు రజఃకృపీటముల ననయంబున్. 385

ఆ. హృదయమధ్యమందు నెసఁగెడునొకనాడి, తా మనోవహంబు నై మనుష్యు
నవయవములనుండి తివిచి సంకల్పజ,మైనశుక్రమును వెలార్చుచుండు. 486

సీ. ఆనాడితో సకలాంగప్రవర్తక,ములు నాడు లనుగతములు తలంప
నవి తైజసగుణంబు నంది నేత్రములను, బొందుచుండును మంథమున మథింపఁ
బాల నేయియుఁ బోలె స్వాంతసంకల్పమం,థమున శుక్రముమథిత మగుచుండు
స్వప్నమందును మనస్సంకల్పజం బగు, రాగ మైనపుడు శుక్రము బహిర్గ

తే. తమ్ముగాఁ జేయును మనోవహమ్మనియెడు, నాడియత్రియెఱింగె నానాడుశుక్ర
భవ మది త్రిబీజమింద్ర దైవత్యమగుట, నింద్రియం బను పేరిట నెసఁక మెసఁగు

క. ఏ రెడఁద భూతసంకర, కారిగ నాశుక్రగతిని గనఁ జాలుదురో
వారు విరక్తు లదోషులు, నై రమణించుచును జన్మ మందరు మరలన్. 488

వ. గుణానుసారంబుగా మనస్సుచే మనస్సు కొట్టఁబడు మనస్సే మనస్సునకు జ్ఞానముం బుట్టించుఁ గావున విరజంబును నిత్యంబును మంత్రసిద్ధంబు నగు దేహకర్మంబు నాచరించి మహాత్ములు దేహావసానంబున ముక్తినొందుదురు గావున మనోభిఘాతంబునకై నివృత్తిరూపకంబును నిర్మలం బగుకర్మ మాచరించి రజస్తమోవిరహితుం డై యథేష్టగతి నొందఁగలం డని వెండియు. 489

తే. తరుణగత మైనజ్ఞానము తనదు ముదిమి, దుర్బలం బైనఁ బక్వమై తోఁచుబుద్ధి
గలిగి కాలమున న్మనోబలముతోడఁ, గలుషబంధము లెడలించి కాంచు ముక్తి.

చ. జనులు దురింద్రియార్థముల సంగతిఁ జేసి తపించుచుందు రే
జనులు తదర్థసంతతుల సక్తులు గాక మెలంగుచుందు రా
జనులు పరంబు నొందుదురు జన్మము మృత్యువు వ్యాధు లాధులు
న్గనుఁగొని బుద్ధిశాలి జతనం బొనరింపఁగ నొప్పు ముక్తికిన్. 491

తే. వాఙ్మనఃకాయశుద్ధుఁ డై వదలి యహమ,హామిక శాంతుఁడు జ్ఞానియునై యపేక్ష
పొడమ నీయనిమది భైక్ష్యమును జరించు,నట్టివాఁడు సుఖించు నేయవసరమున.

క. భూతానుకంపచేతన్, జేతమునన్ సంగభయము చేకుఱ నగు నే
ప్రీతి విడి కర్మఫల మని,యే తలఁచి యుపేక్ష సేయు టెంతయు నొప్పున్. 493

సీ. అశుభ మైనను శుభ మైనఁ గర్మఫలం బ,వశ్య మనుభవింప వలయుఁ గాన
వాగ్బుద్ధిగతుల శుభము లైనకర్మము, లాచరింపం దగు నవనిజనుఁడు
సత్యం బహింసయు సర్వభూతహితంబు, నార్జవంబును క్షమ యప్రమాద
మివి గలయట్టివాఁ డే సుఖి యగుఁ గాన, భూతసమాహితబుద్ధి లెస్స

తే. మఱి యపథ్యాన్నమున వాంఛ మానినైచి,పుత్రమిత్రాదిసంబంధముసుద్యజించి
స్వార్థహీనప్రయత్నము వదలఁ జేసి, మనము జ్ఞానమున న్నిల్పఁ జను జనునకు.

వ. మఱియు ధర్మసూక్ష్మవేత్త యగువాఁడు సత్యము నహింస్రము ననపవాదము నకపటము నపరుషము ననృశంసము నపిశునము నగుపలుకే పలుక వలయు సంసారము వాగ్బద్ధం బై యుండుఁ గావున నవిక్షిప్తచిత్తంబుతో నించు కించుక మాటలాడుచుండవలయు విరాగి యగునేని బుద్ధ్యనుగృహీతచిత్తంబుతోఁ దనతామసకర్మంబును దాన ప్రకటించుకొనవలయు రజోభూతము లగుకరణములచేఁ గర్మాసక్తుఁ డయ్యె నేని యిహంబున దుఃఖంబు లనుభవించి పరంబున నరకంబులం బొంద నుండుఁ గావున మనోవాక్కాయకర్మంబుల స్థైర్యం బవలంబింప వలయు నని మఱియును. 495

ఉ. దొంగలు మాఁసభారమును దోకొని పోవుచుఁ గొంతలోన వే
ఱంగద వచ్చుమార్గ మది యంచు నెఱింగి తదర్థభార మా
ముంగల వైచి మంచిపథముం గని పట్టి గమించునట్లు దు
స్సంగతి కైనకర్మముల సాల్పడఁ జేసి పరంబు నొంద నౌ. 496

చ. విడిచి పరిగ్రహంబుల వివిక్తముగ న్విహరించు చించుకే
గుడుచుచు నింద్రియార్థములకుం జొఱఁ జోటిడ కాత్మ విజ్ఞుఁడై
యెడఁద నొకింతసందియము నేర్పడ నీక తపస్వి యై మదిం
దడఁబడ నీక జ్ఞానమున దగ్ధపరిక్లముఁ డై సుఖింపదుం. 497

మ. ధృతిమంతుండును నాత్మవంతుఁ డయి బుద్ధి న్నిగ్రహింపం దగుం
మతిచేఁ జిత్తము దానిచేత విషయోన్మాదం బడంపంగ న
య్యతికి న్వశ్యము లై యడంగెడుఁ దదీయాంగంబునం దీశ్వరుం
డతఁ డం చయ్యవి దాన బ్రహ్మ మది హాయిం బొందఁగాఁ గల్గెడిం. 498

వ. ఇంద్రియంబు లపగతంబు లైనప్పుడు సత్త్వ ముదయించు ధ్యానం జేసి బ్రహ్మభూతుం డగు యోగము ప్రకటింపక యింద్రియంబుల వశంబు చేసికొని వృత్తిం బరిశుద్ధము చేయ వలయు మఱియు యోగాభ్యాస మొనర్చువాఁడు కణకుల్మాషపిణ్యాకయావకాదు లాహరించుచుండుటయు కాక ఫలమూల భైక్ష్యము లభ్యసింప వలయు దేశకాలానుసారంబుగా యోగి కాహారనియమంబున సాత్త్వికాహార మావశ్యకము మఱియుఁ బరీక్షాపూర్వకముగా యోగమున కంతరాయము రానీక దానికి జ్ఞానంబుచే నగ్ని నింధనములచేతం బలెఁ

బ్రవృద్ధి నొందింపవలయు నప్పుడు జ్ఞానము సూర్యుఁడుం బోలెఁ బ్రకాశించు జ్ఞానాధిష్ఠాన మగునజ్ఞానము ముల్లోకంబు లావరించు విజ్ఞానానుగత మైనజ్ఞాన ముచే నపకర్షింపం బడునాత్మ యవస్థలకు భిన్న మని యసూయ గలవాఁ డెఱుంగఁ జాలం డపవర్గ మెఱింగినవాఁడు వీతరాగుండై ముక్తుం డగు వయోతీతుం డయ్యును యోగి జరామృత్యువుల జయించి సనాతనంబు నమృతంబు నవ్యయంబు నగుబ్రహ్మపదంబు నొందఁ గలం డని మఱియు. 499

సీ. బ్రహ్మచర్య మొనర్చువాఁ డెప్డు స్వప్నదో,షాకరం బగునిద్ర నడఁప వలయు
స్వప్నమునన్ రజస్తమములచే దేహి, దేహాంతరము నొందు దీనునట్లు
విగతస్పృహుం డగు విజ్ఞాని జ్ఞానాభ్య,సనమున జిజ్ఞాస సలుపుఫొంపె
జాగరణం బుండఁ జను జ్ఞానమునఁజేసి, జాగరూకుం డయి యోగి యొసఁగుఁ
తే. గలను విషయవంతుఁడువలె నలరు టెట్టు, లింద్రియవిలీన మైనచో నెట్లు దేహి
యెఱుఁగుఁదన్న నుశంక యోగేశ్వరుండు, హరి చెలి పెననిబుషులందురదివచింతు.

మ. విరతిం బొందఁగ నింద్రియంబులు శ్రమాన్వితంబులై యప్డు ని
ద్దుర యం ద్రాసమయంబునందు మనమందున్ లీనమై పోక పొం
పిరి వ్యాపార మొనర్చు నయ్యదియె చూపింపంగఁ దార్కాణ మం
దురు యోగజ్ఞులు సంతతానుభవమున్ రూపించుచున్ శాస్త్రమున్. 501

క. మనుజుఁడు జాగ్రదవస్థన్, ఘనకార్యాసక్తమనమునకు సంకల్పం
బొనరినయట్టులు స్వప్నం,బున సంకల్పములు మదికిఁ బొనరుచు నుండున్. 502

క. కామాత్మకుం డసంఖ్యము, లై మించియుఁ బ్రాక్తనంబు లగుసంస్కార
స్తోమముల ననుభవించెడు, నా మెయి నట నడఁగు నాత్ముఁ డది యెఱిఁగి కొనున్.

క. మును చేసినకర్మంబున, ననుగతసత్వాదిగుణములం దెద్దానన్
మన మగు నయ్యాకృతులన్, బొనరఁగ నట సూక్ష్మభూతములు ప్రకటించున్.

ఆ. అంత రాజసాదు లగుగుణంబుల నంత, రాగతఫలములను యోగసరణి
సౌఖ్యదుఃఖరూపసంపదంచితముగాఁ, గలుగఁ జేయుచుండుఁ గదల నీక. 505

సీ. ప్రజలు రజస్తమః ప్రథితభావములతో, వాతపిత్తాదులు హేతువు గల
యాకృతులం జూతు రజ్ఞానమునఁ జేసి, యవి దాఁటుట దురత్యయంబు సూవె
మన మింద్రియములు నిర్మలము లై యున్నప్పు, డెద్ది సంకల్పించు నద్ది స్వప్న
గత మగు నప్పుడు గనుఁగొనుఁ దాని మ,నోదృష్టిఁ జీవుఁడు సాదరమున
తే. మానసము సర్వభూతసమాజమందు, నడ్డు లేక ప్రవర్తించు నయ్య దెల్లఁ

గలుగ నగు నా ప్రభావమువలన నాత్మ, యంద భూతములగుదాని నరయవలయు.

వ. సుషుప్తియందు స్వప్నద్వార మగుమానవదేహము మనమ్మున లీన మ్మగు నట్టి మనమ్ము పరసద్హేతువు నవ్యక్తము నగు నాత్మ యందు నిద్రించి సాక్షీభూతమై యుండు దాని సర్వభూతాత్మభూతస్థ మగునధ్యాత్మగుణము గాఁ జెప్పుదురు.

తే. ఎవ్వఁడు సంకల్పమున మది నీశ్వరగుణ
ముల నెఱుఁగఁ గోరు వానికిఁ దెలిసికొనిన
నదియె యాత్మప్రసాద మయ్యాత్మయందె
భూతజాతం బి దంతయుఁ బొందుపడును. 508

మ. తప మే కారణ మీఫలంబునకు నేలద్దుస్తమం బీఁగువాఁ
డెప్పుడుఁ సూర్యుఁడు నా వెలింగెడిఁ దమం బేఁగం బ్రకృత్యాత్మకుం
డు పరేశుం డనఁ నొప్పుదేహి తప మెందుం దేవతాకోటి నె
ల్లపుడుఁ రాక్షసకోటి నొందెడిఁ దమం బత్యంతఘోరాకృతిన్. 509

వ. సత్త్వరజస్తమంబులు దేవాసురగుణంబు లందు సత్త్వంబు దేవగుణంబు రజస్తమంబు లసురగుణంబులు జ్ఞానజ్యోతిరూపంబు నమృతంబు నక్షరంబు నగు పరబ్రహ్మము నెఱింగినభావితాత్ము లుత్తమగతిం బొందుదు రజాతశత్రూ! పరబ్రహ్మతత్త్వం బింతమాత్రఁ జెప్ప శక్యంబు దానిన్ జ్ఞానచక్షువుచేతను బ్రత్యాహారంబుచేతను దెలియం దగు నని మఱియును. 510

సీ. స్వప్నసుషుప్తులు సగుణనిర్గుణములుఁ, దలఁప వ్యక్తావ్యక్తము లని ఋషులు
చెప్పి యుండిరి వీని చొప్పెఱుంగనివాఁడు, బ్రహ్మ మెఱుంగనివాఁడ యగును
వ్యక్తమ మృత్యు వవ్యక్తమ పర మని, నారాయణమహర్షి నాఁటిధర్మ
మాశ్రయించి చరాచరాత్మజగత్త్రయ, మలరు నివృత్తియవ్యక్త మైన

తే. శాశ్వతబ్రహ్మము ప్రవృత్తిసంగతిమునిజనులఁ దెల్పెఁ బ్రజాపతి మును ప్రవృత్తి
ధర్మమది పునరావృత్తిఁ దవులుకొను నివృత్తి పరమగతికి హేతు వెన్నిచూడ.

ఆ. జ్ఞానతత్త్వపరుఁడు తా నివృత్తి శుభాశుభము లెఱింగి యట్టిపరమగతిని
నాశ్రయింపఁ గలుగు నవ్యక్తపురుషు లనంగఁ దద్విధం బెఱుంగ వలయు.

సీ. అవ్యక్తపురుషుల నతిశయించి మహత్తర మ్మైనయొకపదార్థమ్ము గలుగుఁ
దద్విశేష మెఱుంగఁ దగు విచక్షణుఁ డాప్రకృతిపురుషులకు నొక్కింత యేని
చలన మాద్యంతముల్ గలుగ వలింగము, లవి నిత్యములును మహత్తరములు
సమధర్మమును భేద మమరు నారెంటికిఁ, బ్రకృతి త్రిగుణధర్మపరివృత యయి

తే. స్వర్గధర్మిణి యగు నట్టిప్రకృతి ధర్మ
కర్మములు పూరుషునకును గలుగ వతఁడు
ప్రకృతి కగువికారముల నరయుచు నుండు
గాని గుణముల నెప్పుడుఁ గలుగఁ బోఁడు. 513

వ. జీవేశ్వరు లలింగులు నసంగులు నగుటచే నగ్రాహ్యు లగుచున్నారు జీవుఁడు ప్రకృతిసంయోగంబునం జేసి యుత్పత్తిహేతు వగుచుండుఁ గర్తయై కర్మములం జేయు కరణములచేఁ దనచేయుకర్మముల నాయాగతుల నొప్పి నే నెవం డ నిది యేమి యనుసంజ్ఞలం గీర్తింపం బడుచుండు. 514

శా. పాగా వెట్టినవాఁడు మూఁటివరుసన్ వస్త్రావృతుం డైనయ
ట్లాఁగన్ సత్త్వరజస్తమోగుణములన్ వ్యావిష్టుఁడై జీవుఁడున్
సాఁగుం గావునఁ దచ్చతుష్టయలసత్సారూప్యవైరూప్యముల్
యోగాభ్యాసముచే నెఱింగినజనుం డొందండు మోహం బెదన్. 515

తే. దివ్యసంపదఁ గోరెడుధీరవరుఁడు, హృదయశుద్ధి గలిగి శరీరేంద్రియముల
చే నకల్మషమై యుగ్రమైన తపము, సలుప నది తేజున జగంబు లలుము కొనును.

చ. తపమునఁ జంద్రసూర్యులు ముదంపడి నింగి వెలుంగుచుండు రా
తపమునఁజేసి రాజసము తామసము న్నశియించు సత్త్వమే
తప మగు బ్రహ్మచర్యము వ్రతంబు నహింసయు దైహికోల్లస
త్తపమును వాఙ్మనోనియమతంత్రము మానసికంబు నాఁబడున్. 517

క. వరము ద్విజాన్నగ్రహణము, పురుషుల కాహారనియమమున రాజసమున్
దురితము నడఁగు విషయములఁ, గరణంబులు వైమనస్యగతినిం బొందున్. 518

వ. కావున దేహధారణమాత్రప్రయోజనంబుగ నాహారంబు స్వీకరింప వలయు నంతకాలమున జ్ఞానబలోత్కర్షంబున నాతురుండై యుండవలయు నిట్లు మనోజ్ఞానం బయ్యె నేని రజోదోషవర్జితుండై సూక్ష్మశరీరంబుతో శబ్దంబువలె సంచరించును గార్యములచే నవ్యాహతమతియై వైరాగ్యంబు గలిగి దేహ మున్నంత వఱకు నప్రమాదమున మెలంగుచు దేహాంతమున ముక్తుం డగు భూతసృష్టిప్రలయము లజ్ఞానహేతుకంబులు పరప్రత్యయసర్గంబున నియతియు నుండ దిట్టినిష్కల్మషజ్ఞానంబుగలవా రాత్మస్థుం డగునవ్యక్తసంజ్ఞితుండు నవ్యయుండు నగుహరి నెఱింగి పరంబు నొందుదు రాకర్ణింపుము. 519

ఉ. తామరతూఁటిలోఁ దెగక తంతువు నిండినరీతి మేనిలో

నేమెయిఁ గన్నఁ దా నగుచు నేచినతృష్ణ శరీరి నెప్పుడున్
గోపతిజే పో నొనర్చియును గుట్రపువాఁ డొకబట్టఁ గుట్టిన
ట్లాముున సుస్మృతిన్ వదల కంటఁగఁ గట్టి నిబద్ధుఁ జేసెడిన్. 520

వ. తృష్ణ యిట్టి దయినం బ్రకృతిపురుషస్వరూపం బెఱింగినవాఁడు తృష్ణాసహితుం డయ్యు ముక్తుండగు నని తొల్లి నారాయణమునీంద్రుం డిట్లు భూతానుగ్రహకాంక్షం జేసి యానతిచ్చె నని చెప్పిన విని యుధిష్ఠిరుండు మిథిలాధినాథుం డగు జనకుం డెట్టివృత్తంబున మానుషభోగంబులు విడిచి మోక్షంబు నొందె నెఱింగింపు మని భీష్ము నడిగె ననిన నైమిశారణ్యవాసు లవ్వలివృత్తాంతంబు చెప్పు మని సూతు నడుగుటయును. 521

ఆశ్వాసాంతము.

శా. శ్రీకృష్ణాజలశీకరాంచితమరుత్సేవాసమాసాదితా
స్తోకానందసుఖైకపాత్ర మగుచున్ శోభిల్లి ముక్తీశ్వర
ప్రాకామ్యాంఘ్రిసరోజముల్ గొలుచుచున్ రాజై ప్రజారక్షణం
బాకాంక్షిం చెడుచంద్రమౌళి సుముఖుం డై యొప్పు నెల్లప్పుడున్. 522

గద్యము.

ఇది శ్రీమదధునాతనోభయకవిమిత్ర, వేంకటయజ్వాగ్రపుత్ర,
సమారాధితవిబుధరాజ, శ్రీపాదకృష్ణమూర్తికవిరాజ
ప్రణీతం బయిన శ్రీకృష్ణభారతంబునందు
శాంతిపర్వంబునఁ బంచమాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ



శ్రీ

బాలాత్రిపురసుందర్యై నమః.

# శ్రీకృష్ణభారతము.

శాంతిపర్వము - షష్ఠాశ్వాసము.



కృష్ణోత్తరతీర
ప్రాకటముక్తేశ్వరాఖ్యపరమేశ్వరసే
వాకలితాత్ముం డగుసు
శ్లోకుఁడు శ్రీచంద్రమౌళి సొంపలరారున్. 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె నట్లడిగినధర్మరాజుదిక్కు
మొగం బై భీష్ముం డిట్లనియె. 2

మ. జనకుం డెల్లపు డూర్ధ్వదైహికములై చాలొప్పుధర్మంబులన్
మననంబుం బొనరించువాఁ డగుచు నానాదేశసంవాసులన్
ఘనులం గోరిన వారు నూఱుగురు వేడ్కన్వచ్చి తద్గేహమం
దనిశంబున్ నివసించి వాకొనిరి ధర్మాచార్యులై ధర్మముల్. 3

క. ఆతఁడు వారల నెల్లన్, జేతమునం ధర్మతత్త్వజిజ్ఞాసమెయిన్
బ్రీతుఁ డయి కొలిచె శిష్య,ఖ్యాతమతిన్ సతతభోజనాదికసేవన్. 4

## పంచశిఖుఁడు జనకునకుఁ జేసినతత్త్వోపదేశము.

ఆ. అపుడు కాపిలేయుఁ డనఁ బంచశిఖుఁ డన,నొప్పుమౌని యొకరుఁ డుర్వి యెల్ల
మెట్టికొనుచు వచ్చె మిథిలాపురంబున, కొక్కనాఁడు రాజునొరిమ వినుచు. 5

సీ. ఆతఁడు సర్వసన్న్యాసధర్మంబుల,తత్త్వమెఱింగినధన్యమూర్తి
తత్త్వవిజ్ఞాని నిర్ద్వంద్వుండు నష్టసం,శయుఁడు మానవులందు శాశ్వతసుఖ

మెంచువాఁ డాతని నెల్లసాంఖ్యులు ప్రజాపతి గ మహర్షి గాఁ బలుకుచుండు
రట్టిరూపున లోకు లందఱు కచ్చెరు, వుదయింపఁ జేయుచు నుండు నతఁడు
తే. ఆతఁ డాసురి యనువాని కాదిశిష్యుఁ,డైనవాఁడు పంచస్రోతమందు వేయి
వర్షములకరిమితి గలపరమసత్త్ర,మాచరించి ప్రసిద్ధి గన్నట్టివాఁడు. 6
వ. చిరజీవి యగుసమ్మహాత్ముండు పంచస్రోతమునందు నిష్ణాతుం డై పాంచరాత్రా
గమవిశారదుండై పంచకోశముల నెఱింగి శమదమాదులు గలిగి పంచకర్మ
ముల నొనర్పుచుఁ బంచశిఖుండు నాఁబడె నతనిగురుం డగునాసురియు క్షేత్ర
క్షేత్రజ్ఞజ్ఞానంబున దేవదర్శనుం డై యమ్మండలంబున నవ్యయపదంబు నొందె
నతని కంతేవాసి యగు నాపంచశిఖుండు. 7
క. కపిల యనునొక్కబ్రాహ్మణి,కపుడు సుతత్వంబు నొంది యాయమచనుఁబాల్
కృపనిడఁ ద్రావుట నిక్కా,శ్యపి నాతఁడు కాపిలేయుఁ డన నుడికెక్కెన్. 8
క. జనకుని సామాన్యుని గాఁ,దనమనమున నెంచి ధర్మతత్వజ్ఞుం డా
తని నూర్వుర నాచార్యులఁ,బనివడి యోడించె హేతువాదము లెసఁగన్. 9
తే. కాపిలేయానుదర్శనకారణమున,జనకుఁ డభిరక్తుఁ డగుచు వెంటన మెలంగి
కొనుచు నతిభక్తిఁ బూజించెఁ దనదుతొంటి,వారినూర్వుర విడనాడి వరుసతోడ.
వ. పంచశిఖుం డాచార్యుం డై ప్రణతుం డగునజ్జనకునకు సాంఖ్యోక్తంబులు
మోక్షప్రదంబు లగుబహువిధవచనంబులును జాతనిర్వేద కర్మనిర్వేద ధర్మ
నిర్వేదంబులం బ్రతిపాదించు వాక్యంబులునుం దెలిపి దేనికై ధర్మము లొన
రించియు ఫలప్రదంబు లగుకర్మము లాచరించుటయుం గలుగుచుండునో యట్టి
యనిత్యాసత్యావిశ్వసనీయం బగుమోహంబుం గూర్చి పలుతెఱంగులంబలికి
యనంతరంబ నాస్తికులవాదం బుపపాదించుచు ని ట్లనియె. 11
సీ. తనువినాశనము ప్రత్యక్ష మై లోకసా,క్షిక మయి చూపట్టఁ గేవలాగ
మము నమ్మి పర మొక్కఁడమని ననెడునాతఁ,డుపరాజితుం డగు నెపుడు మేను
తెగునది యే మృత్యు వగు జరారోగము, లర్థమృత్యువులు క్లేశాకరమ్ము
లొడలు గా నాత్మ యొక్కఁడు కల దనుకొంట,సరి కాదు మోహమే పరఁగునచట
తే. లేని దున్నటు లెంతుర యేని జనుఁడు, తనకు లేవు జరామృతు లని తలంచు
మాత్ర లేకుండునోటు ప్రమాణమునిట,నాత్మ లేదంటకుం బెక్కు లమరియుండు.
వ. ఇ ట్లుండ దేనిం బురస్కరించుకొని లోకయాత్రావినిశ్చయము చెప్పఁ గలరో
మఱియు నాగమానుమానంబులకుఁ బ్రత్యక్షము మూలము ప్రత్యక్షముచేత

నాగమము భిన్నం బగు నింక ననుమానము ననిశ్చయము గాంచె మైనఁ గానరా దనుమాన మొనర్ప వలసినదియును దానసాధ్య మగునదియు లేదు గావున శరీరముకంటె నన్యుఁ డగుజీవుం డొండొక్కఁడుండు లేఁ డనియు నతి సూక్ష్మం బగువటబీజంబున నాకులు కొమ్మలు పుష్పములు లోనగునవి యిమిడి యున్న వాశక్తి బీజమునక కల దట్లు బీజమునుండి దేహమును మనోబుద్ధ్యహంకారాదులును గలుగును సూర్యకాంతి యయస్కాంతమును వాఁకి వహ్నిం బుట్టించును దప్తలోహము జలము నింకించు నట్లే దేహాదులుం బుట్టి గిట్టుచుండు నని నాస్తికులు వాదింతు రది సరి కాదు చెప్పెద నాకర్ణింపుము.

సీ. మృతి నొందినప్డు లో మెలఁగుశక్తి నశించు, మేను నశింపదు గాన మేను
నాత్మ యొక్కటి యైన నా రెండు కాన రా,కుండ వలయు నిట్టు లుండఁ బట్టి
యవి భిన్నవస్తువు లని చెప్పవలయు నా,స్తికులు దేవతలఁ బ్రాప్తింత్రు స్థూల
దేహముల్ గలుగనిదేవత లున్నట్లు, వా రొప్పికొని రన వలయుఁ గాదె
తే. అట్లయిన మేనికన్న వే ఱగుచు నాత్మ,యొకటి కల దని వా రేల యొప్పికొనరొ
మరణ మొందినవెనుకఁ గర్మములు లేమి, నాస్తికులవాద మడియు ననాదృతంబ.

క. ఆపగిదిఁ బూర్వకర్మము, లే పోయినస్థితికి జాతి కీవైషమ్యం
బే పగిది వచ్చు హేతువు, లే పగిదిని వారు చెప్ప రింతయు నిందుక్. 15

వ. మఱియునుం గొందఱు పునర్జన్మమునకు నవిద్యాకర్మతృష్ణలు లోభమోహంబులు దోషాచరణంబును గారణ మందురు వా రవిద్యను క్షేత్రముగాను గర్మములు బీజములు గాను తృష్ణ నీరంబు గాను జెప్పి దానివలనఁ బునర్జన్మ మగు ననియు నవిద్య నిగూఢం బయినమరణధర్మము గలదేహము నశించి దానినుండి యన్యదేహము పుట్టు ననియు నది జ్ఞానదగ్ధం బైన సత్యసంక్షయం బగు ననియుం గా దేని మనుష్యుండు నిర్వాణంబు నొందు ననియు వచింతు రది యసంగతంబు వినుము. 16

సీ. అట్లు పునర్జన్మ మందినజన్యంబు,వెనుకటిదానికి భిన్న మైన
తనులక్షణాదులఁ దనరి యుండిన యేని, యాతనువే యిది యనుట యెట్టు
లది యిది గాదు వే ఱనిన నాకర్మము, లనుభవింపం బని యమరఁ బోదు
విద్యాబలాదులం బ్రీతియు నెట్లగుఁ, గర్మమే యింతకుం గారణ మన
తే. నివలిజన్మమునం బూర్వభవమున నగు,కర్మఫల మందఁ గలుగుదుఃఖసుఖములను
బట్టి యిపుడు దృశ్యాదృశ్యఫలవినిర్ణ,యము నొనర్పఁగ రా దని యందు రేని.

క. లోకంబ్ల దంపి దేహము, పోకార్చిన నాశరీరమునుండి మఱొం
డేకరణిఁ బుట్టఁ గూడదొ, వాకొనఁ దగు వారె తమవివాదముపొంకెఱా. 18

తే. ప్రాక్తనవిజ్ఞానమే హేతువుగ మఱొండు, జ్ఞాన ముదయించు నం ద్రదిసరిపడంగఁ
బోదు మును మేనితోఁ దెగి పోయినట్టి, జ్ఞాన మవలికి హేతువు గా నెసఁగదు.

సీ. పవలును రేయి ఋతువు లేండ్లుశీతోష్ణ,ములు ప్రియాప్రియములుపోయిమరల
వచ్చెడునట్లు సత్వములు క్షయించి యు,నవియె మరల వచ్చు ననఁగ వలయు
జ్ఞాననిత్యత నెంచి దానికిఁ గ్రొత్తవి,జ్ఞానసంబంధము నౌ న టన్న
జీవికినయిలు గూలి చెడినట్లు మేఁ జరా,మృత్యువులఁ నశియించి పోవు

తే. నింద్రియములుమనముగాలియెమ్ముకలును, నల్లయునునంజుడును జెడినాశ మొంది
తమకుఁ గారణమైయుండుధాతువులను, గలిసిపోయెడుననిబుద్ధిఁ దెలియవలయు.

వ. దేహంబులు సుఖదుఃఖాదులును స్వాభావికము లందురేని దానధర్మ ఫలప్రాప్తి నిరర్థకం బై లోకయాత్రావిఘాతం బగుఁ గర్మబోధకంబు లగువేదాదులును లౌకికంబు లగు వ్యవహారంబులును వ్యర్థంబు లగు నాత్మ మనోబుద్ధులను విడనాడినఁ గర్మఫల మనుభవింప నెవ్వఁడుండుఁ గావున నిట్టినాస్తికవాదముల వెంటఁ బరువు లెత్తువారిబుద్ధి వృక్షంబు వలె జీర్ణించు నిట్లర్థానర్థంబులం దగిలి సర్వజంతువులు దుఃఖితము లగుచుండు నట్టివారిని మావటివాం డ్రేనుంగులం బలె వేదంబు లాకర్షించుచుండు. 21

ఉ. మానవు లెందఱో తమకు మానసశక్తి యొకింతయేనియున్
లేనికతంబునన్ సుఖమునే తలపోయుచుఁ దద్గతార్థముల్
బూని యనేకకష్టములఁ బొంది స్వవాంఛితసౌఖ్యలేశమున్
గానఁగ లేక మృత్యుముఖగహ్వరమం దయి పోదు రక్కటా. 22

తే. అధ్రువం బయి నాశన మంద నున్న, జీవితమునకుఁ జుట్టాలతో వసుమతి
తోఁ బ్రయోజన మేమి? చేతోగతి నివి, యెల్ల వదలినవానికి నెసఁగు ముక్తి.

తే. పంచభూతవికార మైఁ పడటఁ గలియు, నట్టి దిది యని విజ్ఞాన మలరె నేని
మేనిపై నాస వేనికి మానకుండు, నట్టివానికి సుఖ మెంచు కెట్టిమాట. 24

వ. అని నిరామయంబులును నాత్మసాక్షికంబులు నచ్ఛలంబు లగుపంచశిఖుని వాక్యంబులు విని విస్మితుం డై విదేహుండు మరణానంతరభవాభవము లడుగువాఁ డై యమ్మునిదిక్కు మొగంబు వెట్టి యి ట్లనియె. 25

తే. జనుఁడు చచ్చినపిదప విజ్ఞాన ముండ, దనిన నజ్ఞానమున జ్ఞానమునఁ బ్రయోజ

న మది యెట్టి దట్లయినచో నమలచిత్త, సర్వకర్మములకుఁ జేటు సంభవిలదె.

వ. మఱియు నట్టియెడ నప్రమత్తునకుఁ బ్రమత్తునకుం దారతమ్య మేమి యుండు సుఖకరము లగువాని వీడుటయు వినశ్వరము లగుచింతలం గూడుటయుం గలుగునేని కర్మము లెవ్వ రాచరింతు రింపలితత్వం బెఱింగింపు మని యజ్ఞానావృతుం డై యున్న జనకు నోదార్చుచుఁ బంచశిఖుం డి ట్లనియె. 27

సీ. నృపవర! యుచ్ఛేదనిష్ఠ గా దీమోక్ష,మరయ సూక్ష్మగ్రాహ్య మనఁగ రాదు
దేహేంద్రియస్వాంతసాహచర్యమున స,మాహార మగుచుఁ గర్మముల నిద్ధి
కలసియు వే ఱయ్యుఁ గావించుచుండును,బంచభూతముల మే నెంచ నొప్పు
నవి చేరి మేను గా నగుటయు విడుటయు, వాని స్వభావ మై వఱలుచుండు

తే. మే ననఁగఁ బంచభూతము లౌను గాని
దాని కేకత్వకథనము తగదు మేనఁ
బ్రాణవాయువు జఠరాగ్ని జ్ఞాన మనెడు
మూఁడు కార్యసంగ్రహము లై పొనరుచుండు. 28

వ. ఈమూఁటినుండియు నింద్రియములు నింద్రియార్థములు స్వభావము చేతనయు మనంబును బ్రాణాపానంబులును ధాతువులును నిస్సృతంబు లగుఁ బంచేంద్రియంబులును మనశ్శక్తివలనఁ దమతమగుణంబు లొందు మనస్సు విజ్ఞానగుణయుక్తం బై సుఖదుఃఖంబులు సుఖదుఃఖాభావంబు ననువివిధావస్థలం బొందుచుండు శబ్దస్పర్శరూపరసగంధంబులును వానిమూర్తులును షడ్గుణంబులు నామరణాంతము జ్ఞానసిద్ధి కగుచుండు నాషాడ్గుణ్యంబునం దకర్మనిసర్గంబును ద్యాగంబును దత్త్వార్థనిశ్చయంబు నున్నయవి మఱియు నందే బుద్ధి యనుమహత్పదార్థము శుక్రనామంబున నొప్పు నదియే నిశ్చలం బగుమనంబుతోఁ గూడి యవ్యయం బగుపరంబు నెఱింగికొనుచున్న దీగణసమూహ మాత్మభావమునం జూచువాఁడు సమ్యగ్దృష్టి లేనివాఁ డగుటం జేసి దుఃఖంబు లందు దేహేంద్రియాదుల నాత్మ గా నెంచక నేను నాది యనునహంకారము లేనివాఁడు దుఃఖదూరుం డగు నిట సమ్యగ్బోధ మనుత్యాగశాస్త్ర మనుత్తమ మది ముక్తికి హేతుభూతంబు. 29

సీ. వినుము ద్రవ్యత్యాగమునకు యాగాదికర్మములు భోగత్యాగ మమరుపొంతెఁ
దగువ్రతమ్ములు సుఖత్యాగమునకుఁ దపో,యోగములు సకలత్యాగమునకు
సకలసమాప్తి యై ప్రకటింపఁబడు నది, దుఃఖనాశమునకుఁ ద్రోవ యట్టి

చాఱి జనకు యున్నఁ దప్పదు దుర్గతి, యెంత లెంతల కైన నెల్లనాఁడు

తే. మఱియును జ్ఞానేంద్రియంబులు మనము ననెడు
నాఱిటిం జెప్పె కర్మేంద్రియములు ప్రాణ
మనెడువాఱింటిని గ్రమ మనుసరించి
తెల్పెదను సావధానతఁ దెలియ వినుము. 30

సీ. హస్తముల్ పనిసేయునవి పాదములు నడచునవి శేఫము ప్రజఁ గనెడునద్ది
గుదము మలము విసృజనది వాక్కు పలికెడునది వీనితో మది యమరియుండు
నిట్లని పదునొకొం డింద్రియంబులు బుద్ధిచే మనంబును విడఁ జేయ వలయుఁ
జెవులును శబ్దము చిత్తముఁగ వినుటకు, వలయు నట్టులు రసస్పర్శరూప

తే. గంధములకుఁ దక్కినవానిఁ గలయ వలయు
వాని వానిని దెలియఁ గా వలయుఁ బదియు
నైదు పైత్రికములకూట మన్నిఁటికిని
విషయసంగ్రహణంబున వెలయ నగును. 31

తే. సాత్వికము రాజసము తామస మనుమూఁటి
యంద యుదయించుఁ ద్రివిధంబు లయ్యు సర్వ
సాధనము లైనభావముల్ సంతతంబు
మానవులః మేలుకీళ్లకు స్థానము లయి. 32

సీ. హర్షంబు ప్రీతియు నానందము సుఖంబు, శాంతచిత్తత యివి సాత్వికములు
పరితాపశోకలోభక్రోధములు తుష్టి,రాహిత్య మనునివి రాజసములు
నవివేకమును మోహమతినిద్రయును బ్రమాదముతంద్రతయునివి తామసములు
కారణాకారణగతుల సత్వరజస్సు, లగు నెట్టులో తమం బతిశయిల్లు

తే. సతతసంప్రీతియుక్తము సత్వగుణముఁ, జూడ నప్రీతి కరము రజోగుణమ్ము
భూరిమోహాకరమ్ము తమోగుణమ్ము, నప్రతర్క్య మవిజ్ఞేయ మత్తమంబు. 33

వ. మఱియు శ్రోత్రము వ్యోమాశ్రితభూతము శబ్దము శ్రోత్రము నాశ్రయిం
చును శబ్దవిజ్ఞాన ముభయంబున నగు నిట్లు త్వక్చక్షుర్జిహ్వాఘ్రాణములు నగు
నవి స్పర్శరూపరసగంధములం బ్రవర్తించు నవియే చిత్తప్రవృత్తికగుచుండుఁ
గర్మేంద్రియజ్ఞానేంద్రియములు తమకార్యములలో యుగపద్భావము నొందు
నందు నేకాదశం బగుమనంబును ద్వాదశం బగుబుద్ధియును వర్తించు నాపది
రెండింటికిని యుగపద్భావము లేకున్నఁ దామసం బగునుచ్ఛేదము లేదు

యుగపద్భావము లౌకికవ్యవహారము ననుసరించి యుండుఁ బూర్వ శ్రుతాగమంబున సూక్ష్మేంద్రియములు తెలియంబడుచున్నవి. త్రిగుణంబులతోఁ గూడి యుండుటం జేసి సూక్ష్మకారణేంద్రియములు తోఁచవచ్చుచున్నవి కావున స్వప్నమందును జాగ్రదవస్థయందుంబలెఁ గార్యములు ఘెల్లుచుండు నదియే తామసావస్థ యది యస్థిర మై చెడునది యగు నిఁక వేదజ్ఞానమున నైనముక్తి సుఖ మన్న నది యట్టిది కాక దుఃఖమును మాత్రము నొందకుండు సుషుప్తి యందుం బోలె మోక్షావస్థయందును గర్మగుణములు లేకుండు నధ్యాత్మ చింతకులు దేహేంద్రియాదిసమాహారమును క్షేత్రమండ్రు మానసస్థితం బగు భావము క్షేత్రజ్ఞుఁ డనఁబడు నిష్టినశాశ్వతునకు నుచ్ఛేద మెట్లగు సర్వ గతంబు లగునదీనదంబులు నిజవ్యక్తులను విడిచినట్లు గుణసహితుం డగుజీవుండు పరమాత్మం జేరి భేదంబుఁ గాంచకుండు నిదియే సత్వసంక్షయంబు. 34

క. ఇది యెఱిఁగి యప్రమత్తతఁ, బొదలినమనమునను మోక్షబుద్ధి పరంబుల్
వెదకెడువానికి నంటవు,సదసత్కర్మములు జలము జలజదళగతల్. 35

క. కొడుకులు కొమ్మలు సొమ్ములుఁ, గుడు లాదిగ నైనపాశకోటులలోనన్
బడక సుఖదుఃఖసంతతిఁ,గడచినవాఁ డుత్తమంబుగతి నొందు నిలన్. 36

క. శ్రుతిశాస్త్రసుప్రమాణ,స్థితిగతుల నెఱింగి మెలఁగుక్షితిజనుఁడు జరా
మృతిభయము లందఁ బోవక,సతతము సుఖనిద్రఁ జేయు సౌఖ్యం బెసఁగన్.

తే. పుణ్యపాపఫలంబుల పొందు విడిచి,బుజగతి మెలంగుచు నస క్తహృదయుఁ డైన
యతఁడు మునుమున్ను సగుణంబునంది పిదప,నిర్గుణబ్రహ్మ మంది నిర్నిద్రుఁడగును.

చ. మునుమును సాలెపుర్వు తనపోఁగులఁ జిక్కియుఁ దద్వినాశనం
బున నిజతంతులన్ విడిచి పోయెడునట్టులు జీవుఁడున్ స్వక
ర్మనిచయసంగతిం గలుగుమై విడియున్ దనదుఃఖ మద్రిపైఁ
జనుశిల జాఱి పడ్డగతి జాఱి పడన్ సుఖయించు నెంచఁగన్. 39

ఉ. దుప్పి పురాణశృంగమును దూపిల కేఁగినయట్లు కూసమున్
సప్పము పీడ్చినట్లు నది సాళ్వడుచెట్టును బిట్ట పీడిన
ట్లెప్పుడు సర్వసంగముల నీఁగినయోగి సమస్తదుఃఖముల్
దెప్పునఁ ద్రెంచి యుత్తమగతిం గలఁడై సుఖ మందుఁ బొందుగన్. 40

క. జనకుఁ డొకప్పుడు కాలెదు,తనమిథిలం గన్నులారఁ దాఁ గని యిది నా
దని కాని కాలుచున్నది,యని కాని వచింపఁ జాల ననె నఁట వింటే. 41

వ. ఇట్లు పంచశిఖునివలన మోక్షమార్గంబు విని మైథిలుండు వీతశోకుం డయ్యె
మోక్షనిశ్చయం బగునిజనకపంచశిఖసంవాదంబు వినినవాఁ డుపద్రవంబులం
బొలఁగఁ ద్రోచి దుఃఖంబునుండి విడివడు నని చెప్పిన నప్పౌరవేంద్రుం డప్పి
తామహునిక్కు మొగం బై దేవవ్రతా! మానవుం డేమికార్యంబులం జేసి
సుఖదుఃఖంబు లొందునో యేవి చేసిన నిర్భయుం డగునో తెలుప ననుగ్ర
హింపు మనిన నతం డతని కిట్లనియె. 42

## శుభాశుభకర్మఫలనిర్వచనము.

సీ. దమము నే సర్వవర్ణముల వారికి నుత్తమ మగుధర్మం బని మాన్యు లండ్రు
దమము లేకుండిన నమర దొప్పుగఁ గార్య,సిద్ధి దమమునంద చెల్లి యుండు
సత్యంబు తపమును సత్క్రియయు దమంబ,తేజోగరిమఁ బ్రవర్ధిల్లఁ జేయు
దాంతుండు పాపముల్ తఱెగి నిర్భయుఁ డయి,పొందు మహత్వము నిందు నందు
తే. నతఁడుసుఖనిద్ర నొందిసౌఖ్యముగ మేలు,గాంచునిర్మలచిత్తముంగలుగుదమము
క్రోధలోభాదిశత్రులం గొట్టివైచి, సర్వసౌఖ్యంబు లొనఁగూర్చు సంతతంబు. 43
క. భూతములకుఁ గ్రవ్యాదుల,చేతంబలె దాంతి లేనిచెన్నఁటి కతనఁ
భూతలవాసుల కెప్పుడు, భీతియ పొడసూపుచుండుఁ బృథ్వీనాథా. 44
ఆ. దాంతి లేనివానిఁ దండించి లోకుల,కభయ మొసఁగుపొంటె నబ్జభవుఁడు
క్షత్రియాన్వయంబు ధాత్రీతలంబున, నెసక మెసఁగ జేసె నెంచి మదిని. 45
వ. సర్వాశ్రమములందును దమంబు ప్రధానం బయ్యాశ్రమధర్మంబు లెల్ల దమము
నంద యున్నయవి తల్లక్షణంబులం జెప్పెద వినుము. 46
సీ. సంతోషమును శ్రద్ధ శాంతము దయయు నా,ర్జవము నక్రోధము సాధువర్త
నము నకార్పణ్యము నాతివాదము నన,సూయ శీలము నపైశున్యము నమృ
షావాదమును వృత్తసంపన్నతయు నజ,నాపవాదము ప్రసన్నాత్మతయును
భూతావిరోధము పుణ్యకథాశ్రుతి,విగతనిందాస్తుతి విలసనంబు
తే. ననెడునివి దాంతులకుఁ జెప్ప నైనలక్షణములు వీనిని గలిగిననరుఁడు లోక
సత్కృతులనొంది దేహావసానమందు, స్వర్గమునుబొంది సుఖయించుఁ క్ష్మాతలేంద్ర.
వ. అట్టిదాంతుండు భూతజాతంబున కభయం బొసంగుటం జేసి తా నాభూతంబుల
భయంబు లేక లాభాలాభంబులు సంతోషదుఃఖంబులు లేక సత్కార్యాచరణ
శీలుం డై శ్రుతసంపన్నుం డై యింద్రియనిగ్రహంబు గలిగి యుండు దురాత్ము
నకు క్షమ సంతోషము సహనము ప్రియవాదిత్వము సత్యము లోనగునవి లేక

కామక్రోధలోభగర్వాదులు గలిగియుండుం గావునఁ గామక్రోధాదులను జయించి బ్రహ్మచారియు జితేంద్రియుండును శంసితవ్రతుండు నై కాలము నిరీక్షించుచు నాత్మజ్ఞుం డగువాఁడు నిరహంకారుండై యుండు ననిన యుధిష్ఠిరుండు వ్రతోపేతు లగుద్విజాతులు బ్రాహ్మణప్రీతి నై హవిర్భుజు లగుదు రది దోషయుక్త మగునో యనిన భీష్ముం డి ట్లనియె. 48

క. వ్రతముల వేదోక్తమ్ముల, నతినిష్ఠం జేసి కుడిచి నంతన దోషం
బతుకదు వేదోక్తంబుల, వ్రతలోపము గలుగుఁ గుడుపునలన నరేంద్రా. 49

క. అనిన యుధిష్ఠిరుఁ డను నో, యనఘా యుపవాసము తప మని కొంద అనఁగా
విని యుందు నదియె తప మని, యన వచ్చునొ తపము వేఱ యగునో చెపుమా

సీ. అనిన భీష్ముం డను నవనీశ! మాసప, క్షోపవాసము లవి యే పరమత
పం బవు కాని తపం బన రా దని, త్యాగ మింద్రియనిగ్రహమును దపము
నాఁబడియెడు న ట్లొనర్చువాఁడు సదోప, వాసియును మఱి సదా బ్రహ్మచారి
యును సదాఘాసుఁడుండును సదాముని సదా, దైవతం బన నయి తనరుచుండు

తే. నతిథులకుఁ బెట్టి భుజియించునట్టిఁడువిఘసాసి వేల్పులకుం బెట్టి యవల మెసఁగు
నాతఁడమృతాసి సవములయందుఁ గాక, తిననియాతఁడమాంసాసియనఁగవచ్చు.

వ. మఱియు సాయంప్రాతఃకాలములం దక్కఁ దక్కిన కాలంబులం దిననివాఁడు సదోపవాసి ఋతుకాలంబులందు భార్యం బొందువాఁడు సదా బ్రహ్మచారి పగలు నిద్రింపనివాఁడు నిత్యాస్వప్నుండు జ్ఞాననిత్యుం డెప్పుడును సత్యవాది యిట్టివారు బ్రహ్మోద్యుత్తమలోకంబులం బొందుదురు వారు దేవతలం బితృదేవతలం గూడి భుజించుచుందు రనిన ధర్మనందనుండు మందాకినీనందనుం విలకించి యి ట్లనియె. 52

తే. కర్మములు శుభాశుభ ఫలగతు లొసంగు
మనుజున కటందు రట్టికర్మముల మాన
వునకుఁ గర్తృత్వ ముండునో యనియు లేదొ
యనియు సందియ మగుఁ దీర్పు మనఘ! దాని. 53

వ. అనిన విని శాంతనవుం డీయర్థంబున నింద్రప్రహ్లాదసంవాదం బనుపురాతనేతిహాసంబు గల దాకర్ణింపు మొక్కనాఁ డసక్తుండును ధూతపాపుండును సత్కులజుండును బహుశ్రుతుండు ననహంకారుండు సత్యగుణసంపన్నుండును సమయజ్ఞుండును దుల్యనిందాస్తుతియు దాంతుండును శాంతమతియుఁ జరాచరభూత

ప్రభవాప్యయజ్ఞుండు నక్రోధనుండును సమలోష్టకాంచనుండు ప్రియాప్రియ
సమచిత్తుండు నాత్మజ్ఞానధీరుండును నిశ్చితనిశ్చయుండును బరావరజ్ఞుండును
సంయతేంద్రియుండును సర్వజ్ఞుండు సమదర్శనుండు నగుప్రహ్లాదునికడకు దేవేం
ద్రుండు వచ్చి తత్ప్రజ్ఞాప్రభావం బెఱుంగం గోరి యి ట్లనియె. 54

ఇంద్రప్రహ్లాదసంవాదప్రకారము.

చ. సకలజగంబు మెచ్చఁ గలసద్గుణసంఘ మ దెల్ల నీయెడన్
ప్రకటిత మయ్యె న ట్లయిన బాలునిరీతి భవత్ప్రవర్తనం
బకట! కనుంగొనం దగియె నర్థవిహీనుఁడ వయ్యు శాత్రవ
ప్రకరవశుండ వయ్యు వగవం దగియుఁన్ వగ పొంద వియ్యెడన్. 55

తే. పాశబద్ధుఁడవై స్థానబలము లేక, వ్యసన మనుభవించుచుఁ బ్రసన్నాత్మకుండ
వగుదువిదినీదునవివేకమా? మదినగు,ధైర్యమా హేతువెది? తెల్పుమార్యవినుత.

వ. అని యడిగిన ధీరుం డగునాప్రహ్లాదుండు తద్వాక్యసంచోదితుండును నిశ్చిత
నిశ్చయుండును నై మృదుమధురవచనంబులం దనప్రజ్ఞయెల్లఁ దెల్లంబు గా ని
ట్లనియె. 57

సీ. విబుధేంద్ర! భూతప్రవృత్తినివృత్తుల, నెంచనివాఁడు స్తంభించుఁ గాని
తద్విధం బెఱిఁగినతత్వజ్ఞునకు స్తంభ, మనునది యేనాఁడు నమరఁ బోదు
స్వస్వభావముననే సర్వభావాభావ, ములు ప్రవృత్తి నివృత్తిఁ బొందుచుండుఁ
బురుషప్రయత్న మం దరయ నింతయు లేదు, దాని కేతా వొకిం తైన లేని

తే. యపుడు కారకుఁడెవఁడు లేఁడనుటనిశ్చ,యముశుభాశుభకర్మములందుఁదన్నుఁ
గర్తగానెంచుకొనువాఁడుక్రతుభుగీశ!, యేమెఱుఁగనియజ్ఞుండనినామతంబు.

చ. మనుజుఁడె కర్త యైన యెడ మానని శ్రేయముఁ బొందు కార్యముల్
పొనరిచి యర్థసిద్ధులను బొందుఁ బరాభవ మెందు లేనిపెం
పును గలఁడై యనిష్టములఁ బోకడఁ బెట్టి సుఖించుచుండుఁ గా
వున సుఖదుఃఖముల్ జతను వొందకవచ్చు నహేతుకంబులై. 59

క. ప్రతిరూపతరులు పజ్ఞా,న్వితు లగువా రొక్కొంతమంది నేర్పునఁ బ్రతిభా
ప్రతిహతబుద్ధు లరూపులు, నతగులునగువారిధనము నర్థింతు రెదన్. 60

సీ. గుణము లట్లు స్వభావగుంఫితంబులు గాఁగఁ, గలుగుశుభాశుభఫలములయెడ
నేరి కేయది మానకారణ మది యెల్లఁ, దత్స్వభావం బని తలఁతు నేను
దానికంటెన్ వేఱ యైనయాత్మప్రతిష్ఠయుఁ బ్రజ్ఞయును నా కెసంగఁ బోవు

తలఁప శుభాశుభ ఫలయోగ మది కర్మజము చెప్పెదను దద్విషయము వినుము

తే. కాకి తినుబండముం బెర కాకులకును
దెలుపునట్లు సకలకర్మములు స్వభావ
మును దెలుపుచుండును వికారములనె యెఱుఁగు
నతఁడు ప్రకృతి నెఱుంగనియట్టి డగుచు. 61

తే. వానికే జాడ్యమగుఁగానిదానినెఱుఁగు, దానికే జాడ్యము లేదు భావములు స్వ
భావభావులుగా నెంచువానిదర్పమానము ల వేమి చేసెడు మఘవిహారి. 62

ఆ. వేదధర్మ విధులవిధ మెల్ల నెఱుఁగుడు, భూతములయనిత్యమును నెఱుఁగును
నశ్వరంబు సర్వ మైశ్వర్య మని యెంచి, వగవు దక్కి యుండు స్వాంతమందు.

సీ. నిర్మముండ నిరాశి నిర్ముక్తబంధనుఁడను నిరహంకారుఁడ నయి భూత
సృష్టిలయంబుల నెఱిఁగి స్వస్థుండ నైనాఁడఁ గృతప్రజ్ఞునకు వితృష్ణు
నకు దాంతునకును నెన్నఁడు శ్రమమునువి, యెసరదు ప్రకృతియందునువికార
మందు నాకుఁ బ్రియాప్రియమ్ములు లేవు శత్రులుమిత్రులును లేరు తెలియవినుము

తే. ముజ్జగంబుల వాంఛితములు గలగవు, జ్ఞానమందును మఱియు విజ్ఞానమందు
జ్ఞేయమందును శర్మమే యేయెడలను, లేదు గావున నవి కోర నేది గాని. 64

ఆ. అనిన నింద్రుఁ డిట్టు లనునిట్టిప్రజ్ఞయు, నిట్టిశాంతి జనున కెట్టు లబ్బు
నేదియో యుపాయ మెఱిఁగింపు మద్దాని, కనిన దానవేంద్రుఁ డనియె నిట్లు.

వ. ఆర్జవంబును నప్రమాదంబును నాత్మజ్ఞానంబును వృద్ధశుశ్రూషయు ననువీని
వలనఁ బురుషునకు మహత్త్వంబు లభించుఁ బ్రజ్ఞయు శాంతియు స్వభావంబున
జనించు నీవు చూచుచుండు నీసర్వంబును స్వభావసంజనితం బనిన నింద్రుండు
విస్మితుం డై ప్రహ్లాదు నభినందించి వానిసెలవుగొని నిజనివేశంబునకుం జనియె
ననిన యుధిష్ఠిరుండు రాజ్యభ్రష్టు లెట్లు మెలంగుదురో తెలియఁ జెప్పు మనిన
భీష్ముండు నీ వడిగినదాని కుత్తరంబుగా బలివాసవసంవాదం బనునితిహాసంబు
గలదు దానిం జెప్పెద విను మని యిట్లనియె. 66

బలివాసవసంవాదప్రకారము.

చ దనుజుల నెల్ల గెల్చి విబుధప్రవరుం డొకనాఁడు బ్రహ్మదే
వునికడకుం గమించి యనువుం జను వొప్ప సమస్కరించి యో
వనరుహసంభవా! ధనము వమ్మయి పోవుచు నున్న విత్తహీ
నునిబలె నెప్పుడుం బలి కనుంగొనరాఁ డిది యేమి హేతువో. 67

క. దనుజులతోఁ బోరెడునా, కనిమొనగా దెల్లకడల నరసినఁ గానీ
కనరాఁ డయ్యెర్ బలి యా,తనివర్తన మెట్టిదీతిఁ దనరుం జెపుమా. 68

చ. వరుణుఁడొ వాయువో రవియొ వహ్నియొ చంద్రుఁడొ వేలు పెవ్వఁడై
పరఁగెడు నస్తమించెడినొ వాన లొసంగునొ యెల్లదిక్కులుర్
గరగరి వెల్గఁ జేసెడినొ గాని వచింప ననుగ్రహింపవే
కరుణమెయిర్ బలీశ్వరునికల్గినవృత్తము దెల్లఁ దెల్లఁగర్. 69

వ. అనిన వనజాసనుం డి ట్లనియె. 70

చ. అడుగఁగ రానిదాని నిపు డో నిది కా దిది నాక నన్ను నీ
వడిగితి చెప్పకుండుట లనాదృతిఁ జెప్పెదుఁ గానఁ జెప్పెదర్
గడిమి నతండు తా నిపుడు గాడిదలందొ వృషంబులందొ త
త్తడికొలమందొ లొట్టియలతండమునందునొ పుట్టి యుండెడిర్. 71

వ. ఆతఁ డిప్పు డొక్కశూన్యాగారంబున నుండె ననిన నింద్రుండు వెండియు. 72

క. ఆతఁడు శూన్యగృహమునం, దీతఱి వర్తించుచున్న నేఁ జని వానిర్
హేతిఁ దెగ నేసి వత్తునొ, చేత విడిచి పుత్తునో వచింపం గదవే. 73

ఆ. అనిన బ్రహ్మ యిట్టు లనియె నో వాసవ!, బలి వధార్హుఁ డనుట పాడి గాదు
పాడిఁ దలఁచి నీవు బలిని హింసింపఁ గాఁ, దలఁప వల ద టంచుఁ దెలుపుచుంటి.

వ. అనిన నోఁ గాత మని వాసవుం డాతని వీడ్కొని భూతలంబున నైరావతా
రూఢుం డై చని సంచరించుచు నొక్కశూన్యాగారంబున ఖరరూపుం డై
యున్నబలిం గాంచి యి ట్లనియె 75

ఉ. గాడిదపుట్టు వెత్తి యుముకం దినువాఁడవ వై తపింతువే
పాడి దొలంగి నీదయినవర్తనముం గన నెట్టివారికిర్
గో డరుదెంచు ని ట్లయినఁ గొంచెము గానియుఁ గించ నీమదిర్
గూడినజాడ లే దనుచు గోచర మయ్యెడు నెల్లవారికిర్. 76

వ. శత్రువశుండ వైననీభాగధేయము మిగుల శోచనీయము వినుము. 77

మ. సిరులా పోయెను మిత్రులా చెడిరి నిస్సీమప్రభావాదులా
పరిహాసంబుల కయ్యె బంధుజనులా పల్లెత్తు మాటాడ రే
పరివారంబును లేదు శత్రువులచే బంధింపఁగా నైతి నీ
ఖరజన్మంబును నీచ మిన్నిగతులర్ గష్టుండవై తక్కటా. 78

సీ. వేనవే ల్వాహముల్ వెంట రా జ్ఞాతులు, చుట్టువారుకొనంగఁ జుట్టి చుట్టి

లోకావళికి నెల్ల లోఁ వెలు పుదయింప, సలుపుచుందువు మమ్ము సరకుఁ గొనవు
నీశాసనంబున నిలుతురు పెక్కురు, రక్కసు లేనాఁడు నుక్కుమిగిలి
నీదుపాలనమున భూదేవియు నకృష్టపచ్య యయ్యెం గదా బలిపురారి
తే. ఇట్టినీ కిప్డు వ్యసనము లేగుదెంచె,నైన శోకింప వింతయుఁ గాని కడలి
తూర్పుగట్టున ధనము జ్ఞాతులకుఁ బంచి, యిచ్చునప్పుడు నీమనం బెట్టులుండె.
ఉ. నీకడ నప్డు వేవు రగునిర్జరకాంతలు నాట్య మాడుచున్
దేఁకువ నుండ్రు పెక్కు లగుదివ్యశరచ్ఛతముల్ మహోన్నతిన్
గైకొని పద్మమాలికలు కాంచనసుప్రభ లీవు దాల్తు వి
ట్లేకరణిన్ వసింతు మన మీదురవస్థకు నెట్టు లోర్చెదిన్. 80
సీ. రత్నభూషితసువర్ణచ్ఛత్రమును దాల్తు, నీగడి నలువది వేగు రైన
గంధర్వు లుందురు గానప్రవీణులు, నీయూపముల్ కాంచనాయతములు
జన్నములన్ దశశతసహస్రములు గోవుల దానమిచ్చినపురుషమూర్తి
యజమానుఁడ వయి శమ్యాక్షేపవిధిఁ జేసి, వసుధయెల్లఁ జరించి వచ్చి తీవు
తే. అపుడు నీమన మెటు లుండె నక్కటకట,యీసువర్ణభృంగారము నావ్యజనము
నామణిచ్ఛత్రమును గంటి కగపడ విట, బ్రహ్మదత్తమాలిక గాన రా ద దేది.
వ. అని సాభిప్రాయంబుగాఁ బలికిన బలి చలింప కి ట్లనియె. 82
మ. కనుఁగోరా విపు డీవు న న్నడుగుభృంగారాదు లోయన్న ! యీ
ఘనభూభృద్ద్రుమాలోన నున్నయవి నాకాలంబు మే లైన నా
కును నీకుం గన వచ్చుఁ గాని యిపు డోగుం గొన్నన న్నివ్విధం
బున నర్థాదుల పెచ్చి నీవు నగుచుం బోనాఁడుటల్ పాడియే. 83
తే. ప్రాజ్ఞులున్ జ్ఞానతృప్తులు పండితు లగు, వార లెన్నఁడు దుఃఖముల్ వచ్చుపట్లఁ
బరితపింపరు సంపదల్ వచ్చుపట్ల, సంతసింపరు నీవలె స్వరధినాథ. 84
క. ప్రాకృతుఁడ వగుట గర్వాస్తోకత వ్యాజోక్తు లాడుచుం బరిహాసం
బీకరణిఁ జేయ వచ్చితి, నీకున్ నాగతియ పట్టె నే ని ట్లందే. 85
వ. అనిన నవ్వుచు నవ్వాసవుండు వ్యాలంబు వోలె బెట్టు నిట్టూర్పునబ్బలిం గని
యి ట్లనియె. 86
ఉ. జ్ఞాతిసహస్రముల్ గొలువ సర్వజగంబుల నీప్రతాపమున్
ఖాతరలాడఁ జేసి యొకపాటిగ నే మముబోంట్లఁ జూడ కెం
తో తమి నొప్పుచుందు విపుడో యవి యన్నియు నన్న గిల్లె నీ

రితేఁ గుంద నే ననినరీతికిఁ గుందుదు వేమి చెప్పుమా. 87

వ. అనిన బలి యి ట్లనియె. 88

సీ. కాలవశమ్మునం గందు ననిత్యము, గా సర్వము నశించుఁ గాన నేను
దేనికిం జింతింపఁ బోను దేహములు న,శ్వరములు గాన నే వగవ కునికి
తప్పుగా దీజీవితశరీరములు రెండు, సహజములై వెలిగి నాశనము నొందు
నా కహంభావము లేక తత్త్వ మెఱింగి,యుండుట వ్యథ యెందునుండి వచ్చు

తే. నాపగల కంబునిధివోలె నఖిలభూత,ములకు నిధనమె గతి యని తెలిసినట్టి
రిలను మోహవశులు గాకు తెలియ నట్టి, రధికకష్ట మనుభవింతు రాత్మ లేమి.

తే. బుద్ధి గలుగ నరుఁడు పాపములను ద్రుంచుఁ, బాపరహితునిసత్త్వంబు పట్టుకొనును
సత్త్వసంస్థునిమనము నిష్కల్మష మగు, నట్టిమనము గలుగువాని కగును సుఖము.

క. జననము మరణము నర్థం,బు ననర్థము సుఖము దుఃఖ మును బోరిఁ బోరి నాఁ
జను దెంచుఁ గాన వానికిఁ, బొనరఁగ వనరంగఁ దగునె పురుషున కెడఁదన్.

తే. చంపుటయుఁ జంపఁ బడుటయు జయము గొనుట
యపజయము గొంట పురుషున కనువుపడునె
యచటఁ గర్తృతాభోక్తృత లెంచ నగునె
గర్త నే ననుకొనువాఁడు గాఁడె జడుఁడు. 92

చ. జగముల సృష్టియున్ లయము సల్పెడువాఁ డెవఁ డన్నఁ గర్మమే
యగు నన వచ్చుఁ గర్త మఱి యన్యుఁ డెవండును లేడు జ్యోతియున్
జగతియు నాకసంబు పవనంబు జలంబును భూతజాతముం
దగ నొనరించుఁ జంపు నిటఁ దాల్పఁగఁ జేటికిఁ జింత సేయఁగన్. 93

సీ. విద్వాంసుఁడును నల్పవిద్యుఁడు మేధావి, బుద్ధివిహీనుఁడు నిద్ధబలుఁడు
బలరహితుండును లలితరూపుఁడు విరూపుఁడు సుభగుఁడు దుర్భగుఁడు ననియెడు
వా రెల్ల కాలదైవతవశంగతు లయి, యడఁగి పోవుదురు నే నట్టివాఁడ
నని యెఱింగి మెలంగునట్టినా కిప్పుడు, వ్యథ యేమిటికి వచ్చు వజ్రపాణి

తే. దగ్ధమె దహింపఁబడుసు హతమె హతమగు, నశ్యమె నశించు లబ్ధమెన్నఁ గలభించు
నిట్టికాలార్ణవమునకు గట్టు గాని, దీవి గాని కనంబడ దేవలనను. 94

ఉ. అంతము లేని కాల మిది యంచు నెఱింగియు భూతకోటులన్
సుంతయుఁ గూల్పఁ జాల దని చూచెడువాఁడన యైనయప్డు నా
స్వాంతమునందు దర్పమును హర్షము క్రోధము నగ్గలించు నా

వంతునఁ గానినాఁ డెటులు వానికి లోఁబడియుండుఁ జెప్పుమా. 95

తే. తుషము దినుగర్దభంబ వై తోషు లేక, శూన్యగృహమున నుండ నిప్పాటికివచ్చి
పరిహసించితి నా కిచ్చ వచ్చె నేని, వికృతరూపము లెత్తి నిన్ బీతుపుత్తు. 96

క. నావికృతరూపదర్శన, మేవంవిధ మనుచు నీకు నేర్పడ నేనిన్
వాపుచ్చి మాట లాడవు, పోవుదు వేనాఁడొ బీతు పొంపిరి వోవన్. 97

వ. కావునం జెప్పెద నాకర్ణింపుము. 98

ఉ. కాలమె సర్వముం దలుపుఁ గాలమె నిల్పును గాలమే జగ
జ్జాలము మాపుఁ గాలమున సర్వ మధిష్ఠిత మిట్లెఱుంగు మీ
వేల వహింతు పౌరుషము నే మును గన్నెఱసేయ లోకముల్
జాలి వెలార్చి కుయ్యిడుచు సాళ్వడి పోవుట లే వెఱుంగవో. 99

సీ. లోకధర్మ మి దెల్ల లో నెఱుంగుదు నేను, నీవు నెఱింగియో యింతమాత్ర
భ్రాంతి నొందకుము ప్రభావప్రభావము, లొక్కనిసొమ్ముగా దోయి శక్ర
యీవేళఁ గూడ బాల్యావస్థనే నీదు, చిత్త మున్నది బుద్ధిఁ జేసి కనుము
దేవగంధర్వపితృమనుష్యరాక్షసాదులు నాకు వశులౌటఁ దెలియు మిప్పు

తే. డబ్బలీంద్రుఁ డెందున్న వాఁడద్దెసకి దె, మ్రొక్కుచును బుద్ధిమాత్సర్యమోహాతులయి
యున్న వా రేను నీపాని వెన్ను దన్ని, నందులకుఁ గుంద విధివశమందు నుంటి.

చ. కులమున దర్శనీయుఁడు నకుంఠపరాక్రముఁ డయ్యు దుఃఖియై
పొలుచుట దుష్కులోద్భవుఁడు మూఢుఁ డలంతి సుఖానుభూతి యై
మెలఁగుట లక్షణాన్విత యమేయగుణాంచిత భాగ్యహీన యై
చెలఁగుట దుష్టలక్షణ ససిం బొలుపొందుట దిష్టమే కదా! 101

చ. పొలుపఱి నేను గల్మి మెయిఁ బొంగుచు నీవు నెసంగుచుండుటన్
తెలియ స్వకర్తృకం బనియెదే యటుగా దధికార మింతయేఁ
గలుగదు నాకు నీకుఁ గనుఁ గానవు కాలవశంబు నా మదిం
దలఁపవు శ్రీ గలాఁడ నని దర్పము సూపుదు వెంత వెఱ్ఱివో. 102

ఉ. కాలమె పట్టి నన్నిపుడు కాఱియ వెట్టనిచో సవజ్రుఁడై
క్రాలెదునిన్ను నాదయినగాఢతరాశనితుల్యముష్టిచే
వ్రీలిపడంగఁ జేయ నోకొ వ్రేల్మిడిలో నట విక్రమింపఁగాఁ
గాలము గాదు నా కిపుడు కాలము వచ్చెను శాంతి సేయఁగన్. 103

క. కాలమె మూలం బంతకుఁ, గాలమె సర్వమును బెంచుఁ గాలమె త్రుంచుం

గాలమె దైవం బంచుం,గాలమునకు లోఁగియుండఁ గాఁ దగు నింద్రా. 104

సీ. అప్పుడు కాల మభ్యాగతం బగుట నేఁ,బ్రతపించి గర్జించి ప్రబలినాఁడ
ద్వాదశార్కుల తేజ మాదినంబుల లోన,నొక్కరుండన పూని యుండినాఁడ
నేనే జలంబులఁ బూని మ బ్బట్లు వర్షించి లోకంబుల మంచినాఁడ
రక్షించి శిక్షించి త్రైలోక్యము తపింపఁ,జేసి ప్రకాశింపఁ జేసినాఁడఁ
తే. గొట్టి తెచ్చితి నిచ్చితిఁ గొంతనాక,నిఖిలలోకవిభుండ నై నిగ్రహం బ
నుగ్రహంబును సలిపితి నుగ్రమైన,నావిభుత సెల్లెఁ గాలప్రభావమునన. 105

మత్త. ఈవు నేనును వాఁడుఁ గర్తలమే తలంపఁగ లోక మా
దేవనిర్మితిఁ గాలపర్యయ దీప్తిఁ గర్మఫలంబులన్
బోవకుండఁగఁ బొందుచుండును బొమ్ము సర్వవినిశ్చితం
బై వెలింగెడునిందు సందియ మంద నేటికి వాసవా. 106

సీ. కాలమే బ్రహ్మమై క్రాలెడు దానికి,మాసమాసార్ధముల్ వాసగృహము
రేయింబవళ్లు సంవృతములు ఋతువులు,ద్వారముల్ వర్షంబు దానిముఖము
నని వేదవేత్తలు వినిపింత్రు కొందఱు, కించిన్మనీషులు పంచకోశ
ములు బ్రహ్మ మందు రప్పలు కుండ నిమ్ము మ,హాసాగరమువోలె నతిగహనము
తే. నగుచు నత్యంతగంభీర మగుచు క్షరము,నగుచు నక్షర మగుచు నాద్యంతశూన్య
మగుచు బ్రహ్మముసర్వవిఖ్యాత మగుచు,నొప్పుచుండుననియెఱుంగుమోయిశక్ర.

వ. అయ్యది సహజంబుగ నిర్లింగ మైనను సత్వంబులం జొచ్చి లింగవంత మగుఁ
దత్వవేత్తలు దానిన్ ధ్రువం బనియు భూతవిపర్యాసము భగవత్కృతం బగు
చుండు ననియుం దెలియుదురు బ్రహ్మము మాయం జేసి చిత్సంబంధంబు గలి
గించుకొనుం గాని దాని కది స్వరూపంబు గాదు స్వీయరూపం బెఱింగినపు
డాసంబంధ మెడయు నని యెఱుంగు మని మఱియును. 108

మత్త. కాలరూపము బ్రహ్మ మయ్యది గల్గుజీవుల కెల్ల నే
వేళఁ దా గతి యై తలిర్పఁగ వెఱ్ఱివీ వది దాఁటి పోఁ
జాలుదే పరువెత్తి వచ్చి వెస న్ని నున్ గ్రసియించెడున్
జాలివెట్టెడు దాని నింద్రియజాల మారయఁ జాలునే. 109

తే. కొందఱు ప్రజాపతియనియుఁగొందఱగ్ని,యనియుఁగొందఱుపక్షమాసాదిరూప
మనియు వాకొంద్రుసర్వమునధిగమించు,నదియుఁ గాలమెయనినమ్ముమమరనాథ.

మ. బహుసాహస్రబిడౌజు లిప్పటికిఁ బోవ న్వింటి మోయింద్ర! వా

రహహా నాఁగ మహాబలాఢ్యు లగుచున్ హార్వాంది రిపుం బలేన్
స్పృహణీయం బగువైభవంబు వెలయన్ వెల్గొందునీపై నను
గ్రహముం జూపదు కాల మీడ్చుకొనిపోఁ గన్పట్టి యుండుం జుమీ. 111

క. బలి నని గర్వింపకు మది,బలవంతము దాని కెల్ల వశ మీప్రుచు నేన్
గలవారు దాని నాఁగం,గలుగరు ముజ్జగములందుఁ గ్రతుభుగధీశా. 112

ఉ. ఉత్తమరాజ్యలక్ష్మి నను నొందెఁ దిరంబుగ నుండు నంచు నీ
చిత్తమె కాని యొక్కరుని చెంత వసింపదు వేగు రింద్రులన్
సత్తములన్ ననున్ విడిచి చల్లఁగ నిన్ గలియంగ వచ్చె నా
చిత్తటి లోల నిన్ విడిచి వేచనుఁ జుమ్మిటు గర్వి వైనచోన్. 113

వ. కావున నీవు శాంతుండ వై బుద్ధి గలిగి యుండు మనునంతలో నబ్బలిదేహంబు నుండి వెడలి వెలుంగుచున్నసిరిం జూచి వెఱఁగంది బృందారకేంద్రుండు దైత్యేంద్రుం గాంచి యి ట్లనియె. 114

ఆ. ఎవ్వ రీమె దిక్కు లెల్ల వెల్గించుచు,మెఱయు మెఱపువంటిమేనితోడ
నీదు మేనినుండి మీఁదికి వచ్చెడుఁ,దెలుపు మనుచు నడుగ బలి వచించె. 115

క. నే నెఱుఁగ నీమె దేవియొ, మానుషియో లేక యసురమానినియో నీ
వే నుడి యొనరింపుము కా,దేనూఱకయుండు మొండు లేమిటి కాడన్. 116

వ. అనిన నయ్యమరాధ్యక్షుండు సంపజ్జలజాక్షిం బ్రతీక్షించి యి ట్లనియె. 117

చ. తెలియక నేను ని న్నడిగి తెల్లము చేసికొనంగ నిచ్చమైఁ
బలుకుచు నుంటి నుజ్జ్వలవిభావముతో బలిమేనినుండి పై
వెలలితి వీతనిన్ విడిచి వే ననుఁ జేరెదునిచ్చ నీమదిన్
మొలచినయట్లు తోఁచెడిని ముద్దియ! నీ వెవరమ్మ చెప్పుమా. 118

వ. మహాలక్ష్మి యి ట్లనియె. 119

తరళము. నను విరోచనుఁ డిబ్బలీంద్రుఁడు నాకముఖ్యులు నీవునున్
గని యెఱుంగరు నన్ను దుస్సహగా విధిత్సగ భూతిగా
జనులు చెప్పుచు నుంద్రు శ్రీ యనుసాధునామము నాకగున్
వినుము చెప్పితి నన్ను నాతఁడు వేడ్క నాయమ కి ట్లనున్. 120

క. చిరకాల ముండి బలిమం,దిరమున నీ విపుడు వాని దిగఁద్రావుటకున్
బరఁగునిమిత్తము నేనో,బిరుదుమగం డతఁడో తెలుపవే దయతోడన్. 121

వ. అనిన శ్రీదేవి యి ట్లనియె. 122

సీ. నను విధింపను ధాతయును విధాతయు నుండ, నిమ్ము కాలవిపర్యయమ్ము కతన
నిట్లున్న నీతని నీ వనుమానింపఁ,దగ దన్న నింద్రుండు తల్లి! వీని
విడిచితి నీ వెట్టివిధము వర్తించునన్,విడువ వ దేమియో వినుచు మనుడు
నాయమ యను సత్యమందుఁ దపంబున,యందుఁ బరాక్రమమందు వ్రతము
తే. నందు ధర్మమునందు నే నుందు బలియు
నీనినుండి పరాఙ్ముఖుం డైనవాఁడు
మున్ను తఁడు సత్యవాక్యసంపన్నుఁడు విజి
తేంద్రియుండు బ్రహ్మణ్యుఁడై యొసక మెసఁగు 123

వ. మఱియు నితండు బ్రాహ్మణావజ్ఞంజేసి యుచ్ఛిష్టుండై ఘృతంబు స్పృశించె యజనశీలుండై నన్నుఁ బూజించుచుండియు లోకులఁ దూలనాడువాఁ డయ్యెం గావున నేను వీని విడిచి ని న్నాశ్రయింప నుంటి నప్రమత్తుండును దపోవంతుండును విక్రమవంతుండు నన్ను ధరింప నర్హు లనిన శక్రుం డి ట్లనియె.

ఉ. దేవమనుష్యలోకముల దేవి! యొకండ నిను న్వహింపఁ గాఁ
బోవు నొకో సమర్థుఁ డగుపూరుషుఁడై వచియింపు మన్న నా
దేవి యనుం ద్రిలోకముల దేవనరాసురముఖ్యులం దొకం
డావటిలన్ వహింపఁగ సమర్థుఁ డెవండును లేఁడు చెప్పితిన్. 125

వ. అనిన నింద్రుం డి ట్లనియె. 126

తే. నీవు న న్నెప్డు పాయక నిలుచునట్టి, వెరవు గలదేని చెప్పు మావిధముగా నొ
నర్పఁ దలఁచితి నీమాట నాకు వేద, మనుఁడు శ్రీదేవి జిష్ణున కనియె నిట్లు. 127

ఆ. వేదదృష్టవిధులు వెలయంగ నను నాల్గు, విధములన్ విభాగవిధి నొనర్తు
వేని నీదు చెంత నే నుందు నెల్లప్డు, తిరముగా న టన్న దివిజవిభుఁడు. 128

క. నీ చెప్పినట్ల యగు నా, యాచోటుల నాదుశక్తి కగురీతి నినుం
జూచి వసింపం జేయుదు, నీచక్కి నతిక్రమించి నే నెపు డుండన్. 129

సీ. భూతభావిని యైనభూమి నీయొకపాలు, ధరియింపఁగాఁ జాలుగరిమ కలదు
నావుడు శ్రీ యట్లు కావచ్చు రెండవ, కాలుంచుతావును బలుకు మనుడు
జలము ద్రవించి మర్త్యులఁ బెంచు నది నీదు, రెండవకాల్గోయ నుండుఁజాలి
నన లక్ష్మి యది లెస్స యట్ల చేసెద నాదు, మూడవకా లూనఁ బోలు నెద్ది
తే. వేల్పులకుయజ్ఞములకును వేదములకు, నాదరువు వహ్ని యటనుంపనగునటన్న
మేల యగునాదునాలవపాలు గొనఁగఁ, బోలునెది యనిసిరిపల్కబుధవిభుండు.

తే. ఎవరు మానవులందు సత్యవచనులును, బ్రహ్మ వాదులు నగుదు రవ్వారిమొడల
నీదునాలవపాదము నిలుపు మనిన, నట్ల యౌ నని శ్రీదేవి యనియె నిట్లు 131

క. భూతముల నీవు చెప్పిన, రీతిఁ నానాల్గుకాళ్లు ప్రీతి నిలిపితిఁ
జేతోమోదముతో నీ, వేతఱిఁ బాలింప వలయు నివి యాజ్ఞ యనన్. 132

క. భూతములు నీ వెనంగుట, ఖ్యాతిం జనునట్టి మైన నన్మద్వచనం
బూఁత గొని మెలఁగు నట్లు ని, శాతముగా దండనంబు సలుపుదు నంబా. 133

వ అని దేవేంద్రుండు పలికినం గులుకుచు నమ్మహాలక్ష్మి బలిం బెడఁబాసి చనియె
నంత దైత్యేశ్వరుండు రాజ్యశ్రీపరిత్యక్తుండై మహత్వాంతునిం దిలకించి విప
న్వాంతుండు ప్రాగాదిదిగ్భాగంబులందుం బలె మేర్వగ్రగతుండై ప్రతాపించు
నప్పుడు దేవాసురయుద్ధంబు సిద్ధంబు గాఁగల దప్పు దేను ముప్పిఁగొని నిను
నీవారిం గీటడంచెద ననుటయు నతం డోవిరోచనాత్మజా! నిన్నుఁ ద్రెళ్ల
నేయ వల దని హిరణ్యగర్భునిశాసనంబు గావున నావజ్రంబున కెఱ సేయని
దాన నీవు బ్రతికితి విచ్చవచ్చినమచ్చునం బో మ్మెన్నఁటికి నీవు నుడివినవడువున
నాదిత్యుండు మేర్వగ్రగతుండు గాఁ బోవండు వానికి దక్షిణోత్తరాయణ
గతులఁ శీతోష్ణస్థితులు గలిగి యుండు నిట్లు స్వయంభువుశాసనంబు దానికి
వైలక్ష్య ముండ దుండినం జూచుకొందము లె మ్మనినం గి మ్మనక వైరోచనుండు
దక్షిణమార్గంబువట్టి పోయె నింద్రుండు ననహంకారసంజ్ఞితంబు లగుబలివచ
నంబులు స్మరించుచు నుత్తరంబుగ గగనమార్గంబున స్వర్గంబునకు నిర్గమించె
నని చెప్పి కురుపితామహుండు కుంతీసుతాగ్రజుం గాంచి మఱియు నీసంద
ర్భంబున నింద్రనముచిసంవాదం బనుమఱియొక యితిహాసంబు గలదు దానిం
జెప్పెద విను మని యి ట్లనియె. 134

## ఇంద్ర నముచి సంవాదము.

శా. అక్షోభ్యం బగుసాగరంబువలె నత్యంతంబు గంభీర మై
సాక్షాద్బ్రహ్మము నాఁగ నొక్కతల మందాసీనుఁడై యొంటిమై
రక్షోధీశ్వరుఁ డాధ్యుఁ డౌనముచి వీర్యం బేగ నుండన్ సురా
ధ్యక్షుం డింద్రుఁ డొకప్డు గాంచి యనియెన్ దాత్పర్యగర్భంబుగన్. 135

క. స్థానభ్రష్టుఁడవై శ్రీ, గానం బడ కేగ నొరులకట్టులకై నీ
వోనముచీ! యతిశోక,స్థానమవై పరితపింపఁ దలఁప విదేమో. 136

వ అని యడిగిన నముచి వాని కి ట్లనియె 137

సీ. అనివార్య మగుశోకమున మేను దపియించుఁ, గాని సాహాయ్యమద్దానఁ గాదు
శోకించువానిని జూచి శత్రులు సంతసింతురు గాన నే నింత వగవ
వగపున రూపంబు వ్రయ్యు సిరి దొలంగు, ధర్మంబు నాయువు దలఁగి పోవుఁ
గానఁ బ్రాజ్ఞుఁడు మనోగతదుఃఖము న్వీడి, నెమ్మి మంగళము ధ్యానింపవలయు.
తే. నట్లు ధ్యానించుచుండినయతని కెల్ల, యర్థములు వచ్చి పొందెడు నంతలోనె
శాస్త మొక్కఁడె రెండవశాస్త లేఁడు; శాస్త గర్భస్థశిశువును శాస్తి చేయు
తే. అతనిప్రేరణంబున మిట్టునందునుండి, క్రిందికరుగునీళ్లవలె వర్తించుచుందు
నెఱిఁగియుభవాభవంబుల నెపుడు వాని, లోనొకటి మేటి యనియెంచఁబోనెడంద

ఉ. ఆతనిదివ్యశాసనము నొదలఁ గైకొని పుణ్యపాపసం
పాతమున న్మెలంగుడును వచ్చెడునయ్యది రాక మాన దా
రీతిగఁ బోవు నద్ది యెదిరించినఁ బోవక పోదు పుట్టువుల్
ధాత విధించు గర్భమునఁ దాఁ గొను జీవికి స్వేచ్ఛ లేదెటన్. 140
క. భువిఁ దనకు నైనభావము, భవితవ్యము కాని కాదు పర మని బుద్ధిన్
దవిలినయేఁ బురుషుఁడు మోహావశంబునఁ గాక సౌఖ్య మందు బిడౌజా! 141
తే. కాలపర్యాయహతులయి కూలువారి, కెవ్వఁడభియోక్త ద్వేష్టయై యెవఁడుతన్నుఁ
గర్తగా నెంచునో వాఁడు ఘనమనోవి, కారముల దుఃఖ మందెడు ఖచరనాథ
వ. మఱియు మహర్షులును సురాసురసముదయంబులును వేదవేత్తలును వనవాసు
లగుమునులును వీరు వా రన నేల యెల్లవారు నాపదలకు లోనుగానివారు
లేరు పరావరజ్ఞు లగుపండితులు మాత్రము లోనుగారు. 143

సీ. కోవిదుం డెవ్వఁడు కోపింపఁ బోఁ డభి, మానింపఁ బోఁడు నెమ్మదిని సంత
సింపఁ బోవండు శోకింపఁ బోఁ డెట్టియి, క్కట్టులందును గొండకరణి నుండు
సంచలింపం డర్థసంసిద్ధి హర్షము, వ్యసనంబులన్ మోహవశుఁడు గాఁడు
ఘనుఁ డాతఁడు సుఖంబు కష్టంబు సైరించుఁ, దన్మధ్యగతుఁ డయి తరలకుండి
తే. తనకు నాయాయవస్థలు తారసిల్లు
నపుడు పరితపింపక సంతసపడుచుండ
వలయు నిట్లు ప్రవృద్ధమై మలయుదుఃఖ
ములఁ దొలంగించుకొనఁ జూడవలయుఁ బ్రజ్ఞ. 144
తే. సాధ్వసముఁ బాపి సదుపదేశం బొసంగు, నదియె పరిషత్తు నా సభ యన సదస్సు
నాఁబడున్ ధర్మతత్త్వమునం బ్రవీణుఁ, డయినపురుషుఁడె బుద్ధిమదగ్రసరుఁడు.

క. తెలిసినపురుషునికర్మము, దెలియం బడ దాతఁ డెట్టిదీనావస్థన్
దెలివి విడి మోహవశుఁ డై, కలఁగం బోఁ డెందు జ్ఞానకలితుఁడు గానన్. 146

క. స్థానప్రచ్యుతుఁ డైనం, గానీ కడువృద్ధుఁ డైనఁ గానీ కష్ట
స్థానం బైనం గానీ, మానసమున గౌతముండు మఱలొందె నొకో. 147

సీ. విను మంత్రబలమును వీర్యంబు ప్రజ్ఞయుఁ, బౌరుషశీలముల్ వర్తనంబు
నర్థసంపదయు ము న్నగువానిచే లభింపనిఫలంబు నరుండు పడయుచుండు
వానికై చింతింప వలయునో పుట్టిన, వారి కెల్ల విధాత వలయుగతుల
నేర్పఱిచె న్వానినే చేయు మనల నా, చనఁటిమృత్యువ దేమి చేయఁ గలుగు
తే. నింక లబ్ధవ్యములె లభియించుచుండు, ననిశము గంతవ్యమునకె తా ననుగమించు
ననియుఁ బ్రాప్తవ్యమునె పొందు ననియు నెఱిఁగి, నట్టిఁ డెట్టిదుఃఖంబులనం దనుండు.

వ. అని చెప్పె నని చెప్పిన విని యుధిష్ఠిరుండు భీష్ముం గాంచి. 149

క. చుట్టాలు సమసి రాజ్యము, పట్టంబై పోవ వ్యసనమగ్నుం డగున
ప్పుట్టున నరులకు మఱలన్, బట్టునె శ్రేయంబుఁ దెలుపఁ బ్రార్థింతు నినున్. 150

వ అని యడిగిన దేవవ్రతుండు. 151

మ. ధనధాన్యాదులు దారపుత్త్రకులు నిత్యప్రాభవంబున్ నశిం
చినఁ గృచ్ఛ్రంబులఁ జేసి మానవుఁడు వాసిం బాసి దుఃఖార్ణవం
బున మగ్నుం డయి యున్నయప్డు ధృతియే పోలింప శ్రేయస్కరం
బనియున్ దుఃఖవినాశకం బనియు వ్యాఖ్యాతంబు లోకంబునన్. 152

తే. ధైర్యమున మేన్ కృశింపదు తలఁగు దుఃఖ, మందు నసుఖంబు నారోగ్యమమరు దాన
నలరు నుత్సాహ మద్దాన సజ్జనుండు, పొందు సంపత్సమేతుఁడై దండి కెక్కు.

వ. సత్త్వప్రధానప్రవృత్తి గలవాని కైశ్వర్యము ధైర్యము కర్మవ్యవసాయమునుం
గలుగు దీని కుదాహరణంబుగా బలివాసవసంవాదంబు నాఁబడు మఱియొక
యితిహాసంబు గల దాకర్ణింపుము. 154

## *ఇంద్రబలిసంవాదప్రకారము.

సీ. ఆదికాలమున దేవాసురసంగ్రామ, మతిభయంకరముగా నయ్యె నందు
దైత్యదానవుల కత్యంతసంక్షయ మైన, యంత మహావిష్ణు వఖిలలోక
ముల నాక్రమించి పెంపలర నింద్రుని దేవ, రాజపదంబున నోజ నిలిపె

*ఈసంవాద మీపర్వములో రెండుసారులు మూలమున నున్నది. దానికిని దీనికిని గొంచెము మాత్రమే భేద మగపడు నిది ప్రక్షిప్తమేమో యని సంశయింపం దగు.

వర్ణాశ్రమవ్యవస్థ యేర్పడి ద్విజుల్ వెండియు, సవనకార్యంబులు సలిపి రవనిఁ
తే. త్రిభువనంబులు సంపత్సమృద్ధిఁ దనరె, నపుడు దేవగణాన్వితుండై వృషుండు
భద్రదంతావళము నెక్కి ప్రభుత మెఱయ, ముజ్జగంబులసంచారమును బొనర్చె.
వ. ఇట్లు సంచారంబు సేయుచు సముద్రాంతరంబున నొకానొకగిరిగహ్వరంబున
నున్న వైరోచనిం గాంచి సమీపించుటయు నతండు దేవగణావృతుండై తన
చెంత కరుదెంచినదేవేంద్రుం దిలకించి యించుకయుం జలింపనిచిత్తంబున విగత
జ్వరుండై వగవకుండె నట్లు వికారవిరహితుం డగునతని నిరీక్షించి దేవేం
ద్రుండు నర్మగర్భంబుగా నిట్లనియె 156
శా. దైత్యాధీశ్వర! యించుకేనియు మదిన్ ధైర్యంబు వోనాడ వే
వ్యత్యాసంబును బొంద విట్లు భవదీయం బైనశౌర్యంబ నీ
సత్యాచారమ వృద్ధసేవయ తపస్సారంబ వా కిమ్మయో
నిత్యశ్రీ చెడిపో నలంతివలె నై నీ వుంటి ధైర్యంబునన్. 157
ఆ. స్థానబలము వోయె సంపత్తు నశియించె, బంధుజనులఁ బాసి పరవశమున
నుండ రానిచోట నుంటి వేకాకివై, వగవకుండు వేటితగవొ చెపుమ 158
క. నీజాతివారిలోనం, దేజోగరిమంబు గలిగి దీపించి తరి
త్రిఁ జేకొంటివి భోగము, లోజమెయిం గొంటివిపు డయో యిట్లుంటే 159
మ. పితృపైతామహ మైనరాజ్యమున సంప్రీతిన్ బ్రభుత్వంబునన్
వితతైశ్వర్యము లొందినాఁడ వరిచే నీవైభవం బంతయున్
హృత మైనన్ ధనదారవస్తునిచయం బెల్లన్ హతం బైన బ
ద్ధత కైనం జలియింప వింతయును నీధైర్యంబు సామాన్యమే. 160
క. త్రైలోక్యరాజ్యనాశం, బాలక్షింపంగ నైనయప్పుడు నీవుం
బోలెం జీవించెడువాఁ, డేలోకమునందు నుండఁ డిది యేమొకొ. 161
వ. అని మఱియు నెన్నియో తెఱంగులఁ బరుషంబు లాడి పరిభవించిన నించు
కయుఁ జలింపనిచిత్తంబున నద్దైత్యోత్తముండు మరుత్వంతున కిట్లనియె. 162
సీ. నిగృహీతుఁడై నేను నీచేతఁ జిక్కితి, ననుఁ జూచి గర్హింప న్యాయ మొకొ
వజ్రాయుధం బెత్తి వచ్చితి మున్నీ వ, శక్తుండ విపు డిట్లు శక్తివచ్చెఁ
గత మెద్ది నీవు గాక మఱెవ్వఁ డిట్లు దు, ర్భాషల నాడంగఁ బాలుపడఁడు
బలవంతుఁ డయ్యుఁ దాఁ బగఱచేఁ జిక్కిన, పరిహాసింపక దయ నరయువాఁడు
తే. వీరపురుషుఁడు నాఁబడుఁ బోర జయము

నిక్క మన రాదు నిర్వైరం డొక్కరుండు
జయము నింకొక్కరుం డపజయము నొందు
నిది స్వభావ మటంచు నీ వెఱుఁగు మింద్ర. 163

సీ. జగము లన్నియు గెల్చి సర్వభూతేశుల, మైత్రి మనియె యెంతు మాజయంబు
నాకృతంబును గాదు నీకృతంబును గాదు, నీ వట్లు నే నిట్లు గావుటకును
మనము నిమిత్తమే యన రాదు నావలె, నీవు నీవలె నేను నిలుతు మేమొ
యిట్లుంటి నే నని యీావవమానింపఁ, బోలు నే సుఖదుఃఖములఁ బురుషుఁడు
తే. కాలపర్యాయమునఁ బొందుఁ గాలగతుల
నింద్రుఁ డీవైతి కాని నీయిద్ధకర్త
మునను గా దని యెఱుఁగుము నిను నను నడి
పించునది కాలమే యని యెంచు మెడఁద. 164

క. మాతాపితృశుశ్రూషయుఁ, బూతం బగుదేవతాదిపూజన మింకన్
ఖ్యాత మగుసుగుణసంపద్ప్రీతియుఁ బురుషునకు సుఖము తేలే వెపుడున్. 165

మత్త. కాలపీడితు లైనవారలఁ గావఁ జాలవు విద్యయున్
శీలముం దపమున్ జపంబును శిష్టదానము ధర్మమున్
శ్రీలు రాజ్యవిభుత్వమున్ ఘనసేనలుం బ్రియబాంధవుల్
బాలమిత్రులు పుత్రులుం గరవాలముఖ్యము లెవ్వియున్. 166

క. రాఁ గలుగునవర్థములన్, బోఁ గొట్టఁగ శుద్ధ మైనబుద్ధిబల మొకం
డొఁ గాని తక్క నెవ్వియు, నేఁ గావని తెలియ వలయు బుధరాజమణీ 167

వ. అట్లే కాలపర్యాయహతు లగుప్రాణికోటుల రక్షించువాఁ డెవ్వఁడును లేఁడు
వినుము 168

ఉ కర్తను నే నటంచు మది గర్వము నొందుదు నాయవస్థకున్
గర్తవు నీవ యైనవు డొకండు నినున్ సృజియింప కుండెడున్
గర్తకుఁ గర్త యున్నపుడు కర్త యతం డగు నీవుగావు నీ
కర్తృత నేతిబీరయనఁ గా వలయున్ సురలోకవల్లభా. 169

ఉ. కాలముచేత మున్ను నినుఁ గట్టితి నిప్పుడు నీవు నన్ను నా
కాలముచేతఁ గట్టితివి కట్టిఁడి వైతివి వచ్చువారికిన్
గాలమె పోవువారికిని గాలమె కారణ మం చెఱుంగు మో
వేలుపుతేఁడ! ప్రాకృతుఁడవే ప్రళయంబు నెఱుంగ వింతయున్. 170

సీ. నీసుకృతంబున నే నీవు సర్వోన్నతైశ్వర్య మందితి వంద్రు కొంద
ఱెఱిఁగినవార లెన్నంచను కాలాహతికి వగతురు మోహాదిశకుఁ గారు
కాలపరితులై క్రాలువారలబుద్ధి, వ్యసనంబులం బొంది వనధిలోన
ఛిన్ననావ యనంగ వెస నశించుఁ నీవు, నేను దిక్పాలురు నింద్రశతము
తే. చనినవారిన చనుమము ఘనతరప్రభావమున నొప్పు నీవును బర్యాయమున
నగుదు నావలెనే యుగయుగములందు, వేసవే లింద్రు లేగుట వినవె శక్ర.

క. కాలము దురతిక్రమ మగు, నోలిన్నీ విపుడు గొన్న యునుసంస్థాన
శ్రీ లక్షించుచు ఘనునిగ, నీలోనం దలఁచుకొనుచు నెఱి గొందు వయో.

తే. శాశ్వతం బగుబ్రహ్మము చందముననను, నీదుసంస్థానము దిరమై నిలుచు ననుచుఁ
బ్రాకృతునిరీతి గర్వింతు రాజ్యలక్ష్మి,నాది యని కొందు విది పిచ్చిగాదొ తలఁప.

ఆ. నన్ను విడిచి యిపుడు నిన్నుఁ జేరిన దిది, నిన్ను విడి మఱొక్కని న్ని మేష
మునను బొందు నీకు మున్నెంద ఱింద్రులు, చనిరొ నీ వెఱుంగఁ జాల వకట.

వ. మఱియుం జెప్పెద వినుము పృథువు నైలుఁడు మయుఁడు భీముఁడు నరకుఁడు
శంబరుఁడు నశ్వగ్రీవుఁడు పులోముఁడు స్వర్భానుఁడు నమితధ్వజుఁడు ప్రహ్లా
దుఁడు నముచి దక్షుఁడు విప్రచిత్తి విరోచనుఁడు హ్రీనిషేవుఁడు సుహోత్రుఁడు
భూరిహాఁడు పుష్పవంతుఁడు వృషుఁడు సత్యేప్సుఁడు ఋషభుఁడు బాహువు
కపిలాశ్వుఁడు విరూపకుఁడు బాణుఁడు కార్తస్వరుఁడు వహ్ని విశ్వదంష్ట్రుఁడు
నైఋతి సంకోచుఁడు వర్రీతాక్షుఁడు వరాహుఁడు నశ్వుఁడు రుచిప్రభుఁడు
విశ్వజిత్తు ప్రతిరూపుఁడు విషాండుఁడు విష్కరుఁడు మధువు హిరణ్యకశిపుఁడు
కైటభుఁడు లోనగుదైత్యదానవులు పెక్కురీనేలం బాలించి కాలవశులై
పోయి రని మనము విని యుంటిమి కావునఁ గాలము బలవత్తర మ్మని
యెఱుంగు మని మఱియును. 175

ఉ. ఎందఱొ నూఱుయజ్ఞము లహీనగతిం బొనరించినట్టి వా
రందరు నే నొకండన సమున్నతిఁ జేసితి నంచు నెంచుకో
కందఱు ధర్మకార్యపరు లందఱు నాకచరుల్ మహాత్ము ల
య్యందఱుఁ జిత్రయోధులు బలాఢ్యులు కామవిహారు లారయన్. 176

క. అందఱు సంహననాంచితు, లందఱు మాయాశతధరు లందఱు రిపురా
డ్బృందముల గెలిచినట్టిరు, నందఱు నైశ్వర్యవంతు లందఱు శూరుల్. 177

శా. వా రెల్లన్ గతమత్సరుల్ ధనమదం బావారికిన్ లేదు వా

రేరు నీవలె గర్వులై మనసు దాతృత్వాదిధర్మంబులన్
భూరాజ్యంబుల నేలి కాలవశులై పోకాడిరి పన్నరో
వారిం బోలినవాఁడ వే యెప్పుడో పోవన్ వేచి యుంటింతలోన్. 178

మ. భవదీయం బగురాజ్యలక్ష్మి విడి పోవ న్నీవు దీనుండ వై
వివశత్వంబున దేవ్వరించెద వయో వృద్ధశ్రవా! యిప్డు నా
కవు కాలం బది నీకు నంతటన సంప్రాప్తించు నవ్వేళ శో
కవృతాత్ముండవు కాకు మయ్య తెలియంగాఁ జెప్పితి న్సుందరన్. 179

వ. శుభాశుభసమయంబుల హర్షశోకంబు లందుట ప్రాజ్ఞలక్షణంబు గా వతీతా
నాగతంబుల విడిచి ప్రత్యుత్పన్నమతివి గమ్ము తమించి నాప్రబోధనంబు చెవిం
బెట్టుము. 180

మ. నను వాగ్వజ్రముఁ జేసి చెక్కుచుఁ గడున్ గర్వంబున న్నీవ నిన్
ఘనుఁగా నెంచుచునుంటి నన్ను మునునున్ గాలంబు ప్రాపించె నిం
తన ప్రాపించెడు నిన్ను నే నెనఁగునానాఁ డీవు నో రెత్తఁ జా
లినవాఁ డైతివె నీదు కాల మిది మేల్మిం గాంచె నిప్పట్టునన్. 181

క. నే నింద్రపదభ్రష్టుఁడ,నై నిలిచితి నెట్లు నీవు నట్లే యైంద్ర
స్థానభ్రష్టుఁడ వయ్యెద, వీనియతికిఁ గర్తకాలమే సుమి శక్రా 182

వ. సర్గవినాశైశ్వర్యంబులు సుఖదుఃఖంబులు భవాభవంబులు వనుపీనికిఁ బండితులు
హర్షశోకంబు లందరు నీ కింతగర్వం బేమిటికి నన్ను నీ వెఱుంగుదువు నిన్ను
నే నెఱుంగుదును మున్ను నే నెట్టిపౌరుషంబునం బ్రవర్తించితినో నీ వెఱుంగ
నియది కాదు వసువులు రుద్రు లాదిత్యులు సిద్ధులు సాధ్యులు మరుత్తులు నాచే
వినిర్జితులు నీ వా దేవాసురసంగ్రామంబు గన్నులారం గాంచి యుంటి తద్విధం
బెల్ల మఱచితివా వినుము 183

శా. నాకాధీశ్వర! నాఁడు నాముందుమునన్ నాకౌకసుల్ పాఱరో
లోకాలోకముఖాద్రు లంబుధులు నాలోడింపనో త్రెంపనో
నీకు న్నాకయివాఁడి సూప వెఱమై నిట్టూర్పుచున్ నీవు వో
వో కైవారము సేయుచున్ మఱచి తోకో మొన్న మొన్నం గదా. 184

క. కాలము దురతిక్రమమై,పోలింపఁగ నయ్యె నైనఁ బురుహూతుఁడ! దం
భోళి గొనియున్న ని న్నీ,వేళ న్నాముష్టి నడఁచి వేయం గలఁ బో. 185

వ. అయినను నా కిది క్షమాకాలంబు గాని విక్రమకాలంబు కాదు కావున నట్టి

యుత్సాహంబు కలుగదు సహింపరానినీప్రవర్తనంబునకు సహించితిఁ గాల
పాశబద్ధుఁడనై యున్ననన్నుఁ బరిభవించి గర్వించుచుంటి విది తగ దిదిగో
నల్లపురుషుండు లోకదురతిక్రముం డై కనుపట్టి నన్నుఁ బశువుం ద్రాటఁ గట్టినట్లు
కట్టి రౌద్రంబు చూపుచున్నవాఁడు లాభాలాభములు సుఖదుఃఖములు కామ
క్రోధములు భవాభవములు వధబంధప్రమోక్షంబులు లోనగునన్నియుఁ గాల
సంప్రాప్తంబు లగుచుండు నని మఱియును. 186

సీ. నేను గర్తను గాను నీవు కర్తవు గావు, కాలప్రభువు కర్త గాని నేను
బరిపక్వదశ కైతి నరయఁ గాలము చేత, వరవృక్షగత మగుఫలము రీతిఁ
బురుషుఁ డాయాకర్మములఁ జేసి కాలము, గలిగిన సుఖదుఃఖములను బొందుఁ
గాలజ్ఞుఁ డగువాఁడు కాలసంస్పృష్టుఁడ, నని యెంచి శోకింపఁ డంతరాత్మ
తే. గాన శోకింపఁ బోను శోకమునఁ జేసి, పాయ మింతయుఁ గాదు శోకాయతమతి
వ్యసనముఁ శోక ముడుపదు వజ్రపాణి, దాన సామర్థ్యమును జెడుఁగాన వగవ.
వ. అనిన సహస్రాక్షుం డక్షీణుం డగుతనసంరంభం బుడిగించుకొని వైరోచనిం
గని యిట్లనియె. 188

చ. భిదురము నెత్తి వేయుటకు ప్రేలెడునాదుకరంబు సూచియుఁ
వదలనియట్లు బద్ధ మగువారుణపాశము సూచియు న్మదిఁ
బెదరవు చంపవచ్చి కనిపించెడుమృత్యుకి నైన జంక వి
య్యెదనున వేనిబుద్ధి వ్యథ నందక యుండెడు నీది గాకిలఁ. 189

వ. తత్త్వదర్శి వగునీవు నీధైర్యంబున నవ్యథితుండ వైతివి జగత్తత్త్వ మెఱింగిన
యెవండు నశ్వరంబు లగునర్థంబులు నస్థిరంబగుశరీరంబు శాశ్వతంబు లని
యెంచెడిని నేను నీవలె నీలోకం బశాశ్వతం బని తెలిసికొనుచున్నాఁడ ఘోర
మును దురవగాహంబు నగు కాలాగ్నియందు నావహుతం బగుపదార్థ మెవండు
రక్షించెడిని గావున సూక్ష్మంబులు స్థూలంబులు నగుభూతము లెల్లఁ గాల
పక్వంబు లగుటయే నిశ్చయ మనీశుండు నప్రమత్తుండు ననివృత్తుండు నగుకాల
దేవునిబారిం బడినవాఁడు ప్రయత్నించియుఁ దప్పించుకొని పోవం జాలం డని
మఱియును. 190

సీ. ధర్మరూపము సనాతనము శాశ్వత మైన, కాలము జాగరూకతను గల్గి
ప్రాణులయెడ సమవర్తి యగు దాని కిం, తేఁ బరిహారవ్యతిక్రమములు
గలుగవహోరాత్రములుమాసములుక్షణం, బులు లోనివన్నియుఁ గలియఁగూర్చి
వడ్డి కిచ్చెడువాఁడు వడ్డినిం బలెఁ గాల, మాయుఃప్రమాణము నంకె వేయు

తే. నిపుడు చేసెద లేక రే పేని దప్పు, దనెడు వారిని దరిచెట్ల నాపగ వలెఁ
గాలముహరించుకొని పోవుఁగాలమహిమ, తెలియనెవ్వానికేనియుఁదలముగాదు

క. ఇపుడే చూచితి నీతని, నెపు డీల్గె నితండు పేని కే మరు దెంచెన్
జెపుఁ డనుచుఁ గాలధర్మ, వ్యపగతు లగువారిఁ గూర్చి యాలాప మగున్. 192

సీ. జనులజీవితమును స్థానముం భోగము, లర్థము లైశ్వర్య మాది యెల్లఁ
గాలాపహృతము లై కడతేరిపోవును, పెఱిగిన వన్నియు విఱుగు నవియె
భావ మభావస్వభావమే సర్వ మస్థిరమె దానికిఁ గృషిచేఁత నిష్ఫ
లమ్ము గావునను దత్త్వమ్మెఱింగిననీవు, బుద్ధి నిశ్చల మయి పొనరుచుండు

తే. నే నెసంగితి మున్నని యెంచఁ బోవు, కాలపీడిత మైనలోకమ్మునందుఁ
జిన్న పెద్దయనెడుభావ మెన్నఁబడదు,జగము కామాదిసక్తమై పొగులుచుండు

వ. నీ వన్ననో భావతత్త్వజ్ఞుండవు విద్వాంసుండవు జ్ఞానతపోఽన్వితుండవు కాల
చారిత్రవిజ్ఞుండవు గావున నీకాలముం గరతలామలకంబువలెం దిలకించి కృతా
ర్థుండవై తీలోక మెల్ల నీచే నవగత మైన దని నేఁ దలంచెద. 194

క. అన్నిట విహరించుచు నీ, వెన్నఁడు సక్తుఁడవు గాక యొసఁగుదు ఘనుఁడై
నిన్ను రజస్తమములు డా, యన్నెఱి చెడి పోయినట్టివగు నసురేంద్రా. 195

తే విగతసంతాప మాత్మ సేవించువాఁడ, విట్టి నిను సర్వభూతాత్ము నిద్ధచరితు
సుహృదునిన్ శాంతమానసుఁ జూచినంత, నీదుమతి యనుక్రోశిని నాఁ దెలిసితి

సీ. నే నిట్లు తెలిసినవానినిన్ బంధింప, నానృశంస్యమె ధర్మ మని తలంతుఁ
గాలపర్యయమునఁ గలుగునీవారును, బాశబంధమ్ములు వాయునట్లు
చేయుదు ప్రజ లొనర్చినతప్పునడవళ్ల, నీకు మే లగుఁ గాక నే వచింతు
నెప్పుడు కోడలు వృద్ధయౌ నత్తచేఁ, దనయుండు తండ్రిచేఁ బనులు గొందు

తే. రెపుడు ద్విజునిచేఁ బదసేవ నిచ్చగించి
పాదజుఁడు బ్రాహ్మణిం బొంద బాలుపడునో
పురుషులు వియోనులన్ బీజమును విడుతురో
యపుడు నీపాశబంధము లన్నియుఁ దెగు. 197

వ. మఱియును గాంస్యపాత్రంబుల సంకరపదార్థం బెత్తుటయుఁ గుపాత్రంబులం
బలులు వెట్టుటయు నాలుగువర్ణంబులవారును గులాచారధర్మంబులం దప్పి
మెలంగుటయు నెప్పుడు తటస్థించు నప్పుడ నీబంధంబు లొక్కటొక్కటిగఁ
దెగి పోవు నింక మావలన నీకెట్టిభయంబును గలుగదు నీవు సమయపాలనంబు

సేయుచు నిరామయుండవై నిర్బాధకంబుగా స్వస్థచిత్తుండవై యుండు మని శతక్రతుం డైరావతంబు నెక్కి యథాగతకృతగమనుండై దుష్టసంహారంబు గావించి త్రిలోకాధిపతియై సుఖం బుండె నని చెప్పిన విని యుధిష్ఠిరుండు దేవవ్రతుం గాంచి యి ట్లనియె. 198

లక్ష్మీశక్రసంవాదము.

క. పురుషునకుఁ గలుగఁబోయెడు, పరమప్రాభవపరాభవములకు నెల వై పరఁగు నవి పూర్వరూపము,లరుదారగ నాకుఁదెలుపు మని యడుగుటయుఁన్.

వ. భీష్ముం డి ట్లనియె. 200

క. మనమే మనుజునిగౌరవ, మునకు నగౌరవమునకును బొలుపొందఁగ నై పొనరునలపూర్వరూపము, లను దెలియం జేయుచుండు లక్షింపంగన్. 201

వ. ఇందులకు లక్ష్మీశక్రసంవాదం బనునితిహాసంబు గలదు దానిం జెప్పెద నవధరింపుము. 202

సీ. బ్రహ్మలోకమునందు బ్రహ్మతేజోవిరా,జితులగుఋషులలోఁ బ్రతిభ గన్న మహానీయుఁడునుదపోమహిమచేనుభయలో,కములెఱింగినఘనుండమితసత్త్వుఁ డగునారదమహర్షి యఖిలలోకంబులు, తిరుగువాఁ డొకనాఁడు తెల్లవాఱ లేచి పవిత్రాంబు సేచన మొనరింపఁ, దలఁచి ధ్రువద్వారతలమునందుఁ

తే బొదలుగంగకుఁ జనియె నయ్యెదనునంద, పాకశాసనుఁ డరుదెంచె వార లిర్వు రందు జలమాడి నియతాత్ము లై జపించి, భర్మవాలుకపులినము పై వసించి.

వ. అచట సమాగతు లైనమహర్షులు దేవర్షిప్రోక్తంబులును బుణ్యకర్మసమంచితంబులు నగుపుణ్యకథాప్రసంగంబులు సేయ నాకర్ణించి తమతమపూర్వవృత్తంబు లొండొరులు చెప్పుకొనుచు నొక్కచో విశ్రమించి రంత. 204

మ పొడుపుంగుబ్బలి నుద్భవించినరవిం బోలించి సేవించి శ
క్రుఁడును న్నారదుఁ డొక్కచో నిలిచి కోర్కుల్ మీఱ నున్నంతలో
నుడువీథిన్ ఘన మైనతేజ మొకఁ డెంతో వింతగా నవ్విభా
నుఁడు భాసిల్లెడునో యన న్వెలుఁగుచు న్జూపట్టె నప్పట్టునన్. 205

వ. అంతలోఁ త్రైలోక్యము వెలింగింపం జాలునాతేజము క్రమక్రమంబుగా నింద్రనారదులకుం జేరువ యై యది యుద్యతార్చిస్సుప్రభంబును సువర్ణాంకితంబు నగువిమానం బై కానవచ్చె నం దభిరూపశోభాన్విత లగునప్సరసలు సేవింప నానావిధాభరణంబులం దాల్చి పద్మదళస్థితయై సాక్షాన్మహాలక్ష్మి సాక్షాత్కరించి

విమానంబు డిగి యింద్రనారదు లున్నకడ కేగుదెంచుచున్నంగని వారామె
కెదు రేగి నమస్కరించి పూజించి రంత దేవేంద్రుండు కృతాంజలిపుటుండై
పద్మాలయం గని యి ట్లనియె. 206

క. ఎందుండి యిందు వచ్చితి, వెందుల కేగెదవొ యెవ్వ రీవు జనిత్రీ!
యిందుఁ గలకర్జ మేమో, పొందుపడం జెప్పు మమ్ము బోలించి పమ్ముగ. 207

వ. అనిన మహాలక్ష్మి యి ట్లనియె. 208

ఉ. స్థావరజంగమంబు లగుజంతువు లన్నియు ముజ్జగంబులన్
నావలె నుండఁగా వలయు నన్ మతి సేయుచు నుండుభానుసం
భావిత మైనపంకజము పట్టునఁ బుట్టియు భూతజాతమున్
భావన చేసి సంపదలు పర్వఁగఁ జేయుచునుందు విందువే. 209

సీ. మఱియును నేఁ బద్మమాలిని పద్మ పద్మాలయ భూతి శ్రీ యనెడుపేళ్లఁ
దనరులక్ష్మిని శ్రద్ధయును మేధయును సన్నతియును విజితియును స్థితియు నేన
నేన ధృతియు సిద్ధి నేన త్విద్యూతియు, నేన నియతియును నేన స్మృతియు
నేన స్వాహాదేవి నేన స్వధాదేవి, నై యొప్పుచుండు లోకాళియందు

తే విజయమానరాజ్ఞసేనాగ్రవీథులందు, ధర్మశీలనివాసభూస్థలములందుఁ
బోరులం దీఁగకుండెడుశూరులందు, నరపతులయందు నే నుందు నిరత మనఘ.

వ. మఱియు బ్రహ్మజ్ఞులు సత్యవాదులు ధర్మశీలురు వినయవంతులు దాతలు నగు
వారియందు నివసింతు నిట్టినే నిపుడు సత్యధర్మపరాయణులు గానిరాక్షసులం
బెడఁబాసి ని న్నావహింపఁ గోరి వచ్చితి ననిన నింద్రుం డి ట్లనియె 211

క. దానవు లెట్టిగుణంబులఁ, గానంబడి నప్డు వారిఁ గాంక్షించితి వి
ద్దానిక్కృతిగుణము లక్కడఁ, గానంబడ విడితొ తెలిపి కరుణింపఁ గదే. 212

సీ అనుడు మహాలక్ష్మి యను దైత్యదానవుల్, ధైర్యంబు వదలక ధర్మనిరతు
లగుచు స్వర్గముఁ గోరునట్టివారై సత్యప్రధానులై యున్నపు డేను వారి
పైఁ బ్రీతిఁ జూపితి వారు దానాధ్యయనాదులు గలవారు యాగరతులు
సతతవ్రతులు సత్యసంధులు పితృదేవతాగుర్వతిథ్యర్చనాగరిష్ఠు

తే. లతిపవిత్రులు బ్రాహ్మణవ్రతులు శాంతిదాంతి గలవారు కాంతలఁ దలఁపకుండు
వారు నిరతంబు వేలిమి వలచువారు,వారి సామాన్యు లని చెప్పవలను పడదు.

వ. మఱియును వారు శ్రద్ధధానాక్రోధానీర్ష్యానసూయలు గలిగి భృతదార
పుత్రమిత్రభృత్యామాత్యు లై పరస్పరద్వేషంబు లేక ధైర్యవంతు లై పర

సమృద్ధి కసూయపడక దాతలు సంగృహీతలు భూతదయావిష్టులు ప్రసన్న
చిత్తులు దృఢభక్తులు జితేంద్రియులు కృతజ్ఞులు ప్రియవాదులు ఋజువర్తనులు
నుపవాసతపశ్శీలురు బ్రహ్మవాదులు నై యుండువా రాకర్ణింపుము. 214

సీ. ఒకనాఁటికిఁ భాస్కరోదయాస్తమయము,లందు నిద్రింపనియట్టివారు
మునిప్రొద్దు ఘృతమును ముట్టిముంగళశస్తు,వులఁ గాంచి విప్రులఁ గొలుచువారు
కృపణు లనాథులు వృద్ధులు దుర్బలుల్,స్త్రీలు మున్నగువారి నేలువారు
వ్యాధిపీడితుఁ గృశు వ్యసనార్తుని భయార్తు,నుద్విగ్ను హృతధను నోమువారు
తే. దేవతాతిథిగురువృద్ధసేవ చేసి, భుక్తశేషము భుజియింపఁ బోవువారు
పరసతులఁ గంటఁ జూడనివ్రతముఁగలిగి,యలరువారుత్తమోత్తము లైనవారు.

ఆ. ఆకసంబునందు నంబువులందును,నన్యజాతియోనులందుఁ బసుల
యందుఁ బర్వతములయందు నింద్రియమును,విడువనట్టివారు వీరవరులు. 216

వ. మఱియు సత్యదానార్జవదాక్ష్యశౌచానహంకార సౌహృదక్షమాకారుణ్యాది
సద్గుణంబులు గలిగి నిద్రాలస్యాసంప్రీత్యసూయారతివిషాదాదు లగుదుర్గు
ణంబులు విడిచి యుండువా రట్టిదానవులయందు మున్ను నేఁ బెడఁ బాయ
కుండుదాన నంతఁ గాలవిపర్యాసంబున వారికి గుణవిపర్యాసంబు గలిగి ధర్మంబు
విడిచి కామక్రోధవశాత్ము లై రప్పుడు. 217

క. చదువునఁ బెద్దలు సెప్పెడు, నది కా దని వాదులాడి యుపహాస్యములన్
గదియించి తెగడఁ జొచ్చిరి, మదిఁ దప్పినవార లై యమాన్యచరిత్రుల్. 218

సీ. కోడెకాం డ్రొకచోటఁ గూడి పెద్దలు రాఁగ, నెదురేగి పూజింప రెల్లనాఁడు
సుసమర్థుఁ డై తండ్రి సూరెల నుండఁ దనయుఁ డింటి కధికారి నాఁ దలిర్చె
భృత్యుండు కాక తా భృత్యతఁ బ్రకటించి, వేతనం బిమ్మని వేఁచు ధనికు
నతినీచకార్యము లాచరించియు జనుల్,విపులార్థములఁ గూడఁ బెట్ట నైరి
ఆ. పడఁతి మగనిమాట కొడుకు జనకుమాట, వినక ధిక్కరించు చెనఁటు లైరి
గురుని దల్లిఁ దండ్రి గుణవృద్ధు నాచార్యు, గౌరవింప రైరి క్రూరు లగుచు.

క. పితృదేవాతిథిగురులను, బితలాటక మాచరించి భిక్షాబలు లం
చితగతిఁ జేయక కుడిచెద, రతినీచమనస్కు లగుచు నప్పటివారల్. 220

తే. శూద్రజనులకు శౌచంబు లేదు వంట, కమ్ములను మనోవాక్కాయకర్మములను
గోప్య మొనరించుటలు లేవు గోఘృతంబొ,నర్తురుచ్ఛిష్టతను గూడనార్తులగుచు,
తే.దాత్రకుద్దాలములుకాంశ్యపాత్రములును,తామ్రపిటకాదులందందుఁదడబడంగ

నిల్లు వాకిళ్లు సరిచేయ దింటి యామె, చల్లఁబడు నింట ధాన్యముల్ పొల్లవోవ.

క. రాటకుఁ బశువులఁ గట్టియు, నోటికి నొక్కింతకసవును న్నీళ్లు నిడక్
బాటింపకుండ్రు నాళులు, నాఁటిన దయ యింత లేనిదైత్యులు శక్రా. 223

క బాలుర చూచుచు నుండం, బాలును భక్ష్యములు తామ భక్షించుచు న
బ్బాలకుల కింత పెట్టరు, పాలింపరు భృత్యకోటి బాలిశు లగుచున్. 224

సీ. పులగంబు మాంస మపూపముల్ చక్కిలాల్, తినఁ దమరే వండుకొనెడివారు
నుభయసంధ్యల నిద్ర నొందువారును రేఁబ, వలునా కెపుడు పోరు సలుపువారు
జాతిమతద్వేషసాంకర్యములు గల్గి, శౌచవిహీనులై చనెడువారు
చదివినవారును జదువనివా రొక్క, దండిఁ జూడం బడుచుండువారు

తే. దాసదాసీజనంబులు తారతమ్య, విరహితులు వేషభాషాదివిధుల సమత
గలిగి యెల్లగృహంబులఁ గలియఁ దిరిగి, పను లొనర్తురు సంసారిజనులయిండ్ల.

క. పురుషులు స్త్రీవేషం బా, పురుషులవేషంబు స్త్రీలు పొందుచు నన్యో
న్యరతి మెయి ధరణి విహరిం, తురు బిడియము లేక ముదము తుంపెసలాడన్.

మ. తమవా రర్థు లటంచు నుత్తములకున్ దానంబు గావించు క్షే
త్రములుం దొట్టిసమస్తవస్తువులు తద్వంశీయు లౌదుష్టు లు
త్తములం గొట్టి గ్రహించుచుండ్రు మరలన్ దర్పంబు నాస్తిక్యమున్
దమ కెల్లప్పుడు పట్టుగొమ్మ లగుచున్ దళ్కొత్తగా నత్తఱిన్. 227

మ తనకార్యంబున సంశయంబు గలఁడై తా నొక్కమిత్రుండు మి
త్రునితోఁ జెప్పిన దీని నెట్లొ సమకూర్తున్నే నటం చాడి త
ద్ధనలాభంబును దాన కైకొనును మిత్రద్రోహియై దుర్జనుం
డని తన్నాడిన లోకముం దెగడువాఁడై క్రూరచిత్తుం డిలన్. 228

తే. శూద్రు లార్యుల మనుకొని శుచులు గాక, జపతపంబులు గావింప సాఁగి రధిక
నిష్ఠ నియమంబు గలిగినశ్రేష్ఠు లట్లు, విప్రు లన్నను వారికి వెగటు దోఁచు. 229

క. గురుశుశ్రూషన్ శిష్యుఁడు, పరఁగఁడు పుత్రుండు నన్నపరతంత్రతమై
దురపిల్లుఁ దల్లిదండ్రులఁ, బరిపోషింపంగఁ బోఁడు భార్యాప్రియుఁడై. 230

క. శ్రుతు లెల్లఁ జదివి బ్రహ్మ, ప్రతిమానులు ప్రాజ్ఞులైనబ్రాహ్మణు లెల్లన్
బ్రతిపత్తి లేక పొట్టకు, గతి కానక కృషి పొనర్పఁ గడఁగిరి కడఁకన్. 231

సీ. శిష్యుల నియమింపఁ జెల్లినకృత్యముల్, గురులు తామే చేసికొనుచు నుందు
రత్తమామలును బ్రత్యహము శాసించుచుఁ, గోడండ్రు సేయించుకొండ్రు పనులు

సతులు పతులఁ బిల్చి సైరింపరానట్లు, చిందఱఁగొట్టి శాసించుచుండ్రు
తనయులకుం బంచి తండ్రులు తిన లేక, యష్టకష్టంబుల ననుభవింత్రు
తే. చెలిమిఁ జూపెడువారలఁ జెన్నుదఱుగఁ, బరిహసించుచు ద్వేషంబు పాదుకొలిపి
జనులు వర్తింత్రు నాస్తికులును గృతఘ్ను, లును దురాచారులును జూడఁదనరిరపుడు.

వ. అట్టిదైత్యదానవులం దుండ రాదని నాకుఁ దలంపు గలిగి నాయంత నేన వచ్చితి నన్నంగీకరించి పూజింపుము నిన్నెల్లపు మన్నింతురు నే నున్నచోటన మదిష్టు లగుజయయు నాశయు శ్రద్ధయు ధృతియు శాంతియు విజితియు సన్నతియు క్షమయు నను నెనమండ్రు నీకెంతయుం గూర్పుచు నన్నాశ్రయించి యుందు రని పలికినం గలుములకలికిపలుకుల కింద్రనారదు లెంతయు సంతసించిరి. 233

సీ. అంతఁ జల్లనిగాలి యఖిలదిక్కులయందు, వీఁచె సుఖస్పర్శమై చనంగ
దేవత లెల్ల రా దేవేంద్రునిం జూడ, వచ్చిరి ముచ్చట హెచ్చి కొనఁగ
నారదసహితుఁడై నాకాధిపతి దివ్య, రథ మెక్కి స్వర్గమార్గంబు పట్టె
స్వారాజ్యమును గొన్నపట్టునం దట మౌని; దేవ్యాగమనమెల్లఁ దెలియఁజెప్పె
తే. నజనిలోకమునకు నింగినమృత మొలికె, మోదకున్నను దుందుభుల్ మ్రోసె దెసలు
నిర్మలము లయ్యెఁ బర్జన్యుఁ డూర్జితఁగాల, గతులకుం దగవర్షించెఁ గలిగెసుఖము.

క. తొలఁగం డెవ్వఁడు ధర్మము, నిల యయ్యెక్ రత్నగర్భ యెందును వేదం
బులు మ్రోఁగె యజ్ఞకర్మము, లల రెక్ భూసురులయందు నతులితగతులక్.

చ. నరులును గిన్నరుల్ సురలు నాగులు యక్షు లొగిక్ సమృద్ధిమైఁ
బరఁగిరి పక్వ మావఱుకుఁ బండులు పూవులు చెట్లనుండి పెం
గరువలి రాల్పఁ డావు లధికంబుగఁ బా లిడె నెవ్వఁ డేనియుక్
బరుసము లాడువాఁడు కనుపట్టఁడు భూతలమందు నెందునుక్. 236

క. దేవేంద్రుఁడు శ్రీదేవికిఁ, గావించినయీసపర్య కడుభక్తిమెయిక్
భావించుచుండు వానికి, శ్రీ వెలయు నిరంతరంబు క్షితితలమందుక్. 237

వ. అని మఱియును. 238

క. అవనీశ్వర! నీ వడిగిన, భవాభవముల కిపు డేను బలికినకథ లే
తవిననిదర్శన మిట్టిపు వొనప్పము తత్వ మెఱిఁగి పొందుదు ఫలముక్. 239

తరు. అని తెల్ప ధర్మజుం డనియె నిట్లోయ్య, నఘ! బ్రహ్మపదము దానందునెట్టిందు
వినిపింపు దానికి విక్రమమా? వివేకమా? శీలమా? విద్యయా? వెలయు

నన శాంతనవుఁ డను నప్పద మొందు, నతఁడు లఘ్వాహారుఁడై జితేంద్రియుఁడు
నన నొప్పి మోక్షధర్మాసక్తుఁ డగుచు, నలరంగ వలయు నోయమ రాజతనయ.

దేవలజైగీషవ్యసంవాదప్రకారము.

వ ఈయర్థంబున నొక్కయితిహాసంబు గల దది యసితుం డగుదేవలునకు జైగీష
వ్యునకు నైనసంవాదంబు దానిం జెప్పెద నాకర్ణింపుము: 241

తే ప్రాజ్ఞుఁ డక్రోధనుండు శాస్త్రజ్ఞుఁ డఖిల, ధర్మతత్త్వవిదుండు సత్యవ్రతుండు
నై తలిర్చుజైగీషవ్యుఁడనుమునీంద్రు, నసితుఁడగుదేవలుఁడుగాంచియనియెనిట్లు.

క. పొగడిన సంతస మందవు, తెగడిన మదిఁ గుంద వీవు తెలుపుము నీ కిం
దగుప్రజ్ఞ యెట్టి యది యెట్లగు దానఁ బరాయణంబు నది యెట్టిదియో. 243

వ. అనతి మ్మనిన జైగీషవ్యుం డసందిగ్ధంబును పావనంబును బుష్కలార్థపదంబు నగు
మహావాక్యంబు పలికె నది యెట్టి దనిన. 244

ఆ. పుణ్యకర్ములకుఁ బొసఁగెడు గతి యేదో, యుత్తమోత్తమ మయి యొప్పుస్థాన
మెదియొ శాంతి యేదొ యది వచించెద నిప్పు, డవధరింపుమయ్య యతివరేణ్య.

సీ. నిందాప్రశంసల నిత్యసమత్వము, నిర్వికల్పత గల్గి నెగడువారు
తమసుకృతంబును సమయంబు నొకనాఁటికిని గాని ప్రకటించుకొననివారు
నహితులకే హిత మాచరించెడివారు,నొరులు దూరిన దూఱ కుండువారు
చంప నెంచినవారి నొంప కుండెడివారు,పండితు లని తెల్పఁ బడుచునుంద్రు

ఆ. ప్రాప్త మనుభవింతు రప్రాప్తమునకు న,తీతమునకు లోన నేతఱి వగ
వంగఁ బోరు గౌరవం బైనపట్ల య,థోపపత్తి గా సముత్సహింత్రు. 246

వ. ప్రాజ్ఞు లగునట్టివారు జ్ఞానపరిపాకంబున జితక్రోధులు జితేంద్రియులు నై మనో
వాక్కాయముల నొకప్పుడు నపరాధ మొనర్ప కుండురు మఱియును. 247

సీ. ఒకనితోఁ గలహింప రొకని హింసింపరు, పరసమృద్ధి కసూయ పడరు పరుల
నిందింపరు స్తుతింప రెందు వికారము, నొందరు శాంతులై యుందు రెపుడు
విడి క్రోధహర్షముల్ వేరికిఁ ద్రోహము, దలఁపరు హృదయబంధంబు వీడఁ
బరమసుఖం బుంద్రు బంధు లబంధువుల్, మిత్రు లమిత్రు లన్ మేఱ లేక

తే. సర్వసమవర్తులై ధర్మసరణి విడక, ధాత్రి సర్వజ్ఞమూర్తులై దనరువారు
దుఃఖ మనునది యెట్టిదో తోఁపకుండ,సంతతానంద మొందుదు రెంతయేని

వ. నే నిట్టిపథంబు పట్టి మెలంగుచున్నవాఁడ నిందాస్తుతులకును శోకహర్షంబుల
కును నాచిత్తంబు హత్తుకొనదు. 249

క. పొంది యవమాన మమృతము, నొందినగతి సంతసించుఁనుత్తముఁడు మనం
బందుఁ సమ్మానంబుం,బొంది భయం బందు విషముఁ బొందినభంగిన్. 250

తే. అవమతిం బొంది తనపాప మరుగఁ బ్రాజ్ఞుఁ,డిహపరంబుల భయమేగ నెసక మెసఁగు
నట్టివానికి నవమాన మాచరించు, వాఁడు తనచేఁతకుం దానె పరితపించు 251

క. ఉత్తమగతిఁ గోరినవాఁ, డెత్తఱిఁ దనమనమునందు నీమార్గంబున్
హత్తుకొనఁ జేసె నేనియు, గుత్తగొనున్ సతతసుఖము కోవిదవర్యా. 252

క. ఇటుల ప్రవర్తించుచుఁ గ్రతు,పటలము గావించి ప్రకృతిపరమై ధ్రువమై
పటు వగుబ్రహ్మపదంబుం, దటుకునఁ గొను సర్వదేవతాప్రణతుం డై. 253

వ. అట్టిపదంబు దేవగంధర్వపిశాచరాక్షసాదులు పొందఁ జాల రని చెప్పె నని
చెప్పిన విని యుధిష్ఠిరుండు సర్వలోకప్రియుండును సర్వసత్వాభినందితుండును
సర్వగుణోపేతుండు నగుమానవుం డెవ్వండు గలండు చెప్ప ననుగ్రహింపు
మనిన భీష్ముండు నీ వడిగినదాని కుత్తరంబుగా నారదునివిషయమై యుగ్రసేన
వాసుదేవులకుం బ్రవర్తిల్లినసంవాదం బొండు గల దాకర్ణింపు మొక్కనాఁ
డుగ్రసేనుండు వాసుదేవుం జూచి నారదుని లోకం బెల్ల సన్నుతించు నతని
గుణసంపన్నత్వ మెట్టిది యెఱింగింపు మనిన నతం డతని కి ట్లనియె. 254

ఉగ్రసేనశ్రీకృష్ణసంవాదప్రకారము.

క. కుకురాధీశ్వర! నారదు,నకుఁ గలగుణగణము లెల్ల నాయెఱిఁగినపో
లికి సంక్షేపముగాఁ బొం,దికఁ జేసి వచింతు వినుము నీ వియ్యెడలన్. 255

సీ. కాయతాపక మహంకారము గౌరవ,ముం గోరుబుద్ధి యమ్మునికి లేవు
భిన్నశ్రుతచరిత్రుఁ డెన్నఁటికిం గాఁడు, కోపంబు భయమును జాపలంబు
నరతియు నతనికిం బరఁగవు దీర్ఘసూ,త్రుఁడు గాడు కార్యశూరుం డతండు
కామలోభంబులం గాని ప్రమాదము,నంగాని పలికి బొంకంగఁ బోఁడు

తే. శాంతుఁ డాత్మతత్వజ్ఞుఁడు సత్యవాది, శక్తుఁడు జితేంద్రియుండు విజ్ఞానబుద్ధి
వినయతేజోయశస్తపోజననములను,వృద్ధుఁడై జగత్పూజ్యుఁడై వెలయునతఁడు.

వ. మఱియు సుశీలుఁడు సుఖసంవేశుఁడు సుభోజుఁడు సువాక్యుఁడు శుచిసాదరుఁ
డనీర్ష్యుఁడు నగుటం జేసి సర్వపూజ్యుం డయ్యె. 257

చ. సుకృతము చేయుఁగా నెపుడు చూడఁడు పాపమువంక నొడ్డన
ష్టకృతికి నోర్వఁ డాత్మ శ్రుతిశాస్త్రపురాణసమాహితార్థముల్
సకలజనావబోధ మగుచందమునన్ లయతోడిగాన ము
త్సుకత నొనర్చి సంతసముతోఁ జరియించెడు నెల్లకాలమున్ 258

సీ. సహనంబు గలవాఁడు సమబుద్ధి యగుటచే, నవమానము నెఱుంగఁ డప్రియంబు
ప్రియ మాతనికి లేవు పెరల నెవ్వ మహోక్ష, కాలతఁ బల్కఁ డలాలసుండు
చిత్రచారిత్రుఁడు భిన్నాగ్రహుఁడు బహుశ్రుతుఁడు శాంతికుఁడు నక్రోధనుండు
దైన్యలోభమదాదిశూన్యుఁడును శాంతి, కలితుండును ధర్మకాముఁడును
తే. దోషరహితుం డనిందితాత్ముండు భక్తి, భరితుఁ డనృశంసుఁ డక్రూర్యుఁడు గతరాత్మ
తత్త్వవిజ్ఞానకలితుండు దాంతుఁ డగుట, సర్వలోకైకపూజ్యుఁ డై సొంపు మీఱు.
వ. మఱియు నతండు సర్వసంగవిముక్తుం డయ్యు నక్షాత్మనిచయంబునం గాన వచ్చు
నాతనికి దీర్ఘసంశయం బెన్నఁటికిం గలుగఁ బోదు కామచింత లేనివాఁడు తన్నుం
దాఁ బొగడుకోనినివాఁడు వక్తవ్యదువాది లోకచిత్రవృత్తులు కుత్సింపక
చూచుచుండువాఁడు శాస్త్రవిద్యాకుశలుఁడు స్వవిపక్షాన్యమతంబులకు నసూయ
పడక నిజమతానుసారంబుగం బ్రవర్తించువాఁడు వశ్యాత్ముఁడు కృతకర్ముఁడు
కృతప్రజ్ఞుఁడు నిత్యయుక్తుం డప్రమత్తుం డపత్రపుండు పరద్రోహాభిలాషి పర
గుహ్యముల భేదింపఁ దలంపనివాఁడు లాభాలాభంబుల నానందవ్యథలు లేని
వాఁడు గావుటం జేసి సర్వలోకపూజ్యుం డయ్యె నిట్టిసుగుణగణాంచితుం
డగువాని నెవ్వ రాదరింప రనియె ననిన నజాతశత్రుండు 260
తే. వివిధజీవుల కాద్యంతవిధము ధ్యాన,కర్మములు కాలమును యుగకలిత మాయు
వును జగత్తత్త్వమును బంచభూతములు గ,తాగతంబులు సృష్టిలయములు మఱియు.
తే. సృష్టిలయములు జగ మిది యెందునుండి,వచ్చినది మున్ను భృగుభరద్వాజవాద
రూపమునఁ జెప్పితివి దానిరూప మెల్ల,మఱియు వినవెంచితిని దెల్పుమా! మహాత్మ.
వ. అని యడిగిన వియన్నదీనందనుం డీయర్థమును సమర్థించుచు శుకవ్యాససంవాద
మనునితిహాసంబు గలదు దానిం జెప్పెద నాకర్ణింపుము మున్నొకనాఁడు వేద
వేదాంగంబులుం జదివియు నుపనిషత్తత్త్వంబు నెఱింగినశుకుండు ధర్మనైపుణ
దర్శనంబున నైష్ఠికం బగుకర్మంబు నెఱుంగం గోరి తనతండ్రి యగుకృష్ణద్వై
పాయనుం జేర నరిగి ఛిన్నధర్మార్థసంశయుం డగునాసంయమీంద్రునివలనఁ
దనసందేహము దీర్చుకొనువాఁ డై యి ట్లనియె. 263

—— వ్యాసుఁడు శుకునకుం జెప్పిన కాలావయవనిరూణపము. ——

క. అనఘ! చరాచరకర్తయు, ఘనకాలజ్ఞానవేద్యకాయుం డై యొ
ప్పినవాఁ డెవ్వఁడు బ్రాహ్మణుఁ, డన నెవ్వఁడు వానికర్మ మది యెట్టిదొకో.264
వ. వినవలతుం జెప్పు మనిన నతీతానాగతవేది యగునతం డతని కి ట్లనియె. 265

క. అజుఁ డాద్యంతవిహీనుం, డజరుఁడు దివ్యుండు ధ్రువుఁడు నవ్యయుఁడు పరుం
డు జగన్నాథుఁ డతర్క్యుం, డజితుం డగు బ్రహ్మ మొక్కఁ డాది నెసంగున్.

వ. తద్విధం బవల విందు కాని మొదటఁ గాలవిధంబు వివరించెద వినుము. 267

సీ. పదునైదునిమిషముల్ పరఁగెడు నొకకాష్ఠ, కాష్ఠలు ముప్పది కళ యనఁబడుఁ
గళలు ముప్పదియును గళలోనిపదియవ, వంతుముహూర్తమై వఱలుచుండుఁ
ద్రింశన్ముహూర్తముల్ రేబవళ్లగు నవి, ముప్పది యైనచో నొప్పు మాస
మవి పదిరెండైన హాయనం బగు దక్షిణోత్తరాయణములం దొప్పు రెండు

తే. రవియె రేలుం బవళ్లు మర్త్యమునఁ జేయు
రేయి భూతజాతము నిదురించుటకును
బవలు సర్వకార్యములు నాప్రజ లొనర్చు
కొనుటకున్ నిర్ణయం బయ్యె మును కుమార. 268

వ. మనుష్యమాసంబు పితృదేవతల కొకయహోరాత్రంబు వీరిశుక్లపక్షము వారి పవలు కృష్ణపక్షము రాత్రియు నగుచుండు మానవవర్షంబు దేవతల కొక్క దినం బుత్తరాయణంబు పవలు దక్షిణాయనంబు రాత్రి మనుష్యమానముంబట్టి బ్రహ్మదేవునికాలపరిమాణంబు దెలిపెద నాలింపుము కృతాదులు నాలుగు యుగంబు లందుఁ గృతయుగప్రమాణము నాలుగువేలదివ్యవర్షంబులు సంధ్య నన్నూఱు సంధ్యాంశము నన్నూఱువర్షము లిట్లు తక్కినమూఁడుయుగంబులకు సంధ్యాసంధ్యాంశములకు నొక్కొకదాని కొక్కొకపాదంబుగా సహస్రములు శతముం దక్క నగుచుండు నిట్లుగా సంధ్యాసంధ్యాంశములతోఁ గృతయుగ ప్రమాణము నాలుఁగువేలయెనిమిదివందలు త్రేతాయుగప్రమాణము మూఁడు వేలాఱువందలు ద్వాపరప్రమాణము రెండువేలనాల్గువందలు కలియుగ ప్రమాణ మొకవేయి రెండువందలవత్సరంబు లీయుగంబులు శాశ్వతంబులై సనాతనంబు లగులోకంబుల వహించుచుండు దీనినే వేదవేత్తలు శాశ్వతబ్రహ్మ మని చెప్పుదురు మఱియును. 269

సీ. ధర్మంబు నాల్గుపాదముల వర్తించును, గృతయుగంబునయందు నతులితగతి
నపు డధర్మాగమమందుఁ బ్రవృత్తి లే, దితరయుగంబుల నెసఁగుధర్మ
మొక్కొకపాదంబుతక్కువయగు నసత్యముచౌర్యమునుమాయయాదిగా న
ధర్మక్రియలు హెచ్చుఁ దద్విధంబుగఁ బాద, పాదక్రమంబునఁ బరిఢవిల్లి

తే. కృతయుగంబున రోగము లతుకఁ బోవు, సర్వసిద్ధార్థు లెల్లప్రజలు చతుశ్శ

తాబ్దములు జీవనము గల్గియలరుచుండు, రఖిలసౌభాగ్యములతోడ నతిశయిల్లి.

మ. విను త్రేతాదియుగంబులం దొకొకపాదోనోక్క నరాయుష్యముల్
జను హ్రాస్వం బయి వేదవాదఫలముల్ జన్మంబు లాశీఃఫలం
బును క్షీణించు యుగానురూపముగఁ బెంపుం దక్కి ధర్మంబు లె
ల్ల నెఱిం దప్పును భిన్నభిన్నములుగా లక్షింప నై పుత్రకా. 271

ఆ. కృతమునం దపంబు త్రేత జ్ఞానంబును, ద్వాపరమున సప్తతంతువు కలి
దాన మొండు శ్రేష్ఠతమములై ఫలమిచ్చు, ధర్మము లని శ్రుతులుఁదలపఁజేయు.

వ. విద్వాంసు లీద్వాదశవర్షంబు లొక్కయుగ మనియు నట్టియుగములు వేయి
యైన బ్రహ్మకొక్కపగ లగు ననియు నట్లె రాత్రి యగు ననియు దివసారంభ
మున నతఁడు మేలుకాంచి సృష్టిం గావించు ననియు క్షపారంభమున ధ్యానా
వేశమున నిదురింప జగత్ప్రళయం బగు ననియు నిట్లు యుగసహస్రద్వయ
మాతనికి రేఁబవళ్లగు ననియు నెఱుంగుదు రని చెప్పి మఱియును. 273

## భూతోత్పత్తిప్రకారము.

సీ. స్థావరజంగమాత్మక మైనయీప్రపంచము బ్రహ్మతేజోమయ మగుశుక్ర
ముననుండియగు బ్రహ్మము న్నహర్ముఖమున,యందు మేల్కొనియవిద్యాప్రభావ
మున జగంబు సృజింప మొనసి మహత్తను, దాన వ్యక్తాత్మక మైనమనము
మునుమున్న సృజియించె మన మతిప్రార్థనా, సంశయాత్మక మతిచార మరయ

తే. నమ్మనమ్మున నాకాశ మగును దాని, గుణము శబ్ద మాకసమునకు వికృతి యయి
దానివలన వాయువు పుట్టు దానిగుణము,స్పర్శమనినీ వెఱుంగు మోసత్కుమార.

ఉ. వాయువికారముం గలుగ వహ్ని జనించెడు దానినుండి త
ద్దేయగుణంబు రూప మయి తీరును వహ్నివికారసంగతిన్
దోయము పుట్టు తద్గుణముతోడ రసంబు జలంబునుండి పెం
పై యుదయించు గంధగుణ మై గణియింపఁగ భూమి పుట్టెడున్. 275

వ. ఇది పూర్వభూతోత్పత్తిక్రమం బిట్లు పూర్వపూర్వభూతగుణంబుల నుత్తరో
త్తరభూతము లొందుచుండు వానిలో నొక్కొకదానియం దెల్లభూతగుణం
బులుం గానఁబడుచుండు నని మఱియు. 276

చ. తెలియక కొంద ఱప్పులను దేలినగంధము నమ్మయమ్ముగాఁ
దలఁచి భ్రమింత్రు గాని యది ధాత్రిగుణంబు జలానిలాన్వితం
బలఘుతరంబు లమ్మహదహంకృతు లివ్వియుఁ గూడ నేడు నై

ప్రాణము వేఱువే జయింపవచ్చునుం గలవై తలిర్చెడిన్. 277

సీ. ఇవి యన్నియుం గూడి యే కాని కర్త్రయై, జనుల సృష్టింపఁగఁ జాల వయ్యె
నొంటొంటి నివి కూడియుంట శరీరాశ్రయమను తేర్పడె నివి యన్ని యొకటి
గాఁ జేరి మూర్తిసంకలితమై పదియారు, భాగము ల్గల మేను పరిఢవిల్లె
క్షేత్రభూతాంగము మహాభూతముల్, కర్మగతులతోడఁ గలిగియుండు

ఆ. నాదికర్త యన్న మహాభూతములతోడ, స్థూలమందు నున్న సూక్ష్మమందుఁ
జొచ్చి మనముఁ బ్రజ్ఞ నిచ్చు నాతనిఁ బ్రజాపతి యటంచు బుధులు పలుకుచుండ్రు.

వ. అతండు జంగమస్థావరంబు లగునెల్లభూతంబుల సృజించు నతండె బ్రహ్మారూపంబు నొంది దేవర్షిపితృమానవులను నదీనదసముద్రంబులను శైలవనస్పతులను నరకిన్నరరక్షోగణంబులను పశుపక్షిమృగోరగంబులను, దిక్కులను లోకంబులను బ్రాక్సృష్టిప్రవర్తకర్మానుసారంబుగ నట్టికర్మఫలంబులం బొందునట్లు సృజించుచుండు నవ్విధంబుననే హింసాహింసలు మార్దవక్రౌర్యములు ధర్మాధర్మములు సత్యాసత్యములు లోనగునవియుఁ బునస్సృష్టియందుఁ బొందఁబడుచుండు నట్టిగుణంబులే వానివానికి రుచించునట్లు ధాత భూతములకును శబ్దాదులకును బదార్థములకును నానాత్వము గల్పించి నానావిధప్రాణికోటుల సృజించుచుండు నని మఱియు. 279

ఉ. కొందఱు కర్మసంగతులకుం బురుషత్వమె హేతువం డ్రికం
గొందఱు దైవ మండ్రు మఱికొందఱు దానిస్వభావ మండ్రు పైఁ
గొందఱు మూఁడునుం గలసికొన్నపుడే ఫలసిద్ధి గాని వే
ఱొందినయప్డు లే దనుచు నుందు రనేకనిదర్శనంబులన్. 280

క. ఇది యిట్టు లనుచుఁ గొందఱు, నిదియిట్టులు కా దటనుచు నిఁకఁ గొందఱు ని
య్యది యిది కా దని కొందఱు, నెదిరిచి కార్మికు లొనర్తు రీవాదములన్.

సీ. సత్వస్థు లగువారు సత్యమా బ్రహ్మమే, కారణ మండ్రు శరీరి కెన్నఁ
దపమె శ్రేయమొసంగు దానికి శమదమం,బులు హేతువులు దానఁ బురుషుఁ డఖిల
కామంబులం బొందఁ గలుగుటయే కాక, బ్రహ్మపదంబును బడయుఁ బిదప
ఋషులు తపంబుననే తేయిఁ బవలును, వేదాధ్యయనము గావించుచుండ్రు

తే. దివ్య మాద్యంతరహితము నవ్యయ మగు
వేదవిద్యను వాగ్రూపవిలసితముగ
నజుఁడు మునుమున్ను సృజియించె నందు ఋషుల
పేళ్లు సృష్టియుఁ గర్మప్రవృత్తు లొప్పు. 282

వ. మఱియు నాత్మసిద్ధియు నధ్యయనము కర్మప్రవృత్తి లోనగునవి శ్రుతులందు వాకొనం బడె జనులదేహపృథగ్భావము కర్మజనితంబై సంసక్తిం జేసి నశించును శబ్దబ్రహ్మ మెఱింగినవాఁడు పరబ్రహ్మంబు నొందు నాకర్ణింపుము 234

సీ. ఆలంభయజ్ఞను లగుక్షత్రియులకు హవిర్యజ్ఞములు వైశ్యవర్గమునకు
బరిచారయజ్ఞముల్ పదజులకొప్పుఁ దపోయజ్ఞములు దగు భూసురులకుఁ
ద్రేతాయుగమ్మునందే యజ్ఞవిధి గాని, కృతయుగంబున లేవో కింతయేని
ద్వాపరంబున విప్లవము నొందు నయ్యవి, కలిలో నభావమె పలుక నొప్పు

తే. ఋగ్యజుస్సామవేదము లిష్టులు విడి, యితరధర్మము లొప్పఁ గృతయుగమ్ము
నందుఁ బుట్టినమానవు లధికనిష్ఠ, చేఁ దపోయోగమున సిద్ధిఁ జెందుచుండ్రు.

తే. త్రేతయందు మహాబలస్ఫీతు లౌదవి, సర్వవిధముల జంగమస్థావరముల
నడరి శాసించువారు వర్ణాశ్రమాధ్వరములు శ్రుతులునుగలసి వేర్వేర యుండు

క. ద్వాపరమున నాయువు కొంతై పోయెను మీఁదిమీఁదు నంటక వేఱై
చూపట్టెఁ గలియుగంబున, నేపఱె ధర్మములు శ్రుతులు నింతింత లగున్. 236

తే. కలి నధర్మపీడితములై క్రతువులు శ్రుతులునునశించునుకృతయుగమున నెసంగు
ధర్మములు శ్రుతమ్ముతపమాత్మజ్ఞతయును, గలుగువారలకడ నిప్పు మెలఁగునింత.

తే. వానకారునఁ బ్రబల మహా వానవలన
నేలపైఁ జెట్లు చేమలు వోలెఁ బ్రతియు
గమున బహువిధధర్మముల్ గలుగు ఋతువు
లందు బలె ధర్మముల్ బ్రహ్మయందును నగు. 238

వ. అనాదినిధనం బగుకాలమె నానావిధవస్తువులం గలిగించు నని చెప్పితి నదియే భూతములఁ బుట్టించునది పెంచునది మ్రింగుచుండునది యగుచుండు నాభూతములు సుఖదుఃఖాదిద్వంద్వము లనుభవించుచు స్వభావమునం బ్రవర్తించు నిది సర్గకాలక్రియాఫలప్రకారం బింకఁ బ్రళయప్రకారంబు చెప్పెద వినుము.

## ప్రలయప్రకారాభివర్ణనము.

తే. అజునిపవలంతమై రాత్రియైనయపుడు, స్థూలమీవిశ్వమును జేసిసూక్ష్మముగ మ
హేశ్వరుఁడు తనలోపల నిముడఁ జేసి,కొనును దద్విధమెల్ల నే వినుతు వినుము.

సీ. దివి ద్వాదశాత్ముఁడు భువి సప్తజిహ్వుఁడు, జాజ్వల్యమానకీలోజ్జ్వలు లయి
ప్రజ్వరిల్లుచు జగత్ప్రచయముం గాల్తురు, స్థావరజంగమాత్మకము లైన
యఖిలభూతములు తదర్చుల దగ్ధమై, భూమిత్వమును బొందు బూదె యగుచు

నప్పుడు నిస్తృణాస్తృతమై యొప్పు ధర కూర్మపృష్ఠంబు రీతిఁ గాన్పించునట్టి

తే. మొదలభూగుణగంధంబు వెడలిపోవఁ, గలియుగంధము వోభూమి ప్రళయమునకు
సమరియుండు నంతట జల మతిశయిల్లి, యావరించు జగంబు నారావ మెసఁగ.

క. జలగుణమునఁ దేజ మొందఁగ, జల మెల్లన్ దేజ మందు సాల్పడి యడఁగున్
వెలుఁగొందు దేజ మప్పుడు, కలసి రవిన్ మంటఁ గలుపు గగనం బెల్లన్. 292

క. జ్యోతిస్సగుణ మగురూపము, వాతము గైకొనఁగ వహ్ని వడి నడవోడగున్
వాతము హోరు రవుచున్ దెస, లాతతగతి నిండి మ్రోయు నాకస మెల్లన్. 293

క. వాయుగుణం బగుస్పర్శము, నాయెడ గగనము గ్రసింప నది చల్లారున్
బోయి నసవసడి నాకస, మాయతముగ మొఱయునట్టిదై యపు డుండున్. 294

సీ. గగన మప్పుడు రూపగంధరసస్పర్శములు లేక మూర్తినిం బొందఁ బోక
నాదసంయుక్తమై నలువొందు నానాదు, నవ్యక్తమున్ వ్యక్తమైనమనము
గ్రసియించుఁ దదాత్మకలితగుణంబుతో, మనమును జంద్రుండు మొనసి మ్రింగు
సంకల్ప మనెడునాచంద్రు నీశుఁడు పెద్ద, కాలమునకుఁ దన్ను గలుపుకొనును

తే. చిత్తము నడంచు సంకల్ప ముత్తము మగు
జ్ఞాన మద్దియె కాల మద్దాని మ్రింగు
బలము కాలముఁ గాలము బలము మ్రింగు
విద్య కాలమున్ వశము గావించుకొనును. 295

వ. అట్టివిద్య గలిగినవిద్వాంసుండు ఆకాశనాదమును దనలో నిమిడించుకొను నది యవ్యక్తంబును శాశ్వతంబు నగుపరబ్రహ్మం బిట్లు సర్వభూతంబులును బ్రహ్మమందు లీనం బగు నని జ్ఞానదృష్టిం జేసి యోగు లెఱుంగుదు రిట్లు విస్తారసంక్షేపంబు లంది పరబ్రహ్మమే సృష్టివిలయంబులం బొందుచున్న దిఁక బ్రాహ్మణకృత్యంబులం జెప్పెద విను మని వ్యాసుం డెండియు. 296

సీ. విను జాతకర్మప్రభృతిసమావృత్తిపర్యంతకర్మములు వేదాంగవేత్త
యైన యాచార్యునిచే నెఱి ధన మిచ్చి, చేయించుకొనియును బాయ కెపుడు
శుశ్రూష చేయుచు శ్రుతు లెల్ల నధ్యయనము చేసి గురుఋణంబు దీర్చి
మఖముల నెఱిఁగి సమావర్తనము చేసి, యవల నాచార్యులయనుమతి గొని

తే. యాశ్రమచతుష్కమున నొక్కఁ డైనదాని
నొంది మేన్ దెగువఱకుఁ దా నంద యుండి
తత్తదనుకూలధర్మముల్ తగ నొనర్చి

మనుజుఁ డగుదానికి ఫలంబు గొనఁగ వలయు. 297

తే. బ్రహ్మచర్యంబు గాని గార్హస్థ్యమైనఁ, గాని వనులన్నివాసము పూని చేసి
గానియతిధర్మమును గాని మానవుండు, పొందిచరితార్థుఁడగునని చెప్పు శ్రుతులు.

సీ. ఆశ్రమంబుల గేస్తుఁ డధికుఁ డాతఁడు దాంతుఁడై సర్వతీర్థుల నంటఁ గలఁడు
యజ్వయై శ్రోత్రియుఁడై ప్రజావంతుఁడై, మూఁడుఋణంబుల ముక్తుఁ డగును
గార్హస్థ్యకర్మము లర్హక్రియం దీర్చి, తక్కునాశ్రమముల నందఁగ వలయు
మఱియును ధరనుత్తమములైనకర్మముల్, పూనియుత్తమకీర్తిఁ బొందవలయుఁ

తే. దపము చేతను విద్య చేతను మఖంబు,చేత దానంబు చేతను క్షితిసుజనుండు
యశమునార్జింప వచ్చునయ్యశము జగతి,నిలుచునందాఁక వానికిఁగలుగుసుగతి

## దానప్రభావాభివర్ణనము.

వ. యజనయాజనాధ్యయనాధ్యాపకదానప్రతిగ్రహము లాఱును బ్రాహ్మణకర్మ ములిందు యాజనాధ్యాపకప్రతిగ్రహములవలన సంప్రాప్తం బగుధనంబున యజ్ఞ దానంబు లొనర్ప వలయుం గాని దా నొక్కరుండ మెక్క నొప్పదు మఱియు దేవర్షిపితృగుర్వర్థంబును వృద్ధాతురక్షుధితారిపీడితార్థంబు నార్జితార్థం బొసం గుట యుత్తమధర్మంబు తొల్లి ప్రహ్లాదుండు కాశ్యపున కుచ్చైశ్శ్రవమను నశ్వరాజంబు నిచ్చి యశంబు గాంచె శుక్రుండు తనప్రాణం బిచ్చి బ్రాహ్మణ ప్రాణంబు గాపాడి దివంబు నొందె సాంకృత్యుం డగురంతిదేవుండు వసిష్ఠున కపఃప్రదానంబు చేసి నాకపృష్ఠంబు నొందె నాత్రేయుం డింద్రదమనునికి వివి ధార్థంబు లొసంగి యుత్తమలోకంబు లొందె నౌశీనరుం డగుశిబి బ్రాహ్మ ణార్థము తనశరీరంబు నౌరసపుత్రగాత్రంబునుం గోసి యిచ్చి నాకంబు నొందెఁ గాశిపతి యగుప్రతర్దనుం డొక్కబ్రాహ్మణునకుఁ దననేత్రంబులు పెఱికి యిచ్చి మహాయశంబు గైకొనియె దేవావృధుం డష్టశలాకంబును సౌవర్ణంబు నగు దివ్యచ్ఛత్రంబు నిచ్చి రాష్ట్రజనులతో దివ్యపదంబు నొందె నాత్రేయుం డగు సాంకృతిశిష్యులకు నిర్గుణబ్రహ్మ ముపదేశించి యుత్తమలోకంబు నొందె నంబ రీషుం డుత్తమబ్రాహ్మణులకుఁ బదునొకండర్బుదముల గోవుల నిచ్చి నిజరాష్ట్ర జనులతో స్వర్గంబునకు నిర్గమించె సావిత్రి తనదివ్యకుండలంబులును జనమే జయుండు నిజశరీరమును బ్రాహ్మణార్థము పరిత్యజించి పరమపదంబు నొందిరి వృషాదర్భిపుత్త్రుం డగుయువనాశ్వుండు సర్వరత్నసమంచితంబును బ్రియస్త్రీ జనరమ్యం బగుతనమందిరంబు దానంబు చేసి స్వర్లోకంబు నొందె వైదేహుం

డగునిమి రాష్ట్రంబును జామదగ్న్యుండు వసుంధరను గయుండు నిజదేశంబును విప్రుల కొసంగి సుగతిం గాంచి రనావృష్టిం జేసి ధరాతలంబు మలమల మాడుచున్నపాడుకాలంబున వసిష్ఠుండు తనతపఃప్రభావంబున నెల్లప్రాణికోటులం బ్రదికించి సుగతిం గాంచెఁ గరంధమసుతుం డగుమరుతుం డంగిరసునకుఁ గన్య నిచ్చి దివంబు నొందెఁ బాంచాలదేశాధీశుం డగుబ్రహ్మదత్తుండు బ్రాహ్మణులకు శంఖనిధి యొసంగి యుత్తమలోకంబు లొందె మిత్రసహుం డనురాజు వసిష్ఠునకు దమయంతి యనుతనభార్య నొసంగి తా నామెతో స్వర్గంబు నొందె సహస్రజిత్తనురాజర్షి తనప్రాణంబులు బ్రాహ్మణార్థము పరిత్యజించి యుత్తమలోకంబు లొందె శతద్యుమ్నుం డనుమహీపతి ముద్గలునకు సర్వకామసంపూర్ణంబును హిరణ్మయంబు నగువేశ్మంబు నొసంగి నాకంబు నొందె సాళ్వదేశాధీశుం డగుద్యుతిమంతుండు ఋచీకునకు రాజ్యం బొసంగి స్వారాజ్యంబు నొందె మదిరాశ్వుం డనురాజర్షి హిరణ్యహస్తునకుఁ గన్య నొసంగి దేవస్తుతలోకంబులం బొందె లోమపాదుండు ఋష్యశృంగునకు శాంత నిచ్చి సర్వకామంబులం బొందెఁ బ్రసేనజిత్తు శతసహస్రగోదానంబులు చేసి యుత్తమలోకంబు లొందె మఱియు ననేకు లనేకదానంబులచేతను దపోనియమంబులచేతను జితేంద్రియులు మహాత్ములునై స్వర్గాదిలోకంబు లొందిరి వారికీర్తి ధరిత్రి గలంతకాల ముండు నని పారాశర్యుండు వెండియును. 300

సీ. వేదోక్త మగుత్రయీవిద్య నంగములతోఁ, దెలియఁగ వలయు నది ఋగ్యజుస్సు
లును సామము నథర్వ మనునాలుగింటఁ బెంపలరుషట్కర్మములందు నెసఁగు
వాఁడు సత్త్వుం డగు వానియందే వేదవేత్తలు నధ్యాత్మవేత్త లధిక
సత్వోపమేతులై సర్వజగత్సృష్టియును లయంబు నెఱింగి యుండు రెడఁద

తే. నిష్టధర్మములను బూని యెపుడు శిష్టవర్తనం బాశ్రయింపఁగా వలయు మఱియు
భూతసంశోధ మొనరింపఁబోకద్విజుఁడు, మంచివృత్తినిఁ గైకొనిమనఁగ వలయు.

తే. సజ్జనులు శాస్త్రమును దన కొజ్జలుగను, జ్ఞానియును శిష్టుఁడై పరం బైనతనదు
ధర్మమును విడనాడక కర్మషట్కమున మెలంగెడు నాతఁడె భూసురుండు.

తే. ధైర్యశాలియు దాంతుండు ధర్మవేత్త
యప్రమత్తుఁడునై క్రోధహర్షమదము
లను విడినబ్రాహ్మణున కెన్నఁడును బొసంగఁ
బోవ దేలోపము నటంచుఁ బోలుఁ దెలియ. 303

సీ. దాన మధ్యయనంబు తపము యజ్ఞము హ్రీయు, నార్జవంబును దమ మలరు నేని
తేజోభివృద్ధి యగాఁ దెగి పోవు పాపముల్, పాపహీనుం డయి ప్రజ్ఞ గలిగి
విజితేంద్రియుఁడు లఘువిధభోజనుం డై నఁ, గామలోభాదులఁ గడకుఁ ద్రోలి
బ్రహ్మపదంబును బడయఁగా జతనింప, నగు విప్రపూజయు నగ్నిపూజ
తే. దేవతార్చన మొప్పు భూదేవునకును, హింసయు నసత్యవాదము నెపుడు విడిచి
నట్టివృత్తియే ద్విజునకు నెట్టినాఁడు, విధివిహితధర్మములు నాఁగఁ బెద్ద లండ్రు.

తరణోపాయకథనము.

క. తను జ్ఞాని యయ్యుఁ గర్మము,లను బొనరిచి కాని సిద్ధులం బొందఁగ లేఁ
డని శ్రుతులు దెలుపుఁ గావునఁ,బొనరుపఁ దగువిహితకర్మముల బుధుఁ డెపుడున్.

క. విను పంచేంద్రియసలిలం,బును ఘోరము లోభమూలమును దుస్తరమున్
ఘనమన్యుపంకమున్ భీ, జనకం బగుసంసృతినది జ్ఞాని తరించున్. 306

క. త న్నెదురుకొనియెఁ గాలం, బున్నది యని తెలియ వలయు నురువిధి బలసం
పన్నము స్వభావనది వడి, నెన్నఁగ నీజగము నడచు నెక్కాలంబున్. 307

సీ. వత్సరావర్తము పక్షోలపత్రణంబు, మాసభంగమ్ము సముంచితఋతు
వేగ మహోరాత్రవితతజలము నిమేషోన్మేషఫేన మత్యుగ్రకామ
నక్రము వేదయజ్ఞప్లవమును ధర్మ, కార్యాంతరీపము కామఘనర
సస్రావమున్ దానసత్యవాక్తీర మహింసాతరుప్రవాహోద్ధగుణము
తే. యుగమహాహ్రదమును గల్గి యొప్పుచున్న, కాలవాహిని బ్రహ్మముకరణి దా న
నాదియై ధాత సృష్టించునఖిలభూత,ములను బొందించుయమపురమునకు నెపుడు.

ఉ. ధీరులు దాని ప్రజ్ఞ యను తెప్పను గైకొని దాఁటి పోదు రా
దారి యెఱుంగ కజ్ఞులు పృథాపృథగా నలకాలవాహినిం
బోరన కూలి పోవుదురు పో యన నేటికి దేప లేనివాఁ
డూరక వెల్లువం బడిన నొడ్డును జేరుకొనంగ నోపునే. 309

క. గుణదోషములను బ్రాజ్ఞుఁడు, గణుతింపం గలఁడు దూరగతుఁ డయ్యును దు
ర్గుణచిత్తుం డప్రాజ్ఞుం, డణుమాత్రము దాఁటఁ జాలఁ డాకులమతి యై. 310

సీ. జ్ఞానప్లవము లేనిజనుఁడు మహాదోష,భరముచే మున్నీటఁ బడి మునుంగు
జ్ఞానప్లవము గల్గి తా నుండియుం గాము, నక్రగృహీతుఁడై నది మునుంగు
నదిగానఁబండితుండగు వాఁడు తెలివిమై, మునుఁగకుండు ప్రయత్న మొనరుపనగు
నరయ బ్రహ్మజ్ఞాని యగువాఁడె దీనిని, దాఁటి పోవం జాలు ధైర్యశాలి

ఆ. యాజనప్రతిగ్రహాధ్యాపనములను, మాని యధ్యయనము దానము యజ
నం బొనర్చునట్టినరుఁడు దాఁ బ్రజ్ఞాబ,లమునఁ జేసి దీని లలిగ దాఁటు. 311

తే. గృహి యసూయయుఁ గోపముఁ గెడపి పంచ
యజ్ఞము లొనర్చుచున్ విఘసాశి యగుచు
సజ్జనుం డయి శిష్టుఁడై సత్క్రియలను
సలుపుచుండంగ వలయును సంతతంబు. 312

చ. ఒకనికి హాని లేనిగతి నొప్పు చగర్హితమైనవృత్తిమై
సుకలుఁడు వేదశాస్త్రహితశుద్ధచరిత్రుఁడు శిష్టమార్గగుం
డకలుషుఁడై స్వధర్మమునయందు మెలంగుచు ధూతపాపుఁడై
సుకృతము లొందఁ గల్గెడిని సూనృతకర్మము లాచరించుచున్. 313

క. జ్ఞానియుఁ గర్మము లొనరిచి, తా నందున్ సుగతి ధర్మతత్పరుఁడై య
జ్ఞాని యధర్మ మధర్మము, లో నెంచియు ధర్మకృతికి లోఁబడు నెపుడున్. 314

వ. అట్టివానికి జననమరణంబులుసంప్రాప్తంబు లగుచుండు నని వ్యాసుండువెండియు.

మ. జను లీకాలనదీప్రవాహమున నిచ్చల్ మున్గుచుం దేలుచున్
వనటన్ జెందుచునుండ్రు పండితులు భాస్వత్ జ్ఞానకోలంబు కై
కొని దానిం దరియించి తా రితరులం గూడం దరింపంగఁ జే
యు నెఱిం గల్గి మెలంగుచుందు రని నీ వూహింపు మోపుత్రకా. 316

క జ్ఞానప్లవముం బొందని, మానవు లేనాఁటికేఁ దమరు దరియింపం
గానని చోఁ బెరవారల, నేనెఱిఁ దరియింపఁ జేయ నేతురు చెపుమా. 317

వ. ముక్తసంగుండైనముని దేశము ధర్మము ననురాగము నర్థము నుపాయము
నపాయము నిశ్చయము చక్షువు నాహారము సంహారము మనస్సు దర్శనము
ననుద్వాదశవిధయోగముల నభ్యసించుచు నుత్తమజ్ఞానము వడసి మనో
బుద్ధుల నరికట్టవలయు నిట్టియోగంబుల నెఱింగిన పురుషుండు వేదం బెఱిం
గిన నెఱుంగకుండిన ఋజువర్తనం బుండిన లేకుండిన ధార్మికుం డైనఁ గాకుం
డిన మహాదుర్గం బగుజరామరణసాగరంబు తరించు నని మఱియు. 318

సీ. దేహస్థజీవమే దివ్యరథము దాని, కమరుధర్మ ముపస్థక మగుఁ ద్రపయె
పరఁగువరూథ ముపాయ మపాయము, నటఁ గూబర మపాన మక్ష మందుఁ
బ్రాణంబు యుగము ప్రజ్ఞాయువుల్ జీవబం,ధమ్ము చేతన బంధురమ్ము సదమ
లాచారమే నేమి యాదర్శనస్పర్శనములు ఘ్రాణశ్రవణములు రథ్య

తే. ములును బ్రజ్ఞ నాభియుఁ దంత్రములు బ్రతోద
మమలవిజ్ఞానమే సారథి యగుచు నలరు
నందు క్షేత్రజ్ఞుఁడు రథి యై యమరఁ ద్యాగ
దమములన్ శ్రద్ధయుఁ బురస్సరములుఁ గాఁగ. 319

వ. శౌచగమ్మును ధ్యానగోచరమ్ము నగునద్దివ్యరథమ్ము బ్రహ్మలోకమ్మునకుం బోయి విరాజిల్లుచుండు మఱియు నక్షరం బగుగమ్యస్థానముం జేరఁ బ్రపంచకారణ్యమార్గమున శీఘ్రగతిం గలిగి పోవువిధంబు రథచోదకుండు తెలిసి యుండం దగు నట్టియుపాయముం జెప్పెద వినుము 320

ఉ. ధారణ నా మనంబు నొకదానియెడం నిలుపంగఁ జేయుటే
ధారణ సప్తరీతుల నుతం బగు దానిని వాగ్యతుండు నై
ధీరత యోగి పొంద నగు దీనఁ గ్రమంబునఁ భూతబుధ్యహం
కారములన్ వశంబునను గైకొనుచుం బరమాత్మ నెంచెడున్. 321

యోగసాంఖ్యప్రకారకథనము.

వ. యోగులు యోగంబులం జేసి పొందువిభ్రమంబులును యోగసిద్ధియుం జెప్పెద వినుము. 322

క. యోగి యగువాఁడు తన మే, నేగినపైఁ దనదునాత్మ కేరూ పగునో
యేగతి గలుగునో సూక్ష్మ, త్యాగములఁ బట్టి దాని నరయం జాలున్. 323

సీ. స్థూలదేహము విడ సూక్ష్మమై జీవుని, కగురూపు శిశిరర్తు వందు ధూమ
సంశ్రయం బగునాకసము వోలె దీపించు, నంతలో నది వోవ నాతఁడు హృద
యాకాశమున జల మట్టిరూపము నొందు, నది నశించిన వెన్క నగ్నిరూప
మరయంగ వచ్చు నయ్యదియుఁ బోవాతరూ,పముదోచు నదియును బాయునంతఁ

తే. బచ్చ నగుశస్త్రముం బోలి పరిధవిల్లు, నదియుఁ జెడ సాలెపట్టునానమువెనుక
నాకసమువోలె ధావళ్యమతిశయిల్లు, సూక్ష్మతను గాంచి దీపించుఁ జోద్యముగను.

వ. ఇట్లు నానావిధరూపంబు లందునప్పుడు గలవిశేషము లెఱింగించెద నాకర్ణింపుము.

సీ. పార్థివం బైనరూపమునఁ బ్రజాపతి, యన బ్రజల సృజించుఁ దనదుమేన
ననిలరూపంబున హస్తపాదాంగుష్ఠ,ముల భూమి కంపింప నలుపఁ గలుగు
నాకాశభూతుఁ డై యాకాశసదృశుఁ డై, వెలుఁగొందుఁ గనరానివిధ మెసంగ
జలరూపమున నదుల్ సంద్రంబులు తటాక,ములు గబళించెడుపోలుపు గాంచు

తే. నగ్నిరూపము గాంచినయతఁడు చూడ, నలవి గానట్టితేజుచే వెలసి మరల
నగ్నిఁ జల్లార్చుకొనినపై హరువు గాంచు, నని వచించెద రాత్మజ్ఞు లాత్మజన్మ.

తే. తనయహంకారమును గెల్చితనరు యోగి, పంచభూతములను వశపఱచుకొనును
భూతములకు నహంకారమునకు నాత్మ, యైనబుద్ధి జనించెనే నధికుఁ డగును

వ. అతఁడు వ్యక్త మవ్యక్త మగుపరమాత్మం గలియు నవ్యక్తమునుండి ప్రపంచము వ్యక్త మగు సాంఖ్యంబునం జెప్పిన ట్లావ్యక్తవిషయముం జెప్పెద వినుము. 328

సీ. యోగసాంఖ్యములందు నొకరీతిగాఁ బంచ, వింశతితత్త్వముల్ పేర్కొనఁ బడు
జననంబు వృద్ధియు క్షయమును గలయవి, వ్యక్తముల్ లేని వవ్యక్తము లగు
శ్రుతులందు సిద్ధాంతగతులందు నాత్మలు, రెండని పొలుపొందుచుండు నందు
జీవాత్మధర్మార్థభావ మపేక్షించు, నయ్యది వ్యక్త మవ్యక్తభవము

తే. మఱియు వేదోక్త మయినయాత్మద్వయంబు
విషయరాగమున జనించువిధము దోఁచు
విషయవిముఖత సాంఖ్యులవితతమైన
మత మటంచు నెఱుంగుమీ మహితబుద్ధి. 329

వ. నిర్మముండు నిరహంకారుండు నిర్ద్వంద్వుండు నిస్సంశయుండు నై యొకరిపైఁ గోపింపక యొకరిని ద్వేషింపక యనృతం బెన్నఁడు గాని తనవాక్కునం దాఁకనీక యొరులు కొట్టినం దిట్టిన నాక్రోశింపక సర్వప్రాణులయెడ మైత్రి గలిగి యెపుడు నశుభంబు దలంపక హింసావాక్పారుష్యంబులు విడిచి సర్వభూతసముం డైనవాఁడు బ్రహ్మంబు నొందు మఱియు నిచ్ఛాద్వేషములు లేక జీవయాత్రమాత్రము నిర్వర్తించుకొనుచు వ్యథ యెఱుంగక యలోలుపుండును దాంతుండును విహితకర్మప్రవర్తకుండు నేకాగ్రచిత్తుండు నవిక్షిప్త మనోరథుండు సమలోష్టకాంచనుండు తుల్యప్రియాప్రియుండు తుల్యనిందాస్తుతియు బ్రహ్మచర్యదృఢవ్రతుండు నైనచో సాంఖ్యమతానుసారంబుగ ముక్తిం గాంచు యోగాభ్యాసమున నీశ్వరత్వ మతిక్రమించినవాఁడును ముక్తుఁ డగు సంసారసాగరంబునం బడి మునిఁగి తేలుచుండువాఁడు నాత్మ శాంతి నెఱింగి జ్ఞానప్లవంబున దానిం దరించి ముక్తుం డగు ననిన శుకుండు తండ్రి కి ట్లనియె.

ఆ. అట్టిజ్ఞాన మేది యది తత్త్వముం దెల్పు, విద్య యగునొకో ప్రవృత్తిలక్ష
ణమొ నివృత్తిధర్మసము పేతమో నాకుఁ, దెలియఁ జెప్పు మనఘ తెల్లముగను.

పరబ్రహ్మప్రాప్తిసాధనప్రకారము.

వ. అనిన వ్యాసుం డి ట్లనియె. 332

చ. జగము స్వభావజం బయి యెసంగును దానికి మూల మెద్దియుఁ
దగుల దటంచు వాదము లొనర్చుచుఁ బ్రజ్ఞ మెయిఁ స్వవాదముల్
తెగి చనకుండు హేతువులు దెల్పుచు సన్మను లాడువాక్యముల్
దెగువ వినం దలంపనియధీరులు శ్రేయము లొంద రెన్నఁడుఁ. 333

వ. సమస్తవస్తువులును స్వభావజంబు లనియు స్వభావంబున వ్యస్తంబు లయ్యుఁ బూర్వగుణంబులం గలుగుచుండు ననియు నుభయమతంబు లగువానిం జెప్పెద నాకర్ణింపుము. 334

సీ. ప్రాజ్ఞులు భువి దున్ని పైరులం బెట్టి వానిని గ్రహించుటయు నాసనము శయన
మాలయయానాదు లందుటయును రోగములకౌషధంబులు సలుపుటయును
మున్నగువానిని బొనరించుచుందురు, ప్రజ్ఞ తదర్థసంపాదనమున
కును శ్రేయ మందుటకును హేతు వగుచుండు, బ్రజ్ఞ కుందగునట్లు రాజవరులు
తే. భోగములఁ బొందుచుందురు భూతసృష్టి
గతియు హెచ్చుకుందులు విద్యకలిమిఁ దెలియుఁ
బ్రాణులు చతుర్విధములు జరాయుజాండ,
జములు నుద్భిజ్జములు స్వేదజములు నాఁగ. 335

ఆ. స్థావరములకంటె జంగమంబులు విశిష్టమ్ము లగుచు జంగమమ్ములు బహు
పాదము లనియును ద్విపాదము లనియును, రెండుతెఱఁగు లగుచు నుండుజగతి.

సీ. ఉత్తమంబులు బహుపాత్తులకంటె ద్విపాత్తు లయ్యవి పార్థివమ్ము లనియు
వైహాయసము లని ద్వైవిధ్యముం గాంచు,వానిలో నుతి గాంచుఁ బార్థివమ్ము
లయ్యవి నానావిధాన్నముల్ భుజియించు, నం దుత్తమములు మధ్యమములనఁగ
ద్వివిధముల్ జాతిధర్మములొనర్పుటఁ జేసి,మహిమఁ గాంచిన వయ్యె మధ్యమములు
తే. మధ్యమము లిరుగతులు ధర్మజ్ఞము లిత
రము లనంగ ధర్మజ్ఞము లమలకార్య
మును నకార్య మెఱుంగుటఁ బుడమియందు
నుత్తమములునాఁ బేర్పొంది యుండు నెపుడు. 337

వ. ఆధర్మజ్ఞములు వేదజ్ఞములు నవేదజ్ఞము లని రెండువిధము లందు వేదజ్ఞము
లుత్తమములు వేదజ్ఞములలోఁ బ్రవర్తకములు నితరములు నని రెండువిధ

ములు ప్రవర్తకములు సర్వధర్మోపదేశంబునం జేసి విశిష్టములు వారు వేదములను
ధర్మముల నెఱింగి ఫలసహితకర్మముల నుపదేశింతు రా ప్రవక్తలు నిరుదెరం
గులు నాత్మజ్ఞములు నితరము లని యాత్మజ్ఞములు జననమరణతత్త్వమెఱుంగుట
నుత్తమములు ధర్మద్వయము నెఱింగినవాఁడు ధర్మజ్ఞుఁడును సర్వవేత్తయును
త్యాగియు సత్యసంకల్పుఁడు బ్రహ్మజ్ఞానసంపన్నుఁడు నీశ్వరుఁడు నగువానినే
దేవతలు బ్రాహ్మణుఁ డని చెప్పుదురు. 338

ఉ. ఏరు శ్రుతుల్ పఠించి పరమేశ్వరతత్త్వ మెఱింగి లోఁ బయిన్
దిరినయాత్మరూపమును దెల్లముగాఁ దలపోసి యుందురో
వారె ద్విజోత్తముల్ మఱియు వారె సుపర్వులు వారియందె యీ
ధారుణి యంతయున్ నిలుచు వారిమహత్త్వ మనంత మారయన్. 339

ఆ. మఱియు వారు జననమరణాదికర్మ్ములను నతిక్రమించియును జతుర్వి
ధంబు లైనభూతతతుల కీశ్వరులై స్వయంభువునకు సాటి యగుచు నుండ్రు.

క. తొల్లిటినుండియు బ్రాహ్మణ, తల్లజులకు నిట్టివృత్తి తగ విహితం బై
తెల్లం బయ్యెనె కర్మము, లెల్లన్ జ్ఞానియును జేసి యొసకం బెసఁగున్. 341

ఆ. కర్మసంశయంబు గలుగకుండిన సిద్ధి, పరఁగుఁ గర్మగతిస్వభావ మెట్టి
దనిన వినుము జ్ఞానమునకు సాధన మైన, కర్మ మది పొనర్పఁ గడఁగవలయు.

సీ. తలఁపఁ గర్మములకు దైవము కారణ, మని కొందఱును కొంద ఱట్లు కాదు
పౌరుష మనియు స్వభావమే యనికొంద, ఱును మూఁడుఁ గారణమనియుఁ గొంద
ఱంద్రు సమష్టియు వ్యష్టియుం జెప్పుదు, ఱెల్ల యీ నని కొంద ఱట్లు కాద
యని కొంద ఱందఱు సన్నివిధంబుల, ననుచుండెదరు యోగు లైనవారు

తే. బ్రహ్మమునకె హేతుత్వము పలుకుచుంద్రు
మఱియుఁ ద్రేతాదియుగముల మానవులకు
సంశయం బగుఁ గృతయుగజను లసంశ
యులు తపస్వులు శాంతులు నలఘుమతులు. 343

ఉ. వేదములం బృథక్త్వమును వీడి యొడందఁ బృథక్కరించి క్రో
ధాదుల సత్తపోనియమమందు సునిశ్చితులై పొనర్చుచుం
గాదన కెల్లకోర్కులను గల్గి కృతాదిజనుల్ తపక్క్రియా
పాదితసృష్టిశక్తిమెయి భాసిలుచుందురు భూతనాథు లై. 344

క. వేదముల నున్న బ్రహ్మము, వేదవిదుల్ తెలియ లేక వెగడొందుదు రా

వేదాంతవేద్య మయ్యది, కా దింతయుఁ గర్మయోగగతి వేద్యం బై. 345

తే. క్షత్రియులకు నారంభయజ్ఞములు వైశ్యు
లకు హవిర్యజ్ఞములు శూద్రులకు ద్విజపరి
చర్యయజ్ఞముల్ భూసురజాతికి జప
యజ్ఞములు ధర్మములు నాఁగఁ బ్రాజ్ఞు లండ్రు 346

క. తెలియఁగ వేదాధ్యయనము, సలిపినవాఁడే ద్విజుండు సత్కర్మములన్
సలిపిన సలుపక యుండిన, వెలసిన దే భూతమైత్రి ద్విజుఁ డనఁ బరఁగున్ 347

వ. త్రేతాయుగంబున వేదములు యజ్ఞములు వర్ణాశ్రమంబులుం గలిసియుండు నవి ద్వాపరంబునఁ బ్రజ లల్పాయువు లగుటం జేసి విభక్తంబులై క్షీణదశకు వచ్చి నవి కలియుగంబున వానికి విప్లవంబై హాని వాటిల్లినది మఱియు నీయుగంబున. 348

సీ. వినుమి యధర్మప్రపీడితులై ప్రజల్, తనుతమధర్మముల్ తలఁగఁ ద్రోతు
రావులున్ భూమియు నప్పు లోషధులును, రసవిహీనంబులై పస దొఱంగు
వేదధర్మంబులు వేదముల్ వర్ణాశ్రమము లధర్మాంతర్హితముల యగును
స్వస్వధర్మములను జంగమస్థావరములు వీడి వికృతులం గలిగి యుండుఁ
తే. పార్థివము లెల్ల భూతముల్ వర్షమునను
వర్ధిలెడునట్లు శ్రుతులచే వానియంగ
ములు ప్రతియుగంబునందుఁ బెంపలరుచుండుఁ
గాలనానాత్వ మీరీతిఁ గ్రాలుచుండు. 349

వ. కాలమే సర్వప్రపంచంబునకు స్థానంబును బాలకంబును భూతజాతంబు దీనం జిక్కి ద్వంద్వంబులకుం దక్కి దీని ననుసరించి వర్తించుచుండు ననిన శుకుండు మోక్షధర్మవిధం బెఱుంగం గోరి కృతప్రజ్ఞుండు ననసూయకుండు నగువాఁ డనాగతంబు ననైతిహ్యంబు నగుబ్రహ్మము నెట్లు తెలియం జాలుఁ దపము బ్రహ్మచర్యము సర్వత్యాగము బుద్ధి సాంఖ్యము యోగము ననువానిలో నెద్ది యుత్తమము మనస్సునకు నింద్రియములకు నేకాగ్రత యేయుపాయంబునం బట్టుపడు నెఱింగింపు మనిన వ్యాసుండు వెండియుఁ. 350

క. ఘనతప మింద్రియనిగ్రహమును విద్యయు సర్వసంగములత్యాగంబుం
గాని కాని యొండుపాయంబున సిద్ధిం బొందు టరిది పురుషున కవనిన్. 351

సీ. బ్రహ్మసృష్టము లగుపంచమహాభూతములు ప్రాణభృద్గ్రామముల నెసంగు

భూమినుండి శరీరమును జలంబుననుండి, సుస్నేహమున్ మహాజ్యోతినుండి
చక్షుస్సులున్ నభస్వంతునినుండి ప్రాణము నపానము ననంతముననుండి
శ్రవణరంధ్రములు సమకురుచుండును, నడలందు విష్ణువు నాల్క వాణి

తే. కరములందు నింద్రుండు నుదరమునందు
నగ్నియును శ్రోత్రములయందు నఖలదిశలు
పరఁగుచుండ జ్ఞానేంద్రియపంచకంబు
వానివిషయముల గ్రహించు ద్వారము లగు. 352

వ. శబ్దస్పర్శరూపరసగంధము లనునింద్రియార్థము లైదు నింద్రియములకంటె
భిన్నంబు లై యుండు నని యెఱుంగం దగు 353

క. మన మింద్రియముల నియమించును వాజుల రౌతు వోలె సురుగఁగ నీఁ క
మ్మనమును హృదయాశ్రిత మై, చనుబుద్ధియు నిలువరింపఁ జనుఁ దనుజన్మా.

వ. మఱియు నింద్రియములు నింద్రియార్థములు స్వభావము చేతన మనము
ప్రాణాపానములు జీవుఁడు నెల్లప్పుడు దేహులదేహంబులందుఁ బొందుపడి
యుండు సత్వరజస్తమోగుణములు గలప్రకృతి బుద్ధి కాశ్రయము గాని శరీ
రము నాత్మయు నాశ్రయములు కా వని యెఱుంగుము. 355

క. పదియాఱు గుణంబులతోఁ, బదియేడవవాఁడ యైన పరమాత్మునిఁ గో
విదుఁడు జితేంద్రియుఁ డై నెమ్మదిఁ జూడం గలఁడు తనదుమహితాత్మనొగిన్.

సీ. ఆయాత్మ కందోయి కారయంగా రాని, దింద్రియగోచర మేని కాదు
దీనిరూపం బయి దీపించుమనముచే, నయ్యది తెలియంగ నగుచునుండు
శబ్దము రూపము స్పర్శము రసము గం,ధము నింద్రియములు దేహమును లేక
యవ్యయం బై మేనులందుఁ గానంబడు, జంగమస్థావరసర్వభూత

తే. సంతతులయందు నవ్యక్తసరణినొప్పు, మర్త్యులందు సువ్యక్త మై మహిత మగును
నెవ్వఁడీవిషయం బెల్ల నెఱుఁగఁగలఁడో, వాఁడు బ్రహ్మమయగుననవలయుఁజూవె.

తే. విద్యయుం గులమును గలవిప్రునందు, గోవునందును గజమందుఁ గుక్కయందుఁ
గుక్కఁదినువానియందునునొక్కరీతిఁ, బండితుల్ సమదృష్టిమైఁబరఁగుచుంద్రు.

క. తనయందు సర్వభూతం,బును దా నాసర్వభూతములయం దెపుడున్
దనరఁట తెలియం జాలెడు, ననఘుఁడు బ్రహ్మంబ యనుచు నలరుఁ గుమారా.

ఆ. వేదవేత్త యగుచు వెలసినయాత్మయం,దెంతమహిమ గలదో యంతమహిమ
యప్పరాత్మయందునలరారుననియెఱిం,గినయతండమృతుఁడనియెఱుఁగుము

ఆ. అఖిలభూతములకు నాత్మభూతుం డయి, యఖిలభూతములకు నతిహితుండయి
బ్రహ్మపదముఁ గోరుబ్రాహ్మణుమార్గము, నరయ లేరు వేల్పు లైనఁ గాని 361

ఆ. నింగిఁ బక్షిగతియు నీట మత్స్యముగతి, యెఱుఁగ రాని దగుచు నెట్లుపంగు
నట్లుజ్ఞానవంతుఁ డైనపూరుషుగతి, యెఱుఁగ రాని దగుచు నెసక మెసఁగు.

సీ. కాలంబు పచియించు లీల భూతంబుల, నది పవనం బోట నరయ రెవ్వ
రదిక్రిందమీఁదమధ్యమునఁ బ్రక్కల లేదు, దానిలోలోకముల్ దాఁగియుండుఁ
దద్బాహ్య మిది యని తలఁప రా దెవియు సుఁజ్యుతం బైనబాణంబురీతి
నది మనోవేగము నంది పోవుచు నుండు, సూక్ష్మంబుకన్నను సూక్ష్మతరము

తే. స్థూలమునకన్న స్థూల మాకాల మెన్న, సర్వతఃపాణిపాదము సర్వతోక్షి
శీర్షవదనశ్రవణ మై ప్రకర్ష మొంది, సర్వమును నావరించి ప్రశస్తి గాంచు.

తే. అఖిలభూతాంతరగతంబు నయ్యు నద్ది
క్షరము నక్షర మనుభావకలన నొప్పు
క్షరము సర్వభూతములందుఁ గలుగునదియు
నక్షరము దివ్య మమృత మై యలరునదియు. 364

వ మఱియుం గాలము సర్వభూతంబులకుం బ్రభువై స్థిరమై నిష్క్రియమై నిర్గు
ణమై యుండి నవద్వారపురముం జొచ్చి హంసరూపంబు నొంది హానిభంగా
దులు గలిగి క్రియాయుక్తమై కూటస్థ మగునక్షర మనం బడు నట్టియక్షర
స్వరూప మెఱింగిన ప్రాజ్ఞుం డక్షరుండై జన్మరాహిత్యము నొందు నింక యోగ
ప్రకారముం జెప్పెద వినుము. 365

తే. మనము నింద్రియములు బుద్ధి మఱియు నాత్మ
వూని యొకచోట నిల్పుటే జ్ఞాన మగును
దాని నధ్యాత్మశీలియు దాంతుఁ డైన
పురుషుఁ డెఱుగంగఁ జాలెడు వరకుమార. 366

క. విను మతఁడు యోగదోషము, లనఁబడు కామంబు క్రోధ మతిలోభము భీ
యును స్వప్నంబును నేనిం, టిని విడనాడంగఁ దగుఁ గడింది మగఁటిమిన్. 367

సీ. శమముచేఁ గ్రోధము సంకల్పశూన్యత,చేఁ గామమును సత్త్వసేవవలన
నిద్ర జయింప నౌ నెఱిమీఁదుధైర్యంబు,వలన శిశ్నోదరములను దృష్టిఁ
బాణిపాదములు గాపాడుకొనం దగు, మనముచే దృక్శ్రోత్రములను సుకర్మ
మున మనోవాక్కులఁ బొనరించుకొన నొప్పు, నప్రమాదమున భయంబుఁ బ్రాజ్ఞ

తే. సేవచే దంభమును దరిఁ జేరనుండఁ, జేసికొనఁ దగు నిగ్గతిం జేసి ప్రాణి
హింస నన్నృతంబు విడి వహ్నిఁ బృథ్విసురల,సురల సేవించుచుండిన సుగతిగలుగు.

వ. ఈప్రపంచమున కంతకును బ్రహ్మమే తేజోమయం బగుబీజ మది చరాచర
భూతకోటియం దనుస్యూతము ధ్యానాధ్యయన దాన సత్య త్రపార్జవ
క్షమా శౌ చాచా రేంద్రియ నిగ్రహాదులచే నా తేజము వర్ధిల్లి పాపాపహం
బగు నన్నాది దానం జేసి సర్వార్థసిద్ధియు విజ్ఞానంబు గలుగు నని మఱియును.

మ. సముఁడై భూతములందు ద్వంద్వములకున్ సంతోషదుఃఖంబు లు
ల్లమునం బొందక భూతపాపుఁ డగుచున్ లఘ్వన్నపానీయుఁడై
శ్రమణం బందెడు నింద్రియంబులను గెల్వం జాలి కామంబుఁ గ్రో
ధమునుం గెల్చి ద్విజుండు బ్రహ్మపద మొందం బోవుఁ దేజస్వియై. 370

ఆ. యతిసమాధినిష్ఠుఁడై మనంబును నింద్రియముల నొక్కచోట ననువుపఱచి
పూర్వ మపర మైనసర్వరాత్రములందు, మనము నాత్మయందు నునుప వలయు.

క. పంచేంద్రియములలో నే, కొంచెము ఛిద్రంబ యైనఁ గోశము చెడి పో
నించినజలము స్రవించెడు, నంచున ముని జ్ఞాన మెల్ల జారి స్రవించున్. 372

క. జాలరివాఁడు కుమీనముఁ, బోలె న్విజ్ఞాని మనము మును లోఁ గొని పై
నోలిన్ శ్రోత్రము చక్షువు, నాలుక ఘ్రాణమును వశమునం గొన వలయున్.

చ. అడఁచినవాని నెల్ల మనమందు నడంగఁగఁ జేసి యెన్నికల్
విడిచిన దాని బుద్ధిఁ దగిలించి పదంపడి నింద్రియంబులం
గడుఁగొని కూర్చి చిత్తమునఁ గట్టఁ దగున్ మదితోడ నాఱు నె
ప్పుడు దిరమై మతిం గలియఁ బోయెడునప్పుడె బ్రహ్మ మొప్పెడున్. 374

వ. ఆబ్రహ్మపదార్థము విధూమపావకంబువలెను దీప్తిమంతం బగు నాదిత్యబింబంబు
చందంబునను విహాయసంబున విద్యుల్లతతెఱంగునను మెఱుంగుచు సర్వంబు
నందుం దానును దనయందు సర్వంబును నిండి యుంట మహాత్ము లెఱింగి
బ్రహ్మజ్ఞాను లగుచుందు రని మఱియును. 375

యోగానుష్ఠానకథనము.

సీ. పరిమితకాల మిప్పగిది రహస్యమం,దుండి యోగి యతవ్రతుండు గాఁగ
నక్షరత్వము నొందు నతనికిఁ బరమాద్భుతము లెల్ల నటఁ దోఁచుఁ దా రసాదు
లరయుటకున్ దురూహములగునర్థముల్,మరుదాకృతులెఱుంగుమహిమ గలిగి
దివ్యాంగనలపొందు దీపించు నివియెల్ల, యోగబలంబున నుజ్జగించి

తే. బుద్ధియందు విలీనమై పోవ నట్లు, సలిపి కాలత్రయమునందు సమముగాత్ముఁ
డగుచు యోగానుసంధాన మాచరింప, వలయు నియతవ్రతంబున నిలిచి యోగి.

క. గిరిశృంగంబులు గుహలును, ధరణీసహితంబులును దేవతానిలయములున్
బరమోత్తమములు యోగము, నిరతాభ్యాసం బొనర్పనిష్ణాతులకున్. 377

సీ. ఇంద్రియంబుల నాఁగి యేకాగ్రచిత్తుఁడై, ధనభాండముఁ బోలె మనము నునిచి
పరమాత్మఁ జింతింప వలయును సహజచంచల మైనచిత్తము న్నిలువరించి
తనకు గుహల్ దేవతానిలయములు శూన్యాగారములు నిల నైనచోట్లు
పరులసాంగత్యము పరిహరింపఁగ నొప్పు, నెందు నుదాసీనతం దలిర్చి

తే. నియమితాహారుఁడై పరుల్ నింద సేయఁ,బొగడ నొకరీతినై శుభమునకు నశుభ
మునకు లాభమున కలాభమునకుఁ గాక, గాలి నా నెందు సమగతిఁ గ్రాలవలయు.

క. ఇటు లాఱునెలలు యోగము, పటుమతిఁ గావించునట్టి ప్రజ్ఞానిధికిన్
దటుకున బ్రహ్మజ్ఞానము, నటమట గాకుండ నొందనయ్యెడు సువ్వే. 379

తే. ఆపదార్తులఁ గరుణమై నరయుచు సమ
లోష్టకాంచనుఁడై ధనలోలుపుండు
గాక విరతుఁడై మోహముం గడకుఁ ద్రోచి
యోగి యగువాఁడు వర్తింప నొప్పు నెపుడు. 380

వ. ఇట్టియోగ మనుసరించినవాఁడు వర్ణావకృష్టుం డైనను ధర్మకాంక్షిణి యగు కాంత యైన నుత్తమగతిం బొందుదు రనిన విని శుకుండు తండ్రీ! వేదము కర్మము నకర్మముం జెప్పు నిట్లు చెప్పుటకుఁ గతం బెద్దియో కర్మజ్ఞానగతులఫలం బెట్టిదియో తెలుప ననుగ్రహింపు మనినఁ బాదరాయణుండు నీ వడిగినయర్థం బతిగహ్వరంబు చెప్పెద నవహితుండ వగుము. 381

క. వేదప్రతిష్ఠితము లగు, నీదారులు రెండునుం బ్రవృత్తి నివృత్తుల్
నాఁ దనరుచుండుఁ గర్మము,చేఁ దగ బద్ధుండు విద్యచే ముక్తుఁ డగున్. 382

క. కావున సంపూర్ణజ్ఞానావిష్కృతుఁ డెపుడు కర్మమం దాస్థ విడున్
జా వైనపిదప నక్షరుఁ, డై వెలయున్ వెండి పుట్టు వది లే కుండన్. 383

ఆ. అల్పబుద్ధు లైనయట్టిరు కర్మము, లాచరించి చచ్చి యవల మఱియుఁ
బదియునాఱుకళలు పర్వఁ బుట్టియుఁ జచ్చి, పుట్టుచుంద్రు ముక్తిఁ బొందఁ బోక.

మ. నిపుణత్వంబున ధర్మముం దెలిసి నిర్నిద్రప్రకాశాత్ము లై
యెపుడున్ జావును బుట్టు లేనిపదమం దిచ్ఛం బ్రవర్తించు జ్ఞా

నపనల్ కర్మము నింద్య మంచుఁ దెగువన్ వాదింత్రు గంగాజలం
బు నసం గాంచినవాఁడు కూపజలముం బోనాఁడుచందంబునన్. 385

ఆ. జనన మరణములును సంతోషదుఃఖముల్, కర్మఫలము లగుచుఁ గానఁ బడును
జ్ఞానమార్గమునను మానవుఁ డెప్పుడు, శోక మెఱుఁగనట్టిచోటు నొందు. 386

తరు. ఎందున జననంబు మృతియు లేకుండు, నెందుఁ బరబ్రహ్మ మెసక మెసంగు
నెం దనాయాస మమృతమును గలదో, యెందు ద్వంద్వాదివికృతిబాధ లేదో
యెందు నిరోగార్తి యెపుడు లేకుండు, నెందు మహామోద మే యగు దానిఁ
బొందు జ్ఞానంబున మునిపుంగవుండు, పోలింప నతఁ డుత్తముఁడు భూతహితుఁడు.

చ. అమవస సూక్ష్మచంద్రకల యట్లయి నిత్యుఁడ యయ్యు జ్ఞాని క
ర్మములను గానరాఁ డని కరంబు గ్రహించి మహర్షి తెల్పె ము
న్నమరినసూత్న్మచంద్రుని ననంతమునం గనిసంతమాత్ర నీ
క్రమ మిది యంతయున్ సరియె గా యని యూహ యొనర్ప వచ్చెడిన్. 388

క. పదునొండుకళలతోడం, గదిరి వికారంబు సూక్ష్మకం బగుమేనం
బొదలెడుఁ గర్మగుణములస,ముదయము గలవాఁ డటంచు మునివచన మగున్.

క. యోగి జితాత్ముం డై సం,యోగముఁ బెడఁబాసి నిత్యుఁ డున్నతుఁ డగుచున్
రాగిల్లి తామరాకునఁ, జేగగుజలబిందు వట్లు క్షేత్రజ్ఞుఁ డగున్. 390

వ. సత్వరజస్తమంబులు మూఁడును జీవగుణంబులు జీవమాత్మగుణ మాత్మ పర
మాత్మగుణం బనియు సచేతనత్వము జీవగుణం బనియు జీవుఁడే శరీరములఁ
బొదలించి తాఁ బొదలుచుండు ననియు క్షేత్రజ్ఞుఁడు సప్తభువనంబులం జేయు
వాఁ డనియుం జెప్పుదు రనిన శుకుం డి ట్లనియె 391

తే. ఈరము లోనగువానిచేఁ గలుగుసృష్టి, యాత్మ చేఁ గల్గు నని యందు రవ్విధంబు
జగతి సద్వృత్తి యెట్టిదె చను జగత్ప్రవృత్తతత్వము వినిపింపు విని తరింతు.

వ. అనిన సాత్యవతేయుండు మున్ను బ్రహ్మ సృజించినదియుఁ బూర్వతరు లైన
మహర్షు లాచరించినదియు నగువృత్తి బ్రహ్మచర్యంబు దానిం జెప్పెద నాకర్ణింపు
మని యి ట్లనియె. 393

చ. వనమునఁ గందమూలఫలభక్షణముం బచరించుచుం దపం
బొనరిచి పుణ్యభూములకు నొయ్యనఁ బోవుచు భూతహింస లే
కనిశము నాత్మనిగ్రహమునందుఁ గడుంగడు శ్రద్ధ చేయుచున్
వనితలసంగమున్ విడి ప్రవర్తిలఁ గాఁ దగు బ్రహ్మచారి యై. 394

క. పోఁగ లేక ముసలశబ్దము, తగులక కనవాసు లైనతపసులయిండ్లన్
తగినతఱులందు భైక్షము, ద్రుడిగి తినుచుఁ బ్రహ్మ మొందె నేన నైజయుక్తిన్. 395

క. కావున నీవు శుభాశుభ, భావములఁ బరిత్యజించి ప్రశాంతచిత్తుండవై
బోవ శోకండవ వనులం, బై వేళకు నెదిరియు తినుచు నందుము సుగతిన్. 396

వ. అనిన శుకుం డి ట్లనియె. 397

మత్త. వేదవాక్యము లోకవాదము వేఱువేఱువిధంబు లా
నేది యేది ప్రమాణమో యట నెట్లు శాస్త్రము చెప్పునో
ప్రోదిమై నుభయప్రమాణము పొంద దందునఁ గర్మముల్
గాదు నా కవిరోధపద్ధతిఁ గల్గు ముక్తి వచింపుమా. 398

ఆశ్రమధర్మకథనము.

వ. అనినఁ బారాశర్యుండు బ్రహ్మచారి గృహస్థుఁడు వానప్రస్థుఁడు భిక్షుకుఁడు నను వారు తమయాశ్రమధర్మములు యథోక్తముగ నాచరించి యుత్తమగతిం బొందుదు రట్లు కాక యొక్కండ నాలుగాశ్రమంబులుం బొంది కామద్వేషయుక్తుండు గాక ముక్తుం డగు నివి నాలుగును బ్రహ్మలోకావాప్తికి సోపానములందు ముందుఁ బ్రథమాశ్రమప్రకారంబు చెప్పెద నవహితుండ వగుము. 399

సీ. బ్రహ్మచర్యాశ్రమప్రవణుఁ డాయువు పాదము గురు దాక గురునొద్ద నైన గురుని
సుతునొద్ద నైన సంస్తుతమతి యై యుండి, గురునివెన్కం బండుకొని యతండు
లేవక మును లేచి సేవకుండును బోలె, వితతశుశ్రూష గావింపఁ దగును
వలఁతి యై పను లెల్ల సలిపి గురునిప్రక్క, నిలిచి యుండియు విద్య నేర్వవలయు
తే. నెపుడు నపవాదములు సేయ కింద్రియార్థ, చాపలము లేక సుగుణి యై కోపి గాక
గురువుతినకుండఁ దినక తాఁ గురుని కాళు, లొత్తి పరిచర్య సేయుచు నుండవలయు.

క. గురుకులవాసిగ నుండిన, తరుణంబున బ్రహ్మచారి తా సేవింపన్
బరఁగనిగంధాదు లనం, తరము సమావృత్తి యైనతఱి నొంద నగున్. 401

వ. ఇట్లు బ్రహ్మచారి గురుశుశ్రూషాదులును వ్రతోపవాసాదులునుం జేయుచు వేదాధ్యయనము చేసి పదంపడి గురులకు యథాశక్తి దక్షిణ లొసంగి తదనుజ్ఞ వడసి సమావృత్తుం డై. 402

క. తనయాయువు నాలుగుపాళ్లను రెండవపాలు ధర్మలబ్ధకళత్రం
బును బడసి గేస్తువై యగ్నిని సేవించుచును గడప నియమం బెసఁగన్. 403

సీ. గార్హస్థ్యవృత్తులు గ్రాలు నాల్గందుఁ బ్రథమ మైనది [1]కుసూలధాన్యవృత్తి
యవ్వలఁ [2]కుంభధాన్యా[3]శ్వస్తన[4]కపోత, వృత్తు లొప్పును విధివిహితములయి
యవియుత్తరోత్తరాద్యధికతరంబు లై, పరఁగుచుండును ధర్మపరతఁ జేసి
యాదివృత్తి మెలంగునాతఁడు యజనాది, షట్కర్మములొనర్పఁ జను ద్వితీయుఁ

తే. డలఘ యజనాధ్యయనదానములు తృతీయుఁ
డధ్యయనదానములు నాలు గైనవృత్తి
నాచరించెడునాతఁ డధ్యయన మొండు
మాత్ర మొనరించుచుండుటల్ మహితము లగు. 404

సీ. తన కొక్కనికి సన్నమును వండుకొన రాదు, పశుహింస వృథగ సల్పంగఁ జనదు
పూర్వాపరంబులై పొనరు రాత్రులయందుఁ, బగటను నిద్రింపఁ దగదు గృహికిఁ
దినరాదకాలములను గ్రాలుగంటి ఋతువు గానియప్పుడు కవయఁ దగదు
కుడువక పూజింపఁ బడక గృహస్థుని, యింటినుండి యెవండు నేగ రాదు

తే. శ్రోత్రియులు వేదవేత్తలు శుద్ధమతులు, దాంతులు తపస్వులును గ్రియావంతులనఘు
లతిథులై రాగ హవ్యకవ్యములవారి, భక్తిఁ బూజింపఁదగు గృహభర్త యెపుడు.

ఆ. వంటకమున నొక్కపాలు గోళ్లను గడ్డములును బెంచుకొనినపురుషులకును
వహ్ని విడిచినట్టివారికిన్ గుకుపరి, త్యాగులకును బెట్టఁ దగును మొదట. 406

క. విఘసాశియు నమృతాశియు, నఘహరుఁ డై గేస్తు ప్రత్యహము పొదల నగున్
విఘసంబు భృత్యశేషం, బఘహర మగు యజ్ఞశేష మమృత మనఁ బడున్ 407

క. నిజభార్యారతుఁడున్ గతవృజినుఁడు దాంతుం డసూయ విడిచినవాఁడున్
విజితేంద్రియుండు నగుచున్, బ్రజ లెంచఁగ భవనభర్త పరఁగఁగ వలయున్.

చ. హితులు పురోహితుల్ సుతులు ఋత్విజు లాప్తులు నిష్టబంధువుల్
సతులును జ్ఞాతు లార్తులును సంశ్రితులున్ సయిదోడులున్ మహీ
పతులును దల్లిదండ్రులును వైద్యులు మామలు వృద్ధు లైనవా
రతిథులు వీరితోడఁ గలహం బొనరింపఁగ రాదు గేస్తులై. 409

1 కుసూలధాన్యవృత్తి = మూఁడుసంవత్సరములకుఁ జాలినధాన్యము సంగ్రహించి కుసూలమున (గాదె) నిలువఁ జేసికొని యుండుట. 2 కుంభధాన్యవృత్తి = ఒక్కసంవత్సరమునకు జాలినధాన్యము సంపాదించుకొని కుంభము (బానక)లో నిలువఁ జేసికొని యుండుట. 3 అశ్వస్తనవృత్తి = మరునాఁటిమాట దలంప కానాఁటికిఁ జాలినధాన్యము సేకరించుకొనుట. 4 కపోతవృత్తి = కపోతము వలె గింజ లేరుకొని తెచ్చి దానితో జీవించుట.

సీ. పూజింపఁ బడి గేస్తుప్రసకు నాచార్యుఁడు, బ్రహ్మలోకము పిత్రుపాదు లెడఁద
నలరి ప్రాజాపత్య మతిథి స్వర్లోకము, ఋత్విజుల్ దేవలోకేష్టదము
నచుఁగులు నైదోడు లప్సరోలోకము, జ్ఞాతులు వైశ్వదేవాటిపదము
సంబంధిబాంధవుల్ సర్వదిక్సుఖమును. మాత మాతులులు భూమహితసుఖము
తే. వృద్ధబాలాతురుల్ నభోవితతసుఖము,నొసఁగుచుండురు జ్యేష్ఠుఁడై యొప్పుభ్రాత
తండ్రి కెన సతీసుతులు స్వతనుసమాను,లెల్ల సేవకుల్ తనఛాయ యే తలంప.

వ. కావున వీరు తన్ను నిందించినను నిగ్రహించినను గృహస్థుం డసంజ్వరుం డై శాంతించి వారి నాదరించుచుండవలయు నత్తలుబ్ధుం డై యేకార్యంబును జేయరాదు కుంభధాన్యాదివృత్తు లుత్తరోత్తరోత్తమంబు లట్టిగృహస్థులు దశపూర్వదశాపరు లైనపితృలం దరింపం జేసి తాముం దరించి జితేంద్రియు లొందులోకంబు లొందుదురు మఱియును. 411

చ. గృహపతి స్వర్గలోకమున కేగి విమానములందు నిచ్చలున్
విహరణముం బొనర్చుచును వింతలు సూచుచు వేడ్కమీఱ న
న్వహమును నచ్చరల్ గొలువ నం దగునందనచందనాదిభూ
రుహములనీడ నాడుచును రో యిడ కేలుచు నుండు నెప్పుడున్. 412

వ. ఇది ద్వితీయాశ్రమక్రమం బింకఁ దృతీయం బగువానప్రస్థమున నస్థిపంజరము లైనదేహములతోఁ గాలముం గడుప వలయుఁ దత్ప్రకారంబు వినుము. 413

క. మేను వలీపలితం బై, సూనునకున్ సూనుఁ డొదవుచో నప్పరసి గృహ
స్థానందధర్మ మెల్లం, బోనాడి విరక్తుఁ డగుచుఁ బోఁ దగు వనికిన్. 414

శా. వానప్రస్థుఁడు భార్యతోడ వనులన్ వాసంబు గావింప గా
నొ నాయుస్సున నొక్కపాలు కొఱగా నొ నంతదాఁ కగ్నులన్
మానం బోవక యజ్ఞముల్ సలుపుచున్ మత్తుండు గా కెత్తఱిన్
దా నాహారము షష్ఠకాలమున నొందం జాలి వ్రాలైకమున్. 415

క. దున్నక పండినధాన్యం, బన్నంబుగఁ గొనఁగ వలయు నది విఘసం బై
యున్నపుడు పంచయజ్ఞము,ల న్నెఱి వేల్వఁగ వలయు లబ్ధార్థములన్. 416

సీ. నాల్గువృత్తులును వానప్రస్థమున నగు, నాపూటకుం జాలినంతఁ గొంద
ఱొకనెలకున్ జాల నొకకొంద ఱొకయేటి,క గునట్లు కొందఱు హాయనములు
పదిరెంటికిన్ సరిపడునట్లు కొందఱు, నాహారసంచయం బగు నొనర్ప
నది యెల్ల నతిథిపూజార్థము యజ్ఞార్థ, మగుచుండ వలయు దుర్వ్యయము లేక

తే. వానకాఁడన బయలున వడకుకాఁడు, నందు నీటను వేసంగియందుఁ బంచ
వహ్నిమధ్యమునం దుండి వననివాసి, జపతపంబులు గావింపఁ జను మఱియును.

ఉత్సాహ. నేల వారి కాసనంబు నేల వారిశయ్యయున్
నేలఁ గూరుచుండ వలయు నేలనే శయింపఁగాఁ
బోలుఁ బ్రపదములను నేల మోపి నిల్చి యుండ నౌ
బోలునట్లు క్రతువు లెల్లఁ బూని సేయఁ గా నగున్. 418

వ. కొందఱు ధాన్యాదులు దంతములతో నమలి తిందురు కొందఱు ఱాలం గొట్టి భక్షింతురు కొందఱు శుక్లపక్షంబున మాత్రము యవాగుం ద్రాఁగుదురు కొందఱు కృష్ణపక్షంబున నప్రయత్నలబ్ధంబుల భుజింతురు కొందఱు మూలములు కొందఱు ఫలములు కొందఱు పుష్పములు స్వీకరించి శరీరయాత్రం జేసి కొందురు కొందఱు వైఖానసగతి నాశ్రయింతు రిట్లనేకవిధదీక్ష లందుఁ గలిగియుండుఁ జతుర్థాశ్రమంబున నుపనిషద్ధర్మంబు సాధారణం బగుం గావునఁ దదర్థచింతనంబునుం గలిగియుండు నిట్లీయుగంబున నగస్త్యుండు మధుచ్ఛందుండు నఘమర్షణుండు సాంకృతి సుదివాతండి యహోవీర్యుఁడు కావ్యుఁడు తాండ్యుఁడు మేధాతిథి కర్మనిర్వాహకుఁడు శూన్యపాలుఁడు కృతశ్రముఁడు లోనగుమహర్షు లీధర్మంబు లాచరించి స్వర్గంబునకు నిర్గమించిరి మఱియుఁ దపస్సంపన్నులు ధర్మజ్ఞు లగుమఱికొందఱు బ్రాహ్మణులును వానప్రస్థు లై సుగతిం గాంచి రట్లు వైఖానసులు వాలఖిల్యులు సైకతులు మున్నగువారు వానప్రస్థధర్మంబులం జేసి నిరామయులై జ్యోతిర్గణంబులం జేరి యాకసంబున వెలుంగుచుండి రిట్లు వానప్రస్థమునం గడపి తమయాయువున నాలవపాలు మిగిలియున్నప్పుడు దాని న్విడనాడి తురీయాశ్రమము స్వీకరింపవలయు నప్పుడు సద్యస్కాలేష్టిం గావించి యగ్నుల నాత్మారోపణంబు గావించుకొని సర్వపరిగ్రహంబులుం బరిత్యజించి కర్మయజ్ఞంబులం గాక యాత్మయజ్ఞంబులం జేయుచుఁ బ్రాణధారణార్థ మైదాఱు కబళంబు లాహరించుచుఁ గేశలోమనఖంబులం దీయించుకొని పవిత్రుఁడై వానప్రస్థమునుండి యత్యాశ్రమము స్వీకరింప వలయు నట్టి సన్యాసి సర్వప్రాణుల కభయం బొసంగి దేహత్యాగ మొనరించి తేజోమయ లోకంబులం బొంది సుఖించు నట్టితురీయాశ్రమధర్మంబు లెఱింగించెద నవహితుండ వగు మని మఱియును. 419

క. మూఁడాశ్రమంబులందుం, గూడినధర్మములఁ బుణ్యగోచరుఁ డగున
వ్వాఁడే పరమార్థం బగు, జాడం జనఁ దగునొ వినుము శ్రద్ధాళుఁడ వై. 420

సీ. ప్రవ్రజితుఁడు పరివ్రాజకుం డగువాఁడు, యోగసిద్ధిం గోరి యొంటి మెలఁగి
పరమాత్మ యన్నిటం బరఁగునట్లెంచుచు, ముక్తిదూఁపఁడు గాక మొనయునతఁడు
విడి యగ్నిహోత్రముల్ విడిదయు నన్నార్థ, మరిగి గ్రామమునకు నధికనియతి
నశ్వస్తనవిధాత యై మౌనమున నొక్క, పరి లఘుభోజి యై పరఁగ వలయుఁ
తే. జెట్లమొదట నివాసము శిథిలవస్త్ర
ధారణము నసహాయత ధరణిజనుల
యెడ నుపేక్షయుఁ బుక్కచే నిడికొనుటయుఁ
దెలియ నివి భిక్షులక్షణములు కుమార. 421
తే. బీతుఁడం జేసి పసువిడి నూతఁ బడిన, వారణంబులుబలెఁ బల్కువాకు లెవని
యందుఁ జొచ్చి మరల వక్తనొందకుండు, నతఁడె కైవల్యపదమందనర్హుఁడగును.
క. ఎవఁడేని తన్నుఁ దిట్టిన, నవి విని వినవట్ల యుండ నగుఁ గన్నవ్వా
నివలను ద్రిప్పఁదగదు ద్విజుఁ,డెవడక తత్కుశల మెపుడు తెలియఁగవలయున్.
క. తనకున్ మౌనమె మందుగ, మనమునఁ దలపోసి తన్ను మానవుఁ డేమే
నని చెంద నాడె నేఁ గి,ష్మన కూరక యుంట లెస్స యతిపతి కెపుడున్. 424

## బ్రాహ్మణధర్మకథనము.

ఆ. ఎవ్వఁ డుండుచోట దెల్లప్డు పరిపూర్ణ, మైనదిపమువోలె నతిశయిలునొ
యొవనికలిమిఁ జేసి యవు జనాకీర్ణ మ,శూన్యమ ట్లతండె క్షోణిసురుఁడు. 425
క. ఎదియేఁ గట్టియు దొరకిన, దెదియేనిం దినియు నెందునేఁ బండియుఁ దాఁ
బొదలుచునుండునొ వానిన్, ద్రిదశులు బ్రాహ్మణుఁడటంచుఁ దెలుపుదు రెపుడున్.
క. జనసంఘమునకు నహివలెఁ, దనలోనన్ వెఱచి భోగతతి నరకము నాఁ
గొన రోసి కుణప మట్టులు, వనినం దలపోయువాఁడె బ్రాహ్మణుఁ డనఁగన్.
క సమ్మానమునకు సంతో,షమ్మవమానమున శాంతి సమకుఱకుండన్
నెమ్మిమెయి భూతతతి కభ,యమ్మిడునాతండె విప్రుఁ డనఁ బడుచుండున్. 428
సీ చావుబ్రదుకులకు సంతసింపక ప్రభు,నాజ్ఞ భృత్యుఁడు వోలె యతివరుండు
కాలప్రతీక్షను గావింప వలయును, వాఙ్మనోదోషముల్ వదలి వైచి
పరిశుద్ధుఁ డై శత్రుపరిహార మొనరించు, నతనికి భయ మెప్పు డంటఁ బోవ
దేన్నుపదంబుకం దితరపదము లెల్ల, నిముడునట్టు లహింస నిముడు ధర్మ
తే. మర్థ మాదిగనన్నియు నట్లు గాన
హింస సేయక యోగి యై యొసఁగువాఁడు

మృత్యుగతుఁ డయ్యు నమృతుఁ డై మీఁదిజగతి
శాశ్వతానంద మొందెడు సంతతముగ. 429

మ. సమచిత్తుండు నహింసకుండు విజితాక్షవ్యూహుఁడున్ సత్యవా
క్ప్రియుండున్ ధృతిశాలి భూతహితుఁడున్ బ్రజ్ఞానతృప్తుండు ను
త్తముఁ డౌ వానికి మృత్యుభీతి యెపుడున్ దాపింపఁ బో దాతఁ డు
త్తమలోకంబుల నొంది నిక్షయతమైఁ దళ్కొత్తు సౌఖ్యోన్నతిన్. 430

వ మఱియు నాతండు సర్వసంగవిముక్తుం డై సర్వశూన్యం బగునాకాశంబు వలె నిశ్చలుం డగు నట్టివానినే బ్రాహ్మణుం డని దేవతలు చెప్పుచుందురు. 431

క. ఏవాని బ్రదుకు ధర్మము, కావించుట కెవనిధర్మగతి హార్యర్థం
బేవాని రేఁబవలు పుణ్యావాప్తికి నగునొ విప్రుఁ డందురు వానిన్. 432

తే. ఎవఁడు నిష్కాముఁడు నిరాశి యెవఁడు ముక్త
బంధనుఁడు నిరారంభుఁడు ప్రాజ్ఞుఁ డెవఁడు
స్తుతినమస్కారవిముఖుఁ డౌ సూరివరుని
బ్రాహ్మణుం డని దేవతల్ పలుకుచుంద్రు. 433

మ. వలచున్ బ్రాణులు సౌఖ్య మన్న వెఱచున్ బంధానుషంగక్రియల్
గలుగం బోవు ననంగ వానికి భయాక్రాంతక్రియల్ గూర్చి రా
పులపా ల్సేయఁగ రాదు ప్రాణి కభయంబుం గూర్చుటే దాన కో
టులలో నుత్తమదాన మంచు శ్రుతు లాడున్ వీడ కేనాఁడునున్. 434

సీ. వేఁ డహింసం బూనువాఁడభయము నొందు, నెవఁడు వానప్రస్థునివలె నైదు
నా త్రైనకబళము లానకుండు నతండు, లోకనాభీపదశ్లోక మందు
నేఁ డాత్మయాజియైహృదయాగ్నిఁ బ్రాణముల్, వేల్చులోకమువానివేల్మి కలరు
నేఁడు గుణత్రయావృతుజీవుఁ బరమాత్ముఁ, డనువాఁడు దేవలోకార్చితుఁడగు
తే. వేఁడు వేదముల్ వేద్యము వివిధవిధులు, తనదుమైనున్న యాత్మలోఁ దనరునట్లు
భావన యొనర్చునో వాని దేవవరులు, సర్వమాన్యునిఁగా నెంచి సన్నుతింత్రు.

మ. తనదేహంబున నున్నయాత్మను సమస్తం బై నలోకంబునం
దు నెఱి న్నిండియు నాకసంబునను గాంతు ల్మీఱ నండోద్భవం
బన నౌనాపరమాత్మ గా నెఱుఁగు యోగారూఢునిన్ దేవతల్
ఘనమేధానిధి గా మహాత్ముని గ వక్కాణించి పూజింత్రెదన్. 436

తే ఋతువు లనునాఱు నాభు లంచితము లైన, నెల లనెడుపద్ధి రెండఱల్ గలిగియజర

మగుచుఁదనవోటఁబడువిశ్వమాకగించు,కాలచక్రమెఱుఁగువాఁడుఘనతరుండు.

వ్యాసుండు శుకునకుఁ దత్త్వోపదేశము చేయుట.

తే. జగములకు మేనుపరమాత్మ యగు నతండు,నిండియుండునంతటను జీవుండువాని
లోన నొక్కపాలై దేవలోకములకుఁ, దృప్తిఁ గలిగించువాఁ డయి తేజరిల్లు.
క. తేజోమయుండు నిత్యుం, డాజీవుఁడు నిశ్చయంబు లగులోకము లె
న్నో జతపడ నొందుచు వి,భ్రాజద్గతి మెలఁగుచుండు వదలక యెప్పుడున్. 439
క. స్తుతినిందాశూన్యుండును, గతకల్మషుఁడు సములోష్టకాంచనుఁ డగుచున్
మతిమోహముఁ విడిచి యత,వ్రతుఁ డై భిక్షుకుఁడు వొల్చుఁ బ్రవిమలబుద్ధిన్.
వ. అని చెప్పి వ్యాసుండు వెండియు. 441
సీ. ప్రకృతివికారముల్ సకలేంద్రియమ్ములు, క్షేత్రజ్ఞు నాశ్రయించియె వసించు
నవి యాతని నెఱుంగ వతఁడు వాని నెఱుంగు, సారథి శిక్షితాశ్వములచేత
నరదంబువలె నింద్రియములతోడి మనంబు,చేఁ గార్యగతులను జేయుచుండు
నింద్రియంబులకంటె నింద్రియార్థంబులు, వానికంటె మనంబు దానికంటె
తే. బుద్ధి దానికంటెం బొలుపొందు నాత్మ, దానికంటె మహత్తు నద్దానికంటెఁ
గలుగునవ్యక్తముం దానికంటెనమృత, ముత్తమోత్తమతనుగాంచియొప్పుచుండు.
చ. అమృతము కంటె నుత్తమపదార్థ మొకండును లేనిమాట స
త్య మది పరంబు భూతములయందు నిగూఢముగా మెలంగు సూ
క్ష్మ మయినదృష్టి గల్గుమునిచంద్రులు సూక్ష్మమ యైనబుద్ధిచేఁ
గ్రమముగ నభ్యసించి వెనుకం గనఁ జాలుదు రీశ్వరాభులై. 443
మ. మనముం గూడిననింద్రియార్థముల నేమం బేర్పడన్ బుద్ధిచేఁ
దనయాత్మం గలియంగఁ జేసి తగఁ జింత్యం బెల్లఁ జింతింప నే
ర్చిన ధ్యానంబున భోగరక్తి విడిపోఁ జిత్తంబునన్ జ్ఞాన మొ
ప్ప నశీశుండు ప్రశాంతుఁడై యమృతముం బ్రాపించు యోగీంద్రుఁడై. 444
క. అటు గా కింద్రియవశుఁ డై, దిట చెడి చలితాత్ముఁ డయిన దేబె వివేకం
బటమటగా రాగములకు, నుటజంబై మిత్తివాతి నొందం బోవున్. 445
క. కావున సంకల్పములం, బోవంగాఁ ద్రోలి సత్త్వమునఁ జిత్తంబుం
దావలము చేసి బుద్ధిన్, భావించెడువాఁడు కాలబలముం గెలుచున్. 446
తే. చిత్తనైర్మల్యమునఁ జేసి చేరనీక, శుభమునశుభము తనవంక కభయుఁ డగుచు
నాత్మరూపం బెఱింగి నిరంతరంబు, శాశ్వతసుఖంబు నొందు విజ్ఞానమహిమ.

సీ. సుఖనిద్ర వంటిది సూవె చిత్తప్రసా,దము నివాతమున దీపము తెఱఁగునఁ
జలియింపకుండు నీచందంబునన్ మాని, పూర్వాపరంబు లై పొలుచు కాల
ములఁదన్నుఁ దాఁజూడఁగలిగి లఘ్వాహారుఁ, డై విశుద్ధాత్ముఁ డై యలరు నేని
యాత్మవిజ్ఞానము నలరించుకొను దాన, నరచేతిదై మోక్ష మరయ వచ్చు
తే. నిది యనైతిహ్య మగుశాస్త్ర మెల్ల వేద,ములరహస్యమనాగమ మలఘుతరము
నాత్మఁ బ్రత్యయికము పరమాత్మబోధ, కమ్ము ననుశాసన మ్మని నమ్ము మెడఁద.

వ. కుమారా! యిట్లు ధర్మాఖ్యానములయు సత్యాఖ్యానములయు సారమెల్లఁ బదివేలబుక్కులనుండి మథించి దధినుండి నవనీతంబువలె సంగ్రహించి నీ కొసంగితి దీనిని స్నాతకు లగువారికిం దెలుపవలయుఁ గాని యప్రశాంతులకు నదాంతులకు నతపస్వులకు నవేదవిదులకు నననుగతులకు ననృజులకు నసూయావిష్టులకు ననిర్దిష్టకారులకుఁ దర్కశాస్త్రజ్ఞులకుఁ బిశునులకుం దెలుప రాదు తత్త్వవేత్తలు రత్నపూర్ణ మగుభూమిదానంబు కన్న నీదాన ముత్తమ మని తలంతురు నీవు నన్నభ్యర్థించితివి గావున నతిమానుషంబును గుహ్యతరార్థంబును వేదాంతవిహితంబును మహర్షిసేవితంబు నగునీయధ్యాత్మతత్త్వము నీ కుపదేశించితి మఱియు నీకుం గలసంశయంబు లడుగుము చెప్పెద నన శుకుండు తండ్రీ! మఱియు నాకీయధ్యాత్మతత్త్వమునే విస్తరించి చెప్పు మధ్యాత్మ మన నేమి యది యెట్లు పుట్టిన దనిన వ్యాసుండు వెండియు. 449

సీ. భూమియు నాకసంబును గాలి జల మగ్ని, యనుమహాభూతము లైదు సాగ
రమున కలల్ వలెఁ బ్రాణికోటికి నాక,రము లవి కూర్మ మంగములు ముడిచి
ప్రసరింపఁ జేసెడుపగిదిని బెక్కురూ,పములు గా మాఱియుఁ బాయుచుండు
భువన మంతయుఁ బంచభూతమయం బగు,సర్గప్రలయముల జగము వాని
తే. యందు సంబంధమునుబొందు నవి యొక, భూతసంబంధమును బాసి పోవునప్డట్లు
భూతకర్త వేర్వేఱుగాఁ బోవఁ జేయు, ననిన శుకయోగి వ్యాసున కనియె నిట్లు.

క. భూతములు శరీరంబుల, నేతీఱున వేఱుపడుట యెట్లెఱుఁగ నగున్
స్ఫీతేంద్రియమ్ములున్ దత్ఖ్యాతగుణంబులును దెలియుదారియుఁ జెపుమా. 451

వ. అని యడిగినకొడుకునకుం దండ్రి యి ట్లనియె. 452

సీ. శ్రోత్రేంద్రియంబును శ్రోత్రము శబ్ద మా,కాశసంభవము లై క్రాలుచుండు
ప్రాణముల్ చేష్టయు స్పర్శము ననుమూఁడు, వాయుగుణంబు లై వఱలుచుండుఁ
జక్షువు రూపము జఠరాగ్ని యనునవి, జ్యోతిర్గుణంబు లై ఖ్యాతిఁ గాంచు

రసము స్నేహంబును రసనము ననునివి, వారిగుణంబు లై సొంపుమీఱు

తే. ఘ్రేయమును ఘ్రాణమునును శరీరము నివి
భూమిగుణము లై చనుఁ బంచభూతవికృతు
లగు నవియె యింద్రియము లని యఖిలశాస్త్ర
ములు తెలియఁ జెప్పుచున్న వోసలలితాత్మ. 453

క. మనముం బుద్ధి స్వభావము, ననుమూఁడు స్వయోనిజంబు లై నిజవిషయ
ప్రణుతగుణంబులకంటెన్, ఘనము లయి యతిక్రమింపఁ గల వగునరయన్.

క. కమఠము తనయంగంబులఁ, గ్రమ మొప్పఁగఁ జాఁచి ముడుచు కైవడి దేహం
బున బుద్ధి యింద్రియంబుల, నొనరించి యడంచుచుండు నురుతరశక్తిన్. 455

క. పాదాదికేశపర్యం, తాదృత మగుదేహభాగ మంతయుఁ జూడన్
బ్రోదియగుబుద్ధిగుణములు, నాదట మదితోడ నింద్రియములుగ మాఱున్.

వ. బుద్ధి లేకున్న గుణాదు లెవ్వియు లే వని యెఱుంగు మింద్రియంబు లై దాఱ
వది మనంబు బుద్ధి సప్తమంబు క్షేత్రజ్ఞుఁ డష్టముండు నా నెసంగుచుండుఁ జక్షు
రాదులు రూపాదుల నాలోకించుటకును మనంబు సంశయించుటకును బుద్ధి
సంశయంబు నిశ్చయించుటకును నై యుండ క్షేత్రజ్ఞుండు సాక్షిభూతుండై
యుండు నని మఱియు. 457

సీ. తమము రజంబు సత్త్వము ననునివి మూఁడు, సర్వభూతములందు సమత నుండు
సంశుద్ధియునుఁ బ్రీతి శాంతియు సత్త్వగుణములు శరీరమానసములకును
సంతాపజనక మై సమకుఱునది రజో, గుణము సమ్మోహముఁ గూర్చునదియు
నవ్యక్తవిషయంబు నగునది తామసగుణ మప్రతర్క్య మై గణుతి కెక్కు

తే. సమత హర్షము ప్రీతియు స్వస్థతయును, సాత్త్వికంబులు మోహ మక్షమయు లోభ
మునభిమానము రాజసములును మోహ, తంద్రలు ప్రమాదనిద్రలు తామసములు.

తే. మదిసృజించెడి భావముల్ మసలనీక, బుద్ధిశాసించుహృదయము మొగిఁ బ్రియాప్రి
యమ్ముల నెఱుంగు నిటు త్రివిధమ్ము యగుచుఁ, గర్మచోదన యొప్పులోకమ్మునందు.

వ్యాసుఁ డింద్రియనిగ్రహ ముత్తమధర్మ మని చెప్పుట.

వ. ఇంద్రియమ్ములకంటె నింద్రియార్థములు వానికంటె మనంబును దానికంటె
బుద్ధియు దానికంటె నాత్మయుఁ బరమ్ములు మనుష్యునకు బుద్ధియే యాత్మ యనం
బడు బుద్ధిలోనివికారము లే మన స్సగు నింద్రియంబుల పృథగ్భావంబున బుద్ధి
వికారముల నొందు నది వినునపుడు శ్రోత్రము స్పృశించునపుడు స్పర్శము

చూచునపుడు చక్షువు చవిచూచునపుడు రసనము మూర్కొనునపుడు
ఘ్రాణము నై యిట్లు పృథగ్వికారంబుల నింద్రియసంజ్ఞం గలిగి యదృశ్య మై
మెలంగుచు సత్త్వరజస్తమోగుణంబులం బుట్టించుచుండు మఱియు నాబుద్ధి. 460

మ. ఒక కాలంబున సంతసించుటకు నై యొండొక్క కాలంబునన్
సుకమ్ముం గానక శోకముం గుడువ నై చో ప్పేద నొక్కప్డు రెం
టికినిం గాక త్రిభావయుక్త మగుచుం దీపించియున్ వాని నొం
డొక కాలంబున డాటు నబ్ధితట మట్లూర్మిప్రకర్షంబునన్. 461

ఆ. బుద్ధి కోర్కి యైనపుడు మనస్సంజ్ఞ కొ, వేఱు వేఱు గాక నేఱుపడియు
నింద్రియములు బుద్ధినే యాశ్రయించెడు, నని యెఱుంగ వలయు నాత్మజన్మ.

సీ. మునుమున్న యింద్రియముల జయింపం దగు, వానికి బుద్ధి వే ర్గానిదయ్యు
సహభావమైమానసముం జొచ్చు త్రిగుణంబు,లరయ మనోబుద్ధ్యహంకృతులను
గలసి చక్రము నేమివలె బహుభావముల్, గలిగించు జ్ఞానంబుగాంచుపొంతె
మన మింద్రియములు సాధనము గాం జేసికొ,నం దగు యోగి జ్ఞానంబువలన

తే. నెందును విరక్తుండై యిది యెల్ల సహజ, మని తలంచి ఖేదమోదము లందంబోక
మోహమనుపాశమునుండిముక్తుండగుచు, శాశ్వతానందసౌఖ్యముసంతరించు.

ఆ. కామగోచరములు గాన నింద్రియములు, వానిచేత నాత్మం గానం బడదు
విమలములుగ నైన విద్వాంసులే కానం, జాల రనిన జడులజోలి యేల. 464

ఆ. మానవుండు తనదుమనసుచే నింద్రియ,ము లననొప్పువర్గములను బట్టి
నిలువరింపం గలిగె నేని దీప్తం బగు, దివ్వె వోలె నాత్మం దెలియం గలండు.

క. జలచరపక్షులమేనన్, జల మంటనియట్లు ముక్తసంగుం డగుచున్
మెలంగెడుయోగిని గుణదో,షలతల్ చుట్టంగ లేక సాల్వడి పోవున్. 466

ఆ. విషయసక్తుం డయ్యు విజ్ఞాని తద్దోష,ములను నంటకుండ మెలంగుచుండు
నాత్మం బ్రీతిం గలుగు నాతండు కృతకర్మ,ములను విడిచి యాత్మభూతుండగును.

క. గుణముల నాత్మ గ్రహించును, గుణములు దానిం గ్రహించుకొన వాత్మయె త
ద్గుణముల సృజించు నదియై, గణుతింపం బడుచునుండుం గాదె కుమారా. 468

వ. ప్రకృతిభిన్నంబు లగుసత్త్వక్షేత్రజ్ఞులు మత్స్యజలంబులం బలె మశకోదుంబ
రంబులతెఱంగునను ముంజేషీకంబులచందంబునను వేఱయ్యు నొండొంటిం
గలిసి యుండు నని మఱియును. 469

సీ. సాలీండు సూత్రము చందంబునన్ సత్త్వ,ముగుణంబుల సృజించు మొనసి వాని

యందు క్షేత్రజ్ఞుఁ డధ్యవసించు నీశ్వరుఁ,డయ్యు నగ్గుణముల నంట కుండు
గుణరూప మది గనుంగొనరాదు గాని పో, వని కొంద ఱున్ జ్ఞానమున నశించు
నని కొంద ఱందు రీయది యెఱింగి వివేకి, యాత్మవిజ్ఞానియై యుండ వలయు
తే. నాత్మ యాద్యంతములు లేని దని యెఱింగి
దోషమును మత్సరత్వము తొలఁగఁ ద్రోచి
చింత నగుహృదయగ్రంథి చిక్కుఁ జేసి
సంశయవిహీనచిత్తుఁడై చనఁగ వలయు. 470

ఆ. ఈఁత రానిమూఢుఁ డేటిలోఁ బడినట్లు, లోక మెఱుఁగ నతఁడు శోక మందు
తత్త్వవేత్త గట్టుదరి నున్న జనుఁడు నాఁ, దాపములకుఁ గాక తనరుచుండు 471

వ. ఇట్లు భూతములకు నాగతంబు లెఱింగి యాత్మజ్ఞానరూపం బని తెలిసికొనినచో నుత్తమశాంతి నొందు నాత్మజ్ఞానము శాంతియు మోక్షసాధనములు విద్వాంసులి ట్లెఱింగి ముక్తు లగుదు రజ్ఞానికే పరలోకభయముగాని జ్ఞానికిఁ గాదు విషయపీడిత మగునీలోకమ్మున నొకఁ డసూయపడు వేఱొకఁడు శోకించు ఫలమపేక్షింపక కర్మము లాచరించినవాఁడు తనపురాకృతము ద్రోసి రా జను ఫల మపేక్షించినవాఁడు ముక్తిం గాంచ నేరం డనిన శుకుం డెల్లధర్మంబుల నుత్తమధర్మం బెద్దియో యానతి మ్మనిన వ్యాసుం డెండియు. 472

ఉత్తమోత్తమధర్మనిర్వచనము.

చ. జనకుఁడు బాలునిం బలె నసాధ్యము లై చను నింద్రియంబులన్
గొనకొని యాజ్ఞ వెట్టి మదిఁ గూడఁగఁ జేయుచు బుద్ధిపెంపునన్
దనరుట యుత్తమం బయినధర్మము నాఁగ నెఱుంగు మిట్లు గాఁ
బొనరిచి చింతలన్ విడుచుపూరుషుఁ డాత్మ నెఱుంగఁ జాలెడున్. 473

తే. ఇట్టిమహనీయు లగువిప్రులే జ్వలించు, నగ్నినిం బలె భూతాత్ముఁడై పరుండు
నై పరంజ్యోతియైయొప్పునమలమూర్తిఁ, దెలిసికొని ముక్తులగుచుంద్రు సలలితాత్మ.

తే. శాఖలం బూలఫలములఁ జనుమహీజ, మొదుఁ దనపూలు పండ్లుండు నెఱుఁగనట్టు
లాత్మ యెందుండి వచ్చె నెందఱుగు నెఱుఁగ, రాదు కలదంత రాత్మ సర్వం బెఱింగి.

క. తనయందె జ్ఞానదీపం,బున నాత్మ నెఱింగి జ్ఞాని పొర విడిచినపా
మునఁ బాపశూన్యుఁ డగుచున్, బొన రెడుఁ గైవల్యపదముఁ బొంది తనూజా.

సీ. సర్వతస్స్రోతమై సంసారనిమ్నగ, లోకప్రవాహిని యై కడంగు
నమ్మహానది కింద్రియములు గ్రాహంబులు, చిత్తసంకల్పముల్ స్థిరతటములు

మోహలోభములు సంపూర్ణతృణంబులు, క్రోధకామములు చతుశ్శ్రీవములు
సత్యము రేవు లసత్యము తరగలు, మదమత్సరములు జంబాలతలము

తే. గాఁగ నవ్యక్తముననుండి కలిగి యజ్ఞు, లకును దాఁటఁగ రానిదై ప్రకటితమగు
వైరాగ్యవిజ్ఞానముల దాని దాఁటఁ గలరు, సర్వసంగవిముక్తులై చనెడువారు. 477

వ. జ్ఞాని యగువాఁడు నిష్కల్మషుండు నిర్మలాత్ముండు నై సంసారసాగరం బుత్త
రించి కొండ యెక్కినవాఁడు క్రిందివారిం బలె నెల్లప్రాణులం జూచుచుండు నీ
వక్రోధనుండవై సంతోషంబునకుఁ జోటీక నృశంసమతివి గాకుండు వేని
భూతోత్పత్తిలయంబు లెఱింగి సర్వభూతవిశిష్టుండవై బ్రహ్మభూతుండ వగుదు
విట్లాత్మ నెఱుంగునట్టిజ్ఞానమే పుత్త్రునకుఁ దండ్రి యుపదేశింపఁ దగినదియు
హితుఁడు నియతుఁడు ననువర్తి యగుశిష్యునకు గురు వుపదేశింపఁ దగినదియు
నీయాత్మజ్ఞానము గుహ్యమును గుహ్యతమంబును దీని నెఱింగినస్త్రీ గాని పురు
షుండు గాని పునర్జన్మంబు నొందఁ బోవ రని చెప్పి మఱియు నట్టిబ్రాహ్మణ
వృత్తంబు చెప్పెద విను మని యి ట్లనియె. 478

మ. రసగంధాదు లలంక్రియల్ విభవముల్ ప్రక్చందనాదుల్ సుఖం
బసమున్ మానము రాగభోగములు నీహం జేయ కో గన్న య
ద్దెసకున్ బోవక బ్రహ్మచర్యమును హృద్వీథిం బ్రతిష్ఠించి వే
దసమేతుం డయి భూతహార్ద మగునాతండే ద్విజుం డారయన్. 479

తే. సవము లొనరించి యిష్టులు సలిపినంత, బ్రాహ్మణత్వము రాఁ బోదు ప్రాణిహింస
కామరాగంబులున్ లేక కరుణ గలిగి, యుండునాతఁడె తత్సిద్ధి నొందఁ గలఁడు.

క. కామమును జయించినవాఁ, డామబ్బులనుండి వెడలునబ్జుఁడు వోలెన్
దా మించు గతరజస్తముఁ, డై మెఱయుచుఁ గాలకాంతుఁ డై ధీరుం డై. 481

మ పరిపూర్ణం బచలంబు నై నకడలిం బ్రాపించి వాకల్ స్వరూ
పరతిం బాసినయట్లు కామము లవేప్రజ్ఞానిధిం గూడి యె
వ్వారికిం గానఁగ రా ని వా నతఁడు విద్వాంసుండు శాంతుఁడునై
స్థిరసౌఖ్యంబున నుండు నన్యుఁ డెపుడున్ దీపింప కార్తుం డగున్. 482

వ. మఱియు నాకర్ణింపుము వేదమునకు సత్య ముపనిషత్తు సత్యమున కుపనిషత్తు
దమము దమమున కుపనిషత్తు దానము దానమున కుపనిషత్తు తపము తపమున
కుపనిషత్తు త్యాగము త్యాగమున కుపనిషత్తు సుఖము సుఖమున కుపనిషత్తు
స్వర్గము స్వర్గమున కుపనిషత్తు శమము నగుం గావున నీవు సంతోష మర్థించితి

వేని బుద్ధికిఁ బ్రసన్నత్వము నంవజుచుకొమ్ము శోకరాహిత్యము మమకార శూన్యత సంఘరాహిత్యము సంతోషము మనఃప్రసన్నత యమాత్సర్యము నివి యాఱునుం గలవాఁడు జ్ఞానపరిపూర్ణుం డగు యోగము ధ్యానము జ్ఞానము ననుగుణంబులు గలిగి ప్రత్యగాత్మ నరయువాఁడు ముక్తిం గాంచు మానసముచు విషయవిముఖముఁ గావించినం గలుగుసంతోషమునకు సాటి యెట్టిసంతోషమును లేదు భోగద్వారముల నఱికట్టి పరమాత్మను ధ్యానించు వాఁడే యోగపరాయణుం డగు బ్రాహ్మణుండు కర్మము లతిక్రమించి సంగ ములను విడిచిన బ్రాహ్మణుని జరామరణాదులు చేర రావు సర్వసంగపరిత్యాగియు సర్వసముఁడు నైనవానికి దేహసంబంధ మున్నను నింద్రియేంద్రియార్థములు బాధింపవు వాఁడు పునరావృత్తిరహిత మగుపరమపదంబు నొందు నని మఱియు. 483

పంచభూతములును భావ మభావము, కాల మొప్పును భూతగణమునందు
నంతరాత్మక మగునాకాశ మది తన్మయ మ్మగుశ్రవణేంద్రియమ్ము దాని
గుణము శబ్దమ్ము చరణము వాయుమయంబు, ప్రాణ మపానము నరయఁ దన్మ
యమ్ములుస్పర్శేంద్రియము వాయుగుణముత్వ,చముజీర్ణగుణము తేజమును జూపు
రూపు తేజోగుణమ్మదిమూత్రఁదమము, ద్రవముస్వేదముశ్లైలము రక్తమజ్జ [ము
లమ్మయము రసనమ్మురసమ్ముజలగుణములుమేన్ భూమయముగంధముమహిగుణ

ఇట్లు పంచభూతసంఘసంతతిని మును లెఱింగి వర్ణించిరి వీనికిఁ దొమ్మిద వది మనస్సు పదియవది బుద్ధి పదునొకండవది యంతరాత్మ యది యన్నిఁటి కంటెఁ బరమోత్తమంబు బుద్ధి నిశ్చయాత్మకంబు మనంబు సందేహాత్మకంబు నిత్య మగునాత్మ కర్మవశమున దేహంబు నొంది జీవసంజ్ఞ నొందుచున్న దిట్లె ఱింగినవారు మోహావశులు గాక యుత్తమగతిం గలిగియుందు రని మఱి యును. 485

అనఘ! దేహవిముక్త మగుసూక్ష్మభూతముత్, యోగులు గంద్రు శాస్త్రోక్తవిధుల
నది యాకసంబున నర్కు తేజం బట్లు, వెలుఁగుచు లోకాళి మెలఁగుచుండు
కన రాదు మనుజునికంటికి జలమందు, ద్యుమణిబింబం బట్లు యోగదృష్టి
స్థూలదేహమునందుఁ జూతురు విజితేంద్రి,యులు కర్మరజమును దొలఁగఁ ద్రోచి
పవలు రేయియు నాకొక్కపగిది నాత్మ
చింతన మొనర్చుచుండెడు శాంతమతికి

లింగదేహము వశమయి లోఁగి యుండు
నతనియానందమును మహోన్నతము సువ్వె. 486

క. వానిశరీరమునందున్, మానొందెడుజీవుఁ డెప్డు మహదాదులసం
ధానమున నిత్యుఁ డగుచున్, గానంబడు జననమరణ గతి లేకుండన్. 487

క. మనముం బుద్ధియు వశముగఁ, గొనలేనియతండు స్వప్నగోచర మైనన్
దనపరభేదము మానక, ఘనదుఃఖసుఖంబు లంది కాఱియ నొందున్. 488

మ. అతఁ డెల్లప్పుడు నుండువానివలె నూహం జేయుచున్ లోభసం
గతినై నే నధికారి నాకు ధనముల్ కాంక్షించిన ట్లుండె సం
తతియుం గాంతలుఁ గల్గె నంచు ముద మత్యంతంబునుం బొందు సం
తతమున్ బుణ్యము లాచరింపఁ డగుం దర్వాతఁ గానం డహో. 489

క. కడుపున సూక్ష్మమునం బడి, గడియకు నన్నంబు జీర్ణగతి నై పోవున్
గడుపునఁ బదినెల లుండియుఁ, జెడఁడుం జీర్ణంబుఁగాఁడు జీవుం డహహా. 490

ఆ. స్థూలదేహమునను జొచ్చి హృద్గతుఁ డయి, వెలుఁగుచుండుజీవు లలితమూర్తిఁ
దమము రజముఁ గల్గి తబ్బిబ్బుపడువారు, తెలియఁ జాల రెపుడు తెలివి లేమి.

వ. యోగశాస్త్ర మెఱింగినజ్ఞానులు స్థూలసూక్ష్మకారణంబులఁ బరమాత్మునంశ
మగుజీవు నెఱుంగుచున్నారు పృథగ్ఖ్యాతంబు లగునాశ్రమధర్మంబులునుసమాధి
విషయంబులును శమంబును శాండిల్యుఁడు చెప్పియున్నవాఁడు సప్తసూక్ష్మం
బులు షడంగంబులుం గలిగినమహేశ్వరుం దెలిసినవాఁడు బ్రహ్మసాయుజ్యంబు
నొందు నని తెలిపి వేదవ్యాసుండు వెండియు. 492

సీ. హృదయంబునం గామవృక్ష మగుం దాని, బీజము మోహమై వెలయుచుండు
క్రోధమే స్కంధము కోర్కులే పాదు నజ్ఞానమే కూఁకటి నైనవేఱు
విను ప్రమాదంబె జీవన మసూయయె పత్రములు పురాదుష్కృతము లవి చేవ
విస్తృతచింతయే విటపముల్ శోకమే, శాఖలు భయ మం చెసంగు నంకు
తే. రము ముమోహాకరాశలు ద్రుమసమావృతములు తీవలు లుబ్ధులు తత్ఫలంబు
పడయుకోరిక వాసనాపాశబద్ధు, లగుచు నాశ్రయింతురు దాని ననవరతము.

క. ఎవఁ డాపాశములం దన, వశంబునఁ బెట్టికొనుచు ద్రుమముం దానిన్
సవు రడఁచి ద్రుంపఁ జాలునొ, భువి నాతఁడు చావుపుట్టువులు లే కొప్పున్.

తే. ఆమయగ్రస్తుఁ డౌషధం బనుచు విషము, ద్రావి చచ్చినవిధమునఁ దాని నెక్కి
ఫలము నాశించు నజ్ఞానిఁ బట్టి యదియె, కాఱియం బెట్టి చంపు నిష్కారణముగ.

తే. యోగి యోగాసిఁ జేఁ గొని యుక్కుమిగుల నమ్మహావృక్షమునఁ బొదలంటఁ ద్రవ్వి
యూడఁ బెఱికంగఁ జాలిన యోగివరుఁడు, చిత్తనైష్కల్యమున యోగసిద్ధిఁ బడయు.

వ. ఇట్లు కామశాస్త్రతత్త్వం బెఱుంగువాఁడు కామమూలంబైన దుఃఖంబులం దొలఁ
గించుకొను నని మఱియును. 497

చ. తనువు పురంబు బుద్ధి యది దానికి నేలికసాని బుద్ధికి
న్మన మది కార్యచింతన మొనర్చెడు నయ్యెడ యింద్రియంబులం
దనిశము నుండుపౌరులు తదర్థమ యుత్సు మొనర్చుచుండు నె
మ్మన మెపుడుం రజస్సును దమంబును దోషము లుండు రెండటన్. 498

తే. పురజనులు నీశులేయర్థములనుఁ గోరి, బ్రదుక నెంతురో యీరెండువానిఁబట్టి
తొడరియుండు నేలికసానిదోషములకు, లొంగనిదియయ్యుఁ గుమతికి లోఁగిపోవు.

క. పౌరులు మంత్రిభయంబునఁ, బారిప్లవగతులు గలిగి వర్తింతురు త
త్కారణమునఁ బ్రభ్వితలం, పారమార్థస్థితికిఁ గాక యాఁపడి పోవున్. 500

తరు. అటు బుద్ధికార్యము లటమట గొట, కామది చింతించు నద్దాని చింత
లటు లొటకన్ బుద్ధి యనుతాప మొందు, నారెండు వేఱుగ నగుఁ గర్మకలన
నెటువలెఁ దోఁచిన యే నవి యొక్కఁ, డే యగు నైననా హృది మైత్రి జేసి
తటుకున రజముతోఁ దద్బుద్ధి నక్కు, తెలఁ బట్టి మిత్రు నిదరి నప్పగించు. 501

వ. అని వ్యాసుండు శుకున కుపదేశించె నని భీష్ముండు ధర్మరాజుదిక్కు మొగంబై దీప్తానలనిభుం డగుకృష్ణద్వైపాయనుండు చెప్పినచొప్పున భూతసంఖ్యానంబు మరలఁ గావించెద నవహితుండవై వినుము స్థైర్యము గురుత్వము కాఠిన్యము ప్రసవార్థత్వము గంధము శక్తిసంఘాతము స్థాపన ధృతి యివి భూగుణంబులు శైత్యము క్లేదము ద్రవత్వము స్నేహము సౌమ్యత జిహ్వావిస్యందనము భౌమ వస్తుశ్రవణము జలగుణంబులు దుర్ధర్షత జ్వలనము తాపము పాకము ప్రకాశనము శోకము రోగము వేగము తీక్ష్ణత యూర్ధ్వజ్వలనము నివి యగ్నిగుణములు నియమస్పర్శము వాదనశక్తి స్వాతంత్రత బలము శీఘ్రత్వము మలమూత్రాదివిసర్జనశక్తి వస్తుసంచలనశక్తి యుచ్ఛ్వాసనిశ్వాసములు ప్రాణము భవము నివి వాయుగుణంబులు శబ్దము వకాశ మనాశ్రయ మనాలంబనము నవ్యక్తము నవికారిత యప్రతీఘాతము శ్రోత్రము శరీరద్వారములు ననునివి యాకాశగుణంబు లిట్లు పంచభూతగుణంబు లేఁబది యని చెప్పంబడు ధైర్యము నుపపత్తి వ్యక్తివిసర్గము కల్పన క్షమ సత్తు నసత్తు నాశుత్వ మివి తొమ్మిదియు

మనోగుణంబు లిష్టానిష్టవిపత్తి వ్యవసాయము సమాధిత సంశయప్రతిపత్తి యివి యైదును బుద్ధిగుణంబు లనిన యుధిష్ఠిరుండు బుద్ధిగుణంబు లైదును సూక్ష్మంబుగ గ్రహింప నగుం గావున వానిని వివరించి చెప్పు మనినఁ గురుపితామహుండు బుద్ధి కైదుగుణంబులె కా వఱువది గుణంబులు కలవవి నిత్యములు గావు వేదవిరుద్ధవచనములు వానిని విడిచి నీవు భూతార్థతత్త్వంబ యెఱింగి శాంతబుద్ధివై తత్త్వవిచారంబు సేయుచుండు మనిన నౌఁ గాత మని యుధిష్ఠిరుండు వెండియును 502

మ. తమకుం బోలిన వారిచే నని మొనన్ ధాత్రీవిభుల్ త్రెళ్ళి మృ
త్యుముఖాంతర్గతు లైరి వీరలు మహాదోస్సారశౌర్యోజ్జ్వలుల్
నమితోర్వీధవు లుగ్రతేజులు ఘనుల్ నాగాయుతత్రాణు లే
సమయంబందును నోడ రిట్లు మృతిసంజ్ఞం గాంచి రే మందుఁ బో. 503

క. ఏనికి మృత్యువు మృత్యువు, నా నెట్టిద దెట్లు వచ్చు నానాజనులన్
బో నడఁచునట్టి దెయ్యది, యో నాకు నెఱుఁగఁ జెప్పు మోవసుమూర్తీ. 504

భీష్ముండు ధర్మరాజునకు మృత్యుదేవత తెఱం గెఱింగించుట.

వ. అనిన భీష్ముం డిట్లనియె 505

సీ. కలఁడు మున్నాదియుగంబున ననుకంపకుఁ డనురాజేంద్రుఁడు క్రూరు లైన
శత్రువులకుఁ జిక్కి సంగ్రామరంగము, నందుఁ బ్రక్షీణవాహనబలుండ
యగునంత విష్ణుతుల్యపరాక్రముం డగు, నతనిపుత్త్రుఁడు హరి యనెడువాఁడు
పగఱ నెదిర్చియు బలపదానుగులతో, శత్రుహతుం డయి సమసి పోయె

ఆ. శత్రువశగుఁ డైనధాత్రీతలేంద్రుండు, పుత్త్రశోకమునను బొగిలి పొగిలి
తనకుఁ దాన శాంతి దనర యదృచ్ఛమై, నారదర్షి నొక్కనాఁటఁ గాంచి. 506

వ. నమస్కరించి శత్రుగ్రహణంబును బుత్త్రనిధనంబు లోనగు తనసర్వవృత్తాంతంబు విన్నవించుటయు నతం డతనిదెసం గరుణాళుండై పుత్త్రశోకాపహంబగు నొక చరిత్రంబు గల దది నే విన్నచందంబున వివరించెద విను మని యి ట్లనియె.

చ. నలువ సృజించినట్టిప్రజ నాలుగుమూలలు నిండి వృద్ధిమై
నెలకొని యూర్పుపుచ్చుటకు నేనియుఁ జోటిసుమంత లేనియ
ట్లలుముకొనంగ ముజ్జగమునం దెడ మున్నది లేక కుంచమం
దొలయఁ గదుల్లో వోసినటు లుండెఁ జరాచరభూతజాతముల్. 508

తే. అపుడు సర్వేశ్వరుండు సంహారమును బొ, నర్పఁగా బుద్ధి చేసె మనంబునందుఁ

గాని వానికి నెటు సూచెనే మహాయ, మరణము వాటించె నేవేళ నైనఁ గాని.

వ. దానం జేసి వానిమానసంబున మహాక్రోధం బొక్కుమ్మడి సముద్భవించి మిక్కుటం బయ్యె నంత నా క్రోధంబున నాతని యింద్రియంబులనుండి మహానలంబు పుట్టి మిట్టుమీఱె ననంతరంబ. 510

చ. అనలము చుట్టుముట్టి జగ మంతయు వింతగ ముట్టుపెట్టి క్రిం
దను మఱి మీఁద వెల్వలను దాపల లోపల నెల్లదిక్కులన్
మునుకొని తాల్చిపుచ్చి దివముం భువనంబును భూమి భస్మమై
చనియెఁ జరాచరం బయినజంతుసమూహముతోడ ప్రేల్చిడిన్. 511

వ. ఇట్లెల్లభూతంబుల భస్మావశేషంబు గావించి కుపితుండై యున్న బ్రహ్మదేవుని పాలికిఁ బ్రజాహితకాముఁడై వేదాధ్వరవిభుండును జటాధరుండు నగుపరమ శివుండు వచ్చి శరణంబు జొచ్చుటయు నతం డతనిం గని. 512

క. ఏకోర్కి కోరి వచ్చితొ, నాకడ కీవు డీవు వరమునకు నీ వర్హుం
డై కానుపింతు విచ్చెదఁ, గైకొను మేఁ గర్తఁ బ్రియము గావింపంగన్. 513

వ. అనిన శంకరుం డి ట్లనియె. 514

ఉ. ఏను బ్రజాహితార్థ మయి యిచ్చుటికిం జనుదెంచినాఁడ నే
దేని మఱొండు కర్జ మది యింతయు లేదు హిరణ్యగర్భ! నీ
చే నొనరింపఁగాఁ బడియెఁ జెన్నలరామచునుండు రీ ప్రజల్
మాననికిన్క వీరిపయి మాఁటువడం బొనరింప నేటికిన్. 515

క. నీదగు తేజోగ్నిప్రభ, నేదిక్కును గానరాక యీప్రజ లెల్లన్
బూది యయి పోవుచుండిరి, సాదరముగ వీరిఁ జూడు మంబుజగర్భా! 516

మత్త. నావుడుం బరమేష్ఠి యి ట్లను నాకు వీరిపయిన్ ద్విష
ద్భావ మింతయు లేదు వీరలవర్తనం బహితంబు గా
దావసుంధర భారపీడిత యై ననుం గడు వేఁడ నే
నీవిధంబున లాఘవార్థమ యెంచి చేసితి సంహృతిన్. 517

క. భారము మిక్కుట మైనన్, ధారణి జలమందు మునిఁగి నాశన మగు నం
చారటము హెచ్చఁ జెప్పన్, దీరుపఁ దోపమిని క్రోధతీవ్రత కలిగెన్. 518

వ. అనిన మృత్యుంజయుం డి ట్లనియె. 519

మానిని. ఈవు ప్రసన్నుఁడవై కృపఁ గైకొని యీ ప్రజఁ గావుము సంహృతిమై
స్థావరజంగమకోటులతో నివె సర్వజగంబులు బూడిదయై

పోవుచునున్నవి పోయినచో మఱి పుట్టుట దుర్ఘట మట్లగుటన్
గావుము నీదగు తేజము పెంపునఁ గావుణికత్వము గల్గికొనన్. [521]

తే. భూతహితకాముఁడవు నదాహమునకుఁ గాని యొండుపాయము చింతింపు మో జగ
ద్భూ! ప్రపంచ మొనర్చితి మున్న నీవ, ప్రజఁ బునస్సృష్టిఁ గావింపఁ బ్రార్థనంబు.

వ. అని ప్రార్థించినం బ్రసన్నుండై పితామహుండు నిజమనోవాక్కుల నియమించి
తేజం బంతరాత్మ నడంగం జేసికొని లోకపూజితుండై మరలఁ బ్రవృత్తి
నివృత్తులం గల్పించె నాసమయంబున నతని సకలేంద్రియంబులనుండియు. 522

ఉ. నల్లని నేత్రముల్ మఱియు నల్లని మేను లలాటమధ్యమున్
నల్లని వస్త్రయుగ్మమును నల్లని హస్తతలంబు గల్గి భూ
షోల్లసదంగియై పాడమి యొక్కవధూమణి దక్షిణంబుగా
నల్లన మెట్టుచో నరసి రాపరమేష్ఠియు నష్టమూర్తియున్. 523

వ. అంత లోకేశ్వరుం డాయమం దలంచి మృత్యువా! యని పిలిచి నీవు నాచేఁ
బ్రజాసంహారార్థము స్మరింపఁ బడితివి గావునఁ బండితుండు పామరుండు నాక
నీ వీరెల్ల ప్రాణులం బొలియింపుము నాని యోగంబుఁ దీర్చిన నీకు మే లయ్యెడు
ననినఁ గమలమాలిని యగునామృత్యుదేవత పాకం బైనశోకంబునఁ గన్నీరు
మున్నీరై పాఱ నేడ్చుచున్నం గని చతురాననుం డాకన్నీరు ధారణిం బడ
కుండఁ బాణితలంబులం బట్టి దుఃఖోపశమనంబుగాఁ బలుకుచుం బ్రార్థించు
టయు నాయమ తనలోనిశోకంబుఁ బోకార్చుకొని ప్రాంజలియై కమలాసనుని
దెసం బరికించి యి ట్లనియె. 524

మ. మహనీయుం డగునిన్ను వంటిమునిసమ్మాన్యుండు సృష్టింప నై
మహముం గాంచిన నేను రౌద్ర మగుకర్మంబుం బొనర్పన్ భయ
ప్రహతాత్మన్ దపియించుచుండితి నధర్మం బంచు నీలో నను
గ్రహముం జేయుచు ధర్మకర్మము నొనర్పన్నన్ను నేమింపుమా. 525

ఉ. బాలుర వృద్ధులన్ వయసువారల గొంతుక నుల్మి చంపఁగాఁ
జాల ననుగ్రహింపుము ప్రసన్నుఁడ వై ననుఁ గాచిపుచ్చు మో
పాలితలోక! పుత్త్రులును భ్రాతలు మిత్త్రులు తల్లిదండ్రులున్
గూలిన నున్నవారవుడుఁ గొల్లున నేడ్చుచు నన్నుఁ దిట్టరే. 526

క. దీనులపరిదేవన నా,మానసముం గాల్చిపుచ్చు మహిఁ బడుకన్నీ
ళ్లీనసుఁ బూడిద సేయున్, గాన నినున్ వేఁడుకొందుఁ గావు మధీశా. 527

ఆ. చచ్చినట్టిప్రాణి జమునింటి కేగునే, జోక పోదు నిన్ను ద్రొక్కి వేఁడు
కొందు నీదుకరుణఁ గోరి నేను దపంబు, నాచరింపఁ బోదు నాజ్ఞ యిమ్ము. 528

తరలము. అనఁ జతుర్ముఖుఁ డిట్లు వల్కె మహామతీ విను నిన్ను నే
జనన మందినవారి నెల్లరఁ జంప నే సృజియించితిం
జనుము చెప్పినచొప్పునం గ్రియ సల్పు మల్పను నైన మా
అనకు మియ్యెడి నీకుఁ దప్పని దయ్యొ నియ్యెడఁ జెప్పితిన్. 529

సీ. అనుడు మృత్యువు బదులాడ నేరక గరి, సత్త్వానఁ జూచుచు సరస నిలిచె
నలువ ప్రసన్నుఁడై నవ్వుచున్ జగములఁ, దిలకించి లో నీసుఁ దొలఁగఁ ద్రోచె
నంత మృత్యువు వాని యానతిం బెదతలఁ, జొనిపి ధేనుకతీర్థమునకుఁ బోయి
యొంటికాల న్నిల్చి యుండి యందుఁ దపించెఁ, బదునేనుపద్మముల్ వత్సరమ్ము
తే. లప్పు డజుఁ డేగుదెంచి నేఁ జెప్పినట్లు, చేయు మనుటయు నష్టాట పాయఁ ద్రోచి
యెప్పటిం గొన్ని కోటులయేండ్లు ఘోర,తప మొనర్చెను నిష్ఠమైఁ దపసు లెన్న.

చ. అటులు తపించుచున్ మృగములందుఁ జరించుచు గాలి తిండి గా
దిటపడి కొన్ని వేల్సములు తిండి యెఱుంగక మౌన మూని ప్ర
స్ఫుటముగఁ గొన్ని వేల్సములు పుష్కరపూరమున న్మునింగి దు
ర్ఘటగతిఁ గొన్ని వేల్సములు కాలముపుచ్చెను మిత్తి యత్తతిన్. 531

వ. అనంతర మామృత్యు వచ్చోటు విడిచి కౌశికీతీరంబునకుం జని యట వాయు
జలాహారనియమంబునఁ గొంతకాలము తపంబు గావించి యటనుండి గంగా
తీరంబునకుం బోయి యటఁ గొంతకాల ముగ్రతపం బొనర్చి యటనుండి
మేరువుం జేరి యట దారువువలెనిశ్చేష్టయై ప్రజాహితముం గోరి పెద్దకాలంబు
తపించి పదంపడి హిమవన్నగంబుఁ జేరం జని నిర్జరులు యజ్ఞంబు లొనర్చిన
చోట నొంటిప్రేలు నేల నంట నిలువం బడి యొక్కమహాఖర్వకాలంబు మహా
తపం బొనరించె నప్పు డప్పద్మసంభవుండు ప్రత్యక్షుండై పుత్రీ! యీఘోరతపఁ
బేమిటికి నాపన్పు గావింపు మనిన నాయమ్మ వినయమ్మునఁ గరంబులం జోడించు
కొని యిట్లనియె. 532

చ. ప్రజలను సంహరించుటకు వ్రాల నినుం బలిమాలుకొందు నో
యజుఁడ! యధర్మభీతి మెయి నాజ్ఞకుఁ లోఁబడ నోపకుంటి నీ
సృజనకు నైననన్నుఁ గృపఁ జేసినబుద్ధి నను గ్రహింపవే
వృజినములందు డిందుపడి వేఁగక యుండెదుదారిఁ జూపుచున్. 533

పోవుచునున్నవి పోయినచో మఱి పుట్టుట దుర్ఘట మట్లగుటన్
గావుము నీదగు తేజము పెంపునఁ గారుణికత్వము గల్గి కొనన్. [త్వ]

తే. భూతహితకాముఁడవు నదాహము నణఁగఁ గానియెడునుపాయము చింతింపు మో జగ
భూ! ప్రపంచ మొనర్చితి వున్న నీవ, ప్రజఁ బునస్సృష్టిఁ గావింపఁ బ్రార్థనంబు.

వ. అని ప్రార్థించినం బ్రసన్నుండై పితామహుండు నిజమనోవాక్కుల నియమించి తేజం బంతరాత్మ నడంగం జేసికొని లోకపూజితుండై మరలఁ బ్రవృత్తినివృత్తులం గల్పించె నాసమయంబున నతని సకలేంద్రియంబులనుండియు. 522

ఉ. నల్లని నేత్రములల్ మఱియు నల్లనిమేను లలాటమధ్యమున్
నల్లనివస్త్రయుగ్మమును నల్లనిహస్తతలంబు గల్గి భూ
షోల్లసదంగియై పొడమి యొక్కవధూమణి దిక్కినంబుగా
నల్లన మెట్టుచో నరసి రాపరమేష్ఠియు నష్టమూర్తియున్. 523

వ. అంత లోకేశ్వరుం డాయమం దలంచి మృత్యువా! యని పిలిచి నీవు నాచేఁ బ్రజాసంహారార్థము స్మరింపఁ బడితివి గావునఁ బండితుండు పామరుండు నాక నీ వీయెల్లప్రాణులం బొలియింపుము నానియోగంబుఁ దీర్చిన నీకు మే లయ్యెడు ననినఁ గమలమాలిని యగునామృత్యుదేవత పాకం బైనశోకంబునఁ గన్నీరు మున్నీరై పాఱ నేడ్చుచున్నం గని చతురాననుం డాకన్నీరు ధారణిం బడకుండఁ బాణితలంబులం బట్టి దుఃఖోపశమనంబుగాఁ బలుకుచుం బ్రార్థించుటయు నాయమ తనలోనిశోకంబుఁ బోకార్చుకొని ప్రాంజలియై కమలాసనుని దెసం బరికించి యి ట్లనియె. 524

మ. మహనీయుం డగునిన్ను వంటిమునిసమ్మాన్యుండు సృష్టింప నై
మహముం గాంచిననేను రౌద్ర మగుకర్మంబుం బొనర్పన్ భయ
ప్రహతాత్మన్ దపియించుచుండితి నధర్మం బంచు నీలో నను
గ్రహముం జేయుచు ధర్మకర్మము నొనర్ప న్నన్ను నేమింపుమా. 525

ఉ. బాలుర వృద్ధులన్ వయసువారల గొంతుక నుల్మి చంపఁగాఁ
జాల ననుగ్రహింపుము ప్రసన్నుఁడ వై ననుఁ గాచిపుచ్చు మో
పాలితలోక! పుత్త్రులును భ్రాతలు మిత్త్రులు తల్లిదండ్రులున్
గూలిన నున్నవారపుడుఁ గొల్లున నేడ్చుచు నన్నుఁ దిట్టరే. 526

క. దీనులపరిదేవన నా,మానసముం గాల్చిపుచ్చు మహిఁ బడుకన్నీ
ళ్లీననుఁ బూడిద సేయున్, గాన నినున్ వేఁడుకొందుఁ గావు మధీశా. 527

ఆ. చచ్చినట్టిప్రాణి జమునింటి కేఁగినఁ, బోక పోదు నిక్కు ద్రొక్కి వేఁడు
కొందు నీదుకరుణఁ గోరి సేసు దపంబు నాచరింపఁ బోదు నాజ్ఞ యిమ్ము. 528

తరలము. అనఁ జతుర్ముఖుఁ డిట్లు వల్కె మహాసతీ విను నిన్ను నే
జనన మందినవారి నెల్లరఁ జంప నే సృజియించితిం
జనుము చెప్పినచొప్పునం గ్రియ సల్పు మల్పుడు నైన నా
అనకు మియ్యది నీకుఁ దప్పని దన్యథా నియ్యోగముఁ జెప్పితిన్. 529

సీ. అనుడు మృత్యువు బదులాడ నేరక గతి, సత్యనాఁ జూచుచు సరస నిలిచె
నలువ ప్రసన్నుఁడై నవ్వుచున్ జగములఁ, దిలకించి లో నీసుఁ దొలఁగఁద్రోచె
నంత మృత్యువు వాని యానతిం బెడతలఁ, జొనిపి ధేనుకతీర్థమునకుఁ బోయి
యొంటికాల న్నిల్చి యుండి యందుఁ దపించెఁ, బదునేనుపద్మముల్ వత్సరమ్ము
తే. లప్పుడజుఁ డేగుదెంచి నేఁ జెప్పినట్లు, చేయు మనుటయు నమ్మాట పాయఁ ద్రోచి
యెప్పటిం గొన్ని కోటులయేండ్లు ఘోర, తప మొనర్చెను నిష్ఠమైఁ దపసు లెన్న.

చ. అటులు తపించుచున్ మృగములందుఁ జరించుచు గాలి తిండి గా
దిటపడి కొన్ని వేల్సములు తిండి యెఱుంగక మౌన మూని ప్ర
స్ఫుటముగఁ గొన్ని వేల్సములు పుష్కరపూరమున న్మునింగి దు
ర్ఘటగతిఁ గొన్ని వేల్సములు కాలునుపుచ్చెను మిత్తి యత్తఱిన్. 531

వ. అనంతర మామృత్యు వచ్చోటు విడిచి కౌశికీతీరంబునకుం జని యట వాయు జలాహారనియమంబునఁ గొంతకాలము తపంబు గావించి యటనుండి గంగాతీరంబునకుం బోయి యటఁ గొంతకాల ముగ్రతపం బొనర్చి యటనుండి మేరువుం జేరి యట దారువువలెనిశ్చేష్టయై ప్రజాహితముం గోరి పెద్దకాలంబు తపించి పదంపడి హిమవన్నగంబుఁ జేరం జని నిర్జరులు యజ్ఞంబు లొనర్చిన చోట నొంటిప్రేలు నేల నంట నిలువం బడి యొక్క మహాఖర్వకాలంబు మహాతపం బొనరించె నప్పు డప్పద్మసంభవుండు ప్రత్యక్షుండై పుత్త్రీ! యీఘోరతపం బేమిటికి నాపన్ను గావింపు మనిన నాయమ్మ వినయమ్మునఁ గరంబులం జోడించుకొని యి ట్లనియె. 532

చ. ప్రజలను సంహరించుటకు వ్రాల నినుం బలిమాలుకొందు నో
యజుఁడ! యధర్మభీతిమెయి నాజ్ఞకుఁ లోఁబడ నోపనంటి నీ
సృజనకు నైననన్నుఁ గృపఁజేసినబుద్ధి నను గ్రహింపవే
వృజినములందు డిందుపడి వేఁగక యుండెడుదారిఁ జూపుచున్. 533

వ. ఇట్లధర్మభీతరై చేతులు జోడించి వేఁడుచున్నసన్నతాంగిం గనుంగొని హిరణ్యగర్భుం డిట్లనియె. 534

సీ. ఇది యధర్మము కాదేనాఁటికిం బ్రాణి, సంహార మొనరింపఁ జాలు మమ్ము
యస్మృత మెన్నఁడు నావచనమునంగాఁ బోదు, నినుసనాతనధర్మమునకుమూర్తి
మీదేవతలు నేను నీదెసఁ బ్రీతుల, మింక నొండుకోర్కి నీకేది కలదొ
తెలుపు మేఁ దీర్చెదఁ గలుగదు దోష మీ, కర్జంబునం బ్రజల్ గదలవలనఁ

తే. దెగుచునుందురు నీదుకన్నుఁగవనుండి
పడెడు నీ ర్వట్టితిని నేను వ్యాధు లగుచు
నవి ప్రజలఁ గూల్చుతఱి యైనయపుడ నీవు
పున్నపుంసకస్త్రీరూపములను గొనుము. 535

వ. అని చెప్పిన నొప్పుకున్నయప్పడంతిం గని నీ కింతధర్మభీతియగునేని నీవు తటస్థవై యుండి ప్రాప్తకాలంబుల రోగంబులం గాక కామక్రోధంబులం బుచ్చుమవియే ప్రాణిలోకంబున కపాయకరంబు లగుచుండు నందున నీ కధర్మంబు గాక యుండు ననిన నామె శాపభయంబున నెట్టకేల కట్ల యగుం గాక యని సంహారంబున కొడంబడి తనకృత్యంబున జాగరూకయై కామక్రోధంబులను రోగంబులం బుచ్చి ప్రాణికోటులఁ గీటడంచుచుండుఁ గావున మృతికి శోకింపం బని లేదు సుషుప్తియం దింద్రియములు నిశ్చేష్టములై జాగ్రదవస్థయందు సచేష్టము లైనట్లు శరీరులును దమశరీరముల విడిచి పరలోకంబుల కేగి మరల నీలోకంబునకు వచ్చుచుండ్రు దేవతలు పుణ్యానుభవానంతరమున మర్త్యలోకముఁ జొత్తురు మర్త్యులును బుణ్యానుభవంబునకై దేవలోకంబున కేగుదురు గావున నోయనుకంపకా! నీవు నీపుత్త్రునికై శోకింపకుము నీపుత్త్రుం డిపుడు దేవలోకంబున సుఖంబున్నవాఁ డని చెప్పి యొప్పించె నోధర్మరాజా! దేవసృష్ట యగుమృత్యువు ప్రాప్తకాలంబున నిజాశ్రుపాతసంజనితంబు లగువ్యాధులం బుచ్చి ప్రాణికోటుల సంహరించుచుండు ననిన యుధిష్ఠిరుండు ధర్మంబన నెట్టిది యది యెట్లు కలుగుచున్నది ధర్మం బిహార్థమా యాముత్రార్థమా యుభయార్థకమా తెలియ నానతి మ్మనిన శాంతనవుం డిట్లనియె. 536

భీష్ముండు ధర్మస్వరూపనిరూపణముచేయుట.

సీ. స్మృతి సదాచారము శ్రుతు లను మూఁడును, ధర్మముం దెలుపును ధనముఁగూడ
ధర్మలక్షణ మని ధర్మజ్ఞులం డ్రిహ, పరసుఖోదర్కమై పరఁగుధర్మ

మది యెఱుంగనిపాపి యగువాఁడు పాపము,లనుభవించును ముక్తుఁడగుట కల్ల
యాపదలం దసత్యము వోలె నాపద, లం దధర్మము ధర్మ మండ్రు బుధులు
తే. ధర్మనిష్ఠ యాచారమే దాని నాశ్రయించి సుఖపడుఁ దస్కరుం డితరధనము
లపహరించియు ధర్మము నాచరించు, నట్టిధర్మ మధర్మమై యగును జూవె. 536
మ. తనపక్షంబున రా జెసంగు ననుచున్ దర్పించి దుష్టాత్ముఁడై
ఘనులన్ స్వస్వధనాతితుష్టు లగుయోగ్యస్వాంతుల న్నొంచి త
ద్ధన మెల్లన్ హరియించి ధార్మికుఁడు నాధర్మంబు గావించుచున్
మనమం దించుక శంకలేక సభలన్ వర్తించు యోగ్యుం డనన్. 537
ఉ. సత్యము మించి నట్టియది సర్వజగంబుల లే దొకండు నా
సత్యమె మూల మన్నిఁటికి సత్యమునంద సమస్తధర్మముల్
నిత్యము నిల్చియున్న యవి నిత్యదురాత్ములు వారికార్యముల్
సత్యము నాశ్రయించుకొని సల్పుచు నుందురు లేక మోసముల్. 538
క. అది లేకయున్న నొండొరుఁ, పదపదమునఁ బోరుకొనుచు వాదము లెసఁగన్
తుది మొదలు లేక యాఖలు, లదవదలై కొట్టుకొనుచు హతులగుదు రిలన్.
సీ. పరులధనంబు నపహరింపకుండ స,నాతనధర్మము నా నెసంగు
నది దుర్బలులమాట యని బలవంతు లం,దురు గాని దైవంబు తొలఁగి నపుడు
తమమాట తప్పని తలఁతురు బలవంతు,లు సుఖంతు రెపు డనఁ బొసఁగఁబోదు
కావునఁ జెడుదారిఁ బోవరా దట్టివా,రి కసాధుభయమును నృపతిభయము
తే. చోరభయమును లేకుండు నేరికి నొక, కీడు సేయనివాఁడు లో నోడకుండు
నూరుసేరినవనమృగ మో యనంగ, దొంగ జంకుచు నుండు నేసంగడమున.
ఆ. తానుఁ బాపి యగుచుఁ దనవలె నితరులు, పాపు లనుచుఁ దలఁచుభావమందు
నెఱిఁ గలట్టివాఁడు నిత్యసంతోషి యై, భయ మెఱుంగ కెల్లపట్ల మెలఁగు.
ఆ. భూతహితముఁ గోరుపురుషుండు పాత్రదా,నమ్మె ధర్మ మనుచు సమ్మతించు
దాన విధిదరిద్రదర్శిత మను ధని, తాను నిస్వుఁ డైన దాని మెచ్చు. 542
క. ఒరు లొనరించినకీడుం, బురుషుఁడు తా నెట్లు సైఁపఁ బోకుండెడునో
యొరు లట్లు సైఁప రనుచున్, పరివర్జింపంగ వలయుఁ బరభర్త్సనముల్. 543
క. ఉపపతిగా నుండియుఁ దా, నుపపతి తప్పెన్ని యనుట కోపం డట్టిం
డుపపతి తనపత్నికిఁ గా, నెపుడున్ సైఁపం డటంచు నెఱుఁగఁగ వలయున్.544
తే. బ్రతుక నెంచినవాఁ డెప్డు పరుల నొంపఁ, డెట్లు తాఁ గోరునో పరుఁ డట్లె కోరు

నని తలంపఁ దగుఁగ దాను తినెడు దాని, నేనిఁ బెరవారికిం బెట్టఁ బూన వలయు.

క. దేవతలు మెచ్చుమచ్చున, గావింపఁగ వలయు జనుఁడు కర్జంబుల లా
భాకృతుఁ డైనఁగ ధర్మముఁ, బో విడువఁగ రానిదనుచు బుధులం ద్రు నృపా.

వ. ఇట్టివే పరమధర్మంబు లీలక్షణంబులం బట్టి ధర్మాధర్మంబుల తెఱం గెఱుంగ వలయు నీధర్మములే తొల్లి విధాత వెలయించినవియు మన పెద్ద లాచరించిన వియు నిది ధర్మలక్షణంబు నీ వీదారిం బ్రవర్తించి కృతార్థుండ వగు మనిన ధర్మనందనుండు. 547

సీ. ధర్మజ్ఞ ధర్మముత్తమము సూక్ష్మం బని, తత్ప్రమాణంబు వేదంబ యంటి
మిడిమిడిజ్ఞానంబు మెఱయుచున్నది నాకు, నీవు చెప్పినది గ్రహింతు నేమొ
నాశంకలకు నెల్ల నాట సమాధాన,ములు సెప్పితి మఱొండు తెలియఁ దలఁతుఁ
బుట్టుచుం బెఱుఁగుచు గిట్టుచున్నవి జంతు,వులు పరిపాకమువలన నెల్ల

తే. ధర్మము లెఱుంగ లే మని తలఁప వచ్చు, నవి సమస్థులు విషమస్థు లైనవారి
కొక్కకవిధంబు నాపద నొక్కవిధము, గాఁగ నుండును దెలియుట కష్టతరము.

క. ఇది గాక సదాచారము, సదమలధర్మంబు నాఁగ సజ్జను లం ద్ర
య్యది లక్షణరహితం బగు, నెది సాధ్య మసాధ్య మెద్ది యెఱుఁగుట యెట్లో.

క. తెలియక ధర్మం బనుకొని, సలుపునధర్మంబ ధర్మసంగత మనుచుం
దెలిసియు నొక్కఁడు కర్మము, సలుపుఁగ ధర్మంబుఫలము సమకుఱుపొంకెఁ.

వ. ఇందులకు శాస్త్రప్రమాణంబులునుం గలవు యుగానుసారముగ వేదవాదమ్ము లును క్షీణించుచున్నయవి ప్రతియుగమ్మునందును ధర్మశాస్త్రములు వేఱువేఱు మార్గంబులం బడి బహుముఖంబు లగుచున్నవి వేదవచనమ్ములు సత్యమ్ము లనుట లోకసంగ్రహార్థం బాశ్రుతులనుండి స్మృతులు సర్వతోముఖంబు లైనవి కావున వేదము ప్రమాణం బయినప్పుడు శాస్త్రంబులును బ్రమాణంబులగు వానికిం బరస్పరవిరోధం బున్న నవి రెండును బ్రమాణంబులు కాఁజాలవు మఱియు నవి దుష్టజననిరోధితంబులై నాశనముం బొందుచున్నవి ధర్మము క్షుర ధారవలె సూక్ష్మంబును బర్వతంబువలె గరీయంబునై తొలిదొల్త గంధర్వ నగరంబువలెం గానంబడియు నదర్శనం బగుచుండు గోపాలపాత్రయందలి జలంబువలెను క్షేత్రంబునందలి గాలువవలెను బ్రవృత్తి చెడినప్పు డాధర్మంబు నశించుఁ గామంబునఁ గొందఱును నిర్బంధంబునఁ గొందఱును గారణాంతరం బులఁ గొందఱును ధర్మ మాచరించుచుందురు దుష్టుండు దురాచారము లాచ

రించుటయు ధర్మంబ యగు మూఢులు ధర్మప్రవచనము లసత్యము లని పరిహ
సింతురు మహాజనులు నిజధర్మంబుల విడనాడి రాజాదిధర్మంబుల నాశ్రయింతు
రొక్కధర్మంబుననే యొక్కఁడు సుఖించు నింకొక్కఁడు దుఃఖించు నాచారముల
కును ఫలసిద్ధి బహుప్రకారంబు పూర్వప్రసిద్ధధర్మం బెప్పటికిని శాశ్వతంబ
యని ధర్మనందనుండు తనసందియంబు లిట్లు వెల్లడించి ధర్మమూర్తీ! నాయీ
సంశయంబులెల్లం దీఱ ధర్మస్వరూపనిర్ణయంబు గావింప ననుగ్రహింపు మని
నిలింపనదీనందను నడిగె నని వైశంపాయనుండు జనమేజయునకుం జెప్పె నని
సూతుండు నైమిశారణ్యవాసులకుం జెప్పిన వారవ్వలివృత్తాంతంబు చెప్పుమని
యడుగుటయును. 551

ఆశ్వాసాంతము.

చ. త్రిభువనముం బవిత్రముగఁ దీర్చెడుగంగకుఁ దోడఁబుట్టువై
విభవసమేతమై జగతి విశ్రుతికెక్కినవంశమందు స
త్ప్రభు వగువాసిరెడ్డికులవారిధిచంద్రుఁడు చంద్రమౌళి దా
ఋభుపతితుల్యవైభవసమేతవిభుత్వమునం దలిర్చుతన్. 552

గద్యము.

ఇది శ్రీమదధునాతనోభయకవిమిత్ర, వేంకటయజ్వాగ్రపుత్ర,
సమారాధితవిబుధరాజ, శ్రీపాదకృష్ణమూర్తికవిరాజ,
ప్రణీతం బయినశ్రీకృష్ణభారతంబునందు
శాంతిపర్వంబున షష్ఠాశ్వాసము.
శ్రీశ్రీశ్రీ



శ్రీ

బాలాత్రిపురసుందర్యై నమః.

# శ్రీకృష్ణభారతము

## శాంతిపర్వము - సప్తమాశ్వాసము.



మత్సుదర్శనాఖ్య
శ్రీమహితునిఁ గన్నతండ్రి శ్రీపదకృష్ణ
స్వామికృతిరాజ మిల నా
సోమార్కముగాఁ దలిర్చు సురుచిరలీలన్. 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కి ట్లనియె న ట్లడిగినధర్మనందనుం గాంచి నదీనందనుండు నీసందియంబు లెల్లం దీఱ నొక్కపురాతనేతిహాసంబు గలదు చెప్పెద నవహితుండ వగు మని యి ట్లనియె. 2

### జాజలితులాధారులసంవాదప్రకారము.

మ. మునుమున్ జాజలి నాఁగ నొక్కద్విజుఁ డంభోరాశితీరంబునన్
ఘనకాంతారమునందు ఘోరతపముం గావించుచున్ బెక్కులేం
డ్లు నితాంతంబు యతవ్రతంబు వెలయన్ లోలత్వముం బాసి తో
లును నారల్ జడలున్ ధరించి జలముల్ భోజ్యంబుగా వర్తిలున్. 3

వ. ఆతం డొక్కనాఁడు జలంబులం దుండి నిజమనోబలంబున నెల్లలోకంబులం జూచుచు. 4

క. నాకుం జాలినవాఁ డీ, లోకంబులఁ గాని నీటిలోపలఁ గానీ
నాకంబునందుఁ గానీ, లేకుంట నిజంబు లేరు లే రెవ్వారున్. 5

వ. అని జలంబులనుండి సగర్వంబుగాఁ బలుకుకొనుచున్నవాని కెఱుకపడున ట్లదృశ్యభూతంబు లి ట్లనియె. 6

ద్విపద. నీ వెవ్వరో కాని నీకిట్లు గర్వ, భావంబుతో నాడఁ భావ్యంబుఁ గాదు
పో వోయి కాశికాపురిఁ గీర్తితుండు, పావనాచారుండు పాపదూరుండు
తా వొప్పులకుఁ దులాధారుఁ డాతండు, నీవలె గర్వోక్తి నెగడుకోఁ బోఁడు.

వ. అని యదృశ్యభూతంబులు పలికిన విని జాజలి వాని నుద్దేశించి. 8

తే. ప్రాజ్ఞుఁ డైనతులాధారుఁ బరమకీర్తిఁ, జూడఁ గా నెంచినాఁడ నేఁ జూచు టెట్లు
నావుడున్ భూతములు వాని నావననిధి, నుండి వెడలించి యిట్లను నండఁ జేరి.

క. ఈదారి వట్టి పొమ్మా, భూరియశున్ వారణాసిపురమునఁ జూడం
జేరుదు వని యాభూతము, లారయ రాకుండఁ బోయె నంతటిలోనన్. 10

వ. అనిన నక్కౌంతేయాగ్రజుం డోమహాత్మా! జాజలి యెట్టిసుకృతకర్మం బాచరించి యట్టిమహాత్త్వం బార్జించెఁ దులాధారుం డెట్టివాఁడు చెప్పు మనిన శాంతనవుండు వెండియు. 11

సీ. వినుము జాజలిఘోరమునుమహోన్నతమగు,తప మొనర్చినవాఁడుధరణిసురుఁడు
తాను వానప్రస్థధర్మమునం దుండి, యుభయసంధ్యల స్నాన మొనరఁ జేసి
స్వాధ్యాయపరుఁడు నగ్న్యారాధకుండు నై, తేజోవిరాజి యై తేజరిల్లె
వానకారున నిరావరణదేశంబున, జలివేళ నీట వేసంగి నెండ

తే. నుండి తపియించుఁ గాని తానున్నతుండ,నని తలంపఁడు నేలమీఁదన శయించు
వర్షజలమును మట్టియుం బడుటఁ జేసి, జాజలిశిరంబు నెఱు లెల్ల జడలు గట్టె. 12

వ. అరణ్యగమనంబునం జేసి మలసంయుతుం డగునతం డొండొక్కకాలంబున నిరాహారుండును వాయుభక్షుండు నై యొక్కచోఁ గాష్ఠంబు వోలె నిలిచి చలింపనివ్రతంబునఁ దపంబుఁ గావింపం దొడంగె నట్టిసమయంబున. 13

తరలము. అడవిపిచ్చుక లమ్మహామహునౌదలం దృణతంతులన్
జడలలోపల గూడు గట్టి యజస్రమున్ మది ప్రత్యయం
బడరఁ గాఁపురముండె నాల్మగ లైనతచ్ఛకునంబులన్
బుడమివేలు పెఱింగి స్థాణువు వోలె నుండె దయాళువై. 14

తే. విశ్వసించి కులింగముల్ విప్రునెత్తి, నున్నతమగూటిలో సుఖంబుండి వర్ష
వో శరత్కాలమున కామమునను గూడి, గ్రుడ్లు పెట్టె జాజలినెత్తిగూఁటిలోన.

వ. శంసితవ్రతుండుఁ గాన నతండును వాని నెఱింగి ధర్మబుద్ధిం జేసి చలింపకుండె నండజంబులు నంతకంత కతిశయించిన విశ్వాసంబున రేయిం బవ లానీడంబు వీడం బోవక సుఖంబుగఁ గాలక్షేపము సేయుచుండె. 16

ఆ. అంతఁ గొంత కాల మఱిగినపదపడి, పవిలి గ్రుడ్లనుండి పక్షికూన
లుదయ మంది పెఱుఁగుచుండె మౌనీంద్రుఁ డవు, వానిరక్షఁ గోరి పూనె స్థిరత.

క. పిల్లలు కాలక్రమమున, నల్లన పక్షములు గలిగి యటు నిటు మెలఁగన్
మెల్లనఁ గూఁతలు గూయన్, జెల్లినవై యొప్పె విధివిశేషముకలిమిన్. 18

వ. జాజలియు జాతపక్షంబు లగువానిం జూచి పరమప్రీతుండై యుండె నిట్లు పిల్లలును దల్లిదండ్రులును నిశ్చయంబుగా నందు నిత్యనివాసంబు సేయుచుఁ బవలు పిల్లలం గూడి పోయి వచ్చుచు రేలందు సుఖనిద్ర సేయుచు నిట్లు కొంత కాలం బుండి కులింగంబులు గూడు విడిచి యెందేనియుం బోయె నతండును వాని రాకకై యొకమాసంబు వేచియు వానిజాడం దెలియమి సంయమీంద్రుఁ డవి యింక రావని నిశ్చయించుకొని తాను గృతకృత్యుండ నైతి ననియుఁ దనకు సిద్ధి గలిగె ననియు సంతసించుచు నచోటు వాసి నదీస్నానంబు చేసి సూర్యు నారాధించి శకుంతసంరక్షణంబునం జేసి నాయట్టిధర్మశీలుం డెందును లేఁ డని గర్వించె నప్పుడు భూతంబు లట్లు తులాధారుం బ్రశంసించె దాని కతండు కదలి కతిపయప్రయాణంబుల వారణాసీపురంబు దరియం జని యటఁ బణ్యము లమ్ముకొనుతులాధారుం జూచుటయు నతం డతనిం జూచి లేచి సంతసించుచు నెదురేగి తోడితెచ్చి పూజించి యి ట్లనియె. 19

ఉ. నీ విట రాకమున్న నిను నే నెఱుఁగం గలవాఁడ నైతి భూ
దేవ సముద్రతీరమున దివ్యతపం బొనరించునీతలన్
కేవలవృక్షమందు వలెఁ గేల్కొని పిల్లలఁ బెట్టెఁ బక్షు లీ
వావిధముం గ్రహించి చరితార్థుఁడ నంచుఁ దలంచి తెందునన్. 20

క. ఆకాశవాణి నీదగు, వాకున్ సయిరింప కిట్లు పంచెను నిన్నున్
నాకడకు నేమి వలయునొ, వాకొను మన విస్మయంబు పడి ద్విజుఁ డనియెన్.

తే. ఓతులాధార! రసములు నోషధులును,గంధములు దారువులు మూలకందఫలము
లమ్ముకొనువాఁడ వీ నైష్ఠికామలమతి, యెట్లు పుట్టెనో నా కిప్పు డెఱుఁగఁజెపుమ.

వ. అనిన ధర్మార్థతత్త్వవేత్త యగునప్పైశ్యోత్తముండు సనాతనంబు లగుధర్మరహస్యంబు లే నెఱుంగుదు నని ధర్మసూక్ష్మంబులతెఱం గిట్టు లని చెప్పం దొడంగె నాకర్ణింపుము. 23

ఆ. ఎల్లభూతములకు హిత మైనమైత్రి పు,రాణధర్మ మనిరి ప్రాజ్ఞు లెపుడు
భూతములకు ద్రోహబుద్ధి సూపమి యొప్పుఁ, దప్పనపు డొకింత యొప్పు నండ్రు.

సీ. ఏ నిట్టివృత్తిమై నెసఁగుచుంటి నొకళ్లు, నఱికి తేఁ గొన్న తృణములు కాష్ఠ
ములు వెట్టి కట్టితి నిటు లత్తుకయుఁ బద్మకము తుంగముస్తలు గంధములును
మద్యవర్జము లైనమహితరసంబులు, గొని యమ్ముదును మోసగొలుపకుండ
నొకని నిరోధింప నొకని విద్వేషింప, నందర మైత్రివై నరయుచుందుఁ
తే. త్రికరణంబుల ధర్మముల్ తెలిసి యెల్ల, వారికిన్ మేలుఁ గోరుదుఁ గోరిక విడి
సర్వసముఁడను నాత్మ సుసర్వభూతములకు సమఁడుల్లగతి మెయి మెలఁగుచుండు.
తరు. పరు లాచరించెడుపనుల నేఁ బొగడఁ, బరిహరిం దెగడ దివముసందుఁ బోలె
ధరయందుఁ గలచిత్రతతిఁ గనుచుందుఁ, దగుపైకి వెళ్లఁ దలఁతు లో సమత
గురురోగియును నంధకుఁడును వృద్ధుండు, కుంటి లోనగువారు కోరనియట్లు
నితర కామాదుల నిస్పృహాత్ముఁడ, నిలుతు నెల్లప్పుడు నే మునిచంద్ర. 26

సీ. తనకు భయము లేక తా భయపెట్టక, ద్వేషముం గోర్కియుఁ దెలియఁ బోక
ప్రాణికోటులయెడఁ బాపభావము లేక, మసలెడువాఁడు బ్రహ్మాత్వ మొందు
జన మేనివాపడికిని కైవడికి మిత్త్రికిని నా జడియువాఁడు వనటఁ గుందు
సన్మార్గగులును హింసాశూన్యులును వృద్ధులగువారివృత్త మే ననుసరింతు
తే. వినుసదాచారమును వీడ వేదధర్మ, రహితుఁ డగుజితేంద్రియుఁడును బ్రాజ్ఞుఁడైన
వాఁడు నా సదాచారము వట్టియున్న, ధర్మఫలభాజనుం డగుఁ దాపసేంద్ర.

క. ఒకనదిలోఁ గాష్ఠము మఱి,యొక కాష్ఠముతోడఁ గలియు నోసరిలున్ దై
వికమది భార్యాపుత్రాదికసంసృతి తద్విధ మని తెలియఁగ వలయున్. 28

క. వృకమునకుఁ బోలె వేనికి, సకలము భయపడునొ వాఁడు జలము న్వీడి యొ
డ్డుకుఁ జేరుజలచరం బనఁ, గకవికపడుచుండు నెల్లకాలము వింటే. 29

చ. జపతపముల్ సవంబులును సత్యము దానము ప్రజ్ఞ లోఁగ నా
నుపకృతులన్ లభింప నయి యున్న ఫలం బభయప్రదాన మె
ల్లపుడు ఘొనర్చుచుండునరుఁ డందెడుఁ గావున భూతహింసఁ బా
సెపుడు నొనర్పకుంటయె మహిన్ ఘనధర్మ మటంచు నెంచుమా. 30

చ. మునివర కర్మముల్ సలుపఁ బొందుఫలం బది కొన్నినాళ్లలో
జనుఁ దిర ముండ దాజనుఁడు సౌఖ్యములం దిగనాడి వెండియున్
మునుపటిఫక్కిని న్మెలఁగఁ బోయెడువాఁ డగు నిట్లెఱింగి స
న్మునిజను లెప్పు డప్పగిదిఁ బోవఁ దలంపరు నెమ్మనమ్ములన్. 31

తే. సుఖమునకుఁ గాదు ధర్మము సూక్ష్మ మగుటఁ

తెలియ దుర్లభ మగు శ్రుతుల్ దెలుపుసుఖము
నవియు గోప్యము నాచారభవము లగుచుఁ
గొన్నిధర్మము లొప్పెడుఁ గుతలమందు. 32

సీ. కోడెలబీజముల్ గొట్టియు ముక్కులు, గుట్టియు గంతలఁ బెట్టియుఁ బయి
బాధింత్రు కొందఱు వానిఁ జంపి భుజింత్రు, నీ వేల వారి నిందింపకుండు
తా నరుఁ డయ్యును దనసరినరుఁ దాస, భావమున న్నిల్పి పనులఁ గొల్పు
తనదుఃఖ మట్టు లాతనిదుఃఖ మనుకోక, వధబంధనాదుల వాని నొంచుఁ

తే. ప్రాణికోటులయందు బ్రహ్మయును యముఁడు
ప్రాణవాయువు చంద్రుఁ డర్యముఁడు క్రతువు
లోను గాఁగల నెల్లవేల్పులును నుండ్రు
వాని నమ్మి జీవించెడివారుఁ గలరు. 33

క. ప్రాణుల నమ్మినపాపం, బేనాఁటం దీఱ దనుచు నేర్పడె నింకన్
బ్రాణములు విడినజంతుల, మేనుల నమ్మినను జెప్ప మితి యట గలదే. 34

వ. చెప్పెద విను మజ మగ్ని మేషము వరుణుఁ డశ్వము సూర్యుఁడు పృథివి విరాట్టు ధేనువును వత్సంబును సోముండు గావున నజమేషాశ్వభూగోవత్సంబుల నెన్నఁడును విక్రయింపరాదు కొందఱు పశువుల బహుదంశంబులు మహాకర్దమంబును గలస్థలంబులం గట్టియు వాహంబులుగాఁ జేసికొనియుఁ బెద్దబరువు మోయించియు బాధింతు రది భ్రూణహత్యకన్న మిన్నయగు దోషంబు కృషి యొప్పు నందు రదియును దారుణంబ యగు నయోముఖహాలంబున భూమిం బగులించి యం దున్న ప్రాణుల హింసింతు రత్తఱి ననడ్వాహంబులం బూంతురు గోజాతి హింసింపరానిది ము న్నొకప్పుడు మహర్షులు నహుషునిచెంతకుం జని గోవు లోకమాతయనియు వృషభము ప్రజాపతియనియుం జెప్పుదు రట్టివాని నీ వెఱుంగక చంపితివి దానం జేసి మాకు వ్యథ యైన దని వానిప్రార్థనంబున వాని పాతకమును నూఱునొకఁడు భాగములుగా విభజించి వానిని రోగములుగా మార్చి ప్రాణులందుఁ బడవైచియు నహుషుని భ్రూణహంతఁ గా నెంచి వాని యజ్ఞంబున హవిర్భాగంబులు దేవతల కీయఁ జాల మని పలికినట్లు విని యుండు మిట్టిఘోరాచారములు కలవు వానిని నీ వెఱుంగకుంటి వని మఱియును, 35

క. కారణము తెలిసి ధర్మసమారంభము సేయ వలయు నది విహితము గా
కేరో చేసి రటంచున్, గోరిక మెయిఁ జేయ రాదు కోవిదవర్యా. 36

తే. నన్ను హింసించువానిని నాకు గొప్పఁదనముఁ దెచ్చినవానిని మనమునందు
సములనితలంతు నాకుఁ బ్రియమును నప్రియమును లేవని తెలుపుదు నార్యవర్య.
వ. అనిన జాజలి వాని కి ట్లనియె. 38
ఆ. తులను జేతఁ బట్టి తూఁచికొనెడు నీవు, ధర్మములను దెలుపఁ దవిలి భూత
జీవికయును గాక చెలఁగ స్వర్గద్వారము నరికట్టుచుంటి ఘనుఁడ వగుచు. 39
తే. కృషివలన నన్న మగు దాన నీవు నేను, బ్రతుకుచుంటిమి పశువులవలన నోష
ధులవలన లోకజీవిక యలరు వాన, యజ్ఞము లెసంగు ని ట్లాడ నగునె నీకు.
వ. అనినఁ దులాధారుం డి ట్లనియె. 41
సీ. నే నాస్తికుఁడఁ గాను నిందింప యజ్ఞముల్, ధరయజ్ఞవేత్త దుర్లభుఁడు గాన
యజ్ఞంబులకు నల్ల యజ్ఞవేత్తలకు న,మోవాక మొనరింతు నోర్మి జేసి
వినుము స్వయజ్ఞముల్ విడిచి విప్రులు రాజ,యజ్ఞముల్ గావింప నైరి యిపుడు
విత్తార్థ లగులుబ్ధవిప్రులు నాస్తికుల్, వేదవాదమ్ములవిధ మెఱుఁగక [చు
తే. అనృతసిద్ధాంతములనుసత్యములుగాఁగఁ, నొడివియందందు ద్రవ్యమునడిగికొను
జన్నముల్ వెలయించిరి జగతి దాన, స్తైన్యదుష్కర్మములు కొనసాఁగు నందు.
తే. సాధుహవ్యములకునమస్కారములకు,నలరుస్వాధ్యాయములకోషధులకు వేల్పు
లలరి సంతృప్తి నొందుదు రట్లు పూజ, కర్హ మగువాని శాస్త్రము లానతిచ్చె.
క. దుష్టులకు దుష్టపుత్రకు, లిష్టాపూర్తములవలన నెసఁగుదురు ధరన్
గష్టులకులుబ్ధజనులకుఁ, గష్టులు లుబ్ధులు జనింత్రు కర్మఫలముగన్. 44
సీ. ఫలకామనన్ ఋత్విజులు యజమానులు, సలిపినవిధులకుఁ జాలినట్లు
ప్రజలుఁ గల్గుదు రంబరమునుండి జలము నా,సవములనుండి ప్రజలు జనింతు
రగ్ని వేల్చినహోమ మాదిత్యు నొందు నా,తనివలనన్ వర్ష మొనరుచుండు
నావర్షమున నన్న మగుదానఁ బ్రజ లుద,యింత్రు పూర్వులు కోర్కు లిట్లు గొనిరి
తే. నేల దున్నక పండు నక్కాలమందుఁ, దృణలతాదు లాశీస్సుల వృద్ధి నొందు
ఫల మపేక్షింప రప్పటివార లిప్డు, ఫల మపేక్షించి లుబ్ధులై కలుగుచుంద్రు.
సీ. మఱిఁ బ్రమాణం బప్రమాణంబు గా నప్ర,మాణ మత్యంతప్రమాణముగను
జెప్పుచుఁ గర్మముల్ చేయించువిప్రుండు, నిజదుష్కృతంబున నిరయ మొందుఁ
గర్తవ్యములననుక్రమముగానొనరించు, బుధుఁడునిర్భయుఁడయిపొందుసుగతిఁ
గర్మఫలాపేక్షఁగాకుంటయున్నిత్య,సంతృప్తియున్ భూతచయహితంబు
తే. తత్త్వవిజ్ఞానమును గల్గి తనరువాఁడు, బ్రహ్మవిజ్ఞానముం బొందఁ బాత్ర మగును

సర్వదేవస్వరూపమై చనెడు ప్రణవ, మాతని సమాశ్రయించి పెంపలరుచుండు.

వ. ప్రజ్ఞానతృప్తునకు నిత్యతృప్తియు సుఖోదయంబు నగు ధర్మమే సుఖదాయకమని యెంచువారు సర్వసుఖంబు లొందినవా రగుచున్నారు కొందఱు విజ్ఞానధనులు సంసారసాగరముం దరింప నెంచి పుణ్యాదంబును బుణ్యాభిజనసేవితంబును నాశనరహితంబు నగుబ్రహ్మస్థానమును బొందుచున్నారు వారు స్వర్గాదిసుఖం బపేక్షింపరు కీర్తిధనాపేక్షంజేసి యజ్ఞాదు లాచరింపరు హింసాశూన్యయాగములనే యొనర్తురు వనస్పతుల నోషధుల ఫలమూలముల హోమక్రియ లాచరింతురు పరధనంబులం గోరక స్వధనంబుననే యజింతురు సజ్జనులు స్వధర్మాచరణంబును దామ కాక తమతోడిప్రజలను స్వర్గంబు నొందింతురు వారి నాలోకంబున ననడ్వాహంబులు శకటంబులం బూనుకొని మోయుచుండు గోవులు తమంతన పాలుపిదుకు వారిమనస్సంకల్పము లన్నియు నింతలో సిద్ధించుఁ బరిశుద్ధాత్ము లగువారు యూపసంగ్రహణంబునఁ బ్రాప్తదక్షిణలతో నధ్వరంబులు గావింపం దగు నట్టిపారిశుద్ధ్యము లేనివా రోషధులం జేసి యాగంబులు సేయం దగుఁ గోర్కియు నారంభము నిందయు స్తుతియు నభిలషింపక కర్మంబు ఫలింపమికి వగవ కుండువాఁడు బ్రాహ్మణుండు నాఁబడు ఫల మపేక్షింపక బ్రహార్పణబుద్ధితో యజ్ఞములు సేయువారు బ్రహ్మంబు నొందుదు రని చెప్పిన జాజలి తులాధారా! నీచెప్పినమనోయజ్ఞ మతికష్టతర ముండ నిమ్ము ప్రాజ్ఞులు కానివా రేకర్మంబు లాచరించి కృతార్థు లగుచుందురో యెఱింగింపు మనినఁ దులాధారుం డి ట్లనియె. 47

సీ. శ్రద్ధావిహీనులు సల్పుయాగమ్ములు, యాగముల్ గా వట్టియజ్ఞ లెపుడు
యజ్ఞముల్ గావింప నర్హులు గా రట్టి, వారొకధేనువు క్షీరములును
దధియు నాజ్యమును బాదమ్ములు కొమ్ములు, నెఱులు యాగద్రవ్యనిచయములుగ
నీవిధిచే శ్రద్ధనే పత్నిగాఁ జేసి, యిష్టదైవతము నూహించి వేల్చి

తే. సవనఫల మందుఁ బశువుల సర్వవస్తువులు పవిత్రపురోడాశము లన నొప్పు
సర్వనదులు సరస్వతుల్ సకలగిరులు, పుణ్యతమము లాత్మయెతీర్థమునిచంద్ర.

వ. జాజలీ! నీవు దేశాటనము సేయ నక్కఱ లే దున్నచోటున యుండి నాచెప్పిన చొప్పున ధర్మంబు లాచరింపుము తెలిసి ధర్మం బాచరించినవాఁ డుత్తమలోకమందు నని మఱియు. 49

తే. ఏ వచించినమార్గము లెల్ల శిష్టు, లైన దుష్టులు నైన సమాశ్రయింత్రు

గాక నీవు ప్రత్యక్షము గాఁగ దాని, నారయుము నీక తెలిసెడు నవ్విధంబు.

మ. ఇవె పక్షుల్ నలువంకలం దిరుగు నెన్నే నిందు నీనెత్తిపై
భవముం గాంచెను గొన్ని శ్యేనములు నా భాసిల్లెడిం గొన్నియుఁ
వివిధాశాగతిఁ బోవుచున్నయవి వీనిం బిల్వుమా ప్రేమతో
నవి నీచెంతకు రాక యుండ వని నాస్వాంతంబునం దెంచెదన్. 51

ఉ. రెక్కలనుండి పాదములు రేకులనంటఁగఁ గుంచి చూపు నీ
చక్కికిఁ ద్రిప్పి యొప్పు డనుచందమునం జనుదేర నుండె నీ
పక్షులు నీవు పెంచినవి బాపురె! తండ్రిని బిడ్డ లట్లు ని
న్నెక్కువ ప్రేముడించెడిని నీ విటుర మ్మని పిల్వరాదకో. 52

వ. అని తులాధారుండు చెప్పిన జాజలి దాని కొప్పికొని పక్షుల నాహ్వానంబు
గావించుటయు నవి వానిమాటలు విశ్వసించి విని వాని కి ట్లనియె. 53

తులాధారుఁడు జాజలికిం జెప్పిన బ్రహ్మగీతలు.

సీ. హింసారహితకర్మ మిహపరసుఖదంబు, హింస యైనన్ శ్రద్ధ యేటఁ గలియు
శ్రద్ధ వోఁ జనుఁడు నాశము నొందుఁ గావున, శ్రద్ధధానుఁ డొనర్చు జన్న మెన్న
ఫలద మా ఫలకాంక్ష సలిపిన విఫల మా, శ్రద్ధ వైవస్వతి బ్రధ్నదుహిత
వాఙ్మనోదోషముల్ వాపుఁ దద్దోషము, వాపంగ నోప వావాఙ్మనములు

తే. బ్రహ్మగీత లీయర్థము పలుకు వినుము, కలిగి శుచి శ్రద్ధ లేకుండఁ జలిపినదియు
శ్రద్ధ గలిగియు శుచి లేక సలిపినదియు, సమఫలంబుగ నెంచెద రమరవరులు.

క. శ్రుతు లెఱిఁగియు లోభముగొను,నతనియు మఱియుఁ వదాన్యుఁడయ్యుఁ వృద్ధిన్
బ్రతికెడునతనియు నన్నము, మతి నెంతురు వేలుపుల్ సమత్వ మెసంగన్. 55

వ. ప్రజాపతి యీరెండును విషమంబు లని వక్కాణించె వినుము. 56

సీ. శ్రద్ధాసమేత మై చనువదాన్యునియన్న, మలరు నశ్రద్ధమై నదియుఁ జెడును
దాత వడ్డికి నిచ్చు నాతఁ డైనఁ దదన్న, మెసఁగెడు లోభి యా నేని యొసఁగ
దశ్రద్ధధానుని దగుహవి స్సన్నము, దేవతల్ మానవుల్ దినఁగ రాదు
శ్రద్ధ లేకుండుట చాల పాపము శ్రద్ధ,పొసఁగుట పాపవిమోచనంబు

తే. శ్రద్ధధానుఁడు జీర్ణత్వచమ్ము విడుచు, పాముపోలిక పాపముల్ పరిహరించు
శ్రద్ధతోడి నివృత్తిమార్గమ్మె యుత్త,మమ్మును బవిత్రమును నయి యొప్పెమీఁఱు.

క. శీలమునం గలదోషము, లోలిం దొలఁగించి శ్రద్ధ నూనెడువాఁడే
నేల తపంబు జపం బిది, యేల మహావృత్త మతని కిత్రితియందున్. 58

వ. శ్రద్ధ యొక్కని కొక్కొక్కవిధంబు మేము ధర్మజ్ఞునివలన శ్రద్ధావిధాన మెఱింగి యుంటి మోజాజలీ! నీవు శ్రద్ధగలవాఁడ వగుము దానం జేసి పరంబు నొందఁ గల వని పక్షులు పలికె నప్పలుకులు విని జాజలి తులాధారుండు చెప్పినచొప్పున శాంతుండై ధర్మం బవలంబించె నంతఁ గొంతకాలంబున కత్తులాధారుండును జాజలియు స్వర్గంబునకు నిర్గమించి సుఖంచి రని చెప్పి భీష్ముండు మఱియు నీయర్థంబున నొక్కయితిహాసంబు గల దదియుం జెప్పెద వినుము. 59

సీ. మును విచఖ్యుం డనుమను జేంద్రుఁ డొకనాఁడు, గోమేధ మొనరింపఁగోరిగో గ్ర హామునందుజడిసియూపమువిఱుగం జేయు,వృషభ మున్వ్రీలపించు పెయ్యగముల నరసి దయాళుఁడై ధరఁ గల్గుగోజాతి,కిని స్వస్తి యగుఁ గాత మనుచుఁ బలికి నాస్తికులై మూఢు లధ్వరంబుల హింస, చెప్పిరి తగ దని చెప్పె మనువు

తే. యాజకులు బహిర్వేదులయందుఁ బట్టి, పసుల హింసించుచున్నారు పాప మనక యింకఁ బై ధర్మసూక్ష్మత నెఱిఁగియాగ,ములుపొనర్పఁగఁ దగునవి ఫలదములగు·

మ ఫలముం గోరుచు జన్నముల్ విధికి లోపం బేర్పడన్ జేయుచున్ బలువృక్షంబులు గొట్టి యూపములు గా భావించి వ్యర్థంబు గాఁ బలలంబుం దినుచుండ్రు ధర్మ మనుచున్ భావింపరా దద్ది యో గులు వైరాగులు మెచ్చఁ బో రెపుడుఁ దత్క్రూరప్రయోగంబులన్. 61

వ. మఱియుం గొందఱు ధూర్తులు మధుమాంసాసవకృసరాన్నాదులం బ్రవర్తిల్లం జేసి రది వేదకల్పితంబు గాదు లోభమోహకల్పితంబు బ్రహ్మజ్ఞాని సర్వయజ్ఞం బులందును విష్ణువుం బ్రశంసించుచుఁ బూలం బాయసంబులఁ బూజించు శుద్ధ స్వభావుండు వేదకల్పితంబులై యజ్ఞీయంబు లగువృక్షఫలాదులం జేసి యజ్ఞం బుల దేవతల నారాధించుఁ గాక యని శాసించె నని తెలిపిన విని యుధిష్ఠిరుం డహింసావ్రతపరాయణులశరీరంబు లాపదలు వివదమానంబు లగుం గావున హింస యించుకయేని లేకున్న శరీరయాత్ర యె ట్లగుం జెప్పు మనిన భీష్ముండు.

ఆ. ఒడలు క్లేశ మొందకుండునట్లును మృత్యు,వశము గాని యట్లు వలఁతి యగుచుఁ దగినకర్మములను దాఁ జేసి ధర్మము, నాచరింపవలయు నవనినాథ. 63

వ. అనిన విని కార్య మెట్లు పరీక్షింపవలయు నే కార్యంబు శీఘ్రంబుగను మఱి యే కార్య మాలోచనాపూర్వంబుగనుం జేయ వలయుం జెప్పు మని ధర్మజుం డడిగిన దేవవ్రతుండు దీని కుదాహరణంబుగా నాంగిరసకులంబునం దైనచిర

కారికునకు సంబంధించిన యితిహాసంబు గలదు చెప్పెద నవహితుండ వగుము.

## చిరకారి యనుమునికుమారునిచరిత్రము.

మ. వరపుత్త్రుం డలగౌతమద్విజునకుం బ్రాజ్ఞుండు మేధావి దాఁ
బరివర్తింపఁగ నైనకార్యములలోపం బెన్నఁడుం గల్గ నీ
క రతిం గల్గి పౌనర్భవాఁడు చిరజాగ్రత్స్వప్నకార్యాదులన్
జిరచర్చం జిరకారికుం డనఁగ వాసిం గాంచె మించేర్పడన్. 65

ఆ. బుద్ధిహీను లగుచు మునువెన్క లెఱుఁగని, జడులు కొంద ఱతనికడిమి తెలియ
కలసుఁ డనుచు బుద్ధి గలుగనివాఁ డంచుఁ, బలికి పరిహసింపఁ బాలుపడిరి. 66

వ. ఇట్లున్నసమయంబున నొక్కనాఁడు. 67

ఉ. గౌతమపారికాంక్షి తనకాంతకుఁ జీఁకటితప్పు గల్గినన్
హేతువునన్ స్వపుత్త్రకుల కెవ్వరికిం దెలియంగ నీక వి
ఖ్యాతమతిన్ సుపుత్త్రుఁ జిరకారిని జీరి కుమార! నేఁడు నీ
మాతనుఁ జంపి రమ్మనియెఁ గానక యొండొకఁ డాగ్రహంబునన్. 68

వ. అని వాని కాజ్ఞాపించి గౌతముం డరణ్యంబునకుం జనియె నంతఁ జిరకారికుం
డును దండ్రియాజ్ఞ నంగీకరించియును స్వభావంబునందాను జిరకారికుండు
గావునఁ జిరాలోచనంబునఁ జిరము విమర్శించుచుఁ దనమనంబున. 69

చ. జనకునియాజ్ఞ నే నెటులు సల్పకయుండుదుఁ దల్లి నెట్లు నేఁ
దునుముదు దుర్జనుం డనఁగఁ దోఁపఁగ వచ్చియు నిట్టిధర్మమం
దొనరుదుఁ దండ్రియాజ్ఞ పరమోత్తమధర్మము మాతృరక్షణం
బును నిజధర్మ మిట్టియెడఁ బుత్త్రుఁడ నెట్లు చరించు నక్కటా. 70

ఉ. ఆఁడుది గాక కన్న దెటు లాయమఁ జంపి మెలంగ నేతు నిం
దోడితి నేని తండ్రినుడి నుండ కవజ్ఞ పౌనర్భవాఁడ నై
వేడుక లెట్లు పొందెద దవీయము లీయవి కావు రెండునుం
గూడు నొనర్ప నెట్టు లొనఁగూర్చెద ధర్మము దాఁటకుండఁగన్. 71

తే. కులమునన్ శీలచారిత్రగోత్రములును,ధారణార్థము జనకుండు దారయందుఁ
జొనుపుఁ దనయాత్మ యవెపుత్త్రుఁ డనఁగఁబుట్టి,నట్టినాకిర్వురును సములైనవార.

వ. తల్లిదండ్రు లిర్వురును నాజన్మమునకు హేతుభూతు లని యెఱింగిననాకు
విజ్ఞాన మేలలేక పోయెనో యీవిషమావస్థ నెట్లు గడవ నేఁదువాఁడనో యని
మఱియును. 73

సీ. జాతకర్మము పోషణ ముపనయన మధ్యాపనం బను వానిరూపమునను
దండ్రి గౌరవనీయతం గాంచెడుఁ దదాజ్ఞ, తల ధరించుట పుత్రకులకు ధర్మ
మని నిశ్చయింప నో నతఁడు చెప్పినధర్మ, మే వేదసిద్ధాంత మై వెలయును
బ్రీతిమాత్రుండు తండ్రికిఁ గన్నకొమరుఁ డీ, జగతి వానికిఁ దండ్రి సర్వధనము
తే. నీయఁ దగినవి దేహాదు లెల్లఁ దండ్రి, తనయునకు నిచ్చుఁ గావునఁ దండ్రివాక్య
మెట్టి దైన విచారింపకే సుతుండు, సలిపి పాతకదూరుఁడై పొలుపుమిగులు. 74

వ. మఱియు భోగానుభవమందును బ్రవచనమునందును సర్వలోకనిదర్శనంబునం
దును గర్భాధానసీమంతంబులందును దండ్రి ధర్మము తండ్రియే స్వర్గము
తండ్రియే పరమతపము తండ్రి ప్రీతుం డైన సర్వదేవతలును బ్రీతు లగుదురు
తండ్రి తనయునిం బలికిన వెల్ల నాశీర్వచనములు తండ్రి సంతసించినం దనయు
నకు బాపనిష్కృతి యగు నింతియ కాక. 75

చ. ద్రుమములనుండి పండు లవి ద్రుళ్లినయట్టులు తండ్రివాకులం
దమరినవానిబంధము ల వన్నియుఁ ద్రుళ్లును దండ్రి యెన్నిక
ష్టములను బొందినన్ సుతునిచక్కఁ బ్రియంబును వీడఁ బోఁడు త
త్క్రమము సమస్తముం గనినఁ దండ్రి గురుత్వము తేటతెల్లమే. 76

వ. ఇట్టిది పితృగౌరవం బింక మాతృగౌరవం బన్ననో. 77

చ. అరయఁగఁ బంచభూతమయమై తగునాదగుమేని కగ్ని క
య్యరణియుఁ బోలె మజ్జనని యయ్యెడుఁ గారణ మట్టితల్లియే
నిరతము నాదునార్తులను నీఱుగఁ జేయుచు గారవంబునం
గర మరుదారఁ బ్రోచెడిని గంటిని జెప్ప విధంబు చొప్పడన్. 78

మత్త. తల్లి దిక్కు జగజ్జనాళికిఁ దల్లి లేనిజనుండు దా
నెల్ల గల్గియు దిక్కు లేనటు హీనుఁ డై తపియించెడిన్
దల్లి గల్గిన దుఃఖ మెప్పుడు తారసిల్లదు కన్ననా
తల్లియంచుఁ దలంచినన్ దురితంబు లెల్ల నశించెడిన్. 79

క. ఇమ్మహి సొమ్ములు ధనధాన్యమ్ములు లేకున్న నిస్వుఁ డైనం దనవా
సమ్మునకుఁ జేరుకొనుచో, నమ్మా! యని పిలువ దుఃఖ మంతయుఁ దీఱున్. 80

మహా. తనకు న్నూఱేడు లైనం దనయులు మనుమల్ తన్ను సేవించి యున్నం
గనుఁగొంచుం దల్లి వానిం గనికర మెసఁగం గన్నులం గప్పుకొంచున్
దనలో రెండేండ్లవాని న్బలెఁ దలఁచుచు మానాన్న! మాతండ్రి! రా రా

యనుచుఁ లాలించు దద్దేహము నిమురుచు నిత్యంబు హస్తంబుతోడఁ. 81

క. కొడుకు సమర్థుం డసమర్థుఁడు కృశుఁ డకృశుండు నెట్టిదుష్టుం డైనం
గడుపున నిడికొని పెంచుఁ, దడ వెంచక తల్లిఁ బోలు దైవము గలదే. 82

సీ. అరయ మాతృవియోగ మగునప్డె దుఃఖితుం, డగువృద్ధుఁడగుసుతుం డతనికపుడె
జగ మెల్ల శూన్యమై యగపడు మాతృసచ్ఛాయ మాతృసమగతి మాతృ
సమరక్షణము మాతృసమసుప్రియంబును, లేదు లే దని చెప్ప లేదు వాదు
ధారణంబునఁజేసి ధాత్రి యనియుఁ బుత్ర, జననంబునం జేసి జనని యనియు

తే. నంగసంవర్ధనంబున నంబ యనియు,నలఘు శిశుశుశ్రూషచే శ్వశ్రు వనియుఁ
బిలువఁ బడు తల్లి పిల్లకు వేలుమేను, నంటి దట్టితల్లిం జంపువాఁడు గలఁడె·

సీ. దంపతులకుఁ బ్రాణసంశ్లేషమునఁజేసి, పుత్త్రుండు సముఁ డయి పోలుచు నైన
నమ్మయందుం బరమార్థము నెలకొను, నాయమయే తెల్పు నాభిజాత్య
మాయమ్మ ప్రీతిస్నేహముఁజేయుఁగడుపున, గన్నమాత్రమున నక్కఱ నిసున్నఁ
దండ్రివారై ప్రజల్ తనరుచుందురు ధర్మ,పత్ని పోషణము తద్భర్తదయగు

తే. భరణమునఁజేసిభర్తనాఁబరఁగునతఁడు,ధర్మమెడలినఁబతియుభర్తయునుగాఁడు
కాంత కపరాధ మెప్పుడు గట్ట రాదు, కట్టిరే నది భర్తకుఁ గట్ట వలయు. 84

క. వరదైవతంబ యనుచుఁ, బురుషుని భావించి భార్య పొరి సేవించుఁ
బురుషునకుఁ బోలునాత్మజు, భరియించి యొసంగు నామె వలవదె పొగడఁ. 85

తే. పొలఁతిస్వాతంత్ర్యమెందును బొందఁ బోవ, నట్టిదానికినపరాధ మనుటకంటెఁ
దనదెయపరాధమనుకొంటతగును బతికి, నదియుననుమానమైనప్పుడనఁగ నేల.

ఉ. గౌరవపాత్ర మైనకులకాంతన కాక జనిత్రిఁ జంపుటల్
వేరికి నేని కా దని వివేకము లేని మృగంబు లైన ని
ర్ధారణ జేసి చెప్పెడిని దల్లికిఁ దండ్రికిఁ గీడు గాని య
ట్లే రహిఁ నే మెలంగి కృతకృత్యుఁడ నయ్యెద నిప్డు దైవమా. 87

తే. దైవతాంశసమూహమే తండ్రి యనియు, దేవతామానవాంశముల్ తేజరిల్లఁ
దల్లిపొలుపొందునయనుదనయుఁడెఱింగి,వారిఁబూజించి సేవింపవలయుఁగాదె

వ. అని తల్లిదండ్రులం దడపుకొనుచు నతండు చిరకారిగావునఁ జిరకాలముం
దడసె నంతలోఁ గ్రామాంతరంబునుండి మగిడి వచ్చుగౌతముండు మేధాతిథి
గావున నించుక విమర్శించి పత్నీవ్యతిక్రమంబునకు మిగుల వగలం బొగులుచుఁ
బశ్చాత్తాపంబునం జేసి తనమనంబున. 89

తే. అతిథిరూపుఁడై విప్రరూపము నవధరించి, నాకవల్లభుఁ డరుదెంచె నాదునాశ్ర
మమున కే నప్డు స్వాగత మమరఁ జేసి, యర్ఘ్యపాద్యాదు లిచ్చితి నధికభక్తి.

వ. ఇట్లతిథిపూజం గావించి నే నీవాఁడ నీ కేమి కావలయు నెట్టిది యైన నిత్తు
ననుటం జేసి యిట్టి వ్యతిక్రమంబు సంప్రాప్తం బయ్యె నిందు నాతప్పు గాని
నాయింతితప్పు గాని లే దిది ధర్మప్రమాదంబు గాని యెవ్వరిప్రమాదంబును
గాదు నే నీర్ష్యాభిభూతుండనై దుఃఖసాగరనిమగ్నుండ నైతిఁ బతివ్రతాతిల
కంబుం జంపించి వ్యసనంబునం బ్రుంగుడు వడితి న న్నుద్ధరించువా రెందునుం
బొందుపడ రని యనేకవిధంబుల విలపించుచు. 91

క. చిరకారి కాజ్ఞ వెట్టితిఁ, బరికింపక తల్లిఁ జంపి పఱతె మ్మనుచున్
జిరకారి యగుచు వాఁడీ, దురితంబున నుండి నన్నుఁ దొలఁగించు నొకో. 92

వ. అని చిరకారి నుద్దేశించి. 93

క. చిరకారి! నీకు భద్రము, చిరకారీ! నీకు మేలు చేకుఱుత భవ
చ్చిరకారిత సార్థక మై, పరఁగెడునటు చేసికొనుట పాడియ సుమ్మీ. 94

మ. చిరకారిత్వము రూఢికెక్కఁగ ఫలస్వీకారముం జేయుచుం
జిరకాలంబు నిజోదరంబున నినుం జేకొన్న నీతల్లినిం
జిరసంప్రాప్తతపోధనాఢ్యుఁ డగుచుం జెన్నొందు నీతండ్రినిన్
దురితం బందకయుండఁ గాచుకొన రాదో జాగు గావించుచున్. 95

వ. అని మందమందగమనంబున నాశ్రమద్వారంబుఁ జేరం జని పుత్త్రునిం బొడఁ
గానక. 96

క. చిరకారీ! చిరకారీ!, పరితాపము చేత దుఃఖభరమున రావో
కర మలసి నిదుర వోయితొ, పరితప్తుఁడ నైననన్నుఁ బరికింపఁ గదే. 97

వ. అని పరిదేవనంబు సేయుచున్నయవసరంబునఁ జిరకారి సమీపగతుండై తండ్రిం
జూచి దుఃఖించుచుఁ గరంబునందలికరవాలంబు విడనాడి పాదంబుల సాఁగిలి
పడి లేచి వినయవినమితోత్తమాంగుండై యున్న కుమారుం గనునంతలో
నంతికగత యగు కాంతయు లోచనగోచరం బగుటయు నతం డంతరంగంబున
నెంతయు సంతసించుచుఁ జిరకారి నక్కునం జేర్చి మూర్ధాఘ్రాణంబు సేయుచుఁ
బ్రీతిపూర్వంబుగా ని ట్లనియె. 98

క. చిరకారి! నీకు భద్రము, చిరకాలము వఱకుఁ దనువు చెడ దుఃఖమునం
బరితాప మొందకుండఁగఁ, బరిరక్షించితివి నన్ను వరపుత్త్రుఁడ వై. 99

వ. అని మఱియును. 100

సీ. చిరకారి యగుధీరవరు నొందు గుణములు, చిర మెంచి కార్యంబు చేయవలయుఁ
జేఁ బూనుకొనునది చిర మెంచి విడఁదగు, చిర మెంచి మైత్రి నార్జింప వలయు
నపకార ముపకార మప్రియంబు ప్రియంబు, లోనగునవి లెస్సగా నెడందఁ
జిరకాల మరసియ చేయ నౌ స్త్రీలును, బంధువుల్ లోనగువారితప్పు

తే. లరసి చిరతరముగ నొండ్ల కనఁగ వలయుఁ
జిరము వృద్ధులకడఁ జేరి సేవ సేయ
వలయుఁ జిర మెంచి ధర్మముల్ సలుప వలయుఁ
గడు వితర్కించి యుత్తర మిడఁగ వలయు. 101

సత్యవద్ద్యుమత్సేనసంవాదము.

వ. అని యుపదేశించి నిర్వికారచిత్త యగుపత్ని ననునయించి గౌతముండు సతీసుతసమేతుండై గార్హస్థ్యధర్మంబు నిర్వర్తించుచుం గొంతకాలంబునకు స్వర్గమునకు నిర్గమించె ననిన ధర్మరాజు రాజైనవాఁడు ప్రజల రక్షించువిధంబును శిక్షించువిధంబును జెప్పు మనిన నప్పితామహుం డీవిషయంబున సత్యవద్ద్యుమత్సేనసంవాదంబు గలదు సత్యవంతుఁ డొక్కనాఁడు తండ్రిశాసనంబున వధ్యస్థానంబున నెలకొల్పినవధ్యులం గాంచి తండ్రితోఁ జెప్పినమాటలు గొన్ని గలవు చెప్పెద నాకర్ణింపుము. 102

ఉ. ధర్మ మధర్మ మై చను నధర్మము ధర్మము గాఁగ మాఱెడుం
ధర్మమరయ యొకప్పుడు వధం బది ధర్మము కాకపోవు నా
ధర్మము కానిచో వధము ధర్మ మన న్మఱి యేది యాను దు
ష్కర్ములఁ జంపకుండిన నెసంగక మానునె సంకరం బిలన్. 103

క. అపరాధుల వధియింపక, కృపఁ జూపిన లోకమందు నిది నా దనుచున్
సుపరిష్కృతి లేకుండెడు, నపు డెల్లరజీవయాత్ర యగు టెట్టు లొకో. 104

వ. అని ద్యుమత్సేనుం డుత్తరం బిడిన సత్యవంతుండు తండ్రిదిక్కు మొగంబై యి ట్లనియె. 105

సీ. వర్ణత్రయము ధర్మపాశనిబద్ధమై, ద్విజులకు లోఁగి వర్తింప వలయు
నెవఁ డేని ధర్మము నెడపె నే విప్రుండు, నృపతికి నెఱిఁగింప నపు డతండు
తప్పునకుం దగ దండింపఁ దగుఁ గాని, విధి గానిదండ మెవ్వేళఁ దగదు
వధ మొప్ప దెప్పుడు స్వల్పదోషులను దస్కరులను గొని రాజు చంపుచుండు

తే. నపుడు తత్సతీసుతులు పిత్రాదులెల్లఁ, జచ్చిన ట్లయి నశియింత్రు జగతి నట్లు
కాన నరపతి దోషులు గాన నైనఁ, దెలిసి తగునట్లు పాలింప వలయుఁ జూవె.

క. ఒకకాలంబున దుర్జను,నకు శీలము గలుగ వచ్చు నలువొందెడుపు
త్రకులుం బుట్టఁగ వచ్చుఁ గ,నుక మూలచ్ఛేదనంబు నుతి కెక్కదు నాకో. 107

సీ. అపరాధినిం జంపు టది సనాతనధర్మ, మన రాదు విప్రు లాతనికి వధము
పలుక రెప్పుడు వానిఁ బట్టికట్టియుఁ గొట్టి, భయపెట్టి శిక్షింప వలయు నతఁడు
తప్పు చేసితి నిట్టిత ప్పెప్పుడును జేయ, నని శరణము వేఁడు నట్టివాని
విడుచుటయును ధర్మవిధి యని బుధు లంద్రు, విధిశాసనమ్ము నీవిధమ యుండు

తే. దండ మజినంబునుం దాల్చి ముండుఁ డైన, విప్రుఁడును దప్పు చేసిన విహితశిక్ష
కర్హుఁ డయి యుండు గొప్పవాఁడైన గొప్ప,శిక్ష కర్హుఁడు మఱి మఱిఁ జేసెనేని.

వ. ఎట్టివారికిని బ్రథమాపరాధ శిక్షలకన్న నుత్తరోత్తరాపరాధశిక్ష లధికంబులై
యుండ వలయు నట్టివానిం బ్రథమాపరాధంబునందుం బలె విడువ రా దనిన
ద్యుమత్సేనుండు. 109

మ. ఎపు డేతప్పున కెట్టిశిక్ష స్మృతుల న్వీక్షింపఁగా నుండునో
యపు డాతప్పున కట్టిశిక్ష మొగిఁ జేయం గల్గుటే యుత్తమం
బు పవిత్రం బగుధర్మ మం డ్రిపుడు తప్పుం జేయుదుష్టాత్ములం
గృపచేఁ జంపక యున్న లోకమునకుం గీ డౌట నిక్కం బరో. 110

క. మునుపటివారలు సత్యం,బునె పల్కెడువారు స్వల్పములు ద్రోహంబుల్
పొనరించి స్వల్పశిక్షల,కును బాత్రములగుచునుంద్రు కుతలమునందున్. 111

క. మును ధిగ్దండ మనంతర,మున వాగ్దండంబు పిదప మొగి ధనదండం
బును నిప్పుడు వధదండము, పొనరింతురు దాన లోఁగఁ బోవరు కుజనుల్.

క. మునిము చ్చగువాఁడు నరుల,కును గంధర్వులకుఁ బితలకును వేల్పులకున్
గన విసఁ దగఁ డని వేదము, లనిశము వాక్రుచ్చుచుండు నది విన లేదే. 113

ఆ. బుద్ధిహీను లైనపురుషులు కొందఱు, చితులనుండి ధనము సేకరింత్రు
మఱిఁ బిశాచముల నమరులుగాఁ గొల్తురు, వారి నాజ్ఞవెట్టువారు గలరె. 114

వ. అని పలుక సత్యవంతుండు తండ్రి కి ట్లనియె. 115

సీ. ఈవట్టివారి నహింసచే సాధులు, గాఁ జేయఁ జాలవేఁ గడఁకతోడ
భూతభవ్యం బయి పొలుచుకర్మంబున, వారి హింసింపు మీవసుధయందు
నవనీపతులు లోకయాత్రార్థమ తపింత్రు, వారిఁ గన్గొని సిగ్గుపడుచుఁ బ్రజలు

వారివలెం దాము వ్రతపరాయణు లయి, వర్తింత్రు సుకృతంబువలన ఱేఁడు

తే. లవనిఁ బాలింత్రు దాన శ్రేయములు గలుగు,జనులు శాసించువారల ననుసరింత్రు
తనదువృత్తంబు సరి లేక జనుల నేలఁ, బట్టునాతఁడు పరిహాసపాత్రుఁ డగును.

తే. ఎవఁడు దంభాదులఁ దొరకెపు డసాంప్ర,తమ్మొనర్చునో వానిసర్వమ్ము లైన
శిక్షలం జేసి దండింపఁ జెల్లు దాన, నతఁడు తనపాపములనుండి యపసరిల్లు. 117

తే. దుష్కృతంబులఁ దొలఁగింపఁ దోఁగువాఁడు
మునుపు తనయాత్మ నియమించుకొనఁగ వలయు
ఖలుఁడు శిక్షింపఁ బడకున్న తలమునందుఁ
బాపములు గూడు సుకృతముల్ వాసి పోవు 118

వ. అని కారుణ్యశీలుం డగునొకవిద్వాంసుండు నాకుం జెప్పె నని చెప్పిన ద్యుమత్సేనుండు తండ్రీ! మనపూర్వులు నిట్లు శాసించిరి కృతయుగంబున రాజు లిట్లు పాలించియుందురు త్రేతాయుగంబున నొక్కపాదంబు ధర్మంబు క్షీణించె ద్వాపరంబున రెండుపాదంబులు లోపించెఁ గలియుగంబున రాజులదుశ్చరిత్రంబునను గాలవిశేషంబునను ధర్మంబు పదియాఱవవంతుమాత్రము ప్రవర్తించుచుండుఁ బ్రథమకల్పంబున ధర్మసాంకర్యము గలిగినయెడ నాయుశ్శక్తికాలంబులంబట్టి దండంబు చెల్లం దగు సత్యంబుకొఱకు ధర్మఫలంబు సెడకుండునట్లు భూతానుకంపార్థ మిట్లు స్వాయంభువమనువు పలికె నని తెలిపిన నజాతశత్రుండు గంగాపుత్రునిం గని యి ట్లనియె. 119

తే. జనులకుం బీడ గాకుండ షడ్గుణముల, యోగ మెఱిఁగించితివి గానిభోగమోక్ష
ములకు నవి యెట్లు సాధకమో యెఱుంగ, నభిలషించితి నెంతయు నంతరాత్మ.

తే. యోగమార్గమునకు గృహస్థోక్తధర్మ,మునకు దూరము గాని సమున్నతప్ర
యోజనముగల్గుననియెంతు నుల్లమందు,నందు నెదిశ్రేయమో తెలియంగఁ జెపుమ.

వ. అనిన భీష్ముం డి ట్లనియె 122

క. రెండును ఘనధర్మంబులు, రెండు నశక్యము లొనర్ప రెండు ఫలదముల్
రెండు సదాచరితము లా,రెండిటిఁ బ్రామాణ్య ముచ్చరించెద నిచటన్. 123

కపిలగోసంవాదప్రకారము.

వ. ఈవిషయంబునఁ గపిలగోసంవాదం బనునితిహాసంబు గలదు దానిం జెప్పెద నవహితుండవై ఛిన్నధర్మార్థసంశయమ్ముగ విను మని యి ట్లనియె. 124

సీ. నహుషునింటికి మున్ను నడతెంచె నతిథియై, త్వష్ట వానికి గోవు వండి పెట్ట

నెంచి నియోగించెఁ గొంచక యొకగోవు, విశసింప దానిని విజ్ఞుఁడైన
కపిలుండు గన్గొని కటకటంబడి యొక్క, మా అయ్యయో వేదమా! యటంచు
నిర్వేదమున నుడినిం జేసె నది విని, స్యూమరశ్మి యనంగ నొప్పువాఁడు

తే. గోవులోఁ జొచ్చి కపిలునితో వచించె
నహహా! వేదమే ధర్మమై యలర దేని
మిగిలినవి యేవి ధర్మము లగునొ ఋషుల
వాక్యములు దలంత్రు భగవద్వాక్యములుగ. 125

వ. సర్వజ్ఞుం డగుభగవంతునివాక్యంబులే వేదంబు లట్టివానియెడ సందేహంబు
పుట్టుట యెట్టిదియో తెలియకున్న దనినఁ గపిలుం డి ట్లనియె. 126

శా. నే వేదంబుల నిందసేయ మఱి వానిం గూర్చి భిన్నంబుగా
భావంబుం బొనరింప నాశ్రమములన్ వర్తించుధర్మంబులం
దేవంకన్ ఫల మొక్కఁడే యనుచు నూహింపంగ నా దేవయా
నావిర్భ్యాతగతంబు నల్వురకొకం డై పొందఁగా నుండెడున్. 127

వ. ఈయాశ్రమంబులకు ఫలవిషయంబున జ్యేష్ఠకనిష్ఠభేదంబులు కల వవి తెలిసి
కర్మంబు నాచరింప వలయు నని యొక్క శ్రుతియు నాచరింప నక్కఱ లే దని
యొక్క శ్రుతియు వక్కాణించు నారంభము ననారంభమును దోషములె
యనునట్టిశాస్త్రములబలాబలంబు లెఱుంగుట కష్టతర మహింసకన్న నుత్తమ
ధర్మము శాస్త్రసిద్ధము గాక ప్రత్యక్షసిద్ధమై యున్నయెడం జెప్పు మనిన గో
గర్భగతుం డగుస్యూమరశ్మి యి ట్లనియె. 128

సీ. మునుమున్ను 'స్వర్గకామోయజేత'యటంచు, సంకల్ప మొనరించి జన్నములను
సలుపుదు రజము నశ్వము మేషమును గోవు, పక్షు లోషధులును బ్రాణికోటి
కాహార మని శ్రుతులనుఁగాన నిరుప్రొద్దు,గ్రహియింతు రన్నముం బ్రతిదినంబు
యజ్ఞాంగకములు ధాన్యముపశువులు వానిఁ, గల్పించె బ్రహ్మ యాగములతోడ

తే. వానిచే వేల్పులం గొల్వఁ గా నొనర్చె, గ్రామజంతువు లేడు నరణ్యజంతు
లేడుదగునంద్రుమఘములనెల్లజగము,క్రతువులకుఁగాఁగమును బ్రహ్మకల్పితంబ.

వ. ఇది పూర్వాభ్యనుజ్ఞాతమతంబు పశువులు పక్షులు మనుష్యులు ద్రుమము
లోషధులును మఖంబులనుండి స్వర్గంబు గోరుచున్నయవి మఱియు నోషధులు
పశువులు వృక్షములు లత లాజ్యము దధి పయస్సు హావిస్సు భూమి దిక్కులు
శ్రద్ధ కాలము నను పండ్రెండును ఋగ్యజుస్సామయజమానులనునాలుగును

గృహపతి యగునగ్నియుం గూడఁ బదియేడును యజ్ఞాంగంబులుగను యజ్ఞము మూలముగను దెలియం దగు నాజ్యము దధి పయస్సు శకృత్తు త్వచము నామిక్ష వాలములు శృంగములు ఖురములు ననునివి యజ్ఞోపయుక్తంబు లగు టంజేసి యజ్ఞములకు గోవులు ప్రధానత్వముం గాంచుచున్న విట్టిసంభారంబుల భూరిదక్షిణల ఋత్విజులు సప్తతంతుతంత్రంబు నిర్వర్తించుచుందురు ఫలాపేక్ష లేనియాగకర్తలు ప్రాణిహింసం జేయరు ద్రోహ మాచరింపరు యజ్ఞాంగంబుల నానుపూర్వంబుగ గ్రహించి యుపయోగించుదురు వేదార్థావబోధకంబులై యార్షంబు లగుస్మృతులు జూపట్టు యాగములకు బ్రాహ్మణులు ప్రధానులు ప్రపంచమంతయు యాగము నాశ్రయించి యున్నది వేదముల కుత్పత్తిస్థాన మగునోంకారమును నమ స్స్వాహా స్వధా వషట్కారము లుచ్చరించుచు యజ్ఞంబు లొనర్పం దగు నట్టివాఁడు ముల్లోకంబుల భయంబు నొందఁ డని వేదములు ఋషులుం జెప్పుదురు మఱియు ఋగ్యజుస్సామములు స్తోభలు విధి చోదితములు వీని నెఱింగినవాఁడు విప్రుండు నీవును యజ్ఞఫలంబు నెఱింగిన వాఁడవు గావున సందియపడక యజ్ఞంబులు చేసియు నొరులచేఁ జేయించియు స్వర్గాదిఫలంబు నొందఁ గల వని చెప్పినఁ గపిలుండు వెండియు. 130

సీ. కర్మమార్గ మెఱింగిఘనులు జ్ఞానులు జ్ఞాన, మార్గముఁ బూని బ్రహ్మంబుఁ గందు
రవ్వారి కేలోకమందు వ్యతిక్రమ, మలరదు నిష్కాము లగుచు వారు
పాపవిముక్తులై పచరింతు రపవర్గ, మందుఁ ద్యాగమునందు నంతరంబు
నెఱిఁగి బుద్ధిన్ నిశ్చయించి బ్రహ్మిష్ఠులై, బ్రహ్మంబునం గాఁపురంబు నుంద్రు
తే. గతరజస్తమస్కు లశోకు లతులితగతు, లైనవారలు గార్హస్థ్యమం దెసంగు
కర్మముల నాచరించినకతన నేప్ర, యోజనము గల్గు ననఁ బల్కు స్స్యూమరశ్మి.

మ. విను సన్యాసమునంద యుత్తమగతు ల్వెల్గొందు నన్నన్ గృహ
స్థునిసంబంధము లేనియాశ్రమము లెందున్ సాఁగఁ బో వెల్లచే
తనముల్ తల్లిని నాశ్రయించి మనుచందం బొప్ప గార్హస్థ్యమున్
మునుకొంచుం దగ నాశ్రయించి యితరంబుల్ మూఁడు వర్తించెడున్. 132

క. జన్నము సేయుటకుఁ దపం,బు న్నెఱపుటకున్ గృహస్థె పొలిచెన్ జగమం
దున్న సకలధర్మములకు, నెన్నన్ గార్హస్థ్య మాదియే యగుఁ గాదే. 133

తే. ప్రాణికోటిసుఖంచెడుఁబ్రజలఁగాంచి,ప్రజన మితరాశ్రయంబులఁబరఁగఁబోదు
మఱియు నోషధులాదిసమస్తముగృహ,పతివయవిలేకప్రాణులు బ్రదుకుటెట్లు.

సీ. కావున గృహికి మోక్షము లేదనెడుమాట, సత్యమె ట్లగునో యశ్రద్ధధాను
లప్రాజ్ఞు లలసులు నగుమందమతులు సన్న్యాస ముత్తమ మంచు నాశ్రయింత్రు
త్రైలోక్యమునకు మర్యాద శాశ్వత మాట, వేదవాక్యంబులఁ గాదె తెలియ
పుట్టినదాది విప్రుఁడు పూజ్యుఁడగుగర్భ,ధారణాదిగను మంత్రములఁబోదలుఁ
తే. జచ్చునప్పుడుఁ గాల్చెడుసమయమందు, శ్రాద్ధకాలమునందు భోజనమునందుఁ
బిండదానమున న్నీటఁ బెట్టునపుడు, వేదమంత్రము లొప్పు నాద్విజున కెన్న.

వ. మఱియు నర్చిష్మంతులు బర్హిషదులు క్రవ్యాదులు ననుపితృదేవత లామృతున
కైనమంత్రంబు లంగీకరింతు రట్టిమంత్రంబులే కర్మఫలంబు నొసంగుటకుఁ
గారణం బగు నని వేదంబులు ఘోషించుఁ గర్మము లాచరింపనిమానవులు
దేవర్షి పితృద్విజులకు ఋణస్థు లగుదు రట్టివారికి మోక్షంబు మృగ్యంబు ధన
హీనులు నలసులు నగువారు వేదవాదాపరిజ్ఞానంబున నసత్యమార్గం బిట్లు
కల్పించిరి వేదవిహితకర్మము లాచరింపనివాఁ డధోగతిం బొందు సోమయాజి
తనచేసినయజ్ఞంబు ఫలంబునఁ దా నాయజ్ఞపశువులం గూడి స్వర్గంబునకుం
బోయి సర్వకామంబు లనుభవించుం గావున వేదనిందయు నాస్తికత్వమును
విడిచినం గాని మానవుండు మహత్పదంబు నొందం జాలఁ డనినఁ గపిలుండు.
తే. అగ్ర్యములుదర్శపూర్ణమాసాగ్నిహోత్ర,ములునుమఱియుఁజాతుర్మాస్యములును
కాకరంబులు గావవి యాచరించు,టలు సనాతనధర్మమై వెలయుఁ గాదె. [హింస

క. ఆరంభశూన్యు లగుచుౕ, ధీరులు విజ్ఞాను లగుచు దేవాదిఋణం
బోరిమిఁ దీఱుచు కొందురు, వారలపథ మెఱుఁగ దేవవర్యుల కగునే. 138

వ. చతుర్ద్వారంబులు చతుర్ముఖంబులుం గలిగి చతుర్విధంబుల జీవులదేహంబులం
దేజరిల్లుచుండు వాగ్బాహూదరోపస్థలు ననుద్వారంబులు గలుగుటంజేసి దేవ
తల కాచతుర్ద్వారసంబంధము గలిగియుండు నెల్ల రాద్వారంబుల వశంబునం
దిడికొని పాలించు చుండవలయు నని మఱియును. 139

సీ. జూద మాడుట యొరుల్లసొత్తు హరించుట, యధములచే నధ్యయనముఁ గొంట
కోపించు టొక్కనిఁ గొట్టుట తిట్టుట, వితగ నాడుట కొండె మతికి యనుట
తిండిపోఁ తగుటయుఁ దినకుంటయుఁ బరాప,వాద మొనర్చుట వలవ దెపుడు
మితభాషణంబును హితభాషణంబును, సత్యప్రవచనము సాధుమైత్రి
తే. అప్రమత్తతయు నచాపలప్రసక్తి, గలుగ వలయును బరకాంతఁ గవయ నొప్ప
దిట్లొనర్చిద్వారచతుష్క మెవఁడుగాచు,కొనెడునాతఁడెబ్రాహ్మణుండనఁగనొప్పు.

క. అజితద్వారునిఁ దలఁపక, యజనాధ్యయనములు సద్వ్రతాచరణంబుల్
సుజనప్రతిపత్తియు మేల్, ప్రజలాత్మయు రిత్త యనఁగ వచ్చుం జుమ్మీ.

క. ఏతటి నను త్తరీయుం, డై తిరుగుచు సుఖము గోరనట్టిం డగుచుం
జేతులు తలగడ గా నిడి, భూతలమునఁ బండువాఁడె భూసురుఁ డనఁగన్.

క. తా నేసంబంధమునం, బో నొల్లక యెల్లవారు పొందెడుసౌఖ్యం
బే నొందుసౌఖ్య మనుచుల్, లో నెంచెడు వాఁడె ద్విజుఁడు లోకమునందున్.

క. ఇది ప్రకృతి వికృతి యిది యని, సదమలమతి నెంచి భూతసంచయగతులన్
బొదలుజగద్వృత్తము నె, మ్మది నెఱిఁగినవాఁడె ద్విజుఁడు మహీతలమందున్.

క. ప్రాణులవలనం దానుం, బ్రాణులు తనవలన భయము నందనిగతిమైఁ
దా నుండి భూతమయుఁ డై, జానొందిన విప్రుఁ డంద్రు సవభుజు లతనిన్.

సీ. యాగదానాదుల నగుఫల మెల్ల మ,నశ్శుద్ధి యొసఁగెడు నా నెఱుఁగక
శాశ్వతంబులు గా నెసంగనికర్మఫ, లములఁ గోరుచు శాశ్వతమును స్థిరము
నగుతపోనిష్ఠతో నలరువారల సదా, చారము న్నడుపంగఁ జాలనట్టి
రగుచుఁ గొంద అనశ్వరాతిఫలంబును, విఫలంబుగా నెంచి వేఱుఫలము

తే. నాస సేయుదు రవ్వార లాసనేయు,ఫలము తెలియ నశక్యము తెలిసికొనిన
సలుప దుర్ఘట మవి యెట్లొ సలిపిన ఫల,మస్థిరం బంచు నెంచు మోాయనఘ నీవు.

ఆ. అనిన స్యూమరశ్మి యనియె నోఁ గాదను, శ్రుతి ప్రమాణ మెట్టులతికిగొనును
ద్యాగకర్మవిధులతగురూ పెఱుంగ నేఁ, దలఁతు నానతిమ్ము సలలితాత్మ. 147

ఆ. అనుడుఁగపిలుఁ డనియె నాయోగమందుఁబ్ర,త్యక్షఫలముఁజూతు రఖిలజనులు
కర్మమార్గమందుఁ గలుగుప్రత్యక్షఫ,లమును జూపఁ గలరె సుమతు లైన. 148

వ. అనుటయు నతం డయ్యా! నేను స్యూమరశ్మి యనువాఁడను జిజ్ఞాసార్థ మిట్లు వచ్చితిని శ్రేయోభిలాషినై నీకుఁ బ్రతివచనం బిచ్చుచుంటిఁ గాని జిగీషం గాదు నాయీసంశయంబు దీర్పుము మిముబోంట్లు సత్పథంబున నుండి ప్రత్యక్ష ఫలంబును గాంచుచున్నా రట్టిప్రత్యక్ష మగునదియు మీా రుపాసించునదియు నెట్టిది నేఁ దర్కశాస్త్రములకాక యాగమార్థము లెల్ల నెఱింగితి వర్ణాశ్రమ ధర్మము లెఱుంగఁ గోరువారి కాగమములు తోడునీడ లవి నిశ్చయములగు టం జేసి తత్ఫలసిద్ధియుఁ బ్రత్యక్షము కావచ్చు నావకుం గట్టిననావ నిజేచ్ఛం బోఁ జాలక దాని ననుసరించునట్లు బుద్ధియుఁ బ్రాక్తనకర్మము ననుసరించుం గాని తరింపఁ జేయఁ జాలకుండుఁ గావున నీకు శిష్యుఁడ నైననా కీవిషయ మెల్ల నుప

దేశింపుము భోగత్యాగియు నిత్యసంతోషియు నిర్గతశోకుండును నిరామయుండును విగతకార్యారంభుండును త్యక్తసంగుండును గర్మవాంఛారహితుండు నగువాఁ డెందేనిం గలండో మేముం బోలె మీరును శోకింతురు సంతసింతురు సర్వప్రాణులకుం బోలె నింద్రియార్థంబులు మీకుం గలవు వర్ణాశ్రమ ప్రవృత్తులందు నేదే నొక దానిం బూనునపు డేది నిరామయం బెఱింగింపు మనినఁ గపిలుం డిట్లనియె. 149

సీ. సర్వప్రవృత్తుల సార్థకం బగుశాస్త్ర, మనుసరింప నిరామయ మ్మగు నది
జ్ఞాన మనుసరించువానిని దరియింపఁ, జేయు నజ్ఞానము శ్రేయ మడఁచు
మీరు జ్ఞానము గలవారె గా మీకు స,ర్వము బ్రహ్మ మనుబుద్ధి వఱలు నొక్క
శాస్త్రతత్వ మెఱుంగఁ జాలక కొందఱు, కామలోభాదులఁ గట్టువడుచు
తే. వాదబలమునఁదథ్యముపలుకఁబోక, శాస్త్రములఁదాఱుమాఱు గాసలుపుకొనుచు
శమదమాదులకుం గాక జ్ఞానమార్గ,ము ఫలదం బని చెప్పరు మోహమునను.
క. తమమె పరాయణ మగుచుం, దమ రుండుట నట్టిపసులె తగు నని తోఁపన్
సుముఖులు గాకుందురు తమ, తమప్రకృతులఁ బట్టి జనులు తనరుదు రుర్విన్.

వ. అట్టివారికి ద్వేషము కామము క్రోధము దంభము ననృతము మదము నను నివి ప్రకృతిసంభవంబులై ప్రవర్తిల్లుచుండు వేరొకైనం బ్రకృతిం జేసి గుణంబు లుదయించుచుండుఁ బ్రకృతిశక్తి నెఱింగినవారు శుభాశుభంబుల జయించి యతులై పరమగతిం బొందుదు రనిన స్యూమరశ్మి వెండియును. 152

సీ. నీచెప్పినది యెల్ల నేఁ జూచితిన్ శాస్త్ర,ముల నర్థవిజ్ఞాన మలర కునికి
వర్తించెడుఁ బ్రవృత్తు లార్తులకై న్యాయ్య, మాచార మే శాస్త్రమనియు నితర
మైన దశాస్త్రమే యనియు శ్రుతుల్ సెప్ప, శాస్త్రహీనం బేది సలుపఁ జనదు
వేదవాదములకు భిన్న మైన దశాస్త్ర, మగుఁ దమ కగునర్థమందుఁ గలుగు
తే. నని విలక్షణగతి నెంచి యజ్ఞులు తమ,మున మునిఁగి హీనయజ్ఞాదు లొనరఁజేసి
శాస్త్రదోషముల నెఱుంగఁ జాలనట్టి, రగుచు మావలె దుఃఖింతు రనుదినమ్ము.
ఆ. జగతిలోనఁ గలుగుసకలజంతువులకు, నెసఁగు నింద్రియంబు లింద్రియార్థ
ములును మీకు నెసఁగుఁ దలఁపోయ వారుమీ, సాటి యెట్లువత్తు రోటు చెపుమ.
చ. మునివర! నీ వఖండ మగుపోడిమి నింద్రియముల్ జయించియున్
గనఁబడునన్నిటి న్వశముగాఁ గొని యుండియు బ్రహ్మతత్త్వమున్
జనులకు బోధచేయుటకుఁ జాలినవాఁడవు మేము స్వల్పమై
చనువిషయంబులం దగిలి జ్ఞానవిహీనుల మైతి మక్కటా. 155

వ. నాలుగాశ్రమమ్ముల వారును బహువిధప్రవృత్తులం దవిలియు నొక్కసుఖమే యపేక్షింతురు యోగియగువాఁడు జితేంద్రియుండై ప్రపంచ మెల్ల నిరసించి వేదవాదముల నపేక్షింపక మోక్షంబు నొందు నేను వేదాంతవిషయమ్ము నీకు శిష్యుండనై తెలియఁ గోరుచున్నవాఁడ నా కిందలియాథార్థ్య మెఱింగింపు మనినఁ గపిలుం డిట్లనియె. 156

సీ. వేదప్రమాణము కా దని యెవ్వరు, వెనుఁద్రోయ నెంచరు వినుము దాని
నరయ శబ్దము బ్రహ్మ మనియుఁ బరబ్రహ్మ, మనియు బ్రహ్మ మెసంగు నట్టిశబ్ద
మందు నిష్ణాతుఁడు పొందుఁ బరబ్రహ్మమును వేదసంస్కారమున జనించి
నట్టివిప్రుఁడు పవిత్రాంగుఁడు గావున, బ్రహ్మవిజ్ఞానాతిపాత్రుఁ డగును

తే. గర్మములకు నానంత్యమే కలఫలంబు, కర్మఫలము తత్కర్తకుఁ గాక వేద
శాస్త్రవేత్తలకే నగోచరము దాని, తత్వ మంతయు నెఱిఁగింతుఁ దవిలి వినుము.

వ. నిష్కాములై లోభదైన్యాసూయల న్విడిచి ధర్మమే ఫలముగా నెంచి యజ్ఞము లాచరింతురు ధనమునకు సత్పాత్రదానము సన్మార్గము దుష్కర్మరహితులై పరిశుద్ధజ్ఞానము గలిగి క్రోధమాత్సర్యాదులం ద్యజించి సర్వభూతహితంబుగా మెలంగుచు నిజధర్మపరిత్యాగంబు చేయక కొంద ఱుత్తమగృహస్థు లుందురు వారిధర్మమ్ములు ప్రత్యక్షఫలదమ్ము లాకర్ణింపుము. 158

సీ. బ్రహ్మమునందు విశ్వాసము గలవారు, స్వాంతశుద్ధిం గల్గి శాస్త్రసమ్మ
తాచారమును వీడ కతికష్టమందును, సదమలధర్మముల్ సలిపి సౌఖ్య
మందుచుందురు ధర్మ మాచరించెడుపట్ల, స్వాతంత్ర్య మూనక శాస్త్రవిధుల
ననుసరించుచు ముఖ్య మగుపక్షమే పూని, యుంద్రు ప్రాయశ్చిత్తమొందఁ బోక

తే. యి ట్లనేకులు ప్రాచీను లిద్ధచరితు, లేఫలాపేక్షయును లేక యెల్లనాఁడు
హరిహరులఁగూర్చియాగములాచరించి,యుత్తమోత్తమగతులందుచుందురనఘ.

క. నిగమాగమకర్మములఁ, మొగి ననువర్తించువారి పుణ్యాధ్వరముల్
పొగడంగఁ బడుచు వారలుఁ, తెగనాడరు కర్మచయము ధీరులు గానన్. 160

తే. నిత్యశాంతులు ఋజుమతుల్ నియతచిత్తు, లైనవారలు పొనరించునట్టి దెల్ల
బ్రహ్మరూపమయగు ననిపలుకు శ్రుతులు,వారితపములు ఘోరమై వఱలుచుండు.

వ. సదాచారసంపన్ను లగుమన ప్రాచీనులు ధర్మసూక్ష్మమును గని పెట్టి కర్మము లాచరించెడివా రది ప్రమాదరహితం బై సర్వవర్ణములందును వ్యతిక్రమము లేక నడచుచుండు వ్యతిక్రమం బగుకాలంబున దానిఁ విభాగించి తద్భాగం

బులు మొదటిమూఁడాశ్రమములవారు నాచరించి సుగతిం గాంచుచుండిరి మఱియును. 162

సీ. వారిలోఁ గొందఱు స్వర్గమున వ్వహ్ని,రూపు లై నక్షత్రరూపు లగుచుఁ
దారకారూపులై తనరి బ్రహ్మత్వము, నొంది నిత్యానంద మొందు చుందు
రని శ్రుతుల్ చాటించు నట్టివా రొకనాఁడు, స్వస్వకర్మంబున జన్మములను
గల్గిరేనియుఁ బాపకార్యము లంటక, యుత్తమత్త్వంబున నొప్పుచుందు
తే. రట్టివారలు బ్రహ్మచర్యంబు నొంది, పఱపుచుఁ గురుశుశ్రూష బ్రహ్మనిశ్చ
యముగలిగినట్టిబ్రాహ్మణు లై ప్రతిష్ఠఁ,గాంచుచుం డ్రని శ్రుతి వచియించుచుండు.

వ. అట్లు కావింపనివాఁడు నీచబ్రాహ్మణుండు నాఁబడు సుఖదుఃఖములకుఁ బురుషుండు చేసినకర్మమే కారణం బిట్లు కర్మశుద్ధి గలిగి విజితేంద్రియు లైనవారు విజ్ఞానముచే సర్వముఁ బ్రహ్మముగా నెంతురు మఱియు నిరాశులు సంగరహితు లగువారికి శమదమాదులు సర్వవర్ణసామాన్యంబు లై యుండుఁ ద్యాగము గలవాఁడె బ్రహ్మజ్ఞానాశ్రయుం డగు మోక్షాపేక్షుం జేసి కర్మము లాచరించువాఁడు వివేకి యై త్యాగ మొనర్పక మానండు గావున బ్రహ్మపదము పేక్షించి ప్రవర్తించువాఁడు సంసృతినుండి విముక్తుం డగు ననిన స్యూమరశ్మి యి ట్లనియె. 164

ఉ. భోగులు దాతలుఁ సవనభోక్త లధీతులు శాంతచిత్తులుఁ
ద్యాగులు నెందఱేని ధరయందు నెసంగుచునుండ్రు విగ్రహ
త్యాగము చేసినంతటన నాకమునం దెవ రుత్తమత్వసం
యోగమునం దలిర్చెదరొకో? విన నెంచితి నానతీయవే. 165

వ. అని యడిగినఁ గపిలుండు. 166

క. దారస్వీకృతి గలవా,రారయ సౌఖ్యముల నెల్ల నంది గుణమునం
దీరుదురు గాని త్యాగ, త్యారూఢసుఖంబు నొంద రని యెఱుఁగ వొకో. 167

వ. అనిన స్యూమరశ్మి మఱియును. 168

మ. మిముబోం ట్లుత్తమయోగనిష్ఠు లయి పేర్మిం గాంత్రు గార్హస్థ్యధ
ర్మమునం దుండినవారు కర్మరతు లై మానొందుచుం డ్రెన్న నా
శ్రమముల్ నాల్గును నిష్ఠయందు సమతం బ్రాపించు వే త్రైన నే
కమ యైనం గన మేవిశేషమును బల్కం జెల్లుఁ దన్యాయముఁ. 169

సీ. అనఁ గపిలుం డిట్టు లను గర్మములు దేహ,ములకు నిమిత్తముల్ దలఁప జ్ఞాన

మది పరగతిమార్గ మగు మనశ్శుద్ధి కర్మములఁ గల్గుం దాన మానవునకు
క్షమయుశాంతియహింససత్యమార్జవమానృ, శంస్యమద్రోహము సమత హ్రీయు
ననభిమానము నోర్పు జనియించు నియ్యవి, బ్రహ్మప్రవృత్తిమార్గంబు లగుచుఁ
తే. బరము నొందింపఁ జాలెడుఁ బండితుండు, కర్మనిశ్చయ మిట్టిదిగా నెఱుంగు
శాంతులునుజ్ఞాననిష్ఠులుత్మోసురేంద్రు,లందుపద మందుదురదియయగునుబరము.
సీ. వేదముల్ సదివి తద్విధిఁ జరించినవాఁడు, వేదవేత్త యటంచు వినుతి గాంచు
వేదవేత్త సమస్తవిధు లెఱుంగును వేద, మంద సమస్తము పొందుపడును
గలదు లే దనునది కల దందు సదసత్స,మాహ్వాయంబున జగత్ఖ్యాత మగుచుఁ
ద్యాగశీలికి సర్వ మావేదమందు సం,ప్రాప్తమై సంతోష మందఁ జేయు
తే. ఋతము సత్యము విదితము సతతవేది,తవ్య మఖిలాత్మ మవ్యక్త మవ్యయంబు
బ్రహ్మమనఁబడుఁదేజముపరమశాంతి, క్షమయునివినిరామయసుఖంబమరఁజేయు.
క. ఈసుగుణసంపదం దగి, భాసుర మగుజ్ఞానదృష్టిఁ బరునిం గని సం
తోసమున నొప్పువిప్రుల, కేసమయమునందు మ్రొక్క లేఁ జెల్లింతుఁ. 172
వ. అని కపిలుండు స్యూమరశ్మికిం దెలిపె నని తెలిపిన న్వాని ధర్మనందనుండు
గంగానందనుం గాంచి యి ట్లనియె. 173
తే. శ్రుతులధర్మార్థకామములతులితముగఁ, జెప్పఁబడియుండువానిలోశ్రేయ మొసఁగు
నట్టి దెయ్యదియో తెలియంగఁ బలుకు,మనిన మందాకినీసుతుం డనియె నిట్లు.
వ. ఈ వడిగినవిషయంబు దేటపడ నొక్కయితిహాసంబు గల దాకర్ణింపుము. 175

### కుండధారుండను దేవానుచరుని వృత్తాంతము.

మ. ఫల మర్థించుచు ధర్మముం జలుపులిప్సం జేసి దారిద్ర్యముం
గలవిప్రుం డొకరుండు మున్ను మఖముం గావింపఁగా నెంచి మి
క్కిలియర్థంబు గడించు దానికయి రక్తిం జేసి ఘోరంబుగా
వెలయం జేసెఁ దపంబు దేవతల హృద్వీథిం బ్రతిష్ఠించుచుఁ. 176
వ. ఇట్లతం డత్యంతభక్తిభరితాంతరంగుండై దేవతారాధనంబు గావించినను
ధనము సంప్రాప్తింపమికిఁ జింతాకులస్వాంతుండై నే నెవ్వరిచేతం బూజింపం
బడనియేదేవతం బూజింతు నే దేవత నాకు ఝడిటి ప్రత్యక్షంబై వరం బొసంగి
నాకోర్కి నీడేర్చునో. యని విచారించుచు నించుక సౌమ్యమనస్కుం డై
యుండఁ గొండొకవడికి నాతనిసమక్షంబునఁ గుండధారుం డను దేవానుచరుం
డగు మేఘుండు ప్రత్యక్షం బగుటయు నతం డాతని నతిభక్తిం గాంచి తన

మనంబున నీతనిరూపరేఖావిలాసంబులు గన నిమ్మహాపురుషుండు దేవతాసన్ని కృష్ణుండు ననన్యమానవవృత్తుండుం బలెఁ బోలఁ దోఁచుచున్నవాఁ డీతండ నాకు బసధనం బొసంగి నాకోర్కు లచిరకాలమ్మునన తీర్పం గలం డని నిశ్చయించి ధూపదీపగంధమాల్యాదినానావిధబలివిధానంబుల నాజలధరు నర్చించి సేవించుటయు నతం డంతన సంతుష్టుండై తుష్టిపుష్టివివర్ధమానసూచకంబుగా ని ట్లనియె. 177

తే. బ్రహ్మహత్య యొనర్చినవానికి సురఁ, ద్రావువానికి దొంగకు వ్రతవిలుప్త
నకును నిష్కృతి శాస్త్రమునం దలిర్చుఁ, గాని లేదు కృతఘ్నుఁ డౌవాని కెందు.

తే. ధరదురాశకధర్ముఁ డాత్మజుఁ డసూయ, కసుఁగుఁ దనయుఁడు క్రోధుఁడుఘుననికృతికిఁ
బ్రియకుమారుఁడు లోభుఁ డేరీతి బ్రజలు, పుట్టఁ బోరు కృతఘ్నున కెట్టియెడల.

వ. అని పలుకుచున్నంత దర్భశయనంబున నున్న బ్రాహ్మణున కించుక కునుకుపట్టుటయు నంతలోఁ గుండధారుని తేజం బాతనిలోనం జేరుటం జేసి యతండు తన తపంబునకును శమంబునకును భక్తికి నిదర్శనంబుగా సర్వభూతంబులం గాంచునట్టిం డయ్యె నయ్యెడ దేవతామధ్యగతుండును మహాద్యుతియు నగు మాణిభద్రుండు లోచనగోచరుం డయ్యె దేవతలు సత్కర్మము లాచరించిన వారికి వివిధరాజ్యంబు లొసంగుటయు నాచరింపనివారిధనంబు లపహరించుటయుఁ గాన వచ్చె నాలో నమస్కరించి వినమ్రుండై యున్న కుండధారునిం గాంచి దేవానుజ్ఞ వడసి మాణిభద్రుండు నీ కేమి కావలయుం జెప్పు మనిన నతం డి ట్లనియె. 180

చ. అమరులు సుప్రసన్ను లగునట్టిర యేని మహానుభావ! నా
కమరినభక్తుఁ డీద్విజకులాగ్రణి వీని ననుగ్రహించి భ
ద్రము లగునట్లు చేయుఁ డని ప్రార్థనముం బొనరింతు నావుడున్
బ్రమనుఁడు మాణిభద్రుఁడు సురప్రవరుల్ వినుచుండ ని ట్లనున్. 181

తే. లెమ్ము లెమ్ము శుభ మ్మగు నిమ్మహీసు, రుండు విత్తార్థి యగునే నితండు కోరి
నంతవిత్తము నిమ్ము నే నమరశాస, నమున నంతయు నిత్తు నీసమయమందు. 182

వ. కుండధారుండు ధనము మనుష్యసుఖప్రదం బనిత్యం బని తలంచి తనభక్తుఁ డగు బ్రాహ్మణోత్తమునకుఁ దపంబునం దాసక్తి గల్గఁగ వరం బిప్పింప నెంచి మాణిభద్రునితో ని ట్లనియె. 183

మ. ధనదాతా! ధరణీసురోత్తమునికై ద్రవ్యంబులున్ రత్నముల్

ఘనభూరాజ్యముఁ గోరుకోఁ దలఁప వేడ్కం జేసి యీతండు ధ
ర్మనిధానంబును ధార్మికుండు నగుచుం గ్రాల న్వరం బీవె న
న్ననుకంపం గనునట్టివాఁడ వగుదే నా మాణిభద్రుం డనున్. 184

క. కాయక్లేశవివర్జితుఁ, డై యీతఁడు ధర్మఫలము లగురాజ్యశ్రీ
లీయెడ నొంది సుఖింపం, బోయెడు నని పలికె నమరపుంగవు లెన్నన్. 185

వ. కుండధారుండును దనమిత్రునకు ధర్మరక్తియే గలుగ వలయు నని మఱియు
మఱియుఁ బ్రార్థించినఁ దేవళ్లు ప్రసన్నులై రపుడు మాణిభద్రుండు కుండ
ధారుం దిలకించి. 186

సీ. దేవళ్లు ప్రీతులై రీవిప్రు నెడ నితం,డత్యంతధార్మికుం డై తలిర్చు
ననఁ గృతకృత్యుఁడ నైతి ననుచు మేఘుఁ, డలరె నంతటిలోన నవనిసురుని
కెలన సన్ననిచేలములు కొన్ని చూపట్టె,నతఁడు చూచియుఁ జూడనట్టి డగుచు
నీతఁడే నా కుపకృతి సేయ లేకున్న, నింకఁ జేసెడివార లెవ్వరు గల

తే. రనుచు నిర్వేదమున ధర్మ మాశ్రయించు,టుచిత మని తలంచి వనంబు నొంది నిష్ఠ
బూనరుచుచు దేవతాతిథిభుక్తశేష, మూలఫలభోజి యై తపం బోలిఁ జేసె 187

ఉ. ఆతనిబుద్ధి ధర్మమునయందుఁ జరించుటఁ బండ్లు దుంపలుం
బ్రీతి యొనర్ప కాఁకులను మెక్కుచు వానిని మాని నీళ్లలోఁ
బ్రాఁతిగ నానుచుం దుదకు వానిని గూడఁ ద్యజించి వేళకున్
వాతముఁ బీల్చుచుం గడపె వర్షసహస్రము లెన్ని యేనియున్. 188

క. ఇమ్మాడ్కి నున్న నమ్ముని, నెమ్మేను కృశింప దయ్యె నెఱిమీఱినధ
ర్మమ్మున శ్రద్ధయుఁ దపమున, సమ్మతియును విస్తరిల్లె సమ్యగ్రీతిన్. 189

ఆ. ఇట్లు పెద్దకాల మేగినపదపడి, దివ్యదృష్టి యొదవె నవ్వ మగుచు
నపు డతండు పరుల కడిగినధన మీయఁ, గల నటంచు బుద్ధి గలిగికొనియె.190

క. న న్నడిగి వృథగఁ బోవం, డెన్నఁడు నేవాఁడుగాని యిది నిక్క మటం
చు న్నెమ్మది హృష్టుం డై, సన్నియమముతోడఁ దపము సలిపెన్ మఱియున్.

సీ. ఇటు తపించుచు నొక్కయెడ వెండియును నాతఁ,డేఁ బ్రసన్నుఁడ నైన నేరికైని
సామ్రాజ్య మొసఁగ నేఁ జాలుదు నానుడి,మిథ్య గా దేనాఁడు మిసిమిఁ గాంచు
నని సంతసించెడునవసరంబునఁ గుండ,ధారుఁడు సౌహృదప్రేరణమునఁ
బొడసూపి పూజింపఁ బడి విస్మితుం డయి, దివ్యచక్షువు నీకుఁ దేజరిల్లె

తే. లోకములఁ జూడు మదె రాజలోకమరయు,మనుచు నరకస్థులం జూపి యనఘ నీవు

క స్తి నొందిన నాయుపకారమెల్ల, వితయగుంగానఁ జనుము వివేకగతుల. 192

క. జనుఁ డెట్లు కోరుఁ గోర్కులు, కన స్వర్గద్వార మిపుడు కట్టం బడియెం
గను మని పలికెడుసమయంబున విప్రుఁడు దృష్టిసాఁచి భువనముఁ జూచెన్.193

వ. అంతలో నావిప్రునకుఁ గామము క్రోధము లోభము భయము మదము నిద్ర మాంద్యము నాలస్యము నాశ్రయించి కొందఱు పురుషు లావిప్రునికట్టెదుటం బొడకట్టి రంత జలధరుండు ధరణీసురా! వీరిచేత లోకమావృతం బయ్యె వీరు దేవవచనంబునఁ దపోవిఘ్న మాచరింతురు దైవానుగ్రహము లేక ధార్మికుండు గాఁజాలఁడు నీవు తపశ్శక్తిచే రాజ్యాదు లొసంగ సమర్థుండ వైతి వనిన బ్రాహ్మణుండు వానిపాదంబులం బడి నాయపరాధంబు సైఁచి నన్ను గ్రహింపుము నేను గామలోభానుబంధంబున నీపై నింత యసూయం జేసితి నది సౌమనస్యంబున క్షమింపు మని వేఁడినఁ గుండధారుం డతనిం గ్రుచ్చి కౌఁగిలించుకొని యంతలో నంతర్హితుం డయ్యె నంత నాద్విజుం డెల్లలోకంబులం బరిభ్రమించుచుఁ గుండధారప్రసాదంబునఁ దపస్సిద్ధిం బడసి యోగ బలంబున నాకాశగమనాదులు గలిగి పరమగతికిం బాత్రుం డయ్యె నోధర్మనందనా! దేవతలు ధర్మవంతులఁ బూజింతురు గాని ధనాదులం గోరువారి నాదరింపరు నీబుద్ధి ధర్మనిష్ఠితంబు నీకు దేవతలు ప్రసన్నులు ధనము స్వల్పసుఖప్రదము ధర్మము సంపూర్ణసుఖదం బనిన విని ధర్మనందనుం డోపితామహా! తపోయజ్ఞంబులు చిత్తశుద్ధిరూపఫలప్రదంబు లవి స్వర్గసుఖంబుల కయ్యెడుం గాని ధర్మంబున కెట్లగుం జెప్పు మనిన నప్పితామహుం డిందుల కొకపురాతనేతిహాసంబు తార్కాణం బగు దానిం జెప్పెద వినుము మని యి ట్లనియె. 194

## సత్యుం డనుముని చరిత్రము.

సీ. ధర్మోత్తర మగువిదర్భదేశమున సత్యుండు నా నొక్కవిప్రుం డెసంగు
నతఁ డుంఛవృత్తిమై శ్యామాక మన్నము, తిక్తము విరసమై తెలియుసూర్య
పర్ణిసువర్చలాపచితశాకంబును, నియతభోజనముగా నెఱి వహించి
వన మొంది భూతహింసనెఱుంగక చరించు,చును దపస్సిద్ధిఁ గైకొనియు నచోట

తే. మూలఫలముల నొకయజ్ఞమును బొనర్పఁ,దలఁచె నతనికిఁబుష్కరధారిణి యను
భార్య గల దామె పరిశుద్ధభావురాలు,వ్రతకృశాంగియు సత్యవాగ్వర్ణితయును.

సీ. నెమిలిపెంద్రుకలతో నేసినవస్త్రముల్, ధరియించు నాయమ తనదుభర్త
సలుపుయజ్ఞంబున సహధర్మిణిగ నుండ, నయ్యు నయ్యజ్ఞమం దాస్థ లేని

దయ్యు భర్తృస్వభావానువర్తిని యయ్యె, హోత్రనుశాసన మున్నతముగ
ఫల మపేక్షింప కావరయాగ మొనరింప, సముకట్టియున్న తత్సమయమందు

తే. నటకు మృగరూపుఁడగుచుఁ బర్ణాదుఁ డనెడు
నతఁడు చనుదెంచి సత్య! మంత్రాంగహీన
మైన క్రతు విది వికృత మోఁ గాన నన్నుఁ
జంపి వేల్వుము నీకిందు స్వర్గమొదవు. 196

వ. అయ్యవసరంబున సావిత్రి సాక్షాత్కరించి యమ్మృగమ్మును యజ్ఞపశువుగా నిమంత్రించినం గాంచి దేవీ! నీ విట్లు నిమంత్రింపకుము నేను నాసహవాసి యగుదీనిం జంప నొల్ల ననిన యద్దేవి యద్దుశ్చరితముం జూడఁ జాలక రసాతలంబునకుం బోవునదియై యాగాగ్నిం జొచ్చె నంత మఱియు నాహరిణంబు కృతాంజలియై సత్యుం బలిమాలిన నతండు దానిం గౌఁగిటం జేర్చి లాలించి నిను నేఁ జంప నీవు నీయిచ్చవచ్చినచొప్పునం బొమ్మనుటయు నది యొనిమిదడుగులు వైచి మరలి వచ్చి విప్రోత్తమా! నన్ను నీయజ్ఞపశువుం గావించి విశసింపుము దీన నేను స్వర్గతిం గాంచెద నని వానికి దివ్యదృష్టి నొసంగి బ్రాహ్మణోత్తమా! చూడు మయ్యవి గంధర్వవిమానంబులు వారె యప్సరస లనిన నతం డట్లు కావించి యీమృగంబును యజ్ఞపశువుం జేసినఁ గాని దీనికి స్వర్గంబు సిద్ధింప నేర దని నిశ్చయించె నంతలో నట బహుకాలంబునుండి మృగరూపుఁడై యున్నధర్మదేవత చనుదెంచి మృగహింస ధర్మంబు గా దనియె మృగ హింస సేయనెంచుటంజేసి పరమోన్నతం బగునాసత్యునితపంబు సముచ్ఛిన్నం బయ్యెఁ గావున యజ్ఞంబులందు హింస ముఖ్యంబు నాఁబడ దప్పు డాధర్మదేవతయే యజ్ఞంబు చేయించె నంత సత్యుండు తనసతికి సమాధానంబుగా నత్యుత్తమ తపంబు గావించి సిద్ధిం బడసె ధర్మనందనా! హింసాహింసల ధర్మాధర్మంబు లిట్టి విది సత్యవాదులధర్మం బనిన ధర్మరాజు జనుం డెట్లు పాపాత్ముం డగు ధర్మం బె ట్లాచరించు నిర్వేదం బెట్లు పొందు మోక్ష మెట్లు సిద్ధించుం జెప్పు ననుగ్రహింపు మనిన మందాకినీనందనుండు. 197

తే. సర్వధర్మంబులున్నిదుస్వాంతమెఱుఁగు,నట్టులైనసుసిద్ధ్యర్థమడుగుచుంటి [గాను.
వినుమునిర్వేదముఁ ధర్మమునువృజినము, మోక్షమును దెల్పెదనుమూలముట్టు

—— భీష్ముఁడు ధర్మరాజునకు ముక్తిమార్గముం దెల్పుట. ——

సీ. ఇంద్రియార్థంబుల నెఱిఁగినంతన మును,మున్ను గాఁ గోర్కులు పుట్టుచుండు
వెనుకఁ గామంబును ద్వేషంబు జనియించు, జతనించుఁ దత్కర్మగతికి నవలఁ

దన కిష్టరూపగంధముల నభ్యాసము, గలిగించుకొనుబుద్ధి గలుగు నంత
రాగంబు ప్రభవించుఁ గ్రమముగా ద్వేషము, లోభంబుమోహంబులోజనించు
తే. నట్టివానికి ధర్మమునందు బుద్ధి,పుట్ట దేదేని వ్యాజంబు పెట్టుకొనుచు
ధర్మ మర్గము పచరింపఁ దవులు నందె, బుద్ధి నెలకొల్పి దుష్కృతములఁ బొనర్చు.
ఉ. పండితులున్ సుహృద్వరులు పాపమునుండి మరల్ప నెంచినన్
దండితనంబునం దగినదారి సదుత్తర మిచ్చుఁ గాని యా
తం డలరాగమోహజ మధర్మము వీడఁడు ముత్తెఱంగులన్
మెం డగుపాపముల్ దలఁచి మేకొని పల్కి పొనర్చుచుండెడున్. 200
క. పాపులు తనకుం బోలిన, పాపులతో మైత్రి చేసి వర్తింత్రిహాముం
దే పడయరు సుఖ మనఁగా, నాపరమున సుఖము వారి కగు ననఁ గలమే.201
వ. ఇట్టిది పాపాత్ముల తెఱం గింక ధర్మాత్ముల తెఱం గెఱింగించెద నాకర్ణింపుము.202
సీ. ధర్మాత్ముఁ డగువాఁడు తాఁ గుశలము నొందు, నొండ్లకుశల మెంచు నుల్లమందు
నందున నుత్తమ మగుగతి నొంద నో, నేఁడు కామాదుల నేవగించి
సుఖదుఃఖకుశలుఁడై సుజనుల సేవించి, ధర్మసంసక్తుఁడై తనరు నతఁడు
ధర్మలబ్ధము లగుధనముల మది నిల్పి, సన్మిత్రులం గాంచి సౌఖ్య మందు
తే. నతఁడునింద్రియార్థములస్వాయత్తములుగ,సలిపికొనిధర్మఫలములఁదెలిసిపొంది
సంతసింపక విజ్ఞాన సహితుఁ డగుచు, నలర నిర్వేదము సుఖించు ననుదినంబు.
తే. విషయవిముఖుఁడు కోర్కులు విడిచి ధర్మ,సక్తుఁ డయ్యు నశ్వరమగుజగమునరసి
క్రమముగావిరక్తినిఁగాంచికలుషరహితుఁ,డగుచుధర్మఫలముఁరోసితగులుముక్తి.
వ. ధర్మనందనా! నీ వడిగినదాని కుత్తరంబుగాఁ బాపము ధర్మము మోక్షము
నిర్వేదము నను నివి యెట్టివో తెలియఁజెప్పితిం గావున నీవు సర్వావస్థలందును
ధర్మమునందే ప్రవర్తింపుము ధర్మప్రవర్తకునకు శాశ్వతం బగుసిద్ధి యగు ననిన
నజాతశత్రుం డుపాయంబున మోక్షంబు సిద్ధించు నంటి వాయుపాయం బెట్టి
దియో విన నెంచితి నన దేవవ్రతుండు. 205
తే. అనఘ!యేయుపాయమునసర్వార్థములును, జనునకగుదానినీవనిచ్చలును వెదకు
నట్టిఁడవు గాననయ్యుపాయము గ్రహింప,నర్హుఁడవు నీవవినుము నే నదివచింతు.
సీ. ఘటము చేసెడునప్డు గలబుద్ధి చేసిన, పదపడిఁ గర్తకుఁ బొదలఁ బోవ
దారీతిగా ధర్మకారణ మగునది, మోక్షకారణము కాఁ బోవ దెపుడు
ప్రాక్సముద్రము దారి పశ్చిమాబ్ధికిఁ బోదు, మోక్షమార్గం బొక్కపుంత నుండు
నది విస్తరించెద నవహితుండవు గమ్ము, క్షమచేతఁ గ్రోధము సమయఁ జేసి

తే. ప్రబలు కామము సంకల్పవర్జనమునఁ, దఱిగి సత్త్వసంసేవ నిద్రను హరించి
యప్రమాదమునభయంబునపహరించి,యాత్మదర్శనమునశ్వాసమ్రాఁగిమఱియు.

సీ. సతతధైర్యమున నిచ్ఛాద్వేషకామము, లభ్యాసమునను మోహంబు భ్రమయు
జ్ఞానంబునం బ్రతిభానిద్రలుగా జీర్ణ,హితమితాశనమున నెల్లరుజలు
పూర్ణసంతుష్టిచే మోహలోభంబులు, విమలతత్త్వజ్ఞత విషయములను
దయచే నధర్మము దగునాయతి దురాశ,మొగి సంగవర్జనమున ధనంబు

తే. అస్థిరత్వమతిగా స్నేహమమలయోగ,మున క్షుధఁగా గృప హంకారము పరిత్యక్తిఁ
దృష్ణ యుద్ధానమునఁ దంద్రి దివ్యనిశ్చ,యమ్మున వితర్కముగా విడనాడ వలయు.

వ. మఱియు మౌనముచే బహుభాషణంబును శౌర్యముచే భయంబును బుద్ధిచే వాఙ్మనంబులును జ్ఞానచక్షుస్సుచే బుద్ధినిం జయించి యాత్మావబోధచే జ్ఞానము నాత్మచే నాత్మను వశముగావించుకొని శాంతిమంతుఁ డగువాఁడు నిజపవిత్ర కర్మములచే బోద్ధవ్యుఁ డగుచున్నాఁడు పండితులు వచించెడుయోగదోషము లైదింటినిగా ఛేదించి కామముతోఁ గ్రోధలోభములు భయస్వప్నంబులును విడిచి మౌనంబున యోగసాధనంబు గావింపవలయు ధ్యానము నధ్యయనము దానము సత్యము హ్రీ ఋజుత్వము శాంతి శౌచము సాత్త్వికాహారము నింద్రియ నిగ్రహము నింద్రియసంయమనము ననువానిచేఁ దేజోభివృద్ధియై పాపపరిహారం బగు నట్టివానికి సంకల్పసిద్ధియు విజ్ఞానమును గలుగు ధూతపాపుఁడును దేజస్వియు లఘ్వాహారుండును జితేంద్రియుండును నై కామక్రోధముల నరికట్టినవాఁడే బ్రహ్మపదంబున కర్హుం డగు నమూఢత్వ మసంగిత్వము కామక్రోధవివర్జనము దైన్యరాహిత్యము గర్వత్యాగము భయశూన్యత్వము స్థిర బుద్ధి యనునివి ముక్తిమార్గంబు లివి గాక మనోవాక్కాయనియమంబును ముక్తిమార్గం బని తెలిపి యిందుల కుదాహరణంబుగా నారదదేవలసంవాదాత్మకం బగునొక్కయితిహాసంబు గలదు దాని నెఱింగించెద విను మని యిట్లనియె. 209

## నారదదేవలసంవాదము.

క. ముదుకఁడు దేవలుఁ డొకచోఁ, జదికిలఁబడి కూరుచున్నసమయంబున నా
రదుఁ డాబుద్ధిమదగ్రణి, పదముం జని సర్గ మెఱుఁగువాఁడై యడిగెన్. 210

క. స్థావరజంగమభూత, ప్రావృత మగువిశ్వ మేనివలనన్ గలిగెన్
భావింపఁ బ్రళయ మందది, యేవానిం జేరుఁ బలుకవే మునినాథా. 211

వ. అని యడిగిన నసితుం డగుదేవలుం డి ట్లనియె. 212

ఉ. ఈశ్వరుఁ డాత్మభావమున నెంతయుఁ జోదితుఁడై సమర్థతన్
విశ్వము సేయ నెంచి సరవిన్ సృజియించెను భూతపంచకం
బీశ్వరచోదితం బగుచు నేనిటినుండియుఁ గాల మోలి మై
శశ్వదనంతలోకముల సల్పెఁ జరాచరభూతకోటితోన్. 213

వ. మఱియు నాకర్ణింపు మీభూతప్రపంచంబుకంటెఁ బరం బగుపదార్థ మొండు
గలదు పంచభూతంబులును శాశ్వతంబులు ధ్రువంబులై యుండు నని మఱి
యును. 214

సీ. పంచభూతములును భావ మభావము,కాల మీయెన్మిది కలుగు భూత
ములకుఁ బుట్టువు చావు గలిగించు భూతముల్,వానియం దడఁగుచు వానినుండి
పొడముచుండును బ్రాణి పొడవడంగినపయి, నయిదుతెఱంగుల నగుచు నుండు
దానిదేహముభూమి దాని శ్రోత్రము నింగి, దానిచక్షువు వహ్ని దాని ప్రాణ
తే. మాశుగము దానిశోణితమరయ జలము, త్వక్కుచక్షువు శ్రోత్రజిహ్వలును ఘ్రాణ
మైదు నింద్రియములునింద్రియార్థము లగు,శబ్దముఖ్యములైదు నెసంగుచుండు.

వ. ఈశబ్దాదిగుణంబుల నింద్రియంబు లెఱుంగఁ జాలవు కాని క్షేత్రజ్ఞుఁ డింద్రియ
మూలమున వాని నెఱుంగుచున్నాఁడు వినుము. 216

సీ. ఇంద్రియంబులలోన నెసఁగెడుచిత్తము, దానికంటె మనంబు దానికంటె
బుద్ధి పరం బగు బుద్ధికంటెన్ జీవుఁ, డధికుఁడు తెలియంగఁ బ్రాణి తనదు
నింద్రియములచేత నింద్రియార్థములను, దెలియ వేర్వేఱుగాఁ దొలుత నవల
మదిచే విచారించి పదపడి బుద్ధిచే, విషయనిశ్చయమును వెలయఁ జేయు
తే.నింద్రియోపలబ్ధార్థము లెల్లబుద్ధి,మంతుఁడొగినిశ్చయించునుమనముబుద్ధి[చంద్రు.
యింద్రియసమూహమనెడునీయెనిమిదియును,బుధులుజ్ఞానేంద్రియములనిపోల్చు

వ. మఱియు ముఖపాణిపాదపాయూపస్థము లైదును గర్మేంద్రియము లందు. 218

సీ. తినుటకుం బల్కుటకును మోము నడచుట,కుం గాళ్లు పని సేఁతకుం గరములు
మలవిసర్గార్థ మింపలరు పాయూపస్థ,ము లనుగర్మేంద్రియములును మనము
జ్ఞానేంద్రియములును జ్ఞానచేష్టయు గుణం,బులు నే వచించితిఁ దెలియు నట్లు
శ్రమచేత నీయింద్రియములు కర్మమునుండి, విరమించినప్పుడు నరుఁడు తనదు
తే. నింద్రియజ్ఞాన మెంతయు నెడయ నిద్ర,నొందునప్పుడును విరామ మొందక మఱి
విషయసంసక్తమగుస్వప్నవిధమదియని, తెలియవచియింత్రు విజ్ఞులోసలలితాత్మ.

వ. జాగ్రదవస్థం గలుగుసాత్త్వికరాజసతామసగుణంబులు మూఁడు నాస్వప్నదర్శన మందును మనంబునకుఁ గలుగుచుండు నానందము కర్మసిద్ధి ప్రతిపత్తి యుత్తమగతి యనునివి సాత్త్వికలక్షణంబులు వీని నెల్లప్పుడును జ్ఞాన మాశ్రయించి యుండు మఱియు నింద్రియములు భావములు గుణములుం గలసి పదునేడును శాశ్వతుం డగుజీవుం డొక్కరుం డీపదునెనిమిదియుఁ బాంచభౌతికం బగు దేహము నాశ్రయించి తద్వియోగంబున నవియు వియోగంబు నొందుచుండు నింతకుమున్ను వక్కాణించిన పదునెన్మిదియు జీవజఠరాగ్నులం గూడి యిరువదియై శరీరంబునఁ బాంచభౌతికసమూహంబు నాఁబడు. 220

సీ. ప్రాణముతోడ మహత్తత్త్వ మది గూడి, దేహము న్నడపు నాదేహ మెడయు నపుడు మహత్తున కాప్రాణము నిమిత్త,మాత్రమతా భూతముల్ మరలి పోవుఁ గర్మానుసారము కాలచోదితుఁ డయి, చను జీవుఁ డొండొక్కతనువుఁ జేర దీని కప్రాజ్ఞులు దేవురింతురు ప్రాజ్ఞు, లింతయు వగవఁ బో రితని కెవఁడు

తే. లేఁడితఁడు వేనికిం గూడఁ గాఁడు మేన,సుఖము దుఃఖము జీవుఁడు సొరిది నొందు జననమరణము లతనికిం గన మతండు,కర్మసంక్షయమున ముక్తి గాంచఁ గలఁడు.

వ. కర్మసంక్షయంబునకు సాంఖ్యజ్ఞానము ముఖ్య మని చెప్పె నని చెప్పిన యుధిష్ఠిరుండు. 222

ఉ. క్రూరుల మేము లోభమునకుం గురి యై ధనకాంక్షఁ జేసి ని
ష్కారణ మట్లు ఘోర మగు సంగరముం బొనరించి జ్ఞాతులన్
గూరిమితాతలన్ సుతులఁ గూలఁగఁ జేసితి మిట్టిమాదురా
చారకృతాఘ మెప్పగిది సాళ్వడి పోవునొ చెప్ప నెంచవే. 223

వ. అనిన భీష్ముం డిందుల కుదాహరణంబుగా నొక్కపురాతనేతిహాసంబు గలదు చెప్పెద వినుము. 224

జనకరాజమాండవ్యులసంవాదము.

తే. జనకుఁ డొకనాఁడు మాండవ్యముని గాంచి,లేదు భూతలమందు నా కేది గాని హాయిగా నేను మనుచుంటి నల్లమిథిల, కాలుచుండెను నాదేది కాలలేదు 225

వ. అని పలికి మఱియును 226

క. తెలిసినవా రధికధనం,బులు దుఃఖకరములు గాఁగ బుద్ధిఁ దలంతుర్
తెలియనివా రల్పధనం,బులయెడ మోహమును బొంది మురియుదు రనఘా.

క. కామాదిసుఖంబులు సుర, భూమహితసుఖంబు లెల్లఁ బోలింపఁగఁ దృ

ష్ణాము_క్తిసుఖంబునకుఁ గ,లామాత్రము పోల వని తలంతురు విజ్ఞుల్. 228

ఆ. గోవు పెఱుగుచుండఁ గొమ్ములు పెఱిగెడు, నట్లు ధనము పెఱుగునపుడు తృష్ణ
పెఱుగు ధనమునందుఁ బేరాస మమతచే, నయినఁ దద్వినాశ మార్తిఁ బెనుచు.

ఆ. కామసక్తి దుఃఖకారణ మౌఁ గాన, దానివంకఁ దగులు మాన వలయు
ధనము గలిగె నేని దాని ధర్మార్థము, వెచ్చ పెట్టవలయు విజ్ఞుఁ డెపుడు. 230

మ. తనతోఁ బాటు సమస్తభూతముల విద్వాంసుండు వీక్షించుచున్
మనమందుం బరిశుద్ధి గల్గి శమము న్మన్నించి దాంతత్వముం
గొని ద్వంద్వంబులఁ బాఱఁ దోలి సువివేకుం డై దురారంభముల్
పానరింపం గడకట్టినట్టిఁడు సుఖంబుం బొందు నిం దందునన్. 231

తే. దుర్మతుల కెద్ది విడువంగ దుర్లభంబు, నొడలు జీర్ణింప జీర్ణింపకుండు నెద్ది
యేది ప్రాణములను దీయ నెదుగురోఁగ, మట్టి తృష్ణను విడి సౌఖ్యమందు జనుఁడు.

క. పరిశుద్ధబుద్ధి గలిగిన, పురుషుఁడు తనచరితఁ జంద్రమునిరీతిన్ దు
ష్టరహితముగ నొనరింపం, దొరకొని సుఖ మందఁ గలఁడు దుఃఖము లెడలన్.

వ. అని జనకుండు చెప్పిన విని మాండవ్యుం డట్లు ప్రవర్తించి మోక్షంబు నొందె ననిన ధర్మనందనుండు గంగానందనునిం గని కాల మీభూతకోటిం బట్టి గిట్టించుచున్న దిట్టిచో మానవుం డెట్లు చేసి శ్రేయంబులం బొందు నెఱింగింపు మనిన నతం డీవిషయంబున నొక్కయితిహాసంబు గల దది నీకు మున్న చెప్పితి నైన నందు మఱికొన్నివిశేషంబులు గలవు వానిం జెప్పెద విను మని యిట్లనియె. 234

పితాపుత్రసంవాదము.

సీ. స్వాధ్యాయనిరతుండుత్క్షాసురుండౌకరుండు,కలఁడుమున్న తనికిఘనుఁడుసుతుఁడు
మేధావి యనువాఁడు మేధావి యై మోక్ష, ధర్మకుశలి గానితండ్రి నరసి
జనులయాయువు కనుంగొనుచుండునంత నే, సన్నగించెడునట్టిసన్న నెఱిఁగి
మనము వైళ మొనర్పఁ జను ధర్మ మెట్టిదో,యదినాకు నానుపూర్వ్యముగఁ జెప్పు

తే. మనుడు జనకుండు బ్రహ్మచర్యమున శ్రుతుల
నధ్యయన మాచరించి గార్హస్థ్య మొంది
పుత్రులం గాంచి యాగముల్ పోషణించి
వని వసించియు ముని యయి తనర వలయు. 235

క. అనవుడు సుతుఁ డి ట్లను నో, యనఘా! కాలం బమోఘు మై జగ మెల్లన్

బ్రణిహత మై పోవుడు ధీరునిరీతి వచింతు వి ట్లరూపవచనముల్. 236

వ. అనినం దండ్రి యోయీ! కాలం బమోఘుం బనుట యేమి జగంబు పరివారితంబు ప్రణిహతం బనుట యెట్టిది నన్నిట్లు వెలుపింతు వేమిటి కనుడు మేధావి యెండియు. 237

సీ. వినుము లోకము జరావృతము మృత్యుహతంబు, రేఁబవల్లాయువు రేకుమడఁచు
నిది నే నెఱుంగుదు నీ వెఱుంగవా మిత్తి,వెను దన్ని యుండు భూజనుల నెపుడు
నెఱిఁగి పరీక్షించు చే నిట్లు స్థిమితచిత్తుఁడనై మెలంగ నేతునో వచింపు
మానాఁటి కానాఁడు వో నాయు వల్పమై, పోవు నప్పుడు నింకి పోవునీటఁ

తే. జేప యట్టులు మర్త్యుండు చేద్పడి సమ, వాప్తకాముఁడు గాకుండ నట్టి వచ్చు
మిత్తి కప్పన మగుఁ గాన మేను దిరము, నాక రేపన్న దిప్పుడే నడప వలయు.

మ. పని గావింపఁగ లే దితం డనుచుఁ దత్పర్యంతముం గాల మూ
తనిపై నక్కటికంబు సూప దెపుడో తా మృత్యువుం బుచ్చు నీ
వును నేఁ గాలము నోర్వఁ జాల మితరంబుం జూచుచుండంగ మేఁ
కను దోఁడే ల్బలె నోట వైచుకొని వీఁకం బోఁకపో దారయన్. 239

క. యువకుఁ డయి యున్నయప్పుడె, సవిమర్శను గాఁగ ధర్మసంగతిఁ జన నౌ
నెవి యెవియో చేసినపై, నవల యన న్మనది యవునె యది తలఁపోయన్.

క. జీవిత మనిత్య మగుటం, గావింపఁగ వలయు ధర్మకార్యము దానన్
భూవలయమందుఁ గీర్తియు, నావల స్వర్గాదిసౌఖ్య మందఁగ వచ్చున్. 241

సీ. మోహంబునన్ దారపుత్త్రాదులం గూడి, కార్య మకార్యముం గాన లేక
తృష్ణానమేతుఁడై తృప్తి యింతయు లేక, యైహికసుఖసక్తుఁడై నవాని
మృగమును బులివోలెమిత్తి గైకొని పోవు,బలవంతుఁడబలుండుఖలుఁడు సుకృతి
జడుఁడు పండితుఁ డని చర్చింప దది యక,స్మాత్తుగాఁ బ్రాణుల సంగ్రహించు

తే. జరయు నాధియు వ్యాధియుఁబరమదుఃఖ, కారణంబులు పెక్కులు గలిగియుండ
స్వస్థచిత్తుఁడ నే నని జనుఁడు తలఁచు,కొని సుఖంచెడు ననుమాట విననిమాట.

తే. గ్రామవాసము మృత్యుముఖమ్ము నిర్జ,నాటవీవాస ముత్తమ మైన దనుచు
శ్రుతి వచించెడుఁ గావున సుజనుఁ డిట్లు,తెలిసి సంగమువిడి యడవులకుఁజనును.

తే. త్రికరణంబుల హింసను ద్రెంచువాఁడు, దుష్టకార్యములకు నెప్డు దూరుఁడగుచు
దుష్టులకుఁ గానిసత్యముతోడఁ గూడి, వెంట వచ్చెడుమృత్యువు గెంటివైచు.

వ. మఱియు సత్యవ్రతపరాయణుండు సత్యకాముండు శాంతుండు నైనవాఁడు

మృత్యువున కాదు కాలయమునిం జయించు సత్య మమృత మజ్ఞానము మృత్యువు గావున నేను సత్యసంధుండ నై కామక్రోధాదులఁ జయించి సర్వసముండనై యహింసావ్రతంబు పూని మృత్యుంజయుండ నయ్యెద మఱియు శాంతియజ్ఞంబును దాంతియజ్ఞంబును బ్రహ్మయజ్ఞంబును వాగ్యజ్ఞంబును మనోయజ్ఞంబును గర్మయజ్ఞంబునుం జేసి దేవయానంబునం బోవుదుం గాని హింసారూపంబు లగుపశుయజ్ఞంబు లాచరింపఁ బ్రాజ్ఞుఁ డెవ్వఁడు నాచరింప నొల్లండు మఱియు నేఁ దపస్స్వాధ్యాయయోగంబులం జేసి యాత్మనిష్ఠుండనై వాఙ్మనంబులు ప్రణిహితంబుచేసి యాత్మయజ్ఞంబు గావించి సర్వసౌభాగ్యము లందెద లోకంబున విద్యాసమం బగుచక్షువును రాగసమం బగుదుఃఖంబును త్యాగసమం బగుసుఖంబును లేవు నాకు ధనంబులతో దారలతో బంధువులతో సంబంధము లేదు నాయందు నేఁ బుట్టి నాయందు నే నడంగుచున్నాఁడ సమత్వము సత్యము సుశీలము విరక్తి యనునవి సాధనంబులు గుహాప్రవిష్టుం డగునాత్మ నన్వేషించుచు ముక్తుండ నయ్యెద నని చెప్పినఁ దండ్రియుఁ దద్విధంబునం బ్రవర్తించి కృతకృత్యుం డయ్యె నీవు నట్లు సత్యధర్మపరాయణుండవై ప్రవర్తింపు మనిన సమవర్తితనయుండు శాంతనవు దిక్కు మొగంబై ప్రకృతి పరంబును ధ్రువంబు నగుబ్రహ్మపదంబు నొందుట కెట్టిశీల మెట్టిసమాచార మెట్టివిద్య యెట్టిపరాయణము గావలయు నెఱింగింపు మనిన గాంగేయుం డిట్లనియె. 245

## మోక్షధర్మకథనము.

సీ. ధర్మజా! విను మోక్షధర్మరతుండు ల, ఘ్వాహారుఁడు జితేంద్రియార్థుఁ డగుచు
స్వగృహంబు విడనాడి సర్వసముం డయి, కామంబు లెల్లను గడకుఁ ద్రోచి
సన్న్యాసియై యెప్డు డన్యదూషణము సల్పక భూతహింసను బరిహరించి
యొకచోట నిలక సూర్యునివలె మెట్టుచుఁ, గలహింప కొకనితో గరువ ముడిగి

తే. పొగడ నుబ్బక తెగడినవెగడుపడక, ప్రియము పలుకుచుఁ గ్రౌర్యము విడిచి తన్నుఁ
బిలిచినం గాని పలుకక పిచ్చివానివలెఁ బ్రవర్తింప వలయును గలత దక్క.

క. ముసలధ్వనులుం ధూమము, పస యడగినవెనుక నింటివారలు భుక్తిన్
బొసఁగింపఁ దెలిసి భిక్షుకుఁ, బ్రసమీక్షించుచును మౌని వలయుం దిరుగన్.

సీ. ప్రాణయాత్రకుఁ జాలునంతమాత్రమె బిచ్చ, మెత్తుకొనం దగు నితరవాంఛ
లెవ్వియుఁ జేయరా దెవ రాదరించి పిల్చిన వారియిండ్లకుఁ జనఁగ రాదు

శయ్యాసనంబులు సమకూర్చుకొనఁ దగు, నిశ్చలాకం బగునెలవునందు
గుహ లరణ్యంబులు కుజమూలములు శూన్య, గేహము లివి యతికిం దగినవి
ఆ. నిత్యతృప్తుఁ డగుచు నిజకర్మములఫలం, బగు నటంచు నాసఁ దగులుకొనక
జపము తపము విడక జనసంగమును విడి, యతి మెలంగఁ దగు నియతి దలిర్ప.

వ. మఱియుం దపస్వి యగువాఁడు వాగ్వేగంబును మనోవేగంబును క్రోధవేగం
బును హింసావేగంబును నుదరోపస్థవేగంబును నిలువరించుకొని స్తుతినిందా
సముండై పూర్వపరిచితంబు లగు ప్రదేశంబులం బరిత్యజించి వానప్రస్థులతో
నైనను సంబంధము పెట్టుకొనక పరివ్రాజకాశ్రమవిధులం బ్రవర్తింప వలయు
నిదియే విజ్ఞానుల కుత్తమమార్గం బనియు మోక్షమార్గం బనియు మున్ను
హారీతుండు పలికె నని పలికిన దేవవ్రతునిం గాంచి ధర్మసుతుం డి ట్లనియె. 249

ఉ. ధన్యులు పాండుపుత్త్రు లని తత్పరతన్ మము మెచ్చుచుంద్రు చై
తన్యము గల్గునెల్లరును దా రొకనాఁడును మాకు దీటుగా
దైన్యము దుఃఖముం గుడుచుదారి మెలంగ నెఱుంగ రక్కటా
మాన్యనృపాన్వవాయమున మావలె దుఃఖితు లుండ రెవ్వరున్. 250

వ. దుఃఖభూయిష్ఠము లగునీదేహములు ధరించి యుండుట కష్టతరంబు వ్రత
పరాయణు లగుమును లింద్రియము లింద్రియార్థములు మనోబుద్ధ్యహంకార
ములును గుణంబులును విడిచి పునర్జన్మంబు నొందకుందురు మే మెపు డీరాజ్య
భారంబు విడిచి సన్న్యాసుల మై సుఖింపఁ గలుగుదుమో చెప్ప ననుగ్రహింపు
మనిన భీష్ముం డి ట్లనియె. 251

సీ. గణుతింప జగమునందణుమాత్ర మేనియు, నంతమందకయుండు నదియు లేదు
నీవు తలంచెదుభావంబునందు దో,షము లే దనుచుఁ జెప్ప సాహసింతె
నీప్రయత్నముచేత నే నీవు తమ్ములు, నచిరమ్మునన ముక్తి నందఁ గలరు
జనుఁడుపుణ్యముపాపమును జేయుటకుఁ గర్త,గాఁడులోనగుఁ గృతకర్మమునకుఁ
తే. గర్మజం బయి వచ్చినఘనతమంబు, చుట్టుకొన నిర్గుణుఁడు జీవుఁ డట్టె మాఱి
దానివిడనాడియొండొక్కఁడైనదేహ,మాశ్రయించుచు నుండు నటంచు వినవె.

క. జ్ఞానముచే నజ్ఞానజ, మై నెఱి మీఱినతమంబు నడఁగించుకొనం
గా నంతలోనె ప్రాణికిఁ, గానంబడు బ్రహ్మ మఖిలకల్మషహార మై. 253

వ. సనాతనంబగునాబ్రహ్మ మెంతప్రయత్నించినను బొంద సాధ్యంబు గాదు మహర్షు
లా బ్రహ్మముం బొంది మరలకుందు రీవిషయంబున నొక్కపురాతనేతిహాసంబు

గలదు వినుము తొల్లి వృత్రుండు భ్రష్టైశ్వర్యుండును శత్రుమధ్యగతుండు నై యున్న సమయంబున శుక్రుం డాతనిపాలికిం జని శత్రుపరాజితుండ వగునీ కిపుడు వ్యథ లేకున్నది గదా యనిన వృత్రుం డిట్లనియె. 254

శుక్రవృత్రసంవాదము.

తే. సత్యము తపంబు గలిగి నిస్సంశయముగ, భూతసర్గవినాశము బూమె లెఱిఁగి
నట్టినాచిత్త మిది శోకహర్షములకుఁ, జో టొసంగనిదని నీవు చూడు మెడఁద.

సీ. కాలచోదితములై కలజీవు లెప్పుడు, నరకంబున మునుంగ నరుగుచుండు
గణితకాలం బట్లు కడతేర్చి వెండియుఁ, గర్మశేషంబునఁ గలుగు నిచట
నిరతంబు కామాదిపరివృతుం డగువాఁడు, పొందుఁ దిర్యగ్యోనులందుఁ బుట్టుఁ
గర్మానుసారము గా ఫలం బగు నని, శాస్త్రముల్ ఘోషించు సంతతంబు

తే. కర్మమునఁజేసి జన్మముల్ గలుగుచుండు,నింతవాఁ డంతవాఁ డగు నంతవాఁడు
నింతవాఁ డగుఁ గాన నా కెట్టి యెడలఁ,గష్టసుఖములు సమములై కానఁ బడును.

వ. అనిన శుక్రుం డోయీ! నీవు ధీమంతుండ వైన నసంబద్ధప్రలాపంబు లాడు చుంటి వేమిటి కనిన వృత్రుండు వెండియు 257

చ. తెలియదె నీకు లోకులకు దివ్యతపోధన! తొల్లి నే భుజా
బలమున నెల్లలోకములఁ బట్టి జయించితి నింద్రముఖ్యులన్
గెలిచి సబంధుమిత్రముగ గీఁటుపడం బొనరించినాఁడ నా
జ్వలదనలప్రతాపము దిశావలయంబుల నిండి యుండెఁ బో. 258

క. నాదగుతపఃప్రభావము, మాదారున కెత్తువచ్చు మహిమైశ్వర్య
ప్రాదుర్భవముగ నొప్పితి, నాదినములు నెల్లిపోయె నన ఫల మగునే. 259

వ. భార్గవా! నేను ధైర్యంబునంజేసి గతంబున కించుకేనియు విచారింపకున్న వాఁడ ము న్నొకనాఁడు నేను మహేంద్రుపై దాడివెడలినప్పుడు నాకు వైకుంఠవాసుఁడును లోకపితామహుండును బురుషోత్తముండు నగునారాయణుండు దర్శన మిచ్చె దానంజేసి నాతపం బెంతవిశేషించినదియో కర్మఫలం బెట్టిదియో విన నెంచితి మఱియు నైశ్వర్యం బెవ్వనియందు నిరూఢం బగు నది యెట్లు నివర్తించు వేనివలన భూతంబులు పుట్టి పెరుగుచున్న వేమిఫలమ్మున జీవుండు శాశ్వతుం డగుచుండె నట్టిఫల మేజ్ఞానకర్మములచేఁ బొందఁ దగు నెఱింగింపు మనిన శుక్రాచార్యుండు. 260

ఉ. భూమియు నాకసం బెవనిభూరిభుజాంతరగోచరంబులో
యేమహనీయుమూర్ధ మది యింతనరాక యనంత మానో యా

శ్రీమహిళామనోహరునిఁ జిన్మయరూపుని సంభజించి త
త్స్వామిమహత్వ ముత్తమము దానవసత్తమ! నీకుఁ జెప్పెదన్. 261

వ. అని వా రిద్దరును బ్రశంసించుకొనుచున్న సమయంబున ధర్మాత్ముం డగు సనత్కుమారుం డట వచ్చి వారిచేఁ బూజితుండై విశ్రమించినంత శుక్రాచార్యుం డాతనిం గాంచి మహాత్మా! యీదానవేంద్రుండు విష్ణుమాహాత్మ్యము విన నెంచెం గావునఁ జెప్ప ననుగ్రహింపు మనిన నతం డట్ల యగుం గావుత మని వృత్రునిదిక్కు మొగం బై యి ట్లనియె. 262

సనత్కుమారుండు చెప్పినవిష్ణుమాహాత్మ్యము.

సీ. స్థావరజంగమాత్మకభూతజాతంబు, శ్రీమహావిష్ణువుచే సృజింపఁ
బడియు నాతనియందె యడఁగు వాని నతండు, విడుచు నాకర్షించు వేళలందు
నింద్రియార్థముల జయించినజ్ఞాని యా,తనిఁ గనుఁ గన లేరు తపసి యజ్వ
యగసాలి బంగార మగ్నిలో బలుమాఱు, కాల్చి విశుద్ధినిఁ గాంచినట్లు

తే. జీవుఁ డెన్ని యే జన్మముల్ చెందికర్మ,ములనుబొనరించి శుద్ధుఁడౌఁ దెలియనొక్కఁ
డొక్కజన్మమునం దె యత్యుత్తమప్ర,యత్నమునశుద్ధుఁడై ముక్తినందఁగలఁడు.

క. మనుజుఁడు తనమేనన్ సోఁకినదూళినిఁ దుడిచికొనెడు క్రియఁ బాపములన్
ఘనయత్నంబునఁ దొలఁగన్, బొనరించుకొనంగ వలయుఁ బుణ్యక్రియలన్.

చ. అలుపము లైనపుష్పములయందుఁ దగుల్కొనఁ జేసినంతటన్
దిలలును సర్షపంబులును దీఱ స్వగంధ మెసంగ వెన్నొ పూ
వుల బహువారముల్ గలిసి పొల్పెసలారెడునట్లు సక్తముల్
కలుషము లెన్నొ జన్మములఁ గాని తొలంచుట దుర్లభం బగున్. 265

వ. మఱియుఁ గర్మస్వరూపంబును దద్విశేషంబులును వివరించెద నవహితుండ వగుము. 266

సీ. నారాయణుఁడు ప్రాణివారంబు సృష్టించి, ఈరుఁ డక్షరుండునై సర్వభూత
తతి నుండువాఁ డయ్యుఁ దా నొండు నీరైదు, నగువికారంబుల నలరి తనదు
రశ్ముల జగమెల్లఁ ద్రావుచునుండు నా,తనిపాదములు భూమి తల దివంబు
చేతులు దిక్కులు చెవు లాకసంబు తే,జము సూర్యుఁడు మనంబు చంద్రముండు

తే. బుద్ధి జ్ఞానగతము రసంబు జలమయము,కన్నుబొమ్మలు గ్రహములు కన్నులుడుగ
ణమ్ము లెన్న సత్వరజస్తమమ్ము లతని, దివ్యమూర్తు లటంచును దెలియు మనఘ.

క. విను మాతఁ డాశ్రమంబుల,కును గర్మములకు నకార్మికులకును ఫలమై

చను నజుఁ డవ్యయుఁ డాతని, వినుతింప నశక్య మెట్టివిజ్ఞానులకున్. 268

మ. శ్రుతులాదేవునిరోమముల్ ప్రణవ మాసూర్యాత్మువాకు ల్మనో
గతధర్మం బతఁడే హృదంతరసమాక్రాంతుండు బహ్వాశ్రయుం
డతఁడే బ్రహ్మము సర్వతోముఖుఁడు ధర్మాంచత్తపోగమ్యుఁడున్
శ్రుతిశాస్త్రగ్రహషోడశర్త్విజమహాస్తోమస్వరూపుండునున్. 269

సీ. అతఁడె పితామహుం డశ్వినీదేవత, లింద్రుండు వరుణుండు నినుఁడు యముఁడు
ధనదుండుబహురూపతనుగాంచియొక్కఁడై, యొసఁగునంచుంబ్రాజ్ఞులెఱిఁగికొం
జగ మెల్ల నతనివశమునసుండెడుభూత,సంఘాత మెల్లనాస్వామి యనియుఁ[శ్రు
దెలిసిన పురుషుండు దివ్యతేజోమూర్తిఁ, బొడఁ గాంచు నట్టిఁడై పొందు ముక్తి
తే. వేయికోటులు జీవు లేవేళఁ బుట్టి, చచ్చి పుట్టుచు నుండు నీచందమునను
స్థావరంబులు నని నీదుస్వాంతమందుఁ, దెలిసి కొనవయ్య దానవకులవరేణ్య.

వ. ఇంకఁ బ్రజావిసర్గపరిమాణంబు చెప్పెద విను మొక్కొకయోజనము వెడల్పు నైదునూర్లయోజనంబుల పొడ వొక్కక్రోశము లోఁతును గల్గి ప్రవృద్ధములై యున్న పెక్కువేలబావులలోఁ గలజలం బెల్ల నొక్కవెంద్రుకకొనతో నెగురఁగొట్టఁ గలంతకాలములోఁ బ్రజాసృష్టిసంహారంబు లగుచుండు మఱియు గుణసంయోగంబున జీవులకుఁ గృష్ణధూమ్రనీలరక్తహారిద్రశుక్లవర్ణంబులుం గలుగుచుండు నందు రక్తవర్ణము సహ్యతరము హారిద్రము సుఖము శుక్లము శోకరహిత మిట్లు జీవులు పదునాలుగులక్షలజన్మము లొంది యూర్ధ్వాధోగతు లందుచుండు నందు నీలగుణప్రాణి నికృష్టం బై నరకపాతంబున కగు నిట్లు లక్షలకొలందిజన్మంబు లెత్తి హరితవర్ణంబు నొంది పెక్కుకాల మావర్ణంబునఁ జరించుచు యుగక్షయంబున సత్వగుణయుక్తుండై నిజతపోబలంబునఁ దమోగుణం బడంచి లోహితవర్ణంబు నొంది మనుష్యలోకంబున జన్మపరంపరల నొందు నిట్లు మానవసృష్టిలయకాలంబుదనుకం గ్లిశ్యమానుండై యవల హారిద్రవర్ణంబు నొంది వేయిసృష్టివిలయమ్ము లగునంతకు దేవత్వ మందు నిష్టేడువందలసాత్వికకర్మంబు లాచరించి కొన్నివర్ణంబు లొందినపదంపడి శుక్లవర్ణం బంది పుణ్యలోకాష్టకంబున విహరించి యవల మర్త్యపదంబు నొందు సుఖము విడనోపనియోగి సత్యతపోమహాజనలోకంబుల నూఱుకల్పంబులు వసించు రాగాదుల జయించియు సిద్ధుండు కానేరనియోగి నిజకర్మశేషంబున నూటయేడుకల్పంబులు స్వర్గసుఖం బనుభవించి మరల మానవత్వమున నుత్త

మత్వ మొందు వానికి మోక్షేచ్ఛ గలిగినప్పుడు సప్తలోకంబులుం దనవిజ్ఞానముచే నిగ్రహించి విషయంబులం దగులుకొనక యవ్యయ మనంతం బగు పదంబు నొందుచున్నాఁ డాకర్ణింపుము. 271

సీ. ఆపదం బీశుని దనియు విష్ణునిదని,యును బ్రహ్మ దనియు శేషునిది యనియుఁ
బలువురు పలుతెఱంగులఁ బల్కుచుందురు, జ్ఞానాగ్ని చేత ముష్మేనుఁ గాల్చి
యోగులు బ్రహ్మంబు నొందుదు రింక దే,వత్వ మొందినవారు స్వస్వకర్మ
ములఁబట్టి తా ముందు పొందినజన్మముల్, పొందు చుందురు మీఁదిపుట్టువులను

తే. గర్మఫలము నిశ్శేషముగా భుజించి, పైన దేవత్వమును విడి మానవత్వ
మొందుచుందురుపొందికంగొందఱుత్త,ములుజితేంద్రియులై ధర్మమున మెలంగి.

తే. జ్ఞానమునఁజేసి సంసారసాగరంబు, దరియ నీఁది మహోత్తమత్వమున మెలఁగి
యవ్యయం బగుపరతత్వ మంది యెపుడు, చావుపుట్టువు లేనట్టితావుఁ గొంద్రు.

వ. అని తెలిపిన వృత్రాసురుండు సనత్కుమారుం గాంచి. 274

శా. దేవా ! నీవచనంబు లెంతయు సమర్థించు న్మదీయార్థముల్
నీవాక్యంబులు వేదవాక్యములు నే నిష్కల్మషుం డైతి నా
భావం బెంతయు శోకశూన్య మగుచుఁ భాసిల్లెడిఁ నశ్వరం
బీవిశ్వం బని విశ్వమూర్తి నజునిఁ వీక్షించి సేవించెదఁ. 275

వ. అని పరమార్థతత్త్వవేత్త యగువృత్రుండు తనప్రాణంబులు విడిచి నిజాత్మను బరమాత్మతోఁ గలియంజేసి పరమోత్తమస్థానంబు నొందె నని తెలిపిన యుధిష్ఠిరుండు వృత్రునకు సనత్కుమారుండు తెలిపినజనార్దనుండు భగవంతుఁడా యతనిమహత్వం బెట్టిది చెప్పు మనిన భీష్ముం డిట్లనియె. 276

సీ. భగవానుఁ డగువిష్ణు వగును మూలస్థాన, మతఁడు తేజంబున నఖిలభావ
ములు సృజించెడు వాని కలరుఁ దురీయార్థ,మునఁ గేశవుం డయి మూఁడులోక
ములను భావించు నాబలశాలి జలముల, శయనించు జగములు సలుపుచుండు
వాని శూన్యంబులు గానీ కనంతుఁ డై, భరియించు దీన లోఁబడఁ డతండు

తే. అనుడు ధర్మజుఁ డిట్లను నాసురారి, యైనవృత్రుఁ డధ్యాత్మతత్త్వావబోధ
మైన వాఁ డని తలఁచెదఁ గాన నే వి,రాగియై యొందునుఁ శోకరహితుఁడయ్యె.

వ. శుక్లజాతివర్ణంబులు గలవారికి సిద్ధి గలిగి పునరావృత్తి లేకుండు రక్తహారిద్రాది వర్ణములు గలవారు తమఃప్రధానకార్యము లొనర్చి తిర్యగ్యోనులం జనింతురు కదా మేము రజోగుణసూచకం బగురక్తవర్ణము గలవారమై సుఖ

దుఃఖములకుఁ బాసైతి మిఁక మాగతి యెట్టిది మావర్ణము నీలమా నికృష్ట మగుకృష్ణమా యెఱింగింపు మనిన భీష్ముండు మీరు సంశుద్ధాభిజనసంపన్నులు శంసితవ్రతులు దేవలోకమున విహరించి మనుష్యలోకమునకు వచ్చి సుఖం బుండి రాగలసృష్టిలో మరలదేవత్వము నంది సమస్తసౌఖ్యము లనుభవిం చుచుఁ దుదకు సిద్ధు లగుదురు మీ కెన్నఁడు భయము గలుగ నేర దనిన యుధిష్ఠిరుండు వెండియు. 278

తే. నిర్మలాత్ముఁడు వృత్రునిధర్మశీల, మతులవిజ్ఞాన మసమాన మతనివిష్ణు
భక్తియు ననంత మాతనిభవ్యచరిత, వినుట నానంద మెంతయు విస్తరిల్లె. 279

శా. తత్త్వజ్ఞుండును ధర్మశీలుఁడును మేధావంతుఁడుఁ వృత్రుఁ డా
ర్యత్వంబుఁ విడి యింద్రుతోడ దుర మారంభింప నేమయ్యె నే
సత్వంబుం గొని యింద్రుఁ డాఘనభుజుఁ సంగ్రామమం దోర్చె నీ
తత్త్వం బంతయు నానుపూర్విగ వినం దాత్పర్య మయ్యె న్మదిఁ. 280

వ. అనిన భీష్ముం డి ట్లనియె. 281

ఇంద్రవృత్రులయుద్ధప్రకారము.

సీ. ముప్పదికోటులు మూఁడుకోటులు దేవ,ముఖ్యులు వేష్టింప ము న్నొకప్డు
దండయాత్రఁ బొనర్పఁ దలఁచి దేవేంద్రుఁడు, తనజైత్రరథ మెక్కి తరలి చనుచు
నొకచోట నేనూఱుయోజనంబుల యెత్తు,మున్నూఱుయోజనంబులవెడల్పు
గలిగి పర్వతమునాఁ గన్పట్టువృత్రుని, నరసి సంత్రస్తులై రమరు లెల్ల

తే జడుపునం జేసి యింద్రునితోడలు గదల,కుండె నప్పుడు వారి కత్యుగ్ర మైన
యుద్ధమగు దెంచెనట్లుసన్నద్ధుఁడైన,యమరవిభుఁ గాంచిభయమందఁడయ్యెనసుర.

ఉ. అప్పుడు భూనభోంతర మ దంతయు నిండఁగ భేరిభాంకృతుల్
ముప్పిఱిగొన్న శబ్దమున ముట్టఁగఁ బర్వుచునుండ రెండునా
గొప్పసముద్రముల్ కవియఁ గూడిన యట్టులు రెండుసైన్యముల్
గప్పుచుఁ జొచ్చెఁ బోరునకుఁ గట్టుపకాసుతనంబు హెచ్చఁగఁ. 283

వ. త్రైలోక్యభయాకరం బైనయమ్మహాసంగ్రామంబున నసిపట్టసశూలశక్తితోమర ముసలముద్గరాదిసాధనంబులయు వృక్షశిలాదులయు వివిధకార్ముకంబులయు నానావిధశస్త్రాస్త్రంబులయుఁ బావకోల్కాదిపరికరంబులయుం బ్రయోగం బున నద్దేవదానవసైన్యంబులకు ఘోరయుద్ధంబు సిద్ధించె నాయుద్ధం బరయు వేడ్కం జేసి పితామహపురోగము లగుదేవగణంబులును ఋషిగణంబులును

సిద్ధసాధ్యాప్సరోగణంబులును విమానంబు లధిష్ఠించి వచ్చి యంతరిక్షం బాశ్రయించి యుండె నాసమయంబున వృత్రాసురుండు. 284

ఆ. అంతరిక్ష మెల్ల నావరించి యతిద్రుతముగ నశ్మవర్ష మమర సేన
మీఁదఁ గురియ రుట్సమేతమై సురసేన, నది యడంగఁ జేసె నశ్మవృష్టి. 285

వ. అంతలోన. 286

క. మాయావిశారదుం డగు, నాయమరద్వేషి క్రుద్ధుఁడై శతమన్యున్
మాయాయుద్ధంబున మూర్ఛాయత్తుం గా నొనర్చె నతిశౌర్యమునన్. 287

వ. ఇట్లు దేవేంద్రుండు వృత్రార్దితుండై మూర్ఛిల్లి యున్నంత వసిష్ఠుండు రథంతర సామంబున నతనికిఁ బ్రబోధంబు గావించుచు ని ట్లనియె. 288

సీ. దేవతాశ్రేష్ఠ! యోదేవేంద్ర! దైత్యదానవనిషూదన! యిట్లు నాలి వోలె
నెద విషాదము నొందె దేటికి లే లెమ్ము, బ్రహ్మయు విష్ణుండు పరమశివుఁడు
వీరె వచ్చిరి వీరివెన్క సోముండును, పరమర్షు లల్లదే వచ్చుచుండి
రలఁతివోలెందుఁగఖమందనొప్పదుపూన్కి, సలుపు మనిన్ శాత్రవులను గెలుము

తే. పరమశివుఁ డదెకరుణ నిన్నరయుచుండె, ధిషణముఖ్యమహర్షు లీదెస జయంబు
గోరి నిన్ను స్తుతించుచున్నారు మూర్ఛ, దేరి మొనకట్టు జయలక్ష్మి చేరు నిన్ను.

వ. అని సంబోధించుచున్నంతలో నమ్మరుత్వంతునకు నత్యంతోత్తమతేజంబును బలంబునుం గలుగ లోనిమోహంబు దిగఁద్రావి యోగబలంబున నయ్యాసురమాయం బోకార్చె నవ్వేల నవ్వృత్రుని పరాక్రమక్రమం బెఱింగి వసిష్ఠాదిపరమర్షు లెల్ల శర్వుం జేర నరిగి సర్వలోకహితకాములై వృత్రవినాశనంబు గోరి వినుతించుటయు నంత నాజగత్పతితేజంబు రౌద్రం బగుజ్వరంబై దైత్యపతి యగువృత్రు నావహించె భగవంతుం డగువిష్ణుదేవుండు లోకసంరక్షణరతుండై వజ్రాయుధంబునం జొచ్చె వసిష్ఠుండు బృహస్పతియు నితర మహర్షులును వాసవుం దరియ వచ్చి యేకాగ్రమనస్కులై వృత్రుం జయింపు మని దీవించిరి మహేశ్వరుం డమరేశ్వరుం బిలిచి యీవృత్రుండు మహాబల సమన్వితుండు బహుమాయాధురంధరుండు షష్టిసహస్రవర్షంబులు పద్మసంభవుం గూర్చి పరమతపంబు గావించి త్రిలోకదుర్జయుండై యున్నవాఁ డిదె మామకం బగుతేజంబు ని న్నావేశించుచున్నది నీవు వీని నీవజ్రాయుధంబున నింతలోఁ దెగ నేయు మనిన నింద్రుండు నీప్రసాదంబునం జేసి దురాసదుం డగువీనిం దునుమాడెదం గాక యనునంతలో శివజ్వర మావృత్రుని

లోనం జొచ్చెఁ జొచ్చునపుడు దేవర్షులు మహానందంబునఁ గలకలధ్వనులు గావించిరి దుందుభులుశంఖములు మురజమ్ములు డిండిమమ్ములు లోనగుమహా వాదిత్రమ్ములు వేలకొలందిగ మ్రోఁగ సాఁగె దైత్యదానవులచేష్టలెల్ల నష్టం బయ్యె నయ్యసురమాయయుఁ బటాపంచ లయ్యె దేవేంద్రుండు దివ్యరథంబున దేదీప్యమానుండై చూడ నయ్యె నయ్యవసరంబున. 290

సీ. జ్వరసమావిష్టుఁ డౌసురవైరి మోమెల్ల, వైవర్ణ్యమును బొందె వాసి వోవ
నొడ లెల్ల గడగడవడకంగఁ జొచ్చెను, గొప్పనిశ్వాసము లుప్పతిల్లె
రోమహర్షం బతిరూక్షమై ప్రభవించె, నిలువెల్లఁ జెమ్మటల్ కలియఁ బాఱె
నశివశివాకృతి నాతనిస్మృతి యెల్ల, నోటుమై వెలివచ్చె నోటినుండి

తే. పార్శ్వములయందు నుల్కలు పడియెఁ గాక,కంకగృధ్రవలాకహాగణములార్వ
లెసఁగ వృత్రునినెత్తిపై నింతలోన, జక్రమును బోలి తిరుగాడె వక్రగతుల.

మ. జ్వరతీవ్రత్వముచేత జృంభణ మెసంగం జేసి సింహంబు నా
నురునాదంబున నార్చె వృత్రుఁ డపు డెంతో పంత మేపార ని
ర్జరనాథుండును విష్ణుయుక్త మగువజ్రం బెత్తి యాదైత్యుపైఁ
బరఁగించెం బరమేష్ఠిముఖ్యదివిజవ్రాతంబు లగ్గింపఁగన్. 292

క. కాలాగ్నిసదృశ మగుచున్, జ్వాలాజాలంబు నిండ సర్వాశల దం
భోళి యది పఱచి వృత్రుని, వైళమ కూలంగఁ జేసె వాసి యెసంగన్. 293

బ్రహ్మహత్య యింద్రు నావహించుట.

వ. ఇట్లు వృత్రుం బరిమార్చి దేవేంద్రుండు దేవతాపరివారపరివృతుండై స్వర్గంబు నకు నిర్గమించె నంత. 294

సీ. అతిఘోరరూప మత్యతిరౌద్రనేత్రముల్, లోకభయావహాలోకనములు
భీకరదశనముల్ వికృతశిరోజముల్, కృష్ణపింగళవర్ణ ముష్ణరోచి
చీరవల్కలములు భూరికపాలమాలలు గల్గి నెత్తురు లొలికి కొనుచు
వృత్రునిమై నుండి వెలివచ్చి నిప్పు కన్గవ రాల సృక్వముల్ నాకికొనుచు

తే. నాసురీరూపమున బ్రహ్మహత్య గదలి, శక్రు నరయుచు నాతఁడు స్వర్గమునకుఁ
జనుట నెఱిఁగినదై వానిననుసరించి, కొంతలోఁబట్టె నతఁడులోఁ గుతిలఁగుడువ.

వ. ఇట్లు బ్రహ్మహత్యానురోధితుం డగుపురుహూతుండు భీతుండై పఱచి పోయి యొక్క జలాశయంబున బిసతంతువులం దంతువ యై పెక్కేండ్లు డాగి యుండె బ్రహ్మహత్యయు నతని ననుసరించియే యుండె నంత నిస్తేజస్కుం డగు

నింద్రుండు ధానిం దొలఁగించుకొను నుపాయంబు గాన కొక్కనాఁడు పితామహునిపాలికిం జని ప్రాంజలియై విన్నవించునంతలో వెన్నుఁదన్ని వచ్చిన బ్రహ్మహత్యం దిలకించి హిరణ్యగర్భుండు సాంత్వనపూర్వకంబుగా మృదు మధురస్వరంబున ని ట్లనియె. 296

ఆ. మత్ప్రియం బొనర్పుమతి గలదాన వై, విబుధనాథు నితని విడిచి పుచ్చు
మేమి కోర్కి నీకు నెసఁగెడినో చెప్పు, మేను దీర్పువాఁడ నింతలోన. 297

ఉ. నావుడు బ్రహ్మవధ్య యను నా కొకకోరికి యుండఁ బోవు నే
నీ విటు సంతసించి కరుణించితి వింతియ చాలుఁ బొ మ్మనం
బోవుదు నీబిడౌజసునిపొంత వసించుట మాని కాని నా
కేవిధ మైనవాస మెట నేర్పడఁ జెప్పెదొ చెప్పు మబ్జజా. 298

వ. అనిన నతం డట్లు గావుత మని యగ్నిభట్టారకుం దలంచిన నతండు సాక్షాత్కరించి దేవా! నాకు ముదల యేమి యాన తిమ్మనిన నన్నలువయు.

తే. గోత్రభేదివిముక్తిని గోరి బ్రహ్మ, వధ్య నాల్గుతెఱంగులై వఱలు నట్లు
చేయు చుంటినందొకపాలుస్వీకరింపు, మీవునావుడు వెఱ వహ్ని యిట్టులనియె

క. నీయాజ్ఞాబద్ధుఁడఁ గా, నీ యొంతటిలోన ముక్తి యెఱిఁగింపుము నా
కో యయ్య యనఁ బ్రజాపతి, పాయనిప్రేమమున నిట్లు పలికె నతనికిన్. 301

ఆ. ప్రజ్వలించునిన్నుఁ బరికించి బీజౌషధులు రసంబు వేల్మి సలుప కేగు
వాని నంటు బ్రహ్మవధ్య యియ్యది నీదు, మానసజ్వరంబు మలఁగు నంత. 302

వ. అనిన వైశ్వానరుండు పితామహువచనంబునం జేసి బ్రహ్మహత్యం బరిగ్రహించె నంతఁ దృణవృక్షలతాదులం బిలిచి జాతవేదునితోడం జెప్పినచొప్పునం జెప్పిన నవియుఁ దమకు దానిం బాయుతెఱం గెఱింగింపు మని యడిగినఁ జతురాననుండు. 303

తే. పరుల కుపకార మొనరించువారు మీరు, మిమ్ము నెవ్వరు పర్వదినమ్ములందు
నఱికి ఛేదింతురో వారి నాఁడె చేరఁ, బోవు నీబ్రహ్మవధ్య మిమ్ములను వీడి.

వ. అనిన నవ్వనస్పతులు వల్లె యని వధ్యం గ్రహించి చనియె నవ్వల నవ్వనజాసనుం డప్సరసలం బిలిచి వనస్పతులతోడం జెప్పినట్లు చెప్పిన వారు వనస్పతు లడిగిన ట్లడుగుటయు నతండు వారి కి ట్లనియె. 305

తే. అలకింపుఁడు దేవకాంతాలలామ,లార! స్త్రీలు రజస్వల లైనయప్డు
వారి నంటి క్రీడించెడువారి నపుడ, కూడఁబాఱు మిమ్ముల వీడి ఘోరహత్య.

వ. అనిన వారుతచ్ఛాసనంబున బ్రహ్మహత్యం గ్రహించి చనిరి పదంపడి పరమేష్ఠి
సలిలంబులం దలంచిన నవి సాన్నిధ్యంబు గావించుటయు వానితో నచ్చరల
తోడం జెప్పినట్లు చెప్పిన నవి తొంటివానివలె నవధిం దయచేయు మనిన
బ్రహ్మదేవుండు. 307

తే. చులుకఁ జేయుచు మిముఁ జూచి యలఁతి యెవఁడు
శ్లేష్మమూత్రపురీషముల్ మీాపదమున
విడుచు నాతని నాహత్య వడిగ నంటు
విడిచి మిమ్ము నొకింతలో విస్మయముగ. 308

వ. అనిన నవియు దానిం దలఁ దాల్చి పనివినిరి యింద్రుం డివ్విధంబున బ్రహ్మ
హత్యం బెడఁబాసి పితామహానుజ్ఞాతుండై హయమేధంబు గావించి శుద్ధిం
గాంచి వైరుల సంహరించి సకలైశ్వర్యంబు లనుభవించుచు సుఖం బుండె
నావృత్రునిరక్తంబువలన శిఖండంబులు గలకొన్నిపక్షులు పుట్టె నవి రక్తో
రక్తజనితంబు లగుటంజేసి తపోనిష్ఠులు దీక్షితులు నగుద్విజాతుల కభక్ష్యంబు
లయ్యె నోధర్మనందనా! నీవు భూతలదేవత లైన బ్రాహ్మణుల నారాధించుచు
దేవేంద్రుండు వోలె వైరులం దునుమాడి యశోవిశాలుండవై వెలయుచుండు
మీావృత్రాసురసంహారకథను బర్వపర్వంబులందును భూసురప్వసమక్షంబునం
బలికినవారికిఁ గిల్బిషంబు లంటఁబోవింక నేమి విన నెంచితి వనిన నజాతశత్రుం
డీవృత్రవధకథాశ్రవణంబున నాశోకసందియం బుదయించె వృత్రుండు జ్వర
మోహితుండై యున్నయప్పుడు వాసవుండు వజ్రంబున వాని వధించె నంటి
వాజ్వరప్రాదుర్భావాదికం బెట్టిది విన వలతుం జెప్పు మనిన దేవవ్రతుండు
చెప్పెద విను మని యి ట్లనియె. 309

దక్షముఖమున శివజ్వరప్రాదుర్భావకథనము.

సీ. కలదు సుమేరుశృంగము లోకపూజ్యము, జ్యోతిష్క మను పేర నొప్పుమీాఱి
యదియె సావిత్ర మయ్యెడి సర్వరత్నవిభ్రాజితం బింద్రాదిపూజితంబు
హేమధాత్వంచిత మై మించు నాగిరి, తటమున ము న్నొక్కతఱి మహేశుఁ
డుపవిష్టుఁడై యుండె నపుడు పార్శ్వంబున, గోత్రరాట్కన్యయుఁగూరుచుండె

తే. నమరు లశ్విను ల్వసువులు యక్షపతియు
శుక్రుఁడు సనత్కుమారుఁడు సురగురుండు
పర్వతుఁడు నారదుండు విశ్వావసుండు
నప్సరోగణసంఘము నరిగె నటకు. 310

వ. అపుడు బహువిధసుగంధబంధురము లగుచల్లనిగాలులు వీఁచె ద్రుమంబులు సర్వర్తుకసుమోపేతమ్ములై ఘ్రాణతర్పణంబు గావించె విద్యాధరులు సిద్ధులు తపోధనులు నానారూపధరభూతంబులు యక్షరాక్షసపిశాచంబులు నమ్మహాదేవు నుపాసించిరి దేవానుచరుం డగునందికేశ్వరుండు దేవదేవునియెదుట నిలిచి యుండె సర్వతీర్థజలోద్భవయు నుత్తమోత్తమయు నగుగంగాదేవి యంగనారూపంబు నుపాసించుచుండె నిట్లుండుసమయంబున. 311

సీ. పూర్వవిధిక్రమంబునఁ జేసి దక్షప్రజాపతి జన్నంబు సలుపఁ దొడఁగె
శక్రపురోగముల్ సకలదేవత లమ్మహాధ్వరంబును జూడ నాసఁ జేసి
జ్వలనార్కసదృశప్రభాభాసమానవిమానము లెక్కి దేవానుమతినిఁ
బొంది గంగాద్వారమున కేగుచుండ నాపార్వతి వారలఁ బాఱఁ జూచి
తే. విభునిదిక్కు మొగంబయియభవ! వారె, వేల్పులింద్రునితోఁగూడి వెడలిరెందుఁ
బోవుచుందురొ విన నెంతు దేవదేవ, తెలియ నానతి యిమ్ము నా కెలమిమిగుల.

వ. అనిన మహేశ్వరుం డిట్లనియె. 313

క. అక్షీణప్రతిభుం డగు, దక్షుఁడు హయమేధయాగతత్పరుఁ డయ్యెన్
దాక్షాయణి ! వీరలు త, ద్వీక్షామతి నేగుచుండి రిట్లచ్చటికిన్. 314

క. నావుడు సుమ యిట్లను నో, దేవా నీ వేల తద్దిదృక్షాపరతన్
బోవైతి వటకుఁ బ్రతిషేధావిష్కృతి యెద్ది నీప్రయాణంబునకున్. 315

వ. అనిన మృత్యుంజయుండు. 316

తరల. సురలు మున్ సమయమ్ము చేసిరి సూవె యజ్ఞములందు నా
కరయ భాగము లేనియట్లుగ నట్టిపూర్వపరిస్థితిన్
గరిమ గైకొని నే ధరాస్థలిఁ గ్రాలుచుండెడునట్టియ
ధ్వరములం గనఁ బోను నావుడు ధారణీధరకన్యయున్. 317

సీ. భగవంతుఁడవు గుణాభ్యధికుండవు మహాప్రభావసంపన్నుఁడ వీవు దేవ!
నీకు నీయారేఖలోకంబుల నొకండు, పురుఁ డైనవాఁ డుండఁ బోఁడునిజము
యిట్టినీ విజ్ఞావిహితభాగహీనుఁడ, వగుట కే నెంతయుఁ బొగులుచుంటి
నని పల్కి మన సేర్పుకొనిపోవ గౌరి మా, టాడ కూరకయుండె నభవుఁ డంత
తే. నామెమతముఁ జికీర్షిత మాత్మ నెఱిఁగి, నందికేశునిఁ బిలిచి నీ విందయుండు
మనుచు నానతి యిచ్చి యోగాతిశయము,నధిగమించెనుదత్ప్రభావాప్తివలన.

క. ఉగ్రున కనుచరు లగువా, రుగ్రపరాక్రములు పెక్కు రొక్కుమ్మడి న

త్యాగ్రహ మేర్పడ సవమున్, వ్యగ్రత దోపంగఁ గూల్చి రసురక్రియలన్.

సీ. సింహగర్జనములు చేసిరి కొందఱు, కొంద ఱిందందును జిందుద్రొక్కి-
రట్టహాసంబుల నాచరించిరి కొంద, ఱటఁ గొంద ఱగ్నుల నార్పి వైచి
రిద్ధబర్హిష్మల నీడ్చిరి కొందఱు, మఱికొంద ఱం దంను మట్టుమీఱి
రెఱఁగి యూపంబుల విఱిచిరి కొందఱు, కొందఱు కీకసల్ గొట్టి రెగిచి

తే. మఱియుఁగొందఱునోళులఁ దెఱచియచట,నున్నపరిచారకులఁబట్టిక్రన్నమ్రింగి
రంత నాదక్షునధ్వర మందదు కయి, తారె మృగరూపమున మిన్ను దారి వట్టె.

చ. అటు మృగరూపమున్ గొని రయంబున నేగెడుదక్షుయాగమున్
దటుకునఁ జూచి జూచుచుఁ బినాకము వీకున నెక్కువెట్టి ప్ర
స్ఫుట మగుబాణముం దొడిగి పొంపిరివోయెడు పౌరుషంబునన్
బటురయ మేర్పడన్ మృగముపజ్జన పాఱె భయంకరాకృతిన్. 321

ఉత్సాహ. నిరుపమాన తేజుఁ డైననీలలోహితుండు దా
వరమృగంబువెంట నంటి పాఱువేళ నమ్మహా
పురుషమూర్తిఫాలమందుఁ బుట్టి క్రోధసంభవం
బురుతరంబు స్వేదబిందు వొకఁడు రాలె నేలకున్. 322

క. నేలం బడినంతట నే, కాలాగ్నిం బోలునగ్ని ఘనమై యచటన్
గ్రాలంగ నయ్యె నందున్,గాలాంగుఁడు పురుషుఁ డొకఁడు ఖర్వుఁడు పొడమెన్.

వ. మఱియు నాపురుషుం డతిమాత్రహ్రస్వుండును రక్తాక్షుండును హరిశ్మశ్రుయుగ్మండును భయంకరోర్ధ్వకేశుండు నతిరోమావృతాంగుండును గరాళుండును గృష్ణవర్ణుండును రక్తవస్త్రుండు నై బలపరాక్రమంబు లెసంగ బయలువెడలి కక్షంబు నగ్ని వోలె దక్షుయజ్ఞంబు తత్క్షణంబునం గాల్చిపుచ్చి విచ్చలవిడి విహరింపం జొచ్చె నాసమయంబున. 324

సీ. తమమీఁదఁ బడు నని తలఁకున ఋషులు త్రి,దశులును బఱచిరి దశదిశలకుఁ
బుడమియుం గడగడ వడఁకసాఁగె జగంబు, హాహారవంబున నత్తమిల్లె
నపు డటఁ బరమేష్ఠి యరుదెంచి స్తుతియించి, యాగములన్ హవిర్భాగములను
నీకు నీ నమరులు నిశ్చయించిరి క్రోధ, ముపసంహరింపుము కృప దలిర్ప

తే. స్వేదజుం డగుపురుషుఁడు వెలయు జ్వరుఁడు, నాఁగ నీతని తేజ మీలాగున నొక
ప్రోవుగా నున్న నీధర మోయ లేదు, గాన బహురీతుల సృజింపఁ గడఁగు మీశ.

వ. అనిన నౌఁ గాత మని యమ్మహాదేవుం డంతరంగంబున సంతసించి బ్రహ్మకల్పి

తంబు లగుయాగభాగంబులు స్వీకరించి సర్వభూతశాంత్యర్థ మాజ్వరుని బహు విధంబులుగా విభజించె నాప్రకారం బెఱింగించెద నవహితుండ వగుము నాగంబులకు శీర్షాభితాపంబును బర్వతంబులకు శిలాజితును నీటికి నాఁచును బాములకు నిర్మోకంబును సౌరభేయంబులకు ఖేచరంబును భూతలంబున నూష రంబును బశువులకు దృష్టిప్రత్యవరోధంబును హయంబులకు గొంతురోగం బును మయూరంబులకు శిఖోద్భేదంబును గోకిలమ్ములకు నేత్రరోగమ్మును గుఱ్ఱెలకుఁ బిత్తభేదంబును శుకంబులకు హిక్కయు శార్దూలమ్ములకు శ్రమ మ్మును జ్వరంబులు గా నిర్ణయింపంబడె మనుష్యుల కిట్లు గాక జ్వరము నాడులం బట్టి బహువిధం బది జననమరణకాలంబులంద కాక మధ్యకాలంబులందును గలుగుచుండు మహేశ్వరతేజ మగునాజ్వర మావహించి నప్పుడ వృత్రుని సుత్రాముండు ద్రుంపఁ గలిగె నతండు విష్ణుభక్తుండు గావున వజ్రాయుధవినిహ తుండై వైష్ణవపదంబు నొందె నిది జ్వరోత్పత్తిప్రకారము దీని నాకర్ణించినవారు రోగవిముక్తులై సర్వసౌఖ్యము లందెద రని భీష్ముండు చెప్పె నని చెప్పిన జనమే జయుండు వైశంపాయనుం గాంచి వైవస్వతమన్వంతరమునఁ బ్రాచేతసుం డగు దక్షుం డొనర్చినహయమేధ మెట్లు వినాశనమ్ము నొందె నీశ్వరుం డెట్లు ప్రస న్నుం డయ్యె నిది యంతయు సవిస్తరంబుగ విన నభిలషించుచున్న వాఁడ ననుగ్రహింపు మనిన వైశంపాయనుం డి ట్లనియె ము న్నొక్కనాఁడు హిమ వత్పర్వతప్రాంతప్రదేశం బగుగంగాద్వారంబున దక్షప్రజాపతి యశ్వమేధ యాగం బొనర్పం గడంగె నయ్యాగంబున కాహూతు లయి దేవదానవులును గరుడగంధర్వకిన్నరోరగపిశాచయక్షరాక్షసాదులును హాహాహూహూప్ర భృతులును దుంబురునారదాదులును విశ్వావసువిశ్వసేనులును వసురుద్రాదిత్య సాధ్యాదులునునింద్రాది దిక్పాలకులును యజ్ఞభాగులు నూష్మపసోమపధూమపు లగుఋషులును బితృదేవతలును బ్రహ్మదేవుండును విచ్చేసిరి మఱియు నచ్చో టికి జరాయుజాండజస్వేదజోద్భిజ్జము లై నచతుర్విధభూతగ్రామంబులును బృథి వ్యంతరిక్షస్వర్వాసు లగువా రెందఱేని వచ్చి యుండుటం గాంచి దధీచి కోపా విష్టుండై దక్షాదులు విన ని ట్లనియె. 326

మ. ఇది యజ్ఞం బన రాదు ధర్మ మిట లేనే లేదు ఋత్విక్కులుఁ
మది లేనట్టిరు సోమయాజి యభిమానగ్రస్తచిత్తుండు సి
గ్గది లేకుండినవారు యజ్ఞభుజు లౌరా! సర్వలోకేశ్వరా

స్వదుఁ డాశర్వుఁడు లేనియీక్రతు వశీర్షంబైనవర్ష్మంబ యో. 327

క. అందఱు వధబంధంబుల, నొందఁగ నున్నార యేమొకో మీ రెల్లం
గ్రిందును మీఁదు నెఱుంగరు, పొందెద రీక్రతువునందు భూరిభయంబుల్.

వ. అని పలికి యమ్మహాయోగి నిధ్యానదృష్టిం జేసి పార్వతీపరమేశ్వరులం దన్నికటంబున నారదుం జూచి తనపలుకు సత్యం బగు నని నిశ్చయించుకొని నితాంతసంతోషసాగరనిమగ్నుం డయ్యె నయ్యెడ నం దున్నవా రందఱు నొక్కచక్కివా రగుటం జేసి పరమేశ్వరుం బలుకరింప రంత దధీచి యట నుండి మఱియొక్కచోటికిం జని మఱియు ని ట్లనియె. 329

క. పూజింపఁ దగనివారలఁ, బూజించియుఁ దగినవారిఁ బూజింపకయున్
భూజనుఁడు జనునిఁ జంపం,గా జతపడుపాప మందఁ గలఁ డండ్రు బుధుల్.

క. నే నన్నృత మాడువాఁడం, గా నిదె వచియించుచుంటిఁ గ్రతుభోజనుఁ డై
కానంగ వచ్చునీశ్వరు, నానందముతోడఁ జూడుఁ డందఱు నిచటన్. 331

వ. అనిన దక్షుం డి ట్లనియె. 332

క. పదునొకఁడు రుద్రు లిచ్చటి, పదముల నివసింత్రు శూలపాణులు వీరిం
బొదలంగ నెఱిఁగి యుండుదుం, గద శర్వుం డెవఁడొ యెఱుఁగఁ గాని మునీంద్రా.

చ. అనిన దధీచి యి ట్లనియె నక్కట నీమత మిట్టిదౌట నే
మనమున శంకరుం డనెడుమాట దలంపక యజ్ఞకర్త వై
పొనరుదు వీమఖంబు పరిపూర్ణముగా దమహేశ్వరంబు గా
వున విను మన్యదైవతము పుట్టదు సాంబునికన్న మిన్న యై. 334

వ. అనిన దక్షుండు వెండియు. 335

తే. ఇదె హవిస్సు యజ్ఞేశున కీయ స్వర్ణ, పాత్రమున మంత్రపూతమై పరఁగఁ జేసి
నిలిపితిని దీని నాహవనీయమందుఁ, బొలిచి శ్రీమహావిష్ణువు పొందుఁ గాక.

వ. అంతలో నక్కడఁ బార్వతి పరమేశ్వరుండు విన ని ట్లనియె. 337

క. నామగఁ డొకపా ల్గానీ, సా మగుపా ల్గాని యందు సామేఁ గానీ
స్తోమముల నొంద దానం,బో మహితతపంబొ చేయఁ బోలునొ నాకున్. 338

వ. అని పలుకుచున్న పార్వతిం గాంచి హర్షించుచు హరుం డి ట్లనియె. 339

సీ. దేవి! నన్నెఱుఁగవు నీవు నే యజ్ఞేశ్వ,రుఁడ నయుక్తము నీదు నుడుగు మోహి
తాత్ము లింద్రాదిదివౌకసుల్ త్రిజగముల్, కాని హోతలు నన్నుఁ గ్రతువులందు
స్తుతియింత్రు సామగు లతులితంబుగ రథం,తరమున గానముల్ నడపుచుంద్రు

బ్రాహ్మణులు యజింత్రు భాగ మధ్వర్యులు, కల్పింత్రు నాఁ గొరి కాంతుఁ జూచి
తే. పురుషు లసమర్థు లైన స్త్రీపరిసరమునఁ
దమ్ముఁ దార పొగడుకొండ్రు, తలఁక కనుడు
నేఁ బొగడుకొనఁ గను మని యీశ్వరుండు
తనముఖమునుండి యొక్కభూతము సృజించి. 340

వీరభద్రావతారకథనము.

వ. ఓరీ! నీవు పోయి దక్షాధ్వరధ్వంసమ్ము గావించి రమ్మని నియోగించె నంతలో హైమవతీక్రోధమ్మున మహాకాళి ప్రభవించి కర్మసాక్షిగా నాతని ననుసరించె నధికబలవీర్యసమన్వితుం డగుటం జేసి యతండు వీరభద్రుండు నాఁబడి మహేశ్వరానుజ్ఞాతుండై కదలి చనుచుఁ దనరోమకూపములనుండి రౌమ్యు లను గణేశ్వరుల రౌద్రాకారులం బుట్టించి కోటానఁగోటు లైనవారిం గూడి దక్షమఖాయతనంబునకుం జని భూనభోంతరంబులు నిండ మహాధ్వానంబు గావించె నయ్యవసరంబున. 341

సీ. గ్రహతారకలతోడ గగన మెల్లం ద్రెళ్లె, బ్రహ్మాండభాండంబు బ్రద్ద లయ్యె
వసుధాతలం బెల్లఁ బరియ లయ్యె స్వరు,ణాలయంబు కలంగె హాళి మాసెఁ
బర్వతంబులు ప్రేలి పగిలెఁ బెంగాలులు, శర్కరాయుతములై చదల వీఁచె
వెలుఁగ వగ్నులు దిశావలయమ్ములం జిమ్మ, చీఁకట్లు వడి గ్రమ్మెఁ జిక్కనగుచు
తే. దేవమానవమానులు దేవురించి, రపుడు రౌమ్యులు యజ్ఞశాలాంతరమ్ము[యు.
చొచ్చివహ్నుల నార్పియుసోమపాత్ర,ములుహరించియుస్రుక్స్రువంబులు విఱిచి
తే. యాజకులఁ బట్టి ప్రహరించి యజ్ఞయూప,ములకు నంటఁగఁ గట్టి పొట్టలువగిల్చి
యడ్డ మాకయు లేనివిహారములను, వీరభద్రావతారము ఘోర మయ్యె. 343

వ. మఱియు నారుద్రగణంబులు పెచ్చి పెటేఁగి విచ్చలవిడి విహరించుచు యజ్ఞాంగంబు లెల్లఁ జూర్ణంబు గావించి భక్ష్యభోజ్యాదిపదార్థంబు లెల్లం గడుపాఱం దినియుఁ బాఱ వైచియుఁ బయోదధిఘృతంబు లటఁ బ్రవాహంబులై పాఱం జేసియు నెల్లవారిం జెల్లాచెదరు గావించియు సర్వభూతభయంకరంబు గా మహాకోలాహలం బొనరించి యజ్ఞశిరంబు దెగ నేసి రప్పుడు బ్రహ్మాదిదేవతలును దక్షప్రజాపతియుం బ్రాంజలులై భద్రకాళీసమేతుం డగువీరభద్రుం గాంచి మీ రెవ్వ రనిన వీరభద్రుండు సర్వవృత్తాంతంబు నెఱింగించి మేము నీయజ్ఞవిధ్వంస మాచరించుటకు వచ్చితిమి మ మ్మెవ్వ రాఁగువారు గాని నీ

యాగంబు రక్షించువారు గాని లేరు నీవు బుద్ధిమంతుండ వగుదేని మహాదేవు శరణంబు వేఁడు మనిన వీరభద్రునివచనంబునం జేసి దక్షుండు. 344

మ. మునుముక్ వేల్పులు తోడునీడ లగుచు న్మున్నున్న బోధింప నె
మ్మనముం గూడినయింద్రియంబులను నేమం బేర్పడం బుద్ధితో
నెనయం జేసి మహేశ్వరుర్ స్తుతుల నెంతే భక్తి భావింప న
య్యనఘుం డామఘకుండమం దగజతో నావిర్భవించె న్వడిర్. 345

వ. అట్లావిర్భవించినదేవదేవు ననేకవిధంబుల వినుతించి దక్షుండు బాష్పాకులేక్షణుండై ఫాలతలంబునం గేలుదోయిఁ గీలించి నాతప్పు సైఁచి రక్షింపు మని ప్రార్థించినం బ్రసన్నుండై పరమేశ్వరుండు నీ కేమి కావలయు నడుగు మనిన నతం డష్టోత్తరశివసహస్రనామంబులం బ్రస్తుతించి దేవా! నాకుఁ బ్రసన్నుండ వైతి వేని విధ్వస్తం బైననాయజ్ఞం బుద్ధరింపు మనిన నతం డట్లయగుంగావుత మని వరం బిచ్చె ననిన విని ధర్మరాజు దక్షుండు స్తుతించినశివసహస్రనామంబులు విన నెంచితి ననుగ్రహింపు మనిన దేవవ్రతుండు. 346

క. దక్షుఁడు ప్రత్యక్షం బగు, దాక్షాయణివిభుని భక్తి తాత్పర్యమునర్
వీక్షించి నుతించినవే, ళ్లక్షీణఫలప్రదంబు లవి విను మిచటర్. 347

### దక్షకృతశివసహస్రనామస్తోత్రము.

వ. దేవదేవేశ! దేవారిబలసూదన! దేవేంద్రబలవిష్టంభ! దేవదానవపూజిత! నీకు నమస్కారము సహస్రాక్ష! విరూపాక్ష! త్ర్యక్ష! యజ్ఞాధిపప్రియా! నీకు వందనము నీవు సర్వప్రదేశముల నావరించినపాణిపాదాంతములును నేత్రశిరోముఖంబులును గలవాఁడ వంతటను శ్రోత్రంబులు గలిగి లోకంబులన్నిటను వ్యాపించియున్నమహోన్నతుండ వో శంకుకర్ణా! మహాకర్ణ! కుంభకర్ణా! గజేంద్రకర్ణా! గోకర్ణ! పాణికర్ణ! యర్ణవాలయా! నీ కేటికోట్లు శతోదర!శతావర్త! శతజిహ్వ! నీ కిదే నమస్సు గాయత్రీమహామంత్రోపాసకులు నిన్ను గానము సేయుచున్నా రర్కస్వరూపుఁడ వయినని న్నర్కోపాసకు లర్చించుచున్నారు బ్రహ్మావు శతక్రతుఁడ వైన ని న్నూర్ధ్వాకాశంబుగా నెన్నుచున్నవారో మహామూర్తీ! సముద్రాంబరసన్నిభ! నీమూర్తియందు సర్వదేవతలును గోష్ఠంబున గోవులు వోలె నివసించుచున్నారో దేవా! నీదేహంబున సోమాగ్నిజలేశ్వరాదిత్యబృహస్పతులను బ్రహ్మవిష్ణువులను జూచుచున్నార మోభగవానుఁడా! కారణంబును గార్యంబును గ్రియాకారణంబు నీవ మఱియు

సదసత్తులకుఁ బ్రభవాప్యయంబులు నీవ యగుచున్నవాఁడవు భవుఁడు శర్వుఁడు రుద్రుఁడు వరదుఁడు పశుపతియు నంధకఘాతియు నగునీకు జోహారు త్రిజటుఁడు త్రిశీర్షుఁడు త్రిశూలవరపాణి త్ర్యంబకుఁడు త్రినేత్రుఁడు త్రిపురఘ్నుఁడు నగువానికి నమోవాకము చండుఁడు కుండుఁడు నండుఁ డండధరుఁడు దండి దండిముండుఁడు సమకర్ణుఁడు నగువాని కభివాదనం బూర్ధ్వదంష్ట్రకేశుఁడు శుక్లుఁ డవతతుఁడు విలోహితుఁడు ధూమ్రుఁడు నీలగ్రీవుఁడు నగుదేవునకు ధన్యవాద మప్రతిరూపుఁడు విరూపుఁడు శివుఁడు సూర్యుఁడు సూర్యమాలుఁడు సూర్యపతాకియుఁ బ్రథమనాథుఁడువృషస్కంధుఁడుధ్వనియు శత్రుందముఁడు దండుఁడు పర్ణచీరపటుండు నగువాని కిదే నతి హిరణ్యగర్భుఁడు హిరణ్యకవచుఁడు హిరణ్యకృతచూడుఁడు హిరణ్యపతి స్తుతుఁడు స్తుత్యుఁడు స్తూయమానుఁడు సర్వుఁడు సర్వభక్ష్యుఁడు సర్వభూతాంతరాత్మ వగునీకు నమస్కారము హోతయు మంత్రస్వరూపుండును శుక్లధ్వజపతాకియు నగువానికిని నాభుఁడు నాభ్యుఁడు కటకటుఁడు కృశుఁడు కృశనాశుఁడు కృశాంగుఁడు నగువానికిని సంసృష్టుఁడు కిలకిలుఁడు శయమానుఁడు శయితుఁ డుత్థితుఁడు స్థితుఁడు ధావమానుఁడు ముండుఁడు జటిలుఁడు నగువాని కిదే నానమస్కారము నర్తనశీలుండును ముఖవాదిప్రతివాదియు నాట్యోపహారలుబ్ధుండును గీతవాదిత్రశాలియు నగువానికిని జ్యేష్ఠుఁడు శ్రేష్ఠుఁడు బలప్రమథనుఁడు కాలనాథుఁడు కల్పుఁడు క్షయుఁడు పక్షయుఁడు నగువానికిని భీమదుందుభిహాసుఁడు భీమవ్రతధరుఁడు నుగ్రుఁడు దశబాహుఁడు కపాలహస్తుఁడు చితిభస్మప్రియుఁడు విభీషణుఁడు భీష్ముఁడు భీమవ్రతధరుండు నగువానికిని వివృతవక్త్రుఁడు ఖడ్గజిహ్వుఁడు దంష్ట్రియుఁ బక్వామమాంసలుబ్ధుండు తుంబీవీణాప్రియుండు వృషుఁడు వృష్యుఁడు గోవృషుఁడు నగువానికి నానమస్కారము కటంకటుఁడు దండుఁడు పంచంపచుఁడు సర్వవరిష్ఠుఁడు వరుఁడు వరదుఁడు నగువానికిని వరమాల్యగంధవస్త్రుఁడు వరాతివరదుఁడు రక్తవిరక్తుండు భావనుఁడు రుద్రాక్షమాలియు సంభిన్నుఁడు విభిన్నుఁడు ఛాయాతపరూపుఁడు ఘోరాఘోరరూపుఁడు ఘోరాఘోరతరుఁడు నగుదేవునకు నమస్కారము శివుఁడు శాంతుఁడు శాంతతముఁడు నగువానికిని నేకపాదుఁడును బహునేత్రుఁడు నేకశీర్షుఁడు నగువానికిని క్షుద్రుఁడు క్షుద్రలుబ్ధుఁడు సంవిభాగప్రియుఁడు పంచాలుఁడు సితాంగుఁడు ఘుమశమ్ముండును ఛండఘంటుండును ఘంటారూపుండు నఘంటఘంటియు

సహస్రఘ్రాతఘంటుండు ఘంటామాలాప్రియుండును ప్రాణఘంటుండును గంధ రూపుండు కలకలుండు నగువానికి నావందనంబు హూంహూంహూంకార పారుఁడు హూంహూంకారప్రియుండు శమశమనిత్యుండును గిరివృక్షాల యుండు నగువానికిని గర్భమాంససృగాలుఁడు తారకుఁడు తరుఁడు నగువాని కిని యజ్ఞస్వరూపుఁడు యాజి హుతుఁడు ప్రహుతుఁడు యజ్ఞవాహుఁడు దాంతుఁడు తప్యుఁడు తపనుఁడు నగువానికిని నావందనము తటుఁడు తట్యుఁడు తటపతి యగువానికి నన్నదుఁ డన్నపతి యన్నభుజుఁడు నగువానికిని వంద నము సహస్రశీర్షుఁడు సహస్రచరణుఁడు సహస్రోద్యతశూలుఁడు సహస్రనయ నుఁడు బాలార్కవర్ణుఁడు బాలరూపధరుఁడు బాలానుచరగుప్తుఁడు బాలక్రీడ నకుఁడు వృద్ధుఁడు లుబ్ధుఁడు క్షుబ్ధుఁడు క్షోభణుఁడు నగువానికి నమస్కారము తరంగాంకితకేశుఁడు ముంజికేశుఁడు షట్కర్మతుష్టుఁడు త్రికర్మనిరతుఁడు యథోక్తవర్ణాశ్రమధర్మసమ్యగ్విభాగకర్తయు ఘుష్యుఁడు ఘోషుఁడు కల కలుఁడు శ్వేతపింగళనేత్రుఁడు కృష్ణరక్తేక్షణుఁడు ప్రాణభగ్నుఁడు దండుఁడు స్ఫోటనుఁడు కృశుఁడు నగువానికి నమస్కారము ధర్మార్థకామమోక్షకథనీయ చరిత్రుఁడు సాంఖ్యుఁడు సాంఖ్యముఖ్యుఁడు సాంఖ్యయోగప్రవర్తకుఁడు నగు వానికిని రథ్యుఁడు విరథ్యుఁడు చతుష్పథరతుఁడు కృష్ణాజినోత్తరీయుఁడు వ్యాళయజ్ఞోపవీతియు నగువానికి నే నిదే మ్రొక్కుచున్నాఁడ నో యీశానా! వజ్రసంఘాతా! హరికేశ! త్ర్యంబకా! యంబికానాథ! వ్యక్తావ్యక్త! కామ! కామద! కామఘ్న! తృప్తతృప్తివిచారా! సర్వ! సర్వద! సర్వఘ్న! సంధ్యారాగరూప! నీకు నమస్కారము నీవు మహామేఘచయప్రఖ్యుఁడవు మహాకాలుండవు స్థూలుండవు జీర్ణాంగుఁడవు జటిలుఁడవు వల్కలాజినధారివి దీప్తసూర్యాగ్నినిభతేజోనిధివి వల్కలాజినవాసుండవు సహస్రసూర్యసన్నిభుఁ డవు తపోనిత్యుండ వున్మాదనుఁడవు నీకు నిత్యాభివందనము శతావర్త గంగాతోయార్ద్రమూర్ధజా! చంద్రావర్త! యుగావర్త! ఘోరావర్త! నీకు నమస్కారము దేవా! నీవే యన్నమవు నీవే యన్నభోక్తవు నీవే యన్నదుఁ డవు నీవే యన్నభుక్కవు మఱియు నన్నస్రష్టవు పాచకుఁడవు పక్వభోక్తవు ననిలుండవు ననలుండవు నై వెలుఁగొందుచున్న వాఁడ వో దేవదేవా! జరాయు జాండజస్వేదజోద్భిజ్జము లనుచతుర్విధచరాచరభూతగ్రామంబులను బుట్టించు వాఁడవును గిట్టించువాఁడవును నీవే యో బ్రహ్మవిద్వరా! నిన్ను బ్రహ్మవేత్తలు బ్రహ్మముగాఁ దెలుపుచున్నారు నీవే మనస్సునకును నభోవాయుజ్యోతులకును

బరమకారణంబవు బ్రహ్మవాదులు నిన్ను ఋక్సామంబులుగ నోంకారంబుగఁ జెప్పుచుందురు. హాయి హాయి! హువాహోయి! హువాహోయి! యని బ్రహ్మవాదు లగుసామగులు నిన్ను గానముచేయుచుందురు. నీవు యజుర్మయుండవు ఋఙ్మయుండ వాహుతిమయుండవు నని వేదంబులును వేదోపనిషత్తులునుం దెలుపుచుండు బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రవర్ణంబులు నీవే మేఘసంఘంబులు విద్యుత్స్తనితగర్జితమ్ములు నీవే మఱియు సంవత్సరంబులు ఋతువులు మాసములు పక్షములు యుగములు నిమేషంబులు కాష్ఠంబులు నక్షత్రములు గ్రహములు కలలు నీవై యున్నవాఁడవు నీవు వృక్షములలో మాకందమవు గిరులలో శిఖరం బవు మృగములలో శార్దూలంబవు పక్షులలోఁ దార్క్ష్యుండవు సర్పంబులలో ననంతుఁడ వుదధులలో క్షీరోదమవు యంత్రమ్ములలో ధనుర్వరంబవు ప్రహారణంబులలో వజ్రంబవు వ్రతంబులలో సత్యవ్రతంబవు ద్వేషేచ్ఛారాగమోహక్షమాక్షమలును వ్యవసాయధృతిలోభకామక్రోధజయాజయంబులును నీవే గదియు శరియుఁ జాపియు ఖట్వాంగియు ఝర్ఝరియు ఛేత్తయు భేత్తయుఁ బ్రహర్తయు నేతయు సంతాపకుండవు నీవే దశలక్షణసంయుక్తుండవు ధర్మార్థకామరూపుండవు నీవే గంగయు సముద్రములు నదులు పల్వలంబులు సరోవరంబులు తరుగుల్మలతౌషధులు పశుపక్షిమృగంబులు నీవే ద్రవ్యములు కర్మసమారంభములు పుష్పఫలప్రదకాలంబును నీవే వేదాదియు వేదాంతము గాయత్రియు నోంకారము నీవే హరితము రోహితము నీలము కృష్ణము రక్త మరుణము కద్రువు కపిలము కపోతము మేచకము ననువర్ణంబులు నీవే యవర్ణుఁడు సువర్ణుఁడు వర్ణకారుఁడు ననౌపముఁడు సువర్ణనాముఁడు సువర్ణప్రియుఁడు నీవే నీవే యింద్రుఁడవు నీవే యముఁడవు నీవే వరుణుఁడవు నీవే ధనదుఁడవు నీవే యనలుఁడవు నీవే యుపప్లవమవు నీవే చిత్రభానుఁడవు నీవే స్వర్భానుఁడవు నీవే భానుఁడవు హోత్రము హోత హోమ్యము హుతము నీవే యోప్రభూ! త్రిసుపర్ణంబున బ్రహ్మంబును యజుస్సున శతరుద్రియంబును మఱియు నీవు పవిత్రవస్తువులం బవిత్రుఁడవును మంగళవస్తువులకు మంగళుండవు నై యున్నవాఁడవు గిరికుఁడు హిండుకుఁడు వృక్షుఁడు జీవుఁడు పుద్గలుఁడును నీవే ప్రాణము సత్త్వరజస్తమములు నప్రమాదము ప్రాణాపానవ్యానోదానసమానమ్ములు నున్మేషము నిమేషము క్షుతము జృంభితము నీవే నీవు లోహితాంతర్గతదృష్టివి మహావక్త్రుఁడవు మహోదరుఁడవు సూచీరోముఁడవు హరిశ్మశ్రుఁడ వూర్ధ్వకేశుఁడవు

చలాచలుఁడవు గీతవాదిత్రతత్త్వజ్ఞుఁడవు గీతవాదనప్రియుండవు మత్స్య
రూపుఁడవు జలచరుఁడవు జాల్యుఁడ వకలంకుఁడవు కేలికలుఁడవు కలిరూపుఁడ
వకాలుఁడ వతికాలుఁడవు దుష్కాలుఁడవు కాలరూపుఁడవు మృత్యురూపుఁ
డవు క్షురరూపుఁడవు భేదనకర్తవు పక్షుఁడ వపక్షక్షయంకరుఁడవు మేఘ
కాలుఁడవు మహాదంష్ట్రుఁడవు సంవర్తకబలాహకుఁడవు ఘంటుఁడ వఘంటుఁ
డవు ఘటివి ఘంటివి చరుచెలివి మిలిమిలివి నీకు నమస్కారము మఱియు
బ్రహ్మాగ్ని దేహము గలవాఁడవు దండము ధరించినవాఁడవు ముండుఁడవు
త్రిదండధారివి చతుర్యుగరూపివి చతుర్వేదస్వరూపుఁడవు చాతుర్హోత్ర
ప్రవర్తకుఁడవు చాతురాశ్రమ్యనేతవు చాతుర్వర్ణ్యకరుఁడ వక్షప్రియుండవు
ధూర్తుఁడవు గణాధ్యక్షుఁడవు గణాధిపుఁడవు రక్తమాల్యాంబరధరుఁడవు
గిరీశుఁడవు గిరికప్రియుఁడవు నైతివి మఱియు శిల్పివి శిల్పిశ్రేష్ఠుఁడవు సర్వ
శిల్పప్రవర్తకుండవు భగనేత్రాంకుశుండవు చండుఁడవు పూషదంతవినాశకుం
డవు స్వాహాస్వధావషట్కారరూపుఁడవు నమస్కారరూపుఁడవు గూఢవ్రతుఁ
డవు గుహ్యాతపుఁడవు తారకుఁడవు తారకామయుఁడవు ధాతవు విధాతవు
సంధాతవు ధారణుఁడవు ధరుఁడవు నీవే బ్రహ్మవు తపమువు సత్యమువు నీవే
బ్రహ్మచర్యము నీవే యార్జమవు భూతాత్ముఁడవు భూతకర్తవు భూతుఁడవు
భూతభవ్యభవోద్భవుఁడవు భూర్భువస్వరాకృతివి ధ్రువుఁడవు దాంతుఁడవు
మహేశ్వరుఁడవు దీక్షితుఁడ వదీక్షితుఁడవు క్షాంతుఁడవు దుర్దాంతుఁడ
వదాంతనాశనుఁడవు నై యుంటివి చంద్రావర్తుఁడవు యుగావర్తుఁడవు సంవర్తుఁ
డవు సంప్రవర్తకుఁడవు కాముఁడవు బిందుఁడ వణువువు స్థూలుఁడవు కర్ణికార
మాల్యప్రియుఁడవు నందిముఖుఁడవు భీమముఖుఁడవు సుముఖుఁడ వముఖుఁ
డవు చతుర్ముఖుఁడవు బహుముఖుఁడవు రణాంగణాగ్నిముఖుఁడవు హిరణ్య
గర్భుఁడవు శకునివి మహోరగపతివి విరాట్టు వధర్మహాంతవు మహాపార్శ్వుఁ
డవు చండధారుఁడవు గణాధిపుఁడవు గోనర్దుఁడవు గోప్రతారుఁడ వోగో
వృషేశ్వరవాహనా! త్రిలోకరక్షకా! గోవిందా! గోమార్గా! యమార్గా!
నీవు శ్రేష్ఠుఁడవు స్థిరుఁడవు స్థాణుఁడవు నిష్కంపుఁడవు కంపుఁడవు దుర్వా
రణుఁడవు దుర్విషహుఁడవు దుస్సహుఁడవు దురతిక్రముఁడవు దుర్ధర్షుఁడవు
దుష్ప్రకంపుఁడవు దుర్జయుఁడవు జయుఁడవు శశుఁడవు శశాంకుఁడవు శమ
నుఁడవు నై యుంటి వో దేవా! నీవు శీతోష్ణక్షుజ్జరాదులం జేయువాఁడవు
నీవే యాధియును వ్యాధియును నీవే యాధిహరుఁడవు వ్యాధికారణుఁడవు

యజ్ఞమృగవ్యాధుఁడవు వ్యాధ్యాగమనగమనకారణుఁడవు శిఖండి పుండరీ
కాక్షుఁడు పుండరీకవనాలయుఁడు దండధారుఁడు త్ర్యంబకుఁ డుగ్రదండు
దండనాశకుఁడు విషాగ్రపుఁడు సురశ్రేష్ఠుఁడు సోమపుఁడు మరుత్పతి యమృత
పుఁడు నైనవాఁడ వోజగన్నాథా! దేవదేవ! గణేశ్వర! విషాగ్నిపా!
మృత్యుపా! క్షీరపా! సోమపా! నీవు స్వర్గపతితుల రక్షించువాఁడవు నాజ్య
పాయుల సంతోషపెట్టువాఁడవు హిరణ్యరేతసుఁడవు పురుషుఁడవు నీవే స్త్రీ
పున్నపుంసకంబులు నీవే బాలుఁడవు యువకుఁడవు స్థవిరుఁడవు జీర్ణదంష్ట్రుఁడవు
నాగేంద్రుఁడ వింద్రుఁడవు ప్రపంచకర్తవు సర్వకర్తవు నీవే సర్వవిశ్వకర్తల
కధిపతివి విశ్వబాహుఁడవు విశ్వరూపుఁడవు విశ్వతోముఖుఁడవు తేజశ్శాలివి
నీకుఁ జంద్రాదిత్యులు నేత్రములు నీహృదయము పితామహుఁడు నీవు మహా
సముద్రుఁడవు నీవు సరస్వతివి నీవాక్కు సరస్వతి యనిలుఁడు ననలుఁడు నీబల
మహోరాత్రములు నీనిమేషోన్మేషములు క్షణత్రుటులు నీవే నీవు కాని దింత
యును లేదో దేవా! నీమాహాత్మ్యము బ్రహ్మయు విష్ణుండును బురాణ
మునులు నెఱుంగఁ జాలరు సుసూక్ష్మంబులైన నీమూర్తులు నాకగోచరంబు
లోపరమేశ్వరా! నేను నీకు రక్షణీయుండను గాన నన్ను రక్షింపుము
రక్షింపుము నీ కిదే సాష్టాంగదండప్రణామము. 348

వ. ఇట్లు సహస్రనామంబుల స్తుతించి మఱియును. 349

మ. భగవంతుండవు నీవు భక్తులయెడన్ బాధానుకంపంబునన్
దగు దే నెప్పుడు నీకు భక్తుఁడను నాదండం బ్రసన్నుండవై
జగతిం గన్నకుమారునిన్ జనకుఁ డేస్వాంతంబునం జూచు న
ప్పగిదిం జూడ ననుగ్రహింపు మనుకంపం గాచి రక్షించుచున్. 350

తే. పెక్కువేలేండ్లు మాయమై యొక్కరికిని, గానరాక యేకాకియై కంధిమధ్య
మున వసించినదేవుఁ డెప్పుడును నన్ను, స్నేహభావముతోడ రక్షించుఁ గాక.

శా. ఏతన్మాత్రము గానియోగగతిమై నే రింద్రియగ్రామముం
జేతం బట్టియు శ్వాసమున్ నిదురయున్ జెల్లంగ సత్త్వస్థులై
జ్యోతీరూపుఁడ వైనవేనిఁ గనుచుండ్రో యట్టియోగాత్మునిన్
జేతోఽతీతమహాప్రభావుఁ డగునిన్ సేవింతు నశ్రాంతమున్. 352

తే. జటలు దండకమండలుల్ పటునిషంగ,ములు ధరించి లంబోదరమును శరీర
ములఁ బూనియు బ్రహ్మాత్ముఁ డైననీకు, వందనము చేయుచుంటి నో వామదేవ.

తే. జడల మబ్బులు సర్వాంగసంధులందు, నదులు కుక్షి సముద్రముల్ నాల్గు గలిగి
నట్టితో యాత్మునకు నీకునధికభక్తి, మ్రొక్కుచుంటినినను గాచి ప్రోచుటకును.

సీ. ప్రలయకాలమునసకలభూతముల మ్రింగి, జలశాయియగుశేష్వ శరణుఁ జొత్తు
రాహ్వాస్యమునఁ జేసి రాత్రిఁ జంద్రునిఁ బవల్, రవిని మ్రింగెడు వేల్పుఁ బ్రస్తుతింతు
యాగభాగములుసృష్ట్యాదిగాఁ గల్గి స్వాహాస్వధాదుల మెచ్చు ననఘుఁ గొలుతు
నంగుష్ఠమాత్రుఁడై యఖిలదేహములందుఁ, దనరుచుండెడు దేవుఁ దగ భజింతు

తే. దేహగతుఁడయి తానొకింతేనిదుఃఖ, మొందక దేహులకు దుఃఖమొందఁ జేయు
వలఁతి యై వారిసంతోషపడఁగ నీక, తాను సంతోషపడియెడుధన్యుఁ గొలుతు.

వ. మఱియు నదులందును సముద్రములందును బర్వతంబులందును గుహలందును
వృక్షమూలములందును గోష్ఠంబులందును గాంతారగహనంబులందును జతు
ష్పథంబులందును రథ్యలందును జత్వరంబులందును దటంబులందును హస్త్యశ్వ
రథశాలలందును జీర్ణోద్యానాలయంబులందును బంచభూతంబులందును దిక్కు
లందును విదిక్కులందును జంద్రార్కకిరణమధ్యంబునందును బాతాళానంతర
ప్రదేశంబునందును బొందుపడియుండు నేకాదశరుద్రులకు నెల్లప్పుడు నమ
స్కారము సంఖ్యయుఁ బ్రమాణము లేనిరూపగుణంబులు గలయారుద్రుల
కెల్లప్పుడు వందనము. 356

సీ. సర్వభూతకరుండు సర్వభూతహరుండు, సర్వభూతేశుఁడు సర్వభూత
ముల కంతరాత్ముఁడు తెలియ నీ వగుదు నిన్, బిలువకుండితి నంట తెలియకుంట
వివిధదక్షిణలతో వెలయుయజ్ఞము లెల్ల, నీస్వరూపం బందు నిను యజింత్రు
శా దందు వేనీదుఘనమాయ చే మోహితుఁడ నై పిలువ నైతి స్తోమమునకు

తే. నన్ను నుగ్రహింపుము దేవ నాదుభావ, గతుఁడవగుమయ్య నాదగుమతియుమనము
నాదుహృదయము నీయందె పాదుకొనియె, నేను నీవాఁడ నైతి నన్నేలు మీశ.

వ. అని ప్రస్తుతించినం బ్రసన్నుండై పరమేశ్వరుండు దక్షప్రజాపతి నక్షీణకరుణా
కటాక్షావలోకనంబులం దిలకించి నే నీస్తవంబునం బరితుష్టుండ నైతి నీవు
నాస్థాన మొందుదువు నాయనుగ్రహంబునం జేసి నీ వశ్వమేధసహస్రంబులయు
వాజపేయశతంబులయు ఫలంబు నొందఁ గల వని మఱియు నోదక్షా!
నీయజ్ఞవిధ్వంసము గావించినందులకు నన్నుఁ గోపింపకుము ప్రసన్నముఖుఁడవై
నా చెప్పినది వినుము దేవదానవులు షడంగవేదములనుండియు సాంఖ్యమ్ము
నుండియు నీతపఃప్రభావమును జెప్పియున్నారు నీ వుత్తమతపస్వివి మఱియు

నీకు నపూర్వంబును సర్వశుభ ప్రదంబును బంచాంగసంయుక్తంబును వర్ణాశ్రమ ధర్మాతిరేకంబు నగుపాశుపతవ్రతంబు నాచే నుత్పాదితంబు తద్వ్రతంబు సంపూర్ణఫలంబు గావున దాని నీ వాచరింపుము నీమనస్తాపం బెల్లఁ దీఱు నని పలికి మహాదేవుండు సపరివారంబుగా నంతర్ధానంబు నొందె నీదక్షకృత స్తోత్రంబు విననవారి కెన్నఁడు నమంగళము పొసంగదు దీర్ఘాయు వగుఁ గీర్తియు రాజ్యము విద్యయుం గోరువారు దీనిం గీర్తించి కృతార్థు లగుదురు వ్యాధిపీడితుండు పఠించి యారోగ్యంబు నొందు భూతప్రేతపిశాచాదిబాధ లీ స్తవంబునఁ బటాపంచ లగు నీసహస్రనామములు పఠించువాఁడు కుమార స్వామికినిం బార్వతికిని నందీశ్వరునకును బలి నొసంగి నియమచిత్తుండై పఠించి సర్వేప్సితంబులం బొందఁ గలం డని వ్యాసభగవానుఁ డానతిచ్చె నని చెప్పిన యుధిష్ఠిరుండు పురుషున కధ్యాత్మ మెట్టి దది దేనివలనం బుట్టు నెఱింగింపు మనిన భీష్ముండు. 358

## అధ్యాత్మతత్త్వకథనము.

సీ. అగ్ని వాయు వసుంధరాకాశ జలములు, పంచభూతములు నాఁ బరఁగు నవియ
సకలభూతంబులసంభవలయముల,కు నిమిత్తములు భూతగుణము లెతను
మూలకారణములు మున్నిటఁ దరగలు, వోలెఁ బ్రాణులు పంచభూతములను
బుట్టి భూతములందె పొడవడంగుచునుండు, భూతగుణంబులరీతి వినుము

తే. గగనముననుండి శబ్దము శ్వాతలంబు, నుండి సంభూత మనిలంబునుండి ప్రాణ
మంబువులనుండి రసము తేజంబునుండి, రూప మగు నిట్లు భూతస్వరూప మెల్ల.

క. భూతములు లయమున మహా, భూతముల లయించు సృష్టి పొసఁగినచో నా
భూతములనుండి వెండియు, భూతమ్ములు పుట్టు ననుచు బుద్ధి నెఱుఁగుమా.

సీ. శ్రోత్రంబు శబ్దమ్ము శ్రోత్రవివరము నా,కసముగుణంబులు రసము జిహ్వ
స్నేహము ననునివి జీవనగుణములు, జఠరంబు రూపంబు చక్షువు నివి
జ్యోతిర్గుణంబులై యొప్పు ఘ్రేయము ఘ్రాణ,మును శరీరంబును భూగుణములు
ప్రాణంబు చేష్టయు స్పర్శంబు నునునివి, వాయుగుణంబులై వఱలుచుండు

తే. మఱియు సత్త్వమును రజస్తమములు కాల, కర్మబుద్ధులు మనమునుగలుగఁజేసె
నీశ్వరుఁడుబుద్ధియనునదియెల్లదేహ, మునఁ బ్రవర్తించుచుండునిండినదియగుచు.

వ. మనుష్యదేహంబునం దింద్రియము లైదు మనం బాఱవది బుద్ధి యేడవది క్షేత్రజ్ఞుఁ డెనిమిదవవాఁడు నని పలుకుదురు సత్త్వరజస్తమములు తదాశ్రయము లైనభావంబు లని మఱియును. 362

సీ. చక్షువు చూచును సంశయించు మనంబు, బుద్ధి యధ్యవసానమును బొనర్చు
క్షేత్రజ్ఞుఁడెప్పుడుసాక్షీభూతుఁడగుసత్వ,మును రజ స్తమములు మొనయఁ గాల
కర్మముల్ బుద్ధిని గడఁక నడపుచుండు, నింద్రియంబులు బుద్ధి యే యనఁ దగు
బుద్ధి లే కింద్రియంబులకు గుణజ్ఞత, గలుగదు బుద్ధివి కాసమందె [స్పర్శ

తే. కనును జక్షువు శ్రోత్రమువినును ముక్కు, మూరుకొను నాల్క చవిచూచు మొనసి
మది స్పృశించును బుద్ధి యేదైనఁ గోరు, నపుడు నెమ్మనముంగూడు నమలచరిత.

వ. బుద్ధి కింద్రియంబు లధిష్ఠానంబు లవి దుష్టంబు లయినప్పుడు బుద్ధి దుష్టం బగుచుండు మనుష్యబుద్ధి త్రివిధం బొకప్పుడు సుఖించు మఱియొకప్పుడు దుఃఖించు నింకొకప్పుడు రెండును లేక యుండు నూర్మిమంతం బగుపారావారము వేలం బోలి భావగతబుద్ధి మనంబు నతిక్రమింపఁ జాలదు ప్రహర్షము ప్రీతి యానందము సుఖము శాంతచిత్తము నివి సాత్వికగుణంబులు పరిదాహము శోకము సంతాపము దురాశ యక్షమ యివి రాజసగుణంబు లవిద్య రాగము మోహము ప్రమాదము స్తబ్ధత భయము నసమృద్ధి దైన్యము ప్రమోహము స్వప్నము తంద్ర యివి తామసగుణంబులు మఱియు మనస్సునకుఁ బ్రీతియుక్త మగునది సాత్విక మనియు నప్రియమై దుఃఖకర మైనది రాజసం బనియు నజ్ఞానయుక్తమై గ్రహింప శక్యంబుగాకుండునది తామసం బనియు నెఱుంగం దగు నివి బుద్ధిగతంబు లని మున్న యెఱింగించితి నింక సుసూక్ష్మంబు లగుసత్వక్షేత్రజ్ఞులయంతరం బెఱింగించెద నాకర్ణింపుము. 364

సీ. అం దొక్కఁడుగుణంబులమరించునమరింప, దొండొక్కఁడవి రెండునొకటి గాక
ప్రకృతిచే వేఱయ్యు వారిమత్స్యము లట్లు, కలసియే యుండు నెక్కాలమందు
గుణములాత్మ నెఱింగికొనవు గా నయ్యాత్మ,గుణముల నెఱుఁగు నద్గుణము లంట
కెపుడు సాక్షీభూతుఁడే యగు బుద్ధికి, నాశ్రయంబును లేద యనఁగ వచ్చు

తే. గుణములస్వరూప మెవ్వఁడు గుఱుతుపట్ట
నెఱుఁగఁడు గుణంబులన్ బుద్ధియే సృజించు
వాని క్షేత్రజ్ఞుఁ డెఱుఁగు సత్వమున కాత్మ
కింతమాత్రమ సంబంధ మెఱిఁగికొనఁగ. 365

వ. ఇంద్రియంబులు దీపంబులవలె వస్తుజ్ఞానముం గలిగించు బుద్ధియం దుండి సర్వము నెఱుంగుచున్న దిట్లెఱింగినవాఁడు శోకహర్షాదు లొందక మెలంగుచుండు నూర్ణనాభికిం దంతువులుంబలె బుద్ధికి గుణసృష్టి సహజము చింతామయ మగు

నిట్టిహృదయగ్రంథి న్విడిచి విశోకుండును ఛిన్నసంశయుండునై మనుజుండు సుఖించు నధ్యాత్మవేత్తలు జ్ఞానప్లవంబున నగాధం బగుభవాబ్ధి నుత్తరించి తరింతు రని గాంగేయుండు తెలిపినం ధర్మనందనుండు. 366

ఆ. ప్రాణికోటి మృత్యు వన్న దుఃఖం బన్న, జడియుచుండు ననుట సత్య మేము
వానివలన భయము వడయనివార మై, యుండు తెఱఁగు సెప్పు మోమహాత్మ.

వ. అనిన గంగాతనయుం డీ వడిగినదాని కుదాహరణంబుగా సమంగనారద సంవాదం బనునితిహాసంబు గల దాకర్ణింపు మ ను న్నొక్కనాఁడు నారద మునీంద్రుండు సమంగుం డనువానిపాలికిం జని యి ట్లనియె 368

## నారదసమంగసంవాదము.

సీ. ఉరము నేలఁ బోయ నుంచి చేతుల నీఁదు, నట్లు ప్రణామము లాచరింతు
వెపుడు శోకము లేక హృష్టమనస్కుఁడ, వయ్యుద వుద్వేగ మది యెఱుఁగవు
నిత్యతృప్తుం డవు నీవు స్వస్థుండవై, సంచరింతువు బాలుచందమునను
నా సమంగుం డను నారద! భూతభ,వ్యభవిష్యములతత్త్వ మంత నాకుఁ

తే. దెలియుఁ గావునఁ జింతలోఁ గలుగకుండ, మెలఁగుచుంటినుపక్రమంబులుఫలోద
యము లెఱుంగుదునచ్చెఱువగును గాన, నేను విమనస్కుఁడను గాక యిట్టులుండు.

సీ. అప్రతిష్ఠకు నైన యట్టి రచారిత్ర,కులు గతి లేనివారలును జడులు
నంధులుఁ మనమును స్వాచరితక్రియ, బ్రదుకుచుంటిమి రోగ మెదియు లేక
వేల్పులుఁ జీవింత్రు వేయి గలారును, నూఱు గలారును వేఱు లేక
కడ తేరుచుండిరి కష్టులు కొందఱు, సుఖులు కొందఱు నయి చూడ నైరి

తే. మనము శోకింప కుండిన మనల ధర్మ, కర్మములు గాని కష్టసౌఖ్యములు గాని
యేమి చేయంగఁ జాలెడునింద్రియముల, సుప్రసాద మె జ్ఞానమై సొంపుమిగులు.

సీ. దేహేంద్రియమ్ములే మోహశోకములందు, మూఢేంద్రియుం బొందఁబోదు ప్రజ్ఞ
మూఢుండు దుఃఖంబు మోహంబునుం బొందు, నిహపరంబులు వాని కెన్న సున్న
యి ట్లుండుసంసృతి నెఱిఁగి ప్రవర్తించు, జనునకుఁ బరితాపమును సుఖంబు
గలుగఁ బో దాతఁ డొరుల కగులాభముం, గోరఁడు తనసిరిఁ గౌరవింపఁ

తే. డది లభించినఁ బోయిన నగు సముండు
కులము శ్రుతమును మంత్రముల్ బలము ధనము
బంధువులు పరంబున నగు బహుళదుఃఖ
మును దొలంగింపఁ జాలవు మునివరేణ్య. 371

క. శీలం బొక్కఁడు పరమున, జాలిం బెడఁబాపి శాంతి సమకూర్చి సుఖ

శ్రీల నొసంగెడు నది యగుc, బోలింపఁగ దాన యోగముం బొందనగుc.372
వ. యోగము ముక్తిసాధనము ధృతియు దుఃఖపరిత్యాగమ్మును సుఖదమ్ములు ప్రియము సంతోషజనకంబు సంతోషము గర్వజనకంబు గర్వము నరకజనకంబు నే నీగర్వంబును సుఖదుఃఖంబులును భయాదులును విడిచి దేహప్రవర్తనంబు నకు సాక్షినై తృష్ణామోహదూరుండనై చరింతు నమృతాంధసుండు మృత్యువునకుం బలెc గామక్రోధలోభాదులకును మృత్యువునకును భయంపడువాc డం గా నిట్లు నాతపఃప్రభావంబున సంప్రాప్తం బయ్యెc గావున నన్ను శోకంబు బాధింప నేర దని సమంగుండు నారదునకుం జెప్పె నని చెప్పిన ధర్మనందనుండు శాస్త్రతత్త్వజ్ఞుండు గాక సంశయాత్ముండు నకృతవ్యవసాయుండు నైనవానికి శ్రేయం బెట్లగుం జెప్పు మనిన శాంతనవుండు. 373

శాస్త్రతత్త్వం బెఱుంగనివాcడు సేయవలసినవిధము.

తే. గురుల సతతంబు పూజించికొలుచుటయును, వృద్ధజనపర్యుపాసనవిధియు వివిధ శాస్త్రములపరిశ్రవణముజనునకిందు,నందుశ్రేయంబొసంగెడుననియెఱుcగుము.
వ ఈయర్థంబున కుదాహరణంబుగా గాలవనారదసంవాదాత్మకం బగునితిహాసంబు గల దొక్కకాలంబున వీతమోహాక్లముండును జ్ఞానతృప్తుండును జితేంద్రియుండును యతాత్ముండు నగునారదుం గాంచి గాలవుం డి ట్లనియె. 375
చ. జగమున నుత్తమంబు లని శస్తికి నెక్కినసద్గుణంబు లెం
చగ నినుc గూడి కానc బడు సన్మునిచంద్రమ ! పండితోత్తరుం
డగుదువు నీవ మోహహృదయమం దగుసందియముల్ దొలంపc గా
దగినమహానుభావుcడవు తావకబుద్ధి యనల్ప మెన్నcగc. 376
సీ. కార్యావిశేషంబు గా జ్ఞానమందుc బ్రవృత్తి యె ట్లగుc గార్య మెద్ది తగదు
సర్వాశ్రమములు నాచారభేదంబున, నెసcగు నిదశ్రేయ మిదియె శ్రేయ
మని శాస్త్రములు చెప్పు నట్లొనర్తురు పెద్ద,లిం తె కా నెది శ్రేయ మెఱుcగ మేము
శాస్త్రైకమత్యము సంభవించిన మేలె, కాకుంట నిట్లు గా వా కొసcగితి
తే. శిష్యభావమునం జేసి శ్రేయ మెద్ది, యనుచు నడుగుదు నద్దాని నక్కటిక మె
సంగ నెఱిcగింపవే యనస్రష్టృసుతుcడు, గాలవునిcగాంచి యి ట్లనుcగరుణ జేసి.
ఆ ఆశ్రమములు నాలు గవి వేఱువేఱు గా, నేఱుపఱపc బడియె నీవు వాని
గురులచెంత నేర్చి కొను సూక్ష్మదృష్టులు, వాని పరమగతిని గానc గలరు. 378
వ. మిత్రానుగ్రహంబు నమిత్రనిగ్రహంబును త్రివర్గసంగ్రహంబును బాపకర్మనివృత్తియుc బుణ్యశీలతయు సజ్జనసముదాచారంబును నసంశయంబుగా శ్రేయంబు

లనంబడు మఱియు సర్వభూతంబులందు మార్దవంబును వ్యవహారంబుల
నార్జవంబును మధురవాక్కును శ్రేయంబులు దేవపితృతిథిసంవిభాగంబును
భృత్యులయెడ నహంకారత్యాగంబును సత్యవాక్యంబును బ్రమాదనిగ్ర
హంబును సంతోషమును స్వయంజీవనంబును శ్రేయస్కరంబులు ధర్మము
ననుసరించి వేదములు వేదాంతములు నభ్యసించుటయు జ్ఞానార్థజిజ్ఞాసయు
శ్రేయోదాయకంబులు శ్రేయంబులం గోరువాఁడు శబ్దస్పర్శరూపరసగంధా
తిసేవయు నక్తచర్యయు దివాస్వాపంబును నాలస్యపైశునమదంబులును బహు
సంగంబును సంగరాహిత్యంబును బరిత్యజింప వలయు మఱియును. 379

క. నే నింతవాఁడ ననుచుం, దా నెన్నఁడు చెప్పుకొనఁగఁ దగ దితరుల నిం
దేనియు నింద యొనర్పం, గా నొప్పదు శ్రేయ మెంచుఘనుఁ డేనాఁడున్. 380

మ. గుణహీనుం డగువాఁడు తాన జగతిన్ గొండాడఁగా నైనస
ద్గుణము ల్గల్గిన మేటిగా మనమునందుం జూచుకొంచు న్మహా
గుణసంపన్నుల నన్యులం దెలిసియుం గొంచెంబుగా నెంచు చే
క్షణమందున్ నిరసించుచున్ గరువముం గైకొంచు వర్తించెడిన్. 381

క. పండితుఁడు సద్గుణంబుల, నిండినవాఁ డయ్యు నొరుల నిందింపక యె
న్నండును దనుఁ దాఁ బొగడుకొ,నం డెందము నేయ కసమునందులఁదూఁగున్.

ఉ. *వూ లొకపిట్టకుం దెలుపఁ బోవక నైజసుగంధ మెల్లెడం
గ్రాలఁగఁ జేయునట్లు గ్రహరాజెఱిఁగింపక నింగి వెల్గున
ట్లాలరిదై యొకప్డు స్వగుణాతిశయంబును వెల్లడింప కీ
నేలఁ దలిర్చు సజ్జనుఁ డనింద్యచరిత్రకుఁడై యశంబునన్. 383

సీ. కప్పిపెట్టిన వెలుంగం జొచ్చుఁ గృతవిద్యుఁ, డసదుక్తి దీపింప దార్చి యనినఁ
దనరు సదుక్తి మందముగ నాడిన రవి, సూర్యకాంతమునెడఁ జూపు దీప్తి
కానఁ బృథగ్విధం బైన ప్రజ్ఞం జనుల్, సంతరించుకొనంగఁ జనును జువ్వె
ప్రశ్నింపఁబడ కెప్డు బదులు సెప్పఁగ రాదు, నన్యాయములకు మాఱాడ రాదు
తే. తెలిసియుండియు జడునట్లుపలుకకూర, కుండనగు ధర్మనిరతు లత్యుత్తములగు
వారితో నెప్డు నివసింపవలయు ధర్మ,మునకు వ్యతిరేకమైనచోఁ జనుఁద్యజింప.

తే. ఎట్టియారంభమును జేయనట్టివాఁడు
తనకు దొరకినదాన జీవనము చేయు

* ఒకపిట్టకున్ = ఎవ్వరికిని; ఇట్లు గోదావరీమండలమున వాడుదురు.

వాఁడు సుఖయించుఁ బుణ్యపాపము లెఱింగి
మెలఁగఁ గలవాఁడు పరమోత్తములను జేరు. 385

తే. పుణ్యవంతులసంగతిఁ బుణ్యములను, పాపవంతులసంగతిఁ బాపములను
బడయుమనుజుఁడు పుణ్యపాపములస్పర్శ, మరయనగుజలాగ్నిస్పర్శమట్లుజగతి.

ఉ. జ్ఞాన మెఱుంగఁ గోరి యొకసక్కియ మాడుచుఁ దెల్పు మన్న దు
ర్జ్ఞానికి ధర్మముం దెలుప మానసముం బొనరించు విప్రుఁ డె
చ్చోఁ నివసించు నచ్చోట విశుద్ధచరిత్రుఁడు నాత్మవేత్తయున్
జ్ఞానియు నైనవాఁడు నిముసంబు వసింపఁ దలంపఁ డెప్పుడున్. 387

క. గురుశిష్యభావ మొప్పఁగఁ, బరశాస్త్రాదిప్రచారపరతాగుణ మే
వరదేశమం దెసంగునొ, పురుషుం డాదేశమందుఁ బోలు వసింపన్. 388

శా. దోషం బింతయు లేనియుత్తమునెడన్ దోషంబు గల్పించి సం
భాషింపం గలదుష్టబుద్ధు లెచటన్ బద్ధేర్ష్యులై నిత్యసం
తోషం బందుచు నుందు రత్తలమునందుం గౌరవం బెంచువా
రీషన్మాత్రము చిత్తమున్ సలుపఁ బో రేనాఁడు వాసింపఁగన్. 389

తే. ధర్మసేతువు లెచ్చోఁ నధర్మపరుల, చేతఁ ద్రెంపఁగఁ బడియుండునో తలంప
నట్టిదేశము విడువ నౌ నగ్నిఁ గాలు, చెఱఁగు గలిగినవస్త్రంబు తెఱఁగు దోఁప.

తే. వీతమత్సరులై ధర్మవిధుల శంక, తోరఁగి యెచ్చట ధర్మశీలురు వసింతు
రట్టి దేశమునందుఁ బుణ్యాత్ము లైన, వారు నివసింపఁ జెల్లు నోశౌరవేంద్ర. 391

తే. ధర్మ మర్థార్థ మెప్పుడు తవిలి చేయు, నట్టిపాపుఁడు నివసించుపట్టునందుఁ
బుణ్యతత్పరుఁ డగునట్టిపూరుషుండు, కాఁపురము చేయరాదని కావ్యుఁ డనియె.

ఆ. బ్రదుకు నభిలషించి పాపకర్మము లాచ, రించునట్టివా ర్వసించుచోటు
పాము గల్గునిల్లు వడి విడనాడెడు, పగిది విడిచి పోవఁ బాడి సూవె. 393

ఆ. అతిథు లరుగుదేర నవ్వారికిం బెట్ట, కెచట రాజు ప్రజలు నెల్లనాఁడు
నన్న మారగింతు రట్టిదేశము విడ, నాడవలయు విజ్ఞుఁ డైనవాఁడు. 394

తే. యాజనాధ్యాపనములు స్వాహాస్వధాదు, లెల్లనాఁ డెట్టిదేశమం దెసక మెసఁగు
నట్టిదేశంబునం దిసుమంత యైన, శంక సేయక నివసింప జనున కొప్పు. 395

వ. మఱియు వృత్తికర్శితులై విప్రు లపవిత్రులై యున్న దేశంబున నివసింప
నొప్పదు రాజు ధర్మనిరతుఁడై న్యాయపరిపాలనము గావించుదేశమున నివాస
ముత్తమం బో ధర్మనందనా! శ్రేయస్సాధనం బెట్టి దని యడిగితివి గావున

నిట్లు చెప్పితి ననిన యుధిష్ఠిరుండు నాయట్టిరా జెట్లు సంచరింప వలయు నెట్టి గుణంబులు గలవాఁడు సంగవిముక్తుం డగుం జెప్పు మనిన భీష్ముం డీయర్థంబున నొక్కయితిహాసంబు గలదు చెప్పెద విను మొకప్పుడు సగరుండు తార్క్ష్య వంశజుండును సర్వశాస్త్రవేత్త యగునరిష్టనేమిం జేర నరిగి నీ విపుడు నన్నడిగిన ట్లడిగిన నతం డతని కి ట్లనియె. 396

అరిష్టనేమి సగరున కుపదేశించినధర్మప్రకారము.

సీ. సుముఖ! మోక్షసుఖం బెసుఖమునాఁబడుమూఢుఁ, డగువాఁడుపుత్త్రదారాదిసక్తుఁ
డగుచునశాంతుఁడై యదియెఱుంగఁగ లేఁడు, మూఢుండువిషయసంమోహితుండు
స్నేహపాశంబులచేఁ గట్టువడి మోక్షమున కనర్హుం డయి పాడవడంగు
స్నేహపాశములను జెప్పెద విను మవి, జ్ఞానియే విన నర్హుఁ డైనవాఁడు

తే. దారసంగ్రహ మొనరించి తజుల సుతులఁ, గాంచి వారలు యౌవనకలితు లైనఁ
బెండ్లి చేసి తమంత జీవించుశక్తి, గలుగుట యెఱింగి విడనాడ వలయు వారి.

తే. నీకు నర్ధాంగియై భార్యయై కనఁబడి, పుత్త్రవతి పుత్త్రవత్సలఁ బుణ్యచరితఁ
సగము గడచినవృద్ధగా స్వాంతమందుఁ, గనుఁగొనుచు వీడి చన నగువనిఁ దపింప.

తే. ఇంద్రియార్థంబులం బొంది స్వేచ్ఛగాఁ గు, తూహలంబులు దీరఁ బుత్త్రులను గాంచి
కాని కాంచక కాని సంగంబు విడుము, సర్వసమబుద్ధిఁ దపముండఁ జనుము వనికి.

వ. ఇట్లు సంక్షేపంబుగా నైహికవిషయంబు కీర్తించితి నింక నాముష్మికవిషయంబు విస్తరించి చెప్పెద నాకర్ణింపుము. 400

సీ. సంగవిముక్తుఁడై చరియించునరుఁడు సు, ఖించు సక్తుండు నశించు నెంచ
నెద ముక్తిఁ గోరితి వేని నీబంధుల, యెడఁ జింత యంతయు విడుచుకొనుము
జంతువుస్వయముగా జనియించుఁజచ్చును, సుఖదుఃఖములనొందుసుకృతమునను
బూర్వకర్మము మీఱి పోనరెడునది లేదు, పురుషుఁడు మృత్పిండభూతుఁ డస్వ

తే. తంత్రుఁ డెటుస్వజనముఁబ్రోచుఁ దానుజూడ, వారుచత్తురుతాఁ జచ్చువారుచూడ
నిట్టిచో వారికై యేడ్చు టేటిమాట, లీవు చచ్చిన నీవారి నెఱుఁగఁ గలవె.

క. ఈవిధ మంతయు నారయ, నేవానికి నెవఁడు చుట్టమెవ్వఁడు పక్కం
బీవింత తెలిసి ముక్తికిఁ, గావింపుము బుద్ధి విడిచి ఘనసంగములన్. 402

తే. క్షుత్పిపాసలు మోహము క్రోధలోభ, ములు జయించియు సత్త్వముపొం దెఱింగి
సంసృతిని రోసినాతఁడీజగమునందు, ముక్తుఁడగుననియెఱుఁగు మోభూతలేంద్ర.

క. మానినియు వేట జూదము, పానం బనువీనియందు వ్యసనరతుం డై

మానవుఁడు మోహ మందక, తా నుండిన ముక్తుఁ డనుచుఁ దలఁపు మెడందన్.

క. దినదినము ననుభవించెద, నని ఖేదం బందు నెవ్వఁ డాతఁడు దుష్టుం
డనఁబడు స్త్రీసాంగత్యము, జని కారణ మనుచు నెఱిఁగి చను ముక్తుండై. 405

సీ. భూతసంభవనాశముల నెఱింగినవాఁడు, ముక్తుఁడు తనకు వేపుట్లధాన్య
ముండిన యాత్రార్థ మొకకుంచెడే చాలు, నని యెంచుకొనుజనుం డందు ముక్తి
జగమెల్ల రోగము చావును గలదై న,శించు నంచనువాఁడు గాంచు ముక్తి
జగ మిట్టిదని యెంచిస్వల్పసంతుష్టుఁడై,యుండునాతఁడు మోక్ష మొందగలఁడు

తే. పుడమి పల్యంకమును సమంబులుగఁ బండి
గంజియును బాయసం బొక్కగతిగఁ ద్రావి
క్షౌమమును నారలును నొక్కచక్కిఁ గట్టి
మెలఁగునాతఁడు ముక్తుఁడై మిసిమిఁ గాంచు. 406

వ. మఱియు నెవ్వఁ డీప్రపంచము పంచభూతమయంబుగా నెంచుచు సుఖదుఃఖ
ములు లాభాలాభములు జయాజయములు నిచ్ఛాద్వేషములు భయోద్వేగ
ములు తుల్యమ్ముగా నెంచునో వాఁడు ముక్తుండు రక్తమూత్రపురీషాదిదోష
దూషితం బీశరీరం బని తలంచుచుం దనశరీరం బెప్పటికే జీర్ణంబు కాకుండ
దని తలంచువాఁడు ముక్తుం డెందఱో మహారాజులు మహర్షులు లోనగువా
రీభూమిన్ విడనాడి పోయి రని తెలిసిన వాఁడు ముక్తుండు సంసృతిదుఃఖమూలం
బని యెంచువాఁడును ముక్తుండు శాస్త్రజ్ఞానలోకజ్ఞానంబుల నీమనుష్యలోకము
నిస్సారం బని యెఱింగినవాఁడు ముక్తుం డగు నీవు నావచనంబునం జేసి ముక్తి
మార్గంబు వట్టి మెలంగుము కాదేని గృహస్థవృత్తి నవలంబించినను ముక్తి
నొంద శక్తుండ వగుదువు గాని నీబుద్ధి కలత నొందకుండ వలయు ననిన సగ
రుండు మోక్షమార్గం బనుసంధించి ప్రజలం బాలించె ననుటయు నజాత
శత్రుండు శంతనుపుత్రుం దిలకించి యి ట్లనియె. 407

భార్గవునకు శుక్రనామము గలిగినవిధము.

శా. దేవర్షిప్రవరుండు భార్గవుఁడు దేదీవ్యత్ప్రభావుండు తా
దేవారాతిగురూత్తరుం డగుచుఁ దత్ప్రేమం బ్రవర్తిల్లి తే
జోవృద్ధిం బొనరింప నేమిటికి నక్షుద్రద్విషద్భావ మా
దేవాధీశులతోడ దానవుల కుద్దీపింపఁగా నేటికిన్. 408

క. అమరేంద్రాభుం డుశనున, కమితం బగుబుద్ధి యెట్టు లబ్బెన్ శుక్ర

త్వము గలుగు టెట్లు దివి మధ్యమునకు రాకుంటకుం గతం బెయ్యది యో.

వ. అనిన భీష్ముండు నావిన్నవిధంబునఁ వివరించెద నవహితుండ వగు మని యి
ట్లనియె. 410

సీ. ధర్మజ! భార్గవదాయాదుఁడును జగన్నాన్యుఁ డాతం డొక్కమాటబడిని
సురలకుఁ విప్రియకరుఁ డయ్యెఁ జెప్పెద, వినుము కుబేరుండు ధనపతి యయి
యక్షరక్షఃపతి యై యుండునెడ భార్గవుఁడు యోగబలమునఁ గడిమి మెఱసి
ధనదునిలోఁ జొచ్చి తద్ధనం బంతయు, హరియించె నరికట్టి యతనిమనము

తే. యక్షరా జింతయు నెఱింగి స్వాంతమందు, శర్మ మింతయుఁ గానక శర్వుకడకు
నరిగి యోగబలంబున నస్మదీయ, కాంచనం బెల్లఁ గొనియె భార్గవుఁడు భర్గ.

వ. అని విన్నవించిన విని మహేశ్వరుండు కేల శూలంబు పూని వాఁ డేఁడి యని
పలుకునంతలో నుశనుండు దూరగతుండయ్యెఁ దనయోగశక్తిం జేసి తచ్చి
కీర్షితం బెఱింగి యి ద్దేమి చేయుదు నని యించుక విచారించి యోగప్రభా
వంబున నుగ్రునిత్రిశూలంబునగ్రంబునం బ్రవేశించుటయు శూలి శూలాగ్ర
స్థితుం డగువాని నెఱింగిచేయునది లేకశూలంబుకేలం బట్టి వంచుటయు నది
విల్లునా వంగి పినాకంబు నాఁబడియె నయ్యెడ హస్తగతుం డగు భార్గవుం దిల
కించి పట్టి నోటం బెట్టుకొని యొక్కజలాశయంబున స్థాణుభూతుండై యుండి
ప్రయుతంబు లర్బుదంబులు వర్షంబులు ఘోరతపంబు గావించి పదంపడి యమ్మ
హాహ్రదంబునుండి వెలివచ్చి తత్కాలసమాగతుం డగుపితామహుని బహూ
కరించి తనతపఃప్రకారం బెఱింగించె నంత నతనిగర్భగోళంబున వివర్ధమానుం
డై యున్న భార్గవుం డుద్విగ్నుండై మెండుగ స్తుతించి తన్ను వెడలింపు మని
ప్రార్థించినం బ్రసన్నుండై పరమేశ్వరుం డోకపీ! నీవు నా మేహనద్వారంబు
నుండి వెడలి ర మ్మని వక్కాణించి తక్కినద్వారంబులు మూసె నంత నతం డా
శుక్రద్వారంబునుండి వెడలివచ్చి శుక్రుం డయ్యె దానం జేసి యతండు నభో
మధ్యగతుండు గాఁ నోపఁ డయ్యె నట్లు వెడలివచ్చినశుక్రుం జూచి శూలో
ద్యతకరుం డగుశర్వుం దిలకించి సర్వమంగళ యిట్లనియె. 412

ఉ. నీయుదరాంతరంబునఁ బ్రతిష్ఠితుఁడై చిరకాల ముండి తే
జోయుతుఁడై బహిర్గతికిఁ జొచ్చెను గావున నీకు నాకుఁ బు
త్రాయితమూర్తి యయ్యెను గదా! యితని వ్యధియింప నొప్ప దో
స్వీయజనావనప్రవణ! వీని ననుగ్రహదృష్టిఁ జూడుమా. 413

వ. అనినం బ్రీతుండై భూతేశుం డీతని న్విడిచి పుచ్చితి నిచ్చ వచ్చినమచ్చునం బో
వచ్చు ననిన భార్గవుం డాపురాణదంపతులకుఁ దండప్రణామంబు గావించి
యిష్టగతిం బ్రాపించె నిది భార్గవుని చరిత్రం బనిన ధర్మపుత్త్రుండు మఱియు
శ్రేయోదాయకంబు లగువాని న్విన నెంచి పురుషుం డెట్టి శుభకర్మం బాచ
రించి యిహపరంబుల శ్రేయంబు లొందుం జెప్పు మనిన నప్పితామహుం
డిట్లనియె. 414

## జనకునకుఁ బరాశరముని యుపదేశించినధర్మప్రకారము.

ఉ. ఈవిషయంబు తేటపడు నేను వచించెద మున్ బరాశరా
ఖ్యావిదితున్ మహామునిజనాగ్రణినిన్ జనకుండు గాంచి భూ
దేవకులాగ్రగణ్య! వినఁ దెల్పు మిహంబున నప్పరంబునన్
భావుకముం బొనర్చెడుశుభం బగుకర్మము నాన తీయవే. 415

వ. అని యడిగిన సర్వధర్మవిధానవిదగ్రగణ్యుం డగునప్పరాశరుం డాతని నను
గ్రహాదృష్టిం దిలకించి యి ట్లనియె. 416

సీ. కృతధర్మమే శ్రేయ మిహపరంబులఁ గూర్చు,నది దానికంటె నన్యంబు లేదు
నరుఁ డట్టిధర్మ మొనర్చియే స్వర్గంబు, పొందు ధర్మము కర్మమూలకంబు
కావునఁ గర్మంబు గావింత్రు నాల్గాశ్ర,మములవారు చతుర్విధ మగుయాత్ర
జనుల కయ్యది తనంతన కల్గు చుండును, వివిధ క్రమంబుల వెలయుసుకృత
తే. దుష్కృతము లొనర్చెడువారుతోఁప వత్తు,రైదు తెఱఁగులఁదద్గతు లధికవిధము
లగును బంగారుజలపోత కైనపాత్ర, మట్లు కర్మమునన్ జంతు వలరుచుండు.
క. బీజము లే కేదియు ధర,పై జనియింపంగఁ బోనిపగిదిం గర్మ
భ్రాజితుఁ డై యొప్పినజనుఁ, డాజన్మమునందు సౌఖ్య మందు నిజముగన్. 418
సీ. కన రాదు దైవము కనుటకు సాధనం,బును లేదు దేవతలును నసురులు
గంధర్వులు స్వభావకలితులు ప్రాణులు, కడ తేరిపోఁ బూర్వకర్మఫలము
నంట వచ్చెడు ననునది కల్ల యోఁ జతు,ర్విధకర్మమును హేతురీతి గాదు
లోకయాత్రార్థము వాకొను వేదము, లవి మనశ్శాంతికి నయ్యెఁ గాని
తే. కావు వృద్ధానువాదముల్ ఘనతరమ్ము, లనుచుఁగొందఱు పల్కుదురదియసంగ
తముచతుర్విధకర్మముల్ధరణిఫలద,ములయటంచునుబండితుల్పలుకుచుంద్రు.
క. తన చేసినకర్మంబున, కను వగుఫల మందుఁ బురుషుఁ డది దుష్కృత మై
నను సుకృత మైన మిశ్రం,బు నైనఁ గర్మము వినాశముం గొన దెపుడున్.420

క. సుకృతము దుష్కృత మివి రెం, డొకపరి జనుఁ డనుభవింప నుండవు ధరలో
నొకఁ డనుభవించి పై నిం, కొకఁడుగఁ దా ననుభవించు నొగిఁ గర్మగతిన్.

వ. మఱియు దమము శమము ధృతి తేజము సంతోషము సత్యవాదిత్వము మందా
క్షము నహింస ప్రయత్నము సామర్థ్యముం గలవాఁడు సుఖంబు నొందు
సుకృతదుష్కృతముల నియతంబులు విచక్షణుండు నిరతమ్ము నెమ్మనమ్మున
సమాహితమ్ము చేసి కొనవలయు మనుష్యుండు తనసుకృతదుష్కృతంబులు
తాన యనుభవించుం గాని యన్యుం డనుభవింపఁడు విషయసక్తుం డొక్క
మార్గంబును విషయవిరక్తుండు వేఱొకమార్గంబునుం బట్టి పోవుదురు భీరు
వగురాజన్యుఁడును సర్వభక్షుఁ డగుబ్రాహ్మణుండును గృహ్యాదులు లేని
వైశ్యుండును నలసుం డగుశూద్రుండును శీలము లేనివిద్వాంసుండును
వృత్తవిహీనుం డైనకులీనుండును సత్యము లేనివిప్రుండును దుష్ట యగు
స్త్రీయును రాగము గలయోగియు మూర్ఖుఁ డగువక్తయును నృపవిహీనం
బగురాష్ట్రంబును బ్రజానురాగంబు లేనిరాజును శోచనీయతకుఁ బాత్రము
లగుదు రని పరాశరుండు వెండియు. 422

తే. ఇంద్రియార్థహయంబుల నెసక మెసఁగు, ఘనమనోరథరథ మెక్కి తనరుజ్ఞాన
మనెడురశ్మలఁ జేఁబూని యభిగమించు,నతఁడుబుద్ధిమంతుఁడటంచునాఖ్యనొందు.

క. ఆయువు దుర్లభ మయ్యది, పోయెడు కర్మములజోలిఁ బో కెప్పుడు పు
ణ్యాయితకర్మంబులచే, నాయత మొనరించుకొనఁగ నగు నెవ్వేళన్. 424

సీ. జనుఁడు వర్ణోత్కర్షమునుబొందుఁ బుణ్యకర్మముల నుత్తమము వర్ణంబునొంద
నట్టిఁడు పాపకార్యము లాచరించెడు, నజ్ఞానకృతపాప మడఁగుఁ దపము
వలన జ్ఞానకృతంబు ఫలమొసంగక పోదు, కానఁ బాపము లను గాదు సేయఁ
బాపకర్మమున లాభం బున్న దానిఁ జం,డాలు నట్టులు పాఱఁ దోల వలయుఁ

తే. బాపఫల మతి కష్టమై పరిభవిల్లుఁ, బాపి యగువానిదృష్టికి భ్రమము గలదు
వాఁడు తనదేహ మాత్మగానోడ కెంచుఁ,బాపిప్రస్థితుఁడగుచుఁ దాపంబునొందు.

తే. వస్త్రము విరక్త మైన శుభ్రంబ యగును,నలుపువర్ణము గలదైననలుపువిడదు
పాపవిధ మిట్టిరీతిని బరఁగుచుండు,ననుచుఁ దెలియంగవలయు నెమ్మనమునందు.

తే. తెలిసిచేసినపాపముఁదొలఁగికొనఁగఁ,బొనరుననుచుఁ బ్రాయశ్చిత్తమునుబొనర్చి
యుభయఫలమును వేర్వేఱ నొందుఁగాని,తొలఁప లేఁడుప్రాయశ్చిత్తకలనదాని.

సీ. అజ్ఞానకృతహింస యది యహింసాధర్మ,మునఁ దొలంగెడు ననియనిరి బుధులు

వ. అనినం బ్రీతుండై భూతేశుం డీతని న్వీడిచి పుచ్చితి నిచ్చ వచ్చినమచ్చునం బో
వచ్చు ననిన భార్గవుం డాపురాణదంపతులకుఁ దండప్రణామంబు గావించి
యిష్టగతిం బ్రాపించె నిది భార్గవుని చరిత్రం బనిన ధర్మపుత్త్రుండు మఱియు
శ్రేయోదాయకంబు లగువాని న్విన నెంచి పురుషుం డెట్టి శుభకర్మం బాచ
రించి యిహపరంబుల శ్రేయంబు లొందుం జెప్పు మనిన నప్పితామహుం
డిట్లనియె. 414

జనకునకుఁ బరాశరముని యుపదేశించినధర్మప్రకారము.

ఉ. ఈవిషయంబు తేటపడు నేను వచించెద ముక్ బరాశరా
ఖ్యావిదితుక్ మహామునిజనాగ్రణినిక్ జనకుండు గాంచి భూ
దేవకులాగ్రగణ్య! వినఁ దెల్పు మిహంబున నప్పరంబునక్
భావుకముం బొనర్చెడుశుభం బగుకర్మము నాన తీయవే. 415

వ. అని యడిగిన సర్వధర్మవిధానవిదగ్రగణ్యుం డగునప్పరాశరుం డాతని నను
గ్రహదృష్టిం దిలకించి యి ట్లనియె. 416

సీ. కృతధర్మమే శ్రేయ మిహపరంబులఁ గూర్చు,నది దానికంటె నన్యంబు లేదు
నరుఁ డట్టిధర్మ మొనర్చియే స్వర్గంబు, పొందు ధర్మము కర్మమూలకంబు
కావునఁ గర్మంబు గావింత్రు నాల్గాశ్ర,మములవారు చతుర్విధ మగుయాత్ర
జనుల కయ్యది తనంతన కల్గు చుండును, వివిధ క్రమంబుల వెలయుసుకృత

తే. దుష్కృతము లొనర్చెడువారుతోఁప వత్తు,రైదు తెఱఁగులఁదగ్గతు లధికవిధము
లగును బంగారుజలపోత కైనపాత్ర, మట్లు కర్మమునక్ జంతు వలరుచుండు.

క. బీజము లే కేదియు ధర,పై జనియింపంగఁ బోనిపగిదిం గర్మ
భ్రాజితుఁ డై యొప్పినజనుఁ, డాజన్మమునందు సౌఖ్య మందు నిజముగక్. 418

సీ. కన రాదు దైవము కనుటకు సాధనం,బును లేదు దేవతలును నసురులు
గంధర్వులు స్వభావకలితులు ప్రాణులు, కడ తేరిపోఁ బూర్వకర్మఫలము
నంట వచ్చెడు ననునది కల్ల యొకాఁ జతు,ర్విధకర్మమును హేతురీతి గాదు
లోకయాత్రార్థము వాకొను వేదము, లవి మనశ్శాంతికి నయ్యెఁ గాని

తే. కావు వృద్ధానువాదముల్ ఘనతరమ్ము, లనుచుఁగొందఱు పల్కుదురదియసంగ
తముచతుర్విధకర్మముల్ ధరణిఫలద,ములయటంచును బండితుల్ పలుకుచుంద్రు.

క. తనచేసినకర్మంబున, కను వగుఫల మందుఁ బురుషుఁ డది దుష్కృత మై
నను సుకృత మైన మిశ్రం,బు నైనఁ గర్మము వినాశముం గొన దెప్పుడుక్. 420

క. సుకృతము దుష్కృత మివి రెం, డొకపరి జనుఁ డనుభవింప నుండవు ధరలో
నొకఁ డనుభవించి పై నిం, కొకఁడుగఁ దా ననుభవించు నొగిఁ గర్మగతిన్.

వ. మఱియు దమము శమము ధృతి తేజము సంతోషము సత్యవాదిత్వము మందాక్షము నహింస ప్రయత్నము సామర్థ్యముం గలవాఁడు సుఖంబు నొందు సుకృతదుష్కృతముల నియతంబులు విచక్షణుండు నిరతమ్ము నెమ్మనమ్మున సమాహితమ్ము చేసి కొనవలయు మనుష్యుండు తనసుకృతదుష్కృతంబులు తాన యనుభవించుం గాని యన్యుం డనుభవింపఁడు విషయసక్తుం డొక్కమార్గంబును విషయవిరక్తుండు వేఱొకమార్గంబునుం బట్టి పోవుదురు భీరు వగురాజన్యుఁడును సర్వభక్షుఁ డగుబ్రాహ్మణుండును కృష్యాదులు లేని వైశ్యుండును నలసుం డగుశూద్రుండును శీలము లేనివిద్వాంసుండును వృత్తవిహీనుం డైనకులీనుండును సత్యము లేనివిప్రుండును దుష్ట యగు స్త్రీయును రాగము గలయోగియు మూర్ఖుఁ డగువక్తయును నృపవిహీనం బగురాష్ట్రంబును బ్రజానురాగంబు లేనిరాజును శోచనీయతకుఁ బాత్రము లగుదు రని పరాశరుండు వెండియు. 422

తే. ఇంద్రియార్థహయంబుల నెసక మెసఁగు, ఘనమనోరథరథ మెక్కి తనరుజ్ఞాన
మనెడురశ్ములఁ జేఁబూనియభిగమించు,నతఁడుబుద్ధిమంతుఁడటంచునాఖ్యనొందు.

క. ఆయువు దుర్లభ మయ్యది, పోయెడు కర్మములజోలిఁ బో కెప్పుడు పు
ణ్యాయితకర్మంబులచే, నాయత మొనరించుకొనఁగ నగు నెవ్వేళన్. 424

సీ. జనుఁడు వర్ణోత్కర్షమును బొందుఁ బుణ్యకర్మముల నుత్తమము వర్ణంబునొంద
నట్టిఁడు పాపకార్యము లాచరించెడు, నజ్ఞానకృతపాప మడఁగుఁ దపము
వలన జ్ఞానకృతంబు ఫలమొసంగక పోదు, కానఁ బాపము లను గాదు సేయఁ
బాపకర్మమున లాభం బున్న దానిఁ జం,డాలు నట్టులు పాఱఁ ద్రోలవలయుఁ

తే. బాపఫల మతి కష్టమై పరిఢవిల్లుఁ, బాపి యగువానిదృష్టికి భ్రమము గలదు
వాఁడు తనదేహ మాత్మగా నొడకెంచుఁ,బాపి ప్రస్థితుఁడగుచుఁ దాపంబునొందు.

తే. వస్త్రము విరక్తమైన శుభ్రంబ యగును,నలుపువర్ణము గలదైననలుపువిడదు
పాపవిధ మిట్టిరీతిని బరఁగుచుండు,ననుచుఁ దెలియంగవలయు నెమ్మనమునందు.

తే. తెలిసిచేసినపాపముఁదొలఁగిపోనఁగఁ,బొనరుననుచుఁ బ్రాయశ్చిత్తమునుబొనర్చి
యుభయఫలమును వేర్వేఱ నొందుఁగాని,తొలఁపలేఁడుప్రాయశ్చిత్తకలనదాని.

సీ. అజ్ఞానకృతహింస యది యహింసాధర్మ,మునఁ దొలంగెడు ననియనిరి బుధులు

బుద్ధిపూర్వక మైనఁ బో దండు రె ట్లైనఁ, బుణ్యపాపంబు నీపుడమియందు
ననుభవింపక పోవ యని యందు నే నందు, స్థూలసూక్ష్మంబుల చొప్పు వట్టి
తలఁపఁ బ్రమాదమువలనఁ గల్గినతప్పు,లకుఁ జాలి స్వల్పఫలంబె గల్గు

తే. మునులు వేల్పు లొనర్చునపూర్వకర్మ,ములకు సందిగ్ధఫలతను దెలిసి వాని
వంకఁ జనరాదు మది నెంచి వలయుకర్మ, మాచరించిన భద్రము లందు నరుఁడు.

మ. నవభాండంబునఁ బోయునీర్ క్రమముగా నాశం బగుం దగ్గి ప్రాఁ
తవడన్ భాండము దానిలోనిజలముల్ తగ్గంగఁ బో వట్లు బు
ద్ధివిశేషంబునఁ గార్యముల్ శుభసమృద్ధిం గూర్చు నీళ్లున్న పైఁ
దవుల న్నీ ళ్లిడినట్లు బుద్ధిబల మొందన్ వృద్ధిగాంచుం బనుల్. 429

వ. రా జైనవాఁ డున్నతు లగుశాత్రవుల జయించి సమ్యగ్విధంబునఁ బ్రజలం
బాలించి బహువిధయాగంబు లాచరించి యనంతరంబ వానప్రస్థుండై దమా
న్వితుండును ధర్మశీలుండునై ప్రాణికోటిం దన్నుఁగా నెంచి పెద్దలం బూజించి
సుఖంబు గాంచు నని మఱియును. 430

సీ. ఒకనికి నుపకార మొనరించుటయు నిచ్చు,టయుఁ గోలెఁ గార్యసంచయము లెల్ల
నాత్మార్థ మగున్నే హ మది లేమిఁ దోఁచుట్ల, విడుతు రుత్తమునకు నిడుట వాని
వలనఁ గొంటయుఁదుల్యములున్యాయవి త్తము, ధర్మార్థమైయిడఁదలఁప వలయుఁ
గ్రూరకార్యములకుఁ గూడ దార్జింపంగ, నతిథికి నిన్నినీ ళ్లయిన నిచ్చి

తే. క్షుత్పిపాసలు దీర్చిన సుజనుఁ డుర్వి, సుకృతఫల మొందుఁ దొల్లి భూసురుల కిన్ని
పండ్లు దుంపలు నీ ళ్లిచ్చి భవ్యకీర్తి, యైనరంతిదేవుఁడు సిద్ధి నందఁ గలిగె. 431

వ. అట్లే శైబ్యుండును ఫలపత్రంబుల మాతరు నర్చించి పరమస్థానంబు నొందె
దేవపితృతిథిభృత్యులకు ఋణపడి యున్నవాఁడు పునర్జన్మంబు నొందుఁ గావున
స్వాధ్యాయంబుచే మహర్షులయు యజ్ఞకర్మంబులచే దేవతలయు శ్రాద్ధదానం
బుచేఁ బితృదేవతలయు సమర్చలచే నతిథులయు ఋణంబు దీర్చి వేదపఠన
శ్రవణాదులచే విజ్ఞానంబు గలిగించుకొని భృత్యులం బోషించి కృతకృత్యుం
డగు ధనము లేకున్నను ధరణీజనులు ధన్యు లగుదురు మును లగ్నుల నారా
ధించి సిద్ధిం గాంతురు ఋచీకపుత్రుండు విశ్వామిత్రునకుఁ బుత్రత్వంబుఁ
గాంచి యజ్ఞభాగు లైనదేవతల ఋక్కులన్ స్తుతించి సిద్ధి నొందెఁ గావ్యుండు
దేవదేవప్రసాదంబున శుక్రత్వంబు నొంది యశోవృతుండై గగనం బలంకరించె
నసితుం డగుదేవలుండు పర్వతనారదులు కాక్షీవంతుఁడు జామదగ్న్యుఁడు

శాండ్యుఁడు వసిష్ఠుఁడు జమదగ్ని విశ్వామిత్రుఁడు నత్రి భరద్వాజుఁడు హారిశ్మశ్రుఁడు కుండధారుఁడు శ్రుతగ్రీవుఁడు మున్నగుమహర్షులు నారాయణుని సన్నుతించి తత్ప్రసాదంబునఁ దపస్సిద్ధిం బడసిరి న్యాయార్జితం బుత్తమధనం బన్యాయార్జితం బధమధనంబు ధనకాంక్షం జేసి ధర్మంబు వీడ రాదు ధర్మచింతం జేసి యాహితాగ్ని యగువాఁడు పుణ్యకృదుత్తరుండు వేదము లగ్నిత్రయప్రతిష్ఠితంబు లగ్నియు నాత్మయుఁ దల్లియుఁ దండ్రియు గురువును బరిచర్య సేయం దగినవా రహంకారము లేక వృద్ధసేవ చేయుచు నహింసామార్గమునఁ బ్రవర్తించువాఁడు సజ్జనాదరణపాత్రుం డగు నని పరాశరుండు వెండియు. 432

సీ. ద్విజుల మూవురను సేవించుట శూద్రుని, ధర్మ మాతఁడు తండ్రి తాత మొదలు
వేఱొకస్థిర మైనవృత్తి లేకున్నచో, ద్విజుల శుశ్రూషయే విహిత మగును
సజ్జనసంగతి సంపత్ప్రదం బగు, దుర్జనసంగతిఁ దొలఁగ నొప్పు
నుదయాద్రి చేరువ నున్నరత్నంబులు, వేవెల్గుసంగతి వెలుఁగునట్లు
తే. సజ్జనులసన్నికర్ష మెసంగుకతన, హీనవర్ణుఁడు దీపించు నెంతయేని
మడుగు రంగు వేయుటఁ జేసి మాఱి నట్లు, పాదజుం డొప్పు సద్వర్ణపరిచయమున.

సీ. అతిచలాచల మనిత్యము జీవితము సుఖదుఃఖము లయినప్డు తొనఁకు లేక
శుభకార్యము లొనర్చి శుభములనే పొందు, ధర్మేతరము లొక్కతఱి ఫలంబు
నిడున వైనను వాని విడువంగఁ దగు నది, హితము కా దేనాఁటి కేనిఁ గాని
పరగోసహస్రము హరియించి దానము, నొనరించురాజన్యుఁ డొడయు వేరి
తే. తస్కరుం డనఁబడు మున్ను తగ స్వయంభు
వలరి ధాతను సృజియించె నతఁడు లోక
ధారణరతుఁ డౌ నొక్కపుత్రకునిఁ గాంచె
నతని సేవించి యారుజుం డార్యుఁ డయ్యె. 434

వ. వైశ్యుండు కృషిం జేసి ధనంబు సంతరించుటయు రాజు రక్షించుటయు బ్రాహ్మణుం డనుభవించుటయు ధర్మం బయ్యె నాబ్రాహ్మణుండు వక్రబుద్ధియు క్రోధము శఠత్వము లేక హవ్యకవ్యంబు లాచరించువాఁడు గావలయు ని ట్లున్న ధర్మము నశింపదు ప్రజలు సుఖింతురు దేవతలు సంతసింతురు ధర్మతత్పరుఁడై ప్రజాపాలన మొనర్చురాజు నధ్యయనము సేయువిప్రుండు నార్జనరతుం డగు వైశ్యుండు నియతేంద్రియుండై శుశ్రూష చేయుశూద్రుండు గౌరవార్హు

లట్లాచరింపరేని ధర్మహీను లగుదురు రాజు సత్కరించి విప్రులకు ధనం బొసంగి ఫలం బనుభవించు నని మఱియును. 435

చ. ఎదురుగ నేగి యాచకున కింద మటంచు నొసంగుదాన మ
య్యది పరమోత్తమంబు కడ కాగతుఁడై యడుగంగ నిచ్చున
య్యది యగు మధ్యమం బడుగునంత నవజ్ఞ ఘటిల్లఁ జేయుచుం
బదరుచు నిచ్చునట్టి దధమం బని రార్యులు సత్యవాదులై. 436

—చాతుర్వర్ణ్యధర్మకథనము.—

వ. సంసారసాగరనిమగ్ను లగువారు దానినుండి యెట్లు వెడలవలయునో తద్విధం బెఱింగికొనవలయు బ్రాహ్మణుం డింద్రియనిగ్రహంబునను క్షత్రియుండు శత్రువిజయంబునను వైశ్యుండు ధనసంచయంబునను శూద్రుండు దాక్ష్యంబునను శోభింతురు ప్రతిగ్రహాగతంబు లగువిప్రధనంబులును యుద్ధనిర్జితంబు లగు క్షత్రియధనంబులును న్యాయార్జితంబు లగువైశ్యధనంబులును శుశ్రూషార్జితంబు లగుశూద్రధనంబులు నల్పంబు లయ్యుఁ బ్రశంసార్హంబులై ధర్మవినియుక్తంబులై ఫలప్రదంబు లగుచున్నవి వినుము. 437

సీ. ద్విజుఁడు జీవిక లేనితెఱఁగైన రాడ్వైశ్యధర్మముల్ పూనియుఁ దాఁ జెడండు
కాని శూద్రునిధర్మ మూనినఁ బతితుఁడౌ, శూద్రుండు తనకు శుశ్రూషఁ జేసి
జీవిక జరుగనిచో వర్తకము పాశు,పాల్యము శిల్పముం బడయ వచ్చు
మద్యమాంసములు చర్మములు లోహంబులు, నమ్ముట రంగస్థలావతరణ
తే. మన్యరూపోపజీవన మఘము వెంచు, నడపడిఁ సిద్ధి గాంచియు నడుమ గర్వి
యై చెడినవాని నిగ్రహింప నైతి గామి, శిష్టసమ్మతమై ధరఁ జెల్లు ననఘ. 438

వ. దాంతులు ధర్మప్రధానులు న్యాయమార్గానువృత్తికులు నగువారు ప్రమాదంబునం దప్పు చేసినవారికి ధిగ్దండమే శాసనంబు మున్ను ధర్మమే ప్రశంసింపం బడి దానినే ప్రజ లనుమతించువా రప్పుడు రాక్షసు లయ్యుది సహింపక కామక్రోధాదిరూపములతో నాప్రజలలోనం బ్రవేశించుటం జేసి వారికి ధర్మనాశకం బగుదర్పంబు పుట్టె దర్పంబునం జేసి క్రోధంబును లజ్జయు మోహంబును సంభవించె మోహపరీతు లగువా రన్యోన్యపీడితులై రపుడు ధిగ్దండంబు చాలనిదయ్యె నయ్యెడ దేవబ్రాహ్మణులం దిరస్కరించువారు ప్రబలుటం జేసి దేవతలు దేవదేవుని శరణంబుఁ జొచ్చిన నతం డొక్కబాణంబున నాకాశగంబు లగుకామక్రోధలోభంబు లనునామూఁడుపురంబులం గూలనేసి తత్పురాధి

నాథుం డగుభీముం బిలుకుమార్చినంత లోకం బెప్పటియట్లొప్ప వేదశాస్త్రంబులకుఁ బ్రవర్తకంబు గలిగెఁ బదంపడి సప్తర్షులు దేవరాజ్యంబునకు దేవేంద్రు నభిషిక్తుం జేసి తాము మానవుల కనుశాసకులై రవ్వల విపృథుఁ డనురాజు పాలకుం డయ్యె మఱియుం గొందఱు రాజు లాయామండలంబుల కధిపతులై ధర్మంబు ప్రవర్తింపం జేయుచుండినను గొందఱు వృద్ధు లారాక్షసభావంబు మానకుండి రందున నిప్పటికి నయ్యాసురత్వమునం జేసి దుష్కర్మంబులు తలసూపుచున్నవి గావున జనులు జాగరూకులై హింసాత్మకంబు లగు కర్మంబులం దొలంగి సిద్ధిం బడయ నెంచవలయు నీవు దాంతుండవు ప్రియబాంధవుండవునై ధర్మానుశాసనంబునఁ బ్రజలం బాలింపు మని మఱియును. 439

సీ. జనుల కిష్టానిష్టసంప్రాప్తియందు సౌ,హార్దంబు వైరంబు నగుచునుండు
జన్మసహస్రముల్ జనులకుం దిరుగుచుం,దును గాన సుగుణంబులను గ్రహించి
దుర్గుణంబుల రోసి దోషిగాకుండ నౌ, ధర్మ మధర్మము దగులునరుల
నన్యభూతములకు నవి లేవు జనుఁడు వి,వేకియై ధర్మము విడువ కుండి
తే. యెల్లప్రాణులఁ దనవలె నెంచుకొనుచు, జీవహింస యొకింతయుఁ జేయనట్టిఁ
డగుచుసాంతమువిషయంబులందునిడక,యనృతమాడకయున్నశ్రేయంబులందు.

వ. ఇవి గృహస్థవిధు లింకఁ దపోవిధులుం జెప్పెద నాకర్ణింపుము. 441

సీ. గృహమేధి కుదయించు గెడపఁగ రానిదై, మమత రజస్తమమహిత మగుచు
గృహినాశ్రయించి మేల్గృహములు క్షేత్రముల్,దారపుత్రాదులుధనచయంబు
లుండు వానిం జూచుచుండి ప్రవృత్తిమై, నగువాఁడు ద్వేషరాగాన్వితుఁ డయి
ద్రవ్య మార్జింపంగఁ దగిలి మోహంబును, బ్రీతియు గలఁ డయి రీతి విడిచి
తే. రాగభోగపరాయణుఁడేగృహార్థుఁ, డసుచుఁదలఁచుచుగ్రామధర్మాంచితుఁడయి
దానికంటెను వేఱ యెద్దానిఁ గాని, సౌఖ్యముగ నెంచఁ బోవక జడుఁ డెసంగు.

వ. లోభాభిభూతుం డగునతండు సంగ మభిలషించి జనాభివృద్ధిం గావించి తత్పోషణార్థ మర్థం బార్జింప నెంచి దానికై యొఱింగియు నకార్యంబు లాచరించు. 443

తే. ఆర్జితార్థము నశియింప నట్టిదాని, పరిచయంబునఁ దా నెంతొ పరితపించి
తొంటిగౌరవమర్థించితోడరిభోగ,ములనుబొందఁ బనులుచేసి పొడ వడంగు.

వ. బుద్ధియుక్తులు శాశ్వతబ్రహ్మవాదులు పుణ్యకర్మములం జేయఁ గోరువారును సంగపరిత్యాగులు నగువారును సుఖం బనుభవింతురు. 445

క. మనుజునకు స్నేహపాత్రులు, వినాశనము నొందిన ధనవిరహిత మైనం
బొనరిన నాధివ్యాధులు, మనుజుఁడు నిర్వేద మొందు మానసమందున్. 446

తపఃప్రకారాభివర్ణనము.

తే. అట్టి హేయత్వబుద్ధిచే నాత్మబోధ, మాత్మబోధమునం జేసి యమలశాస్త్ర
దర్శనంబును శాస్త్రసందర్శనమునఁ, దపముతపమున ముక్తియుఁ దలఁప నగును

చ. సుకములఁ ద్రోసిరా జని విశుద్ధమనస్కత వీతరాగుఁడై
వికలత లేనినిష్ఠ మెయి వీగనియోగముతోఁ దపంబు సే
తకు నగుటల్ సుదుర్లభము దానిఁ బొనర్పఁగ నొప్పు శూద్రజా
తికిఁ గల దూర్ధ్వభూములకుఁ దిన్న నిదారి యిడుం దపం బొగిన్. 448

క. మును వ్రతపరుఁడై వ్రతములు, పొనరిచి సత్తపము చేసి పొనరినశక్తిన్
వనజోద్భవుండు ప్రజలం, గొనకొని సృజియింపఁ గలిగెఁ గొంతటిలోనన్.

వ. మఱియు నాదిత్యులు వసువులు రుద్రులు నగ్న్యశ్విమారుతులు విశ్వేదేవులు సాధ్యులుపితృదేవతలు మరుద్గణములుయక్షరాక్షసగంధర్వులు సిద్ధులు మున్నగు దివౌకసు లెల్లఁ దపస్సిద్ధిం జేసి స్వర్గవాసు లయి రెందఱో బ్రాహ్మణులును దపంబునం జేసి భూతలంబునఁ బ్రఖ్యాతిం గాంచి స్వర్గంబు నొందిరి మఱియు నెందఱో రాజేంద్రులును గృహమేధులును మహాకులంబులం బుట్టి పాలు పొందుచుండు రింతకును దపంబె మూలంబు వినుము. 450

సీ. కౌశేయవస్త్రముల్ కాంచనాభరణముల్, వస్తువాహనములు వారణములు
యానాసనములు సౌధాగ్రవాసము వేల, కోలఁదినౌ రూపవతులు ప్రమదలు
ప్రవిమలశయనముల్ వివిధభోజ్యంబులు, యోగ్యంబులగుభాగ్యభోగ్యములు
ఘనతపఃఫలమున జనులకుం గలిగెడు, నఖిలజగంబులయందుఁ దపము [ను

తే. చేతఁ బడయంగ రాని దేచిదురపాలు, గాని లేదు సర్వము తపఃకలనవలనఁ
బడయ వచ్చునటంచును బలికి రెల్ల, మౌనితల్లజు లని నీవు మది నెఱుఁగుము.

తే. తపముచేత విరక్తి ప్రాప్తమగు దాన, నరుఁడు లోభగుణము విడనాడి యొప్పు
నింద్రియభ్రమమగులోభ హేతువునను, దానఁ బ్రజ్ఞయడంగెడు మానవునకు.

క. ఎప్పుడు ప్రజ్ఞాక్షయ మగు, నప్పుడు న్యాయంబు తప్పు నది గాన సుఖం
బొప్పనియపు డుగ్రతపం, బొప్పుగఁ జేయంగ వలయు సుర్వీనాథా. 453

ఆ. కలుషహీనతపము గావించునాతండు, నిత్యభద్రములను నెఱి వహించి
సకలవిషయసౌఖ్యసంగతులం దగి, విమలకీర్తి నొందు నమలతేజ. 454

క. ఫలము నపేక్షించి తపం, బలసతఁ గావించుపురుషుఁ డాఫల మెడయం
గులుగుటె కాకప్రియమునుఁ, సిలుగవమానంబు నొంది చెన్నఱి పోవున్.

క. దానము ధర్మము తపమును, మానుగఁ జేయంగ నిచ్చ మసలిన యేనిన్
దా నింత పాపకార్యము, మానవుఁ డొనరించి నరక మందిరగతి కా. 456

తే. సుఖము గల్గిన దుఃఖంబు చుట్టుకొన్న, నెట్టిసమయంబునం దైన నెవఁడు స్వీయ
వృత్తమున నుండిచలియింపకుత్తమగతి, నలరునాతఁడు శాస్త్రజ్ఞుఁ డనఁగనొప్పు.

చ. శ్రవణము ఘ్రాణమున్ రసన స్పర్శము దర్శన మిందునం గొనం
దవు సుఖముల్ శరంబు గుఱిఁ దాఁకగఁ బోయెడునంతమాత్రలో
వ్యవహితముల్ వినశ్వరము లల్పము లయ్యవి చెల్లినంత మా
నవుఁడు దురంతచింతల ఘనం బగునార్తికిఁ దావలం బగున్. 458

సీ. అబుధు లనుత్తమం బగుమోక్షసుఖమును, మెచ్చ రుత్తమఫల మిచ్చుసేయు
వా రుత్తమగుణంబు లే రహిం సేయుదు, రర్థకామంబుల నంట కుందు
రప్రయత్నాగత మగువిషయసుఖంబు, గేస్తు పొందఁగ వచ్చుఁ గ్రియలవలన
సత్కులోత్పన్నులు శాస్త్రజ్ఞు లొనరించు, సత్క్రియ లజ్ఞులు సలుపఁ జాల

తే. రెవ్వఁడేనియు దంభము నివ్వటిల్లఁ, జేయుకర్మమునం జెడు నీయిలపయి
ధార్మికునకుఁదపముమించుకర్మ మొకఁడు, లేదుగేస్తు స్వధర్మమున్ రాదు విడువ.

క. నదులును నదములు సాగర, పదమునఁ జొరఁ బాఱునట్లు వసుధాస్థలిలోఁ
బొదలెడుసర్వాశ్రమములు, సదమలగార్హస్థ్యమంద సంస్థితి నొందున్. 460

వ. అని చెప్పిన జనకుం డప్పరాశరుం గని యిట్లనియె. 461

### వర్ణభేదవిచారకథనము.

తరు. ధరలోన వర్ణభేదము గల్గు టెట్లొ, దానిని విన నెంతుఁ దాపసవర్య!
పురుషున కుదయించుపుత్త్రుండు దానె, పొసఁగెడు ననుచు వాపోవు వేదంబు
లరయంగ బ్రహ్మకు నాదికాలమున, నై రంద అందున నగుదురు సములు
ధరణీసురుం డని తజ్జాతి నొకనిఁ, దద్దయు ననుటకుఁ దగ వేది చెపుమ. 462

తరు. అనినఁ బరాశరుం డనియె నీ వన్న, యట్లు తనకుఁ బుట్టినట్టిఁడు తానె
యని చెప్పు వేద మ ట్లయినఁ దపోమ, హాత్మ్య ములఁతి రైన నగు వర్ణ మెల్లె
పొసరెడు సుక్షేత్రమునను సుబీజ, మునఁ బుట్టినది పెంపుఁ బొందెడు నన్య
మున నన్యగతి మెయిఁ బుట్టినల్లైనఁ, బొలుపొంద దనిమనము తెలియఁ గలము.

వ. లోకంబుల సృజింప నెంచిన బ్రహ్మదేవుని ముఖభుజోరుపాదంబులనుండి ప్రజలు

పుట్టి రందు ముఖజులు బ్రాహ్మణులు బాహుజులు రాజు లూరుజులు వైశ్యు
లంఘ్రిజులు శూద్రు లని నాల్గువర్ణంబుల వారైరి వీరివలన నన్యోన్య
సంపర్కంబున ననులోమవిలోమజాతులై క్షత్తలు నతిరథులు నంబష్ఠులు
నుగ్రులు వైదేహకులు శ్వపాకులు పుల్కసులు స్తేనులు నిషాదులు సూతులు
మాగధులు నయోగులు కరణములు వ్రాత్యులు చండాలురు లోనగుసంకర
జాతు లుత్పన్నంబు లైన వనిన జనకుం డోమునివర్యా! యొక్కబ్రహ్మవలనఁ
బుట్టినవారికి గోత్రనానాత్వం బెట్లు గలిగె లోకంబున నిపు డిన్ని గోత్రంబు
లుండుటకుం గతం బేమి మఱియు సుయోనిసంభవుల కాక వియోనులందును
విజాతులందును బుట్టినవారు మహాత్మును లగుట యెట్టిది యెఱింగింపు
మనినఁ బరాశరుం డతని కి ట్లనియె. 464

తే. తపముచే భావితాత్ము లుదాత్తులైన
మునులపుట్టువు లెంచుట మనకుఁ దగదు
మౌను లెం దెందొ పుట్టించి సూనులఁ దమ
తపమునఁ గా వారలకు ఋషిత్వము నొసఁగిరి. 465

వ. ఇందులకుఁ దార్కాణంబుగా మున్ను నాపితామహుం డగువసిష్ఠుండును
ఋష్యశృంగుండును గశ్యపుండును వేదుండును దాండ్యుండును గృపుండును
గాంక్షీవత్కమఠాదులు నవక్రీతుండును ద్రోణుండును నాయువును మతం
గుఁడును దత్తుఁడును ద్రుమదుండును మాత్స్యుండును ననువీ రందఱుఁ దపో
బలంబుననే యుత్తమప్రకృతిం బొందిరి మఱియు దమంబుచేతను దపంబుచేతను
వేదవేత్తలై సుప్రతిష్ఠితులైరి మున్ను మూలగోత్రంబులు నాల్గు మాత్ర
మవ్వానికి నంగిరసుఁడు కాశ్యపుఁడు వసిష్ఠుఁడు భృగువు వీరు మూలపురుషు
లనంతరంబునఁ గర్మంబునంజేసి పెక్కునామధేయంబులఁ బెక్కుగోత్రంబు
లుత్పన్నంబు లైన వనిన జనకుండు వర్ణంబుల సామాన్యవిశేషధర్మంబు లెఱిం
గింపు మనినఁ బరాశరుం డి ట్లనియె. 466

సీ. వినుము విప్రునకు యాజనము ప్రతిగ్రహ, మధ్యాపనము క్షత్రియాన్వయునకు
రాష్ట్రప్రజాదిసంరక్షణంబును వైశ్య, వరునకు వాణిజ్యపాశుపాల్య
ములు కృషియును శూద్రముఖ్యునకుఁ గా ద్విజ, న్ములపరిచర్యయు న్ముఖ్యము లగు
ధర్మము లింక సాధారణధర్మముల్, తెలిపెద విను తేటతెల్లముగను
తే. ఆనృశంస్య మహింసయు నప్రమాద, సంవిభాగ మక్రోధము శ్రాద్ధకర్మ
మాతిథేయము సత్యము స్వాంగనాను, రాగసంతోషశౌచముల్ ప్రాణిరక్ష

తే. మఱియునిత్యానసూయయు మహితమైన, యాత్మవిజ్ఞానముతితిక్ష యనెడునివ్వి
తలఁప సాధారణము లగుధర్మము లిల, నెల్లవా రాచరింపనై యొసక మెసఁగు.

సీ. బ్రాహ్మణక్షత్రియవైశ్యవర్ణంబులు, మూఁడు ద్విజాతు లీమూవు రెల్ల
ధర్మము లొనరింపఁ దగి యుందు రొగి వీరు, తగనిధర్మంబునఁ దగిలి రేని
పతితు లౌదురు నిజవర్ణధర్మంబుల, నమరువా రుత్తమోత్తములు తలఁపఁ
బదజున కెప్పుడు పతితత్వ మది లేదు, విపులసంస్కారముల్ వెలయఁ బోవు
తే. వైదికాచార మతనికి లేదు వేద, మెఱిఁగిన ద్విజుండు ధర్మసమేతు శూద్రు
నుత్తమబ్రాహ్మణుఁగఁ జెప్పుచుందు నేను, జగమునకుఁ బ్రధానమగు వెల్గుఁగఁ దలంతు.
వ. హీనజాతులవారు కామక్రోధాదులఁ జయించి సజ్జనులవృత్తం బధిగమింప నెంచి మంత్రవిహీనంబుగా శాంతికపౌష్టికక్రియ లొనరించి యిహపరంబుల సుఖంతు రనిన జనకుండు మునీంద్రా! మానవుండు దూషితుం డగుటకు జాతియా? కర్మమా? కారణం బెఱింగింపు మనినఁ బరాశరుం డి ట్లనియె. 470
క. జాతియుఁ గర్మము ననునివి, భూతలమున దోషహేతువులు తలపోయఁ
జాతిని నీచుం డయ్యును, బాతకశీలుండు గానివాఁ డధికుఁ డగుఁ. 471
తే. జాతిచే నుత్తమత్వము సంగ్రహించి, నట్టివాఁడైన పాపము లాచరించి
దూషితుం డగుఁ గాన మర్త్యునకు జాతి, కన్నఁ గర్మప్రధానత నెన్న వచ్చు. 472
వ. అనుటయుఁ జనకుం డెట్టికర్మంబులు ధర్మయుక్తంబు లెట్టి వహింసాకరంబు లెఱింగింపు మనినఁ బరాశరుండు వెండియు. 473

సీ. మనుజుండు నిత్యాగ్నులను వీడి సంగపరిత్యాగ మొనరించి సత్యమైన
ముక్తిమార్గము మెట్టి రక్తిం బెడంబాసి, విగతజ్వరుం డయి వినయదమము
లను బూని కర్మములను విడనాడి జరామరణవిహీనమై మహితము
నైనపదం బంది యలరారుచుండెడు, శాశ్వతానందంబు సంధిలంగ
తే. మఱియు సర్వవర్ణంబులమానవులును, స్వస్వధర్మము నడుపుచు సత్యవంతు
లగు చధర్మము విడినవా రదుగు రేని, నాకముఱ చేతఁగొనినవారగుదు రెపుడు.
వ. అని పరాశరుండు మఱియును. 475

సీ. గుణహీనులం దేర్ప గురుపులుం దండ్రులు, సఖులునుం గాంతలు చాలరైన
వారు హితుల్ ప్రియవాదు లనన్యభక్తులు మాత్ర మగుదు రీకుతలమందుఁ
దండ్రియే పరదైవతము తల్లికంటె నెక్కుడుజ్ఞానలాభంబు గొప్ప దగుట
విజితేంద్రియార్థులై వెలయువారు పరంబు, నొందుదురు రణంబునందు శత్రు

తే. శరహతుం డయి కూలినక్షత్రవీరుఁ, డమర దుర్లభలోకము లందు శ్రాంతు
భీతు భ్రష్టాస్త్రుఁ బరికరవిరహితుని బ,రాఙ్ముఖుఁ రోగి ననిఁ జంపరాదెఱింగి.
క. పరికరయుక్తుఁడు తుల్యుం, డరి యుద్యతుఁ డగుచు నెదిరినప్పుడు వానిన్
దురమున నెదిర్చి పోరుట, పరఁగుఁ క్షత్రియున కనుచుఁ బలికిరి విజ్ఞుల్. 477
మ. తనకుం దుల్యునితోడఁ గాని మఱియుం ద న్నన్నిట న్మించునా
తనితోఁ గాని దురం బొనర్చి తెగుటల్ తర్కింప శ్రేయం బగుఁ
దనకుం దక్కువవాఁడు కాతరుఁడు హీనప్రాయుఁడుం బాపభా
జనుఁ డౌ వాని నెదిర్చి చచ్చినను దోషం బంట నౌ దుర్గతుల్. 478
ద్విపద. దిష్టాంతవశుఁ డయి తెగనున్న వాని, కష్టపాలైనను గావ లే డెవఁడు
ద్వేష్ట యగుచుఁ దన్నుఁ దెగడునాయుర్వి, శిష్టునెవ్వండు హింసింపఁజాలండు.

## హింసాహింసాస్వరూపనిరూపణము.

సీ. సలుపరా దెప్డు హింసాకార్యములు తన, యాయువు నిల్పఁ బరాయువులను
దీయరా దెందునే దేహంబు విడ నెంచు, పురుషు లుత్తమతీర్థములు చన నగు
నాయువు చెల్లినయప్పుడె మృతి యగుఁ, గారణాంతరములఁ గలుగుమృతికి
జన్మాంతరం బట్టిచందంబునం గల్గు, నద్యాత్మ వేత్త లౌనార్యజనులు
తే. స్నాయుమజ్జాస్థులం బురీషమునమూత్ర,మున నెసంగెడునదిచర్మముననుమూయఁ
బడినయది మేను జీవుఁడు వెడలినంత, జీర్ణమై భూతములయందుఁ జేరు ననిరి.
ఆ. మొదటిమేను విడిచి పోయినజీవుండు, కర్మగతులఁజేసి కష్టసుఖము
లంది పిదప దాని కనుగుణంబుగ జన్మ, మెత్తుచుండు సతత మివ్విధమున. 481
క. మరణము నొందినతోడన, ధరపై జీవుండు మరలఁ దాఁ బుట్టఁడు పు
ష్కరమందు మేఘ మట్టులు, తిరుగుచుఁదగుచోటుదొరకఁదెలిసి యటఁబడుఁ.
వ. అట్లుత్పన్నం బైనశరీరంబునందు నింద్రియంబు లగు నింద్రియంబులకంటె మనం
బును మనంబుకంటె నాత్మయు నుత్తమంబులు వివిధంబు లగుభూతజాతంబుల
జంగమంబులు శ్రేష్ఠంబు లందు ద్విపాత్తు లుత్తమంబు లందు ద్విజు లుత్తమో
త్తము లందుఁ బ్రజ్ఞావంతులు పరమోత్తములు వారిలో నాత్మజ్ఞానము గల
వారును వారిలో నహంకారశూన్యులును బరమోత్తమోత్తమంబు లిట్లు పుట్టిన
వన్నియుం గిట్టు ననుట నిశ్చయంబు. 483
సీ. నరులు గుణమ్ముల నశ్వరకర్మము, లొందుదు రర్థముఁ డుత్తరగతుఁ
డై నయప్పుడునుబుణ్యముఃహార్థమునయందుఁ, బుణ్యార్థమునమృతిపుణ్యాదంబు

క్లేశ మెవ్వరికి నే లేశంబు సేయక, సత్కర్మరతుఁడు స్వేచ్ఛామృతి కగు
నురి వెట్టుకొని విషం బూని యగ్నిం గాలి, చచ్చుట నీచంపుచా వనఁ బడుఁ

తే. బుణ్యకర్మముల్ చేసినపూరుషులకు, నిట్టిచావులు గలుగఁ బో వెపుడుఁ గాని
వారిప్రాణము లూర్ధ్వము దారివట్టి,సూర్యు భేదించుకొని పోవుఁ జూచుచుండ.

వ. సుకృతదుష్కృతంబు లొనర్చినమధ్యములు మధ్యమలోకంబునకును దుష్కృ
తంబు లొనర్చినవా రధోలోకంబునకును బోవుదురు మనుష్యున కజ్ఞానము
వంటిశత్రు వొండొక్కరుండు లేఁ డజ్ఞాని చేయరానిదారుణకర్మంబు లుండవు
గావున నట్టిశత్రువుం జయింప వలయు నన్న వృద్ధానుసేవచేఁ బ్రజ్ఞాశస్త్రముం
గూర్చుకొని దానం దాని ఛేదింప వలయు నని మఱియును. 485

చ. పురుషుఁడు ధర్మతత్పరత భూరితపం బొనరించి వేదముల్
నిరతము బ్రహ్మచారి యయి నేరిచి యజ్ఞము లాచరించి యుర్వ
ధరణి స్వవంశము న్నిలిపి దారసుతాదుల రోసి కాననాం
తరమున కేగి మోక్షము నెదం దలపోసి మెలంగ నొప్పెడున్. 486

క. మానవయోనిం బుట్టిన, తాను సుకర్మములు చేసి తగిలి శుభంబుల్
మానొంద వచ్చుఁ గావున, మానవుఁ డగు టొప్పు సూవె మాలం దైనన్.

ఆ. మర్త్యయోనినుండి మనము భ్రష్టులము గాకుండ ధర్మకర్మకాండములను
నాచరించుపనులయందుఁ బ్రయత్నము, మానకుండవలయు మనుజనాథ. 488

క. ఏనరుఁడు దుర్లభం బగు, మానుష్యము నొంది దాని మన్నింపనివాఁ
డై నింద సేయునాతఁడు, కాననివాఁ డగుచుఁ జెడును గామహతుం డై. 489

ఆ. ఎవ్వఁడు ప్రాణికోటి నెంతయుం బ్రేముడి
నరసి సాంత్వనంబు లాడి యన్న
దుండ యగుచు సుఖము దుఃఖము సమముగాఁ
దలఁచువాఁడు పరముఁ గలిగి కొనును. 490

వ. మఱియు నైమిశారణ్యాదిపుణ్యక్షేత్రంబులకును సరస్వత్యాదిపుణ్యతీర్థంబు
లకును జని స్నానదానాదు లాచరించుచుఁ దపంబు చేసి నిష్కల్మషశరీరులు
గావలయు గృహంబులం జచ్చినవారిశరీరంబులు శ్మశానంబున కీడువంబడి
దహింపంబడు నిష్టులు పౌష్టికములు యజనయాజనములు దానములు లోనగు
పుణ్యకర్మంబులు శ్రేయం బభిలషించువాఁడు చేయం దగు ధర్మశాస్త్రములు
వేదవేదాంగములు నరులశ్రేయంబునకే పుట్టిన వనిన మిథిలాధినాథుండు

పరాశరుం గాంచి శ్రేయ మెద్ది గతి యెద్ది యెట్టికార్యంబు వినాశనరహితం
బెందుఁ బోయినవాఁడు నివర్తింపఁ డెఱింగింపు మనినఁ బరాశరుండు. 491

### శ్రేయోదాయకప్రకారకథనము.

సీ. విను మసంగము శ్రేయమునకు మూలము వర, జ్ఞాన ముత్తమగతిసాధనంబు
పాత్రదానము సత్తపమును నశింప వ, ధర్మపాశముఁ ద్రెంచి ధర్మరక్తుఁ
డైన నభయదాన మాచరించిన సిద్ధి, యమరు గోశతసహస్రములు దాన
మిడినవానికి భయం బెన్నఁడుం గలుగదు, విషయమధ్యమున వివేకి యుండి
తే. విషయసక్తుండు గాకుండు విజ్ఞుఁ డైన, వానిఁ దామరపాఁకును వారి యట్లు
ధర్మమంట దప్రాజ్ఞుని దారువులకు, లక్కయ ట్లంటుఁ బాపము లక్కజముగ.

వ. కర్త ధర్మాధర్మఫలకాలంబు వచ్చినప్పుడు తా దనకనుభవించు జ్ఞాను లెప్పుడుం గర్మంబునం జిక్కకొన రింద్రియార్థంబులం దగుల్కొనినవారు సుకృత దుష్కృతభేదం బెఱుంగఁ జాలక విషయాసక్తిం దగిలి భయం బందుదురు రాగహీనులై క్రోధాదులం జయించినవారు విషయప్రవర్తకు లైనను వారిం బాపంబు లంటఁ బోవు సూర్యకాంతమణి సూర్యకాంతుల నాకర్షించినట్లు యోగి సమాధిచే యోగము నాకర్షించు నని మఱియు. 493

క. నూవులకు నిష్టగంధము, పూవులతోఁ గూడికొనుటఁ బొసఁగినమాడ్కిన్
భావింప భావితాత్ములతో, వాసము సత్త్వవృద్ధిఁ దొడరఁగఁ జేయున్. 494
మ. త్రిదివంబుం గనఁ బోఁ దలంచునరుఁ డెంతే నింద్రియార్థంబులన్
మదిఁ గావింపక దారపుత్రులను సంపత్సంచయం బుల్లస
త్పదమున్ వాహనవారణాదులను సత్కార్యంబులన్ సర్వమున్
వదలున్ భూతిక మెల్ల వానికిఁ దృణప్రాయంబుగాఁ దోఁచెడిన్. 495
ఆ. విషయసక్తుఁ డగుచు విహిత మెఱుంగమి, నాత్మహితము గానన ట్టిమనుజుఁ
డామిషాశ చేప యట్టులు సర్వభావముల కెపుడు చిక్కి బడలుపడును. 496
సీ. ధర్మకాలం బొందు తలఁప నుండదు మిత్తి, నరు నురకరయుచున్ మరలఁ బోదు
కాన నెప్డును ధర్మకార్యం బొనర్చుట, శ్రేయ ముత్తమగతిఁ జెందు యోగి
యొకదానివెనువెంట నొకటిగాఁ జావుపుట్టువు లుండు మోక్షధర్మవు లెఱుఁగని
జనుఁడు విషయబద్ధుఁడును సంసృతింజిక్కుకొను జ్ఞానియిందునందును సుఖించుఁ
తే. దమ్మితూఁడున కంటుకర్దమ మొకింత, లోన విడి పోవునట్లు గా మానవాత్మ
మానసమ్ము నొకింతలోఁ దాను వీడు, శక్తి గల దగు నెఱుఁగు మోజనకరాజ,

సీ. మనసు ప్రేరేచు నాత్మను మున్ను యోగంబు, దగిలించుకొన నాత్మ దాని నడఁచు
కొనుఁ దనలో నాత్మకుం యోగసిద్ధిగా, నది తన్నుఁ బరమాత్మ యని తెలియును
జ్ఞానవంతునియాత్మ తాను స్వర్గంబున, నుత్తమగతి నొంది యొప్పుచుండు
నవివేకి యగువానియాత్మ యధోగతి, కగుచుఁ దిర్యక్కులయందుఁ బుట్టుఁ
తే. దప్తమృద్భాండమునయందు ద్రవపదార్థ, మలరి చెడకుండునటు తపఃకలిత మైన
మేను విషయసుఖంబును బైన బ్రహ్మ, లోకసుఖమును బొందనై ప్రాకట మగు.
వ. విషయాసక్తునకు ముక్తిలేదు భోగంబులం ద్యజించినవానికిఁ బరం బరచేతి
దగు శిశ్నోదరపరాయణుండు మంచుచేఁ గ్రస్తుంబడినవాఁడుం బలె నింద్రియార్థ
సమాక్రాంతుండై యుండియుం దుదకు జాత్యంధుండు దారి నెఱుంగనట్లు
పరమపదం బెఱుంగఁ జాలకుండు వినుము. 499
తే. తాను బెట్టినదానికిఁ దగినలాభ, మొడబేహారి పొందెడునోజ జనుఁడు
తనపొనర్చినకర్మంబుదారికిఁ దగు, ఫలము నొందుచు నుండు నవశ్యముగను.
చ. నిడుపడు గాలినిం దినెడు నేర్పునఁ బేర్పడి రేఁబవళ్లు నాఁ
బడియెడునిట్టికాలమునఁ బ్రస్తుతి కెక్కి జరాస్వరూప మే
ర్పడఁ జనుదెంచి మృత్యువు నిరంతరముం గ్రసియించుచుండెడిం
బుడమి జనించునీసకలభూతముల న్విగతానుకంప మై. 501
ఉ. పండినఁ గూరుచుండినను బాటఁ జరించుచునుండినం గ్రియా
కాండములందు నుండినను గర్మము లెట్టివి యైనఁ గర్త నొం
డొండ సమాగతంబు లయి యొందుచు నుండెడుఁ గాని యన్యముల్
కొండొకనాఁటికిం గలియఁ గూడఁగ రా వని నమ్ము నెమ్మదిం. 502
తే. నావికుఁడు నావ వలసియున్నం సముద్రమందు ముంచియుఁ జేఁద్రాట నంతలోన
బైకిఁ దీసినగతి మది పడలువడిన, జీవునిం యోగమునఁ బైకి లేవఁ దీయు.
క. నదులు సముద్రమునందుం, గదియుచుఁ దద్రూప మొందుకరణి మనం బ
య్యది యోగముతోఁ గూడిన, యదనున మూలప్రకృతిసమాశ్రయ మందుం.
తే. బహువిధస్నేహపాశసంబద్ధు లైన, మనుజు లజ్ఞానమగ్నులై మహితలమున
సలిలసంపరివృత మైనసైకతగృహ, మట్టులు వినాశనం బందు నండ్రు బుధులు.
వ. ఈదేహం బొకగేహం బనియు శౌచం బొకతీర్థం బనియు నెంచి జ్ఞానమార్గం
బునం బ్రవర్తించుదేహి యిహపరంబుల సుఖంచు సంకల్పసంభవం బగుమిత్ర
వర్గంబును గారణాత్మకం బగుజ్ఞాతివర్గంబును భార్యయుఁ బుత్త్రులును దను

తమయర్థంబు లనుభవించుచుందురు దానధర్మంబులు తప్పఁ దల్లిదండ్రులు లోనగువా రెవ్వరును బరలోకసహాయులు గాఁ జాలరు గాని యష్టాపదపద స్థానంబున దక్షసూత్రంబువలె నుపయోగింతు రేకాగ్రచిత్తుఁ డగుధీరుని సూర్యునిఁ గిరణంబువలె సిరులు వీడం బోవు మఱియు మృత్యువు మాత రిశ్వుండు దారుచూర్ణంబునుంబలెఁ బ్రాణుల నెగుఱం గొట్టుచుండు మాన వుఁడు పురాకృతంబునన కులగౌరవంబును ధనధాన్యపశ్వాదికంబును బొందు చుండు నని చెప్పిన జనకుండు పరమానందంబు నొందె ననిన యుధిష్ఠిరుండు సత్యము దమము క్షమ ప్రజ్ఞ యనువీని విద్వాంసులు ప్రశంసించుచుందు రిందు నీయభిప్రాయంబు విన వలతుం జెప్పు మని కురుపితామహు నడిగెనని చెప్పు టయు. 506

ఆశ్వాసాంతము.

శా. దేవబ్రాహ్మణభక్తితత్పరుఁడు సద్విద్యాప్రియుం డీశ్వరీ
సేవాసక్తహృదంబుజుండు సుకవిశ్రేష్ఠార్పితార్థుండు రా
జీవాక్షాంఘ్రిసరోజపూజకుఁడు శ్రీశ్రీచంద్రమౌళీశ్వరుం
డీవిశ్వంభర సర్వసౌఖ్యములతో నెల్లప్డు వర్ధిల్లుతన్. 507

గద్యము.

ఇది శ్రీమదఘునాతనోభయకవిమిత్ర, వేంకటయజ్వాగ్రపుత్ర,
సమారాధితవిబుధరాజ, శ్రీపాదకృష్ణమూర్తికవిరాజ,
ప్రణీతం బయిన శ్రీకృష్ణభారతంబునందు
శాంతిపర్వంబున సప్తమాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ



శ్రీ

బాలాత్రిపురసుందర్యై నమః.

# శ్రీకృష్ణభారతము

## శాంతిపర్వము - అష్టమాశ్వాసము.



మద్వేదవ్యాసమ
హాముని సంకలితభారతామ్నాయకథా
స్తోమస్తుత ! సర్వజగ
ద్ధామా ! రక్షింపవయ్య దైవలలామా. 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె నట్లడిగినధర్మనందనుం దిలకించి మందాకినీనందనుం డీయర్థంబున హంససాధ్యసంవాదం బనునితిహాసంబు గలదు దానిం జెప్పెద విను మని యిట్లనియె. 2

### హంససాధ్యసంవాదప్రకారము.

ఆ. అజుండు స్వర్ణహంస మై యొకకాలము, నందు ముజ్జగముల నరయుపొంతం
దిరుగుచొక్కచోటదిగె సాధ్యలోకకొంత, మందికూడియున్న మాడ్కిం దెలిసి.

వ. అట్లు తమచెంత నావిర్భవించినహంసరాజమ్ముం గాంచి సాధ్యు లిట్లనిరి. 4

సీ. పక్షీంద్ర ! మేము దేవతలము సాధ్యుల, మడుగుచుంటిమి సంశయం బొకండు
పొసంగం జెప్పుము మాకు మోక్షధర్మంబులు,భావంబులును నీవు ప్రాజ్ఞుండ వని
మోక్షవేత్తవు నని పోలుపుగా వాదింతు, వని సాధుశబ్దము దనరెడు నని
వినియుంటిమి ద్విజత్వమును మేటి యందువో,యెందు నీమది రమియించునొక్కో

తే. కార్యములలోన నేది యోగ్యం బటంచు,నెంచుచుందువో యెది చేసి యెల్లబంధ
ములను బురుషుండు విడుచునో తెలియ మాకు, నానతి మ్మన నిట్లను హంసరాజు.

క. వినుండ దమృతాశనులారా !, మనమరికట్టుటయు సత్యమార్గము తపముం

బొనరించుట దమ మనునివి, ఘనకార్యము లనుచుఁ దెలియఁ గాఁ దగు నాదిన్.

సీ. వివిధహృద్గ్రంథుల విడిచి ప్రియాప్రియ,ముల వశంబునయందు నిలుపుకొనియు
నొరులఁ బీడింపక దురితము లాడక, హీనునుండి పరిగ్రహింపఁ బోక
పరుల నుద్వేషించుపలుకు పలుక కొడ్లు, తన్ను వేధించినఁ దలఁక కెవఁడు
కొట్టినఁ దిట్టినం గోపింపక యసూయ, తలసూప నీక హృదయమునందు

తే. నెవఁడు వర్తించునో వాఁడు భువి సమస్త,పుణ్యకర్మము లొనరించి పూతదేహుఁ
డై మహాతప మొనరించునట్టివాఁడు,పొందుసుకృతంబుఁబొం దెడుఁబూజ్యులార.

వ. వినుఁడు నే నొరులు తిట్టినం దిట్టక కొట్టినం గొట్టక శాంతుండ నగుదు శాంతి యుత్తమం బని పెద్ద లందురు సత్యము నార్జవము నానృశంస్యము నుత్తమోత్తమంబులు మఱియు వేదముల కుపనిషత్తు సత్యము సత్యమున కుపనిషత్తు దమము దమమున కుపనిషత్తు మోక్ష మిట్లు సర్వశాస్త్రసిద్ధాంతము వాగ్వేగ మనోవేగ క్రోధవేగవిధిత్సావేగోదరవేగోపస్థవేగములు లేనివాఁడు బ్రాహ్మణుండు నాఁబడు నొరులు నిందింప నిందింపనివాఁడు వానిం దహించినట్టిం డయి వానిసుకృతంబునుం గైకొను నట్టివాని దేవతలును మెత్తురు నే నెల్లనాఁడు సజ్జనుల సేవింతు నాకుఁ గోపంబు లేదు నే నొరుల నాశ్రయింప నే నమృతంబునకు దమము ద్వారం బని యెఱుంగుదు నేను మీ కిపుడు మహారహస్యము నెఱింగించు చుంటిమానవ జన్మమునుమించినజన్మంబు లేదనిమీ రెఱుంగుఁడు. 8

తే. జలధరమునుండి విడివడుచంద్రు నట్లు, పాపముననుండి విడివడి పండితుండు
ధైర్యమును బూనివిరజుఁడై తనరు నేని,సిద్ధి గాంచెదుననిబుధుల్ చెప్పుచుంద్రు.

క. జనులను దెగడెడువా రెవ్వనిమంచియుఁ జెడ్డ చెప్ప వలతులు గారో
ఘనుఁ డతఁడు తపస్త్యాగము, లను శ్రుతులం బొంద నొ ఫలంబుల నొందున్.

క. తనుఁ బొగడుకొనుట పరులను, ననయం బవమానదృష్టి నరయుట ప్రాజ్ఞుం
డొనరింప రాదు కోపం,బునఁ జేసినయెట్టికర్మమును వ్యర్థ మగున్. 11

వ. వేల్పులారా! యుపస్థోదరహస్తవాక్కులు నాలుగును ద్వారంబులు వానిం గాపాడుకొనువాఁడు సద్గతిం బడయు సత్యము దమము నార్జవము నానృశంస్యము ధృతి తితిక్ష యనుసద్గుణంబులం గలిగి స్వాధ్యాయపరుం డైనవాఁ డున్నతగతిం బొందు లోకంబున సత్యంబునకు మించినది మఱియొక్కండు లేదని గ్రహించితి నది స్వర్గంబునకు సోపానమార్గంబు పారావారంబునకు నావ

యనందగు మనుజుం డెట్టివాని నాశ్రయించిన నట్టిగుణంబు గలండై పుట్టు దేవత లెప్పుడును సాధువాదంబు గావింతురు గాని మానుషవిషయంబులం జూడ నొల్లరు వివిధవిషయంబు లెఱింగినవారికిఁ జంద్రవాయువులు పోలం జాలరు సన్మార్గవర్తి యగుపురుషుని దేవతలు ప్రేముడింతురు శిశ్నోదరనిరతులై వాక్పారుష్యముం గలవారి దేవతలు గర్హింతురుహీనసత్త్వులు సర్వభక్షులు దుష్కర్ములగువారు వేల్పులఁ సంతోషపెట్టఁ జాలరు సత్యవ్రతులు కృతజ్ఞులు ధర్మరతులు నగువారునిర్జరులంగూడిసుఖంబుందురనిపలికినంత సాధ్యు లిట్లనిరి 12

క. లోకం బేమిట నావృత, మేకతనం జనుఁడు పొదలఁ డెందు నమిత్రుల్
వాకొనక విడుచు నేగతిఁ, జేకూరదొ స్వర్గసుఖము చెప్పుము మాకున్. 13

వ అనిన మరాళం బి ట్లనియె 14

ఆ. ఆవృతంబు లోక మజ్ఞానమున మత్సరమునఁ జేసి పొదల రాఁడు జనుఁడు
విడుచులోభగుణము వడి మిత్రునైనను, సంగమునను స్వర్గసౌఖ్య మరుదు.

వ. అనిన సాధ్యులు మఱియును. 16

క. ఎవఁ డొక్కండ రమించెడు, నెవఁ డొక్కఁడ పదుగురందు నెసకం బెసఁగున్
భువి దుర్బలుండ బలియై, యెవఁ డొప్పెడుఁ గలహ మెంచఁ డెవ్వఁడు చెపుమా.

వ. అనిన హంస యి ట్లనియె. 18

క. ప్రాజ్ఞుఁడు రమించు నొక్కఁడు, ప్రాజ్ఞుఁడు బహుజనులలోనఁ బ్రజ్ఞ వహించున్
బ్రాజ్ఞుఁడు బలవంతుం డగుఁ, బ్రాజ్ఞుఁడు కలహమునఁ గాలు ద్రవ్వం డెపుడున్.

వ. అని చెప్పిన సాధ్యులు. 20

క. దేవత్వ మెట్లు విప్రున, కావిర్భావంబు నొందు నతిసాధుత్వం
బేవగ నగునో యసాధుత, యేవిధమో మానుషత్వ మెందున నగునో. 21

వ. చెప్పు మనిన హంసం బి ట్లనియె. 22

తే. ధరణి దేవత్వ మమరుస్వాధ్యాయముననుఁ,వ్రతమునం జేసి సాధుత్వమతికి నొనును
దూఱులాడుటచే నసాధుత్వ మెసఁగు,మృత్యువున మానవత్వము మేదిని నగు.

వ. ఇది హంససాధ్యసంవాదం బిందున శరీరము కర్మమూల మనియు సద్భావము సత్య మనియుం దెలియుచున్న దనిన ధర్మనందనుండు శాంతనవా! సాంఖ్యయోగంబులవిశేషంబు వినవలతు ననిన నతం డి ట్లనియె. 24

భీష్ముఁడు ధర్మజునకు యోగతంత్రప్రకారము చెప్పుట.

సీ. సాంఖ్యులు సాంఖ్యప్రశంసయు యోగులు, యోగప్రశంసయు నొనరఁ జేసి
తమతమపక్షముల్ దనరఁ గారణములు, పలుకుచుండెదరు యోగులు తలంప
నెట్లు ముక్తుఁ డగు ననీశ్వరవాది యం, డ్రాసాంఖ్యులో విషయములరక్తి
విడిచి గతు లెఱింగి యొడలు దెగినమీఁద, మోక్షంబు గల దని పూని యండ్రు
తే. మతము లీరెండు శిష్టసమ్మతము లగుట, మనకు సమ్మతములు వాని ననువు మీఱ
ననుసరించినచోఁ బరమార్థగతులు, గలుగఁ గల వని పెద్దలు పలుకుచుండ్రు

వ. ఆరెండింటియందును శౌచము తపము భూతదయ వ్రతధారణమును దుల్య
ధర్మంబు నొంది యుండు ననిన యుధిష్ఠిరుం డివి యన్నియు ఫలమ్మునఁ దుల్యం
బై యున్నయప్పు డవి భిన్నమార్గంబు లగుటకుం గతం బేమి యనిన దేవ
వ్రతుం డి ట్లనియె. 26

సీ. మోహంబు రాగంబు స్నేహంబు కామంబు, క్రోధంబు ననునైదు ఘోరపాప
ములయోగబలమునఁ దొలఁగించుకొని యోగి, వలద్రెంచుకొనిచేఁపజలములఁబడు
పగిది బంధములను వదలించుకొని ముక్తిఁ, బొందుదురు బలంబు పొదల కున్న
వలఁ జిక్కినమృగంబు వలెఁ గర్మబద్ధుఁడై, యంతటిలో నశియించి పోవు
తే. నల్ప మగువహ్ని స్థూలము లైనయింధనములలోఁ బడి చల్లాఱు క్రమమున బల
హీనుఁడై యోగి యోగముం బూనికొనియు,సంతరింపఁగఁ జాలక సన్నగించు.

ఉ. యోగబలంబు గల్గి ప్రభ నొప్పెడుయోగి బలిష్ఠమై సమి
ద్యోగము గల్గి వాతహతితో నలరారెడునగ్ని లోకముల్
వీఁగక కాల్చిపుచ్చునటు వెల్గుచుఁ దేజముతోడ నంతకా
లాగతభాస్కరుం డన మహాప్రతిభం గొని యొప్పు నెప్పుడున్. 28

మ. బలహీనుం డగువాఁడు వెల్లి బడి చేవం దక్కి పోవున్ మదా
వళ మేటం బడి యించుకైన వడికిన్ వాలంగఁ బో దట్లు దు
ర్బలుఁడై యోగి నశించు యోగబల మొప్పం గ్రాలు యోగీశ్వరుం
డలఘుప్రజ్ఞ మెయిన్ దురింద్రియగతిన్ హత్తంగఁ బోఁ డెత్తఱిన్. 29

వ. యోగబలంబు గలమానవుం డొండ్ల కవశుండై ఋషులందును బ్రజాపతులం
దును దేవతలందును మహాభూతంబులందును బ్రవేశింపఁ గలం డమితతేజుం
డగునాతనిఁ గ్రుద్ధుం డగుయముండును భీమవిక్రముం డగుమృత్యువును గాని
శాసింపం జాలరు యోగి తనయోగబలంబున బహుసహస్రంబు లగుదేహంబుల
సృజించి తా నందుఁ జొచ్చి భూతలంబెల్లఁ దిరిగి రాఁ గలం డతం డొక్కప్పుడు

విషయాసక్తుం డయ్యో నేని మరల నుగ్రతపంబు గావించి సూర్యుండు తేజం
బునుం బలె విషయంబుల సంక్షేపించి బంధవిముక్తుం డై ప్రభవిష్ణుత్వంబు
నొందఁ గలం డివి యోగఫలంబు లింక సూక్ష్మఫలంబులును సమాధిధారణా
నిదర్శనంబులునుం జెప్పెద విను మని మఱియును. 30

క. విలుకాఁడు జాగరూకత, గలఁడై లక్ష్యంబు నేయుకరణిన్ నిష్ఠా
కలితుఁ డగుయోగి మోక్షము, చలనం బిసుమంత లేనిచక్కిం బొందున్. 31

మ. పుడమిన్ మర్త్యుఁడు తైలపూర్ణ మగుచుం బోల్పొందుపాత్రంబు పై
నిడికొంచున్ జలనంబు లేనిమదితో నేరీతి మెట్లెక్కునో
కడిమిన్ నిర్మలుఁ డైనయోగి తనయోగంబందు యుక్తాత్ముఁడై
కడకన్ భాస్కరునట్లు నిర్మలమతిన్ గన్పట్టు నెప్పట్టునన్. 32

చ. జలనిధిఁ గర్ణధారుఁ డతిచంచల మై చనునావ నేర్పుమై
నిలువఁగఁ బట్టి శీఘ్రగతినిం గలిగించుచు నొడ్డుఁ జేర్చున
ట్టులు వరయోగి యోగము గడుంగడు నాత్మసమాధిఁ జేరఁగాఁ
జలిపి సుదుర్గమం బయినస్థానము నొందు నొడల్ దెగం బయిన్. 33

తే. సారథి సదశ్వములఁ బూన్చి జాగరూకుఁ, డగుచు రథికుని నిష్టదేశగతుఁ జేయు
నట్లు ధారణాయుక్తుఁడై యలరుయోగి, శుద్ధపదమందు లక్ష్య మాశుగమురీతి.

వ. మహావ్రతసమాహితుం డగుయోగి జీవాత్మను నాభి కంఠ శీర్ష హృదయ
వక్షః పార్శ్వద్వయ దృష్టి శ్రవణ ఘ్రాణము లనుస్థానంబులం గలయాత్మలోఁ
గూర్చి శుభాశుభకర్మంబు లెల్ల దగ్ధంబు గావించి యోగబలంబున ముక్తిం
బొందు ననిన యుధిష్ఠిరుండు యోగి యెట్టియాహారంబులం గ్రహించి వేనిం
జయించి బలంబు నొందునో తెలుపు మనిన భీష్ముం డి ట్లనియె. 35

సీ. విడిచి స్నేహపదార్థవిసరంబు లన్నియు, నూకలున్ మఱియుఁ బిణ్యాకములును
రూక్షయావకమును భక్షించుచున్ యోగి, బలము గలాఁడయి పరిఢవిల్లు
వారపక్షర్తుసంవత్సరంబు లొక్కొక్క, పరి నీళ్లు గలసినపాలు మాత్ర
గ్రోలుచువచ్చినన్ గొన బొందుయోగము,పలల మంటకయున్న బలము హెచ్చు

తే. వర్ష మూష్ణంబు శీతంబు భయము క్రోధ
కామశోకములున్ శ్వాసకమును విషయ
ములు నరతి తృష్ణయును స్పర్శమునును నిద్ర
తంద్రయు జయించి యోగులు తనరుచుంద్రు. 36

వ. ఇది బ్రహ్మజ్ఞానసంపన్నులమార్గంబ కాని దుర్గమం బీమార్గంబున నెవ్వండో కాని సామాన్యులు వోఁజాలరు బహుసర్పసరీసృపంబును సంవృతంబును బహులకంటకాకీర్ణంబును బాషాణప్రాయంబును దోయహీనంబును దావదగ్ధమహీరుహంబునుదస్కరావృతంబును దుర్గమంబును భోజనపదార్థశూన్యంబును ఘోరదర్శనంబును నగునరణ్యమార్గంబు వోలె నీయోగమార్గంబు యోగికిం దాఁట దుర్లభంబు గావున జాగరూకుండై మెలంగి కృతకృత్యుండు గా నగు సునిశితం బగుక్షురధార నైన నిలువ వచ్చుం గాని యీయోగమునఁ జలింప కుండుట కష్టతరము కర్ణధారవిరహితం బగునావ గమ్యస్థానమును బొంద నట్లు ధారణ లేనియోగి యుత్తమగతిం బొందఁ జాలండు ధారణాశక్తి గల యోగి జననమరణాదుల౯ విడనాడి శాశ్వతానందసౌఖ్య మొందు నిట్లు నానాశాస్త్రంబుల నిష్పన్నంబును యోగములం దుదాహృతంబును దీని ఫలంబు ద్విజాతులకుం దెలియ వచ్చు నాఫలంబు బ్రహ్మసాయుజ్యం బింతియ కాక యోగి యగువాఁడు బ్రహ్మవిష్ణుమహేశ్వరభవధర్మషడాననులను మహానుభావు లగుబ్రహ్మపుత్రులను సత్వరజస్తమోగుణంబులను శుద్ధ మగు పరాప్రకృతిని వరుణపత్ని యగుసిద్ధిదేవిని నానావిధతేజస్సులను దారాధిపుని విశ్వేదేవులను నురగులను బితృదేవతలను సమస్తశైలంబులను సాగరంబులను సవనంబులను మేఘంబులను నాగంబులను నగంబులను దిక్కులను యక్షగంధర్వసంఘంబులను జొచ్చి మహామహుం డగుయోగి తనయోగప్రభావంబున నింతలోనన ముక్తుండు కాఁగలండు నారాయణస్వరూపుం డగుయోగి సర్వమర్త్యుల నధఃకరించి వెలుంగుచుండు నని చెప్పిన నవ్వూరుకులోత్తముండు వెండియు. 37

భీష్ముఁడు ధర్మజునకు సాంఖ్యస్వరూపనిరూపణము సేయుట.

తే. గురువు శిష్యుల కెఱిఁగించుకరణినాకుఁ, గరుణతో యోగమార్గముక్రమము దెల్లఁ
దెలిపితింకిటసాంఖ్యంబు తెఱఁగెఱుంగ, నభిలషించితి దయఁజూడు మనఘచరిత.

వ. అని యడిగిన విదితాత్ము లగుసాంఖ్యులమతం బెఱింగించెద విను మని మఱియును. 39

సీ. ఈసాంఖ్యమతము మునీశ్వరసదృశు లౌ, కపిలాదితాపసాగ్రణులవలన
గణుతింపఁ బడినది గనరావు దోషము, లందు గుణంబులే యతిశయిల్లు
జ్ఞానంబునం జేసి సాంఖ్యులు విషయముల్, పాపయుక్తములుగాఁ బరిగణించి

యక్ష రాక్షసపిశాచాసురమనుజగంధర్వోరగాదుల సర్వవిషయ
తే. ముల నెఱిఁగి ప్రజాపతులయు మునులయుఁ బర
మేష్ఠియు విశేషము లెఱింగి మేదినీజ
నములయాయుఃప్రమాణముల్ శ్రమసుఖములు
స్వర్గనరకాదులు నెఱింగి వఱలుచుండ్రు. 40

వ. మఱియు వారు వేదవాదములందును జ్ఞానయోగంబునందును యోగంబునందును సాంఖ్యజ్ఞానంబునందును గలగుణదోషంబు లెఱింగియు దశగుణంబు సత్త్వంబు నవగుణంబు రజంబు నష్టగుణంబు తమంబు సప్తగుణంబు బుద్ధి షడ్గుణంబు మనంబు పంచగుణంబు నభంబు మఱియును బుద్ధి చతుర్గుణంబు తమము త్రిగుణంబు రజము ద్విగుణంబు సత్త్వ మేకగుణంబు ననియు నెఱింగి ప్రలయమార్గంబునుం దెలిసికొని జ్ఞానవిజ్ఞానసంపన్నులై శుభమూర్తులై సుసూక్ష్మపరమాణువు లాకసంబుం బలె మోక్షంబు నొందుచున్నారు మఱియు దృష్టి రూపంబునందును ఘ్రాణము గంధమునందును శ్రోత్రము శబ్దమునందును జిహ్వ రసంబునందును దేహము స్పర్శమందును వాయువు నభంబునందును మోహము తమంబునందును లోభ మర్థంబునందును సమాశ్రయించి యుండు విష్ణువు గమనశక్తిని శక్రుఁడు బలమును గలిగింతురు కోష్ఠంబున నగ్ని ప్రజ్వలించును భూమి జలంబుల సక్తం బగు జల మగ్ని నగ్ని వాయువును వాయు వాకాశమును నాకాశము మహత్తును మహత్తు బుద్ధిని బుద్ధి తమంబును దమంబు రజంబును రజంబు సత్త్వంబును సత్త్వం బాత్మ నాత్మ నారాయణుం డగునీశ్వరు నాశ్రయించి యుండు నీశ్వరుండు మోక్షంబును సంబంధించు మోక్ష మెట్టిసంబంధంబును లేకయుండు ననియుం దెలిసికొని షోడశగుణాత్మకం బగుశరీరంబు సత్త్వాత్మకంబు గాను దేహగతం బగునాత్మ పాపవిరహితంబు గాను దెలుపుదురు విషయాసక్తులకర్మవిధంబును నాత్మసంశ్రితంబు లగునింద్రియార్థంబులును శ్రుతిపూర్వకంబును దుర్లభంబు నగుమోక్షవిధంబును బ్రాణాపానవ్యానోదానము లనువాయువులస్థితియును బ్రవహం బనునధోగతవాయుప్రకారంబును సప్తవాయుప్రచారంబును బ్రజాపతులను ఋషులను నానావిధధర్మమార్గంబులను సప్తర్షులను రాజర్షులను దేవర్షులను బ్రహ్మర్షులను సాంఖ్యు లెఱుంగుదురు వారు పెద్దకాలంబున నైశ్వర్యంబు దొలంగినవిధంబును మహాభూతసంఘవినాశనంబును బాపకర్ముల కగుదుర్గతులును యమక్ష

యంబున వైతరణిం బడువారిదుఃఖంబులును బ్రాణులు నానాయోనుల జనించి పడుపాటులును శోణితోదకభాజనంబును శ్లేష్మమూత్రపురీషపరివృతంబును దీవ్రగంధసమన్వితంబును మజ్జాస్నాయుపరిగ్రహంబును శిరాశతసమాకీర్ణంబును నగునవద్వారపురంబున జీవుండు గొట్టుమిట్లాడుటయు నెఱుంగుదుర మఱియు సాత్వికరాజసతామసప్రవర్తనంబును జంద్రసూర్యగ్రహణంబులును నక్షత్రపతనంబును ద్వంద్వవిప్రయోగంబును భూతంబు లొండొంటి భక్షించుటయు బాల్యంబునాఁటియజ్ఞానంబును దేహనాశనంబు నొకానొకని కగుమోక్షంబును గతాసువులకుం గల్గుశుభదేహంబులవిధంబును బ్రహ్మఘ్నులు పతితులు సురాపులు దుర్బ్రాహ్మణులు గురుదారప్రసక్తులు లోనగువారు పొందుదుర్గతులును దల్లిదండ్రుల గురులం బూజింపనివారును దిర్యగ్యోనియందు జనించినవారును బొందుగతులును ఋతుపర్యయంబును వర్షమాసపక్షదివసాదిక్షయంబును జంద్రవృద్ధిక్షయంబులును యుగాదిక్షయంబులును నదీశైలక్షయంబులును వర్ణక్షయంబును జన్మజరామృత్యు దుఃఖంబులును మఱియు నానావిధదేహదుఃఖంబులును వా రెఱుంగుదురనిన ధర్మనందనుండు గంగానందనుం దిలకించి మనుష్యులకు స్వగాత్రోద్భవదోషంబు లెట్టివి చెప్పుమనిన నతం డతని కిట్లనియె. 41

అత్మ పరమపదంబు ప్రాపించెడుప్రకారము.

సీ. పండితోత్తమునకుఁ బంచదోషంబు లైసఁగు నని కపిలాదిసాంఖ్యు లనిరి
వినుము చెప్పెదఁ గామమును గ్రోధమును భయ,మును నిద్ర శ్వాసమునన్ఁగనైదు
శాంతిచేఁ గ్రోధము సంకల్పవర్జనం,బునఁ గామమును సత్వమునను నిద్ర
జాగరూకతఁ జేసి సాధ్వసంబును మితా,హారంబుచే శ్వాస మడఁగఁ జేసి
తే. గుణశతంబులచేతను గుణముల మఱి, దోషశతములచేతను దోషములను
హేతుశతములచేతను హేతువులను, తెలిసికొనుచుండ్రుసాంఖ్యులు తెలివికలిమి

చ. జలముల ఫేనముం బలె నసారమ యై పృథుభిత్తిచిత్రమై
నలసదృశంబు నై తమమునం దగు గర్తముఁ బోలి వానలో
పలిబుడగట్టులై సుఖము పర్వనిదై యవశంబునై చెడం
గలిగెడుదానిఁ గా జగముఁ గన్గొనుచుందురు సాంఖ్యు లెప్పుడున్. 43

ఆ. పంకలగ్నమత్తవారణం బట్లు ర, జస్తమఃకలితము జగ మటంచు
నెఱిఁగి స్నేహబంధ మెడలంగ ద్వంద్వముల్, విడిచియుందు రెప్పుడువిజ్ఞులగుచు.

తే. సాత్త్వికము రాజసము తామసమును దేహ, సంశ్రితములగు గంధముల్ జ్ఞానమనెడు
శస్త్రమునఁ ద్రెంచి తప మనుసారదండ, మునను మర్దించు సాంఖ్యవిన్మునిజనంబు

సీ. ఘోరదుఃఖోదము భూరిచింతాహ్రద, మామయమృత్యుమహాగ్రహంబు
సాధ్వసోరగము రజఃకూర్మమును దమో, మీనము స్నేహపంకానుగతము
ఘనజరాదుర్గము ప్రణుతవిజ్ఞానసు, ద్వీపము వరసత్యతీరయుతము
హింసాతివేగసమేతము నానార, సాకరమున్ జ్వరస్పర్శనంబు

తే. శోకతృష్ణామహావర్తలోకితంబు, వ్యాధిగజ మస్థిసంఘాతబహులఘట్ట
దర్శితము శ్లేష్మఫేనము దానమౌక్తికమ్ము శోణితహ్రదవిద్రుమమ్ము మఱియు.

తే. హసితనిర్ఘోషమును రోదనాశ్రులవణ, పరివృతము పునర్జన్మప్రవాహకలిత
మైనసంసారసాగర మమలమునులు, జ్ఞానయోగంబునం దాఁటి చనెద రధిప.

క. ఈగతిఁ దరించి మేనిన్, వీఁగినవా రాకసంబు వెస నొంద మహా
భాగుల వారిన్ సూర్యుఁడు, దాఁ గరములచే వహించి తనరించు నొగిన్. 48

చ. ప్రవహము నాఁగ వాయు వట వర్తిలుచుండి వనంబుఁ బద్మతం
తువువలె వారలం దిగిచి తోడన శీతలగంధబంధురం
బవునటు మోచికొంచుఁ బ్రణయంబున సప్తమరుజ్జగంబులన్
దవినతలంబుల న్నిలుపుఁ దద్దయు స్పర్శసుఖంబుఁ గూర్చుచున్. 49

వ. అట్టివారి నాకాశము రజస్సునం గలపరమగతి నొందించు నది సత్త్వంబు నందలిపరమగతిం బ్రాపింపఁ జేయు నది నారాయణునిం బొందించు నతండు తనతోడం గూడఁ బరమాత్మం జేర్చుఁ బరమాత్మం జేరినవారు పునరావృత్తి లేక ముక్తు లగుదురు మఱియు నిర్ద్వంద్వులును సత్యార్జవరతులును సర్వభూత దయామయులు నగుమహాత్ముల కిదియె పరమోత్తమగతి యనిన ధర్మనందనుండు పితామహుం దిలకించి దేవవ్రతా! యట్టియుత్తమస్థానముం బొందినవారు నిజ జననమరణంబుల స్మరింతురో యనుసందియంబు నాడెందంబునం దగు దీనిం దొలఁగింప ననుగ్రహింపుము సిద్ధి గలిగినవారికి నిట్టివిజ్ఞానము గల దనిన వారి కింకను బ్రవృత్తిలక్షణధర్మం బున్న దనవలయు విజ్ఞానంబు గలుగ దనిన ముక్తిదశలో జ్ఞానంబు లే దనుటకన్న దుఃఖంబు వే ఱొండు లే దని యడుగుచున్న ధర్మరాజునకు ధర్మజ్ఞుం డగునతండు నీయడిగినప్రశ్నంబు విద్వాంసుల కైన సందేహంబు గలిగించు నిందలితత్త్వంబు కపిలాదిమహాత్ము లెఱుంగుదురు దాని నీ కెఱింగించెద సావధానుండ వగు మని యి ట్లనియె. 50

సీ. దేహి దేహమునందుఁ దెలియుచున్నవి విష,యమ్ము లర్థ జ్ఞానేంద్రియమ్ములాత్మ
కవి కరణమ్ము లయ్యది సూక్ష్మమై చూచు, నాయింద్రియమ్ముల సాయమునను
నాత్మసంబంధశూన్యము లింద్రియమ్ములు, దారుకుడ్యసమంబులై రహిఁ జెడుఁ
బ్రాణి నిద్రించెడుపట్ల సూక్ష్మాత్ముఁడు, తిరుగు నంతట నింగిఁ గరువలి వలె

తే. నరయు స్పర్శాదులనెఱుంగుమరల మేలు,కన్న నింద్రియవ్యాపార మెన్నఁజేయు
నాత్మ లేకున్న నుండియు వ్యర్థము లవి, యాత్మ కూడినచో వానికగును దెలివి.

వ. మఱియు సత్వరజస్తమోగుణమ్ములు మనోబుద్ధిగుణంబులు పృథివ్యప్తేజో వాయ్వాకాశగుణంబులు క్షేత్రజ్ఞు నాశ్రయించి పరమాత్మచే వ్యాప్తంబు లగుచుండు శుభాశుభకర్మములు నింద్రియమ్ములు జీవు నాశ్రయించి యను వర్తించుచుండు జీవాత్మ ప్రకృతి నతిక్రమించి నిర్ద్వంద్వుండును బ్రకృతిపరుం డును నవ్యయుండు నగునారాయణుం బొంది నివర్తింపకుండు జ్ఞాని యగు వాఁడు దేహముక్తుండై యచిరకాలంబున విదేహముక్తిం బొందుఁ బ్రాజ్ఞు లగుసాంఖ్య విజ్ఞానంబునన యుత్తమగతిం బొందుదు రని మఱియును. 52

**అక్షరాక్షరవిజ్ఞానకథనము.**

సీ. ఈసాంఖ్యవిజ్ఞానమే ధ్రువ మక్షరం,బు సనాతనం బంద్రు బుధులు మఱియుఁ
గూటస్థ మగుదాని మేటిశక్తిం జేసి, సృష్టియు లయమును జెలఁగు నంద్రు
దానినే పరదైవతముగ బ్రహ్మణ్యము,గా వేల్పులుం జెప్పి గారవింత్రు
యోగులుఁ సాంఖ్యులు నొక్కరీతిగఁ గని, దానిని బ్రహ్మవిజ్ఞాన మంద్రు

తే. సాంఖ్యమందును యోగశాస్త్రంబునందు
శ్రుతులయందును స్మృతులందుఁ జూడ నొప్పు
జ్ఞాన మంతయు సాంఖ్యశాస్త్రంబునుండి
వచ్చినది గాని తెలియంగ వలయు నంద్రు. 53

వ. మఱియుం బరమశాంతియు సూక్ష్మజ్ఞానము తపస్సు సర్వసౌఖ్యంబులును సాం ఖ్యంబునకు సమంబులు సాంఖ్య విజ్ఞానంబుననే దేవత్వముం గాంచి సుఖం బనుభవించి సుఖానంతరంబున నుత్తమబ్రాహ్మణులు మహామునులు నగుచుందు రిదియుం గాక సాంఖ్యులు దేహత్యాగానంతరమున ముక్తియుం బొందఁ గలుగుచుందురు వారి కెప్పటికి నధోగతులు గలుగ వుత్తమము శాశ్వతము నప్రమేయము నగుసాంఖ్య మెఱింగినవాఁడు నారాయణుండు నాఁబడు నని తెలిపిన విని యుధిష్ఠిరుండు పునరావృత్తిరహితం బగునక్షరము విధంబును

బునరావృత్తిసహిత మగుక్షరమువిధంబును వానివానివిశేషంబులును వినవల
తుం జెప్పు మనిన శాంతనవుండు నీ వడిగినదాని కుదాహరణంబుగా వసిష్ఠకరాళ
జనకసంవాదం బనుపురాతనేతిహాసంబు గల దాకర్ణింపు మొక్కనాఁడు కరాళ
జనకుం డనురాజేంద్రుండు భాస్కరసమద్యుతియు నధ్యాత్మగతినిశ్చయుండు
నగువసిష్ఠమునీంద్రుం జేర నరిగి నమస్కరించి నైశ్రేయసం బగునుత్తమజ్ఞానం
బుపదేశంబు నొంద నెంచి కృతాంజలిపుటుం డై దేవా! మునీంద్రులు దేని
నొంది పునరావృత్తి నొందకుందురో క్షరాక్షరవిధం బెట్టిదియో యట్టిసనాతన
బ్రహ్మము నెఱింగింపు మని మృదుమధురవాక్యంబుల నడిగిన నతండు క్షరా
క్షరంబులవిధం బెఱింగించెద నాకర్ణింపు మని యి ట్లనియె. 54

వసిష్ఠజనకరాజసంవాదప్రకారము.

సీ. పదిరెండువేలదేవశరత్తు లొకయుగ, మాయుగంబులు నాలు గైనఁ గల్ప
మాకల్పములు వేయి యైన బ్రహ్మకుఁ బవ, లట్టులే రాత్రియు నగుచు నుండుఁ
బవ లైన మేల్కనుఁ బ్రళయ మారీతి నై, నపుడ మూర్త్యాత్మకుఁ డైనశంభుఁ
డావిర్భవించి కర్మాంచిత మగువిశ్వ,రూపముతో జగద్రూప మైన
తే. భూతపంచకము సృజించె మొదట నాతఁ, డష్టసిద్ధులు గలిగినయవ్యయుండు
నెల్లెడలఁ బాణిపాదాక్షు లెసఁగువాఁడు, నన్నిట న్నిండి యుండినయట్టివాఁడు.

వ. తేజోరూపి యగునతండు హిరణ్యగర్భుం డనియు బుద్ధి యనియు వ్యవహరిం
పంబడు యోగశాస్త్రమున నాతని విరించి యనియు నజుం డనియుం జెప్పు
దురు సాంఖ్యంబున బహునామంబులు గలవు విశ్వాత్ముం డగునతం డక్షరుం
డని చెప్పంబడుచుఁ ద్రైలోక్యంబు సృజించి బహురూపుం డగుటం జేసి విశ్వ
రూపుండు నాఁబడు నతండు విక్రియాపన్నుం డై తన్నుం దా సృజించుకొని
యహంకారుండు నహంకృతుండు నగుప్రజాపతిఁ సృజించె నంత. 56

సీ. అవ్యక్తమున వ్యక్త మాపన్న మయ్యె న,య్యదియె విద్యాసర్గ మనఁగ నయ్యె
మహదహంకారసంపాదనం బది యవి,ద్యాసర్గ మనఁ దగు నవిధి విధియు
ననఁగ విద్యావిద్య లని శ్రుతిశాస్త్రార్థ, చింతకుల్ దెలుపుదు రింత తెలిసి
స్వల్పభూతమ్ము లహంకారమువనుండి, యయ్యె నయ్యది తృతీయంబు సృష్టి
తే. యయ్యహంకారములసంఘమందు వైకృ,తమగుసృష్టి నాల్గవ దయి తనరుచుండు
నందు సర్వప్రపంచముం బొందుపడియె,దానివిధ మెల్లఁ దెలిపెదం బూనివినుము.

వ. ఆనాల్గవసృష్టియందుఁ బృథివ్యప్తేజోవాయ్వాకాశంబులును శబ్దస్పర్శరూపరస

గంధములు నొక్కమాఱుగ దశవర్గ ముత్పన్నంబయ్యె నంత భౌతికం బగు సర్గంబు పంచమం బందు శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణంబు లైదును వాక్పాణి పాదపాయూపస్థ లైదును జ్ఞానేంద్రియకర్మేంద్రియసంజ్ఞం గల వై మనంబు తోడం గూడి జనించె నీచతుర్వింశతితత్వంబు లెల్లశరీరంబులందుం బొంది పడి యుండు మఱియు దేవదానవయక్షభూతగంధర్వకిన్నరనరులును బిశా చోరగచారణనిశాచరదేవర్షులును దంశకీటమశకపూతికృమిమూషికములును శుని శ్వపాకైణేయ చండాలపుల్కసులునుహస్త్యశ్వఖరశార్దూలగోవులును దరుగుల్మలతాదులును మున్నగువానియందును జలమందును స్థలమందు నాకాశంబునందునుం గలయెల్లప్రాణులందు నీచతుర్వింశతియె చూపట్టు నిట్లు వ్యక్తం బగు నీసర్వంబును క్షరం బగుం గావున క్షరసంజ్ఞం గాంచుచున్నది మఱియు నవ్యక్త మగుమహత్తత్త్వరంబు వ్యక్తం బగుజగత్తు క్షరం బని యెఱుంగు మని మఱియును. 58

క. ఇరువదిరైదవతత్వం, బిరవొందును విష్ణు వాతఁ డీతత్వములం బరికించి మించి యుండుటఁ, బరఁగుఁ ని స్తత్త్వుఁ డగుచుఁ బార్థివముఖ్యా. 59

క. ఐనం దత్వంబులతో, నానారాయణుఁడు సంశ్రయాత్మం డగుటన్ మానివరేణ్యులు విబుధులు, వానిం దత్వం బటంచుఁ బలుకుదు రధిపా. 60

సీ. వ్యక్త మిర్వదినాల్గు నగుతత్వముల నైన, నిర్వదేనవవాఁడు సర్వమూర్తి హృదయగతుం డయి యెసక మెసంగు నవ్యక్తుం డరూపుఁడు ననఁగ నొప్పి ప్రకృతిసాంగత్యమువలన రూపము నొంది, సృష్టిలయంబులం జెందుచుండు గుణరహితం బయ్యు గుణసహితం బగుఁ, బ్రకృతిమంతునిగఁ ద న్వికృతి నెంచు

తే. మఱియు సత్వరజస్తమోమహిత మగుచు, జననమరణాదివికృతులఁ దనరి తాను దానికన్నను వే ఱని తలఁప లేక, తామసాదిగుణంబులఁ దగులుచుండు. 61

వ. ఈసత్వరజస్తమంబులు శుక్లలోహితకృష్ణవర్ణంబులు గల వివి ప్రకృతిసంబంధంబులు తామసులు నిరయంబును రాజసులు మానవులను సాత్వికులు దేవ తలం బొందుచుందురు కేవలపాపులు తిర్యగ్యోనులం బుట్టి గిట్టుచుందురు పాప పుణ్యసమ్మేళనంబున మనుష్యులైై పుట్టుఁ గేవలపుణ్యవశంబున దేవత్వంబు గలుగు నిట్లవ్యక్తంబు నక్షరంబు నగునది వ్యక్తంబు క్షరంబుగ మాఱుచుండు ననియు నిరువదైదవతత్వము జ్ఞానగమ్య మనియుం జెప్పి మఱియును. 62

సీ. భ్రాంతి నజ్ఞానము ప్రాపింప జీవుండు, వేలకొలందిగా విగ్రహములు

నొందుఁ దిర్యగ్యోనులందు నొకప్డు వే,ఱొక్కప్డు వేల్పులం దుదయ మొందు మనుజుఁడై దివి కేగియును దివంబుననుండి, మరల మనుష్యుఁడై నిరయ మందుఁ బొ త్తిపురుపు తంతువులఁ బట్టుకొన్నట్లు, గుణతంతువులఁ దగుల్కొనెడునతఁడు

తే. సుఖము దుఃఖము లోనయి చూడ నొప్పు
ద్వంద్వములజాడ లెఱుఁగనివాఁడ యయ్యు
నట్టియట్టియోనులయందుఁ బుట్టి ద్వంద్వ
సహితుఁడై చూడ నొప్పెడు ఖ్యాతలేంద్ర. 63

వ. మఱియు నాజీవుండు శీర్షరోగ మక్షిరోగము దంతశూలము గళగ్రహము జలోదరము తృష్ణారోగము జ్వరగండము విషూచిక శ్విత్రము కుష్ఠ మగ్నిదగ్ధము శైత్య మపస్మారము లోనగురోగములు తనవిగం దలంచుచుండు నట్లె యజ్ఞానంబునఁ దిర్యగ్యోనులందును దేవయోనులందును జనించిన ట్లెంచుచు ఫలం బనుభవించు చుండు మఱియు శుక్లవాసుఁడు చతుర్వాసుఁడు నధశ్శాయి మండూకశాయి వీరాసనగతుఁడు నై చీరధారణ మాకాశశయనముం జేసినట్లును గంటకప్రస్తరంబు నిష్టకాప్రస్తరంబు లోనగుస్థలంబుల నున్నవానిఁ గను యుద్ధాదులం దిరుగువానిఁ గను భావించుకొనుచుఁ గృష్ణాజినము నార సాలువ లోనగునవి ధరించిన ట్లెంచుకొనుచు నానావిధాభరణములు దాల్చినట్లును వివిధభోజనపదార్థము లనుభవించినట్లును భావించుకొనుచు నాఁకలంబులం దినియు నిరాహారుండు నై యుండియుఁ గృచ్ఛ్రచాంద్రాయణాదివ్రతంబు లాచరించి యున్నట్లును నాలుగాశ్రమములధర్మంబు లాచరించినట్లును బాషండాదిమతంబులు స్వీకరించినట్లును వాణిజ్యాదివృత్తులం జేసినట్లును జన్నంబులు జపతపంబులు దానధర్మంబులు చేసినట్లును దలంచుచు నవివేకంబునఁ బ్రకృతిసంబంధంబునం జేసినకర్మములకుం దన్నుం గర్తగా నెంచుకొనుచుండును జననమరణాదులం దనసంబంధంబు గల దని తలంచు నీక్రియాపథం బెల్లఁ బురాతనశుభాశుభఫలం బని తెలియం దగు భయప్రళయాదులు ప్రకృతియే చేయుచుండు నాకర్ణింపుము. 64

మ. దివసాంతంబున రశ్మిజాలమును నాదిత్యుం డనన్ సంక్షయం
బవున ప్రాత్యుఁడు లో గుణంబు లుపసంహారంబు గావించి తా
న వెలుంగుం దగ నొక్కఁడై మఱియు నొందన్ సృష్టి నవ్వానిఁ బై
కి విడం జేయుచు నుండు మాటికి నిటుల్ క్రీడావిహారార్థి యై. 65

తే. గుణములను వశం బొనరించుకొనియు నాత్మ,కర్మ మార్గవశ మయి వికార మొంది సృష్టిలయధర్మములు గుణత్రితయము గల,ప్రకృతినిం జేసి తా నట్టిపగిది మెలఁగు.

సీ. ప్రకృతిచే జగ మెల్లఁ బరఁగు నంధీకృతం, బయి రజస్తమములఁ వ్యాప్త మెల్ల
నిట్లు మాయంజేసి యేర్పడునాత్మకు, ద్వంద్వాదు లెప్పుడుం దగిలిన వయి
జీవుఁ డజ్ఞానముచే నవి యెల్లను, దనవిగా నెంచు సక్తతను గాంచి
తనదుఃఖముల నీఁగికొని సుకృతఫలంబ, యనుభవింపం దగు నని తలంచు

తే. సుకృతమే చేయవలయు నేసుఖ మెపొంద, వలయుఁబై జన్మమందును గలుగుఁగాక
సుకము నాదుపాపమున నరకమ యైన, నవల మనుజుండనై పుణ్య మాచరింతు.

తే. దాన దేవత్వ మొంది యద్దానినుండి, మరల మానవత్వము వచ్చు మానవత్వ
మునను గర్మవశంబునఁజనుఁడునరక,మునకు ననిజీవుఁడొగి నెంచుకొనుసతతము

వ. ఇట్లు భ్రాంతి గలపూరుషుండు దేవతలందును మనుష్యులందును బుట్టుచు నిరయంబు నొందుచుండు నట్టిపుట్టువులు కోటిగుణితంబు లగుచుండు నెవఁ డిట్లు శుభాశుభకర్మంబు లాచరించునో వాఁడు మూఁడులోకంబులం దిరిగి ఫలం బనుభవించు జన్మస్థానంబులు ప్రకృతివలన నేరుపడు నాత్మయుం బ్రకృతివలె లింగశూన్యం బయ్యు దేహస్థితం బగుటంజేసి కార్యంబులం దెలియఁ బడుచుండుఁ గార్యంబులు తాన చేయుచుంటి నని తలంచుఁ దా నభవుం డయ్యు భవు నట్లును నాశకరహితుం డయ్యు నాశకసహితు నట్లును నిర్భయుం డయ్యు సభయు నట్లును నక్షరుం డయ్యు క్షరు నట్లును జీవుం డజ్ఞానంబునం జేసి యెంచుకొనుచుండు నని వసిష్ఠుండు వెండియును. 69

సీ. విను మిట్టు లవివేకమున నవివేకుల, సాంగత్యమునఁ గోటిశతసహస్ర
జన్మము లెత్తుచు సంతత మొకదానినుండి వేఱొకదాని నొందఁ జనుచుఁ
దిర్యక్కులందును దేవతలందును, మర్త్యులందును జేరి మఱియు మఱియు
ద్విజరాజువిధమున వృద్ధిక్షయంబులు, పొందుచుండును జ్ఞాన మొంద కుంట

తే. వికృతులకు లోనుగాక యవ్వేళ స్థిరత, నొనరుఁజిద్రూపుఁ డజ్ఞానమునను జీవుఁ
డల్లపదునైదుకళలందు నవతరించుఁ, బదియునాఱవకళ సోమపద మనఁబడు 70

వ. ఈపదియాఱుకళలు లేకున్న భూతోత్పత్తి లే దిదియే ప్రకృతి ప్రకృతిసంబంధపరిత్యాగమే మోక్షము పంచవింశం బగుమహత్తు షోడశకళాపరిపూర్ణమై యవ్యక్తం బగుదేహము నాశ్రయించు నాత్మ విశుద్ధం బైన నపరిశుద్ధసంసేవం జేసి యపరిశుద్ధం బగుచుండు జీవుండు జ్ఞానరూపి యయ్యు నజ్ఞానసంబంధం

బునఁ బ్రకృతిసేవం జేసి తాను నట్టిం డగుచుండు ననినఁ గరాళజనకుండు
వసిష్ఠుం గాంచి యి ట్లనియె. 71

తే. అక్షరక్షరసంబంధ మట్లు స్త్రీపు,రుషులసంబంధ మగును బురుషుఁడు లేక
స్త్రీకి గర్భము రాఁబోదు స్త్రీని విడిచి, పురుషుఁ డోపఁడు క్రొత్తరూపును సృజింప.

వ. స్త్రీపురుషసంయోగంబునన రూపనిష్పత్తి యగుఁ దన్నిదర్శనం బెట్టి దనిన. 73

సీ. స్నాయుమజ్జాస్థులు జనకువలనఁ గల్గుఁ, ద్వఙ్మాంసరక్తముల్ తల్లివలనఁ [నఁ
గలుగునంచు న్వేదములుశాస్త్రములు దెల్పుఁ, బ్రకృతిపూరుషులసంశ్రయమువల
గలుగదు మోక్షంబు తెలియఁ జెప్పుము మాకు, నజర మనామయ మప్రతర్క్య
మగుపరమపదంబు నందఁ గోరుదు మేము, మోక్షకాముల మయి మునివరేణ్య!

తే. అనవుడు వసిష్ఠుఁ డి ట్లను నధిప! వేద,శాస్త్రసూచితవిషయము జ్ఞప్తి నుంపఁ
గలిగితివి గాని యాథార్థ్యగతి నెఱుంగఁ, జాల వైతి చదివినంత జ్ఞాన మగునె.

తే. వేదశాస్త్రార్థమును సభావేది సరిగఁ, దెలుపఁ జాలనివాఁ డెట్లు తెలిసి గ్రంథ
విషయనిర్ణయ మొనరించు విజ్ఞుఁడైనఁ, దత్త్వమెఱుఁగ మిఁబరిభవస్థాన మగును.

వ. కావున సాంఖ్యంబునందును యోగంబునందును జెప్పినవిషయమ్ములెల్ల యాథా
తథ్యంబుగం జెప్పెద నాకర్ణింపు మని యి ట్లనియె. 76

క. ఎది యోగు లెఱుంగుదు ర,య్యది సాంఖ్యులు నెఱిఁగియుందు రా రెండిటికిన్
మది భేద మెంచకుండెడు, చదురుఁడు ధీశాలి యనుచు సన్నుతి కెక్కున్. 77

తే. జగతి బీజమ్మునుండి బీజమ్ము వోలె
ద్రవ్యముననుండి ద్రవ్యము దనరు నింద్రి
యమువలన నింద్రియమును దేహమున దేహ
మొదవుచుండెడు నని తెలియుము నరేంద్ర. 78

వ. నిరింద్రియుండు నిర్జీవుండు నిర్ద్రవ్యుండు నిర్దేహుండు నిర్గుణుండు నగు
మహాత్మునకు గుణంబులు పుట్టం బోవు గుణంబునంద గుణంబులు పుట్టి యంద
యడంగు నట్లు ప్రకృతినుండి గుణంబులు పుట్టి ప్రకృతియంద యడంగుఁ
ద్వఙ్మాంసరుధిరమేదః పిత్తమజ్జాస్థిస్నాయువు లెనిమిది ప్రాకృతులును శుక్ర
జన్యంబులు పురుషుండు నపూరుషుండును బ్రాకృతంబులు పరమాత్మ వీనికి
భిన్నంబు ఋతువులు పుష్పఫలంబులం దెలియఁబడునట్లు రూపహీన మయ్యును
బ్రకృతి మహాద్వికారంబుల నూహింపంబడు నట్లు దేహంబునందలిచైతన్యం
బునఁ బరమాత్మ యూహింపంబడుచుండు ననాదినిధనుండు ననంతుండు సర్వ

దర్శి నిరామయుండు నగునాత్ముం డభిమాని యగుటంజేసి గుణంబుల గుణంబు నాఁబడు జీవాత్మ ప్రాకృతగుణశూన్యం బై పరమాత్మం జూడఁ గలుగు నిర్గుణంబై గుణాతీతంబై పరంబై పంచవింశతిగుణంబై ప్రకృతిభిన్నం బగునది పరమాత్మ యనియు నీశ్వరుం డనియు సాంఖ్యు లెఱుంగుదురు జీవాత్మపరమాత్మల కభేదము సువ్యక్తం బని జ్ఞాని యెఱుంగు నజ్ఞాని యెఱుంగక భేదంబు గల్పించుఁ గరాళా! నీ కిపుడు క్షరాక్షరభేదం బెఱింగించితి నేకత్వ మక్షరం బనియు నానాత్వము క్షరం బనియుం దెలిసికొమ్ము పంచవింశతిసర్గమే తత్వం బనియు నీతత్వంబు నతిక్రమించినది సనాతనవస్తు వనియుఁ దత్త్వజ్ఞులు తెలుపుచుందు రని చెప్పినఁ గరాళుండును. 79

సీ. ఋషినాథ! నానాత్వ మేకత్వమును జెప్పి,తి నిదర్శనమున సందిగ్ధ మొదవు
స్థూలబుద్ధిని గానఁ బోలంగఁ దత్వము, నరయ లేకుంటి నక్షరము క్షరము
దెలిపితి వేను జంచలబుద్ధి నగుటచే, జ్ఞప్తి నుంచఁగ లేనిజడుఁడ నైతిఁ
గాన నానాత్వ మేకత్వము బుద్ధ మ,బుద్ధము మఱియును బుధ్యమాన [విహిత
తే. మక్షరంబును క్షరము విద్యయు నవిద్య, సాంఖ్యమును యోగమును దద్విశాల
విధముసంపూర్ణముగ వేఱు వేఱుగా య,థార్థముగనానతీయవే వార్ధమెసఁగ.

క. అనవుడు ముని యిట్లను నో, జననాయక యోగకృత్యసరణి య దెల్లన్
వినిపింతుఁ బృథగ్విధమున, విన నెంచు మనన్యచిత్తవృత్తివ యగుచున్. 81

క. యోగములకు ధ్యాన మె బల, మై గణుతింపంగ నొప్పు నది ద్వివిధం బై
సాఁగెడుఁ బ్రాణాయామము, వీఁగనియేకాగ్రచిత్తవృత్తియుఁ దలఁపన్. 82

క. బ్రాణాయామము సగుణం, బై నెగడొం దెడిని మానసైకాగ్రత్వం
బౌ నిర్గుణంబు గావున, ధ్యానము సర్వోత్తమంబ యై తనరారున్. 83

క. కాలుమడి విట్టు విడిచెదు, వేళన్ సాపడెదు వేళ విడిచి కడమ నా
వేళల ధ్యాన మొనర్పం, బోలున్ యోగీశ్వరుండు భూపవరేణ్యా. 84

వ. మనశ్శుద్ధి గలిగినయోగి యింద్రియంబు లింద్రియార్థంబులనుండి మరలించి యిరువదిరెండువిధంబులతో దేహావ్యాప్తియుఁ దత్వపరంబు నజరంబు నగు పరమాత్మతో జీవాత్మం గలియఁ గూర్చి సిద్ధిం గాంచఁ గలండు మఱియును.

సీ. యోగి సంగంబుల నుజ్జగించి జితేంద్రి, యుండు లఘ్వాశియై యుండి పూర్వ
రాత్రమం దపరరాత్రమునందు మదిహృద,యమునందు నరికట్టి స్వాక్షములను
స్థాణుపాషాణవిధంబున నిశ్చలుం, డై సువిధానజ్ఞుఁ డగుచు యోగ

మగు నాతఁ డెద్దియు నరయ కాలింపక, యెఱుఁగ కొక్కఁడు తలఁ పేది లేక

తే. కొయ్యవలెనున్న యోగయుక్తుండనంగఁ, బండితులు చెప్పుదురతండుపవనరహిత
దేశదీపముమాడ్కిఁ బ్రకాశ మొంది, బ్రహ్మమును గాంచులింగసంబంధ మెడల.

వ. అట్టివానికిఁ దిర్యగూర్ధ్వగతులు గలవు యోగి జ్ఞానజ్ఞేయజ్ఞాతముల నైక్యము గావించి హృదయగతాంతరాత్మునిఁ జూచునప్పు డాతనిహృదయంబునఁ బరమాత్మ విధూమపావకంబువలెను రశ్మిమంతుం డగురవివలెను మొయిలదారిఁ మెఱయుమెఱపువలెను బ్రజ్వలించుచుం గానవచ్చు మహాత్ములు బ్రహ్మవేత్తలగువా రట్టియోగి నమృతాత్మకుఁ డగుపరమాత్మునిఁ గాఁ దలంతు రాపరమాత్మ యణువుకన్న నణువు మహత్తుకన్న మహత్తు నై సర్వభూతాంతర్గతమయ్యుం గాన రాకుండినను విద్వాంసులు మనోదీపంబునం గాంచుచుందు రాపరమాత్ముఁడు తమఃపారంబున నున్నను దామసంబు లేనివాఁడు తమ మడంచువాఁడు నగు నతండు విమలుండు తమోరహితుండు లింగశూన్యుండు నై లింగసంజ్ఞితుం డగుచుండు నిది యోగశాస్త్రలక్షణం బింక సంఖ్యానదర్శనం బగుసాంఖ్యజ్ఞానం బెఱింగించెద నాకర్ణింపుము. 87

తరళము. ప్రకృతివాదులు సాంఖ్యు లెంతయుఁ బ్రస్తుతించి వచింతు రా
ప్రకృతియే పరమోత్తమం బనువాదముం బచరించి త
త్ప్రకృతినుండి మహత్తు పుట్టెను దానినుండి తృతీయ మై
సకలభూతములం దహంకృతి సంభవించె మహోన్నతిన్. 88

వ. అయ్యహంకారంబునుండి పంచభూతంబులుం బుట్టె నివి యష్టప్రకృతులు షోడశవికారములు పంచవిశేషములు పంచేంద్రియంబు లిదియే సాంఖ్యతత్త్వ మీయిరువదినాల్గు నంతరాత్మనుండి యనులోమంబుగ జనించి ప్రతిలోమంబుగ మరలి వానియంద లయం బగుచుండు నిదియ సర్గప్రలయవిధము పరమాత్మ ప్రలయమున నేకత్వము సర్గమున బహుత్వము నొందుచుండు నవ్యక్తమగుప్రకృతి తన కధిష్ఠాన మగుపురుషు నేకత్వబహుత్వము లొందునట్లు చేయుచుఁ దాను నేకత్వబహుత్వము లొందుచుండుఁ బరమాత్మ యిరువది నాల్గుతత్త్వముల కవ్వల నిరువదియైదవదియై క్షేత్రముల నధిష్ఠించి యధిష్ఠాత యనియు నవ్యక్త మగుక్షేత్రము నెఱుంగుట క్షేత్రజ్ఞుం డనియు నవ్యక్తమునం బ్రవేశించుటఁ బురుషుం డనియుఁ జెప్పంబడు మఱియు నవ్యక్తము జ్ఞాన మనియుఁ బంచవింశుఁడు జ్ఞేయ మనియుఁ బురుషుం డీశ్వరుఁడు ననీశ్వ

రుఁడు తత్త్వాతీతుఁడు నై యున్నవాఁడు పరిసంఖ్యానుదర్శనం బగుసాంఖ్య
దర్శనం బేతావన్మాత్రం బని మఱియును. 89

సీ. సాంఖ్యులు ప్రకృతియే జగము సృజించెడు, నంద్రు తత్త్వజ్ఞాన మలరుకతనఁ
బరమాత్మఁ గనుఁగొంద్రు ప్రకృతి కతీతుఁడు, జీవుఁ డిర్వదినాల్గుపై వెలుంగుఁ
బ్రకృతిసంబంధము వ్వదలి యతం డాత్మఁ, గనునప్డు కేవలుం డనఁగ నొప్పు
నింద్రియార్థములు ప్రకృతిబద్ధునకుఁ దోఁచుఁ, దొడరి ప్రకృత్యతీతునకు బ్రహ్మ
తే. మెపుడుఁ బ్రత్యక్ష మగుచుండు నిట్టివాని, కెప్పటికిఁ బునర్జన్మము చెప్పదు విధి
ముక్తుఁ డక్షరభావముం బొందుకతనఁ, బరము వ్యయ మున్నతపదమునొందు.

వ. ఇట్లు సాంఖ్యజ్ఞానము తెలిసినవారు ముక్తులై పునరావృత్తిభయంబు నొందరిది
సాంఖ్యదర్శనం బింక విద్యావిద్యలవిధం బనుక్రమంబుగాఁ జెప్పెద నవహి
తుండ వగుము. 91

## విద్యావిద్యాప్రకారనిరూపణము.

తే. సర్గలయధర్మి యగుచు నెసంగుచుండు, నట్టియవ్యక్తమె యవిద్య యట్లు కాని
పంచవింశకుఁడే విద్య పార్థివేంద్ర, సాంఖ్యగతి మునిప్రోక్తమౌ సరణివినుము.

సీ. ఇంద్రియంబులను జ్ఞానేంద్రియంబులు విద్య, యందలివిషయము లగును విద్య
వానిలోపల విద్య నా నొప్పుమనమందుఁ, బంచభూతములు విద్యాంచితమ్ము
లాభూతములలో నహంకార మౌ విద్య, దానికంటెన్ బుద్ధి యౌను విద్య
మహాదాదులందును మఱియు నవ్యక్తము,నందుఁ బ్రకృతివిద్య యనఁగనొప్పుఁ
తే. బ్రకృతికంటెను విధి విద్య ప్రకృతి మించి
నట్టిపంచవింశకుఁడు విద్య యనఁ జెల్లు
జ్ఞానములయందు నవ్యక్త మౌను జ్ఞేయ
మతఁడు పంచవింశకుఁ డగు నవనినాథ. 93

క. తెలిపితి విద్యావిద్యలు, తెలిపెదను క్షరాక్షరముల తెఱఁ గిట నీకుం
దెలియుము జీవప్రకృతులు, వెలయు క్షరాక్షరము లనఁగ వివరింపంగన్. 94

సీ. జీవుండు ప్రకృతియు సృష్టి ప్రభుత్వము, గలిగి యనాద్యంతము లయి యొప్పు
నీరెంటినిన్ జ్ఞాను లెపుడు తత్త్వము లంద్రు, సృష్టిలయంబులఁ జెందుకతన
నవ్యక్త మక్షర మనఁబడు గుణసృష్టి, కది మాటికి వికార మందుచుండు
మహాదాదిగుణసృష్టిమఱియునధిష్ఠాన,మునఁబురుషుఁడు క్షేత్ర మనఁగఁ బరఁగు
తే. నరయ గుణజాల మవ్యక్తమందు యోగి

యొపు డడఁచుఁ బంచవింశకుఁ డపుడు లీన
మగును గుణములతో నట్టులైనయపుడు
ప్రకృతి యొక్కటి మాత్రము పరఁగుచుండు. 95

వ. అప్పుడు క్షేత్రజ్ఞుఁడు క్షేత్రమున లయం బంద గుణసంశ్రితం బగుప్రకృతి యక్షరత్వము నొంది సగుణంబు గాక నిర్గుణం బగు క్షేత్రజ్ఞానపరిక్షయంబున క్షేత్రజ్ఞుఁడు ప్రకృతింజేసి నిర్గుణుం డగుఁ బ్రకృతిం బరిత్యజించి విశుద్ధుం డగు క్షేత్రజ్ఞుఁడు తాఁ బ్రకృతిభిన్నుండని తలంచి ప్రకృతి సంబంధము లేక బ్రహ్మం బగు సంబంధము గలిగినప్పుడు బ్రహ్మాభిన్నుం డై కానవచ్చు జీవుండు ప్రకృతి గుణవిరహితుండై పరునిం గాంచఁ గలుగునట్లు గాంచినప్పుడు దాని విడువఁ జాలం డట్టిసమయంబున నతండు. 96

సీ. కటకటా! నే నింతకాలము గడపితిఁ, గనుఁ గాన లేనివెంగలిని బోలి
మెలఁగితి నాదగుతెలివి యెల్లం దెల్ల,వాఱినయ ట్లయ్యె వలను జూచి
తెలియక మీ నందుఁ దిరిగెడు న ట్లాలు,బిడ్డలం గూడితిఁ జెడ్డ కయితి
నీమేనికన్న వే ఱేమియు లే దను, కొంటి నేఁ బరమాత్మకంటె వేఱ
తే. యని తలంచితి మోహమునందుమగ్నుఁ,డయితి నజ్ఞానమును బొందునట్టిఁడనయి
సారెసారెకుఁ బుట్టుచుఁ జచ్చుచుంటి, నెన్న నామార్గ మెంతయు హీన మిసిసి.

వ. ఇది గతజలసేతుబంధనం బుండుఁ గాక నే నిపుడు వివేకి నైతి నాకుఁ బరమాత్ముఁడే పరమబంధువు నేను వానితోన కూడియుండెద మే మిర్వురము తుల్యులము పరమాత్మ విమలము నవ్యక్తము నేను నట్టిఁడన కావున నింకఁ బ్రకృతితో నుండఁ జాలఁ దిరుండనై నిర్వికారుండ నయ్యెద నాతొంటియపరాధమునకు నే శిక్షితుండఁ బ్రకృతిసక్తుండ నై పరమునెడఁ బరాఙ్ముఖుండ నైతి నక్కతంబున రూపు లేనినేను రూ పొందితి నాకుఁ బ్రాకృతం బగుమమకారంబునంజేసి నానాయోనుల జన్మంబు సంప్రాప్తం బయ్యె నిపుడు వివేకి నై మమకారాహంకారములతోఁ బ్రకృతిసంబంధము న్విడిచి పరమాత్మ నాశ్రయించెద నని జీవుం డనామయం బగునక్షరతత్త్వము నొందు నో జనకా! యిది క్షరాక్షరనిదర్శనము యథాశ్రుతముగా నీ కిట్లు సాంఖ్యయోగ మెఱిఁగించితి యోగు లీసాంఖ్యమునందును వేదమునందును బ్రమాణబుద్ధింజేసి ప్రవర్తింతురు పంచవింశకునికన్నఁ బరం బగుతత్త్వంబు లే దని సాంఖ్యులమతం బని తెలిపి పరమాత్మం గూర్చియు జీవునిం గూర్చియుం దెలిపెద నవహితుండవై విను మని యిట్లనియె. 98

## జీవాత్మపరమాత్మప్రకారము.

సీ. ఆపరమాత్మ మాయావృతుం డయి బహు,రూపముల్ తా నొంది యేపుమీఱు
జీవత్వముం దానె చేకొను గుణములఁ, సృష్టించు నపసంహరించు మరల
నిది యొకక్రీడగా నెసఁగు నాతనికి న,వ్యక్తబోధనమున నతఁడు బోధ్య
మానుఁ డగుచు నుండుఁ దాను వ్యక్తుం బయి,నప్డు నిర్గుణుఁ డని యరయ లేఁడు

తే. ప్రకృతిసాంగత్యముననునవ్యక్తుఁడయ్యుఁ,బంచవింశుఁడు బద్ధునిపగిది నగుచు
విమలుఁడు సనాతనుఁ డగుషడ్వింశకునిని, దెలియఁజాలనివాఁడయి కలవరపడు.

వ. జీవుఁడు తన్నుఁ బ్రకృతిభిన్నుఁగా నెంచినప్పుడు స్వస్వరూపంబు నొందునట్టి యెడ విశుద్ధ మగుబుద్ధి నొంది బుద్ధస్వరూపుం డగు షడ్వింశకుండై సర్గలయాది ప్రకృతిఁ విడనాడి నిర్గుణుండై కేవలత్వము నొంది పరమాత్మతో సారూప్యము నొందుచుండు నిదియే తత్వము నజరామరం బగు నిస్తత్వము ననఁ బడుచు నజరము ననామయము నగుచుండును మనీషులు జీవునితోఁ బంచవింశతి తత్త్వంబు లందు రాత్మకుఁ దత్త్వంబులు లేవు జీవుండు షడ్వింశకుం డని తలంచి నప్పుడు తత్సాదృశ్యంబు నొందు సాంఖ్యశాస్త్రముం బట్టి యిదియే నానాత్వ మని వాకొనం బడు జీవుఁడు సంగధర్ముం డయ్యు నిస్సంగుఁడు నజరుండు విభుఁడు నగుషడ్వింశకు నొంది నిస్సంగుం డగు జీవాత్మపరమాత్మలకుఁ గల భేదము మత్స్యోదకంబులకు మశకోదుంబరములకును గల భేదంబు వంటిది తన్నుఁ బ్రకృతిభిన్నముగాఁ దెలియుటయే మోక్షంబు నాఁబడు నవ్యక్తదర్శనంబునన మోక్షంబు గలుగు జీవుఁ డిట్లే ముక్తుం డగు జీవుఁడు పరుఁడయ్యు క్షేత్రసంబంధంబున దానిధర్మంబు నొందు ముక్తధర్ము నితోఁ గూడి ముక్తుం డగు విమలాత్మునిం గూడి విమలాత్ముం డగు నిదియే తత్వవిధంబు నీ కెఱింగించితి నీవీయుత్తమార్గము వేదనిష్ఠ లేనివారి కెఱింగింపకుము మఱియు నిది యనృతాత్ముఁడు శఠుఁడు క్లీబుఁడు వక్రబుద్ధి పండితాసూయకుఁ డగువానికి నుపదేశింప నొప్పదు శ్రద్ధాన్వితుఁడు గుణవంతుఁడు పరాపవాదరహితుఁడు యోగజ్ఞుఁడు పండితుఁడు శాంతిపరుఁడు శాస్త్రప్రియుఁడు శమదమసహితుఁడు సమర్థుఁడు నగువాఁడు దీనిం దెలియ నర్హుండు మఱియుఁ బరమము పవిత్రము శోకరహితము నాది మధ్యాంతవిహీనము నగుబ్రహ్మముం దెలిపితి నీ వానిరామయం బగుబ్రహ్మము నెఱింగి మోహముం బరిత్యజింపుము నేను దీని హిరణ్యగర్భుం బ్రసన్నుం జేసి కొని సంగ్రహించితి నీప్రార్థనంబునం జేసి నీ కుపదేశించితి నని వసిష్ఠుండు

కరాళున కెఱింగించె నోధర్మరాజా! యిది హిరణ్యగర్భునిచే వసిష్ఠుండు వినియె వసిష్ఠునివలన నారదుండును నారదునివలన నేనును వింటి మీ క్షరాక్షరవిధం బెఱింగినవారికిజననమరణాదిభయంబు గలుగ దని తెలిపి భీష్ముండు వెండియును. 100

## జనకభార్గవసంవాదము.

క. జనకాత్మజుండు వేఁటకుఁ, జని యొకవనమందు భృగువుసంతతియందుం
జనునొకమునిఁగనుఁగొని వం,దనముం బొనరించి యనియెఁ దాత్పర్యమునన్.

తే. ఏది యిహపరంబుల శ్రేయ మిచ్చునదియొ, కామవశవర్తియై క్షణకాలమునన
నశ్వరం బగుదేహము నమ్మియున్న, పురుషుఁ డుత్తమగతి యెట్లు పొందు ననఘ.

వ. అని యడిగిన నతని కమ్మహర్షి యి ట్లనియె. 103

ఉ. నీవు మనోనుకూల మగునిత్యసుఖం బిపు డప్డ నొందఁగా
భావ మొనర్తువేని యొకభాషితము న్వచియింతు విస్ము భూ
తావళికి న్విరోధ మగునట్లు మెలంగక యింద్రియంబులం
జేవ మెయిన్ జయింపు మటుచేసిన శ్రేయము లంద నయ్యెడిన్. 104

సీ. ధర్మమే హితము సద్వర్తికి ధర్మమే, పరమాశ్రయము ధర్మపథమువలన
సచరాచరము లైనజగములు మూఁడును, సంప్రవృత్తము లయి జరుగుచుండు
స్వాదుకాముఁడ వీవు స్వాంతంబునం గామ,తృష్ణను వీడవు తేనెఁ జూతు
వేకాని పాతం బొకింతయుఁ జూడవు, జ్ఞానంబుచే నొంద నైనఫలము

తే. ధర్మకర్మముచే నగు ధర్మకాముఁ, డైన దుర్జాతికి విశుద్ధ మైనచేత
దుర్లభము సజ్జనునకెంతొ దుష్కరంపుఁ, గార్యమైనను సుకరమై గ్రాలుచుండు.

మ. వనమం దుండియు గ్రామ్యసౌఖ్యములకున్ వాంఛించునే గ్రామ్యుఁ డే
యని చెప్పం జను గ్రామమం దెసఁగి సౌఖ్యంబుల్ మదిం గోరఁడే
ననయంబు న్వనవాసియున్ ఋషియు సత్యాచారుఁడు స్థీరుఁడు
న్మనుఁ డన్ పేర్మికి నై మహోన్నతగతుల్ గల్గన్ సమర్థుం డగున్. 106

వ. కావున నీవు మనోవాక్కాయికధర్మంబున సమాహితుండ వగుము ప్రవృత్తి నివృత్తిధర్మంబులం గలుగుణాగుణంబుల నిశ్చయించుకొను మనసూయుండ వై నిత్యము సత్పాత్రదానము చేయుము దానము దేశకాలము లెఱింగి వ్రతాదులచేఁ బరిశుద్ధుం డగువాని కడిగినప్పుడ యొసంగుము మఱియును. 107

సీ. న్యాయలబ్ధార్థ మిం సరుగ నర్థున కీయ, నగు నిచ్చి యిచ్చితి ననుట తగదు

శుచియు దాంతుఁడు సత్యవచనుఁడక్రౌర్యుఁడు, యోనికర్మవిశుద్ధుఁ డుత్తమమతి
ఋజుబుద్ధి శ్రుతివేత్తద్విజుఁడు దానార్హుఁడు, తెలిసిదాన మొనర్ప వలయు నెప్డు
డొడలి నంటినదుమ్ముదుడిచికొనినయట్లు, తొడరిపాపములను దొలఁచ వలయుఁ
తే. గడుపు వట్టిది చేసినకడపటను ఘృతమ్ము భేషజ మైనచందమున దోష
ములఁదొలంగించుకొనిధర్మమునుబొనర్ప, నదిసుఖావహమగుఁబరమందు నెపుడు.
వ. మఱియు సర్వభూతంబులందును మనంబు శుభాశుభం బయి వర్తించుచుండు
నట్టిమనంబు నశుభమ్మునుండి మరలించి శుభంబున నిలువరింపుము నీవు బుద్ధి
మంతుండ వై యప్రశాంతుండవుగాక శాంతంబు గలిగి యుండుము మను
ష్యునకుఁ దేజ మిహాపరసాధనంబు దానికి ధైర్యమే మూలము తొల్లి మహా
భిషుం డధైర్యంబునం జేసియే స్వర్గచ్యుతుం డయ్యె యయాతి క్షీణపుణ్యుం
డయ్యు ధైర్యంబున నుత్తమలోకంబు లొందె నీవు తపోనిధులయు ధర్మ
వంతులయు సంసేవనంబున బుద్ధిమంతుండ వై శ్రేయంబు లందు మని చెప్పిన
నప్పుడమిఱేఁడు తనమానసంబు కామంబునుండి మరలించి ధర్మంబున నిలువ
రించె ననిన ధర్మనందనుండు మందాకినీనందనుం దిలకించి ధర్మాధర్మవిముక్తం
బును సర్వసంశయవిముక్తంబును జన్మమృత్యువిముక్తంబును బుణ్యపాపవిము
క్తంబును శివంబును నిత్య మభయంబును నిత్య మక్షయంబును నవ్యక్తంబును
నిత్యపవిత్రంబు ననాయాసంబు నగువిషయంబు నెప్ప ననుగ్రహింపు మనిన నతం
డీయర్థంబున జనకయాజ్ఞవల్క్యసంవాదం బనునితిహాసంబు గల దాకర్ణింపుము
తొల్లి దైవరాతి యనుజనకవంశజుం డొక్కనాఁడు యాజ్ఞవల్క్యునిం జేరం
జని ప్రాంజలి యై. 109

యాజ్ఞవల్క్యజనకరాజసంవాదప్రకారము.

తే. ఇంద్రియము లెన్ని ప్రకృతు లవెన్ని బ్రహ్మ,మనఁగ నెయ్యది తత్పరం బైనదెద్ది
సర్గలయము లెట్టివి కాలసంఖ్య యెట్టి,తెలఁగునం బొల్చునో నాకుఁ దెలుపుమనఘ.
వ. అనిన యాజ్ఞవల్క్యుం డి ట్లనియె. 111
సీ. ఈ వెఱుంగనిధర్మ మేదియు లే దైనఁ, దెలుపు మంటివి గానఁ దెలుప నుంటి
యోగులు సాంఖ్యులు నుత్తమ మని యెంచు,దానితత్త్వం బెల్లఁ దవిలి వినుము
ప్రకృతు లెన్మిది వికారములు పదియు నాఱు, ననుచు వచింతు రధ్యాత్మ వేత్త
లవ్యక్తము మహదహంకారములుమహా,భూతముల్ ప్రకృతులై ఖ్యాతిఁగాంచు
తే. జ్ఞానకర్మేంద్రియములు విషయము లయిదు
మనము నివి వికారములునాఁ దనరుచుండు

కీశ్వరం బోజనకా! తత్త్వసర్గసంఖ్యయుఁ గాలసంఖ్యయుం దెల్పితి నింక నుప
సంహారంబునుం దెల్పెద నాకర్ణింపుము. 115

తే. అక్షరుండును నిత్యుఁ డనాదినిధనుఁ
డవ్యయుం డగుబ్రహ్మ యీప్రాణిసమితి
మఱియు మఱియును సృష్టించి మఱియు మఱియుఁ
బొడవడంగించు విధము నేర్పడఁగ వినుము. 116

సీ. పగలు క్షయించి రేయగు దేర నతఁడు నిద్రర వోఁ దలఁప భూతపరికరముల
నవ్యక్తుఁ డీశుఁ డహంకృతుం బ్రేరించు, నపుడు సహస్రాంశుఁ డతులితగతి
ద్వాదశాత్ముం డయి ప్రజ్వలించుచుఁ జతుర్విధజంతుజాలము వేఁగిపోవఁ
గూర్మపృష్ఠము వోలెఁ గుతలము జలమధ్యమునఁ దేలుఁ గాలాగ్ని పొడమి మేటి

తే. నీటి నిగిరించు నంతట నీటితాత, యష్టరూపములం బుట్టి యగ్ని మ్రింగి
తిర్యగూర్ధ్వాదిగతుఁ డయి తేజరిల్ల, దాని మ్రింగు నాకాశము పూని పట్టి.

## అధ్యాత్మాధిభూతాధిదైవతప్రకారము.

వ. అయ్యాకాశమును మనస్సు మ్రింగు మనస్సు నహంకారప్రజాపతి మ్రింగు
నహంకారమును మహత్తు మ్రింగు నామహత్తు నణిమాదిసిద్ధులు గలశంభుండు
మ్రింగు నతం డంతటను బాణిపాదశిరోక్షిముఖశ్రవణంబులు గలిగి సర్వము
నావరించి సర్వభూతాత్మభూతహృదయభూతుం డై యంగుష్ఠమాత్రుం డయి
యుండియుఁ బరమేశ్వరుం డయి జగ మెల్ల మ్రింగు నవ్వల నవ్యయము
నక్షర మగుపరబ్రహ్మమే మిగిలి యుండు నిది విలయక్రమం బింక నధ్యాత్మము
నధిభూతము నధిదైవతము నను వానిం దెలిపెద విను మని యాజ్ఞవల్క్యుండు
వెండియు నోజనకా! పాదము లధ్యాత్మము గంతవ్య మధిభూతము విష్ణు వధి
దైవత మగ్లే పాయు వధ్యాత్మము విసర్గ మధిభూతము మిత్రుఁ డధిదైవత
ముపస్థ మధ్యాత్మ మానంద మధిభూతము ప్రజాపతి యధిదైవతము హస్తము
లధ్యాత్మము కర్తవ్య మధిభూత మింద్రుఁ డధిదైవతము వాక్కధ్యాత్మము
వక్తవ్య మధిభూతము వహ్ని యధిదైవతము చక్షు వధ్యాత్మము రూపమధి
భూతము సూర్యుఁ డధిదైవతము శ్రోత్ర మధ్యాత్మము శబ్ద మధిభూతము
దిక్కు లధిదైవతము జిహ్వ యధ్యాత్మము రస మధిభూత ముదక మధిదైవ
తము ఘ్రాణ మధ్యాత్మము గంధ మధిభూతము పృథివి యధిదైవతము త్వ
క్కధ్యాత్మము స్పర్శ మధిభూతము పవన మధిదైవతము మన మధ్యాత్మము

మంతవ్య మధిభూతము చంద్రముఁ డధిదైవత మహంకారిక మధ్యాత్మ మభి
మాన మధిభూతము బుద్ధి యధిదైవతము బుద్ధి యధ్యాత్మము బోద్ధవ్య మధి
భూతము క్షేత్రజ్ఞుఁ డధిదైవత మిది యాదిమధ్యాంతములం గూడినవిభూతి
యోగం బని మఱియును. 118

క. ప్రకృతిగుణంబుల కెన్నే, వికారములు గల్గఁ జేయు వేఁడుకతో ని
ట్లు కలుగఁ జేయుట లెన్నం, బ్రకృతికి నొకక్రీడ యనుచుఁ బరికింప నగున్.

మ. ఒకదీపంబుననుండి లోకమున నెన్నో దీపము ల్గానవుల్
సకలప్రాంతములందుఁ బొందుపడి వెల్గం జేయుచందంబునన్
బ్రకటప్రాభవ మేర్పడన్ గుణములన్ స్వచ్ఛంద కామ్యంబులన్
వికృతుల్ పెక్కులు గల్గఁగాఁ బ్రకృతి గావించున్ విచిత్రంబుగన్. 120

వ. గుణంబులు సత్వరజస్తమోంచితంబులు చెప్పెద వినుము సత్వ మానంద ముద్రే
కము ప్రీతి ప్రాకాశ్యము సుఖము శుద్ధత్వ మారోగ్యము సంతోషము శ్రద్ధ
యకార్పణ్య మసంరంభము క్షమ ధృతి యహింస సమత్వము సత్య
మానృణ్యము మార్దవము హ్రీయు నచాపలము శౌచ మార్జవ మాచార
మలౌల్యమసంభ్రమ మిష్టానిష్టయోగంబుల నవి కల్పనము నస్పృహత పరార్థత
సర్వభూతదయ యనునివి సత్వగుణంబులు రూపము నైశ్వర్యము కలహము
నత్యాగిత్వము నకారుణ్యము సుఖదుఃఖోపసేవనము పరాపవాదరతి వివాద
ప్రియము నహంకారము నసత్కారచింత వైరోపసేవనము పరితాపము
స్తేయము హ్రీనాశనము ననార్జవము భేదము పరుషత కామము క్రోధము
మదము దర్పము ద్వేషము వాదము ననునివి రజోగుణంబులు మోహ మప్రకా
శము క్రోధ మనుతామిస్రము మరణము ననుసంధితామిస్రము సర్వపదార్థ
భక్షణేచ్ఛ భోజనాపర్యాప్తి పేయాతృప్తి గంధవాసోవిహారశయనాసనా
తృప్తి దివాస్వప్నము నతివాదము ప్రమాణము ననిష్టము నృత్యవాదిత్రగీత
ప్రియత్వము ధర్మద్వేషము ననునివి తమోగుణంబులని మఱియును. 121

సీ. ఈమూఁడు ప్రకృతికి నెసఁగుగుణంబులు, జగము సంబంధించి చనియెడు నివి
యవ్యక్తరూపుఁడు సువ్యక్తముగఁ జేయుఁ, గోటానఁగోట్లుగా మేటిరూపు
లధ్యాత్మచింతకు లత్యుత్తమము సాత్వి,కస్థాన మని రజఃకలిత మయిన
స్థానము మధ్యమం బై నెగడొందెడు, నని తమస్స్థాన మత్యధమ మనియుఁ

తే. జెప్పుదురు ప్రాణిపుణ్యముచేత నూర్ధ్వ,గతియుఁ బుణ్యపాపములసంగతిని మర్త్య

మును నధర్మమునం జేసికననధోగ,తియునుబొం దెదుననిబుధుల్ తెలుపుచుండ్రు.

వ. మఱియు నీగుణంబులు రెండు మూఁడునుం గలియుచుండు నెట్లనిన రజము సత్వముతోడను దమము రజస్సుతోడను సత్వము తమంబుతోడనుం గలియుచుండును మూఁడును సమత్వము నొందుటయును జూపట్టు నపు డవి యవ్యక్తం బగుప్రకృతి యగు నవ్యక్తుఁడు సత్వమాత్రయుతుం డై దేవలోకంబును రజస్సత్వసమాయుక్తుండై మనుష్యత్వమును రజస్తమోయుతుండై తిర్యగ్యోనిత్వమును బొందుచుండు మఱియు నొకప్పుడు సత్వరజస్తమోగుణసహితుండై మనుష్యుండై పుట్టుఁ బుణ్యపాపరహితుని కవ్యయము శాశ్వత మక్షయ మమృత మగుస్థానము లభించు నని చెప్పుదురు. 123

క. జ్ఞానులపుట్టు వనుత్తమ, మైనది మఱి వారిస్థాన మది యచ్యుత మ
జ్ఞానవిరహిత మతీంద్రియ,మై నెగడుం జావుపుట్టు లవి లేనిది యై. 124

తే. పరము నడిగితి వాతఁ డవ్యక్తుఁ డయ్యుఁ
బ్రకృతిగతుఁ డౌటఁ దనప్రభావమున నుండుఁ
బ్రకృతియు నచేతనం బయ్యుఁ బరము నాశ్ర
యించి సృష్టిలయములు గావించుచుండు. 125

వ. అనిన జనకుండు ప్రకృతిపురుషు లనాదినిధను లమూర్తిమంతు లచలు లదృష్టిగోచరు లం దొకఁ డచేతనత్వము నొందుటయు నొకఁడు చేతనము గల్గి క్షేత్రజ్ఞుం డగుటయు నెట్టిది నీవు మోక్షధర్మవేత్తవు నేను జిజ్ఞాసువును గావున నాకుఁ బురుషునితత్త్వరాహిత్యమును గేవలత్వమును బ్రకృతిభిన్నత్వమును దేహాశ్రితదేవతలను దేహి దేహము న్విడిచి చనుప్రదేశమును జేరు కొనుస్థానంబును సాంఖ్యయోగజ్ఞానంబును నరిష్టాదులుం దెలుపు మివి యెల్ల నీకుఁ గరతలామలకంబు లనిన యాజ్ఞవల్క్యుం డి ట్లనియె. 126

సీ. గుణములు లేనప్డు గుణములు గల వనఁ, గుదురునె సగుణనిర్గుణములగతి
దెలిపెదఁ దత్త్వవేత్తలు పూరుషునకు గు,ణములసంగతి గుణిత్వము నసంగ
తిఁ నిర్గుణత్వముఁ దెలుపుదు రవ్యక్త,ము గుణస్వభావముం దగిలెడునది
గావున గుణములఁ గడచన నేర దజ్ఞ, మచేతనంబయి చనుఁ బురుషుఁడు

తే. తెలిసినట్టిఁడునాకంటెఁగలుగదొక్కఁ, డనుచునభిమానమొందెడునక్షరుఁడయి
చేతనుం డయ్యె నజ్ఞతచే గుణమల,వడక తన్నెఱుంగకముక్తిఁబడయఁబోఁడు.

వ. మఱియు నప్పురుషుండు సర్గకర్తృత్వమ్మున సర్గధర్ముం డనియు యోగకర్తృత్వ

మ్మున యోగధర్మం డనియుఁ బ్రకృతికర్తృత్వమ్మునఁ బ్రకృతిధర్మం డనియు బీజకర్తృత్వమ్మున బీజధర్మం డనియు గుణప్రసవమ్మునఁ బ్రసవధర్మం డనియుఁ బ్రలయకారకుం డగుటఁ బ్రలయధర్మం డనియు నుపేక్షించువాఁడు ననన్యుఁడు నభిమాని యగుటం జేసి కేవలుం డనియుఁ జెప్పంబడుచుండు నాతని యతులు సిద్ధులు నధ్యాత్మజ్ఞులు శోకరహితులు నగువా రవ్యయుఁడు నిత్యుఁ డవ్యక్తుఁడు వ్యక్తుఁడు నగు నని తెలుపుదురు జ్ఞానాశ్రితులు ప్రకృతి కేకత్వమును బురుషున కు నానాత్వమునుం జెప్పుదురు పురుషుండు ప్రకృతిభిన్నుం డైనను ముంజేషీకలకును మశకోదుంబరములకును మత్స్యోదకంబులకునుం బోలె సంయోగంబున భేదం బేర్పడకుండు మఱియు నగ్న్యుఖలకును జలపుష్కరంబులకును బోలె వానిసంబంధము గలిగియుండు నిట్లు తెలియనివారు నిరయంబునం బడుదు రిది యుత్తమపరిసంఖ్యాన మగుసాంఖ్యదర్శన మింక యథాశ్రుతము యథాదృష్టముగ యోగానుదర్శనం బెఱింగించెద నని మఱియును. 128

ఆ. సాంఖ్యమునకుఁ జాలుజ్ఞానము యోగము,నకును జాలుబలము నలువుపడదు
రెండు నొక్కచర్య నుండెడు నవి నిధ,నంబు నొందనివ యనంగ వచ్చు. 129

సీ. వానివేఱుగ బుద్ధిహీనులు చూతురు, మే మొక్కటిగఁ జూతు మోమహీశ
యోగసాంఖ్యముల నొకటిగాఁ గనువాఁడు,తత్త్వవేత్త యనంగఁదనరుచుండు
రుద్రప్రధానముల్ రూఢికెక్కం గొన్ని, యోగము లవి నేర్చియున్నవారు
తమదేహములతోడ దశదిశల్ తిరుగుచు, నణిమాదిసిద్ధుల నందఁ గలిగి

తే. ప్రలయమగుదనక్కవిహరింత్రు పండితాళి, యోగమష్టగుణంబనియును సుసూక్ష్మ
మష్టగుణ మని యోగకృత్యంబు సగుణ, నిర్గుణంబులద్వివిధముం దెలుపుచుంద్రు.

క. మనముఁ ధారణచేయుట,యును నేకాగ్రముగఁ జేతయును బ్రాణాయం
బన నొప్పు నద్ది సగుణం, బనియు న్నిర్గుణము ననియు నభినుతి గాంచుఁ. 131

వ. మన స్సింద్రియంబులనుండి మరలించి నిశ్చలంబు గావించినప్రాణాయామము నిర్గుణము కేవలవాయుధారణము చేయునది సగుణము వాయుధారణము చేసి దృశ్యమునఁ జిత్తము నుంపక విసర్జనంబు చేసినచో వాతాధిక్యం బగు నట్టి దానిం బరిత్యజింప వలయుఁ బ్రతిరాత్రంబును బ్రథమయామంబునఁ బండ్రెండు ప్రాణాయామంబులును నిద్రానంతరంబున మధ్యయామంబునఁ బండ్రెండు ప్రాణాయామంబులుం గావింప వలయు నట్టివాఁ డుపశాంతుండు దాంతుండు నేకాంతశీలియు నై పరమాత్మయందు మది నిల్పం దగు మఱియుఁ బంచేంద్రి

యంబులవిషయంబులనుండి మరలించి ప్రతిభాపవర్గముల నిగ్రహించి యిం ద్రియగ్రామము మనస్సునందును మన స్సహంకారమునం దహంకారము బుద్ధి యందును బుద్ధిఁ బ్రకృతియందును నిలిపి విరజస్కుండు నమలుండు నిత్యుం డనంతుండు శుద్ధుండు నవ్రణుండు స్థిరుం డభేద్యుం డజరామరుండు శాశ్వ తుండు నవ్యయుండు నీశ్వరుండు నగుపరబ్రహ్మము నుపాసింపవలయు నింక యోగనిష్ఠునిలక్షణంబులు చెప్పెద నాకర్ణింపుము. 132

యోగనిష్ఠునిలక్షణంబులు.

తే. తృప్తిగాఁ దిని సుఖము నిద్రించువాని, కగు ప్రసాదగుణము యోగి కలరు నెప్పు డతఁడు నిర్వాతమునను స్నేహాంచిత మగు, దీప మట్టులు దీపించు రేపుమాపు.

వ. వర్ష ధారలకుఁ జలింపనిపాషాణంబు వలె యోగనిష్ఠుఁడు నిశ్చలుండై శంఖ దుందుభినిర్ఘోషములు గీతవాదిత్రములు లోనగుశబ్దములు చెంగట నైనం జెవిఁ బెట్టక కంపనుండై యుండు మఱియును. 134

ఉ. నిండిననూనెకుండఁ దననెత్తినిఁ గైకొని ఖడ్గహస్తు లు
ద్దండపరాక్రమంబునను దర్జనముల్ పొనరించుచుండఁగాఁ
నొండొకచుక్కయుం దొణఁక కుండఁగ మెట్టుల నెక్కువాఁడు నా
నుండు నచంచలుం డగుచు యోగి పరుం గను చేకచిత్తుఁడై. 135

వ. సమాధిగతుం డగుయోగి యోగధారణంబునఁ దమోమధ్యగతుం డగుజ్వల నుండు వోలె వెలుంగుచుండు బ్రహ్మముం గాంచి దేహావసానంబునఁ గేవలుం డగు నని శ్రుతులు వచించుచుండు నని యోగలక్షణంబు చెప్పి యాజ్ఞ వల్క్యుం డుత్క్రమణములు పొందుస్థానంబు లెఱింగించెద విను మని యి ట్లనియె. 136

ఉత్క్రమణంబులు పొందుస్థానంబులు.

తే. పాదములనుండి చచ్చినవాఁడు విష్ణు,పదము జంఘలనుండి మేన్ వదలువాఁడు వసువులజ్జానువులనుండిప్రాణమీఁగు,నతఁడుసాధ్యులఁబొం దెడునండ్రుబుధులు.

సీ. పాయువునుండి మేన్ వాసినవాఁడు మైత్రస్థాన మొందుఁ బార్శ్వములనుండి మరణించునాతఁడు మరుతులం జేరు జఘనమునుండి మృతించి క్షమ జనించు నూరుయుగ్మమునుండి సుసురులఁ బాసి ప్రజాపతిం బొందు నాభీపదమ్ము నుండి పంచత్వము నొందినవాఁడును, బాహుయుగ్మమునుండి దేహ మీఁగి

తే. నతఁడునింద్రునిఁగనఁబోదురక్కునుండి, తరలిరుద్రునిఁబొందుఁ గంధరమునుండి పొలిసిమునియగునరునొందుముఖమునుండి,తనువువిడిచివిశ్వేదేవులనుగమించు.

వ. మఱియు శ్రోత్రమునుండి మరణించి దిక్కులను ఘ్రాణమునుండి గతించి గంధవహుని నేత్రంబులనుండి మృతించి వీతిహోత్రుని భ్రూయుగ్మంబునుండి యడిసి యశ్విదేవతలను లలాటంబునుండి వెడలి పితృదేవతలను మూర్ధంబునుండి ప్రాణంబు విడిచి బ్రహ్మదేవునిం బొందుదు రింక నరిష్టంబులం జెప్పెద నవధరింపుము. 139

—యాజ్ఞవల్క్యుండు జనకునకు నరిష్టంబులం జెప్పుట.—

క. ధ్రువుఁడు నరుంధతి పూర్ణుం,డవుచంద్రుఁడు దీప మఱి కగపడకున్నన్
భువి జనుఁడొకవర్షములో, దివముం గనఁబోవుననుచుఁ దెలుపుదు రార్యుల్.

సీ. తన మేనినీడలో దక్షిణభాగము, ఖండిత మయినట్లు కానఁ బడినఁ
దన ప్రతిబింబము కనునంత నెదుటివా,రలకంటిపాపలఁ గ్రాలకున్నఁ
దనదు దేహచ్ఛాయ దినదినక్రమముగాఁ, దఱిగిపోయెడునట్టు లెఱుఁగ నైన
శ్రవణరంధ్రములు హస్తములమూసిన లోని, నాదమూహింపఁగా రాద యైన

తే. మనుజుఁడొకవర్షకాలముమాత్ర బ్రదుకు, నధిక తేజము ప్రజ్ఞయు నపహరంబు
సన్నగిల్లిన నాఱుమాసములు మాత్ర, మతఁడు జీవించు నని విజ్ఞు లందు రధిప.

క. భావము చెడినన్ విప్రుల, దైవతముల దూఱునిచ్చ తనలో నైనం
జేవ చెడి కాంతి నల్లన, యై వాడిన మాసషట్క మాతఁడు బ్రదుకున్. 142

ఆ. సాలెపట్టునందుఁ జంద్రునందును సూర్య, బింబమందు నడుమఁ బెద్దకన్న
మైనయట్లు కంటి కగపడినన్ మర్త్యుఁ, డాఱునెలలలోన నడఁగి పోవు. 143

క. దేవళమందు సుగంధం, బేవానికి శావగంధ మిది యని తోపం
గా వచ్చునేని యాతఁడు, జీవములం బాయు నేడు నెల్లన్ రాత్రుల్. 144

వ. మఱియుఁ గర్ణనాశికలు వంగిన ట్లయినను దంతంబులయు దృష్టియు కాంతి చెడినను సంజ్ఞాలోపం బయిన నుష్ణంబు సన్నగిల్లినను వామనేత్రంబునుండి హఠాద్గతి నీరు గాఱినను మూర్ధంబునుండి ధూమమ్ము వెడలినను సద్యస్కాలమరణం బగుదెంచు నిత్యాద్యరిష్టములం గనిపెట్టి మరణకాల మెఱింగిన మానవుండు రేయింబవళ్లు పరమాత్మయందుఁ జిత్తంబు నేర్ప వలయు నప్పుడు మరణింప నిష్టము లేకున్న సర్వరసగంధంబులం బరిత్యజించి సాంఖ్యధారణంబు గావించి విదితాత్ముండై మృత్యువుం జయింప వలయు నాతని కవలికాలంబున జన్మరహితంబును శాశ్వతంబు నగునుత్తమలోకం బగు నని చెప్పి నీ వతిగుహ్యం బగుపరమాత్మవిషయం బడిగితివి గావున నదియుం జెప్పెద నవహితుండ వగుము. 145

—● యాజ్ఞవల్క్యుండు సూర్యు నారాధించి యజుస్సులం బొందినవిధము. ●—

తే. ఆర్షవిధిఁ జేసి చరియించునట్టి నేనొ,కానొకప్పుడు భగవంతుఁ డైనసూర్య
దేవు సేవించి తత్కృపాభావమునను, బడసితి యజుస్సుల న్విన్ము పార్థివేంద్ర.

ఉ. నే నతినిష్ఠఁ గైకొనుచు నిర్మలచిత్తముతో విభావసుఁ
బూని తపం బొనర్చియును బ్రొద్దులు మూఁడునుసేవ చేసియుఁ
దైనికచర్యగా నిటు లుదారతఁ గొన్నిసమల్ భజించితిఁ
దానికి సంతసించి కరుణాళుఁడు నాదెసఁ బొల్చి పల్కనన్. 147

ఉ. ప్రీతుఁడ నైతి నీవలన విశ్వజనీనతపఃప్రకార! యో
పూతచరిత్ర! నీదుమది పొందఁగ నెంచెడు నెద్ది దుర్లభం
బై తెలియంగ వచ్చినఁ బ్రియంబున నట్టివరం బొసఁగఁ గా
నైతి నెఱుంగఁ జేయు మనె సాదరవాక్యసమాసవైఖరిన్. 148

వ. అని ప్రసన్నదృష్టిం బలికిన నే నాత్రిమూర్త్యాత్మునకు సాష్టాంగదండప్రణామం
బాచరించి వినయవినమితోత్తమాంగుండనై మోడ్పుఁగేలు ఫాలంబునం
గీలించి. 149

క. జగదుపయుక్తయజుస్సులఁ, దగురీతి నెఱింగి కొనఁగఁ దలఁచితి దయచే
యగఁ జూడు మనుచు వేఁడితి, మగురయ్యలు తాన యైనమూర్తిన్ భక్తిన్.

వ. అంత భగవంతుం డగునాద్వాదశాత్ముండు నీకోరినవరం బొసంగితి సరస్వతి
వాగ్రూపంబున నీశరీరంబునం బ్రవేశించుం గావున నోరు దెఱచుకొని యుండు
మనిన నే నట్లు కావించితి నంతలో వాగ్దేవి నానోటం బ్రవేశించుటయు
దందహ్యమానదేహుండ నగు నే నప్పుడా తాపంబు భరింప నోపక జలంబులం
జొచ్చి యవిజ్ఞానామర్షంబునం జేసి భాస్కరు నోనాడఁ జొచ్చితి నంత విదహ్య
మానుండ నగునన్నుం జూచి ప్రసన్నుండై ప్రభాకరుండు. 151

శా. చేతోవీథి మువహ్యార్తమాత్రము మునిశ్రేష్ఠా! సహింపం దగుఁ
శీతీభూతుఁడ వయ్యె దీతపనముం దీఱు న్నిమేషంబులో
ఖ్యాతామ్నాయము లుత్తరంబులును నీస్వాధీనతం బొందు నీ
చేతస్మాత్రము గానిదివ్యమహిమన్ హేమింతు వెల్లప్పుడున్. 152

తే. శతపథబ్రాహ్మణ మొనర్చి సర్వలోక, వినుతవిఖ్యాతి గైకొని విమలబుద్ధి
గలిగిసాంఖ్యయోగీప్సితంబలఘుపదము, తెలిసికొం దనిపలికియదృశ్యుఁడయ్యె.

వ. అంతఁ గొంతలోన. 154

సీ. సూర్యుండు చెప్పిన చొప్పున నామేనఁ, బొడమినతాపంబు పొడవడంగ
నే నింటి కరుదెంచి ధ్యానించితి సరస్వతిని హృష్టమతి నయి ఘనతరముగ
నవల నాయమ స్వరవ్యంజనభూషిత, యై పొల్చె నోంకార మాది నుండఁ
గని భక్తితాత్పర్యమున భారతికి భాస్కరున కర్ఘ్య మిడితి భక్తిని భజించి
తే. అంత నాసీనుఁడగునాదుస్వాంతమందు, శతపథముదోఁచె సరహస్యసంగ్రహంబు
సపరిశేషము దాని హర్షమునఁ జేసి, శిష్యులకు నుపదేశముఁ జేసినాఁడ. 155

యాజ్ఞవల్క్యుఁ డుపదేశించిన తత్త్వప్రకారము.

వ. అనంతరంబ సశిష్యుండ నగునేను బోయి నామాతులుం డగువైశంపాయను నకు విప్రియంబు గావించి నీతండ్రిచే నధ్వరంబు చేయించి యట దక్షిణార్థము నామేనమామతో నింతకలహించి దేవలునియెదుట సుమంతుఁడు పైలుఁడు జైమిని నీతండ్రియు లోనగువారియనుమతంబున నర్ధమాత్రయజ్ఞదక్షిణం గ్రహించి సూర్యసంప్రాప్తం బగునేఁబదిశాఖలయజుస్సును రోమహర్షణునితోఁ బురాణపఠనంబు గావించి శతపథబ్రాహ్మణంబు చేసి శిష్యులచేఁ జదివించి నే బ్రహ్మచింతకుండ నైతి నపుడు కడకు వేదాంతజ్ఞానకోవిదుం డగు విశ్వావసుం డనుగంధర్వుండు వచ్చి బ్రాహ్మణోపయుక్తంబు సత్యం బనుత్తమం బగు దాని నెఱుంగంగోరి విశ్వము నవిశ్వము నశ్వము నశ్వమిత్రము వరుణుఁడు జ్ఞానము జ్ఞేయము విజ్ఞుఁడు నజ్ఞుఁడు కతపుండు నతపుఁడు సూర్యాదుఁడు సూర్యుఁడు విద్య యవిద్య వేద్య యవేద్య యచలము చలము నపూర్వము నక్షయము క్షయము నను వానిం గూర్చి యిరువదినాలుగుప్రశ్నంబులును నాన్వీక్షికిం గూర్చి యిరువదియైదు ప్రశ్నంబులును గావించిన నేనొక్కముహూర్తమాత్ర మాసరస్వతీదేవిం ధ్యానింపఁ దదనుగ్రహంబున దధినుండి ఘృతంబు వోలె స్ఫురించె నపు డాన్వీక్షికి నుద్దేశించి యుపనిషత్తులను బరిశేషమును మథించి సర్వము నవగతంబు గావించుకొని విశ్వావసుం గాంచి గంధర్వసత్తమా! నీయడిగినప్రశ్నంబుల కుత్తరం బిచ్చెద నవహితుండ వగు మని యిట్లంటి నాకర్ణింపుము. 156

తే. భూతభవ్యభయంకరంబై తలిర్చు, నదియుఁ ద్రిగుణాత్మకం బగునదియుఁ బరమ
విద్య యవ్యక్తమది విశ్వవిశ్రుతంబు, నిష్కళ మవిశ్వ మది బ్రహ్మనిశ్చయంబు.
సీ. అశ్వ నా స్త్రీ యగు నశ్వంబు పురుషుండు, ప్రకృతి యవ్యక్తమై పరఁగు నిర్గు
ణుఁడుపురుషుండుమిత్రుఁడునబ్లిపురుషుండు, వరుణుండుజ్ఞానముప్రకృతియయగు

జ్ఞేయంబు నిష్కళంబై యొప్పుజ్ఞాజ్ఞులు,పురుషుండునిష్కళుం డరయఁ "గ"యన "నతప" యనంబురుషాఖ్యలే "తప"యనఁ, బ్రకృతినాఁబడు నని పలుకుచుంటి

తే. విను మవేద్య మవ్యక్తము వేదము పురు
షుండు చలము ప్రకృతి యచలుండు పురుషుఁ
డగును గొందఱు వేద్య మవ్యక్త మని య
వేద్యముం బురుషుం డంద్రు విజ్ఞతమెయి. 158

వ. వా రిద్దఱు నజ్ఞులు ధ్రువులు నక్షయులు నజులు నిత్యులు నని యథార్థాత్మగతి నిశ్చయంబు ప్రకృతిప్రజననవిషయంబున నక్షయం బగుటంజేసి యవ్యయం బనియు క్షయము లేమింజేసి పురుషుం డక్షయుం డనియుఁ జెప్పుదురు గుణములకుఁ గాక తనకు క్షయమ్ము లేమింజేసి ప్రకృతియు నక్షయంబు నాఁబడు ముక్తిసాధనం బై చతుర్థం బైనయీయాన్వీక్షికీవిద్యం దెలిపితి నని మఱియు. 159

శా. సాంగోపాంగము గాఁగ వేదములు నా ల్గత్యంతనిష్ఠం బఠిం
పంగా నేర్చినవాఁడ యైనఁ బరమాత్మజ్ఞానతత్త్వం బెఱుం
గం గీలోకనిద్విజన్ము వేద మది లోకంబందు వ్యర్థంబ యై
త్రుంగుం ద్రచ్చిన మండశూన్యము ఖరీదుగ్ధంబుచందంబునన్. 160

తే. ప్రకృతిపురుషుల నెఱుఁగనిపంచజనుఁడు
జననమరణప్రవాహమునను మునుంగు
క్షయ మగుప్రవృత్తి నెఱిఁగి యక్షయము బ్రహ్మ
మరయు నాతఁడు కేవలుం డగు నరేంద్ర. 161

వ. షడ్వింశకుఁడు పంచవింశకుఁడు నేక మని కొంద ఱందురు సాధువులు వా రిరువురు నొక్కటిగా భావింతురు సాంఖ్యులును యోగులును జీవాత్మపరమాత్మలకు భేదము లే దని నిశ్చయింతు రనిన విశ్వావసుండు పంచవింశకషడ్వింశకులకు భేదంబు లే దంటి వది నాకు విస్పష్టంబు గాకుండె దానిని జైగీషవ్యుఁడు నసితుఁడు దేవలుఁడు పరాశరుఁడు వార్షగణ్యుఁడు భృగువు పంచశిఖుఁడు కపిలుఁడు శుకుఁడు గౌతముఁడు నార్ష్టిషేణుఁడు గర్గుఁడు నారదుఁడు నాసురి పులస్త్యుఁడు సనత్కుమారుఁడు శుక్రుఁడు నాత్రేయుఁడు కశ్యపుఁడు రుద్రుఁడు విశ్వరూపుఁడును దేవతలును బితృదేవతలును దెలుప నే వింటి వారు నిత్య మగువేద్యముం దెలుపుదురు నీవు నీబుద్ధిబలంబున దీని నా కెఱిం

గింప నే వినఁ గోరుచున్నవాఁడ నీవు మహానుభావుండవు నీకుఁ దెలియని దించుకంతయు లేదు నిన్ను దేవలోకమునందును బితృలోకమునందును బ్రహ్మ లోకమునందును సన్నుతింతురు సూర్యుండు నీవాక్పటిమముం బ్రకటించు సాంఖ్యము యోగము నీయధీనంబు లనిన యాజ్ఞవల్క్యుం డి ట్లనియె. 162

క. తెలిసినవాఁడవు నీ వని, తెలియంగా వచ్చి నయినఁ దెలుపు మటంచుం
బలికితివి గానఁ దెలిపెదఁ, దెలిసినవిధమునను వినుము తెల్లము గాఁగన్. 163

సీ. తెలియనిప్రకృతినిం దెలియును బంచవిం,శకుఁ డింత తెలియదు ప్రకృతి వాని
నీప్రతిబోధమే హేతువుగా వానిఁ, గోని యోగులు ప్రధాన మని వచింత్రు
జ్ఞాని చతుర్వింశుఁ గానంగఁ బంచవిం,శకుఁడు గా భావింపఁ జనదు చేప
జలమున వర్తించు స్వస్వభావంబున, నది నీటికిం భిన్న మయినయట్లు

తే. పంచవింశుఁడు భిన్నుఁడు ప్రకృతికంటె, నతఁడుపరమాత్ము నైక్యము నరయలేక
ప్రకృతిసంగతి సంసారపతితుఁ డగును, మఱుత విడిచిన నుత్తమమార్గ మొందు.

వ. ప్రకృతికంటెఁ దాను భిన్నుం డని తెలిసినపుడు షడ్వింశకుని గనుంగొని పున ర్జన్మము నొందకుండు గంధర్వరాజా! జీవాత్మపరమాత్మలు వేఱు వేఱుగ నుందురు పరముఁ డాజీవునం దంతర్యామి యగుట జీవాత్మపరమాత్మ లొకటి యని భావింతురు జీవుఁడు షడ్వింశకు నెప్పుడు గాంచునో సర్వవేత్తయై తా నప్పుడు పునర్జన్మంబు నొందఁ డని తెలిపిన విని విశ్వావసుండు నీవు నాకుఁ బర మోత్తమప్రకారంబు చెప్పితివి నీకు మంగళం బగుఁ గాక యని పలికి స్వర్గం బునకు నిర్గమించి నా తెలిపినదర్శనమును బ్రహ్మాదిదేవతలకును భూలోకవాసు లకు నధోలోకవాసులకు నెఱింగించె సాంఖ్యులకు యోగులకు మానవులకు నీదర్శనము దృష్టజ్ఞానఫలం బొసంగు జ్ఞానంబున మోక్షం బగుం గావున జ్ఞాన మన్వేషింపం దగు సర్వవర్ణంబులవారును బ్రహ్మసంభవు లగుటంజేసి బ్రహ్మముం బలుకుచుందురు బ్రహ్మబుద్ధింజేసి నీ కీతత్త్వ ముపదేశించితి సమస్త విశ్వమును బ్రహ్మ మని యెఱుంగుము బ్రహ్మముఖంబున బ్రాహ్మణులు బాహు వుల క్షత్రియులు నూరువుల వైశ్యులు పాదముల శూద్రులు జనించిరి సర్వ వర్ణములును బ్రహ్మనుండియే పుట్టినవి మానవు లజ్ఞానముచే జననమరణంబు లొందుచుందురు ప్రాకృతయోనులుం గలుగుచుండుం గావున జ్ఞాన మెల్లవిధం బుల సంపాదింపం దగు నని యాజ్ఞవల్క్యుండు చెప్పిన జనకుండు సంతసిం చుచు మునికభివందనం బాచరించి నిజస్థానంబునకు నిర్గమించి కోటిగోదా నంబులును హిరణ్యదానంబులు లోనగుదానంబు లొనర్చి విదేహరాజ్యభారము

పుత్త్రునం దుంచి యతిధర్మం బాశ్రయించి సాంఖ్యయోగజ్ఞాన మవలంబించి
ప్రాకృతధర్మంబులం బరిత్యజించి నిత్య మవ్యయంబు నగుకేవలు నాశ్రయించి
ముక్తుం డయ్యె నని భీష్ముండు వెండియు. 165

సీ. ఇచ్చెడువాఁడును బుచ్చుకొనెడువాఁడు, చేయించు వాఁడును జేయువాఁడు
నాత్మయే యగు నాత్మ యాత్మసంబంధ మౌ, నతనికి వేఱు లే దని యెఱుఁగుము
సగుణనిర్గుణములసరణి యెఱుంగని,యతఁడు తీర్థములను యజ్ఞములను
సలుపెడువాఁడగు స్వాధ్యాయముతపమ్ము, పొనరింప బ్రహ్మము బొందుపడదు
తే. జ్ఞానమునఁ జేసి బ్రహ్మత్వసంపద యగు,మహదహంకారముల సేవ బహువిధముల
స్థానము లొసంగు బ్రహ్మముఁ గానఁజాలి,నతఁడు మోక్షము నొందుజన్మాదులవిడి.

వ. నే నీ జ్ఞానము నైవరాతివలనం బొందితి నతండు యాజ్ఞవల్క్యునివలనం బొందె
జ్ఞానంబున కెద్దియు సాటిగాదు యజ్ఞాదినియమవ్రతంబులచే స్వర్గాదు లంది
మరల భూమిం బొందఁ గలుగుచుండుఁ గావున నీవు పరమపవిత్ర మగుజ్ఞాన
యజ్ఞ ముపాసింతు వేని ఋషివై ముక్తుండ వగుదు వనిన యుధిష్ఠిరుండు
మహైశ్వర్యమ్మును మహోన్నతధనమ్మును దీర్ఘాయువును బొందినవాఁ
డయ్యు మానవుం డెట్లు మృత్యువు నతిక్రమించెడిని తపము సత్కర్మము
శ్రుతము రసాయనప్రయోగము లొనగువానిచే జరామరణంబులు జయింప
సాధ్యం బగునో చెప్పు మనినం గురుపితామహుం డీయర్థంబున జనకపంచశిఖ
సంవాదం బనునొక్కయితిహాసంబు గలదు దానిం జెప్పెద విను మని
యి ట్లనియె. 167

### జనకరాజపంచశిఖసంవాదము.

తే. మున్ను వైదేహుఁ డొకనాఁడు సన్నుతమతి, ఛిన్నధర్మార్థసంశయుఁ జేరిపంచ
శిఖుని మునివర! యెట్టివిశిష్టవర్తనమున దాఁటు జరామరణముల నరుఁడు. 168
తే. తపమునం గాని సత్కర్మతతిని గాని, బుద్ధిబలమునఁ గాని సమున్నతశ్రు
తమ్మునం గాని యవి భూతలమ్మునందు, నలవడునొ చెప్పుమన నాతఁడనియెనిట్లు.
సీ. ఈరెంటికి నివృత్తి యారయఁగా లేదు, లే దనుటకు వీలు లేదు వినుము
నెలలు రేలు పవళ్లు నిరత ముండక పోవు,నరుఁ డస్థిరుం డయ్యు స్థిర మయిన ని
వృత్తిపథము నొంది విడు జన్మమృత్యువుల్, సకలజీవులు కాలసాగరమునఁ
బడి కొట్టుకొనిపోవుఁ బ్లవ మైన లేకుండ, నపుడు జరామృతు లనెడి గ్రాహ
తే. ములు గ్రసించెడుసాయమునుగలుగదెదియు, దారపుత్త్రాదిబంధువుల్ దారిఁగలసి

నట్టిరగుదురు ప్రాణు లప్పట్టునందు, దిక్కు సుంతయు లేనిదై దేవురించు. 170

తే. కాలవశమున నొండొండు గాలిచేతఁ, గూడి వీడెడుమబ్బులపోడిమి మెయిఁ
బ్రాణితతి పరస్పరము సంబంధ మింత, లేక మృత్యువువాతికై పోక పోదు.

వ. ఎల్ల భూతంబులు నిట్టివ యగు భూతాత్మం డొక్కరుండ నిత్యుండు గావున జననమరణంబులకు హర్షశోకంబులు నిష్ప్రయోజనంబ యని మఱియును. 172

శా. ఏ నెవ్వండనొ యిట్టు లేమిపనికై యే తెంతునో వెండియుఁ
నే నెచ్చోటికిఁ బోదు నేమగుదు నిద్దెం దున్న వాఁడ న్ననుం
గానం జాలుదు రెవ్వ రే నెవనికై గాటంబు శోకింతు నం
చేనాఁ డెంచునొ నాఁడు జ్ఞాని యగుచుఁ హేమించు మర్త్యుండిలన్. 173

వ. లోకంబునం గలప్రాణిలోకము నిజకర్మానుగుణమ్ముగా స్వర్గనరకంబు లొందక మానదు గావున నీవాగమంబుల నతిక్రమింపక దానధర్మాధ్వరంబులం గావింపు మని పంచశిఖుండు చెప్పె నని చెప్పిన నజాతశత్రుండు గంగాపుత్త్రుం గాంచి గార్హస్థ్యమును విడువ కెవండేని మోక్షతత్త్వంబు నొందెనో స్థూలసూక్ష్మంబు లెట్లు విడువం దగునో మోక్షమునకుఁ బరం బెద్దియో యెఱింగింపు మనిన నతండు నీయడిగినవిషయంబున సులభాజనకసంవాదం బనునితిహాసంబు గల దాకర్ణింపు మని యి ట్లనియె. 174

సులభాజనకసంవాదప్రకారము.

తే. మున్ను ధర్మధ్వజుం డనుపుడమిఱేఁడు, జనకనాముఁడు మిథిలాపురిని వసించు నతఁడు సన్యాసఫలకాంక్షుఁ డఖిలశాస్త్ర, విదుఁడు వేదము లెఱిఁగినవిమలబుద్ధి.

ఆ. మోక్షశాస్త్ర మెఱిఁగి యక్షుంబులన్ గెల్చి, వసుధ నేలుచుండె వానిసాధు
వృత్త మెఱిఁగి ప్రాజ్ఞు లత్తఱి నెందఱో, యతని ననుసరించి రాదరమున.

వ. అట్టిధర్మయుగంబున. 177

చ. సులభ యనంగఁ బే ర్వడసి క్షోణితలంబున యోగధర్మసం
కలితహృదంబుజాత యయి క్రాలెడుభిక్షుకి యొార్తు సర్వభూ
తలమును మెట్టుచుం జని త్రిదండులు సెప్ప విదేహభూమిభృ
త్తిలకుఁడు మోక్షధర్మముల ధీరుఁడు నా విని చూచునిచ్ఛమై. 178

క. వినినది సత్యమొ కాదో, యని సందియ మావహిల్ల నమ్మిథిలేశున్
గనుఁగొన సంకల్పంబుం, బొనరిచి తనయోగబలముపొందున నంతన్. 179

వ. పూర్వరూపంబు విడిచి యనుత్తమం బగునన్యరూపంబు ధరించి లఘ్వస్త్రగతిఁ

గామినియై నిమేషమాత్రంబునఁ బ్రభూతజనసంకులం బగుమిథిలానగరంబు నకుం జని భైక్ష్యచర్యాపదేశంబున మిథిలాధినాథుం దర్శించె నంత నాతం డాతపస్వినీవపుశ్శ్రీసుకుమార్యంబుఁ గాంచి నివ్వెరంపడి తనమనంబున. 180

క. ఎవ్వత యివ్వనితామణి, యెవ్వారిదొ యెందునుండి యిట వచ్చినదో
నివ్వెరఁ గయ్యెడు నీయమ, యవ్వంబును జవ్వనంబు మఱి మఱిఁ జూడన్. 181

వ. అని చింతించి స్వాగతం బొసంగి వరాసనంబున నాసీనం గావించి పాద్యం బిడి పూజించి రుచిమదన్నంబు నివేదించుటయు నామె భుక్తవతియై సంతసించుచు మంత్రిపరివృతుం డగురాజుం దరియ వచ్చి సర్వశాస్త్రవిదగ్రగణ్యులసమక్షం బున రాజుం బ్రేరేచుచు నతండు ముక్తుం డగునో కాఁడో యని సంశ యించుచు యోగశక్తిచే నతనిబుద్ధియందుఁ దనబుద్ధిం బ్రవేశపెట్టి తనదృష్టిచే నాతనిదృష్టి నరికట్టి యోగబంధంబున నాతనిం బంధించుటయు నాతఁడు పరిహసించుచు నామెభావ మాకర్షించి యి ట్లనియె. 182

తే. ఉవిద! నీచర్య యెట్టిదెందుండుదాన, వెందుఁ బోయెద వెందుండి యిందురాక
చెప్పినం గాని తెలియమింజేసినిన్ను, నడుగుచుంటిని వా కిమ్ము విడిచి శంక.

క. నను ఛత్త్రాదులు విడిచిన, జనునిఁగఁ దలపోయు మెందు సక్తి సుమంతే
మనమునఁ బొడమదు నాకున్, వినిపింపుము నీదుసత్యవిషయం బెల్లన్. 184

వ. నీవు పూజ్యురాలవుగాఁ గానిపించుచుంటివి కాన మునుమున్ను నావైశేషిక జ్ఞానంబును మోక్షజ్ఞానంబునుం జెప్పెద జెవి యొగ్గి వినుము పరాశరగోత్రో ద్భవుండు మహాత్ముండు నగుపంచశిఖున కే నంతేవాసిని సాంఖ్యయోగంబు లందును రాజనీతియందును ద్రివిధమోక్షధర్మములందును భిన్నసంశయుండనై యున్న వాఁడ నాకర్ణింపుము. 185

సీ. శాస్త్రసమ్మతమార్గసంచారియై యెల్ల, వసుధయు మెట్టుచుఁ బంచశిఖుఁడు
నాయింట సుఖముగా నాలుగువార్షిక,మాసముల్ గడపె నామాన్యచరితు
నొద్ద నప్పుడు వింటి నొద్దికఁ ద్రివిధ మౌ, మోక్షవిజ్ఞానము శిక్షితుఁ డయి
కాని రాజ్యము వీడఁగాఁ దెల్పఁ డాతండు,రాగహీనుఁడనై పరమపదంబు

తే. నాశ్రయించి మోక్షంబునయందు నున్న
త్రివిధవృత్తుల నెఱిఁగి చరించుచుంటి
మోక్షమునకు వైరాగ్యమే మూల మద్ది
జ్ఞానమునఁ జేసి లభియించు మానవులకు. 186

వ. మఱియు జ్ఞానంబున యత్నం బగు యత్నంబున మహత్త్వ ప్రాప్తించు దాన ద్వంద్వంబులు తొలంగు నందున మృత్యువుం జయించి సిద్ధి నొందు నే నిట్టి దాని నాశ్రయించి సుఖదుఃఖాదిద్వంద్వంబులం దొలంగి సంగరహితుండనై సంచరించుచున్న వాఁడ నాకర్ణింపుము. 187

క. మెత్తనగునట్లు దున్నియు, న త్తఱి నీ రెట్టి క్షేత్రమం దిడ బీజం బెత్తెడునంకుర మటు జనుఁ, డె త్తఱిఁ గర్మమునఁ జేసియే జనియించున్. 188

ఆ. అట్టిబీజ మొక్కమట్టిమంగలములోఁ, బెట్టి వేఁచినంత బీజశక్తి సడలి మొలవనట్లు సద్గురుబోధ నా, బుద్ధి యయ్యె బీజమునకుఁ గాక. 189

సీ. నాబుద్ధి విషయమునం బ్రవర్తింపదు, దేనియం దనురాగ మూనుకొనదు పరితపింప దనర్థపరికరంబుల దాని, కేయర్థములు తృణప్రాయము లగు నొకఁడుగంధముపూయునొకచేతి కొకఁడురెం,డవచేయినఱకునాకివియు రెండు సమములు నే ముక్తసంగుఁడనై రాజ్య, గతి నుండి సములోష్ఠకాంచనుండ

తే. నై మెలంగుదు సుఖిని సర్వార్థకలనఁ, గావునఁ ద్రిదండులందు నే ఘనతఁ గాంతు మోక్షసౌధమునకుఁ గలమూఁడుదారు,లే నెఱింగినవాఁడ నోయింతి! వింటె.

వ. మోక్షవిత్తము లెఱింగినత్రివిధనిష్ఠలు నెఱింగించెద వినుము కొందఱు సర్వ లోకవిషయజ్ఞానము ముక్తిసాధనం బనియును మఱికొందఱు కర్మత్యాగమే ముక్తిహేతు వనియును మఱియుంగొందఱు జ్ఞాననిష్ఠ యొక్కటియే ముక్తి మార్గం బనియుం జెప్పుదురు మహాత్ముఁడు పంచశిఖుఁడు కర్మజ్ఞానవిభిన్న మగు తృతీయమార్గమే ముక్తిమార్గం బని తెలిపె మఱియు యమనియమాదులు గలగృహస్థులు సన్న్యాసిసములు కామక్రోధాదులు గలసన్న్యాసులు గృహస్థ సదృశులు జ్ఞానంబునం గాక త్రిదండాదులవలనను మోక్షం బగు నేని ఛత్ర చామరాదులు నట్టివ యగుఁ గార్హస్థ్యమున దోషము శంకించి దాని న్విడ నాడి యాశ్రమాంతరస్వీకారము చేసినను వాఁడు ముక్తుండు గాఁడు నిగ్ర హానుగ్రహాధిపత్యము రాజభిక్షులకుఁ దుల్యం బయి యుండ భిక్షున కగు మోక్షము రాజునకుం గాక మానదు ప్రవ్రజితుం డయినప్పుడ కాక రా జయినప్పుడును గేవల జ్ఞానంబునం జేసి పరిశుద్ధుండై పరమపదంబు నొందఁ గలండు కాషాయవస్త్రధారణము ముండనము త్రిదండము కమండలువు లోనగు నవి దంభార్థమ కాని మోక్షార్థము కాఁ జాలవు. మఱియు దారిద్ర్యముచే మోక్షము ధనికత్వముచే బంధముం గలుగఁ బోదు వినుము. 191

తే. ఏను ధర్మార్థకామముల్ పృథివిరాజ్య
మనెడుబంధనాయతనంబులను మెలంగు
చుండియును బంధములు లేనియుత్తమపద
మూని పెంపొందువాఁడనై యుంటి నిపుడు. 192

మ. విను స్నేహాయతనాదిబంధనములన్ వెల్గొందు రాజ్యంబు నాఁ
జనుపాశంబును ముక్తి నాఁబడెడుపాషాణంబునన్ దారు వె
ట్టినత్యాగాసిని గోసి సంగములఁ బాటింపంగఁ బో కున్నతం
బనపాయం బగుముక్తినిం బడయఁగా నై యుంటి నోభిక్షుకీ. 193

వ. ఓవరవర్ణినీ! నిన్ను నే నెఱింగితి నీవర్ణ మయథార్థము నీనడవడియు నొప్ప
నిది చెప్పెద వినుము. 194

సీ. నీకు రూపంబును సౌకుమార్యంబును, వయసు లోనగునవి వఱలు మిగుల
నిట్టినీకు నియమ మెట్టొకో యని నాకు, సందియ మెంతయుఁ బొందుపడియె
నీచిహ్నములకును నీచేష్టితంబులు, కా వనురూపము లబ్జనేత్ర!
నేను ముక్తుండనో కానో యనుచు సంశ,యమున నాలోఁ జొచ్చి తది తగునొకొ

తే. కామసంయుక్తమైనయోగమునకును త్రిదండ మొప్పదు నీచేత దండరక్ష
ణానరుపంబడ లేదు విముక్తునకును, సర్వరక్షయు వలయు నోసారసాక్షి. 195

వ. నీవు నాపక్ష మాశ్రయించి నాదేహంబునం బ్రవేశించి వ్యతిక్రమంబు గావించి
తివి యేమిటికి నారాష్ట్రంబునం బ్రవేశించితివో యెవనిసన్నికర్షంబున నాహృ
దయంబుఁ జొచ్చితివో నీవు బ్రాహ్మణి వగుటంజేసి వర్ణప్రవరముఖ్యురాలవు
నేను క్షత్రియుండను మన కిరువురకు నేకయోగంబు లేదు వర్ణసంకరంబు
గావింపకుము నీవు మోక్షధర్మమం దున్నదాన నేను గార్హస్థ్యధర్మమం దున్న
వాఁడ నిది ద్వితీయం బగునాశ్రమసంకరదోషము నాకు నీ వసగోత్రవో సగో
త్రవో తెలియం బడదు నీవు నన్నెఱుంగవు నేను నిన్నెఱుంగ నిట్లు నాలోఁ
జొచ్చుట మూఁడవదోషము దీన గోత్రసంకరంబు నగు నీభర్త జీవితుఁడో
మృతుఁడో ప్రోషితుఁడో కాని పరభార్య వగుట నాలవదగుధర్మసంకర
దోషము నీ విపు డిన్నియకార్యములు కార్యాపేక్షం జేసితివో యవిజ్ఞానంబునం
జేసితివో మిథ్యాజ్ఞానంబునం జేసితివో స్వాతంత్ర్యంబునం జేసితివో తెలియ
రాదు నీ కించుక శ్రుతం బున్నయెడ నీయొనర్చినదంతయు ననర్థకంబ మఱియు
మహాత్మ్యమును బ్రకటించుకొనునీదుష్టత్వమున కీచిహ్నములే నిదర్శనములు

నీవు నన్నుఁ గాక నాపరిషత్తును జయింప నెంచి వచ్చియుందు వని నీచూపులే తోఁపించుచున్నయవి పరస్పరప్రేమాస్పదు లగు స్త్రీపురుషులసంయోగ మమృతోపమంబు రక్తి లేనియెడ నాసంయోగము విషతుల్యం బని నీ వెఱుంగుము నీశాస్త్రమును నీవు రక్షించుకొమ్ము నన్నుఁ బరీక్షించితివి గావున నీ వింక నిన్ను దాఁచుకొనుట తగదు స్వకార్యార్థినివై నీయంతన నీవ వచ్చితివో పరప్రేరణంబున వచ్చితివో చెప్పుము రాజును ద్విజరాజును గుణవతి యగుసాధ్విని మోస సేయ దోసం బగు మృషావాదులు హతులగుదురు రాజుల కైశ్వర్యము బ్రాహ్మణులకు వేదము స్త్రీలకు రూపయౌవనసౌభాగ్యములు నుత్తమబలంబులు స్వార్థాపేక్షు లార్జవంబున మెలంగ వలయు ననార్జవంబు వినాశకారణంబు నీవు నీజాతిశ్రుతవృత్తభావములు నాగమనకృత్యమును యథార్థకథనంబు గావింపు మనిన సులభ యసుఖంబులు నయుక్తంబులు నసమంజసంబులు నగు రాజవచనంబులు విని చలింపక ప్రసన్నముఖయై ప్రియవాక్యపురస్సరంబుగా ని ట్లనియె. 196

జనకునిప్రశ్నంబులకు సులభ ప్రత్యుత్తరం బిచ్చుట.

సీ. నరనాథ! వాక్యము నవశబ్దదోషముల్, నవబుద్ధిదోషముల్ దవులకుండ
సదుపపన్నార్థమై పదియును నెనిమిది,గుణములు గలదయి గణుతి కెక్కి-
సౌక్ష్మ్యముం గ్రమమును సాంఖ్యమునిర్ణయం,బును బ్రయోజనమనంజనెడునైదు
నర్థంబులఁ దలిర్చు నదియె వాక్యం బని, పండితవర్యులు పలుకుచుంద్రు

తే. పదపదార్థవాక్యంబులఁ బొదలుచుండు, నట్టిసౌక్ష్మ్యసాంఖ్యాదులయర్థలక్ష
ణములు వేర్వేఱ వివరించి క్రమ మెసంగఁ, జెప్పెదను జిత్తగింపుము క్షితితలేశ.

వ. భిన్నభిన్నంబు లైనజ్ఞేయంబులందు జ్ఞానంబును భిన్నంబుగ నుండునట్టిపట్టున సమ్యగ్విధానంబున బుద్ధిం బ్రసరింపఁ జేయుట సౌక్ష్మ్యంబు గుణదోషప్రమాణము విభజించి యెఱింగి యర్థనిర్ణయంబు సేయుట సాంఖ్యంబు వివక్షితార్థము లెఱింగించునప్పుడు పూర్వాపరక్రమం బెఱింగి వచించుట క్రమంబు ధర్మార్థకామమోక్షంబులు ప్రతిజ్ఞ చేసి తద్విధం బిది యని పలుకుట నిర్ణయము రాగద్వేషభవం బైనదుఃఖంబు విజృంభించినప్పుడు దాని నడంగించుట కైన ప్రవృత్తి ప్రయోజనం బివి కలదియే సద్వాక్యంబు మఱియు నుపేతార్థ మభిన్నార్థము న్యాయవృత్తం బనధికంబు నసందిగ్ధంబు నపురుషంబు గుర్వక్షరవిరహితంబు నపరాఙ్ముఖసుఖంబు ననృతశూన్యంబు త్రివర్గావిరుద్ధంబు సుసంస్కృ

తంబును గటుకశబ్దవిహీనంబును గ్రమసహితంబును శేషరహితంబును వ్యర్థము
కానిదియుఁ గారణము లేనిదియు నగువాక్యముం బలుక వలయుఁ గామక్రోధ
భయలోభదైన్యములు నయోగ్యత మందాక్షము పశ్చాత్తాపము మానము
నివి కలిగి పలుక రాదు మఱియును. 198

సీ. వక్తయుఁ శ్రోతయు వాక్యము వికలము,గాకున్న సమతమైఁ గ్రాలునర్థ
మనమతితో శ్రోత నరయుచు వక్త స్వార్థము పల్కు నది వ్యర్థతను గమించు
స్వార్థము న్విడిచి పరార్థమే పలికిన, శంకింతు రదియు దుష్టంబ యగును
వక్త యయినవాఁడు స్వపరపక్షములకు, నవిరుద్ధముగఁ బల్కు నగు హితంబు

తే. అట్టియర్థము గలిగెడునట్టు లెంచి, నీసమక్షమునం దిప్డు నేను వాక్య
మెసఁగఁ జేయుచునుంటినో నృపవరేణ్య!, విననవధరింపు మవహితమనముతోడ.

సీ. జతుకాష్ఠములు పాంసుసముదయంబును జల,బిందువుల్ గూడెడుచందమునను
లోకమునం బ్రాణు లేకమై యుండున,ట్లింద్రియార్థంబు లింద్రియములు
వే ఱయ్యు జతుకాష్ఠవిధమున మేనితో, నంటుఁ జోదన వాని కరయ లేదు
వాని కొండొంటిని గాన నా విజ్ఞాన,మింతయు లే దని యెఱుఁగ వలయు

తే. నవి స్వకార్యము లొనరించునపుడు బాహ్య
విషయములు సైతముం గోరు వినుము కన్ను
రూపము ప్రకాశమును మూఁడు చూపునకును
హేతు లగు నిట్లె తక్కినయింద్రియములును. 200

వ. ఇంద్రియంబు లెల్ల జ్ఞానజ్ఞేయంబులకు హేతువు లగుచుండు నట్టిజ్ఞానజ్ఞేయాంతరంబున మన స్సనునపరగుణం బేకాదశంబై విషయంబుల మంచిచెడ్డల నిశ్చయించుచుండు ద్వాదశం బగుబుద్ధి యనుగుణంబు సంశయగ్రస్తవిషయమ్ముల నిశ్చయించుచుండు నవ్వలఁ ద్రయోదశం బగుసత్వంబు గలదు దానం జేసి జంతు వల్పసత్వ మనియు మహాసత్వ మనియు నూహింపఁ బడుచుండు నంతఁ జతుర్దశం బై నాది నేను జేయుదు ననునొక్కగుణంబు గల దది యహంకారంబు దీనిపైఁ బంచదశం బైనగుణంబు గల దది పూర్వవాసన లోక మంతయు దాని ననుసంధించి యుండు దానిపై షోడశం బగువిద్య యనుసంఘాతగుణంబును బ్రకృతి యనుసప్తదశగుణంబును వ్యక్తి యనునష్టాదశగుణంబును గలవు పిమ్మట సుఖదుఃఖములు జరామరణంబులు లాభాలాభంబులు ప్రియాప్రియంబులు నను నేకోనవింశం బగుగుణం బగు నది ద్వంద్వయోగంబు నాఁబడు

దానిపై వింశతిగుణంబై కాలం బనునది కలదు దాన భూతంబులకు జననమర
ణంబులు గలుగుచుండు నివి గాక పంచభూతమ్ములును భావాభావంబులునుం
గూడి సప్తవింశతిగుణంబు లగు మఱియు విధిశుక్రబలంబు లనుగుణత్రయం
బిన్నియుం గూడి త్రింశద్గుణంబు లగు నివి కలదియ శరీరం బీముప్పదికళలకు
నవ్యక్తప్రకృతియే కారణం బని కొంద అందురు స్థూలదృష్టు లగుమఱికొం
దఱు పరమాణువే కారణం బందురు వ్యక్త మైన నవ్యక్త మైన నుభయ మైన
లేక పురుషుఁడు మాయ జీవుఁడు నవిద్య యనునాలుగుం గాని కారణం బగు
చున్న దధ్యాత్మచింతకులు సర్వభూతములకును బ్రకృతియే కారణం బందు
రవ్యక్తప్రకృతి కళారూపమున వ్యక్తతను గాంచుచున్న దవధరింపుము. 201

క. నేనును నీవును దక్కిన, ప్రాణులునుం బ్రకృతి నైనవారమ గర్భ
స్థానమున శుక్రశోణిత, యానంబునఁ బుట్టి నైతి మని యెఱుఁగ నగుఁ. 202

సీ. మున్ను బిందున్యాసమునఁ గలలం బగు, నందున బుద్బుదం బగుచు నుండు
బుద్బుదంబునఁ జేశి పుట్టు నద్దానిచే, నంగంబు లన్నియు వ్యక్తము లగు
నంగంబులం దభిష్వంగంబు లగునఖ,రములు రోమమ్ము లీక్రమ మెసంగ
నెలలు తొమ్మిది నిండ నెఱిమీఱి జంతువు, జనియించి లింగంబుసంగతి మెయిఁ

తే. బురుషుఁ డేనియు స్త్రీ యేని సరగ నగుచు, వెడలు నెట్టనిగోళ్లును వ్రేళ్లు గలిగి
బాల్యయావనకౌమారవార్ధకమ్ము, లవలనొగినొందురూపుమార్పుగుచు నుండు.

వ. మఱియుఁ బ్రతిక్షణమందును దేహకళలు మాఱుచుండు నివి సుసూక్ష్మంబు
లగుటం జేసి దీపశిఖయందలిమార్పుం బోలెఁ దెలియం బడకుండు దేహస్థితి
మహాజవంబునం బాఱునశ్వంబువలె నుండు నిట్టిచో నెవ్వఁ డెక్కడినుండి
వచ్చె నెక్కడికిం బోవు నది నాది యిది నీది యనుట లజ్ఞానసంభవంబులు
భూతంబులకు నవయవంబులకును సంబంధము మృగ్యంబు సూర్యకాంతము
నుండియు వీరుధులనుండియు నగ్ని పుట్టినట్లు ప్రాణులును బూర్వోక్తకళా
సముదయంబునఁ బుట్టుచుండు నోయిజనకా! నీవు నీదేహమందు నితరదేహము
లందును సమబుద్ధి గలిగినవాఁడ వేని నన్ను నీ వెవ్వతె వనియు నెందులకు
వచ్చితి వనియు నేమిటికిఁ బ్రశ్నింతువు నీప్రశ్నంబులకు ఫలం బేమి శత్రు
మిత్రమధ్యస్థులయందును జయవైరాదులందును జతనంబు గలిగినరాజులకు
ముక్తిలక్షణం బెట్టిది సప్తవిధం బగుత్రివర్గ మెఱుంగనివారు ముక్తు లనుట
యెట్లు చెప్పు మని మఱియును. 204

ఉ. ముక్తుఁడ నైతి నే ననుచు మూర్ఖునికైవడి మాటలాడుచుఁ
యుక్తులు కొన్ని పన్నితి వయో యభిమానము మాన వైతి నీ
రక్తి నెఱింగి నిన్ దెలుపఁ బ్రాజ్ఞులు నే జతనింప రోటు నీ
ముక్తివచఃప్రసంగము ముమూర్షువు నౌషధ మట్టు లయ్యెడిన్. 205

తే. దానపుత్రాదిసంగమస్థానములను, నాత్మనెంచుచు శయనాసనాదు లైన
నాల్గుకర్మముల వశంబున నైలంగు, నీకు ముక్తలక్షణ మెట నొకదయ్య. 206

వ. ఈభూమండలం బెల్ల నేకచ్ఛత్రాధిపత్యమున నేలురాజచంద్రుండు నొక్కఁ డొక్కపురంబున నొక్కగృహంబున నివసింప వలయు నొక్కశయనంబున శయింపవలయు నం దర్ధంబు సహధర్మిణి కొసంగవలయు నిట్లగుటం జేసి యతం డల్పఫలం బనుభవించు నిట్లే భోజనాచ్ఛాదనాద్యుపభోగంబులును బరిమి తంబులు నిగ్రహానుగ్రహంబులందు సంధివిగ్రహాదులందును గ్రీడావిహారాదు లందును స్వాతంత్ర్యవిరహితుం డగునతం డమాత్యాదులకు వశుండై వారి చేతిలోనిబొమ్మయై యుండు భయనిమిత్తంబు లేకున్నం బరరాజులవలని భయంబు నొందుచుండు రాజును గృహస్థుం బోలినవాఁడ కాని యధికుండు కాఁడు సాధారణమానవుండు వోలె రాజును రాగద్వేషాదులకును సుఖ దుఃఖాదులకు లోనై పరితపించుచుండు నదిగావున నల్పసుఖదంబును బహు దుఃఖజనకంబు నై ఫేనబుద్బుదముం బోలినరాజ్య మభిలషించువాఁ డెవ్వండు నోవిదేహరాజా! రాష్ట్రబలకోశామాత్యాదులు నీవిగా నెంచుచుండు వవి నీయవి కావు రాష్ట్రప్రజలవి ప్రజలు నీలోనిలోపం బెఱింగి నిన్నుఁ గా దని యన్యునిన్ రాజుగాఁ జేసికొందురు మఱియు సప్తాంగమ్ములు రాజ్యమ్మున కంగమ్ము లవి యొకొక్కకతఱి నొకొక్కటి ప్రాముఖ్యముం గాంచుచుండు క్షత్రధర్మసక్తుం డగురాజు ప్రజలనుండి పదియవపాలు గొని యనుభవింపం దగు రాజ్యపాలనము చేయురాజు ధర్మప్రవర్తకుం డగు టరిది ధర్మంబు లేనిచో ముక్తి లేదు రాజునకు రాజ్యపాలనాదికము దుఃఖాకరమ్ము రాజ్య ముత్త మమ్ముగఁ బరిపాలించినవారు వేయికొక్కఁడు కోటి కొక్కండుగ నుండునో యని తలంతు నని మఱియును. 207

తే. నాకు నాదేహసంగమే లేక యుండు,నపుడు పరదేహసంగ మె ట్లగునొ తెలియ
దిట్టినను నివ్విధంబున బిట్టువలుకు, టర్హ మని యెంచుకొంటివే యవనినాథ.

సీ. పంచశిఖునితో నుపనిషత్తులు నుపాయ,ములు నుపాంగంబులు గలిగియున్న

మోక్షధర్మము లెల్ల శిక్షమైఁ గఱచితి, ముక్తసంగుఁడ వైతి రక్తి విడిచి
ఛత్రాదులఁ బెండి సక్తిపడఁగ నేల, శ్రుతము నీచే నేఁడు శ్రుతము కాదొ
యాశ్రుతం బెల్లమృషాశ్రుతంబయ్యెనో, శ్రుతమట్టిశ్రుతమేది శ్రుతముగాని
తే. లౌకికజ్ఞానముం గల్గి ప్రాకృతునకుఁ, దీటువచ్చితి ముక్తుఁడ వోటు ముక్తుఁ
డైన నీలోన నాసత్వ మైనమాత్ర, నాయొనర్చిన యపకృతి యేయది యొకో.
క. క్షితిఁ గలధర్మము లన్నిట, యతులకు శూన్యప్రవేశమం దగుట మహా
న్నతధర్మ మేను శూన్యస్థితి కగునీమదినిఁ జొచ్చితిఁ దోష మొకో. 209
క. వ్రేళులచేఁ జేతులచేఁ, గాళులచేఁ దొడలచేతఁ గాయమునందుం
గ్రాలెడునవయవములచేఁ, బోలింపఁగ నిన్ను ముట్టఁ బోవ నిలేశా. 210
*క. కులగౌరవంబు గలిగియుఁ, దెలిసియు బిడియంబు లెస్స తిలకించెడుధీ
గల వయ్యు నిటు రహస్యము, సెలవిత్తువె మంచి దైనఁ జెడ్డది యైనన్. 211
మ. గురువుల్ మాన్యులు బ్రాహ్మణోత్తములు నీకుం గూర్చువా రెక్కు రీ
పరిషన్మధ్యమునందుఁ బొందుపడి రో బ్రహ్మజ్ఞ! నీ పుర్వరే
శ్వరుఁడై తిందఱిలో వచింపఁ దగునే వాచ్యం బవాచ్యంబునుం
బరిశీలింపక స్త్రీపుమాంసులగతిన్ స్పష్టంబు గావించుచున్. 212
క. నలినీపర్ణస్థిత మగు, జల మచ్చోట నంట కుండుసరణి న్నీలో
పలఁ జొచ్చి నిన్ను నంటక, మెలఁగుదు నో రాజచంద్ర! మే లెంచ వదో.
క. నేను స్పృశించిన స్పర్శజ్ఞానము నీచిత్తమందు జనియించె ననం
గా నీకుఁ బంచశిఖుఁడిడు, జ్ఞానము విషయములనుండి సడలదు సూవే. 214
తే. చ్యుతుఁడ వైతివి గార్హస్థ్యగతులనుండి, యున్నతం బగుమోక్షమునొంద వైతి
వుభయమధ్యగతుండవై యురకముక్తి,ముక్తియనిమాటలాడుదువుక్తిమెఱయ.
సీ. వర్ణసంకర మన వచ్చునే ముక్తున,కును ముక్తసంగతి పొనరు టరయఁ
బ్రకృతియుఁ బురుషుండు గ్రాలిన యట్లగు, భేదబుద్ధుల కట్టివాద మొదవు
మేనులు వే రైనఁ గాని నీయాత్మ నా,యాత్మయు వేఱుగా దనుచు నెంచి
నిలిపితి నాబుద్ధి నీయందు నా కిందు, దోష మిట్టిది యనఁ దొడరు నెవఁడు
తే. కుండయును బాలు మక్షిక గూడి యున్న, నరయ వే ఱగునట్లు వర్ణాశ్రమాది
ధర్మములు ముక్తునందును దవిలి యున్న, నతని నంటవు మనపొందు నట్టియదియ.
శా. ఏ వర్ణోత్తమ గాను వైశ్యయునుగా నే శూద్రసంభూత గా

* సెలవిమ్ము-చెప్పుము; ఇట్లు పూర్వార్థమందు వ్యవహారము కలదు.

నీవు న్నేను సవర్ణసంభవుల మూహింపం బ్రధానుండు నాఁ
జేవం గాంచినరాజచంద్రునికులశ్రీ గల్గి జన్మించితిన్
జూవే నే సులభాహ్వయం దెలియుమీ క్షోణీతలాధీశ్వరా. 217

వ. మున్ను మాపూర్వులు గావించినసత్త్రంబులకు సుత్రాముం గూడి ద్రోణుండును శతశృంగుండును జక్రద్వారుండును బర్వతుండును వచ్చి పోవుచుండువారు నే నట్టిపరిశుద్ధవంశంబునం బుట్టినదాన నాకు ననురూపుం డగుభర్త లభింపమిం జేసి పరిణయంబు లేక మోక్షధర్మంబులందు వినీతనై మునివ్రతంబు చరించుచున్నదాన నాకర్ణింపుము. 218

సీ. జననాథ! కపటవేషము వేసికొన లేదు, పరధనంబు హరించుపనికి రాను
ధర్మసంకరమును దలఁప ధృతవ్రత, నై స్వధర్మంబునయంద యుంటి
స్వప్రతిజ్ఞ చెడంగ సంచరింపను బరి, శీలింప కేవల్యు సేయఁ బోను
దగ నారయక నీదుదరికి రా నీవు ము, క్తుఁడ వని వచ్చితిఁ గడిమి నెఱుఁగ

తే. స్వపరపక్షభేదము లేనిసరణి నుంటి, గొప్పతనమును బ్రకటించుకొనుట లేదు
ముక్తుఁడుజయేచ్ఛనుండఁ డేప్రొద్దుగాని, శాంతునకుశాంతియుండుటసహజగుణము

వ. భిక్షుం డగువాఁడు గ్రామైకరాత్రంబుగాఁ బర్యటనంబు సేయుచు శూన్యగృహంబునఁ గాలంబు గడుప వలయుం గావున నే నీరాత్రి శూన్యం బగు నీశరీరంబున నివసించి నీయాతిథ్యసత్కారంబులం బరిగ్రహించి రేపకడం బోయెద ననిన సహేతుకంబులు నర్థవంతంబులు నగుసులభావచనంబులు విని జ్ఞానఖని యగునాజనకుండు మాఱాడ కూఱకుండె నని తెలిపిన నజాతశత్రుండు స్వర్ణదీపుత్త్రుం గాంచి పితామహా! వ్యాసపుత్త్రుం డగుశుకుండు నిర్వేదంబు నొందినవిధంబు విన నెంచితి మఱియు వ్యక్తావ్యక్తనిశ్చయంబును బుద్ధినిశ్చయంబును నజునాకృతియుం జెప్ప నర్హుండవనిన దేవవ్రతుం డి ట్లనియె. 220

వేదవ్యాసుఁడు శుకున కుపదేశించినవైరాగ్యప్రకారము.

క. ప్రాకృత మైనసువృత్తము, గైకొని తా నెందు భయము గలుగనివాఁడై
లోకమునఁ దిరుగుశుకునిన్, వాకొనియెన్ శ్రుతులు గఱపి వ్యాసుఁడు ప్రీతిన్.

వ. దానిం జెప్పెద నవహితుండ వగుము. 222

ఆ. తనయ! నీవు ధర్మమును లోన సేవింపు, మాతపంబు హిమము మాతరిశ్వ
నాఁకలియును డప్పి ననిశము సైఁచి జి, తేంద్రియుండ వగుచు నెసఁగు మెగిచి.

సీ. సత్య మార్జవమానృశంస్య మక్రోధము, ననసూయయును శమంబును దమంబు

దపము నహింసయుఁ దగువిధిం బాలింపు, మెపుడు ననార్జవ మెల్ల విడిచి
సత్యమం దుండుము నిత్యధర్మరతుండ, వగుము దేవాతిథు లారగింప
నగు శేషమున జీవయాత్ర సాఁగింపుము, ఫేనోపమం బైన మేనియందుఁ
బక్షివలెజీవుఁడింతలోఁబఱవనుండుఁ, బ్రియులతోఁబొత్తనిత్యమైవెగడుగుడుపఁ
జూచుచుండంగజగమెల్లసుఱుఁగుచుండ, నెట్లునిదురింపఁగలిగెదవెఱుఁగఁజెపుమ
బలవంతు లగుచు నీదా,యలు మఱవక జాగరూకులై పడి నిన్నుఁగా
బొలియింప వేచి యుండుట, తెలియవు బాలుండ వైతి తెలిపితి వినుమా. 225
పాయనివడి నాళులు పో, నాయువు క్షీణింపఁ గృశత నందఁగ జీవుం
డీయెడఁ దెలిసియుఁ దిరుఁడవ, వై యుండెదు లేచి పాఱ వకట యి దేమో.
పారలౌకికసుఖదములౌ పనులు విడిచి, నాస్తికాధములై మూఢు లైహికంబు
పలలశోణితసంబంధబంధురంబు, నాససేయుదు వేమందు నక్కటకట. 227
బుద్ధిమోహసమన్వితుల్ పురుషు లేరు, ధర్మమందు నసూయను దవిలి వారి
వారియపమార్గమునుబట్టి వారుపాప,భాక్కులై నారకవ్యథల్ పడయఁగలరు.
శ్రుతిధర్మపరు లగుసుజనులం గని యుపా,సింపుము వారలఁ జేరికొనుము
పండితులమతంబుఁ బట్టి యుత్పథగామి, యగుచిత్తమును నాఁగు మమలబుద్ధి
నించుకించుక గాఁగ నెక్కుము ధర్మని, శ్రేణి నుత్పథ మధిష్ఠింప నగుము
కోశకారము చుట్టుకొని త్రెళ్లినట్లు గా,కుము సంసృతిం బడి కొట్టుకొనుచు
నాస్తికుని భిన్నమర్యాదునంటఁబోకు, మూర్తిమృత్యువు కామమోహాదులుగల
యింద్రియజలాబ్ధి ధృతినావనెక్కి జన్మ,దుర్గములదాఁటనెంచు మనర్గళముగ.
నడుచు నప్పుడొకూర్చుండుగడియయందొ, పండినప్డా హతాద్గతి వచ్చి మిత్తి
నెత్తిపైఁ బడుమర్త్యునకత్తరుణము, నిర్వృతియటంచుఁజెప్పఁగ నేరఁ డెవఁడు.
కామములఁ దృప్తి గానక, నేమెయి నవ్వాని రోయ నే యగువానిఁగా
భీమ మగువృకము మేకను, నా మృత్యువు వచ్చి కొంచు నడచుఁ గుమారా.
ధర్మబుద్ధిమయము నిర్మల మగుదివ్వెఁ, జేతఁ బూని దానిశిఖను బ్రజ్వ
లింపఁ జేసికొనుచుఁ బెంపగునంధకా,రమ్మునందుఁ జొరఁగఁ బొమ్ము పుత్ర. 232
. నానాదేహము లెత్తుచుం గ్రమమున న్మర్త్యత్వ మందుంగా ద్విజ
త్వానందంబును గాంచి దాని విడి వేత్రై ఘోక కాపాడుకో
నా నాబ్రాహ్మణదేహ మారయఁగఁ గామార్థంబ కా దిందు నెం
తేనిం గస్తికి నై తపించి పరమం దెప్డుంగా సుఖింపం జుమీ. 233

క. ఘనతపము లాచరించిన, వెనుకన బ్రాహ్మణ్య మబ్బు విశ్వంభర దా
నిని బొంది జనుఁడు క్రీడలఁ, దను వీఁగఁగఁ జేసికొంట తగదు కుమారా. 234

వ. నీవు క్షేమం బర్థించి స్వాధ్యాయంబునందును దపంబునందును దమంబునందును నిత్యయుక్తుండవై కుశలం బందఁ బ్రయత్నింపుము. 235

సీ. పదియాఱుకళలతోఁ బరఁగునవ్యక్తదేహము గలిగిన వయోహయ మెసంగు
దానిస్వరూప మత్యంతసూక్ష్మము క్షణ, త్రుటులు నిమేషముల్ రోమములును
శుక్లకృష్ణంబులు సూచునేత్రంబులు, సంధ్య లంసములు మాసమ్ము లంగ
కము లది వడివడి గాఁ బరువెత్తెడు, గాలికిం బోలినగతులు గలిగి

తే. నీకుఁ గన్నులు గలవేని నిలక పఱచు, నట్టిదై కాన రానట్టియడవిదారిఁ
బట్టి పోవుటఁ గనుఁగొని పరమగురుని, సదుపదేశమునం ధర్మసరణి నిలుము. 236

ఆ. ధర్మదూరు లగుచు ధర దుష్టకార్యము, లాచరించువార లైన వారు
చచ్చి నిరయమందు సతతంబు బహువిధ, కష్టములను బొందఁ గలరు వింటె.

తే. ధర్మపరుఁ డైనరాజు సత్కర్మముల శు
భాశుభంబుల నరయుచు నవని నేలి
సుకృతఫల మందు సుజనుండు సుకృతమున మ
హోన్నతము లగులోకము లొందుఁ జూవె. 238

చ. నరు లొనరించుదుష్కృతుల నారకముం గనఁ బోయి యందు భీ
కరరదనంబు లైనశునకంబు లయోముఖకాకకంకముల్
నిరతము మేనికండలను నిల్వునఁ దీసి భుజింప నెత్తురుల్
పురువులు గ్రోల యాతనలఁ బొందెద రెంతయు సంతపించుచున్. 239

క. విశదగతి విధి యొనర్చిన, దశవిధమర్యాద లెల్లఁ దాఁటుచు నేనో
వశుఁ డగుదుష్టజనుఁడు దుర్దశ కై పితృవసతిఁ దాపతప్తుఁ డగు నొగిన్. 240

చ. దురితము లాచరించుచును దుష్టమతి న్నికృతిప్రియుండు నై
పరులను మోసగించుచును బల్కు చపత్యము లీల్గువాఁడు నై
తరణి మునింగియుం బరశుదారువనాంతరగామి యై నిరం
తర మసిపత్రసంతతులు దార్కొనఁ జేర్కొనుదుఃఖ మొందెదున్. 241

తే. ఏవిధో చూతువేకాని యీవు పరమపద మపేక్షింపకున్నాఁడ విది విచిత్ర
మింక నపేక్షింపనొప్పదొక్కింతలోనె, వచ్చిపడు జరాఖ్యవిపత్తు పెచ్చుపెఱిఁగి.

సీ. యమరాజశాసన మయినంత మిత్తి కై, పోఁ గల వట్టి యముండు పరుల

బాధ లెఱుంగఁడు బంధుమిత్రాదులతో జనుం బడఁద్రోసి తోకొని చను వానివారించెడువాఁడెవ్వఁడును లేఁడు, మునుమున్న సుకృతంపుపుంతఁ బొమ్ము యమమారుతము నీదుసముఖమందే యగు, నా భయ మగుదెంచునపుడు నీకు

ఆ. దిక్కు లెఱుఁగ రావు తెలిసినశ్రుతియు విరుద్ధ మగును గాన నిద్ధబుద్ధి
మెయి సమాధి నొంది మీఁదఁ జింతింపని,పగిదిశాస్త్రవిధులఁదగులు మిపుడ.

చ. జర చనుదెంచి నీతనువు జర్జరితం బొనరించి రూపస
త్వరతి నడంచినంత గరువంబున మృత్యువు రోగసాది యై
పరువడి వచ్చి ప్రాణములు వాయఁగఁ జేయును గాన నింతలోఁ
బరమతపం బొనర్చి మృతిఁ బాయఁగఁ దోలెడు దారిఁ జూడుమా. 244

సీ. అంధకారముఁ గంట నరయవు గిరిమూర్ధమందు స్వర్ణాగము నరయఁ గలవు
దుస్సంగతిం జేసి తొడిబడుశత్రువుల్, నీఱంకఁ జూడక పోవ నెంత్రు
దొరలు దొంగలు హరింపరు చచ్చిన న్విడి, పోని పెంధనమును బొంద వచ్చు
నెంత లెంతల కైన నింతయుఁ గొనరాని, పరమపదంబును బడసి కొందు

తే. వీ విఁకని మేషమాత్రము నేని మసలఁ
బోవక యతవ్రతంబును బూని ధర్మ
నిరతుఁడై యింద్రియార్థముల్ పరిహరించి
కనుము పరమాత్మ జ్ఞానయోగమునఁ జేసి. 245

క. త్రెళ్లిన నీవెంబడి నీ, తల్లియుఁ బుత్రులును బంధుతతియును బ్రియులున్
దెల్లముగ రారు నిక్కము, తొల్లిటినీకర్మ మెల్లఁ దోడయి వచ్చున్. 246

క. పరలోకమందుఁ దనకున్, సిరియున్ సంపదయుఁ దోడు సేయవు కృత మై
పరఁగుశుభాశుభకర్మము, సరి చెప్పుచు నాత్మ యొకఁడె సాక్ష్యం బిచ్చున్. 247

వ. మఱియు దేహాశ్రితసూర్యాగ్ని వాయువులు జీవునికర్మంబునకు సాక్షు లగు చుందురు పరలోకమార్గంబున భయంకరంబు లగువిరూప రౌద్రమూర్తికంబులు చుట్టుముట్టినట్టియెడ స్వకర్మమే తోడుపాటు గావించు నటఁ దనకర్మఫలంబు తానపొందు నొరుఁడు పొందం బోఁడు మహర్షులు లోనగువారు తమసుకృత ఫలంబునన విమానంబు లెక్కి విహరింతురు మఱియు నాపుణ్యపురుషులు నిజ ధర్మంబులంజేసి యింద్రచంద్రాదిలోకంబులం బొందుచుందురు బుద్ధిహీను లగు వారిం బట్టి ధర్మమూర్తి మోహాపాశంబులం గట్టి బిట్టడంచుచుండు నోయి పుత్రకా! నీ కిప్పటి కిరువదిరైదువత్సరంబు లతిక్రమించుచున్నవి దేహాపాట

వంబు తగ్గకయమున్న ధర్మపాలనంబు గావింపుము పరలోక ప్రయాణంబున నీకు ముందువెన్కల నెవ్వరు నుండువారు కానరారు గావున వారితగులంబు విడి నీవు నీదారిం జూచుకొమ్ము సత్కర్మాచరణంబున నీభయంబు నీవ తొలంగించుకొమ్మిట్లు నా తెలిసినంతవట్టు శాస్త్రనిదర్శనంబు లభివర్ణించితి నీ విట్లు ప్రవర్తింపుము గ్రామవాసము బంధరజ్జు వది పుణ్యాత్ములు త్రెంచుకొనంజాలుదురు దురాత్ము లట్లు కాఁ జాల రని మఱియును. 248

సీ. నీ కేరితోడను బో కంతయుఁ బ్రయోజనము లేదుగుహానున్న యమలమూర్తి
నరయుము నీ పూర్వు లరిగిన దెఱుఁగుము, రేపటిపని యిప్పుడే పొనర్పు
మది యయ్యెనో లేదోయనిమిత్తి చూడదు,మృతునగ్ని నిడి జ్ఞాతు లేగు దెంత్రు
కాలపీడిత మయి కడతేరు జగ మని, తెలిసి ధర్మ మొనర్పఁ దలఁపు మెడఁద
తే. నెవ్వఁ డీదర్శనోపాయ మెఱిఁగికొనునొ
వాఁ డిహాముత్రసుఖ మొందు వర్ష్మ మెడయు
నంత మరణము నాక మహాత్ములు చను
పథమునం బడి చనువాఁడె పండితుండు. 249

వ. ధర్మభ్రష్టుఁడు మోహపాశబద్ధుం డగు సత్కర్మనిరతుండు స్వర్గంబును దుష్కర్మనిరతుండు నిరయంబునుం బొందుచుందురు స్వర్గసోపానభూతంబును దుర్లభంబు నగుమానుష్యము నొంది భ్రంశము లేకుండునట్లు జనుండు సమాధినిష్ఠుండు గాఁ దగు సత్పథంబు విడువనివాఁడు పుణ్యాత్ముఁ డతనిబుద్ధి నిరుపహతం బై నిశ్చయజ్ఞానం బవలంబించి నిర్భయం బగు స్వర్గవాసంబు లభింపఁ జేయు భోగపరిత్యాగి యై తపించువాఁడు పొందరాని దేదియును లేదు గావునఁ దపంబు సర్వోత్తమం బని చెప్ప నొప్పు మఱియును. 250

ఉ. వేలకొలంది తల్లులును వేలకొలంది సతీసుతాదులుం
గాలవశంబునం గలిగి కాలవశంబునఁ గూలిపోయి రీ
వేల విచారముల్ సలుప వెవ్వని కెవ్వఁడు చుట్ట మిట్టిచోఁ
బోలనిబాంధవంబునను బొక్కుట మోహము గాక యుండునే. 251

తే. వారికిని నీకు సంబంధబాంధవములు, లేవు పుట్టిరి వారును నీవు నట్లె
పుట్టితివి కర్మసంగతి పురుషవర్య!, నీకు నీవే యటంచు నే వాకొనియెద. 252

ఆ. ధనము ననుసరించి జనము స్వీయం బగు, ధనము లేకయున్నఁ దనకు స్వీయుఁ
డెవఁడు గాని లేఁడు భువి బాంధవం బిట్టి, భంగియనుచు నీ వెఱుంగు మెడఁద.

క. జనుఁడు కళత్రాపేక్షం, గనుఁ గానక శుభవిహీనకర్మము లోగిన్
బొనరించి యిహాపరంబుల, ఘనతరకష్టముల నొందఁ గలుగుం జుమ్మీ. 254

మ. ఋతుమాసాఖ్యనెసంగుదర్విఁ గొని యెంతేఁ బ్రీతిఁ గాలుండు సం
తతమర్కాగ్నిని రేఁబవళ్లనెడునిద్ధంబుల్ రగుల్కొల్పి భూ
తతతిన్ లోకకటాహమం దొగి బలాత్కారంబునం బెట్టి సం
చితకర్మం బదిసాక్షిగాఁ బచనముం జేయున్ నిమేషంబునన్. 255

తే. సుకలులకుఁ గానిధనమును సూడు నోర్వ, లేనిబలమును జ్ఞానము లేనిచదువు
నవిజితేంద్రియుఁ డగువాని కాత్మవిత్త్వ,మంతయును వ్యర్థమని బుధులందురరసి.

వ. పుత్రకా! నీ కిట్లు చెప్ప నగునంత చెప్పితి దాని ననుసరించి ప్రవర్తింపు మనిన
విని విజ్ఞానంబు వడసి శుకుండు మోక్షోపదేశికుం డగుతండ్రికడ ననుజ్ఞ వడసి
చనియె ననినఁ గురూద్వహుండు కురుపితామహుం గాంచి యజ్ఞదానతపశ్శు
శ్రూషలం గలఫలంబు తెలుపు మనిన నతం డిట్లనియె. 257

ఆ. ఎవఁ డనర్థయుక్త మవునాత్మ చేఁ బాప,మునను మనము నిలుపఁ బోవునతఁడు
కలుషకర్మములను సలిపి మహాక్లేశ,ములకుఁ బాలువడును సలలితాత్మ. 258

వ. పాపకర్ములు దరిద్రులై దుర్భిక్షమునుండి దుర్భిక్షమును గ్లేశమునుండి క్లేశ
మును భయమునుండి భయమ్మును బొంది మృతులకంటె మృతులు నాఁబడు
దురు మఱియు శ్రద్ధధానులు దాంతులు నగుపుణ్యాత్ములు ధనవంతులై యుత్స
వంబునుండి యుత్సవంబును స్వర్గంబునుండి స్వర్గంబును సుఖంబునుండి సుఖం
బును బొంది యమృతులకంటె నమృతులు నాఁబడుదు రాకర్ణింపుము. 259

తే. నాస్తికులు వ్యాలశార్దూలనాగదుర్గ
మాధ్వమును బట్టి పోవుదు రమలచిత్తు
లుత్తములు క్షేమకర మయి యుండునుత్త
మాధ్వమును బట్టి పోవుదు రని యెఱుఁగుము. 260

క. విను ధర్మ మాచరింపని, జనుఁ డోషధులం బులాకసరణి ఖగములం
గనఁ జాత్యండముపగిదిం, జనులందు నిరర్థకుండు నాఁబడు నధిపా. 261

సీ. మనుజుం డొనర్చుకర్మ మతండు పఱచినఁ, బఱచును బండినఁ బండి యుండుఁ
గూర్చుండినం దాను గూర్చుండు నీడ నా, ననుసరించున్ విడనాడ కట్లు
సుకృతదుష్కృతములఁ జూపట్టుఫలము జన్మాంతరంబుల నైన నంద వచ్చుఁ
గర్మానుగుణముగాఁ గాల మాతనిఁ బట్టి, యొడళులం గట్టి లాగెడిని దవ్వ

తే. కాలమునఁ జెట్లు పుష్పించుకరణిఁ బూర్వ
కర్మములు ఫలియించెడుఁ గర్త నంటి
యొకఁ డొసంగినయవి కావు సుకము దుఃఖ
మును మనుష్యుఁడు తాఁ దెచ్చుకొనినయవియ. 262

వ. గర్భశయ్యం జేరినది మొద లేసమయంబునం జేసినది యైనఁ బూర్వదేహిక కర్మంబు జన్మాంతరంబున నాయాసమయంబున శతసహస్రగోమధ్యంబున నున్న తనతల్లినిం దెలిసి వత్సంబు కలియ వచ్చెడుమచ్చునఁ గర్తం గలియ వచ్చెడు మలినవస్త్రంబు వారిపూతం బగున ట్లుపవాసాదులచేతం బ్రతప్తు లగువారు పూతు లగుదు రనినఁ బూరువంశపవిత్రుండు నదీపుత్రుం దిలకించి మహాతపస్వి యగువ్యాసభట్టారకునకు శుకుండు పుట్టినవిధంబు నాతనియోగప్రభావంబును విన నభిలషించితిం గావున నాన తిమ్మనిన నతం డో ధర్మనందనా! జ్ఞానవిషయం బున బాలవృద్ధభేదంబులు లేవు నీవు న న్నడిగినది తపోమూలం బది యింద్రియసంయమనంబునం గాని సిద్ధింప దశ్వమేధసహస్రంబును వాజపేయశతం బును యోగకళామాత్రతుల్యంబులు శుకుఁడు మహాయోగివర్యుం డాతని జన్మవృత్తాంతంబును యోగప్రభావంబును జెప్పెద సావధానమనస్కుండవై విను మని యి ట్లనియె. 263

భీష్ముఁడు ధర్మరాజునకు శుకునిజన్మప్రకారము సెప్పుట.

ఉ. ము న్నొకనాఁడు భూతగణముల్ గొలువంగ మహేశ్వరుండు భూ
భృన్నిచయేశ్వరాత్మజ సవేశమునంద మెలంగ మేరుశృం
గోన్నతకర్ణికారవిపినోచితచారుతర ప్రదేశమం
దెన్నఁడు లేనితేజము మెయిన్ విహరింపఁగ నయ్యె నయ్యెడన్. 264

మత్త. యోగధర్మపరాయణుండు మహోన్నతుండు మునీంద్రుఁడున్
రాగకృష్ణవిహీనుఁ డైనపరాశరాత్మజుఁ డాత్మసం
యోగమేర్పడఁ గా సమాధిసముచ్ఛ్రితవ్రతనిష్ఠుఁడై
భాగధేయము ప్రేరణంబునఁ బట్టి చేసెఁ దపం బటన్. 265

శా. భూమ్యాకాశసమీరవారిహుతభుగ్భూతాత్ముఁడై భూతకృ
త్సామ్యంబుం గొని భూతభావనుఁడు నాఁ దళ్లోకత్తుపుత్రుండు నా
సౌఖ్యాత్మం బ్రభవించుఁ గాత మనుచున్ సంకల్పముం జేసి సు
స్వామ్యంబుం గలశంకరుం గొలిచె నావ్యాసర్షి హర్షంబునన్. 266

క. నిష్ఠాగరిష్ఠుఁడు ముని, శ్రేష్ఠుఁడు మారుతముఁ గ్రోలి రేఁబవలు పరా
కాష్ఠ మెయిఁ జేసెఁ దపముం, గాష్ఠము వలె నిలిచి నూఱుఘనవర్షంబుల్. 267

సీ. అక్కాలమందు బ్రహ్మర్షులు రాజర్షులును లోకపాలకులును వసువులు
సాధ్యులు సిద్ధు లప్సరసలు రుద్రులు, దేవగంధర్వు లాదిత్యు లశ్వు
లును మరుతులు చంద్రుఁడునుసూర్యుఁడునువాస, వుఁడునారదుఁడుపర్వతుఁడు
లును సాగరంబులు వినుతులు వినతులు,సలిపి పూజించి రాచంద్రమౌళి [సరిత్తు

తే. నంత నమ్మహాదేవుఁడు సంతసమునఁ, గర్ణికారసుమోత్కరకలిత మైన
మాలికధరించిచంద్రికామహితుఁడైన,చంద్రమునిరీతిఁబోలుపొందెసాంద్రకళల.

వ. దేవర్షి సంకులంబు దివ్యంబు నగునాప్రదేశంబునఁ గృష్ణద్వైపాయనుం డుత్త
మోత్తమయోగం బనుసంధించి తపించుచుండె నట్టిసమయంబున నతనిదేహంబు
వాడివత్తలగుట గాని గ్లాని గాని లేనిదయ్యె నది చూచి ముల్లోకంబు లచ్చెరు
పడి మెచ్చె నప్పుడు తపస్తేజంబునంజేసి యాసంయమీంద్రునిజటాజూటంబు
వైశ్వానరశిఖోపమంబై వెలుంగం జొచ్చె నని కన్నులారం గాంచినమార్కండే
యుండు నా కీకథ యెఱింగించె నది మొదలు ద్వైపాయనునిజడ లగ్ని
సదృశంబులై కాన వచ్చు నట్లు ఘోరతపంబు గావించునమ్మహర్షి సమ్ముఖమ్మున
వృషభధ్వజుండు సాక్షాత్కరించి. 269

ఉ. మెచ్చితి నీతపంబునకు మేల్గలుగ న్వర మిచ్చువాఁడ నై
వచ్చితిఁ బంచభూతములభాతి వెలుంగుప్రభూతకీర్తియుఁ
నిచ్చల మైనతేజమును నిష్ఠయుఁ గల్గి తలిర్చునట్టిఁడుఁ
సచ్చరితుండు పుత్రకుఁడు సంభవ మందెడు నీకు సంయమీ. 270

ఆ. అతఁడు బ్రహ్మభూతుఁడై భావభావియై, బ్రహ్మమంద బుద్ధిఁ బరఁగ నిల్పి
దాని నాశ్రయించి తనతేజమున ముజ్జగములు వెలుగఁ జేయఁగలఁడు నూవె.

వ. అని వరం బొసంగి పరమేశ్వరుం డంతర్ధానంబు నొందె నంత సాత్యవతే
యుండు తేజోవంతుం డై వహ్న్యారాధనంబు సేయువాఁడై యరణిం దెచ్చి
మథింపం జొచ్చె నయ్యవసరంబున. 272

మ. తనతేజంబునఁజేసి ముజ్జగములం దళ్కొత్తుసీమంతినీ
జనముం దక్కువపాటు నొందెడుగతిఁ సల్పంగఁ జాల్చుందముం
గొని సౌందర్యము దీవియో యనఁగ నై క్రొంగ్రొత్తరీతు ల్మనీం
ద్రునకుం జూప ఘృతాచి వచ్చె నటకుఁ దోబుచులం జేయుచుఁ. 273

వ. అప్పుడు భగవంతుం డగునప్పారాశర్యుండు నప్సరోజనమాన్య యగునా ఘృతాచిం జూచి కామమోహితుండై కార్యం బెఱుంగకుండె నట్టియెడ నాతని వికారచేష్టితంబులం గనుపట్టి ఘృతాచియు. 274

మ. శుకియై వన్నెలు చిన్నెలుం వనమునం జొబ్బిల్లఁగాఁ జేయుచుం
బ్రకటప్రక్రియఁ దేనియల్ దొలఁకఁగాఁ బల్కులు భాషించుచుం
సకలాంగాధికసుందరత్వమున నెంచం వచ్చు వాల్గంటి నా
నకలంకుం డగుమౌనిచంద్రముని మోహావిష్టుఁ జేసెం గటా. 275

ఉ. అచ్చరమచ్చెకంటి నటు లాఁరసి తారసిలంగ మోహ మా
సచ్చరితుండు ధైర్యమున స్వాంతము చిక్కఁగఁ బట్ట నెంచియుం
హెచ్చినదానిరూప మెద నెంతయు వింతగఁ ద్రోసి పుచ్చుటం
బచ్చునివింటిదంటబడిబారికి నగ్గల మయ్యె నయ్యెడం. 276

తే. అరణినిం ద్రచ్చి యగ్నికార్యంబుదీర్ప,నుండెఁ గావునమన మెంత యోప్రయత్న
మున నిలుప నెంచి నిలుపలేకునికి వెడలి,వానిశుక్లమయ్యరణిపైఁబడియెనపుడు.

వ. శుక్లపాతం బయినను శంకింప కమ్మహాతపస్వి తనవీర్యంబు పడినతావునన మథింపం జొచ్చె నంతలోన. 278

సీ. అరణియం దగ్నితో నధికతేజోవంతుఁ, డవుమహాయోగి సంభవము నొందె
నారణేయుఁడు శుకీకారణంబున శుకుం,డన నొప్పి పవనాగ్నియట్లు వెలిఁగెఁ
దండ్రిఁ బోలినవానిఁ దరుణి యై వచ్చి గం,గాదేవి నీరాడఁగా నొనర్చె
నపు డాకసమునుండి యలశుకార్థము దండ,కృష్ణాజినంబు లాకెలనఁ బడియెఁ
తే. బాడి రప్పుడు గంధర్వు లాడి రప్స, రసలు మ్రోసె మహాస్వన మెసఁగఁ దేవ
దుందుభులు సన్నుతించిరి తుంబురుఁడును, నారదుఁడులోనిదేవత లారణేయు.

వ. మఱియు నక్కాలంబున నక్కడకు శక్రపురోగము లగులోకపాలురు దేవతలు దేవర్షులు బ్రహ్మర్షులు సమాగతు లైరి మాతరిశ్వుండు దివ్యపుష్పవర్షంబు గురిసె నతనిజన్మంబునం జేసి జగంబులం గలజంగమస్థావరంబులెల్ల సంతసించె నంతఁ బార్వతీసహితుం డగుపరమేశ్వరుండు ప్రమథగణపరివృతుం డయి పరతెంచి జాతమాత్రుం డగునమ్మునిపుత్త్రున కుపనయనసంస్కారంబు గావించె దేవేశ్వరుండు దివ్యంబు నద్భుతదర్శనంబు నగుకమండలువును దివ్యవస్త్రంబులు నొసంగె హంసలు శతపత్త్రంబులు సారసంబులు శుకంబులు నుపనీతుం డగునాతనికిఁ బ్రదక్షిణంబులు గావించె నట్లు దివ్యదేహంబు నొంది శుకుం డందయుండి వ్రతనిష్ఠుండై సమాధి నాశ్రయించె ననంతరంబ. 280

సీ. సరహస్యములును ససంగ్రహమ్ములు శ్రుతుల్, పుట్టినంతన వానిఁ బొంద వచ్చె
నతఁడు బృహస్పతి నాచార్యుఁగ వరించి, యాతనితో శ్రుతుల్ సేతిహాస
రాజశాస్త్రంబులు తేజమ్మైఁ బఠియించి, గురుదక్షిణ యొసంగి కొంతలోన
సలిపి సమావృత్తి సద్బ్రహ్మచారి యై, యత్యుగ్ర మగుతపం బాచరించెఁ
తే. బుట్టినప్డ తపస్వి యై పొలిచెఁ గాన, నతని ఋషులును వేల్పులు నభినుతింత్రు
మోక్షధర్మానుదర్శియై మొదటినుండి, తలఁపఁ డయ్యె గృహస్థుఁడై తనరుటకును.

శుకుండు తండ్రియాజ్ఞం జేసి మిథిలాపురంబున కరుగుట.

వ. అట్టిశుకుం డొక్కనాఁడు తండ్రికడకుం జని సాష్టాంగదండప్రణామంబు గావించి నామనస్సునకుం బరమశాంతి యెట్లు గలుగుం జెప్పు మనిన నతం డాతని నాదరించి కుమారా! నీవు వివిధధర్మంబులలో మోక్షధర్మం బెఱింగికొమ్ము దానం జేసి నీకు శాంతి సమకుఱు ననుడు నతండు పితృనియోగంబున యోగశాస్త్రంబును గాపిలం బగుశాస్త్రంబునుం దెలిసికొని యున్నంత వ్యాసుండు తనతనయునిం బిలిచి ధర్మతత్పరుండ వగునీవు మిథిలేశ్వరుం డగుజనకునికడకుం బొమ్ము నీ కతండు ధర్మోపదేశంబు గావించెడుఁ బోవునప్పుడు నీప్రభావంబు సూప నాకాశమార్గంబునం బోక మానుషమార్గంబు ననుసరించి యార్జవంబు సూపుచు నడిచి పొ మ్మహంకారంబు సూపకుము సుఖాన్వేషివి గాకుండు మతండు నాకు యాజ్యుండు నీకుం గూర్చుననిన శుకుం డౌఁ గాత మని తండ్రియానతి నౌదలం దాల్చి గగనమార్గంబున ససాగరమహీవలయం బెల్ల నతిక్రమింపం గలసామర్థ్యంబు గలఁ డయ్యుఁ దా నట్లు సేయక కాలినడం గదలి. 282

సీ. వ్యాలమృగాకీర్ణవనములుఁ గిరులును, నదులు నదంబులు నుదధులు గల
క్షోణీతలము మెట్టుకొనుచు మేరువుఁ జేరి, హర్యాదివర్షము లవలఁ జేసి
హిమవద్గిరిని దాఁటి క్రమముగా భారతవర్షంబునం జొచ్చి హర్ష మెసఁగఁ
జీనహూణాదినిషేవితదేశముల్, కడచి యార్యావర్తకమున కరిగి
తే. జనకునాజ్ఞఁ దలంచుచు వనధికాంచి
దూరమార్గము మెట్టుచు దారి నందు
నందుఁ బురము లుద్యానముల్ హర్మ్యములును
వివిధరత్నాపణంబులుం దవులఁ గాంచె. 283

వ. మఱియు నందందుఁ గలయనేకవిచిత్రంబు లరసియు నరయనివానిచందంబున

వానినెల్ల నతిక్రమించి ధర్మతత్పరుం డగునతం డచిరకాలంబున ధర్మస్వరూపుం
డగుజనకరాజచంద్రునిచేఁ బరిపాలితంబు లగువిదేహంబులం జేరుకొనియె
నవియును. 284

సీ. విసృమరబహ్వన్నరసభోజనంబులు, ఘనతరనగరముల్ గ్రామములును
బహుసమృద్ధంబులు పల్లెలుఁ విపులగోకులసంకులంబులు ఘోషములును
ప్రస్ఫీతయవశాలివరసస్యకలితముల్, క్షేత్రముల్ ఫలవృక్షచిహ్నితములు
కలహంససారసక్రౌంచసేవితములు, సజలకుల్యాంచితసారనదులు
తే. తతసరోవరశతము లుద్యానములును, గలిగి కన్నులపండువై కానఁబడుచు
వివిధజనసేవితంబులై వెలయుచుండు, నలవిదేహము లెంతయుఁ బొలుపుమిగిలి.

క. ఆవః పుట్టెడునట్టివి, దేహముల నతిక్రమించి దివ్యమునీంద్రుం
డీహిత మగుమిథిలాపుర, బాహిర ముద్యానవనముపజ్జకుఁ జనియెన్. 286

వ. దానిపుష్పాదిసంపత్సమృద్ధి కలరి మెలమెల్ల నడుగు లిడుచు హస్త్యశ్వరథసంకు
లంబును నరనారీసమాకులంబు నగునప్పురంబు లోచనగోచరం బయినం
జూచియుఁ జూడనివానిచందంబున మందగమనం బంగీకరించి రాజమార్గంబు
పట్టి చనుచు నంతరాత్మచింతాపరుండై పురద్వారంబు సేర నరిగి దాని నతిక్ర
మింప నున్నంత. 287

మత్త. ద్వారపాలురు దాఁటిపోయెడువానినిం గని పోకు పో
కోరి పారుఁడ! యెందుఁ బోయెదవో వడిం జొరఁబాఱు దీ
వేరియాజ్ఞ మెయిం బురంబున కేగుచుంటివి మళ్లు మం
చారటంపడునట్లు పల్కుచు నాఁగి రేగక యుండఁగన్. 288

క. వారలపరుషాక్షరముల, కీరస మొకయింతయేని యేర్పడ నీ కా
దారి నడ నెండతాఁకున, నో రెండుచు నున్న శుకుఁడు నొగులక యుండెన్.

ఉ. ఆతపతాపతప్తుఁ డగునాతఁ డొకింతయు డప్పిఁ దీర్చుకో
నాతఁడేఁ జూడఁ బో కలసినట్లును గా కట నెండ నిల్వఁగా
నాతతశోకముం గలుగ నం దొకరుం డగుద్వారపాలుఁ డ
ట్లాతపకర్శితుం డగుచు నర్కుఁడు నాఁ జనునారణేయునిన్. 290

తే. కని కడుపు చుమ్మచుట్టఁగాఁ గదియ వచ్చి, మ్రొక్కి పూజించి రమ్ము నాచక్కి ననుచు
నగరిరెండవకక్ష్యచెంతను బ్రవేశ, పెట్టి వచ్చె నక్కటికము పెచ్చుపెఱుఁగ.

వ. శుకుం డక్కక్ష్యాంతరంబునం గూరుచుండి ఛాయాతపంబు లొక్కగతిం దలఁ

పోయుచు ముక్తిమార్గంబ చింతించుచుండె నయ్యవసరంబున నొక్కరాజమంత్రి చనుదెంచి సూర్యాగ్నిసదృశతేజుం డగునాతనిం జూచి కృతాంజలియై తనవెంటం బెట్టుకొని మూఁడవకక్ష్యం బాఁటించి సమీపంబున నంతఃపురసంబంధంబు గలిగి క్రీడాసరోవరంబు ననుసరించి చైత్రరథోపమం బై పుష్పితలతాపాదపాకీర్ణం బగు ప్రమదావనంబు నందలియొకరమ్యాసనంబునం గూరుచుండం బెట్టి చనియె నయనంతరంబ. 292

మ. తళుకుంబంగరుడాలు డీలిడెడుమేల్దీవారు నెమ్మేనులు
స్థలుకుంగుబ్బలు వాలుఁగన్నులును మిన్నుంబోలు లేఁగౌనులుం
జెల నా నొప్పెడుమోములుం గలిగి వర్ణింపంగ నై యెందఱే
నెలప్రాయంపుమిటారికత్తియలు దా రేతెంచి రచ్చోటికిన్. 293

తే. తరుణులుం బ్రియదర్శనుల్ తప్తకాంచ, నాభరణభూషితలు శోభనాంగయష్టు
లప్సరస్తుల్యలరుణసూక్ష్మాంబరధర, లతులవేషభాషాంచిత లైన చెలులు. 294

వ. మఱియు సల్లాపోల్లాపప్రవీణలు నృత్యగీతవిశారదలు స్మితపూర్వాభిభాషిణులు కామోపచారకుశలలు భావజ్ఞలు నగువారముఖ్య లేఁబండ్రు చనుదెంచి యర్ఘ్యపాద్యాదుల నమ్మహామునిఁ నర్చించి పూజించి కాలోపపన్నంబు లగు సాధ్వన్నంబుల సంతృప్తిం గావించినయనంతరంబ వార లయ్యంతఃపురకాంతారసౌందర్యం బంతయు నొక్కరొక్కరుగ నభివర్ణించి చూపుచు నాడుచుం బాడుచు నవ్వుచు నుదారసత్త్వుం డగునాతనిఁ బరిపరివిధంబులఁ బరిచర్య గావించి సేవించి రంత శుద్ధాంతఃకరణుం డగునతండు వశ్యేంద్రియుండును జితక్రోధుండు నై వారిచేఁతలకుఁ జిత్తంబున హర్షంబు గాని క్రౌర్యంబుం గాని పొందఁ డయ్యె నయ్యెడ నయ్యిందువదనలు నవరత్నభూషితంబును దేవార్హంబు నగునొక్కదివ్యశయ్యాస్తరణంబు గల్పించినం గని శుకుండు పాదప్రక్షాళనంబు గావించుకొని శుచియై సంధ్యోపాసనంబు గావించి తదాసనోపవిష్టుండై పరబ్రహ్మస్వరూపధ్యానంబు సేయుచుఁ బూర్వరాత్రంబు గడపి మధ్యరాత్రంబున నించుక శయనించి ముహూర్తమాత్రంబున లేచి స్త్రీజనపరివృతుం డయ్యును ధ్యానపరుం డయ్యె నిట్లాదివారాత్రంబులు గడచనం జేసిన పదంపడి. 295

సీ. జనకుఁ డంతఃపురజనము మంత్రులు దాను,మునుబురోహితు నిడుకొనుచు నాతఁ
డమలరత్నాసనం బమరించుకొని తేరఁ, దనశిరంబున నర్ఘ్యమును గ్రహించి

గురుపుత్త్రుఁ డైనశుకుని చెంత కరుదెంచి, తనపురోధసుఁడు తెచ్చినచిరత్న
రత్నాసనము తాఁ గరంబునఁ గొని వైచి, దానిపై నాతనిం దనరఁ జేసి

తే. విధివిధంబునఁ బాద్యము వెలయఁజేసి, యర్ఘ్యమును గోవుఁ గొనసంగిననతఁడు జనకుఁ
డాచరించినపూజకు నలరి భూతలాధినాథునికుశలము నడిగె నంత. 296

వ. జనకుండు తనకుశలం బెఱింగించి తదనుజ్ఞాతుండై సహానుగంబుగాఁ బుడమి
పయిం గూరుచుండి కృతాంజలిపుటుండై గురుపుత్త్రునికుశలం బడిగి మీరిందు
వచ్చినకార్యం బెట్టి దనిన నతం డతని కి ట్లనియె. 297

క. కలఁడు విదేహుఁడు ధర్మం,బుల నెఱిఁగినవాఁడు జనకభూపతి నాయా
జ్ఞ్యలలోన నగ్రగణ్యుఁడు, తొలఁచుఁ సందియము లెల్ల దోషజ్ఞులకున్. 298

క. అతఁడు ప్రవృత్తినివృత్తుల, వితమెఱిఁగినవాఁడు నీవు వెడలు మచోటికిన్
మతిమంతుఁ డగుదు వనుచున్, బితృశాసన మగుటఁ జూచు ప్రేముడి నైతిన్.

వ. నీవు ధర్మభృద్వరిష్ఠుండవు నాసంశయంబులం దీర్ప నర్హుండవు బ్రాహ్మణుం
డిహంబునం జేయ నగుకార్యం బెద్ది మోక్షస్వరూపం బెట్టిది దానిం బొందుట
యెట్లు జ్ఞానమా తపమా తెలుపు మనిన జనకుండు. 300

జనకుఁడు శుకున కుపదేశించిన మోక్షధర్మప్రకారము.

సీ. అగ్రజన్ముం డగునతఁ డుపనీతుఁడై, స్వాధ్యాయతత్పరుం డై తలిర్చి
తపము శుశ్రూషయుఁ దవిలి పొనర్చుచు, దేవపితౄణము దీర్చి వైచి
బ్రహ్మచర్యంబున బ్రహ్మముం బఠియించి, తరువాత గురునకు దక్షిణ యిడి
తదనుజ్ఞ వడసినంతట సమావృత్తుఁ డై, గార్హస్థ్యమున దారకలితుఁ డగుచు

తే. నాహితాగ్నియుఁ బుత్త్రపౌత్త్రాంచితుఁ డయి
యడవులకు నేగి యగ్నుల నతిథిజనులఁ
గొలిచి యజ్ఞులఁ దనలోనఁ గలుపుకొనుచు
నాశ్రయింపఁగ వలయు మున్నాశ్రమంబు. 301

వ. అనిన శుకుం డో జనకా! ద్వంద్వాతీతుండై జ్ఞానవిజ్ఞానవిరాజితుం డగునతం
డును మూఁడాశ్రమంబులందు నుండవలయునో యెఱింగింపు మది వేదశాస్త్ర
సమ్మతంబై యుండవలయు ననిన నతం డి ట్లనియె. 302

తే. జ్ఞానవిజ్ఞానములు లేనిమానవులకు, ముక్తి లభియింప దాజ్ఞానము గురుకరుణ
వలననే కల్గుజ్ఞానముప్లవముగురుఁడు, ప్లావయితయంచుఁ బ్రాజ్ఞులుపలుకుచుంద్రు.

సీ. కృతకృత్యుఁ డగుచు సంసృతిసాగరము దాఁటి, విజ్ఞాని యారెంటి విడువవచ్చు

లోకకర్మము లీగి పోకుండుటకు నాలు,గాశ్రమంబులు పూర్వు లనుమతించి
రిట్లు కర్మంబు లనేకజన్మంబుల, సలిపి విడినమీఁదఁ గలుగు ముక్తి
బహుజన్మసంస్కారపరిశుద్ధి గలిగినఁ, బ్రథమాశ్రమమునందె పడయు ముక్తి

తే. ఇట్లు బహుజన్మముల నెత్తి యిద్ధబుద్ధి
యగుచు సంసిద్ధి ఫలుఁ డైనయట్టిజనుఁడు
ముక్తి నొందుట కితరముల్ మూఁడునాశ్ర
మములు పని లేదు మొదటనే సమకురు నది. 304

వ. మఱియుం జెప్పెద నాకర్ణింపుము. 305

సీ. జనుఁడు రాజసతామసము లైనదోషముల్, వదలి సాత్వికమార్గ మది వహించి
తగనాత్మచే నాత్మఁ దగిలి కన్గొన నగు, భూతముల్ తనలోన భూతతతులఁ
దా నుంట తెలియుచుఁ బానీయములఁ జేప,వలె దేని నంటక మెలఁగ వలయు
సంగంబులన్ రోసి శాంతి నొందినవాని, పక్షినాఁ బయి కేగి పరము నొందు

తే. మోక్షశాస్త్రవిశారదుల్ భూసురేంద్రు,లాచరించెడుధర్మము లాయయాతి
తొల్లి గాథలు గాఁ దెల్పెనెల్లవానిఁ, దెలియఁ జెప్పెద వినుమని పలికెమఱియు.

క. పరమాత్మ తనదునాత్మం, బరికింపఁగ నుండుఁ గాని మఱియొకచో లే
దరయ నది యెల్లప్రాణుల, సరియై వర్తించు టెఱుఁగు సంయమి యొడఁదన్.

క. తనవలనఁ బరుఁడు పరునివ,లన దాను న్వెఱపు లేనిలాగున రాగం
బును ద్వేషంబును విడిచిన, మనుజుఁడు బ్రహ్మంబ యగుచు మానొందు నిలన్.

ఆ. మనసు వాక్కు కర్మ మనుమూఁటిచే నెల్ల, భూతములకుఁ బాపమును బొనర్పఁ
బోక ద్వేషరాగములు చిత్తమున లేక, యుండునతఁడు బ్రహ్మ మొందు ననఘ.

క. మనమాత్మయందుఁ గూడం, బొనరించి యసూయ విడిచి మోహము కామం
బును దగులఁ బోక జ్ఞానం,బునఁ దనరెడునతఁడు బ్రహ్మమును బొంద నగున్.

తే. స్తుతియు నిందయు సుఖమును దుఃఖ మర్థ
మును ననర్థము కాంచనమును నయస్సు
శీత ముష్ణము మరణము జీవితమ్ము
సమముగాఁ జూచువాఁడు బ్రహ్మమును బొందు. 311

మ. తనయంగంబులఁ జాపియున్ మఱి తనంతం గూర్మ మన్నింటినిం
దనదేహంబునయం దిముడ్చుకొనుచందంబొప్పఁగా నక్షముల్
మనమందు న్నిలువంగఁజేసి తమ మెల్లం గ్రమ్మ నౌ నిల్లు ది

వ్వైను గన్నట్టులు మాని జ్ఞానమునఁ దా వీక్షించు నధ్యాత్మునికి. 312

సీ. ఇది యెల్లనీయందునెఱుఁగవచ్చు నెడేనిఁ, దెలియంగఁ దగియున్నఁదెలియుమింక
నీతండ్రికరుణయు నీదునభ్యాసము, గలుగ నింద్రియముల గెలిచి తీవు
తత్ప్రసాదమున నేతద్జ్ఞాన ముదయించె, ని ట్లందున న్నిన్ను నెఱిఁగి కొంటి
నీజ్ఞాన మధికము నీగతి యధిక మైశ్వర్యము నధిక మీాచంద మీావు

తే. తెలియకుంటివి బాల్యమువలనఁ గాని, సంశయంబునఁ గాని మోక్షంబు గలుగ
దేమొకో యనుభయమున నేమొ గాని, జ్ఞానివయ్యుఁ దెలియకుంటి జ్ఞానగతులు.

శుకుఁడు హిమవంతంబున నున్న వ్యాసునికడకు వచ్చుట.

వ. సామాన్యుం డగువాఁడు మముబోంట్లవలన సంశయచ్ఛేదంబు గావించుకొని హృదయగ్రంథులు విడ నుత్తమగతిం బ్రాపించు నీ వుత్తమజ్ఞానసంపన్నుండవు ఛిన్నసంశయుండ వేప్రయత్నంబును లేక పరమాత్మ నొందఁ గలిగితివి నీ వలోలుపుండవు సుఖదుఃఖాదిద్వంద్వములం దగులనివాఁడవు నృత్తగీతంబులం దౌత్సుక్యములేనివాఁడవు నీకు బంధువులయం దనుబంధంబు లేదు నిన్ను సమలోష్టాశ్మకాంచనునిఁ గా నక్షయంబు ననామయంబు నగునుత్తమమార్గమం దున్నవానిఁగా నెఱింగికొంటి నింక న న్నేమి యడుగనుంటి వనిన నేమియు ననక కృతాత్ముండును గృతనిశ్చయుండు నగునతం డాత్మ నాత్మయందు నిలిపి యాత్మచే నాత్మం బ్రతీక్షించుచుం గృతకార్యుండై యుత్తరాభిముఖుండై వాయువేగంబున హిమవన్నగంబునకు నిర్గమించె నారదుండు నక్కాలంబున నటకుం జనుదెంచె నయ్యది సిద్ధచారణసేవితంబు నప్సరోగణాకీర్ణంబు శాంత స్వననినాదితంబునై యుండు నప్పర్వతరాజంబునఁ గిన్నరసహస్రంబులు భృంగ రాజంబులు మద్గువులు ఖంజరీటంబులు జీవంజీవకంబులు కేకాశతవిరాజితంబు లగుచిత్రవర్ణమయూరంబులు రాజహంససమూహంబులు కృష్ణపరభృతనివ హంబులుం గొలువ గరుత్మంతుండు నిత్యనివాసం బుండు మఱియు లోక పాలురును దేవర్షిగణంబులును లోకహితకామ్యంబున నిత్య మప్పర్వతంబునకు వచ్చి పోవుచుందురు విష్ణుమూర్తి యగ్గోత్రరాజంబునఁ బుత్రార్థియై తపంబు గావించెఁ గుమారుం డగుకుమారస్వామి తొల్లి ముల్లోకంబుల నవమానించు నిజశక్తి నట నిక్షేపించి నాకం బెు నధికుం డున్న దీని నుద్ధరించుఁ గాక కాకున్నం గదలించుఁ గాక యని బింకంబులు గొట్టి నట్టిపట్టున లోకంబు లాకుల త్వంబు నొందె నది యెఱింగి విష్ణుండు దానిం బెల్లగింప సమర్థుం డయ్యుఁ

గుమారునందలి కూర్మిం జేసి యట్లు చేయక సవ్యహస్తంబున దానిం బట్టి కదల్చి దానం జేసి సశైలవనసాగరం బగుసర్వసర్వంసహాయుఁ జలింపం జొచ్చె నట్టియెడ విష్ణుదేవుండు ప్రహ్లాదుం బిలిచి కుమారపరాక్రమం బగ్గించిన నతం డాశక్తి నెత్తం బోయి మేనిబలం బొత్తిగిల్ల నొల్లఁబోయి పెల్లార్చి నేలం బడి మూర్ఛితుం డయ్యె నం దుత్తరభాగంబున వృషభధ్వజుండు దుర్ధర్షం బగుతపంబు గావించె మఱియు నాశైలరాజంబున నగ్నిజ్వాలావృతంబై దశయోజనవిస్తృతం బగునాదిత్యపర్వతంబు నాఁబడునాశ్రమంబు గల దం దగ్నిహోత్రుం డేకపాదంబున నిల్చి వేయి దివ్యవర్షంబులు ఘోరతపంబు గావించుచుఁ బరమేశ్వరతపంబునకు విఘ్నంబు గాకుండఁ గాపాడె నాదిత్యపర్వతంబున కుత్తరభాగంబునం దొక్కవివిక్తతటంబునఁ బారాశర్యుండు కృతాశ్రయుండై సుమంతుండు వైశంపాయనుండు జైమిని పైలుఁడు ననునల్వురు శిష్యులకు వేదాధ్యాపనంబు గావించుచుండె నట్టియవసరంబున. 314

చ. దివమున సూర్యుఁడుం బలెను దిక్కులు పిక్కటిలంగఁ జేయుచుం
దవిలినతేజ మద్భుతగతంబును గాంచ శుకుండు తండ్రికిన్
సవిధముఁ జేర రాఁగ మునిసత్తముఁ డైనపరాశరాత్మసం
భవుఁడు నిజాత్మసంభవునిఁ బాఱఁ గనె న్ముద మార దొవులన్. 315

క. శరవేగంబున మార్గాంతరమునఁ గలవృక్షపర్వతము లడ్డుపడం
బరికింపక యోగాంచితుఁ, డరుదెంచెం దండ్రిఁ జూచునాసక్తిమెయిన్. 316

సీ. ఆరణేయుం డట్లు లరుదెంచి తండ్రిపాదంబుల కభివందనం బొనర్చి
తనకును జనకరాజున కైనసంవాదమును మూలముట్టుగా వినుచుటయును
నాతఁడు ముదమంది యాహిమవత్పృష్ఠమున నుండి సుతునితోఁ దనదుశిష్య
వరులకు వేదముల్ వరుస నధ్యాపన, మొనరించె నంత వా రొక్కనాఁడు
తే. మేము కృతకృత్యులైతిమి మీకటాక్షమునను మాయంద సుప్రతిష్ఠనువహించి
వేదము లెసంగునట్లు మే మైదుగురము, మీకు శిష్యుల మగునట్లు మే ల్దలఁపుడు.

వ. అని విన్నవించిన విని పరలోకార్థచింతకుం డగుపరాశరాత్మజుండు వారి కిట్లనియె. 318

సీ. ధర్మ్యమున్ శ్రేయఃప్రద మ్మగువచనమ్ము, చెప్పెద వినుఁ డిట్లు శిష్యులార!
బహుళసంఖ్యాకులై పరఁగ వలయు మీరు, శ్రుతులు వ్యాపించుత క్షితితలమున
శుశ్రూషకుం డగుక్షోణీసురున కీయ, నగు వేద మడిగినయంత మాత్ర

నవ్రతుండు నశిష్యుఁ డకృతాత్ముఁ డగువాని, కీరాదు శిష్యుఁ బరీక్ష చేసి
తే. యీ వలయు నంచుఁజెప్పుదు రిద్ధమతులు, కాల్చియును గీటు పెట్టియుఁ గమ్మైనఱికి
యును సువర్ణముగుణమును గనెడునట్లు, కులగుణాదులశిష్యులఁ దెలియవలయు.
వ. మీరు మీశిష్యుల నియోగింప రానికార్యంబుల నియోగింప రాదు వేద
విద్యలు వారివారిబుద్ధిం బట్టియుఁ బఠనపాఠంబులం బట్టియు ఫలించు వేద
పారాయణంబు సేయువారు సర్వదుర్గంబులం దరించి సర్వభద్రంబులం బొందెద
రని మఱియును. 320
తే. బ్రాహ్మణుని మున్ను గాఁ గొని బ్రహ్మపఠన, మాచరించిన వినవచ్చు నచటినుండి
నాల్గువర్ణములకుఁ జెంది నలువుమీఱు, నట్టివా ర్వేదనియమంబు లిట్టియవియ.
క. దేవతలన్ స్తుతియించుట, కీవేదములన్ సృజించె నీశ్వరుఁ డేవాఁ
డీవేదవిదుల దూరెడి, నో వానికిఁ గలుగకుండు నుత్తమకీర్తుల్. 322
మ. ఇవి స్వాధ్యాయవిధుల్ వచించితిని మీ కే శిష్యులారా! మదీ
యవచస్సంగతి నంతరంగమునయం దానంగ సంధించుచున్
సవిమర్శంబుగఁ జర్చ సేయుచును మీ ఛాత్రాళికిం జెప్పుచున్
భువికి న్మేలొనఁగూడఁ జేయుఁ డనుచున్ బోధింతు నెల్లప్పుడున్. 323
వ. అనిన నగ్గురువాక్యంబు లాకర్ణించి సంతసించుచు వా రట్లు చేయ సంకల్పించు
కొని సంయమిచంద్రుం గాంచి నమస్కరించి. 324
చ. గురువర! మీయనుజ్ఞ యొనఁగూడినచో నిటనుండి యిప్పు డు
ర్వరకు గమించి వేదములవ్యాప్తి యొనర్తుము నాఁగ నప్పరా
శరసుతుఁ డౌ బళీ! మన మెసంగినయేని ధరిత్రి కైన ని
ర్జరపురి కైన మీ రరిగి రాఁ దగు వేదము విస్తరింపఁగన్. 325
క. ఏదేశములకు నరిగిన, వేదంబుల యెడల నెట్టివేళల నైనన్
బాదుకొన నప్రమత్తత, మీదగువర్తన మెసంగ మేలగుఁ జుండీ. 326
వ. అనిన నట్ల యగుం గావుత మని వా రాపారాశర్యునిచే ననిపించుకొని మర్త్య
లోకంబునకు వచ్చి యచ్చటివారికిం బూజ్యులు యాజకులు నై గృహస్థులై
యుండి రంత నక్కడ వ్యాసభట్టారకుండు. 327
శా. అంతేవాసులు వార లట్టులు హిమాహార్యంబునుం బాసి పో
నంతం బుత్రసహాయుఁడై యచట నిధ్యానాంచితుం డయ్యు నే
కాంతంబందు వసించి యుండె నపు డాగ్రావంబున న్మెట్టుచున్

సంతోషించుచు నారదుం డతని చెంతం బొల్చెం బొల్పేర్పడన్. 328

తే. అట్లు పొల్చిననారదుం డాశ్రమపద, మందు వ్యాసర్షిఁ గనుఁగొని హర్షమంది
యోవసిష్ఠకులోద్భవ! యోమహర్షి!, వేదఘోష మిక్కడ వినరా దదేమి?

క. ఒకరుండ విట్లు ధ్యాన, ప్రకటితచిత్తుండ వగుచు బాధము గానూ
రక యెదియో చింతించెద, వకటా! నీచింత కెట్టియది హేతు వొకో. 330

చ. తలఁపఁగ వేదఘోషరహితం బగుచుం దలగాము ముట్టుకోఁ
దెలతెలఁ బోవుచంద్రమునితీఱున నిగ్గిరి తేజు వో నిషా
దులయిలు వోలె నై సిరులతోఁ దులఁదూగుచు దేవజుష్టమై
వెలసియు నొప్పకున్నయది వేదవిహీనత గల్గి యుండుటన్. 331

క. అని నారదుండు పలికిన, విని ద్వైపాయనుఁడు వేదవేత్తవు నీ వి
ట్లనుట సమంజస మని నా, మన మెఱిఁగించెదిని నాకు మాన్యవిచారా. 332

తే. నీవు సర్వజ్ఞమూర్తివి నీ కెఱుంగ, రానియర్థ మేలోకమం దైన లేదు
శిష్యు లెడఁబాయ నేమియుఁ జేయలేని, యట్లయితినిప్డు నా కేమియాజ్ఞ చెపుము.

వ. అనిన నారదుం డిట్లనియె. 334

నారదప్రేరణంబున వ్యాసుండు శుకునిం గూడి వేదపఠనంబు సేయుట.

తే. మలము వేదమునకు ననామ్నాయము ద్విజ
వరున కవ్రతము మలమ్ము వసుధ కధిక
మలము వాహీకు లతివకు మలము కుతుక
మగుట సుతుఁ గూడి చేయు మధ్యయన మిపుడు. 335

వ. వేదఘోషముచే రక్షోభయజనితాజ్ఞానము వాయు ననిన వేదవ్యాసుం డట్ల
యగుం గావుత మని సహపుత్త్రుం డై వేదపఠనంబు గావింపం దొడంగె నపు
డుచ్చైస్స్వరంబునం జేసి లోకంబు లన్నియు నిండుకొన సముద్రవాయుప్రేరి
తంబై మహావాయు వొండు పుట్టి బిట్టు వీవం దొడంగె నది యెఱింగి వ్యాసుం
డది యనధ్యయనదినం బని పుత్త్రుని వేదపఠనంబునుండి విరమింపం జేసిన నతండు
తండ్రిం గని వాయుచేష్టితంబునకు ననధ్యయనంబునకును గతం బేమి సెప్పు
మనిన వ్యాసభట్టారకుండు. 336

సీ. దివ్యచక్షువు నీదు దెస నగు నీమది, సహజనిర్మల మయి చనుఁ గుమార
శుద్ధసత్త్వంబునఁ జూపట్టుదువు నీవు, యొగ మద్దమునఁ జూచుపగిది నాత్మ
నాత్మచేఁ జూచెద వఖిలజ్ఞుఁడవు దేవ,పితృయానములు రెండు వెలయుచుండు

నవి మృతు లగువార లరుగుమార్గంబులు, నాకంబునకు లేక నరకమునకు

తే. నేల నింగిని వీఁచెడుగాలి కేడు, తెఱఁగులెఱిఁగింతు విను మందు దేవత లగు
సాధ్యు లేడ్గడ లవ్వారికాత్మజన్ముఁ, డలరె దుర్జయుఁడై సమానాహ్వయుండు.

వ. ఆసమానున కుదానుఁడు వానికి వ్యానుఁడు వానికి నపానుఁడు వానికిఁ
బ్రాణుఁడుం బుట్టి రందుఁ బ్రాణుం డనపత్యుం డయ్యె. 338

క. ఈవాయుపంచకంబే, జీవులదేహముల వివిధచేష్ట లెసంగం
గావించు వానికర్మము,లే వివరించెదను రీతు లేర్పడ వినుమా. 339

వ. ఆవాయువు లన్నియు భూతకోటులకుఁ బ్రాణంబు లొసంగుచుండుటంజేసి
ప్రాణసంజ్ఞం గాంచి యున్న వాకర్ణింపు మందు. 340

క. ప్రవహము నాఁ బ్రథమం బగు, పవనము ధూమోష్మజాభ్రపఙ్క్తుల నెల్లన్
దివిఁ బ్రేరించుచు విద్యు, త్ప్రవహమునఁ బ్రకాశ మొసఁగఁ దగి పెంపెసఁగున్

క. ఆవహవాయువు శబ్దము, గావించుచు సోముఁ డాదిగా నవుజ్యోతుల్
గావుటకు హేతువై మెయి, నై వెలయు నుదాన మనఁగ నది రెండవదై.

చ. వినుము తృతీయ ముద్వహసువిశ్రుతవాయువు నాల్గువార్ధులన్
దనరెడునీళ్లులం గొని యుదారత మబ్బుల కిచ్చి పుష్కరం
బున నలవర్ష దేవతకుఁ బోహణ సేయుచు నెల్లవేళలన్
ఘనులకు నింపు సొంపెసఁగుకై వడి వీఁచుచు నుండు మెండుగన్. 343

ఉ. నాలవదైనసంవహము నాఁబడువాయువు వెల్లి వీఁచుచున్
వ్రాలి ఘనంబులం గదిసి వర్ష మొసంగగ వానిఁ గూర్చుచున్
వ్రీలఁగఁ జేయుచున్ గిరుల విన్నున దివ్యవిమానపఙ్క్తులన్
ద్రోలుచు భూతకోటులకుఁ దోడ్పడునట్టి దగున్ జగంబులన్. 344

తే. వివహమైదవ దది బలవేగములను, గలిగి యతిరూక్షమై వృక్షములఁ బెకల్చు
నోపుమెఱుములుత్పాతముల్ సూపుదానిఁ,గలియు ననిలంబులువలాహకములు [సతతము.

చ. పరివహవాయు వాఱవది వారిదపఙ్క్తిఁ జలించు నీళ్లులన్
ధరఁ బడకుండఁ దాల్పు గగనంబున గాంగజలంబు నిల్పు భా
స్కరునిసహస్రదీప్తులను సన్నగిలం బొనరించియున్ క్షపా
కరుఁడు కృశత్వ మీఁగి వెలుఁగం బొనరించును జేర్మి పెంపునన్. 346

చ. ఎనయుపరావహం బనెడునేడవవాయువు ప్రాణికోటులం
గొనియెడు మృత్యుధర్ములను గూడియు శాంతులు నాత్మచింతకుల్

ఘను లగువారి కూర్ధ్వగతి గల్గఁగఁ జేయును దానిస్పర్శ మొం
దినజనుఁ డందు మోక్షమును దెం పదిలేని తెఱంగు దోఁపఁగన్. 347

వ. ఈవాయువు లేఁడును మున్నదితికిం బుత్త్రులై పుట్టి సర్వదేశంబు లాక్రమించె నివి యతిశయించిన నీపర్వతంబునుం జలించు నీవాయువులు విష్ణునిశ్వాసంబు లతఁడు నిట్టూర్చిన నవి మహోన్నతంబుగ వీవం దొడంగు నట్టిపట్టున వేదాధ్యయనంబు సేయరాదు వాయుమయం బగువేదము బహిర్వాయువుచేఁ బీడింపంబడుఁ గావున బహిర్వాయుప్రచారం బడంగువఱకు కుఱకయుండి పదంపడి యధ్యయనంబు గావింపు మని చెప్పి పారాశర్యుండు వ్యోమగంగాస్నానం బొనర్పం బోయె నయ్యవసరంబున స్వాధ్యాయనిరతుం డగుశుకునికడకు నారదుం డరుదెంచినం గాంచి శుకుం డర్ఘ్యపాద్యంబు లిచ్చి పూజించుటయు సంతసించి యతండు వత్సా! నీ కెట్టిశ్రేయంబు లొసంగుదు ననిన శుకుండు లోకహితార్థం బెఱింగించుటయె నాకు శ్రేయం బొసంగుట యనిన నారదుండు తత్త్వజిజ్ఞాసువు భావితాత్ములు నగుబుషులకు సనత్కుమారుండు చెప్పినచొప్పు చెప్పెద నవహితుండ వగు మని యి ట్లనియె. 348

నారదుఁడు శుకున కుపదేశించినతత్త్వప్రకారము.

ఆ. జగతి విద్యఁ బోలుచక్షువు సత్యముం, బోలుతపము రక్తిఁ బోలువ్యథయు
విడుపుఁ బోలుసుఖము వెలఁదిఁ బోల్కష్టము, లేదు లేదు లేదు లేదు లేదు.

క. దురితములనుండి మరలుట, వరపుణ్యక్రియలయందు వఱలుట సద్వృ
త్తిరతి నెసంగుట పరమో, త్తరసనుదాచార మందుఁ దనరుట యొప్పున్. 350

సీ. మానుష్యమునసక్తుఁడైనదుఃఖవిముక్తి, నొందఁజాలఁడుమోహ మురుతరమగు
సంగము దుఃఖలక్షణము సంగికి సుఖ, మరయంగ లే దిహపరములందు
నేయుపాయముచేత నేని కామక్రోధ,ములను శ్రేయోర్థి తాఁ గెలువ వలయు
నెపుడు క్రోధమునుండి తపమును మత్సర,త్వమ్మున శ్రీయు మానమ్మున నవ

తే. మానమునఁజేసి విద్యఁబ్రమాదగతుల, నాత్మఁ జెడకుండ రక్షింప నగును శాంతి
పరమబల మానృశంస్యముపరమధర్మ, మాత్మవిజ్ఞాన మేజ్ఞాన మనియెఱుఁగుము.

క. సత్యము సర్వశ్రేయము, సత్యమునకు మించి లేదు సద్వ్యాపారం
బత్యంతభూతహిత మే, సత్య మ్మని నామతమ్ము సంయమివర్యా. 352

క. ఎవఁ డారంభవివర్జితుఁ, డెవఁడు పరిగ్రహము లేక యెపుడు నిరాశుం
డగు నెవఁడు విడుచు నన్నియు, భువి నాతఁడె పండితుండుబుధుఁడును దలఁపన్.

తే. ఇంద్రియార్థములకుఁ జిక్కకింద్రియములఁ, గట్టిశాంతాత్ముఁడై నిర్వికారుఁడునుస
మాహితుం డయివర్తించునట్టివాఁడు, సంగములఁ బెడఁబాసి మోక్షంబునొందు.

సీ. భూతహింస పొనర్పఁ బోవక వేరితో, వేరంబు పూనక విజితమాన
నుఁడు దైన్యరహితుండు శుద్ధుండు నిష్కాముఁ, డగునేని శ్రేయంబులందఁగలఁడు
నీ వింద్రియంబుల నిర్జించి భయశోక, రహిత మౌ స్థానంబు రమణఁ గొనుము
విడు మామిషము దాని విడిచితి వేనియు, దుఃఖతాపంబులు దూర మగును

తే. సంయతాత్ముఁడు దాంతుఁడు సంగవర్జి, తుండు నియతాత్మకుండు శాంతుఁడు తపస్వి
యొంటిఁ జరియించువాఁడగు నుత్తముండు, శాశ్వతానందసౌఖ్య మెసంగ నొప్పు.

వ. ద్వంద్వంబులం జిక్కినవాఁడు జ్ఞానతృప్తుండు నాఁబడు జ్ఞానతృప్తుండు శోకం
బెఱుంగకుండుఁ బుణ్యకర్మముల దేవత్వమును మిశ్రకర్మముల మానవత్వమును
బాపకర్మముల నధోగతియుం గలుగుచుండు జనుండు జన్మమృత్యుజరాదుఃఖం
బులచేఁ బీడితుండై సంసారానలంబునం బచ్యమానుండై యహితంబు హితం
బుగను నధ్రువంబు ధ్రువంబుగను ననర్థంబు సార్థంబుగను దలంచుచు నజ్ఞా
నంబునఁ గోశకారంబు నిజతంతువులం జిక్కికొన్నట్లు తన్నుఁ దాన చుట్టుకొని
నశించు నని మఱియును. 356

సీ. పుత్రదారకుటుంబపురుషుండు బురదలో, మునిఁగినగజము నాఁ బొడవడంగు
జాలంబులం బట్టి జలములపై కెత్తఁ, జేప నా నెంతయుఁ జేటుఁ జెందు
దారపుత్త్రాదులు ధనమునుం దనమేను, బరకీయములును నస్థిరము లరయఁ
బరలోకములఁ దోడుపడునవి సుకృతంబు, దుష్కృత మని నీకుఁ దోఁచియుండు

తే. దినుటకుం దిండి యిదిత్రోవయనెడువాఁడు, విశ్రమింపఁగఁ జోటు చేవేయుకోల
లేక చిమ్మఁజీఁకటి నోట లేకొకండ, కాననాధ్వము మెట్టు ఏకరణి యొక్క.

వ. విద్యయుఁ గర్మంబును శౌచంబును జ్ఞానంబును సిద్ధించినప్పుడే మోక్షము
సిద్ధించు నని యెఱుంగుము. 358

తే. గ్రామవాసము బంధనరజ్జు వరయ, దానిఁ దెగఁ గోసి పుణ్యాత్ముఁ డైనవాఁడు
పోవ నెంచును దుష్కృతి పోవ నేర, నట్టిఁడై సంగమునఁ జేసి వ్యర్థుఁ డగును.

మ. మనమే వేగము రూపమే తటము సమ్యక్స్పర్శమే ద్వీపముల్
ధ్వనియే వారి రసంబె వెల్లువ సుగంధంబే మహాపంకమై
చనుసంసారనదిన్ క్షమాధృతులునాఁ జాల్వారు పెందెడ్లతో
ఘనసత్యం బనునావ నెక్కి విడు పన్గాలిన్ దరింపం దగున్. 360

వ. మోక్షాపేక్ష గలవాఁడు ధర్మాధర్మములు సత్యాసత్యములు లోనగునవి విడిచి సంకల్పరహితుండై పరమాత్మనిశ్చయంబు గలిగి యుండ వలయు మఱియును.

సీ. దేహమే గేహము తెలియ దానికి నెమ్ములు కలు స్తంభములు దానికట్టుత్రాళ్లు
స్నాయువుల్ రక్తమాంసములు లేపనము చర్మముమీఁదికప్పుమూత్రముపురీష
మనెడుదుర్గంధమునను నిండినది జరాకలితము శోకరోగముల కిక్క
యతితరాధిష్ఠాన మధికరజోగుణయుత మనిత్యము భూతతతికి నునికి

తే. యట్టిదాని మహోన్నత మైన దనుచు, నెంచుచును మోహవశమున సంచరింప
కస్థిరం బని దానిపై నాస్థ విడిన, జనుఁడు పరమోత్తమపదంబు గొనఁ గలండు.

వ. ఈజగత్తంతయు మహాభూతాత్మకం బగు మహత్తు పరమాశ్రయము పంచభూతమ్ములును బంచేంద్రియంబులును సత్త్వరజస్తమోగుణంబులును బైఁ జెప్పినవియుం గూడి సప్తదశకంబై యవ్యక్తంబు నాఁబడు నింద్రియార్థాహంకార బుద్ధులతో నిరువదినాలుగై పురుషుం డనంబడుఁ ద్రివర్గంబును సుఖదుఃఖంబులును జీవితమరణంబులును దెలిసినవాఁడు ప్రభవాప్యయంబులఁ దెలిసినవాఁ డగు జ్ఞానవిషయంబు పారంపర్యంబుగ నెఱుంగ నగు నింద్రియగ్రాహ్య మగు నది వ్యక్త మతీంద్రియంబై లింగగ్రాహ్య మగునది యవ్యక్త మింద్రియ నిగ్రహము గలవాఁడు తృషితుండు జలంబునం బోలెఁ దృప్తుం డగుఁ బరాపరజ్ఞానిశక్తి జ్ఞానమూలంబై నశింపదు జ్ఞానంబునం జేసి మోహజంబు లగుక్లేశంబులు నశించు మోక్షవేత్త యనాదినిధనంబు నవ్యయంబు నమూర్తంబు నగుపరమాత్మ జీవాత్మయంద యుండు నని తెలుపుచుండు నిజకర్మంబుల నిత్యదుఃఖితుం డగువాఁడు దుఃఖశాంతి యగు నని పశ్చాలంభన మొనరించి పునర్జన్మంబులం బొంది మఱియు దుఃఖంబులపా లయ్యు నవియ సుఖంబు లనుకొని యపథ్యంబున నాతురుండు వోలెఁ బరితపించుచు మోహాంధుండై కర్మబద్ధుండై సంసారచక్రంబునఁ బరిభ్రమించుచుండు నీవు నివృత్తబంధుండవు కర్మనివృత్తుండవు సర్వజ్ఞుండవు సర్వజిత్తువు నీ కుపదేశింప నగునర్థంబు లేదు నీవు సిద్ధుండవని మఱియును. 363

క. శోకముం బోకార్చెడునది, శోకము లేకుండునదియు శుభకర మనుచుఁ
వాకొనఁ దగినది శాంతి, శ్రీకం బగుశాస్త్ర మెఱుఁగ శ్రేయంబు లగుఁ. 364

క. వేలకొలఁదిశోకంబులు, వేలకొలందిభయము ల్వివేకవిహీనుం
బోలంగ నొందుఁ బండితు, నేలీలం బొంద వనుచు నెఱుఁగుము దీనిఁ. 365

వ. అది గావున ననిష్టపరిహారార్థంబు కొన్ని విషయంబు లెఱింగించెద నాకర్ణింపుము.

సీ. ప్రియవిప్రయోగ మప్రియసమవాప్తియు, మానసదుఃఖముల్ హీనబుద్ధు
లైనమానవులకు నగు ద్రవ్యములు వోవ, వానిగుణము లెంచి వగవ నొప్పు
దెట ననురాగ మా నట దోష మగుఁ గాన,నట ననిష్టముఁ బూన నగు విరక్తిఁ
గడచినదాని కెవ్వఁడు చింతిలునొ వాఁడు, ధర్మార్థగతులకు దవ్వ యగును

తే. మృతికి నష్టమునకు శోక మతులితగతి, నొందుట యనర్థమున కగు నుర్వి మాన
సములుశారీరములుదుఃఖసముదయములు,బుద్ధిమద్వరుఁడగువానిఁబొందవెపుడు

క. చింతించుకొలఁది దుఃఖ మ,నంతం బగుఁ గాన నెట్టిదైనం గానీ
స్వాంతమునఁ బెట్టకుండిన, యంతం దా నంత నదియె యడఁగాఱి చనున్. 368

క. మానసదుఃఖము లెల్లన్, జ్ఞానంబున దేహదుఃఖసంచయ మెల్లన్
మానగుమందులవలనన్, బో నడఁపం దలఁప వలయు బుధవర్యుఁ డిలన్. 369

క. యౌవనము రూపు ద్రవ్యము, జీవిత మారోగ్య మిష్టశేవధు లెవియున్
భావింప ననిత్యంబులు, గావున వానికయి చింత గాదు పౌనర్వన్. 370

క. జనుఁడు జనించినదాదిగఁ, దనయాయువునందు సుఖము తక్కువయును దుః
ఖనిచయ మెక్కువ యగుచున్, గనుఁగొన వచ్చెడి నిఁ కేమి కలదు వచింపన్.

సీ. ఇంద్రియార్థంబులయెడఁ బ్రియంబును మృతి,యెడ నప్రియంబును నెవని కగునొ
వాఁడు మోహవశుఁడై పోడిమిం దప్పు నె,వ్వఁడు సుఖదుఃఖముల్ విడునొ వాఁడు
బ్రహ్మపదము నొందుఁ బండితుల్ దేనికిఁ, జింతింప కుందురు చిత్తమందు
వయ సొకయింతలోపల నేగు దేహమే, జలబుద్బుదం బని తలఁప వలయు

తే. ధనము కూర్చుట కష్టము దానిపాల,నమును గష్టము తన్నాశనమ్ము కష్ట
తరము దానియెడంబండితప్రకాండు,లాదరము సూపకుందురు స్వాంతమందు.

క. పెరిగినది విఱుగు వృద్ధియుఁ, దరుగున్ యోగం బయోగతం జెడిపోవున్
బరికింప జీవితంబున్, మరణాంతం బగు నటంచు మది నెఱుఁగ నగున్. 373

తే. ఆశ కంతము లేదు నిత్యప్రతుష్టి, పరమసుఖము సంతోషమే పరమధనము
గా మనీషులు దలపోసి కామగతుల, మది నడవ నీయ కెప్పుడు పొదలుచుంద్రు.

సీ. వ్యసనములం జిక్కుపడక మేధావియై, కార్య మారంభింపఁ గడఁగవలయు
ధనికి దరిద్రునకును విషయంబుల, ననుభవించినపయి నగునె యొండు
సంయోగపూర్వ మేచంద మాచందమే, విప్రయోగమునందు వెఱఁ గదేల
ధైర్యంబునం జేసి తాను శిశ్నోదర,మ్ములఁ బ్రమాదము లేక మెలఁగ వలయుఁ

తే. గనులఁ బాణిపాదంబులు మనసువలనఁ,గనులు చెవులును విద్య చే మనము వాక్కు
జనుఁడు కాపాడు కొనఁ దగు నని మహాత్ము,లైనవారు వచింతు రోయతివరేణ్య.

క. ఎవనిప్రయోజన మెంచక, మనమున నొకకోర్కి లేక మహితాత్ముం డై
తనయాత్మ తనకుఁ జుట్టం, బని తలఁచి చరించువాఁడు హాయి సుఖించున్. 376

ఆ. సుజనవందితాత్మ ! సుఖదుఃఖముల విప,ర్యాస మైనయప్పు డామనుజునిఁ
బ్రజ్ఞ గాని నీతిపౌరుషంబులు గాని, కావఁ జాల వనుచుఁ నీ వెఱుఁగుము.

తే. పరమయత్నంబు గావించి జరయు మృతియు
రోగమును లేక యుండెదురాఢి మెఱయ
తనదుదేహము రక్షించు కొనఁగ వలయు
యోగశాస్త్రజ్ఞుఁ డగు బ్రాహ్మణోత్తముండు. 378

క. శారీరమానసము లగు, ఘోరాధివ్యాధు లాత్మకున్ ధానుష్క
ప్రేరితబాణము లట్టు ల,పారములై తాఁకుదెంచి బాధించు నరున్. 379

చ. పవలును రేలు మానవులభవ్యతరాయువు సంగ్రహించి పెం
జవమున నేళ్లు వెల్లువలచందమునం బ్రవహించి పోవు మ
ళ్లవు వడి శుక్లకృష్ణములు లావఱఁ జేసి మనుష్యునిన్ జరం
జివికినవానిఁ జేసి చనుఁ జెచ్చెఱ నిల్వ వొకింతకాలమున్. 380

ఆ. ముదిమి లేనిసూర్యుఁ డుదయాస్తమయముల, నధిగమించువాఁడ నై సమస్త
జంతుజాతమునకుఁ జనుసుఖదుఃఖముల్,పక్వముగఁ బొనర్చుఁ బ్రౌఢి మెఱయ.

వ. అదృష్టపూర్వంబులు నపరిశంకితంబులు నగుమనుష్యులయిష్టానిష్టభావంబులం
గ్రహించి రాత్రులు నిర్గమించుచుండుఁ బురుషుండు కోరకుండఁ గర్మానుసార
ఫలంబుగాఁ గామంబులం బొందు సంయతులు దక్షులు మతిమంతులు నగు
వారు సర్వకర్మహీను లై నిష్ఫలులై చూపట్టుదురు కొందఱు పురుషాధములు
బాలిశులు నిర్గుణు లయ్యును గోరక సంపూర్ణకాము లగుదురు మఱికొందఱు
భూతహింసాపరులును లోకవంచకు లగువారు సుఖముగాఁ జిరకాలము జీవిం
తురు కదలక మెదలక కూరుచుండినవానికిన్ లక్ష్మి సంప్రాప్తమగు నింకఁ గొంద
ఱెట్టిఘనకార్యంబులు చేసినను బ్రాప్యార్థంబులం బొందఁ జాలరు పుత్రకా
ములై యెంతయేఁ బ్రయత్నించినవారికి సంతానప్రాప్తి యుండదు గర్భధార
ణంబు సర్పధారణంబు వలె భయంపడుచుండువారి కాయుష్మంతుం డగుకుమా
రుండు పుట్టుఁ బుత్రకాములై తపించి దేవతల నారాధించినవారికిఁ గులపాంస

సులు పుట్టుదురు స్థూలశరీరము నశించిన నాశరీరమునఁ జేసినకర్మంబు వశంబున శరీరాంతరంబు గలుగు దేహము నశించినప్పు డాజీవునకు నొకనావనుండి మఱియొకనావకు మనుష్యుండు మాఱునట్లు దేహాంతరంబు నొందుట సిద్ధం బగు నని మఱియును. 382

శా. రేతోబిందు వచేతనం బగుచు నేరీతిన్ వధూగర్భసం
పాతం బందెడు నేప్రయత్నమున జీవం బందు గర్భం బదే
రీతిన్ జాఠరవహ్నిసంగతిని జీర్ణింపంగఁ బో కున్నతిం
ప్రీతిం గూర్చెడు నంచు సందియము నీ హృద్వీథి వర్తించునో? 383

సీ. చెప్పెద విను మది జీర్ణకోశమునకుఁ, గాక మూత్రపురీషకలిత మైన
గతి గల్గి యటనుండి కదలుటకు నటన, యుండుటకును శక్తి నొంద కుండుఁ
బుట్టినగర్భముల్ పుట్టినట్లే కొన్ని, స్రవియించుఁ బుట్టుచుం జచ్చు కొన్ని
చచ్చియుం బుట్టును జక్కనై మఱికొన్ని, జానుమీఱుచునుండుఁ జావఁ బోక

తే. కర్మవశమున నిఁకఁ గొన్ని కడుపునందె,నాశనం బందు బీజసంధానశక్తి
స్త్రీపురుష భేదమునుబొందుక్షితిజనించుఁ, బోత మని నీ వెఱుంగవో భూతభావ.

వ. మరణకాలం బగుదెంచునప్పుడు భూతదేహంబునం గలపంచభూతమ్ములును సప్తమనవమావస్థలం బొంది పిమ్మటఁ గాన రాకుండు నాకర్ణింపుము. 385

సీ. మృగయులకుంజిక్కుమృగములువలెరోగ, ములఁజిక్కి మనుజులు మెలఁగ లేరు
వ్యాధిపీడితు లయి వైద్యులకున్ బహు,ధన మిచ్చి మందులం దినినఁ గాని
బ్రదికింపఁ జాలఁ డావైద్యుఁడు తాఁ జచ్చుఁ, గుశలుఁ డైనను రోగవశతఁ జేసి
త్రావి కషాయాదు లావెజ్జులును జరా,భర మైనఁ బాపుకో నోరిమ గనరు

తే. మృగములకుఁబక్షులకురోగముగునదనున,నెవఁడునుచికిత్సకుండగునెపుడుశ్వాప
దములకు దరిద్రులకునురోగము లెరావు,ధనికులను రాజులనె పట్టుఁదగనిరుజలు.

వ. ఇట్లు లోకము మోహశోకపరిప్లుతంబై కాలప్రవాహంబునం బడి కొట్టుకొని పోవుచుండు నెల్లప్రాణులును ధనధాన్యరాజ్యాదులం జేసి స్వభావం బగు కర్మానుగతిం దప్పించుకొనం జాలక జాలిం బడు నెందును స్వప్రయత్న మిసుమంతయు లే దది యున్న నెవ్వరును ముదుసళ్లు గారు మరణంబు నొందరు సఫలితకాము లగుచుందురు వారి కప్రియంబులును గలుగకుండు నాలింపుము.

ఉ. ఎల్లరు నున్నతంపుఁబద మెక్కఁగఁ గోరి ప్రయత్న మెంతయేఁ
జెల్లఁగఁ జేయుచుందు రది సిద్ధము కావుట కాకపోవుటల్

తొల్లిటికర్మసంగతిని దోఁపఁగ వచ్చెడు స్వప్రయత్నముల్
కల్ల లహంకృతుల్ వితలు కారణ మన్నిటి కెన్న దైవమే. 388

తే. అప్రమత్తులు ధీరులు నైనవారు, పూర్వకర్మవశంబునఁ బొలుపు దక్కి-
పానమత్తులు ధనమత్తు లైనవారి, నాశ్రయించి జీవింపఁగా నభిలషింత్రు. 389

తే. తెలియకుండఁగఁ గ్లేశముల్ తొలఁగి పోవుఁ
గొందఱకు స్వస్వమే పొందఁ గుదర కుండుఁ
గర్మసంగులయందును ఘనతర మయి
ఫలము వైషమ్య మారయ వచ్చుచుండు. 390

సీ. పల్లకి నెక్కెడువారలు కొందఱు, వూని కొందఱు దాని మోయువారు
కొందఱు రథముపైఁ గూచుందురు కొంద, ఱనుసరింతురు నడయాడుకొనుచుఁ
గులసతుల్ లేనివా రొక్కొందఱు విధవలై, కుతిలఁ గుడుచుస్త్రీలు కొంతమంది
వ్యాధు లాధులు లేనివారలు కొందఱు, సతతరోగులు కొంద ఱతగు లవని

తే. ద్వంద్వములయందు నొక్కొక్క దానిఁ బొంది
సంతసంబును దుఃఖంబు సతము నొంద
నంద ఱగుదురు వారలచంద మరయ
మోహమును బొంద కుండు వోమునికుమార. 391

శుకుండు కైలాసపృష్ఠంబున యోగం బనుసంధించుట.

వ. ఆరణేయా! నీ ప్రియాఖ్యానంబున ధర్మాధర్మంబులును సత్యాసత్యంబులును విడిచి దేనిచే దేన్నిని విడువ వలయునో దాని విడుపు మిది పరమగుహ్యం బేతన్మూలంబున దేవతలు భూతలంబు విడిచి స్వర్గంబు నొందఁ గలిగి రనిన శుకుం డొకయింత చింతించి నిశ్చయంబు నొందఁ జాలక దారపుత్రక్లేశ మధికము విద్యాక్లేశ మత్యధిక మల్పక్లేశంబున మహోదయం బగుపదంబు లభించు టెట్లని యోజించుచు ముహూర్తమాత్రంబునఁ బునరావృత్తిరహితం బగుపరమోత్తమగతి నొంద నిశ్చయించికొని యది జ్ఞానయోగంబునం గాని లభింపదు జ్ఞానికిఁ గర్మసంబంధంబు గలుగఁ బోదు గావున నేను యోగం బనుసంధించి గృహకళేబరంబు విడిచి వాయుభూతుండనై తేజోరాశి యగుదివాకరుం జేరెద నీతనిం జేరి చంద్రమండలంబు వృద్ధిక్షయంబులం బొందుచుండుం గాని సూర్యమండలం బెప్పుడును క్షీణింపదు లోకమునకు విజ్ఞాన మొసంగునీమండలంబుం బ్రవేశించి

యిందు నాకళేబరం బుంచి సౌరతేజంబు ధరించి ఋషులతోడం జరించెద నిప్పుడీనగ నాగ దేవ దానవ గంధర్వ యక్ష రాక్షస పిశాచోరగాదులయనుజ్ఞవడసి సూర్యునిం బ్రవేశించెద నని వారికిం జెప్పి నారదునానతిం బడసి పితృపాదులసవిధంబునకుం జని పాదాభివందనం బాచరించి తనయభిప్రాయం బెఱింగించి యాజ్ఞ వేఁడుటయు నాతండు ప్రీతుండై నీమూర్తిదర్శనంబున నానేత్రపర్వంబు గావించుకొనియెద నించుక నిలు మనిన నిస్సంగుం డగునతండు మోక్షమార్గాన్వేషణంబు సేయుచు గమనోన్ముఖుండై తండ్రిం బెడఁబాసి కైలాసపృష్ఠంబునకుఁ జని. 392

సీ. అంతఁ దొకసమదేశమందు నాసీనుఁడై, యోగధారణమున నొప్పుమిగిలి
క్రమముగాఁ బాదాదిగాత్రంబులందు యో,గానుసంధానము నలరఁ జేసి
ప్రాఙ్ముఖుఁడై సూర్యభగవాను నభిముఖు,ముగఁ జేసికొని పాదములును హస్త
ములును ముడుచుకొని మొగి వినీతుండయి, యుండె శ్వాసంబుల నుడుగఁజేసె

తే. నట్టియెడఁ బక్షులయును మృగాదులయును, శబ్దములు వానిదర్శనస్పర్శనములు
గలుగ కుండెను ధీమదగ్రసరుఁడతఁడు,యోగమునవిశ్చలుండయి యుండెనంత.

క. యోగమునసుండి కొంతటి,లోఁ గని పరమాత్మ నతఁడు లోలో నగుచున్
యోగముమఱియుంగయికొని,యోగేశ్వరుఁడగుచుమోక్షమొందఁగనయ్యెన్

వ. ఇట్లు కొంతతడ వుండి ద్వైపాయనాత్మజుం డటనుండి వెడలి విహాయసమార్గంబున నారదమహర్షి కడకుం జని తనయోగప్రకారం బంతయు నతని కెఱింగించి నీయనుగ్రహంబున యోగమార్గం బెఱింగితి నిష్టార్థసిద్ధియుం బొందఁ గలిగితి నని విన్నవించి నమస్కరించి తదనుజ్ఞాతుండై కైలాసపృష్ఠంబునుండి నభోమార్గంబున వాయుభూతుండై గరుత్మంతునిచందంబునఁ ద్రిదివంబునకు నిర్గమించె నాసమయంబున. 395

—— వ్యాసుండు వెనుకొన శుకుండు యోగమార్గంబున నదృశ్యుం డగుట. ——

మ. ద్విజవర్యుం డటు వాయువేగము మనోవేగంబునుం గల్గి ప్ర
వ్రజితుండై చను నమ్మహాత్ముఁ గని సర్వప్రాణులు న్విస్మయం
బు జనింపన్ వినుతించె నంత నతఁ డీముల్లోకముల్ బ్రహ్మ మన్
నిజమున్ లోన దృఢీకరించుకొనుచున్ వేవేగ మేగెన్ దివిన్. 396

వ. ఇట్లు సూర్యాగ్నిసమతేజస్కుం డగునతండు దీర్ఘమార్గం బేకమనంబున నకుతో

భయుండై యతిక్రమింపఁ జరాచరాత్మ ప్రపంచం బాతని యథాన్యాయంబుగఁ బూజించె దివౌకసులు పుష్పవర్షంబు గురిసిరి దేవర్షిసంఘం బూర్ధ్వంబుగ దృష్టి నిగిడించి తపస్సిద్ధి వడసి యంతరిక్షచరుండై పోవుచున్న వాఁ డితం డెవ్వం డని నివ్వెరం పడి చూడం జొచ్చి రపుడు త్రిలోకవిశ్రుతుం డగునతం డహస్కరుం దిలకించుచు మౌనవ్రతంబునం బోవుచుండఁ బంచచూడ లోనగునప్సరస లాతనిం గని సంభ్రాంతలై యీతఁ డెవ్వండు దైవతంబువలెం దోఁచుచు నుత్తమగతి నొంది వచ్చుచున్న వాఁ డితండు ముక్తసంగుండు నా నొప్పు నని విస్మయంబు నొందుచుండ నతం డొక్కింతలో మలయపర్వతంబునకుం జను టయు నట నూర్వశియుఁ బూర్వచిత్తియు నాతనింగని యిమ్మహాపురుషుండు పితృశుశ్రూషావిశేషంబున నిట్లుత్తమగతిం బొందియున్న వాఁ డిట్టిపుత్రునిం బెడఁబాసి తండ్రి యెట్లు స్వస్థుం డయ్యె నో కదా యని పలికిన వారిపలుకు లాలకించుచు నతం డంతరిక్షంబును సశైలవనకాననం బగుమహీతలంబును జూచుచుం జరించుచుండ దేవతలు కృతాంజలిపుటులై బహుమానపురస్సరం బుగాఁ జూచుచుండి రపుడు శుకుండు వారిం జూచి నన్ను మాతండ్రి యను సరించి శుకా! యని పిలిచిన మీరు నన్నుఁ బ్రేముడించుచుం బ్రతివచనం బొసంగుఁ డని పలికిన వానిమాటలు విని దిక్కులు వనంబులు పర్వతంబులు సముద్రంబులు సరిత్తులు లోనగునవి నీయాజ్ఞాప్రకారము కావింతు మని మాఱు పలికిన సంతసించుచు శుకయోగీంద్రుండు. 397

సీ. నాల్గువిధంబులై గల్గుదోషంబులు, వోఁ జేసికొని సిద్ధిఁ బొంద నెంచి
యైదువిధంబుల నగురజం బెన్మిది,విధము లౌతమమును వెడలఁ జేసి
పిదప సత్వంబును విడనాడి పొగ లేని,నిప్పు నా వెలుఁగుచు నిర్గుణంబు
నిత్యము సత్యము నిర్లింగ మగుబ్రహ్మ,పదమును బొందంగ బయలు వెడలె

తే.నపు డిల చలించె దిగ్దాహ మావహిల్లె,రాలె నుల్కలు వృక్షముల్ గూలె గిరులు
పగిలె నిర్ఘాతశబ్దము బ్రద్దలైన, పగిది హిమవంతమునఁ బర్వెఁ బ్రబల మగుచు.

చ. వెలుఁగఁడు చిత్రభానుఁడు సువిశ్రుతుఁ డయ్యు జ్వలింపఁ డగ్నియున్
గలఁగెను సాగరంబులు సుగంధరసోత్కరవర్షపాతముం
గలిగెను దివ్యగంధమును గల్గినవాయువు నాల్గుదిక్కులన్
గలయఁగ వీఁచె బ్రహ్మమును గన్గొనుచున్ శుకుఁ డేగునత్తఱిన్. 399

వ. పదంపడి శుకుండు హిమవన్మేరుసంభవంబులును శ్వేతపీతసంశ్లిష్టంబులును రుక్మరూప్యమయంబులు నగుశిఖరంబులు రెండును దిర్యగూర్ధ్వభాగంబుల శతయోజనవిస్తీర్ణంబులై కానిపింపఁ దదుత్తరమార్గంబు వట్టి నిశ్శంకంబుగాఁ బోవుచుండె నప్పుడు. 400

తే. శృంగములు రెండు రెండుగాఁ జీలినట్లు,తోఁచుటయు విస్మయంబును దోఁపనతఁడు వాని వడివడి గా దాఁటెఁ గాని వాని, గతికి నవి యడ్డుపెట్టవు గనుఁగొనంగ.

క. కొండలు చీలిక లగుటయు, దండిమగం డతఁడు వానిదాఁటుటయుం బై నుండి కనువేల్పు లచ్చోట, నిండఁగ మే ల్మే లటంచు నెఱపిరి రవముల్. 402

వ. అప్పుడు దేవర్షిగంధర్వయక్షరాక్షసప్రముఖప్రపూజితుం డగునతండు దివ్యపుష్పసమాకీర్ణం బగునంతరిక్షంబున రమ్యపుష్పద్రుమాలంకృతం బగుగంగానదికి మీఁది భాగంబునఁ జనుచున్న సమయంబున. 403

తే. వలువలను వీడ్చి గంగలో జలకమాడు, నప్సరస లెల్లఁ దమకు దాపై నభమున నరుగుచుండుశూన్యాకారుఁడై నశుకునిఁ,గాంచిమందాక్షమునుబొందనెంచరైరి.

శా. ఆలో వ్యాసమహర్షి హర్షమున నయ్యాత్మోద్భవుం డభ్రమం
దాలోలద్గతితోడ వాయుపథమం దక్లేగుటం గాంచి స్నే
హాలంకారసమన్వితుం డగుచు బ్రహ్మజ్ఞాని యానాతనిన్
బోలం గన్గొన వెంబడించె దివిషత్పూజ్యాశుగాంచద్గతిన్. 405

ఆ. శుకుఁడు గాలికన్న చులకన యానడ, మీఁదుమీఁదు గాఁగ మింటిదారి బ్రహ్మభూతుఁ డగుచుఁ బరఁగునిజప్రభం, జూపు చరిగె వెలుఁగు దోప నపుడు.

వ. వ్యాసభట్టారకుండును మహాయోగగతి నాశ్రయించి నిమేషాంతరంబునఁ గుమారుం జేరఁ గలిగినసామర్థ్యంబున. 407

క. వడివడి నడచుచుఁ గొండలు, నడుమఁగ రెం డగుచుఁ బగిలి నడిదారిఁ దోఁడిం బడఁ గాంచి సంతసించుచుఁ, గొడుకటు గావించి చనుటకుం దలరుమతిన్.408

వ. ప్రవర్తించుచు నపు డందలిఋషులు తనకుమారుని పరమాద్భుతకర్మం బెఱిఁగించిన వెఱంగుపడుచు నుచ్చస్స్వరంబున నోహో శుకా! యని యాక్రందనంబు గావించుచుం బిలుచుటయు నాస్వనంబు ముల్లోకంబులఁ బ్రతిధ్వనించుటం గాంచి శుకుండు సర్వగతుండును సర్వాత్ముండును సర్వతోముఖుండు నై ప్రతివచనంబుగా నో యనుటయు స్థావరజంగమాత్మకం బగుజగం బెల్ల నో యని

ప్రత్యుత్తరం బిచ్చెనది మొదలుకొని నేఁటివఱకును గొండగుహాలయందు నెట్టి శబ్దం బైన నో యని ప్రతిధ్వని శుకానువాదమై విన వచ్చుచుండు నంతలో, శుకుండు తండ్రికిం గానరా కంతర్హితుం డయ్యె నయ్యెడ భట్టారకుండును.

సీ. శబ్దాదిగుణముల సంత్యజించి పరంబు, నందినసుతునిమాహాత్మ్య మెల్లఁ
దెలిసి యాతనిన చింతించుచు నట గిరిప్రస్థమందు వసించె శ్రాంతుఁ డగుచు
నాతఱి మందాకినీతీరమున నాడు, నచ్చరచేడియ లతనిఁ గాంచి
సంభ్రాంతలును గతసంజ్ఞలు నై రందుఁ, గొందఱు దూరిరి గుల్మములను

తే. గొంద ఱప్పుల మునిఁగిరి కొందఱు వడిఁ,దారుమాఱుగ వస్త్రముల్ దాల్చి రిట్లు
పోల్చి వ్యాసుఁడు పుత్త్రునిముక్తతకును, దనదుసక్తత కందె ముదమును సిగ్గు.

వ. అనంతరంబ దేవగంధర్వవృతుండును మహర్షిగణపూజితుండును సర్వలోక శంకరుండు నగుశంకరుండు సాక్షాత్కరించి పుత్రశోకాభిసంతప్తుం డగు కృష్ణద్వైపాయనుం దిలకించి సాంత్వపూర్వంబుగా ని ట్లనియె. 411

ఆ. మున్ను నీవు పంచభూతతుల్యపరాక్రమక్రముం గుమారు మహితతేజుఁ
గోరి తీవు నేను గొమ్మని యిచ్చితిఁ, బుట్టె నట్టివాఁడు పుత్త్రుఁ డగుచు. 412

ఉ. నీదుతపఃప్రభావమున నీసుతుఁ డిట్టులు బ్రహ్మతేజముం
బ్రోదిగఁ గల్గి వేల్పులకుఁ బొందఁగ రానిపదంబు నొందె ని
ష్పీడిగు లేల పొంద నయి తీవు సముద్రములు న్మహాగిరుల్
మేదిని యుండునంతకును మీయశ ముండు మహోన్నతస్థితిన్. 413

తే. పుత్రమోహము తీఱనిపోల్కి యేని, పుత్త్రునిం బోలుఛాయ నీ పొంత నెపుడు
విడువకుండెడు నీవరం బిడితి దాని,నరయుచుం దృప్తి నొందు మోయతివరేణ్య.

వ. అని పరమేశ్వరుం డాశ్వాసించి తిరోహితుం డగుటయుఁ గృష్ణద్వైపాయ నుండు ఛాయాపుత్రదర్శనంబు గావించి శాంతచిత్తుండై సంతసించుచు మరలి పోయె నిది శుకునివృత్తాంతంబు దీనిని సవిస్తరంబుగా నారదుండు నా కెఱిం గించె వ్యాసుండును బ్రసంగవశంబునం జెప్పుచు వచ్చె మోక్షధర్మోపసంహితం బగునియ్యితిహాసంబు సంస్మరించినపురుషుండు శాంతిపరుండై పరమగతిం బొందు నింక నీవు న న్నేమి యడిగెద వని శాంతనవుండు కౌంతేయాగ్రజు నడిగె నని చెప్పుటయు నైమిశారణ్యవాసు లవ్వలివృత్తాంతంబు చెప్పు మని సూతు నడుగుటయును. 415

ఆశ్వాసాంతము.

ఉ. నావగుపూర్వజన్మములు నాలితనంబున కయ్యె నేమొ నే
నేవగ లేనియట్లు పరమేశ్వరునిన్ భజియింపకుండ నా
భావము వ్యాధు లాధు లనుబాధల మార్పడె నట్లు గాక మేల్
త్రోవ లభింపఁ జేసి కృపతోఁ గనవే జగదేకరక్షకా. 416

క. జ్ఞానము కలిగినదాదిగ, మానసమున శాంతి లేనిమాడ్కి మెలఁగితిన్
నే నెన్నో కష్టంబుల, మానఁజేతి న్నన్నుఁదేర్పుమా పరమేశా! 417

గద్యము.

ఇది శ్రీమదఘనాతనోభయకవిమిత్ర, వేంకటయజ్వాగ్రపుత్ర,
సమారాధితవిబుధరాజ, శ్రీపాదకృష్ణమూర్తికవిరాజ,
ప్రణీతం బయిన శ్రీకృష్ణభారతంబునందు
శాంతిపర్వంబున అష్టమాశ్వాసము.
శ్రీ శ్రీ శ్రీ



శ్రీ

బాలాత్రిపురసుందర్యై నమః.

# శ్రీకృష్ణభారతము.

శాంతిపర్వము - నవమాశ్వాసము.



మంత్రమాతృకాదిమ
హామంత్రోపాసకామలాంతర్వర్తీ!
కామితఫలదానసమా
త్తామలకీర్తీ! జగత్త్రయాంచితమూర్తీ! 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె న ట్లనినమందాకినీనందనుం దిలకించి ధర్మనందనుండు నాలుగాశ్రమంబులవారును సిద్ధిం గోరి యేదేవతల నారాధింప వలయు వారికి ధ్రువ మగుత్రిదివ మ్మెట్లు గలుగు ముక్తి యెవ్విధంబునం బ్రాపించు మఱియు దేవతలం బితృదేవతల నేవిధి నారాధింప వలయు ముక్తుండు పొందుగతి యెట్టిది స్వర్గతునకుం జ్యోతి లేకుండు టెట్లు దేవతలకు దేవుం డెవండు పితృదేవతలకుం బిత యెవండు చెప్పు మనినం గురుపితామహుం డిట్లనియె. 2

భీష్ముఁడు ధర్మరాజునకు నారదనారాయణసంవాదము చెప్పుట.

సీ. పరమగూఢం బగుప్రశ్న మొనర్చితి, నూతేడు లూహించి తెలియఁ జెప్పఁ
జాల రెవ్వరు దాని జ్ఞానంబుచేఁ గాని, దేవతానుగ్రహస్థితిని గాని
చెప్ప సాధ్యం బగుం జెప్పెద విను మితిహాస మొండీయర్థమందుఁ గలదు
నారదమునికిని నారాయణునకును, సంవాదరూపమై చనెడునద్ది

తే. మున్ను నారాయణుఁడుధర్మమూర్తిపుత్త్రుఁ, డగుచుఁబుట్టి చతుర్మూర్తియై సనాత

నుండువిశ్వాత్మకుండునైదండికెక్కె,ననుచువచియించెనాతండ్రిమునుపొకపుడు.

వ. మున్ను కృతయుగంబున స్వాయంభువమన్వంతరంబున నర నారాయణ హరి కృష్ణు లనినలువురుగల రందు నరనారాయణులు కనకరథంబు లెక్కి బదరికాశ్రమంబునకుం జని యటఁ బరమతపంబు గావించిరి వారిరథంబు లష్టచక్రంబులు భూతయుక్తంబులు మనోరమంబులై యుండె నాకర్ణింపుము. 4

తే. వారు కృశులయ్యునరములుబయటఁబడఁగ, నధికనిష్ఠాగరిష్ఠులై యచటఘోర
తప మొనర్చుచు దేవతాథ్యతులకును, గన నలవి గానితేజునఁ దనరి రపుడు

శా. వారిం జూచుతలంపుపెంపునను దేవానాంప్రియద్వేషి యై
పేరుం గాంచిననారదుండు కనకాన్వితాద్రిపై నుండి సం
చారం బొప్పఁగ గంధమాదనముపజ్జం జేరి యం దుండి వి
స్తారాధ్వంబును దాఁటి వచ్చె బదరీశస్తాశ్రమాస్థానికిన్. 6

వ. ఇట్లు సమాగతుం డగునారదుండు నరనారాయణులయాశ్రమంబునకుం బోవుచు సర్వజగద్రక్షకుం డగుసాక్షాద్విష్ణు వొక్కరుండ యయ్యుఁ దా నిపుడు నాల్గు విధంబులై యున్నవాఁ డందు రీనరనారాయణులు పరమాత్మస్వరూపులు వీ రిద్దఱు తపోనిష్ఠం గూరియున్నవారు వీరి కాహ్నికక్రియ లన నేమి సర్వ భూతపితలు దైవతము లట్టివా రేదేవత నారాధింతు రేపితరుల నర్చింతు రని చింతించుచు నయ్యాశ్రమంబుం జేర నరిగి యం దొకచో నాసీనులై యున్న పురాణమునుల సమీపించి వారు పొనర్చెడుదేవపితృకార్యంబులం దిలకించి పిమ్మట వారిచేఁ బూజితుండై విశ్రమించి నారదుండు నారాయణు నిరీక్షించి నమస్కరించి యిట్లనియె. 7

శా. సాంగోపాంగము లైనవేదములయం దాయాపురాణంబులం
దుం గీర్తింతురు నిన్ను శాశ్వతుఁ డజుండున్ సర్వలోకేశ్వరుం
డుం గోవిందుఁ డటంచు సర్వజగ ముండు న్నీదుపై నెందు నెం
దుం గన్పట్టెడు వారు గొల్చెదరు నిన్నున్ సర్వలోకేశ్వరా. 8

క. తల్లివి తండ్రివి నీవే, యెల్లజగంబులకు గురుఁడ వేద్దడ నీవే
యెల్లరు నిన్నుం గొలుతురు, తెల్లంబుగ నీ విఁ కెట్టిదేవుం గొలుతో. 9

వ. దేవా! నీదేవపితృపూజలం గాంచిననాకుఁ బరమాద్భుతంబు గలుగుచున్న దనిన నారదునకు నారాయణుం డి ట్లనియె. 10

క. ఇది పరమగుహ్య మొరులకు, విదితము సేయంగ రానివిషయం బైనన్

మది మమ్ము భక్తి సేసెదు, సదమలమతి వగుట నీ కెసంగ వచింతుఁ. 11

సీ. ఎది సూక్ష్మ మవ్యక్త మింద్రియార్థవివర్జితమ్మును సర్వభూతముల కంత
రాత్మ యనం జెల్లు నదియె క్షేత్రజ్ఞుఁడు, త్రిగుణవిరహితుఁ డై తెలియఁ బడెడు
పురుషుండు నాఁబడు పురుషోత్తమా! వాని, వలన గుణత్రయకలిత మైన
యవ్యక్త ముదయించె నది యవ్యయం బయి, ప్రకృతి యనం దగి వ్యక్తభావ

తే. సంస్థితం బగు నదియె మాజన్మములకుఁ, గారణమ్ము సదసదాత్మక మగు దాని
దైవపితృభక్తిఁ గొలుతు మద్దానికన్న, లేరు దైవపితృద్విజుల్ తెలియ మాకు.

వ. అయ్యాత్మనుండియే యీమర్యాద సుప్రస్థితం బై దైవపితృకర్మము లాచరింప
నగు నని శాసనం బయ్యె బ్రహ్మ స్థాణుఁడు మనువు దక్షుఁడు భృగువు ధర్ముఁడు
యముఁడు మరీచి యంగిరుఁడు నత్రి పులస్త్యుఁడు పులహుఁడు క్రతువు
వసిష్ఠుఁడు పరమేష్ఠి వివస్వంతుఁడు సోముఁడు కర్దముఁడు క్రోధుఁడు విక్రీ
తుఁడు ననునిరువండ్రు ప్రజాపతు లై రి వా రామర్యాద నతిక్రమింపక దైవ
పిత్ర్యంబు లెఱింగి యిష్టార్థసిద్ధులం బడయుచుండిరి స్వర్గస్థులు నిట్లు కావించి
కృతకృత్యు లగుచుందు రాలకింపుము. 13

తే. సప్తదశగుణకర్మసంసక్తతయును, బంచదశకళాగతులను బరమనిష్ఠ
వదలినట్టిరు ముక్తులై పొదలఁ గలరు, వారికిఁ గతి క్షేత్రజ్ఞుఁ డై రహించు.

క. ఆతఁడు సగుణుఁడు నిర్గుణుఁ, డై తగి జ్ఞానమునఁ దెలియ నగునట్టిఁడ యా
నాతనివలనఁ మే మిా, ఖ్యాతిఁ విఖ్యాతి నొంది పరఁగుదు మనఘా. 15

వ. ఇట్లు మే మాసనాతను నెఱింగి పూజించుచుంటిమి మఱియు వేదములు
నాశ్రమంబులు మతంబు లాతనినే సేవించి యుత్తమగతిం బ్రాపించుచున్నవి
నీవు మాకుఁ బరమభక్తుండ వగుటం జేసి యీరహస్యము నీ కెఱింగించితి
మని చెప్పిన ద్వీపద్వరిష్ఠుం డగునారదమునిశ్రేష్ఠుండు నారాయణమునిశిఖా
మణిదిక్కు మొగం బై యి ట్లనియె. 16

సీ. ఈ వెందులకు ధర్మునావాసమున నాల్గు, రూపుల నై తొ నిరూపణంబు
సేయుము నే నిప్డు నీయాదిమప్రకృతిని జూడఁ బోయెద దేవదేవ!
సతతము గురుపూజ సలుపుదుఁ బరరహస్యము వెల్లడింప వేదము లెఱిఁగితిఁ
దప మొనర్చితి నసృతము వల్క నెప్పుడు, శిశ్నోదరాదులై చెలఁగునాల్గు

తే. ద్వారములు గాచుకొనుచుంటిఁ దలఁప సములు
శత్రుమిత్రులు నిర్మలస్వాంతమున భ

జింతు నయ్యాదిదేవు నేకాంతమందు
నందునన్ నేను శుద్ధుఁడ నందు నిందు. 17

వ. అని పలికిన నారదునిపలుకు లాలకించి శాశ్వతధర్మగోప్త యగునారాయణుండు నారదమహర్షిన్ యథోచితంబుగ సత్కరించి నీవు పొమ్మని సెల వొసంగిన నతండు వాని కభివందనం బాచరించి వాయువేగంబున నెగిరి మేరుశిఖరంబున వ్రాలి యొక్కముహూర్తమాత్రం బట నేకాంతంబుగ విశ్రమించి యట నుండి యుత్తరపశ్చిమంబుగను క్షీరసముద్రంబున కుత్తరంబుగ నద్భుతజనకంబు గా నున్న శ్వేతద్వీపంబునకుం జనియె నదియును. 18

### శ్వేతద్వీపవృత్తాంతకథనము.

క. అప్పుసిడికొండ కెన్నఁగ, ముప్పదిరెండగుసహస్రములు యోజనముల్
చెప్ప నగుదూరమందుం, జొప్పడు నత్తెల్లదీవి సువిశాలం బై. 19

సీ. అందుండువార లనశను లనింద్రియు, లనిమేషు లిష్టగంధనిభృతులును
శ్వేతశరీరులు పాతకదూరు లై, పాపులదృష్టులం బరిహరింత్రు
వారిదేహస్థులు వజ్రసారములు మా,నావమానములు తుల్యములు వారి
కవయవరూపము లతిసారసము పేత, ములు ఛత్రసమశీర్షములును మేఘ
తే. రవమునుం గల్గి ఘనచతుర్బాహువులును, పద్మసన్నిభపాదముల్ పరఁగ ధవళ
షష్టిసంఖ్యాకదంతము లష్టదంష్ట్రలును మహాజిహ్వ లెన్ని యేఁ దనర నుంద్రు.

వ. వా రాజిహ్వలతో సర్వలోకంబులం బుట్టించియు సాంగవేదములయు ధర్మములయు మునులయు దేవతలయు పుట్టువులకుం గారణం బై సూర్యప్రఖ్యుండును విశ్వవక్త్రుండును విశ్వోత్పన్నుండు నగుదేవుని భక్తిం జేసి లేహనము చేయుచుందు రనిన ధర్మనందనుం డో పితామహా! వా రట్లు పుట్టుటకుం గతం బేమి వారికిం గలుగుగతి యెట్టిది ముక్తు లగువారిలక్షణంబు లిట్లుండనోపునో యెఱింగింపు మనిన నతం డిక్కథ మిగుల విస్తీర్ణ మయినది దీని మున్ను నేను నాపితృపాదులసన్నిధి వినియున్నవాఁడ నీ కిపుడు తత్సారం బెఱింగించెద నాకర్ణింపుము. 21

### ఉపరిచరుండు చిత్రశిఖండిశాస్త్రం బెఱింగి యశ్వమేధము చేయుట.

క. కలఁ డుపరిచరుఁడు నాఁబడు, నిలాతలాధిపుఁడు నిర్జరేశ్వరసఖుఁడున్
లలితమతి విష్ణుభక్తుఁడు, తొలుతన్ ధార్మికత పుట్టుతోఁ దన కమరన్. 22
క. నారాయణవరమున ము, న్నా రాయఁడు రాజ్య మంది యతితేజమ్మునన్

స్వారాట్సముఁడై భవ్యుఁడై, భూరియశం బందె మూఁడుభువనములందున్. 23

సీ. విను మమ్మహారాజు మును సూర్యముఖనిస్సృత మగుసాత్వతవిధిం దవిలి భక్తి
భరితుఁడై దేవేశు నిరతంబు పూజించి, తచ్ఛేషమునను బితామహులను
బితృశేషమున విప్రతతి సంవిభాగంబు, నను సమాశ్రితులను దనియఁ జేసి
శేషాన్నభోజియు శిష్టవ్రతుండును, సత్యపరుండును సర్వభూత

తే. హితుఁడు హింసావిరహితుఁడై సతముసర్వ,భావమున భక్తుఁడై దేవదేవుని జ
నార్దనుని లోకకర్త నవ్యయు ననాది, నిధనునారాధన మొనర్చునిరతమతఁడు.

క. నారాయణభక్తుండును, వైరివిమర్దనుఁడు రాజవరుఁ డాతనికిన్
స్వారాట్టై శాసనశ,య్యారత్నము లిచ్చి మెచ్చు నాదర మెచ్చన్. 25

క. తనరాజ్యమ్ము కళత్రము, ధనములు ధాన్యములు వస్తుతతులును గజవా
హనములు లోనగునవి హరి, యనుగ్రహమునన లభించె నని యతఁడెంచున్.

తే. కామ్యనైమిత్తికములు మఖక్రియలును
సాత్వతవిధిం బొనర్చు నాక్ష్మాపతికడఁ
బాంచరాత్రవిదుల్ భగవత్ప్రదత్త
మన్నమును మున్ను భుజియింతు రనుదినంబు. 27

వ. ఇట్లుపరిచరుం డనృతంబు లేక దుష్టవర్తనంబునం బోక ధర్మానుశాసనంబుగా
రాజ్యంబు పరిపాలించుచున్నంత మరీచియు నత్రియు నంగిరసుఁడు పుల
హుఁడు పులస్త్యుఁడు క్రతువు వసిష్ఠుఁడు నను సప్తమహర్షులు చిత్రశిఖండులు
నాఁ బేర్వడసి స్వాయంభువమనువుతో నెనమండ్రై మేరుశిఖరంబున నైకమత్య
ముతోఁ జతుర్వేదంబులం గలయర్థ మెల్ల నొక్కశాస్త్రంబు గావించి యేకా
గ్రమనస్కులు దాంతులు సంయమరతులు భూతభవ్యభవిష్యజ్ఞులు సత్యధర్మ
పరాయణులు నై యిది శ్రేయ మిది బ్రహ్మ మిది హితం బని లోకంబున కుప
దేశించుచు మున్ను ధర్మార్థకామంబులు నవల మోక్షంబును స్వర్గమర్త్యాదులం
గల వివిధమర్యాదలుం దెలియఁ జెప్పిరి మఱియును. 28

సీ. వీరు నారాయణు వేయి దివ్యాబ్దముల్, సేవించి రంత నాదేవదేవు
నాజ్ఞ సరస్వతి విజ్ఞానఘనుల వా, రల నావహించె సుక్రమ మెసంగ
దాన నత్యధికులై తాపసుల్ శబ్దమం, దర్థమందును హేతువందుఁ జెల్లు
నుత్తమశాస్త్రము నోంకారయుతముగా, రచియించి తొలుత నారాయణునకుఁ

తే. జదివి వినిపింప నతఁడు ప్రసన్నుఁ డగుచుఁ

గంటఁబడి యండ ఋషులను గాంచి నూఱు
వేలశ్లోకంబులం బొల్చి శ్రీల నొసఁగు
మీపానర్చినశాస్త్రము మిసిమిఁ గాంచు. 29

వ. మఱియు సర్వలోకతంత్రంబులధర్మంబులును బ్రవృత్తినివృత్తిమార్గంబులును దీనం గలుగు నిది ఋగ్యజుస్సామంబులకు నథర్వాంగిరస్సునకును బ్రమాణం బగు నేను బ్రసాదంబున బ్రహ్మను గ్రోధంబున రుద్రునిఁ బ్రకృతిం జేసి మిమ్ముం జేసితిని సూర్యాచంద్రమసులు జలవాయుభూమ్యగ్నినక్షత్రములు భూత సంజ్ఞం గాంచి బ్రహ్మంబు నెఱింగించుచు స్వాధికారంబునం బ్రవర్తించుచుండు వీనికిని మీశాస్త్రంబు ప్రమాణం బగు నిది నాయనుశాసనం బని మఱియును.

సీ. వచియించు ధర్మముల్ స్వాయంభువుఁడుదీన,నుశనుండుధిషణుండునుదయమంది
మీమత మెఱిఁగింత్రు మీఁద నుపరిచర, వసువు బృహస్పతివలనఁ గఱచి
నాభక్తుఁడై దీన నడపుఁ దంత్రము లెల్ల, నిది యుత్తమం బయి యొసక మెసఁగు
నేతత్ప్రవర్తన మెసఁగించుటం జేసి, మీరు ప్రజావంతులై రహింత్రు

తే. వసువు వసుమంతుఁడై ప్రభావముననొప్పి, స్వర్గమున కేగునంత మీశాస్త్రమిది తి
రోహితం బగుఁ జెప్పితి నీమాఁ జేసి,యని యదృశ్యుఁడై చనియె నారాయణుండు.

వ. అంత నాలోకజనకులు సనాతనం బగునాశాస్త్రముం బ్రవర్తింపం జేసియు నవలఁ గృతయుగంబున నంగిరఃకులంబున జనించినబృహస్పతికి సాంగోపనిషదం బగునాశాస్త్రంబు నొసంగి సర్వధర్మప్రవర్తకు లగువారు తపంబునఁ గృతనిశ్చయులై యథేచ్ఛం జని రనంతరంబున నయ్యాంగిరసుండు బృహద్బ్రహ్మమహత్పర్యాయపదంబుల బృహస్పతి నా నొప్పి మహావిద్వాంసుం డయ్యె నతని కుపరిచరుండు ముఖ్యశిష్యుండై చిత్రశిఖండి శాస్త్రం బంతయు నధ్యయనంబు చేసి వాసిం గాంచె మఱియును. 32

క. అతఁ డింద్రుఁడు దివముం బలె, క్షితితలరాజ్యంబు ప్రజకు క్షేమం బలరన్
బ్రతిపాలించుచు నెన్నేఁ, గ్రతువులు గావించె సురలు కౌతుక మొందన్. 33

వ. అప్పుడమిఱేఁ డొకప్పుడు కావించినయశ్వమేధయాగంబున నుపాధ్యాయుం డగుబృహస్పతి హోత యయ్యెఁ బ్రజాపతిసుతు లగు నేకత ద్వితత్రితులును మహర్షు లగుధనుష రై భ్యార్వావసు పరావసు మేధాతిథి తాండ్య శాంతి వేదశిరులును శాలిహోత్రజనకుం డగుకపిలుండు నాద్యుఁ డగుకఠుండును వైశంపాయనాగ్రజుం డగుతైత్తిరియుఁ గణ్వుఁడును దేవహోత్రుఁడు ననుపదు

నార్వురును సదస్యులై రమ్యమహాధ్వరంబున. 34

తే. సర్వసంభారములు నందు సంభవించెఁ, గాని శుచియు నహింస్రుఁడు నైనతేని
యానతిం బశుఘాతమా యాగమందు, లేక యారణ్యకంబులే కైకొనఁబడె.

క. దానికి హరిమేధుఁడు భగ,వానుఁడు సంప్రీతి నొంది పరు లెవ్వరికిం
గానంగ రాక నృపతికిఁ, గానంబడి యాగభాగకలితుం డయ్యెన్. 36

ఉ. మేటియు యాజకుండు నృపుమే ల్దలపోసెడునొజ్జ కోపి యై
మాటికిఁ జేతిస్రుక్కును గ్రమం బఱి యంబరసీమ నేయుచుం
జాటుగ హవ్యభాగము నొసంగుట గా దిదె భాగ మెత్తితిన్
మాటలు మాని వచ్చి కొనుమా యను చుంటిని దేవదేవునిన్. 37

వ. అని రాజుదిక్కు మొగంబై మొగంబు బిగియం బట్టి నట్టియెడ రాజేంద్రుం
డును సదస్యులు నతనిఁ బ్రసన్నుం జేయుచు ని ట్లనిరి. 38

చ. కృతయుగధర్మ మౌనె యిటు కేవలునట్టులు కోప మూనుటల్
స్తుతిహితకార్య మం చనఁగఁ దోఁపదు నీ విటు కోపి వైన న
ప్పతి కినియంగఁ బోవఁడు కృపం గొనువారికిఁ గాక దర్శనం
బతఁ డిడఁ డస్మదాదులకు నాతనిఁ జూడ నశక్య మయ్యెడిన్. 39

ఏకత ద్వితత్రితులు బృహస్పతికి విష్ణుమహిమం జెప్పుట.

వ. అంత నేకతద్వితత్రితు లతని కి ట్లనిరి. 40

ఆ. మహితమూర్తి! బ్రహ్మమానసపుత్రుల, మేము మోక్ష మొందునిచ్ఛఁ జేసి
యొక్కకాలమందు నుత్తరాశం బట్టి, చనియుఁ జనియు నొక్కస్థలమునందు.

సీ. భర్మాద్రి కుత్తరభాగంబునం దల్లఁ, బాలవెల్లిం జేరుకూలమందుఁ
నారాయణుండు సనాతనుం డగుదేవ, దేవు దర్శించెడుభావమునను
గాష్ఠంబు నా నొంటికాల నిల్చి తపంబు, వేయేండ్లు సలిపితి మాయతముగ
మాచేయువ్రతము సమాప్తమైనంత నా,కాశవాక్యము వినఁగలిగె నొండు

తే. దేవదేవుని దర్శింపఁ దివిరి మీరు, తపము గావించితిరి గాని తత్ఫలముగ
నతనిఁ జూచుట కష్టము ట్లైనఁ గాని,వినుఁడుమీ కొండు చెప్పెద వేడ్కమీఱ.

వ. క్షీరసముద్రంబున కుత్తరభాగంబున శ్వేతద్వీపంబు గల దందుఁ జంద్రవర్చ
స్కులు నేకాంతభావులు పెక్కురు కల రాభక్తు లాదేవదేవునిం బొంది
దర్శింపఁ గలరు మీ రందులకుం బొండు మీ కట నాత్మప్రకాశం బగు నని
పలుకుటయును. 43

సీ. ఆమాటల న్విని మేము మూావుర మల్ల, దీవికిఁ జని యట దేవదేవుఁ
గన నెంచితిమి గాని కన్నులు మిఱుమిట్లు, గొలిపెఁ ద త్తేజమువలనఁ జూడఁ
జాల మైతిమి మాకు జనియించె జ్ఞానము, తపము సేయక చూడఁ దగ మటంచు
మరల మే మొకనూఱు పరివత్సరంబులు, తపము చేసినపయిఁ దత్స్థలమున
తే. సర్వలక్షణలక్షితుల్ చంద్ర తేజు, లయినవారు కృతాంజలులై యుదఙ్ము
ఖులును బ్రాఙ్ముఖులై మనఃకలితజపము, సలుపుచుండుటఁ గాంచితి మెలమి దోఁప.

ఉ. వారితపంబునం దనిసి వారిజనాభుఁడు వారివాఁడ యా
వారు యుగావసానమున వర్తిలుసూర్యునిఁ బోలుకాంతిమైఁ
దీరి మెఱుంగుచుండెదరు తెల్వఁగ నే మగు నోమునీశ్వరా!
భూరితరప్రభాపటలపూర్ణపదం బని తోఁప వచ్చెదుర్. 45

సీ. అంతలో మాకు నత్యాశ్చర్యముగఁ దోఁచె, నొకపరి వేయిసూర్యులు జనించి
నట్లు మహాతేజ మది గని యట నున్న, వారు నమో నమో వారిజాక్ష!
యని కృతాంజలు లయి యటు నిటు బలిచిరి, పూజించి నట్లును బోలఁ దోఁచెఁ
గాని మా కేమియుఁ గాన రాదయ్యెను, భ్రమ మామదుల నప్డు పాదుకొనియె
తే. వారిలో నొక్క రైన నెవ్వారు మీర, లని యడిగి గాని మావంక నరసి కాని
యెఱుఁగ కేక మనస్కులై యొసఁగిరపుడు, పలికె నశరీరభూత మిప్పగిది మమ్ము.

క. శ్వేతులు సర్వేంద్రియసం, ఘాతవివర్జితులు వీరు గా కెవ్వరు నీ
భూతపతిఁ జూడఁ జాలరు, వే తరలుఁడు మీర లిచోటు విడి మునులారా.

వ. ఏకాంతభక్తులకుఁ గాని భక్తి లేనివారి కీనారాయణదర్శనంబు లంభిప
దోమహామునులారా! కృతయుగంబు వోయి త్రేతాయుగంబు వచ్చినప్పుడు
వైవస్వతమన్వంతరమున నొక్కమహావిపర్యాసము గలుగు నప్పుడు సురకార్య
సిద్ధికై మీాయుపకృతి కావలసియుండు ననిన విని మేము మరలి మాప్రదేశం
బునకు వచ్చితి మవధరింపుము. 48

ఉ. అట్టితపంబు చేసియును హవ్యము కవ్యమునుం బొనర్చియుం
బుట్టినదాది సద్వ్రతము పూని చరించెదునిట్టిమేమ యొ
ట్టెట్టొనరించియుంద్రిభువనేశ్వరు శాశ్వతు వానిఁ జూడ లే
నట్టిర మైతి మిట్టియెడ నారయు దెట్టులు నీవు చెప్పుమా. 49

వ. అని యనేకవిధంబుల నేకతాదులు బోధించిన బృహస్పతి దేవతలం బూజించి
యాగసమాప్తి గావించె నుపరిచరుండును గృతకృత్యుండై రాజ్యపాలనంబు

సేయుచు సర్గంబునకు నిర్గమించి యట బ్రహ్మశాపంబునఁ బడభ్రష్టుండై భూ వివరంబునం బడి విష్ణుమంత్రప్రభావంబున నుత్థితుండై బ్రహ్మపదంబుకంటె నున్నతం బగుపదంబు నొందె నని తెలిపిన యుధిష్ఠిరుండు ధర్మాత్ముఁడు వసు మహారాజు స్వర్గపదభ్రష్టుం డగుటకుం గతం బేమి యనిన దేవవ్రతుం డి ట్లనియె. 50

ఉపరిచరుండు స్వర్గభ్రష్టుం డైనవృత్తాంతము.

శా. ఛాగాలంభన మాచరించి సవముల్ సాఁగింపఁగా నొప్పు నం
చాగీర్వాణులు జీవహింస విహితం బౌ నంచు వేదంబు వా
కోగం జెప్పరు గాన బీజములె కైకొంచుఁ యజింపంగ నో
యాగంబుల్ వధ మీాకృతంబునను జేయం జెల్లునే యేరికిన్. 51

తరళము. అనుచు వేల్పులకున్ మునీంద్రుల కంత మింతయు లేనియ
ట్లొనరె వాద మదెంతయేనియు నొక్కకాలమునందు ని
ట్లనుగతం బగుచుండు నప్డు సమాగతుం డయి తత్పదం
బున వసుక్షితినాథచంద్రుఁడు పొల్చె దారి గమించుచున్. 52

తే. అఖిలపరివారపరివృతుండంతరిక్ష, చరుఁడును సమగ్రబలవాహసహితుఁడగుచు
దేవయానంబునం బోవు ధ్మావరుండు, దిగియె నట నున్నవారు వెఱగుపడంగ.

వ. అట్లు సపరివారుండై దిగినవసున్నృపాలుం గాంచి ఋషులు దేవళ్లదిక్కు మొగంబై యీారాజేంద్రుండు యజ్వయు సర్వభూతహితరతుండు గావున నితని నడిగి మనవాదు తీర్చుకొంద మని రాజుం జేర వచ్చి తమవా దెఱిం గించి. 54

మ. అజమా ధాన్యములా సవంబులను హవ్యార్థంబు చేకోఁగ నో
నిజముం జెప్పుము మామదిం గలుగుసందేహాంబులం దీర్పు భూ
భుజలోకాగ్రణి! మాకు నీవచనముల్ పొల్పుం బ్రమాణంబులై
సుజనుల్ మెచ్చెడిమచ్చునం దగవు దీర్పుం గాదె రా జెప్పుడున్. 55

వ. అనిన నుపరిచరుండు కృతాంజలిపుటుండై మీాలో నెవ్వ రేమతంబున వాదించు కొనుచుండి రెఱింగింపు మనిన ఋషు లి ట్లనిరి. 56

తే. ఓషధులచే యజించుట లొప్పు ననుచు,నేము కా దట్లు ఛాగంబులే సవముల వేల్వఁ దగినవి యనుచు నీవేల్పు లిట్లు, వాదులాడుచు నుంటి మోవసునృపాల.

వ. అనిన వసురాజు దేవమతంబు గ్రహించి దేవపక్షసమాశ్రయంబున నజంబె సవ

నంబున యజింపం దగు నని చెప్పిన సూర్యవర్చస్కు లగుబుషు లెల్లరుం గుపితులై సురలపక్ష మాశ్రయించి సత్యంబు చెప్ప వయితివి గావున నీవు స్వర్గచ్యుతుండ వగుము నేఁటినుండి నీ కాకాశగమనంబును లేకపోవుఁ గాక మఱియు మాశాపాఘాతంబున భూమిం బెకలించుకొని పోవుదువు గాకయనిశపించినంతన యుపరిచరుండు ధరణిం బడి వివరగతుం డయ్యెఁ గాని నారాయణాజ్ఞం జేసి పూర్వస్మృతి మాత్రము పోకుండె నాకాలంబున నాకౌకసు లెల్లరు మనకారణంబున నిమ్మహారాజున కిట్లు వచ్చెఁ గావున మన మీశాపంబు వాపి ప్రత్యుపకారంబు సేయఁ బ్రయత్నింప వలయు నని సర్వభావంబున నిశ్చయించుకొని వసురాజున్న చోటునకుం జని 58

మ త్త. దేవభక్తుఁడ వీవు నీపయి దేవదేవున కెంతయుఁ
భావ మయ్యెడు నాతఁ డెల్లప్రపంచకంబున నీశ్వరుం
డై వెలింగెడువాఁడు నీ కగునట్టిశాపము వాపెడుఁ
గావునన్ భజియింపు మాతనిఁ గాచు నిన్నతఁ డిత్తఱిన్. 59

వ. అని మఱియును. 60

సీ. విను మెప్పుడు నవజ్ఞ విప్రజాతికిఁ బొనరింప నొప్పదు వివరింప వారి
తపము ఫలింపక తప్పదు మాహేతువున నీకుఁ బతనంబు వొనరెఁ గాన
నిను మే మనుగ్రహమునఁ జూతు మీశాపమగు నంతదాక నీ కాఁకలికిని
సవముల న్వేల్వంగ నవువసుధారలు, నినుఁ జేరుచుండు నీ వనుభవింపు
తే. మెపుడు క్లేశము లేకుండు నీవివరమునందు క్షుత్పిపాసలు నిన్నుఁ బొంద కుండు
మావరంబులబలమున దేవదేవుఁడలరి బ్రహ్మలోకము నీకుఁ గలుగఁ జేయు.

తరు. అని వరం బొసఁగి యయ్యమరులు సనిన,యంత నవ్వసురాజు హరిని సేవించి
తనకొన్న మంత్రము తగ జపించుచును, దాఁ బంచయజ్ఞముల్ తవిలి కావించె
మనమున దాని కామాధవుఁ డలరి, మహితవరం బీయ మఱియుఁ దా నెంచి
తన చెంత నుండిన తార్క్ష్యు నీక్షించి, తత్పరత్వమున నేతద్రీతిఁ బలికె. 62

తే. వసువు బ్రాహ్మణకోపమువలన భూవివరమునం బడె నాతనివలన నేను
ప్రీతుఁ డైతిని గావున నీతఁడిఁ జని, వాని ఖేచరుఁ జేయు మోవైనతేయ. 63

వ. అనిన నతం డొఁ గావుత మని వసురాజున్న చోటునకుం జని వాని నావివరంబునుండి వెడలించి గగనంబునకుం గొని పోయి విడిచె విడిచినంత నతండు తనతొంటిరూపంబు దాల్చి బ్రహ్మలోకంబునకుం జనియె నో ధర్మనందనా!

మానసపుత్త్రులసంభవం బెఱింగించితి నింక నారదుండు శ్వేతద్వీపంబునకుం జనినవృత్తాంతంబు నెఱింగించెద నవహితుండవై విను మని శాంతనవుండు వెండియు. 64

—◆ నారదుండు శ్వేతద్వీపంబునకుం జని నారాయణుని దర్శించుట. ◆—

క. శ్వేతద్వీపంబునకుఁ, బ్రీతిమెయి న్నారదుండు విచ్చేసి యటఁ
శ్వేతాంగులఁ గని మ్రొక్కియు, నాతతగతి వారిమ్రొక్కు లందియు నంతన్.

ఆ. జప్యపరముఁ డయ్యు సర్వకృచ్ఛ్రంబులు, సలిపియూర్ధ్వబాహుకలితుఁ డగుచు
నిలిపి మనమునందు నిర్గుణు విశ్వరూపుని నుతించె నిట్లు పౌనరుభక్తి. 66

వ. దేవా ! దేవదేవా! నీకు నమస్కారము నిర్గుణా ! నిష్క్రియా ! లోకసాక్షీ! క్షేత్రజ్ఞా ! పురుషా ! మహాపురుషా ! పురుషోత్తమా ! నీ కేటికో ళ్లనంతపురుషా! త్రిగుణా! ప్రధాన! యమృతా! యమృతాక్ష! యనంతా! వ్యోమా ! సనాతన! సదసద్రూపా! వ్యక్తా! యవ్యక్త! బుతధామ! యాదిదేవా! వసుప్రద! ప్రజాపతీ ! సుప్రజాపతీ ! మహాప్రజాపతీ! వనస్పతీ! యూర్జస్పతీ! వాచస్పతీ! జగత్పతీ! మనస్పతీ ! దివస్పతీ! మరుత్పతీ! సలిలపతీ! పృథివీపతీ ! దిక్పతీ ! నీ కిదే వందనము పూర్వనివాసా! గుహ్యా! బ్రహ్మపురోహితా ! బ్రహ్మకాయకా! మహారాజికా! చాతుర్మహారాజికా! యాభాసుర! మహాభాసురా ! సప్తమహాభాగా! నీ కిదె ప్రణామము యామ్యా! మహాయామ్య ! సౌజ్ఞా ! యసౌజ్ఞా ! తుషిత! మహాతుషిత! ప్రమర్దన ! పరినిర్మిత! యపరినిర్మిత! వశవర్తి! యపరినిందిత! యపరిమితవశవర్తీ! యవశవర్తీ! యజ్ఞ! మహాయజ్ఞ! యజ్ఞసంభవ! యజ్ఞయోని! యజ్ఞగర్భ! యజ్ఞహృదయ ! యజ్ఞస్తుతా ! యజ్ఞభాగహార! పంచయజ్ఞ! పంచకాలకర్తృపతి! పాంచరాత్రిక ! వైకుంఠ! యపరాజిత ! వందనము మానసిక! నామనామిక ! పరస్వామీ! సుస్నాత! హంస! పరమహంస! మహాహంస! పరమయాజ్ఞిక! సాంఖ్యయోగ ! సాంఖ్యమూర్తీ! యమృతేశయ! హిరణ్యేశయా! దేవేశయ! కుశేశయ! బ్రహ్మేశయ ! పద్మేశయ! విష్వక్సేన! విశ్వేశ్వర! నీకు సాష్టాంగనమస్కారము నీవు జగదన్వయుండవు జగత్ప్రకృతివి నీ కగ్ని ముఖము నీవే బడబాముఖాగ్నియు నాహుతియును నీవు సారథివి వషట్కారుఁడవు నీవ యోంకారమవు నీవ తపము నీవ మనము నీవ చంద్రుఁడవు నీవ చక్షుస్సువు నీవ యాజ్యము నీవే సూర్యుండవు నీవే దిగ్గజమవు దిగ్భానూ! విదిగ్భానూ! హయశిరా! నీవు ప్రథమత్రిసౌపర్ణుఁడవు వర్ణధరా! పంచాగ్నీ! త్రిణాచికేతా! షడంగనిధాన! ప్రాగ్జ్యోతిషా! జ్యేష్ఠసామగా! మానసికవ్రతధరా!

యథర్వశిరా! పంచమహాకల్ప! ఫేనపాచార్య! వాలఖిల్య! వైఖానస! యభగ్నయోగ! యభగ్నపరిసంఖ్యానా! యుగాదీ! యుగమధ్యా! యుగనిధనా! యఖండల! ప్రాచీనగర్భ! కౌశిక! పురుష్టుత! పురుహూత! విశ్వకర్త! విశ్వరూప! యనంతగతీ! యనంతభోగ! యనంతా! యనాదీ! యమధ్యా! యవ్యక్తా! యవ్యక్తనిధన! వ్రతావాస! సముద్రాధివాస! యశోవాస! తపోవాస! దయావాస! లక్ష్మ్యావాస! విద్యావాస! కీర్త్యావాస! శ్రీవాస! సర్వావాస! వాసుదేవ! సర్వచ్ఛందక! హరిహయ! హరిమేధమహాయజ్ఞభాగహరా! వరప్రద! సుఖప్రద! ధనప్రద! హరిమేధ! యమా! నియమా! మహానియమ! కృచ్ఛ్రి! యతికృచ్ఛ్రి! మహాకృచ్ఛ్రి! సర్వకృచ్ఛ్రి! నియమధరా! నివృత్తభ్రమా! ప్రవచనగత! ప్రవృత్తవేదక్రియ! యజ! సర్వగతీ! సర్వదర్శీ! యగ్రాహ్య! యచల! మహావిభూతి! మాహాత్మ్యశరీరా! పవిత్ర! మహాపవిత్ర! హిరణ్మయ! బృహద్రూప! యప్రతర్క్య! యవిజ్ఞేయ! బ్రహ్మాగ్ర్య! ప్రజాసర్గకరా! ప్రజానిధనకరా! మహామాయాధరా! చిత్రశిఖండీ! వరప్రదా! పురోడాశభాగహరా! గతాధ్వరా! ఛిన్నతృష్ణా! ఛిన్నసంశయా! సర్వతోవృత్త! నివృత్తరూప! బ్రాహ్మణరూప! బ్రాహ్మణప్రియ! విశ్వమూర్తి! మహామూర్తీ! బాంధవ! భక్తవత్సల! బ్రహ్మణ్యదేవ! నేను నీభక్తుండను నిన్ను దర్శింపఁ గోరి యున్నవాఁడ నేకాంతదర్శనుండ వగు నీ కిదే నమస్కారము నీ కిదే నమస్కారము.

క. అని నారదుం డొనర్చిన, ఘనతర మగుస్తోత్రవిధము కౌంతేయునకున్
వినిపించి దేవగంగా, తనయుఁడు మఱి యిట్టులనియెఁ దాత్పర్యమునన్. 68

క. సురముని యిటు తథ్యమ్ములు, సరహస్యము లైన పేళ్ల సర్వేశ్వరునిం
బరిపరివిధములఁ బొగడినఁ, గరుణాళుం డాతఁ డతనికంటికిఁ దోఁచెన్. 69

సీ. విశ్వరూపుఁడ తండు వెలసి చంద్రుని కాంతి,యును గృశానుని కాంతియును మిహిరుని
కాంతియుం గలిగియుఁ గంటికి మిఱుమిట్లు, గొలుపుచుంతటఁ గొన్ని కొన్ని యెడల
శుకపత్రనిభుఁడు స్ఫటికసన్నిభుఁడును నీ, లాంజనప్రఖ్యుండు హాటకప్ర
భుఁడు ప్రవాళాంకురభూరివర్ణుఁడు శ్వేత,వర్ణుండు వైదూర్యవర్ణుఁ డింద్ర

తే. నీలసముఁడు కేకిగ్రీవనిభశరీరుఁ, డగుచు బహువిధరూపవర్ణాంచితుఁ డయి
వేయి బాహులు శీర్షముల్ వేయి కనులు, గలిగి యవ్యక్తరూపుఁడై క్రాలుచుండె.

తే. తనముఖమునుండి యోంకారమును వెలార్చు
చును జతుర్వేదములఁ బల్కుచును మనోభా

రముగ నారణ్యకముల గానము పొనర్చు
చరయ నయ్యె యజ్ఞేశ్వరుఁ డగునతండు. 71

శ్వేతద్వీపవాసి యగునారాయణుండు దర్శన మిచ్చి నారదునకుఁ దత్త్వ ముపదేశించుట.

వ. మఱియు నన్నారాయణుండు చిరత్నరత్నపాదుకలం దొడిగికొని స్ఫటికమణి మాలికలను గృష్ణాజినదండకమండలువులను జ్వలించునగ్నిహోత్రంబును హస్తంబుల ధరించి ప్రసన్నవదనుండై లోచనగోచరుం డగుటయు నారదుండు పాదాభివందనం బాచరించి వినమ్రుండై యున్నం గని యమ్మహాత్ముం డతని కిట్లనియె. 72

క. ఏకతుఁడు ద్వితుఁడు త్రితుఁడును, నాకడకు న్వచ్చి దర్శనం బొనరింపం
గాక చని రేను దర్శన, మేకాంతికు లైనవారికే యిడుచుందుర్. 73

వ. నీ వేకాంతికోత్తరుండవు గావున నన్నుం జూడఁ గంటి నాయీదేహంబులు ధర్మునిగేహంబునం బుట్టినవి వాని నీ వెల్లప్పుడు నారాధించుచుండుము నీకు శ్వశ్రేయసం బగుం గాక నేను నీకుఁ బ్రసన్నుండ నైతి నావలన నేదేని వరంబు గోరుకొ మ్మనిన నారదుండు. 74

చ. అమలుఁడ వవ్యయుండవు ననాదిలయుండవు నైననీవు నా
కమరఁగ దర్శనం బొసఁగి తంతియ చాలు వరంబు లేల నా
యమనియమాదులున్ దపము సార్థకమై ఫలియించె నాదుజ
న్మము కృతకృత్య మయ్యె నిఁక మానవకోటుల నేను ధన్యుఁడన్. 75

వ. అని నారదుండు పలుకుచున్నంత నారాయణుండు వెండియు. 76

చ. మసలక పొమ్ము నీ విచట మామకు లింద్రియశూన్యు లెందఱో
మసలుచు నన్నుఁ గొల్చుటకు మానసముం గొని యుంద్రు వారియు
ల్లసదసమానభక్తి సఫలం బగునట్లుగఁ జేయు చేతకున్
బొసఁగఁగ రాదు విఘ్న మని పోలిచి యిట్లు వచింతు నారదా. 77

తే. సిద్ధులు రజస్తమోఽతీతు లిద్ధబుద్ధు, లయినవీర లేకాంతులై యనవరతము
ననుఁ బ్రవేశించి సంతతానంద మనుభ,వించుచుందురు ననుఁ గూడి విడువ కంటి.

సీ. సర్వగతుండయి సత్త్వరజస్తమోఽ,తీతుఁడై జగదాత్మభూతుఁ డగుచు
భూతశరీరస్థుఁ డై తలిర్చియు నవి, నశియించినం దాను నాశ మొంద
కజుఁడునిత్యుఁడుశాశ్వతా కారుఁడగు నిర్గు,ణుఁడునిష్కళంకుఁడై యడరువాఁడు
నిరువదినాలు గై యొసఁగుతత్త్వముల పైఁ, బంచవింశాఖ్యచేఁ బరఁగువాఁడు

తే. జ్ఞానదృశ్యుఁడు నిష్క్రియుండైనవాఁడు, వేనినిం బొంది యచ్చటి ద్విజులు ముక్త
లగుదురు సనాతనుఁడు పరమాత్మ వాసు, దేవుఁ డాతఁడు తెలియు మో దేవమౌని

వ. ఆదేవునిమాహాత్మ్యం బభివర్ణించెద నాకర్ణింపు మాతండు శుభాశుభకర్మంబు
లకు లోను గా కుండు సత్త్వరజస్తమోగుణంబులు సర్వశరీరంబులందును
బ్రవర్తించుచుండు నీగుణంబుల క్షేత్రజ్ఞుం డనుభవించుం గాని యవి వాని
ననుభవింపఁ జాల వతఁడు నిర్గుణుఁడు గుణభోక్త గుణస్రష్ట గుణాధికుండు
నై యుండు జగత్ప్రతిష్ఠ యగుపృథివి జలంబుల లీనం బగు జలము జ్యోతిస్సు
నందును జ్యోతిస్సు వాయువునందును వాయు వాకాశంబునందు నాకాశము
మనంబునందును మనం బవ్యక్తమందు నవ్యక్తము నిష్క్రియుం డగుసనాతన
పురుషునియందును లీనం బగుచుండు. 80

సీ. ఆపురుషునికంటె నన్యతరుఁడు లేఁడు, వాసుదేవుఁ డతండె పరముఁ డెల్ల
స్థావరజంగమాత్మకజగంబు నశించు, నతఁడు నిత్యుండు భూతాత్మకుండు
భూతసమ్మేళనమే తను వగు నం ద,దృశ్యుఁడై ప్రభువు వర్తించుచుండు
ధాతుసంయోగము దవులక దేహంబు, గలుగదు జీవుండు గలుగకున్న

తే. నొడలివాయువు చేష్టింప దొడయఁ డనుచు, శేషభూతుఁ డటంచును జీవుఁ డొప్పి
తాసనత్కుమారత్వముం దాల్చి ప్రలయ,మున నశింపక ప్రద్యుమ్నుఁ డనఁగ బరఁగు.

వ. ఆతనివలననే స్థావరజంగమాత్మకం బగు ప్రపంచంబు సంభవించుచున్న దాతండే
యనిరుద్ధుఁ డీశానుఁడు క్షేత్రజ్ఞుఁడు వాసుదేవుఁడు సంకర్షణుండు నాఁబడు
సంకర్షణునివలనఁ బ్రద్యుమ్నుం డగు నతండే మనోభూతుం డనంబడుఁ
బ్రద్యుమ్నునివలనం బుట్టినయనిరుద్ధుఁ డహంకారుం డతండ యీశ్వరుండు.

సీ. సచరాచరము లగుజగము లక్షరమును, క్షరమును సత్తు నసత్తు నేన
కలిగించితిని నన్నుఁ గలసినవార లే, నిరతముక్తులు నేను నిష్క్రియుఁడను
బంచవింశకుఁడ నిర్ద్వంద్వుండ నిర్గుణుం,డను నన్ను రూపవంతునిగఁ దెలియఁ
దగదు లోకగురుండ నగునాదుమాయచే, ననుభూతగుణములఁ బొనరువానిఁ

తే. గను దలంతురు భూతసంఘముల కంత,రాత్మ నెల్లెడ వ్యాపించునట్టివాఁడ
మేనులు వినాశనం బైన నే నశించు,వాఁడఁ గా నని తెలియు మో బ్రాహ్మణేంద్ర.

సీ. క్రోధమునం బుట్టె రుద్రుఁడు నాలలా,టమ్మున సవ్యపార్శ్వమ్మునందుఁ
బదియు నొక్కం డయి పరఁగు రుద్రులు వామ,పార్శ్వభాగంబునఁ బదుగు రిద్ద
ఱైన యాదిత్యులు నష్టవసువులును, మును వెనుకల దస్రులును బ్రజాప

తులును సప్తమహర్షు లలరుచుండిరి వేద,ములు జన్నములు నోషధులు తపములు

తే. శ్రీయు లక్ష్మియుఁ గీర్తియు క్షితియు వేద
మాతయు సరస్వతియు మూర్తిమంతము లయి
నదులు త్రిగుణంబు లుదధులు మొదలు సర్వ
మిదిగొ చూడుము నాయందుఁ బొదలుచుండు. 84

వ. అని మఱియును. 85

తే. దేవపితృకార్యములను బైతృకమె ఘనము,దేవపితృలకు నేఁబితఁ గావున హయ
శిరుఁడ నై పశ్చిమోత్తరసింధువందు,నుండి హవ్యకవ్యంబుల నొందుచుండు.

సీ. మును నే సృజించినవనజోద్భవుఁడు యజ్ఞ,మూర్తి నన్ను యజింపమోద మొంది
యే నాతనికి నెన్నియే వరంబుల నిచ్చి, కల్పాదియందు లోకప్రభుత్వ
మొసఁగి నాపుత్త్రుఁగా నొనరించుకొనియుఁ ద,చ్ఛాసన మెవ్వరుఁ ద్రోసిపుచ్చ
రని వరమ్ముల నిచ్చుఘనుఁడ వీ వని సురా,సురముఖ్యులకు నుపాస్యుఁడవు నీవ

తే. యగుచు ననుఁగూడ శాసింపఁదగుదువనుచుఁ, గరుణమైనానతిచ్చియు గరిమఁగూ
పరమసంతోషమున నేను బరఁగి సతత,మునునివృత్తిరతుండనై తనరుచుంటి.[ర్చి

వ. సర్వధర్మంబులందును నివృత్తియే నిర్వాణంబు నాఁబడు నివృత్తి నొందినవాఁడు
సర్వాంగనిర్వృతుం డగు నాదిత్యమధ్యగతుండ నగుసన్నుఁ గపిలుఁ డందురు
ఛందస్సులు నన్ను హిరణ్యగర్భుం డను యోగశాస్త్రంబులందు యోగేశ్వరుం
డని పేర్కొనంబడుదు నిట్టినేను శాశ్వతుండ నయి యుగసహస్రాంతంబున
జగం బుపసంహరింతు నపుడు చరాచరంబు లెల్ల నాలో నిమిడించుకొని యే
కాకినై విహరించుచుఁ గొంతకాలమ్మునకు విద్యాసహాయుండనై జగంబులం
గల్పింతు నానాలుగవమూర్తి శేషుని సృజించు నతఁడు సంకర్షణుం డనంబడి
ప్రద్యుమ్నునిం గను నతనివలన నే ననిరుద్ధుండనై జనింతు నిట్లు సారెకు
నన్ను నే సృజించుకొనుచుండు నయ్యనిరుద్ధునుండి బ్రహ్మ జనించు నతనివలనఁ
జరాచరంబు లుత్పన్నంబు లగు నిట్టిసృష్టి కల్పాదినుండియు నగుచుండు సూర్యున
కుదయాస్తమయంబులుం బలె సృష్టిలయంబు లగుచుండు నని యెఱుంగుము.

నారాయణుండు నారదునకు నిజావతారంబులతత్త్వ మెఱింగించుట.

తే. సర్వభూతహితమ్ముగా సకలభూత,లము హిరణ్యాక్షుఁడు హరింప లలి వరాహ
రూపమున నేను రక్కసిరూపు మాపి, జగతిని సముద్ధరించెద జలధినుండి 89

క. అనుజుని జంపితి ననుపగ, ఘనబాహుం డగుహిరణ్యకశిపుఁడు నాపైఁ

గినుకఁ గొన నృహరిరూపంబున వాని వధింతు లోకములఁ బ్రోచుమతిన్. 90

మ. బలవంతుండు విరోచనాత్మజుఁడు దేవానాంప్రియుం డుగ్రుఁడున్
బలియన్ దైత్యుఁ డజేయుఁ డై త్రిభువనేంద్రత్వంబు నైకో మహో
జ్జ్వలుఁ డాకశ్యపునాత్మజుండ నగుచున్ జన్మించి దైత్యున్ రసా
తలమందుం బడఁ జేసి వాసవున కింద్రత్వంబు గల్పించెదన్. 91

క. భృగురాముఁ డగుచుఁ ద్రేతాయుగమున క్షత్రియులు ప్రబలియుండఁగ వారిం
దెగ నేసి జగ మకంటకముగఁ జేయుదు నధికతేజమునఁ బ్రజ లెన్నన్. 92

శా. త్రేతాద్వాపరసంధి దాశరథినై దీపించి లోకేశ్వర
ఖ్యాతిం గాంచి ప్లవంగకోటులసహాయత్వంబునన్ సర్వలో
కాతీతోన్నతబాహుదర్పమున రౌద్రాకారుఁడై దుర్జనుం
డై తల్లోకభీతిదు రావణుం దునిమి లోకాళిం దగం గాచెదన్. 93

క. ద్వాపరకలిసంధిన్ మధురాపురమునఁ గంసముఖ్యరక్షోజనముల్
రూపించి రూపుమాపఁగ, నై పుట్టెద రామకృష్ణు లను పే ళ్లమరన్. 94

వ. అయ్యవతారంబున. 95

సీ. ద్వారకాపురము నివాసంబుగా నుండి, నరకాదిదనుజుల నఱికి వైచి
బలిసుతుండు సహస్రబాహుఁడు బాణుని నోడించి సాళ్వుని నుక్కడంచి
కాలయవనుఁ గూల్చి ఘనుజరాసంధునిఁ, బరిమార్చి మాగధుఁ బరిభవించి
రాజసూయంబునఁ బ్రతిఘటించినశిశుపాలునిం గూలిచి పాండుపుత్రు

తే. లందు నరుతోడిమైత్రిని బొంది వారి, హస్తినాపురరాజ్యసింహాసనమున
నిలుపుదునుయాదవవినాశ మొలయఁజేసి, నాల్గుమూర్తులుదాల్చి నేనడుతు దివికి.

వ. మఱియు హంస కూర్మ మత్స్య వరాహ నరసింహ వామన భృగురామ శ్రీరామ బలరామ కృష్ణ కల్కి రూపంబు లొందుదు శ్రుతులు నష్టము లైన వానిం దెచ్చి లోకము లుద్ధరింతుఁ దొల్లింటినాపుట్టువులు నీ వెఱింగి యుందువు నే ననేకజన్మంబులు లోకావనార్థం బెత్తి ప్రకృతిం బొందుచుందు నో మునీంద్రా! నీ వేకాంతగతబుద్ధి వగుటం జేసి నన్నుఁ జూడఁ గలిగితివి బ్రహ్మాదులుం జూడఁ జాలరు నీవు నా కత్యంతభక్తుండవు గావున నరహాస్యవిషయంబు నీ కెఱింగించితి నని పలికి యంతలో నంతర్ధానంబు నొందె నారదుండు నిట్లు భగవదనుగ్రహంబు నొంది నరనారాయణులం జూడ బదరికాశ్రమంబు నకుం జనియెఁ గొంతకాలంబున కాతండు చతుర్వేదసమన్వితంబును సాంఖ్య

యోగోపబృంహితంబును బంచరాత్రానుశబ్దితంబును నారాయణముఖోద్గీతం బగునమ్మహోపనిషత్తు బ్రహ్మలోకంబునం బ్రకాశింపఁ జేసె ననిన యుధిష్ఠిరుండు భీష్ముం గాంచి యి ట్లనియె. 97

మ. పరమాశ్చర్యమ యయ్యె నీనుడి వినఁగా బ్రహ్మాత్మజుం డట్టి లీ
శ్వరమాహాత్మ్యము సత్యలోకమునఁ జెప్పం గల్గె నన్నంత నా
పరమేశుండు నజుండుఁ దుల్యు లనుచుం బల్కంగ నొ నట్టిచోఁ
బరుఁ డొక్కండు వచింప బ్రహ్మకు వినం బ్రాప్తించె నా నెట్టిదో. 98

వ. అనిన శాంతనవుం డి ట్లనియె. 99

సీ. కల్పసహస్రముల్ కల్పశతంబులు, గడచె నమ్మాడ్కి సర్గప్రలయము
లరిగెఁ దొల్లిటిస్మృతి ననుసరించి సృజించు, బ్రహ్మ యెఱుంగు నప్పరమపురుషుఁ
డధికుఁ డంచును సత్యమందు సిద్ధుల కట్లు, వినిపించె నారదమునివరుండు
వారలవలన భాస్వంతుం డెఱింగె నా,తఁడు త న్ననుసరించి తనరుచుండు

తే. నఱువదియు నాఱు వేగురు పరమఋషుల, కెఱుఁగఁ జేసె వారివలన హేమశైల
మునసుర లెఱింగి రవ్వారిపొంతనసితుఁ,డెఱిఁగిపితృదేవతలకప్పు డెఱుఁగఁ జేసె.

వ. నా కీమహత్త్వము నాతండ్రి యగుశంతనుం డెఱింగించె నేను నీ కెఱింగించితి నీయాఖ్యాన మార్షేయము పారంపర్యాగతము నీవు దీని భగవద్భక్తులకుఁ గాని తెలుపకుండుము వేల్పులు ము న్నమృతముంబోలె మహర్షులు మథించి యియ్యమృతముం బడసిరి దీనిం బఠించినవాఁ డేకాంతభావుం డై శ్వేతద్వీప వాసి యగుపరమాత్మం బ్రవేశించు రోగార్తుండు విని రోగముక్తుం డగు భక్తుండు భక్తగతిం బొందు నీ వాతని భజింపు మాతఁడే జగంబులకుఁ బిత యు మాతయు గురుండు నై యున్నవాఁ డని ధర్మరాజునకు భీష్ముండు తెలిపె నని వైశంపాయనుండు జనమేజయుఁ గని పాండవాగ్రజుండును దమ్ములు నీ యాఖ్యానము విని నారాయణపరాయణులై రి కృష్ణద్వైపాయనుండును నారా యణమంత్రంబు జపించుచు నంతరిక్షమార్గంబున శ్వేతద్వీపవాసి యగునీశ్వరు నారాధించి వచ్చుచుండు నని చెప్పె నని సూతుండు శౌనకాదులదిక్కు మొగంబై యీయాఖ్యానము వైశంపాయనుండు సెప్ప జనమేజయుండు కృత కృత్యుం డైన యట్లు మీరును శాశ్వతుం డగునప్పరమేశ్వరుని యజించి చరి తార్థుల రగు డిట్లు పరంపరాగత మగుదీని నాతండ్రి నా కెఱింగించె ననిన శౌనకుం డో యి సూతపుత్రా! భగవానుం డగునారాయణుండు యజ్ఞపురుషుం

డై యజ్ఞముల నగ్రభాగ మొందువాఁ డయ్యె నిట్లు నివృత్తిమార్గం బవలం బించుటకుం గతం బెయ్యది ప్రవృత్తిధర్మంబులందు దేవతల నెట్లు యజ్ఞ భాగార్హులఁ గావించె నీసంశయంబు దీర్పు మనిన నతం డోమహర్షులారా! వినుం డట్లు చెప్పినజనమేజయుం డో బ్రాహ్మణోత్తమా! సురాసురులును బ్రహ్మేంద్రాదులును సత్కార్యాసక్తులు నీవు చెప్ప నిర్వాణము పరమసుఖం బనియుఁ బుణ్యపాపవివర్జితు లగుముక్తులు సహస్రార్చి యగుదేవునిం బ్రవే శింపఁ గల రనియు వింటి మిది దురనుష్ఠేయ మగుటం జేసీ దీనిని విడనాడి వేల్పులు హవ్యకవ్యభుజు లైరి మఱియు బ్రహ్మయు రుద్రుఁడు శుక్రుఁడు సూర్యుఁడు చంద్రుఁడు వాయువు నగ్ని వరుణుఁడు లోనగుదేవతలును బ్రలయం బెఱుంగమి నవ్యయం బగునివృత్తిమార్గ మాశ్రయింప కుందురు కార్మికుల కిక్కాలపరిణామమే దోష మని తలంతు దేవతలు యజ్ఞభాగహరు లెట్లయిరి వారిని యజించు టేమిటికి దేవత యజ్ఞకర్త యైన నాభాగ మెవ్వ నికిం జెందుఁ జెప్పు మనిన వైశంపాయనుండు దీని కుత్తరంబు సామాన్యులు చెప్పం జాలరు నేను సుమంతుఁడు జైమిని పైలుఁడు శుకుఁడును వ్యాసశిష్యు లమై యొక్కనాఁ డీప్రశ్న మొనర్పఁగా నగ్గురువరుండు మాకుఁ జెప్పిన చొప్పు చెప్పెద సావధానుండవై యాకర్ణింపుము. 101

—ఈ వ్యాసుండు శిష్యుల కుపదేశించిన దేవరహస్యము. ఈ—

సీ. భూతభవ్యభవిష్యముల నెఱుంగఁగఁ గోరి, తప మొనర్చితి నేను దారుణముగ
దానఁ ద్రైకాలికజ్ఞానము నారాయ,ణానుగ్రహంబున నలరె నాకు
నందునఁ గల్పాది నగునదియెల్లను,దెల్ల మయ్యె వినుండు తెలుపుచుంటి
సాంఖ్యులు యోగు లేస్వామినిఁ బరమాత్మ,గా వచింతు రతండె దేవదేవుఁ
తే. డతనివలన జనించె నవ్యక్త మందు,వలన లోకసృష్ట్యర్థము వ్యక్త మయ్యె
నాతఁడనిరుద్ధుఁడనియుమహాత్ముననియు,నాత్మ యనియునుబలుకనై యలరుచుండు.
వ. అట్లు వ్యక్తత్వము నొందినయనిరుద్ధుండు పితామహుని సృజించె నతఁ డహం కారమ్ము నా నొప్పె నయ్యహంకారమునుండి పృథివ్యప్తేజోవాయ్వాకాశము లనుపంచభూతమ్ములునుగుణమ్ములుం గలిగె వానినుండి మరీచ్యంగిరోఽత్రిపులహ పులస్త్యక్రతువసిష్ఠస్వాయంభువమనువు లనునష్టప్రకృతులుం బుట్టె వారి యంద లోకంబులు సంప్రతిష్ఠితంబులు పదంపడి లోకపితామహుం డగుబ్రహ్మ దేవుండు లోకహితార్థము వేదవేదాంగములను యజ్ఞంబులను నిర్మించె నిట్లు ప్రకృతినుండి ప్రపంచంబు జనించినది. 103

తే. రోషమునఁ జేసి రుద్రుఁడు రూఢికెక్కె, నాతఁడు పదుండ్రు రుద్రుల నలరఁ జేసె
వారలు వికారపురుషులఁ బేరు గొనిరి, పిదప దేవతలును ఋషుల్ పొదలిరపుడు.

వ. లోకసిద్ధ్యర్థము జనించిన వీ రందఱును బితామహునికడకుం జని దేవా! నీవు మమ్ము సృజించితివి మే మేయధికారంబులఁ బ్రవర్తింపం దగు నాన తిమ్మనిన నతండు మీకు భద్రం బగుం గాక లోకత్రయసంరక్షణార్థము మన మాలోకసాక్షి యగుమహాపురుషు నాశ్రయింప వలయు నతండు మనకు హితంబు గూర్పఁ గలం డని వారిం గూడి క్షీరసముద్రోత్తరతీరంబునకుం జని యట బ్రహ్మోక్తంబును దేవకల్పితంబు నగుక్రమంబున నూర్ధ్వదృష్టియు నూర్ధ్వబాహువులుం గలుగ నేకపాదంబున నిలిచి మహనీయం బను పేర దారుణం బగుమహాతపంబు గావింపం దొడంగి రట్లు వేయేండ్లు కడచినయనంతరంబ వేదవేదాంగభూషితం బగునొక్కమధురవాణి వారికి శ్రోత్రపేయం బయ్యె నది యెట్టి దనిన. 105

―― విష్ణుం డదృశ్యరూపమున దేవతల కుపదేశించినహితప్రకారము. ――

సీ. ఓ దేవఋషులార! మీ దెసఁ బ్రీతుండ, స్వాగతంబు వచించి పలుకుచుంటి
నరసితి మీ కార్య మది లోకహితము నా, కరుణఁ గోరి తపించితిరి ఘనముగఁ
దపమున కెంతయుం దగుఫలంబును బొందుఁ, డతిబలవృద్ధి మీ కమరుఁ గాక
యజ్ఞుఁడును మీరు సమాహితులై నన్నుఁ, నొగి యజించియు భాగ మొసఁగవలయు

తే. ననుడు వారలు వైష్ణవయాగ మపుడు, వేదదృష్టవిధిం జేసి విష్ణునకును
బ్రహ్మముఖ్యు లొసంగిరి భాగములను, ఘనుఁడు వరదుఁ డీశానుఁడు నని తలంచి.

వ. అంత నద్దేవుం డదృశ్యరూపంబున నాకాశగతుండై వారితో మీ రొసంగిన భాగంబుల స్వీకరించితి మీయెడఁ బ్రసన్నుండ నైతి మీ కావృత్తిలక్షణం బగుఫలం బొసంగెద మీ రిట్లు సంపూర్ణదక్షిణంబు లగుక్రతువు లొనర్పుఁడు దానఁ బ్రతియుగంబునందు నిట్లు ప్రవృత్తిఫలభాగు లయ్యెద రని మఱియును.

కవిరాజ. జగముల జన్నము సల్పెడువారలు సాధుమతిన్ సవభాగములన్
యుగయుగమందు మహోన్నత మౌనిగమోక్తవిధంబున మీకు నొసం
గఁగఁ గల రిరు తగ న్ననుఁ గొల్చి మఖం బొనరించినదాన నిటుల్
నిగమములందు వినిర్ణయ మౌనటు నేను బొనర్చితి నేమమునన్. 108

వ. సురలారా! మీరు లోకంబులం బాలించుపొంటె సృజింపంబడితిరి గావున యాగభాగంబులం బొందుచు మీ క్రియానురూపంబుగఁ బ్రవృత్తిఫలంబు

లంది బలాఢ్యులై లోకధారణంబు గావింపుఁడు మనుష్య విడుయాగభాగం బులు మీరు గైకొని నా కొసంగుఁడు కల్పాంతమువఱకు మీనిర్మితి ప్రవృత్తి లక్షణకల్పితం బగు మీరు మీమీయధికారంబు లొంది లోకహితం బాచ రింపుఁడు మఱియును. 109

తే. అంగిరుఁడు పులస్త్యుఁడుక్రతువత్రిపులహుఁ,డునుమరీచివసిష్ఠుఁడుననెడువారు మనసుచే సృజింపంబడి మానసీయు,లై ప్రవృత్తిఁ బ్రజాసృష్టి కైరి తలఁప.

తే. సనుఁడుసనకుండునుసనత్సుజాతుఁడునుస,నందనుఁడుకపిలుండుసనత్కుమారుఁ డునుసనాతనుఁడను నేడ్వురనఘమతులు, బ్రహ్మమానసపుత్త్రులైపరఁగుబుధులు.

వ వారు విజ్ఞానంబున నివృత్తిధర్మనిరతులై యోగసాంఖ్యవిశారదులై ధర్మశాస్త్రా చార్యులై మోక్షశాస్త్రప్రవర్తకు లగుదురు మఱియు నవ్యక్తంబునుండి యహంకారంబును సత్త్వరజస్తమోగుణంబులును బుట్టు నాప్రకృతికంటెఁ బరుండు క్షేత్రజ్ఞుండు నాఁబడు నట్టిక్షేత్రజ్ఞుండు నే నని యోగు లెఱుంగుదురు నిజకర్మానుగతిం బుట్టినజంతువు ప్రవృత్తినివృత్తిఫలం బనుభవించు నీపరమేష్ఠి లోకగురుండు మీ కితఁడే తల్లియుఁ దండ్రియు నై వరప్రదాత యగు నీతని లలాటంబునుండి రుద్రుండు ప్రథమపుత్త్రుం డై పుట్టి భూతధరుం డగు నింక మీరు మీయధికారంబుల నిర్వర్తించుకొనం బొండు సర్వలోకంబులుఁ సర్వ క్రియలుం బ్రవర్తించుఁ గాక కర్మానుగతులఁ బ్రాణులయాయుఃప్రమాణము నిర్ణయింపంబడుఁ గాక. 112

సీ. ఇది కృతయుగ మిందు హింసింప రాదు జ,న్నములందుఁ బశువుల నాల్గుకాళ్ల నడచు ధర్మము పదంపడి త్రేతయనెడుయు,గమువచ్చు నపుడుధర్మము త్రిపాద మగు వధింపంబడు నధ్వరంబులఁ బశు,వులు ద్వాపరంబంతఁ బొలుపు మీఱు నందు ధర్మమునకు నడుగులు రెం డగు, నది మిశ్రకాల మై పొదలుచుండు

తే. నవలఁ దిష్యయుగంబు సమాగతమగు, నతిభయంకర మై పాపవృతము నగుచు నందు నొకపాదమున ధర్మమగునటంచు, నాదినారాయణుఁడు వారి కానతిచ్చె.

వ. అట్లానతిచ్చిన వియచ్చరులు రిచ్చపడి మే మాకలిప్రాప్తియం దేమి చేయం దగు నేది గతి యనిన భగవంతుండు. 114

క. దమము దపము సత్యము య, జ్ఞములు నహింసయును ధర్మసహితులు విబుధుల్ సముపస్థితు లగుచుండుట, కమరినచో నుండుఁ డఘము లంటవు మిమ్ముఁ. 115

వ. అనుడు వా రెల్లరు నల్లన నతని కభివందనం బాచరించి నిజనివాసంబులకుం

జనిరి హిరణ్యగర్భుం డొక్కరుండు మాత్ర మక్కడన యుండి యనిరుద్ధుం
జూడ నెంచుటయు నతండు హయగ్రీవరూపంబునఁ గమండలువును ద్రిదండం
బును ధరించి సాంగంబు లగువేదంబు లావర్తించుచుం బొలిచిన నజుం డతని
మ్రోలఁ బ్రాంజలియై వినుతించునంత నతం డతనిఁ గౌఁగిలించుకొని యిట్లనియె.

ఆ. లోకకార్యగతుల లోకించుచుండుము, సర్వభూతములకు స్వామి వీవు
భార మెల్ల నీదుపయిఁ బెట్టి ధృతిఁ గొందు, వలసినపుడు కానఁ బడుచునుందు.

వ. అని పలికి హయశిరుండు తిరోహితుం డయ్యెఁ బరమేష్ఠియుఁ దదనుశిష్టుండై
నిజలోకంబునకు నిర్గమించె నిట్లు పద్మనాభుండు యాగాగ్రభాగహారుం డై
యజ్ఞధారి యయ్యె మఱియును. 118

సీ. అక్షయధర్మల కాశ్రయం బగునివృత్తి నతండు గైకొనియును విచిత్ర
ముగఁ బ్రవృత్తినిలోకమునకు నిర్మించెనా, యన ప్రజ కాదిమధ్యాంతము లిడె
ధాతయు ధ్యేయమై తలొఁకృత్తి కర్తయుఁ, గార్యమునై యొప్పు ఘనుఁ డతండు
కల్పాంతమందు లోకముల నడంగించి, నిదురించియు యుగాది విదిత మైనఁ

తే. దెలిసి మేల్కాంచితొల్లింటివలెనుసకల, జగములందాన మఱియును సంతరించి
సృష్టి గావించి లీలమై చెలఁగుచుండు, నట్టిదేవున కేటికో శ్లాచరింతు. 119

వ. మఱియు నిర్గుణుండు మహాత్ముం డజుండు విశ్వరూపుండు దేవధాముఁడు
మహాభూతాధిపతి రుద్రాధిపతి యాదిత్యపతి వసుపతి యశ్విపతి మరుత్పతి
వేదయజ్ఞాధిపతి వేదాంగపతి సముద్రవాసి హరి ముంజికేశుండు శాంతుండు
సర్వభూతమోక్షధర్మానుభాషి తపఃపతి తేజఃపతి యశఃపతి వచఃపతి సరిత్పతి
కపర్ది వరాహరూపుఁ డేకశృంగుఁడు ధీమంతుఁడు వివస్వంతుఁ డశ్వశిరస్కుఁడు
చతుర్మూర్తి ధరుఁడు గుహ్యుఁడు జ్ఞానచక్షు వక్షరుండు నగుదేవునకు నమ
స్కారంబు లర్పింపుఁ డవ్యయుం డగునీతండే సర్వగతి యీతండే పరమాత్మ
యీతండే జ్ఞానదృష్టి నెఱుంగం దగువాఁడును. 120

మ. ఇది నే నంతయు జ్ఞానదృష్టికలిమి న్వీక్షించి మీ కిప్డు స
మ్మద మొప్ప న్వచియించినాఁడను జుఁడీ మాశిష్యులారా! యిఁక
న్మది నామాటలు పాటిసేయుచు హరి న్ధ్యానించి సేవింపుఁ డు
త్పదులై వేదవచఃప్రసంగతుల సంప్రార్థించి పూజింపుఁడీ. 121

వ. అని వేదవ్యాసుండు వచింప నంతేవాసుల మగుమేము మాయుపాధ్యాయులుం
గలసి చతుర్వేదోద్గతంబు లగుబుక్కుల నప్పరాత్పరుం బ్రస్తుతించితిమి దీని

సమాహితచిత్తుండై పఠించినవాఁడును వినినవాఁడును సర్వార్థసిద్ధులం బొందు
దురు మఱియును. 122

సీ. ఆతురం డారోగ్యమందు బద్ధుఁడు బంధ, ముక్తుఁడౌఁ గామముల్ పొందుఁ గామి
యల్పాయు వలరు దీర్ఘాయువై విప్రుండు, చను సర్వవేదియై క్షత్రియుండు
విజయియగు వైశ్యుండు విపులలాభము నొందు, శూద్రుండు సుఖయయి సొంపుమిగు
బుత్రహీనుఁడు గను బుత్రు, నింగన్నియ, యనురూపవరు నొందితనరుచుండు [లుఁ
తే. వంధ్య ప్రసవించుఁ గొనుఁ బుత్రపౌత్రవృద్ధి, బాంధుఁడధ్వమును గమించు భద్రగతుల
నదియు నిది యన నేమిటి కన్నియును లభించు దీని బఠించి యాలించి రేని.

వ. ఇట్లు గురువచనం బనిన జనమేజయుం డో బ్రాహ్మణోత్తమా! సశిష్యుం డగు
వ్యాసభట్టారకుం డేనామంబుల మధుసూదనుని స్తుతించె నానామములు విన
నెంచితి ననుడు నతం డీయర్థంబున నరనారాయణసంవాదం బను నితిహాసంబు
గల దాకర్ణింపుము మున్నొక్కప్పుడు జిష్ణుండు కృష్ణుం గాంచి. 124

ఉ. వేదములం బురాణముల విస్తృతరీతి జగద్ధితంబుగా
నీదగు నామముల్ తెలియ నిర్వచనంబును బొంది యున్న వో
వేదమయస్వరూప! మునివిశ్రుతనామకలాప! కేశవా!
నీదగువాక్యనం బలుక నే విన నెంచితి నామతత్త్వముల్. 125

## భగవన్నామనిర్వచనప్రకారము.

వ. అని యడిగినం గృష్ణుం డర్జునా! నానామంబులు వేదములందును నుపనిషత్తు
లందును బురాణములందును జ్యోతిషంబునందును సాంఖ్యంబునందును
యోగశాస్త్రంబునందును నాయుర్వేదంబునందును బహువిధంబుల మహర్షు
లచేఁ గీర్తింపంబడి యున్న వందుఁ గొన్ని గౌణంబులును గొన్ని కర్మజంబు
లును వాని నెల్ల నిర్వచనంబు గావించెద నాకర్ణింపుము. 126

క. నాలో సాబా లీ వే, నీలీల జనించినార మీవును నేనుం
బోలింప నప్పురాత్పరు, లీలారూపముల మై చలింతుము గాదే. 127

తే. నిర్గుణుఁడు గుణాత్ముఁడు కీర్తినిధి సమస్త, దేహి పరమాత్మ విశ్వము దివ్యమూర్తి
యైన నారాయణుని నాదునాత్మఁ గలిపి, నామనిర్వచనంబు నే నొనర్తు వినుము.

సీ. ఆదేవదేవుప్రసాదమునఁ బ్రహ్మ, క్రోధంబువలన రుద్రుండు నైరి
స్థావరజంగమసముదయంబున కాతఁ, డే కారణము పదునెన్మిదిగుణ
ములు గలసత్త్వ మాపురుషునిరూప మౌఁ, బ్రకృతి ప్రధానమై పరఁగు దాని

వలన నగుఁ సృష్టివిలయవికారము, లదియె యజ్ఞము యష్ట యది పురాణ
తే. పురుషుఁడనిరుద్ధుఁడువిరాట్టుపరముఁడనఁగఁ,గ్రాలుఁదత్ప్రభావంబున బ్రాహ్మమైన
రాత్రి గడ తేరఁ బద్మము ప్రభవ మయ్యెఁ, బద్మమందుఁ జతుర్ముఖబ్రహ్మ పుట్టె
క. పవలు గతించినఁ గ్రుద్ధుం, డవు దేవునినుదుట రుద్రుఁ డఖిలహరుం డై
భవ మొందె బ్రహ్మ రుద్రు, లిరువురుఁ సర్గంబు లయము రూఢిఁ బొనర్తుర్.
వ. అందు రుద్రుండు కపర్ది జటిలుఁడు ముండుఁడు శ్మశానసేవకుఁడు సుగ్రవ్రత
ధరుండు యోగి పరమదారుణుండు దక్షక్రతుహరుండు భగనేత్రహరుండు
నను వేళ్లం బరంగుచుండు నాకర్ణింపుము. 131
క. నారాయణాత్మకుం డై, యారుద్రుఁడు యుగయుగంబునం దగు జగమం
దారుద్రుఁడు పూజితుఁ డై, నారాయణుఁ డట్టివాఁడు నాఁ జెప్ప నగుఁ. 132
సీ. ఎల్లజగములకు నే నాత్మభూతుఁడ, నాయాత్మ యగురుద్రు నాది నేను
బూజింతు నట్లు నేఁ బూజింపకున్న చోఁ, నెవ్వఁడును బూజింపఁ డెపుడు నన్ను
ననుఁ బ్రమాణము చేసికొని చరించుజగంబు,లునురుద్రుఁ గొలుచుటననుఁ గొలుచు
హరిహరు లోకవ్యక్తి యైన ద్వైవిధ్యము, నొంది చరించునట్లుంద్రు జగతి [బె
ఆ. హరుఁడు గాక నాకుఁ బరమీయనొరుఁడు లేఁ,డనుచునాత్మజన్ముఁ డైనహరుని
నన్ను నేన కొలుచు తెన్నునం గొల్తు నీ, విష్ణుఁ డెఱుఁగునోటు వేల్పు నొరుని.
వ. బ్రహ్మయు రుద్రుండును నింద్రాదిదేవతలును మహర్షులును సురశ్రేష్ఠుఁ డగు
నారాయణుని సేవింతురు భూతభవిష్యములకెల్ల విష్ణువే నిత్యపూజ్యుఁడు నీ
వాహవ్యకవ్యభోక్త యగువిష్ణునకు నమస్కరింపు మార్తులు జిజ్ఞాసువులు
కార్యార్థులు జ్ఞానులు ననునలు దెఱంగులవారు నాభక్తులం దనన్యభక్తులు నే
కాంతులు నై నన్నె సేవించువా రుత్తములు వారికి నేన గతి మిగిలినమువ్వురు
ఫలకాములు వీరిలో జ్ఞాని యుత్తమఫలంబు నొందు జ్ఞానులు బ్రహ్మాదిదేవ
తలం గొలిచి నన్నె పొందుదు రివి భక్తస్థానంబు లని మఱియును. 134
తే. నరుఁడు నారాయణుం డనునామములను, బడసి నీవును నేను భూభారముడుప
మానవత్వము నొందితి మె నెఱుఁగుదు, నాత్మయోగము ధర్మములఖిలములును.
క. నారములు నాఁగ నుదకము,లై రాజిలు నందు నాకు నయనం బగుటఁ
నారాయణుండు నాఁగం, బే రయ్యెఁ సర్వలోకవిశ్రుత మగుచుఁ. 136
తే. కిరణములఁ జేసి భాస్కరుకరణి నేను, విశ్వమంతయు వ్యాపించి శాశ్వతగతి
సర్వభూతాధివాస మై పర్వకతన, వాసుదేవుఁడు నాఁ బేర వఱలుచుండు.137

సీ. సర్వభూతములకు స్థానము గతియు నై, వ్యాపించియుంట విశ్వంబ నైతి
నఖిలలోకంబుల నాక్రమించుట విష్ణుఁ, డైతి దమంబున నభిలషించి
సిద్ధి జనులు నన్నుఁ జేరి భూమ్యాకాశ, మధ్యములందు సమాశ్రయించు
దాన దామోదరుండై నెఱి మీఱుదు, నన్నంబు వేదంబు నప్పు లమృత

తే. మనెడునివిపృశ్ని యనఁబడునవిమదీయ, గర్భమున నుండుటంబృశ్నిగర్భుఁడైతి
సూర్యసోమాగ్ని కిరణముల్ చూడనాకుఁ, గేశములుగాననన్నండ్రు కేశవుఁడని.

క. యోగము హిరణ్యమనఁబడు, యోగము గర్భమునఁ బొంది యుండుటనన్నున్
యోగులు హిరణ్యగర్భుని, గా గణుతించుచు భజింత్రు కౌరవతిలకా. 139

వ. మఱియు నగ్నీషోము లేకయోను లనియు లోకముం ధరించుచుండి రనియుం
జెప్పిన నర్జునుండు వా రేకయోను లగుట యెట్లు చెప్పు మనిన శ్రీకృష్ణుండు.

సీ. సమచతుర్యుగసహస్రము లతీతము లైనఁ, బ్రలయముజగమునంగలుగునపుడు
సర్వభూతములు నాశన మగు వ్యక్త మ, వ్యక్తమున లయంబు నందు నంధ
తమసంబు నిండు లోకము జలావృత మగుఁ,బవలు రేలను భేద మవలకఱుగు
నప్పు డనింద్రియ మగ్రాహ్యము లలామ, మగుతమంబునను నవ్యక్తపురుషుఁ

తే. డగుహరి జనించె నతఁడు బ్రహ్మను జనింపఁ
జేసె నాతఁడు ప్రజల సృజింప నెంచి
కనులనుండి యగ్నీషోములను సృజించెఁ
గ్రమముగా భూతసృష్టియు నమరె నవల. 141

వ. ఆభూతసృష్టియందు బ్రహ్మక్షత్త్రియులుం గలిగి రాసోముండు బ్రహ్మ బ్రహ్మయే
బ్రాహ్మణు లగ్నియే క్షత్త్రము క్షత్త్రబలముకన్న బ్రహ్మబలము ప్రబలము
బ్రాహ్మణునికన్న మున్నే భూతమును బుట్టలే దగ్ని యెట్లు యజ్ఞంబుల
హోతయై ప్రాముఖ్యముం గాంచునో బ్రాహ్మణుం డట్లు యజ్ఞంబుల వహించి
ప్రాముఖ్యముం గాంచు బ్రాహ్మణముఖంబునం దిడినది యగ్నిముఖంబున వేల్చి
నట్టి దగు యజ్ఞములు దేవతలం దృప్తినొందించుఁ దృప్తు లైనదేవతలు భూమి
ఫలింపం జేయుదు రీవిషయంబు శతపథబ్రాహ్మణంబునందును బేర్కొనంబడె
మఱియు నిట సనత్కుమారగీతంబులు కొన్నిశ్లోకంబులు గల వాకర్ణింపుము.

తే. బ్రహ్మ విశ్వము సృజియింప వాంఛఁ జేసి
బ్రాహ్మణులఁ జేసె వారలు బ్రహ్మవాదు
లగుట బ్రహ్మయోను లమరు లగుచు నలరి

దివమునకుఁ బోవుచుండ్రు వైభవ మెసంగ. 143

తే. బ్రాహ్మణుల బుద్ధి వచనము శ్రద్ధ తపము, కర్మమను నివి భూమినాకాశమును ధ
రించుచున్నవి శక్యము రేపు మాపు, పాలు మీఁగడలు ధరించుపక్కి దోఁప.

తే. మహితసత్యముకంటె ధర్మంబు లేదు, తల్లికంటెను దైవంబు తండ్రికంటె
గురువరుండును లేఁడు భూసురునికంటె, బర మొకండును లే దిహపరములందు.

శా. ఏరాష్ట్రంబున బ్రాహ్మణోత్తములు వా రేవృత్తియున్ లేక స
ర్వారంభంబుల శూన్యులై తినఁగ లేకారాటముం బొందుచుం
డ్రా రాష్ట్రంబునఁ బాడిపంటలు ధనవ్యాపారముల్ తగ్గియున్
దూరాధ్వంబుల కేగు నాథులును వ్యాధు ల్పర్వు సర్వంసహన్. 146

తే. విప్రు లచ్యుతముఖమున వెలసి రితర, వర్ణములు వారినుండియే వచ్చినయవి
కాన విప్రులు వేల్పులకన్న మిన్న, లనుచు వేదప్రమాణము దనరుచుండు. 147

సీ. మును పహల్యాధర్షణనిమిత్తమున గౌత,మర్షిచే హరి హరిశ్మశ్రుఁ డయ్యెఁ
గౌశికుకతన నాకౌశికుఁడు స్వముష్క,ములఁ బాసి మేషాండములను బొందెఁ
జ్యవనుకోపంబున స్తంభించె వజ్రిహ,స్తము లాశ్వినేయగ్రహమునయందు
దక్షుతపమున నధ్వరహర్తనుదుటను, నేత్రాకృతి యొకండు నిలువ నయ్యెఁ

తే. త్రిపురవధ మొనర్పఁగఁ జనునపుడు హరుని, నలివిశుక్రుఁడుతనజడలట్టిపెఱికి
వైవ నవి పాములై వానిగ్రీవఁ జుట్టు,కొనుటచే నీలకంఠుఁ డై తనరెనతఁడు.

తే. గురుఁడు వార్వఁగఁ బో నొక్కతరుణమందు
జలము కలుషముగా నుంట తెలిసి మీఁకు
మత్స్యకూర్మాదిసంగతి మలిన మెపుడు
కలుగు నని దాన జలము లాగతి నెసంగు. 149

విశ్వరూపుం డనుత్వాష్ట్రుని వధించినకథ.

తే. తనరు మును విశ్వరూపుఁడు త్వష్టకొడుకు
దైత్యులకు భాగినేయుఁడు దైవతముల
కుం బురోహితుఁడు త్రిశిరస్కుండు నగుచు
నఖిలజగములయందుఁ బ్రఖ్యాతిఁ గాంచె. 150

వ. పురోధసుం డగుటంజేసి యతండు దేవతలకుఁ బ్రత్యక్షంబుగను బూర్వదేవ
తలకుఁ బరోక్షంబుగను యాగభాగంబు లొసంగుచుండుటయుం గని కను
కనింబడి దనుజవరేణ్యులు హిరణ్యకశిపుం బురస్కరించుకొని విశ్వరూపమాత
కడకుం జని, 151

చ. చెలియల! విశ్వరూపుఁడు ప్రసిద్ధికి నెక్కి పురోహితుండు నై
పలువురు మెచ్చ వేల్పులకు భాగము లిచ్చెడు దాన వారు వ
ర్ధిలుటయు మేము క్షైణ్యమునఁ దేలుటయుం గన వచ్చుఁ గాన న
ర్మిలి గొని వానినిం దెలిచి మీఁదగుపక్షము నొందఁ జేయవే. 152

క. అనుటయు నాయమ నందన, వనగతుఁ డగుకొడుకుకడకు వడివడిఁ జని యో
తనయ! యిటు శత్రుపక్షము, పోనరింపం జూతువట్టె పోలునె చెపుమా. 153

వ. అనినఁ దల్లివచన మనతిక్రమణీయం బని తలంచి హిరణ్యకశిపుం గారవించి
తత్పక్షంబునం బ్రవర్తించునంత నతండు వసిష్ఠశాపంబున మృతుం డగుటం జేసి
మాతృపక్షవర్ధనుండై ఘోరతపంబు గావింపం దొడంగె నయ్యవసరంబున. 154

సీ. పురుహూతుఁ డతనితపోభంగ మొనరింప, నెంచి యచ్చరల రావించి పుచ్చె
వా రట కరుదేరఁ ద్వాష్ట్రుఁడు గని మోహ, వశుఁ డయ్యె నది గాంచి వనితలతనిఁ
బలుకరించియు మేముపనివినియెదమింద్రు, పనుపొనర్చుటమాకుఁబని యనంగఁ
గనలి యింద్రాదులు గానరాకుండ నేఁ, గావింతు నని పల్కి గాఢతపము

తే. సలిపి ఘనుఁ డయి విప్రు లొసంగుసోమ, మొక్కమోమున నన్నము నొక్కనోట
మఱియు నొక్కముఖంబున మఘువదాది, నిర్జరుల మ్రింగఁదొడఁగెనిర్నిద్రశక్తి.

వ. అంత నింద్రుండు సోమపానాప్యాయితసర్వగాత్రుం డగునాత్రిశిరస్కుం జూచి
చింతాకులస్వాంతుండై బృందారకబృందంబులతో హిరణ్యగర్భునికడకుం జని
విశ్వరూపునివృత్తాంతం బంతయు నెఱింగించి తమకు సోమపానము లేమియు
విశ్వరూపుఁడు సవనభుజుం డయ్యె ననియుఁ దమపక్షంబు క్షీణించి పరపక్షంబు
ప్రవృద్ధంబగుచున్న దనియు నివేదించి రక్షింపు మని ప్రార్థించినం బ్రసన్నుండై
పరమేష్ఠి వారలం గాంచి యి ట్లనియె. 156

మ. భృగుపుత్త్రుండు దధీచి నా నొకమునిశ్రేష్ఠుండు భార్యాయుతుం
డగుచున్ ఘోరతపం బొనర్చు నతనిం బ్రార్థించి కోలెమ్ము వేఁ
డఁగఁ బొం డయ్యది వజ్రమై పగతు రొడ్డారింపఁ గా నింతలోఁ
దెగ నేయం గలదై జయం బొసఁగు నోదేవేంద్ర! వాక్రుచ్చితిన్. 157

తరు. అనుడు దధీచిమహామునిచంద్రుఁ, డలరుచోటున కేగి ప్రార్థించి తాను
జను దెంచినట్టికర్జము విన్నవించె, శతమన్యుఁ డంత నాసంయమివర్యుఁ
డనుమాన మింత లే కంత మే న్విడిచె, నపుడు కశేరుక మును నెమ్ము వజ్ర
మొనరించుకొని త్వాష్ట్రు నుక్కడఁగించె, నుగ్రతేజుం డింద్రుఁ డొక్కింతలోన.

వ. అనంతర మావిశ్వరూపునిమేను త్వష్ట మథించిన నందు వృత్రుండు పుట్టి సుత్రాము నెదిరించుటయు నతం డతనిం బ్రతిఘటించి వజ్రాయుధంబునన వధించె నవల ద్వైధీభూతం బగు బ్రహ్మహత్య దేవేంద్రునిం జుట్టు ముట్టుడు నాతండు భీతుండై దేవరాజ్యంబు పరిత్యజించి మానససరోవరాంతర్గతం బగు నొక్కబిసతంతువు నాళంబున యోగబలంబున సూక్ష్మరూపుండై ప్రవేశించె నంత నక్కడ రాజు లేమి రాజ్యంబు పూజ్యంబు గాకుంటం జేసి దేవతలు ఋషులునుం గలసి నహుషునకుఁ బట్టంబు గట్టిన నతండు ముల్లోకంబు లల్లనఁ బాలించుచు నొక్కనాఁడు శచీదేవిం గోరిన నాయమ బృహస్పతిమతంబున. 159

సీ. ఋషివాహనము నెక్కి యేతెమ్ము నాకడ, కనుడు నానహుషుఁ డట్లాచరించి
వచ్చుచో నాతనివామపాద మగస్త్యమునికిఁ దాఁక నతండు కనలుగుడిచి
నీవు సర్పంబవై నేలం బడు మనంగ, నహుషుఁ డప్పుడ పతనంబు నొందె
మరల నెప్పటియట్ల సురరాజ్య మది యరాజక మైన విష్ణునిసరస కరిగి

తే. ఋషులు దేవత లది యెల్ల నెఱుఁగఁ జేసి, తదనుమతి నింద్రునిం దెచ్చి తగినరీతి
వాజిమేధము సేయించి వైష్ణవముగ, రాజ్యపట్టముఁ గట్టిరి పూజ్యుఁ జేసి. 160

వ. వాజిమేధప్రభావంబున నింద్రుం బెడఁబాసి యున్న బ్రహ్మహత్యం నాల్గు తెఱంగులు గావించి వనితాగోగ్నివనస్పతులం బొందించి రిట్లు దేవేంద్రుండు బ్రహ్మతేజఃప్రభావోపబృంహితుండై శత్రుసంహారంబు గావించి కృతార్థుం డయ్యె నని మఱియును. 161

తే. జలకమాడుభరద్వాజసంయమీంద్రుఁ, డలిగి త్రిపదవిన్యాసము నాచరించు
జలజనాభునివక్షము సలిలపాణిఁ, చేఁ జఱచె నట నైల్యము చెన్నుమీఱె.

వ. భృగుమహర్షిశాపంబున నగ్ని సర్వభక్షకుం డయ్యె బుధునిశాపంబున నదితి గర్భవ్యథ గలిగించుచు మార్తాండుండు పుట్టి శ్రాద్ధదేవుం డయ్యె దక్షునిశాపంబునఁ జంద్రుండు రాజయక్ష్మం బొందుటయ కాక కృష్ణపక్షంబున క్షీణించు వాఁడు నయ్యె నారాయణుండు బడబాముఖుం డనుమునినై సముద్రోదకంబు క్షారం బగునట్లు శపించె నిట్టిది బ్రాహ్మణప్రభావము బ్రాహ్మణప్రసాదంబునన క్షత్త్రంబు పృథివీపతిత్వంబు నొంది దీపించు నీబ్రహ్మక్షత్త్రమే యగ్నీషోము లయ్యగ్నీషోములు లోకములకుం జేయుహర్ష కార్యంబులచే వరదుండ నగు నేను హృషీకేశుండ నైతి మఱియు నధ్వరంబుల నిడాహ్వానముచే భాగంబు హరించుటం జేసియు హరితవర్ణంబునను హరి యని వ్యవహరింపం బడుచుందు మఱియును. 163

సీ. భూతసారము ధామము ఋతంబు సత్యము,దాన నన్నృతధాముఁ డండ్రు
క్షితి నష్టమై గుహాగత మైన నే దాని, విధ మెఱుంగుటను గోవిందుఁ డండ్రు
హీనరోముఁడు శిపి దాన నొప్పుట నన్ను, విద్వజ్జనులు శిపివిష్టుఁ డండ్రు
నే నెప్పుడుం బుట్టనే లేదు పుట్టఁ బో,నందునఁ దత్వజ్ఞు లజుఁ డటండ్రు

తే. నిత్యమును సత్యమందు నేనిలుతుఁగాన, సత్యముననుండి యెపుడు నేజార కుంట
సాత్వతుం డండ్రు నేలఁగర్షణ మొనర్తుఁ,గృష్ణతంబొల్తుఁగావునఁగృష్ణుఁడండ్రు.

ఆ. నేల జలముచేత గాలిచే వ్యోమము, గాలి నగ్ని చేతఁ గలియఁ గూర్చి
జగము లెసక మెసఁగ నలుపుట వైకుంఠుఁడనఁగ నెసఁగుచుంటి నమలకీర్తి! 165

వ. మఱియు నిర్వాణ మ్మగుబ్రహ్మమునుండి చ్యుతుండఁ గాకుంటంజేసి యచ్యుతుం డనియు సర్వవ్యాపకంబు లగు భూమ్యాకాశముల సంధారణంబున నధోక్షజుం డనియు సకలజంతుప్రాణధారణ మగుఘృతము నా తేజస్సు గావున ఘృతార్చి యనియు వాతపిత్తశ్లేష్మములు త్రిధాతువు లవి ప్రాణములం ధరించునవి తత్సంఘాత మగున న్నాయుర్వేదవిదులు త్రిధాతు వనియు వృషము ధర్మువు కపి వరాహము గావున నన్ను వృషాకపి యనియు నా కాదిమధ్యాంతములు లేవు గావున ననాద్యుఁడు నమధ్యుఁడు ననంతుఁడు ననియు శుచి గలిగి శ్రవణీయము లగువాని నే విందుం గావున శుచిశ్రవుఁ డనియు మున్నేకశృంగము గలవరాహ మైతిఁ గాన నేకశృంగుఁ డనియు నపుడ మూఁడుమూపురములు గలుగుటంజేసి త్రికకు త్తనియుఁ గాపిలజ్ఞానంబునఁ బరమాత్మ యగు విరించికిఁ జైతన్య మొసంగుటంజేసి విరించుఁ డనియుం బ్రస్తుతింతురు మఱియు సాంఖ్యాచార్యులు విద్యాసహాయవంతుండ నగునన్నుఁ గపిలుం డనియుం జెప్పుదురు నేనే వేదములందుఁ బేర్కొనం బడుహిరణ్యగర్భుండ నేకవింశతి సాహస్రం బగుఋగ్వేదమును నన్ను గా నెన్నుదురు సహస్రశాఖం బగు సామంబును నారణ్యకంబులును నూఱు నొక్కండు శాఖలు గలయజుర్వేదంబును బంచకల్పం బగునథర్వంబును నన్నుఁ గాఁ బ్రశంసింతురు నేనే హాయశిరస్కుండనై వేదంబులు వెలయించితి బాభ్రవ్యగోత్రుం డగుగాలవుండు నాయనుగ్రహంబునఁ గ్రమశిక్షలం గావించె బ్రహ్మదత్తుం డగుపుండరీకుండు నాకటాక్షంబునంజేసి యేడుజన్మంబుల మహాయోగులు పొందఁ గలసిద్ధి నొక్కజన్మంబునం బొందె మున్నేను గారణాంతరంబున ధర్మునకుం బుట్టి ధర్మజుండనైతి గంధమాదనంబున నేను నరనారాయణరూపంబు నొంది తపంబు గావిం

చితి దక్షుఁడు యజ్ఞ మొనర్ప నపుడు రుద్రుఁ డాయజ్ఞవిధ్వంసమ్ము గావించి దక్షునిపై శూలప్రయోగము గావింప నతండు పఱచి మాకడకు వచ్చి శరణంబు వేఁడునంతలో నాశూలంబు నాయురంబునం బడియెఁ దత్తేజంబున నా కేశంబులు ముంజవర్ణంబు నొందె దానం జేసి ముంజకేశుండ నైతిఁ బిదప నే నాశూలంబు పట్టి కొట్టుచు నాపైఁ బడినశంకరునికంఠంబు బిగియం బట్టితి దాన నది నైల్యంబు నొందె నరుం డపుడు రుద్రశూలంబుపై నొకయిషీకంబు వైవ నది పరశు వైన దాని నేను ఖండించుటం జేసి ఖండపరశు వైతి నని కృష్ణుండు చెప్పిన నర్జునుం డాయుద్ధంబున విజయ మెవ్వని కయ్యెం జెప్పు మనినఁ గృష్ణుండు వెండియు. 166

సీ. రుద్రనారాయణుల్ క్రుద్ధులై యున్నప్డు, తోఁచె నుత్పాతము ల్ఘోర మగుచు
నపుడు బ్రహ్మయు వేల్పులరుదెంచి రుద్రునిఁ, బ్రార్థించిహరితోడి వైరముడుగు
మేకరూపులు మీర లిద్దఱు కారణాం,తరమున నిపు డిట్లు తనరుచుండు
రనిన నాతఁడు వల్లె యనిలోకహితమెంచి, దురమాఁగి విష్ణుని శరణుఁ జొచ్చె
తే. నంత వా రిర్వురకుసఖ్య మయ్యె ననుచు, ఋషులు నాకు నెఱింగించి రీవు కోరి
నట్లు నానామనిర్వచనాదికంబు, చేసితిని నీపయిం గలచెలిమిఁ జేసి 167

వ. అర్జునా ! నే నెన్నియోరూపమ్ములతో గోలోకాది సమస్తలోకములందును జరించుచుండు నీవు నాకుఁ బరమభక్తుండవు నీయుద్ధంబుల దేవదేవుం డగు రుద్రుండు నీముందు సంచరించుచుండు నని యెఱుంగు మాతండు నాక్రోధంబునం బుట్టినవాఁడు నీశత్రువుల నతండు చంపినవెనుక నీవు చంపుచుండు వని పలికె నని సూతుండు తెలుప శౌనకుండు నీవు మా కిపుడు మహాఖ్యానంబు చెప్పితివి సర్వతీర్థావగాహనంబును నారాయణకథకు సాటి రా దనుట నిశ్చయం బట్లనిరుద్ధుని దర్శించినపదంపడి నారదుండు నరనారాయణదర్శనం బపేక్షించి బదరికాశ్రమంబునకుం జనియె నంటి వక్కారణం బెఱింగింపు మనిన సూతుండు. 168

సీ. జనమేజయునిచేయుసర్పయాగం బది, జరుగుచున్నప్డు డాజనవిభుండు
ద్వైపాయనుం జూచి తాపసేశ్వర! భార,తగ్రంథకర్త వుత్తముఁడ వీవు
నీ వెఱుంగనికథ లేవియు నుండవు, తెలిదీవినుండి యాదేవమౌని
మఱియు బదరికాశ్రమమునకుఁ జని నర, నారాయణులఁ గాంచినాఁ డనంగ
తే. వింటి నట నేమివిషయముల్ వీరువారు,పలికికొని రెల్ల విన నాకుఁ దలఁపుగలిగె

ననిన నతఁడు వైశంపాయనుని వచింప,నాజ్ఞ యిడ నాతఁ డాతని కనియె నిట్లు.

—నరనారాయణనారదసల్లాపప్రకారము.—

వ. అట్లు నారదుండు శ్వేతద్వీపంబునుండి మేరుగిరికిం జని యట నుండి గంధ
మాదనంబునకుం బోయి బదరికాశ్రమంబునం బ్రవేశించి యటఁ దపోనిష్ఠా
గరిష్ఠులును శ్రీవత్సలక్ష్మణులును జాలపాదభుజులును వ్యూఢోరస్కులును
దీర్ఘబాహువులును ముష్కచతుష్కులును షష్టిదంతులును నష్టదంష్ట్రులును
మేఘసదృశస్వనులునగునరనారాయణులంగాంచిపూజించివారిచేఁబూజితుండై
స్వాగతానంతరం బంతర్గతమతియై వారిం దిలకించి శ్వేతద్వీపమున నున్న నారా
యణుం బోలియున్న వారిం దలంచుకొని వారికిఁ బ్రదక్షిణనమస్కారంబు
లర్పించి తా నొకకుశమయాసనంబున విశ్రమించినంత నాఋషు లిరువురుం
బూర్వాహ్ణికవిధు లాచరించి నారదున కర్ఘ్యపాద్యంబు లిచ్చి సుఖాసీనుం
డగునతనిం గని నారదా! నీవు శ్వేతద్వీపంబునకుం బోయితివి కదా భగ
వానుం డగుదేవదేవునిదర్శనం బయ్యెనే యనిన నతం డి ట్లనియె. 170

ఆ. విశ్వరూపధరుఁడు విష్ణుండు నా కట, దర్శనం బొసంగె దైవతంబు
లార! మీరు నమ్మహాత్ముండు నా కొక్క, వాలకమునఁ దోఁప వత్తు రహహ.

ఉ. ఆయనయందు నుండెడుమహాయతలక్షణజాల మెల్ల నో
హో యన మీయెడం గనఁగ నొప్పుచునున్న వ యింతె కాదు మీ
రాయెడ నమ్మహామహునియంద వసింపఁగఁ జూడఁ గంటి ని
ప్డీయెడఁ జూచుచుంటి నిది యెంతయు వింతగఁ దోఁచు నామదిన్. 172

క. మీ రిరువురు దక్కఁగ నా,నారాయణుఁ బోలువారు నా కెవ్వారే
ధారుణిఁ గన వినఁ గలుగదు, కోరిక ఫలియించె మిమ్ముఁ గూడినదానన్. 173

సీ. అమ్మహాపూరుషుం డట నాకు క్షేత్రజ్ఞ,విషయ మంతయుఁ దెల్పె విశదరీతి
నచ్చొ ననింద్రియు లగుశ్వేతమూర్తులు, సేవించుచుందు రాదేవదేవు
నాభక్తవత్సలుం డఖిలజగంబుల, వెలిఁగించు నిజదీప్తికలనఁ జేసి
యష్టనలోచ్ఛేద మగునేలపై నేక,పాదంబునన్ నిల్చి బాహు లెత్తి
తే. యుత్తరాభిముఖుండయియురుతపంబు,సలుపుచుండును రాసురాదులు ప్రియమున
నొసఁగుహవ్యకవ్యంబులాయుత్తమోత్త,మునిచరణసన్నిధిం జేరుకొనుచునుండు.

వ. నే నేకాంతుండనై పోయి సేవించి తదాజ్ఞం గొని యిట వచ్చితి మీరు ధర్మ
నందనులరు మీసమక్షంబునఁ గాలక్షేపంబు గావించెద ననిన నరనారాయణు
లి ట్లనిరి. 175

క. ధన్యుఁడవు ననుగృహీతుఁడ, వన్యులు నినుఁ బోలువార లారయ లే రో
మాన్యచరిత! నీకు జగ,జ్జన్యుఁడు హరి దర్శనం బొసంగినదానన్. 176

క. ఆతనిఁ గాంచినవాఁ డీ,భూతలమున నేఁడు లేఁడు పోలింపఁగ నా
ధాతయుఁ దనంతఁ దా నా, భూతేశునిఁ జూడ లేదు ము న్నెన్నాఁడున్. 177

వ. నీవు పరమభక్తుండ వగుటం జేసి నీకు దర్శనం బిచ్చె నాపరమాత్మునితపస్థా
నము మే మిరువురముం దప్ప నెవ్వరుం బొందఁ జాలరు వినుము. 178

సీ. కలిగెనద్దేవునివలన భూమిం గూర్చు, క్షమయు రసమ్ము రసమ్మువలన
జలము ద్రవత్వముం గల దగు మఱియు నా,తనినుండి యే తేజ మొనరె దాని
వలన నాదిత్యుఁడు వెలుఁగు నవ్విష్ణుని,వలన స్పర్శం బయ్యె స్పర్శమునను
వాయు వెల్లెడ వీఁచు నాయనంతునినుండి, శబ్దంబు జనియించె శబ్దమునను

తే. నాకసము సంవృతము గాక యలరుచుండు, నమ్మహాదేవువలన నే యలరె మనము
మనమునం జేసిచంద్రుఁడుమహితుఁడగుచుఁ, గాంతిగుణయుక్తుఁడై వెల్గుసంతతంబు.

వ. విద్యాసహాయుండును హవ్యకవ్యభోక్తయు నగునాభగవానుఁ డున్నస్థానము దేవసంజ్ఞికము సర్వభూతోత్పాదకంబు నగుఁ బుణ్యపాపవివర్జితులై పోవువారి కాదిత్యుఁడు ద్వారంబై తమం బడంచు వా రాదిత్యమండలంబున దగ్ధసర్వాంగులై యణురూపంబు నొంది యచోటు వాసి యనిరుద్ధుం బొంది మనోభూతులై ప్రద్యుమ్నుం బొంది వాని విడనాడి జీవరూపుం డగుసంకర్షణుం జేరుదు రంత సాంఖ్యులై భాగవతులతోడం జరించుచుఁ ద్రైగుణ్యహీనులై పరమాత్మం గలయుదురు పరమాత్ముఁడే క్షేత్రజ్ఞుండు వాసుదేవుండు నని యెఱుంగుము సమాహితచిత్తులు సంయతేంద్రియులు నేకాంతు లగువా రావాసుదేవునందుఁ బ్రవేశింతురు నారదా! మే మాధర్మునిగృహంబునం బుట్టిన వారము జగచ్ఛుభ మెంచి యుగ్రతపం బాచరించుచున్న వారము నిన్ను మే మాభగవానుని చెంతం జూచితిమి నీవు త్రికాలజ్ఞాన మెఱుంగం గోరుటయు నాతం డనుగ్రహించుటయు నెఱుంగుదు మని నరనారాయణు లానతిచ్చిన నారదుండు నారాయణపరాయణుండై నరనారాయణాశ్రమంబున దివ్యమంత్రధ్యానంబు సేయుచు వేయిదివ్యవర్షంబులు తపంబు గావించి యనంతర కాలంబున దైవపైతృకంబు లాచరించినం గని నారాయణుండు నారదుం గాంచి నీ వీదైవపైతృకంబు లేనిం గూర్చి చేసితివి దీన నెట్టిఫలం బపేక్షించితివి చెప్పు మనిన నారదుం డి ట్లనియె. 180

తే. నీవు చెప్పితి గాదె మున్ దైవకర్మ, ముత్తమము పరమాత్ముని నొందునట్టి
దనుచు నందున నవ్యయుండక్షరుఁడయి, యొప్పు దేవు నారాధించుచున్న వాఁడ.

సీ. ఆదేవునుండి మున్నజుఁడు లోకపితామహుఁడు పుట్టి దక్షునిఁ బడసె నతని
సంకల్పమునఁ జేసి సంభవించితి నేను, విష్ణుసంప్రీతికై పితలఁ గొలుతుఁ
దల్లియుఁ దండ్రియుఁ దాతయు నాతఁడే, పితృయజ్ఞముల వాని వేల్చుచుండు
సురలు మున్ సుతులకు శ్రుతులను జెప్పియుఁ, దమకునష్టముగాఁ గఁదనయులకడ

తే. వానినిం జెప్పుకొనిరదిగాన సుతులు, తండ్రులకుఁ దండ్రు లగుటయుఁ దారసిల్లె
నపుడు తనయులుఁదండ్రులన్యోన్యపూజ, లాచరించుకొనుట మీకు గోచరంబ.

వ. వా రపుడు దర్భలపై మూఁడు పిండములు వెట్టి పితృదేవత లని వానిం
బూజించి రని చెప్పి నారదుం డాపిండములకుఁ బితృదేవసంజ్ఞ యెట్లు వచ్చెం
జెప్పు మనిన నారాయణుండు. 183

చ. ధరణి ప్రణష్ట మైనతఱి దానినిఁ దెచ్చె వరాహరూపుఁడై
హరి పయి కెత్తి నిల్పునపు డాతనికోఱల నున్న మృత్తికం
గరముల దీసి పిండములు గా నొనరించి యతండు దర్భలన్
వరుసగ నిల్పి మూఁటికి సపర్య లొనర్చెను పైతృకక్రియన్. 184

వ. ఇట్లు పిండప్రదానము తన్నుద్దేశించి పైతృకంబుగా నొనరించి నిజశరీరసముద్భ
వంబు లగుతిలల నపసవ్యముగాఁ జల్లి ప్రాఙ్ముఖుండై పిండోద్వాసనంబు
గావించెఁ గోఱలనుండి మృత్తికం గ్రహించునపు డది మూఁడు ముద్దలై దక్షి
ణంబుగం బడుటం జేసి వానికిఁ బిండసంజ్ఞ వచ్చినది పిండములే పితృదేవత లని
వృషాకపి నిర్ణయించె నవి వరుసగాఁ బితృపితామహప్రపితామహు లనం
బడియె నిది పితృదేవతలకుఁ బిండసంజ్ఞ వచ్చినవిధం బో దేవమునీ! దేవతలను
బితృదేవతలను గురువులను నతిథులను దల్లిదండ్రులను గోవులను భూమినిం
బూజించువారు నారాయణు నారాధించినవారై యిహపరంబుల సుఖం
బనుభవింతు రనిన నారదుండు నారాయణున కేకాంతికత్వము నొంది తదా
శ్రమంబున భగవదారాధనంబు సేయుచు మఱియు వేయేండ్లుండి పదంపడి
హిమవంతంబునందలి నిజాశ్రమంబునకుం జని పరమతపంబు గావించె నని
వైశంపాయనుండు జనమేజయునిదిక్కు మొగం బై. 185

చ. కురుకులదీప! నీ విపు డకుంఠితభక్తి మెయిన్ జనార్దనో
త్తరకథ యాదినుండి కొనదాఁక సమస్తము నాలకించుటన్

నిరతము సంస్మరించుటను నేఁడు కృతార్థుఁడ నైతి పూతమై
పరఁగెను నీదువంశ మనపాయరమావరభక్తియుక్తిమై. 186

తే. ఎవ్వఁడవ్యయుఁడగువిష్ణు నెపుడు దూరఁ, దివురునో వానికిహపరస్థితులు రెండు
చెడుట యేగాక తత్పితల్ చెన్ను దఱిగి, నరకమునముస్గుదురు నిరంతరముగాను.

క. తనయాత్మ విష్ణు వనుచుఁ, మునివర్యులు పలుక వినుచు మోహాంధుం డై
జనుఁ డట్టివిష్ణునిందన, మొనరించిన వానిఁ దడవ నుండును చెపుమా. 188

ఉ. మాకు గురుండు లోకజనమాన్యుఁడు ధన్యుఁడు ధర్మవేది సు
శ్లోకుఁడు బాదరాయణుఁడు చూచి యొఱింగినరీతి నంతయుఁ
నాకు వచించె నే నిపుడు నారదమౌనికి విష్ణుతోడ నా
నీకథ నీకుఁ జెప్పితి మహీసురభక్తుఁడ వంచు నెంచుచుఁ. 189

క. నరవర! మున్నిధర్మము, హరిగీతలయందు సంగ్రహమ్ముగ నీకుఁ
గురువరునానతిఁ జెప్పితిఁ, బరిపూర్తిగ నేఁడు వింటి పరమార్థగతిఁ. 190

ఉ. స్ఫాయదనంతధర్మముల భాసిలి లోకమునందుఁ బంచమా
మ్నాయము నా వినం దగి కనం దగు భారత మెల్ల నొక్కద్వై
పాయనమౌని గాక సలుపం దగువాఁ డెవఁ డుండు నుర్వి నా
రాయణమూర్తి గా మునికులాగ్రణి నాతని నారయం దగుఁ. 191

వ. అని వైశంపాయనుండు తెలిపె నని తెలిపి సూతుండు వెండియు. 192

సీ. జనమేజయుం డిట్లు విని తనయజ్ఞము, పరిసమాప్తి నొనర్చి ప్రతిభఁ గాంచె
నారాయణీయ మఁ నలువుమీ తెడుదీనిఁ, దెలిపితి మీకు నేఁ దెలిసినట్లు
కృష్ణభీష్మాదుల కెలన మాగురునకు, నారదుఁ డెఱిఁగించె నాఁటినుండి
నే నెఱింగితి వ్యాసమౌనిశిష్యు లెఱింగి, రిపుడు మీ రెఱిఁగితి రిద్ధబుద్ధిఁ

తే. బరమఋషులార! పరమర్షి వందితుండు, శాశ్వతుం డవ్యయుండు విశ్వస్వరూపుఁ
డై ననారాయణునిసేవ లాచరింపుఁ, డిహపరసుఖంబు లందెద రెపుడు మీరు.

హయగ్రీవదేవమాహాత్మ్యాభివర్ణనము.

వ. అనిన విని శౌనకుం డోయి సూతా! హరి హయగ్రీవరూప మెత్తుటకుం
గారణంబును బ్రహ్మదేవుఁ డపు డొనర్చినవిధంబును విన నెంచితి మన
సూతుండు మీ రిపుడు న న్నడిగినట్లు జనమేజయుండు వైశంపాయనుం
జూచి హరిమేథుం డగుహయగ్రీవునావిర్భావ మెట్టి దనిన నతం డతని కి
ట్లనియె. 194

సీ. ప్రలయమునం దేకార్ణవజలంబులఁ భూమి, మునిఁగె జలము తేజమునను దేజ
మనిలమునం దనిల మనంతంబునం దది, మనమునం దది వ్యక్తమునను వ్యక్త
మవ్యక్తమందు నవ్యక్తము పురుషుని; యందు లయించె న ప్డాపురుషుఁడు
సర్వగతుం డయ్యె సర్వముం దన మయ్యె, నది యమృతాత్మక మై తలిర్చె

తే. నందుఁ గారణబ్రహ్మము పొందుపడియు, విశ్వభావసంజ్ఞాతమై వెలసి పురుషుఁ
డగుచు ననిరుద్ధుఁడనఁబడి తగెఁ బ్రధానుఁ,డయ్యెఁ ద్రిగుణంబు నవ్యక్తమనఁగ నొప్పె

వ. విష్వక్సేనహరిప్రభునామంబుల నాదేవుండు విద్యాసహాయుండై యోగనిద్ర
నాశ్రయించి జలంబుల శయనించి జగత్సృష్టికిం జింతించుచు నంత మహద్గుణంబు
నుండి యహంకారము జనించె నది చతుర్ముఖబ్రహ్మ యయ్యె ననిరుద్ధనాభి
పద్మసంజాతుం డగు నతండు సర్వలోకపితామహుండై సహస్రపత్రకమలంబున
నాసీనుండై భూతసృష్టిం గావింపఁ దొడంగె నంతకు మున్న నారాయణుం
డాసహస్రపత్రపద్మదళంబున రెండు జలబిందువులు పొందుపడం జేసె నం
దొకటి మధుండును వేఱొకటి కైటభుండు నై తమోరజోగుణాంచితులై
గదాహస్తులై పద్మనాళం బనుసరించి సంచరించుచు. 196

క. అరవిందస్థుం డగుచుం, గర మరుదుగ వేదసృష్టి గావించు నజుఁ
బరికించి వంచనం గొని, సరగున వేదములఁ గొంచుఁ జని రతఁ డరయన్. 197

వ. అట్లు చతుర్వేదంబు లపహరించి వా రాసముద్రంబునం జొచ్చి రసాతలంబు
పట్టి పోయి రంతఁ జతుర్ముఖుండు కలుషితస్వాంతుండై శాంతంబు దక్కి యోగ
నిద్రాగతుం డగు నారాయణుం గాంచి యి ట్లనియె. 198

చ. కటకట నాదు వేదములు కష్టులు భ్రష్టులు రాక్షసాధముల్
దటుకున సంగ్రహించుకొని తారి రధోగతిఁ బట్టి యింక నే
నెటులు సృజింతు విశ్వ మిఁక నేగతి నుండెద వేదశూన్యతన్
దిటపడెఁ జిమ్మచీఁకటులు దేవర! కావగ నీవ దిక్కుఁ కన్. 199

క. అని విన్నవించి జలజాసనుఁ డాదేవాదిదేవుసముఖమునందున్
వినతాననుండు ప్రాంజలియును నై స్తోత్రం బొనర్చె నుత్తమఫణితిన్. 200

దండకము. ఓంకారమూర్తీ! నమస్కార మో బ్రహ్మవర్తీ! నమస్కార మో లోక
పూర్వా! నమస్కార మో దేవదేవా! ప్రభూ! సాంఖ్యయోగేశ్వరా! యోగి
హృద్వాస! యో విశ్వభోక్తా! మహాభూతజాతప్రసక్తా! జగద్ధామ! నే నీప్రసా
దంబునన్ మానసం బైన జన్మంబునుం బొందినాఁడన్ ద్వితీయం బగుం జాక్షు

షంబుం దృతీయంబు జన్మంబు వాక్సంభవంబుం జతుర్థంబు శబ్దేంద్రియప్రోద్భవం
బై చనుం బంచమం బైనజన్మంబు ఘ్రాణంబునం గల్గె షష్ఠంబు నీయండసంభూత
మౌ సప్తమం బబ్జనాభీభవం బేను నీపుత్త్రుఁడన్ సర్గసర్గంబునం బుండరీకాక్ష!
నేసత్వసంజాతుఁడన్ నీ వీశ్వరేశుండ వో దేవతాచక్రవర్తీ! త్రిమూర్తీ! నాకు
వేదంబులే కన్నులౌ వేదముల్ వోవ నంధుండ నై యుంటి నీభక్తుఁడ న్నాకుఁ
గన్నుల్ ప్రసాదించి రక్షింపవే నీకిదే మ్రొక్కెదన్ మ్రొక్కెదన్. 201

వ. అని ప్రార్థించినం బ్రసన్నుండై సర్వతోముఖుం డగుసర్వేశ్వరుండు వేదకార్యా
ర్థము నిద్రనుండి లేచి తనయోగశక్తిం జేసి ద్వితీయంబగుదేహంబు నొందె
నదియును. 202

సీ. తారకాకీర్ణమై తళుకొత్తునాకాశ, భాగంబు మూర్ధమై పరిఢవిల్ల
సూర్యాంశువులఁబోలిసురుచిరద్యుతి నొప్పి, నిడుదలై కేశముల్ నెఱిఁ దలిర్ప
నమ్మూర్తికర్ణములాకాశపాతాళ, తలములై యెంతయుఁ దళుకులీన
గంగాసరస్వతుల్ ఘనతరశ్రోణులై, విభ్రమాశ్చర్యముల్ వెలయఁ జేయఁ

తే. జంద్రసూర్యులుచక్షువుల్ సాగరములు,బొమలుధాత్రిలలాటముముక్కుసంధ్య
పరతటిజ్జిహ్వగోలోకబ్రహ్మలోక, ములుపెదవులయియెంతయుఁ బొలుపుమిగిలె.

చ. చలువలతేని కీ డగుచు సర్వదిశల్ వెలుఁగం బొనర్చు కాం
తులు మెయినిండఁ గ్రమ్ముకొనఁ దుంగతురంగముఖంబుతో మహో
జ్జ్వల మగుతేజముం గలిగి సారసలోచనుఁ డొక్కమూర్తినిం
గలిగి రసాతలంబునకుఁ గ్రన్నన నేగెఁ దిరోహితాంగుఁ డై. 204

సీ. అటు రసాతలమున కరిగి హయగ్రీవుఁ, డతఁడు పరమయోగ మాశ్రయించి
సామవేదాంతస్థమై మించునుద్గీథ, మును బాడె సుస్వరంబునను విరియ
నామధురస్వరం బాలించి మధుకైట,భులు వేదముల నొక్కకెలనఁ బెట్టి
స్వరము పుట్టినదిక్కు వట్టి పోయిరి హయ,గ్రీవుఁ డాలోనఁ బరిగ్రహించి

తే. వేదములఁ గొని పోయి యవ్వేధకిచ్చి,వేదదాతయటంచుఁ బేర్వెలయఁగాంచి
హయశిరమ్ము ప్రాగుత్తరాశాబ్ధివిడిచి,తా మరల దొంటిరూపముఁదాల్చెఁ బెల్చ.

వ. అంత మధుకైటభులు మగిడి వచ్చి శ్రుతులం గానఁ జాలక రసాతలంబునుండి
పయికి వచ్చి జ్వాలమాలాసమావృతం బగునాగభోగాఢ్యశయనంబున యోగ
నిద్రం గొనియున్నయనిరుద్ధుం గాంచి. 206

ఉ. వీఁడె శ్రుతుల్ హరించుకొని వెళ్లినవాఁడు మలిమ్లుచుండు తా
నీడ నొకం డెఱుంగనిమెయి న్నిదురించెడునట్లు పాముపై
వీడక పండె వీనిఁ దెగవ్రేయుట పోలు నటంచు నెంచి లో
నోడక దుర్మదాంధు లయి హుంకృతి సేయుచు లేపి రేపునన్. 207

వ. ఇట్లు లేపి యుద్ధంబునకు సన్నద్ధులై సమీపించిన నతండు వారియాద్ధత్యం
బెఱింగి క్రుద్ధుండై యొక్కపెట్ట యిద్దఱం బట్టి బిట్టేసి గిట్టించి శతానందున
కానందం బాపాదించె నిది హయగ్రీవోత్పత్తిప్రకార మిక్కథ పురాణప్ర
సిద్ధంబై యున్నయదియ దీని విన్నవా రుత్తమగతిం బొందుదు రిట్లు పురుషో
త్తముఁడు ధర్మసంస్థాపనార్థ మవతారంబు లెత్తుచుండు నాకర్ణింపుము. 208

తే. అతఁడె యోగము సాంఖ్యము నతఁడె బ్రహ్మ
మతఁడె తపమును ఋతము సత్యమును ధర్మ
మును రసాదులు జ్యోతులు భూతిసిద్ధు
లతఁడె దైవపైతృకముల కాశ్రయుండు. 209

క. భూతావాసుఁడు గావున, నాతఁడు శ్రీవాసుదేవుఁ డనఁబడుచుండున్
ధాతయు రుద్రుఁడు సర్వ,జ్యోతులు నాతం డటంచు నూహింప నగున్. 210

వ. అని చెప్పిన జనమేజయుం డేకాంతికులచర్య యెట్టిది చెప్పు మనిన వైశంపా
యనుం డిట్లనియె. 211

వైశంపాయనుండు జనమేజయున కేకాంతికధర్మ మెఱింగించుట.

క. సమరారంభమునందున్, విమనస్కుం డయిననరుని వీక్షించి రమా
రమణుఁడు గీతలఁ జెప్పిన, క్రమమున నగతిగతు లెఱుఁగఁ గావించితిఁబో. 212

క. ఇది మిక్కిలిగహనం బగు, నది యకృతాత్ములకుఁ దెలియ నతిదుర్ఘటమై
నది సామవేదసమ్మిత,మిది కృతయుగమందు మున్ను కృత మయ్యె నృపా. 213

క. హరివలన మానసం బగు, వరజన్మము బ్రహ్మకైనపట్టున విష్ణుం
డరసి పొనరించె నీధ,ర్మరతిం గొని దైవపిత్ర్యమహితక్రియలన్. 214

సీ. అంతట ఫేనపు లగుఋషు లాధర్మ,ముం బొంది రా ఫేనపులవలనను
వైఖానసులు వారివలన సోముఁడు పొందె, నవలనంతర్హితంబయ్యె నద్ది
పిదపఁ జాక్షుషజన్మ మొదవినప్పుడు బ్రహ్మ, సోమునివలన నీసూత్ర మెఱిఁగి
రుద్రునకుం జెప్పె రుద్రుండు కృతయుగ,మున వాలఖిల్యులకును వచించె

తే. మఱియునవ్వలనదిదైవమాయఁజేసి,మాయమయ్యెఁబదపడి బ్రహ్మకుఁదృతీయ
మయినవాచికజన్మమైనపుడు మరలఁ, బద్మనాభునివలన నుత్పన్నమయ్యె. 215

వ. అప్పద్మనాభునివలన సుపర్ణుం డనుఋషి పొంది తపము దమము నియమము
ననువీనిచే మూఁడుమాఱు లాధర్మము ప్రవర్తింపం జేయుటంజేసి త్రిసౌ
పర్ణంబు నాఁబడె నది ఋగ్వేదపాఠపఠితమై దుశ్చరంబై యుండె నంత నా
సుపర్ణునివలన వాయువు సంగ్రహించె నతనివలన విఘసాశు లగుఋషులు పరి
గ్రహించిరి వారివలన సముద్రుండు సంపాదించె నంత నది యదృశ్యంబై
బ్రహ్మకు శ్రవణజన్మం బైనప్పుడు ప్రజాసృష్టి గావింపు మని నారాయణుం

డతనికి సాత్వతం బనునాధర్మ ముపదేశింప నతం డాహరిమేధునివలన సరహస్యంబును ససంగ్రహంబును సారణ్యకంబు నగునాధర్మమును గ్రహించి స్థావరజంగమాత్మకంబు లగులోకంబుల సృజించె నదిమొదలు కృతయుగంబు ప్రవర్తిల్లె ననంతరకాలంబున లోకహితావేశుంజేసి ప్రజాపతి స్వారోచిషమనువున కాసాత్వతధర్మం బెఱింగించె నతండు తనపుత్త్రుం డగుశంఖపదునకుం జెప్పె నతండు నిజపుత్త్రుం డగుసువర్ణాభున కుపదేశించెఁ బదంపడి త్రేతాయుగం బగుదేర మరల నాధర్మం బదృశ్యంబయ్యె నంత బ్రహ్మకు నాశికాజన్మంబు గలిగినప్పుడు నారాయణుం డతని కెఱింగింప నతండు సనత్కుమారునకుం జెప్పె నతనివలన వీరణుం డనుప్రజాపతి గ్రహించె నతండు రైభ్యున కొసంగె రైభ్యుండు పుత్త్రుం డగుకుక్షి యనువాని కిచ్చె నవ్వల మఱియు నది యంతర్హితం బయ్యె నంత బ్రహ్మ కండజన్మము గలిగినప్పుడు హరియోని యగునతనికై నారాయణముఖంబునుండి యీధర్మంబు సముద్భవం బయ్యె నపుడు బ్రహ్మ దీనిం బరిగ్రహించి బర్హిషత్తు లనుమునులకుం జెప్పె వారివలన సామవేదపారగుం డగుజ్యేష్ఠుం డనుబ్రాహ్మణుం డభ్యసించె దానం జేసి యతండు జ్యేష్ఠసామవ్రతుండు నాఁబడె నతనివలన నవికల్పుం డను రాజు దానిం బొందె నంత వెండియు నది యదృశ్యం బయ్యె బ్రహ్మకు సప్తమం బగుపద్మజన్మంబు గలిగినప్పుడు నారాయణుం డాతని కుపదేశించె నతండు దక్షున కొసంగె దక్షుండు తనదౌహిత్త్రుం డగునాదిత్యున కొసంగె నతనినుండి వివస్వంతుండు గ్రహించె నతండు త్రేతాయుగాదిని మనువున కిచ్చె మనువు లోకసంరక్షణార్థ మిక్ష్వాకున కిచ్చె నతండు దీని లోకంబులం దెల్లెడలఁ దెల్లంబు గావించె నిది కల్పాంతమున మరల నారాయణుం బొందు నిట్లు హరిగీతలందు సంక్షేపంబుగం దెలుపం బడె నీధర్మం బెఱింగి యహింసాకర్మయుక్తం బగుధర్మం బాచరించిన నారాయణుండు ప్రీతుం డగు నిర్మముఁడు నిష్కలుఁ డగునాహరియే పంచభూతములకు మించినజీవుండును బంచేంద్రియంబులం బ్రేరించుమనస్సు నగు నతండే లోకముల శాసించువాఁడును సృజించువాఁడు నై క్రీడించుచుండు నిది యేకాంతధర్మము దీనిచే జగం బావృతం బై నంతఁ గృతయుగంబు ప్రాప్తించు నని చెప్పిన జనమేజయుం డిట్లు బహువిధం బగుధర్మంబు జ్ఞానసేవితం బగుచుండ దాని నాచరింపక ద్విజులు నానావ్రతపరు లగుటకుం గతం బేమి చెప్పు మనుగ్రహింపు మనిన వైశంపాయనుండు,

సీ. దేహబంధంబులఁ దెలియ నా సత్వర,జ_స్తమంబులు మూఁడు సాత్వికుండు
మోక్షార్హుఁ డగునిహంబునఁబురుషుని,బ్రహ్మ, వి_త్తముగ నెఱింగి వెలయుచుండు
నేకాంతభ_క్తుఁడు వీఁక నెల్లప్పుడు, పురుషో_త్తము భజించి పొందుఁ గోర్కు-
లేకాంతసేవిత మీధర్మ మరయంగ, సాంఖ్యయోగములతో సరి యనఁ దగు
తే. రాజసాదిప్రకృతులతోఁ దేజరిల్లు, నట్టిఁడు ప్రవృ_త్తిలక్షణాద్యంచితుఁ డగు
పురుషునిఁ హరిఁ గనుఁగొనఁ బోఁడు వాని,జాయమానునిఁ గనుఁగొనుసర్గకర్త.
వ. జనమేజయా! సత్వగుణసంపన్ను లైనను సూక్ష్మసత్వవిహీను లగుదు రేని వారు వైకారికులు నాఁబడుదు రనిన నతండు వైకారికుం డెట్లు పురుషో_త్తముం బొందఁ గలండు ప్రవృ_త్తిక్రమం బెట్టిది యెఱింగింపు మనిన వైశంపాయనుండు వెండియు ని ట్లనియె. 218

సీ. సూక్ష్మంబు త_త్త్వసంఖ్యాతంబు త్ర్యక్షర,యు_క్త మాపురుషుని నొందు నిష్క్రి
యుఁడుపంచవింశుఁడై యుండుఁ బురుషుఁ డిట్లు, సాంఖ్యయోగోపనిషచ్ఛ్రయంబు
పాంచరాత్రము నెంచి వచియించుచుండు నే,కాంతికధర్మ మీకరణి వెలసి
జలధిజలంబులు జలధిఁ జేరినయట్లు,హరికి సంబంధమై హరినిఁ గలయు
తే. సాత్వత మ్మగునీధర్మసరణి యెల్ల, నీకుఁ దెలిపితి నిది శ్వేతలోకమందుఁ
దెలిసి నారదముని నాగరులకుఁ దెలిపె, వారు ధర్మజునకుఁ దెల్పినారు తొల్లి.
వ. అనిన జనమేజయుండు సాంఖ్యము యోగను పాంచరాత్రము దేవారణ్యకము నివి జ్ఞానదాయకంబు లివి యన్నియుఁ బృథగ్వ్యక్తులందుఁ గాక యేక వ్య_క్తియందుఁ జూపట్టునే చెప్పు మనిన వైశంపాయనుం డి ట్లనియె. 220

### వేదవ్యాసుఁడు నారాయణపుత్త్రుఁ డైనవిధము.

సీ. మాకు గురుండు లోకైకవిఖ్యాతుఁడు, సత్యవతీపరాశరులవలన
ద్వీపమధ్యంబున వెలసినమాని యజ్ఞానాంధకారము వో నడంచు
జ్ఞాని యాద్యుం డైనవాని కాలవవాఁడు, నార్ష సంపదలతో నగుమహర్షి
నారాయణాంశమునఁ జనించినయేక, పుత్త్రుఁడు వేదవిత్పూజితుండు
తే. వ్యాసభట్టారకుఁ డజుండునప్రమేయుఁ,డునుబురాణపురుషుఁడునై తనరుమాని
వర్యుఁడొకరుండుసర్వవిద్వర్యుఁడొక్కఁ,డెసక మెసఁగెడుననన్నపుండిట్టులనియె.
వ. బ్రాహ్మణో_త్తమా! వసిష్ఠునకు శ_క్తి శ_క్తికిఁ బరాశరుఁడు బరాశరునకు వ్యాసభట్టారకుండునుం బుట్టె నని మున్నీవు చెప్పితి విప్పు డాద్వైపాయనుండు నారాయణాసుతుం డని చెప్పుచుంటి వది పూర్వజన్మసంబంధమో చెప్పు మనిన వైశంపాయనుండు మాగురుం డట్లు భారతాఖ్యాన మొనరించి హిమవత్పాద మాశ్రయించి యున్నప్పుడు శిష్యుల మగుమే మొకసందర్భమున నారాయణుని

వలన నీకుఁగలిగినజన్మంబువృత్తాంతంబువినవలతుమనిననతండు మాకుఁ జెప్పిన
చొప్పుఁ జెప్పెద నాకర్ణింపుము. 222

సీ. సప్తమం బగుపద్మసంభవజన్మము,నందుఁ బ్రజాసర్గ మాచరింపు
మని హరి పరమేష్ఠి కానతీ నాతఁడు, తనశక్తి లేమిని వినిచె నపుడు
హరి బుద్ధిని సృజించి పరమేష్ఠి నొందుమీ, వన నది చెప్పినయట్లు చేసె
నపుడు ప్రకృతి తన్ను నావరించిన నల్వ, సకలప్రజాసృష్టి సలిపె నంతఁ
తే. గ్రూరు లగుదైత్యదానవుల్ కుతలమునకుఁ, గీడు సేయుదురని యెంచి కేశవుండు
మత్స్యకచ్ఛపసూకరమానవాది, రూపములు దాల్చి దుష్టుల రూపడంచె. 223

క. శ్రీహరి తదనంతరమున, నోహోహో యనుచు శబ్ద మొనరించుడు నా
వ్యాహారమ్మున వాగ్భవుఁ,డై హవణిల్లెం గుమారుఁ డధికప్రభతోఁ. 224

వ. సారస్వతుం డగునాతండు సారభూతుం డై యపాంతరతముండు నా నొప్పె
నప్పుడు భూతభవ్యభవిష్యజ్జ్ఞుండును సత్యవాదియు ధృతవ్రతుండునగునాతనిం
జూచి దేవదేవుండు నీవు వేదాధ్యాపనంబు గావింపు మని యాదేశించుటయు
నతండు స్వాయంభువమన్వంతరంబున నేకీభూతంబులై యున్న వేదంబుల విభ
జించె దాని కాహరి యెంతయు సంతసించి యతనిం గాంచి యి ట్లనియె. 225

తే. ఇతరమన్వంతరంబుల నీవు నీసు,తప్తతపమున యమనియమాప్తశక్తి
నిట్టులు ప్రవర్తకుండవై యెపుడునప్ర,ధృష్యుఁడవునచలుఁడవునై తీరఁగలవు.

చ. కలియుగ మేగుదే నపుడు కౌరవవంశమునందు భూపతుల్
పలువురు నీకటాక్షమున భారతభూమి జనించి ఖేదముల్
గలుగుట వార లొండొరులు కయ్యము చేసి మృతింతు రీవు వా
రలచరితల్ రచించియు విరాజిలఁ జేయుదు వేదశాఖలన్. 227

ఆ. కృష్ణయుగము గానఁ గృష్ణవర్ణుండ వై, కృష్ణనామమునను గీర్తి వడసి
వివిధధర్మములను విస్తరించుచుఁ దపో,న్వితుఁడ వగుదు జ్ఞాననిష్ఠుఁడ వయి.

క. రాగము వీడదు నిన్నుఁ, రాగము విడి నీసుతుండు ప్రబలుం డగుచున్
యోగమునఁ జేసి పరమా,త్మాగారముఁ జేరునట్టిఁ డగు వరతనయా. 229

మ. బుధు లేబుద్ధిమదగ్రగణ్యుని జగత్పూతప్రభావోదయున్
విధికి న్మానసపుత్త్రుఁ డంచు వినుతు ల్వేమాఱు గావింతు రా
ప్రథితాఖ్యుండు వసిష్ఠునన్వయమునం బ్రఖ్యాతిఁ గైకొన్న వాఁ
డధికాభుండు పరాశరుండు జనకుం డై నీకు వాకో నగున్. 230

సీ. అష్టమార్షికిఁ గన్యయం దీవు జన్మించి, కానీనుఁ డను పేర సూనుఁ డగుదు
భూతభవ్యభవిష్యములు నీ వెఱుంగుదు, కడచియు రాఁబోవు కల్పములను
వేనవేల్ యుగములవిధులునువీ వెఱుం,గుదువున స్మరియించుకొనుచునురటఁ

దరణిపుత్త్రుఁడు శనైశ్చరుఁడు తా మను వగు, నపుడు ప్రసిద్ధి నీ వందఁగలవు

తే. మానవుం డేది చేయుట కైనఁ గాని,పరునిసాహాయ్యమునుగోరుఁబరముఁడైన
నేను సర్వస్వతంత్త్రుఁడ నై నిఖిలము, సలుపుచుండుదు నెప్డు స్వచ్ఛందవృత్తి.

వ. అని వాసుదేవుండానతిచ్చి యపాంతరముండ నగు నన్నుఁ బో మ్మనిన నే నాహరిమేథసునిప్రసాదంబునసారస్వతసుతుండనయ్యునిప్పుడుపరాశర సుతుండ నై తినని తెలిపెనిది నాగురువర్యులపూర్వజన్మవృత్తాంతంబని మఱియును. 232

సీ సాంఖ్యము యోగశాస్త్రము పాంచరాత్రము, వేదముల్ పాశుపతాదికములు
భిన్నమతంబులై యెన్నఁబడుం గపి,లమహర్షి సాంఖ్యము వెలయఁ జేసె
యోగ మెఱింగె ము న్నొక్క-హిరణ్యగ,ర్భుఁ డెఱుంగఁడెవ్వఁడుభూతలమునఁ
బ్రాచీనగర్భుఁ డపాంతరతముఁడు వే,దముల కాచార్యుఁడై క్రమ మెఱింగెఁ

తే.బశుపతియుభూతపతియగుపరమశివుఁడు,పాశుపతమునుబ్రకటించెఁబ్రతిభ మీఱ
నఖిలజగదీశ్వరుండు నారాయణుండు,పాంచ రాత్రము గావించె భక్తు లలర.

వ. ఈసర్వశాస్త్రంబుల ననుసరించి నారాయణుండు ప్రవర్తించుఁ దర్క-వాదంబుల నాతండు తగులు వడండు పాంచరాత్రవేత్త లేకాంతభావము నొంది హరిం బొందుదురు సాంఖ్యయోగంబులు వేదంబులును సనాతనంబులు వేదోక్త కర్మములు సర్వస్థలంబులందును బ్రసక్తిం బొంది యుండు ననిన జనమేజయుం డనఘా! పురుషుం డొక్క-రుండా? పెక్కు-రా? యెక్కు-వతక్కు-వ లెట్టివి చెప్పు మనిన వైశంపాయనుండు. 234

వైజయంతాద్రిపై నున్నబ్రహ్మకడకు రుద్రుండు వచ్చి సంభాషించుట.

సీ. పురుషులు పెక్కు-రు వరసాంఖ్యయోగవి,చారణంబున నెల్లవారలకును
గారణభూతుఁ డొక్క-ండే పరమపూరు,షుం డనఁ దగు దానిచొప్పు వినుము
పురుషసూక్తం బది పరఁగు వేదములందు,ఋతము సత్యము ననియెంచి పురుషుఁ
డొక్క-రుండనివ్యాసుఁడొప్పించుచుంబల్కె-,సంగ్రహంబుగ నీవిషయమునందుఁ

తే. గలుగు నితిహాసమొక్కఁడుకంజజునకు,నుగ్రునకునయ్యెసంవాద మొక్క-నాఁడు
క్షీరసాగరమందుఁ బ్రసిద్ధి గన్న, వైజయంతాద్రిపై నొంటి వఱలె నజుఁడు.

వ. అ ట్లేకాకియై యధ్యాత్మచింతకుండై యున్నచతుర్ముఖునిచెంతకు నాకాశంబు నుండి లలాటప్రభవుండును త్రిణయనుండును మహాయోగియు నగుపరమ శివుండు యదృచ్ఛాగతుండై పర మేష్ఠిపాదంబుల వ్రాలి మొక్కి-న నతం డతని లేవ నెత్తి చిదాత్మజుం డగునాత్మజుం గాంచి యి ట్లనియె. 236

తే. స్వాగతముఁ నీకుఁ బుత్రక ! సౌఖ్యగరిమ, నుంటివే నీదుకుశలంబు వింట కభిల
షించుచుంటిని దిష్టంబు చెల్లుబడిన, నాకు దర్శన మిచ్చితి లోకవినుత. 237

వ. అనిన రుద్రుం డి ట్లనియె. 238

ఆ. నీయనుగ్రహంబు పాయనిదగుట స్వాధ్యాయతపములకు నిరంతరాయ
మెల్ల జగములకును జెల్లును గుశలంబు, నిన్నుఁ జూడఁ గంటి నియతమునను.

క. వైరాజసదనమందుం, గోరిక నినుఁ జూచినాఁడఁ గొన్నాళ్లకుఁ బై
నీరీతి నీనగంబుం, జేరుటకుం గతమ దేమి చెప్పు మధీశా. 240

వ. అనిన బ్రహ్మదేవుం డి ట్లనియె. 241

క. ఈవైజయంతగిరివర, మే వేళం జూడ వచ్చి యేగుచునుందుఁ
భావించి విరాట్పురుషుఁ, సేవించెద నిచట నుండి స్థిమితాత్ముఁడ నై. 242

వ. రుద్రుం డి ట్లనియె. 243

క. పురుషులసృష్టించితి పెక్కుర సృష్టింపంగ నుంటి గురువర్య! విరా
ట్పురుషుఁ డొకఁ డందు నీ కాపురుషుని ధ్యానించునిచ్చ పుట్టుట లేలో. 244

వ. అనినం బితామహుం డి ట్లనియె నోయి కుమారా! నీవు పెక్కండ్రు పురు
షులం జేర్కొంటివి వారల కందఱకును గారణం బావిరాట్పురుషుండు
గావున నే నాతని ధ్యానించుచుంటి నాతండు సనాతనుండు నిర్గుణుండు నిరంజ
నుండు నిర్వికల్పుండు నిత్యుండు సత్యుం డవ్యయుం డప్రమేయుండు నై నిర్వ
చింపంబడు నమ్మహాపురుషుని నీవు గాని నేను గాని మఱియెవ్వరుం గాని
చూడఁ జాల రాకర్ణింపుము. 245

సీ. అద్దేవు నిర్గుణు లైన సగుణు లైన, జ్ఞానముచేతనే కాన నగుదు
రత డెల్లదేహములందు నదేహుఁ డై, యలరుఁ గర్మములతో నంటు వడక
యతఁడు నీకును నాకు నందఱకును నంత,రాత్మయై సాక్షియై యలరుచుండు
నెల్లదేహములందు నెన్నియో శీర్షము, లెన్నియో బాహువు లెన్నొ కనులు
తే.గలిగియొకరుఁడేసుఖముగా మెలఁగుచుండు,వినుము దేహము క్షేత్రముబీజమదిశు
భాశుభంబగుకర్మమీాయమలతత్త్వ,మరయుచున్నాఁడుయోగాత్ముఁడై నవాఁడు.

ఉ. ఆతనిరాకపోకలను బ్రాణులయందు నొకానొకండు నే
నేతఱిఁ గానఁ జాల రిపు డే నిట సాంఖ్యము యోగముం దగం
బ్రాతిగఁ జేసి చిత్తమునఁ బ్రాజ్ఞుని నాతనిఁ జింత సేయుచుం
బ్రీతిమెయి న్వసింతు నని ప్రేముడి నీకు నెఱుంగఁ జెప్పితిఁ. 247

క. అతఁ డొకఁడే పురుషుండై, సతతము వెలుఁగొందు ననుచు సమ్యగ్జ్ఞాన
స్థితిఁజేసి చెప్పుచుంటిఁ, మతిమంతుఁడ వీవు నెఱుఁగుమా తత్త్వంబుఁ. 248

చ. ఒకఁ డగునగ్ని వేగతుల నోలి వెలింగెడు నొక్కసూర్యుఁడే
సకలఖగప్రకాశము నెసంగఁగఁ జేసెడు నొక్కవాయువే
ప్రకటము గా నొకప్పు బహుభంగుల వీఁచెడు నొక్కకంథియే
వికలత నొంది నీ రొసఁగు విశ్వమర్త్యుం డతఁ డట్టిఁడే యగుఁ. 249

క. పురుషులు వే ర్వేఱుగ నై, పరికింపఁగ వచ్చుచున్నఁ బరుఁ డాతండే
పురుషుఁ డతఁ డతనికళ లివి, పరివర్తించెడిని వివిధ భంగుల వింటే. 250

సీ. నిర్గుణుం డగువాని నిరతమును ముముక్షువులు పొందుదురు జ్ఞానకలితులగుచు
నతఁ డనిరుద్ధాదు లగునాల్గుభావముల్, కలఁ డని తెలిసినం గలియు నతనిఁ
బరమాత్ముఁ డొకఁడని పండితుల్ ప్రత్యగాత్మయై పరమాత్మ గాఁ దలఁచికొంద
రందు రాతండె నారాయణుం డనియు సర్వాత్మ యాపూరుషుం డనఁగ నొప్పుఁ

తే. బద్మపత్రముపై నున్న వారిభంగిఁ, గర్మఫలముల నంటక గ్రాలు నతఁడు
సప్తదశకరాశింగూడినదమలుఁడయి, యొసఁగుచుండునటంచునీ వెఱుఁగు మెడఁద.

వ. మఱియు నతం డంతకు దానయై వేద్యము పరమునై బోధ్యము బోధనీయుం డునై మంతయు మంతవ్యుఁడు నై ప్రాశితయుఁ బ్రాశనీయుఁడు నై ద్రష్టయు ద్రష్టవ్యుఁడు నై ఘ్రాతయు ఘ్రేయుండు నై జ్ఞాతయును జ్ఞేయుండు నై సగు ణుండు నిర్గుణుండునై నిత్యుండు శాశ్వతుండు ప్రధానుండు నవ్యయుండు నై ప్రకాశించుచుండు నే నాతనివలనం బొడమినవాఁడ నీవు నావలనం బొడమి తివి మఱియు నావలన సరహస్యంబు లగువేదంబులును స్థావరజంగమాత్మకంబు లగుజగంబులుం జనించె నిట్లు సనాతనుం డగునప్పురుషుండు నాల్గుతెఱంగులై క్రీడించుచుండు నాతని జ్ఞానంబునం జేసి తెలియం దగు నని రుద్రునకు బ్రహ్మ దేవుం డానతిచ్చె నని జనమేజయునకు వైశంపాయనుండు చెప్పె నిది యిట్లుండ నట్లు నారదుండు నలువకు నారాయణమహాత్వముం దెలిపె నని భీష్ముండు తెలిపిన న్విని యుధిష్ఠిరుండు పితామహా మోక్షాశ్రితధర్మంబు లెల్లం దెలిపితి వింక నాశ్రమధర్మంబులు మఱికొన్ని చెప్పు మనిన నతం డతని కి ట్లనియె. 252

తే. నాలుగాశ్రమములయందు నలువుమీఱు, ధర్మముల నెల్ల నడిపినదాన సత్య
ఫలము స్వర్గము నగునట్టిద్వార మైన, ధర్మమునకు వైఫల్యము తలఁపఁ జనదు.

క. వేఁ దేధర్మమునందుం, గూడిననిశ్చయముతోడఁ గుదిరి మెలఁగునో
వాఁ డాధర్మమునందే, పీడనిమతి నుండు వినుము వేఱొకదానిన్. 254

వ. నీ విపుడు న న్నడిగినట్లు మున్నింద్రుండు నారదమునిచంద్రు నడిగె న త్తెఱం గెఱింగించెద నాకర్ణింపుము. 255

ఇంద్రుఁడు నారదునకుం జెప్పిన భృగునామకవిప్రునిచరిత్రము.

క. నారదుఁడు జగత్త్రయముం, గోరిక మెయి గాలి వోలెఁ గొంకనిమతియై
సారెకుఁ దిరుగుచు నొకనాఁ, డారయుతలఁపునను వచ్చె నాకంబునకున్. 256

క. వచ్చినమునివర్యునిఁ బొర, పొచ్చెము లేనట్టిభక్తిఁ బూజించి సురల్
మెచ్చఁగ నింద్రుం డాతని, కిచ్చి సుఖాసనము వేడ్క నిట్లని పలికెన్. 257

ఉ. ఈవు సమస్తలోకముల నెప్పుడు మెట్టుచు నుందు వెందునుజ్
నీవలె నెల్లకర్జముల నేర్చి యెఱింగినవార లుండ రో
దేవమునీ! జగత్త్రయము నెన్నన నెన్నఁగ నైనయద్భుతం
బేవగ నైన నీ వెఱిఁగితేని వచింపుము నాకు నిత్తఱిజ్. 258

వ. అనిన నారదుం డాతని కి ట్లనియె. 259

సీ. తనరు గంగానదీదక్షిణతీరము, నందు మహాపద్మ మనెడునగర
ము౦ దొక బ్రాహ్మణుం డత్రిగోత్రోద్భవుం, డలరుఁజితక్రోధుఁ డార్యనుతుఁడు
స్వాధ్యాయనిరతుండు సత్యసంధుఁడు సుశీ,లము గల్గి వర్తించుసుకృతమూర్తి
సత్త్వాదిసన్నుతా శ్రమసముంచిత మైన, పూజ్యవంశమునందుఁ బుట్టినతఁడు

తే. పెక్కురం బుత్రులం గన్న వేద ధర్మ, తత్పరుఁ డతండు త్రివిధమై తనరుధర్మ
పథమునం దెది యుత్తమ విధ మొదాని, నాశ్రయింపఁగఁ జింతించు ననుదినంబు.

వ. ఇ ట్లున్నసమయంబున నొక్కనాఁ డొక్కబ్రాహ్మణుం డతిథియై వచ్చిన నాతని
కాతిథ్యం బిచ్చి సుఖాసనాసీనుండై యున్నవానిం గాంచి యతండు. 261

చ. ద్విజవర! నీప్రసంగములు విన్న మనంబున సంతసం బగుజ్
సుజనుఁడ వంచు గౌరవము చొప్పడె నిప్పుడు నీవు మిత్రధ
ర్మజితుఁడ వైతి కాన నినుఁ బ్రార్థనముం బొనరింతు నెందునుజ్
వృజినము లేనిమార్గమున విన్నను వొప్పఁగఁ జెప్పనెంచుమా 262

సీ. నాపుత్రకులయందు నాదుగృహస్థధ,ర్మము పెట్టి పరమధర్మంబు నొందఁ
బరికించుచుంటి నేవరమార్గ మాశ్రయిం,తునొ పరతత్త్వము గనఁగ నెంతుఁ
గాని సాధారణ మైనగుణంబున, నిరతబద్ధుండ నై నిలుతుఁ గాన
నటు లొనర్పఁగఁజాలననుకొందు నిఁకమీఁదఁ,బారలౌకికభుక్తిఁ బడయనెంతు

తే. లోకసాగరముఁ దరింప లోఁ దలంతు, నెద్దిధర్మప్లవమ్ము నే నితరభోగ
ములను రోసితిగేస్తులవలన బ్రతుకు,యతుల కగువృత్తి నాకిష్ట మగుట లేదు.

క. అతిథీ! బుద్ధిబలాశ్రయ, వితతం బగునట్టిధర్మవిధమున నాకుజ్
గతి గలుగఁ జేసి నిలుపవె, సతతము గురుభక్తి నిన్ను సంప్రార్థింతుజ్. 264

వ. అనిన నయ్యతిథి మృదుమధురవచనంబుల నాతని కి ట్లనియె. 265

క. నీవలె నేనును బహుమో,హావిష్టుఁడ నాకు నిట్టియభిలాష యగుజ్
దేవాయతనము బహుమా,ర్గావిష్కృత మగుట నిశ్చయము గలుగ దయో.

ఉ. కొందఱు మోక్షధర్మమును గొందఱు యజ్ఞఫలాదిధర్మముం
గొంద ఱరణ్యవాసమును గొందఱు గేహము నొంది యుండుటల్
కొందఱు రాజధర్మమును గొందఱు దేశికు నాశ్రయించుటల్
కొందఱు సత్యవాక్యమును గొంద ఱహింసయుఁ జెప్పుచుం డ్రిలజ్. 267

వ. మఱియుం గొందఱు మాతాపితృసేవయు నింకం గొందఱు మౌనవ్రతంబును మఱికొంద ఱాహవమరణంబును గొంద ఱుంఛవ్రతంబును మఱియుం గొంద ఱధ్యయనంబును నిట్లనేకు లనేకవిధంబుల ధర్మంబు లుపదేశింతురు ప్రజ లట్లు ప్రవర్తింతు రిట్లు ధర్మమార్గంబు బహువిధంబులై యుండు నామనంబును వాయువేగంబున మేఘంబు వోలెం జలించుచున్న దైన నాగురుండు నాకుం జెప్పినతెఱంగునం జెప్పెద నాకర్ణింపుము. 268

పద్మనాభుండను నాగరాజుచరిత్రము.

సీ. నైమిశారణ్యమునఁ గోమతీతీర,మందు నాగాహ్వాయ మనుపురంబు
గల దందు దేవతల్ క్రతువులు చేసిరి, మిష లేక మాంధాత మించె నింద్రుఁ
బద్మనాభుండును బద్ముండు ననుమహా, నాగ మప్పురి నుండు వీఁగ కుండఁ
ద్రివిధమార్గంబులఁ దిరుగుచు నందలి, ప్రాణికోటులను గాపాడుచుండు

తే. నాలు గగునుపాయములను బోలఁ జేసి, సజ్జనులఁ బ్రోచి దుర్జనసమితి ఱాచి
యొప్పుచున్నాఁడుసర్వలోకో త్తరుండు, నీడుసందేహములఁ దీర్పు గాదిలి మెయి.

వ. మఱియు నాతండు శాస్త్రవిశారదుండు సర్వాతిథిప్రియుండు నిత్యసత్యవ్రతుండు వేదాధ్యయనతత్పరుండు తపము దమము శమముం గలిగి దాతయై యున్న వాఁడు సతత మతిథిభుక్తాన్నంబ భుజించువాఁడు పరిశుద్ధవంశసంభవుండు నీ వటకుం బొమ్మనిన నాబ్రాహ్మణుండు సంతోషించుచు నాఁటిరేయిఁ దనయింట నయ్యతిథిం బెట్టుకొని మోక్షధర్మయుక్తం బగుప్రసంగంబు సేయుచు మరునాఁ డరుణోదయంబున లేచి కాల్యకరణీయంబులం దీర్చి యతిథి నంపిపుచ్చి తన వారికిం జెప్పి వారిచే ననిపించుకొని భుజగేంద్రపురంబు దారి వట్టి వనంబులు సరోవరంబులు పర్వతంబులు పురంబులు గ్రామంబులు క్రమక్రమంబునం దాఁటి పోవుచు మార్గమధ్యంబున నొకమున్యాశ్రమంబుఁ జేరి నాగరాజవృత్తాంతంబు దెలిసికొని కతిపయప్రయాణంబుల నాగాహ్వయపురంబునకుం జని పద్మనాభా గారం బడుగుచుం బోయి తద్గృహముఖంబున నేను బ్రాహ్మణుండ వచ్చితి నని శబ్దంబు గావించె నంత. 270

ఉ. నాగునిధర్మపత్ని యగునాతి యటం బొడసూపి యోపికన్
స్వాగతము న్వచించి విధివద్వరివస్య పొనర్చి యోమహా
భాగ! మదీయగేహమున బ్రాహ్మణవర్యున కెట్టికార్యముల్
కాఁగల వున్న వో తెలుపఁ గాఁ దగు నావుడు బ్రాహ్మణుం డనున్. 271

చ. అమృతముఁ బోలునీదునుడు వట్టె చెవిం బడునంత నాదుస్వాం
తము కడు సంతసించె విగతక్లమఁ డైతి సమర్చ లన్నియున్
గ్రమమున నన్నుఁ జేరినవి నాగవధూమణి! పద్మనాభునిన్
సుముఖునిఁ జూడ వచ్చితిని జు మ్మిది కార్యము మీగృహమ్మునన్. 272

క. కడుదవ్వు నడచి వచ్చితి, నెడఁదం గలనాదుకోర్కి యీడేర్చుకొనం
బడఁతీ! యెం దేగె నతం, డడపొడ నీ వెఱిఁగితేని యానతి యిమ్మా. 273

ఆ అనుడు నాగభార్య యను నార్య! నాభర్త, నాగరాజు సూర్యునకు రథంబు
మోయువాఁడ యగుచుఁ బోయె మాసావధి, కింక సాము మిగిలె నేగుదేర.

చ. అనవుడు బ్రాహ్మణుం డనియె నమ్మరో! సమ్మతిఁ జేసి నీపతిం
గనుఁగొన వచ్చినాఁడ నిటఁ గర్జము వే ఱొకఁ డుండఁ బోవ ద
య్యనఘుఁడు వచ్చుదాఁక నెదు రారయుచున్ నగరాంతికంబునన్
వనమున నుండు నాతఁ డిట వచ్చిన నాదగు రాక చెప్పుమా 275

వ. నేను నాగరాజాగమనంబు ప్రతీక్షించుచు గోమతీతీరంబునం దిసుకతిన్నియలఁ
గాలంబు గడపెద నని నాగపత్నికిం జెప్పి యొప్పించి చెప్పినచోటికిం జని
తపస్వియు నిరాహారుండునై యుండె నది యెఱింగి రాజబంధువు లెల్లరుం
బరితపించుచు వాని చెంతకుం జని పూజించి యి ట్లనిరి. 276

మత్త. ఆఱునా ళ్లగు దెంచె నీ విట కైనదాదిగ నేఁటికిన్
మీఱునాఁకలి కాకలంబులు మెక్కుజాడయుఁ దోఁప దో
పాఱుఁడా! యిట నున్న గేస్తులు పాపభీతికి జంకువా
రాఱునాళ్లును నీభుజింపమి కారటంపడుచుం డ్రయో. 277

వ. అతిథి వగునీవు మానుండి యేపం డైనం గొని భుజించి మమ్ము మాగార్హస్థ్యముం
గాపాడు కొన్న వారిం గావింపు మనిన నతండు వారి కి ట్లనియె. 278

మత్త. నాగునాగమనంబు గోరుచు నాఁటిదన్క భుజింప నం
చీగతిన్ వ్రత మూనినాఁడ నహీశ్వరుం డతఁ డేడునా
ళ్లేగునంతన వచ్చు భోజన మే నొనర్చెద నప్పు డో
నాగులార! గమింపుఁ డిండ్లకు నాపయిం గరుణించుచున్. 279

వ. అని ప్రత్యాఖ్యానంబుచేసిన వారు యథాగతకృతగమను లై రనంతరంబ.

సీ. గ్రహరాజుకడ నాజ్ఞఁ గైకొని నాగరా, జాత్మగృహంబున కరుగుదెంచె
నప్పు డాతనిపత్ని యర్ఘ్యపాద్యంబుల, నిడి భజించుటకుఁ దా నెదురు వోయె
నతఁ డాయమం గని సతి! దేవతాతిథి, పూజ లొనర్తువే పూఁట పూఁట
నే నింట లేనప్డు నీ విట్టిధర్మసేతువు దాఁటి పోవుగా తోయజాక్షి!

తే. అనుడు నాయమ యి ట్లను నార్య! నీకుఁ,బత్నినయ్యుఁ బాతివ్రత్యపరతనుండి
ధర్మసేతువు దాఁటెడుదాన నోటు, సర్వ మీవు చెప్పినయట్లు జరుగుచుండె.

వ. నాథా! సర్వవిషయంబులన్ జాగరూకురాలనై యున్నదాన నీనడుమ నొకపక్షం
బునకున్ ము న్నొక్కవిప్రుండు మనయింటి కతిథియైవచ్చి పూజితుండయ్యుఁ
దనవచ్చినకార్యము నాకుం జెప్పకనీరాక వేచి గోమతీతీరంబున దర్శనార్థియై
యున్నవాఁడు కావునవిన్నవించితినని నతండు కటకటంబడి కాంత కి ట్లనియె,

ఉ. బాడబరూపధారి యయి వచ్చినవానిని వేనిగా మదిం
కూడఁగఁ జేసితో తెలిసికోఁ దలపోయుదు మర్త్యకోటిలో
వాఁడో సుపర్వుఁడో మది రవంతయు నేనియు బీతులేకనా
పోడిమిఁ జూడఁ బో కడిగెఁ బో యిటు దర్శన మీయఁ గోరుచున్. 283

తరు. అన నాగపత్ని యోయనఘ యావచ్చి,నతఁడు నిర్జరుఁడు గాఁ డవనీసురుండు
నినుఁ జూచునిచ్ఛమై నీయింటి కతిథి, నే నని చెప్పుచు నీదర్శనంబు
పొనరింప నట వర్షమును గోరి మేఘ,మును జేరుచాతకమును బోలి ద్విజుఁడు
కనిపట్టికొని యుండెఁ గనుఁగోక వాని, కాదంటివే నేగి కాఁ గల దనఘ 284

వ. అనిన నతండు విజ్ఞానంబు గలుగ ని ట్లనియె. 285

మ. గరితా! నే నభిమానముం గలుగుటం గా దిట్లు రోషంబునం
బరిభాషించుట జాతిదోష మనుచున్ భావింప నో నీవచో
గరిమన్ నాదగురోష మంతయును దగ్ధం బయ్యె వైశ్వానరో
త్కరసంపర్కముఁ జేసి తూలము వలెం దర్కింప నిం కేటికిన్. 286

ఆ. రోషమునకు మించి దోష మొక్కఁడు లేదు, తద్వశంబునందు దవిలి జనులు
సురుగుచుండ్రు దందశూకంబులకు రోష, మింతయింతయనుచు నెన్నఁదరమె.

చ. త్రిదశపతిన్ దురంబునను ద్రెళ్లగ నేయఁగఁ జాలుతేజునం
బొదలెడు రావణాసురుఁడు పొంపిరివోయినపౌరుషంబునం
గదిరినరోషసంగతిని గాదె రణాంగణమందు రాముచే
మద మఱి త్రెళ్లనై త్రిదివమార్గము వట్టి చనండె తొల్లిటన్. 288

శా. గోవత్సంబు హరించె నంతిపురముం గొల్లాడి మున్ భార్గవుం
డేవాఁ డంచు నమర్షకర్షితమతిన్ హెచ్చిల్లి యకార్తవీ
ర్యావిగ్నాత్మజు లెల్ల ద్రెళ్లి రనిలో నవ్వారికిం దండ్రియున్
జీవం జూపియుఁ జూచె సంయమని లోఁ జెల్వారు రాచావడుల్. 289

వ. కావున నీవాక్యంబు విశ్వసించి క్రోధంబు మహాశత్రు వని నిశ్చయించుకొని
నాచే నిపుడు నిగ్రహింపంబడె నీయట్టి సహధర్మిణి నాకుఁ గలుగుటం జేసి
నాకు నేన ప్రశంసించుకొనుచుంటి నింక నే నాబ్రాహ్మణుఁ డున్నచోటికిం
బోయి వచ్చెద నని యామెచే ననిపించుకొని గోమతీపులినంబున నున్నవాని
చెంతకుం జని మృదుమధురంబుగా ని ట్లనియె. 290

నాగరాజభృగువులసంభాషణము.

ఉ. భూసురవర్య! నానుడికిఁ బొందకు మీ సెదలోన నీదునా
వాస మదేది యేమిటికి వచ్చితి విచ్చటి కిచ్చ పెంపునం
జేసి యుపాసముల్ పొసఁగఁ జేయుదు వెవ్వని కివ్వరాపగా

ఖ్యానపదంబు నేరితివి వాకొను మయ్య ప్రియంబు పెంపునన్. 291
తే. అనుడు బ్రాహ్మణుఁ డనియె నో యనఘమూర్తి!
విసుము నేను ధర్మారణ్యుఁ డనెడుద్విజుఁడ
పద్మనాభుని కడ నొక్కపని గలుగుట
నమ్మహానాగు దర్శింప నైతి నిటకు. 292
క. అతఁ డూరలేమి నాతని, సతి చెప్పెను వాని రాక జలదముగాకన్
మతిఁ గర్షకుండు గోరెడు, గతిఁ గోరుచు శ్రుతిఁ బఠింతుఁ గళ్యాణముగన్.
తే. అనిన నానాగరా జిట్లు లనియె నార్య!, నీవు కళ్యాణచరితుఁడ వీవు సాధు
సజ్జనుండవు నీవు సజ్జనహితుఁడవు, నాకు దయఁ జూపు చుంటివి లోకవినుత.
శా. ఓవిప్రోత్తమ! వేనిఁ జూచుటకు నీ వుల్లంబునం దెంతువో
యేవాఁ డుత్తముఁ డైననీదుకరుణన్ హేమింపఁగా నుండునో
యావిప్రాన్వయభక్తియుక్తహృదయుం డాపద్మనాభాహ్వయుం
డే వీఁ డిట్లరుదెంచె నీదుకడకు న్వీక్షించి పో నిత్తఱిన్. 295
క. నను విశ్వసించి నీవచ్చిన కార్యము నానతిచ్చి చేయించుకొనన్
మన మిచ్చినాఁడ నన్నున్, గొనినాఁడవు నేఁడు నీదుగుణధన మిడుచున్. 296
సీ. అనుఁడు బ్రాహ్మణుఁ డను నసఘ! నీదర్శన, మొనరింప వచ్చితి వినుము నేను
దెలియనివాఁడను దెలిసికో నుంటి నా, చిత్తము విషయసంస్థితికిఁ గాక
చలనము లేనిదై నిలిచి పరబ్రహ్మమును దిలకించెడునను వు గలిగి
తనరుపథంబును గనుఁగొనుటకు లోన, నభిలషించుచు నుంటి నమలచరిత!
తే. పిదపఁ దెలిసెదనదియెల్ల మొదలనిపుడు,సందియమొకండుజనియించెసదమలాత్మ
నీవు సర్వజ్ఞమూర్తివి నీగుణములు, చంద్రకిరణము లట్టులు చల్లని వగు. 297
చ. తెలుపుము ద్వాదశాత్మునకు దివ్యరథం బొకఁ డేకచక్రమై
వెలయును దాని నీవు సరవిం గయికొంచు వహింప నేగి న
ట్లల రెడునీదుపల్కు లగు వ్యాలకులేశ్వర! తద్రథంబునం
గలిగెడునబ్బురంబు వినఁగా మన మయ్యెడు నానతీయవే. 298
వ. అనిన నాగరా జి ట్లనియె. 299
సీ. భూతప్రవర్తకుం డై తనరెడుసూర్యుఁ, డాశ్చర్యములకుఁ దా వైనవాఁడు
వానిసహస్రగభస్తులను సమాశ్రయించి సిద్ధులు మును లెల్ల సురలు
వఱలుచుందురు మహావాయు వాయననుండి, వెడలి నభంబున విఱియుచుండు
నతఁడు ప్రజాహితము భిలషించుచు గాలి, విభజించి జలముల విడుచుచుండు
తే. వరుణమండలమధ్యస్థుఁ డైనదేవ,దేవుఁ డత్యంతదీప్తిమైఁ దేజరిల్లి
విష్టపమ్ము ల్లాదయుచునుండు వీనికన్న, నద్భుతంబులుమఱి యొండునరయవచ్చు.

తరు అమ్మహాత్మునిశుక్ర మను పేరనొప్పు, నసితగభస్తి యొం డంబరమున ర
సమ్ము ధరించి వర్షాకాలమందు, జల మిచ్చు నష్టమాసము లైన నాజ
లమ్ము లాకర్షించు లవి వానిఘృష్టు, లన్ బ్రాణికోటు లలరు భూమి యుందు
నమ్మధుసూదనుఁ డాతనియందు, నధివసించెడు నెప్పు డచ్చెరు వెసఁగ. 301

వ. మఱియుం జెప్పెద నాకర్ణింపుము. 302

ఉంఛవృత్తి మహిమాభివర్ణనము.

ఉ. మిత్రునిచెంతఁ జేరుతఱి మింట నొకానొకమంట దోఁచె నా
నేత్రయుగంబు చూచుటకు నేరని దయ్యె ననంతరంబ త
ద్ధాత్రి వెలుంగఁ జేయుచును దా నొకసూర్యుఁడు నా వెలుంగుచుం
జిత్రవిచిత్రపద్ధతులఁ జెన్నలరారె నభస్స్థలంబునన్. 303

మ. అది సూర్యాభిముఖంబుగా నరుగుదే నాదిత్యుఁడో నాఁగ నా
హృదయంబం దుదయించె సందియ మొకం డీలోన హస్తద్వయం
బిదె రమ్మంచు వచించి సాఁచి యరుణుం డేతెంచున త్తేజమున్
ముద మొప్పం గొని లోనఁ జేర్చుకొనియెన్ బ్రోద్యద్వికాసంబునన్. 304

వ. ఇట్లు రశ్మిమండలంబు మార్తాండమండలంబుఁ జొచ్చి యేకీభూతంబై యాదిత్య
త్వంబు నొందె నిది యంతయుం జూచునా కిందు రథస్థుం డగు మొదటిసూర్యుం
డెవండు రెండవవాఁ డెవం డని సందేహంబు పొడకట్టుడు నెట్టకేల కా ప్రథమ
సూర్యునిదిక్కు మొగంబై యితం డెవ్వం డని యడిగితి నడిగిన నతండు. 305

సీ. అనిలసఖుం డగునగ్ని గాఁ డసురుండు, గాఁడు పన్నగుఁడును గాఁ డితండు
పరమోంఛవృత్తిమై పరఁగి వ్రతంబునఁ, జనునట్టిసిద్ధుఁ డీమునివరుండు
శీర్ణపత్రంబులు చేకొని జల మాని, గాలిఁ బీల్చినయట్టి ఘనుఁ డితండు
సంహితలన్ శివు సన్నుతించినవాఁడు, సంగవిరహితుఁడై చనినవాఁడు

తే. ఆశలను వీడి యుంఛశిలాశనుఁ డయి, భూతదయ గల్గి వర్తించుపురుషుఁ డీతఁ
డిట్టిసద్వృత్తి గలిగినయట్టివారి, కంటె నెంతటివా రైనఁ గారు ఘనులు. 306

వ. అని సూర్యభగవానుం డానతిచ్చె నో బ్రాహ్మణోత్తమా! యిట్టిపరమాశ్చ
ర్యంబు లాసూర్యునియందుఁ జూచి వచ్చితి నుంఛవృత్తిం బ్రవర్తించునతండు
సూర్యసహితుండై పుడమింబరివర్తనంబు గావించుచుండునని చెప్పినబ్రాహ్మణుండు.

మ. పరమాశ్చర్యముగా గణింపఁ బడు నీపల్కెల్ల సందేహ మిం
దరవీసంబును లేదు సార్థకగతిం బ్రాప్తించె నాగోత్తమా!
కరమానంద కరంబు సూవె యిట నాకర్జంబు నుం దీఱె నేఁ
బరితుష్టిం గొని పోయి వచ్చెద నిఁకన్ భద్రంబు నీ కయ్యెడిన్. 308

క. పిలిపింపు మవసరంబుల, వలసినపనులందు నన్నుఁ బనిగొను మెపుడున్
దలఁపుము నాపైఁ గూరిమి, నిలుపుము నేఁ బోయివత్తు నిర్మలహృదయా. 309

వ. అనిన నాగవల్లభుం డిట్లనియె. 310

సీ. హృద్గతం బగుకార్య మెఱిఁగింప కీరీతి, నేఁగెద వందు వి దేటిమాట
దేనికై నీ వేగుదెంచితో చెప్పుము, చెప్పినవెనుక నాచేఁత లరసి
యభ్యనుజ్ఞాతుఁడ వై పొమ్ము ననుఁ గాంచి, యీవగ రిత్తగాఁ బోవు టగునె
మనకు నన్యోన్యముఁ దనరుచుండుత ప్రీతి, నేను నావారును నీదుసొమ్ము

తే. నాఁగ బ్రాహ్మణుఁ డిట్లను నాగరాజ! నీ వనినదెల్ల సత్యము నీకు వేల్పు
లునుబుధులుగారునీవు నేనునునొకరము,లోకము లివెల్లఁబరమాత్మలోలయించు.

ఆ. వినుము సర్పరాజ! మును బుణ్యసంపాద,న మ్మెటో యటంచు నాకు సంది
యమ్ము గల్గు నిప్పు డది తీఱె నుంఛవృ,త్తిని దొడంగి సుగతి తెన్ను వోదు.

వ. అని చెప్పి యొప్పించి యప్పాఱుం డప్పుడ కదలి పోయి పోయినపోకన
భార్గవుం డగుచ్యవను నాశ్రయించి కృతకృత్యుం డయ్యె ధర్మనందనా! ధర్మ
తత్పరుం డగుభార్గవుం డీవృత్తాంతము జనకునకుం జెప్పె జనకుండు నారదున
కెఱింగించె నారదుం డింద్రునకుం దెలిపె నింద్రుండు కొందఱు బ్రాహ్మణు
లకుం దెలియఁ జేసె నేను మున్ను పరశురామునితో యుద్ధంబునకు సిద్ధ
మైనప్పుడు వసువులు నాకు విశదంబు గావించి రిప్పుడు నేను నీ కుపదేశించితి
నిది పరమపవిత్ర ముంఛవృత్తియే పరమధర్మంబు దీనం జేసి యాబ్రాహ్మణుండు
యమనియమసహాయుండై యుంఛశిలాప్రవిష్టుండై కృతకృత్యుండయ్యె నని భీష్ముండు
ధర్మరాజునకుం జెప్పె నని వైశంపాయనుండు జనమేజయునకుం జెప్పె. 313

క. అని శౌనకాదిమునులకు, వినిపించెను సూతుఁ డిట్లు విజ్ఞానము పెం
పున శాంతిపర్వకథలన్, వినినన్ భూజనుల కధికవిజ్ఞాన మగున్. 314

ఆశ్వాసాంతము.

చ. తలఁచినమాత్ర వేదములఁ దత్పరతన్ వెలయింపఁ జేసి య
వ్వల నలువన్ సృజించి పిదపన్ భువనంబు లొనర్ప నాతనిన్
నిలిపి సమస్తముం దనదునిర్మితి యయ్యును గానియట్లు గా
వెలుఁగుచు నెల్లరన్ మనుచు వేల్పులవేల్పు భజింతు నెమ్మదిన్. 315

ఉ. వాకులఁ గాంచి పుత్రకుని వ్యాసుఁడు నా నుడికార మిచ్చి సు
శ్లోకునిఁ జేసి వేదముల శోధనముం బొసఁగించి వానిచే
లోకము లుద్ధరించుచు నలోలమతిన్ సకలైకరక్షకుం
డై కరుణామయుం డగుమహాత్ముని నే శరణంబు వేఁడెదన్. 316

క. వెలిదీవి వెల్లనయలకు, వెలిమేనన్ దర్శనంబు వెలయించుచు ను
జ్జ్వలతేజుండై త్రిజగం,బుల నేలెడువేల్పుఁ గొలుతుఁ బొదలినభక్తిన్. 317

మాలిని. సకలభువనరక్షా! సాధులోకైకపక్షా!
వికృతిరహితవీక్షా! వీతరాగామలాక్షా!
సకలుషజనరూక్షా! సర్వరక్షాతిదక్షా!
నికృతకృతవిపక్షా! నిత్యసత్యాపరోక్షా! 318

గద్యము.

ఇది శ్రీమదఘునాతనోభయకవిమిత్ర, వేంకటయజ్వాగ్రపుత్ర,
సమారాధితవిబుధరాజ, శ్రీపాదకృష్ణమూర్తికవిరాజ
ప్రణీతం బయిన శ్రీకృష్ణభారతంబునందు
శాంతిపర్వంబున సర్వంబును
నవమాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ

---

మ. పరమార్థ్యం బగుభారతంబున ఫలప్రాయంబునై సారమై
పరమార్థం బయి రాజధర్మములు నాపద్ధర్మముల్ మోక్షధ
ర్మరహస్యంబులు వెల్లడించునదియై మానొందు నీశాంతి నాఁ
బరఁగుం బర్వము కృష్ణమూర్తికవి యొప్పం జేసె నాంధ్రంబునన్.

---

చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1934.